ॐ

# भगवद्गीता

# ఇంటింటా గీతాధ్యయనం




VOL - IV

# ఇంటింటా గీతాధ్యయనం

## చతుర్థ భాగము

ఆంగ్లమూలము

**పరమపూజ్య స్వామి దయానంద సరస్వతి**

తెలుగు అనువాదము

**స్వామి తత్త్వవిదానంద సరస్వతి**



*Publishers :*

**AARSHA VIDYA SAGAR**

"TRIPTI" Plot No. 1165, Road No. 56,

Jubilee Hills, Hyderabad - 500 033.

ANDHRA PRADESH, INDIA

**Tel : 354 8425**

శ్రీ గణేశాయనమః

# ఆముఖము

శ్రీ శంకర భగవత్పాదులు రచించిన భాష్యముతో కూడియున్న శ్రీ మద్భగవద్గీతను మాగురుదేవులు, అభినవ శంకర భగవత్పాదులు, జగమెరిగిన బ్రహ్మ విద్యాచార్యులు పరమపూజ్య స్వామి దయానంద సరస్వతి గారు ఆంగ్లభాషలో ఆధునిక కాలంలోని జిజ్ఞాసువులకు అర్థమయ్యే విధంగా, ప్రపంచమంతటా ప్రచారము చేసినారు. అందమైన ఆంగ్లభాషలో ప్రవహించిన ఆ జ్ఞానగంగను గురుదేవుల ఆదేశాను సారముగా తెలుగు భాషలో అందజేసే ప్రయత్నములో ఈ 'ఇంటింటా గీతాధ్యయనం' అవతరించినది.

ఈ బృహద్గ్రంథము యొక్క ముద్రణకు ఆర్థిక సాహాయ్యమునంద జేసిన వారిలో ప్రముఖులు:

1. శ్రీ S. కుమారవేలు గారు, T.K.M. ఏజన్సీ, భాగ్యనగరము.
2. Dr. రవి బత్తిన గారు, Fort Wayne, USA
3. Dr. Y. రాములు గారు, Chicago, USA
4. Dr. పత్తికంటి వీరభద్రం గారు, Michigan, USA
5. శ్రీ నారాయణ రెడ్డి గారు, నెల్లూరు

వీరందరికి శ్రీకృష్ణభగవానుని అనుగ్రహము పూర్ణముగా లభించుగాక!

ఈ గ్రంథమును ముద్రించి జిజ్ఞాసువులకు అందజేసే బృహత్కార్యమును స్వామిని ఆత్మలీనానంద గారు ఆద్యంతము పర్యవేక్షించినారు. ఈ గ్రంథమును నేను వ్రాసే సమయములో శ్రీ K.C.M. కుమార్ గారు, కుషాయి గూడ, శ్రీ జొన్నలగడ్డ అన్నప్ప శాస్త్రి గారు, బన్సీలాల్ పేట, భాగ్యనగరం నాకు కంప్యూటర్ సహకారమును అందించిరి. శ్రీ కుమార వేలు గారి సహకారము ఈ మహాయజ్ఞములో నాకు అడుగడుగునా లభించినది. వీరికి భగవానుడు సకల సన్మంగళములను కలుగ జేయుగాక!

నారాయణ స్మరణమ్

భవదీయుడు,

స్వామి తత్త్వవిదానంద సరస్వతి

తేది:1-8-2001

బ్రహ్మవిద్యాకుటీర్, పాత అల్వాల్.

## श्रीगणेशाय नमः

శ్రీ శంకరులు తరువాతి శ్లోకమును ఒక ప్రశ్నతో ఉపక్రమించు చున్నారు. బ్రహ్మ సర్వవ్యాపకము. సర్వ పరిస్థితులలో బ్రహ్మ ఉపలభ్యముగనే యున్నది. దేశ-కాల-వస్తువులు బ్రహ్మకు దూరముగా లేవు. కాని బ్రహ్మను జనులు దర్శించుట లేదు. ఒక రకమైన చీకటి (తమస్) ఆవరించి యున్నదా యేమి?

**అధ్యాయము 13, శ్లోకము 17 :**

ज्योतिषामपि तज्ज्योतिस्तमसः परमुच्यते ।
ज्ञानं ज्ञेयं ज्ञानगम्यं हृदि सर्वस्य विष्ठितम् ॥ १७ ॥

జ్యోతిషామపి తజ్జ్యోతిస్తమసః పరముచ్యతే
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ (17)

**తత్** = ఆ జ్ఞేయ-బ్రహ్మ, **జ్యోతిషామపి** = జ్యోతిస్సు (ప్రకాశింపజేయునది) లకు కూడా, **జ్యోతిః** = ప్రకాశింపజేయునది, **తమసః** = చీకటి (అజ్ఞానము) కి, **పరమ్** = అతీతమని, **ఉచ్యతే** = చెప్పబడుచున్నది, **జ్ఞానమ్** = జ్ఞానము, **జ్ఞేయమ్** = తెలియదగినది, **జ్ఞానగమ్యమ్** = జ్ఞానముచే పొందదగినది, **సర్వస్య** = అందరి, **హృది** = హృదయము నందు, **విష్ఠితమ్** = ఉపలభ్యమగు చున్నది.

> ఆ జ్ఞేయబ్రహ్మ జ్యోతిస్సులను కూడ ప్రకాశింపజేయునది, అజ్ఞానమనే చీకటికి అతీతమైనది, జ్ఞప్తి రూపము, తెలియదగినది, జ్ఞానముచే పొందదగినది, అందరి హృదయములో నున్నది అని చెప్పబడుచున్నది (17).

ఆ జ్ఞేయబ్రహ్మ ప్రకాశవములన్నింటికీ ప్రకాశకము (జ్యోతిషాం జ్యోతిః). సూర్యచంద్రులు, నక్షత్రములు, మరియు వివిధ రకముల దీపకాంతులు నేత్రేంద్రియ ప్రత్యక్షమునకు ఆలంబనమగుచున్నవి. స్వయముగా ప్రకాశించేది, లేదా తనపై పడిన కాంతిని పరావర్తనము చేయునది అగు వస్తువును మాత్రమే మనము చూడగల్గుదుము. అట్లు కాని వస్తువు దృష్టిగోచరము కాదు. మనకు అనుభవములోనున్న ఈ పరిస్థితి ఆత్మ స్వరూప బోధలో ఇపుడు

దృష్టాంతముగా నీయబడుచున్నది. నిష్ప్రభము (opaque) అగు వస్తువు తనంత తానుగా ప్రత్యక్షము కాదు. దానిని ప్రకాశింపజేసే దీపము ఉండవలెను. ఒక దీపమును ప్రకాశింపజేయుటకు మరియొక దీపముతో పనిలేదు. దీపము తనంత తానుగా నేత్రేంద్రియ గోచరమగును. కావున దీపము స్వయంప్రకాశమని చెప్పదగునా? దీపము స్వయం ప్రకాశమైనచో, కన్నులు మూసిననూ కనబడవలెను. కాని మహోజ్జ్వల కాంతి పుంజమగు సూర్యుడైననూ కన్నులను మూసినచో, కానరాడు. కావున దీపమేదియూ స్వయం ప్రకాశము గాదు. అట్లైనచో దీపము యొక్క ఉనికి ఎట్లు సిద్ధించుచున్నది? ప్రత్యక్ష ప్రమాణముచే సిద్ధించు చున్నది. నిష్ప్రభమగు వస్తువు వలె, దీపము కూడా మరియొక దీపముచే ప్రకాశింప చేయబడు చున్నది. ఆ మరియొక దీపము ఏది? కన్నులలోని కాంతి. దీపమును కన్నులలోని కాంతి ప్రకాశింప జేయుచున్నది గనుక, అది స్వయం ప్రకాశము గాదు. కన్నులు కూడ స్వయం ప్రకాశము కావు. ఏలయన, మనస్సు వాటితో జతగూడనిదే అవి వస్తువును చూడజాలవు. పరమాణువులు మొదలగునవి కేవలము అనుమాన ప్రమాణము (inference) పై ఆధారపడి యున్నవి. అనుమితిని చేయునది మనస్సే గదా! ఈ స్థితిలో ఏది స్వయం ప్రకాశము? మనస్సు స్వయంప్రకాశము గాదు. ఏలయన, మనస్సు స్వయంప్రకాశమైనచో, అది పరిణామమును చెందజాలదు. అప్పుడు మనము ఏ వస్తువునైననూ దర్శించ జాలము. వస్తు-ఆకారము గల మనోవృత్తి ఉదయించినప్పుడు మాత్రమే మనకు ఆ వస్తువు ప్రత్యక్షమగును. కావున మనస్సును కూడ ప్రకాశింపజేసేది మరియొకటి గలదు.

స్వయంప్రకాశమగు అంతిమ స్థానమేది? అది ఆత్మ మాత్రమే కాగల్గును. జ్ఞేయ-బ్రహ్మయే ఆత్మ. ప్రకాశము దాని స్వరూపము. ఇతర జ్యోతిస్సులన్నియు పూర్తిగా దానిపై ఆధారపడును. లోపలి దీపము, బయటి దీపము, సర్వాతీతమగు దీపము, అంతరతమమగు దీపము, దీపములకు దీపము నేనే. ఆత్మ జ్యోతియగు శివుడును నేనే (అంతర్జ్యోతిః బహిర్జ్యోతిః ప్రత్యగ్ జ్యోతిః పరాత్పరః, జ్యోతిర్ జ్యోతిః అహంజ్యోతిః ఆత్మా జ్యోతిః శివోऽస్మ్యహమ్). దీనిని పదే పదే భావన చేసినచో, అది నిదిధ్యాసన మనబడును.

అజ్ఞానమునకు ఆవలనున్నది (తమసః పరస్తాత్) అని చెప్పబడిన జ్యోతి ఇదియే. ఇచట తమస్ అనగా చీకటి కాదు. వెలుతురు చీకటికి విరోధి. అవి పరస్పర వ్యావర్తకములు (exclusive). కాని ఈ జ్ఞాన జ్యోతి చీకటితో సహా సర్వమును అనుమోదించి ప్రకాశింప జేయును. ఈ జ్యోతి వలననే మనము చీకటిని తెలియగల్గుచున్నాము. ఆత్మజ్యోతి అజ్ఞాన విరోధి కాదు; జ్ఞాన విరోధి కాదని చెప్పనేల? ఘటజ్ఞానమును, మరియు మృత్పరమాణువుల అజ్ఞానమును

కూడ అది ప్రకాశింప జేయును. అది ద్వంద్వములకు అతీతమై, ద్వంద్వములకు ఉనికి నొసంగి ప్రకాశింపజేయును. అది సర్వజ్ఞానాకార వృత్తులను ప్రకాశింప జేయు కౌశలముతో సమమగు కౌశలముతో అజ్ఞానమును కూడా ప్రకాశింపజేయును. అది దేనికైననూ విరోధి కాదు. లుప్తమగుట ఎరుంగని ద్రష్ట (అలుప్తదృక్) యే ఆత్మ. మనస్సు నిద్రలో లీనమైనప్పుడు, కలలను గనుచున్నప్పుడు మరియు శబ్దరసాదులను స్వీకరించునప్పుడు, ఆత్మ ప్రకాశించుచునే యుండును. సూక్ష్మశరీరము స్థూలదేహమును వీడినప్పుడు, మరియు విశీర్ణమైనప్పుడు (disintegrated) కూడ ఆత్మ సర్వదా శుద్ధ చైతన్యస్వరూపమై ప్రకాశింప జేయుచుండును. కావున అది అజ్ఞానమనే చీకటికి అతీతమైనది; జ్యోతిస్సులకు అన్నింటికీ జ్యోతి.

అదియే జ్ఞానజ్యోతి; అనగా శుద్ధ చైతన్యము. అది పరిచ్ఛిన్న జ్ఞానములకు మరియు అజ్ఞానమునకు అతీతమైనది. అదే సర్వకారణమగు జ్ఞేయ–పరం బ్రహ్మ. ఇంతకు ముందు వర్ణించబడిన జీవనమూల్యములకు శాస్త్రప్రమాణమును జతగూర్చి దానిని పొందదగును (జ్ఞానగమ్యమ్). దానిని ఎచట తెలియదగును? అది హృదయమునందు భాసించుచున్నది (విష్ఠితమ్). అది అనేక రూపములలో ఉపలభ్యమగుచున్ననూ, నిత్యము మానవుని జీవితములో జరిగే వివిధ ఘటనలకు దానిపై ప్రభావమేదియూ లేదు. అది శుద్ధ చైతన్య స్వరూపములో స్థిరముగ నుండును.

ఇంతవరకు చెప్పబడిన విషయమును సారరూపముగా క్రింది శ్లోకము ప్రస్తావించుచున్నది.

**అధ్యాయము 13, శ్లోకము 18 :**

इति क्षेत्रं तथा ज्ञानं ज्ञेयं चोक्तं समासतः ।
मद्भक्त एतद् विज्ञाय मद्भावायोपपद्यते ॥ १८ ॥

**ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః**
మద్భక్త ఏతద్ విజ్ఞాయ మద్భావాయోపపద్యతే (18).

**ఇతి** = ఈ విధముగా, **క్షేత్రమ్** = క్షేత్రము, **తథా** = అదే విధముగా, **జ్ఞానమ్** = జ్ఞానము, **చ** = మరియు, **జ్ఞేయమ్** = తెలియదగినది, **సమాసతః** = సంగ్రహముగా, **ఉక్తమ్** = చెప్పబడినది, **మద్భక్తః** = నా భక్తుడు, **ఏతద్** = దీనిని, **విజ్ఞాయ** = తెలుసుకొని, **మద్భావాయ** = నాతో ఒకటి యగుటకు, **ఉపపద్యతే** = అర్హుడు అగును.

ఈ తీరున క్షేత్రము, జ్ఞానము (జ్ఞానమును పొందే సాధనములు) మరియు జ్ఞేయము సంగ్రహముగా చెప్పబడినవి. నా భక్తుడు వీటిని స్పష్టముగా తెలుసుకొని నాలో ఐక్యమగుటకు అర్హుడగును (18).

పంచభూతములు, అహంకారము, బుద్ధి మరియు అవ్యక్తము ఇత్యాదులు క్షేత్రమని చెప్పబడినది. దీనితో సర్వసృష్టియు క్షేత్రములో అంతర్గతమగు చున్నది. అమానిత్వాది జీవన మూల్యములతో గూడియున్న జ్ఞానము చెప్పబడినది. అది లేనిది, సత్ గాని అసత్ గాని కానిది, తెలియదగినది (జ్ఞేయమ్) అగు పరంబ్రహ్మ సంగ్రహముగా (సమాసతః) చెప్పబడినది. క్షేత్రజ్ఞుడు జ్ఞేయము కంటె వేరు గాదని ముందుగనే నిర్ధారింపబడి యుండుటచే ఇచట భగవానుడు క్షేత్రజ్ఞుని ప్రత్యేకముగా ప్రస్తావించలేదు. సమస్త వేదార్థమును మాత్రమే గాక, సమస్త గీతా శాస్త్రార్థమును గూడ భగవానుడీ శ్లోకములో సారరూపముగా చెప్పినాడని శ్రీశంకరులు వివరించిరి.

ఈ జ్ఞేయ-బ్రహ్మ-సాక్షాత్కారమునకు అర్హులు ఎవరు? నా యందు అనగా, గురువులకు గురువు, సర్వజ్ఞుడు అగు పరమేశ్వరుని యందు భక్తి గలవారు (మద్భక్తాః). ఈ జ్ఞానమును సృష్ట్యాదిలో భగవానుడు ప్రవర్తిల్లజేసినాడు గనుక ఆది గురువు మరియు అంతిమ గురువు ఆయనయే. తన మనస్సును, ఇంద్రియములను, సర్వమును భగవద్-జ్ఞాన-అన్వేషణకు సమర్పించిన వ్యక్తి మద్భక్తః అనబడునని భగవానుడు చెప్పుచున్నాడు.

నీవు సర్వమును కోరే పక్షంలో సర్వమును సమర్పించవలయును. వస్తుస్థితి అట్లున్నది. జూదములోనైనా, తాను నెగ్గగలననే ధీమా గలవాడు తన సర్వమును పందెములో ఒడ్డును. కాని ఇది జూదము కాదు. ఏలయన, నీవు సాధించవలసినది నిత్య సిద్ధమగు సద్వస్తువు. కావున దీనిలో ఓడిపోయే ప్రసక్తి లేదు. దీనిలో నీవు ఏ స్థాయి వరకు త్యాగము చేసెదవో, ఆ స్థాయి వరకు లాభమును పొందెదవు. అనగా, నీలో సంతుష్టి ఎంత అధికంగా ఉంటే, అంత అధికంగా నీవు త్యాగమును చేయగల్గుదువు. నీలో సంతుష్టి ఎంత అల్పముగ నుండునో, నీ త్యాగము కూడ అంతే అల్పముగ నుండును. ఇచట త్యాగమనగా ఒక దానికి అతీతముగా పరిపక్వతను చెందుట. కావున, నీవు త్యాగమును చేసిన ప్రతి పర్యాయము ఒక దానిని దాటి పరిపక్వతను చెందినట్లు అగును. అనగా దీనిలో వాస్తవముగా కోల్పోయేది ఏదీ లేదు. సాధారణంగా నీవు దేనిని త్యాగము చేసినా, అహంకారమునే త్యాగము చేసినట్లు అగును. అనగా, సత్య-మిథ్యా వివేక జ్ఞానములో అహంకారము అంతర్గతమై అంతర్ధానమగును. ఈ తీరున సర్వము

త్యజింపబడును. ఈ జ్ఞానమును పొందుట కొరకై సర్వమును త్యజించువాడు మద్భక్తః అనబడునని భగవానుడు చెప్పుచున్నాడు.

అతడు సర్వమును భగవానునకు సమర్పించును. అతడు దేనిని చూచినా, వినినా, స్పృశించినా, సర్వము భగవానుడే యను సమాలోచనముతో అతని మనస్సు నిండి పోయి, పరవశమగును. పూర్వశ్లోకములలో వర్ణింపబడిన ఈ జ్ఞేయబ్రహ్మను స్పష్టముగా నెరింగిన (ఏతద్ విజ్ఞాయ) ఇట్టి వ్యక్తి నన్ను పొందుటకు అర్హుడగునని (మద్భావాయ ఉపపద్యతే) భగవానుడు చెప్పుచున్నాడు. మద్భావమనగా ఈశ్వరునితో తనకు గల అభేదమును గుర్తించి పరమాత్మరూపుడై ఉండుటయని భగవానుడు చెప్పియున్నాడు. దశమపురుషుడు తాను దశమ పురుషుడనని యెరింగి దశమపురుషుడు అగును. అదే తీరున మద్భక్తుడు ఈశ్వరత్వమును సంపాదించును. పరమాత్మ తెలియాలంటే పరమాత్మ జ్ఞానమునందు ప్రేమ ఉండవలెను. సర్వులు ఆనందమును ప్రేమించెదరు. ఆ ఆనందమే ఆత్మ. కాని ఆత్మ జ్ఞానమును ప్రేమించువారు అరుదు. ఈ ప్రేమగల వ్యక్తి జిజ్ఞాసువు అగును. జిజ్ఞాసువు ఒక విలక్షణవ్యక్తి. సంసారాంతర్గతమగు లక్ష్యాన్వేషణలో భగవంతుని సహకారము నర్థించువాడు గౌణభక్తుడు. ఈ ప్రకరణములోని భక్తుడు అట్టి భక్తుని కంటె ఉత్కృష్టుడగు జిజ్ఞాసుభక్తుడు. భగవద్ జ్ఞానమునందలి ప్రేమ మాత్రమే యథార్థమగు ప్రేమ. అంత కంటె తక్కువ ప్రేమ యథార్థప్రేమ కాదు. పరమాత్మ జ్ఞానమునందలి అట్టి ప్రేమ నిన్ను పరమాత్మని దరికి జేర్చును. ఏలయన, నీవు సర్వకాలములయందు పరమాత్మవే. నీవు అజ్ఞానముచే గోల్పోయిన వస్తువు దగ్గరకు ఆ వస్తుజ్ఞానమునందలి ప్రేమ దక్క మరియేది నిన్ను చేర్చగల్గును? జ్ఞానోదయమునకు ఆవశ్యకమగు అర్హతలు మొదలగు వాటినన్నింటినీ ఆ ప్రేమ తనతో బాటు దోడ్కొని వచ్చును. అంతకు తక్కువ దానిపై నీకు మక్కువ లేదు. కావున, ఆవశ్యకమగు షరతులనన్నింటినీ నీవు పరిపూర్తి చేసెదవు. జ్ఞానమునందలి ప్రేమ అనగానదియే. వ్యక్తులు ఈ ప్రపంచములో ఒక వస్తువును ప్రేమించి దానిని పొందుటకై పర్వతములనధి గమించెదరు. కావున, నీకు ఈ జ్ఞానముపై ప్రేమ ఉన్నచో, ఈ జ్ఞానము ఎంతటి విలువ గలదియో నీవు ఎరింగినచో, దీనిని పొందుటకు నీవు పడరాని కష్టము ఏది గలదు? జ్ఞానమునందలి ప్రేమ ఎంత గొప్పది అంటే, వాస్తవములో దానికొరకు దేనినైననూ పని గట్టుకొని త్యజించవలసిన పనిలేదు. సర్వము తనంత తానుగా జారిపోవును.

అనావశ్యకములగు వస్తువులను మనము సంతోషముతో వదిలించుకొనెదము. వాటి విషయములో త్యాగమేమియూ లేదు. సర్వమును కబళించి వేసే ప్రేమ జ్ఞానమునందున్నచో,

దానికి విరుద్ధమైనది ఏదైనా జారిపోవును. అట్టి వ్యక్తిని ఈ జ్ఞానమునకు దూరముగా నుంచుట సంభవము కాదు.

శ్రీ శంకరులు తరువాతి శ్లోకమునకు గడచిన భాగము (section)తో గల సంగతి (connection)ని వివరిస్తూ, 7 వ అధ్యాయములో చర్చించబడిన పరా-అపరా అనే ద్వివిధ- ప్రకృతులను మనకు గుర్తు చేయుచున్నారు. సృష్టి అంతయు ఈ రెండు ప్రకృతులలో అంతర్గతమగునని మనము చూచి యున్నాము. ఈ అధ్యాయములోని బ్రహ్మ-అభిన్నమగు క్షేత్రజ్ఞ-ఆత్మయే పరాప్రకృతి. క్షేత్రము అపరాప్రకృతి.

ఇప్పుడు ఒక ప్రశ్న తలయెత్తుచున్నది. ప్రకృతి (క్షేత్రము) మరియు పురుషుడు (క్షేత్రజ్ఞుడు) అనే రెండు సర్వమునకు కారణములెట్లు అగుచున్నవి? ఈ ప్రశ్నకు సమాధానము తరువాతి శ్లోకములో రానున్నది. అర్జునుని ప్రశ్నను పరిశీలించినచో, పురుషప్రకృతులనగా నేమి? అను ప్రశ్నలకు కూడ ఈ శ్లోకములో సమాధానము రాగలదు. ఇంతే గాక, క్షేత్రక్షేత్రజ్ఞ వర్ణనలో వివరింపబడని కొన్ని విషయములను కూడ ఈ శ్లోకము వివరించుచున్నది.

అధ్యాయము 13, శ్లోకము 19 :

प्रकृतिं पुरुषं चैव विद्ध्यनादी उभावपि ।
विकारांश्च गुणांश्चैव विद्धि प्रकृति संभवान् ॥ १९ ॥

ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్ (19).

చ = మరియు, ప్రకృతిమ్ = ప్రకృతిని, పురుషమ్ = పురుషుని, ఏవ = నిశ్చయముగా, ఉభౌ అపి = రెండింటినీ కూడ, అనాదీ = ఆది లేనివి యని, విద్ధి = ఎరుంగుము, చ = మరియు, ప్రకృతి సంభవాన్ = ప్రకృతినుండి పుట్టిన, వికారాన్ = కార్యములను, చ = మరియు, గుణాన్ = గుణములను, ఏవ = నిశ్చయముగా.

ప్రకృతి పురుషులిద్దరూ అనాది యనియు, వికారములు (కార్యములు) మరియు గుణములు ప్రకృతి నుండి పుట్టిన వనియు నీవు నిశ్చయముగా ఎరుంగుము (19).

ప్రకృతి యనగా సృష్టించుట కొరకై పూర్తిగా లభ్యమగునది ( ప్రకర్షేణ కృతియోగ్యత్వాత్ ప్రకృతిః). ఉదాహరణకు, మట్టి కుండలకు మట్టి ప్రకృతి అని చెప్పుటకు వీలులేదు. మట్టి ఒక విశిష్ట శక్తి గల కారణము. మట్టి కుండకు కారణము కాగల్గును. కాని అద్దమునకు కారణము కాలేదు. కాని ప్రకృతి యనగా సర్వమును సృష్టించగల శక్తి గలది అని యర్థము. ప్రకృతి తనంత తానుగా సృష్టించలేదు. పురుషునితో గూడి సృష్టికి హేతువు అగును. సృష్టికి అస్తిత్వమును పురుషుడు సమకూర్చును. ఈ రెండు కారణములు కలిసి ఈశ్వరుడనబడును. ఈ రెండింటికి కారణత్వము సమానమే అయిననూ, ప్రకృతి (మాయా)కి పురుషుడు ఆధారము.

ఈ రెండింటికీ ఆది లేదని (అనాదీ ఉభౌ) భగవానుడిచట చెప్పుచున్నాడు. పురుషుడు కాలమునకు బద్ధుడు కాడు. కాన పురుషునకు ఆది–అంతములు లేవు. ప్రకృతికి ఆధారము పురుషుడు. ప్రకృతి పూర్తిగా పురుషునిపై ఆధారపడి యున్నది. కావున ప్రకృతికి కూడ ఆది లేదు. ప్రకృతికి ఆది ఉండే పక్షంలో, ఆ ఆదికి పూర్వములో ప్రకృతి లేకుండవలెను. అపుడు ప్రకృతి దేనినుండి సృష్టింపబడెను? దీనిలో అనవస్థా దోషము వచ్చి పడును. సృష్టి అసంభవమగును. కావున ప్రకృతి కూడ అనాదియే. జగత్తు దృష్ట్యా దానికి మాయా అని పేరు. అది మిథ్యా భూతమగు సృష్టికి మూలము. జీవుని దృష్టికోణములో దానికి అవిద్యయని పేరు. జగత్తు ప్రలయమములో విలీనమైనప్పుడు అవ్యాకృతముతో గూడి బ్రహ్మ మాత్రమే మిగిలియుండును. ఆ అవ్యాకృతస్థితికి ప్రకృతి యని పేరు. ఆ రెండింటికీ ఆది లేదు.

ఈశ్వరుడు సర్వసృష్టికి ద్వివిధకారణము అగుచున్నాడు. ఈ ద్వివిధ కారణత్వము వలననే ఆయన సృష్టికి అధ్యక్షుడు అగుచున్నాడు. ఈశ్వరుడు కేవల నిమిత్తకారణము (పురుషః) మాత్రమే అయి, ఉపాదానము (ప్రకృతి) ఈశ్వరుని కంటె భిన్నముగా నున్నచో, ఈశ్వరుడు మరియొక వస్తువుపై ఆధారపడి సృష్టిని చేసినట్లు అగును. అనగా ఆయన యందు సర్వశక్తిమత్త్వము, సర్వవ్యాపకత్వము లుప్తమగును. అపుడు ఆయనను ఈశ్వరుడనుట పొసగదు. తాను వికారమును చెందకుండగా సర్వమునకు అస్తిత్వమును ప్రదానము చేసే చరమ కారణము, మరియు మార్పులకు లోనయ్యే మాయ అనే రెండు ఈశ్వరుడే. మొదటిదియగు చైతన్య–ఆత్మ (పురుషుడు) ఈశ్వరుని స్వరూపము కాగా, రెండవది యగు మాయ ఈశ్వరుని స్వభావము. కర్మను చేస్తూ ఉన్నా నా స్వరూపము సచ్చిదానందమనియు, భోక్తృత్వము నా స్వభావమనియు నీవు కూడ చెప్పవచ్చును. ఈ ద్వివిధప్రకృతుల వలన జగత్తు యొక్క సృష్టి స్థితిలయములకు ఈశ్వరుడు కారణమగుచున్నాడు. ఈ రెండు తత్త్వములు కలిసి సంసారకారణములగు చున్నవి. ఈ రెండింటికీ ఆది లేదు.

సాంఖ్యవాదులు కూడ సృష్టికారణము పురుషప్రకృతులనియే చెప్పెదరు. కాని వారి వాదములో పురుషుడు భోక్త కాగా, సర్వమును సృష్టించే కర్త ప్రకృతి. ఇదియే సంసారము. తాను భోక్తను మాత్రమేనని గుర్తించిననాడు పురుషుడు సంసారమునుండి విముక్తిని పొందును. పురుషుడు (ఆత్మ) అసంగుడనియు, ఆత్మలు వేర్వేరనియు సాంఖ్యులు భావించెదరు. కాని సృష్టికి కారణమగు ప్రకృతి అద్వితీయము. ప్రకృతి కార్యము, జడము అగు ప్రతి అంతఃకరణము వెనుక ఒక చేతన-ఆత్మ గలదు. ప్రకృతి సత్త్వరజస్తమో గుణాత్మకము. ప్రళయములో ఈ గుణములు సామ్యావస్థలో నుండును. సృష్టి సమయము ఆసన్నమైనప్పుడు ఈ సామ్యావస్థలో సంక్షోభము (disturbance) ఏర్పడును. ఇచట ఒక ప్రశ్న ఉదయించును. ఆ క్షోభను కలిగించేది ఎవరు? ప్రకృతి జడము గనుక, ఆ పనిని అది చేయజాలదు. పురుషుడు అసంగుడు గనుక, చేయజాలడు. ఇవి గాక మూడవ తత్త్వము లేదు. మరియు ప్రకృతి నిత్యమై సర్వమును అదియే సృష్టించినచో, సృష్టి జరిగిన తరువాత, ఆ సృష్టికి ప్రళయము సంభవము కాదు. ఒకచో ప్రళయము వచ్చిననూ, అదియే కొనసాగవలెను. కావున, మోక్షము అసంభవమగును. వాస్తవములో ఇచట మోక్షము యొక్క ఆవశ్యకతయే లేదు. జడమగు ప్రకృతికి మోక్షముతో పనిలేదు. పురుషుడు సర్వదా నిత్యుడు మరియు సర్వసంబంధ వివర్జితుడు (అసంగః).

అట్లుగాక, పురుష ప్రకృతులు కలిసి ఈశ్వరుడన్నచో, సమస్య లేదు. అంతే గాక, ఆ ఈశ్వరుడు నీవే. ఈ సత్యము నెరింగినచో, నీవు బంధవిముక్తుడవు అగుదువు. కావున, శాస్త్రము సార్థకమగును. వేదాంత శాస్త్రమును మననము చేయునప్పుడు, అభ్యాసములో సహకరించే ప్రతిపక్ష స్థానములో (sparring partner) సాంఖ్యవాది ఉపకరించును. అంతకు మించి సాంఖ్యవాదమునకు ప్రయోజనము లేదు.

ప్రకృతి నుండి ఉద్భవించిన వివిధ వికారములను మరియు గుణములను మనము తప్పక తెలియవలెనని (ప్రకృతి సంభవాన్ వికారాన్ చ గుణాన్ చ విద్ధి) భగవానుడు తరువాత చెప్పుచున్నాడు. బుద్ధి, జ్ఞానేంద్రియములు ఇత్యాది కొన్ని వికారము (కార్యము)లను, సుఖ-దుఃఖ-మోహాది వివిధ-అంతఃకరణ-ధర్మముల రూపములో అభివ్యక్త మయ్యే గుణములను భగవానుడు తరువాత క్రమముగా చెప్పగలడు. ఇవి అన్నియు ప్రకృతి నుండి పుట్టినవియేనని మనము తెలియవలెను. ప్రకృతి యనగా ఈశ్వరుని సృజనశక్తి. దీనికే మాయయని పేరు. సత్త్వరజస్తమో గుణములు దానిలో అంతర్భాగములు. దేహము ఇత్యాది వివిధ-వికారములకు కారణము ఈ ప్రకృతియే. నేత్రములకు గల రూపగ్రహణ శక్తి ఇత్యాది విభిన్న-అభివ్యక్తులన్నింటికీ కారణము ప్రకృతియే. ఇవి అన్నియు ఈశ్వరుని ప్రకృతి నుండియే పుట్టినవి.

మరియు ప్రకృతి యనగా జగద్రూపముగా పరిణామమును చెందిన ఉపాదాన కారణము (పరిణామి-ఉపాదాన-కారణమ్) అగు ఈశ్వరుడేనని శ్రీ శంకరులు వివరించిరి. సర్వసృష్టికి పురుషుడు కూడ కారణమే; కాని పురుషునిలో వికారమేమియు ఉండదు (వివర్త-ఉపాధాన-కారణమ్). ఈ రెండు కారణములు ఈశ్వరుని యందే ఉన్నవి. అనగా ప్రకృతిపురుషులు ఈశ్వరుని కంటె వేరుగా లేరు. ప్రకృతి యందు మాత్రమే మార్పులు వచ్చునని గీత ఇచట స్పష్టముగా నిరూపించు చున్నది (వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్). ఈ ప్రకృతి వివర్త-ఉపాదాన-కారణమగు పురుషుని ఆశ్రయించి ఉన్నది.

ప్రకృతి నుండి పుట్టిన వికారములు, గుణములు ఎయ్యవి? అను ప్రశ్నతో శ్రీ శంకరులు తరువాతి శ్లోకమును ఉపక్రమించినారు:

**అధ్యాయము 13, శ్లోకము 20 :**

कार्यकारणकर्तृत्वे हेतुः प्रकृतिरुच्यते ।
पुरुषस्सुखदुःखानां भोक्तृत्वे हेतुरुच्यते ॥ २० ॥

కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే
పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే (20).

**కార్యకారణ కర్తృత్వే** = స్థూల దేహమును, ఇంద్రియములను సృష్టించుటలో, **ప్రకృతిః** = ప్రకృతి, **హేతుః** = కారణమని, **ఉచ్యతే** = చెప్పబడుచున్నది, **సుఖదుఃఖానామ్** = సుఖదుఃఖముల, **భోక్తృత్వే** = భోక్త యగుటలో, **పురుషః** = పురుషుడు, **హేతుః** = కారణమని, **ఉచ్యతే** = చెప్పబడుచున్నాడు.

> స్థూలదేహమును ఇంద్రియములను సృష్టించుటలో ప్రకృతి కారణమనియు, సుఖదుఃఖానుభవమునకు పురుషుడు హేతువు అనియు చెప్పబడు చున్నది (20).

కార్యకారణ కర్తృత్వే అను పదములోని కార్యశబ్దమునకు స్థూలదేహము అని యర్థము. దేహ నిర్మాణములో ఉపాదానములైన పంచభూతములు కూడ కార్యములే గనుక వాటిని కూడ జత చేయవలెను. శ్రోత్ర స్పర్శ జిహ్వా నేత్రఘ్రాణములనే ఇంద్రియముల యొక్క విషయములను

కూడ కార్యములో అంతర్గతము చేయవలెను. ఇవి అన్నియు ప్రకృతి నుండి పుట్టినవి. జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, బుద్ధి, అహంకారము మరియు స్మృతి అనునవి కరణములు. ఈ కరణములు (సాధనములు) స్థూలదేహము నందు ఉపలభ్యమగు చున్నవి. పూర్వశ్లోకములో చెప్పబడిన తీరున, సుఖ-దుఃఖ-మోహాది-వివిధ-మనోదశలు కూడ మనస్సు అనే కరణము యొక్క అభివ్యక్తులే గనుక, కరణములలో అంతర్గతమగును. ఇవి అన్నియు ప్రకృతి నుండియే పుట్టినవి.

ఈ పదము వద్ద పాఠాంతరము గలదు. దానిని ఈ విధముగా వ్యాఖ్యానించవలెను. కార్యకారణరూపమగు సృష్టికి మూలకారణము ప్రకృతి (కార్యకారణ కర్తృత్వే). కారణము రూపాంతరములోనికి పరిణమించి కార్యమగునని శ్రీ శంకరులు నిర్వచించిరి. ఉదాహరణకు, ఘటరూపకార్యమునకు కారణము మట్టి. మనకు తెలిసిన కార్యకారణ సంబంధము చాల అస్థిరమైనది. ఒకే వస్తువు ఒక దృష్టికోణములో కారణము, మరియొక దృష్టికోణములో కార్యము అగు చుండును. ఉదాహరణకు, ఘట దృష్ట్యా మట్టి కారణము కాగా, పరమాణువుల దృష్ట్యా కార్యము అగుచున్నది. మనకు తెలిసే ఈ కార్యకారణ ప్రపంచమునకంతకూ ప్రకృతి కారణమని భగవానుడిచట చెప్పుచున్నాడు.

ప్రకృతికి ఆశ్రయమగు పురుషుడు కూడా సృష్టికి దూరముగా లేడు. పురుషుడు సృష్టించుట మాత్రమే గాక, భోగించును. బుద్ధి నుండి ఆరంభమయ్యే ప్రకృతి లోపల ఉపలభ్యమయ్యే చేతన స్వరూపుడగు పురుషుడు ప్రకృతిగుణములగు సుఖదుఃఖములననుభవించే భోక్త. ఈ సంఘాతము ప్రకృతి. సంఘాతభోక్త పురుషుడు. జీవుడు, క్షేత్రజ్ఞుడు మరియు భోక్త అనునవి పురుషునకు పర్యాయములని శ్రీ శంకరులు వివరించిరి. భోక్తృత్వములో జ్ఞాతృత్వము కూడా అంతర్గతమగును. ఈ సమస్త సృష్టికి జ్ఞాతయగు పురుషుడు కర్తయై, తత్కారణముగా భోక్తయగును. మరో మాటలో చెప్పాలంటే, ద్రష్ట, శ్రోత, మంత, విజ్ఞాత ఇత్యాది రూపములను పొందునది పురుషుడే. పురుషుడు లేనిదే కర్తగాని, భోక్తగాని లేడు. కాని మనమింతకు ముందు పలుమార్లు చూచిన విధముగా, పురుషుడు కర్తృత్వ భోక్తృత్వ రహితుడై స్వతంత్రమగు ఉనికిని కలిగి యుండును. పురుషప్రకృతులు రెండు కలిసి సంసారమునకు కారణమగును.

స్థూలదేహము, ఇంద్రియములు, జగత్తు మరియు సుఖదుఃఖాది వివిధ మనోదశల రూపములోనికి ప్రకృతి పరిణమించనిచో, మరియు వీటి నన్నిటినీ అనుభవించే చేతనుడు లేకున్నచో, సంసారము అసలే లేకుండెడిది. ఇందువలననే, నిద్రలో సంసారానుభవము లేదు.

నిద్ర యందు గల ఆకర్షణకు కారణమిదియే. ప్రకృతి ఈ విధముగా పరిణమించనిచో, జగత్తు ఉండెడిది గాదు. దానిని చూపించే ఇంద్రియములు ఉండెడివి గావు అని శ్రీశంకరులు వివరించిరి. పురుషుడు కూడ ఉండి తీరవలెను. పురుషుడు లేనిచో చేతనతత్త్వము లేదు. ఈ రెండింటి మధ్యలో ఎట్టి సంబంధము గలదు? పురుషుని స్వరూపము అసంగత్వము; అనగా దేనితోనైననూ సంబంధము లేకుండగానుండుట. ఉదాహరణకు, చైతన్య స్వరూపుడగు పురుషునకు మనస్సుతో గల సంబంధమెట్టిది? చైతన్యములో వృత్తి ఆకాశములో వ్రేలాడే మేఘపు తునక వంటిది. వృత్తి యొక్క అవశేషములు ఏమియు చైతన్యము నందు మిగిలి యుండవు. కాని వృత్తికి స్వతంత్రమగు అస్తిత్వము లేదు. పైగా వృత్తి జడము.

చేతనుడగు పురుషునకు, జడ–ప్రకృతి–వికారమగు వృత్తికి మధ్యలో ఎట్టి సంబంధము సంభవమగును? కావున సంబంధము అవిద్యాకృతము, కావుననే మిథ్యయని శ్రీశంకరులు వివరించిరి. ఈ సర్వము అధ్యాస (Superimposition) మూలకము. వాటిమధ్య అవిద్యాకృతమగు సంబంధము ఉండుటచే, అంతః కరణములో ఏది జరిగినా, అది నాకే జరిగినట్లు భాసించును. అదియే సంసారము. జ్ఞాతృత్వాది అనుభవములను భోగించువాడు పురుషుడు కాగా, అనుభవింపబడే దానికి ప్రకృతి హేతువు. ఇది సంసార జీవనమునకు అనుకూలమైన సమగ్ర నిర్మాణము.

ఇపుడు శ్రీ శంకరులు మరియొక ప్రశ్నను వేయుచున్నారు. ఈ సంసారమనగా నేమి? సుఖ దుఃఖముల తీవ్రమగు అనుభవమే సంసారమని శ్రీ శంకరులు వర్ణించిరి. సంసారమునమభవించువాడు సంసారి యనబడును. కావున, పురుషుడు సంసారియైనట్లు కన్పట్టును. అసంగుడు, చేతనుడు అగు పురుషుడు సంసారి ఎట్లు అయినాడు?

**అధ్యాయము 13, శ్లోకము 21 :**

पुरुषः प्रकृतिस्थो हि भुंक्ते प्रकृतिजान् गुणान् ।
कारणं गुणसंगोऽस्य सदसद्योनिजन्मसु ॥ २१ ॥

పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్
కారణం గుణసంగోస్య సదసద్యోనిజన్మసు (21).

**హి = ఏలయనగా, పురుషః = పురుషుడు, ప్రకృతిస్థః = ప్రకృతి యందున్నవాడై, ప్రకృ**

తిజాన్ = ప్రకృతినుండి పుట్టిన, గుణాన్ = గుణములను, భుంక్తే = అనుభవించుచున్నాడు, అస్య = ఈ పురుషుని, సదసద్యోని జన్మసు = ఉత్తమ-అధమ యోనుల యందు జన్మించుటలో గుణ సంగః = గుణముల యందలి ఆసక్తి, కారణమ్ = కారణము.

> ఏలయనగా పురుషుడు ప్రకృతి యందున్నవాడై ప్రకృతి నుండి పుట్టిన గుణములననుభవించు చున్నాడు. ఈ పురుషుడు ఉత్తమ-అధమ యోనులలో జన్మించుటకు గుణములయందలి ఆసక్తియే కారణము (21).

దేహేంద్రియ మనస్సంఘాత రూపముగా పరిణమించిన ప్రకృతిలో పురుషుడు (క్షేత్రజ్ఞుడు) ఉపహితుడై ఉపలభ్యమానమగు చున్నాడు. జగద్రూపముగా కూడ ప్రకృతియే పరిణమించి యున్నది. పురుషుడు ప్రకృతిలో ప్రకటమైనంత మాత్రాన సంసారి అయిపోడు. పురుషుడు సంసారి కావాలంటే, ప్రకృతిని ఆత్మరూపముగా భ్రమపడి యుండవలెను. పురుషుడు అసంగుడు; పురుషునకు దేనితో నైననూ యథార్థమగు సంబంధము లేదు. కాని అజ్ఞానముచే దేహేంద్రియ మనస్సంఘాతముతో తాదాత్మ్యమును పొంది, తనయందు కర్తృత్వ-భోక్తృత్వములనారోపించు కొనుచున్నాడు. అట్టి సంసారికి ప్రకృతియే ఆత్మయై ఉన్నది గనుక, ప్రకృతి జన్యములగు సుఖదుఃఖాది విభిన్న మానసిక అవస్థలను అనుభవించు చున్నాడు (భుంక్తే) మానవుడు సుఖదుఃఖములను ఇదమ్ (ఇది) రూపముగా గాక, 'నేను సుఖిని, నేను దుఃఖిని' అను తాదాత్మ్యముతో అనుభవించుచున్నాడు. అవిద్యా కృతమగు సంసర్గము వలన మాత్రమే అతడు సుఖదుఃఖానుభవములను తనపై ఆరోపించు కొనుచున్నాడు. ఇంతే గాక, మానవుడు 'నేను భ్రాంతుడను, నేను పండితుడను' ఇత్యాది ఇతర భ్రాంతులకు కూడ లోనగుచున్నాడని శ్రీశంకరులు వివరించిరి.

ఈ భ్రాంతులకు మూలకారణము అవిద్య. కాని ఒక విశిష్టయోనిలో జీవుడు జన్మించుటకు అవ్యవహిత (immediate) కారణమేమి? ఈ స్థూలదేహమునకు కొన్ని విశిష్ట సమస్యలు ఉండుటకు, మరికొన్ని లేకుండుటకు కారణమేమి? ఒక విశిష్ట వంశములో జన్మించి, మరియొక వంశములో జన్మించకుండుటకు కారణమేమి? సాధారణ కారణమగు అవిద్యకు తోడుగా మరియొక అసాధారణ కారణము కూడ ఉండి తీరవలెను. మరియొక కార్య-కారణ స్థాయి కూడ ఉండవలెను. అదియే కర్మ. ఒక విశిష్ట దేహము ఆరంభమగుటకు హేతువులగు కొన్ని విశిష్ట కారణముల సముదాయమునకు యోని అని పేరు. దేవాదుల దేహము కేవల పుణ్యఫ

లము (సద్యోని). పశ్వాదుల దేహము కేవల పాపఫలము (అసద్యోని). మానవ దేహము పుణ్యపాపముల మిశ్రమఫలము (సదసద్యోని). మానవునకు గల ఇచ్ఛాశక్తి పుణ్యఫలము. ఇది సర్వమానవ సాధారణము. ఇది గాక ఆయా వ్యక్తుల పుణ్యమును బట్టి విశిష్ట సుఖములు, కొన్ని సహజములగు ప్రతిభలు ఉద్బుద్ధమగును. పురుషునకు గుణములతో గల సంసర్గమే వీటికి హేతువు అగుచున్నది.

మానవుని యందు దేహమే తాను అను ధారణ గలదు. దాని వలన కర్తృత్వమేర్పడినది. ఈ ధారణయే గుణములతోడి సంసర్గమునకు మూలకారణమగుచున్నది. ప్రకృతి గుణముల యందు ఆత్మ భ్రాంతి ఉండుటచే, సుఖాదుల యందలి కామన కూడ ఆత్మయేనను భ్రాంతి కలుగుచున్నది. మానవుడు సుఖిని కావాలని కోరును; అనగా తాను సుఖి కాదని అప్పటికే నిర్ణయించుకున్నటుల స్పష్టమగు చున్నది. ఆ నిష్కర్షకు కారణము అవిద్య. మానవుడు ఈ సుఖమును సంపాదించుటకై ధర్మమార్గములో ప్రయత్నించే పక్షంలో పుణ్యమును ప్రోగుచేసుకొనును. ధర్మమును ఉల్లంఘించినచో, పాపమును మూట గట్టు కొనును. ఏది ఏమైనా, ఈ పుణ్యపాపములు ఫలించవలెను. దాని కొరకై, మరియొక దేహములో జన్మించవలెను. మానవుడు సుఖిని కావాలనియు, దుఃఖిని కాకూడదనియు కాంక్షించును. దాని కొరకై అతడు కర్మలను చేయవలెను. కర్మఫలము వలన అతడు ఉన్నతమైన, లేదా నీచమైన జన్మలను (సదసద్యోని జన్మను) పొందును. కావున ఈ సంసార చక్రము తిరుగు చుండును. గుణముల తోడి కలయికయే (గుణసంగః) దీనికి కారణము. దీనిని ఆత్మ జ్ఞానముతో మాత్రమే బాధించదగును. ఆత్మ జ్ఞానముతో బాటు విరక్తి తోడుగా నుండును. విరక్తి యనగా వస్తువులను వాస్తవిక దృష్టితో విలువ కట్టుట అని యర్థము.

పురుషుడు అజ్ఞానము వలన గుణవికారములతో తాదాత్మ్యమును చెందియుండుటయే సంసారమనబడును. దీనిని బట్టి సంసారము పురుష (ఆత్మ) నకు చెందినది కాదని స్పష్టమగు చున్నది. ప్రకృతియందు భోక్తృత్వము లేదు గాన, సంసారము దానియందు ఉండజాలదు. ఆత్మ మాత్రమే చేతనము గనుక భోక్త కాగల్గును. కాని అసంగ–నిర్గుణ–ఆత్మ ప్రకృతిగుణభోక్త ఎట్లు కాగల్గును? అవిద్యచే పురుషుడు వాటితో తాదాత్మ్యమును చెందుట వలన మాత్రమే భోక్తృత్వము ప్రాప్తమైనది. జ్ఞానోదయము కాగానే ఈ అజ్ఞానకృతమగు తాదాత్మ్యము విలీనమై సంసారము బాధించబడును.

కావున పురుషుని స్వరూపజ్ఞానము ఆవశ్యకము. తరువాతి శ్లోకము ఆ జ్ఞానమును నిరూపించు చున్నది :

అధ్యాయము 13, శ్లోకము 22 :

उपद्रष्टानुमंता च भर्ता भोक्ता महेश्वरः ।
परमात्मेति चाप्युक्तो देहेऽस्मिन् पुरुषः परः ॥ २२ ॥

ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః
పరమాత్మేతి చాప్యుక్తో దేహేస్మిన్ పురుషః పరః (22).

అస్మిన్ = ఈ, దేహే = దేహము నందు, పురుషః = పురుషుడు, పరః = అనంతుడు, ఉపద్రష్టా = అంతిమ సాక్షి, అనుమంతా = అనుమతినిచ్చువాడు, చ = మరియు, భర్తా = పాలించి పోషించువాడు, భోక్తా = భోగించువాడు, చ = మరియు, మహేశ్వరః = అనంత ఈశ్వరుడు, పరమాత్మా = అనంత-ఆత్మ, ఇతి = అని, అపి = కూడా, ఉక్తః = చెప్పబడు చున్నాడు.

ఈ దేహమునందలి పురుషుడు అనంతుడు, సాక్షి, అనుమతి నిచ్చువాడు, పాలించి పోషించువాడు, భోక్త మరియు అనంత-ఈశ్వరుడు. ఈ పురుషునకు పరమాత్మ అను పేరు కూడ గలదు (22).

ఈ పురుషుడు ఉపద్రష్ట. ద్రష్ట అనగా చూచువాడు. ఉప అను ఉపసర్గకు 'దగ్గర' అని యర్థము. కాన ఉపద్రష్ట యనగా దగ్గరగా నుండి చూచువాడు. శ్రీ శంకరులు ఒక దృష్టాంతము నిచ్చిరి. యజ్ఞమును చేసే యజమాని యజ్ఞములో భాగముగా కొన్ని కర్మలను చేయును. యజ్ఞమును నిర్వహించే ఋత్త్విక్కులు వివిధ కర్మలను చేయుదురు. వీరు గాక మరియొక వ్యక్తి గలడు. అతడు అచట కూర్చుండి యుండును. కాని అతడు స్వయముగా ఏ పనినీ చేయడు. క్రియాకలాపమునకంతకూ అతడు అత్యంత సన్నిహితుడై యున్ననూ, స్వయముగా ఏ కర్మనూ చేయడు. కాని యజ్ఞ విధానమంతయు అయనకు కరతలామలకమై యుండును. అదే విధముగా పురుషుడు తాను స్వయముగా క్రియాశీలి గాడు. కాని పురుషుని సన్నిధిలో స్థూలదేహము, మనస్సు మరియు ఇంద్రియములు తమ తమ పనులను చేయు చుండును. 'ఉప' అను ఉపసర్గకు ప్రాధాన్యము గలదు. పురుషుడు క్షణమైననూ దూరముగా లేడని అది సూచించును. ఇందు వలననే ఈ పురుషుడు మరియొక సందర్భములో 'శ్రోత్రస్య శ్రోత్రమ్ (చెవికి చెవి)' ఇత్యాదిగా వర్ణించబడినాడు. సర్వజ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, మరియు మనస్సునకు వెనుక, కర్మలను వేటినీ చేయకుండగా, పురుషుడు ఉపస్థితుడై ఉన్నాడు. ఆ పురుషుడే ఆత్మ.

ఉపద్రష్ట యనగా అంతరతమమగు ద్రష్ట అని కూడ అర్థమును చెప్పవచ్చును. స్పర్శ జ్ఞానము స్థూలదేహమునంతనూ వ్యాపించి యుండుటచే, వేడి చల్లదనము ఇత్యాదులను అది గుర్తించగల్గును. ఆ దృష్టితో చూస్తే స్థూలదేహము ద్రష్టయగును. అదే విధముగా జ్ఞానేంద్రియ మగు కన్ను ద్రష్ట. మనస్సు లేనిదే ఇంద్రియములు పని చేయజాలవు. కావున మనస్సు ఇంద్రియములకు ద్రష్ట. కాని మనస్సును దర్శించువాడు మాత్రమే యథార్థమగు ద్రష్ట. ఆ ద్రష్ట మూలకముగనే మనస్సు, ఇంద్రియములు ఇత్యాదులన్నియు దర్శించగల్గుచున్నవి. ఆ ద్రష్ట అంతిమద్రష్ట. ఆ ద్రష్టను దాటి మరియొక ద్రష్ట లేడు. ఆ ద్రష్టకు ఉపద్రష్ట అని పేరు. ఈ పదమునకు మూడవ అర్థము గలదు. ఆత్మ సర్వమునకు సర్వదా సమీపములో నుండి సర్వమును దర్శించును. జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయములను ప్రకాశింపజేయు ఆత్మ ఉపద్రష్ట యగును. ఈ మూడు అర్థములు ఈ ప్రకరణములో సమానముగా వర్తించును.

అనుమంతా యనగా అనుమతిని ఇచ్చువాడు. అనుమననమ్ అనగా అనుజ్ఞ. మనస్సు ఏమి చేసినా, ఆత్మకు సంతోషమే. ఆత్మ స్వరూపతః పూర్ణము గనుక, దాని యందు ఏ కాలమునందైనను లోటు ఉండదు. మనస్సులో ఎన్ని రకముల మార్పులు వచ్చినా, ఆత్మ సర్వదా ఆనందముగా విశ్రాంతిగా నుండును. రెండవ అర్థమేమనగా, ఆత్మ క్రియల నాచరించదు. కాని ఆత్మ లేనిదే మనస్సు, ఇంద్రియములు, మరియు దేహము తమ వ్యాపారముల ననుష్ఠించలేవు. వీటి క్రియాకలాపమునకంతకూ ఆత్మ ప్రత్యక్షసాక్షి యగు చుండును. శ్రీశంకరులీ పదమును మూడవ విధముగా నిట్లు వ్యాఖ్యానించిరి. దేహేంద్రియ మనస్సులను ప్రకాశింప జేసి, ఆత్మ వాటి క్రియాకలాపమునకు అంతకు ఆశ్రయమగు చుండును. ఆత్మ దేనికైననూ విరోధి కాదు; లేశమైననూ అడ్డు చెప్పదు. ఆత్మ గొప్ప అనుమంత. మనస్సు అల్లకల్లోలముగా నున్నచో, ఆత్మ ఆ అల్లకల్లోలమును ప్రకాశింపజేయును. మనస్సు ఉల్లాసముగా నున్నచో, ఆత్మ మనస్సులోని ఆ ఉల్లాసమును ప్రకాశింప జేయును. ఆత్మ సూర్యుని వలె ప్రకాశస్వరూపము గనుక, అది ఎట్టి మానసిక స్థితికైననూ విరోధి కాదు.

భర్తా అనగా పాలించి పోషించునది. దేహము, ఇంద్రియములు మరియు మనస్సు ఆత్మమూలకముగా అస్తిత్వమును, చేతనత్వమును పొందుచున్నవి. ఆత్మ మూలకముగనే కన్నులు దృష్టి సాధనములు, చెవులు శ్రవణసాధనములు కాగల్గుచున్నవి. ఆత్మ ఈ దేహమునకు మాత్రమే గాక, ఈ ప్రకృతికి అంతకు సత్తను అనుగ్రహించుచున్నది. సర్వకారణమగు ప్రకృతికి చైతన్య-ఆత్మ-స్వరూపుడగు పురుషుడు ఆశ్రయమగు చున్నాడు. ఈ చైతన్యము దేహేంద్రియ మనస్సంఘాతమును మాత్రమే గాక, సమస్త సృష్టిని పాలించి పోషించు చున్నది.

'భోక్తా' అనగా అంతిమముగా సర్వమును అనుభవించు వాడు; అనగా భోక్త యొక్క స్వరూపము. అహంకారము భోక్త. ఆ భోక్తను నిలబెట్టువాడు పురుషుడు. భోక్త యనగా సర్వమును కబళించువాడు (సంహరణ కర్తా) అని మరియొక అర్థము గలదు. నిద్రలో పురుషుడు తక్క ఇతరము సర్వము విలీనమగును. ప్రళయములో కూడ సర్వసృష్టి పురుషునిలో విలీన మగును. నామ రూపములన్నియు ప్రకృతి-ఉపాధిలో విలీనము కాగా, దానికి మూలములో పురుషుడు గలడు. కావున, పురుషునకు భోక్త (సంహరణ కర్త) అని పేరు.

మహేశ్వరః అనగా అనంతుడు మరియు ఈశ్వరుడు (మహాన్ చ అసౌ ఈశ్వరః). ఎవని సన్నిధిలో సర్వక్రియాకలాపము జరుగునో, వాడు ఈశ్వరుడు. ఈశ్వరుడనగా సృష్టికర్త అని కూడ అర్థము గలదు. కావున పురుషుడు ప్రకృతితో గూడి, పాలించి పోషించు వాడు (భర్తా) లయమును చేయు భోక్త (సంహరణ కర్త) మాత్రమే గాక, ఈ సర్వమును సృష్టించే నిమిత్త కారణము కూడ అగుచున్నాడు.

ఈ పురుషుని శ్రుతి పరమాత్మ అని కూడ నిర్దేశించుచున్నది. పరమాత్మ యనగా అనంత-ఆత్మ. పరమాత్మను తెలుసుకున్న వ్యక్తి పరమాత్మ యగును (పరమాత్మానం జ్ఞాత్వా పరమాత్మా భవతి) అని కైవల్యోపనిషత్తు చెప్పుచున్నది. ఈ స్థూలదేహములో ఉపలభ్యమయ్యే పురుషుడు కూడా ఆ అనంతుడే (దేహే అస్మిన్ పురుషః పరః). ప్రకృతికి అధిష్ఠానము ఈ పురుషుడే. ఆత్మ అనంతము, అద్వితీయము. స్థూలదేహములు అనేకములైననూ, పురుషుడు ఒక్కడే. సర్వజగత్తును సృష్టించి పాలించి ఉపసంహరించే ఈ పురుషుడే పరమాత్మ, అనంతుడు మరియు ఆత్మరూపుడు.

ఈ దేహములో 'నేను' అను రూపములో నివసించే ఈ పురుషుడు పూర్ణుడు, అంతిమ ద్రష్ట (ఉపద్రష్టా), సర్వమును అనుమతించువాడు (అనుమంతా), మరియు ఈ సర్వమును పాలించి పోషించి లయము చేసి మరల సృష్టించు వాడు (భర్తా భోక్తా మహేశ్వరః) అగుచున్నాడు.

**అధ్యాయము 13, శ్లోకము 23 :**

य एवं वेत्ति पुरुषं प्रकृतिं च गुणैस्सह ।
सर्वथा वर्तमानोऽपि न स भूयोऽभि जायते ॥ २३ ॥

యఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ ।
సర్వథా వర్తమానోపి న స భూయోభి జాయతే (23).

యః = ఎవడైతే, ఏవమ్ = ఈ విధముగా, పురుషమ్ = పురుషుని, చ = మరియు, గుణైః సహ = గుణములతో సహా, ప్రకృతిమ్ = ప్రకృతిని, వేత్తి = తెలియుచున్నాడో, సః = వాడు, సర్వథా = అన్ని విధములుగా, వర్తమానః అపి = ఉన్నవాడే అయిననూ, భూయః = మరల, న అభి జాయతే = జన్మించడు.

ఎవడైతే ఈ విధముగా గుణములతో గూడియున్న ప్రకృతిని మరియు పురుషుని తెలుసుకొనునో, వాడు అన్ని విధములుగా నున్ననూ మరల జన్మించడు (23).

పైన వర్ణించబడిన ఈ పురుషుని తెలుసుకున్నవానికి పునర్జన్మ లేదు. ఏలయన, ఆత్మ కాలాధీనము కాదని అతడు ఎరుంగును. సాధారణముగా మనము పొందే జ్ఞానములలో విషయవస్తువు (జ్ఞాన-కర్మ), మరియు తెలుసుకొనే కర్త (జ్ఞాన-కర్త) ఉండును. క్రియా పదమును ప్రయోగించిన సందర్భములన్నింటిలో ఒక క్రియ ఉండవలెను. మరియు క్రియ ఉన్నచోట ఒక కర్త ఉండవలెను. క్రియ సకర్మకమైనచో, కర్మ కూడా ఉండి తీరవలెను. 'తెలుసు కొనుట (జ్ఞ)' అను ధాతువు సకర్మకము. కావున తెలుసుకునే కర్త, మరియు తెలియబడే కర్మ ఉండవలెను. ఒకడు ఆత్మను తెలుసుకున్నాడనుకొనుడు. అపుడు ఆత్మ జ్ఞాతకంటె పూర్తిగా భిన్నమైన జ్ఞేయవస్తువు అగునా? అట్లైనచో, జ్ఞాత ఎవరు? నా జ్ఞానములో నేనే విషయము అయినచో, నేను జ్ఞాతను ఎట్లు కాగల్గుదును? నేను జ్ఞాత కానిచో జ్ఞాత ఎవరు? నా జ్ఞానములో విషయము నేనే అయి ఉండగా, నేను జ్ఞాతను ఎట్లు కాగల్గుదును? కావున, 'ఆత్మను గురించి అజ్ఞానము లేదు; ఆత్మ జ్ఞానము ఆ అజ్ఞానమును త్రోసిపుచ్చినది 'అని చెప్పినచో, మరింత యుక్తి యుక్తముగా నుండును. అజ్ఞానము తొలగి పోగానే, 'ఉపద్రష్టా అనుమంతా భర్తా భోక్తా మహేశ్వరః పరమాత్మా' అగు ఆత్మ సాక్షాత్కరించును. ఈ పదములన్నియు నా గురించిన సత్యమును చెప్పుచున్నవని నాకు సాక్షాత్కరించుటచే అవి సార్థకములగును.

జ్ఞాని ఈ తీరున పురుషుని మాత్రమే గాక, ప్రకృతిని దాని గుణములను కూడ తెలియును. ప్రకృతి దేహేంద్రియ మనస్సంఘాతము (కార్యకరణ సంఘాతము) నకు కారణమని మనము చూచియున్నాము. ప్రకృతిని, దాని గుణములను ఎరింగి, పురుషుడు ఉపద్రష్టా ఇత్యాది

లక్షణములు గలవాడని కూడ తెలుసుకున్న జ్ఞాని క్రియశీలుడుగనున్ననూ (సర్వథా వర్తమానః అపి) మరల జన్మించడు (న స భూయః అభిజాయతే). అతడు జనకుని వలె చక్రవర్తియైనచో, రాజ్యపాలనమును కొనసాగించును. సాధువైనచో, బోధించవచ్చును; లేదా మానవచ్చును. గృహస్థుడైనచో అటులనే కొనసాగవచ్చును; లేదా యాజ్ఞవల్క్యుని వలె సన్న్యసించవచ్చును. ఈ జ్ఞానమును పొందిన తరువాత, వ్యక్తి ఏ రకమైన జీవితమునైననూ గడుపుగాక! ఆ జీవితమును గడుపుతూ చేసిన కర్మలు అతనిని అణుమాత్రమైననూ స్పృశించవు. దేహత్యాగానంతరము అతడు మరియొక దేహములో జన్మించడు. ఏలయన, తాను రూపరహితుడననియు, కాలాతీతుడననియు అతడు ఎరుంగును. అతడు ప్రస్తుత జన్మలో జీవించి ఉన్నంతవరకు ప్రారబ్ధమునకు వశుడై జీవించును. ఏది జరిగినా, అతని సంకల్పశక్తి యొక్క ప్రమేయము లేకుండగా జరిగిపోవును. అతని యందు కర్తృత్వము లేదు. కర్తృత్వమున్నచో కర్మల ఫలము కర్తకు జమ అయ్యేడిది. జ్ఞాని విషయములో ఈ కర్మలకు అదృష్టఫలము ఉండబోదు. గతములో ప్రోగుచేసుకున్న కర్మలు (సంచితకర్మలు) కర్తృత్వమును బాధించుట తోడనే తొలగిపోవును. ప్రారబ్ధకర్మ మాత్రమే మిగిలియుండును. అది సహజముగా క్షయమగును. పురుషుని (ఆత్మ) స్వరూపము అకర్తృత్వమనియు, క్రియలనాచరించేది ప్రకృతి అనియు గుర్తించిన వ్యక్తి సర్వకర్మల నుండియు విముక్తుడగును. కావున అతనికి పునర్జన్మ లేదు.

ఇచట ఒక వాదము ఉండుటకు అవకాశము గలదు. జ్ఞానోదయమునకు పూర్వము ఈ జన్మలో చేసిన సంచితకర్మ చాల గలదు. దానిని క్షయము చేయుటకై జ్ఞాని కనీసము ఒక జన్మనైననూ పొందక తప్పదు. మరియు అసంఖ్యాకములగు పూర్వజన్మలలో చేసిన సంచిత కర్మ అధికాధికముగా గలదు. పక్వమునకు రాకుండా వాటిని నాశనము చేయుట సంభవము కాదు. ఒక కర్మను చేసినచో, దాని ఫలమును అనుభవించి తీరవలయును. జ్ఞానోదయము తరువాత కూడ జ్ఞాని ప్రారబ్ధ కర్మాధీనుడై జీవితమును కొనసాగించు చున్నాడు గదా! ఇదే న్యాయమును పూర్వజన్మార్జితములైన సంచితకర్మలకు కూడ అన్వయించినచో, జ్ఞాని వాటి ఫలములననుభవించవలదా? జ్ఞాని యొక్క జీవితము కొనసాగుటకు కారణమైన ప్రారబ్ధకర్మకు, అతడు పూర్వములో చేసిన ఇతర కర్మలకు భేదము ఏమి గలదు? ప్రారబ్ధ కర్మాధీనమై ఈ దేహము కొనసాగినట్లే, సంచిత కర్మ వలన నూతన దేహము ఆరంభము కావలయును. ఇంతే కాక, జ్ఞానోదయముకు పూర్వము ఈ జన్మలో చేసిన కర్మలకు జమాఖర్చు చెప్పవలెను. మరియు, జ్ఞానోదయము తరువాత చేసిన కర్మలు కూడ ఫలము నీయవలెను గదా! వీటి కొరకై మరియొక జన్మ తప్పదు.

ఫలము నీయకుండగనే కర్మ నశించే పక్షంలో, ఎవరికైననూ కర్మను చేయవలసిన అవసరమేమున్నది? కర్మ కొన్ని సందర్భములలో ఫలము నిచ్చుననియు, మరికొన్ని సందర్భములలో తనంత తాను వినష్టమగుననియు చెప్పే పక్షంలో, ఒక విశిష్ట కర్మ విశిష్ట ఫలము నిచ్చునని చెప్పే శాస్త్రమునందు విశ్వాసము నిర్మూలితమగును. తాను కర్మఫలమును అనుభవించెదననే విశ్వాసము కర్తయందు ఉండి తీరవలెను. శాస్త్రమునందు శ్రద్ధ కలుగుటకు ఇది అత్యావశ్యకము. మరియు, ఫలము నీయకుండగనే కర్మ క్షయమయ్యే పక్షంలో కర్మ-కాండ-శాస్త్రమంతయు బూడిదలో పోసిన పన్నీరు అగును.

దీనికి ప్రత్యుత్తరము శాస్త్రములోననే గలదు. పుణ్యపాపాది అదృష్టఫలములను వర్ణించే శాస్త్రము స్వయముగా నిట్లు చెప్పుచున్నది. అనంతుని దర్శించుట తోడనే వాని కర్మలు నశించును (క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే). మరియు, జ్ఞానాగ్ని సర్వకర్మలను భస్మము చేయును (జ్ఞానాగ్నిః భస్మ సాత్ కురుతే) అని స్మృతి చెప్పుచున్నది. ఆత్మ బ్రహ్మైక్యము నెరింగిన జ్ఞానియొక్క కర్మలన్నియు నశించుటచే, అతనికి పునర్జన్మ లేదు. బ్రహ్మనెరింగిన వాడు బ్రహ్మ యగును (బ్రహ్మ వేద బ్రహ్మ ఏవ భవతి) అనియు శ్రుతి చెప్పుచున్నది. బ్రహ్మ నిత్యము, అనగా ఆత్మ నిత్యము అను సత్యము నెరింగిన జ్ఞాని కాలపు కోరలలో చిక్కడు. వానికి మరల జన్మ అనే ప్రసక్తియే లేదు. 'బ్రహ్మను ఎరింగిన వాడు అనంతతత్త్వమును పొందును (బ్రహ్మవిద్ ఆప్నోతి పరమ్)' అని శ్రుతి చెప్పుచున్నది. జీవుడు జన్మించుటకు ఒక రూపము, మరియు తాను లేని ఒక స్థానము ఉండవలెను. కాని బ్రహ్మజ్ఞాని అనంతుడు గనుక, జన్మించదగిన రూపము గాని, స్థానము గాని లేవు. బ్రహ్మాత్మైక్య జ్ఞానము గల వ్యక్తి యొక్క కర్మలన్నియు నశించునని శ్రుతిలో సర్వత్రా మాత్రమే గాక, గీతలో కూడ చెప్పబడుచున్నది. సర్వకర్మలు నశించునని శాస్త్రము చెప్పుచుండగా, జ్ఞానము ఉదయించిన పిదప చేయబడే కర్మలు మాత్రమే నశించుననే సంకోచార్థమును చెప్పుటకు హేతువు కానరాదు. అర్థ సంకోచమునకు హేతువు లేదు గనుక, సర్వకర్మాణి యనగా ఖచ్చితముగా అన్ని కర్మలు అనియే అర్థము వచ్చును.

యుక్తి కూడ దీనిని సమర్థించుచున్నది. కర్మలన్నియు అజ్ఞాని కొరకు మాత్రమే ఉద్దేశించబడినవి. ఆ అజ్ఞానమును ఆధారముగా చేసుకొని అహంకారము కర్తయై వివిధ కర్మలను చేయుచున్నది. ఆ కర్మలు జీవుని కొత్త జన్మలకు కారణమగును. 'నేను కర్తను' అను ధారణ గల వ్యక్తికి మాత్రమే కర్మలు జన్మరూపమగు ఫలమునిచ్చును; మరియు, ఆ జన్మలలో వివిధ అనుభవములనే ఫలమును ఇచ్చును. ఆ ధారణ లేకుండగా చేయబడిన కర్మలు ఫలము నీయవు.

అట్టి కర్మలు వెనువెంటనే కంటికి కానవచ్చు ఫలములనిచ్చునే గాని, పుణ్యపాపములనే అదృష్ట ఫలము నీయలేవు. పుణ్యపాపములు కర్తకు జమయగును. ఆ కర్త లేనిచో అదృష్టఫలము ఉండజాలదు.

శ్రీశంకరులు ఈ వాదమునకు ఇంకనూ ఇట్లు సమాధానమునిచ్చిరి. ప్రారబ్ధకర్మ ఫలము నిచ్చుట ఎప్పుడో ఆరంభమై యున్నది గనుక, అది నశించదు. ఈ స్థూలదేహము ప్రయోగింపబడిన బాణము వంటిది. వ్యక్తి జ్ఞాని యైననూ, ఈ ప్రయోగింపబడిన బాణము తన మార్గములో పయనమును కొనసాగించును. కాని జ్ఞానికి దానితో తాదాత్మ్యము ఉండదు. మానవ దేహము మోక్షము కొరకు ఉద్దేశించబడినది. ఆ ప్రయోజనము సిద్ధించిన పిదప, ఆ దేహము ఎంతకాలము వరకు పయనించును? అను అంశము ఆ దేహమును ఆరంభించిన కర్మల వేగము (momentum) పై ఆధారపడును. ఆ వేగము క్షీణించిన తరువాత మాత్రమే దేహము పడిపోవును. వాస్తవంలో దేహము యొక్క ప్రయోజనము తీరిపోయినది. జ్ఞానికి దానితో ఇంక పనిలేదు. అయిననూ, దేహమును ఆరంభించిన కర్మ క్షయమగు వరకు దేహము కొనసాగును. ఏలయన, జ్ఞానము అజ్ఞానమును నశింపజేయునే గాని, వ్యావహారిక సత్యత్వమును బాధించలేదు. సూర్యునకు ఉదయాస్తమయములు లేవను సత్యము నెరింగిన వానికి కూడా సూర్యుడు తూర్పు దిక్కున ఉదయిస్తున్నట్లు కానవచ్చును. కాని అజ్ఞానము నుండి ఉదయించిన తప్పుడు నిష్కర్షలు ఏమైననూ ఉన్నచో, వాటిని జ్ఞానము నశింప జేయును. ఎండమావులు అనే సత్యము తెలిసిన తరువాత కూడ ఎండమావులలో నీరు కానవచ్చును. అట్లు కానవచ్చుటకు గల హేతువులు ఈశ్వరుని సృష్టిలో భాగములై యున్నవి. జ్ఞానము ఈ ఆభాసలను నశింపచేయదగిన ఆవశ్యకత కూడ లేదు. ఏలయన, వాటి సత్యత్వమును అది నశింపజేసియున్నది. అవి మిథ్యయను గుర్తింపు వ్యక్తిలో కలిగినది. సృష్టి యథార్థమనే ధారణ నశించుట తోడనే ద్వైతమునందలి సత్యత్వ బుద్ధి నశించును. అనగా ద్వైతప్రత్యక్షము నశించినదని అర్థము కాదు. అట్లు నశించవలసిన ఆవశ్యకతయు లేదు. ద్వైతము సత్యమైనచో, దానిని నశింపజేయుట సంభవము కాదు. జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయములు ఒకే సత్య పరంబ్రహ్మ యందు భాసించుచున్నవనే సాక్షాత్కారము కలుగగానే ప్రాతిభాసిక ద్వైతము నశించును. ఈ త్రిపుటి భాసించుచునే యుండును. కాని త్రిపుటియొక్క సత్యత్వము, దాని మీద ఆధారపడిన ద్వైతసత్యత్వము త్రోసిపుచ్చబడును. సత్యజ్ఞానము జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయములను నశింపజేయదు. అట్లు నశింప జేయవలసిన ఆవశ్యకతయు లేదు. ప్రారబ్ధకర్మాధీనమగు ఈ దేహము జ్ఞానోదయమునకు పూర్వము నందు వలెనే కొనసాగుతూ, కర్మవేగము క్షయమగు వరకు సుఖ దుఃఖముల ననుభవించు చుండును.

సంచితకర్మ మాట యేమి? అది కర్మఖాతాలో జమయై ఉన్నది. కాని జ్ఞానము కర్తను రద్దు చేసినది గాన, పట్టుకోదగిన ఆశ్రయము దానికి లేదు. ఆ కర్మలన్నియు స్వప్నములో చేసిన కర్మలవంటివి యగును. నిద్ర నుండి మేల్కొంచిన వ్యక్తి స్వప్నములో చేసిన కర్మలకు బాధ్యుడు కాడు. దీనిని వివరించుటకు శ్రీశంకరులు మరియొక దృష్టాంతము నిచ్చిరి. ధనుర్ధారికి బాణ ప్రయోగము నందు అభిరుచి తొలగిపోవుటచే, అతడు బాణప్రయోగము నాపివేసినాడు. అప్పుడు ఏమగును? ఇక ఆ బాణములకు చేరదగిన లక్ష్యములు లేవు. అదే విధముగా కర్తను ఆశ్రయించి ఉండే ఈ కర్మలన్నియు కర్త బాధించబడగానే, తాము కూడ బాధించబడును. జన్మను ఆరంభించుట ఇత్యాది సామర్థ్యము వాటినుండి తొలగించి వేయబడినది. కావున స్థూల దేహము రాలిపోయిన పిదప, జ్ఞాని మరల జన్మించడు.

అధ్యాయము 13, శ్లోకము 24 :

ध्यानेनात्मनि पश्यंति केचिदात्मानमात्मना ।
अन्ये सांख्येन योगेन कर्मयोगेन चापरे ॥ २४ ॥

ధ్యానేనాత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే (24).

కేచిత్ = కొందరు, ఆత్మని = బుద్ధి యందు, ధ్యానేన = ధ్యానముచే, ఆత్మనా = శుద్ధమగు మనస్సుచే, ఆత్మానమ్ = ఆత్మను, పశ్యంతి = చూచెదరు, అన్యే = ఇతరులు, సాంఖ్యేన యోగేన = జ్ఞానముచే, చ = మరియు, అపరే = ఇతరులు, కర్మయోగేన = కర్మయోగముచే, పశ్యంతి = చూచెదరు.

కొందరు ధ్యానముచే బుద్ధియందు శుద్ధమగు మనస్సుతో ఆత్మను చూచెదరు. ఇతరులు జ్ఞానము చేతను, మరికొందరు కర్మయోగము చేతను చూచెదరు (24).

ఆత్మదర్శనము నందు (ఆత్మదర్శనే) అనేక ఉపాయములు గలవనియు, అవి ఇచట ప్రస్తావించబడినవనియు శ్రీశంకరులు ఈ శ్లోకమునకు అవతారికలో సెలవిచ్చిరి. శ్రీశంకరులు 'దర్శనము' అను పదమును సాభిప్రాయముగా వాడిరి. వారి తాత్పర్యము చాల ప్రముఖమైనది. బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్యునకు అతని భార్యయగు మైత్రేయితో జరిగిన

సంభాషణమునకు ఇచటి ప్రకరణముతో సంబంధము గలదు. యాజ్ఞవల్క్యుడు మోక్షమును పొందగోరి, సన్న్యాసజీవనమును గడుపవలెనని నిశ్చయించుకొని, తన సంపదను తన ఇద్దరు భార్యలకు పంచి యిచ్చెను. ఆయన తనకిచ్చిన సంపదతో తాను కూడ మోక్షమును పొందగల్గుదునా? అని మైత్రేయి ఆయనను ప్రశ్నించెను. సంపదతో మోక్షము లభించే ఆశ లేదని ఆయన బదులిడెను. అపుడామె మోక్షోపాయమును చెప్పుడని గోరెను.

మానవుడు ఏ వస్తువును ప్రేమించినా తన కొరకు మాత్రమేననియు అంతిమముగా అత్యంత ప్రియమైనది ఆత్మయేననియు యాజ్ఞవల్క్యుడు ఆమెకు ముందుగా బోధించి, ఆ తరువాత ఆమెతో ఇట్లు చెప్పెను: ఓ ప్రియురాలా! ఆత్మను నిశ్చయముగా దర్శించవలెను (ఆత్మా వా అరే ద్రష్టవ్యః). చూచుట యనగా చూచినంత స్పష్టముగా దెలియుట అని యర్థము. దాని కొరకై ఏమి చేయవలెను? నన్ను నేను ఎట్లు చూడవలెను? మనకు తెలిసిన జ్ఞానసాధనములు జ్ఞాతయగు ఆత్మను తెలియుటకు ఉపకరించవు. కావుననే, యాజ్ఞవల్క్యుడిట్లు చెప్పెను: ఓ ప్రియురాలా! ఆత్మను గురించి నిశ్చయముగా వినవలెను (ఆత్మా వా అరే శ్రోతవ్యః). ఈ సందర్భములో వినుట యనగా గురుసాహాయ్యముతో వేదాంత శాస్త్ర విచారమును చేయుట. నేను ఈ క్షణములో కూడ హాజరు అయి ఉన్నాను గనుక, ఆత్మను కొత్తగా పొందనక్కరలేదు. కాని, ఆత్మను జ్ఞానరూపముగా పొందుట సంభవమే. కావున ఈ ప్రమాణము ఆవశ్యకము. ఈ శాస్త్రమును వినిన పిదప నా బుద్ధిలో కొన్ని సందేహములు ఉదయించును; లేదా ఇతరులు కొన్ని ప్రశ్నలను లేవనెత్తెదరు. శూన్యమే ఆత్మయని బౌద్ధులు వాదింతురు. అది ఏల సరిగాదు అనే విషయమును నా అంతట నేను లోతుగా దర్శించవలెను. లేనిచో, అది నాలో సంశయ రూపములో మిగిలి యుండును. సరియగు పద్ధతిలో శ్రవణము చేసినందు వలన, నాకు శ్రుతి యొక్క తాత్పర్యము తెలియ వచ్చినది. కాని దానికి విరుద్ధమగు వచనములేవి గలవో, వాటిని ఎదుర్కొని చాల లోతుగా విశ్లేషించవలెను. కావుననే, 'ఓ ప్రియురాలా! ఆత్మను నిశ్చితముగా మననము చేయవలెను (ఆత్మా వా అరే మంతవ్యః)' అని యాజ్ఞవల్క్యుడు చెప్పెను. తరువాత సత్యము సుస్పష్టముగా తెలిసినా, దేహమే ఆత్మయను అలవాటైన ధారణ ఇంకనూ మిగిలి యుండును. ఈ ధారణ జన్మ జన్మలనుండి వచ్చుచున్నది. కావున నేను దేహము కాదని నాకు తెలిసి యున్ననూ, గతమునకు బందీనై యుండుటచే, ఆ అలవాటు వెంటనే సరిదిద్దబడదు. ఇట్టి జ్ఞానమును ఆటంకములతో గూడిన జ్ఞానము (సప్రతిబంధ జ్ఞానము) అని మనము అంటాము. కావున శాస్త్రప్రతిపాద్యమైన ఈ ప్రత్యగాత్మను అవలోకించవలెను (contemplate). 'ఓ ప్రియురాలా! ఈ ఆత్మను నిశ్చితముగా నిదిధ్యాసనము చేయవలెను (ఆత్మా వా అరే

నిదిధ్యాసితవ్యః)' అని యాజ్ఞవల్క్యుడు చెప్పెను. ఈ నిదిధ్యాసనమును ప్రతిబంధనివృత్తి కొరకు మాత్రమే చేయవలెను. ఎంతకాలము? తినుటను ఆపవలెనని మనకెట్లు తెలియును? ఇదీ అంతే. దానంతట అదియే ఆగిపోవును. దానిని ఆపి వేయుటకై నీవు నడుము కట్టనక్కరలేదు.

'కొందరు ధ్యానముచే ఆత్మను దర్శించెదరు (ధ్యానేన పశ్యంతి కేచిత్ ఆత్మానమ్)' అని ఈ నిదిధ్యాసనమును గురించియే ఈ శ్లోకము ప్రస్తావించుచున్నది. మరల ఇచట 'చూచుట (పశ్యంతి)' అను పదము వాడబడినది. నిదిధ్యాసనము యొక్క ఆవశ్యకత లేని ముముక్షువు చాల అరుదు. కావుననే అది ఇచట ప్రత్యేకముగా చెప్పబడినది. ప్రతి వ్యక్తికి జ్ఞానప్రతిబంధకములు గలవు. చాల శాతము సాధకులు సచ్చిదానంద బ్రహ్మయే ప్రత్యగాత్మ యను నిదిధ్యాసనములో గడుపవలయును. నిది ధ్యాసనమనగా జ్ఞానేంద్రియములను విషయవస్తువుల నుండి మనస్సులోనికి ప్రత్యాహారము చేసి, ఆ మనస్సును చైతన్యఘనమగు ప్రత్యగాత్మ యందు విలీనము చేసి, దాని యందు ఏకాగ్రనిష్ఠను కలిగి యుండుట యని శ్రీశంకరులు వివరించిరి. అదియే ధ్యానము. శ్రీశంకరులు ఒక దృష్టాంతము నిచ్చిరి. కొంగ తన ముక్కును నీటిలో ముంచి నీటిలో చిన్న కదలిక కొరకై ఎదురు చూచుచుండును. పర్వతములు భూమిపై కదలిక లేకుండగా నిలబడి ధ్యానము చేయుచున్నవా యన్నట్లు ఉన్నవి. అటులనే, సాధకుడు ధ్యేయవస్తువు నుండి మనస్సు చెదిరిపోని విధముగా ధ్యానించవలెను.

ప్రత్యగాత్మ ధ్యానము ద్వివిధముగా నున్నది. ఒక వస్తువును కంటితో గాని, లేక మనస్సులో గాని చూస్తూ నీ ధ్యానమును సాక్షిస్వరూపుడగు ప్రత్యగాత్మ వైపునకు త్రిప్పుము. దీనికి దృశ్య-అనువిద్ధ-సవికల్ప-ధ్యానము అని పేరు. అపుడు ప్రత్యగాత్మ స్వరూపమును బోధించే చైతన్య, పూర్ణ ఇత్యాది పదములను భావన చేసి, అవి నీకు ఎంతవరకు అర్థవంతములుగా భాసించినవో గమనించుము. 'నేను పూర్ణుడను ఎట్లు అగుదును? నేను దేహము గాని, మనోవృత్తి గాని అయినచో, పూర్ణుడను కాజాలను'. ఆత్మధ్యానము చేయుటకు ఆత్మ స్వరూపము తెలిసి ఉండాలి. ఆ జ్ఞానము శాస్త్రము నుండి లభించును. ధ్యానము వలన ఆత్మస్వరూపము తెలియదు. ఏలయన, ధ్యానము చేయువాడే ఆత్మ. కాని నీ గురించి నీకు ఏమి తెలియునో, అదియే నీచే ధ్యానింప బడే ఆత్మ యగును. కావున, ఈ విషయములో శ్రవణము వికల్పము కానే కాదు. శ్రవణము వలన మాత్రమే ఈ పదములు అర్థవంతములగును. శాస్త్రమును స్పష్టముగా తెలుసుకున్న తరువాత, జ్ఞాన ప్రతిబంధకములను నిర్మూలించుట కొరకు మాత్రమే ధ్యానమును చేయవలెను. కాని అది కూడ శ్రవణాంగమే యగును. ఇచట చెప్పబడిన ధ్యానము ఉపాసన(ప్రార్థన) కాదు. అది దీనికంటె పూర్తిగా విలక్షణమైనది. అది మనోనిశ్చలతను,

ఈశ్వరకృపను సంపాదించుటకు ఉద్దేశించబడినది. 'వారు ఆత్మ (శుద్ధమగు మనస్సు)తో ఆత్మను చూచెదరు (ఆత్మనా ఆత్మానం పశ్యన్తి)' అని భగవానుడు చెప్పినాడు గనుక, ఈ ధ్యానము నిదిధ్యాసనము మాత్రమే యగును.

ధ్యానము సగుణ బ్రహ్మోపాసనమైన పక్షములో, అది తైలధారవలె నుండునని శ్రీ శంకరులు వివరించిరి. ఒక పాత్ర నుండి మరియొక పాత్ర లోనికి నూనె తీగవలె అవిచ్ఛిన్నముగా పడును. అటులనే ధ్యానములో ఒకే రకమునకు చెందిన వృత్తులు అంతరాయము లేకుండగా స్థిరముగా కొనసాగును (సజాతీయ వృత్తి ప్రవాహః). ఇది జపము కావచ్చును; లేదా ఏ రకమైన ఈశ్వరధ్యానమైననూ కావచ్చును. నిదిధ్యాసనమునకు ముందు మనస్సును నిశ్చలము చేయుట కొరకై ధ్యానమును అభ్యసించవచ్చును. దీనితో బాటు సాధకుడు శ్రవణమును కూడ కొనసాగించును.

'ఆత్మని' అనగా బుద్ధియందు. వారు దాని యందు పూర్ణ-ఆత్మను దర్శించెదరు. అనగా ఆత్మ పూర్ణమని గుర్తించెదరు. ఆత్మ సర్వవిధముల పరిచ్ఛేదములకు అతీతమైనది. ఆత్మ ద్రష్ట కాదు; శ్రోత కాదు; మంత ఇత్యాదులు కాదు; ఆత్మ యందు కర్తృత్వ భోక్తృత్వాదులేమియు లేవు; శుద్ధ సత్తయే ఆత్మ; ఆత్మ శుద్ధ చైతన్యము, మరియు అనంతము. ఈ క్రమములో దర్శిస్తూ వారు పూర్ణ-ఆత్మను దర్శించెదరు. శాస్త్రము ఉపదేశించిన విధముగా వారి సర్వమును సజ్జితమైన పరిపక్వమైన మనస్సుతో దర్శించెదరు. ఆత్మ బుద్ధి యొక్క స్వరూపమే గాని, బుద్ధికి విషయము కాదు. కావున, ఆత్మను దర్శించుట యనగా మనకు తెలిసిన ఘటాది వస్తుదర్శనము వంటిది కాదు. జ్ఞాని ఆత్మను గురించి ఉన్న వివిధ ధారణలను నిషేధించి, ఆత్మస్వరూప బోధకములగు పదముల లక్ష్యార్థము (implied meaning) ను గుర్తించును. ఈ ప్రక్రియలో ఆత్మ పరిచ్ఛిన్నము, సుఖి, దుఃఖి ఇత్యాది భావనలు నిషేధింపబడును. నిదిధ్యాసనములో మనమీ ధారణలకు ప్రతిపక్షములగు భావనలను చేసెదము. కొంత కాలము తరువాత ఈ ధారణలు తమంత తాముగా జారిపోవును.

వ్యక్తి జ్ఞానోదయమునకు సంసిద్ధుడై ఉన్నచో, విచారమొక్కటియే చాలును. అందువలననే, కొందరు జ్ఞానముచే ఆత్మను దర్శించెదరు (ఆత్మానం పశ్యంతి ..... కేచిత్ సాంఖ్యేన యోగేన) అని భగవానుడు చెప్పుచున్నాడు. వారు శ్రవణము చేత మాత్రమే ప్రకృతి పురుషుల యాథార్థ్యము నెరింగి, ఆ జ్ఞానముచే ముక్తులగుదురు. వారికి ఇతర సమస్యలేమియూ ఉండవు.

ఈ శ్లోకములో కర్మయోగము ప్రత్యేకముగా ప్రస్తావించబడినది. కావున, ఈ సాధకులు సన్న్యాసులు గాని, లేదా ఈ జ్ఞానము ఉదయించుటకు అర్హత కలిగిన ప్రతిబంధకములు లేనివారు గాని అయి ఉండవలెను. అనగా వారి యందు వివేక బుద్ధి, వైరాగ్యము, శమము, దమము ఇత్యాది అర్హతలన్నియు గలవని యర్థము. ఈ అర్హతలున్నచో, అది జ్ఞానోదయమునకు అత్యంత అనుకూలమగు పరిస్థితి అగును. అట్టి సాధకుడు చేయదగినది శ్రవణము ఒక్కటి మాత్రమే. ఇట్టివాడు సర్వప్రకృతి కార్యములకు సాక్షి, సత్త్వరజస్తమోగుణధర్మములకు అతీతము, శాశ్వతము అగు ఆత్మను దర్శించును. ఆవలింత వచ్చినప్పుడు దానిని తమోగుణకార్యముగను, అందోళన కలిగినప్పుడు దానిని రజోగుణకార్యముగను, తత్త్వమును చక్కగా తెలిసి నప్పుడు లేదా ధ్యానమగ్నుడైనప్పుడు దానిని సత్త్వగుణకార్యముగను అతడు దర్శించును. ఇవి అన్నియు చూడ బడుచున్నవి గనుక, ఆత్మ ఈ సర్వము కంటె విలక్షణమైనదని అతనికి స్పష్టముగా దెలియును. ఆత్మ ఆవులించదు; అందోళన చెందదు; లేదా క్రొత్తగా ప్రశాంతవము కాబోదు. ఆత్మ నిత్యశాంతము. వాస్తవంలో ఆత్మయందు వికారములేవియూ లేవు. త్రిగుణములు అంతఃకరణ ధర్మముల రూపములో అభివ్యక్తమగు చుండును. అంతేగాక, సర్వసృష్టికి అవియే మూలము. స్థూల పంచమహాభూతములు సూక్ష్మభూతముల తామసాంశముల నుండి పుట్టినవగుటచే జడస్వభావము కలిగియున్నవి. కర్మేంద్రియములు, ప్రాణము రాజసాంశము నుండి, జ్ఞానేంద్రియములు, అంతఃకరణము సాత్త్వికాంశము నుండియు పుట్టినవి. మరియు ఈ గుణములనుండి విభిన్న వృత్తులు ఉదయించును. ఈ తీరున సర్వసృష్టి రూపములో నున్న ఈ గుణకార్యములన్నింటికీ ఆత్మ సాక్షియగుచున్నది. మరియు, ఆత్మ నిత్యము గనుక దానికి పుట్టుక లేదు. ఆత్మ చైతన్యము దృశ్య వస్తువుల దృష్టికోణములో మాత్రమే సాక్షియగును. ఆత్మ స్వీయ దృష్టి కోణములో శుద్ధ చేతన స్వరూపము మాత్రమే. ఆత్మ సర్వగుణాతీతమగుటచే, అవి ఆత్మను లేశమైననూ బంధించవు. ఈ వివేకమునకు సాంఖ్యమని పేరు.

ఈ శ్లోకములో చెప్పబడిన త్రివిధసాధనలలో మూడవది కర్మ యోగము గనుక, ఈ సాంఖ్యులు మరియు నిదిధ్యాసనము చేయువారు సన్న్యాసులు అని తెలియవలెను. శ్రవణ మనన నిదిధ్యాసనములు తక్క వారు చేయదగిన పని మరియొకటి లేదు. వారిలో ప్రతిబంధము గలవారు, లేని వారు అను విభాగము గలదు. దృఢమగు దేహాత్మ భావము గలవారు ఆ ప్రతిబంధమును తొలగించి స్పష్టమగు సమ్యగ్దర్శనమును పొందుట కొరకై నిదిధ్యాసనమును చేసెదరు. అట్టి ప్రతిబంధకము లేనివారు శ్రవణమననాత్మకమగు విచారమును చేసిన చాలును.

వీరు గాక అంతః కరణశుద్ధి అవసరమైన సాధకులు గలరు. దానికి సాధనము

కర్మయోగము. వీరు కూడ శ్రవణమననములను చేయుచుండవచ్చును. దానికి తోడుగా వీరు ఆ కర్మలనన్నింటినీ మరియు కర్మఫలములను భగవానునకు సమర్పిస్తూ కర్మలను చేయుచుందురు. ఆత్మ సాక్షాత్కారమునకు కర్మయోగము ఎట్లు సాధనమగును? కర్మయోగము మనస్సును సంసిద్ధము చేయును. తద్వారా వ్యక్తి తగిన కాలములో జ్ఞానమును పొందును. కర్మయోగము మరియొక మోక్షమార్గము కాదు. కర్మయోగమునునుష్ఠించు సాధకులు కూడ జ్ఞానసాధనను చేయవలెను. ఈ సత్యమును పలుమార్లు నొక్కి చెప్పవలసియున్నది. కర్మ యోగులు తమ రాగద్వేషముల ప్రేరణను ప్రక్కన బెట్టి పరిస్థితికి అనురూపముగా కర్మను చేసెదరు గాన, ఆ కర్మ ఈశ్వరార్పణ మగును. ఫలము లభించినపుడు వారు ఈశ్వరదత్తమనే ప్రసాదబుద్ధితో స్వీకరించెదరు. దీని వలన రాగద్వేషములు ప్రభావహీనములగును. ఈ ఆటంకము తొలగిపోగానే జ్ఞానము ఉదయించును. సన్యాసి మరియు కర్మయోగి ఇద్దరు శాస్త్ర నిరూపితమగు ఆత్మతత్త్వమును తెలుసుకొనవలసిన వారే. వీరిద్దరినీ దేహాత్మభావము అను దోషము వేధించుచుండును. ఇది వారు విచారము చేసి తెలుసుకున్న దానికి విరుద్ధము (విపరీత భావనా). కావున శ్రవణమనన నిదిధ్యాసనములలో నచ్చిన దానిని ఎన్నుకొనుట కుదరదు. దర్శనములో విషయము అగు ఆత్మ సచ్చిదానందబ్రహ్మ. దీనిని బుద్ధి యందలి సర్వవృత్తుల సారరూపముగా దర్శించవచ్చును. వేణుగానములోని స్వరములన్నిటియందు వేణుధ్వనిని గుర్తించవచ్చును. అటులనే, సర్వ వృత్తులలో పరమాత్మను గుర్తించవలెను.

భగవానుడిచట 'వారు చూచెదరు (పశ్యంతి)' అని చెప్పినాడు గనుక, పరమాత్మ వృత్తిచే తెలియబడునని అనిపించవచ్చును. కాని ఈ వృత్తి ఘటాది వస్తువులను తెలుసుకొనే వృత్తి వంటిది కాదు. ఈ వృత్తికి రూపములేదు (అఖండాకార వృత్తి). కావున అది ఏ రూపములోనైనను ఉండవచ్చును. సర్వ ప్రత్యయములలో (cognitions) చైతన్యము గలదు. ఈ అనంత చైతన్యమే 'నేను' అని నీవు దర్శించినచో, ఆ గుర్తింపు వలన చైతన్యము నుండి సర్వపరిచ్ఛేదములు దూరమగును. ఆత్మ చైతన్యము అనంతము అను విషయములో గల అజ్ఞానమును నశింపజేసిన తరువాత, ఆ అఖండాకార వృత్తి తాను కూడ ఆ చైతన్యములో విలీనమగును.

ఈ మూడు రకముల వారు మాత్రమే గాక మరియొక రకము సాధకులు గలరు. వారికి ఆత్మ-అనాత్మల తేడా తెలియదు. వారికి బోధించే ప్రయత్నమును చేసినచో, వారు దానిని తెలుసుకొనరు. కాని వారు కూడ మోక్షకాములే. అంతః కరణమును సంసిద్ధము చేయుట కొరకై వారికి వివిధ అనుశాసనములు బోధింపబడినవి. వేదము యొక్క ఉపదేశమునకు కట్టుబడి,

అమలు జేయు సాధకులు 'శ్రుతి పరాయణాః' అనబడుదురు. ఉపదేశమును చేయు ఆచార్యుడు గొప్ప వేదాంతియే కావచ్చును. కాని విద్యార్థిలో శాస్త్రమును అర్థము చేసుకొనుటకు తగినంత అనుశాసనము లేనిచో, ఆయన అతనికి వ్యాకరణమును గాని, తర్కమును గాని ముందుగా చదువుమని సలహానిచ్చును. కొంత కాలము తరువాత ఆయన వానికి వేదాంతమును బోధించును. లేదా, ఆ సాధకునకు కొంత ఉపాసన ఆవశ్యకమగును. లేదా మనోనిశ్చలత కొరకై అష్టాంగయోగము అవసరమగును. తరువాతి శ్లోకములో ఈ విషయము చెప్పబడుచున్నది:

అధ్యాయము 13, శ్లోకము 25 :

अन्ये त्वेवमजानंतः श्रुत्वान्येभ्य उपासते ।
तेऽपि चातितरंत्येव मृत्युं श्रुतिपरायणाः ॥ २५ ॥

అన్యే త్వేవమజానంతః శ్రుత్వాన్యేభ్య ఉపాసతే
తేపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః (25).

తు = కాని, అన్యే = ఇతరులు, ఏవమ్ = ఈ తీరున, అజానంతః = తెలియనివారై, అన్యేభ్యః = ఇతరుల (ఆచార్యుల) నుండి, శ్రుత్వా = విని, ఉపాసతే = ఉపాసించెదరు, శ్రుతిపరాయణాః = తాము పొందిన ఉపదేశమునకు కట్టుబడిన వారై, తే అపి = వారు కూడ, మృత్యుమ్ = మృత్యువును, ఏవ = నిశ్చయముగా, అతితరంతి = అతిక్రమించెదరు.

కాని ఇతరులు ఈ తీరున తెలియని వారై తమ ఆచార్యుల నుండి విని
ఉపాసించెదరు. తాము వినిన ఉపదేశమునకు కట్టుబడిన వారై వీరు కూడ
నిశ్చితముగా మృత్యువును అతిక్రమించెదరు (25).

ఇంతకు ముందు శ్లోకములో చెప్పబడిన త్రివిధసాధకులతో వీరికి గల భేదమును ప్రదర్శించుటకై 'తు' అను అవ్యయము ప్రయోగించబడినది. వీరు కర్మయోగులు గాని, సన్న్యాసులు గాని అయి ఉన్ననూ, జ్ఞానసాధన వీరికి సాధ్యము గాదు. జ్ఞానసాధన ఆవశ్యకము గదా! విచారార్హతను కలిగించుటకై వారికి ఏ విధమగు సలహాను ఈయదగును? ఆత్మ-అనాత్మ విచారమును చేయ గల శక్తి వారి బుద్ధికి లేనిచో, ఆచార్యుల నుండి వినిన వచనములను పాటించుట వారికి హితకారి యగును. ఇచట ఆచార్యుల నుండి వినిన వచనములు అనగా ఆచార్యులు ఇచ్చిన సలహా అని యర్థము. ఈ సలహా తరచుగా ఆత్మ జ్ఞాన సంబంధి వలె

కన్పట్టక పోవచ్చును. ఆచార్యుడు సాధకునితో నిత్యము ఒక ఆసనమును వేయుమని చెప్పినాడనుకొనుడు. దాని వలన శరీరారోగ్యము సిద్ధించునే గాని, అది శాస్త్ర శ్రవణములో ఎట్లు పనికి వచ్చును? అను శంక కలుగుట సహజము. లేదా, ఆహారనియమము, తీర్థయాత్ర, పూజానుష్ఠానము, జపానుష్ఠానము, ఉపాసన ఇత్యాది సలహాలనిచ్చినచో, వాటికి ఆత్మ జ్ఞానముతో ఏమి సంబంధము గలదు? సాధారణంగా సాధకులకు ఆచార్యులు గాయత్రీ పురశ్చరణను చేయుమని సలహా నిచ్చెదరు. అక్షరలక్షల జపమునకు పురశ్చరణ యని పేరు. గాయత్రీ మంత్రములో 24 అక్షరములు గలవు గాన, 24 లక్షలను జపించినచో, పురశ్చరణ పూర్తి యగును. ప్రతి దినము 4-5 గంటలు జపించినచో, పురశ్చరణ పూర్తియగు సరికి 2-3 సంవత్సరములు పట్టును. దీనికి ఆత్మ జ్ఞానముతో గల సంబంధము స్పష్టముగా గానరాకున్ననూ, ఆచార్యుల వచనముల యందు శ్రద్ధ, అంకిత భావము ఉండుటచే (శ్రుతి పరాయణాః), వారు ఆ పనిని చేసెదరు. కాలక్రమములో వారు అవశ్యకమగు మానసిక అనుశాసనమును సంపాదించెదరు. అపుడు ఆచార్యుడు ఉపదేశమునారంభించును. వారు కూడ తరువాత జ్ఞానమును పొంది, మృత్యువును దాటెదరు; అనగా మోక్షమును పొందెదరు. భగవానుడు 'అపి (కూడా)' అను శబ్దమును వాడినాడు. దీనిని బట్టి ప్రతిబంధకములు లేని వారికి ఇది ఎంత అమోఘముగా పనిచేయునో సూచితమగుచున్నది. వివేకము గల వారికి ప్రమాణమును తెలియుటలో ప్రతిబంధకము లేశమైననూ ఉండదు. భగవానుడు ఆరంభములో 'దేనిని తెలియట వలన అమృతత్వము సిద్ధించునో, ఆ జ్ఞేయవస్తువును నేను నీకు బోధించెదను (జ్ఞేయం యత్ తత్ ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వాఽమృతమశ్నుతే)' అని చెప్పియున్నాడు. ఆ వాక్యముతో ఈ శ్లోకము కలిసి ఏక వాక్యమగు చున్నది. క్షేత్రజ్ఞ-ఆత్మ వాస్తవములో పరమేశ్వరుడే యను జ్ఞానము మానవుని మరణమునుండి విముక్తుని చేయును. అనగా మరల జన్మ కూడ ఉండదు. మరో మాటలో చెప్పాలంటే, సంసారము నుండి విముక్తుని చేయును.

అది యెట్లు సంభవమగును? జ్ఞానముచే బంధము సంప్రాప్తమగునని కొందరు వాదించెదరు. ఒక వస్తువును తెలియుటకు ముందు దానిపై నాకు కోరిక లేదు. కాని ఆ వస్తువు చాల అభిలషణీయమైనది అని నాకు తెలిసిన తరువాత, నాకు దానిపై పిచ్చి పట్టినంత కోరిక కలుగవచ్చును. కావున జ్ఞానము నాలో కోర్కెలను రగిలించి నన్ను బంధించవచ్చును గదా! కోర్కెలు పుట్టినచో, వాటిని తీర్చుకోక తప్పదు. కాని, వాటిని తీర్చుకొనే దారిలో ఆటంకములుండుట ఖాయము. వాటిని తొలగించుటకై నీవు ధర్మ విరుద్ధముగా ఆచరించి పాపమును మూటగట్టినచో, దాని ఫలమును అనుభవించక తప్పదు. కావున, జ్ఞానము వలన

ముక్తి ఎట్లు కలుగును? జ్ఞానము కామనకు మూలమగు చున్నది. కామన నుండి కర్మ పుట్టును. కర్మను చేసిన తరువాత కర్మ ఫలమును తప్పించు కొనజాలము.

క్షేత్రజ్ఞ-ఈశ్వరుల అభేదమునెరింగిన జ్ఞాని మోక్షమును పొందుననుటకు గల కారణమును తరువాతి శ్లోకము వివరించుచున్నది:

అధ్యాయము 13, శ్లోకము 26 :

यावत् संजायते किंचित् सत्त्वं स्थावरजंगमम् ।
क्षेत्रक्षेत्रज्ञ संयोगात् तद् विध्दि भरतर्षभ ॥ २६ ॥

యావత్ సంజాయతే కించిత్ సత్త్వం స్థావరజంగమమ్
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్ తద్ విద్ధి భరతర్షభ (26).

భరతర్షభ = భరతవంశీయులలో శ్రేష్ఠుడవగు ఓ అర్జునా!, యావత్ = ఎంతవరకైతే, కించిత్ = ఏదేని, స్థావర జంగమమ్ = కదిలేది గాని, కదలనిది గాని, సత్త్వమ్ = ప్రాణి, సంజాయతే = జన్మించునో, తత్ = అది, క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్ = క్షేత్ర-క్షేత్రజ్ఞుల కలయిక వలన అని, విద్ధి = తెలుసుకొనుము.

భరతవంశీయులలో శ్రేష్ఠుడవగు ఓ అర్జునా! ఎంతవరకు కదిలేది గాని, కదలనిది గాని ప్రాణి ఏదియైననూ జన్మించునో, అది క్షేత్ర-క్షేత్రజ్ఞుల కలయికచే జన్మించునని ఎరుంగుము (26).

కదిలేది గాని, కదలనిది గాని ఏ ప్రాణియైననూ పుట్టినచో, ఆ పుట్టుక క్షేత్ర-క్షేత్రజ్ఞుల కలయిక వలన యని తెలుసుకొనుము. క్షేత్ర-క్షేత్రజ్ఞుల వియోగమునకు మోక్షమని పేరు. ఈ సంయోగము ఎట్లు ఘటిల్లును? క్షేత్రజ్ఞుడు ఆత్మ అయితే, క్షేత్రము అనాత్మ. ఈ ఆత్మ-అనాత్మల మధ్య ఏ రకమైన సంబంధము ఘటిల్లగల్గును?

విశిష్ట-ఆకృతులు, విశిష్ట-అవయవములు గల కుండ-త్రాడు వంటి రెండు వస్తువుల మధ్య ఉండే సంబంధము వంటి సంబంధము ఆత్మ-అనాత్మల మధ్య ఘటిల్లదని శ్రీ శంకరులు వివరించిరి. త్రాటికి రెండు కొనలు గలవు. వాటిని కుండవంచకు కట్టి, ఆ రెండింటికి సంయోగమును కుదర్చవచ్చును. ఇట్టి సంయోగము క్షేత్ర-క్షేత్రజ్ఞుల మధ్య సంభవము కాదు.

శుద్ధ నిరాకార చైతన్యమగు క్షేత్రజ్ఞునిలోని ఏ అంశమును క్షేత్రముతో కలిపి కట్టవలెను? ఇది ఆకాశమును వస్తువుతో జత గలుపుట వంటిది. ఆకాశము నిరవయవము గనుక, ఇట్టి సంయోగము అసంభవము. రెండు సావయవ వస్తువుల మధ్య ఉండే ఇట్టి కలయిక క్షేత్రక్షేత్రజ్ఞుల మధ్య సంభవము గాదు. వస్త్రమునకు, దారములకు మధ్య గల సంబంధము వంటి సంబంధము గలదనియు చెప్పుటకు వీలుపడదు. ఏలయన, వస్త్రమనగా దారములే. అదే విధముగా క్షేత్ర-క్షేత్రజ్ఞులు స్వరూపతః రెండు విభిన్న వస్తువులు కాదు గనుక, వాటి మధ్య సంయోగము లేదు. క్షేత్రజ్ఞునిలో వికారము వచ్చి క్షేత్రమగునని చెప్పుట పొసగదు. ఏలయన, క్షేత్రజ్ఞునిలోమార్పులు సంభవము కాదు. చైతన్యము నీలముగా నున్నచో, మెల్లగా బూడిద రంగులోనికి మారుటకు అవకాశము గలదు. కాని చైతన్యమునకు రూపము లేదు; వికృతి పొందదగిన అవయవములు లేవు. కాన దానిలో మార్పులు సంభవము కావు.

మరియు, క్షేత్రము నీ జ్ఞానములో విషయమగు జడము. క్షేత్రజ్ఞుడు శుద్ధ చైతన్య-ఆత్మయగు విషయి. చీకటి-వెలుతురుల వలె పరస్పర విరుద్ధ స్వభావములగు వాటి మధ్య సంబంధము సంభవము కాదని శ్రీ శంకరులు మరియొక చోట చెప్పిరి. అయిననూ, వాటి మధ్య మరియు వాటి ధర్మముల మధ్య పరస్పర-అధ్యాస (mistaking) గలదు.

దేహమునందు క్షేత్రజ్ఞ భ్రాంతి గలదు. మరియు మనము దేహధర్మములను క్షేత్రజ్ఞ-ఆత్మ యందు ఆరోపించెదము. అవిద్యా మూలకమగు అధ్యాస (superimposition) చే ఈ సంయోగాభాస కలుగుచున్నది. ఇది కేవలము మిథ్యాజ్ఞానము. మనము దేహమును ఉద్దేశించి 'నేను ఉన్నాను' అని అంటాము. కాని దేహము యొక్క ఉనికి, చైతన్యము ఆత్మకు చెందినవే. 'నేను లావుగా ఉన్నాను' అని నీవు అన్నప్పుడు దేహధర్మములు ఆత్మపై ఆరోపించ బడుచున్నవి. ఇది అంతయు అధ్యాసవలన కలుగుచున్నది. క్షేత్ర-క్షేత్రజ్ఞ-వివేకము లేక పోవుటయే అధ్యాసకు హేతువు అగు చున్నది. ఈ తీరున అవివేకముచే వెంటనే సంబంధము నెలకొనుచున్నది. ముత్యపు చిప్పను చూచిన వ్యక్తి యందు వివేక జ్ఞానము లేనిచో, అతడు అది వెండి యని భ్రమపడును. అటులనే, త్రాడును చూచి జనులు పాము అని భ్రమపడెదరు. త్రాడు-పాము అనే రెండు వేర్వేరు వస్తువులు ఒకటి అయినవా అన్నట్లు కనబట్టును. ఎట్లు? వాటి మధ్యగల సంబంధము అధ్యాసమూలకము మాత్రమే. అదే తీరున, మిథ్యాజ్ఞానము (అధ్యాస) వలన క్షేత్ర-క్షేత్రజ్ఞుల మధ్య సంబంధము నెలకొన్నది. ఈ అధ్యాసకు మూలము అజ్ఞానము.

శాస్త్రము క్షేత్ర-క్షేత్రజ్ఞుల స్వరూపమును నిరూపించు చున్నది. ఈ జ్ఞానముచే వాటి

వంధ్య వివేకవము నెలకొనును. స్థూలదేహము, పంచభూతములు, అహంకారము, కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, ఇంద్రియగోచరములగు విషయములు, ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము ఇత్యాదులు క్షేత్రమని ముందుగా చెప్పబడి యున్నది. క్షేత్రజ్ఞ-ఆత్మ కంటె భిన్నమైన సర్వము క్షేత్రము అగును. వాడి మొనలు గల ముంజగడ్డిని కాండము నుండి వేరు చేసిన తీరున సాధకుడు శ్రద్ధతో సావధానచిత్తుడై క్షేత్రము నుండి క్షేత్రజ్ఞుని వేరు చేయవలెను. సర్వ వస్తువులలో క్షేత్రజ్ఞ-అంశము, క్షేత్ర-అంశము రెండు గలవు. వస్తువు యొక్క నామ రూపములు క్షేత్రము కాగా, దాని ఉనికి క్షేత్రజ్ఞుడు. మనస్సులోని వృత్తి-అంశము క్షేత్రము కాగా, చైతన్యము క్షేత్రజ్ఞుడనగు నేనే. చైతన్యము నందు వృత్తి అధ్యస్తమైనది (superimposed). ప్రతి క్షణమునందు క్షేత్ర-క్షేత్రజ్ఞులు కలిసి ఉపలభ్యమగుచున్నారు గావున, జాగరూకతతో వివేకమును చేయవలెను.

ఉపాధి గుణములేవియూ బ్రహ్మను స్పృశించవు. ఉన్నది అని గాని, లేదు అని గాని బ్రహ్మను వర్ణింపజాలము. అస్తిత్వ, నాస్తిత్వ ధారణ లన్నింటికీ ఆధారము బ్రహ్మయే. అట్టి బ్రహ్మయే క్షేత్రజ్ఞుడని గుర్తించవలెను. ఈ సత్యమును గుర్తించిన జ్ఞాని, క్షేత్రము మాయనుండి పుట్టినదనియు, కర్రతో చేసిన ఏనుగునకు వలె దానికి వాస్తవమగు అస్తిత్వము లేదనియు కూడ గుర్తించునని శ్రీ శంకరులు చెప్పిరి. మాయకు ఇది చక్కని దృష్టాంతము. ఒక గురువు శిష్యునితో గూడి అడవి మార్గము గుండా వెళ్ళ చుండెను. శిష్యుడు ఒక పెద్ద ఏనుగును చూచి, 'గురువుగారు!' అని కేక వేసెను. గురువుగారు ఆగెదరని అతడు ఆశించెను. కాని గురువు గారు ఆగకుండా ముందుకు నడిచి ఏనుగు వద్దకు వెళ్లి దానిని లాలించు చుండిరి. ఆయన శిష్యుని కూడ ఏనుగు వద్దకు రమ్మని పిలువగా, గురువుయందలి శ్రద్ధచే అతడు దానిని సమీపించెను. దగ్గరకు వెళ్ళిన శిష్యుడు అది కర్ర ఏనుగు అని గుర్తించెను. కర్ర అని తెలియగానే ఏనుగు అదృశ్యమయ్యెను. మిథ్య అనగా నిదియే. స్వప్నములో చూచిన వస్తువులు, మేఘములలో కానవచ్చే నగరము కూడ మిథ్యయే. దాని అసలు రంగు బయట పడగానే, అది సత్యవస్తువుగా భాసించుటకు తెరపడును. దానికి స్వతంత్రమగు అస్తిత్వము లేదు. స్థూలదేహమును విశ్లేషించినచో, అది ఒక దాని నుండి మరియొక దాని లోనికి పర్యవసానమును చెందుతూ, ఆఖరుగా 'ఉన్నది సర్వము చైతన్యము మాత్రమే' అను జ్ఞానములో విలీనమగును. సర్వసృష్టియు ఇంతే. దాని అస్తిత్వము సద్వస్తువు అగు చైతన్యము నందు మాత్రమే గలదు. మనము చూసే సృష్టిలో సద్వస్తువు అగు క్షేత్రజ్ఞుడు నిండి యున్నాడు. కాని క్షేత్రజ్ఞుని యందు సృష్టి లేదు.

ఈ సత్యజ్ఞానము దృఢముగా నిశ్చితమైయున్న వ్యక్తిలో ఈ సాక్షాద్దర్శనమునకు_

విరుద్ధమగు మిథ్యాదర్శనము దూరమగును. క్షేత్ర-క్షేత్రజ్ఞుల మధ్య పరస్పర భ్రాంతికి అతడు లోనుకాడు. కావున, జన్మకారణమగు క్షేత్ర-క్షేత్రజ్ఞ సంయోగము అతనినుండి దూరమైనది. గుణ సహితమగు ప్రకృతిని, మరియు పురుషుని ఈ తీరున తెలుసుకున్న వానికి పునర్జన్మ లేదని (య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ, ....... న స భూయోభి జాయతే) ఇది వరలో చెప్పబడి యున్నది. ఆ పురుషుడు పరం బ్రహ్మయే నని జ్ఞాని ఎరుంగును. క్షేత్రజ్ఞ పురుషునిపై సర్వము అధ్యస్తమగు చున్నది. దానికి క్షేత్రమునకు మధ్యలో వాస్తవిక సంబంధము లేశమైననూ లేదు. ఈ సత్యమును స్పష్టముగా నెరింగిన జ్ఞానిలో జన్మకారణమగు మిథ్యా జ్ఞానము నశించుటచే, అతడు ముక్తుడగును.

క్షేత్ర-క్షేత్రజ్ఞ-సంయోగము సంసారకారణము గనుక, వాటి వియోగము సంసారవిముక్తికి హేతువు అగును. ఇది మరణము వలన సిద్ధించేది కాదు. మరణములో క్షేత్రములోని ఒక అంశము అగు స్థూలదేహము నుండి మాత్రమే విముక్తి గలదు. సూక్ష్మశరీరము నుండి వియోగము లేదు. కనుక జీవుడు మరల జన్మించును. సుస్పష్టము, ఖచ్చితము అగు క్షేత్ర-క్షేత్రజ్ఞ-స్వరూప-జ్ఞానము వలన మాత్రమే క్షేత్ర-క్షేత్రజ్ఞ-వియోగము సంభవమగును. ఈ జ్ఞానమునకు ఫలము అజ్ఞాననాశము. అజ్ఞానముతో బాటు దాని నుండి పుట్టిన మిథ్యాజ్ఞానము కూడ తొలగిపోవును. దానితో బాటు సంసారము తొలగును. అదియే మోక్షము.

ఈ జ్ఞానమును పొందిన వ్యక్తియొక్క దర్శనము తరువాతి శ్లోకములో నిరూపించబడు చున్నది.

**అధ్యాయము 13, శ్లోకము 27 :**

समं सर्वेषु भूतेषु तिष्ठंतं परमेश्वरम् ।
विनश्यत्स्वविनश्यंतं यः पश्यति स पश्यति ॥ २७ ॥

సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్
వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి (27).

సర్వేషు = సకలములైన, భూతేషు = ప్రాణులయందు, సమమ్ = సమముగా, తిష్ఠంతమ్ = ఉండువాడు, వినశ్యత్సు = దేహములు నశించిననూ, అవినశ్యంతమ్ = నశించని వాడు నగు, పరమేశ్వరమ్ = పరమేశ్వరుని, యః = ఎవడైతే, పశ్యతి = దర్శించునో, సః = వాడే, పశ్యతి = దర్శించుచున్నాడు.

సర్వప్రాణులలో పరమేశ్వరుడు సమానముగా నుండుననియు, దేహములు నశించిననూ ఆ చైతన్యస్వరూపునకు వినాశము లేదనియు ఎవడు దర్శించునో, వాడు మాత్రమే దర్శించు చున్నాడు (జ్ఞాని) (27).

'యః పశ్యతి స పశ్యతి (ఎవడు చూచునో, వాడే చూచును)' అను వాక్యము ఇతరులు చూచు దాని కంటె జ్ఞాని విలక్షణమగు వస్తువును గాంచునని సూచించును. జ్ఞాని దేనిని చూచును? అతడు సర్వకారణుడు (ఈశ్వరః), అనంతుడు (పరమ్) అగు భగవానుని గాంచును. ఆయన ఒకానొక దేశములో కూర్చుని ఉండే పరిచ్ఛిన్నుడు గాడు. ఆయన సర్వప్రాణులలో సమముగా నున్నాడు (సమం సర్వేషు భూతేషు తిష్ఠంతమ్). ఈ అధ్యాయారంభములో భగవానుడిదే మాటను (క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత) చెప్పియున్నాడు. ఇచట 'సర్వక్షేత్రేషు' స్థానములో 'సర్వభూతేషు', 'మామ్' స్థానములో 'పరమేశ్వరమ్' వచ్చినవి. అర్థములో మార్పు లేదు. సర్వప్రాణులలో విశేషణ రహితుడై సమముగా నుండువాడు పరమేశ్వరుడు. సర్వము యొక్క అస్తిత్వము ఆ పరమేశ్వరుడేననియు, ఆయన జ్ఞానరూపుడనియు, అనంతుడనియు శాస్త్రము నిరూపించు చున్నది.

మనచుట్టూ ఉన్న వస్తువులన్నియు కాలమునకు అధీనములై నిరంతరముగా నశించు చున్నవి (వినశ్యత్సు). కాని వీటిలో నున్న ఆ పరమాత్మకు నాశము లేదు (అవినశ్యత్). దేహము నశించును. ఆలోచనలు ఒక దాని తరువాత ఒకటిగా నశిస్తూ ఉంటాయి. మనస్సు నశించును. కాలమునకు అధీనమైన అస్తిత్వము గల ఈ జగత్తు అంతయు నశించును. ఏది నశించదో, అదియే సత్యము. నామరూపాత్మకమగు వస్తువు మాత్రమే నశించును. పదార్థమునకు, దాని అభావమునకు కూడ అధిష్ఠానమై యున్న సత్త (ఉనికి) నశించదు. ఆ ఉనికియే పరమేశ్వరుడు. అది ఎన్నటికీ పోయేది కాదు. అది సర్వదా ఏదో ఒక వస్తువు రూపములో భాసించును. వినాశ్యములగు ఈ వస్తువులన్నింటి మధ్యలో నశించకుండా మిగిలి ఉండేది పరమేశ్వరుడు మాత్రమే. నామరూపాత్మకములగు వస్తువులలో వచ్చే వికారములన్నింటిలో నాశము ఆఖరుది. ప్రతి వస్తువు పుట్టి (జాయతే), పెరిగి (వర్ధతే), మార్పులకు లోనై (విపరిణమతే), క్షీణించి (అపక్షీయతే) ఆఖరులో నశించును (వినశ్యతి). నశించు వాటిలో నశించనిది, క్షీణించువాటిలో క్షీణించనిది, మార్పులను చెందు వాటిలో మార్పులను చెందనిది, పెరిగే వాటిలో పెరగనిది, మరియు పుట్టే వాటిలో పుట్టనిది, వాటన్నింటిలో సమముగా మార్పులు లేకుండగా మిగిలియుండునది అగు తత్త్వము పరమేశ్వరుడే.

ఇతర వస్తువులన్నియు నశించిననూ అది నశించని మరియొక వస్తువు అనుకోరాదు. పరమేశ్వరుడు పుట్టి పెరిగి నశించే తరంగములలోని జలము వంటివాడు. ఈ నశించే వస్తువులన్నింటి మధ్యలో లేశమైననూ మార్పులేనిది ఏది గలదో, అదియే పరమేశ్వరుడు. ఒక విశిష్ట రూపములో పుట్టిన వస్తువును ఉద్దేశించి 'ఇది ఉన్నది' అని మనము చెప్పెదము. కాని నిత్య సద్రూపుడగు పరమాత్మ అట్టి వస్తువు కాదు. పరమాత్మ యందు పెరుగుదల, రూపాంతరణము, అపక్షయము మరియు వినాశము లేవు. పరమాత్మ కాలాతీతుడు గనుక, సర్వవికార వినిర్ముక్తుడు. కాలమునకు, కాలాధీనమై యున్న వస్తువులన్నింటికీ సారభూత-అధిష్ఠానమే పరమాత్మ. సృష్టి అనే దృష్టి కోణములో, ఈ అనంత-ఆత్మయే జగత్కారణమగును.

దీనిని చూచువాడు మాత్రమే వాస్తవముగా చూచువాడు అగును. ఇతరుల చూపు తిమిరదోషము (cataract) కలవారి చూపు వంటిదని శ్రీ శంకరులు చెప్పిరి. నేత్రదోషము కలవాడు ఒక చంద్రుని యందు రెండు చంద్రులను చూచును. అదే విధముగా జనులు అజ్ఞానముచే ద్వైతమును గాంచెదరు. దాని యందు సత్యత్వము లేశమైననూ లేదు. ద్వైతదర్శి తనను ఒక పదార్థముగను, ప్రపంచమును భిన్నముగను చూచును. అట్టివాడు ఈ సువిశాలమగు జగత్తులో ఒక అత్యల్పప్రాణియై, వివిధ ఘనకార్యముల ద్వారా, మరియు వివిధ వస్తువులను ప్రోగు చేయుట ద్వారా తన అల్పత్వమునధిగమించే అంతులేని ప్రయత్నములో శాశ్వత-అన్వేషకుడుగా మిగిలి పోవును. సమస్య ఏమనగా మానవుడు, ఎంత గొప్ప ఘనకార్యమును సాధించిననూ, అది అల్పముగనే ఉండుటచే, అల్పత్వభావనను తొలగించ జాలదు. నశించే పదార్థములలో నశించని (వినశ్యత్సు అవినశ్యత్) ఏకైక తత్త్వము నా స్వరూపమేనని దర్శనము వలన మాత్రమే ఈ అల్పత్వమును నిర్మూలించుట సంభవమగును.

పురుష-ప్రకృతులను (క్షేత్రజ్ఞుడు మరియు క్షేత్రము) గురించి స్పష్టమగు జ్ఞానము యొక్క మహత్త్వమును దాని ఫలమును వర్ణించుట ద్వారా తరువాతి శ్లోకము స్తుతించుచున్నదని శ్రీశంకరులు అవతారికలో ప్రస్తావించిరి.

**అధ్యాయము 13, శ్లోకము 28 :**

समं पश्यन् हि सर्वत्र समवस्थितमीश्वरम् ।
न हिनस्त्यात्मनात्मानं ततो याति परां गतिम् ॥ २८ ॥

సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్
న హినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాం గతిమ్ (28).

హి =ఏలయనగా, సర్వత్ర = అంతటా, సమమ్ = సమముగా, సమవస్థితమ్ = ఏకరూపములోఉపలభ్యమయ్యే, ఈశ్వరమ్ = ఈశ్వరుని, పశ్యన్ = చూచువాడు, ఆత్మనా = తనచే, ఆత్మానమ్ = తనను, న హినస్తి = నశింపజేసుకొనడు, తతః = దాని వలన, పరామ్ = చరమమగు, గతిమ్ = లక్ష్యమును, యాతి = పొందును.

ఏలయనగా అంతటా సమముగా ఏకరూపములో ఉపలభ్యమయ్యే
ఈశ్వరుని దర్శించువాడు తన వినాశమును తాను కొని దెచ్చుకొనడు.
కావున అతడు పరమగతిని పొందును (28).

జ్ఞాని సర్వప్రాణులలో సమవస్థితుడై యున్న ఈశ్వరుని చూచును. సమవస్థితుడు అనగా చాల చక్కగా ప్రకాశించువాడు (సమ్యగ్ అవస్థితమ్), అనగా ఆత్మరూపుడు; లేదా, సర్వప్రాణులలో సమానముగా ఆత్మరూపుడై యున్నవాడు (సమం అవస్థితమ్). సర్వ జగన్నాథుడగు ఈశ్వరుడు వికారములేమియు పొందకుండగనే సర్వప్రాణులలో ఆత్మ రూపుడై ఉన్నాడని జ్ఞాని గుర్తించును. ఈ అవగాహన గల జ్ఞాని తనను తాను ఈశ్వర-అభిన్నునిగా గుర్తించును. కావున, అతడు తనను తాను నాశనము జేసుకొనడు. ఈ జ్ఞానముచే నాతడు చరమలక్ష్యమగు మోక్షమును పొందును. చరమ లక్ష్యము అనగా అవినాశి కానిది, మరియు దానిని మించిన లక్ష్యము మరియొకటి లేనిది అని యర్థము.

జ్ఞాని తనచే తనను నాశనము చేసుకొనడు అనగా నేమి? శ్రీ శంకరులు వివరించిరి. ఈ లోకములో ఎవ్వడైననూ తనచే తనను నశింపజేసుకొనడు గదా! ఈ వాక్యమునిచట చెప్పుట వలన ప్రయోజనమేమి? సంభవించే అవకాశము గలదానిని మాత్రమే నిషేధించవలెను గదా! ఉదాహరణకు 'నిప్పును త్రాగరాదు' అని చెప్పే వాక్యము వేదములో లేదు. జనులు మద్యమును త్రాగుట సంభవము గనుక, 'మద్యమును త్రాగరాదు' అని వేదము చెప్పుచున్నది. నిప్పును త్రాగవద్దని నిషేధించవలసిన ఆవశ్యకత లేదు. 'న పృథివ్యాం న అంతరిక్షే అగ్నిః చేతవ్యః' అను వాక్యమును శ్రీశంకరులు ఉదహరించిరి. అగ్నిని భూమిపై మాత్రమే ప్రతిష్ఠించుట సాధ్యమగును. అంతరిక్షములో సాధ్యము కాదు. కావున అంతరిక్షములో అగ్నిని ప్రతిష్ఠించరాదు అను నిషేధము నిరర్థకము.

అదే విధముగా, మానవులు తమచే తమను నాశనము చేసుకొనరు. కావున, 'అతడు తనచే తనను నాశనము చేసుకొనడు' అని చెప్పవలసిన ఆవశ్యకత ఏమి గలదు? పైగా మనకు లోక ప్రవృత్తి దీనికి విరుద్ధముగా కానవచ్చును. ప్రతి వ్యక్తి జీవించాలని ఆకాంక్షించును. ఆత్మ హత్యను చేసుకునే వ్యక్తి కూడ వాస్తవంలో బ్రతకాలనియే ఆశించును. కాని దుఃఖమును పట్టజాలక, మరణముతో దుఃఖము అంతమగునని ఆశించి, ఆత్మహత్యకు పాల్పడును. ప్రతివ్యక్తి ఆనందముగా జీవించాలని కోరుకొనును. తనచే తనను నాశనము చేసుకొనువారెవ్వరూ లేరు. ఈ పరిస్థితిలో, 'అతడు తనచే తనను నాశనము చేసుకొనడు' అని చెప్పుట వలన ప్రయోజనము ఏమి గలదు? ఇది దోషము కాదని శ్రీశంకరులు సమాధానము నిచ్చిరి. ఏలయన, అజ్ఞానులందరు ఆత్మ విషయములో పూర్తి ఔదాసీన్యమును అవలంబించి, తద్వారా తమ వినాశమును తామే కొని తెచ్చుకొనుచున్నారు.

ఈ సర్వము నీకు కానరాకుండా దూరమయ్యే అవకాశము గలదు. కాని ఆత్మ ఎన్నటికీ నీకు దూరము కాదు. ఆత్మ సర్వదా స్వయం-ప్రకాశము. ఆత్మ ఎల్లవేళలా హాజరుగా నున్ననూ, అజ్ఞానియగు వ్యక్తి దానిని పూర్తిగా ప్రక్కన బెట్టి, అనాత్మయగు దేహేంద్రియ మనస్సంఘాతమును ఆత్మయని స్వీకరించును. కావున అతడు సహజముగా కర్తయగును. కర్త యగుటచే భోక్త యగును. భయాతురుడగు ఈ అల్పకర్త సర్వదా మంచి-చెడు కర్మలను చేస్తూ పుణ్యపాపములను మూటగట్టుకొనుచుండును. ఇచట ఈ జీవితము అంతమగు సరికి అతడు సాధించినది ఏదీ లేదు. అనగా అతడు తనను తాను నాశనము చేసుకున్నట్లే గదా! ఈ పుణ్యపాపముల వలన అతడు మరియొక దేహమును పొంది, కొంత కాలము తరువాత ఆ జీవితమును కూడ నాశము జేయును. తమిళములో ఒక పద్యము గలదు. ప్రపంచము అనే ఈ సుందర-ఉద్యానములో జీవుడనే బిచ్చగాడు ఈశ్వరుడనే కుమ్మరి వానిని తన కొరకై మానవ దేహమనే ఒక కుండ ఇమ్మని కోరెను. అతని ప్రార్థనల నాలకించి భగవానుడాతనికి ఒక మంచి దేహమును ఇచ్చినాడు. ఇది జ్ఞానముతో నింపదగిన పాత్ర. జీవుడు ఆ పాత్రను పొంది మహా హర్షముతో దానిని నెత్తిపై నిడుకొని నాట్యమాడుట నారంభించెను. అది క్రిందపడి పగిలి పోయెను. దానినాతడు జ్ఞానముతో నింపలేదు. అజ్ఞాని ఒక దాని తరువాత మరియొకటి చొప్పున కొత్త దేహములను పొంది వానిని నాశనము చేయుచుండును. కారణమేమనగా, సంసార విముక్తి నీయగల ఇచ్ఛాశక్తిని అతనికి భగవంతుడను గ్రహించిననూ, దానిని అతడు దుర్వినియోగ పరచెను. త్రాళ్లతో బంధింపబడి యున్న వ్యక్తి చేతికి చాకును ఈయగా, దానితో అతడు త్రాళ్లకు బదులుగా మెడను ఉత్తరించుకొనెను. ఆత్మ పరిపూర్ణ సత్యము. ఉన్నది ఆత్మ ఒక్కటియే. కాని మానవుడు ఆత్మ

స్వరూపమై యున్న మోక్షము నుండి తనకు తాను వంచితుడై, అజ్ఞానముచే తన వినాశమును తానే కొని దెచ్చుకొనును.

దీనికి భిన్నముగా, స్పష్టమగు ఆత్మ జ్ఞానము గల వ్యక్తి తనను తాను నాశనము చేసుకొనడు. అతడు తన దేహమును సద్వినియోగము చేసినాడు. తనకు ఈశ్వరునితో గల అభేదమును గుర్తించుటలో అతడు విఫలుడు కాలేదు. అతడు జీవన్ముక్తుడైనాడు. ఇచట ఒక అభ్యంతరము గలదు. ప్రతి వ్యక్తి ఇతరుల కంటె భిన్నుడై యుండగా, జ్ఞాని సర్వప్రాణులలో గల ఒకే ఒక ఆత్మను గుర్తించునని చెప్పుట పొసగదు. ప్రతి వ్యక్తి కర్తయై స్వీయకర్మల నాచరించును. అవి తమ తమ విలక్షణ ఫలములను ఉత్పన్నము చేయుగా అతడు వాటిని భోగించును. ప్రతి వ్యక్తి తాను గతములో చేసిన, మరియు ఇప్పుడు చేయుచున్న కర్మల ఫలమును తానే అనుభవించును. కర్తలు అనేకులు గలరు. ప్రతి కర్తకు స్వీయ పుణ్య పాపములు గలవు. ఒక కర్తకు, రెండవ కర్తకు మధ్యలో స్పష్టమగు భేదము గలదు. తరువాతి శ్లోకము ఈ అభ్యంతరమునకు సమాధానము నిచ్చుచున్నది.

**అధ్యాయము 13, శ్లోకము 29 :**

प्रकृत्यैव च कर्माणि क्रियमाणानि सर्वशः ।
यः पश्यति तथात्मानमकर्तारं स पश्यति ॥ २९ ॥

I.M.P.

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః
యః పశ్యతి తథాత్మానమకర్తారం స పశ్యతి (29).

చ = మరియు, కర్మాణి = కర్మలు, సర్వశః = అన్ని ప్రకారములుగా, ప్రకృత్యా ఏవ = ప్రకృతి చేత మాత్రమే, క్రియమాణాని = చేయబడు చున్న వనియు, తథా = మరియు, ఆత్మానమ్ = ఆత్మను, అకర్తారమ్ = కర్తగాదనియు, యః = ఎవడైతే, పశ్యతి = దర్శించునో, సః = వాడే, పశ్యతి = దర్శించుచున్నాడు.

మరియు కర్మలు అన్ని విధములుగా ప్రకృతి చేత మాత్రమే చేయబడు చున్నవనియు, ఆత్మ కర్త గాదనియు ఎవడు దర్శించునో, వాడు మాత్రమే వాస్తవమగు దర్శనము గలవాడు అగును (29).

జగత్కారణము మాయ. ఆ మాయను చెలాయించువాడు ఈశ్వరుడు (మాయాం తు ప్రకృతిం విద్యాత్ మాయినం తు మహేశ్వరమ్) అని శ్వేతాశ్వతరోపనిషత్తు చెప్పుచున్నది. మాయ మార్పులను చెందే ఉపాదాన కారణము (పరిణామి-ఉపాదాన-కారణమ్). ఈ మాయకు ఆశ్రయము బ్రహ్మ. బ్రహ్మ మార్పులు లేశమైననూ లేని వివర్త-ఉపాదాన-కారణము. కర్మలనాచరించునది ఈ ప్రకృతి మాత్రమేనని భగవానుడు చెప్పుచున్నాడు. 'ఏవ (మాత్రమే)' అని చెప్పుటచే, కర్మానుష్ఠానములో ప్రకృతి తక్క ఇతరము ఏదియూ లేదని నొక్కి చెప్పినట్లైనది. వైదిక లౌకిక కర్మలనన్నిటినీ ప్రకృతి మాత్రమే చేయుచున్నది. ఈ కర్మలు వివిధ ప్రకారములుగా వివిధ కర్మేంద్రియములచే చేయబడు చున్నవి. మాయ స్వయముగా కర్మలను చేయుట లేదు. మాయ పరిణమించి హిరణ్య గర్భుడు (సమష్టి-సూక్ష్మ-శరీరము) మరియు విరాట్ (సమష్టి స్థూలదేహము) అయినది. వ్యక్తి స్థాయిలో ప్రకృతి పరిణమించి స్థూలదేహము, ఇంద్రియములు, మనస్సు అయినది. కావుననే, వ్యక్తి ఏదేని ఒక పనిని చేసినప్పుడు చైతన్యమూలకముగనే చేయును. కాని చైతన్యము స్వయముగా కర్మను చేయదు. ప్రకృతిలో పురుషుడు నిండి యుండుటచే, ప్రకృతి క్రియాశక్తిని పొంది కర్మలనన్నిటినీ చేయును. కాని పురుషుడు కర్మలను వేటినీ చేయుట లేదు. ఈ తీరున ఈ విచిత్రమగు సంయోగము ఏర్పడి యున్నది. ఇది అవిద్యవలన కలిగిన అధ్యారోపము (అధ్యాస) అని మనము ఇంతకు ముందు చూచి యున్నాము.

కావున వాగింద్రియము, స్థూలదేహము మరియు మనస్సులచే ఆరంభింపబడే కర్మలను చేయునది ప్రకృతి మాత్రమేనని శ్రీశంకరులు వివరించినారు. ఈ సత్యమును స్పష్టముగా చూచువాడు మాత్రమే చూపు గలవాడగును. మరియు శుద్ధ-చైతన్య-ఆత్మ(పురుషుడు) కర్మలను వేటినీ చేయుట లేదనియు అతడు దర్శించును. ఆత్మ సర్వ-ఉపాధి-వినిర్ముక్తమై యున్నది. అనగా ఉపాధి ధర్మములు ఆత్మకు చెందవు. ఈ అధ్యాయములోని సారము ఈ ఒక్క శ్లోకములో నిక్షిప్తమై యున్నది. ఈ సత్యమును దర్శించువాడు యథార్థ దర్శి యగు చున్నాడు.

ఇచట శ్రీశంకరులిట్లు వివరించిరి: అనేక-ఆత్మలు గలవని నిరూపించే జ్ఞానసాధనము (ప్రమాణము) లేదు. అకర్త, ఆకాశము వలె నిర్గుణము, నిర్విశేషము అగు ఆత్మ యందు నానాత్వమును నిరూపించే ప్రమాణము సిద్ధించుట లేదు. ఆత్మ నిరవయవము గనుక, కర్మలను వేటినీ చేయదు. ఆత్మ సమము, అద్వితీయము. ఆత్మనానాత్వమును స్థాపించే ప్రమాణము లేదు. మన ఇంద్రియ ప్రత్యక్షము కూడా ఈ సత్యమును ధ్రువీకరించు చున్నది. దేహము మనకు దృశ్యమగు చున్నది. కావున, 'దేహమును నేను తెలియుచున్నాను', మరియు 'దేహము నేనే'

అని ఏకకాలములో చెప్పుట పొసగదు. పైగా, ఆత్మ సాక్షి-చైతన్యమని శాస్త్రము చెప్పుచున్నది. ఆత్మ నిర్గుణము (సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ). శాస్త్రవచనమును నిరాకరించ జాలము. స్వయం ప్రకాశమగు శుద్ధ-చైతన్య-ఆత్మ నీవే. ఆత్మ విషయము (object) కాదు. పైగా ఆత్మ సర్వమునకు విషయి (subject) అగుచూ, సర్వము యొక్క సారస్వరూపమై యున్నది. ఒక వస్తువును గుర్తించుటకు, ఇతర వస్తువుల నుండి వేరు చేసి చూపించుటకు ఉపకరించే లక్షణమునకు గుణమని పేరు. ఆత్మ నిర్గుణము. ఆత్మ కంటె భిన్నముగా మరియొక వస్తువు లేదు. ఇట్టి స్థితిలో, ఆత్మకు మరియొక వస్తువుతో గల భేదమును వివేచించుట ఎట్లు సంభవమగును?

ఇదే విషయమును భగవానుడు తరువాతి శ్లోకములో పదములను మార్చి చెప్పుచున్నాడు:

**అధ్యాయము 13, శ్లోకము 30 :**

यदा भूतपृथग्भावमेकस्थमनुपश्यति ।
तत एव च विस्तारं ब्रह्म संपद्यते तदा ॥ ३० ॥

యదా భూతపృథగ్భావమేకస్థమనుపశ్యతి
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా (30).

యదా = ఎప్పుడైతే, భూతపృథగ్భావమ్ = ప్రాణులలోని భేదమును, ఏకస్థమ్ = ఒకే ఆత్మ యందు ఉనికి కలదిగా, అను పశ్యతి = స్పష్టముగా దర్శించునో, చ = మరియు, తతః ఏవ = దాని నుండి మాత్రమే, విస్తారమ్ = నామరూపాత్మకమగు వ్యాకరణమును, తదా = అప్పుడు, బ్రహ్మ = బ్రహ్మను, సంపద్యతే = పొందును.

> వ్యక్తి ఎప్పుడైతే ప్రాణులలోని భేదము యొక్క ఉనికి ఒకే ఆత్మ యందు గలదనియు, దాని నుండి మాత్రమే ఈ నామ రూపాత్మకమగు జగద్విస్తారము ఉదయించినదనియు తెలుసుకొనునో, అపుడాతడు బ్రహ్మను పొందినవాడు అగును (30).

'ఆత్మను సర్వప్రాణులలో సమానముగా చూచువాడు' అని భగవానుడు ముందుగా చెప్పినాడు. అనగా ఆత్మ అంతర్యామియని గుర్తించబడినది. దీనిని బట్టి, ఆత్మ కంటె ప్రాణులు

భిన్నముగా నున్నారనే అర్థమును చెప్పే అవకాశము గలదు. కావున భగవానుడు దానిని ఖండించి అద్వైతమును స్థాపించవలెను. ప్రాణులలో కన్పట్టు ఈ భేదమునకు ఆలంబనము ఆత్మయేననియు, సర్వప్రాణుల ఉనికి ఆత్మ యందు మాత్రమే గలదనియు భగవానుడిచట చెప్పు చున్నాడు. ఆత్మ సమము, ఏకము అని చెప్పినాడు గనుక, ఇంద్రియములు ఇత్యాదులన్నింటి యొక్క అస్తిత్వము ఆత్మ యందు గలదు. అవి ఆత్మ కంటె భిన్నముగా లేవు. ప్రతి ప్రాణియొక్క ఉనికి ఆత్మ రూపమగు సత్త కంటె వేరు గాదు. నామరూపములలో మాత్రమే భేదము గలదు. నామ రూపములన్నియు ఉనికిలో మాత్రమే విలీనమగును.కావున, సర్వభూతముల ఉనికి అద్వితీయ-ఆత్మ యందు గలదని భగవానుడు చెప్పుచున్నాడు.

అనుపశ్యతి అనగా గురువు ఉపదేశించిన శాస్త్రమునకు అనురూపముగా అని యర్థము. ఈ సర్వము ఆత్మయే (ఆత్మైవ ఇదం సర్వమ్) ఇత్యాది శ్రుతి వాక్యములలో బోధింపబడిన సర్వాత్మ భావమును అతడు గుర్తించును. అనగా వివిధ రకముల వస్తువులతో గూడిన ఈ సర్వసృష్టియొక్క అస్తిత్వము ఆత్మ యందు మాత్రమే గలదు.

దాని అస్తిత్వము ఆత్మ యందు ఉండుట మాత్రమే గాక, దాని వికాసము కూడా ఆత్మ నుండియే ఉదయించుచున్నది. ఘటములన్నియు మట్టి నుండి పుట్టు విధంబున, నామ రూపములన్నియు ఆత్మ నుండి మాత్రమే ఉదయించినవి. ఈ సృష్టి అంతయు ఆత్మనుండి ప్రఫుల్లమగు చున్నది. కావున ఆత్మ చైతన్యాత్మకమగు నిమిత్తకారణము మాత్రమే గాక, ఉపాదాన కారణము కూడా అగుచున్నది. కావున ఈ సర్వము ఆత్మ తక్క మరియొకటి గాదు. ఆత్మ నుండియే ప్రాణము, ఆత్మ నుండియే ఆశ, ఆత్మ నుండియే స్మృతి, ఆత్మ నుండియే ఆకాశము, ఆత్మ నుండియే అగ్ని, ఆత్మ నుండియే నీరు, ఆత్మ నుండియే పుట్టుక మరియు కనుమరుగగుట, ఆత్మ నుండియే అన్నము (ఆత్మతః ప్రాణ ఆత్మత ఆశా ఆత్మతస్స్మర ఆత్మత ఆకాశ ఆత్మతస్తేజ ఆత్మత ఆప ఆత్మత ఆవిర్భావతిరోభావావాత్మతోऽన్నమ్) అను వాక్యమును శ్రీశంకరులిచట ఉదాహరించిరి. ఈ విధముగా సర్వము నానుండి మాత్రమే పుట్టి, నా యందు ఉనికిని పొంది, నాలో విలీనమగు చున్నది. నా కంటె భిన్నముగా ఎక్కడనో కూర్చుండి దేనినో సృష్టించే మరియొక ఈశ్వరుడు లేడు.

ఈ సత్యమును స్పష్టముగా దర్శించగలవాడు బ్రహ్మను పొందును (బ్రహ్మ సంపద్యతే). అనగా బ్రహ్మ ఆత్మ-అభిన్నమని తెలుసుకొనును. 'నా నుండి సర్వము ఉదయించినది; నేను సర్వరూపములలో నుండి సర్వమును ధరించి యున్నాను. సర్వము నాలో విలీనమగును' అను

దర్శనమే బ్రహ్మప్రాప్తి. సాధకుడు జ్ఞానోదయమునకు పూర్వమునందు కూడా బ్రహ్మమే గనుక, క్రొత్తగా బ్రహ్మ అగుట లేదు. ఇందువలననే మోక్షమును పొందుటకు జ్ఞానమొక్కటియే చాలును. తాను బ్రహ్మ యనే సత్యమును జీవుడు ఎరుంగడు గనుకనే, శ్రుతి 'నీవు బ్రహ్మవు' అని చెప్పుచున్నది. 'నీవు తరువాత బ్రహ్మవు కాగలవు' అని శ్రుతి చెప్పుట లేదు.

సర్వక్షేత్రములలోని ఏక అద్వితీయ-చైతన్యము ఆత్మయేననియు, సర్వప్రాణులలో ఉపలభ్యమయ్యే ఆత్మ కంటె భిన్నముగా ఏదీ లేదనియు, దేహములన్నియు ఆత్మకంటె భిన్నము కావనియు స్పష్టముగా నిరూపించబడినది. కాని సంయోగము వలన దేహేంద్రియ మనస్సంఘాతము యొక్క దోషములు ఆత్మకు అంటకుండునా? తరువాతి శ్లోకములో ఈ ప్రశ్నకు సమాధానము గలదు.

**అధ్యాయము 13, శ్లోకము 31 :**

अनादित्वान्निर्गुणत्वात्परमात्मायमव्ययः ।
शरीरस्थोऽपि कौंतेय न करोति न लिप्यते ॥ ३१ ॥

అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాయమవ్యయః
శరీరస్థోపి కౌంతేయ న కరోతి న లిప్యతే (31).

**అయమ్** = ఈ, **అవ్యయః** = వినాశము లేని, **పరమాత్మా** = అనంత-ఆత్మ, **అనాదిత్వాత్** = ఆది లేనిది యగుట వలన, **నిర్గుణత్వాత్** = విశేషణములు లేనిది యగుట వలన, **కౌంతేయ** = ఓ కుంతీపుత్రా! అర్జునా!, **శరీరస్థః అపి** = శరీరమునందు ఉపలభ్యము అగుచున్ననూ, **న కరోతి** =చేయుట లేదు, **న లిప్యతే** = లేపమును పొందుట లేదు.

ఓ కుంతీపుత్రా! అర్జునా! ఈ వినాశము లేని అనంత-నిర్గుణ-ఆత్మకు ఆది లేదు. కావున ఈ ఆత్మ శరీరము నందు ఉపలభ్యమగు చున్ననూ, కర్మలను చేయుట లేదు; వాటిచే ప్రభావితము అగుట లేదు (31).

స్థూలదేహము జన్మించును. దానికి ఆది గలదు. కాని ఆత్మ అనాది. కావున ఆది గల వస్తువునకు సహజముగా ఉండే సమస్యలు ఆత్మకు లేవు. ఆది గల వస్తువు ఏదైననూ కాలాధీనమై ఉండుటచే క్షీణించి నశించును. దాని స్వరూపము క్షణక్షణమునకు మారుచుండును.

ముందు క్షణములోని రూపము ఈ క్షణములో లేదు. కావున కాలమునకు వశమై ఉండేది ఏదైనా నశించి తీరును. కాని ఆత్మ కాలమునకు అతీతమైనది. లేదా, అనాది యనగా కాలము లేనిది అని యర్థము. సర్వసృష్టికి కారణము ఆత్మ. సృష్టి ఏదైనా, సృష్ట్యాది యందు ఉన్నది దానికి కారణమగును. ఘటసృష్టికి పూర్వము మట్టి గలదు గాన, అది ఘటమునకు కారణమగును. అదే విధముగా, సృష్టికి పూర్వము ఆత్మ ఉండెను. కనుక, సృష్టికి కారణము ఆత్మ. ఆత్మకు వేరే కారణము లేదు. అనగా ఆత్మ కార్యము కాదు. కావున, ఆత్మకు పుట్టుక లేదు.

మరియు ఈ అనంత -చైతన్య-ఆత్మ నిర్గుణము. ఆత్మకు ఏదేని గుణమున్నచో, అది సంయోగముచే మారే అవకాశము గలదు. ఉదాహరణకు, పాలకు నీటికి స్వీయగుణములు గలవు. పాలను నీటిలో పోయగానే, పాలు పలుచబడును. స్వీయగుణములు గల ఒక వస్తువు మరియొక సగుణవస్తువుతో సంయోగమును పొందినపుడు మార్పులకు లోనగును; ఇతర వస్తుగుణములు దానికి సంక్రమించును. కాని అది ముందుగా విశిష్ట గుణములు గల వస్తువు అయి ఉండవలెను. కాని ఆత్మ పూర్తిగా నిర్గుణము. చైతన్యము, అనంతత్వము గుణములు కావు. చైతన్యము గుణమైనచో, దానికి ఆశ్రయమగు మరియొక పదార్థము ఉండవలెను. ఆ పదార్థము చేతనమా? అచేతనమా? అది అచేతనమైనచో, చేతనము దానికి గుణము కాజాలదు. పైగా, నీవు దేనిని గురించి ఆలోచిస్తావో, అది చైతన్యమునకు విషయమగును. కావున, చైతన్యము దీనికి గుణము అనదగిన గుణి ఉండజాలదు. చైతన్యము నిర్గుణ వస్తువు గనుక, తాను స్వయముగా విశేష్యము కాజాలదు. అది తక్క ఇతరము సర్వము సగుణ పదార్థమే యగును. మాయయందు మూడు గుణములు విశేషణములై యున్నవి గనుక, అది పరిణామమును చెందును. కాని, ఆత్మ చైతన్యము నిర్గుణము. మాయ కూడ చూడబడునదియే (సాక్ష్యము). కాని ఆత్మ చూచేది (సాక్షి). ఆకాశమునకైనను గుణములు లేని స్థితిలో, ఆకాశమునకు కారణమగు చైతన్య-ఆత్మ గుణములను కలిగియుండుట ఎట్లు సంభవమగును? మనస్సు ఆత్మ కంటె భిన్నముగా లేదు. కాని మనస్సు యొక్క సమస్యలను ఆత్మకు అంటగట్టుట సంభవము కాదు. అటులనే, దేహము, ఇంద్రియములు మరియు వివిధ రకముల సమస్యలతో నిండియున్న జగత్తు అను వాటితో ఆత్మకు సంయోగము లేదు. వాటిని ఆకర్షించే కేంద్రకము (nucleus) ఆత్మ కాదు. కావున, ఆత్మ యందు వికారము లేవియూ కలుగవు. ఆత్మ అవ్యయము. ఆత్మ కొన్ని గుణములు గల పదార్థమైనచో, ఆ గుణములలో మార్పు రావచ్చును. ఉదాహరణకు,

దేహము గుణములు కలది గనుకనే, వికారాధీనమై యుండును. ఒకప్పుడు యౌవనములో నున్న దేహము ఇప్పుడు ముదుసలి యగుచున్నది. ఆత్మ నిర్గుణము, అవ్యయము గనుక, అవినాశి.

ఇట్టి ఈ ఆత్మ శరీరములో ఉపలభ్యమగుచున్ననూ, కర్మలను వేటినీ చేయదు (శరీరస్థోఽపి న కరోతి). సర్వము ఆత్మయే అయి ఉండగా, ఆత్మ శరీరములో నున్నది అని చెప్పుటకు కారణమేమి? దీనికి కారణమేమనగా, శరీర దేశమునందు ఆత్మ యొక్క ఉనికిని గుర్తించవచ్చును (ఉపలబ్ధి స్థానమ్). సాధారణంగా దేహము కర్మను చేయుచుండగా, ఆత్మయే కర్మను చేయుచున్నదని మనము భావించెదము. ఇది భ్రాంతి యని మనము పరిశీలించి యున్నాము. ఆత్మ అకర్త. ఆత్మ సన్నిధిలో సర్వక్రియలు జరుగుచున్ననూ, క్రియాలేశమైననూ ఆత్మ యందు కేంద్రితమై లేదు. ఈ తీరున, ఆత్మ దేహములో ఉపలభ్యమగు చున్ననూ, కర్మలను వేటినీ చేయదు.

ఆత్మ అకర్త గనుక, కర్మఫలముచే ప్రభావితముగాదు (న లిప్యతే). ఆత్మ కర్మఫలములనన్నింటినీ ప్రకాశింపజేయుచూ అసంగముగా నుండును. కామన ఉదయించు చుండగా, ఆత్మ దానిని ప్రకాశింపజేయును. కాని ఆత్మకు స్వీయకామనలు లేవు. కామనా పరిపూర్తికై ఉపాధి తన వశములో నున్న వివిధ సాధనములతో కర్మల నారంభించును. ఆత్మ వాటిని ప్రకాశింప జేయును. ఫలము సంప్రాప్తమైనప్పుడు, అది అభిలషితము అయినా కాక పోయినా, ఆత్మ దానిచే లేశమైననూ ప్రభావితము గాకుండా, దానిని ప్రకాశింప జేయును.

శ్రీశంకరులిచట ఒక సూత్రమును ఉద్ఘాటించినారు. కర్మను ఎవరు చేస్తే, వారే దాని ఫలమును పొందెదరు. 'నేను కర్తను' అని నీవు భావించినచో, నీ కర్మలకు నీవు బాధ్యుడవగుదువు. నీకు పుణ్యపాపములు, సుఖదుఃఖములు, పూర్తి సంసారము తప్పవు. అనగా కర్తయే భోక్తయగును. ఏ విత్తును పాతితే ఆ ఫలము లభించును. ఆత్మ కర్త కాదన్నచో, కర్త యెవరు? అను ప్రశ్న తలయెత్తును. ఈ ఆత్మ అకర్తయై ఉండగా, కర్మలను చేయు ఆత్మ మరియొకటి గలదా? అట్టి స్థితిలో రెండు ఆత్మలుండుటచే, ద్వైతము సంప్రాప్తమగును. దీనిలో ఒక సమస్య గలదు. సర్వక్షేత్రములలోని క్షేత్రజ్ఞుడను నేను అని తెలుసుకో (క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వ క్షేత్రేషు భారత). బ్రహ్మ ఏకము; రెండవ వస్తువు లేదు (ఏకమేవ అద్వితీయం బ్రహ్మ). ఈ సర్వము ఆత్మయే (యదా ఇదం సర్వం అయం ఆత్మా). ఈ సర్వము నిశ్చయముగా బ్రహ్మయే (సర్వం ఖల్విదం బ్రహ్మ) ఇత్యాది వాక్యములు అర్థరహితములగును. అంతే గాక, నీవు రెండవ ఆత్మ గలదని ఎట్లు నిర్ధారించెదవు? చూచే ఆత్మ, చేసే ఆత్మ వేర్వేరుగా నున్నచో, ఈ 'నేను'ను

ముందు క్షణములోని రూపము ఈ క్షణములో లేదు. కావున కాలమునకు వశమై ఉండేది ఏదైనా నశించి తీరును. కాని ఆత్మ కాలమునకు అతీతమైనది. లేదా, అనాది యనగా కాలము లేనిది అని యర్థము. సర్వసృష్టికి కారణము ఆత్మ. సృష్టి ఏదైనా, సృష్ట్యాది యందు ఉన్నది దానికి కారణమగును. ఘటసృష్టికి పూర్వము మట్టి గలదు గాన, అది ఘటమునకు కారణమగును. అదే విధముగా, సృష్టికి పూర్వము ఆత్మ ఉండెను. కనుక, సృష్టికి కారణము ఆత్మ. ఆత్మకు వేరే కారణము లేదు. అనగా ఆత్మ కార్యము కాదు. కావున, ఆత్మకు పుట్టుక లేదు.

మరియు ఈ అనంత -చైతన్య-ఆత్మ నిర్గుణము. ఆత్మకు ఏదేని గుణమున్నచో, అది సంయోగముచే మారే అవకాశము గలదు. ఉదాహరణకు, పాలకు నీటికి స్వీయగుణములు గలవు. పాలను నీటిలో పోయగానే, పాలు పలుచబడును. స్వీయగుణములు గల ఒక వస్తువు మరియొక సగుణవస్తువుతో సంయోగమును పొందినపుడు మార్పులకు లోనగును; ఇతర వస్తుగుణములు దానికి సంక్రమించును. కాని అది ముందుగా విశిష్ట గుణములు గల వస్తువు అయి ఉండవలెను. కాని ఆత్మ పూర్తిగా నిర్గుణము. చైతన్యము, అనంతత్వము గుణములు కావు. చైతన్యము గుణమైనచో, దానికి ఆశ్రయమగు మరియొక పదార్థము ఉండవలెను. ఆ పదార్థము చేతనమా? అచేతనమా? అది అచేతనమైనచో, చేతనము దానికి గుణము కాజాలదు. పైగా, నీవు దేనిని గురించి ఆలోచిస్తావో, అది చైతన్యమునకు విషయమగును. కావున, చైతన్యము దీనికి గుణము అనదగిన గుణి ఉండజాలదు. చైతన్యము నిర్గుణ వస్తువు గనుక, తాను స్వయముగా విశేష్యము కాజాలదు. అది తక్క ఇతరము సర్వము సగుణ పదార్థమే యగును. మాయయందు మూడు గుణములు విశేషణములై యున్నవి గనుక, అది పరిణామమును చెందును. కాని, ఆత్మ చైతన్యము నిర్గుణము. మాయ కూడ చూడబడునదియే (సాక్ష్యము). కాని ఆత్మ చూచేది (సాక్షి). ఆకాశమునకైనను గుణములు లేని స్థితిలో, ఆకాశమునకు కారణమగు చైతన్య-ఆత్మ గుణములను కలిగియుండుట ఎట్లు సంభవమగును? మనస్సు ఆత్మ కంటె భిన్నముగా లేదు. కాని మనస్సు యొక్క సమస్యలను ఆత్మకు అంటగట్టుట సంభవము కాదు. అటులనే, దేహము, ఇంద్రియములు మరియు వివిధ రకముల సమస్యలతో నిండియున్న జగత్తు అను వాటితో ఆత్మకు సంయోగము లేదు. వాటిని ఆకర్షించే కేంద్రకము (nucleus) ఆత్మ కాదు. కావున, ఆత్మ యందు వికారము లేవియూ కలుగవు. ఆత్మ అవ్యయము. ఆత్మ కొన్ని గుణములు గల పదార్థమైనచో, ఆ గుణములలో మార్పు రావచ్చును. ఉదాహరణకు,

దేహము గుణములు కలది గనుకనే, వికారాధీనమై యుండును. ఒకప్పుడు యౌవనములో నున్న దేహము ఇప్పుడు ముదుసలి యగుచున్నది. ఆత్మ నిర్గుణము, అవ్యయము గనుక, అవినాశి.

ఇట్టి ఈ ఆత్మ శరీరములో ఉపలభ్యమగుచున్ననూ, కర్మలను వేటినీ చేయదు (శరీరస్థోఽపి న కరోతి). సర్వము ఆత్మయే అయి ఉండగా, ఆత్మ శరీరములో నున్నది అని చెప్పుటకు కారణమేమి? దీనికి కారణమేమనగా, శరీర దేశమునందు ఆత్మ యొక్క ఉనికిని గుర్తించవచ్చును (ఉపలబ్ధి స్థానమ్). సాధారణంగా దేహము కర్మను చేయుచుండగా, ఆత్మయే కర్మను చేయుచున్నదని మనము భావించెదము. ఇది భ్రాంతి యని మనము పరిశీలించి యున్నాము. ఆత్మ అకర్త. ఆత్మ సన్నిధిలో సర్వక్రియలు జరుగుచున్ననూ, క్రియాలేశమైననూ ఆత్మ యందు కేంద్రితమై లేదు. ఈ తీరున, ఆత్మ దేహములో ఉపలభ్యమగు చున్ననూ, కర్మలను వేటినీ చేయదు.

ఆత్మ అకర్త గనుక, కర్మఫలముచే ప్రభావితముగాదు (న లిప్యతే). ఆత్మ కర్మఫలములనన్నింటినీ ప్రకాశింపజేయుచూ అసంగముగా నుండును. కామన ఉదయించు చుండగా, ఆత్మ దానిని ప్రకాశింపజేయును. కాని ఆత్మకు స్వీయకామనలు లేవు. కామనా పరిపూర్తికై ఉపాధి తన వశములో నున్న వివిధ సాధనములతో కర్మల నారంభించును. ఆత్మ వాటిని ప్రకాశింప జేయును. ఫలము సంప్రాప్తమైనప్పుడు, అది అభిలషితము అయినా కాక పోయినా, ఆత్మ దానిచే లేశమైననూ ప్రభావితము గాకుండా, దానిని ప్రకాశింప జేయును.

శ్రీశంకరులిచట ఒక సూత్రమును ఉద్ఘాటించినారు. కర్మను ఎవరు చేస్తే, వారే దాని ఫలమును పొందెదరు. 'నేను కర్తను' అని నీవు భావించినచో, నీ కర్మలకు నీవు బాధ్యుడవగుదువు. నీకు పుణ్యపాపములు, సుఖదుఃఖములు, పూర్తి సంసారము తప్పవు. అనగా కర్తయే భోక్తయగును. ఏ విత్తును పాతితే ఆ ఫలము లభించును. ఆత్మ కర్త కాదన్నచో, కర్త యెవరు? అను ప్రశ్న తలయెత్తును. ఈ ఆత్మ అకర్తయై ఉండగా, కర్మలను చేయు ఆత్మ మరియొకటి గలదా? అట్టి స్థితిలో రెండు ఆత్మలుండుటచే, ద్వైతము సంప్రాప్తమగును. దీనిలో ఒక సమస్య గలదు. సర్వక్షేత్రములలోని క్షేత్రజ్ఞుడను నేను అని తెలుసుకో (క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వ క్షేత్రేషు భారత). బ్రహ్మ ఏకము; రెండవ వస్తువు లేదు (ఏకమేవ అద్వితీయం బ్రహ్మ). ఈ సర్వము ఆత్మయే (యదా ఇదం సర్వం అయం ఆత్మా). ఈ సర్వము నిశ్చయముగా బ్రహ్మయే (సర్వం ఖల్విదం బ్రహ్మ) ఇత్యాది వాక్యములు అర్థరహితములగును. అంతే గాక, నీవు రెండవ ఆత్మ గలదని ఎట్లు నిర్ధారించెదవు? చూచే ఆత్మ, చేసే ఆత్మ వేర్వేరుగా నున్నచో, ఈ 'నేను'ను

దేనియందు నిక్షేపించెదవు? కర్త నీకు తెలియునా? తెలియదా? తెలియని పక్షంలో 'నేను కర్తను' అని ఎట్లు చెప్పగలవు? తెలిసే పక్షంలో 'కర్త నేను' అని ఎట్లు చెప్పగలవు? నాచే తెలియబడేది నా కంటె భిన్నముగా నుండును. ఒకే ఒక ఆత్మ గలదు. 'నేను' అను ప్రత్యయమునకు ఆలంబనము చైతన్యము తక్క మరియొకటి కాజాలదు.

'నేను కర్తను, నేను భోక్తను' అనే అనుభవము మనకు గలదు. కర్మలను చేయువాడే కర్మఫలములననుభవించునని శాస్త్రము ధ్రువీకరించుచున్నది. కాని కర్మలను వేటినీ ఆత్మ చేయుట లేదు. కాని ఎవరో ఒకరు చేయు చున్నారు గదా! కర్మానుష్ఠానము ప్రకృతిస్వభావమని భగవానుడు స్వయముగా చెప్పియున్నాడు (స్వభావస్తు ప్రవర్తతే). ఆత్మానుగ్రహముచే చైతన్యము బుద్ధి యందు ప్రతిఫలించును. చైతన్య విశిష్టమగు ప్రకృతి (బుద్ధి) కామన గల జీవుని రూపమును దాల్చి కర్త యగును. కావున, కర్తృత్వము అంతఃకరణమునకు చెందునని స్పష్టమగు చున్నది. కాని మానవుడు అజ్ఞానముచే 'నేను చేయుచున్నాను' అని చెప్పును. కర్తృత్వ భోక్తృత్వములు అజ్ఞాని యందు మాత్రమే గలవు; ఆత్మ యందు కాదు.

ఆత్మ అకర్తయని యెరింగిన జ్ఞాని తాను కర్మలనేమియు చేయుట లేదనియు, కాని జ్ఞానేంద్రియములు, మనస్సు, కర్మేంద్రియములు అన్నీ తమ తమ పనులను చేయుచున్నవనియు దర్శించును. కాని అజ్ఞాని విషయములో అవి మరియు వాటి వ్యాపారములు ఆత్మ యందు అధ్యస్తము చేయబడును. అజ్ఞాని తానే కర్తనని తలపోసి, ఫలముచే ప్రభావితుడగును. వాస్తవములో ఒకే ఒక పరమాత్మ గలడు. ఆయన యందు కర్మ లేదు.

ఈ ఉపదేశము యొక్క తాత్పర్యమును తెలుసుకొని, దీనియందు నిష్ఠ గల జ్ఞానులకు ఆత్మ కర్త, భోక్త అనే ధారణలు ఉండవు గాన, వారికి కర్మాధికారము లేదు. వేదము కర్మను అజ్ఞాని కొరకు మాత్రమే విధించుచున్నది; ఆత్మ అకర్తయని ఎరింగిన జ్ఞాని కొరకు గాదు. కర్మలను చేస్తూనే ఉన్నా, తాను కర్మలను వేటినీ చేయుట లేదని జ్ఞాని యెరుంగును. 'చేస్తూనే ఉన్నా చేయుట లేదు; చూస్తూ చూచుట లేదు; వింటూ వినుట లేదు (కుర్వన్నపి న కరోతి పశ్యన్ న పశ్యతి శృణ్వన్ న శృణోతి)'. ఆత్మ అకర్తయను సత్యమును గుర్తించిన జ్ఞానికి ఇట్టి కర్మల ఫలములు అంటు కొనవు.

జ్ఞాని కర్మలను చేయకుండుట ఎట్లు పొసగును? అతడు వాటి లేపమును పొందకుండుట యెట్లు? అను విషయమును తరువాతి శ్లోకము దృష్టాంత పూర్వకముగా వివరించుచున్నది.

అధ్యాయము 13, శ్లోకము 32 :

यथा सर्वगतं सौक्ष्म्यादाकाशं नोपलिप्यते ।
सर्वत्रावस्थितो देहे तथात्मा नोपलिप्यते ॥ ३२ ॥

యథా సర్వగతం సౌక్ష్మ్యదాకాశం నోపలిప్యతే
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే (32).

యథా = ఏ విధముగా, సర్వగతమ్ = సర్వవ్యాపకమగు, ఆకాశమ్ = ఆకాశము, సౌక్ష్మ్యత్ = సూక్ష్మము అగుట వలన, న ఉపలిప్యతే = లేపమును పొందుట లేదో, తథా = అదే విధముగా, దేహే = దేహమునందు, సర్వత్ర = అన్ని అవస్థలలో, అవస్థితః =స్థిరముగా నెలకొని యున్న, ఆత్మా = ఆత్మ, న ఉపలిప్యతే = లేపమును పొందుట లేదు.

ఏ విధముగానైతే సర్వవ్యాపకమగు ఆకాశము సూక్ష్మము అగుట వలన లేపములను పొందుట లేదో, అదే విధముగా దేహమునందలి అవస్థలన్నిటి యందు నెలకొనియున్న ఆత్మ లేపమును పొందుట లేదు (32).

ఆకాశము సూక్ష్మమైనది. అనగా దానికి రూపము గాని, అవయవములు గాని, గుణములు గాని లేవు. దాని యందు జరిగే వివిధ ఘటనలచే అది లేపమును పొందదు. గోడలను కట్టినా, తుక్కును పోసినా ఆకాశము కళంకితము కాదు. రూపము లేని ఈ ఆకాశము సర్వవ్యాపకము కూడా. అదే విధముగా, అన్ని అవస్థలలో దేహము నందు ఉపలభ్యమయ్యే ఆత్మ లేపమును పొందదు (unaffected). ఉల్లాసము, దుఃఖము, కామన, ద్వేషము, క్రోధము, నిరాశ ఇత్యాది అవస్థలన్నింటి యందు ఉపలభ్యమయ్యే ఆత్మ వాటికి క్షణమైననూ దూరము కాకున్ననూ, నిర్లిప్తముగ మిగిలియుండును. ఆత్మసాక్షాత్కారము కొరకై మనస్సు ప్రశాంతముగ నుండబని లేదు. వృత్తులను నిరోధించనక్కరలేదు. ఆత్మ అన్ని అవస్థలలో ఉపలభ్యమగును. కాని లేశమైననూ లేపమును పొందదు. నీ మనస్సులో ఎట్టి ఆలోచన ఉన్ననూ, దాని ప్రభావము ఆత్మపై పడదు. కావున ఉపాధిలో ఎన్ని రకముల మార్పులు వచ్చుచున్ననూ, నాపై వాటి ప్రభావమేమియు ఉండదు. ఒకే ఆత్మ సర్వక్షేత్రములను ప్రకాశింప జేయు తీరును వివరించే దృష్టాంతమును భగవానుడు తరువాతి శ్లోకములో నిచ్చుచున్నాడు.

అధ్యాయము 13, శ్లోకము 33 :

यथा प्रकाशयत्येकः कृत्स्नं लोकमिमं रविः ।
क्षेत्रं क्षेत्री तथा कृत्स्नं प्रकाशयति भारत॥ ३३ ॥

యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత (33).

యథా = ఏ విధముగా నైతే, ఏకః = ఒక, రవిః =సూర్యుడు, ఇమమ్ = ఈ, కృత్స్నమ్ = సమస్తమైన, లోకమ్ = లోకమును, ప్రకాశయతి = ప్రకాశింప జేయు చున్నాడో, తథా =అదే విధముగా, భారత = ఓ అర్జునా!, క్షేత్రీ = క్షేత్రజ్ఞుడు, కృత్స్నమ్ = సమస్తమగు, క్షేత్రమ్ = క్షేత్రమును, ప్రకాశయతి = ప్రకాశింప జేయుచున్నాడు.

ఓ అర్జునా! ఏ విధముగానైతే ఒక సూర్యుడు ఈ లోకమునంతనూ ప్రకాశింప జేయుచున్నాడో, అదే విధముగా క్షేత్రజ్ఞుడు క్షేత్రమునంతనూ ప్రకాశింప జేయుచున్నాడు (33).

గ్రహమండలమునంతనూ ఒకే సూర్యుడు ప్రకాశింప జేయు చున్నాడు. అదే విధముగా, క్షేత్రమునందు ఉపలభ్యమయ్యే క్షేత్రి క్షేత్రమునంతనూ ప్రకాశింప జేయుచున్నాడు. క్షేత్రి యనగా ఆత్మయే. ఆత్మకు ఈ దేహమే ఒక క్షేత్రము. దేహేంద్రియ మనస్సంఘాతము మరియు సమస్త సృష్టి క్షేత్రము అగును. ఈ క్షేత్రము నంతనూ ప్రకాశింప జేయు ప్రత్యగాత్మయే పరమాత్మ. దీనినంతను ఒకే ఆత్మ ప్రకాశింప జేయుచున్నది. మనము క్షేత్రమును చూచి రెండవ ఆత్మయని భ్రమపడు చున్నాము. మనము ఇంకో వ్యక్తిని లెక్కించే సందర్భములో, వాస్తవంగా లెక్కించేది దేనిని? దేహమును మాత్రమే. ఆత్మను కాదు. ఒకే ఆత్మ ఈ నా దేహమును మాత్రమే గాక, ఇతరుల దేహములను కూడ ప్రకాశింప జేయుచున్నది. మరియు నా మనస్సు నాచే తెలియబడుచున్నది గనుక, అది కూడ క్షేత్రమే యగును. ఇతర వ్యక్తి యొక్క మనస్సును కూడ నేను తెలుసుకొనుచున్నాను గనుక, అది కూడ క్షేత్రమే. మనము మరియొక చైతన్యమును ఇంకో వస్తువు రూపములో దర్శించే (objectify) ప్రసక్తి లేదు. ఏలయన, విషయరూపముగా దర్శించబడే సర్వము చైతన్యములో విషయమగును. దీనికి భిన్నముగా, విషయములను దర్శించే చేతనపురుషుడు సర్వదా విషయి (subject) అగును. నీకు, ఇతర వ్యక్తికి మధ్యలో గల భేదమును నిరూపించగోరుచున్నావా? నీ దేహమునకు, అతని దేహమునకు మధ్యలో దేశ (space) కృ

తభేదము నిశ్చియముగా గలదు. మరియు మీరిద్దరు ఆ దేశమును విషయరూపములో దర్శించు చున్నారు. ఇంకా ఖచ్చితంగా చెప్పాలంటే, చైతన్యము నందు దేహము విషయరూపముగా ప్రకాశించుచున్నది. ఈ తీరున చైతన్యములో దేశము విషయమగుచుండగా, చైతన్యము నందు దేశము విభాగమును కలిగించుట ఎట్లు సంభవమగును? దేశకృత విభాగములన్నియు దేశాంతర్గతములై యుండును. కాని చైతన్యము దేశములో లేదు. పైగా అదియే దేశమునకు అధిష్ఠానమగుచున్నది.

మనస్సు కూడా దేశ-కాలముల పరిధి లోననే యున్నది. ఆలోచన లేనిదే మనస్సు లేదు. ఆలోచనలన్నింటి యొక్క సారస్వరూపము జ్ఞప్తి (awareness). జ్ఞప్తి లేనిదే ఆలోచనలు లేవు. మరియు పంచభూతములు కూడా అదే చైతన్య-ఆత్మ నుండి ఉదయించి, దాని చేతనే తెలియబడుచున్నవి. రెండవ చైతన్యము లేదు (ఏకం చైతన్యమ్). నీకు సందేహమున్నచో, కన్నులను మూసుకొని లోపల ఎన్ని చైతన్యములున్నవో పరిశీలించుము. నీవు దేనిని తలపోసిననూ అది చైతన్యములో విషయము అగును. కావున ఒకే ఒక జ్ఞప్తి (awareness) గలదు. మనచే ఈ క్షణములో కానవచ్చే ఈ జగత్తునంతనూ సూర్యుడు ప్రకాశింపజేసినటుల, క్షేత్రము నందు నివసించు వాడు సర్వక్షేత్రమును, స్థూలసూక్ష్మ భూతములను, తెలియబడే దానిని మరియు తెలియబడని దానిని ప్రకాశింపజేయుచున్నాడు. ఒకే స్వయం-ప్రకాశ-సూర్యుడు గలడు. అటులనే ఒకే ఒక స్వయం-ప్రకాశ-ఆత్మ గలదు. మరియు, అది దేనిని ప్రకాశింప జేయునో, దానితో లేపమును పొందదు. సూర్యునకు గీతను ప్రకాశింపజేయుటచే ఉన్నతి, అశ్లీల పుస్తకమును ప్రకాశింపజేయుటచే అవనతి లేదు. అదే విధముగా, ఆత్మ దేనిని ప్రకాశింప జేసిననూ, దానితో ఏ విధమైన లేపమునైననూ పొందదు. ఆత్మ దృశ్యము కాదు గనుక, ఈ సృష్టిలో ఏదైననూ ఆత్మను ప్రభావితము చేయ జాలదు. ఇతరమునకు విషయము అగు వస్తువు మాత్రమే ఇతరముచే ప్రభావితమగును. ఆత్మ సర్వమును ప్రకాశింప జేయును. ఆత్మను ఇతరము ఏదియు ప్రకాశింప జేయదు. ఆత్మను ఇతరము ఏదియు స్పృశించ జాలదు.

ఈ అధ్యాయములో నిరూపించబడిన జ్ఞానమంతయు సారరూపముగా ఈ అంతిమ శ్లోకములో సంగ్రహించబడు చున్నది.

**అధ్యాయము 13, శ్లోకము 34 :**

क्षेत्र क्षेत्रज्ञयोरेवमंतरं ज्ञानचक्षुषा ।
भूत प्रकृतिमोक्षं च ये विदुर्यांति ते परम् ॥ ३४ ॥

క్షేత్ర క్షేత్రజ్ఞయోరేవమంతరం జ్ఞానచక్షుషా
భూత ప్రకృతిమోక్షం చ యే విదుర్యాంతి తే పరమ్ (34).

యే = ఎవరైతే, జ్ఞానచక్షుషా = జ్ఞానము అనే నేత్రముతో, ఏవమ్ = ఈ తీరున, క్షేత్రక్షేత్రజ్ఞయోః = క్షేత్ర క్షేత్రజ్ఞుల మధ్య గల, అంతరమ్ = భేదమును, చ = మరియు, భూత ప్రకృతి మోక్షమ్ = భూతములకు కారణమగు ప్రకృతి నుండి విముక్తిని, విదుః = తెలుసుకొను చున్నారో, తే = వారు, పరమ్ = పరమగతిని, యాంతి = పొందెదరు.

ఎవరైతే జ్ఞానము అనే నేత్రముతో ఈ తీరున క్షేత్ర-క్షేత్రజ్ఞుల మధ్య గల
భేదమును మరియు భూతములకు కారణమగు ప్రకృతి నుండి విముక్తిని
తెలుసుకొనుచున్నారో, వారు పరమగతిని పొందెదరు (34).

ఇంతవరకు వివరించిన విధముగా క్షేత్ర-క్షేత్రజ్ఞుల మధ్యగల విభాగమును తెలుసుకొనవలెను. ప్రపంచము క్షేత్రమనియు, తాను దానిని తెలుసుకొనే క్షేత్రజ్ఞుడననియు ప్రతి మానవునకు తెలియును. కాని ప్రముఖ విషయమేమనగా, ఈ వివేకము చాలదు. 'నేను క్షేత్రజ్ఞుడను' అని మనము అన్నప్పుడు, ఆ 'నేను' సర్వ క్షేత్రములలో సమానముగా నున్నదని నిరూపించబడినది. పూర్ణము, సర్వజగత్కారణము, సర్వమును ప్రకాశింప జేయునది, సర్వము నుండి వివిక్తమై అసంగముగా నుండునది అగు ఆత్మ వరకు ఆ 'నేను' పయనించవలెను.

దేనితో తెలియవలెను? జ్ఞానమనే కన్నుతో (జ్ఞానచక్షుషా). మనము ఒక వస్తువును కంటితో చూచినచో, అది పూర్ణప్రత్యక్షముగా పరిగణింపబడును గాన, భగవానుడు జ్ఞానమును కంటితో పోల్చినాడు. న్యాయస్థానములోని వ్యాజ్యెములలో ప్రత్యక్ష సాక్షి యొక్క సాక్ష్యము నిర్ణాయకమగును. జ్ఞానచక్షుః అనగా ఆత్మ స్వరూపమును గుర్తింపజేసే ప్రత్యయము (cognition) అని శ్రీశంకరులు నిర్వచించిరి. అది ఎట్లు సంభవించును? ఉపదేశము వలన, శాస్త్రాచార్య కృప వలన ఆ ప్రత్యయము పుట్టునని శ్రీ శంకరులు చెప్పిరి. ఆచార్యుని ద్వారా శాస్త్రము ప్రమాణమై తద్ద్వారా ఆత్మ యొక్క అపరోక్ష జ్ఞానము కలుగును. గురుశిష్యుల సమాగమమునకు ఈశ్వరకృప ఆవశ్యకమగును. శాస్త్రవచనముల తాత్పర్యమును తెలియు సామర్థ్యము ఈ కృప వల వలన సిద్ధించును. ఆ జ్ఞానము మాత్రమే జ్ఞాననేత్రము అనబడును. ఇచట నేత్రము జ్ఞానమునకు చక్కని దృష్టాంతము. ఏలయన, తిమిరదోషము (cataract) కంటిని వలె, అజ్ఞానము

బుద్ధిని కప్పివేయును. జ్ఞాననేత్రమును తెరుచుట యనగా అజ్ఞాన-ఆవరణను తొలగించి, తద్ద్వారా వ్యక్తియొక్క దర్శనమును, తాత్పర్య నిశ్చయమును నిర్దుష్టము చేయుట అని యర్థము.

ఈ జ్ఞానమును పొందిన వారు సర్వభూతములకు ప్రాణులకు కారణమగు ప్రకృతి నుండి విముక్తులగుదురని చెప్పబడుటచే ఈ జ్ఞానము పరిపూర్ణమని స్పష్టమగు చున్నది. సర్వజీవులకు, మరియు పంచభూతములకు కారణము ప్రకృతి. మాయ, అవిద్య, ప్రకృతి అనునవి సమానార్థక పదములు. జీవుడు పునఃపునః జన్మలనెత్తుటకు కారణము అవిద్య. అనగా, సృష్టి అంతయు ప్రళయములో విలీనమైననూ, జీవుల కర్మలన్నియు బీజరూపములో నుండుటచే, సంసారము నుండి విముక్తి లేదు. జ్ఞానముచే మాత్రమే విముక్తి సాధ్యమగును. క్షేత్ర-క్షేత్రజ్ఞ-వివేక-జ్ఞానము మానవుని సర్వ సృష్టికి కారణమగు ప్రకృతి యొక్క బంధము నుండి విముక్తుని చేయును.

ఈ జ్ఞానము గలవారు పునరావృత్తిరహితమగు పరమపదమును పొందెదరు. సాధారణముగా, మనము ఎచటకు వెళ్లిననూ, వెనుకకు మరలి వచ్చెదము; లేదా, ముందుకు సాగెదము. కాని, పరమమనగా వెనుకకు వచ్చుట గాని, ముందుకు సాగుట గాని లేనిది. ఇది జ్ఞాన రూపముగా మాత్రమే సంభవమగును. తాను క్షేత్రజ్ఞుడననియు, క్షేత్రము తనకంటె భిన్నముగా లేదనియు ఎరింగిన జ్ఞానికి పునరావృత్తి ప్రసక్తి లేదు. అతనికి పునర్జన్మ లేదు. అతడు జీవన్ముక్తుడు. మనము కోరేది అదియే. అతనికి పునరావృత్తి లేదు. అనగా, ఇతరుల దృష్టికోణములో అతడు ఈశ్వర స్వరూపుడు; స్వీయ దృష్టికోణములో కేవల పరబ్రహ్మ. అతడు ఏది కావాలని కోరినాడో, అది అయి ఉన్నాడు.

భగవానునిచే బోధించబడిన ఆత్మ విద్య, ఉపనిషత్సమ్మితము, బ్రహ్మవిద్య విషయవస్తువుగా గలది, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అగు భగవద్గీతలో క్షేత్ర-క్షేత్రజ్ఞ (ప్రకృతి-పురుష) వివేకము విషయవస్తువు (యోగ)గా గల పదమూడవ అధ్యాయము ముగిసినది.

శ్రీ కృష్ణార్పణమస్తు.

# పదునాల్గవ అధ్యాయము

## గుణత్రయ విభాగ యోగము

పదునాల్గవ అధ్యాయము మూడు గుణములను, మరియు గుణాతీత స్థితి (మోక్షము)ని వర్ణించును. ఈ అధ్యాయమునకు ఉపక్రమములో శ్రీ శంకరులు సర్వము క్షేత్ర-క్షేత్రజ్ఞ సంయోగము వలన సృష్టింపబడు చున్నదని గుర్తు చేసిరి. ఈ సంయోగము సృష్టికి ఎట్లు హేతువు అగుచున్నది? అను విషయమును ప్రదర్శించుటకై భగవానుడీ 14వ అధ్యాయము నారంభించు చున్నాడు. ఈ అధ్యాయమునకు సంగతి (connection) ని మరియొక విధముగా చెప్ప వచ్చును. పదమూడవ అధ్యాయములో విశేషించి 21 వ శ్లోకములో తలయెత్తిన కొన్ని ప్రశ్నలకు బదులిడుటకై ఈ అధ్యాయము ఆరంభింపబడు చున్నదని శ్రీ శంకరులు చెప్పిరి. క్షేత్ర-క్షేత్రజ్ఞ సంయోగము సృష్టి హేతువని అచట చెప్పబడినది. స్వతంత్రమగు ప్రకృతి సృష్టికి కారణమనియు, పురుషులు అనేకులు, పరస్పర భిన్నులు మరియు అసంగులు అనియు సాంఖ్యులు చెప్పెదరు. పురుషుడు అసంగుడే అయినా, ప్రకృతికి దూరముగా లేడనియు, సర్వదా ప్రకృతిలో ఉపలభ్యుడగు చున్నాడనియు మనము అనుకున్నాము. పురుషునకు అవిద్యచే త్రిగుణాత్మక ప్రకృతితో సంబంధము భాసిల్లి, వివిధ రకముల జన్మలతో గూడియున్న సంసారమునకంతకూ కారణమగు చున్నది. ఈ గుణములనగా నేమి? అవి ఎట్లు బంధించును? మనము వాటి నుండి విముక్తిని పొందుట యెట్లు? ముక్తపురుషుని లక్షణములేవి? అను ప్రశ్నలను శ్రీశంకరులిచట ప్రస్తావించిరి. ఇవియే ఈ 14వ అధ్యాయమునకు విషయవస్తువు అగుచున్నవి.

**అధ్యాయము 14, శ్లోకము 1 :**

श्रीभगवानुवाच ।
परं भूयः प्रवक्ष्यामि ज्ञानानां ज्ञानमुत्तमम् ।
यद् ज्ञात्वा मुनयस्सर्वे परां सिध्दिमितो गताः ॥ १ ॥

శ్రీ భగవానువాచ
పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్
యద్ జ్ఞాత్వా మునయ స్సర్వే పరాం సిద్ధిమితో గతాః (1).

శ్రీ భగవాన్ = శ్రీ భగవానుడు, ఉవాచ = పలికెను, జ్ఞానానామ్ = జ్ఞానములలో,

ఉత్తమమ్ = శ్రేష్ఠమైన, పరమ్ = అంతిమమగు, జ్ఞానమ్ = జ్ఞానమును, భూయః = మరల, ప్రవక్ష్యామి = స్పష్టముగా చెప్పగలను, సర్వే = అందరు, మునయః = మునులు, యత్ = దేనిని, జ్ఞాత్వా = తెలుసుకొని, ఇతః = ఈ దేహము నుండి, పరాం సిద్ధిమ్ = అంతిమ విజయ మనదగిన మోక్షమును, గతాః = పొంది యున్నారో.

శ్రీ భగవానుడిట్లు పలికెను-

> జ్ఞానములలో శ్రేష్ఠమైన పరమ జ్ఞానమును నీకు మరల స్పష్టముగా చెప్పగలను. మునులందరు దీనిని తెలుసుకొని ఈ దేహమునుండి అంతిమ విజయమనదగిన మోక్షమును పొందియున్నారు (1).

నేను నీకు మరల బోధించెదనని భగవానుడిచట చెప్పుచున్నాడు. అనగా ఇంతకు ముందు చెప్పిన దానిని పునరావృత్తి చేయుట మాత్రమే గాక, దానిని ఇంకనూ వివరించి చెప్పగలడు. సత్యదర్శనమును భగవానుడు గడచిన అధ్యాయములో రెండు మూడు పర్యాయములు బోధించియే యున్నాడు. అయిననూ మరల వక్కాణించెదనని భగవానుడు అర్జునుని సావధానుని చేయుచున్నాడు.

వివిధ రకముల విజ్ఞానములలో ఇది సర్వోత్తమమైనది. ఈ ఉత్కృష్టతకు పవిత్రత మాత్రమే కారణము కాదు. సర్వవిధముల జ్ఞానము భగవత్స్వరూపమే గనుక పవిత్రమే యగును. ఒక విజ్ఞాన శాఖ మరియొక దానికంటె గొప్పది యని మనము తలంచము. కాని బ్రహ్మ విద్య ఉత్తమమైనది. ఏలయన, దాని వలన లభించే మోక్షఫలము మానవునకు అభీష్టతమమైనది, మరియు సర్వాధికముగా అభిలషింపబడునది. దానిలోని విషయవస్తువు అనంత బ్రహ్మ (పరం బ్రహ్మ) గనుక, అది సర్వోత్కృష్ట మగుచున్నది (పరం జ్ఞానమ్). వివిధ రకముల జ్ఞానములు గలవు. కాని ఇది మాత్రమే పరమ జ్ఞానము. ఇతరము సర్వము అపర జ్ఞానము. దానిని మనము త్రోసివుచ్చుట లేదు. ఏలయన, పరజ్ఞానమును పొందుటకు అపర జ్ఞానము అవశ్యకమగును. ఒక స్థాయికి చెందిన బౌద్ధిక అనుశాసనము, మరియు కొన్ని మౌలికమగు మానస ప్రవృత్తులు లేనిదే పరజ్ఞానము లభించుట అసంభవము. మతపరమైన క్రియాకలాపములు అపర జ్ఞానాంతర్గతములే అయినా, సాధకుని పరజ్ఞాన యోగ్యునిగా తీర్చిదిద్దుటలో వాటి సహయోగము చాల ప్రయోజనకారి యగును. ఏలయన, పరజ్ఞానమనగా ఈశ్వరుని యథార్థ స్వరూపము నెరింగించు జ్ఞానమే గదా! ఈశ్వరుని వైపు మనస్సును మళ్లించి ఈశ్వరుని కృప కొరకు చేయు

ప్రార్థన మాత్రమే ఈ సాధనలో సహాయకారి యగును. అపర జ్ఞానమునకు ఆ పేరును పెట్టుటకు రెండు కారణములు గలవు. ఒకటి దాని విషయవస్తువు. దానికి అంతు దరి లేకుండుట రెండవది. రసాయన శాస్త్రము, మనో విజ్ఞాన శాస్త్రము, భాషాశాస్త్రము మొదలగు వాటి అధ్యయనమును అనంతముగా సాగించవచ్చును. పరజ్ఞానమునకు మాత్రమే అంతము గలదు. ఏలయన, అది పూర్ణతత్త్వము యొక్క జ్ఞానము. దానిని తెలిసిన పిదప తెలియదగిన సత్యజ్ఞానము మిగిలి యుండదు. సత్య సాక్షాత్కారము దాని పరాకాష్ఠ. అపర జ్ఞానములో ఆఖరి మెట్టు అనేది సంభవము కాదు.

శ్రోత యందు అభిరుచిని, ఉత్సాహమును కలిగించుట కొరకై శ్రీకృష్ణుడీ జ్ఞానమును పరమ్, ఉత్తమమ్ అనే రెండు పదములతో స్తుతించెను. అర్జునుడు వినుచునే యుండెను. కాని గడిచిన పదమూడు అధ్యాయములలో చెప్పిన విషయమును భగవానుడిప్పుడు మరల చెప్పబోవు చున్నాడు. అర్జునుడు నిరంతర సావధానతతో వినాలని భగవానుడీ జ్ఞానమును స్తుతించు చున్నాడు.

ఆలోచించే సామర్థ్యము గల వ్యక్తి (మనన శీలః) ముని యనబడును. ఆయా తరములలో వసిష్ఠుడు మొదలగు అనేకమునులు ఉండెడివారు. ఈ మహర్షులందురు పరమసిద్ధిని పొందిన వారే (పరాం సిద్ధిం గతాః). ఇచట సిద్ధి యనగా మోక్షము. ముచ్ ధాతువు నుండి మోక్షము అను శబ్దము పుట్టినది. 'బంధము నుండి విడుదల' అని దాని యర్థము. ఈ శబ్దము ప్రయోగించ బడిన సందర్భములలో, 'విడుదల లభించే ఆ బంధము ఏది?' అను విషయమును మనము పరిశీలించవలెను. అజ్ఞానము, ఆ అజ్ఞానము నుండి పుట్టే కామన, ఆ కామనను పరిపూర్తి చేసుకొనుటకు చేసే కర్మ, దాని వలన లభించిన ఈ దేహము అను వాటి బంధము నుండి జ్ఞానులు విముక్తిని పొందెదరని శ్రీశంకరులు వివరించిరి. ఇట్టి విడుదల సిద్ధి యనబడును. ఇది గొప్ప ఉపలబ్ధి అనుటలో సందేహము లేదు. ఇతర ఘనతలన్నియు ఏదో ఒక నాడు దూరము కాక తప్పదు. ఏలయన, నావద్ద నాకంటె భిన్నముగా నున్న వస్తువు ఏదో ఒకనాడు నా నుండి దూరమగును. ఒకనాడు దేహము కూడ దూరమగును. అట్టి స్థితిలో దేహమునకు సంబంధించిన ఇతర వస్తువులను సురక్షితముగా ఉంచుకొనే ప్రసక్తి యెక్కడిది? మనము ఏ లక్ష్యము/గమ్యమును చేరినా, దాని నుండి వెనుకకు మరలి వచ్చుట గాని, లేదా దానిని దాటి ముందుకు పోవుట గాని తథ్యము. కాని మోక్షమనగా పొందబడే లక్ష్యము గాని, చేరుకొనే గమ్యము గాని కాదు. కావున, అది అంతము లేని లక్ష్యము (గతిః); తొలగిపోని గమ్యము. మోక్షము నిత్యసిద్ధమగు సత్యము.

తరువాతి శ్లోకములో భగవానుడు ఈ జ్ఞానము యొక్క పూర్ణత్వమును గురించి చెప్పుచున్నాడు:

**అధ్యాయము 14, శ్లోకము 2:**

इदं ज्ञानमुपाश्रित्य मम साधर्म्यमागताः ।
सर्गेऽपि नोप जायंते प्रलये न व्यथंति च ॥ २ ॥

ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః
సర్గేపి నోప జాయంతే ప్రలయే న వ్యథంతి చ (2).

ఇదమ్ = ఈ, జ్ఞానమ్ = జ్ఞానమును, ఉపాశ్రిత్య = తమ స్వంతము చేసుకొని, మమ = నా యొక్క, సాధర్మ్యమ్ = స్వరూపమును, ఆగతాః = పొందినవారు, సర్గే అపి = మరల జగత్తు సృజింపబడిననూ, న ఉప జాయంతే = వారు జన్మించరు, చ = మరియు, ప్రలయే = ప్రళయమునందు, న వ్యథంతి = వినాశమును పొందరు.

ఈ జ్ఞానమును తమ స్వంతము చేసుకొనిన వారు నా స్వరూపము నందు లీన మగుదురు. మరల సృష్ట్యాదియందు వారు జన్మించరు; ప్రలయములో వినాశమును పొందరు (2).

ఈ జ్ఞానమును శరణు పొందవలెను. అనగా జ్ఞానమును పొందుటకై శ్రవణమును చేయవలెను. అనగా శాస్త్రమును వినవలెను. విశ్లేషణ (మననము), మనస్సులో భావన చేయుట (నిదిధ్యాసనము) అనునవి శ్రవణమునకు సహకరించును. ఈ సాధనముల నాశ్రయించి మహర్షులీ జ్ఞానమును పొంది యున్నారు. భగవానుడీ జ్ఞాన స్వరూపమును 'మమ సాధర్మ్యమ్' అని వర్ణించినాడు.

మమ సాధర్మ్యమ్ అనగా నా స్వరూపము. ఆత్మ పరమేశ్వరుని కంటె భిన్నము కాదని వారు గుర్తించినారు. సాధర్మ్యమనగా సమానమగు ధర్మములను కలిగియుండే స్థితి (సమాన ధర్మతా) కాదని శ్రీశంకరులు టిప్పణిని వ్రాసిరి. జ్ఞాని భగవానుని ఐశ్వర్యములో కొంత భాగమును పొందునని కొందరు వ్యాఖ్యానించెదరు. కాని అది సరి గాదు. ఈ వాదము ననుసరించు వారిలో ప్రముఖులగు శ్రీ రామానుజాలు శ్రీశంకరుల కంటె తరువాతి కాలములో

వారు. ఈ వాదము శ్రీశంకరుల కాలములో గూడ నుండెనని స్పష్టమగు చున్నది. శ్రీశంకరుల ఈ టిప్పణి చాల ఉపయుక్తమైనది. గీతలో సర్వత్రా క్షేత్ర-క్షేత్రజ్ఞుల అభేదము ప్రదర్శించబడినది. భేదలేశమైననూ స్వీకార్యము కాదు. కావున సాధర్మ్య మనగా సమానమగు గుణములను కలిగి యుండుట కాదు. సాధర్మ్యమనగా భగవానుని సత్య-జ్ఞాన-అనంత స్వరూపమే. జ్ఞానులు తమకు ఈశ్వరునితో గల అభేదమును గుర్తించెదరు. ఈ ఫలవర్ణనము జ్ఞానస్తుతి కొరకు ఉద్దేశింప బడినది.

మరియు, సృష్టి సమయములోనైననూ వారికి పుట్టుక లేదు (సర్గేऽపి న ఉపజాయంతే). అసంఖ్యాకములగు ప్రాణులు ఈ లోకమును విడిచి వెళ్లినవి. ఆ ప్రాణులు ఇతర స్థానములలో నున్నవై ప్రళయానంతరము వివిధ రూపములలో మరల జన్మించును. సృష్టి ఆవిర్భవించినప్పుడు అధిష్ఠాన దేవతల స్థానములను క్రొత్త జీవులు ఆక్రమించెదరు. కాని ఆత్మ ఈశ్వర-అభిన్నమని గుర్తించిన వారు సృష్టి సమయములోనైననూ జన్మించరు. వారు బ్రహ్మరూపులై యుందురు; వారి యందు ఏదో ఒక రూపమును దాల్చ దగిన జీవుడు మిగిలి లేడు. కావున ప్రళయసమయములో వారు నశించకుండుటయు (ప్రళయే న వ్యథంతి) సహజమే. మహా ప్రళయము సంభవించినప్పుడు బ్రహ్మ గారు కూడ తన పదవిని కోల్పోవును. సర్వసృష్టి అవ్యాకృతావస్థలోనికి విలీనమగును. కాని ఈ మహర్షులు ప్రళయమునందైననూ నశించరు. ఏలయన వారు జీవరూపములో మిగిలి యుండరు. వారు బ్రహ్మయే.

ఇచట ఒక ప్రశ్న ఉదయించును. బహువచనమును ప్రయోగించుటకు కారణమేమి? ఆత్మలు అనేకములు గలవా? ఆత్మ దృష్ట్యా బహుత్వము లేదు. కాని మనము 'మహర్షులు' అను పదముచే బ్రహ్మ సాక్షాత్కారము గల ఉపాధులను నిర్దేశించు చున్నాము. ఆ ఉపాధులకు వసిష్ఠ, జనక, వామదేవాది నామములు గలవు. వారు మరల ఇంకో రూపములో జన్మించబోరు. కావున వారిని మనము ఈ పేర్లతో పిలుచుటను కొనసాగించు చున్నాము. వారు పరమేశ్వరునిలో ఐక్యమైనారు గాన, వారిని ఈశ్వర రూపములో ఆరాధించవచ్చును.

మోక్షమును పొందిన ఈ మహర్షులు తక్క ప్రళయమునకు పూర్వము నందుండిన సర్వము అవ్యాకృత స్థితి నుండి సృష్ట్యాదిలో ప్రకటమగును. వారు సర్వకారణరూపులై నిలిచి యుందురు. సృష్టి అంతయు వారిలో విలీనమగును గనుక ప్రళయములో వారు నశించరు. మోక్షప్రాప్తి యనగా ఒక విశిష్ట ఘటన కాదు. కావున ఒకసారి మోక్షమును పొందిన జీవుడు ఆ మోక్షమును గోల్పోయి మరల జన్మించుట అనే ప్రసక్తి లేదు. అది ఒక విశిష్టమగు అవస్థ

మాత్రమే అయినచో, దాని నుండి చ్యుతి కలుగును. అది జ్ఞానరూపము గనుక, దానికి చ్యుతి లేదు. స్వరూప భూతమగు మోక్షమును ఉపచారార్థము (figurative) లో మాత్రమే 'పొందుట' సంభవమగును.

మొదటి రెండు శ్లోకములలో ఈ జ్ఞానమును స్తుతించిన పిదప భగవానుడిపుడు ప్రకృత-అధ్యాయ-విషయమునారంభిస్తూ, ప్రకృతి గుణములు జీవుని బంధించు విధానమును వర్ణించుచున్నాడు. ముందుగా ఆయన ఈ శ్లోకములో సర్వసృష్టి కారణమును నిరూపించుచున్నాడు.

**అధ్యాయము 14, శ్లోకము 3 :**

मम योनिर्महद् ब्रह्म तस्मिन् गर्भं दधाम्यहम् ।
संभवस्सर्वभूतानां ततो भवति भारत ॥ ३ ॥

మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్
సంభవస్సర్వభూతానాం తతో భవతి భారత (3).

మమ = నా, యోనిః = ప్రకృతి, మహత్ = సర్వ సృష్టికి కారణము, బ్రహ్మ = సకల విస్తారమునకు, ఉనికికి ఆధార భూతమైనది, అహమ్ = నేను, తస్మిన్ = దాని యందు, గర్భమ్ = గర్భమును, దధామి = ఆధానము చేసెదను, భారత = ఓ అర్జునా!, తతః = దానినుండి, సర్వభూతానామ్ = సకల ప్రాణుల, సంభవః = ఉత్పత్తి, భవతి = కలుగు చున్నది.

> నా ప్రకృతి సర్వ జగత్కారణము. సకల విస్తారమునకు, ఉనికికి అదియే ఆలంబనము. నేను దాని యందు గర్భమును ఆధానము చేసెదను. ఓ అర్జునా! దాని నుండియే సర్వ ప్రాణులు ఉదయించు చున్నవి (3).

ఇచట శ్రీకృష్ణ భగవానుడు సృష్టిని మనకు తెలిసిన భాషలో నిరూపించుచున్నాడు. తల్లిదండ్రులున్నచో శిశువు జన్మించును. అదే విధముగా, ఈ సర్వ జగత్సృష్టికి మూలములో ఒక నిమిత్త కారణము, ఒక ఉపాదాన కారణము గలవు. ఉపాదాన కారణమునకు ప్రకృతి, లేక మాయ అని పేరు. తల్లి నుండి శిశువు జన్మించు తీరున, ఈ జగత్తు ప్రకృతి అనే ఉపాదానమునుండి జన్మించును. కాని తండ్రి లేనిదే తల్లి తనంత తానుగా శిశువునకు జన్మను

ఈయజాలదు. అటులనే, ప్రకృతికి నిమిత్తకారణము తోడు గావలెను. శిశువునకు వలెనే జగత్తునకు కూడ రెండు కారణము లావశ్యకమగును.

దేని నుండి సర్వము పుట్టునో, అట్టి ప్రకృతికి యోని యని పేరు. భగవానుడు మమ యోనిః అనుచున్నాడు. అనగా 'నా ఉపాదాన కారణము'. అనగా 'నాకు కారణమైనది' అను కోరాదు. 'నాకు చెందియున్న కారణము' అని ఆయన అభిప్రాయము. సర్వకారణమగు ఈ మాయ పరమేశ్వరుని కంటె భిన్నముగా లేదు. మాయకు స్వతంత్రమగు అస్తిత్వము లేదు. ప్రకృతియే సర్వప్రాణుల స్థూల సూక్ష్మ శరీరములకు కారణమై యున్నది. ఆ ప్రకృతి మహత్ బ్రహ్మ. దేని నుండి సర్వము ఉద్భవించినదో, ఆ మూలకారణము మహత్తు అనబడును. బ్రహ్మ శబ్దమునకు అనేకార్థములు గలవు. ఈ ప్రకరణములో బ్రహ్మ యనగా సత్య-జ్ఞాన-అనంతము కాదు. బ్రహ్మ శబ్దమునకు వృద్ధిని చెందునది, ధరించునది అను వ్యుత్పత్తి-అర్థములు గలవు. సర్వజగద్రూపముగా వృద్ధిని చెందే ఉపాదాన కారణము బ్రహ్మ యనబడును. యోని శబ్దమునకు మహత్, బ్రహ్మ అను రెండు విశేషణములు గలవు. సర్వము దేని నుండి పుట్టినదో, అది మహత్. దేని వలన సర్వము ధరించబడి వృద్ధిని చెందుచున్నదో అది బ్రహ్మ.

ఈ ప్రకృతి గర్భమును దాల్చునట్లు నేను చేసెదను (అహం గర్భం దధామి) అని శ్రీకృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు. అనగా భగవానుడు దానికి ఉనికిని, స్ఫూర్తిని (consciousness) ప్రదానము చేసి దానికి సృజనసామర్థ్యమును కలిగించుచున్నాడు. అందువలననే, మాయ జగత్కారణ మగుచున్నది.

దీనికి సాంఖ్యవాదముతో గల భేదమునెరుంగుట ముఖ్యము. ప్రధానము (ప్రకృతి) సర్వమును స్వయముగా సృజించునని వారు చెప్పెదరు. కాని చేతనాధిష్ఠితమై చేతనాను గృహీతమైన ప్రధానము సృజించునని ఇచట చెప్పబడుచున్నది. మిథ్యాభూతమగు ప్రకృతి పూర్తిగా సత్య-జ్ఞాన-అనంత-బ్రహ్మపై ఆధారపడి యున్నది. మాయ అనే ఉపాధి దృష్టిలో బ్రహ్మ ఈశ్వరుడై సృష్టికి కర్త యగు చున్నాడు. కావుననే, 'నేను ఈ మాయయందు గర్భము నుంచుచున్నాను' అని భగవానుడు చెప్పుచున్నాడు. సృష్ట్యాదిలో సృష్టి ఆరంభమగుటకు ప్రేరకమొకటి ఉండవలెను. ఈ విషయము శ్రుతులలో కూడ చెప్పబడినది. 'ఆ పరబ్రహ్మ సంకల్పించెను (సోऽకామయత)' అని తైత్తిరీయోపనిషత్తు చెప్పుచున్నది. 'అది చూచెను (తద్ ఐక్షత)' అని మరియొక చోట చెప్పబడినది. ఆ సంకల్పము, లేదా దర్శనమే గర్భాధానము.

అది జరిగిన వెంటనే, మాయయందు సర్వజగద్రూపముగా పరిణమించే సామర్థ్యము ఉదయించును.

సర్వప్రాణులతో గూడిన ఈ సమస్త జగత్తు నిశ్చితముగా అదే ఉద్గమస్థానము (source) నుండి ఉద్భవించు చున్నది (తతస్సంభవ స్సర్వభూతానామ్). సర్వ స్థూల దేహములు, సర్వ బ్రహ్మాండములు అచ్చోటి నుండి మాత్రమే ఉదయించుచున్నవి. కావున ఈ జగత్తు అంతయు సృష్ట్యాదియందు పరమేశ్వరుని ప్రకృతి రూపములో నుండెను. అది ఈశ్వరుని కంటె భిన్నముగా నున్నదా? లేదు. పరమేశ్వరుని శక్తియే మాయ. కావున ఉపాదానకారణ దృష్టితో చూస్తే, సృ ష్టి అంతయు పరమేశ్వరుడే యగును. ఒక విశిష్ట రూపము నారాధించే సందర్భములో, ఆరాధ్యమగు దైవము జగత్తునకు నిమిత్తకారణమగును. కాని ఆ భగవానుని ఆరాధించుటకై మనము ఒక విశిష్ట రూపమును వినియోగించు చున్నాము. దానికి ఒక విశిష్ట నామము గలదు. అదియే ఉపాదాన కారణము. దీనిలో తండ్రి పరమేశ్వరుడు; తల్లి మాయ.

సృష్టి కర్త యందలి ఈ పితృ-అంశమును తరువాతి శ్లోకము మరింత వివరించు చున్నది.

**అధ్యాయము 14, శ్లోకము 4 :**

सर्वयोनिषु कौंतेय मूर्तयस्संभवंति याः ।
तासां ब्रह्म महद्योनिरहं बीजप्रदः पिता ॥ ४ ॥

సర్వయోనిషు కౌంతేయ మూర్తయస్సంభవంతి యాః
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజ ప్రదః పితా (4).

**కౌంతేయ = ఓ అర్జునా!, సర్వయోనిషు = సమస్త జీవజాతుల యందు, యాః = ఏ, మూర్తయః = రూపములు, సంభవంతి = పుట్టుచున్నవో, తాసామ్ = వాటి, మహద్యోనిః = ప్రధానకారణము, బ్రహ్మ = ప్రకృతి, బీజప్రదః = బీజమును ఉంచే, పితా = తండ్రిని, అహమ్ = నేను.**

ఓ అర్జునా! సమస్త జీవజాతులయందు ఏయే రూపములు పుట్టుచున్నవో, వాటికి ప్రధానకారణము ప్రకృతి కాగా, బీజమును ఉంచే తండ్రిని నేను (4).

దేవతలు, పితరులు, మనుష్యులు, గ్రామ్య పశువులు, ఆరణ్యపశువులు ఇత్యాది సర్వయోనులలో ఈ ప్రాణులు జన్మించెదరని శ్రీశంకరులు వివరించిరి. మూర్తులనగా దేహేంద్రియ సంఘాతములు. దినదిన ప్రవర్ధమానములగు అవయవములు గలవగుటచే (మూర్ఛితాంగావయవాః) వీటికి ఆ పేరు వచ్చినది. వివిధ యోనులలో జన్మించే ఈ ప్రాణులన్నింటి మూలకారణము (మహద్యోనిః) బ్రహ్మ. సర్వమునకు ఉపాదాన కారణమై సర్వమును ధరించి యుండుటచే దానికి మహత్ (అతి పెద్దది) అను పేరు వచ్చినది. 'అట్లైనచో, నీవెవరివి?' అని ఎవరైననూ ప్రశ్నించినచో, 'నేను గర్భాధానమును చేసిన తండ్రిని (అహం బీజప్రదః పితా)' అని భగవానుడు సమాధానమునిచ్చు చున్నాడు. అయన మాయయందు బీజావాపమును చేసి, సర్వసృజన సామర్థ్యమునిచ్చినాడు. ఆత్మ కంటె భిన్నముగా మాయకు యథార్థమగు అస్తిత్వము లేదు. ఆత్మయే దానికి సత్తాస్ఫూర్తులనొసంగు చున్నది. మాయతో గూడి ఆత్మ సర్వజ్ఞము, సర్వశక్తిమత్ అగు చున్నది. సృష్టిని ఆరంభింపజేసిన సంకల్పమే బీజాధానమనియు, అట్లు చేసినవాడు బీజప్రదుడనియు వర్ణించబడినది. మనకు గల అనుభవములను బట్టి మనకు తెలిసిన భాషలో, సృష్టికారణమగు పరమేశ్వరుడు బీజప్రదాతయగు తండ్రి అనియు, ఉపాదాన కారణమగు ప్రకృతి తల్లి అనియు వర్ణింపబడినది.

ఈ ఉపాదాన కారణము యొక్క గుణములెయ్యవి? అవి ఎట్లు బంధహేతువులగును? అను విషయములను తరువాతి శ్లోకము వివరించుచున్నది.

**అధ్యాయము 14, శ్లోకము 5 :**

सत्त्वं रजस्तम इति गुणाः प्रकृतिसंभवाः ।
निबध्नंति महाबाहो देहे देहिनमव्ययम् ॥ ५ ॥

సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః
నిబధ్నంతి మహాబాహో దేహే దేహినమవ్యయమ్ (5).

మహాబాహో = గొప్ప బాహువులు గల ఓ అర్జునా!, సత్త్వమ్ = సత్త్వము, రజః = రజస్సు, తమః = తమస్సు, ఇతి = అనే, ప్రకృతి సంభవాః = ప్రకృతియందు ఉండే, గుణాః = గుణములు, అవ్యయమ్ = వినాశము లేని, దేహినమ్ = జీవుని, దేహే = దేహమునందు, నిబధ్నంతి = బంధించు చున్నవి.

గొప్ప బాహువులు గల ఓ అర్జునా! ప్రకృతి యందు ఉండే సత్త్వరజస్తమస్సులు అనే గుణములు వినాశము లేని జీవుని దేహము నందు బంధించు చున్నవి (5).

సృష్టికి ఉపాదానకారణమగు ప్రకృతి సత్త్వరజస్తమస్సులనే మూడు గుణములను కలిగియున్నది. ఇచట గుణములనగా మనకు సాధారణముగా తెలిసిన పెద్ద, చిన్న, గుండ్రని, పచ్చని ఇత్యాది లక్షణవులు కావు. ఇంద్రియగోచరవగు ఈ విశేషణవులు ఒక పదార్థమునాశ్రయించి, దానిని ఇతర పదార్థములనుండి వ్యావృత్తి చేస్తాయి. మనకు జీవితములో తారసిల్లే కొన్ని విలక్షణ ప్రకృతులకు శాస్త్రము గుణవులు అని పేరు పెట్టినది. గుణి (గుణములు గలది) యగు మాయకంటె గుణములు వేరుగా లేవు. అనగా మాయ సత్త్వరజస్తమో గుణాత్మకము, దాని స్వరూపము గుణములే. శాస్త్రప్రోక్తములైన ఈ మూడు గుణములతో మన అనుభవమునకు వచ్చే స్థితులనన్నింటినీ హేతుబద్ధముగా వ్యాఖ్యానించవచ్చును. అవి ప్రకృతిలో భాగమై ప్రకృతియందున్నవి గనుక, ప్రకృతి నుండి ఉద్భవించే ఈ సృష్టిలో వాటి అభివ్యక్తి కానవచ్చును. సుఖానుభవము, జ్ఞానప్రాప్తి అను రూపములో సత్త్వగుణము అభివ్యక్తమగు చుండును. కామక్రోధములు రాజసప్రకృతి. మాంద్యము, మోహము తామసప్రకృతి. ప్రకృతి జగద్రూపముగా పరిణమించినప్పుడు, ఇవి కూడ సృష్టిలో అభివ్యక్తమై మనకు కానవచ్చును.

'ఇవి బంధించును (నిబధ్నంతి)' అని భగవానుడు చెప్పగా, శ్రీశంకరులు 'బంధించునట్లు కన్పట్టును (నిబధ్నంతి ఇవ)' అని జాగ్రత్తగా వ్యాఖ్యానించిరి. గుణములు యథార్థముగా బంధించే పక్షములో, వాటి నుండి విముక్తి ఎట్లు సంభవమగును? ఆత్మ నిర్గుణమనే సత్యమును గుర్తించిన వ్యక్తి ఈ గుణములన్నింటి నుండియు విముక్తుడగునని భగవానుడు ఇదే అధ్యాయములో తరువాత నిరూపించబోవు చున్నాడు.

విషయవస్తువును కొంగ్రొత్త పదవములతో వర్గీకరించునప్పుడు మనవము చాల జాగరూకతతో వ్యవహరించవలెను. లేనిచో మనము లేని పోని సమస్యలను సృష్టించిన వారము అగుదుము. ఒకాయన తనలో మాంద్యము అధికముగా నున్నదని ఫిర్యాదు చేసెడివాడు. అతడీ ప్రసంగమును విని తాను తామసికుడనని నిశ్చయించుకొని ఒక మనో గ్రంథి (Complex) ని నిర్మాణము చేసుకొనుట తగదు. మాంద్యము ఉన్నచో, దానిని అవగాహన చేసుకొని దాని నివారణకు కృషి చేయవలెను. ఒక కప్పు కాఫీ త్రాగినచో, ఉత్సాహము కలుగును. కాని 'నేను

తామసికుడను' అని నిర్ణయించుకొని కూర్చున్నచో, సమస్య మరింత జటిలమై పరిష్కారము దుస్సాధ్యమగును. వ్యక్తులను వర్గీకరించి పేర్లను పెట్టి తదను గుణముగా వ్యవహరించే స్వభావము మనలో ఇప్పటికే నెలకొని యున్నది. దీనికి తోడుగా ఇతరులతో బాటు తనను కూడ వర్గీకరించి పేరు పెట్టుటకు ఇప్పుడు మనకు కొత్తగా మూడు పదములు దొరికినవి. ప్రతి మానవుడు సత్త్వరజస్తమో గుణముల కలయిక. మనస్సులో వచ్చే వివిధ మార్పులకు ఇవియే కారణమగు చున్నవి. మనము ఇంత మాత్రము తెలుసుకున్నచో చాలును. ఉపదేశమునకు తాత్పర్యమిదియే.

అవి ఎచట బంధించును? దేహమునందు (దేహే). ఎవరిని? దేహము నందు ఆత్మను దేహినమ్). ఆత్మలో వికారములేవియు లేవు (అవ్యయమ్). మరణము లేనిది, సదా ఏకరూపమైనది అగు ఈ ఆత్మను గుణములు బంధించినట్లు కన్పట్టుననుటకు కారణమేమి? బంధము కేవలము అజ్ఞానకృతము మాత్రమే గనుక. ప్రకృతి సర్వము మిథ్య. కావున ఆత్మ యొక్క దృష్టి కోణములో ప్రకృతి లేనే లేదు. కావున, దాని గుణములు బంధించినట్లు కన్పట్టుట మాత్రమే (నిబధ్నంతి ఇవ).

పైగా ఈ మూడు గుణముల అస్తిత్వము ఆత్మపై ఆధారపడి యుండ, అవి అదే కాలములో ఆత్మను ఎట్లు బంధించగల్గును? ఇవి గుణములనియు, సర్వము ప్రకృతి యొక్క అభివ్యక్తి అనియు తెలియని వ్యక్తిని మాత్రమే అవి బంధించును. ఇవి ఆత్మ గుణములు కావు. కాని క్షేత్ర-క్షేత్రజ్ఞ వివేకములేని వ్యక్తిని ఈ గుణములు బంధించును. వివేకము గల వానిని ఇవి బంధించవు.

శ్రీశంకరులిచట 'మహాబాహో' అను సంబోధనను వివరించిరి. ఈ పదమునకు రెండు అర్థములు గలవు. పొడవైన చేతులు గలవాడు; లేదా, దృఢమైన చేతులు గలవాడు. అర్జునుడు గొప్ప నైపుణ్యము గల ధనుర్ధారి. కావున అతడు మహాబాహుః అనబడును. ఇంతే గాక, అతడు చేతులను శరీరమునకు రెండు వైపులా క్రిందకు జారవిడిచినప్పుడు, అవి మోకాళ్లవరకు పొగియుండును. అతనికి యుద్ధ విద్య ఇత్యాదులలో అసామాన్యమగు సామర్థ్యము గలదని ఈ లక్షణము సూచించును.

ఆత్మ అనాది, నిర్గుణము అగుటచే (అనాదిత్వాత్ నిర్గుణత్వాత్) ఏ విధమైన మార్పులకు లోను గాదని మనము 13 వ అధ్యాయములో చూచియున్నాము. అట్టి స్థితిలో ఏదైననూ ఆత్మను ఎట్లు బంధించగల్గును? ఆత్మకు వాస్తవమగు బంధము లేదు. కాని అవిద్య వలన

అసంభవము సంభవమగు చున్నది. అనంత-శాశ్వత-ఆత్మ పరిచ్ఛిన్నము వలె కాలాధీనమైనది వలె కన్పట్టు చున్నది. గుణ వినిర్ముక్తమగు ఆత్మ అవిద్యా ప్రభావముచే గుణములన్నింటిచే బంధింపబడినదా యన్నట్లు భాసించుచున్నది. మాయా పంచకమ్ అను ప్రకరణములో 'మాయ అసంభవమును ఘటిల్ల జేయగల్గును (అఘటిత-ఘటనా-పటీయసీ మాయా)' అని వర్ణించబడినది. కావున ఈ దేహములో నివసించి యున్న ఆత్మను సత్త్వరజస్తమో. గుణములు బంధించుచున్నవి (దేహినం నిబధ్నంతి).

భగవానుడిపుడు గుణములను విడివిడిగా నిర్వచించును. మణులలో వలె గుణములలో కూడ అవాంతర భేదము గలదు. అన్నీ మణులే అయినా, ఇంద్ర నీలమణికి పద్మరాగమణికి భేదము గలదు. ఈ గుణములను గురించి విస్తారమగు చర్చ ఈ అధ్యాయములో మాత్రమే గాక, రాబోవు అధ్యాయములలో కూడ గలదు. సత్త్వ, రజస్, తమస్ అను పదములను శాస్త్రము ప్రవేశపెట్టినది గనుక, శాస్త్రమే వాటిని నిర్వచించవలసి యున్నది. తరువాతి శ్లోకములో సత్త్వగుణము నిర్వచింప బడినది.

**అధ్యాయము 14, శ్లోకము 6 :**

तत्र सत्त्वं निर्मलत्वात् प्रकाशकमनामयम् ।
सुखसंगेन बध्नाति ज्ञानसंगेन चानघ ॥ ६ ॥

తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశకమనామయమ్
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ (6)

అనఘ = పాపస్పర్శలేని ఓ అర్జునా!, తత్ర = వాటిలో, నిర్మలత్వాత్ =దోష రహితమగుటచే, ప్రకాశకమ్ = జ్ఞానప్రకాశమును కలిగించునది, అనామయమ్ = దుఃఖ రహితమైనది అగు, సత్త్వమ్ = సత్త్వగుణము, సుఖసంగేన = సుఖమునందలి ఆసక్తి చేత, చ = మరియు, జ్ఞానసంగేన = జ్ఞానమునందలి ఆసక్తి చేత, బధ్నాతి = బంధించును.

పాపసంపర్కము లేని ఓ అర్జునా! ఆ గుణములలో దోషరహితమగుటచే జ్ఞాన ప్రకాశమును కలిగించునది, దుఃఖరహితమునగు సత్త్వగుణము సుఖమునందు మరియు జ్ఞానము నందు ఆసక్తిని కలిగించి బంధించును (6).

తత్ర అనగా ఈ మూడు గుణములలో మనము ముందుగా సత్త్వమును పరిశీలించెదము. అది సర్వదోషవివర్జితమగుటచే (నిర్మలత్వాత్) దుఃఖరహితమైనది (అనామయమ్) అని ఇచట నిర్వచించబడినది. సత్త్వము నందు చైతన్యము సుస్పష్టముగా ప్రతిఫలించును. ప్రకాశము దాని స్వభావము. వ్యక్తి యందు స్పష్టమగు జ్ఞానమును పొందే సామర్థ్యము ఈ గుణము వలన కలుగును. దుఃఖ వివర్జితము (అనామయమ్) అగుటచే సత్త్వము సమ్మోహరహితమగు దర్శనమును కలిగించును. కావున మనము పదార్థములను స్పష్టముగా చూడగలిగే సందర్భములన్నియు సత్త్వగుణము యొక్క ప్రభావమేనని తెలియవలెను. స్పష్టమగు జ్ఞానము మాత్రమే గాక, సుఖము కూడా సత్వగుణము యొక్క అభివ్యక్తియే. ఉల్లాసముగా నున్నప్పుడు మరియు సుఖానుభూతిని పొందే ఘడియలలో సత్త్వము ప్రముఖముగా నుండును. ఇవి అభీష్టమగు అనుభూతులే అయినా, బంధహేతువులేనను విషయమును భగవానుడు మరువకుండగా సూచించుచున్నాడు. సుఖము సత్త్వగుణలక్షణము. సత్త్వము సుఖానుభూతిని కలిగించి వ్యక్తిని బంధించును. మానవుడు దాని ప్రభావముచే సుఖమును పొంది 'నేను సుఖిని' అని భావించును. సుఖానుభవముతో సహా సర్వానుభవములు ఏదో ఒక సమయములో తొలగిపోవును గాన, అతడు 'నేను దుఃఖిని' అనే నిర్ణయమునకు పునాదిని వేసుకొనుచున్నాడని చెప్పువచ్చును. ఉల్లాసముగా మరియు ప్రశాంతముగా నుండే అంతఃకరణ వృత్తికి సత్త్వ గుణ-అతిశయము హేతువు. కాని ఈ వృత్తి కూడ ఇతర వృత్తులవలెనే కాలాధీనమై యున్నది. ఒక మానసిక-అనుభవములో విషయమైన సుఖమును ఆత్మపై అధ్యారోపము చేయుటచే 'నేను సుఖిని' అనే నిష్కర్ష ఉదయించినది. సుఖియై ఉండుటలో ఇబ్బంది ఏమీ లేదు. కాని అది పూర్తి సత్యము కాదు గనుక బంధహేతువు అగును. సుఖము మనస్సులోని సత్త్వగుణాతిశయముపై ఆధారపడి యుండును గనుక, సుఖాకారవృత్తి సత్త్వగుణధర్మము అగును. సత్త్వగుణము ప్రకాశకము. కావున వ్యక్తి యొక్క యథార్థ స్వరూపమగు పూర్ణత్వము (ఆనందము) ను అది కప్పివేయదు. అందువలన అంతఃకరణములో ఒక విశిష్ట సుఖము అభివ్యక్తమగుటలో అది హేతువు అగును. క్రమముగా ఈ సుఖ-అనుభూతి క్షీణించును. ఈ క్షయము అనివార్యము. సంసారము ఇటులనే యుండును.

ఇటువంటి సుఖము సర్వదా ఒక వస్తువునకు పెన వేసుకొని యుండును. ఒక వస్తువును పొందుట, లేక ఒక వస్తువును వదిలించుకొనుట అతని సుఖానుభవమునకు అలంబనమైనచో, అతని యందు అజ్ఞానము (అవిద్యా) గలదు. అట్లుగాక, ఒక వ్యక్తి నిర్హేతుకముగా సుఖమును

పొందుచున్నచో, అతడు పిచ్చివాడు గాని, లేక జ్ఞాని గాని అగును. పిచ్చి వాని మనస్సులో ఏదో ఒక వస్తువు ఉండును. కాన వాస్తవములో నిర్హేతుకముగా సుఖియై ఉండువాడు జ్ఞాని మాత్రమే. 'ఎందువలన?' అను ప్రశ్నకు సమాధానము ఉన్నంత వరకు, సుఖము ఆత్మపై అధ్యారోపము చేయబడినట్లే యగును.

అదే విధముగా అజ్ఞానమున్నచో, సర్వక్రియా వినిర్ముక్తము (అకర్తా) అగు ఆత్మ కర్తయనే భ్రాంతి కలుగును. సత్త్వగుణము ప్రధానముగా నున్నప్పుడు తెలుసుకొనువాడు (జ్ఞాతా) అను స్థితి ఆత్మపై అధ్యారోపము చేయబడును. ఈ తీరున జ్ఞాన-ఆసక్తి ద్వారా (జ్ఞాన సంగేన) సత్త్వగుణము కూడ బంధహేతువు అగును. మరియు సుఖమును పొందాలంటే, ముందుగా కొంత జ్ఞానము ఉండవలెనని శ్రీశంకరులు వివరించిరి. మనము ఒక వస్తువును గని సుఖమును పొందెదము; లేదా ఒక వస్తువును ఊహించి ఉల్లాసమును పొందెదము. ఏవిధముగనైననూ, ఆ సుఖమును పొందుటకు ఏదో ఒక జ్ఞానము ఆవశ్యకమగును. ఆ వృత్తిజ్ఞానము కూడా బంధమే. మరియు నీకు ఎంత తెలిసినా, సర్వజ్ఞుడను కానని కూడ నీకు తెలియచుండును. కావున 'నేను జ్ఞాతను' అను ధారణకు సర్వదా అల్పత్వభావన తోడుగా నుండును. సత్త్వగుణము వలననే జ్ఞానము కలుగును. కాని ఆ సత్త్వగుణమే ఈ జ్ఞానసంబంధము ద్వారా బంధహేతువు అగును.

సత్త్వగుణ ప్రధానమగు మనస్సులోనైననూ అప్పుడప్పుడు రజస్తమోగుణములు అధికమగుచుండును. ప్రతి మానవుని అంతః కరణములో ఈ మూడు గుణములు గలవు. గుణములన్నియు బంధించును (కల్పితబంధము). పదార్థజ్ఞానము మనోధర్మమే గాని, ఆత్మ ధర్మము కాదనియు, ఆత్మ స్వరూపము శుద్ధచైతన్యము గనుక, దాని యందు దేని అజ్ఞానమైననూ లేదనియు ఎరింగిన వ్యక్తిని సత్త్వగుణము జ్ఞానసంబంధము ద్వారా బంధించదు. ఆత్మ స్వరూపము సుఖము. ఒక విశిష్టకాలములో ఆత్మ సుఖియగుట సరికాదు. ఒక వస్తువును చూడగానే ఆత్మ యొక్క స్వరూప భూతమగు ఆనందమును మనస్సు కప్పి వేయనిచో, ఆ మనస్సులో సత్త్వము ప్రధానముగా నున్నదని తెలియవలెను. అట్లైనచో, సుఖి అయ్యేది ఎవరు? ఆత్మ సుఖ స్వరూపము అనే అవగాహనతో 'నేను సుఖిని' అని చెప్పగలిగే పక్షంలో సమస్య లేదు. కాని 'నేను సుఖిని అయినాను' అని నీవు చెప్పినచో, అది నిశ్చితముగా బంధమే యగును. మనోధర్మమును ఆత్మయందు అధ్యారోపము చేయుట అను దోషము దానియందు గలదు. ఆత్మ సుఖిగా మారుట లేదు. కావున 'ఇప్పుడు నేను సుఖిని' అను ధారణ అజ్ఞానకృతము. కాన ఈ ధారణ బంధహేతువు అగును. సుఖము యొక్క స్వరూపములో ఆత్మయే గలదు.

కాని 'ఇప్పుడు ఆత్మ సుఖి' అనే ధారణ భ్రాంతి. అదే విధముగా, ఆత్మ నిర్విశేష జ్ఞాన ఘనమే అయినా, అజ్ఞానవిరోధి యగు ఒక జ్ఞానమును దానియందు ఆపాదించి, తద్వారా దానియందు జ్ఞాతృత్వము ఆరోపించబడును. ఆత్మ ఎట్లు జ్ఞాన విరోధి కాదో, అటులనే అజ్ఞాన విరోధి కూడ కాదు. ఆత్మ అజ్ఞాన విరోధి అయినచో, అజ్ఞానము ఉండుట అసంభవమయ్యెడిది. కాని ఇది మన అనుభవమునకు విరుద్ధము. మనకు తెలియని విషయములు అనేకముగా నుండుట క్రొత్త కాదు గదా!

ఇపుడు భగవానుడు రజోగుణమును నిర్వచించు చున్నాడు.

**అధ్యాయము 14, శ్లోకము 7 :**

रजो रागात्मकं विध्दि तृष्णा संग समुद्भवम् ।
तन्निबध्नाति कौंतेय कर्मसंगेन देहिनम् ॥ ७ ॥

రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్ (7).

కౌంతేయ = ఓ కుంతీపుత్రా! అర్జునా!, తృష్ణాసంగసముద్భవమ్ = తీవ్రమగు రాగము మరియు ఆసక్తి అను వాటి నుండి పుట్టిన, రజః = రజోగుణము, రాగాత్మకమ్ = మనస్సును రంజింపజేసే స్వభావము కలది, తత్ = అది, దేహినమ్ = జీవుని, కర్మసంగేన = కర్మయందలి ఆసక్తిచే, నిబధ్నాతి = బంధించును.

> ఓ కుంతీ పుత్రా! అర్జునా! తీవ్రమగు రాగము మరియు ఆసక్తి అనువాటినుండి పుట్టిన రజోగుణము మనస్సును రంజింప జేసే స్వభావమును కలిగియున్నదై జీవుని కర్మయందు ఆసక్తిని కలిగించి బంధించును (7).

రజస్సు అనగా ధూళి అని సామాన్యార్థము. కాని ఇచట అది పారిభాషిక పదము. రాగము స్వరూపముగా గల గుణము రజస్సు అనబడును. ఒక వస్తువుపై గల అభిముఖ్యము రాగమనబడును. అది మనస్సునకు ఉల్లాసమును కలిగించి ప్రలోభపెట్టును. ఈ రాగము వస్త్రమునకు వేసే జేగురు రంగు వంటిది. ఇది మనస్సును రంజితము చేయునని శ్రీశంకరులు

వివరించిరి. తెల్లని వస్త్రమునకు ఎర్రని రంగును వేయుట ఎందులకు? దానిని ఆకర్షణీయముగా తయారు చేయుటకు. అదే విధముగా రాగము అంతః కరణమును పూర్తిగా రంజితము చేసి, రంగు వస్త్రమునకు పట్టినట్లు, దానిని పట్టుకొని యుండును. మనస్సులో ఒక సారి రాగము నెలకొన్నచో అది ఓ పట్టాన విడిచి పెట్టదు.

ఈ రాగమునకు రెండు హేతువులు గలవు. ఒకటి తృష్ణ. రెండవది వివరీతమగు సంలగ్నత (attachment). దీనినే ఆసంగమందురు. నీ వద్ద ఒక వస్తువు లేదు. ఆ వస్తువును గురించి 'ఇది నావద్ద ఉండి తీరవలెను' అనే కోరికకు తృష్ణయని పేరు. మనము పట్టించుకొని వస్తువులు ప్రపంచములో అనేకములు గలవు. కాని కొన్ని వస్తువులు మన మనస్సులలో ప్రవేశించి తీవ్రమగు కామనలో విషయమగును. వాటి విషయములో మనకు గల మనస్స్థితికి రాగమని పేరు. ఇది తృష్ణ నుండి పుట్టినది. రాగములో దృష్టవస్తువులు మాత్రమే గాక, స్వర్గము మొదలగు అదృష్టవస్తువులు కూడ విషయమగు చుండును. ఇంతేగాక, దూరమగు నేమో యను భయముతో మనము కొన్ని వస్తువులను గట్టిగా పట్టుకొని కూర్చుండెదము. ఇది కూడా రాగమే. ఇది అసక్తి నుండి పుట్టినది. మనము సమయము వచ్చినప్పుడైననూ ఆనందముగా విడిచి పెట్టజాలని వస్తువులు అనేకము గలవు. ఒక వస్తువు దూరమైనప్పుడు లోటు అనే భావన కలిగినచో, అదియే ఆసక్తి యనబడును. ఇది మామూలు సంలగ్నత (సక్తి) కాదు. వస్తువులను ఉన్మత్తుని వలె పట్టుకొని యుండే సంలగ్నత ఆసక్తి యనబడును.

రజోగుణము యొక్క ఈ అభివ్యక్త రూపము కూడ జీవుని బంధించును (నిబధ్నాతి). సత్త్వగుణమువద్ద బధ్నాతి అనియు, కాని ఇచట నిబధ్నాతి అనియు శ్రీకృష్ణుడు ప్రయోగించుటను గమనించుడు. సత్త్వములో సంస్కృతి, నాజూకు తనము, జ్ఞానము, ఒక విశిష్టమగు పరిపక్వత ఇమిడి యుండును. ఇది కూడా బంధమే. కాని అందమైన బంధము. రజస్సు ఇంతకంటె దృఢమైన బంధమును కలిగించును గనుక, భగవానుడు 'నిబధ్నాంతి' అని ప్రయోగించినాడు. ఈ బంధము కర్మకు దారి తీయుటచే, దానికి మోహము తోడుగును. తృష్ణాసక్తులు గల వ్యక్తి దృష్టా దృష్టఫలములను గోరుచుండును గనుక, అతడు కర్మలను చేయక తప్పదు. ఈ కర్మలను చేయు ప్రక్రియలో భాగముగా మంచి కర్మలతో బాటు చెడుకర్మలను కూడ చేసి పాపమును మూట గట్టుకొనును. రాగము యొక్క ఒత్తిడి ఉండుటచే కర్మను చేయకుండుట అసంభవమగును. కావున రజోగుణము కర్మరూపములో ఆవిర్భవించి తద్ద్వారా వ్యక్తిని పూర్తిగా బంధించును. కర్మల వలన పుణ్యపాపములు కలుగును. వాటి వలన మరల

జన్మలు కలుగును. జన్మ కలుగుటచే మరల కర్మలు చేయబడును. ఈ తీరున రజస్సు వ్యక్తిని పూర్తిగా బంధించును.

ఇష్టానిష్టములు రెండు రాగములో అంతర్గతమగును. రాగము కూడ బంధహేతువే. ఆత్మ యందు కర్తృత్వ భోక్తృత్వములు లేవు. కాని కేవలము ఒక విశిష్ట మనస్స్థితి మాత్రమే యగు రాగముతో వ్యక్తి తాదాత్మ్యమును పొందియున్నచో, ఇష్టానిష్టములు ఆత్మయందు అధ్యారోపితములగును. అపుడా వ్యక్తి 'నేను బద్ధుడను' అను ధారణ కలవాడై దుఃఖితుడగును. ఇక మూడవది తమోగుణము.

**అధ్యాయము 14, శ్లోకము 8 :**

तमस्त्वज्ञानजं विध्दि मोहनं सर्व देहिनाम् ।
प्रमादालस्य निद्राभिस्तन्निबध्नाति भारत ॥ ८ ॥

తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వ దేహినామ్
ప్రమాదాలస్య నిద్రాభిస్తన్నిబధ్నాతి భారత (8).

భారత = ఓ అర్జునా!, తమః = తమోగుణము, తు = అయితే, అజ్ఞానజమ్ = అజ్ఞానమునుండి పుట్టినదని, విద్ధి = తెలుసుకొనుము, ప్రమాదాలస్య నిద్రాభిః = ఉపేక్షాభావము, సోమరితనము మరియు నిద్ర అనువాటిచే, సర్వదేహినామ్ = ప్రాణులనన్నిటినీ, మోహనమ్ = మోహింపజేయు, తత్ = అది, నిబధ్నాతి = పూర్తిగా బంధించును.

ఓ అర్జునా! అజ్ఞానమునుండి పుట్టిన తమోగుణమైతే సర్వప్రాణులను మోహింప జేయునని తెలుసుకొనుము. అది ఉపేక్షాభావము, సోమరితనము మరియు నిద్ర అను వాటిచే పూర్తిగా బంధించును (8).

తమస్సు అజ్ఞానము నుండి పుట్టినదని (అజ్ఞానమ్) భగవానుడిచట చెప్పుచున్నాడు. సత్త్వరజస్తమోగుణములు మూడు అజ్ఞానము నుండి పుట్టినవియే గదా! ఇచట ప్రత్యేకించి తమస్సు అజ్ఞానజమని చెప్పుటకు కారణమేమి? ఈ అజ్ఞానమునకు తూల-అవిద్య అని పేరు. ఇది సర్వ జనసాధారణమైన ఆత్మ విషయకమగు మూల-అవిద్య కాదు. ఒకనిలో సత్త్వము, మరియొకనిలో రజస్సు అధికముగా నుండవచ్చును. కాని ఆత్మజ్ఞానము కలుగనంతవరకు అందరు అజ్ఞానులే.

ఇచట మనము మూల-అవిద్యను గురించి చర్చించుట లేదు. ఏది కర్తవ్యము? ఏది చేయకూడనిది? అను విషయములో గల అజ్ఞానమును మనము చర్చిస్తున్నాము. ఇది సరళమగు ధర్మ-అధర్మ-వివేకము. కాని తామసునిలో అది కూడ లోపించును. రజోగుణ ప్రధానుడగు వ్యక్తి జీవితములో విజయమును, సుఖమును కాంక్షించువాడు గనుక, మంచి-చెడుల గురించి అతనికి తామసుని కంటె అధికమగు వివేకము ఉండును. తమోగుణ ప్రధానుడగు వ్యక్తి తన బుద్ధిని లేశమైననూ వినియోగించలేడు. కావుననే అతనిలో మోహము దట్టముగా నుండును. వస్తువులు ఉన్నవి ఉన్నట్లుగా గాక, మరియొక విధముగా కానవచ్చును. అతనియందు ధర్మ-అధర్మ-వివేకము ఉండదు. అతనికి చెడు కూడ మంచిదిగానే భాసించును. ఇది దేహధారులందరికీ (సర్వదేహినామ్) సమానమే. తమస్సు ప్రాణులందరికీ మోహమును ఉత్పన్నము చేయును గనుకనే, అది 'మోహనం సర్వదేహినామ్' అని వర్ణించబడినది. దీని వలన జీవన మూల్యసంరచన (value structure) వికృతరూపమును దాల్చును. ప్రాథమికతలు (priorities) అస్తవ్యస్తమగును.

తమస్సు వివిధ రూపములలో అభివ్యక్తమై బంధహేతువు అగును. వాటిలో ఒకటి ప్రమాదము. అనగా ఒక పని అవశ్యకర్తవ్యమని తెలిసి ఉన్నా చేయలేక పోవుట. ఒక విశిష్ట పరిస్థితిలో ఖచ్చితముగా ఒక కర్తవ్యము అతని యెదుట ఉపస్థితమగును. కాని తమోగుణప్రధానుడు దానిని నిర్వర్తించలేడు. అతని అంగీ కొద్దిగా చినిగినపుడు దానిని కుట్టి సరిచేసుకొనడు. కాని అది పూర్తిగా చినిగినపుడు బిగ్గరగా రోదించును. అలస్యమనగా నిదియే. దేనినీ పట్టించు కొనకపోవుట, నిష్క్రియత అను లక్షణములు రాగ పరిపూర్తికి అటంకమగును. రాగము అతనిని కర్మను చేయుమని ఒత్తిడి చేయుచుండును. కాని అతడు ఏ పనినైననూ చేయకుండగా అలస్యము అడ్డు తగులును. అతని దృష్టిలో ఇప్పుడు వెంటనే చేయుదగిన అత్యావశ్యక కార్యమేదియు లేదు. ఏదైనా రేపు చేసుకో వచ్చును. ఇట్టి వ్యక్తికి వంటచేయుట కూడ సమస్య యగును. అతడు ఒక వారానికి సరిపడే పదార్థములను వండుకొని వాటినే తినుచుండును. తమోగుణమునుండి పుట్టిన సమస్య ఇట్లుండును. తమోగుణము యొక్క మరియొక అవిర్భావము నిద్ర. ఆ గుణము అధికముగా గల వ్యక్తి అధికముగా నిద్రించును. మరియు జడత్వ-అక్రాంతుడైన వ్యక్తి అడ్డ దారుల కొరకు వెతుకు చుండుటచే అనేక తప్పు పనులు అనివార్యమగును. ఇన్ని విధములుగా ప్రకటమయ్యే ఈ తమస్సు ఆత్మను బంధించునా యన్నట్లు కన్పట్టును. కాని ఇది బంధ-ఆభాస మాత్రమే. ఏలయన, నిద్ర పోయేది, పట్టించు కోనిది, పనులను సోమరితనములో వాయిదా వేసేది ఆత్మ కాదు. ఆత్మ గుణ వినిర్ముక్తము.

గుణ లక్షణములను తరువాతి శ్లోకము మరల సంగ్రహముగా వర్ణించుచున్నది.

అధ్యాయము 14, శ్లోకము 9 :

सत्त्वं सुखे संजयति रजः कर्मणि भारत ।
ज्ञानमावृत्य तु तमः प्रमादे संजयत्युत ॥ ९ ॥

సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత (9).

భారత = ఓ అర్జునా!, సత్త్వమ్ = సత్త్వగుణము, సుఖే = సుఖరూపములో, సంజయతి = బంధించును, రజః = రజోగుణము, కర్మణి = కర్మ రూపమునందు (బంధించును), తు = కాని, తమః = తమో గుణము, జ్ఞానమ్ = జ్ఞానమును, ఆవృత్య = కప్పి వేసి, ప్రమాదే = క్రియాశూన్యత యందు, ఉత = నిశ్చయముగా, సంజయతి = బంధించును.

ఓ అర్జునా! సత్త్వ గుణము సుఖమునందు, రజో గుణము కర్మయందు బంధించును. కాని తమోగుణము జ్ఞానమును కప్పివేసి వ్యక్తిని నిశ్చితముగా ఉపేక్షాబుద్ధి యందు బంధించును (9).

మానవుడు సుఖముల వెనుక పరుగెత్తుటకు కావలసిన ప్రేరణను మరియు సుఖమును కూడ ఇచ్చి తద్ద్వారా సత్త్వ గుణము వానిని బంధించును. రజస్సు కర్మరూపములో వ్యక్తిని బంధించును. కాని తమస్సు వ్యక్తి యొక్క వివేకశక్తిని కప్పి వేసి బంధించునని ఇచట నొక్కి చెప్పబడుచున్నది. ఏది కర్తవ్యము? ఏది కర్తవ్యము కాదు? అను వివేక జ్ఞానము సత్త్వము నుండి పుట్టును. దానిని తమస్సు పూర్తిగా కప్పివేయును. జ్ఞానమును ఆవరించుటయే తమోగుణస్వభావము. దీనివలన వ్యక్తి దేని గురించి యైననూ పట్టించు కొనకుండగా, చేయదగిన కర్మలను చేయకుండగా జీవితమును గడిపి వేయుచుండును. ప్రతిదినము మానవుని జీవితములో క్రొత్త క్రొత్త పరిస్థితులు ఎదురగుచుండును. మనకు నచ్చినా నచ్చక పోయినా కొన్ని పనులను చేయుట తప్పని సరియగును. తమోగుణముచే పరాజితుడైన వ్యక్తి తరచుగా ఇట్టి అత్యావశ్యకములగు క్రియలనైననూ చేయజాలడు. ఈ విధముగా తమస్సు వ్యక్తిని బద్ధుని చేయును.

ప్రతి వ్యక్తిలో మూడు గుణములు ఉండగా, ఒక్కొక్క గుణము మాత్రమే ప్రకటమగుటకు కారణమేమి? కారణమేమనగా, ఒక గుణము మిగిలిన రెండింటినీ అతిశయించి ప్రాముఖ్యమును పొందును. ఈ ప్రాముఖ్యము వచ్చి పోయేది కావచ్చును; లేదా స్థిరపడియైననూ ఉండవచ్చును. ఒకడు ఇంచుమించు తామసియై ఉండగా, మరియొకడు రజోగుణ ప్రధానుడు గాని, లేక సాత్త్వికుడు గాని కావచ్చును. తామసికునిలో గూడ జ్ఞానము గలదనియు, అందువలననే అతడు కూడ కాదాచిత్కముగా సత్త్వగుణాతిశయమును పొంది ఆనందించుననియు మనము చూచి యున్నాము. కావున నూటికి నూరు శాతము ఒకే గుణము గల వ్యక్తి లేడు. ఏయే గుణములు ఎప్పుడెప్పుడు ప్రాముఖ్యమును సంతరించుకొని తమ ప్రభావమును చూపును? దీనికి సంబంధించిన సూత్రమును తరువాతి శ్లోకము చెప్పుచున్నది.

**అధ్యాయము 14, శ్లోకము 10 :**

रजस्तमश्चाभिभूय सत्त्वं भवति भारत ।
रजस्सत्त्वं तमश्चैव तमस्सत्त्वं रजस्तथा ॥ १० ॥

రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా (10).

**భారత** = ఓ అర్జునా!, **రజః** = రజోగుణమును, **చ** = మరియు, **తమః** = తమోగుణమును, **అభిభూయ** = తిరస్కరించి, **సత్త్వమ్** = సత్త్వ గుణము, **భవతి** = ఉండును, **రజః** = రజోగుణమును, **చ** = మరియు, **సత్త్వమ్** = సత్త్వగుణమును, **ఏవ** = నిశ్చయముగా, **తమః** = తమోగుణము (అతిశయించును), **తథా** = అదే విధముగా, **తమః** = తమోగుణమును, **సత్త్వమ్** = సత్త్వ గుణమును, **రజః** = రజోగుణము (అతిశయించును).

ఓ అర్జునా! రజస్తమోగుణములను తిరస్కరించి సత్త్వము ఉదయించును.
రజస్సత్త్వ గుణములను పరాజితము చేసి తమస్సు పైకి వచ్చును. అటులనే,
తమస్సును సత్త్వమును రజోగుణము అతిశయించును (10).

భవతి అనగా పుట్టు చున్నది (ఉద్భవతి), లేదా పెరుగు చున్నది (వర్ధతే) అని శ్రీశంకరులు వ్యాఖ్యానించిరి. ఒక గుణము ప్రధానమై మిగిలిన రెండు గుణములను ప్రభావహీనములుగా చేయును. ఏ గుణము ప్రముఖముగా నుండునో, దాని లక్షణములు

ప్రకటమగు చుండును. సత్త్వము ప్రధానమైనప్పుడు దాని ప్రభావముచే ఉల్లాసము, జ్ఞానము, శమము, దమము, జీవన మూల్యములకు అనురూపమగు నడవడి ఇత్యాది లక్షణములు ఆరంభమగును. ఇదే విధముగా రజోగుణము కామనలను ఉద్బుద్ధము చేయును. వాటిని తీర్చు కొనుటకై మానవుడు వివిధ కర్మలను చేపట్టును. రజస్సత్త్వములు పరాజితములై తమస్సు అధికముగా నున్నప్పుడు మాంద్యము, పట్టించు కొనక పోవుట, నిద్ర ఇత్యాదులు ఆరంభమగును. ఈ లక్షణములను బట్టి ఏ గుణము యొక్క ఉద్రేకము గలదు? అను విషయమును మనము ఊహించవచ్చును.

భగవానుడు క్రింది శ్లోకములో అదే విషయమును మరియొక దృష్టికోణములో నిర్దేశించుచున్నాడు.

**అధ్యాయము 14, శ్లోకము 11 :**

सर्वद्वारेषु देहेऽस्मिन् प्रकाश उपजायते ।
ज्ञानं यदा तदा विद्याद्विवृद्धं सत्त्वमित्युत ॥ ११ ॥

సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే
జ్ఞానం యదా తదా విద్యాద్వివృద్ధం సత్త్వమిత్యుత (11).

యదా = ఏ కాలములో, అస్మిన్ = ఈ, దేహే = దేహమునందు, సర్వ ద్వారేషు = జ్ఞానేంద్రియములన్నింటి యందు, ప్రకాశః = ప్రకాశము, జ్ఞానమ్ = జ్ఞానము, ఉపజాయతే = ఉద్బుద్ధమగునో, తదా = ఆ కాలములో, సత్త్వమ్ = సత్త్వగుణము, ఉత = నిశ్చయముగా, వివృద్ధమ్ = వర్ధిల్లినది, ఇతి = అని, విద్యాత్ = తెలియవలెను.

ఏ కాలములో ఈ దేహమునందలి జ్ఞానేంద్రియములన్నింటి యందు
ప్రకాశరూపమగు జ్ఞానము ఉద్బుద్ధమగునో, ఆ కాలములో సత్త్వగుణము
నిశ్చయముగా వర్ధిల్లినదని తెలియదగును (11).

సర్వద్వారేషు అనగా ద్వారములన్నిటి యందు. చెవులు ఇత్యాది జ్ఞానేంద్రియము లన్నియు లోపలికి జ్ఞానము ప్రవేశించే ద్వారముల వంటివని శ్రీశంకరులు వివరించిరి. అంతః

కరణములో వృత్తి రూపముగా భాసించే ప్రకాశము ఈ స్థూలదేహమునందలి సర్వ జ్ఞానేంద్రియముల యందు ఉదయించునని శ్రీ శంకరులు వివరించిరి. ఇది ఈ జ్ఞానేంద్రియముల ద్వారా ఉదయించే జ్ఞానప్రకాశము. సావధానత, ఏకాగ్రత గల వ్యక్తిలో ఈ జ్ఞానము ఉదయించినది. దీనిని బట్టి అతని యందు సత్త్వగుణము అధికముగా గలదని మనము ఊహించవచ్చును. తమః ప్రధానుడగు వ్యక్తితో సహా అందరిలో ఈ జ్ఞానము కొద్దిగానైననూ ఉదయించును.

తరువాతి శ్లోకములో రజోగుణ–ఆధిక్యమును సూచించే లక్షణములు వర్ణించబడినవి :

**అధ్యాయము 14, శ్లోకము 12 :**

लोभः प्रवृत्तिरारंभः कर्मणामशमः स्पृहा ।
रजस्येतानि जायंते विवृध्दे भरतर्षभ ॥ १२ ॥

లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమః స్పృహా
రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ (12).

భరతర్షభ = భరతవంశాగ్రణియగు ఓ అర్జునా!, లోభః = లోభము, ప్రవృత్తిః = ఒక చోట స్థిరముగా కూర్చుండలేక పోవుట, కర్మణామ్ = కర్మల యొక్క, ఆరంభః = ఉపక్రమము, అశమః = మనో నిగ్రహము లేకుండుట, స్పృహా = తృష్ణ, ఏతాని = ఈ లక్షణములు, రజసి = రజోగుణము, వివృద్ధే = వృద్ధి పొందినప్పుడు, జాయంతే = కలుగును.

> భరతవంశాగ్రణి యగు ఓ అర్జునా! లోభము, ఒక చోట స్థిరముగా కూర్చుండ లేక పోవుట, కర్మల ఉపక్రమము, మనోనిగ్రహము లేకుండుట, తృష్ణ అను ఈ లక్షణములు రజోగుణము వృద్ధి పొందినప్పుడు కలుగును (12).

వ్యక్తిలో రజస్సు అధికముగా నున్నప్పుడు ఈ రజో గుణ లక్షణములు ప్రకటమగును. ఇతరుల వస్తువులను తాను పొందాలనే కోరిక లోభమనబడును. తనకు గల సంపద విషయములో గల పిసినారితనము కూడ లోభమే యగును. ఇతరుల స్థలములోనికి చొరబడాలనే ఆలోచన, ఇతరుల సంపదను తనది చేసుకోవాలనే ఆకాంక్ష లోభమనబడును. లోభము

మనస్సులో ఉదయించిన వెంటనే, దానికి తగ్గట్లుగా బుద్ధి మారిపోయి దానిని సమర్థించుట మొదలిడును. ఇదియే రజస్సు. ఇంతేగాక ఇటునటు కదులు చుండుట, నిరర్థకముగా త్రాడునకు ముడులను వేసి వాటిని విప్పుట, గోళ్లను కొరుకు చుండుట ఇత్యాది అర్థరహితములగు పనులు (ప్రవృత్తిః) కూడ రజోగుణ లక్షణమే యగును. ఒక లక్ష్యమును సాధించుట కొరకై సంకల్పించి ఆలోచించి చేపట్టిన కార్యయోజన (ఆరంభః) కూడ రజోగుణ కార్యమే యగును. సాత్త్వికుడగు వ్యక్తి యందు కూడ కాదాచిత్కముగా రజోగుణ-ఉద్రేకము కలుగుటచే వివిధ రకముల క్రియాకలాపములు చేపట్టబడును. ఈ దృష్టితో చూస్తే, కర్మణ్యతకు ప్రేరణనిచ్చే రజోగుణము చాల మంచిది. అదే విధముగా విశ్రాంతి నిచ్చే అంశములో తమోగుణము మంచిది. కాని ఈ రజస్తమోగుణములు కాలము కాని కాలములో ప్రాముఖ్యమును సంతరించుకున్నచో, సమస్యలు ఉత్పన్నమగును.

శమము (ప్రశాంతత) లేకుండుట రజోగుణము యొక్క మరియొక లక్షణము. అనగా శారీరక-అశాంతికి మానసిక-ఆందోళన తోడగును. ఈ అశాంతి ఒకప్పుడు సృజనాత్మకమగు ఆవిష్కారములకు దారి తీయును. సత్త్వము ప్రముఖమైనప్పుడు మస్తిష్కములో నూతన భావములు నిర్మాణమై సృజనాత్మకత (creativity) ప్రకటమగును. వివిధ వస్తువులపై గల తీవ్రమగు ఆకాంక్షను పరిపూర్తి చేసుకొనుటకై చేబట్టే క్రియాకలాపము రజోగుణకార్యమని శ్రీశంకరులు వివరించిరి. ఏ వస్తువుపై ఏ సమయములో కోరిక పుట్టిననూ, అది రజోగుణకార్యమేనని తెలియదగును. ఈ లక్షణములను బట్టి రజోగుణము అధికముగా నున్నదని తెలియును.

తమోగుణ ప్రాధాన్యమును సూచించే లక్షణములీ క్రింది శ్లోకములో చెప్పబడినవి:

**అధ్యాయము 14, శ్లోకము 13 :**

अप्रकाशोऽप्रवृत्तिश्च प्रमादो मोह एव च ।
तमस्येतानि जायंते विवृध्दे कुरुनंदन ॥ १३ ॥

అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ
తమస్యేతాని జాయంతే వివృద్ధే కురునందన (13).

కురునందన = కురువంశమునకు ఆనందమును కలిగించే ఓ అర్జునా!, అప్రకాశః =

జడత్వము, చ = మరియు, అప్రవృత్తిః = నిష్కర్మణ్యత, ప్రమాదః = పట్టించుకొనక పోవుట, చ = మరియు, ఏవ = నిశ్చయముగా, మోహః = మోహము, ఏతాని = ఈ లక్షణములు, తమసి = తమోగుణము, వివృద్ధే = అధికముగా నున్నప్పుడు, జాయంతే = పుట్టును.

> ఓ కురు నందనా! తమోగుణము అధికముగా నున్నప్పుడు బుద్ధి మాంద్యము, నిష్కర్మణ్యత, పట్టించుకొనక పోవుట మరియు మోహము అను లక్షణములు పుట్టును (13).

తమోగుణము అధికముగా నున్న వ్యక్తిలో ఈ లక్షణములు ఉదయించును. సావధానత లోపించి వివేకము దూరమగును (అప్రకాశః). సర్వకార్యముల యందు ఉదాసీన బుద్ధి నెలకొనును (ప్రమాదః). కర్తవ్యకర్మ వేచియున్ననూ వ్యక్తి పనికి పూనుకొనుడు (అప్రవృత్తిః). పనిని ఆరంభించుట కూడ దుష్కరమగును. తమస్సు ప్రముఖముగా నున్న వ్యక్తిలో ఈ లక్షణములు కాదాచిత్కముగా మాత్రమే గాక, అన్నివేళలలో రివాజు (rule) అగును. ఒక వ్యక్తి సాధారణముగా సాత్త్వికుడు, రాజసికుడు లేదా తామసికుడు కావచ్చును. కాని ఆ వ్యక్తి ఒక కార్యమునారంభించుటలో క్లేశముననుభవించుచున్నచో, అది తమోగుణ లక్షణమని తెలియవలెను. ఉదయమే నిద్ర లేచుటకు ముందు తమో గుణోద్రేకము స్పష్టముగా అనుభవమునకు వచ్చును. తమస్సు ప్రముఖగుణమైనప్పుడు మోహము కలుగును. అనగా బుద్ధికి ఆలోచించే శక్తి ఉండదు. ఒక వేళ ఆలోచించినా, తప్పుడు నిర్ణయములకు దారి తీయును. పనిని చేయుటకు ఇష్టపడని వ్యక్తి తనకు కర్మయందు గల విముఖతను ఆధారముగా చేసుకొని నిర్ణయములను చేయును. ఇట్టి నిర్ణయములు సరిగావనుటలో సందేహము లేదు. తమస్సు ప్రధానముగా గల వ్యక్తి తన నిష్క్రియత్వమును పలు విధములుగా సమర్థించుకొనును. అలసత్వమును సమర్థించుకొనుటకు జనులు కర్మసిద్ధాంతమును కూడ ఉటంకించెదరు. ఇంతకు ముందు నీవు చేసిన కర్మలకు నీవు బాధ్యుడవని ఈ సిద్ధాంతము బోధించును. అంతే గాని, కర్తవ్యకర్మలను చేయజాలక పారిపోయే అసమర్థతను ఈ సిద్ధాంతము సమర్థించుట లేదు.

జీవుడు ఈ గుణకార్యములచే ఈ జన్మలో మాత్రమే గాక రాబోవు జన్మలలో గూడ ప్రభావితుడై ఇడుముల బడయునని గీత చెప్పుచున్నది. సత్త్వగుణాధిక్యము గల వ్యక్తి ఈ జన్మలో మాత్రమే గాక మరుజన్మలో గూడ సుఖించును. అదే తీరున రజస్సు గాని, తమస్సుగాని అధికముగా ఉన్నచో, వాటి ప్రభావము ఈ జన్మలో పడుట మాత్రమే గాక, రాబోవు జన్మ

యొక్క స్వరూపమును గూడ అవి ప్రభావితము చేయును. జీవుడు దేహమును విడిన పిదప పొందే ఫలము కూడ గుణాధీనమై యుండును. కావుననే, భగవానుడిట్లు చెప్పుచున్నాడు:

**అధ్యాయము 14, శ్లోకము 14:**

यदा सत्त्वे प्रवृध्दे तु प्रलयं याति देहभृत् ।
तदोत्तमविदां लोकानमलान् प्रतिपद्यते ॥ १४ ॥

యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రలయం యాతి దేహభృత్
తదోత్తమవిదాం లోకానమలాన్ ప్రతిపద్యతే (14).

తు = కాని, యదా = ఏ కాలమునందు, సత్త్వే = సత్త్వగుణము, ప్రవృద్ధే = వృద్ధి చెందియున్నప్పుడు, దేహభృత్ = దేహమునందు ఉన్న జీవుడు, ప్రలయమ్ = మరణమును, యాతి = పొందునో, తదా = అపుడు, ఉత్తమ విదామ్ = ఉత్తమ జ్ఞానము గల వారి యొక్క, అమలాన్ = పవిత్రములైన, లోకాన్ = లోకములను, ప్రతి పద్యతే = పొందును.

కాని సత్త్వగుణము వృద్ధి చెందియున్నప్పుడు మరణించిన జీవుడు ఉత్తమ
జ్ఞానము గలవారి యొక్క పవిత్రమగు లోకములను పొందును (14).

ఈ దేహములో ఉపలభ్యమగు వాడు దేహ భృత్, అనగా జీవుడు. త్రిగుణములలో సత్త్వమునకు గల వైశిష్ట్యమును 'తు' అను అవ్యయము ప్రదర్శించును. జీవిత మంతయు సత్త్వము ప్రముఖముగా నున్నవానికి మరణసమయములో కూడ సత్త్వ-అతిశయము కొనసాగును. జీవితమంతయు రాజసికుడై యున్న వ్యక్తికి మరణకాలములో జనులు చెవిలో నారాయణ నామమును జపించినమా, అతనికి కొంత సొమ్ము బాకీ పడిన నారాయణ అయ్యరు మాత్రమే స్మృతికి దగులును. వ్యక్తియొక్క జీవితమునంతనూ శాసించిన ఆలోచనా ధోరణి మరణ సమయములో కూడ ప్రబలముగా నుండును. సాత్త్విక జీవనమును గడిపిన వ్యక్తిని గురించి ఈ శ్లోకము వర్ణించుచున్నది. ఇట్టివాడు మరణసమయములో కూడ (యదా ప్రలయం యాతి) సత్త్వ గుణ ప్రధానుడై యుండుటచే (సత్త్వే ప్రవృద్ధే) స్వర్గము మొదలైన దుఃఖరహితములగు లోకములను (లోకాన్ అమలాన్) పొందును. అతడు జీవించియుండగా పరిపక్వతను పొంది సాత్త్వికుడైనాడు గనుక, ఉత్తమజ్ఞానులు పొందగలిగే లోకములనాతడు పొందగల్గుట (ఉత్తమవిదాం లోకాన్ ప్రతి పద్యతే) సహజమే గదా! ప్రతి మానవుడు ఇట్టి

పరిపక్వతను సంపాదించి తీరవలెను. ఇట్టి పుణ్యాత్ములు ఇంద్రాది దేవస్థానముల నలంకరించెదరనియు, వారికి ఈ సర్వజగదధిష్ఠానమగు సత్యము ఎరుకయే ననియు శ్రీశంకరులు వివరించిరి.

**అధ్యాయము 14, శ్లోకము 15:**

रजसि प्रलयं गत्वा कर्मसंगिषु जायते ।
तथा प्रलीनस्तमसि मूढ योनिषु जायते ॥ १५ ॥

రజసి ప్రలయం గత్వా కర్మసంగిషు జాయతే
తథా ప్రలీనస్తమసి మూఢ యోనిషు జాయతే (15).

రజసి = రజోగుణము ప్రముఖముగా నున్నప్పుడు, ప్రలయమ్ = మరణమును, గత్వా = పొంది, కర్మయోనిషు = కర్మకు అంకితమైన దేహముల యందు, జాయతే = పుట్టును, తథా = అదే విధముగా, తమసి = తమస్సు అధికముగా నున్నప్పుడు, ప్రలీనః = మరణించిన వాడు, మూఢ యోనిషు = వివేకములేని జాతులలో, జాయతే = పుట్టును.

రజోగుణము ప్రముఖముగా నుండగా మరణించినవాడు కర్మకు అంకితమైన ప్రాణులయందు, అదే విధముగా తమోగుణము అధికముగా నుండగా మరణించిన వాడు వివేకరహితమగు జాతుల యందు జన్మించును (15).

జీవితమంతయు రజస్సే ప్రధానముగా గడిచిన వ్యక్తికి మరణసమయములో కూడ రజస్సే ప్రధానమగుటచే, అతడు కర్మకు అంకితమైన వారి మధ్యలో జన్మించును (కర్మసంగిషు జాయతే). ఇహపరలోకములలో వివిధ లక్ష్యములను పొందగోరి విభిన్నసాధనముల ననుష్ఠించుటకు కటి బద్ధులైన మానవులు కర్మసంగులనబడుదురు.

ఇదే విధముగా, తమస్సు ప్రధానముగా నున్న కాలములో మరణించిన జీవుడు సంమోహములో మునిగి ఉండే పశ్వాది యోనులలో జన్మించును. పశువులలో తమస్సు సర్వకాలములలో ప్రధానముగా నుండుటచే వాటికి ఆత్మాభిమానము, తన్మూలకముగా ఉద్భవించే సర్వసమస్యలు ఉండవు. ఉదాహరణకు, కుక్కకు బిస్కట్లను చాల ఎక్కువగా ఇచ్చి

తీరనుకొనుడు. అది వాటిలో కొన్నింటిని దాచి పెట్టే ప్రయత్నమును చేయదు. ఏలయన, దానికి భవిష్యత్తును గురించి అల్పవికసితమగు భావన మాత్రమే ఉండును. కావున దానికి పేరాప ఉండదు.

భవిష్యత్తును గురించి చింతిల్లే ఈ స్వభావము మానవులలో మాత్రమే గలదు. మానవులు తమ భవిష్యత్తు కొరకు మాత్రమే గాక, తమ పిల్లల భవిష్యత్తు కొరకు కూడ సంపదను ప్రోగుచేయుచుందురు. దీనికంతకూ మూలమునందు రజోగుణ ఆధిక్యము గలదు. ప్రతి మానవుని యందు తన గురించి తాను తెలుసుకొనుటకు చాలినంత సత్త్వముతో బాటు, సమ్మోహమును కలిగించుటకు చాలినంత రజస్సు, తమస్సు కూడ కలవు.

దీనిని బట్టి ఈ మూడింటిలో ఒక గుణము మిగిలిన రెండింటి కంటె అధికమాత్రలో ఉండనని మనము గమనించితిమి. జీవన మూల్యములను అనుశాసనమును పెంపొందించు కొనుట యోగమనబడును. యోగము సత్త్వగుణమును వృద్ధి చేసుకొనుటలో సహకరించును. ఈ వికాసప్రక్రియలోని ప్రధానాంశమేమనగా, సత్త్వగుణమును మిగిలిన రెండింటికంటె అధికముగా కలిగి యుండుటయే. అట్టి సాత్త్వికుడు తేలికగా గుణముల నధిగమించి, అనగా, ఆత్మకు వాస్తవముగా గుణములతో సంగము లేదని యెరింగి, గుణాతీతుడగును.

హరిః ఓం తత్సత్ శ్రీ కృష్ణార్పణమస్తు

శ్రీగణేశాయ నమః

ఇపుడు భగవానుడు గడచిన కొద్ది శ్లోకములలో చెప్పబడిన విషయమును సారసంగ్రహరూపముగా ప్రస్తుతించుచున్నాడు.

**అధ్యాయము 14, శ్లోకము 16 :**

कर्मणस्सुकृतस्याहुस्सात्त्विकं निर्मलं फलम् ।
रजसस्तु फलं दुःखमज्ञानं तमसः फलम् ॥ १६ ॥

కర్మణస్సుకృతస్యాహుస్సాత్త్వికం నిర్మలం ఫలమ్
రజసస్తు ఫలం దుఃఖమజ్ఞానం తమసః ఫలమ్ (16).

సుకృతస్య కర్మణః = పుణ్యకర్మ యొక్క, ఫలమ్ = ఫలము, సాత్త్వికమ్ = సత్త్వగుణ ప్రధానముగను, నిర్మలమ్ = దోష రహితముగను, స్యాత్ = ఉండును, తు = తద్భిన్నముగా, రజసః = రజోగుణమునకు, ఫలమ్ = ఫలము, దుఃఖమ్ = దుఃఖము, తమసః = తమోగుణమునకు, ఫలమ్ = ఫలము, అజ్ఞానమ్ = అజ్ఞానము అని, ఆహుః = చెప్పుచున్నారు.

> పుణ్యకర్మ యొక్క ఫలము సత్త్వగుణప్రధానముగను దోషరహితముగను ఉండును. తద్భిన్నముగా, రజోగుణమునకు ఫలము దుఃఖము, తమోగుణమునకు ఫలము అజ్ఞానము అని పండితులు చెప్పుచున్నారు (16).

పండితులు ఈ విధముగా చెప్పుచున్నారు (ఆహుః): పుణ్యకర్మను చేసినచో దాని ఫలము సత్త్వగుణప్రధానముగను, దుఃఖాది దోషరహితముగను, శుద్ధముగను ఉండును. ఒకడు జీవితమంతయు వేదవిహిత కర్మలన్నిటినీ చేసినాడు. ఇంతేగాక, వేదవిహితములైన కామ్యకర్మలను చేసి పుణ్యమును సంపాదించినాడు. అవి అన్నియు సత్త్వగుణము నుండి పుట్టిన మంచి కర్మలు. వీటి ఫలరూపముగా, అతడు మరణించిన తరువాత సత్త్వగుణము నుండి పుట్టిన దుఃఖరహితమైన స్వర్గలోకమును అనుభవించును. అతడా లోకములో కొంతకాలము వరకు నివసించును. ఇంతేగాక, ఈ పుణ్యకర్మల ఫలరూపముగా అతడు ఈ జీవితములో గూడ దుఃఖమునుండి ఆపేక్షికమగు విముక్తిని పొందును. ఇవి కొన్ని లక్ష్యములనుద్దేశించి వేదముచే విధింపబడిన కర్మలు

(విహిత కామ్యకర్మలు). వీటిని ఆచరించిన వ్యక్తి ఈ లోకములో అపేక్షిక సుఖమును అనుభవించుటయే గాక, సత్త్వగుణజనితమైన దుఃఖరహితమగు పరలోకమును అనుభవించును.

దీనికి భిన్నముగా, రజోగుణము నుండి పుట్టిన కర్మకు ఫలము దుఃఖము. రజోగుణప్రేరితుడైన వ్యక్తి అధికమగు ఒత్తిడికి లోనై ఉండుటచే, అన్ని సమయములలో ధర్మమార్గమును అనుసరించజాలడు. కావున, అతడు పాపమునకు ఒడిగట్టుట సహజమే. రజోగుణము అధికముగా నున్నప్పుడు పాపము తప్పనిసరి యగును. కావున, అతనికి దుఃఖము అనివార్యమగును. ఈ దుఃఖము వివిధరకములుగా అభివ్యక్తమగును. కావున, రజస్సు నుండి పాపకర్మ, దాని నుండి దుఃఖము కలుగును.

తమోగుణజనితములైన కర్మలకు ఫలము అజ్ఞానము. సంసారి అయి ఉండి ఆ సంగతి తెలియక పోవుట కంటె, తనను తాను సంసారినని భావించుటయే మేలు. ఆవు కూడా సంసారియే. కాని దానికి ఆ సంగతి తెలియక పోవుటచే, అది దాని నుండి బయట పడజాలదు. తమః ప్రధానమగు జీవితములో చేయబడే కర్మల ఫలరూపముగా ఇట్టి జన్మలు లభించును. ఇచట అజ్ఞానమనగా నదియే. ఈ గుణములనుండి ఇంకనూ ఏమి కలుగును?

**అధ్యాయము 14, శ్లోకము 17 :**

सत्त्वात्संजायते ज्ञानं रजसो लोभ एव च ।
प्रमादमोहौ तमसो भवतोऽज्ञानमेव च ॥ १७ ॥

సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ (17).

సత్త్వాత్ = సత్త్వగుణము నుండి, జ్ఞానమ్ = జ్ఞానము, చ = మరియు, రజసః = రజోగుణము నుండి, ఏవ = నిశ్చయముగా, లోభః = లోభము, సంజాయతే = పుట్టుచున్నది, తమసః = తమోగుణము నుండి, ప్రమాద మోహౌ = సోమరితనము మరియు మోహము, చ = మరియు, ఏవ = నిశ్చయముగా, అజ్ఞానమ్ = అజ్ఞానము, భవతః = కలుగును.

సత్త్వగుణము నుండి జ్ఞానము, రజోగుణము నుండి లోభము మరియు

తమోగుణము నుండి సోమరితనము, మోహము మరియు అజ్ఞానము కలుగుచున్నవి (17).

గుణముల వలన కలిగే భావి జన్మల గురించి చెప్పిన తరువాత భగవానుడు ఈ జన్మలో వాటివలన కలిగే ఫలమును గురించి చెప్పుచున్నాడు. సత్త్వము నుండి జ్ఞానము కలుగును. జ్ఞానము మోక్షమునిచ్చును గనుక, మంచి కర్మలను చేసి సత్త్వమును పెంపొందించు కొనవలెను. రజస్సు నుండి లోభము, తమస్సు నుండి సోమరితనము మరియు భ్రాంతధారణలు పుట్టును. ఆహారమును ఎన్నుకొనుట ఇత్యాదులలో వ్యక్తమయ్యే ఇష్టానిష్టములు, మరియు వివిధ రకముల భావావేగములు ఒక ప్రత్యేక గుణము అధిక మోతాదులో ఉన్నదని సూచించును. ఉదాహరణకు, స్వతంత్రమగు ప్రేమ సాత్త్వికము కాగా, ఉన్మాద రూపమగు ప్రేమ రాజసమగును. అది ద్వేషముగా పరిణమించినచో, అదియే తామసమనబడును. దానము వంటి కర్మలలో కూడ సాత్త్విక, రాజసిక, తామసిక భేదములు గలవు.

మనము యోగ్యమగు జీవనవిలువలను స్వంతము చేసుకొని అనుశాసనబద్ధమగు జీవనము ద్వారా మనఃపరిపక్వతను సంపాదించవలెను. ఈ ప్రక్రియను మనకు నేర్పి సహకరించుట కొరకై భగవానుడు ఈ గుణములను విస్తారముగా నిరూపించగలడు. జీవనవిలువలను విశ్లేషించుట ద్వారా దీనిని సాధించవచ్చును. కాని భగవానుడిచట సత్త్వరజస్తమస్సులు అనే వర్గములను విశ్లేషించి, తద్ద్వారా మన ఆలోచనలను, జీవితమును సత్త్వము ప్రముఖమగు విధముగా తీర్చిదిద్దుకొనుటలో సహాయపడుచున్నాడు. ఆ స్థితిలో గుణాతీత స్థితి సుగమమగును. ఏలయన, వ్యవహార స్థాయిలో తాను సాధించగల్గిన దానిని సాధించిన సాధకుడు వ్యావహారికసత్తను యథాతథముగా గుర్తించగల్గును. అపుడాతనికి శాస్త్రోపదేశానుసారముగా పారమార్థికసత్తకు చెందిన సత్యవస్తువు ప్రకటమగును.

అధ్యాయము 14, శ్లోకము 18 :

ऊर्ध्वं गच्छंति सत्त्वस्था मध्ये तिष्ठंति राजसाः ।
जघन्यगुणवृत्तिस्था अधो गच्छंति तामसाः ॥ १८ ॥

ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః (18).

సత్త్వస్థాః = సత్త్వగుణప్రధానులు, ఊర్ధ్వమ్ = పైలోకములకు, గచ్ఛంతి = వెళ్లెదరు, రాజసాః = రజోగుణప్రధానులు, మధ్యే = మధ్యలో, తిష్ఠంతి = ఉండెదరు, జఘన్యగుణవృత్తిస్థాః = గుణముల క్రింది స్థాయిలో ఉండే, తామసాః = తామసులు, అధః = క్రింది లోకములకు, గచ్ఛంతి = పోయెదరు.

> సత్త్వగుణప్రధానులు పై లోకములకు, గుణముల క్రింది స్థాయిలో ఉండే తామసులు అధోలోకములకు పోయెదరు. కాగా, రాజసులు మధ్యలో నుండెదరు (18).

ప్రధానముగా సత్త్వగుణప్రభావితులై కర్తవ్యకర్మలనాచరిస్తూ, నిషిద్ధకర్మలను పరిహరిస్తూ జీవించువారు సత్త్వస్థులనబడెదరు. ఇట్టివారు మరణించిన తరువాత భోగప్రధానములగు ఊర్ధ్వలోకములను పొందెదరు. ఈ మానవదేహము కంటె అధికశ్రేణికి చెందిన సుఖానుభవమును పొందగలిగే దేహేంద్రియమనస్సంఘాతము అతనికి అనుగ్రహింపబడును. కాని, అతడు ఆత్మజ్ఞాని కాడు. అట్టి వారు ఈ జీవితములో కూడ అధికశ్రేణికి చెందిన ఆనందమును అనుభవించెదరు. కాని ఇచట పరలోకము గురించి మాత్రమే చెప్పబడినది. అచట వారు నిశ్చితముగా ఉత్తమభోగముల ననుభవించెదరు.

వీటి మధ్యలో మానవలోకము, మరియు దానితో సమములగు స్థానములు గలవు. రజోగుణప్రధానమగు జీవనమును గడిపిన వారు వాటిలో జన్మించెదరు.

ఈ వరుసలో అట్టడుగున ఉన్న (జఘన్య) గుణము తమస్సు. తమోగుణముచే నియంత్రింపబడిన జీవితములను గడుపువారు దుఃఖాత్మకమగు అధోయోనులను పొందెదరు. రజస్సు మధ్యలో నుండుటచే, రాజసిక వ్యక్తి సాత్త్వికుడు గాని, తామసికుడు గాని కాగల్గును. కాని తామసికుడు సాత్త్వికుడు కాలేడు. తమోగుణము నిద్ర, పనులను వాయిదా వేయుచుండుట, సోమరితనము, నిర్లక్ష్యభావన ఇత్యాది రూపములతో ప్రకటమగునని మనము చూచియున్నాము. అట్టి జీవితమును గడుపువారు పశ్వాది అధోయోనులలో జన్మించెదరు.

పై సత్త్వగుణము ముక్తికొఱకే చెప్పబడినది. అయినచో, మనము దానిని పొందుటకొరకే ప్రయత్నము చేయవలసి యున్నది. కాని రజస్తమోగుణములవలె సత్త్వగుణము కూడ బంధహేతువని చెప్పినారు. దానిని ఎట్లు పోగొట్టుకొనవలెను?

గుణములతోడి సంగము వలన జన్మ కలుగునని మనము పూర్వాధ్యాయములో ప్రకృతిపురుష వర్ణనలో చూచియున్నాము. జీవునకు మిథ్యాజ్ఞానముచే గుణములతో సంయోగము ఏర్పడుచున్నది. దీనివలననే, పురుషుడు ప్రకృతిసంసర్గము కలవానివలె కన్పట్టుచున్నాడు. ఈ కారణముగనే, పురుషుడు తన యథార్థస్వరూపము ఆనందమని ఎరుంగక, దుఃఖమోహాదుల ననుభవించు చున్నాడు. ఈ అనుభవములన్నియూ సత్త్వరజస్తమోగుణముల అభివ్యక్తులు మాత్రమే. వాటిలో దారి తప్పిన మానవుడు 'బ్రహ్మను నేనే' యని గాక, 'నేను సుఖిని, దుఃఖిని, సమ్మోహితుడను' ఇత్యాది వచనములను పలుకుచున్నాడు. ఆత్మ అసంగమే అయినా, మిథ్యాజ్ఞానముచే ఈ గుణవికారములన్నింటితో సంబంధము గలది వలె కన్పట్టు చున్నది. వివిధములగు ఇష్టానిష్టజన్మలకు అదియే కారణమగుచున్నది. ఈ విషయము పూర్వాధ్యాయములో సంగ్రహముగను, ఈ అధ్యాయములో విస్తరముగను వర్ణింపబడినది.

మిథ్యాజ్ఞానముచే ఈ గుణములు బంధించునట్లు కనబడు విధమును వివరించిన తరువాత, శ్రీ కృష్ణుడు ఇపుడు ఈ బంధవిముక్తి-ఉపాయము పైకి దృష్టిని సారించుచున్నాడు. ఈ అధ్యాయ ప్రయోజనమదియే. ఈ గుణముల అభివ్యక్తిరూపములగు వివిధ రకముల ప్రవృత్తులనర్థము చేసుకొని, సత్త్వగుణము యొక్క అభివృద్ధికి ప్రయత్నించుట చాల మంచిది. కాని వ్యక్తి సత్త్వగుణమునకు కట్టుబడి పోవుటయూ శాస్త్రమునకు అభిమతము కాదు. వీటి నుండి విముక్తిని పొందు ఉపాయమును మానవుడు తప్పక తెలియవలెను. తరువాతి శ్లోకము ఈ విషయమును చెప్పుచున్నది.

**అధ్యాయము 14, శ్లోకము 19:**

नान्यं गुणेभ्यः कर्तारं यदा द्रष्टानुपश्यति ।
गुणेभ्यश्च परं वेत्ति मद्भावं सोऽधि गच्छति ॥ १९ ॥

నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధి గచ్ఛతి (19)

యదా = ఏ కాలములో, ద్రష్టా = జ్ఞాతయగు వ్యక్తి, గుణేభ్యః = గుణముల కంటె, అన్యమ్ = భిన్నమైన, కర్తారమ్ = కర్తను, న అనుపశ్యతి = కనడో, చ = మరియు, గుణేభ్యః = గుణములకంటె, పరమ్ = అతీతమైన ఆత్మను, వేత్తి = ఎరుంగునో, సః = అతడు, మద్భావమ్ = నాలో ఐక్యమును, అధిగచ్ఛతి = పొందును.

జ్ఞాతయగు వ్యక్తి ఏ కాలములో గుణములకంటె భిన్నముగా కర్త లేడనియు ఆత్మ గుణములకు అతీతమనియు ఎరుంగునో, ఆ కాలములో నా తత్త్వమునెరింగి నాలో ఐక్యమగును (19).

పశ్యతి అనగా 'అతడు చూచుచున్నాడు' అని యర్థము. 'అను' అనే ఉపసర్గతో గూడి 'స్పష్టముగా చూచుచున్నాడు' అని అర్థము వచ్చును. అనగా ఆచార్యుడు ఉపదేశించిన శాస్త్రమునకు అనురూపముగా స్పష్టముగా తెలుసుకున్నాడు అని యర్థము. ఆత్మయాథార్థ్యమే శాస్త్రతాత్పర్యమని ఎరింగిన వాడు ప్రమాణభూతమగు శాస్త్రము బోధించు సత్యమును సాక్షాత్కరించుకొనగల్గును. శాస్త్రము పదముల రూపములోనున్న జ్ఞానసాధనము. వాటి అర్థమును యథాతథముగా తెలుసుకున్నచో చాలును. ఈ జ్ఞానముగల వ్యక్తి గుణములకంటె కర్త వేరుగా లేడని ఎరుంగును. కావున, ఆత్మ కర్తయను భ్రాంతి అతనికి కలుగదు.

త్రిగుణాత్మకమగు మాయనుండి పుట్టిన ఈ దేహేంద్రియ-మనస్సంఘాతము క్రియలనాచరించుచుండును. ఒక క్రియ పూర్తి యగుటకు కర్త మాత్రమే గాక, ఇతర కారకములన్నియు ఆవశ్యకమగును. అవి కూడా మూడు గుణముల వికారములగు పదార్థములు మాత్రమే. ఇంతే గాక, జాగ్రత్-స్వప్న-సుషుప్తులనే మూడు అవస్థలు మరియు వాటి వివిధ-అభివ్యక్తులు కూడ గుణములు తక్క వేరు గాదని శ్రీశంకరులు వ్రాక్రుచ్చిరి.

ఇచట యదా (ఎప్పుడైతే) అను పదమును బట్టి ఇది ఒక ఘటన అనుకోరాదు. 'జ్ఞానియగు ద్రష్ట' అని వ్యాఖ్యానించి శ్రీశంకరులీ విషయమును స్పష్టము జేసిరి. ఆత్మ అకర్తయను సత్యము నెరింగిన అతడు గుణములకంటె వేరుగా మరియొక కర్త లేదని ఎరుంగును. చూచుట, వినుట ఇత్యాది కర్మలు జరుగుచున్ననూ తాను కర్మలను చేయుట లేదనియు, గుణములలో గుణములు మాత్రమే కదలాడు చున్నవనియు (గుణా గుణేషు వర్తంతే) ఎరింగిన తత్త్వవిత్ సత్యదర్శనము గలవాడని భగవానుడిదివరలో చెప్పియున్నాడు.

ఇచటి ప్రముఖవిషయమేమనగా, అతడు ఆత్మస్వరూపమును స్పష్టముగా నెరుంగును. అట్లుగానిచో, సర్వక్రియలను చేసేవి గుణములే అయినా, తనకు వాటితో సంబంధము గలదని తలపోయువాడు అవి చేయు కర్మలచే ప్రభావితుడగును. పుత్రుడు నేరగాడైనచో, నేరములను చేసినది పుత్రుడే గాని తాను కాదని తెలిసినా, దాని ప్రభావము తండ్రిపై పడి తీరును. గుణములచే నిర్వహింపబడే క్రియాకలాపము మరియు ఆత్మ అను విషయములో గల

భ్రాంతధారణను తొలగించుటకై భగవానుడిట్లు చెప్పుచున్నాడు: తన మూలముగనే గుణములు కార్యకారులు అగుచున్ననూ, తాను గుణాతీతుడనని ఎరిగిన వాడు (గుణేభ్యశ్చ పరం వేత్తి) వాటి క్రియాకలాపముతో లేపమును పొందడు. దీనికి ఒక దృష్టాంతము గలదు. ఆకాశము సర్వమునకు అవకాశమునిచ్చును. కాని ఆకాశములో జరిగే ఘటనలచే ఆకాశము ప్రభావితము కాదు. తాను గుణముల క్రియలలో సాక్షిని మాత్రమేనని జ్ఞాని ఎరుంగును. కర్మలను వేటినీ చేయని ఆత్మ సర్వదా సాక్షియై నిలచునని శ్రీశంకరులు వివరించిరి.

ఇట్టి జ్ఞానికి మద్భావము (నా స్వరూమును పొందుట) అను ఫలము లభించునని భగవానుడు చెప్పుచున్నాడు. ఈ మద్భావాపత్తి సర్వమునకు కారణమగుటయే గాక, సర్వమునకు అతీతమై యుండును. ఈ జ్ఞానికి ఈశ్వరునితో భేదము సమసి పోయినది. అది నీవే అయి ఉన్నావు (తత్ త్వం అసి) అను వాక్యము అతనికి యథార్థమైనది. 'నా మూలకముగా కర్త ఉన్ననూ, కర్త నేను కాదు' అని ఎరింగిన ఆ జ్ఞాని 'ఆ పరబ్రహ్మ నేను' యని చెప్పును. ఈ స్పష్టమగు దర్శనము గల వ్యక్తికి ఈశ్వరునితో భేదము లేదు.

ఒక విశిష్టవ్యక్తి యగు జీవునకు ఈశ్వరునితో అభేదము ఎట్లు పొసగును?

**అధ్యాయము 14, శ్లోకము 20:**

गुणानेतानतीत्य त्रीन् देही देहसमुद्भवान् ।
जन्ममृत्युजरादुःखैर्विमुक्तोऽमृतमश्नुते ॥ २० ॥

గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్
జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోమృతమశ్నుతే (20)

దేహీ = దేహమునందు నివసించు జీవుడు, దేహ సముద్భవాన్ = శరీరము పుట్టుటకు హేతువులైన, ఏతాన్ = ఈ, త్రీన్ = మూడు, గుణాన్ = గుణములను, అతీత్య = అతిక్రమించి, జన్మ-మృత్యు-జరా-దుఃఖైః = పుట్టుక, మరణము, వృద్ధాప్యము మరియు దుఃఖము అను వాటి నుండి, విముక్తః = విముక్తిని పొందిన వాడై, అమృతమ్ = అమృతత్వమును, అశ్నుతే = పొందును.

దేహమునందు నివసించే జీవుడు దేహోత్పత్తికి హేతువులగు ఈ మూడు

గుణములనతిక్రమించి, పుట్టుక, మరణము, వృద్ధాప్యము, దుఃఖము అను వాటినుండి విముక్తిని పొంది అమృతత్వము (మోక్షము) ను పొందును (20).

ఈ దేహేంద్రియ-మనస్సంఘాతము పుట్టుటకు ఈ మూడు గుణములే కారణము. అట్టి స్థితిలో ఈ దేహములో నివసించి యుండగనే, వాటికి అతీతుడగుట ఎట్లు సంభవమగును? దీనిలోని అందమేమనగా, ఆత్మ త్రికాలములయందు గుణవినిర్ముక్తమై యున్నది. కావున, ఈ గుణములనతిక్రమించుటలో వాస్తవమగు కదలిక లేదు. ఆత్మ సర్వగుణవినిర్ముక్తమని ఎరిగిన చాలును. ఈ దేహమునందు నివసించు వ్యక్తి ఆ జ్ఞానముచే జన్మమరణములనుండియు, మరియు వాటి మధ్యలో నుండే వృద్ధాప్యము మొదలగు సర్వమునుండియు విముక్తుడగును. అతడు ఈ స్థూలదేహవిషయములనుండి మాత్రమే గాక, మానసిక పీడలనుండి కూడ విముక్తుడగును. వీటిని వర్ణించుటకు దుఃఖము అను పదము ఒక్కటియే చాలును. మానవుని జీవితము ఒక దుఃఖము నుండి మరియొక దుఃఖములోనికి సాగుచుండును. అప్పుడప్పుడు మధ్యలో కొద్దిగా సుఖము కలుగుచుండును. కాన మనము దుఃఖమునుండి విముక్తిని కోరెదము.

ఈ మోక్షము మనిషి జీవించియుండగా లభించును. మరణానంతరము విముక్తి అసంభవము. బద్ధుడు మాత్రమే మరణించును. మరణానంతర-అనుభవములన్నియు బద్ధునకు మాత్రమే ఉండును. బ్రహ్మలోకప్రాప్తి కూడ మోక్షము కాదు. కాని బ్రహ్మలోకమును పొందిన జీవునకు బ్రహ్మగారు జీవబ్రహ్మైక్యమును బోధించు అవకాశము గలదు. అప్పుడైననూ, మోక్షము విలంబము లేకుండగా వెంటనే కలుగును. జన్మమరణములు మొదలగు సర్వ-అనిష్టములనుండియూ ఆత్మ వినిర్ముక్తమనే సత్యమును మానవుడు జీవించియుండగనే గుర్తించవచ్చును. ఆత్మ ఈ క్షణములో ముక్తము గనుక, ఈ జ్ఞానమును పొందుటకై మరణము వరకు వేచియుండ బనిలేదు. ఈ సత్యమునెరింగిన వాడు శాశ్వతపరబ్రహ్మ (అమృతమ్) ను పొందును. ఇట్టివానికి మరణించిన తరువాత పునర్జన్మ లేదు. ఏలయన, ఆత్మ గుణాతీతమని ఎరింగిన వ్యక్తి గుణములచే బద్ధుడు కాడు. ఇది జ్ఞానికి విశ్వాసార్హమగు విషయము కాదు. ఇది సత్యదర్శనము. ఆత్మరూపుడనగు తాను శాశ్వతుడనని ఎరింగిన జ్ఞానికి జన్మప్రసక్తి ఎక్కడిది? కాలవశములో లేని ఆత్మ పునర్జన్మకు ఎట్లు అధీనమగును?

అర్జునుడిచట మెల్లగా ఒక ప్రశ్నను ఇరికించినాడు. జ్ఞానియొక్క లక్షణమేమి? అని అతడు 2వ అధ్యాయములో ప్రశ్నించియున్నాడు. మరికొన్ని అధ్యాయములు దాటిన తరువాత

అతడు మరల అదే ప్రశ్నను రూపము మార్చి అడిగినాడు. గుణాతీతుడు అమృతుడగునను వచనము అర్జునుని ప్రశ్నకు అవకాశమును కలిగించినదని శ్రీశంకరులు వివరించిరి. ఈ అమృతత్వమును పొందేది దేహములో నివసించే జీవుడు (దేహి) గనుక, మానవుడు జీవించియుండగనే జీవ–పరమేశ్వరుల అభేదమును గుర్తించవచ్చునని స్పష్టమగుచున్నది.

**అధ్యాయము 14, శ్లోకము 21:**

अर्जुन उवाच ।
कैर्लिंगैस्त्रीन् गुणानेतानतीतो भवति प्रभो ।
किमाचारः कथं चैतांस्त्रीन् गुणानतिवर्तते ॥ २१ ॥

అర్జున ఉవాచ
కైర్లింగైస్త్రీన్ గుణానేతానతీతో భవతి ప్రభో
కిమాచారః కథం చైతాంస్త్రీన్ గుణానతివర్తతే (21)

**ప్రభో** = ఓ భగవానుడా!, **కైః** = ఏ, **లింగైః** = లక్షణములచే, **ఏతాన్** = ఈ, **త్రీన్** = మూడు, **గుణాన్** =గుణములను, **అతీతః** = దాటినవాడు, **భవతి** = అగును, **చ** = మరియు, **కిమాచారః** = ఎట్టి ప్రవర్తన గలవాడై, **కథమ్** = ఎట్లు, **త్రీన్** = మూడు, **గుణాన్** = గుణములను, **అతివర్తతే** = అతిక్రమించును?

> ఓ భగవానుడా! ఈ మూడు గుణములనతిక్రమించిన వానిని ఏ లక్షణములను బట్టి గుర్తించవలెను? వాని ప్రవర్తన ఎట్లుండును? అతడీ మూడు గుణములనెట్లు అతిక్రమించినాడు? (21)

ఈ త్రిగుణములనతిక్రమించినవానిని గుర్తు పట్టుటకు ఉపయోగపడే లక్షణములేవి యను విషయమును అర్జునుడు తెలియగోరెను. ఇంతేగాక, అతని ప్రవర్తన (ఆచారము) ఎట్లుండును? అర్జునుడు ఇంతకు ముందు అడిగిన ప్రశ్ననే మరింత విస్తృతమగు అర్థము వచ్చునట్లు అడిగినాడు. అతడు ఎట్లు కూర్చుండును? (కూర్చుండునా?); అతడు ఎట్లు నడచును? (నడచునా?); అతడు ఎట్లు మాటలాడును? (మాటలాడునా?) అని అర్జునుడు 2 వ అధ్యాయములో ప్రశ్నించియున్నాడు. ఇపుడాతడు మరియొక ముఖ్యమగు ప్రశ్నను అడుగుచున్నాడు. అతడీ త్రిగుణములనెట్లు అతిక్రమించును? వీటినుండి బయటపడే మార్గము కలదా? ఉన్నవి మూడు

ప్రశ్నలే అయిననూ, శ్రీశంకరులు వాటిని రెండుగా కుదించిరి. మొదటి రెండు ప్రశ్నలు జ్ఞానిని గుర్తు పట్టుట, మరియు జ్ఞాని వర్ణనకు సంబంధించినవి. మూడవ ప్రశ్న గుణములనతిక్రమించు ఉపాయమునకు సంబంధించినది.

భగవానుడు మొదటి ప్రశ్నకు సమాధానము నిచ్చుచున్నాడు :

అధ్యాయము 14, శ్లోకము 22 :

श्री भगवानुवाच ।
प्रकाशं च प्रवृत्तिं च मोहमेव च पांडव ।
न द्वेष्टि संप्रवृत्तानि न निवृत्तानि कांक्षति ॥ २२ ॥

శ్రీ భగవానువాచ
ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి (22)

పాండవ = ఓ అర్జునా!, ప్రకాశమ్ = ప్రకాశమును, చ = మరియు, ప్రవృత్తిమ్ = క్రియాశీలతను, చ = మరియు, ఏవ = నిశ్చయముగా, మోహం చ = మోహమును కూడా, సంప్రవృత్తాని = ఘటిల్లినపుడు, న ద్వేష్టి = ద్వేషించడు, నివృత్తాని = తొలగిపోయినపుడు, న కాంక్షతి = కోరడు.

ఓ అర్జునా! ప్రకాశము, క్రియాశీలత మరియు మోహము సంభవించినపుడు
అతడు ద్వేషించడు; తొలగిపోయినపుడు కోరడు (22).

జాగరూకత, ఉల్లాసముతో కూడి ఉండే స్వభావము ఇత్యాది సత్త్వగుణకార్యములకు ప్రకాశమని పేరు. కామమలచే ప్రేరితమైన క్రియాశీలత ప్రవృత్తి అనబడును. ఇది రజోగుణకార్యము. జడత్వము, పట్టించుకొనకపోవుట ఇత్యాదులు మోహమనబడును. ఇది తమోగుణము నుండి పుట్టును. ఇవి (ఇచట ఏతాని అను పదమును అధ్యాహారము చేయవలెను) సంభవించినపుడు అతడు వాటిని ద్వేషించడు. అవి తొలగిపోయినపుడు అతడు వాటిని కాంక్షించడు (న నివృత్తాని కాంక్షతి).

ఇవి మూడు గుణముల కార్యములని స్పష్టముగా గుర్తింపబడినవి. మోహము లేక

జడత్వము అనుభవమునకు వచ్చినపుడు తమోగుణము అధికముగా నున్నదని అతడు గుర్తించును. తన మనస్సులో తమస్సు ప్రకటమగుటను అతడు దర్శించగలడు. కావున, అతడు తమోగుణప్రభావముచే తన గురించి ఒక నిష్కర్షకు రాడు. అనగా తమోగుణముతో తాను లేపమును పొందడు. అదే విధముగా అశాంతి మరియు క్రియల నాచరించవలెననే అభిముఖ్యము గోచరించినపుడు, అది రజోగుణప్రభావము మాత్రమేనని అతడు గుర్తించును. సుఖానుభవము కలిగినపుడు దానికి బాధ్యత సత్త్వగుణముదేనని గుర్తించి, అతడు దానిచే బద్ధుడు కాడు. ఈ అనుభవములన్నియూ గుణకార్యములేననే స్పష్టమగు అవగాహన అతనికి ఉండుటచే, అతడు వాటిచే ఆకర్షింపబడడు, మరియు వాటిని ద్వేషించడు. అవి ఘటిల్లినపుడు (సంప్రవృత్తాని), అతడు తనను వాటికంటె భిన్నముగా దర్శించి లేపమును పొందడు. అవి ఆధారముగా తనను గురించి నిష్కర్షలను చేయడు. మనస్సు గుణముల వశములో నున్నది. కావున, అది ఒకప్పుడు మందముగా నుండవచ్చును. అవలింత వచ్చినపుడు తాను సచ్చిదానందస్వరూపమునుండి చ్యుతుడనైతినని జ్ఞాని తలపోయడు. అవలింత వచ్చినపుడు అవలింత వచ్చినదని అతడు గుర్తించును. అంతకు మించి ఏమీ లేదు. మందముగా నున్నప్పుడు అది మనోధర్మము. మనస్సు ప్రకాశయుతముగా నున్నప్పుడు అది కూడా మనోధర్మమేనని అతడు గుర్తించును. మనస్సు అశాంతముగా నున్నప్పుడు, అతడా సత్యమును కూడా గుర్తించును. గుణములనతిక్రమించియున్న అతనికి సమస్యలే లేవు.

ఆత్మకు గుణములతో అసంగము ఆకాశమునకు ఘటముతో అసంగము (involvement) వంటిది. ఘటము పెద్దదైనా, చిన్నదైనా, ఆకాశము ఏ విధముగనైననూ ప్రభావితము కాదు. అదే విధముగా, ఆత్మ మనస్సులో సర్వదా ప్రకాశించుచున్ననూ, లిప్తము కాదు. ఈ జ్ఞానము గలవానికి 'నేను' భావన మనోవృత్తి-వికారములలో గాక, సచ్చిదాత్మ యందు ఉండును. కావున, ఒక విశిష్ట-మనోదశను గురించి అతడు ఆదుర్దాను పొందడు. అది తన దారిన తాను వచ్చి, తన దారిన తాను వెళ్ళును. అతడు గుణాతీతుడు గనుక, దాని గురించి కంగారు పడడు. గుణములు దేనిని ప్రస్తుతించిననూ, అతడు ఉల్లాసముగనే యుండును. దీనిలో మంచి-చెడు అనే భేదము లేదు.

ఈ ఉపదేశము ఆత్మనింద కొరకు గాని, తనను తాను అభిశంసించుకొనుట కొరకు గాని ఉద్దేశింపబడలేదు. వ్యక్తి తనను గురించి అవగాహన పెంపొందించుకొనుటయే దీని ప్రయోజనము. మరియు ఈ వర్ణన ఆధారంగా మరియొక వ్యక్తిని గుణాతీతుడని గాని, కాదని

గాని, నిశ్చయించుట సంభవము కాదు. ఈ గుణాతీతత్వము కంటికి కనపడేది కాదని శ్రీ శంకరులు వివరించిరి. ఇతర వ్యక్తి యొక్క ఆత్మను చూడనిదే, ఆతడు గుణాతీతుడు అగునా, కాదా యను విషయమును నిర్ధారించుట సంభవము కాదు. గుణాతీతత్వ స్థితి ఆత్మ-స్వరూప-అభిన్నము. ఆత్మ గుణాతీతమను జ్ఞానమే ఆత్మజ్ఞానము. అది ఎవనికి వానికే తెలియును గాని, ఇతరులకు తెలిసేది కాదని శ్రీ శంకరులు చెప్పిరి. నీవు గుణాతీతుడవు అవునో, కాదో నీకు తెలుస్తుంది. నీవు నీ మనస్సును ఆధారముగా చేసుకొని నిన్ను అభిశంసించుకున్నచో, ఇట్టి అభిశంసనకు గల కారణమును నీవెరుంగవలెను. మనస్సును గాని, ఇతరమును గాని ఆధారముగా చేసుకొని నిన్ను నీవు అభిశంసించు కొనకుండుటయే గుణాతీతస్థితి యగును. ధనము అనే దృష్టికోణములో వ్యక్తి ధనికుడు గాని, బీదవాడు గాని యగును. దేహదృష్టితో చూస్తే వ్యక్తి యువకుడు గాని, వృద్ధుడు గాని యగును. ఈ విష్కర్షలన్నియూ గుణాంతర్గతములై యున్నవి. గుణాతీతుడగుట యనగా ఆత్మను యథాతథముగా తెలుసుకొనుట మాత్రమే.

గుణముల నాధారముగా చేసుకొని తనను తాను అభిశంసించుకొనకుండుట అనే లక్షణము ముముక్షువునకు ఆత్మజ్ఞానోదయము కొరకై సంసిద్ధమగుటలో చాల సహకరించును. మానసిక-అవస్థలన్నియూ మనస్సు మాత్రమేనను దర్శనమును సాధకుడు అలవరచు కొనవలెను. సంతత-పరివర్తన మనస్సు యొక్క సహజలక్షణము. తనకు మనస్సునకు మధ్యలో గల దూరమును గుర్తించి, ఈ సత్యమును దర్శించు వ్యక్తి గుణాతీతుడగును. మనస్సు యొక్క లక్షణమును మార్చుటలో మనకు అభిరుచి లేదు. మనస్సును యథాతథముగా దర్శించుట యందు మాత్రమే మనకు అభిరుచి గలదు. ఇది ముముక్షువు కొరకు ఉద్దేశింపబడినది.

ఈ స్థితికి ముందు వ్యక్తిలో మానసిక-అవస్థలు తీవ్రముగా నుండే పరిస్థితి ఉండవచ్చును. దీనికి కారణము బాల్యమునందు మనస్సులో గూడుకట్టుకొనియున్న దుఃఖానుభూతి మిగిలియుండుటయే. దానిని మరియొక విధముగా పరిష్కరించవలెను. ముందుగా ప్రాతిభాసికమును వ్యావహారికములో విలీనము చేయవలెను. తన ముందున్న పరిస్థితులలో వ్యక్తి చూపే ప్రతిస్పందనకు ఆతడు బాల్యములో అనుభవించిన సమస్యలు మూలమగు చుండును. ఆ ప్రతిస్పందనలకు వాస్తవికతతో సంబంధమేమియూ ఉండదు. వ్యక్తి తనలోని ఈ కాల్పనిక దర్శనమును వాస్తవిక స్థాయి లోనికి తీసుకు రావలెను. అప్పుడు మనస్సు సత్త్వరజస్తమోగుణముల వశములో నున్నదను సత్యము గోచరించును. ఆ సత్యము గోచరము కాగానే, ఆత్మ గుణాతీతమను జ్ఞానము ఉదయించును.

జ్ఞానియొక్క లక్షణములిట్లుండును. బాగున్నది. కాని, అతడు ప్రపంచములో వ్యవహరించు తీరుతెన్నులు ఎట్లుండును? రాబోవు కొన్ని శ్లోకములలో ఈ విషయము వివరింప బడుచున్నది:

**అధ్యాయము 14, శ్లోకము 23:**

उदासीनवदासीनो गुणैर्यो न विचाल्यते ।
गुणा वर्तंत इत्येव योऽवतिष्ठति नेंगते ॥ २३ ॥

ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే
గుణా వర్తంత ఇత్యేవ యోవతిష్ఠతి నేంగతే (23)

యః = ఎవడైతే, ఉదాసీనవత్ = ఉదాసీనుని వలె, ఆసీనః = కూర్చున్నవాడై (ఉన్నవాడై), గుణాః ఏవ = గుణములు మాత్రమే, వర్తంతే = క్రియాశీలములగు చున్నవి, ఇతి = అని (తెలియువాడై), గుణైః = గుణములచే, న విచాల్యతే = చలింపచేయబడడో, యః = ఎవడైతే, న ఇంగతే = చలనము లేక ఉండునో, అవతిష్ఠతే = (వాడు మాత్రమే) ఆత్మనిష్ఠుడై ఉండును.

> ఎవడైతే ఉదాసీనుని వలె కూర్చున్నవాడై, గుణములు మాత్రమే క్రియలనాచరించుచున్నవని తెలుసుకొని, గుణములచే చలింపచేయబడకుండ నుండునో, అట్టి వాడు మాత్రమే స్వరూపనిష్ఠుడై యుండును (23).

ఒకానొక పక్షమునకు కట్టుబడని వ్యక్తి ఉదాసీనుడనబడును. ఇద్దరు వ్యక్తులు వాదించుకొనుచుండగా, ఏ ఒక్కరి పక్షములోనైననూ చేరకుండగా కేవలము పరిశీలించే మూడవ వ్యక్తి ఉదాసీనుడగును. అతడు సాక్షిమాత్రుడై వారిద్దరి వాదములను పట్టించుకొనడు; తన అభిప్రాయమును ప్రకటించడు. అనేకవస్తువుల విషయములో ఈ అలవాటు మనందరికీ గలదు. దారి ప్రక్కన మొలిచిన పిచ్చి మొక్కను గురించి మనమే మాత్రమైననూ పట్టించుకొనము. మనకు ఒక స్థిరమగు అభిప్రాయము లేని కొన్ని ప్రసంగములలో మనము ఉదాసీనులమై చూస్తూ ఉంటాము.

ఆసీనః అను పదమునకు కూర్చుని యుండుట అని యర్థము. కాని ఈ సందర్భములో ఆ పదమునకు 'గుణములనతిక్రమించే ఉపాయమునకు అంకితమైయుండుట' అని యర్థము. సత్త్వరజస్తమోగుణములలో ఏ గుణము అతిశయప్రభావము కలిగియున్ననూ అతనికి అభ్యంతరము లేదు. అతడు వాటిని మార్చే యత్నమును చేయడు. మనస్సు ఉన్నది ఉన్నట్లుగా అతనికి అంగీకార్యమగును. గుణముల అభివ్యక్తిలో అతడు తన వైపునుండి అడ్డు తగలడు; తాను వాటితో తాదాత్మ్యమును చెందడు. అతనికి గుణములలో ఒకదానిపై మక్కువ ఎక్కువ అను పరిస్థితి లేకుండుటచే, ఉదాసీనుని వంటి వాడే యగును. ఆత్మజ్ఞానియగు ఆ సన్న్యాసి గుణముల అభివ్యక్తి మూలకముగా ఆత్మ జ్ఞానము నుండి చ్యుతుడు కాబోడు.

రజస్తమోగుణములు నా జ్ఞానమునపహరించి వేయుచున్నవని ఎవరైననూ ఫిర్యాదుము చేసినచో, మనమిచట అట్టి జ్ఞానమును గురించి మాటలాడుట లేదు. గుణములు దేహేంద్రియమనస్సంఘాతమును మాత్రమే ప్రభావితము చేయును. వాటికి ఆత్మపై ఎన్నడైననూ ఎట్టి ప్రభావమైననూ లేదు. స్పష్టమగు ఆత్మసాక్షాత్కారమును అవి ప్రభావితము చేయు ప్రసక్తి లేదు.

గుణములు క్రియాశీలములని భగవానుడు శ్లోకద్వితీయార్ధములో చెప్పుచున్నాడు (గుణాః వర్తంతే). అనగా గుణములే జగత్తుగను దేహేంద్రియమనస్సంఘాతరూపముగను పరిణమించి యున్నవి. ప్రాణమునకు కర్మేంద్రియములకు రజోగుణము, జ్ఞానేంద్రియములకు అంతఃకరణమునకు సత్త్వగుణము హేతువులు కాగా, తమోగుణము పంచభూతములుగా పరిణమించినది. అవి మరల ద్విధా విభాగమును చెంది, పంచీకరణ ప్రక్రియద్వారా సమస్త జగద్రూపముగా పరిణమించినవి. కావున, మనచే తెలియబడే ఈ సర్వము త్రిగుణములు తక్క వేరు గాదు. నీవు చూచేది, అనుమితి (interence) చేసేది, మరియు ఊహించేది సర్వము గుణముల అభివ్యక్తి మాత్రమే. ఈ గుణములు తమలో తాము వ్యవహారమును నడుపుచుండును. నీవు పూర్తిగా వాటి మధ్యలో చిక్కుకొని యున్ననూ, నీవు వాటిచే లేశమైననూ ప్రభావితుడవు కావు. ఇది శాస్త్ర ప్రోక్తమగు సత్యము. ఈ సత్యమునందు లగ్నమైన మనస్సు గలవాడు స్వస్వరూపమునుండి విచలితుడు కాడు. అతడే గుణములన్నిటి నుండి విముక్తుడై, ఆత్మనిష్ఠుడై యుండుటచే, గుణములలో వచ్చే మార్పులు అతనికి ఆందోళనను కలిగించజాలవు.

శ్రీకృష్ణుడింకనూ ఇట్లు చెప్పుచున్నాడు:

**అధ్యాయము 14, శ్లోకము 24:**

समदुःखसुखः स्वस्थः समलोष्टाश्मकांचनः ।
तुल्यप्रियाप्रियो धीरस्तुल्यनिंदात्म संस्तुतिः ॥ २४ ॥

సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాంచనః
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిందాత్మసంస్తుతిః (24)

సమదుఃఖసుఖః = సుఖదుఃఖములయందు సమముగా నుండువాడు, స్వస్థః = ఆత్మనిష్ఠుడై ఉండువాడు, సమలోష్టాశ్మకాంచనః = మట్టి బెడ్డ, రాతి ముక్క, మరియు బంగారము అను వాటి విషయములో సమముగానుండువాడు, తుల్యప్రియాప్రియః = ఇష్టానిష్టపరిస్థితులలో సమానముగ నుండువాడు, ధీరః = జ్ఞాని, తుల్యనిందాత్మసంస్తుతిః = తనను పొగడినా తెగడినా సమానముగ స్వీకరించువాడు.

> అతడు సుఖదుఃఖములయందు ఇష్టానిష్టపరిస్థితులయందు సమముగా నుండును. ఆత్మనిష్ఠుడగు జ్ఞాని మట్టిబెడ్డ, రాతిముక్క మరియు బంగారము అను వాటి విషయములో సముడై యుండును. ఇతరులు తనను పొగడినా, తెగడినా అతడు సమానముగా స్వీకరించును (24).

సుఖదుఃఖములలో సమముగా నుండు వ్యక్తి (సమదుఃఖసుఖః) ని గూర్చి మనమిచట చర్చిస్తున్నాము. కొన్ని పరిస్థితులు సుఖమును, మరికొన్ని దుఃఖమును కలిగించును. ఈ జన్మలో మరియు పూర్వజన్మలలో చేసిన కర్మల ఫలము ఈ రెండు రకముల పరిస్థితుల రూపములో మానవునకు ఎదురగుచుండును. వ్యక్తి వాటిని ఎట్లు ఎదుర్కొనవలెను? ఆత్మజ్ఞానికి అవి రెండు సమానమే. ఇది సాధనారూపములో సాధకుడు పెంపొందించుకునే మానసిక ప్రవృత్తి మాత్రమే గాదు. మనము సుఖదుఃఖములను వాస్తవిక దృష్టికోణముతో మాత్రమే గాక, ప్రసాదబుద్ధితో స్వీకరించెదము. ఈశ్వరుని గుర్తించిన వ్యక్తి వాటిని ఆనందముగ స్వీకరించి, సముచితముగా స్పందించి తగిన ప్రతిక్రియను చేపట్టును. కర్మయోగమనగా నిదియే. కాని, శ్రీకృష్ణుడిచట గుణాతీతుని గురించి మాటలాడుచున్నాడు. గుణాతీతునకు ఎదురయ్యే వివిధ పరిస్థితులను బట్టి మనస్సులో సత్త్వగుణకార్యమగు సుఖము గాని, రజోగుణకార్యమగు దుఃఖము గాని కలుగుట

సహజమే. కాని అతడు వాటిని సమముగా స్వీకరించును. సుఖమైనా, దుఃఖమైనా, అతడు ప్రభావితుడు గాడు.

స్వస్థః అను పదమునకు రెండు అర్థములు గలవు. తనలో తాను ఉండువాడు (స్వే ఆత్మని తిష్ఠతి). గుణాతీతమగు సచ్చిదానంద-ఆత్మయే నేను అను సాక్షాత్కారమునందాతడు ఉండును. ఆనందముగా, తృప్తిగా నుండువాడు (స్వస్మిన్ తిష్ఠతి) అని రెండవ యర్థము. మనస్సులో గాని, బాహ్యప్రపంచములో గాని, ఏది జరిగినా, అతడు ఆనందముగా నుండును.

సమలోష్టాశ్మకాంచనః అను ప్రయోగమును మనము 6 వ అధ్యాయములో చూచియున్నాము. లోష్టమనగా మట్టి బెడ్డ. అశ్మ యనగా రాయి. కాంచనమనగా బంగారము. అతనికి ఇవన్నీ సమానమే. అన్ని పృథివీవికారములే. అతని దృష్టిలో వాటి మధ్య భేదము లేదు. మానవుని దృష్టిలో ఒక వస్తువునకు గల విలువ అధ్యస్త (superimposed) మనియు, కాల్పనికమనియు అతడు సుస్పష్టముగా నెరుంగును. బంగారము సాగే గుణము గల అరుదైన ప్రకాశించే లోహమనియు, కాని అది తనకు ఒక రాతి ముక్కను మించిన భద్రతనీయజాలదనియు అతడు గుర్తించును. బంగారము అతని గుణాతీతత్వమునకు కొత్త శోభనీయజాలదు.

మరియు, అతడు ఇష్ట-అనిష్ట పరిస్థితులలో సమముగా నుండును (తుల్యప్రియ-అప్రియః). ప్రియ-అప్రియ పరిస్థితులు ఈ జ్ఞానికి ఆందోళనను కలిగించకపోవుటకు కారణము అతని జ్ఞానమే గాని, మానసిక-ప్రవృత్తి కాదు. ఇతరులు నిందించినపుడు అతడు చిన్నబుచ్చుకోడు; పొగిడినపుడు పొంగిపోడు. అతడీ రెండు పరిస్థితులలో సమముగా నుండును. గొప్పది అని మనము భావించుటచే ఆత్మ పొంగిపోదు; మనము తప్పుగా తెలుసుకొనుటచే, ఆత్మకు హాని కలుగదు.

**అధ్యాయము 14, శ్లోకము 25:**

मानापमानयोस्तुल्यस्तुल्यो मित्रारिपक्षयोः ।
सर्वारंभपरित्यागी गुणातीतस्स उच्यते ॥ २५ ॥

మానాపమానయోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః
సర్వారంభపరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతే (25).

మానాపమానయోః = స్తుతినిందల విషయములో, తుల్యః = సమముగా నుండువాడు, మిత్రారిపక్షయోః = మిత్రశత్రుపక్షముల విషయములో, తుల్యః = సమముగా నుండువాడు, సర్వారంభపరిత్యాగీ = ఉపక్రమములనన్నిటినీ విడిచి పెట్టినవాడు, సః = అతడు, గుణాతీతః = గుణములకు అతీతుడని, ఉచ్యతే = చెప్పబడును.

> స్తుతినిందల విషయములో, మరియు మిత్రశత్రుపక్షముల విషయములో సమముగా నుండువాడు, ఉపక్రమముల నన్నిటినీ విడిచిపెట్టినవాడు అగు వ్యక్తి గుణములకు అతీతుడని చెప్పబడును (25).

గౌరవమర్యాదలు గాని, అవమాన-తిరస్కారములు గాని, ఏవి ఎదురైనా, అతడు సమముగా నుండును; అనగా, అతనిలో మార్పు ఏమియూ ఉండదు. మినహాయింపు లేకుండగా, ప్రతివ్యక్తి ఈ రెండు పరిస్థితులను ఎదుర్కొనును. ఏలయన, వ్యక్తులు స్వీయ-అవగాహనను బట్టి, జీవనమూల్య-సంరచనను బట్టి ఇతరులను పొగిడెదరు; లేదా, విమర్శించెదరు. జ్ఞానియైనా, అజ్ఞానియైనా నిందా-స్తుతులను ఎదుర్కొనక తప్పదు. కాని గుణములకు అతీతుడైన వ్యక్తి వాటి ప్రభావమునకు గురికాడు. కావున, అతడు మాన-అపమానములలో ఏది ఎదురైనా, సమముగా నుండుగల్గును.

మరియు, అతడు మిత్రుని అభిమతము, శత్రుని అభిమతము అను వాటి విషయములో సమముగా నుండును (తుల్యః మిత్రారిపక్షయోః). ఇచట ఒక ప్రశ్న ఉదయించును. అతనికి శత్రువు ఎక్కడనుండి వచ్చినాడు? వ్యక్తి వ్యక్తికీ జీవనమూల్య-సంరచన మారుచుండుటచే, మానావమానములు ఉండుట సహజమే. కాని, జ్ఞాని ఎవరికైననూ శత్రువు అగుట ఎట్లు సంభవమగును? ఈ ఆశంకను ముందే ఊహించి, శ్రీశంకరులు ఇచట ఒక టిప్పణిని చేసిరి. జ్ఞాని తన సహజధోరణిలో నిష్పక్షపాతముగా నుండుటచే అతనికి ఎవరియందైననూ శత్రుభావము ఉండదు. కాని, అతనితో వ్యవహరించు ఇతరులకు వారి వారి మనోభావములను బట్టి అతని యందు మిత్రుడు, లేక శత్రువు కానవచ్చుట సంభవమే. వారు అతనిని ఏ విధముగా చూచినా, అతడు ఇతరుల భావావేగములను (emotions) గాని, చేష్టలను గాని తన మనస్సులో నిక్షేపించు (internalise) కొనడు. ఏలయన, ఇవి అన్నియు వారి వారి గుణకార్యములనియు, తనకు గాని, వారికి గాని, తత్త్వదృష్టితో చూస్తే వాటితో సంబంధము లేదనియు అతడెరుంగును. కావున, అతనికి శత్రువు లేడు; మిత్రుడైననూ లేడు. అనగా, అతని దృష్టిలో వారిద్దరు సమానమే.

తరువాత, ఈ జ్ఞానిని గురించి అతిప్రముఖమైన విషయము ఒకటి చెప్పబడినది. అతడు ఉపక్రమములన్నిటినీ పరిత్యజించినాడు (సర్వారంభపరిత్యాగీ). ఆరంభము అనగా ప్రారంభింపబడేది. అనగా ఒక ఘనకార్యమును సాధించుటకొరకై చేపట్టబడిన విశిష్టకార్యప్రణాళి. ఇట్టి ఘనకార్యముల వలన వ్యక్తిలో మార్పు వచ్చును. ఒకానొక అసంతృప్తి గల మానవుడు ఏదో ఒక ఘనకార్యమును సాధించి, తద్ద్వారా సంతృప్తిని పొందుటకు యత్నించును. ఈ అసంతృప్త-భావననుండి వివిధరకముల కామనలు ఉత్పన్నమగును. అవి పరిపూర్తి కావాలని అపేక్షింపబడును. ఈ ఒత్తిడి వలన వ్యక్తి ఒక ఆరంభమును చేపట్టును. ఈ తీరున, మానవుడు లక్ష్యసాధనకొరకై సంకల్పశక్తిని వినియోగించి, కార్యములను చేపట్టుచుండును. వీటినన్నిటినీ విడిచి పెట్టినవాడే జ్ఞాని. మనకు మామూలుగా తెలిసిన అర్థములో విడిచి పెట్టుట యనగా వస్తువును నష్టపోవుట.

మనము తీర్థయాత్రను చేసిన సందర్భములో, ఇష్టమైనదానిని విడిచి పెట్టే ఆచారము గలదు. ఇందువలననే, తిరుపతి ఇత్యాది దేవాలయములలో భక్తులు భగవానునకు తలనీలాలను సమర్పించెదరు. వ్యక్తి యొక్క అహంకారములో ప్రధానభాగము జుట్టునందు నిహితమై యుండును. కావున, ఈ ఆచారము సముచితమైనది, మరియు క్లేశముతో గూడినది. తలనీలాలను సమర్పించిన భక్తుడు త్యాగియే అయినా, అతడు కొంతకాలము వరకు టోపీని ధరించుట మనకు కానవచ్చును. దీనికి కారణమేమి? తాను ఏదో పోగొట్టుకున్నాననే ధారణ అతనియందు గలదు. ఇట్టి ధారణలేమియూ లేని వ్యక్తి పరిత్యాగియనబడును. ఇంటిలోని చెత్తను బయట పారవేసినప్పుడు, ఏదో పోగొట్టుకున్నామనే ధారణ గలదా? ఆత్మలో ఏ విధమైన న్యూనత లేదనియు, ఆత్మ పూర్ణమనియు దర్శించినప్పుడు మాత్రమే అట్టి పరిత్యాగము సంభవమగును. మూడు గుణములకు అతీతమైన వ్యక్తి తనయందు పూర్ణత్వమును దర్శించును గావ, అతనికి ఘనకార్యములను చేపట్టవలసిన ఆవశ్యకత ఉండదు.

కాని, శ్రీశంకరులు ఈ భాష్యమును వ్రాసినారు గదా! అనగా, ఇది వారి ఆరంభమే గదా! వారు 17 అధ్యాయములలో శ్లోకము తరువాత శ్లోకమునకు భాష్యమును వ్రాసిరి. దానికి ముందు ఉపోద్ఘాతమును వ్రాసిరి. ఈ భాష్యము మాత్రమే గాక, అతి మహత్త్వపూర్ణమగు బ్రహ్మసూత్రభాష్యమును వ్రాసిరి. దానిలో వారు ప్రతి సూత్రమునకు శ్రద్ధతో సమగ్రమగు అధికరణములను రచించిరి. వారు పది ఉపనిషత్తులపై విస్తారమగు భాష్యములను వ్రాసిరి. ఇంతే గాక, వారు అనేక ప్రకరణ గ్రంథములను విరచించిరి. ఆరంభము లేకుండగా వారింత పనిని

ఎట్లు చేయగల్గిరి? ఎవ్వరైననూ ఏ పనినైననూ ఆరంభము లేకుండగా చేయజాలరు. శ్రీ కృష్ణుడైననూ ఆరంభము లేకుండగా, గీతను ఉపదేశించలేడు గదా!

వ్యక్తి గుణాతీతుడైనా, గుణములచే బద్ధుడైనా, కార్యములను చేపట్టక తప్పదు. కాని, అసంతృప్త-ధారణ కలిగి తన ప్రస్తుత పరిస్థితిని మెరుగు పరచుకోవాలనే సంకల్పముతో వ్యక్తి చేబట్టే కార్యప్రణాళి అనే సంకోచార్థమును మనమిచట ఆరంభశబ్దమునకు చెప్పవలెను. శరీరయాత్రకు సంబంధించిన వాటిని మినహాయించి, గుణాతీతుడు చేబట్టే ఉపక్రమములన్నియు కేవలము ప్రజల హితము కొరకు మాత్రమే (లోకసంగ్రహార్థమ్) ఉద్దేశింపబడును. ఈ కారణముగనే, భారతదేశములో అనేక మహాగ్రంథముల రచయితలు అనామకులై యున్నారు. వారు అనంతునితో సంబంధము గలవారగుటచే చరిత్రను పరిగణించకుండిరి. ఈ సర్వము భగవానుని విభూతి యొక్క అభివ్యక్తియే గనుక, భగవానుని చరిత్రగనే పరిగణించబడినది. అనేక రచనలు దస్కతు లేకుండగనే వెలుగు లోనికి వచ్చియున్నవి.

జ్ఞాని ఏ కార్యమునైననూ గౌరవప్రతిష్ఠలు ఇత్యాది స్వలాభము కొరకు గాక, ఇతరుల హితము కొరకు మాత్రమే చేపట్టును. దీనిని మరియొక విధముగా మనము అర్థము చేసుకొనవచ్చును. అది జ్ఞాని యొక్క ప్రారబ్ధమని చెప్పవచ్చును. ప్రజల వైపునుండి చూస్తే, శ్రీశంకరులు ప్రజాహితము కొరకై వివిధ గ్రంథములను విరచించిరి. స్వీయ దృష్టికోణములో చూస్తే, ఆ పద్ధతిలో ప్రజాసేవ చేయుట ఆయన ప్రారబ్ధములో నున్నది. ఆయనలో భగవద్దత్తమైన కొన్ని విశిష్టశక్తులు గలవు. ఆయన ప్రారబ్ధము వలన గాని, మన ప్రారబ్ధము బాగుండుట వలన గాని, ఆ శక్తులు ఈ రూపములో బహిర్గతమైనవి. ఇచట ప్రధానవిషయమేమనగా, దాని వలన ఆయనకేమియూ లబ్ధి లేదు. శ్రీకృష్ణ భగవానుడీ విషయమును మూడవ అధ్యాయములో సుస్పష్టముగా చెప్పియున్నాడు.

ఓ అర్జునా! ముల్లోకములలో నాకు కర్తవ్యము లేశమైననూ లేదు. కర్మలను చేసి పొందదగినది, నాచే ఇంకా పొందబడనిది, ఏదీ లేదు. కాని నేను క్రియాశీలుడగనే యున్నాను (న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన, న అనవాప్తం అవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి). కొందరికి ఈ లోకములో సాధించదగినది ఏదీ లేకున్ననూ, పరలోకపు తయారీలో చాల హడావుడిగా నుందురు. కాని శ్రీకృష్ణునకు ఏ దేశములోనైననూ, ఏ కాలములోనైననూ పొందదగినది ఏదియూ లేదు. అయిననూ ఆయన సర్వదా వివిధకార్యకలాపములలో వ్యాపృ

యున్నాడు. జ్ఞాని పరిస్థితి కూడ ఇటులనే యుండును. ఇది కర్మనుండి విముక్తి కాదు. చేయుచుండగనే, దాని నుండి విముక్తి.

గుణాతీతుని యొక్క సహజ-స్వతఃప్రవృత్త-అభివ్యక్తులను ఈ నాల్గు శ్లోకములు వినవి. ఈ వర్ణన ముముక్షువునకు మార్గదర్శకమై ఉపకరించును. ఈ లక్షణముల ములో ఏదేని లోపము సాధకునకు కానవచ్చినచో, దానిని సరిదిద్దుకొనుటకై అతడు ుగు యత్నమును విచారపూర్వకముగా చేయదగును. అది గుణాతీతత్వ స్థితిని సాధనమగును. ఇచట వర్ణింపబడిన వివిధలక్షణముల విషయములో స్పష్టమగు హన గల సాధకునకు తాను గుణాతీతుడననే జ్ఞానమును పొందుటలో క్లేశమేమియూ ోదు.

జ్ఞానిలో అభివ్యక్తమయ్యే లక్షణములు ఎక్కడ నిర్దేశింపబడినమా, ముముక్షువు వాటిని ధనలో భాగముగా చేసుకొని, విచారపూర్వకముగా, మరియు ప్రార్థనాసహితముగా వాటిని వలెను. తద్ద్వారా అతడు జ్ఞానోదయమునకు సంసిద్ధుడై, అతనికి మోక్షమునందు ంక్ష పరిపూర్ణమగును.

అతడు గుణాతీతుడగుటకు సహకరించే ఒక విశిష్ట సాధనమును తరువాతి శ్లోకము ుచున్నది:

యము 14, శ్లోకము 26:

मां च योऽव्यभिचारेण भक्तियोगेन सेवते ।
स गुणान् समतीत्यैतान् ब्रह्मभूयाय कल्पते ॥ २६ ॥

మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే (26)

యః = ఎవడైతే, మామ్ = నన్ను, అవ్యభిచారేణ = దారి తప్పుటెరుంగని, భక్తియోగేన క్తియోగముతో, సేవతే = సేవించునో, సః =అతడు, ఏతాన్ = ఈ, గుణాన్ = గుణములను, తీత్య = అతిక్రమించినవాడై, చ = మరియు, బ్రహ్మభూయాయ = బ్రహ్మయై ఉండుట కు, కల్పతే = సమర్థుడగును.

మరియు ఎవడైతే నన్ను దారి తప్పుటనెరుంగని భక్తియోగముతో సేవించునో, అతడు గుణములనతిక్రమించినవాడై బ్రహ్మ స్వరూపుడై ఉండుటకు సమర్థుడగును (26).

ఒకే ఒక చోట తప్పిస్తే, శ్రీ కృష్ణుడు ఉత్తమపురుష-ఏకవచనమును ఎక్కడ ప్రయోగించిననూ, తాను ఈశ్వరుడననే తాత్పర్యముతో మాత్రమే అట్లు ప్రయోగించును. ఈశ్వరుడనగా సగుణబ్రహ్మ గాని, నిర్గుణబ్రహ్మ గాని లేక ప్రత్యగాత్మ గాని కావచ్చును. ఇచట కూడ శ్రీకృష్ణుడు మామ్ అను పదమును ఈశ్వరుడు అను అర్థములో ప్రయోగించినాడు. భక్తుడగు కర్మయోగి, లేక సన్న్యాసి దారి తప్పుటనెరుంగని భక్తి యోగముతో (అవ్యభిచారేణ భక్తియోగేన) సర్వప్రాణుల బుద్ధిలో చైతన్యరూపముగా ఉపలభ్యమయ్యే ఈశ్వరుని సేవించి బ్రహ్మను పొందెదరని శ్రీ శంకరులు వివరించిరి. క్రిమికీటకాదులలో కూడ చైతన్యము గలదు. అది మానవునిలో 'నేను' అను రూపములో నున్నది. భగవానుని అంకితభావముతో మరియు భక్తితో సేవించు ఈ భక్తుడు సన్న్యాసి కావచ్చును; లేదా, కర్మయోగి కావచ్చును.

ముముక్షువు భగవద్-జ్ఞానమును పొందుటకు ఉపలభ్యమయ్యే జీవనశైలులు ఈ రెండు మాత్రమే. ఇది విచారము మరియు స్పష్టమగు జ్ఞానము అను రూపములో నున్న భక్తియని శ్రీ శంకరులు వివరించిరి. సత్యతత్త్వము ఏది? అను విచారములో విషయవస్తువు ఈశ్వరుడే గనుక, అది కూడ భక్తియే యగును. ఈశ్వరుడు నిత్యసద్రూపుడు; మరియు ఏనాడైననూ జీవునకు దూరముగా లేడు. కావున, ఈశ్వరారాధన యనగా విచారరూపములో మాత్రమే ఉండును. మనమిచట భగవానుని కొరకు వెదుకుట లేదు; ఉన్న తత్త్వమును దర్శించే ప్రయత్నమును మాత్రమే చేయుచున్నాము. దేశములో గాని కాలములో గాని వేరుగానుండి తరువాతి కాలములో రాబోవు వ్యక్తి భగవానుడు కాజాలడు.

మనస్సు అనే దేవాలయములో దీపమును వెలిగించి నీ స్వరూపమును ప్రకటించుమని భగవానుని ప్రార్థించే అందమైన పాట ఒకటి హిందీ భాషలో గలదు. దేవాలయగర్భగృహములన్నియు చీకటితో నిండియుండును గదా! అటులనే, భగవానుని మహిమను గాంచుటకై దీపమును వెలిగించవలెను. భగవానుడు దూరముగా లేడు. అయన భక్తుని మనస్సు అనే చీకటితో నిండియున్న దేవాలయములో నిత్యనివాసియై ఉన్నాడు. ఈ విషయమును భక్తుడు ఎరుంగునని ఆ పాట సూచించుచున్నది. భగవానుని ఉనికిని ప్రకాశింపజేయుటకు ఆవశ్యకమగు దీపమే

జ్ఞానము. ఓ భగవాన్, ఈ దాగుడుమూతలను కట్టిబెట్టి, నీ దర్శనముకొరకు పరితపించుచున్న ఈ కళ్ళకు తృప్తిని కలిగించుమని భక్తుడు భగవానుని అర్థించుచున్నాడు. వ్యక్తి అప్పుడప్పుడు ఆనందముగానున్నప్పుడు, బోధ కలిగినప్పుడు భగవానుడు ప్రకటమగుచునే యుండును. దాగుడుమూతలనుటకు కారణమిదియే. ప్రేమ, అవగాహన, ఆనందము కలిగిన క్షణములలో భగవానుని విభూతి అభివ్యక్తమగుచుండును. ఓ భగవాన్, నీ కృప అనే నిధి యొక్క తలుపులను తెరచి, నా జ్ఞానాంధకారమును బాపుమని భక్తుడు వేడుకొనుచున్నాడు. ఇచట అంధకారమనగా ఆత్మ-అనాత్మ-వివేకము లేకుండుటయే. ఈశ్వరకృపయున్నచో, సత్యమును తెలియవలెననే కోరిక (జిజ్ఞాస) పుట్టి అజ్ఞానాంధకారము తొలగిపోవును.

ఉన్న సత్యమును తెలియగోరువాడు యథార్థమగు భక్తుడు. భగవానుడు నా కంటె వేరు గాదు. నా మనోవృత్తుల సారస్వరూపమే భగవానుడు. అతని భగవదన్వేషణ యొక్క స్వరూపమిట్లుండును. మనమెచట చూచినా భగవానుడే గలడు. కావున అన్వేషణకు ప్రసక్తి లేదు; చూడవలెను. సర్వవ్యాపకుడగు భగవానుడు ఎచ్చటనో దూరముగా లేడు. శాశ్వతుడగు భగవానునితో మనకు కాలవ్యవధానము లేదు. కావున, వెదుకుటకు, లేక వేచియుండుటకు ప్రసక్తి ఏమి గలదు?

ఈ సత్యము నెరింగిన వ్యక్తి సరియగు పద్ధతిలో, అనగా చలనాత్మకముగా గాక, శుద్ధజ్ఞానరూపముగా గుణాతీతుడగును. ఆత్మ (నేను) సర్వదా అతీతముగనే యుండును. అంతర్యామియగు ఆత్మ ఆకాశమువలె సర్వవ్యాపకము. కావున, వాస్తవమగు అతిక్రమణము లేదు. ఇట్టి జ్ఞాని బ్రహ్మరూపుడై యుండుటకు అర్హుడగును. ఏలయన, ఆత్మ బ్రహ్మకంటె వేరుగా లేదు.

**అధ్యాయము 14, శ్లోకము 27:**

ब्रह्मणो हि प्रतिष्ठाहममृतस्याव्ययस्य च ।
शाश्वतस्य च धर्मस्य सुखस्यैकांतिकस्य च ॥ २७ ॥

బ్రహ్మణో హి ప్రతిష్ఠాహమమృతస్యావ్యయస్య చ
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాంతికస్య చ (27)

**అహమ్ = నేను, హి = నిశ్చయముగా, అమృతస్య = వినాశము లేని, చ = మరియు,**

అవ్యయస్య = వికారరహితమైన, చ = మరియు, శాశ్వతస్య = శాశ్వతమైన, ధర్మస్య = సర్వమునకు ఆధారమైన, సుఖస్య = సుఖస్వరూపమైన, చ = మరియు, ఐకాంతికస్య = నిషేధింప శక్యము గాని, బ్రహ్మణః = బ్రహ్మకు, ప్రతిష్ఠా = ఆధారమునగు చున్నాను.

> నేను అవినాశి, అవికారి, శాశ్వతము, సర్వమునకు ఆధారమైనది,
> సుఖస్వరూపమైనది, నిషేధింప శక్యము గానిది అగు బ్రహ్మమునకు
> నిశ్చయముగా ఆధారము నగుచున్నాను (27).

ఇచట భక్తి యనగా జ్ఞానసాధనకు అంకితమగుట. సహాయత, లేక ఉపచారము ఏదైనా సేవ యనబడును. ఈ రెండింటియందు అంకితభావము ఉండవలెను. ప్రస్తుతములో ప్రత్యగాత్మను అన్వేషించు వాడు పరమాత్మయే. సర్వజగత్కారణమగు సచ్చిదానంద–బ్రహ్మ ఆత్మయేనను వివేకజ్ఞానమాతనికి గలదు. కావున, ఈ జగత్తులోని సర్వము ఆత్మయే. కాని సచ్చిదానంద–ఆత్మ క్రియలను వేటినీ చేయదు. కాని ఈ క్రియాకలాపమునకంతకు కారణమును చెప్పవలసియున్నది. కావున, త్రిగుణాత్మకమగు ప్రకృతికి క్రియాశీలమై యుండుట స్వభావమని చెప్పబడినది (స్వభావస్తు ప్రవర్తతే). గుణపరిణామజన్యమైన ఈ దేహేంద్రియమనస్సంఘాతము ద్వారా కర్మలన్నియు నిర్వహింపబడుచున్నవి. ఈ సత్యమునెరింగిన జ్ఞాని గుణాతీతుడగుటచే, ఆ కర్మలయందు సమ్మిళితము గాడు; అనగా కర్మలచే లేపమును పొందడు. ఆత్మ బ్రహ్మభిన్నము గనుక, ఆత్మ గుణాతీతమని యెరింగిన జ్ఞాని బ్రహ్మస్వరూపుడగును. ఆత్మయే సత్యం–జ్ఞానం–అనంతం–బ్రహ్మకు మూలాధారమై యున్నది. ఆత్మ సర్వమునకు ప్రతిష్ఠ యని మరియొకచోట చెప్పబడినది. నేను బ్రహ్మకు ప్రతిష్ఠను అని శ్రీకృష్ణభగవానుడిచట చెప్పుచున్నాడు.

శ్రీశంకరులిచట విస్తారమగు భాష్యమును వ్రాసిరి. ఆత్మ గుణవినిర్ముక్తమని గుర్తించినవాడు బ్రహ్మ యగుటకు అర్హుడని చెప్పబడినది. దానికి కారణమేమనగా, నేను అను పదముయొక్క అర్థము బ్రహ్మకు ఆధారము. నేను సర్వప్రాణులలోనున్నానని తరువాత కూడ ఆయన చెప్పబోవుచున్నాడు. ఓ అర్జునా, సర్వక్షేత్రములలోని క్షేత్రజ్ఞుడను నేనేయని తెలుసుకొమ్మని ఆయన పదమూడవ అధ్యాయములో చెప్పియున్నాడు. క్షేత్రజ్ఞుడనగా ప్రత్యగాత్మ. జీవుని 'నేను' శ్రీకృష్ణుని 'నేను' కంటె వేరు గాదు. మరియు, ఆత్మ దేనికైననూ భిన్నముగా లేదు గనుక, ఆత్మ అంతరము అని చెప్పుటకు వలను పడదు. దేహేంద్రియ మనస్సంఘాతమంతయు 'నేను' యొక్క అర్థమగు ఆత్మయే. ఇదే విషయమును మనము మరల

15 వ అధ్యాయములో చూడగలము. సర్వప్రాణుల హృదయములో నేనే ప్రవేశించియున్నానని భగవానుడు చెప్పబోవు చున్నాడు (సర్వస్య చాహం హృది సన్నివిష్టః).

బ్రహ్మ 'నేను' లో మాత్రమే గలదు గాన, 'నేను' బ్రహ్మకు ఆధారమగుచున్నది. అనగా, 'నేను' కు, బ్రహ్మకు మధ్య ఆధార-ఆధేయ-సంబంధము లేదు; అభేదము గలదు. బ్రహ్మ ప్రపంచములోని వస్తువులలో ఒకటి కాదు గనుక, దానికి ఆధారము ఉండదని శ్రుతి ఉపదేశించుచున్నది. శ్రుతిచే ఉపదేశించబడిన స్వర్గము దేశకాలములలో ఉనికిని కలిగి జగత్తులో భాగమై ఉన్నది గనుక, దానికి జగత్తు ఆధారమగును. అదే విధముగా, వృక్షమునకు భూమి ప్రతిష్ఠ యగును. మట్టితో చేయబడిన కుండయొక్క ప్రతిష్ఠ మట్టి యందు గలదు. స్వర్గమువలె బ్రహ్మ కూడా శ్రుతి-ఉపదిష్టమైన ఒకానొక వస్తువు అయినచో, దాని ప్రతిష్ఠ సృష్టి-అంతర్గతమై యుండును. కాని, శ్రుతి-ఉపదిష్టమే అయినా, బ్రహ్మ యొక్క ప్రతిష్ఠ సృష్టియందు గాక, ఆత్మ యందు గలదు. శ్రుతి బ్రహ్మను ఆత్మకంటె భిన్నముగా ఉపదేశించుట లేదు. ఆత్మకంటె భిన్నమైనది అనాత్మ. బ్రహ్మ ఒకానొక వస్తువు కాదు గనుక, దానిని ఆత్మ యందు మాత్రమే కనుగొనుట సంభవమగును. అది ఆత్మ కానిచో, అనాత్మ మాత్రమే కాగల్గును గనుక, సర్వదా దూరముగా నుండి తీరును (నిత్యపరోక్ష). ఇట్టి బ్రహ్మ స్వర్గము వలె ఒక స్థానము కాదు గనుక, స్వంతము చేసుకోదగిన వస్తువు కాదు గనుక, దానిని పొందుట అసంభవమగును.

అధ్యాయారంభములో బ్రహ్మపదము మాయ అనే అర్థములో ప్రయోగింపబడినది (తేషాం బ్రహ్మ మహద్యోనిః అహం బీజప్రదః పితా). ఇచట కూడ అదే అర్థమును 'మాయకు ఆధారము నేనే' అని ఏల చెప్పరాదు? ఇది సరిగాదు. ఏలయన ఈ శ్లోకములో బ్రహ్మపదమునకు గల అనేక విశేషణములు సత్యం-జ్ఞానం-అనంతం-బ్రహ్మకు మాత్రమే వర్తించును; మాయకు వర్తించవు. పైగా, గుణాతీతుడగు వ్యక్తి బ్రహ్మ యగుటకు అర్హుడగునని చెప్పిన పూర్వశ్లోకమునకు ఈ శ్లోకముతో సంబంధము గలదు. మాయ త్రిగుణాత్మకము. జీవుడు జ్ఞానమేమియూ లేకుండగనే మాయాకార్యమగు దేహముతో తాదాత్మ్యమును పొందియుండును. కావున, ఇచట బ్రహ్మశబ్దమునకు అర్థము మాయ కాజాలదు.

బ్రహ్మకు ఈయబడిన విశేషణములను పరికించినచో మనకీ విషయము స్పష్టమగును.

ఈ బ్రహ్మకు వినాశము లేదు (అమృతమ్). అది వినాశాధీనము కాదని శ్రీశంకరులు వివరించిరి. అది నశించేది కాకపోయిననూ, బహుశః సర్వదా మార్పులకు లోనగుచుండునేమో!

ఒక వ్యక్తిలో కాలము అనేక మార్పులను తెచ్చును. అయిననూ మనమా వ్యక్తిని గుర్తించగల్గుతాము. బహుశః బ్రహ్మ విషయములో కూడా పరిస్థితి అంతేనేమో! కాదు. బ్రహ్మ ఎన్నటికీ మార్పులను చెందదు.

శాశ్వతమనగా రేపు అనగా భవిష్యత్తులో సర్వదా ఉండునది. బ్రహ్మ గతములో లేని కాలఖండము లేదను విషయమును నిత్యమ్ అను పదము సూచించును. అట్టి కాలరహితమగు బ్రహ్మయందు ధర్మము యొక్క పూర్ణజ్ఞానము గలదు. ధర్మ పదమునకు సర్వమును ధరించునది, అనగా నిలబెట్టునది అను అర్థము కూడ గలదు. ఇది జ్ఞానయోగముచే పొందబడే ధర్మమని శ్రీశంకరులు వివరించిరి.

మరియు, అది సుఖమని వర్ణించబడినది. లోకములో సుఖము అనే వస్తువు ఏదీ లేదు. కావున, అది బ్రహ్మను వర్ణించే అద్భుతమగు పదము. బ్రహ్మ యొక్క స్వరూపమే సుఖము. బ్రహ్మయందు ఇది లేదు అనే భావన గాని, అపూర్ణత్వము గాని లేవు. బ్రహ్మ పూర్ణము, ఆనందఘనము అని శ్రీశంకరులు క్లుప్తముగా వర్ణించిరి.

ఐకాంతికమనగా విరోధమునకు గాని, నిషేధము లేక బాధ (negation) కు గాని అధీనము గానిది. బ్రహ్మ తక్క ఇతరము సర్వము కేవలనామరూపాత్మకము, మరియు పరిణామియగు మిథ్య. పరిణమించేది సత్యము కాదు. ఇచట వర్ణించబడిన ఈ బ్రహ్మ స్వరూపతః ప్రత్యగాత్మయేనని తెలియవలెను. ఇచట ప్రతిష్ఠా పదమునకు ఇదియే అర్థము.

గుణములనతిక్రమించినవాడు బ్రహ్మరూపుడై ఎట్లు ఉండును? మాయాశక్తిసహితమగు బ్రహ్మమే ఈశ్వరుడు. ఈ శక్తి బ్రహ్మముకంటె వేరుగా లేదు. ఇట్టి బ్రహ్మ నేనే. పరమాత్మ-శక్తుల కలయికయే ఈశ్వరుడగు శ్రీకృష్ణుడు. శక్తికి శక్తిమాన్‌కు మధ్యలో భేదము లేదు. కావున, శక్తియుతుడగు ఈ ఈశ్వరుని ప్రతిష్ఠ ఆత్మయందు మాత్రమే గలదు. సర్వజగత్కారణమగు బ్రహ్మయొక్క ప్రతిష్ఠ ఆత్మయందు మాత్రమే గలదు. ఇదియే బ్రహ్మ-భావన యనబడును. దీనిలో అబ్రహ్మ బ్రహ్మగా అగుట అను ధారణకు అవకాశము లేదు. బ్రహ్మకు ప్రతిష్ఠయగు నీవు బ్రహ్మ అయ్యే ప్రసక్తి ఏమున్నది?

బ్రహ్మవిద్య, కర్మయోగము విషయవస్తువుగా గలది, గురుశిష్యులగు శ్రీకృష్ణార్జునుల మధ్య సంవాదరూపములో నున్నది, అగు భగవద్గీతలో గుణత్రయవిభాగయోగమనే పదునాల్గవ అధ్యాయము ముగిసినది.

# అధ్యాయము 15

## పురుషోత్తమ యోగము

భగవానుని భక్తితో ఉపాసించు వారు గుణములనతిక్రమించి గుణాతీతులగుదురని పూర్వ-అధ్యాయ-అంతములో చెప్పబడినది.

శ్రీశంకరులీ అధ్యాయమునిట్లు ఉపక్రమించిరి : కర్మఫలము మాత్రమే గాక, జ్ఞానసాధన-ఫలమగు మోక్షము కూడ ఈశ్వరాధీనమై యున్నది. యోగ్యమగు జ్ఞానసాధనము మరియు జ్ఞేయవస్తువు ఉపలభ్యముగానుండుట అనునవి జ్ఞానప్రాప్తికి చాలును. కాని, జ్ఞానసాధన చేయుట, మరియు జ్ఞానము ఉదయించుట అనే రెండింటికీ సహకరించే పరిస్థితులను కల్పించుటలో అనేక-అంశములు అవశ్యకమగును. జ్ఞానము ఉదయించవలసిన అంతఃకరణమును తీర్చిదిద్దవలెను. అట్లు తీర్చిదిద్దుట ఈశ్వరకృపపై ఆధారపడియున్నది. ఇందువలననే, తనను భక్తిశ్రద్ధలతో ఆరాధించువారు తన అనుగ్రహముచే ముందుగా అంతఃకరణశుద్ధిని పొంది, తరువాత జ్ఞానమును పొందెదరని భగవానుడు చెప్పుచున్నాడు. అట్టివారు గుణాతీతులై మోక్షమును పొందెదరు. జ్ఞానోదయమునకు సంసిద్ధము కానివారు కూడ ఈశ్వరకృపచే జ్ఞానులు కాగల్గుదురన్నచో, ఆత్మతత్త్వమును స్పష్టముగా నెరుంగువారి సంగతి చెప్పునదేమున్నది? ఇట్టి ఆత్మతత్త్వమునీ అధ్యాయము ప్రస్తుతించుచున్నది.

ఈ ఉపదేశమునకు ప్రేరణనిచ్చే ప్రశ్నను దేనినీ అర్జునుడు వేయలేదు. అయిననూ, భగవానుడే ఆత్మతత్త్వమును గురించి చెప్పగోరి ఇట్లు పలుకుచున్నాడు:

**అధ్యాయము 15, శ్లోకము 1 :**

ऊर्ध्वमूलमधश्शाखमश्वत्थं प्राहुरव्ययम् ।
छंदांसि यस्य पर्णानि यस्तं वेद स वेदवित् ॥ १ ॥

ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్
ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ (1)

ఊర్ధ్వమూలమ్ = పై భాగమునందు వేళ్ళు గలది, అధశ్శాఖమ్ = క్రిందకు వ్రేలాడే

కొమ్మలు గలది అగు, అశ్వత్థమ్ = రావి చెట్టు, అవ్యయమ్ = అవినాశి యని, ప్రాహుః = చెప్పెదరు, యస్య = దేని, పర్ణాని = ఆకులు, ఛందాంసి = వేదములో, యః = ఎవడైతే, తమ్ = దానిని, వేద = ఎరుంగునో, సః = వాడు, వేదవిత్ = వేదములనెరింగినవాడు.

పై భాగమునందు వ్రేళ్ళు గలది, క్రిందకు వ్రేలాడే కొమ్మలు గలది, వేదములే ఆకులుగా గలది అగు రావి చెట్టు వినాశము లేనిది యని చెప్పెదరు. ఎవడైతే దానిని ఎరుంగునో, వాడు వేదవేత్త యగును (1).

అర్జునుడు సంసారముపై వైరాగ్యమును పెంపొందించుకొనుటలో సహాయపడుటకై, శ్రీకృష్ణుడు ముందుగా దాని స్వరూపమును వర్ణించుచున్నాడు. మోక్షము సంసారాంతర్గతము కాదనే సత్యము నెరుంగట అతి ప్రముఖమైన విషయము. స్వర్గమును పొందాలనే కోరిక మరియు తనలో గూడు కట్టుకొనియున్న అసంతృప్తిచే ప్రేరితుడై భద్రత కొరకు అర్రులు చాచుట అనునవి సంసారము లోపల మోక్షమును పొందే ప్రయత్నమేనని చెప్పువచ్చును. సంసారమునుండి విముక్తియే మోక్షమై యుండగా, దానిని సంసారము లోపల సంపాదించుట ఎట్లు సంభవమగును? ఇచట ఒక చిన్న చిక్కు గలదు. మోక్షము సంసారాంతర్గతము కాదని యెరుంగుటకు వైరాగ్యము ఉండి తీరవలెను. దీనికి విలోమముగా, వైరాగ్యము కలుగుటకై మోక్షము సంసారాంతర్గతము కాదని తెలియుట తప్పనిసరి. ఈ చిక్కును పరిష్కరించి, అవశ్యకమగు వైరాగ్యమును పెంపొందించుకొనుటలో సహాయపడుటకై, వృక్షకల్పనను ఆధారముగా చేసుకొని, సంసారముయొక్క తీరుతెన్నులు మనముందు ప్రస్తుతించబడుచున్నవి. కాని, ఆత్మస్వరూపము తెలియకపోవుట వలన సత్యవస్తువిషయములో భ్రాంతిజ్ఞానము గలదు. ఇదియే సంసారలక్షణమై యున్నది. కావున, శ్రీకృష్ణుడు ఆ తరువాత ఆత్మ తత్త్వమును కూడ ఉపదేశించగలడు.

సర్వము ఆత్మయేనని ఈ అధ్యాయము నిరూపించుచున్నది. కావున, ఇది చాల ప్రముఖమైన అధ్యాయము. ఈ అధ్యాయములో జగత్తు, జీవుడు, మూలకారణము, జీవుడు జన్మ-మరణములకు అధీనమై యుండుట, సూక్ష్మశరీరము, భోజనము మొదలగు నిత్యకృత్యములు, తినబడే అన్నముయొక్క స్వరూపము, తినువాని స్వరూపము ఇత్యాదులు నిరూపించబడినవి. ఈ సర్వము పరమాత్మకంటె వేరు గాదని ప్రదర్శింపబడినది. ఇంతేగాక, మానవుడు సంసారమునధిగమించుటకు కావలసిన అర్హతలను కూడ ఈ అధ్యాయము వర్ణించినది. ఈ విధముగా ఈ అధ్యాయము సమగ్రమైనది.

# అధ్యాయము 15

## పురుషోత్తమ యోగము

భగవానుని భక్తితో ఉపాసించు వారు గుణములనతిక్రమించి గుణాతీతులగుదురని పూర్వ-అధ్యాయ-అంతములో చెప్పబడినది.

శ్రీశంకరులీ అధ్యాయమునిట్లు ఉపక్రమించిరి : కర్మఫలము మాత్రమే గాక, జ్ఞానసాధన-ఫలమగు మోక్షము కూడ ఈశ్వరాధీనమై యున్నది. యోగ్యమగు జ్ఞానసాధనము మరియు జ్ఞేయవస్తువు ఉపలభ్యముగానుండుట అనునవి జ్ఞానప్రాప్తికి చాలును. కాని, జ్ఞానసాధన చేయుట, మరియు జ్ఞానము ఉదయించుట అనే రెండింటికీ సహకరించే పరిస్థితులను కల్పించుటలో అనేక-అంశములు ఆవశ్యకమగును. జ్ఞానము ఉదయించవలసిన అంతఃకరణమును తీర్చిదిద్దవలెను. అట్లు తీర్చిదిద్దుట ఈశ్వరకృపపై ఆధారపడియున్నది. ఇందువలననే, తనను భక్తిశ్రద్ధలతో ఆరాధించువారు తన అనుగ్రహముచే ముందుగా అంతఃకరణశుద్ధిని పొంది, తరువాత జ్ఞానమును పొందెదరని భగవానుడు చెప్పుచున్నాడు. అట్టివారు గుణాతీతులై మోక్షమును పొందెదరు. జ్ఞానోదయమునకు సంసిద్ధము కానివారు కూడ ఈశ్వరకృపచే జ్ఞానులు కాగల్గుదురన్నచో, ఆత్మతత్త్వమును స్పష్టముగా నెరుంగువారి సంగతి చెప్పనదేమున్నది? ఇట్టి ఆత్మతత్త్వమునీ అధ్యాయము ప్రస్తుతించుచున్నది.

ఈ ఉపదేశమునకు ప్రేరణనిచ్చే ప్రశ్నను దేనినీ అర్జునుడు వేయలేదు. అయినను, భగవానుడీ ఆత్మతత్త్వమును గురించి చెప్పగోరి ఇట్లు పలుకుచున్నాడు:

**అధ్యాయము 15, శ్లోకము 1 :**

**ऊर्ध्वमूलमधश्शाखमश्वत्थं प्राहुरव्ययम् ।**
**छंदांसि यस्य पर्णानि यस्तं वेद स वेदवित् ॥ १ ॥**

**ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్**
**ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ (1)**

**ఊర్ధ్వమూలమ్** = పై భాగమునందు ప్రేళ్ళు గలది, **అధశ్శాఖమ్** = క్రిందకు ప్రేలాడే

కొమ్మలు గలది అగు, అశ్వత్థమ్ = రావి చెట్టు, అవ్యయమ్ = అవినాశి యని, ప్రాహుః = చెప్పెదరు, యస్య = దేని, పర్ణాని = ఆకులు, ఛందాంసి = వేదములో, యః = ఎవడైతే, తమ్ = దానిని, వేద = ఎరుంగునో, సః = వాడు, వేదవిత్ = వేదములనెరింగినవాడు.

పై భాగమునందు వ్రేళ్ళు గలది, క్రిందకు వ్రేలాడే కొమ్మలు గలది, వేదములే ఆకులుగా గలది అగు రావి చెట్టు వినాశము లేనిది యని చెప్పెదరు. ఎవడైతే దానిని ఎరుంగునో, వాడు వేదవేత్త యగును (1).

అర్జునుడు సంసారముపై వైరాగ్యమును పెంపొందించుకొనుటలో సహాయపడుటకై, శ్రీకృష్ణుడు ముందుగా దాని స్వరూపమును వర్ణించుచున్నాడు. మోక్షము సంసారాంతర్గతము కాదనే సత్యము నెరుంగట అతి ప్రముఖమైన విషయము. స్వర్గమును పొందాలనే కోరిక మరియు తనలో గూడు కట్టుకొనియున్న అసంతృప్తిచే ప్రేరితుడై భద్రత కొరకు అర్రులు చాచుట అనునవి సంసారము లోపల మోక్షమును పొందే ప్రయత్నమేనని చెప్పవచ్చును. సంసారమునుండి విముక్తియే మోక్షమై యుండగా, దానిని సంసారము లోపల సంపాదించుట ఎట్లు సంభవమగును? ఇచట ఒక చిన్న చిక్కు గలదు. మోక్షము సంసారాంతర్గతము కాదని యెరుంగుటకు వైరాగ్యము ఉండి తీరవలెను. దీనికి విలోమముగా, వైరాగ్యము కలుగుటకై మోక్షము సంసారాంతర్గతము కాదని తెలియుట తప్పనిసరి. ఈ చిక్కును పరిష్కరించి, అవశ్యకమగు వైరాగ్యమును పెంపొందించుకొనుటలో సహాయపడుటకై, వృక్షకల్పనను ఆధారముగా చేసుకొని, సంసారముయొక్క తీరుతెన్నులు మనముందు ప్రస్తుతించబడుచున్నవి. కాని, ఆత్మస్వరూపము తెలియకపోవుట వలన సత్యవస్తువిషయములో భ్రాంతిజ్ఞానము గలదు. ఇదియే సంసారలక్షణమై యున్నది. కావున, శ్రీకృష్ణుడు ఆ తరువాత ఆత్మ తత్త్వమును కూడ ఉపదేశించగలడు.

సర్వము ఆత్మయేనని ఈ అధ్యాయము నిరూపించుచున్నది. కావున, ఇది చాల ప్రముఖమైన అధ్యాయము. ఈ అధ్యాయములో జగత్తు, జీవుడు, మూలకారణము, జీవుడు జన్మ-మరణములకు అధీనమై యుండుట, సూక్ష్మశరీరము, భోజనము మొదలగు నిత్యకృత్యములు, తినబడే అన్నముయొక్క స్వరూపము, తినువాని స్వరూపము ఇత్యాదులు నిరూపింపబడినవి. ఈ సర్వము పరమాత్మకంటె వేరు గాదని ప్రదర్శింపబడినది. ఇంతేగాక, మానవుడు సంసారమునధి గమించుటకు కావలసిన అర్హతలను కూడ ఈ అధ్యాయము వర్ణించినది. ఈ విధముగా ఈ అధ్యాయము సమగ్రమైనది.

ఈ దర్శనము (vision) వృక్షకల్పన ద్వారా ప్రదర్శింపబడినది. సంసారము పవిత్రమగు రావి చెట్టుతో పోల్చబడినది. అశ్వత్థమను పదమునకు 'రేపు ఉండనిది' అను అర్థము గలదు. సంసారము, నిరంతరముగా పరివర్తన చెందు చుండును. అయిననూ, అది తన బీజమును మరియు దానిని అనుసరించి వచ్చిన వ్రేళ్ళను ఆధారముగా చేసుకొని, స్థిరముగా కొనసాగుచుండును. ఆంగ్లభాషలో Ficus Religiosa అని పిలువబడే రావి చెట్టు మర్రి చెట్టుతో సమానమగు వర్గమునకు చెందును.

అశ్వత్థ వృక్షము వలె సంసారము కూడ రేపటికి అదే రూపములో నుండదు. అది నిరంతరముగా పరివర్తన చెందుచుండును. కాని దానికి అధిష్ఠానమగు బ్రహ్మయందు లేశమైననూ మార్పు లేదు. అది అశ్వత్థమే అయినా అవ్యయము కూడా; అది నిరంతరముగా మారుచున్ననూ, మరణించదు. అనగా దాని నామరూపములు మారుచుండును. ప్రళయములో సర్వము విలీనమగును. అయిననూ అది అవ్యాకృతరూపములో మిగిలియుండును. అది కల్పాదిలో ఉద్భవించి కల్పాంతమందు మరల విలీనమగుచూ చక్రాకారముగా తిరుగుచుండును. ఈ తీరున, దానికి ఉత్పత్తి-విలీనములే (వ్యాకృత-అవ్యాకృత అవస్థలు) గాని, అది లేదు. ఈ ఉత్పత్తి-విలీనములు మనము ప్రతిదినము చేసే నిద్ర లేచుట-నిద్ర పోవుట వంటివి. కాని అధిష్ఠాన-అజ్ఞానము తొలగిపోయిన వ్యక్తికి ఈ సంసారము అంతమగును. అంతవరకు అది అవ్యయమై నిలుచును.

సంసారమును వృక్షముతో పోల్చుటకు అనేక కారణములు గలవు. చెట్టు వ్రేళ్ళు మనకు కంటికి కానరావు. కాని, అది వ్రేళ్ళవలన మాత్రమే నిలబడియున్నదని మనకు తెలియుచుండును. అది గలదు అను ప్రత్యయము (Cognition) మనకు గలదు (అస్తి ఇతి బుద్ధిః అస్తి). అదే విధముగా, సంసారమూలము మనకు కానరాదు; మన బుద్ధికి అందదు. కాని సంసారమును పరికించే మనము దాని ఉనికిని ఊహించగలము. అనగా మనము కార్యమును చూడగలము. కాని కారణమును చూడలేము. కార్యముయొక్క ఉనికిని బట్టి కారణము ఉన్నదని మనము ఊహించగలము. కారణము నా కంటె భిన్నమైనచో, దానిని కార్యములో చూచుట సంభవమగును. కారణము నేనే అయినచో, దానిని చూచుట ఎట్లు? ఈ కార్యము నా కంటె భిన్నముగా లేదు. ఈ సత్యము నాకు తెలియాలంటే నాకు నేను తెలిసి ఉండాలి. ఈ సత్యము తెలియనంతవరకు, దేశ-కాలముల చక్రములో అంతర్గతమైయున్న సృష్టిని మాత్రమే నేను చూడగల్గుదును. దేశకాలాతీతమగు ఆత్మతత్త్వమునందు సృష్టికారణము దాగియుండి

తెలియబడకున్నది. వృక్షముయొక్క వ్రేళ్ళు కానరాని విధముగా, ఈ సంసారమూలము ద్రష్టలో దాగి యుండుటచే కానవచ్చుటలేదు.

కాలము కంటె కూడా సూక్ష్మమగు ఈ సంసారమూలము ఊర్ధ్వమునందున్నదని శ్రీశంకరులు వివరించిరి. కాలము ఇతరవస్తువులవలె కంటికి కానరాదు. అది కేవలము మనస్సుచే మాత్రమే తెలియబడుచుండును. కాని, మనమిచట మనస్సుకంటె కూడ సూక్ష్మమైనది, మనస్సునకు మరియు దేశకాలాంతర్గతమగు సర్వమునకు మూలాధారము, లేదా కారణము అగు ఒకానొక తత్త్వమును గురించి విచారించుచున్నాము. సృష్టికారణము సృష్టికంటె ముందు ఉండును గనుక, ఊర్ధ్వమ్ అనబడినది. మరియు అది నిత్యము కూడా. చెట్టును నరికిననూ, వ్రేళ్ళు ఉన్నచో, మరల చిగుర్చును. కలకత్తాలో కొన్ని వేల చదరపు గజముల విస్తీర్ణము గల ఇట్టి వృక్షము ఒకటి గలదు. ఆరంభములో మూలము ఉండిన చోట ఆ విషయమును సూచించే ఒక బోర్డు పెట్టబడినది. ఆ చెట్టు మొదలు కాలగర్భములో కలిసిపోయినది. కాని, తల్లివేరును అనుసరించి వచ్చిన వేలాది వ్రేళ్ళవలన చెట్టు ఇప్పటికీ మిగిలియున్నది. చెట్టుకు కారణమగు వ్రేళ్ళు ఉన్నంతవరకు కార్యమగు వృక్షము మిగిలియే యుండును. ఇదే విధముగా సంసారవృక్షము అనిత్యమగు కార్యము కాగా, అది దేని నుండి పుట్టినదో, ఆ కారణము దానితో పోలిస్తే నిత్యము. ఆ మూలమునుండి అది మరల పుట్టగలదు. సృష్టి సర్వము అనిత్యము కాగా, దాని మూలము నిత్యము. మరియు, అది అనంతము (మహత్త్వాత్) గనుక, ఊర్ధ్వము. సర్వజగత్తునకు ఉపాదానమగు మాయాశక్తితో కూడియున్న బ్రహ్మము సంసార వృక్షమునకు మూలము.

దాని వ్రేళ్ళు పైకి ఉండగా, కొమ్మలు క్రిందకు (అధః) గలవు. సూక్ష్మస్థూల భూతములన్నియూ కొమ్మలు. అవి దేశకాలాధీనములగుటచే క్రిందకు గలవు.

ఆకులు చెట్టును అంతటా ఆవరించియుండి రక్షణనొసంగుటయే గాక, దాని జీవనశక్తికి కూడ ఆధారమై యున్నవి. ఆకులను పెరికివేసినచో, చెట్టు మరణించును. అదే విధముగా, వేదములు (ఛందాంసి) సంసారవృక్షమును రక్షించి, జీవుని జీవనమునకు ఆధారమగును. ఇచట వేదములనగా క్రతువులకు చెందిన సాధన-సాధ్య-సంబంధమును బోధించే ఋగ్యజుస్సామ వేదములని యర్థము. దీనిలో వేదాంతము అంతర్గతము కాదు. ఏలయన, సంసారమును నిలబెట్టుటకు కర్మలు మాత్రమే చాలును. పైగా, వేదాంతము సంసారమును నశింపజేయును.

వేదజ్ఞానము లేని వారు కూడ కర్మలను చేసెదరు. వాటి వలన సంసారము నిత్యముగా కొనసాగుచుండును. అట్లైనచో, వేదములను ఆకులతో పోల్చుటకు కారణమేమి? వేదములు పరమశుభకరమగు కర్మవిజ్ఞానమును కలిగియుండుటచే, సంసార-రక్షకములగును. ఇక లౌకిక-కర్మలను గురించి చెప్పనదేమున్నది? సాధన-సాధ్యములన్నియూ వేదములలో బోధింపబడినవి. కావున, అవి చెట్టు ఆకులవలె సంసారమును రక్షించి శాశ్వతకాలము కొనసాగునట్లు చేయునే గాని, సంసారవిముక్తిని కలిగించవు. ఎందువలన? జీవుడు సాధన-సాధ్యవిజ్ఞానమును పొంది, తన ముందున్న లక్ష్యములను సాధించుటకై వేదవిహితములగు వివిధకర్మలనాచరించి, పుణ్యమును సంపాదించును. ప్రతిషిద్ధకర్మలనాచరించినచో, పాపమును మూటగట్టుకొనును. వాటిని అనుభవించుటకు మరల జన్మించును. ఈ తీరున ఆతనికి సంసారము కొనసాగుచుండును. సమగ్ర-దృష్టితో పరిశీలిస్తే, వేదప్రతిపాద్యములైన పుణ్యపాపములు జీవుని ప్రపంచానుభవమునకు హేతువులై సృష్టికి ఆధారమగుచున్నవి. చెట్టు ఆకులు దాని జీవనము కొనసాగుటకు హేతువులగును. అటులనే, కర్మలు సంసారవృక్షము శాశ్వతమగునట్లు చేయును.

కాని, చెట్టును నరికినట్లే, సంసారమును కూడ అంతమొందించవచ్చును. సంసారవృక్షము అజ్ఞానమునుండి పుట్టినది. దానిని నిర్మూలించుటకై, దాని మూలమగు బ్రహ్మము నేనేననియు, మరియు బ్రహ్మ నుండి ఉదయించిన సంసారవృక్షము కూడ నేనేననియు తెలియవలెను. ఆ జ్ఞానము ఉదయించిన పిదప ఒక విశిష్టస్థూలదేహముతో తాదాత్మ్యము అంతమగును. ముందుగా ఈ వృక్షమును ఛేదించవలెను. దాని కొరకై జీవుడు అనాత్మ యందు ఆత్మభావనను విడనాడవలెను. అపుడు ఖచ్చితముగా, చెట్టును ఛేదించిన తీరున, సంసారమూలమును నిర్మూలించవలెను. చెట్టును ముందుగా రంపముతో కోసి తరువాత వ్రేళ్ళను త్రవ్వెదరు.

వేదము కూడ ఈ దృష్టాంతమును బోధించినది. కఠోపనిషత్తులో సంసారము, వ్రేళ్ళు పైన బ్రహ్మ యందు, కొమ్మలు క్రింద దేశ-కాలము అనే చక్రము నందు గల వృక్షముతో పోల్చబడినది. అది చక్రాకారముగా తిరుగుచుండును గనుక, దానికి ఆది లేదు. అది ప్రళయసమయములో వృక్షము బీజములో వలె అవ్యాకృత-అవస్థలో నుండి, మరల సృష్ట్యాదియందు అభివ్యక్తమగును.

ఈ శ్లోకభాష్యములో శ్రీశంకరులు మహాభారతములోని ఒక దృష్టాంతమును

ఉదహరించిరి. సంసారము బ్రహ్మను ఆశ్రయించియున్న అవ్యాకృతమునుండి బ్రహ్మ యొక్క అనుగ్రహముచే ఉత్పన్నమైనదని అచట చెప్పబడినది. చెట్టు ఈశ్వరుని నుండి పుట్టుట మాత్రమేగాక, ఈశ్వరుని చేతనే పాలించి పోషింపబడుచున్నది. ఈశ్వరుడు లేనిదే దానికి ఉనికి లేదు. బుద్ధియే దాని కాండము. స్థూలదేహములోని ఇంద్రియగోళకములే దానిలోని రంధ్రములు. పంచభూతములే దాని కొమ్మలు. ఇంద్రియగోచరములగు వివిధవిషయములు దాని ఆకులు. ధర్మాధర్మములు, అనగా పుణ్యపాపములు దాని పుష్పములు. వాటి నుండి సుఖదుఃఖములనే ఫలములు పుట్టును. పక్షులు చెట్లపై నివసించు విధంబున, జీవుడు ఈ సంసారవృక్షముపై పూర్తిగా ఆధారపడి జీవించును.

సంసారవృక్షము యొక్క తల్లి వేరు బ్రహ్మ. దాని అభివ్యక్తి కూడ బ్రహ్మమే. అది బ్రహ్మ కంటె భిన్నముగా లేదు. ఏదో ఒక వృక్షము మాత్రమే బ్రహ్మ కాదు. అసంఖ్యాకవృక్షములతో నిండియున్న ఈ అడవి అంతయూ బ్రహ్మమే. ఈ బ్రహ్మవనములో తిరుగాడువాడు కూడ బ్రహ్మమే. కాని ఈ సత్యము వానికి తెలియకున్నది. కావున, సంసారవృక్షమును జ్ఞానమనే ఖడ్గముతో ఛేదించవలెను. అపుడు మానవుడు పునరావృత్తి లేని ఆత్మ స్వరూపనిష్ఠను పొందును.

బ్రహ్మజ్ఞానమును బోధించు మూడు ఆకరగ్రంథములు ఈ దృష్టాంతమును బోధించియున్నవి. ఇది మనకు వేదములోని కఠోపనిషత్తులోను, స్మృతిగ్రంథమగు ఈ గీతలోను కానవచ్చును. ఆ పైన శ్రీశంకరులు ఇతిహాసపురాణమగు మహాభారతమునుండి దీనిని ఉదహరించిరి. మహాభారతము ఇతిహాసమే అయినా, దానిని పురాణమని కూడ చెప్పవచ్చును. కాని, పురాణము ఎన్నటికీ ఇతిహాసము కాజాలదు. ఈ వృక్షమునెరింగిన వాడు వేదవేత్త (యః తం వేద సః వేదవిత్). వేదము చెప్పగోరే ప్రధానవిషయమేమనగా, సంసారమునకు అధిష్ఠానమగు బ్రహ్మ నీవే. బ్రహ్మ మూలముగా గల ఈ వృక్షమునెరింగిన వాడు సంసారమంతయు మిథ్యయనియు, మూలము సత్యమనియు ఎరుంగును. అట్టివాడు వేదములు ఉపదేశించే పరమసత్యమునెరింగిన వేదవేత్త.

ఇది ఈ అధ్యాయము యొక్క ఉపక్రమవాక్యము (ప్రతిజ్ఞా). సమూలమగు ఈ సంసారవృక్షమునెరింగినచో, సర్వము తెలిసినట్లే. అధ్యాయములోని శేషభాగము ఈ సత్యమును స్థిరపరచును. కావున, శేషభాగము ఆరంభవాక్యము యొక్క వ్యాఖ్యానమని చెప్పవచ్చును. మనమీ వృక్షము యొక్క స్వరూపమునింకనూ తెలియవలెను. దీనిని తెలిసినవాడు వేదవేత్త యగునని

చెప్పబడినది గదా! దానికొఱకై, ఈ సంసారవృక్షము యొక్క ఇతర-అవయవములు వర్ణింపబడు చున్నవి.

అధ్యాయము 15, శ్లోకము 2:

अधश्चोर्ध्वं प्रसृतास्तस्य शाखा गुणप्रवृद्धा विषयप्रवालाः ।
अधश्च मूलान्यनुसन्ततानि कर्मानुबंधीनि मनुष्यलोके ॥ २ ॥

అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా గుణప్రవృద్ధా విషయప్రవాలాః
అధశ్చ మూలాన్యనుసన్తతాని కర్మానుబంధీని మనుష్యలోకే (2).

తస్య = ఆ వృక్షము యొక్క, గుణప్రవృద్ధాః = గుణములచే వర్ధిల్లజేయబడినవి, విషయప్రవాలాః = ఇంద్రియగోచరమగు విషయములే చిగుళ్ళుగా గలవి అగు, శాఖాః = కొమ్మలు, అధః = క్రిందకి, చ = మరియు, ఊర్ధ్వమ్ = పైకి, ప్రసృతాః = వ్యాపించియున్నవి, చ = మరియు, మనుష్యలోకే = మానవలోకమునందు, కర్మానుబంధీని = కర్మలు అనుబంధముగా గల, మూలాని = వ్రేళ్ళు, అధః = క్రిందకి, అనుసంతతాని = అంతటా వ్యాపించియున్నవి.

గుణములచే వర్ధిల్లజేయబడినవి, ఇంద్రియగోచరమగు విషయములే చిగుళ్ళుగా గలవి అగు ఆ వృక్షముయొక్క కొమ్మలు క్రిందకి పైకి కూడ వ్యాపించియున్నవి. మరియు, మానవలోకమునందు కర్మలు అనుబంధముగా గల వ్రేళ్ళు అంతటా క్రిందకి వ్యాపించియున్నవి (2).

ఈ సంసారవృక్షము యొక్క కొమ్మలు ఏవి? వాటిలో కొన్ని క్రిందకి, మరికొన్ని పైకి విస్తరించి యున్నవి (అధః ఊర్ధ్వం ప్రసృతాః). ఊర్ధ్వ లోకములలో దేవతలు గలరు. దీని యర్థమేమనగా, ఇంద్ర-బృహస్పతి-ప్రజాపతులనుండి బ్రహ్మగారి వరకు అందరు సంసారములో భాగమై యున్నారు. కోర్కెలచే ఉపహతుడు కానివాడు, కావుననే సంసారమునుండి విముక్తిని పొందినవాడు అగు జ్ఞానితో వీరికి గల ఆనందతారతమ్యమును తైత్తిరీయోపనిషత్తు వర్ణించినది. దీనికి భిన్నముగా మరికొన్ని కొమ్మలు క్రిందకి వ్యాపించియున్నవి. మానవులు, పశువులు, వృక్షములు మొదలగు స్థావరములు మొదలగు వాటిని ఇవి నిర్దేశించును. క్రిందికి, పైకి

విస్తరించియున్న వీరందరు త్రిగుణములచే వర్ధిల్లజేయబడుచున్నారు (గుణప్రవృద్ధాః). బ్రహ్మాశ్రితమగు మాయ ఈ సర్వమునకు ఉపాదానకారణమై యున్నది. గుణములుండుటచే కర్మలు గలవు. జీవులకు కర్మలవలన దేహములు సంప్రాప్తమగును. ఈ జీవులు క్రింద ఉన్నా, పైన ఉన్నా గుణములచే ధరింపబడి యున్నారు.

చెట్టు కొమ్మకు అక్కడక్కడ కణుపులు ఉండి వాటి నుండి చిగుళ్లు పుట్టి కొత్త కొమ్మలు ఆరంభమగును. భోగ్యవస్తువులే (విషయాః) సంసారవృక్షములోని చిగుళ్ళు. వీటిని గోరు మానవుడు కొత్త కర్మలను చేబట్టి వాటి మూలకముగా కొత్త దేహమును పొందును. అనగా విషయవస్తువు అనే మొగ్గ కర్మలద్వారా కొత్త దేహము అనే కొత్త కొమ్మకు శ్రీకారమును చుట్టును.

ఈ సంసారవృక్షమునకు మాయాశబలితమగు బ్రహ్మ తల్లివేరు వంటిదని మనము చూచియున్నాము. జీవుని మనుష్యలోకములో బంధించే కర్మలు కాలక్రమములో కొమ్మలనుండి పుట్టే వ్రేళ్లతో (అధః చ మూలాని) పోల్చబడినవి. మంచి-చెడు సంచితకర్మలు మరియు ఇప్పుడు చేయబడుచున్న కొత్త కర్మలు కలిసి సంసారవృక్షమునకు ఈ కొత్తగా పుట్టే వ్రేళ్ళు అగును. రాగద్వేషములనుండి పుట్టే ఈ కర్మలు పరిపక్వమై ఫలమునిచ్చును. ఈ వ్రేళ్ళు సర్వత్రా వ్యాపించి సంసారవృక్షమును నవనవలాడుతూ ఉండునట్లు చేయును.

ఈ సంసారవృక్షము చాల లోతైన వ్రేళ్ళు గలది వలె కన్పట్టును. కాని అదృష్టవశాత్తు ఇది ఒక స్వప్నము వంటిది. దీనిలో తల్లివేరు మాత్రమే సత్యము, మిగిలినది సర్వము మిథ్య. భగవానుడు తరువాతి శ్లోకములో ఈ సంసారవృక్షముయొక్క యథార్థస్వరూపమును, దానిని పెకిలించి వేయు ఉపాయమును ప్రదర్శించుచున్నాడు.

అధ్యాయము 15, శ్లోకము 3:

न रूपमस्येह तथोपलभ्यते नान्तो न चादिर्न च संप्रतिष्ठा ।
अश्वत्थमेनं सुविरूढमूलमसंगशस्त्रेण दृढेन छित्त्वा ॥ ३ ॥

న రూపమస్యేహ తథోపలభ్యతే నాన్తో న చాదిర్న చ సంప్రతిష్ఠా
అశ్వత్థమేనం సువిరూఢమూలమసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా (3)

ఇహ = ఇచట, అస్య = ఈ సంసారవృక్షము యొక్క, రూపమ్ = రూపము, తథా = ఆ విధముగా, న ఉపలభ్యతే = లభించుట లేదు, అంతః = అంతము, న = లేదు, చ = మరియు, ఆదిః = అది, న = లేదు, సువిరూఢమూలమ్ = బలముగా పాతుకొనిన వ్రేళ్ళు గల, ఏనమ్ = ఈ, అశ్వత్థమ్ = అశ్వత్థవృక్షమును, దృఢేన = దృఢమైన, అసంగశస్త్రేణ = వైరాగ్యమనే ఆయుధముతో, ఛిత్త్వా = ఛేదించి.

> ఇచట ఈ సంసారవృక్షము యొక్క రూపము కన్పట్టు విధముగా లభ్యమగుట లేదు. దానికి ఆద్యంతములు గాని, అవిచ్ఛిన్నత్వము గాని లేవు. బలముగా పాతుకొనిన వ్రేళ్ళు గల ఈ అశ్వత్థవృక్షమును దృఢమైన వైరాగ్యమనే ఆయుధముతో ఛేదించవలెను (3).

అధ్యాయము 15, శ్లోకము 4 :

> ततः पदं तत् परिमार्गितव्यं यस्मिन् गता न निवर्तंति भूयः ।
> तमेव चाद्यं पुरुषं प्रपद्ये यतः प्रवृत्तिः प्रसृता पुराणी ॥ ४ ॥

> తతః పదం తత్ పరిమార్గితవ్యం యస్మిన్ గతా న నివర్తంతి భూయః
> తమేవ చాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ (4)

తతః = ఆ తరువాత, తత్ = ఆ, పదమ్ = లక్ష్యము, పరిమార్గితవ్యమ్ = తగు రీతిలో విచారము చేయబడవలెను, యస్మిన్ = దేనియందు, గతాః = వెళ్ళినవారు, భూయః = మరల, న నివర్తంతి = మరలి రారో, చ = మరియు, తమ్ = ఆ, ఆద్యం పురుషమ్ = ఆదిపురుషుని, శరణమ్ = శరణు, ప్రపద్యే = పొందుచున్నాను, యతః = ఏ పురుషుని నుండి, పురాణీ = ప్రాచీనమగు, ప్రవృత్తిః = సృష్టి, ప్రసృతా = ప్రవర్తిల్లినదో.

> ఆ తరువాత ఆ లక్ష్యమును గురించి తగు రీతిలో విచారమును చేయవలెను. దానిని పొందిన వారు మరల వెనుకకు తిరిగి రారు. మరియు, నేను ఆ ఆదిపురుషుని శరణు పొందుచున్నాను. ప్రాచీనమగు ఈ సృష్టి ఆయన నుండియే ప్రవర్తిల్లినది (4).

ఈ వృక్షము యొక్క రూపము మనకు తెలియరాదు. దీనిని మనము వ్రేళ్ళు, కొమ్మలు

మరియు ఆకులతో సహా విస్తారముగా వర్ణించియున్నాము. కాని, దీనిని విశ్లేషించ నారంభించినచో, నామరూపములు తక్క వృక్షము లేనే లేదు. ఏ వస్తువు విషయములోనైననూ ఇది యథార్థమే. ఆకాశమును దృష్టాంతముగా తీసుకొనుము. ఇంటిలోని నేల గాని, లేక పైకప్పు గాని, ఏదో ఒక అపేక్షిక వస్తువు (reference) లేనిదే, ఆకాశము లేదు. ఆకాశమనే భావనను స్థిరీకరించుటకు కనీసము ఒక అపేక్షిక వస్తువు ఉండితీరవలెను. ఏ విధముగా ఆలోచించిననూ, దానికి స్వతంత్రమగు ఉనికి లేదు. దానిని విశ్లేషించినచో, అద్వితీయ చైతన్యము మాత్రమే మిగులును. తరువాత వాయువును విశ్లేషించెదము. అది ఉదజనియా (Hydrogen)? ప్రాణవాయువా (Oxygen)? నత్రజనియా (nitrogen)? లేక బొగ్గుపులుసు వాయువా (carbon dioxide)? విశ్లేషించినచో, దానికి కూడ యథార్థమగు అస్తిత్వము లేదు. కాని సంసారవృక్షము తుచ్ఛము (non-existent) అని త్రోసిపుచ్చుటకు వీలులేదు. అట్లైనచో, దాని వర్ణనయే ఉండెడిది కాదు. కాని, అదే సమయములో, దానికి స్వతంత్రమగు ఉనికి ఉన్నదని చెప్పజాలము.

శ్రుతితాత్పర్యము సంసారవృక్షవర్ణన కాదు. అది మిథ్య యని నిర్దేశించి, దానికి ఆధారమగు అద్వితీయసత్యమును ప్రదర్శించుటయే శ్రుతితాత్పర్యము. నీవీ కారణమును తెలుసుకున్నచో, సర్వమును తెలిసినట్లే. శ్రీశంకరులు సంసారమును స్వప్నముతో, ఎండమావులలోని నీటితో, ఇంద్రజాలములో అది సత్యమా యన్నట్లు కానవచ్చు నగరముతో పోల్చిరి. స్వీయకాలములో అది సత్యమా యన్నట్లు భాసించిననూ, యాథాత్మ్యమును విచారించినచో, దానికి స్వతంత్ర-అస్తిత్వము లేదు. కాని, దానికి మూలము లేదని చెప్పదగదు. ఏలయన, మూలము మాత్రమే సత్యము. మిగిలినది సర్వము దానిపై అధ్యారోపమగుటచే, మిథ్య యగును.

కావున, ఈ సంసారము ఏ తీరున వర్ణింపబడినదో, ఆ రూపములో ఉపలభ్యమగుట లేదని భగవానుడు చెప్పుచున్నాడు (న రూపమస్యేహ తథోపలభ్యతే). దీనిని రెండు విధములుగా తెలియవచ్చును. పరంబ్రహ్మ దృష్టితో చూచినచో, ఒకే ఒక వస్తువు గలదు. విశ్లేషించిన పిదప, సర్వనామరూపములు దానిలో విలీనమగును. కావున, వస్తుదృష్టితో చూచినచో, నామరూపములు కేవలప్రాతిభాసికములు మాత్రమే. అజ్ఞానముచే కర్తృత్వము ఆత్మపై అధ్యారోపము చేయబడుచున్నది. నామరూపములు ఆత్మకంటె భిన్నముగా భాసించుచున్నవి. జ్ఞేయప్రపంచము జ్ఞాతకంటె, జ్ఞానము కంటె భిన్నమని పరిగణింపబడుచున్నది. సంసారమును నిర్మించే ఈ భేదజాతమంతయూ ప్రాతిభాసికము (projection) మాత్రమే.

వ్యావహారిక దృష్టికోణముతో చూస్తే, పంచభూతములు, సృష్టినియమములు, పుణ్యపాపములు, కర్మ, కర్మఫలములు, దేహము, ఆకలి, జ్ఞానము, మోహము ఇత్యాదులతో కూడియున్న ఈ జగత్తు సత్యమనియు, జీవుని బంధించుననియు అనిపించును. కాని ఇది సత్యము కాదు. ఇవి గాక, ఈశ్వరుడు, ఒక ఉపాదానకారణము, కర్మ-కర్మఫలముల మధ్య ఒక నియతి (Order), జ్ఞాన-అజ్ఞానములు, జాగ్రత్-స్వప్న-సుషుప్తులు ఇత్యాదులు గలవు. ఇంతకు ముందు వర్ణించబడిన సంసారవృక్షమును వ్యావహారిక దృష్టికోణములో చూస్తే, ఇవి అన్నియు సంభవమే. కాని నిర్విశేష సత్యవస్తువు యొక్క దృష్టికోణములో చూస్తే, ఈ సర్వమునకు ఉనికి లేదు. బ్రహ్మ మాత్రమే గలదు.

పైగా, ఈ సంసారమునకు ఆది-అంతములు గాని, మధ్యలో అవిచ్ఛిన్నత (Continuance) గాని లేవు (నాంతో న చాదిర్న చ సంప్రతిష్ఠా). భూతకాలములో లేనిది, భవిష్యత్తులో ఉండనిది వర్తమానములో కూడ లేదు (ఆదావంతే చ యన్నాస్తి వర్తమానే చ తత్తథా) అని గౌడపాదులు చెప్పిరి. ఉదాహరణకు, ఘటము పుట్టుటకు ముందు లేదు; పగిలిన తరువాత ఉండబోదు. కావున, ఈ మధ్యలో దానికి వాస్తవమగు ఉనికి లేదు. కేవలము ఉన్నట్లు కన్పట్టుట మాత్రమే.

ఏకైక-వస్తువు అగు ఆత్మయందు జ్ఞాతృ-జ్ఞేయ-జ్ఞాన-భేదములు అధ్యారోపితమై ప్రతిభాసించే ఈ సంసారమునకు నిశ్చితముగా ఆది గాని అంతముగాని లేవు. మిథ్యయగు సృష్టికి ఆత్మతో అధ్యాస-సంబంధము (Superimposition) మాత్రమే గలదు. అజ్ఞానమూలకమగు ఈ అధ్యాసకు ఆరంభము లేదు. దానికి అంతము కూడ లేదు (అసలు దానికి యథార్థమగు ఉనికియే లేదు). ఆది-అంతములు లేనిది మధ్యలో లేకుండుట సహజమే. ఉదాహరణకు, ఘటమును విశ్లేషించినచో, అది బ్రహ్మయందు అజ్ఞానముచే అధ్యారోపితమైనది గనుక, అదృశ్యమై శుద్ధచైతన్యములో పర్యవసానమును చెందును (reduces). బ్రహ్మ యొక్క దృష్టికోణములో బ్రహ్మకంటె భిన్నమైనది సర్వము అధ్యస్తమే గనుక, దానికి ఆది-అంతములు గాని, ఇప్పుడు ఉనికి గాని ఉండవు.

అది వ్యావహారికముగా సత్యమే అయినా, పారమార్థికముగా సత్యము గాదు. త్రాడు-పాము-భ్రాంతిలో త్రాడు సత్యము; పాము కాదు. త్రాడు పాము కంటె అధికసత్యము కావిచో, పాము అసత్యమనే నిర్ణయమును మనము చేయజాలము. కావున మన యెదుట ఈ

వ్యావహారిక-సత్యత్వము కూడ గలదు. అది ఒక నియతిని అనుసరించి ప్రవర్తిల్లును. వ్యావహారిక-ప్రపంచముయొక్క దృష్టికోణములో, బ్రహ్మ సత్యము కాగా, జగత్తు మిథ్య యగును. జగత్తును బ్రహ్మకంటె పూర్తి భిన్నముగా దర్శించే సమయములో, ద్వైతము సత్యము, జీవులు అనేకులు మరియు పరస్పర-భిన్నులు అగుటచే, జగత్తు భయహేతువు అగును. మరణము, వ్యాధి ఇత్యాది సర్వము మిథ్య గాక, యథార్థమగును. జగత్తును మిథ్యగా దర్శించినచో, అది పారమార్థిక-సత్యము కాకున్ననూ, వ్యావహారిక-సత్యము అగును. ఈ దర్శనము లేనిచో, సంసారము తప్పదు. దానిని బాధించుట యెట్లు?

దాని అసలు రంగును మనము పరికించవలెను. అది చూస్తూ ఉండగానే, మటుమాయమగును (దృష్టనష్టస్వరూపః) అని శ్రీశంకరులు చెప్పిరి. ఒక వస్తువు ఈ క్షణములో ఎట్లున్నదో, అటులనే అది కొనసాగునట్లు చేయుట అసంభవము. మరుక్షణములో అది మారిపోవును. దానిని అపుట ఎవ్వరి తరము కాదు. దానికి ఆది-అంతములు, స్వతంత్రమగు ఉనికి లేకపోవుటకు ఇది మరియొక కారణము. బ్రహ్మ యొక్క దృష్టికోణములో దానికి లేశమైననూ అస్తిత్వము లేదు. మనము ఒక పదార్థమును విశ్లేషించనారంభించినచో, అది వస్తువులో తిరోహితమగును.

ఒక వస్తువు ఫలానా కాలములో పుట్టినదని మనము చెప్పగలము. కాని, సంసారము పుట్టినదని మనము చెప్పజాలము. వ్యావహారిక-దృష్టికోణములోనైననూ, సృష్టి అవ్యక్తమునుండి వ్యక్తము, మరల వ్యక్తము నుండి అవ్యక్తము ఇత్యాదిగా సాగుచుండును గనుక, దానికి ఆది లేకపోవుటయే గాక, స్వతంత్రమగు అస్తిత్వము కూడ లేదు. నీవు నిద్రలోనికి జారుకోగానే, సర్వము మాయమగును. మరల నిద్ర లేచుసరికి, అది ఎన్నటికీ ఏకరూపముగా నుండదు. అది నిరంతరముగా మారుతూ, తిరోహితమగుచుండును.

దానికి అవిచ్ఛిన్నత్వము (Continuance) లేదని చెప్పియున్ననూ, శ్రీకృష్ణుడు తరువాతి పాదములో, దానికి బలముగా పాతుకొనిన వ్రేళ్ళు గలవని చెప్పుచున్నాడు. అజ్ఞానము కంటె బలమైన మూలము ఉండబోదు. కావున, విచారము ఆరంభమై పూర్తి యగునంతవరకు, దాని వ్రేళ్ళు బలముగా నుండును. కాలక్రమములో సర్వము పెకలించి వేయబడును. కాని అజ్ఞానమును జ్ఞానము మాత్రమే పెకలించి వేయగలదు. బహుశః కాలము తగినన్ని దుఃఖానుభవములను కలిగించి, తెలియాలనే కోరిక (జిజ్ఞాస) పుట్టునట్లు చేయును. ఆ కోరిక

విచారవమునకు, విచారవము జ్ఞానవమునకు దారితీయవచ్చును. జ్ఞానవము అజ్ఞానవమును ఉన్మూలించును. సంసారము యొక్క మూలము దృఢమే అయిననూ (సువిరూఢమూలః), ఆ మూలము అజ్ఞానములో నుండుటచే, దానికి వాస్తవమగు రూపము లేదు.

దానిని నరుకుటకు ఒక గొడ్డలి కావాలి. అదియే అసంగ-శస్త్రవము. విషయ-విషయి-భేదవమును గుర్తించుట ద్వారా, దేహేంద్రియమనస్సంఘాతవముతో గల భ్రాంతిమూలకవమగు తాదాత్మ్యము తొలగిపోవును. అసంగశస్త్ర మనగా ఆత్మ-అనాత్మల స్వరూపవిచారమే. దీనితో సంసారవృక్షము నరికి వేయబడును.

ఈ అసంగవము దృఢవముగా నుండవలెను. అసంగవము బాహ్యప్రపంచవముతో ఆరంభవమగును. సాధకుడు మున్ముందుగా తన కుమారుని యెడ అసంగత్వమును పెంపొందించుకొనవలెను. 'నా కొడుకు' అనే పదప్రయోగములోనే ఆసక్తి వ్యక్తమగుచున్నది. ఆసక్తికి మిత్రులు మరియొక ఆలంబనవము. మానవుడు విడిచిపెట్టాలనుకున్నా, మిత్ర బృందముతోడి సహవాసమును విడనాడలేడు. ఇది తేలిక కాదను మాట సత్యము. దీనికి కొంత సమయము పట్టును. ఆ తరువాత, మిత్రులు కలిసినా వారితో సంభాషించుటకు అందరికీ ఆమోదమయ్యే అంశము మృగ్యమగును. వారు వస్త్రములు, సినిమాలు మొదలగు వాటి గురించి మాటలాడెదరు. వాటియందీతనికి అభిరుచి ఉండదు. అభిరుచి లేని అంశము గురించి నోరు విప్పి మాటలాడుట సంభవము కాదు గదా! కావున, ఈతడు వారితో కొద్దిసేపు గడిపి, ఒక కప్పు కాఫీ త్రాగి తన దారిన తాను వెళ్ళును.

ధనము, వివిధరకముల సంపద అను వాటి సంగతి వేరే. వాటిని విడుచుట మరింత కష్టము. స్వర్గమును పొందవలెననే ఆకాంక్ష అంతిమముగా విడువబడును. వీటినుండి పారిపోయే ప్రయత్నము వ్యర్థము. తగిన విచారణతో గూడిన ఆత్మావలోకనము ద్వారా సాధకుడు వీటన్నింటిపై అసంగత్వమును పొందవచ్చును. వాస్తవంలో ఇవేవీ స్థూలపదార్థములు గావు. ఇవి అన్నియూ కేవలధారణా రూపములో మాత్రమే గలవు. సర్వము ఆత్మ కొరకు మాత్రమే ప్రియమగుచున్నది (ఆత్మనః కామాయ సర్వం ప్రియం భవతి) ఇత్యాది శ్రుతివచనములు మనకు ఈరకం విచారములో సహకరించును. ఒక వ్యక్తిపై గల బంధహేతువగు ప్రేమావేశము, ఆత్మ యందలి ప్రేమగా మారిపోవును. ఈ తీరున విచారము ద్వారా మమకారజన్యమగు ఆసక్తిని తగ్గించుకొనవచ్చును. ఈ మమకారమునకు ప్రక్కనే 'నేను' అనే భ్రాంతధారణ (అహంకారః) ఉన్నది. సంసారవృక్షమునకు అనుబంధముగా పుట్టుకు వచ్చే పిల్లవ్రేళ్ళు ఇవియే.

కాని తల్లివేరు మిగిలియండును. అది పోవుటకై ఆత్మ తెలియవలెను. దీనికి సరియగు విచారము (పరిమార్గణమ్) ఆవశ్యకమగును. శాస్త్ర-ఆచార్య సహకారముతో సర్వ గత్కారణమగు బ్రహ్మకు ఆత్మతో అభేదమును చెప్పే మహావాక్యమును యథాతథముగా తెలియవలెను. పరిమార్గితవ్యమ్ అనగా అర్థము ఇదియే.

అసంగత్వము ఒక్కటి మాత్రమే చాలదు. దీనికి తోడుగా సకారాత్మకమగు లక్షణము ఒకటి ఉండవలెను. అట్లుగాక, మనస్సును తొక్కిపెట్టి ఉంచినచో, ఒకదానియందలి ఆసక్తిని విడనాడుతూనే, మరియొకదానియందు ఆసక్తిని పొందే అవకాశము గలదు. కావున, అసంగత్వమును ఒక ఆదర్శము చేసుకొని సాధింపబూనుట శ్రేయస్కరము కాదు. కావున పురుషార్థ-నిశ్చయము ఆవశ్యకమని శ్రీశంకరులు వక్కాణించిరి. సంసారములో జీవిస్తూ సంసారమునుండి విముక్తిని పొందుట సంభవము కాదు. భర్త, భార్య, పిల్లలు మొదలగు వారు సమస్యను పరిష్కరించజాలరు. నీకు తెలివితేటలుండి నేర్చుకోగలిగే పక్షంలో, వారు నీకు కొంత పరిపక్వత నీయగలరు. అట్లు గానిచో, వారివలన సమస్యలు మరింత తీవ్రమై నీవు సంసారములో మరింత కూరుకొని పోయెదవు. నీవు భాగ్యవంతుడవైనచో, ఈ ఎదిగే ప్రక్రియలో పురుషార్థము మోక్షమేనను సత్యమును నీవు గుర్తించెదవు. కాని ఇది కూడా చాలదు. మోక్షమునందలి ఇచ్ఛను తెలియాలనే ఇచ్ఛ (జిజ్ఞాస) లోనికి మార్చుకొనవలెను. ఇట్టి పురుషార్థ-నిశ్చయముండవలెనని శ్రీశంకరులు వ్రాక్రుచ్చిరి. మోక్షము జ్ఞానరూపమనే అవగాహన సామాన్యమైనది కాదు. అధికమగు వివేకము ఉన్నప్పుడు మాత్రమే ఇది సిద్ధించును. ముముక్ష జిజ్ఞాసలోనికి పరివర్తన చెందును.

ఇందు వలననే, వేదాంతశాస్త్ర విచారము అథాతో బ్రహ్మజిజ్ఞాసా (తరువాత అందువలన, బ్రహ్మవిచారము చేయబడవలెను) అను సూత్రముతో ఆరంభమగును. అది ముముక్షతో ఆరంభము కాకపోవుటలో గంభీరమగు అర్థము గలదు. అథ (తరువాత) అనే మొదటి పదములో ముముక్ష అంతర్గతమై యున్నదని గమనించవలెను. మోక్షమునకు కావలసిన అర్హతలనన్నిటినీ సంపాదించిన తరువాత, సాధకుడు బ్రహ్మవిచారమును చేయవలెను. మాత్రమే సంసారనివృత్తి యగును.

తరువాత సాధకుడు ఆత్మానాత్మ వివేకము యొక్క ఆవశ్యకతను గుర్తించును. చెట్టును నరుకుటకు గొడ్డలితో దెబ్బ చాలదు. అటులనే, ఒక్క ప్రయత్నముతో ఆత్మానాత్మవివేకము

సంసారవిముక్తి సిద్ధించవు. అభ్యాసము అవసరమగును. ఎంతవరకు? సంసారము తొలగునంతవరకు. ఇది మామూలు చెట్టు కాదు. ఇది ఇతరవినాశి వస్తువులతో పోల్చినచో, అవినాశి (అవ్యయః). దీనికి ఆది-అంతములు లేవు. దేహము, ఇంద్రియములు మరియు సర్వమనోవృత్తులకంటె ఆత్మ విలక్షణమైనది అను సత్యమును పదే పదే దర్శించవలెను. దీనిని అవగాహన చేసుకొని, అనాత్మను పూర్తిగా త్రోసిపుచ్చి, మనము ఆత్మస్వరూపమును దర్శించవలెను.

ఇపుడు మనము నీవు (త్వమ్) అను పదము యొక్క అర్థమును పరిశీలించెదము. ఉపదేశము పని చేసే అంశము ఇది మాత్రమే. సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ అను వాక్యము వేధించవలసిన లక్ష్యము సర్వాంతరమగు ప్రత్యగాత్మ మాత్రమే. అప్పుడు పొందబడే లక్ష్యమునుండి చ్యుతి ఉండదు. ఇది తక్క జీవుడు ఎచటకు పోయిననూ, నిరంతర పర్యాటకుని వలె తిరుగాడు చుండును. దానిని విడిచి మరియొక చోటికి పోక తప్పదు. కాని, జ్ఞానికి గమనాగమనములు ఇంతటితో సరి.

బ్రహ్మను పొందిన వారికి పునరావృత్తి లేదు. బ్రహ్మ సృష్టికి పూర్వమునందు కూడ ఉండుటచే, ఆద్యమ్ అని వర్ణింపబడినది. ఘటము పుట్టుటకు పూర్వము మట్టి ఉన్న తీరున, ఈ జగత్తు అంతయు సృష్టికి పూర్వము సద్రూపముగ నుండెడిది. దేనినుండి సర్వము ఉద్భవించినదో, ఆ సత్‌యే పురుషుడు. భగవానుడు పురుషశబ్దమును ప్రయోగించి, సత్ చేతనము మరియు పూర్ణము అని స్థిరీకరించినాడు. సృష్టికి పూర్వమునందు ఉన్న పురుషుడే ఇపుడీ దేహములో పురుష రూపములో ఉపలభ్యమగు చున్నాడు. నేను వానిని శరణు పొందుచున్నాను (ప్రపద్యే) అని జీవుడు పలుకుచున్నాడు. ఆ శరణు పొందుట పూర్ణమైనచో, పురుషుడు మాత్రమే మిగిలియున్నాడు.

మిథ్యాభూతుడగు వ్యక్తిని మాత్రమే సమర్పించుట సంభవమగును. యథార్థపురుషుని సమర్పించుట సంభవము గాదు. అనాత్మను నిషేధించిన పిదప అంతరతమమగు ప్రత్యగాత్మ మాత్రమే మిగిలి యుండును. ఇచట పురుషశబ్దముచే నిర్దేశించబడిన పరం బ్రహ్మకు ఆ ప్రత్యగాత్మకు భేదము లేదు. ఎవని నుండి సృష్టి ప్రవర్తిల్లినదో, ఆ పురుషుడీతడే. ఈ అతిప్రాచీనమగు (పురాణీ) సృష్టి ఈ పురుషుని నుండియే ఉద్భవించినది. ఆ పురుషుని శరణు జొచ్చిన వ్యక్తి ఆత్మస్వరూపవిచారమును చేసి, సిద్ధిని పొందగలడు. విచారమును చేయు జిజ్ఞాసువు

ముందుగా అనాత్మను నిషేధించి, ఎవనినుండి సర్వము ఉద్భవించినదో, ఆ పురుషునకు తనను తాను సమర్పించుకొనును.

ఈ పురుషుని పొందగోరి, శరణు జొచ్చిన వ్యక్తులు ఎవరు? వారు పునరావృత్తి లేని (న నివర్తన్తి భూయః) పదమును పొందెదరు. ఇట్టి లక్ష్యమును పొందగలిగే సాధకుల అర్హతలు ఏవి?

అధ్యాయము 15, శ్లోకము 5:

निर्मानमोहा जितसंगदोषा अध्यात्मनित्या विनिवृत्तकामाः ।
द्वंद्वैर्विमुक्तास्सुखदुःखसंज्ञैर्गच्छन्त्यमूढाः पदमव्ययं तत् ॥ ५ ॥

నిర్మానమోహా జితసంగదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః
ద్వంద్వైర్విముక్తాస్సుఖదుఃఖసంజ్ఞైర్గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయం తత్ (5)

నిర్మానమోహాః = ఇతరులు నన్ను మర్యాద చేయవలెననే ఆగ్రహము మరియు మోహము లేనివారు, జితసంగదోషాః = ఆసక్తి అనే దోషమును జయించినవారు, అధ్యాత్మనిత్యాః = సర్వదా ఆత్మనిష్ఠులై ఉండువారు, వినివృత్తకామాః = పూర్తిగా తొలగిన కోర్కెలు గలవారు, సుఖదుఃఖసంజ్ఞైః = సుఖదుఃఖములనబడే, ద్వంద్వైః = పరస్పరవిరుద్ధతత్త్వములనుండి, విముక్తాః = పూర్తిగా విడుదలను పొందినవారు, అమూఢాః = మూఢులు కానివారు, తత్ = ఆ, అవ్యయమ్ = వినాశము లేని, పదమ్ = లక్ష్యమును, గచ్ఛంతి = పొందెదరు.

> ఇతరులు నన్ను మర్యాద చేయవలెననే ఆగ్రహము మరియు మోహము లేనివారు, ఆసక్తి అనే దోషమును జయించిన వారు, సర్వదా ఆత్మనిష్ఠులై యుండువారు, కోర్కెలు పూర్తిగా తొలగినవారు, సుఖదుఃఖములనే పరస్పరవిరుద్ధతత్త్వముల నుండి పూర్తిగా విడుదలను పొందినవారు, మూఢులు కానివారు అగు సాధకులు వినాశము లేని ఆ లక్ష్యమును పొందెదరు (5).

భగవానుడు 13 వ అధ్యాయములో మరియు ఇతరత్రా సాధకునకు ఉండవలసిన అర్హతలను గురించి చెప్పిన సర్వమును ఈ ఒక్క శ్లోకములో ఇమిడ్చినాడు.

నిర్మానమోహాః. వారికి మానమోహములు లేవు. ఇతరులనుండి గౌరవమునపేక్షించుట మానమనబడునని మనము చూచియున్నాము. గౌరవమునపేక్షించుటకు గల కారణమును విశ్లేషించినచో, దీనినుండి విడుదలను పొందవచ్చును. దానికి కారణములు గలవు. తనను గురించి తనకు అతిశయించిన నిందాభావము గల వ్యక్తి ఇతరులనుండి విమర్శను లేశమైననూ సహించలేడు. ఒక వ్యక్తికి సమ్మానార్హములైన అర్హతలు ఉన్ననూ, చాలినంత ఆత్మగౌరవము లేనిచో, దానిని ఆతడు ఇతరులనుండి అపేక్షించును. ఈ లోపము అనేకరూపములలో అభివ్యక్తమగును. ఇతరులు తనను మర్యాద చేయాలనే ఆగ్రహము వాటిలో ఒకటి. దీనిని అధిగమించుటకై వ్యక్తి తనలో దెబ్బతినియున్న ఆత్మాభిమానమును కుదుటపరచుకొని, ఒక విశిష్టస్థాయికి చెందిన ఆత్మగౌరవమును నిర్మించు కొనవలెను.

అఖరుగా మనమొక ప్రశ్నను వేసుకొనవలెను. ఆత్మగౌరవమనగా నేమి? ఉన్నది ఒకే ఒక ఆత్మ. అదియే నేను. ఎవరు ఎవరిని గౌరవించవలెను? తనను తాను పోల్చదగిన ద్వితీయవస్తువు లేదు. స్వరూపభూతమగు ఆత్మను ప్రమాణీకరించ (prove) నక్కరలేదు. ఎవరియెదుట ప్రమాణీకరించవలెనో, వారు ఆత్మకంటె భిన్నులు గారు. ఈ సత్యము గుర్తించదగినది. సచ్చిదానంద బ్రహ్మను నేను. సర్వము నాయందు ఉనికి గలదై, నాచే ప్రకాశింప చేయబడుచున్నది.

వస్తువులకు లేని విలువను వాటికి అంటగట్టుటయే మోహమనబడును. మనము వస్తువులయందు స్వతహాగా లేని విలువను వాటికి అంటగట్టి తత్కారణముగా అల్పకాలములోనే నిరాశకు గురి యగుచుందుము. భ్రాంతికారకములగు ఇట్టి జీవనమూల్యముల వలన, ప్రపంచమును అనాసక్తముగా (dispossionate) దర్శించే సామర్థ్యము మనలో కుంటువడును. విచారముచే వస్తువులను యథాతథముగా దర్శించే సామర్థ్యము అలవడును. ఇతరులనుండి మానమర్యాదలనపేక్షించుట, అనాసక్తముగా వస్తువులను చూడలేకపోవుట అను దోషములనుండి విముక్తులైనవారు నిర్మానమోహాః అనబడుదురు.

సంగము యొక్క దోషమును జయించిన వారు జితసంగదోషాః అనబడుదురు. ఒక వస్తువు లేనప్పుడు వ్యక్తికి న్యూనతా-భావన కలిగినచో, అతనికి దానియందు సంగమున్నదని తెలియవలెను. విచారము, మానసికముగా ఎదుగుట అను వాటిచే మాత్రమే దీనిని అధిగమించవచ్చును. జితశబ్దప్రయోగముచే ఇది యుద్ధమని తెలియుచున్నది. ఇది సత్యము. కాని

ఇది కేవలము తెలివికి సంబంధించిన యుద్ధము. మనము ఏ వస్తువులపై ఆసక్తిని పెంచుకుంటామో, వాటి గురించి మనకు సరియైన అవగాహన ఉండదు. వాటికి మనము దూరమైనప్పుడు మాత్రమే, 'నేను హాయిగా నున్నాను' అనే భావనకు వాటి అనివార్యత మనచే గుర్తింపబడును. అవి ఒకటి తరువాత ఒకటి ఎదుటికి వస్తూ ఉంటే, వాటిపై మనము ఆసక్తిని పెంచుకుంటాము. ఈ ఆసక్తి కేవలము మనోవృత్తి మాత్రమే. విశ్లేషిస్తే యథార్థమగు ఆసక్తి లేదు. వ్యక్తికి వస్తువుల యెడ మరియు తన యెడల గల ఒక విశిష్టదృష్టికోణము ఆసక్తికి, ప్రేమాంధతకు మాత్రమే గాక, ప్రేమోన్మాదమునకు కూడ హేతువు అగును. ఇవి అన్నియూ బంధించే స్వభావము గలవియే. వీటిని యోగ్యమగు విచారముచే జయించినవారు జితసంగదోషాః అనబడుదురు.

బంధహేతువులగు కామనలన్నియూ వీరినుండి అతిసహజముగా దూరమగును (వినివృత్తకామాః). కామనలు ఒక విశిష్టపద్ధతిలో దూరమైనవనే విషయమును 'వి' అనే ఉపసర్గ సూచించును. సాధారణముగా కామనలు కొంత శేషమును మిగిల్చి క్షీణమగును. వినివృత్త అనగా శేషము ఏమియూ మిగులలేదని యర్థము. ఉల్లిని గాని, వెల్లుల్లిని గాని తిన్న తరువాత చేయి కడుగుకొని నీటితో నోటిని పుక్కిలించినమా, కొంత వాసన మిగిలియుండును. అదే విధముగా, కోర్కెలు తొలగి పోయిననూ, వాటి శేషము మిగిలియుండును. తాను ఒక వస్తువును పరిత్యజించినానని వ్యక్తి తలపోయుచున్ననూ, దానియందలి కోరిక సూక్ష్మరూపముగా మిగిలియుండును. అనగా అతడు దానిని నిత్యవ్యవహారములో పరిత్యజించిననూ, దానికి అతీతముగా పరిణతిని చెందలేదు.

నేను ఒక వస్తువును పరిత్యజించినా, లేక దానికి అతీతముగా పరిణతిని చెందినా, ఆ వస్తువు ఇప్పుడు నా వద్ద లేదు. కాని దానికి అతీతముగా పరిణతిని చెందుటయే యథార్థమగు పరిత్యాగమగును. అదియే సన్న్యాసము. ఆత్మస్వరూపనిష్ఠకు కటిబద్ధుడైన వ్యక్తికి మాత్రమే ఇది సంభవమగును. అట్లుగాక, మానసిక పరిపక్వత లేకుండా, వస్తువులను పరిత్యజించినచో, మనస్సులో ఏర్పడిన శూన్యములోనికి వివిధ రకముల కోర్కెలు వేగముగా చొరబడును. వాస్తవములో అధిక మహత్త్వము గల వస్తువుపైకి శ్రద్ధ మళ్ళిన వ్యక్తి అధికాధికమగు సమయమును దాని కొరకు కేటాయించును. అప్పుడు ఇతరములు వాటంతట అవియే జారిపోవును. వాటిని పరిత్యజించవలసిన పని లేదు. ఆత్మ-స్వరూప-నిష్ఠకు కటిబద్ధుడగుట (అధ్యాత్మనిత్యత్వమ్) అనగా నిదియే.

ఇటువంటి సకారాత్మక సాధనలో నిర్దిష్టదిశలో ముందుకు సాగుట, సత్య-అవిష్కారము మరియు వ్యక్తిత్వ-వికాసము ఉండును. ఇవి అన్నియు సహజముగా అబ్బును. పూర్ణమగు అంకితభావము ఏర్పడును. అంకితభావమను పదమైననూ సరిగాదు. ప్రేమాతురుడగు వ్యక్తికి తన ప్రియురాలిని గూర్చి తలపోయుటకు ఏ అంకితభావము ఉండవలెను? అది అతిసహజ-ప్రవృత్తి యగును. అతడు దానిని తప్పించి మరియొక పనిని చేయజాలడు. అతడు విధి నిర్వహణలో భాగముగా అనేక పనులను చేస్తూ, అనేక చర్చలలో పాల్గొనుచున్ననూ, అతని ధ్యానము సదా తన ప్రియురాలిపై ఉండును. సాధకుని జీవితము కూడ ఇటులనే యుండును. ఇది కేవలము తనను గురించి తాను తలపోయుచుండుట కాదు. నిరాశోపహతుడగు ఏ వ్యక్తియైననూ ఆ పనిని చేయగలడు. సాధకుడు శ్రవణ, మనన, నిదిధ్యాసనముల ద్వారా పరమాత్మ స్వరూపమును గురించి అవిచ్ఛిన్నముగా సముచితమగు విచారమును చేయును.

పరస్పరవిరుద్ధములగు ద్వంద్వములనుండి పూర్తిగా విముక్తిని పొందియున్న వ్యక్తుల గురించి మనమిచట చర్చించుచున్నాము. ద్వంద్వములన్నియు సుఖదుఃఖములనే ద్వంద్వములో అంతర్గతమగును. పరిస్థితులన్నింటిలో వారు వాస్తవములను యథాతథముగా ఎదుర్కొనుచున్న వారై ప్రసన్నమగు మనస్సును కలిగియుందురు. దీని ఫలస్వరూపముగా, వారియందు వివిధభ్రాంతులకు చోటు ఉండదు (అమూఢాః). వారు వినాశము లేని పదములను పొందెదరు (తత్ పదం అవ్యయం గచ్ఛంతి).

ఈ పదమును గూర్చి తరువాతి శ్లోకము మరిన్ని వివరముల నిచ్చుచున్నది :

**అధ్యాయము 15, శ్లోకము 6:**

न तद्भासयते सूर्यो न शशांको न पावकः ।
यद्गत्वा न निवर्तंते तद्धाम परमं मम ॥ ६ ॥

న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః
యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ (6).

**తత్** = దానిని, **సూర్యః** = సూర్యుడు, **న భాసయతే** = ప్రకాశింప జేయుట లేదు, **శశాంకః** = చంద్రుడు, **న** = ప్రకాశింప జేయుట లేదు, **పావకః** = అగ్ని, **న** = ప్రకాశింప

జేయుట లేదు, యత్ = దేనిని, గత్వా = పొంది, న నివర్తంతే = వెనుకకు మరలి రారో, తత్ = ఆ, ధామ = స్థానము, మమ = నా యొక్క, పరమమ్ = సర్వోత్కృష్టమైనది.

> దానిని సూర్యచంద్రులు గాని, అగ్ని గాని ప్రకాశింప జేయలేరు. దానిని పొందిన వారికి పునరావృత్తి లేదు. నా యొక్క ఆ ధామము సర్వోత్కృష్టమైనది (6).

ధామ అనగా స్థానము. ఈ శ్లోకములోని పద, ధామ అను శబ్ద ప్రయోగములు గీతానేపథ్యములోని వైదికసంస్కృతిని ప్రతిబింబించును. వేదములతో సహా మతగ్రంథములన్నియు మరణానంతరము జీవుడు పొందదగిన స్థానములను గురించి హామీలనిచ్చును. ఇంచుమించు మతములన్నియు స్వర్గమును చరమలక్ష్యముగా ప్రతిపాదించుచున్నవి. వేదములో కూడ కొన్ని విశిష్ట కర్మలకు ఫలమగు పుణ్యలోకములను పదమ్, ధామన్ అను పదములు నిర్దేశించు చున్నవి. అభీష్టలక్ష్యమును నిర్దేశించుటకు సామాన్యముగా ఈ పదములు ప్రయోగింపబడుటచే, మోక్షమునకు కూడ అవియే పదములు వాడబడినవి. కాని, స్వర్గమును పొందిన వారికి మరలి వచ్చుట తప్పనిసరి కాగా, మోక్షములో పునరావృత్తి లేదు.

ఇందువలననే మోక్షమును నిర్దేశించుటకు ఈ పదములను వాడిన సందర్భములలో, 'వారు తిరిగి రారు (న నివర్తంతే)' అను విశేషణము జతగూడును. దీనిని తెలిసినవారు బ్రహ్మస్వరూపులగుదురు అని భగవానుడు సరళముగా చెప్పియుండవచ్చును. కాని స్వర్గసందర్భములో పరిచితమైన పదములను ప్రయోగించుటవలన వాటి మధ్య గల పోలిక మనస్సునకు వచ్చుటయే గాక, స్వర్గమును పొందుటయే చరమలక్ష్యము కాదను సత్యమును గుర్తు చేసినట్లగును. ప్రతీ గమనములో పునరాగమనము తప్పదు. కాని దీనికి పునరాగమనము లేదు. అనగా ఈ గమనము ఉపచారము (figurative) మాత్రమేనని స్పష్టమగుచున్నది. దీనిలో గమనప్రసక్తి లేదు. ఆ బ్రహ్మవు నీవే.

నీ స్వరూపము బ్రహ్మ. అదియే ధామ. దీనిని సూర్యచంద్రులు గాని, అగ్ని గాని ప్రకాశింప జేయుటలేదు (న తద్భాసయతే సూర్యః న శశాంకో న పావకః). కాని అది చీకటి కాదు. ప్రకాశఘనమగు దాని యెదుట ఇతరప్రకాశములన్నియు నిస్తేజములగుచున్నవి. పైగా, అది అనంతము (పరమమ్). భగవత్స్వరూపమగు ఆ అనంతచైతన్యము సూర్యచంద్రులను అగ్నిని మాత్రమే గాక, ఇతరమును సర్వమును ప్రకాశింప జేయుచున్నది. దానిని ఏది ప్రకాశింప

జేయగలదు? సూర్యుడు భూమండలమునంతనూ ప్రకాశింప జేయగలడు. కాని ఆయన భగవానుని ధామమును ప్రకాశింప జేయలేడు. సూర్యుడు ప్రకాశింప జేయలేని దానిని చంద్రుడు గాని, అగ్ని గాని, ఇతర జ్యోతిస్సులు గాని ఎట్లు ప్రకాశింప జేయగలవు?

చైతన్యమును ప్రకాశింపజేయుటకు మరియొక దీపముతో పనిలేదు. సాధారణముగా ఒక దీపము మరియొక దీపమును ప్రకాశింప జేయలేదు. కాని సర్వదీపములను ప్రకాశింప జేసేది చైతన్యమే. సర్వప్రకాశములు ఈ చైతన్యము వలన మాత్రమే ప్రకాశించుచున్నవి. దీనిని దర్శించుటకు ఇంద్రియములతో గాని మనస్సుతో గాని పనిలేదు. అవి దేని నుండి తమ ఉనికిని అరువు దెచ్చుకున్నవో, ఆ ప్రకాశము ఇదియే. మనస్సునకు, ఇంద్రియములకు మరియు సర్వజగత్తునకు అస్తిత్వమునిచ్చునది చైతన్యమే. సర్వము నేనే అయి ఉండగా, ఒక స్థానమునకు వెళ్ళుట, అచటినుండి తిరిగి వచ్చుట అను ప్రసక్తి యేమున్నది? కావున, అచటకు 'వెళ్ళువారు' మరల తిరిగి రారు (న నివర్తంతే).

ఈ శ్లోకములోని భావమును వ్యక్తీకరించే మంత్రములు కఠ, ముండక ఉపనిషత్తులలో గలవు. 'అచట సూర్యచంద్రులు, నక్షత్రములు ప్రకాశించవు. ఈ మెరుపు కూడ ప్రకాశించదు. ఇక అగ్నిని గురించి చెప్పనదేమున్నది? (న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతోయమగ్నిః).

సూర్యుడు సర్వమును ప్రకాశింపజేయుటచే మనము కన్నులతో చూడగల్గుచున్నాము. కాంతిని పరావర్తనము చేయజాలని వస్తువు కంటికి కానరాదు. ఈ దృష్టికోణములో సూర్యుడు సర్వావభాసకుడగునని శ్రీశంకరులు వివరించిరి. వస్తువుతో కంటికి సన్నికర్ష (Contact) ఏర్పడగానే మనోవృత్తి (thought-form) ఉదయించును. ఈ మనోవృత్తి ఆ వస్తువుయొక్క అజ్ఞానమును నివృత్తి జేయును. ఆ మనోవృత్తియైననూ ప్రకాశింప చేయబడవలెను. కాని అచట సూర్యచంద్రాదులకు ప్రవేశము లేదు. వృత్తిని ఆత్మ మాత్రమే ప్రకాశింప చేయగలదు. కావున, యథార్థమగు ప్రకాశనిధానము అదియే.

ఈ ఆత్మను ప్రకాశింప జేయునది ఏది? వృత్తిని ప్రకాశింప జేయలేని సూర్యుడు వృత్తిప్రకాశకమగు ఆత్మను ఎట్లు ప్రకాశింప జేయగలడు? ఆత్మ స్వయంప్రకాశము. ఏ ప్రకాశము వలన సూర్యుడు కూడ తెలియబడుచున్నాడో, ఆ దీపము ఆత్మయే. 'ఆ అనంత జ్యోతి నేనే. అదియే నా ధామ' అని భగవానుడు చెప్పుచున్నాడు. అచటకు వెళ్ళుట యనగా అది

ఆత్మస్వరూపమేనని గుర్తించుటయే. ఆ జ్ఞానమును పొందిన వారికి పునరావృత్తి లేదు (న నివర్తంతే). వారియందు ఆత్మ-అజ్ఞానము లేదు.

ఆత్మ-అజ్ఞానము ఉన్నంతవరకు కర్త, భోక్త, పోవుట, మరలి వచ్చుట అనునవి తప్పవు.

శ్రీ శంకరులు తరువాతి శ్లోకము యొక్క అవతారికలో ఒక అభ్యంతరమును ప్రస్తావించిరి. సర్వ-అవస్థలకు ఒక ఆరంభము, ఒక అంతము గలవని అందరికీ తెలిసినదే. ఒకచో గూర్చబడిన వస్తువులు కొంతకాలము తరువాత విడిపోవుట (సంయోగా విప్రయోగాంతాః) నిశ్చితమని శాస్త్రము స్వయముగా చెప్పుచున్నది. భార్యాభర్తలలో ఒకరు మరణించుటచే వారి వివాహము అంతమగుట అనివార్యము. కాలక్రమములో సూక్ష్మదేహము కూడ స్థూలదేహమునుండి విడివడును. కొన్నింటిని ఒక చోటికి చేర్చినప్పుడు విడిపోవుట తప్పనిసరి యగును. ఒక చోటనుండి మరియొక చోటకు వెళ్ళుట అను విషయములో కూడ ఈ సూత్రము వర్తించును. నీవు ఒక చోటనుండి మరియొక చోటకు వెళ్ళినావు. అదే న్యాయము (logic) ను బట్టి అచటి నుండి మరియొక చోటకు వెళ్ళుట తప్పదు. కావున, గమనములన్నింటిలో ఆగమనము కూడ ఇమిడి యున్నది. కావున, భగవాముని ధామమునకు వెళ్ళినవారు మరల తిరిగి రారు అని ఎట్లు చెప్పగలము?

అధ్యాయము 15, శ్లోకము 7 :

ममैवांशो जीवलोके जीवभूतस्सनातनः ।
मनष्षष्ठानींद्रियाणि प्रकृतिस्थानि कर्षति ॥ ७ ॥

మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః
మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి (7)

మమ = నా యొక్క, సనాతనః = శాశ్వతమగు, అంశః ఏవ = అంశయే, జీవభూతః = జీవస్వరూపములో నున్నదై, జీవలోకే = జీవుని ప్రపంచములో, ప్రకృతిస్థాని = ఉపాదాన కారణమగు ప్రకృతియందు స్థిరముగా నుండే, మనష్షష్ఠాని = మనస్సుతో కలిపి ఆరు, ఇంద్రియాణి = ఇంద్రియములను, కర్షతి = తనవైపునకు ఆకర్షించుచున్నది.

నా యొక్క శాశ్వతమగు అంశమే జీవస్వరూపములో నున్నదై జీవుని

ప్రపంచములో, ప్రకృతియందు స్థిరముగా నుండే, మనస్సుతో కలిపి ఆరు అయిన ఇంద్రియములను తన వైపునకు ఆకర్షించుచున్నది (7).

వారు నా స్వరూపమే గనుక, మరలి రారని భగవానుడిచట సంగ్రహముగా చెప్పుచున్నాడు. ఇచట పొందుట యనగా ఆత్మ ఈశ్వరాభిన్నమని గుర్తించుటయే. సనాతనుడగు భగవానుడే సర్వము అయి ఉండగా, వారాయనకు దూరమగుట ఎట్లు సంభవమగును? వారు ఎవటికి వెళ్లెదరు? కాలమే లేని స్థితిలో చలనమునకు ప్రసక్తి ఎట్లు సంభవమగును?

అంశ యనగా ఒక భాగము. జీవరూపముగా నున్నది (జీవభూతః) భగవానుని ఒక భాగము వంటిది. దీని యర్థమేమనగా, జీవుడు మరియొక వస్తువు కాదని మాత్రమే. నా చేయి నాకంటె భిన్నమైన వస్తువు కానట్లే, జీవుడు భగవానుని కంటె భిన్నుడు కాడు. భిన్నుడైనచో, భగవానుని అంశమని చెప్పజాలము. జీవుడు మరియొక వస్తువు అయినచో, వెళ్లినవాడు తిరిగి వచ్చును. ఒక చోటికి చేరిన రెండు వస్తువులు మరల విడిపోక తప్పదు. కాని ఇచట పరిస్థితి అది కాదని శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు. జీవుడు భగవానునిలో భాగము.

కాని, భగవానుడు పూర్ణుడైనచో, ఆయన యందు అంశములుండుట ఎట్లు సంభవమగును? ఆయనయందు అంశములుండే పక్షములో, విఘటన (disintegration)కు వశుడై యుండును. ఈ వాక్యములో దోషము గలదని యైననూ చెప్పవలెను. లేదా, దీనిని జాగ్రత్తగా అర్థము చేసుకొనవలెను. జీవలోకమనగా జీవుడు పొందే అనుభవములు. అది జీవుల ప్రపంచము కాదు; ఒక జీవుని ప్రపంచము. జీవుడు తాను కర్తనని తలపోయును. అతడు వేదాధ్యయనము చేసి, వైదిక కర్మలననుష్ఠించు వాడే అయిననూ, ఆత్మ స్వరూపమునెరుంగడు. తానీ లోకములో ఒక కర్తననియు, దేహదృష్ట్యా భోక్తననియు అతడు విశ్వసించును. ఆత్మ కర్తృత్వభోక్తృత్వములను తనపై వేసుకొని యున్నది గనుక, ఈ జీవుడు సనాతనుడైనాడు. అవినాశియగు ఆత్మ యొక్క జ్ఞానము కలిగినప్పుడు మాత్రమే జీవత్వము తొలగి పోవును.

ఈ లోకములో మాత్రమే గాక, ఇతర లోకములలో కూడ కర్తలు, భోక్తలు అనంతసంఖ్యలో నున్నారు. వారు అవినాశియగు బ్రహ్మ కంటె భిన్నముగా నున్నారా? లేరు. అట్లైనచో, ఈ సంఖ్యకు కారణమేమి? వారందరు బ్రహ్మలో ఒక అంశము మాత్రమే. వారు నీటిలో సూర్యుని ప్రతిబింబమువంటి వారని శ్రీశంకరులు వివరించిరి. ప్రతిబింబములు ఎన్ని ఉన్ననూ, సూర్యుడు ఒక్కడే. కాని నీటిలో అనేక సూర్యులు ఉన్నట్లు కానవచ్చును.

ప్రతిబింబము పూర్తిగా సూర్యునిపై ఆధారపడి యుండును. కాని సూర్యుడు ప్రతిబింబములపై ఆధారపడడు. పైగా ప్రతిబింబము బింబములోని ఒక అంశము మాత్రమే గాదు; పూర్ణబింబము కానవచ్చును. మరియు బింబ-ప్రతిబింబములనే రెండు విభిన్నవస్తువులు వాస్తవముగా లేవు. ఒకటి సత్యము కాగా, మరియొకటి మిథ్య. కావున, మనమిపుడు దానిని వ్యాఖ్యానించవలెను. జీవులు అనంతవముగా గలరు. వారందరు పరమాత్మయే. కర్తృత్వవిశిష్టవములగు సర్వసూక్ష్మదేహములు, మరియు వాటియందలి ఆభాసలు (reflections) కూడ పరమాత్మయే. కర్త ఒక తత్త్వము కాదు. అది ఒక ధారణ మాత్రమే. అజ్ఞానయుతమగు మనస్సు ఉన్నంతవరకు మాత్రమే అది మనగల్గును. నిద్రలోనికి జారుకోగానే, కర్త అదృశ్యమగును. నిద్రలేస్తూనే తిరిగి వచ్చును. కర్తృత్వభావన ఎచటకు పోయినది? అది ఎక్కడికీ పోలేదు. అది చైతన్యములో విలీనమగును. అంతే. దీనికే మిథ్య యని పేరు. కుండ పగిలినపుడు మట్టికి దూరముగా పోదు. అది ఎచటకు వెళ్ళగలదు? అదే విధముగా, నిద్రలో గాని, లేదా జ్ఞానోదయము తరువాత గాని, ఎక్కడికీ పోదు. ఆత్మ కర్తకు విరోధి కాదు. అది దాని అధిష్ఠానము. కావున, ఆత్మ నుండి సత్తాస్ఫూర్తులను పొంది అది శాశ్వతకాలము మనగల్గును. అనేక కర్తలు, ఒకే పరమాత్మ ఉండుటచే, అవి అన్నియూ పరమేశ్వరుని అంశములా యన్నట్లు వర్ణించబడును.

కర్తృత్వభావనను ప్రకాశింప జేసేది ఆత్మ అయి ఉండగా, ఆత్మయే కర్త యగుట ఎట్లు సంభవమగును? పైగా, కర్తృత్వభావన వచ్చి పోవుచుండును. అది ఆత్మ స్వరూపమైనచో, దానిని విడిచి పెట్టుట అసంభవము. ఆత్మ యందు కర్తృత్వము లేనే లేదు. ఈ జ్ఞానము ఉదయించగానే, కర్తృత్వము, మరియు సర్వసాంసారికానుభవములు ఆత్మలో విలీనమగును. అపుడు పునరావృత్తి లేదు.

జీవుడు పరమాత్మ యొక్క అంశము అనుటకు శ్రీశంకరులు మరియొక దృష్టాంతము నిచ్చుచున్నారు. ఘటము లేదా మఠముచే పరిచ్ఛిన్న మైన (enclosed) ఆకాశము, దానిని చుట్టువారియున్న వస్తువు (ఉపాధి) యొక్క దృష్టికోణములో మహాకాశము యొక్క అంశమనియే పరిగణించబడును. వాస్తవముగా ఆకాశము విభజింప బడలేదు. ఆకాశమును స్వీయదృష్టికోణములో చూచినచో, దాని ఉపాధి అదృశ్యమై, ఆకాశస్వరూపము తెలియబడును. ఆకాశముయొక్క ఆ స్వరూపమునెరింగిన వ్యక్తి అది పరిచ్ఛిన్నమగుచున్నదని భావించడు.

అదే విధముగా, ఆ అనంత-ఆత్మను పొందినవాడు, అనగా తెలుసుకున్నవాడు మరల

అచట నుండి వెనుకకు మరలి రాడని, అనగా ఆత్మ పరిచ్ఛిన్నమనే భావనను తిరిగి పొందడని చెప్పుట యుక్తియుక్తమే యగును. ఇట్టి జ్ఞానమును పొందిన వ్యక్తిని, ఇంకనూ ఉపాధి మిగిలియుండుటచే, మనము జీవుడనియే వ్యవహరించెదము. కాని అతడు జీవన్ముక్తుడు. వాస్తవములో సర్వజీవులు తన స్వరూపమగు ఆత్మయందు మాత్రమే గలవనియు, కాని తాను జీవుడను కాననియు అతడు ఎరుంగును. తాను సర్వప్రాణుల ఆత్మయే అయినా, సర్వ సంసారవినిర్ముక్తుడనని అతడు ఎరుంగును. ఈ తీరున, అతడు జీవించి యుండగనే మోక్షమును పొందినాడు (జీవన్ముక్తః). అతని ప్రారబ్ధకర్మ క్షయము కాగానే, దేహము పడిపోవును. ఆ తరువాత, అతడు మరల దేహమును దాల్చి మరలి వచ్చే ప్రసక్తి లేదు. పరమేశ్వరుడు మాత్రమే మిగిలి యున్నాడు.

ఒక పరిచ్ఛిన్న వస్తువు మాత్రమే మరియొక వస్తువుతో సంయోగమును పొందగలదు. ఒకే సత్యత్వశ్రేణికి చెందిన రెండు వస్తువులు సంయోగమును పొందగలవు. ఆ కలయికకు ఒక ఆయుష్షు ఉండును. అది పూర్తి కాగానే, ఆ సంయోగము అంతమగును. కాని, ఇచట పరిస్థితి వేరు. ఇచట అజ్ఞానముచే ఒక వ్యవస్థ నిర్మితమై యున్నది. రెండు విభిన్నసత్యత్వశ్రేణులకు చెందిన తత్త్వములు ఒక్కచోట సమగూడినవి. వాటిలో ఒకటి సత్యము కాగా, రెండవది మిథ్య. జీవుడనగా పూర్తిగా పరాత్మపై కేంద్రితమైయున్న ఒక మానసికధారణ మాత్రమే. జీవునకు స్వతంత్రమగు అస్తిత్వము లేదు.

ఘటము తాను మట్టియేనని గుర్తించినచో, పగిలిన తరువాత మరియొక రూపములో దర్శనమియదు. కాని, తాను ఘటమనే భావనతో అది తనువు చాలించినచో, మూత, ముంత ఇత్యాది మరియొక రూపములో మరలి వచ్చును. ఈ రెండు జన్మలకు మధ్యలో అది పరలోకములో కొన్ని సుఖములననుభవించే అవకాశము గలదు. కాని, కొంతకాలము తరువాత వాపను వచ్చుట తప్పదు. లోకము, ఘటత్వధారణ ఒకే సత్యత్వ-శ్రేణికి చెందియుండుటచే, వాటికి సంయోగ-వియోగన్యాయము వర్తించును. కాని, ఇచట సత్యత్వశ్రేణులు భిన్నముగా నున్నవి. మిథ్యాభూతుడగు జీవుడు స్వరూపతః సర్వము యొక్క సత్త (reality) తానేనను సత్యమును గుర్తించును. ఈ సత్యదర్శనమునుండి చ్యుతుడయ్యే ప్రసక్తి లేదు. ఏలయన, అజ్ఞానము తొలగి పోయేదే గాని, మరలి వచ్చేది గాదు. కావున, ఆత్మజ్ఞానికి పునరావృత్తి లేదను (న నివర్తంతే) వచనము యుక్తియుక్తముగా నున్నది.

శ్రీశంకరులు మరియొక ప్రశ్నను లేవనెత్తిరి. నిరవయవమగు ఆత్మయందు కర్తృత్వము, అనుభవము ఇత్యాది అంశములు ఎట్లు ఉండగల్గును? పరమాత్మయందు ఒక అంశము ఉండునన్నచో, అనేక అంశములు ఉండవలెను. అంశములు గల వస్తువు ఏదైనను వినాశాధీనమై యుండును గనుక, పరమాత్మ వినాశి యగును. కావున, పరమాత్మ యందు అంశములు గలవని చెప్పుట పొసగదు. కాని, నిరవయవమగు ఆత్మ ఒక విశిష్టజీవునిగా, కర్తగా, భోక్తగా అగుచుండునని చెప్పజాలము. ఇట్టి స్థితిలో, ఇచట ప్రయోగింపబడిన అంశశబ్దమునకు తాత్పర్యమేమి?

దీనిలో సమస్య లేదు. ఏలయన, అవిద్యాకృతమగు అంశము ఉన్నట్లు కన్పట్టును. ఈ విషయము 13 వ అధ్యాయములో కూడ విస్తారముగా వర్ణించబడినది. అజ్ఞానము ద్వారా మాత్రమే ఆత్మ పరిచ్ఛిన్నమని మనము చెప్పగలము.

ఉపాధి దృష్టిలో ప్రతి కర్త భగవానుని అంశమగును. భగవానుడే ఆత్మయను సత్యదర్శనము గలవానికి కర్తృత్వ-భోక్తృత్వ-ధారణలు అదృశ్యమగును. ఈ తీరున జ్ఞానముచే భగవానుని ధామమును 'చేరిన' వానికి పునరావృత్తి లేదు.

ఈ శ్లోకములోని ప్రథమార్థము 'యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ' అను వాక్యమునకు వివరణ. ద్వితీయార్థమును తరువాతి శ్లోకముతో కలిపి అన్వయించవలెను.

భగవానుని పొందిన జ్ఞానులు మరల తిరిగి రాకపోవుటకు కారణమేమి? వారు ఏ కాలములోనైననూ భగవానునికంటె భిన్నముగా లేరు. ఈ సత్యమును గుర్తించువరకు వారు భగవానుని అంశములా యున్నట్లు కన్పట్టెదరు. ఈ అనాది అంశ ఈ సమయములో కాలవశమై యున్నట్లు భాసించును. బ్రహ్మ నేనేనని నీవు గుర్తించినచో, అంశ లేదు; వస్తువు మాత్రమే గలదు. అజ్ఞానముతో బాటు దాని కార్యము కూడ అదృశ్యమగును.

ముక్తుని దృష్టిలోనైననూ యథార్థమగు అంశ లేదు. ఏలయన సర్వము తానేనని అతడెరుంగును. ప్రారబ్ధకర్మ క్షయమగుచున్నంతవరకు, దేహేంద్రియమనస్సంఘాతము బ్రహ్మను తనలో ఇముడ్చుకున్నదా యన్నట్లు భాసించును. ఆ దేహము పడిపోగానే మిగిలి యున్నది బ్రహ్మ మాత్రమే. వస్తుజ్ఞానముచే మాత్రమే ఆ సత్యము అవగాహనకు వచ్చును. సహజస్వచ్ఛమగు స్ఫటికము పుష్పసన్నిధిలో రంగు గలది వలె కన్పట్టును. ఇచట కూడ పరిస్థితి అంతే. అది

స్వచ్ఛస్ఫటికమని తెలిసిన పిదప రంగు కానవచ్చిననూ, అది ఉపాధి కృతమనియు, స్ఫటికము సహజముగా స్వచ్ఛమనియు మనకు తెలియుచునే యుండును. ఆత్మ యందు కర్తృత్వభోక్తృత్వములు లేవనియు, అది సత్యం-జ్ఞానం-అనంతం-బ్రహ్మ అనియు సాక్షాత్కరించుకున్న జ్ఞాని దేహేంద్రియమనస్సంఘాతము యొక్క దోషములచే ప్రభావితుడు గాడు.

కర్త, భోక్త,సంసారి ఇత్యాది వేర్వేరు రూపములలో బ్రహ్మ కానవచ్చుటకు కారణమేమి? దీనిని ఉపాధి న్యాయము చక్కగా వివరించును. బ్రహ్మ స్వరూపము దూషితము గాదని ఉపాధి సిద్ధింపజేయును. నీవు ఆనందస్వరూపుడవైనచో, సర్వదా ఆనందరూపుడుగనే ఉండెదవు. వికారములు ఉపాధి మూలములని యెరింగిన జ్ఞాని ఏ కాలమునందైననూ తన స్వరూపములో వికారము వచ్చినదని స్వీకరించడు.

అధ్యాయము 15, శ్లోకము 8 :

शरीरं यदवाप्नोति यच्चाप्युत्क्रामतीश्वरः ।
गृहीत्वैतानि संयाति वायुर्गंधानिवाशयात् ॥ ८ ॥

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్ (8)

ఈశ్వరః = ఈ దేహమునకు ప్రభువగు జీవుడు, యత్ = ఏ కాలములో, శరీరమ్ = నూతనదేహమును, అవాప్నోతి = పొందునో, చ = మరియు, ఉత్క్రామతి = దేహమును త్యజించునో, వాయుః = వాయువు, ఆశయాత్ = పుష్పము మొదలగు సుగంధస్థానము నుండి, గంధాన్ ఇవ = పరిమళములను వలె, ఏతాని = ఈ ఇంద్రియములను, మనస్సును, గృహీత్వా = తీసుకొని, సంయాతి = వెళ్ళును.

ఈ దేహమునకు ప్రభువగు జీవుడు ఏ కాలములో ప్రకృత దేహమును విడి నూతన దేహమును స్వీకరించునో, అపుడు సుగంధస్థానములగు పుష్పాదులనుండి వాయువు పరిమళములను వలె, ఇంద్రియములను మనస్సును తీసుకొని వెళ్ళును (8).

ఈ శ్లోకమును పూర్వశ్లోకములోని ద్వితీయార్ధముతో కలిపి అన్వయించవలెను. జీవుడు

స్వరూపతః పరమాత్మ గనుక, కర్త-భోక్త వలె కన్పట్టిననూ, జన్మమరణములకు అతీతుడని గమనించవలెను. ఒక విశిష్టస్థూలదేహదృష్టితో మాత్రమే జీవుడు మరణించినాడని చెప్పుట గలదు. జీవుడు అజ్ఞానసహితుడైననూ, జ్ఞానము ఉదయించువరకు వానికి మరణము లేదు. జీవత్వము అధ్యాసజన్యము గనుక, మరణించుటకు జీవుడు లేడు. ఆత్మపై అధ్యారోపితమైన జీవత్వమనే అవస్థ మాత్రమే సమాప్తమగును.

జీవుడు దేహమును విడిచి పెట్టునప్పుడు, పంచేంద్రియములు మరియు మనస్సుతో గూడిన సూక్ష్మదేహము ఎగిరిపోవును. మనస్సు లేనిదే ఇంద్రియములు పని చేయజాలవు. ఇవి అన్నియు ప్రకృతియందుండును. ఇచట ప్రకృతి యనగా స్థూలదేహము. ప్రతి జ్ఞానేంద్రియము ప్రకృతిజన్యమగు దేహములో ఒక స్థానములో నుండును. జీవుడు దేహముతో తాదాత్మ్యమును పొంది జీవించియుండగా ఇంద్రియములు కూడ పని చేయును. మరణసమయములో ఈ ఇంద్రియములన్నీ ఎగిరిపోవుటచే, మిగిలియున్న గోళకములు నిర్వ్యాపారములగును. జీవుడు యథార్థస్వరూపములో పరమేశ్వరుడే అయినా, అజ్ఞానముచే కర్త-భోక్త అయి, ఈ సమయములో ఈ దేహమును విడిచి పెట్టి, మనము స్వప్నములో చేయు విధంబున, ఒక విశిష్టసూక్ష్మ దేహమును దాల్చి పయనించును.

ఆకర్షతి యనగా తన వైపునకు లాగుకొనుచున్నాడు. ఈశ్ అను ధాతువు నుండి పుట్టిన ఈశ్వరశబ్దమునకు పాలించువాడు అని యర్థము. ఇచట దేహమును పాలించువాడు జీవుడే. కర్త-భోక్త రూపములో నున్న ఈ ఈశ్వరాంశ మరణ సమయములో ఈ దేహమును విడిచి దూరముగా పోవును. అపుడది తనతో బాటు సూక్ష్మములగు పంచజ్ఞానేంద్రియవములను మనస్సుతో సహా తనతో గొని పోవును.

జీవుడు నూతన దేహములోనికి వీటితో బాటు ప్రవేశించును. ఈ ప్రక్రియ మన కంటికి కానరాదు; అంతమాత్రాన, జరుగుట లేదని అనుకోరాదు. వాయువు పుష్పము నుండి గంధపరమాణువులను ప్రోగు చేయుట మనకు కానరాదు. అటులనే, జీవుడు ఇంద్రియములను, మనస్సును ప్రోగుచేసుకొని దేహమును విడిచి వెళ్ళిపోవుట మనకు కానరాదు. ఇవి సూక్ష్మమగు ఘటనలు గనుక, మనకు కానరావు. మనము కంటికి కనబడుదానిని ఆధారముగా చేసుకొని ఊహించగలము. అంతే. దేహములో ఇంద్రియములు, మనస్సు పని చేయుట ఆగిపోవుటచే, జీవుడు అచట లేడని మనము ఊహించెదము.

జీవుడు మరియొక దేహమును దాల్చి, తనతో దెచ్చిన కరణములన్నింటితో మరల విషయవస్తువులను భోగించుచుండును. విషయములను భోగించుటకు ఇంద్రియములు ఉండి తీరవలెను. అతడు వాటిని ఎట్లు అనుభవించును?

అధ్యాయము 15; శ్లోకము 9:

श्रोत्रं चक्षुः स्पर्शनं च रसनं घ्राणमेव च ।
अधिष्ठाय मनश्चायं विषयानुपसेवते ॥ ९ ॥

శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే (9)

అయమ్ = ఈ జీవుడు, శ్రోత్రమ్ = చెవిని, చక్షుః = కంటిని, చ = మరియు, రసనమ్ = నాలుకను, చ = మరియు, ఘ్రాణమ్ = ముక్కును, చ = మరియు, మనః = మనస్సును, ఏవ = నిశ్చయముగా, అధిష్ఠాయ = అధ్యక్షుడుగా నుండి, విషయాన్ = ఇంద్రియగోచరములగు వస్తువులను, ఉపసేవతే = అనుభవించును.

ఈ జీవుడు చెవి, కన్ను, నాలుక, ముక్కు మరియు మనస్సు అను ఇంద్రియములపై అధ్యక్షుడుగా నుండి ఇంద్రియగోచరములగు వస్తువులను అనుభవించును (9).

చేతనుడగు కర్త ఇంద్రియములలో వ్యాపించి యుండును. సర్పము త్రాడుచే వ్యాప్తమై ఉండు తీరున, ఇంద్రియములు కర్తచే వ్యాప్తమై, కర్తయొక్క అధీనములో నుండును. కన్నుకు కన్ను, చెవికి చెవి ఇత్యాదిగా అయి అధిష్ఠాత సర్వేంద్రియముల వెనుక నుండును. మరియు ఈ కర్త మనస్సునకు కూడ అధ్యక్షుడై యుండును. ఈతడు ఎవరు? అవిద్యచే జీవుడైయున్న నారాయణాంశమే ఈతడు. ఈతడు పూర్వదేహములో వలెనే, ఈ నూతనదేహములో కూడ ఇంద్రియగోచరములగు వస్తువుల ననుభవించుచుండును. సత్యమేమనగా, రూపము పరమేశ్వరుని కంటె వేరు గాదు. పరమేశ్వరుడే కర్త మరియు భోక్త అయినాడు. కాని ఈ సత్యము తెలియవచ్చును; తెలియక పోవచ్చును.

అధ్యాయము 15, శ్లోకము 10:

उत्क्रामन्तं स्थितं वापि भुञ्जानं वा गुणान्वितम् ।
विमूढा नानुपश्यन्ति पश्यन्ति ज्ञानचक्षुषः ॥ १० ॥

ఉత్క్రామన్తం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః (10).

ఉత్క్రామన్తమ్ = దేహమును పరిత్యజించుచున్న వానిని, వా = లేదా, స్థితం అపి = స్థిరముగా నున్నవానిని, వా = లేదా, భుంజానమ్ = అనుభవించుచున్న వానిని, గుణాన్వితమ్ = గుణసహితుడై యున్నవానిని, విమూఢాః = అతిశయించిన మోహము గలవారు, న అనుపశ్యన్తి = చూడరు, జ్ఞానచక్షుషః = జ్ఞానమనే నేత్రము గలవారు, పశ్యన్తి = చూచెదరు.

దేహమును పరిత్యజించుచున్న వానిని, దేహములో స్థిరముగా నున్నవానిని, గుణసహితుడై అనుభవించుచున్న వానిని అతిశయించిన మోహము గలవారు చూడరు. కాని జ్ఞానమనే నేత్రము గలవారు చూచెదరు (10).

న పశ్యంతి, చూడరు. 'అను' అనే ఉపసర్గను బట్టి వారు ఆచార్యునిచే ఉపదేశించబడిన శాస్త్రమునకు అనురూపముగా చూడరు అను అర్థము వచ్చును. ఆ వివేకహీనులు పరమాత్ముని అంశయే జీవుడని తెలియకపోవుటచే విమోహితులై (విమూఢాః) ఉందురు. అంశశబ్దము వివరణలో సౌకర్యము కొరకు మాత్రమే ప్రయోగించబడినది. వాస్తవముగా పరమాత్మ యందు విభాగములు లేవు. పరమాత్మ జీవరూపుడై కర్తృత్వమును తన నెత్తిపై వేసుకొనుట మిథ్య మాత్రమే. జీవునకు పరమాత్మ కంటె భిన్నమగు అస్తిత్వము లేదు.

ఇచటి తాత్పర్యమేమనగా, మరణముతో జీవుని సమస్య దూరము కాదు. మోక్షము దేహత్యాగము తరువాత లభించుననే దురభిప్రాయము జనులలో అధికముగా గలదు. దీనిని గీత నిరాకరించును. ఈ దేహములో జీవించియుండగా తాను పరమాత్మననే సత్యమునెరుంగని వాడు ఈ దేహమును వీడిన తరువాత జరిగేది మరియొక దేహమును దాల్చుట మాత్రమే. పరమాత్మయే ఇంద్రియభోగములను, సుఖదుఃఖములను అనుభవించుచూ, రాగద్వేషములు గల సంసారి వలె కన్పట్టుచున్నాడు. కాని, ఈ పరమాత్మను జనులు ఎరుంగరు. ఈ

స్వయంప్రకాశ-ఆత్మ తేలికగా తెలియుటకు లభ్యమగుచున్నది. ప్రతి ఇంద్రియమునకు మనస్సునకు వెనుక అదియే గలదు. కాని విమోహితులైన జనులు అవివేకముచే దానిని గనలేకపోవుచున్నారని శ్రీశంకరులు వివరించిరి. కంటికి కనబడే, మరియు కనబడని భోగములయందుగల తీవ్రమగు ఆసక్తి వలన మానవునిలో వివేక శక్తి లుప్తమగును. ఇట్టివాడు తేలికగా లభించే స్వయంప్రకాశమగు ఆత్మతత్త్వమును కనుగొనలేక పోవుటచే విమూఢుడనబడినాడు.

దుఃఖము, దానిని పరిష్కరించాలనే ఆకాంక్ష సర్వమానవులకు గలవు. కాని, పరిష్కారము ప్రతివానికి దొరుకుటలేదు. దుఃఖము మరియు వివేకశక్తి గలదగుటచే, మానవదేహము మోక్షమునకు పర్యాప్తమగును (adequate). సమస్య ప్రతివానికి విదితమే. కాని మానవుని మస్తిష్కము ఇహపరలోకములలో సాధింపగోరే లక్ష్యములచే పూర్తిగా ఆవేశింప బడియున్నది. వారిలో కొందరికి స్వర్గమునందు ఆశ మెండు. కావుననే ఈ సమస్యను పరిష్కరించుటకు తగినంత వివేకము వారిలో ఉదయించుట లేదు. ఈ భోగములన్నియు ఎరచూపి బంధించే వలలు మాత్రమే. కావుననే, వారు విమూఢులని మనము చెప్పుచున్నాము. వారు మానవదేహముతో మాత్రమే సాధించగలిగే ఒక విశిష్ట ప్రయోజనము కొరకు ఈ భూలోకమునకు వచ్చియున్నారు. కాని, తీవ్రమగు రాగద్వేషములనే బందిపోటు దొంగలు దారి కాసి వారిని దోచినారు. ఈ జీవునకు ఎట్టి దుర్గతి పట్టినది? పరమాత్మ అగు ఆతడు తనకు కొన్ని ఆనందపు ఘడియలననుగ్రహించే భాగ్యదేవత కొరకు ఎదురు చూచుచున్నాడు.

వీరికి భిన్నముగా మరికొందరు తమ స్వరూపమును స్పష్టముగా దర్శించెదరు. ఎట్లు? జ్ఞానమనే కన్నులతో (జ్ఞానచక్షుషా). వేదాంతప్రమాణజన్యమగు జ్ఞానము గలవారికి స్పష్టమగు ఆత్మానాత్మవివేకము గలదు. కర్త పరమాత్మ తక్క మరియొకరు కాదని వారెరుంగుదురు. వారికి చూపు గలదు.

ముందుగా దృక్-దృశ్య-వివేకముచే వారు దృశ్యమగు సర్వము అనాత్మయని నిశ్చయించెదరు. కర్త, భోక్త అనే మనోవృత్తులపై ఆత్మభావన ఆరోపించబడినది. కాని వాస్తవములో అవి అన్నియు నాచే తెలియబడుచున్నవి గనుక, నేను వాటన్నిటికంటె వేరుగా నున్నాను అనే వివేకమును నేను చేయవలెను. ఇది కేవలతర్కము కాదు. ఇది సత్యదర్శనము. 'నేను' అను పదమునకు వాస్తవికమగు అర్థము చైతన్యము. 'నేను' అనే భావన చైతన్యముపై ఆధారపడి

యున్నది. 'నేను' అను పదమును ప్రయోగించే సందర్భములన్నింటిలో, వెనువెంటనే స్వయంప్రకాశ-చైతన్యమే నేనని గుర్తించవలెను. అపుడు 'నేను' అనగా సందర్భమును బట్టి వివిధపాత్రలను పోషించే చైతన్యమని నాకు తెలియచుండును. కారు డ్రైవరు తాను 60 మైళ్ళ వేగముతో పయనించినానని చెప్పును. అట్లు చేసినది తాను కాదని ఆతనికి తెలియును. అటులనే, ఆత్మజ్ఞానము గల వ్యక్తి తాను కర్తను కాదని తెలిసి ఉన్నా, 'నేనిట్లు పలికితిని, అట్లు చేసితిని' అని చెప్పును. ఆతనియందు 'నేను' గురించి స్పష్టమైన కల్పన గలదు.

శ్రీశంకరులు తరువాతి శ్లోకమును 'కాని మరికొందరు' అని ఉపక్రమించిరి. శాస్త్ర ప్రమాణముచే తెరువబడిన ఆత్మజ్ఞానమనే నేత్రము గల జ్ఞానులు పై శ్లోకములోని ద్వితీయార్ధములో వర్ణింపబడినారు. వీరు వారికంటె భిన్నమైనవారు అని స్పష్టపరచుటకై వారట్లు ఉపక్రమించిరి. అర్హుడగు ఆచార్యుడు మహావాక్యమును బోధించియున్ననూ, జ్ఞానోదయము కొరకై ఇంకనూ కొంత సాధనయొుక్క ఆవశ్యకత గలవారి గురించి మనమిపుడు చర్చించుచున్నాము. యాజ్ఞవల్క్యుడు మైత్రేయితో 'ఆత్మను దర్శించవలెను, శ్రవణము చేయవలెను, మననము చేయవలెను, నిదిధ్యాసము చేయవలెను' అని చెప్పిన తరువాత, 'ఆత్మయందలి ప్రేమ వలన మాత్రమే సర్వము ప్రియమగుచున్నది (ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి)' అని చెప్పెను. ఆత్మను నీవు దర్శించవలెను (ద్రష్టవ్యః). ఎట్లు? ప్రమాణముచే తెరువబడిన జ్ఞాననేత్రముచే దర్శించవలెను. దానికొరకై మనకు శ్రుతి కావలెను. కావున, మనము వినవలెనని (శ్రోతవ్యః) యాజ్ఞవల్క్యుడు చెప్పుచున్నాడు. సాధకుడు యోగ్యమగు అర్హత గలవాడైనచో ఇంతవరకు చాలును. ఆ పరిస్థితి లేనిచో, శ్రవణము తరువాత మనన-నిదిధ్యాసనములను కొనసాగించవలెను.

**అధ్యాయము 15, శ్లోకము 11:**

यतंतो योगिनश्चैनं पश्यंत्यात्मन्यवस्थितम् ।
यतंतोऽप्यकृतात्मानो नैनं पश्यंत्यचेतसः ॥ ११ ॥

యతంతో యోగినశ్చైనం పశ్యంత్యాత్మన్యవస్థితమ్
యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యంత్యచేతసః (11)

చ = మరియు, యతంతః = ప్రయత్నముమ చేయు, యోగినః = యోగులు, ఆత్మని

= బుద్ధియందు, అవస్థితమ్ = నివసించియున్న, ఏనమ్ = ఈ పరమాత్మను, పశ్యంతి = చూచెదరు, యతంతః అపి = ప్రయత్నమును చేయువారే అయిననూ, అకృతాత్మానః = పరిపక్వము గాని మనస్సు గలవారు, అచేతసః = విచారహీనులు, ఏనమ్ = ఈ పరమాత్మను, న పశ్యంతి = కనరు.

మరియు ప్రయత్నశీలురగు యోగులు బుద్ధియందు నివసించియున్న ఈ పరమాత్మను గాంచెదరు. పరిపక్వము గాని మనస్సు గలవారు విచారము చేయని వారైనచో, ప్రయత్నమును చేసిననూ ఈ పరమాత్మను కనజాలరు (11).

యోగినః అనగా సముచితమగు సాధనానుష్ఠానముచే ప్రసన్నమగు మనస్సు గలవారై జ్ఞానోదయమునకు సంసిద్ధులైనవారని యర్థము. అందువలననే వారు ప్రయత్నశీలురు (యతంతః) అయినారు. వారు నిదిధ్యాసనమును చేసి దర్శించగలరు.

ఇచట 'ఆత్మని' అనే ఆధారార్థక-సప్తమీ-విభక్తికి అర్థమేమి? సర్వము ఆత్మయందే ఉన్నది గనుక, 'ఆత్మ యందు' అని కాజాలదు. 'బుద్ధియందు' అని యర్థము. 'బుద్ధి అనే ఆధారమునందు గల ఆత్మ' అనుకోరాదు. వారు బుద్ధియందు ఉపలభ్యమయ్యే ఆత్మను దర్శించెదరు. మరియు ఈ ఆత్మచైతన్యము సత్యం-జ్ఞానం-అనంతం-బ్రహ్మ కంటె వేరు గాదని వారు గుర్తించెదరు. ఆత్మయందు దేహేంద్రియమనస్సంఘాతము యొక్క ధర్మములు అధ్యస్తములే గాని యథార్థముగా లేవు.

జగత్కారణమగు బ్రహ్మయొక్క పరోక్షజ్ఞానము సంభవమే. కాని ఆత్మయొక్క పరోక్షజ్ఞానము సంభవము గాదు. ఎప్పుడైననూ ఆత్మ అపరోక్షముగనే దర్శింపబడును. వాస్తవములో శాస్త్రము ఆత్మను గురించి చేసే ఉపదేశము విషయములోనైననూ పరోక్షజ్ఞానము సంభవము కాదు. శాస్త్రోపదేశమును గుర్తించలేకపోతిమి అని మాత్రమే చెప్పదగును. మనకందరికీ స్పష్టముగా తెలిసే విషయమేమనగా, ఆత్మ స్వయంప్రకాశము; ఇతరము సర్వము ఆత్మకు దృశ్యమగు చున్నది.

సర్వవస్తువుల పరోక్ష, అపరోక్షజ్ఞానములను రెండింటినీ ప్రకాశింప జేయునది ఆత్మయే. ప్రత్యక్ష-అనుమానాది ప్రమాణజన్యమగు ప్రత్యయము (Cognition) లన్నింటినీ ప్రకాశింప జేసేది

ఆత్మయే. ఒక వస్తువు ప్రత్యక్షముగా తెలిసినా, పరోక్షముగా తెలిసినా దానికి సంబంధించిన వృత్తిరూపమును ప్రకాశింప జేసేది నీవే. సర్వమును ప్రకాశింపజేసే ఈ ఆత్మయే పరం-బ్రహ్మ యని గుర్తించవలెను.

చాల శాతము సాధకులు ఈ జ్ఞానమునందు నిష్ఠ కొరకై ప్రయత్నము చేయవలసి యుండును. ఇందువలననే యాజ్ఞవల్క్యుడు శ్రవణ-మనన-నిదిధ్యాసనములను ప్రస్తావించినాడు. చాల కొద్దిమందికి ప్రమాణమొక్కటియే చాలును. ఛాందోగ్యోపనిషత్తులోని శ్వేతకేతువు విషయములో అటులనే జరిగినది. తండ్రి అతనికి 'తత్త్వమసి' అని తొమ్మిది సార్లు ఉపదేశించుట తోడనే అతనికి జ్ఞానోదయమైనది. ప్రశ్నోపనిషత్తులోని ఆర్గురు విద్యార్థులు కూడ ఆచార్యుడు ఉపదేశించగానే తెలుసుకొనిరి. అదే విధముగా, సనత్కుమారుడు ఉపదేశించగానే నారదుడు 'బ్రహ్మను నేను' యని తెలుసుకొనెను. ఈ విద్యార్థులందరికీ బోధించిన వెంటనే జ్ఞానోదయమాయెను. వీరందరు ఉత్తమాధికారులు. ఇంతే గాక, ఉపాసనను, తపస్సును చేయు సాధకులు కూడ మనకు శాస్త్రములో కానవచ్చెదరు. వీరు సామాన్యమగు యోగ్యత గలవారు. వీరికి ప్రయత్నము తప్పనిసరి యగును.

కాని కేవల ప్రయత్నము సరిపడదు. ప్రయత్నము సార్థకమగుటకై ఒక విశిష్టమగు మనస్సు కావలెను. సాధకుడు శాస్త్ర విహితమగు ప్రయత్నములన్నింటితో బాటు సముచితమగు రీతిలో విచారమును చేసే సామర్థ్యమును ప్రోది చేసుకొనవలెను. అది ఒక ప్రత్యేకమగు అనుశాసనము. మరియు, సాధకుడు జీవితములో అధర్మమునకు తావీయరాదు. అనుశాసనబద్ధమగు జీవితమును గడుపుతూ, జ్ఞానేంద్రియ-కర్మేంద్రియ-మనస్సులపై నియంత్రణను సంపాదించినచో, ఇవి సాధనలో ఆటంకములు కాకుండును. వారు ప్రయత్నమును చేసియూ చూడలేకున్నారని శ్రీశంకరులు వక్కాణించిరి. కొందరికి పని చేయు వేదాంతము మరి కొందరికి పని చేయదు. దీనిని బట్టి ప్రమాణముతో బాటు మరికొన్ని అర్హతలు కూడ ఆవశ్యకమగునని తెలియుచున్నది. చూచుటకు కన్నులు ఉన్నంత మాత్రాన చాలదు. ఆ కన్నులు నిర్దోషములై యుండవలెను. అప్పుడు మాత్రమే కన్నులు ప్రమాణమగును.

ఒకే ఒక ఆత్మ గలదు. కావున, వేదాంతజ్ఞానములో ఆత్మ వేర్వేరుగా నుండే అవకాశము లేదు. వేదాంతము ప్రమాణమైనచో, దానిని ఎవరు విన్నా, ఒకే సచ్చిదానంద-ఆత్మను గనవలెను. ఒకనికి ఈ ఆత్మజ్ఞానము కలిగి, మరియొకనికి కలుగనిచో, వేదాంతము ప్రమాణమని పరిగణింప

బడినచో, దోషము జ్ఞానము కలుగని వానిలో మాత్రమే గలదని స్పష్టమగుచున్నది. వేదాంతము ప్రమాణమను విషయము తెలియనిచో, అది ఒక రహస్యానుభవము (Mystical experience) అగును. కాని, వేదాంతము ప్రమాణమైనచో, అది అపరోక్షముగా ఉపలభ్యమయ్యే ఆత్మను చూపగలగాలి. ఏలయున, ఈ జ్ఞానము ద్వారా తొలగి పోవునని భావింపబడే సంసారము అపరోక్షముగా మన యెదుటనే యున్నది. నాలోని ప్రజ్ఞాపరాధము (Mistake) అపరోక్షమైనప్పుడు, దాని నివారణ కూడ అపరోక్షము కావలెను గదా!

ఆత్మ నీ స్వరూపము గనుక, దృశ్యము కాదు. కావున, ప్రత్యక్ష-అనుమాన ప్రమాణములకు గోచరము కాదు. ఇచట శబ్దప్రమాణము మాత్రమే పనిచేయును. 'ఆ దేవదత్తుడు వీడే' 'పదవ వాడవు నీవే' ఇత్యాది వాక్యములు అపరోక్ష-జ్ఞానమును కలిగించును. కాని, అట్టి అపరోక్ష-జ్ఞానము కలుగక, వేదాంతము ప్రమాణమనే అవగాహన లేనిచో, అది రహస్యానుభవరూపమనే భ్రాంతిపూర్వక-నిష్కర్ష ఏర్పడును. శాస్త్రము తెలిసిన వారు వేదాంతము ప్రమాణమని చెప్పెదరు. దానిని వినియోగించుట నెరింగిన వారు చాల అరుదుగా నున్నారు. దీని వలన, వేదాంతములో మనము ఒక అజ్ఞాతస్థితిని అనుభవమునకు దెచ్చుకొన వలయుననియు, వేదాంతము ఆ అనుభవస్థితిని చేరుటకు ఉపకరించే సిద్ధాంతమనియు జనులు తరుచుగా నిర్ణయించుచున్నారు.

దీనివలన ఆత్మకు సంబంధించినంత వరకు వేదాంతము ప్రమాణము కాకుండా పోవును. అపరోక్షముగా తెలియబడుతూ, సర్వదా ఉపలభ్యముగా ఉంటూ, సర్వానుభవములకు ఆధారమైయున్న ఆత్మను గురించి అపరోక్షజ్ఞానము నీయని వేదాంతము ఆత్మకు సంబంధించినంతవరకు ప్రమాణము కాజాలదు.

కొందరికి జ్ఞానము కలిగి, మరికొందరికి కలుగనిచో, మరియొక అంశము ఆవశ్యకమని స్పష్టమగుచున్నది. ఈ స్థితిలో జనులు జ్ఞానార్థియొక్క అర్హతలను గురించి పరిగణించుటను మానివేసి, రహస్యానుభవమనే కల్పన వెంటబడుట నారంభించిరి. శాస్త్రములో అనుభవము అను పదము వాడబడగా, అది Experience అని అనువదింప బడినది. దీనితో ఈ సమస్య మరింత జటిలమైనది. కాని అనుభవమనగా దర్శనము, లేదా అపరోక్ష-జ్ఞానము అనియే అర్థము.

ఈ అనుభవమనే సమస్య చాల కాలము క్రితమే అరంభమైనది. శాస్త్రాధ్యయనమునకు

తోడుగా ఒక విశిష్టమైన ఆధ్యాత్మిక (ఈశ్వరీయ) బోధ (అలౌకిక-ప్రత్యయః) ఉండవలెనని పెద్దలు చెప్పిరి. ఈ మాట వెనుక లోతైన పరిజ్ఞానము గలదు. ముందుగా శాస్త్రమునుండి ఆత్మసిద్ధాంతమును తెలుసుకొని, ఆ తరువాత అభ్యాసముచే దానిని అనుభవములోనికి తెచ్చుకొనవలయుననే ఆధునిక వాదమునకు దానితో సంబంధము లేదు.

ఆత్మస్వరూపము గోచరము కాకపోవుట అనే సమస్యనుండి రెండు వికల్పములు ఉదయించును. ఆత్మను ఇంకనూ అనుభవించుట మిగిలియున్నది అనేది ఒకటి. సాధనసంపత్తిని పరిశీలించవలెను అనేది రెండవది. మోక్షము జ్ఞానరూపము గనుక, దానికి కొన్ని అర్హతలు కావాలనుటలో సందేహము లేదు. ఆ అర్హతలను సాధకుడు సంపాదించవలెను. ఇచట ప్రయత్నమనగా నదియే.

అంతఃకరణశుద్ధికి అత్యధికప్రాధాన్యమీయబడినది. కర్మయోగజీవనము మరియు జీవనమూల్యములను పెంపొందించు కొనుట అను వాటిచే ఇది సిద్ధించును. ఇచట విచారము అతిప్రముఖమైనది. కొన్ని ఆపేక్షిసత్యములను గురించి సరియగు అవగాహన లేకపోవుటచే, జీవితములో తప్పుడు విలువలు, అయోగ్యమగు మానసిక ప్రవృత్తులు చోటు చేసుకొనును. కావున, కర్మయోగ-జీవనమును గడుపుతూ, శాస్త్ర శ్రవణమును కొనసాగించుట అతిప్రముఖమైన విషయము.

ఇచట యోగినః అనగా జ్ఞాననిష్ఠులు గాని, కర్మయోగులు గాని కావచ్చును. కర్మయోగజీవనము గాని, నిదిధ్యాసనతో గూడిన సరళ జీవనము గాని, ఏది అవసరమైతే దానిని వారు స్వీకరించెదరు. వారికి జ్ఞానోదయము నిశ్చితము.

సర్వప్రాణుల ఆత్మ ఒక్కటియేననియు (సర్వాత్మా), సర్వవ్యవహారములకు అదియే ఆలంబనమనియు తరువాతి నాలుగు శ్లోకములలో వివరింప బడినది. ఈ నాల్గు శ్లోకములలో భగవానుని విభూతులు కూడ సంగ్రహముగా ప్రదర్శించబడినవి.

**అధ్యాయము 15, శ్లోకము 12 :**

यदादित्यगतं तेजो जगद्भासयतेऽखिलम् ।
यच्चंद्रमसि यच्चाग्नौ तत्तेजो विद्धि मामकम् ॥ १२ ॥

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఖిలమ్
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ (12)

ఆదిత్యగతమ్ = సూర్యునియందు ఉన్న, యత్ = ఏ, తేజః = తేజస్సు, అఖిలమ్ = సమస్తమైన, జగత్ = జగత్తును, భాసయతే = ప్రకాశింప జేయుచున్నదో, యత్ = ఏ తేజస్సు, చంద్రమసి = చంద్రునియందు గలదో, చ = మరియు, యత్ = ఏ తేజస్సు, అగ్నౌ = అగ్నియందు గలదో, తత్ = ఆ, తేజః = తేజస్సు, మామకమ్ = నాదేనని, విద్ధి = తెలుసుకొనుము.

ఏ తేజస్సు సూర్యునియందుండి జగత్తునంతనూ ప్రకాశింప జేయుచున్నదో, చంద్రునియందు మరియు అగ్ని యందు గలదో, ఆ తేజస్సు నాదేనని తెలుసుకొనుము (12).

ఇచట యత్ అనగా చేరుకోదగిన పదము, లేదా ఆత్మ. సర్వమును అదియే ప్రకాశింప జేయును. కాని దానిని సూర్యుడు, అగ్ని ఇత్యాదులు ప్రకాశింప జేయలేవు. ఈ జ్యోతిస్సులేవియూ సర్వమును ప్రకాశింపజేసే ఆ ఆత్మను ప్రకాశింప జేయలేవు.

మామకమ్ అనగా నాకు చెందినది. ఎచ్చట ఏ విభూతి ఉన్నా, అది భగవానుని విభూతియే. మన ఈ జగత్తునకు ఆధారభూతములైన ఆ విభూతులలో కొన్ని ఇచట సంగ్రహముగా, అందముగా ప్రస్తావింపబడుచున్నవి.

జగత్తునంతనూ ప్రకాశింపజేసే సూర్యుని రూపములో నున్న తేజస్సు నాదేనని భగవానుడు చెప్పుచున్నాడు. మరియు, చంద్రునిలో, అగ్నిలో గల తేజస్సులు కూడ నావే. వేటివలన మనము వస్తువులను చూడగల్గుచున్నామో, ఆ ఈ తేజస్సులన్నీ భగవానునివే. దీనిని రెండు విధములుగా అర్థము చేసుకొనవచ్చును. సూర్యుడు, చంద్రుడు, అగ్ని పరమేశ్వరస్వరూపములే గనుక, వాటిలో కానవచ్చే ప్రకాశము పరమేశ్వరునిదే. ఈ మూడు జ్యోతిస్సులు తమ తమ ఉపాధిని బట్టి పరమేశ్వరవిభూతిని అభివ్యక్తము చేయుచున్నవి. సూర్యుడు, అగ్ని వేడితో గూడిన కాంతిని ఇచ్చుటకు, చంద్రుడు చల్లని కాంతిని ఇచ్చుటకు కారణము భగవానుడే.

ఇచట సూర్యచంద్రాగ్నుల అధిష్ఠాన దేవత అనే అర్థమును కూడ స్వీకరించ వచ్చును. సూర్యచంద్రాగ్నులు తమ తమ అసాధారణ జగత్కార్యములను నిర్వహించగల్గుటకు హేతుభూతమై, వారిలో అభివ్యక్తమగుచున్న చైతన్యము భగవానుడే. వారిలో సత్త్వగుణము అధికముగా నుండుటచే, మానవులకంటె అధికమగు జ్ఞానమును, ఆనందమును వారు కలిగి యున్నారు. కావున, సూర్యచంద్రాగ్ని దేవతలలో మనకు కానవచ్చే మహిమ భగవానుడే.

లేదా, మనము ఇంకొక అడుగు ముందుకు వేసి, జగత్తులోని ఈ అద్భుతదృశ్యములలో ఈశ్వరుని దర్శించవచ్చును. భగవానుడే సూర్యచంద్రాగ్నుల రూపములో, మరియు వారి ప్రకాశరూపములో ప్రకటమగుచున్నాడు.

**అధ్యాయము 15, శ్లోకము 13:**

गामाविश्य च भूतानि धारयाम्यहमोजसा ।
पुष्णामि चौषधीस्सर्वास्सोमो भूत्वा रसात्मकः ॥ १३ ॥

గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా
పుష్ణామి చౌషధీ స్సర్వాస్సోమో భూత్వా రసాత్మకః (13)

చ = మరియు, అహమ్ = నేను, గామ్ = భూమిని, ఆవిశ్య = ప్రవేశించి, ఓజసా = బలముతో, భూతాని = ప్రాణులను, ధారయామి = నిలబెట్టుచున్నాను. చ = మరియు, రసాత్మకః = రసస్వరూపడగు, సోమః = చంద్రుడను, భూత్వా = అయి, సర్వాః = సమస్తములైన, ఓషధీః = చెట్టుచేమలను, పుష్ణామి = పోషించుచున్నాను.

నేను భూమిలో ప్రవేశించి బలముతో ప్రాణులను నిలబెట్టుచున్నాను.
మరియు, నేను రసస్వరూపుడగు చంద్రుడనై చెట్టు చేమలనన్నింటినీ పుష్టితో నింపుచున్నాను (13).

భగవానుడు భూమిలో ప్రవేశించి తన బలముతో సర్వప్రాణులను ధరించి యున్నాడు. ఈ బలము బంధహేతువులగు కామనలనుండి విముక్తమైనదని మనమిదివరలో చూచియున్నాము. మరియు భగవానుడీ బలముతో భూమిని పాలించుచున్నాడే గాని, భారమును కలిగించుటలేదు.

భూమి, చంద్రుడు, ఇతరగ్రహములు భగవానుని వలననే తమ తమ స్థానములలో దృఢముగా నిలబడి యున్నవని వేదము ఉద్ఘోషించుచున్నది. కావున, భగవానుడే భూమిని నిలబెట్టుచున్నాడు.

భగవానుడు ప్రాణులనెట్లు పాలించి పోషించుచున్నాడు? ప్రాణులు తమ ఆహారమును తామే సంపాదించుకొని, తమ బాగోగులను తామే చూచుకొనుచున్నవి గదా! కాదు. భగవానుని బలము వలననే ప్రాణులు ఆహారమును సంపాదించుకొన గల్గుచున్నవి. మరియు, ఆహారములోని పుష్టి భగవానుడే. కావుననే, నేను పోషించు చున్నానని (పుష్ణామి) భగవానుడు చెప్పుచున్నాడు.

ఎట్లు? సోముడై (సోమో భూత్వా) పోషించుచున్నాడు. సోమశబ్దమునకు ఒక మొక్క యొక్క రసము, సారము, ఒకానొక తీగ, చంద్రుడు అను అర్థములు గలవు. రసాత్మకః (రసమే స్వరూపముగా గలవాడు) అను విశేషణమును బట్టి సోమ శబ్దమునకు అర్థము చంద్రుడని స్పష్టమగుచున్నది. భగవానుడే చంద్రరూపములో సర్వరసముల భండారమై ఉన్నాడు.

సర్వప్రాణుల ఆత్మ నేనే (అహం సర్వాత్మా) అను సత్యదర్శనమిచట ప్రతిపాదించబడుచున్నది. ప్రాణికోటికి జీవనమునిస్తూ ప్రకాశించే సూర్యుడను నేనే. చంద్రుడు, భూమి, అగ్ని కూడ నేనే. నేనే భూమిలో ప్రవేశించి, నా బలముతో ప్రాణులనన్నిటినీ నిలబెట్టు చున్నాను. ప్రాణుల పోషణకు ఆవశ్యకమగు ఆహారము కూడ నేనే. నేనే ఈ మొక్కలను, చెట్లను పుష్టికరమగు పదార్థములతో, మరియు రుచ్యములగు రసములతో నింపుచున్నాను.

భగవానుడే ఆహారమన్నచో, మనము భగవానుని తినుచున్నామా యేమి? కాదు. తినువాడు కూడ భగవానుడే.

**అధ్యాయము 15, శ్లోకము 14:**

अहं वैश्वानरो भूत्वा प्राणिनां देहमाश्रितः ।
प्राणापानसमायुक्तः पचाम्यन्नं चतुर्विधम् ॥ १४ ॥

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ (14)

అహమ్ = నేను, వైశ్వానరః = జఠరాగ్నిని, భూత్వా = అయి, ప్రాణినామ్ =

ప్రాణులయొక్క, దేహమ్ = దేహమును, ఆశ్రితః = ఆశ్రయించి ఉన్నవాడనై, ప్రాణాపానసమాయుక్తః = ప్రాణ-అపానములతో గూడి, చతుర్విధమ్ = నాల్గు రకముల, అన్నమ్ = ఆహారమును, పచామి = పచనము చేయుచున్నాను.

> నేను జఠరాగ్ని రూపములో ప్రాణుల దేహములనాశ్రయించి, ప్రాణ-అపానములతో గూడినవాడనై, నాల్గు రకముల ఆహారమును పచనము చేయుచున్నాను (14).

భగవానుడే స్వయముగా వైశ్వానర (జఠర) అగ్ని రూపమును దాల్చి యున్నాడు. ఈ వైశ్వానరాగ్ని వ్యక్తిలోపల నున్నదై ఆహారము నరిగించుచున్నది అను అర్థము గల శ్రుతిని శ్రీ శంకరులు ఉదహరించిరి. మనము పచనము చేసి తిన్న ఆహారమును భగవానుడు మరల వైశ్వానరాగ్ని రూపములో లోపలనున్నవాడై పచనము చేయుచున్నాడు. ఆయన సర్వప్రాణుల స్థూలదేహములయందు జఠరాగ్ని రూపములో ఉపలభ్యమగుచున్నాడు (ప్రాణినాం దేహమాశ్రితః). అన్నము అరుగుటలో ప్రధానమైనది వైశ్వానరాగ్నియే అయినా, అన్నము జీర్ణమై వంటబట్టుటకు మరికొన్ని అంశములు ఆవశ్యకమగును. ప్రాణమనగా శ్వాసక్రియ. అపానమనగా వాయునిస్సారణము. వీటితో కూడియున్న వైశ్వానరాగ్ని త్రాగేది (భోజ్య), నమిలేది (భక్ష్య), నాలుకతో స్వీకరించేది (లేహ్య), పీల్చేది (చోష్య) అనే నాల్గురకముల ఆహారమును పచనము చేయును.

ఈ సర్వకార్యములను బ్రహ్మయే నిర్వర్తించుచున్నాడు. ఇందువలననే మనము భోజనము చేయుటకు ముందు ఆహారమును ప్రాణ, అపాన, వ్యాన (రక్తప్రసారమునకు కారణమైన వాయువు), ఉదాన (ప్రారబ్ధక్షయమగు వరకు ప్రాణము దేహములో నుండునట్లు చేయునది), సమాన (జాఠరవ్యవస్థకు కారణమగు వాయువు) ములకు, ఆఖరుగా సర్వప్రాణులలో జీవశక్తి రూపములో విలసిల్లుచున్న బ్రహ్మకు నైవేద్యమును చేసెదము. శాకాహారులకైననూ ఆహారభక్షణములో ఎంతో కొంత హింస తప్పదు. అందువలన, ఆహారమును ముందుగా నైవేద్యమునిడవలెను. జీవనమునకు జీవము ఆధారమగుచున్నది. ప్రాణికి ప్రాణి ఆహారము. జీవహింసవలన పాపము లభించుట సహజమే. తినేది మనము కాదని చెప్పుటకు కారణమిదియే. నేను భుజించుచున్నానని శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు. పాపమేదైన ఉన్నచో, అది ఆయనదే గాని మనది కాదు. కర్త మాత్రమే భోక్త యగును. కావున భగవానుడు భుజించుటయే మేలు.

ఆయన తనను తాను భుజించుచున్నాడు గనుక, ఆయనకు పాపము లేదు. ఆయన దర్శనములో తినుట, తినువాడు అంతా మిథ్యయే. సర్వము భగవానుడని నీవు తెలుసుకున్నచో, సమస్య లేదు.

**అధ్యాయము 15, శ్లోకము 15:**

सर्वस्य चाहं हृदि सन्निविष्टो मत्तस्स्मृतिर् ज्ञानमपोहनं च ।
वेदैश्च सर्वैरहमेव वेद्यो वेदांतकृद्वेदविदेव चाहम् ॥ १५ ॥

సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తస్స్మృతిర్ జ్ఞానమపోహనం చ
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాంతకృద్వేదవిదేవ చాహమ్ (15)

చ = మరియు, సర్వస్య = అందరి, హృది = హృదయములో, అహమ్ = నేను, సన్నివిష్టః = ప్రవేశించియున్నాను, స్మృతిః = స్మరణము, జ్ఞానమ్ = జ్ఞానము, చ = మరియు, అపోహనమ్ = మరుపు, మత్తః = నా వలననే కలుగుచున్నవి, చ = మరియు, సర్వైః = అన్ని, వేదైః =వేదములచే, వేద్యః = తెలియబడువాడను, అహం ఏవ = నేనే, చ = మరియు, వేదాంతకృత్ = వేదవేదాంతములను సృష్టించిన వాడను, వేదవిత్ = వేదములనెరింగినవాడను, ఏవ = నిశ్చయముగా, అహమ్ = నేనే.

నేను అందరి హృదయములలో ప్రవేశించి యున్నాను. విషయములు గుర్తుకు వచ్చుట, జ్ఞానము, విషయములను మరచిపోవుట నా వలననే కలుగుచున్నవి. వేదములన్నింటిచే తెలియబడువాడను నేను. మరియు వేదవేదాంతములను సృష్టించినవాడను, వేదములనెరింగిన వాడను నిశ్చితముగా నేనే (15).

సర్వవ్యవహారములకు అధిష్ఠానమైన ఏకైక అద్వితీయ సద్వస్తువు ఇచట యదాదిత్యగతం తేజః అను శ్లోకముతో మొదలిడి మూడు శ్లోకములలో వర్ణించబడినది. సూర్య-అగ్నులలోని తేజస్సు నేనే. చంద్రునిలోని చల్లని కాంతి నేనే. నేనే నా బలముతో భూమిని ధరించియున్నాను. వృక్షలతాది స్థావర ప్రపంచమునంతనూ పుష్టికరమగు రసముతో నింపువాడను నేనే. కావున, ఆహారము నేనే అగుచున్నాను. పైగా, ప్రాణాపానములతో కూడి నేనే ఆహారమును జీర్ణము

చేయుచున్నాను అని భగవానుడు వర్ణించెను. అన్నము భగవానుడే గనుక, అన్నముచే పోషించబడే ఈ దేహము మరియు ఈ బాహ్యప్రపంచము కూడ భగవానుడే. భగవానుడు కానిది ఏది మిగిలియున్నది?

సర్వప్రాణుల హృదయములో నేను ప్రవేశించి ఉన్నానని (సర్వస్య చ అహం హృది సన్నివిష్టః) భగవానుడీ శ్లోకములో చెప్పుచున్నాడు. సర్వప్రాణుల బుద్ధియందలి క్షేత్రజ్ఞ–ఆత్మను నేనేనని భగవానుడు ఇంతకు ముందే చెప్పి యున్నాడు. ఆయన ప్రవేశించి ఉన్నాడు (సన్నివిష్టః) గనుక, ఆత్మరూపుడై ఉపలభ్యమగుచున్నాడు. భగవానుడు జగత్తును సృష్టించి దానిలో ప్రవేశించినాడని (తత్ సృష్ట్వా తదేవాను ప్రావిశత్) తైత్తిరీయోపనిషత్తు ఉద్ఘాటించుచున్నది. ఆయన తనచేతనే సృష్టించబడిన బుద్ధిలో ఆత్మరూపుడై ప్రవేశించెను. ఇచట అహం సన్నివిష్టః అనగా అర్థమదియే. నేను దానిలో ప్రవేశించి అచట ఆత్మ రూపుడనై స్థిరముగా నున్నానని భగవానుడు చెప్పుటచే, ఆత్మ ఈశ్వరుడేనని స్పష్టమగుచున్నది. జీవ–ఈశ్వరుల మధ్య భేదము లేశమైననూ లేదు. నేను ప్రవేశించినాను ( అహం సన్నివిష్టః ) అను భగవానుని వాక్యములో నేను అనగా ఆత్మ చైతన్యము తక్క వేరు గాదు. ఒకే ఒక చైతన్యము గలదు. అదియే ఆత్మ. ఆ ఆత్మరూపుడగు భగవానుడే ప్రవేశించినాడు (సన్నివిష్టః). రెండవ ఆత్మ యొక్క ఉనికిని నిర్ధారించుట అసంభవము. అట్టి ప్రమాణమేదియూ లేదు. శ్రుతి–న్యాయములననుసరించి రెండవ ఆత్మ సంభవము కాదని మనము తెలియవలెను. ఒకే ఆకాశము వివిధ–ఉపాధులచే అవచ్ఛిన్నమగు తీరున, అద్వితీయ–చైతన్యము జ్ఞాన–జ్ఞాతృ–జ్ఞేయ–భేదములచే అవచ్ఛిన్నమగునట్లు కన్పట్టును. ఈ సర్వము పరమాత్మ తక్క మరియొకటి కాదు. మనస్సుచే ఉపహితమై (Conditioned), ఆత్మ యందు అధ్యారోపితములైన విశేషముల కారణంగా ఆ పరమాత్మయే ప్రమాత యగుచున్నాడు. కాని ఆ చైతన్యము తన దృష్టికోణములో శుద్ధ–అద్వితీయ–అనంత–జ్ఞప్తిస్వరూపము. మనస్సు అనే ఉపాధి దృష్టిలో అది జ్ఞాత అగుచున్ననూ, స్వీయదృష్టికోణములో అది అనంతము. మనము సాధారణముగా ప్రమాత అను అర్థములో 'నేను' అని ప్రయోగించెదవము. ఆ ప్రమాతను ఉద్దేశించియే 'బ్రహ్మను నేనే' అను ఉపదేశము ప్రవర్తిల్లుచున్నది. జ్ఞాతయందు ఉపలభ్యమయ్యే చైతన్యమే నిశ్చితముగా ఈశ్వర–అభిన్న–అద్వయ–చైతన్యము.

ఈ చైతన్యము లేనిదే, జ్ఞాత గాని, జ్ఞానము గాని లేనే లేవు. ఇందువలననే, జ్ఞానము నా నుండి కలుగుచున్నదని (మత్తః జ్ఞానమ్) భగవానుడు చెప్పినాడు. ఆత్మరూపుడనగు నా మూలకముగా మాత్రమే జ్ఞానము సంభవమగు చున్నది. ఏలయన, చైతన్యము లేనిదే, జ్ఞానమే

లేదు. మరియు ఒక వస్తువును తెలియగల్గుట అనేది మాయయొక్క వ్యక్తీకరణ మాత్రమే. కావున, ఈశ్వరుని నుండి మాత్రమే జ్ఞానశక్తి లభించుచున్నది. దీనిని మనము రెండు దృష్టికోణములలో పరిశీలించ వచ్చును. మాయా-సహిత-ఈశ్వరుని కంటె వేరు గాని చైతన్య-ఆత్మ-స్వరూపుడనగు నా నుండి జ్ఞానము ప్రకటమగుచున్నది. లేదా, చైతన్య-ఆత్మ-స్వరూపుడనగు నా నుండి మాత్రమే జ్ఞానము ఉదయించుచున్నది.

అదే విధముగా, స్మృతి కూడ చైతన్యస్వరూపుడగు ఈశ్వరుని వలననే సంభవమగుచున్నది. గుర్తు పెట్టుకునే సామర్థ్యము అనే దృష్టికోణములో అది ఈశ్వరుడే. స్మృతి యొక్క స్వరూపము చైతన్యము. మరిచిపోయే స్వభావమునకు అపోహనమని పేరు. మరుపు, మరియు జ్ఞానము నా వలననే (మత్తః) కలుగుచున్నవని భగవానుడు చెప్పుచున్నాడు. ఈ మరుపు పుణ్యపాపముల ఫలమని శ్రీశంకరులు టిప్పణిలో సూచించిరి. పుణ్యము చేసుకున్నవానికి స్మృతి జ్ఞానములు కలుగును. పాపి వాటినుండి వంచితుడగును. ఇది కర్మకు అత్యధికస్థానమునిచ్చి పరిశీలించే దృష్టికోణము. ఒక రకంగా చూస్తే ఇది సత్యమే. పరీక్షను వ్రాసే సమయములో సర్వమును విస్మరించిన విద్యార్థికి ఆ సర్వము పరీక్ష తరువాత గుర్తుకు రావచ్చును. ఎందువలన? ఏదో ఒక పాపము కారణమని చెప్పవలయును. ఈ స్మృతి-జ్ఞాన-అపోహనములను కర్మఫలదాతయగు ఈశ్వరుని దృష్టికోణములో మాత్రమే కాకుండా, చైతన్యము అనే దృష్టికోణములో కూడ భావించవచ్చును. స్మృతి కూడ చైతన్య-ఆత్మ యొక్క అనుగ్రహమే అయి ఉండగా, దాని సంబంధము లేకుండా మరచుట ఎట్లు సంభవమగును? 'నేను మరచినాను' అని మనము అంటాము. అది కూడా జ్ఞానమే. నేను మరచినానని నాకు తెలియుచున్నది గదా! ఒక విషయము నాకు తెలిసిన అనేకవిషయములలో ఒకటియై నా మనస్సులో దాగియున్ననూ, అది ఈ క్షణములో గుర్తుకు వచ్చుటలేదని నాకు తెలియుచునే యున్నది.

ఇంతమాత్రమే గాదు. నా భావనలన్నిటినీ ఒక ముద్దగా చేసి, క్రొంగ్రొత్త జ్ఞానము ఉదయించుటకు వీలుగా దానిని స్థగితము (suspend) చేయగలిగే సామర్థ్యమే అపోహనమని నేను అంటాను. ఈ దృష్టిలో చూస్తే అపోహనము చాల గొప్ప వరము. నాకు తెలిసిన సర్వము సర్వదా గుర్తులో ఉండే పక్షంలో, నేను క్రొత్త విషయములను ఎట్లు నేర్చుకొనగలను? కావున, అపోహనమనగా మరుపు మాత్రమే గాదు. ధారణలన్నిటినీ స్థగితము చేసి, వాటిని మనస్సు పొరలలో వెనుకకు నెట్టివేసి, మనస్సును ఖాళీగా ఉంచుకోగలిగే శక్తియే అపోహనము. విస్మృతులన్నిటినీ స్థగితము చేసినవాడు మాత్రమే క్రొత్త సత్యములను ఆవిష్కరించ గల్గుతాడు.

అట్లు గానిచో, చిరకాలము నుండి సత్యమని నమ్మిన విషయములకు పూర్తిగా విరుద్ధమగు విషయమును దర్శించుట ఎట్లు సంభవమగును? దీనికి వేదాంతములో విశేష ప్రాముఖ్యము గలదు. ఇచట నీ గురించి, జగత్తు గురించి, ఈశ్వరుని గురించి నీకు గల ధారణలనన్నిటినీ నిషేధించవలసి యుండును. పాత భావనలు మనస్సులో పీట వేసుకొని కూర్చుని యుండగా, వాటిని త్రోసివుచ్చుట ఎట్లు సంభవమగును? ఇప్పుడు ఉన్న ధారణలను ప్రక్కన బెట్టనిదే, క్రొత్త భావనలు లోపలికి ప్రవేశించవు. అవి పూర్తిగా బుద్ధినుండి దూరము కానక్కరలేదు. అవి నా శ్రవణమును చెడగొట్టకున్నచో చాలును. భగవానుడు, నేను, నా అన్వేషణలు, పురుషార్థము అను వాటిపై నాకు గల భావనలు, అభిప్రాయములు పూర్తిగా పరివర్తనను చెంది, వాటి స్థానములో ఒక క్రొత్త దర్శనము (vision) ఉదయించవలెను. అపోహనము లేనిచో, అది సంభవము గాదు.

అదే విధముగా, అపోహనము లేనిచో, కొన్ని ఆనందఘడియలననుభవించుట యైననూ సంభవము గాదు. నాకు గల సమస్యలన్నీ సర్వదా గుర్తున్నచో, ఒక క్షణమైననూ నేను ఎట్లు నవ్వగల్గుదును? నేను నవ్వగల్గుచున్నాను గనుక, అపోహనము గలదని నిరూపణ యగుచున్నది. ఇది భగవానుని అతిమహత్త్వపూర్ణమగు కృప. ఇది లేనిచో, మనము సర్వదా దుఃఖావేశములో నుండెడివారము. కొద్దిపాటి సుఖములనైననూ అనుభవించుటకు వీలుగాక, జీవితము నిస్సారమయ్యెడిది. కావున, అపోహనమనగా మరుపు మాత్రమే గాదు. మనస్సులోని విచారములన్నిటినీ ఏ క్షణములోనైననూ స్థగితము చేయగలిగే సామర్థ్యము కూడ అపోహనమే. ఈ దృష్టితో చూస్తే, అపోహనము లేనిదే స్మృతిజ్ఞానములు కలుగజాలవు గనుక, వాటికి అపోహనము అలంబనమగుచున్నది. చైతన్యము వలన మాత్రమే నేను మరువగల్గుచున్నాను. మరువుతో గూడిన ఈ మనస్సును చైతన్యము ప్రకాశింప జేయుచున్నది. కావున, దీనిని ఈ రెండు విధములుగా అర్థము చేసుకొనవచ్చును. చైతన్యస్వరూపుడనగు నా వలన మాత్రమే స్మృతి-జ్ఞాన-అపోహనములు సంభవమగుచున్నవి. చైతన్య-ఆత్మ లేనిదే, ఈశ్వరుడు లేడు. కావున, ఈశ్వరుడనగు నా నుండి స్మృతి కలుగుచున్నది; జ్ఞానము కలుగుచున్నది; అపోహనము కలుగుచున్నది.

సర్వవేదములచే తెలియదగినది ఈశ్వరుడు మాత్రమే. వివిధక్రతువులు, దేవతలు ఇత్యాదులనేకములు వేదములో చెప్పబడుచుండగా ఇట్లు చెప్పుట ఎట్లు పొసగును? వేదములన్నిటిచే నేను మాత్రమే తెలియబడుచున్నాను (వేదైః సర్వైః అహమేవ వేద్యః) అని చెప్పుటచే, పైన చెప్పిన సర్వము ఈశ్వరుడు తక్క మరియొకటి కాదని మనకు తెలియుచున్నది.

అగ్ని-ఇంద్ర-వరుణ ఇత్యాది దేవతలందరు పరమేశ్వరుడే. కర్మఫలదాత అయనయే. కర్మనియతిపై అధ్యక్షతను వహించువాడు (కర్మాధ్యక్షః) ఆయనయే. కర్త, సర్వలోకములు, సర్వపదార్థములు అనే సగుణబ్రహ్మరూపములోనున్న ఈశ్వరుని కర్మకాండ ప్రతిపాదించుచున్నది. మనము ఘటము అని నిర్దేశించే వస్తువు నామరూపములచే ఉపహితమైన చైతన్యము తక్క వేరు గాదు. జ్ఞాని దృష్టిలో ఏ వస్తువైననూ ఈశ్వరుని కంటె వేరు గాదు. ఆ ఈశ్వరుని వేదములు ప్రతిపాదించుచున్నవి.

వేదములను రచించినది ఎవరు? అనేది తరువాతి ప్రశ్న. వేదకర్త వేదవేద్యుడగు వానికంటె గొప్ప వాడై ఉండి తీరాలి గదా! కాదు. వేదాంతములను రచించినది నేనే (అహం వేదాంతకృత్). వేదాంతబోధనాసంప్రదాయమును ప్రవర్తిల్ల జేసినది ఈశ్వరుడే. ఈ సంప్రదాయములో ఆది గురువు నారాయణుడు. కావున, ఆయన వేదతాత్పర్యవేత్త (వేదవిత్) యగుట సహజమే. వేదవేద్యుడను నేనే; వేదములను సృష్ట్యాదిలో ప్రవర్తిల్ల జేసినవాడను నేనే; వేదతాత్పర్యము తెలిసినవాడను నేనే అని భగవానుడు చెప్పుచున్నాడు. వేదాంతవేద్యుడే వేదవేత్త. ఆయనయే పరమాత్మ.

ఇది సమగ్రమైన నిరూపణము. వృక్షలతాదులలోని ఆహారము నేనే. ఆహారవికారమగు దేహము మరియు ప్రాణము కూడ నేనే. ఆహారమును ఉత్పన్నము చేయు పృథివి నేనే. సూర్యుడు, మరియు సర్వగ్రహములు నేనే. నా వలననే సర్వక్రియకలాపములు ఘటిల్లుచున్నవి. నేను లేనిదే స్మృతి లేదు; జ్ఞానము లేదు; మరుపు లేదు. కొన్ని ప్రముఖ-ఉపాధులనాధారముగా చేసుకొని, ఇచట భగవద్విభూతులు సంగ్రహముగా వర్ణింపబడినవి. ఇట్టి ఉపాధులు అనేకము గలవు. కాని, సూర్యచంద్రులు, అగ్ని ఇత్యాది కొన్ని విశిష్ట-ఉపాధులు మాత్రమే ఈ నాలుగు శ్లోకములలో ప్రస్తావించ బడినవి.

ఒకే పరమేశ్వరునకు రెండు రకముల ఉపాధులు గలవు. ఒకటి వినాశి (క్షర) కాగా, మరియొకటి అవినాశి (అక్షర). భగవానుని ఈ ద్వివిధ రూపములలో గాంచి, తద్ద్వారా క్షర-అక్షరములకు అతీతమగు సత్యసద్రూపమును దర్శించవలెను. ముందుగా అధ్యారోపమును చేసి, తరువాత దానిని బాధించుట (negation) ద్వారా ఇది సంభవమగును. దీనికొరకై శాస్త్రము ద్వివిధ-ఉపాధులను ప్రతిపాదించుచున్నది. ఒకటి క్షర-ఉపాధి. ఇది మనకు తెలిసినదే అయినా, క్షరరూపములో తెలియదు. అక్షర-ఉపాధిని శాస్త్రము నిరూపించును. ఉపహితమగు బ్రహ్మవస్తువును నిర్దేశించుట కొరకై శాస్త్రము ఈ ద్వివిధ-ఉపాధులను వర్ణించుచున్నది.

అధ్యారోప-అపవాద-న్యాయమునననుసరించి, సర్వ-ఉపాధి-గుణ-వినిర్ముక్తమగు సత్యవస్తువు ప్రదర్శింపబడుచున్నది.

**అధ్యాయము 15, శ్లోకము 16:**

द्वाविमौ पुरुषौ लोके क्षरश्चाक्षर एव च ।
क्षरस्सर्वाणि भूतानि कूटस्थोऽक्षर उच्यते ॥ १६ ॥

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోక్షర ఉచ్యతే (16)

**లోకే** = లోకమునందు, **క్షరః** = క్షరుడు, **చ** = మరియు, **అక్షరః ఏవ చ** = అక్షరుడు అనే, **ఇమౌ** = ఈ, **ద్వౌ** = ఇద్దరు, **పురుషౌ** = పురుషులు గలరు, **సర్వాణి** = సమస్తములైన, **భూతాని** = ప్రాణులు, **క్షరః** = క్షరుడు (వినాశి) అనియు, **కూటస్థః** = వికారములు లేనిది, **అక్షరః** = అక్షరుడనియు, **ఉచ్యతే** = చెప్పబడును.

ఈ లోకమునందు క్షరుడు, అక్షరుడు అను ఇద్దరు పురుషులు గలరు. సర్వప్రాణులు క్షరుడు (వినాశి) అనియు, వికారములు లేని తత్త్వము అక్షరుడు (అవినాశి) అనియు చెప్పబడును (16).

**అధ్యాయము 15, శ్లోకము 17:**

उत्तमः पुरुषस्त्वन्यः परमात्मेत्युदाहृतः ।
यो लोकत्रयमाविश्य बिभर्त्यव्यय ईश्वरः ॥ १७ ॥

ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః (17)

**తు** = కానైతే, **అన్యః** = తద్భిన్నమైన, **ఉత్తమః** = ఉత్కృష్టుడైన, **పురుషః** = పురుషుడు, **పరమాత్మా** = పరమాత్మ, **ఇతి** = అని, **ఉదాహృతః** = చెప్పబడుచున్నాడు, **యః** = ఏ, **అవ్యయః** = వికారరహితుడైన, **ఈశ్వరః** = ఈశ్వరుడు, **లోకత్రయమ్** = ముల్లోకములను, **ఆవిశ్య** = ప్రవేశించి, **బిభర్తి** = పాలించి పోషించుచున్నాడో.

> కానైతే, ఆ రెండింటి కంటె భిన్నమైన ఉత్కృష్ట పురుషుడు పరమాత్మ యని చెప్పబడుచున్నాడు. అయనయే వికారరహితుడగు ఈశ్వరుడై, ముల్లోకములను ప్రవేశించి వాటిని పాలించి పోషించుచున్నాడు (17).

ఒక పురుషుడు వినాశి (క్షర) అనియు, మరియొకడు అవినాశి (అక్షర) అనియు భగవానుడిచట చెప్పుచున్నాడు. వీరిద్దరికంటె ఉత్తముడగు మరియొక పురుషుడు గలడని భగవానుడు తరువాతి శ్లోకములో చెప్పుచున్నాడు. ఆ పురుషుడే ముల్లోకములను (లోకత్రయమ్) ప్రవేశించి, సర్వవ్యాపకుడై, సర్వమును పాలించి పోషించుచున్నాడు. అయనయే ఈశ్వరుడు. పరమాత్మయగు ఆ పురుషునిచేతనే క్షర-అక్షరములు రెండు ధరించబడుచున్నవి. అక్షర-పురుషుడనగా అవ్యాకృత-మాయ కాగా, జగత్తు యొక్క వ్యాకృతరూపమే క్షర పురుషుడు. ఈ తీరున సర్వము పురుషుడే. పురుషుని కంటె భిన్నముగా ఏదీ లేదు. కాని యథార్థ పురుషుడు ఎవరు? ఆ పురుషుడు క్షర-అక్షరములకంటె భిన్నుడనియు, కావుననే ఉత్తముడనబడుననియు తరువాతి శ్లోకము చెప్పుచున్నది. అయనకు లోకములో, మరియు వేదములో పురుషోత్తముడను ప్రఖ్యాతి గలదు. సర్వము యొక్క స్వరూపసత్యము అయనయే. అయన యందు క్షర-అక్షరముల గుణములేవియు లేవు గనుక, అయన నిర్గుణుడు. క్షరము నిరంతరవినాశశీలిగా నుండి, అంతమునందు అవ్యాకృత-అక్షరములో విలీనమగును. అవ్యక్తము పరిణమించి వ్యక్తమగును. అది నిరంతరముగా మార్పులకు లోనవుతూ, అంతమునందు మరల అవ్యక్తములో విలీనమగును. ఈ ప్రక్రియ కొనసాగుచుండును. ఈ క్షర-అక్షరములు రెండింటినీ ఆత్మయే ధరించియున్నది. ఈ రెండింటికీ అధిష్ఠానమగు ఆత్మ వాటి వాటి గుణములచే లేశమును పొందదు. ఆ రెండు ఆత్మయందు అధ్యారోపములగుటచే, ఆత్మయే ఉత్తమపురుషుడు అగుచున్నది.

ఆత్మను పురుషుడనుటకు కారణమేమి? ఆత్మ కంటె భిన్నముగా ఏదియూ లేదు గనుక. జడ-చేతనములన్నింటిలో చైతన్య-ఆత్మ గలదు. అందువలననే పురుషశబ్దము ప్రయోగింపబడినది. స్థూల-సూక్ష్మ-పంచభూతములతో, మరియు సర్వస్థూలదేహములతో నిండియున్న ఈ జగత్తు సర్వము నామరూపములు మాత్రమే. సర్వనామరూపములకు పురుషునికంటె భిన్నమగు అస్తిత్వము లేదు. పురుషుడు సర్వగుణవినిర్ముక్తుడు (నిర్గుణః). కాని అదే పురుషుని సగుణరూపమును గురించి మాటలాడినపుడు దానిని రెండు భాగములుగా విభాగము చేయువచ్చును. ఒకటి క్షర-పురుషుడు. రెండవది అక్షర-పురుషుడు. క్షర పురుషుడు

నిరంతరపరివర్తనశీలి. అది తన కారణములో విలీనమగును. ఆకాశాది పంచభూతములతో కూడియున్న ఈ వ్యాకృత-ప్రపంచము, మరియు మానవుని స్థూలదేహము క్షర-పురుషుడనబడును. సాధారణముగా ఈ జగత్తు జడమని మనము భావిస్తాము. కాని దానికి సత్యవస్తువు అగు పురుషునికంటె భిన్నముగా స్వతంత్రమగు అస్తిత్వము లేదు గనుక అది ఒక ప్రత్యేకతత్త్వమనే విభాగమును మనమిచట చేయుట లేదు. సర్వకారణము, సర్వాధిష్ఠానము అగు సత్యం-జ్ఞానం-అనంతం-బ్రహ్మకంటె భిన్నముగా స్వతంత్రమగు అస్తిత్వము గలది ఏదీ లేదు. ఇందువలననే పురుషుడు అను శబ్దము ప్రయోగించబడినది. వ్యాకృతప్రపంచము స్వకారణము (అక్షరః) లో లీనమై, మరల వ్యక్తమగుచుండును. వాటిలో మొదటిది వినాశి కాగా, రెండవది అది విలీనమయ్యే కారణము. భగవానుని మాయాశక్తి (అక్షరపురుషః) కూడా పురుషుడే. ఏలయన, పురుషుడు లేనిదే మాయాశక్తి లేదు. కారణ-ఉపాధి అనే దృష్టికోణములో దానికి అక్షర-పురుషుడని పేరు. కార్య-ఉపాధి అనే దృష్టికోణములో అదియే క్షర-పురుషుడు అనబడును. జగత్తు ప్రకటమైనప్పుడు అదియే భగవానునకు కార్య-ఉపాధియై క్షరపురుషుడనబడును. ఈ తీరున ఈ సంసారములో ఈ రెండు పురుషులు గలరు. క్షరము లేని అవస్థలో అది సృష్టిబీజమగు మాయా (అక్షర-పురుషః) రూపములో నుండునని తెలియదగును. అదియే సర్వసంసారముకు ఆలంబనము. సర్వసృష్టి దానిని ఆశ్రయించి ఉన్నది.

సర్వభూతములు (సర్వాణి భూతాని) క్షర-పురుషుడగునని భగవానుడు చెప్పుచున్నాడు. సృష్టిలోని సర్వవికారములు క్షరమనబడునని శ్రీశంకరులు చెప్పిరి. సూక్ష్మస్థూలభూతముల నుండి ఈ దేహేంద్రియమనస్సంఘాతము ఉదయించినది. అంతఃకరణము, జ్ఞానేంద్రియములు, శారీరకక్రియలు (ప్రాణః), కర్మేంద్రియములు అను వాటితో గూడియున్న సూక్ష్మశరీరమునకు సూక్ష్మభూతములు కారణము కాగా, స్థూలశరీరము స్థూలభూతములతో నిర్మితమైయున్నది. ఈ వ్యవస్థ మానవులమగు మనకు మాత్రమే గాక, సృష్టిలోని సర్వప్రాణివర్గమునకు వర్తించును.

వీటికి భిన్నముగా, అక్షర-పురుషుడు కూటస్థుడు. అది మార్పులనెరుంగని ఒక ముద్ద వలె స్థిరముగా నుండునని శ్రీశంకరులు వివరించిరి. కూటస్థః అనునది సాధారణముగా శాస్త్రములో నిర్గుణము, అందువలననే అవికారి యగు ఆత్మను మాత్రమే నిర్దేశించుటకు వాడే పారిభాషికపదము. ఇచట ఆ ముఖ్యార్థములో గాక, ఆపేక్షికమగు అర్థములో అవినాశి అగు తత్త్వమును నిర్దేశించుటకై ఈ పదము వాడబడినది. కార్యము నశించును. కాని కారణము నశించదు. ఘటము నశించినను మట్టి నశించదు గదా! కంసాలివాని దాగలి కూటమనబడును.

అట్టి కూటమువలె, వివిధవికారములకు ఆలంబనమగుచున్ననూ, తాను స్వయముగా లేశమైననూ వికారమును పొందని తత్త్వము కూటస్థము (కూట ఇవ తిష్ఠతి) అనబడును. మిథ్యాభూతమగు సర్వజగత్తుయొక్క స్వరూపభూతసత్యమగు అధిష్ఠాన-ఆత్మ కూటస్థమనబడును. ఈ పదమునకు మరియొక అర్థము గలదు. కూటమనగా మాయ. దాని యందు దాని స్వరూపసత్యమై ఉండునది గనుక, ఆత్మ కూటస్థమగును (కూటే తిష్ఠతి). అదియే బ్రహ్మ. సర్పములో త్రాడు ఉన్న తీరున, మాయయందు ఆత్మ గలదు.

శ్రీ శంకరులు ముందుగా కూటశబ్దమునకు అవినాశి అను అర్థమును స్వీకరించిరి. కాని, మనము మాయోపాధికుడగు పురుషుని గురించి చర్చించుచున్నాము గనుక, ఆ శబ్దమునకు వంచన అనే రెండవ అర్థమును కూడ స్వీకరించిరి. మాయ మానవుని దర్శనమును తల్లక్రిందులు చేసి మోసగించును. అది అనేకరూపములను దాల్చి వ్యక్తిని సమ్మోహితుని చేయును. శ్రీ శంకరులు ఇంకనూ ఇట్లు వ్యాఖ్యానించిరి. నామరూపాత్మకమగు ఈ మాయ ఆ తరువాత తన బీజావస్థయగు అవ్యాకృతస్థితిలో విలీనమగును. కాని, అది అంతము కాదు. అది మరల వ్యక్తమై, మరల విలీనమగుచుండును. ఉదాహరణకు గాఢనిద్రలో వ్యక్తి యొక్క దేహేంద్రియసంఘాతమునందలి అభిమానము, వ్యక్తిత్వము మరియు ఈ ప్రపంచము విలీనమగును. అపుడాతడు ఒక స్వప్నప్రపంచమును సృష్టించును; అనగా, తానే స్వప్నప్రపంచరూపములో నుండును. దానికి క్షరపురుషుడని పేరు. ఆ తరువాత ఆతడు నిద్రలోనికి జారుకొని, అక్షరపురుషుడగును. అనగా స్వప్న (క్షర) పురుషుడు నశించినాడని అనుకోరాదు. ఇపుడాతడు అవ్యాకృతస్థితిలో నున్నాడు. ఈ సృష్టించబడిన కార్యప్రపంచమంతయు క్షరపురుషుడనబడును. అదే పురుషుడు కారణ-ఉపాధితో కూడినవాడై అక్షరపురుషుడనబడును. కారణ-కార్య-ఉపాధులు రెండు పురుషునిపై అధ్యారోపము మాత్రమే. పురుషునకు వాటి గుణములతో లేపము గలదా యన్నట్లు కన్పట్టును. ఈ కాల్పనిక రచనలో పురుషుడెవరు? అధ్యారోపములనన్నింటిని నిషేధించిన తరువాత మిగిలే తత్త్వమే పురుషుడు. ఉపాధి అనే దృష్టికోణములో పురుషుడు ద్వివిధముగా నున్నాడు. కాని, ఉపాధులను రెండింటిని బాధించి (negate) నచో, ఒకే ఒక పురుషుడు గలడు.

ఇచట అధ్యారోప-అపవాద-ప్రక్రియ సాక్షాత్తుగా వినియోగించబడినది. పురుషుడు పురుషుడుగనే మిగిలియుండుననియు, పురుషునికంటె భిన్నముగా స్వతంత్రమగు అస్తిత్వము లేని ఈ నామరూపాత్మకప్రపంచమంతయు మిథ్య అనియు నిరూపించుటకై ఈ బోధనాప్రక్రియ

ఉద్దేశించబడినది. సర్వమునకు కారణము పురుషుడే అయినా, సృష్టిప్రక్రియలో పురుషునియందు లేశమైననూ వికారము కలుగదు. ఈ ఉపదేశము సర్వదా ఈ అధ్యారోప-అపవాద-ప్రక్రియను వినియోగించి మాత్రమే చేయబడును. ఈ ప్రక్రియయొక్క స్వరూపము నెరింగినవారు దీనిని తెలివిగా వినియోగించి కాల్పనిక ప్రపంచమును వ్యాఖ్యానించి నిషేధించెదరు. ఈ శ్లోకములో క్షర-అక్షర-ఉపాధులు వర్ణించబడగా, తరువాతి శ్లోకము ఉపాధి-వినిర్ముక్తమగు పురుషుని వర్ణించును.

ఈ క్షర-అక్షరములు రెండింటికంటె భిన్నమైన (అన్యః) పురుషుడు వాటితో సంబంధము లేకుండగా స్వతంత్రుడై యుండును. ఈ రెండింటికంటె సంపూర్ణముగా విలక్షణుడగు ఈ పురుషునకు ఉపాధి దోషములతో సంస్పర్శ లేశమైననూ లేదు. ఈ పురుషుని శ్రీశంకరులు తనకు ప్రీతిపాత్రమగు సమాసపదముతో వర్ణించిరి. ఈ పురుషుడు నిత్య-శుద్ధ-బుద్ధ-ముక్త-స్వభావః. అనగా, అజ్ఞానము, పుణ్యపాపాది సమస్త దోషములు, కారణకార్యభావము, మరియు కర్తృత్వ-భోక్తృత్వములనుండి పూర్తిగా వినిర్ముక్తుడు, మరియు నిత్యప్రకాశస్వరూపుడు అని యర్థము. ఆ పురుషుడు ఉత్తముడు, అనగా సర్వశ్రేష్ఠుడు. అనగా నేమి? ఆ పురుషుడు క్షర-అక్షర-పురుషులకంటె పూర్తిగా విలక్షణుడు; ఆ పురుషునికంటె అతీతముగా ఏదియూ లేదు; మరియు ఆ పురుషుని తెలుసుకున్నవాడు మోక్షమును పొందును అని శ్రీశంకరులు వివరించిరి. సర్వసంసారమునకు అధిష్ఠానమగు ఆ ఉత్తముడు కారణ-కార్య-ఉపాధులకు అతీతుడు. ఈ సర్వము ఆత్మయే. పూర్ణమగుటచే ఆత్మకు పురుషుడను పేరు వచ్చినది. లేదా, ఈ దేహమునందు నివసించువాడు (పురౌ ఉశతి) గనుక, పురుషుడను పేరు వచ్చినది. భగవానుడీ సర్వమును సృష్టించి, దేహమునందు ప్రత్యగాత్మ రూపములో ప్రవేశించినాడు. సర్వపదార్థముల అస్తిత్వము దానిపైననే ఆధారపడి యున్నది.

అది పరమాత్మ (అనంత-ఆత్మ) అని పిలువబడుచున్నది (పరమాత్మా ఇతి ఉదాహృతః). పరమనగా క్షర-అక్షర-ఉపాధులకు అధిష్ఠానమైనది. వివిధ దృష్టికోణములను బట్టి, దేహ-ఆత్మ, ప్రాణ-ఆత్మ, మనో-ఆత్మ ఇత్యాదిగా మనకు వివిధ ఆత్మలు గలవు. అవి అన్నియూ ఆత్మలే అయినా, ఈ ఆత్మ ఒక్కటి మాత్రమే పరమాత్మ. ఈ ఆత్మ వలన మాత్రమే మనము ఇతర ఆత్మలను తెలియగల్గుచున్నాము. క్షర-అక్షర-ఉపాధులకు అతీతమైన ఈ ఆత్మ ఒక్కటి మాత్రమే సర్వప్రాణుల అంతర్యామి చైతన్యమై విరాజిల్లుచున్నది. కావుననే ఇది పరమగు ఆత్మ (పరమాత్మ). సర్వమునకు సత్తాస్ఫూర్తులనొసంగునది ఈ ఆత్మ మాత్రమే.

అధ్యారోపమును నిషేధించిన పిదప, తనపై అజ్ఞానముచే ప్రోగుచేయబడిన సర్వమునుండి వినిర్ముక్తమైన ఆత్మ ప్రకాశించును. ఆ ఆత్మను మనము పరమాత్మ యని పిలిచెదము.

మాయాశక్తిసమేతుడగు ఆ పరమాత్మ భూః, భువః, సువః అనే మూడు లోకములలోనికి ప్రవేశించును. భూః అనే వ్యాహృతిలో సప్త అధోలోకములు (అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాలములు) అంతర్గతమగును. ఊర్ధ్వలోకములన్నియు (మహః, జన, తపః, సత్యమ్) సువః లోను, మధ్యలోకములు భువః లోను అంతర్గతమగును. లోకత్రయములో సమస్తలోకములు అంతర్గతమగును. పరమాత్మ జగత్తులోనికి ఎట్లు ప్రవేశించినాడు? కారణరూపములో మాత్రమే ప్రవేశించినాడు. సచ్చిదానంద పరమాత్మ కారణమెట్లు కాగల్గను? ఆయన తన మాయాశక్తిచే మాత్రమే జగత్తులో ప్రవేశించి జగద్రూపుడగును. ఘటములోనికి మట్టి ప్రవేశించు తీరున, కారణము కార్యమగు జగత్తులో ప్రవేశించి, తద్ద్వారా దానిని నిలబెట్టును (బిభర్తి). ఎట్లు? తన స్వరూపమగు సత్తా మాత్రము చేతనే (స్వరూపసద్భావమాత్రేణ) నిలబెట్టును. జగత్తులో ప్రవేశించి పరంబ్రహ్మ తన స్వరూపము (సత్-చిత్) చే దానికి అస్తిత్వమును కల్పించును. సత్-ఆత్మ ఉండుటచే, మాయ ఉండుటచే, సృష్టి గలదు. ఆ సత్తయే జగత్తునంతనూ నిలబెట్టుచున్నది.

మనము కాలము గురించి విశ్లేషించినప్పుడు, సెకను వంటి ఒక విశిష్ట కాలాంశము ఉన్నది అని చెప్పెదము. కాలములోని యథార్థవస్తువు ఈ ఉనికి మాత్రమే. కాలమును క్రమముగా అంశములుగా విభజించుకుంటూ పోతే, నిమిషము ఉన్నది, సెకను ఉన్నది, మైక్రో (micro) సెకను ఉన్నది. అంతిమముగా, కాలభావన లుప్తమగును. అపుడు మిగిలియుండే ఆ ఉనికి మాత్రమే కాలము యొక్క యథార్థస్వరూపము. సర్వవర్తమానకాలీన వస్తువులయందు, మరియు భూతకాలము నందు అనుభూతమైన సర్వమునందు అది సర్వదా గలదు. ఆ సత్తను ప్రదానము చేసే పరమాత్మ ఆ కారణముచేతనే వికారములకు, కాలమునకు వశము కాని అవ్యయుడు. ఆయనయే సర్వజగత్కారణమగు ఉత్తమపురుషుడు. కావున, ఆత్మయే సర్వజగత్కారణమగు ఈశ్వరుడు (బ్రహ్మ) అగును. మరియొక అంశము లేదు. ఈశ్వరుడని పిలువబడే పరమాత్మయే ఆత్మ.

ఇది సమగ్రమగు వివరణ. పరమాత్మరూపములో సర్వమునకు అతీతుడగు పురుషుడే సర్వాంతర్యామియై క్షర-అక్షర-పురుషుడు అగుచున్నాడు.

**అధ్యాయము 15, శ్లోకము 18:**

यस्मात् क्षरमतीतोऽहमक्षरादपि चोत्तमः ।
अतोऽस्मि लोके वेदे च प्रथितः पुरुषोत्तमः ॥ १८ ॥

యస్మాత్ క్షరమతీతోహమక్షరాదపి చోత్తమః
అతోస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః (18).

**యస్మాత్** = ఏ కారణముచే, **అహమ్** = నేను, **క్షరమ్** = క్షరము (వినాశి) ను, **అతీతః** = అతీతుడనై యున్నానో, **చ** = మరియు, **అక్షరాదపి** = అక్షరము (అవినాశి) కంటె, **ఉత్తమః** = ఉత్కృష్టమైనవాడనో, **అతః** = ఈ కారణముచే, **లోకే** =లోకమునందు, **చ** = మరియు, **వేదే** = వేదమునందు, **పురుషోత్తమః** = పురుషోత్తముడని, **ప్రథితః** = ప్రసిద్ధిని గాంచినాను.

నేను క్షర (వినాశి), అక్షర (అవినాశి) పురుషులను అతిక్రమించి యుండుటచే, లోకమునందు మరియు వేదమునందు పురుషోత్తముడనని ప్రసిద్ధిని గాంచినాను (18).

పురుషుడు క్షర-అక్షర-ఉపాధులకు అతీతముగా వాటిచే స్పృశించబడకుండగా నుండుటచే, సంసారకారణమగు మాయకు కూడ అతీతుడై సర్వోత్కృష్టుడుగా (ఉత్తమః) నున్నాడు. కారణ-ఉపాధి అనే దృష్టికోణములో నేను అతీతుడను (ఉత్తమః) అని భగవానుడు చెప్పుచున్నాడు. అది నన్ను స్పృశించలేనంత దూరములో నేను ఉన్నాను. ఎంత దూరములో? త్రాడు తనపై ఆరోపించబడిన పంకిలస్పర్శ గల పామునకు ఎంత దూరములో నున్నదో అంత దూరములో నున్నాను. పాము యొక్క పంకిలస్పర్శ త్రాడునకు అంటుకొనదు. నీ మనోవృత్తులకు నీ చైతన్య-ఆత్మ కూడ అంతే దూరములో నున్నది. చైతన్యముపై మనోవృత్తి తన చిహ్నమును విడువగల్గునా? మనోవృత్తి సుఖాకారమైనా, దుఃఖాకారమైనా, దాని అవశేషము చైతన్యముపై మిగిలియుండదు. నీవు ఈ అక్షరములను ముద్రితమైన పుటలో చూచే చేతనుడవు. ఈ అక్షరములు ప్రక్కకు తొలగినప్పుడు చైతన్యమునకు ఏమగును? ఏమీ కాదు. చైతన్యముపై ఎట్టి చిహ్నములు మిగిలియుండును? నీవు ఒక ఉష్ణపదార్థమును స్పృశించితివనుకొనుము. దానిచే నీ చైతన్యము వేడెక్కదు. నీవు మంచులో విహరించినప్పుడు నీ చైతన్యము చల్లబడదు. వేడియొక్క అనుభూతి చైతన్యము యొక్క ఉష్ణోగ్రతను పెంచదు. శీతల-అనుభూతి దాని ఉష్ణోగ్రతను

తగ్గించదు. చైతన్యముపై ముద్రను వేయగలిగే వస్తువు ఏదీ లేదు. సర్వమునకు అతీతముగా నుండుట (ఉత్తమః) అనగా నిదియే. మనోవృత్తికి, చైతన్యమునకు మధ్యలో దూరము లేదు. సర్వముచే స్పృష్టముగాని ఆ చైతన్యము సర్వమునకు అధిష్ఠానమగుచున్నది.

కావున (అతః), క్షర-అక్షరములకు అధిష్ఠానము, మరియు వాటి స్వరూపసత్యము అగు నేను సర్వముచే స్పృశించబడుట లేదు. కావుననే, పురుషోత్తముడ నగుచున్నాను. వేదములో ప్రఖ్యాతిని చెందిన (ప్రథితః) పురుషుడీతడే. లోకములో కవులు, భక్తులు ఈ పురుషుని నారాయణుడని వర్ణించుచున్నారు.

హరిః ఓమ్ తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు

శ్రీ గణేశాయ నమః

ఈ అధ్యాయము రాబోవు రెండు శ్లోకములలో పునరవలోకనము చేయబడుచున్నది:

**అధ్యాయము 15, శ్లోకము 19:**

यो मामेवमसम्मूढो जानाति पुरुषोत्तमम् ।
स सर्वविद्भजति मां सर्वभावेन भारत ॥ १९ ॥

యో మామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత (19)

భారత = ఓ అర్జునా!, అసంమూఢః = మోహము లేనివాడు, యః = ఎవడైతే, పురుషోత్తమమ్ = పురుషోత్తముడనగు, మామ్ = నన్ను, ఏవమ్ = ఈ విధముగా, జానాతి = తెలుసుకొనునో, సర్వవిత్ = సర్వము (పరం బ్రహ్మ) నెరింగిన, సః = అతడు, మామ్ = నన్ను, సర్వభావేన = సర్వప్రాణుల ఆత్మ అను రూపములో, భజతి = పొందును.

ఓ అర్జునా! ఎవడైతే మోహము లేనివాడై పురుషోత్తముడనగు నన్ను ఈ విధముగా తెలుసుకొనునో, సర్వము (పరం బ్రహ్మ) నెరింగిన అతడు, నన్ను సర్వప్రాణుల ఆత్మరూపములో పొందును (19).

సంమోహమునుండి విముక్తిని పొందిన వ్యక్తియొక్క దృష్టిలో ఆత్మ పురుషోత్తముని కంటె వేరు గాదు. అతడు మోహవినిర్ముక్తుడు గనుక, నన్ను ఈ విధముగా, అనగా నశించే క్షర పురుషునిగా, అవికారియగు అక్షరపురుషునిగా, మరియు క్షర-అక్షర-ద్వయ-వినిర్ముక్తమగు పురుషునిగా (పురుషోత్తమః) తెలుసుకొనునని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. కార్య-ఉపాధి దృష్టిలో క్షర-పురుషుడే పురుషుడు. అదే పురుషుడు కారణ-ఉపాధి దృష్టిలో అక్షర-పురుషుడగును. పురుషుడు స్వయముగా ఈ రెండింటికీ అతీతుడు (ఉత్తమః). ఉపాధి దృష్టిలో మాత్రమే పురుషుడు క్షర-పురుషుడనియు, అక్షర-పురుషుడనియు పిలువబడుచున్నాడు.

ఈ విధముగా, సంసారవృక్షమునకు మూలము, కారణము, దాని స్వరూప సత్యము అగు పురుషోత్తముడను నేను అని తెలుసుకున్నవాడు అసంమూఢుడగును. పురుషోత్తముని

తెలుసుకున్నవాడు సర్వమును తెలిసిన వాడగును (సర్వ విత్). పురుషోత్తముని తెలుసుకున్నచో, సర్వమును తెలియుట ఎట్లు? వానికి ఎలక్ట్రానిక్స్ గాని, లేదా ఫ్రెంచి భాషగాని తెలియునా? సర్వజ్ఞత్వము ద్వివిధముగా నున్నది. వివరములన్నింటినీ తెలిసినవాడు (సర్వవిత్త్వమ్); సత్యవస్తువుయొక్క సామాన్యజ్ఞానము గలవాడు (సర్వజ్ఞత్వమ్). ప్రధానముగా ఈ జగత్తులో ఒకే ఒక సత్యవస్తువు గలదు. అదియే పురుషోత్తముడు. అయనయే క్షరపురుషుడు, మరియు అక్షరపురుషుడు అయి సర్వజగద్రూపములో నున్నాడు. కావున, సత్యవస్తువు నెరింగినచో, మనకు మిథ్య కూడ అవగతమగును. వివరముల జ్ఞానముతో పని లేదు. ఏలయన, వివరములన్నియు నామరూపములు గనుక మిథ్య. సత్యవస్తువు ఒకే ఒకటి గలదు. అదియే పరిగణించదగినది. అది నీవే. సర్వముయొక్క ఆత్మ నేనే (అహం సర్వాత్మా) అని తెలిసినవాడు సామాన్యముగా సర్వమును తెలిసినవాడే యగును. ఈ జ్ఞానము గల వ్యక్తిని నిర్దేశించుటకు ఇచట సర్వవిత్ అను పదము ఉపయోగించబడినది.

ముండకోపనిషత్తులో ఈశ్వరుడు సర్వజ్ఞః సర్వవిత్ అని వర్ణించబడినాడు. అయన ర్వమును సామాన్యాకారముగా తెలియును (సర్వం జానాతి సామాన్యేన) గనుక సర్వజ్ఞుడైనాడు. యనయే మాయోపాధికుడై సర్వమును వివరముగా తెలియును (సర్వం జానాతి విశేషేణ) నుక సర్వవిత్ అయినాడు. ఇచట సర్వజ్ఞత్వమనగా సాక్షిత్వము మాత్రమే. సర్వము యొక్క రూపసత్యము అగు ఆ పరమాత్మ సత్యమును మిథ్యను తెలియును. ఇందువలననే 'ఆ ఒక స్తువు తెలిసినచో, సర్వము తెలిసినట్లే (ఏకస్మిన్ విజ్ఞాతే సర్వం విజ్ఞాతం భవతి)' అని ఉపనిషత్తు చెప్పుచున్నది. ఇచట 'తెలిసినట్లే' అని చెప్పుటకు కారణము గలదు. ఒకటి తెలిసినచో, 'సర్వము తెలియును' అనుట పొసగదు. ఏలయన, సర్వముయొక్క వివరములు తెలియుట సంభవము గాదు. ఏ ఒక్క వస్తువునైనను పూర్ణముగా తెలియుట అసంభవము. ఉదాహరణకు ఒక ఆకును పరిశీలించుడు. దాని గురించి సర్వము మనకు తెలియదు. కావున, ఆ ఒక వస్తువు తెలిసినచో, సర్వము 'తెలిసినట్లే' అని చెప్పవలెను. దీని అభిప్రాయమేమనగా, ఒకే ఒక సత్యవస్తువు గలదు. దానికి దేనిని జోడించినను, అది నామరూపాత్మకమగు మిథ్య యగును. కావున, దానికి సత్యవస్తువుకంటె భిన్నముగా అస్తిత్వము లేదు. కావున, జ్ఞానికి ఆశ్చర్యమును కలిగించేది ఏదీ లేదు. జ్ఞానికి ఎవరైనను ఒక క్రొత్త వస్తువును చూపించినచో, నామరూపములు జతగూడిన సత్యమును మాత్రమే దర్శించును. దానిచే అయ్యన యందు గల ఈశ్వరవిభూతిదర్శనము మరింత మిక్కుటమగును. దానివలన జ్ఞానియొక్క పూర్ణత్వములో వృద్ధి కలిగే ప్రసక్తి లేదు. ఏ జ్ఞానముచే పూర్ణత్వము సిద్ధించునో, ఆ జ్ఞానమునకు సర్వజ్ఞత్వమని పేరు. ఈ జ్ఞానము గలవాడు సర్వవిత్.

సర్వజ్ఞ, సర్వవిత్ అను రెండు పదములను ప్రయోగించిన సందర్భములో సర్వవిత్ అనగా వివరములన్నింటిని తెలిసిన వాడు అని అర్థమును చెప్పవలెను. కాని ఇచట సర్వవిత్ అను పదము మాత్రమే ప్రయోగించబడుటచే, ఈ సందర్భమును బట్టి, సత్యమును మిథ్యను సామాన్యముగా తెలిసినవాడు అని మాత్రమే చెప్పవలెను. ఈ జ్ఞానము గలవాని (యః వేద) యందు భ్రాంతికి స్థానము లేదు (అసమ్మూఢః) గనుక, అతడు సంసారమునుండి విముక్తిని పొందును. సర్వత్ర ఈశ్వరుడు మాత్రమే గలడనియు, ఆ ఈశ్వరుడు ఆత్మకంటె భిన్నముగా లేడనియు అతడు తెలునుకున్నాడు.

ఈ జ్ఞానమునకు ఫలమేమి? అతడు నన్ను పొందును (మాం భజతి) అని భగవానుడు చెప్పుచున్నాడు. జీవుడు సర్వదా సర్వస్వరూపుడగు పురుషోత్తముడే గనుక, జ్ఞానము మరియు ప్రాప్తి ఒక్కటియే యగును. అతడు ఈశ్వరునితో అభేదమును ఎట్లు పొందును? తానే సర్వప్రాణుల ఆత్మననియు, తనకంటె భిన్నముగా ఏదీ లేదనియు అతడు తెలుసుకొని (సర్వభావేన) ఈశ్వరుని పొందును. క్షర-అక్షర-పురుషులు రెండు తానే గనుక, ఏదీ మిగుల లేదు. ఇదియే మోక్షము, జీవన్ముక్తి. అతడు మరణించినచో, ఏమగును? 'అతడు' అను మాటకు అర్థము లేదు. మరణించేది ఏది? ఏది మరణించాలో, అది మరణిస్తుంది. ఏది ఉన్నదో, అది ఉన్నది. ఆ ఉన్నదియే ఆత్మ. ఒక విశిష్ట-ఉపాధి మరణించును. కాని ఉన్న సత్యవస్తువు ఈశ్వరుడు మాత్రమే. ఆ ఈశ్వరుని సర్వులు పూజించెదరు. ఇట్టి జ్ఞాని జీవించియుండగా, అతనికి ఈశ్వరునకు భేదము లేదు గనుక, జనులు అతని వెంట పడెదరు.

ఈ శ్లోకములో జ్ఞానఫలము చెప్పబడినది. ఇపుడు భగవానుడు ఈ జ్ఞానమును స్తుతించి ఉపదేశమునంతనూ సింహావలోకన పురస్సరముగా ఉపసంహరించుచున్నాడు.

ఈశ్వరుని యథార్థస్వరూపమును బోధించే, మోక్షము ఫలముగాగల జ్ఞానము ఈ అధ్యాయములో చెప్పబడినది అని శ్రీశంకరులు ఈ శ్లోకమును ఉపక్రమించిరి. ఇపుడు భగవానుడు ఈ ఉపదేశమును స్తుతించుచున్నాడు.

**అధ్యాయము 15, శ్లోకము 20:**

इति गुह्यतमं शास्त्रमिदमुक्तं मयानघ ।
एतद्बुद्ध्वा बुद्धिमान् स्यात् कृतकृत्यश्च भारत ॥ २० ॥

తెలుసుకున్నవాడు సర్వమును తెలిసిన వాడగును (సర్వ విత్). పురుషోత్తముని తెలుసుకున్నచో, సర్వమును తెలియుట ఎట్లు? వానికి ఎలక్ట్రానిక్స్ గాని, లేదా ఫ్రెంచి భాషగాని తెలియునా? సర్వజ్ఞత్వము ద్వివిధముగా నున్నది. వివరములన్నింటినీ తెలిసినవాడు (సర్వవిత్త్వమ్); సత్యవస్తువుయొక్క సామాన్యజ్ఞానము గలవాడు (సర్వజ్ఞత్వమ్). ప్రధానముగా ఈ జగత్తులో ఒకే ఒక సత్యవస్తువు గలదు. అదియే పురుషోత్తముడు. ఆయనయే క్షరపురుషుడు, మరియు అక్షరపురుషుడు అయి సర్వజగద్రూపములో నున్నాడు. కావున, సత్యవస్తువు నెరింగినచో, మనకు మిథ్య కూడ అవగతమగును. వివరముల జ్ఞానముతో పని లేదు. ఏలయన, వివరములన్నియు నామరూపములు గనుక మిథ్య. సత్యవస్తువు ఒకే ఒకటి గలదు. అదియే పరిగణించదగినది. అది నీవే. సర్వముయొక్క ఆత్మ నేనే (అహం సర్వాత్మా) అని తెలిసినవాడు సామాన్యముగా సర్వమును తెలిసినవాడే యగును. ఈ జ్ఞానము గల వ్యక్తిని నిర్దేశించుటకు ఇచట సర్వవిత్ అను పదము ఉపయోగించబడినది.

ముండకోపనిషత్తులో ఈశ్వరుడు సర్వజ్ఞః సర్వవిత్ అని వర్ణించబడినాడు. ఆయన సర్వమును సామాన్యాకారముగా తెలియును (సర్వం జానాతి సామాన్యేన) గనుక సర్వజ్ఞుడైనాడు. ఆయనయే మాయోపాధికుడై సర్వమును వివరముగా తెలియును (సర్వం జానాతి విశేషేణ) గనుక సర్వవిత్ అయినాడు. ఇచట సర్వజ్ఞత్వమనగా సాక్షిత్వము మాత్రమే. సర్వము యొక్క స్వరూపసత్యము అగు ఆ పరమాత్మ సత్యమును మిథ్యను తెలియును. ఇందువలననే 'ఆ ఒక వస్తువు తెలిసినచో, సర్వము తెలిసినట్లే (ఏకస్మిన్ విజ్ఞాతే సర్వం విజ్ఞాతం భవతి)' అని ఉపనిషత్తు చెప్పుచున్నది. ఇచట 'తెలిసినట్లే' అని చెప్పుటకు కారణము గలదు. ఒకటి తెలిసినచో, 'సర్వము తెలియును' అనుట పొసగదు. ఏలయన, సర్వముయొక్క వివరములు తెలియుట సంభవము గాదు. ఏ ఒక్క వస్తువునైననూ పూర్ణముగా తెలియుట అసంభవము. ఉదాహరణకు ఒక ఆకును పరిశీలించుడు. దాని గురించి సర్వము మనకు తెలియదు. కావున, ఆ ఒక వస్తువు తెలిసినచో, సర్వము 'తెలిసినట్లే' అని చెప్పవలెను. దీని అభిప్రాయమేమనగా, ఒకే ఒక సత్యవస్తువు గలదు. దానికి దేనిని జోడించిననూ, అది నామరూపాత్మకమగు మిథ్య యగును. కావున, దానికి సత్యవస్తువుకంటె భిన్నముగా అస్తిత్వము లేదు. కావున, జ్ఞానికి ఆశ్చర్యమును కలిగించేది ఏదీ లేదు. జ్ఞానికి ఎవ్వరైననూ ఒక క్రొత్త వస్తువును చూపించినచో, నామరూపములు జతగూడిన సత్యమును మాత్రమే దర్శించును. దానిచే ఆయన యందు గల ఈశ్వరవిభూతిదర్శనము మరింత మిక్కుటమగును. దానివలన జ్ఞానియొక్క పూర్ణత్వములో వృద్ధి కలిగే ప్రసక్తి లేదు. ఏ జ్ఞానముచే పూర్ణత్వము సిద్ధించునో, ఆ జ్ఞానమునకు సర్వజ్ఞత్వమని పేరు. ఈ జ్ఞానము గలవాడు సర్వవిత్.

సర్వజ్ఞ, సర్వవిత్ అను రెండు పదములను ప్రయోగించిన సందర్భములో సర్వవిత్ అనగా వివరములన్నింటిని తెలిసిన వాడు అని అర్థమును చెప్పవలెను. కాని ఇచట సర్వవిత్ అను పదము మాత్రమే ప్రయోగించబడుటచే, ఈ సందర్భమును బట్టి, సత్యమును మిథ్యను సామాన్యముగా తెలిసినవాడు అని మాత్రమే చెప్పవలెను. ఈ జ్ఞానము గలవాని (యః వేద) యందు భ్రాంతికి స్థానము లేదు (అసమ్మూఢః) గనుక, అతడు సంసారమునుండి విముక్తిని పొందును. సర్వత్ర ఈశ్వరుడు మాత్రమే గలడనియు, ఆ ఈశ్వరుడు ఆత్మకంటె భిన్నముగా లేడనియు అతడు తెలుసుకున్నాడు.

ఈ జ్ఞానమునకు ఫలమేమి? అతడు నన్ను పొందును (మాం భజతి) అని భగవానుడు చెప్పుచున్నాడు. జీవుడు సర్వదా సర్వస్వరూపుడగు పురుషోత్తముడే గనుక, జ్ఞానము మరియు ప్రాప్తి ఒక్కటియే యగును. అతడు ఈశ్వరునితో అభేదమును ఎట్లు పొందును? తానే సర్వప్రాణుల ఆత్మననియు, తనకంటె భిన్నముగా ఏదీ లేదనియు అతడు తెలుసుకొని (సర్వభావేన) ఈశ్వరుని పొందును. క్షర-అక్షర-పురుషులు రెండు తానే గనుక, ఏదీ మిగుల లేదు. ఇదియే మోక్షము, జీవన్ముక్తి. అతడు మరణించినచో, ఏమగును? 'అతడు' అను మాటకు అర్థము లేదు. మరణించేది ఏది? ఏది మరణించాలో, అది మరణిస్తుంది. ఏది ఉన్నదో, అది ఉన్నది. ఆ ఉన్నదియే ఆత్మ. ఒక విశిష్ట-ఉపాధి మరణించును. కాని ఉన్న సత్యవస్తువు ఈశ్వరుడు మాత్రమే. ఆ ఈశ్వరుని సర్వులు పూజించెదరు. ఇట్టి జ్ఞాని జీవించియుండగా, అతనికి ఈశ్వరునకు భేదము లేదు గనుక, జనులు అతని వెంట పడెదరు.

ఈ శ్లోకములో జ్ఞానఫలము చెప్పబడినది. ఇపుడు భగవానుడు ఈ జ్ఞానమును స్తుతించి ఉపదేశమునంతనూ సింహావలోకన పురస్సరముగా ఉపసంహరించుచున్నాడు.

ఈశ్వరుని యథార్థస్వరూపమును బోధించే, మోక్షము ఫలముగాగల జ్ఞానము ఈ అధ్యాయములో చెప్పబడినది అని శ్రీశంకరులు ఈ శ్లోకమును ఉపక్రమించిరి. ఇపుడు భగవానుడు ఈ ఉపదేశమును స్తుతించుచున్నాడు.

**అధ్యాయము 15, శ్లోకము 20:**

इति गुह्यतमं शास्त्रमिदमुक्तं मयानघ।
एतद्बुद्ध्वा बुद्धिमान् स्यात् कृतकृत्यश्च भारत ॥ २० ॥

ఇతి గుహ్యతమం శాస్త్రమిదముక్తం మయానఘ
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత (20)

అనఘ = పాపమునెరుంగని ఓ అర్జునా!, ఇతి = ఈ విధముగా, ఇదమ్ = ఈ, గుహ్యతమమ్ = అతిగంభీరమైన, శాస్త్రమ్ = శాస్త్రము, మయా = నాచేత, ఉక్తమ్ = చెప్పబడినది, భారత = భరతవంశములో పుట్టిన ఓ అర్జునా!, ఏతత్ = దీనిని, బుద్ధ్వా = తెలుసుకొని, బుద్ధిమాన్ = బుద్ధిమంతుడు, చ = మరియు, కృతకృత్యః = సర్వకర్తవ్యముల ననుష్ఠించినవాడు, స్యాత్ = అగును.

పాపమునెరుంగని ఓ అర్జునా! నేనీ తీరున ఈ అతి గంభీరమగు శాస్త్రమును చెప్పియుంటిని. భరతవంశములో పుట్టిన ఓ అర్జునా! దీనిని తెలుసుకున్నవాడు బుద్ధిమంతుడు మరియు సర్వ కర్తవ్యముల ననుష్ఠించినవాడు అగును (20).

నేను చేసిన ఈ ఉపదేశము (ఇదం శాస్త్రం ఉక్తం మయా) గొప్ప రహస్యమని (గుహ్యతమమ్) భగవానుడు చెప్పుచున్నాడు. రహస్యములలో కొన్ని రకములు గలవు. ఇంతవరకు నాకు తెలియని విషయము రహస్యమనబడును. ఇటువంటి రహస్యములను బాతాఖానీ రచనలను ప్రమురించే పత్రికల (gossip columns) లో చదువవచ్చును. మరియొక రకము సమాచారము గలదు. దానిని తెలుసుకొనే అవకాశమే లేకపోవుటచే అది రహస్యముగా మిగిలి పోవును. దానిని సరియగు పద్ధతిలో బోధించనంతవరకు అది తెలిసే మార్గము లేదు. యోగ్యము మరియు పర్యాప్తము (adequate) అగు జ్ఞానసాధనము లేకపోవుటచే అది రహస్యముగా మిగిలియుండును. ఇక మూడవ రకము రహస్యము గలదు. దానిని గురించి వివరించి చెప్పినను అర్థము కాని కారణముచే అది రహస్యముగనే మిగిలియుండును. 5+4 అను కూడికతో కుస్తీ పడుతున్న వ్యక్తి యెదుట గణితశాస్త్రాచార్యుడు తన పాండిత్యమును ప్రదర్శిస్తూ గణితసిద్ధాంతములను ఏకరవు పెట్టినను, అవి వానికి రహస్యములుగనే ఉండును. నాల్గవ రకము రహస్యము గలదు. దానిని తెలియుటలో కష్టమేమియు లేకున్నను, అది దాచియుంచ బడును. విలువైన రత్నము దీనికి దృష్టాంతము. పది లక్షల రూపాయల విలువ చేసే వజ్రమును జేబురుమాలులో గాని, ఎదురుగా బల్లపై గాని పెట్టరు గదా! కోహినూర్ అను పెద్ద వజ్రము ఒకటి బ్రిటిషు రాణి కిరీటములో నుండెడిది. ఇట్టి వజ్రమును కాగితములు ఎగిరి పోకుండా రక్షించే బరువుగా వాడరు. అది చాల

విలువైనది గనుక, దానిని దాచిపెట్టెదరు. అట్లు వినియోగించబడే పక్షములో దాని యజమాని వజ్రముల పర్వతమునకు అధిపతి గాని, లేదా మూర్ఖుడు గాని అయి ఉండవలెను. అతిపవిత్రము, అత్యధికమగు విలువ గలది, లేదా అధికమగు ప్రేమానుబంధము (sentiment) నకు ఆస్పదమైనది అగు వస్తువును జనులు చాల భద్రముగా దాచి పెట్టెదరు. తాతముత్తాతల కాలమునుండి పరంపరగా వచ్చుచున్న రాగి ఉంగరమునందు గొప్ప ప్రేమానుబంధము ఉండుటచే, దానికి ఒకని దృష్టిలో అధికమగు విలువ గలదు. అంగడిలో దాని విలువ ఒక రూపాయి ఉండకపోవచ్చును. కాని, దానిని అతడు ఇనుప పెట్టెలో దాచి పెట్టును. సాలగ్రామశిల మొదలగు వస్తువులకు వాటి పవిత్రతను బట్టి విలువ కలుగును. సాలగ్రామమనగా నదీగర్భమునుండి సేకరించబడే సామాన్యమగు రాయి. కాని దానిని ఆరాధించువాని దృష్టిలో దానికి అతిశయించిన పవిత్రత గలదు. దానిని స్పృశించే అర్హత ఎదుటివానికి గలదనే నమ్మకము కలుగనంతవరకు అతడు దానిని ఇతరులు స్పృశించుటకు అనుమతించడు. కావున, అది పరమపవిత్రమగుటచే, రహస్యముగా దాచిపెట్టబడును. ఈ విధముగా వీటికి గల విలువను బట్టి అవి రహస్యములైనవి.

ఈ పురుషోత్తముడెవరు? సర్వస్వము ఆయనయే. పురుషోత్తముని యాథార్థ్య జ్ఞానము ముక్తిదాయకమగుటచే, దానిని మించి పవిత్రమైనది మరియొకటి లేదు. పురుషోత్తముని తెలుసుకున్నవాడు సర్వాత్మభావమును పొందును గనుక, ఆ జ్ఞానము కంటె ఎక్కువ విలువ గలది మరియొకటి లేదు. ఈ జ్ఞానము మానవుని అభద్రత, భయము, దుఃఖము మరియు అల్పత్వములనుండి విముక్తుని జేయును. విలువైన వస్తువులన్నింటియొక్క ప్రయోజనము మానవునకు ఉల్లాసమును కలిగించుటయే గదా! కాని ఈ పురుషోత్తముడు సర్వ-ఉల్లాసములకు, సర్వ-అద్భుతములకు, సర్వ-ఆనందమునకు మరియు రక్షణకు నిధానమైయున్నాడు. అంతకంటె విలువైనది మరియొకటి లేదు. వాస్తవములో విలువైనది మరియొకటి లేనే లేదు. సర్వాల ఆనందము ఈ ఆనందములో ఒక లేశము మాత్రమే. కావున, దీనికి పరిపూర్ణమగు విలువ గలదు. దీని పవిత్రత కూడ పరిపూర్ణమైనదియే. ఈ సంసారములో శుద్ధిని కలిగించు వస్తువులు అనేకములు గలవు. కాని, ఇది మానవుని అజ్ఞానమును తొలగించి విశుద్ధుని జేయును. కావున, ఈ జగత్తులో ఈ జ్ఞానముకంటె అధికపవిత్రమైనది మరియొకటి లేదు (న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే). మరియు, ఇది మంగళములన్నింటికీ మంగళమైనది. సర్వమంగళములు ఆత్మ (నేను) నుండియే ఉద్భవించును. ఆ ఆత్మయే పురుషోత్తముడు. ఆత్మ యాథార్థ్యజ్ఞానమును కలిగించుటకు ఉపనిషత్తులు (శాస్త్రము) తక్క మరియొక ప్రమాణము లేదు. గీతలోని విషయవస్తువు కూడ అదియే గనుక, దానికి ఉపనిషత్తులతో సమమగు మాన్యత గలదు. పైగా,

ఉపనిషత్తులు, గీత ఒకే భగవానుని నుండి ఉదయించినవి. శ్రద్ధగల సాధకుని దృష్టిలో గీతకు శ్రుతితో సమమగు పవిత్రత గలదు. ఉపనిషత్తు ఈశ్వరుని నుండి పుట్టినది. అనగా అది మానవునిచే నిర్మించబడినది గాదు. గీతను శ్రీకృష్ణుడు ఉపదేశించినాడు. శ్రద్ధాళుని దృష్టిలో శ్రీకృష్ణుడు ఈశ్వరుడే గనుక, గీత కూడ ఉపనిషత్తు అగును. శ్రీకృష్ణుడు వ్యాసుని సృష్టి యన్నచో, గీత శ్రుతి గాక స్మృతి యగును. కాని అప్పుడైననూ ఉపనిషత్తునందలి విషయవస్తువు శ్రీకృష్ణుని ముఖము ద్వారా మిక్కిలి యుక్తియుక్తముగా ప్రతిపాదింప బడుటచే, గీత కూడ ఉపనిషత్తు యగును. అందువలననే ప్రతి అధ్యాయాంతములో ఉపనిషత్తులు అగు భగవద్గీతలలో (భగవద్గీతాసు ఉపనిషత్సు) అని పఠించబడును.

ఈ జ్ఞానమునకు ఈ శాస్త్రము, అనగా శ్రుతి మాత్రమే ఏకైక ప్రమాణము అగుటచే, ఇది ఇతరప్రమాణలభ్యము కానిదై రహస్యమగుచున్నది. నేను పురుషోత్తముడనని ఎట్లు తెలియవలెను? ఇది ఊహకు కూడ అందని విషయము. అది శాస్త్రముచే మాత్రమే ప్రకాశింప చేయబడుటచే రహస్యము (గుహ్యః). అది పవిత్రమగుటచే గుహ్యము. అది విలువైనదగుటచే గుహ్యము. మరియొక విషయము గలదు. 5 కి 4 కలిపితే 9 యా? లేక 11 యా? అను సందేహము గలవానికి కలనగణితమును బోధించినట్లు, కొందరికి దీనిని బోధించిననూ రహస్యముగనే మిగిలియుండును. అట్టివానికి ఉదయము మూడు గంటలు, సాయంకాలము మూడు గంటలు కలనగణితమును బోధించిననూ, అతనికి అది రహస్యముగనే మిగిలియుండును. దీని యర్థము అతడు అసమర్థుడని కాదు. అతడు ఆ జ్ఞానమునకు సంసిద్ధుడు కాకపోవుటచే, అది రహస్యముగనే యుండును.

ఈ లోకములో అనేక రహస్యములు గలవు. కాని పవిత్రత, స్వరూపము మరియు విలువ అను అంశములన్నిటియందు రహస్యమైనది ఇట్టిది మరియొకటి లేదు. కావున, ఇది రహస్యములలో కెల్లా రహస్యము (గుహ్యతమమ్). అతి భద్రముగా దాచబడి ఏ విధముగనైననూ ఊహించుటకు శక్యము కానిది గుహ్యతమము అగును. ప్రపంచములోని అతివిలువైన వస్తువుమ దాచదగిన అత్యంతరహస్యస్థానము ఏది? దానికొరకు వెదకువాడు మాత్రమే. ఇచట మనము 'ఇదియే' అని పట్టుకొనుట, కాని విశ్లేషణచే కాదని దానిని నిషేధించుట అను ప్రక్రియ ద్వారా కొంతకాలమునకు ఆ రహస్యము చేజిక్కును. మానవుడు తన జీవితములో అన్వేషించే భగవానుడు దాగి యుండ గలిగే అత్యుత్తమరహస్యస్థానము ఆ మానవుడే. సర్వత్రా వెదకుచున్న అన్వేషకుడే స్వయముగా వెదకబడే రహస్యమై ఉన్నాడు. ఇందువలననే శ్రుతి అన్వేషకులమగు

మనలను ఆపి, అన్వేషించబడే వస్తువు నీవే అని చెప్పుచున్నది. శ్రుతి అట్లు చెప్పనిచో, మనము శాశ్వతకాలము అన్వేషిస్తూనే ఉండెదము. అన్వేషించబడే తత్త్వము అన్వేషకునిలోననే యున్నది గనుక, మనము లోపల వెదికినా, బయట వెదికినా అది దాగియే యుండును. సాధకుని కంటె భిన్నముగా పురుషోత్తముడు లేడు. అన్వేషించు ప్రమాతయే అన్వేషించ బడుచున్నాడు. మోక్షమును కోరువాడే (ముముక్షుః) స్వయముగా మోక్షస్వరూపుడై యున్నాడు. ఇది గమనించదగిన పరిస్థితి. వెదుకబడుచున్న మోక్షము దొరికేవరకు ముముక్షువు అన్వేషణను ఆపలేడు. కాని, అతడు అన్వేషిస్తున్నంతవరకు దానిని కనుగొనలేడు. ఇది ఎంతటి నిస్సహాయస్థితియో స్పష్టమగుచునే యున్నది. ఇందువలననే, ఈ అన్వేషణను కట్టిబెట్టుమనియు, వెదకబడేది నీవేననియు బయటనుండి మనకు చెప్పి, దర్శింపజేయు జ్ఞానము మనకు కావలెను. ఈ జ్ఞానము మరియొక ప్రమాతనుండి ఉదయించలేదు. నన్ను అన్వేషకునిగా నిలబెట్టిన ఈ అజ్ఞానమును పోగొట్టగలిగే జ్ఞానవృత్తిని కలిగింప సమర్థమైన జ్ఞానసాధనము (ప్రమాణమ్) బయటనుండి వచ్చి నన్ను ఉద్ధరించవలెను. ఆ ప్రమాణము ప్రమాతయొక్క సంకల్పశక్తిపై ఆధారపడకుండగా, అది తన పనిని చేయును. నీకు ఇష్టము ఉన్నా, లేకపోయినా, అది తన పనిని చేయును. కావున, ఈ జ్ఞానము గుహ్యతమము.

శ్రీ శంకరులు గుహ్యతమమ్ అనగా గోప్యతమమ్, అనగా అతిపవిత్రమైనది అని సరళముగా వ్యాఖ్యానించి ముందుకు సాగిరి. అత్యంతపవిత్రము, రహస్యమునగు ఈ శాస్త్రము ఇచట స్తుతింపబడుచున్నది. సంపూర్ణమగు గీతకు శాస్త్రమనే వ్యవహారము ఉన్ననూ, భగవానుడిచట ఈ అధ్యాయమును గుహ్యతమం శాస్త్రమ్ అని నిర్దేశించి, స్తుతించినాడు. ఈ అధ్యాయమునకు అంతటి ప్రాముఖ్యమేల? ఈ అధ్యాయములో సమస్తగీతాసారము మాత్రమే గాక, సమస్తవేదవిజ్ఞానము సమగ్రముగా మరియు సంగ్రహముగా ప్రతిపాదించబడినదని శ్రీశంకరులు వ్యాఖ్యానించిరి. దీనిలో ఈశ్వరుడు మరియు యోగము వర్ణించబడినవి. నిర్మానమోహా జితసంగదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః అను శ్లోకములో ఈ జ్ఞానమునకు కావలసిన అర్హతలు వర్ణించబడినవి. ఇంతేగాక, సంసారము, దాని ఆధారము, అది పని చేయు తీరుతెన్నులు, మరియు అది స్థిరముగా కొనసాగే విధము కూడ ఇచట వర్ణించబడినవి. సూక్ష్మదేహము ఒక లోకమునుండి మరియొక లోకమునకు పయనించు విధము, మూర్ఖుల అజ్ఞానాంధత్వము (మూఢా నానుపశ్యంతి), జ్ఞాననేత్రము గలవారు చూడగల్గుట (పశ్యంతి జ్ఞానచక్షుషః), ఈ సంసారవృక్షమును నరుకదగిన విధము (అసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా) ఇత్యాది సర్వము వివరించబడినది. ఇంతేగాక, ఆత్మయే సర్వము (సర్వాత్మత్వము) అను

విషయము ప్రతిపాదించ బడినది. సూర్య-చంద్ర-అగ్నులలోని ప్రకాశము నేనే; వృక్షలతాదులను నేను పోషకపదార్థములతో మరియు అన్నరసముతో నింపి అనుగ్రహించుచున్నాను (పుష్ణామి చౌషధీస్సర్వాః); అన్నమును భుజించువాడను నేనే (అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః, ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్) అని భగవానుడీ అధ్యాయములో ప్రతిపాదించినాడు. ఇంతేగాక, అన్నరసభరితమగు ఈ స్థూలదేహము, సూక్ష్మదేహము కూడ నేనేనని భగవానుడీ అధ్యాయములో చెప్పియున్నాడు. అందువలననే, స్మృతి, జ్ఞానము, విస్మృతి (స్మృతిర్ జ్ఞానమపోహనం చ), మరియు సర్వేంద్రియములు నా అనుగ్రహమే. మరో మాటలో చెప్పాలంటే, వినాశి-అవినాశి-పురుషులు ఇద్దరు (క్షరః చ అక్షరః ఏవ చ) నేనే; సర్వము తానే అయి, సర్వమును తెలుసుకొనే ఉత్తమపురుషుడను నేనే. సర్వవేదములలో తెలియ దగిన వాడను నేనే (వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః). ఇంతకు మించి ఏదీ లేదు. ఇదియే గీతాశాస్త్రము; సర్వవేదసారమిదియే. ఈ సర్వము ఈ అధ్యాయములో సంగ్రహించ బడినది. దీనిని తెలిసినవాడు వేదవేత్త (యస్తం వేద స వేదవిత్) అని ప్రథమ శ్లోకములో మనము చూచియున్నాము. అట్టివాడు సంసారవృక్షమును దాని మూలమగు బ్రహ్మతో సహా తెలియగల్గును. సర్వశాస్త్రార్థము ఇచట ప్రతిపాదింప బడుటచే, ఈ ఒక్క అధ్యాయమును శాస్త్రమని వర్ణించదగును.

ఇందువలననే భగవానుడు అర్జునునితో 'నేనీ శాస్త్రమును నీకు బోధించితిని (శాస్త్రం ఇదం ఉక్తం మయా)' అని చెప్పి ఉపసంహరించెను. ఇచట శ్రీకృష్ణుడు అర్జునుని 'అనఘ (పాపము లేని వాడా)!' అని సంబోధించెను. అఘమనగా పాపము. పాపము లేనివాడు అనఘుడనబడును. ఈ శాస్త్రముయొక్క అర్థమును ఉపదేశించిన తీరున తెలుసుకొని (ఏతత్ బుద్ధ్వా) మానవుడు బుద్ధిమంతుడగును. కలవాడు అని అర్థములో మత్ అను ప్రత్యయము వచ్చును. కావున, బుద్ధి గలవాడు బుద్ధిమంతుడగును. సర్వమానవులయందు బుద్ధి గలదు. అట్టి స్థితిలో, ఈ జ్ఞానమును పొందిన వాడు మాత్రమే బుద్ధిమంతుడనుట ఎట్లు? తనకొరకు మరియు ఇతరులకొరకు కూడ ఖర్చు పెట్టగలిగేటంతటి ధనము గల వ్యక్తి మాత్రమే ధనవాన్ అనబడును. ఒకని వద్ద చాల ధనము ఉండియు ఖర్చు పెట్టనిచో, అతడు ధనవంతుడు కాడు; ధని మాత్రమే అగును. వ్యక్తికి బ్యాంకులో గల ధనమును బట్టి, అతనికి గల స్థిరాస్తిని బట్టి అతడు ధని అను విషయము నిర్ణీతమగును. కాని ధనవంతుడగుట హృదయమునకు సంబంధించిన విషయము. ఒక వ్యక్తి వద్ద రెండు రూపాయలు ఉండి, వాటిలో ఒక రూపాయను బీదవానికి ఇచ్చి, మిగిలిన రూపాయమ స్వంతమునకు ఖర్చు పెట్టుకొని కాలక్షేపమును చేసినచో, అతడు ధనవంతుడే.

అతడు దానము చేసిన ఆ రూపాయి అతని భావాత్మక సంపదకు జతగూడును. అదే విధముగా మానవుడు బుద్ధి ఉన్నంతమాత్రాన, దానిని వినియోగించనిచో, బుద్ధిమంతుడు కాబోడు. మస్తిష్కములోని శుష్క ప్రజ్ఞ బుద్ధి కాదు. బుద్ధి యనగా వివేకశక్తి. జీవన విధానమంతయు పూర్వమే నిర్ణీతమై యుండుటచే, గోవునకు వివేకశక్తితో పని లేదు. అది పర్యాలోచనతో సంబంధము లేకుండగా పూర్వనిర్ణీతపద్ధతిలో జీవించుచుండును. కాని, మానవునకు తాను చేసే పనులలో అధికమగు స్వేచ్ఛ గలదు. కావున, మానవుడు వివేకశక్తిని వినియోగించి యోగ్యమగు కర్మను ఎన్నుకొనవలెను. ఏది కర్తవ్యము? ఏది కర్తవ్యము కాదు? అను విషయములో వివేకమును ప్రదర్శించు వ్యక్తి బుద్ధిమంతుడనబడును. మానవుని జీవితలక్ష్యమేమి? అను విషయములో స్పష్టమగు కల్పన (పురుషార్థవివేకము) ఇట్టి వ్యక్తి యందుండును. తద్వారా అతడు ఏది వాస్తవము? ఏది వాస్తవము కాదు? అను జ్ఞానము (నిత్య-అనిత్య-వివేకము లేక ఆత్మ-అనాత్మ-వివేకము) ను పొందును. ఇవి అన్నియు గలవాడు బుద్ధిమంతుడు. ఆత్మ-అనాత్మ-వివేకము గల మనిషిలో బుద్ధి తన పనిని తాను చేసినది. రోడ్డు ప్రమాదములో స్మృతిని గోల్పోవుటచే సత్యం-జ్ఞానం-అనంతం-బ్రహ్మను మరచిన వ్యక్తియైననూ అజ్ఞానవిముక్తుడుగనే యుండును. అతనికైననూ పునర్జన్మ లేదు. జ్ఞానోదయముచే అతని కర్మలన్నియు నశించినవి. అతని యందు కర్తృత్వభావన లేదు. అతనియందు ఉత్సాహము, శక్తి ఉన్నచో, ఇతరులకు జ్ఞానబోధ చేయును. అట్లు గాక, అతని శక్తులన్నియు ఉడిగిపోయి, ఇంద్రియములన్నియు నిష్క్రియములైనచో ప్రారబ్ధకర్మ క్షయమగువరకు అటులనే ఉండి తరువాత మరణించును. ఏ విధముగనైననూ అతడు బుద్ధిమంతుడే. బుద్ధి తన పనిని తాను చేసినది. ఆ పైన అంతా ఈశ్వరకృప. మనస్సు, దేహము వాటి వాటి ప్రత్యేకలక్షణములతో కొనసాగుతూ, వాటి పనులను అవి చేయుచుండును. అతడు ముక్తుడు. ఇట్టి వ్యక్తి బుద్ధిమంతుడనబడును.

అపుడా వ్యక్తి కృతకృత్యుడగును. అనగా, అతని కర్తవ్యములన్నియు పూర్తియైనవి. ఒక బ్రాహ్మణోత్తముడు ఎంతవరకు చేయగలడో, అంతవరకు అతడు చేసినట్లే నని శ్రీశంకరులు వ్యాఖ్యానించిరి. జీవితములో అతడు ఏ స్థానములో నున్ననూ, బ్రాహ్మణకుటుంబములో జన్మించిన వ్యక్తికి విధించబడిన కర్మలనన్నిటినీ అతడు చేసినట్లే యగును. ఆత్మకు జన్మ లేదు గనుక, అతడు ఏ కుటుంబములో జన్మించినాడనే ప్రశ్న అర్థరహితము. ఇది సంతానము లేని తల్లియొక్క పుత్రుని వయస్సు ఎంత యని ప్రశ్నించినట్లుండును. ఈతడు తన సంకల్పశక్తిని, వివేకశక్తిని వినియోగించి ఆత్మజ్ఞానము బడసిన బుద్ధిమంతుడు గనుక, అతడు కర్మలనన్నిటినీ

చేసినట్లే యగును. అవి వాటి పనిని పూర్తి చేసి రద్దు (బాధితాః) అయినవి. దీనికి ఒక దృష్టాంతము గలదు. శవదహనము పూర్తి యగువరకు కట్టెలను చితిలోనికి త్రోయుటకు ఉపయోగించే కర్రను ఆ పని కాగానే ఆ చితిలో పారవేసెదరు. అదే విధముగా, సాధన సిద్ధించి జ్ఞానము ఉదయించు సరికి సంకల్పశక్తి తన పనిని తాను నిర్వర్తించి కృతార్థమైనది. ఆ పైన ప్రారబ్ధము అతని జీవితమును తన వశములోనికి తీసుకొనును. జరగవలసినది జరుగుతూ ఉంటుంది (భవతవ్యం భవతి ఏవ). జ్ఞాని విషయములో మాత్రమే కేవలప్రారబ్ధము గలదు. ఇతరులందరు పురుషార్థముచే నియంత్రించ బడెదరు. వారి జీవితములో పురుషార్థ ప్రారబ్ధములు కలగాపులగముగా నుండుటచే, వాటిని విడదీయుట అసంభవము. కష్టకాలములో ఈ ప్రారబ్ధమనే భావన దెబ్బను కాచుకొని నిలబడుటలో (shock-absorber) సహకరించును. ప్రారబ్ధభావన అనుకూల పరిస్థితులలో వివేకమును కాపాడును. జ్ఞాననిష్ఠాపరులకు ప్రారబ్ధముతో ఇంతకు మించి ప్రయోజనము లేదు. కావున, సంకల్పశక్తి (will) జ్ఞానమనే అగ్నిలో జీవుడు దహించబడినపుడు పైన చెప్పిన కర్రయొక్క పాత్రను నిర్వహించి జీవునితో బాటు తాను కూడ నశించును. ఇది సిద్ధించిన వ్యక్తి కృతకృత్యుడనబడును.

సర్వకర్తవ్యములను సమగ్రముగా నిర్వర్తించుట అనే స్థితి ఈ జ్ఞానము ద్వారా తప్ప మరియొక విధముగా సిద్ధించేది కాదని శ్రీశంకరులు వివరించిరి. నాల్గవ అధ్యాయములో, 'ఓ పార్థా! కర్మలన్నియు జ్ఞానములో పర్యవసానమును చెందును (సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే)' అను వాక్యము ఇదే అభిప్రాయమును ప్రకటించుచున్నది. ఇచట శ్రీశంకరులు మనుస్మృతిని ఉదాహరించిరి: బ్రాహ్మణునకు (ముముక్షుః) జీవితప్రయోజనము, జన్మసాఫల్యము ఈ జ్ఞానము మాత్రమే. దీనిని పొంది ద్విజుడు కృతార్థుడగును. మరియొక మార్గము లేదు. (ఏతద్ హి జన్మసామగ్ర్యం/సాఫల్యం బ్రాహ్మణస్య విశేషతః, ప్రాప్యైతత్ కృతకృత్యో హి ద్విజో భవతి నాన్యథః). శ్రీ కృష్ణుడు ఇంకనూ ఇట్లు చెప్పినాడు : 'ఓ భారతా! నీవీ చరమసత్యము (పరమార్థతత్త్వము)ను నా నుండి వినుటచే కృతార్థుడవైనావు'. భారత అను శబ్దమునకు భరతుని వంశములో జన్మించినవాడు, బ్రహ్మ విద్యయందు రమించువాడు అనే రెండు అర్థములు గలవు. భగవానుడు అనఘ మరియు భారత అనే అత్యంత సముచితమగు సంబోధనలతో పిలిచి అర్జునుని స్తుతించుచున్నాడు.

పురుషోత్తమయోగమనబడే ఈ 15 వ అధ్యాయము ముగిసినది. ప్రతి అధ్యాయాంతమునందు వలెనే, ఇచట కూడ యోగశబ్దము విషయవస్తువు అనే అర్థములో

ప్రయోగించబడినది. వినాశియగు జగద్రూపము (క్షరః)లో, అవికారియగు అక్షరరూపములో నుండియూ, క్షర-అక్షరములకు అతీతుడైన పరమపురుషుడు ఈ అధ్యాయములోని విషయవస్తువు. ఆ భగవానుడు ముల్లోకములను ప్రవేశించి, తాను ఎట్టి వికారములను పొందకుండగనే, వాటిని పాలించి పోషించుచున్నాడు (యో లోకత్రయమావిశ్య బిభర్తి అవ్యయ ఈశ్వరః). ఇది ఈ అధ్యాయములోని విషయవస్తువు.

# పదునారవ అధ్యాయము

## దైవాసుర సంపద్విభాగయోగము

సంమోహమును కలిగించే స్వభావమునకు దృఢముగా అలవాటు పడిన వారిని గురించి వర్ణించే శ్లోకమును మనము 9వ అధ్యాయములో చూచి యున్నాము:

మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః
రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః (9-12)

వీరు తప్పుడు ఆశలు గలవారై (మోఘాశాః), అయోగ్యమగు కర్మలనాచరించుచూ (మోఘకర్మాణః), భ్రాంతిపూర్వకమగు జ్ఞానము గలవారై (మోఘజ్ఞానాః), పూర్తిగా వివేకహీనులై (విచేతసః) ఉందురు. వీరి స్వభావము (ప్రకృతి) అసురము, లేదా రాక్షసమనబడును. దీనికి భిన్నముగా దైవీ (ఆధ్యాత్మిక) స్వభావమునకు అంకితమై జీవించువారిని దాని తరువాతి శ్లోకము వివరించినది:

మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః
భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్ (9-13)

పరిపక్వమైన మనస్సు గల ఆ సాధకులు సర్వము యొక్క స్వరూపసత్యమగు నన్ను తెలియగోరెదరని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. ఈ మూడు రకముల ప్రకృతులు ఇచట మరింత వివరముగా వర్ణించబడుచున్నవి. 9వ అధ్యాయములో క్లుప్తముగా చెప్పబడిన దైవీ, రాక్షసీ, మరియు అసురీ ప్రకృతులను గుర్తు చేసి శ్రీశంకరులు అధ్యాయమును ఉపక్రమించినారు. రాక్షసీ, అసురీ ప్రకృతులు దైవీ ప్రకృతికి విరోధులు అని మాత్రమే ఇచట చెప్పి, వాటి నిర్వచనమును మనము ప్రస్తుతానికి వాయిదా వేయుచున్నాము. వీటిని విస్తారముగా ప్రతిపాదించుటకై ఈ అధ్యాయము ఆరంభమగు చున్నది.

దైవీ ప్రకృతి మానవుడు సంసారవిముక్తిని పొందుటలో సహకరించుటకై ఉద్దేశించబడినది. దీనికి భిన్నముగా, రాక్షసీ-అసురీ ప్రకృతులు మానవుని సంసారములో బంధించును. మనస్సులో దైవీప్రకృతిని ప్రోది చేసుకొనుటకై మానవుడు కొన్ని విశిష్ట జీవనవిలువలను

అలవరచుకొనవలెను. అట్టి సద్గుణములు ఇచట నిరూపించబడుచున్నవి. ఆసురీ, రాక్షసీ ప్రకృతుల లక్షణములు, వాటి వలన కలిగే దుష్పరిణామములు కూడ వాటిని పరిహరించుట కొరకై ఇచట వర్ణించబడుచున్నవి.

ఈ రెండు రకముల ప్రకృతులు అత్యంతసహజసిద్ధములా యనిపించును. ముదిరిపోయిన నేరగాడు కూడ కొన్ని విశిష్టపరిస్థితులలో దయ, స్నేహము, ప్రేమలను కలిగియుండును. వీటికి ప్రతిద్వంద్వియగు గుణములు కూడ సహజములే యున్నట్లు కానవచ్చినను, అవి ఆత్మ స్వరూపమునకు విరుద్ధములగుటచే సహజసిద్ధములు కావు. ముందుగా జీవనమూల్యములను అవగాహన చేసుకొని, జాగరూకతతో వాటిని అలవరచుకున్నవానికి ఈ దుర్గుణములలోని అసహజత్వము కొట్టవచ్చినట్లు కానవచ్చును. కావున, వ్యక్తి వీటిని అవగాహన చేసుకొని, దానికి అనురూపముగా కొత్త జీవనమూల్యములను తనలో పెంచి పోషించుకొని, పాత ధోరణులకు చెందిన దృఢమైన అలవాట్లకు స్వస్తి చెప్పవలెను. ఈ ప్రక్రియలో మనకు సహకరించుటకై ఈ 16 వ అధ్యాయము ఉద్దేశించబడినది.

ఎవరినుండి నిన్ను నీవు రక్షించుకొనుట అవసరమగునో, వాడు రాక్షసుడనబడును. వానికి గల జీవనమూల్యసంరచన ఎట్టిదనగా, వాని ప్రవర్తన ఇతరుల క్షేమమునకు భంగకారి యగును. కావున, ఇట్టి వాని బారి నుండి తప్పించుకొనబూనుట సహజమే గదా!

భోగవస్తువులలో మాత్రమే రసాస్వాదన గలవాడు అసురుడనబడును (అసుషు ప్రాణేషు ఇంద్రియేషు రమతే). అట్టివానియందు యథార్థమగు సౌందర్య-ఆస్వాదన కాని, గంభీరవిషయములయందు అభిరుచి గాని ఉండవు. దీని పరిణామమేమనగా అతడు తన కాలమును, శక్తిని కేవలము అపవ్యయము చేయుచుండును. పైగా, అతనికి తన లక్ష్యసాధనయే ప్రధానము గనుక, అవసరమైతే సాధనల విషయములో రాజీ పడుటకు వెనుకాడడు. పదవి, పేరుప్రతిష్ఠలు, ఇంద్రియభోగములు ఇత్యాదులు అతనికి అత్యంత ప్రముఖములగుటచే, వాటిని సంపాదించే ప్రక్రియలో భాగముగా ఇతరులకు హానిని కలిగించుటలో అతడు ఇబ్బంది పడడు. ఇట్టివాడు రూపాయకు పదహారు అణాలు అసురుడు. ఇట్టివారు ఆలోచించే ధోరణి, వీరి జీవనమూల్యసంరచన అసురప్రకృతి యొక్క లక్షణములగును.

మానవుడు దైవీసంపదను పెంపొందించుకొనుటలో సహకరించుటకై ఈ అధ్యాయము ఉద్దేశించబడినది. ఇచట తనను తాను అభిశంసించుకొనుట కొరకు గాని, లేదా ఇతరులపై తీర్పు

చెప్పుటకొరకు గాని జీవన మూల్యములు నిరూపించబడుటలేదు. వీటి ప్రయోజనమేమనగా, సాధకుడు వీటిని సమగ్రముగా తెలుసుకోవాలి. వీటి అవగాహన వాని స్వరూపములో భాగము కావాలి. ఆ పైన ఈ జీవనమూల్యసంరచన యొక్క అవగాహనకు విరుద్ధమైన ప్రవణత (tendency) తనలో ఉన్నచో, దానిని ఈ అవగాహనకు అనుగుణముగా సరిదిద్దుకోవాలి. జీవనమూల్యములను పూర్ణముగా తెలుసుకోవాలే గాని, వాటిని ఆదర్శములుగా నిలబెట్టరాదు. పాత అలవాట్లు పట్టుకొని వ్రేలాడుచున్నంతవరకు మాత్రమే వీటికి అనురూపముగా జీవించే ప్రయత్నము అవశ్యకమగును. మనకు అనుకూలమైన మార్గమును మనమెన్నటికీ అనుసరించరాదని దీని అభిప్రాయము కాదు. ఒక విశిష్టమార్గము మన అవగాహనకు విరుద్ధము కానంతవరకు మనము స్వేచ్ఛగా దానిని అనుసరించవచ్చును. కాని మార్గమునెన్నుకొనుటలో వ్యక్తిగతసౌకర్యము ప్రధానాంశము కారాదు. ఒక కర్మ మనకు అనుకూలమైననూ, అది కొన్ని విశిష్టజీవనమూల్యములకు విరుద్ధముగా నున్నచో, మనము దానిని విడనాడి, కర్తవ్యకర్మను మాత్రమే ఆచరించవలెను. ఇది ఒక అనుశాసనము.

మనము పెంపొందించు కొనదగిన ఈ జీవనమూల్యములను భగవానుడు తరువాతి మూడు శ్లోకములలో చెప్పుచున్నాడు. భవంతి అను క్రియాపదము మూడవ శ్లోకములో మాత్రమే నుండుటచే, ఈ మూడు శ్లోకములను కలిపి అన్వయించవలెను.

**అధ్యాయము 16, శ్లోకము 1:**

श्री भगवानुवाच ।
अभयं सत्त्वसंशुद्धिः ज्ञानयोगव्यवस्थितिः ।
दानं दमश्च यज्ञश्च स्वाध्यायस्तप आर्जवम् ॥ १ ॥

శ్రీ భగవానువాచ
అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్ (1)

శ్రీభగవాన్ = శ్రీ భగవానుడు, ఉవాచ = పలికెను, అభయమ్ = భయము నుండి విముక్తి, సత్త్వసంశుద్ధిః = మనస్సు శుద్ధముగా నుండుట, జ్ఞానయోగవ్యవస్థితిః = జ్ఞాననిష్ఠయందు స్థైర్యము, దానమ్ = దానము, దమః = ఇంద్రియనిగ్రహము, చ = మరియు,

**యజ్ఞః** = వైదికకర్మానుష్ఠానము, **చ** = మరియు, **స్వాధ్యాయః** = స్వీయవేదశాఖను అధ్యయనము చేయుట, **తపః** = ఆధ్యాత్మిక-అనుశాసనము, **ఆర్జవమ్** = మనోవాక్కర్మలయందు ఏకరూపత.

శ్రీ భగవానుడు ఇట్లు చెప్పెను: భయము నుండి విముక్తి, మనస్సు శుద్ధముగా నుండుట, జ్ఞానినిష్ఠయందు స్థైర్యము, దానము, ఇంద్రియనిగ్రహము, వైదికకర్మానుష్ఠానము, స్వీయవేదశాఖను అధ్యయనము చేయుట, ఆధ్యాత్మిక-అనుశాసనము, మనోవాక్కర్మలయందు ఏకరూపత.... (1).

**అధ్యాయము 16, శ్లోకము 2:**

अहिंसा सत्यमक्रोधस्त्यागश्शान्तिरपैशुनम् ।
दया भूतेष्वलोलुप्त्वं मार्दवं ह्रीरचापलम् ॥ २ ॥

అహింసా సత్యమక్రోధస్త్యాగశ్శాంతి రపైశునమ్
దయా భూతేష్వలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్ (2).

**అహింసా** = హింసను చేయకుండుట, **సత్యమ్** = సత్యమును పలుకుట, **అక్రోధః** = కోపము లేకుండుట, **త్యాగః** = పరిత్యాగము, **శాంతిః** = మనస్సమాధానము, **అపైశునమ్** = కొండెములను చెప్పకుండుట, **భూతేషు** = ప్రాణులయందు, **దయా** = దయను కలిగియుండుట, **అలోలుప్త్వమ్** = దురాశాపరుడు కాకుండుట, **మార్దవమ్** = మెత్తని స్వభావము, **హ్రీః** = వినమ్రత, **అచాపలమ్** = చంచలత్వము లేకుండుట.

హింసను చేయకుండుట, సత్యమును పలుకుట, కోపము లేకుండుట, పరిత్యాగము, మనస్సమాధానము, కొండెములను చెప్పకుండుట, ప్రాణులయందు దయను కలిగియుండుట, దురాశాపరుడు కాకుండుట, మెత్తని స్వభావము, వినమ్రత, చంచలత్వము లేకుండుట (2).

**అధ్యాయము 16, శ్లోకము 3 :**

तेजः क्षमा धृतिश्शौचमद्रोहो नातिमानिता ।
भवंति संपदं दैवीमभिजातस्य भारत ॥ ३ ॥

తేజః క్షమా ధృతిశ్శౌచమద్రోహో నాతిమానితా
భవంతి సంపదం దైవీమభిజాతస్య భారత (3).

**తేజః** = దీప్తి, **క్షమా** = ఆత్మనియంత్రణ, **ధృతిః** = ధైర్యము, **శౌచమ్** = పరిశుభ్రత, **అద్రోహః** = ఇతరులకు హానిని చేయవలెననే తలంపు లేకుండుట, **నాతిమానితా** = అతిశయించిన అభిమానము లేకుండుట, **భారత** = భరతవంశములో జన్మించిన ఓ అర్జునా!, **దైవీం సంపదమ్** = దైవీసంపత్తును, **అభిజాతస్య** = జన్మించిన వానికి, **భవంతి** = ఉండును.

> భరతవంశములో జన్మించిన ఓ అర్జునా! దీప్తి, ఆత్మ నియంత్రణ, ధైర్యము, పరిశుభ్రత, ఇతరులకు హానిని చేయవలెననే తలంపు లేకుండుట, అతిశయించిన అభిమానము లేకుండుట అను గుణములు దైవీ సంపదతో జన్మించిన వానికి ఉండును (3).

ఈ శ్లోకములలోని ప్రతి పదము ఆధ్యాత్మిక (దైవీ) సంపదకు సంబంధించిన ఒక లక్షణమును చెప్పును. సాధకుడు ఈ లక్షణములతో పుట్టియుండ వచ్చును (అభిజాతస్య); లేదా, వాటిని పెంపొందించుకొనవచ్చును.

అభయమ్ అనగా అనేక విషయములలో భయము లేకుండుట. ఇది ద్వైతభావన నుండి విముక్తిని పొందిన జ్ఞానియొక్క ఆత్యంతిక (absolute) అభయము కాదు. జ్ఞానము వలన కలిగే ఆ అభయము ఇచట చర్చించబడుట లేదు. ఇచట మనము సాధకుని మనోలక్షణమును గురించి పరిశీలిస్తున్నాము. భయమునకు హేతువులు ఏవి? భయహేతువులలో ప్రముఖమైనది మరణము. ఇది సామాన్యమగు భయము కాదు. ఆత్మ కాలాధీనము కాదను సత్యము యొక్క పరిజ్ఞానముచేత మాత్రమే దీనిని నిర్మూలించవచ్చును. ఒక విశిష్టమనోభావము యొక్క ఆవేగమే (emotion) భయము. సర్వభావావేగములకు ముందు ఒక మనోవృత్తి ఉండును. కాని మనము సాధారణముగా దానిని గుర్తించుటలో విఫలమగుచుందుము. మన దృష్టిలో పడని ఈ

మనోవృత్తిరూపమగు సంధి (link)ని గుర్తించవలెను. ఆ విశిష్టమనోవృత్తియే మరణభయము. సర్వప్రాణులలో బ్రతుకు మీది తీపి సహజసిద్ధముగా నుండుటచే, మరణసంబద్ధమైన ఒక విశిష్ట భావావేగము ఈ మనోవృత్తికి తోడ గుచుండును. జీవించి ఉండాలనే ఈ అతి సహజమగు బ్రతుకు తీపి సృష్టిలో అంతర్భాగముగా నిర్మితమై యున్నది. ఏ ప్రాణియైననూ మరణించాలని కోరుకోదు. లేడి మొదలగు జంతువులు క్రూరమృగములకు దూరముగా పరుగెత్తును. ఏలయన, పరుగెత్తనిచో తాను మరణించెదనని దానికి నైసర్గికవృత్తి (instinct) చే తెలియుచుండును. బ్రతుకు మీది తీపినుండి అతిసహజముగా భయము పుట్టును.

విషయమును వివేకపూర్వకముగా అవగాహన చేసుకున్నచో, మానసిక-ఆవేగమునకు ముందు ఉండే మనోవృత్తిని ప్రభావహీనము చేయవచ్చును. భయావేగము అనుభవమునకు వచ్చును. కాని 'నేను మరణించెదను' అనే మనోవృత్తి మనకు కానరాదు. 'నేను మరణించెదను' అనే మనోవృత్తిని పట్టుకోగల్గినచో, మనము దానిని విశ్లేషించవచ్చును. మరణించేది ఏది? దేహమా? అది నిస్సందేహముగా మరణిస్తుంది. దానిని ఆపగలిగేది ఏదీ లేదు. మరణించేది మరణించి తీరును. మరణించనిది మరణించదు. ఇది అనిత్యవిచారము. హఠాత్తుగా ఒక రోజున దేహము మరణించుననుకోరాదు. అది క్రమముగా క్షీణించుచునే యుండును. సర్వమును విఘటితము చేసే ఎంట్రాపీ అను అంశము సృష్టిలో అంతర్నిహితమై యున్నది. అది వ్యవస్థను అవ్యవస్థలోనికి పెట్టుచుండును. సంయోగముచే నిర్మితమైన ఈ దేహము విఘటితమయ్యే ప్రవణతను సహజముగా కలిగియున్నది. కావున అది మరణించుట అనివార్యము. ఇది మోటారు వంటిది. ఈ సత్యమును ఎంత అధికముగా తెలుసుకుంటే, అంత అధికముగా మనము ఈ రోజు జీవించి ఉన్నందులకు ఆనందించెదము. అపుడు జీవితము ఒక ఉత్సవము అగును. మనము ఒకే ఒక రోజునకు యోజన చేసిన చాలును. అది ఈ రోజు మాత్రమే. నీకు ఈ రోజుతో మాత్రమే సంబంధము గలదు గనుక, నీవు ఇతరులతో కొట్లాడి, దానిని చెడగొట్టుకొనుట తగదు. ఇది ప్రయాణము వంటిది. సమస్యలను సృష్టించే జనులకు లోటు ఏనాడూ లేదు. నీవు వారిని సహించిన చాలును. ఈ ఇబ్బంది కేవలము కొన్ని గంటల కొరకు మాత్రమే గదా! ఈ తీరున ప్రతిదినము ఆ ఒక రోజు జీవించి ఉన్నందులకు పండుగ చేసుకొనువానికి మరణభయము ఉండదు.

ఈ విధముగా ఒక మనోవృత్తిని గాని, ఆలోచనా ధోరణిని గాని ప్రభావహీనము చేయు ప్రక్రియకు ప్రతిపక్షభావనమని పేరు. ఈ తీరున మన అవగాహనలో మార్పు రావలెను. అపుడు మరణమనే ఆలోచన రాదు. ఒక వేళ వచ్చినా, దానితో బాటు ప్రతిపక్షభావనలు కూడ

ఉదయించును. ఈ భయములు ఉదయించుటతోడనే ఎదుర్కొనుటకై మనము అంతఃకరణములో ఇట్టి ప్రతిపక్షభావనలను (anti-bodies) సృష్టించుకోవాలి. 'నేను మరణించెదను' అనే భావన ఉదయించగానే, 'దేహము మరణించుట అనివార్యము; కాని నేనీ రోజు జీవించియున్నందులకు ఉత్సవమును చేయవచ్చును' అనే మనోవృత్తి దానిని ఎదుర్కొనును. ఈ దేహము ఎప్పుడు మరణించును? అది ఊహామాత్ర గమ్యము. ఆసుపత్రిలోని ఎమర్జన్సీ గదిలో పడియున్న రోగిని 'నీవు ఇచటకు వస్తానని ఊహించేవా?' అని ప్రశ్నించుడు. అపుడు మీకు విషయము అవగతమగును. మనము జీవించి యుండుటకు భగవంతుని కృప ఉండాలి. కావున, ఈ రోజు జీవించి ఉన్నందులకు ఉత్సవమును చేయవలసినదే. మరణములో ఒక మేలు గలదు. మనము దానిని ఒకే ఒక సారి ఎదుర్కోవాలి. అది వచ్చినప్పుడు, దానిని గురించి ఆలోచించెదము. అంతవరకు అది వాస్తవమగు సమస్య కాదు. అది వచ్చునాటికి మనము మరణించుటకు సంసిద్ధులమై ఉండవచ్చును. మనము దానిని స్వాగతించవచ్చును.

ఒక గాథ గలదు. ఒక ముసలి సాధువు ఉత్తరకాశీ, హృషీకేశ్‌లలో 30 సంవత్సరముల కంటె అధికకాలము జీవించెను. ఒకనాడు ఆయనకు సుస్తీచేయుగా, భక్తులు ఆయనను డెహరాడూన్‌కు గాని, ఢిల్లీకి గాని వచ్చి యోగ్యమగు చికిత్సను పొందుడని గోరిరి. ఒకనాడు ఆ స్వామి తన భక్తులలో ఒకనితో నిట్లనెను: 'నీవు పదిమందితో మాటలాడుతూ వ్యగ్రుడవై ఉన్నావనుకొనుము. ఇంతలో నీతో మాటలాడుట కొరకై అచటకు ఒక వృద్ధుడు వచ్చి, నీవు హడావుడిలో నుండుటను గాంచి, ఒక మూల కూర్చుండి వేచియుండెను. అతనికి సత్సంగమునందు అభిరుచి లేకుండుటచే దూరముగా కూర్చుని యున్నాడు. క్రమముగా ఒకరి తరువాత ఒకరు చొప్పున అందరు వెడలిరి. అపుడు నీవు లేచి నీ గదిలోనికి వెళ్లిపోయిన బాగుండునా? లేక, ఆ వృద్ధుని వద్దకు వెళ్ళి అతని పని గురించి అడిగిన బాగుండునా?' 'నేను అందరినీ పంపించివేసి, ఆ వృద్ధునితో తప్పనిసరిగా మాటలాడెదను' అని భక్తుడు బదులిడెను. అపుడా స్వామి ఇట్లు కొనసాగించెను: 'అదే విధముగా నేనీ ప్రపంచములోనికి వచ్చి వివిధ కార్యములలో వ్యగ్రుడనై యుంటిని. మృత్యువు అనే ఈ వృద్ధుడు నాతోబాటు వచ్చి ఇంతకాలము చాల సహనముతో వేచియున్నాడు. ఇపుడు నాతో మాటలాడవలసిన సమయమాసన్నమైనదని అతడు భావించుచున్నాడు. నేను అతనికి ఆ అవకాశమునీయవలెనా? లేక, అతనినుండి పారిపోవలెనా? అతడు సహనముతో వేచియున్నాడు గనుక, నేను అతనికి మాటలాడే అవకాశమును ఇచ్చుటయే యోగ్యముగా నుండును. ఇపుడా సమయము ఆసన్నమైనది'.

మృత్యువు సర్వదా ఒక మూల వేచియుండును. పరుగెత్తే వాహనము లన్నియు దాని రూపములే. అది సూక్ష్మజీవులు ఇత్యాది అనేక స్థిరరూపములలో కూడ ఉండును. మరణించుట దేహము యొక్క స్వభావము గనుక, మృత్యువు నుండి తప్పించుకొనుట అసంభవము. సంయోగముచే నిర్మితమైనదగుటచే ఈ దేహము విశీర్ణము కాక తప్పదు. ఈ సత్యమును నీవు ఎంత లోతుగా తెలుసుకుంటే, మరణసమస్య అంత తక్కువయై, జీవించియున్నందులకు ఉత్సవమును చేసుకునే ప్రవృత్తి అంత అధికముగా నిర్మాణమగును. ఈ రోజు జీవించియున్నందులకు పండుగ చేసుకున్నప్పుడు మాత్రమే మృత్యుభయము తొలగినదని చెప్పవచ్చును. ప్రతి ఉదయము నిద్ర లేచుట పునర్జన్మ వంటిది యగును. వాస్తవంలో, ఇదే దేహముతో నిద్ర లేచెదమనే హామీ ఏమి గలదు? నిద్ర లేచినచో, అది పండుగయే. బహుశః ఇంకొక రోజును సదుపయోగము చేయవచ్చును. కావున, ఒకే ఒక రోజు కొరకు మంచి యోజన చేయవలెను. భవిష్యత్ప్రణాళిక యైననూ, ఈ నాటి ప్రణాళిక మాత్రమే. అవసరమైతే, రేపు దానిని మార్చి వేయవచ్చును. కాని, ఈ నాడు నా చేతిలో ఒక యోజన గలదు. ఈ విధముగా జీవించు వ్యక్తి మరణమును నవ్వుతో స్వాగతించును; లేదా, కనీసము ధైర్యముగా ఎదుర్కొనును.

మరణము మాత్రమే గాక, భయమును కలిగించే హేతువులు అనేకము గలవు. వాటిలో విశేషించి ప్రస్తావించ దగినది భవిష్యత్తు. కాని మనము గతములోనికి చూచినచో, భయము ఉన్ననూ, ఇంతకాలము జీవించి యున్నామని స్పష్టమగును. భయము నిరర్థకమగుట మాత్రమే గాక, అది లేనిచో మనము నిశ్చితముగా మరింత సుఖముగా జీవించి యుండెడి వారము. మనము ఒక నిర్దిష్టసమయములో ఎదుర్కొనవలసినది ఒక రోజు మాత్రమేనను సత్యమును గుర్తించినచో, ఈ భయము కూడ దుర్బలమగును.

నాకు తెలిసిన ఒక కోటీశ్వరుడు సర్వదా భవిష్యత్తును గురించి భయపడెడి వాడు. అతని గృహములో ముగ్గురు వంటమనుష్యులు ఉన్ననూ, కొద్ది రోజులు స్వయముగా వండుకొని తినుమని నేను సలహానిచ్చితిని. ప్రతి దినము కేవలము ఆ పూటకు సరిపడు ఆహారమును మాత్రమే అతడు వండవలెనను నియమము కూడ గలదు. ఒక వేళ అధికముగా వండినచో, రెండవసారి తగ్గించవలెను. వండిన ఆహారమును దాచిపెట్టరాదు. అతడు ఇట్లు కొద్ది రోజులు చేసి, తనకు ఒక రోజునకు కావలసిన ఆహారమును బిచ్చమెత్తి యైననూ సంపాదించవచ్చునని గుర్తించెను. దానితో, భవిష్యత్తును గురించి అతనికి గల అందోళన దూరమయ్యెను.

మానవుడు జీవించుటకు అత్యల్పమగు సామగ్రి సరిపడును. ఈ సత్యమును గుర్తించి

అంతరంగములో ఆధ్యాత్మిక బలము గల వ్యక్తి భావిజీవనమును గురించి ఉండే భయమును అధిగమించగల్గును. కేవలము బ్రతుకగల్గుట పెద్ద ఘనకార్యము కాదు. దోమ కూడ జీవించుచునే యున్నది. అడవికి వెళ్ళి చూడుము. అచట ఎన్ని ప్రాణులు జీవించుచున్నవో! అడవి కోట్లాది ప్రాణులతో నిండియున్నది. వాటికి ఏమి సేవానివృత్తి యోజన గలదు? అవి ఏ రోజునకు ఆ రోజు జీవిస్తూ జీవించదగిన తీరును మనకు నేర్పుచున్నవి. నీవు భవిష్యత్తును గురించి బెంగపెట్టుకున్ననూ, నీ ఉదరములోనున్న కోట్లాది సూక్ష్మజీవులు లేశమైననూ చింత లేకుండా హాయిగా నున్నవి. వాటి సంఖ్య దినదినాభివృద్ధిని చెందుచునే యున్నది. అవి పిల్లపాపలతో, మనుమలతో, మునిమనుమలతో నీవు జీవించియున్నంతవరకు చక్కని కుటుంబ జీవనమును పాగించుచునే యుండును. భవిష్యత్తులో ఏమి జరుగబోవునో యను ఈ చింత అర్థరహితము.

ఈ సమస్యను మరియొక విధముగా ఎదుర్కొనవచ్చును. నీవు ఒకదానిని పోగొట్టుకున్నచో ఏమగునో పరిశీలించుము. ప్రాణనష్టము, పేరుప్రతిష్ఠలకు నష్టము వాటిల్లుట, వదివికి ముప్పు, జుట్టు రాలిపోవుట, పళ్ళు ఊడిపోవుట, ఆరోగ్యము పాడగుట, బంధుత్వము చెడుట ఇత్యాదిగా విభిన్ననష్టముల గురించి మనము సర్వదా చింతిల్లుచుందుము. నీకు ఇప్పుడు గల అధికారములో కొంత నష్టమైనదనుకో ఆ అధికారము పోయిన తరువాత నీవు ఎట్లు ఉండెదవు? ఊహించుము. నీవు మౌలికముగా నష్టపోయినది ఏదీ లేదు. అధికారము గల వానికేసి చూడుము. అతనికి గల అధికారమును, దానిని కోల్పోయెదనేమో యను భయమును కేంద్రముగా చేసుకొని లెక్కలేనన్ని సమస్యలు గలవు. ఈ తీరున, అవగాహనతో విచారణ చేయాలి. భయావేగమునకు నాందిని పలికే ధారణను గుర్తు పట్టి, ఆ పైన విచారము ద్వారా దానిని ప్రభావహీనముగా చేయవలెను. వ్యక్తి ఈ పనిని ప్రయత్న పూర్వకముగా చేయవలెను. ఇట్లు చేసినచో, భయకారకములగు ఆలోచనలు ఉదయించగానే, ప్రతిపక్షభావనలు కూడ ఉదయించును. తెలివితేటలు కలిగి జీవించుట యనగా విదియే.

సత్త్వసంశుద్ధిః యనగా అంతఃకరణశుద్ధి. జీవనమూల్యములనన్నిటినీ సరిగా తెలుసుకున్నచో, అంతఃకరణశుద్ధి కలుగుట నిశ్చితము. కాని ఇచట దానిని భగవానుడు ఒక ప్రత్యేక జీవనమూల్యరూపములో ప్రస్తావించినాడు. మాలిన్యములు లేని మనస్సు అని దీని యర్థము. అనగా, మోసము, దగా లేకుండుట అని శ్రీశంకరులు సుందరముగా వర్ణించిరి. ఆలోచనలలో ఈ దోషములు లేని వ్యక్తి ఇతరులతో వ్యవహరించునప్పుడు ఒక విశిష్టమగు పరిశుద్ధి అతిసహజముగా ప్రకటమగును. అట్టివాడు సత్త్వసంశుద్ధి గలవాడనబడును.

జ్ఞానయోగవ్యవస్థితిః యనగా నిదిధ్యాసనమునందు నిష్ఠను కలిగి యుండుట. ఇచట జ్ఞానమనగా శాస్త్రమునుండి ఆచార్యుని ద్వారా పొందబడిన ఆత్మ జ్ఞానము. ఆత్మ, బ్రహ్మ అను పదముల అర్థమును సరిగా తెలుసుకొనవలెను. వీటిలో ప్రతిపదము తత్సంబద్ధమగు సత్యము (వస్తు)ను నిర్దేశించును. కావున, ముమ్మందుగా ఈ పదమును ఆచార్యునిమండి శాస్త్రము ద్వారా శోధించి వాటి వాస్తవికార్థమును తెలియవలెను. అపుడు మనస్సు ఇంకను పూర్తిగా సంసిద్ధము కాని కారణముగా ఆ జ్ఞానమునకు గల ఆటంకములను తొలగించు కొనవలెను. శ్రవణమననముల తరువాత నిదిధ్యాసనము చేయుట ద్వారా, ఈ సమస్య పరిష్కారమగును. దీనికే జ్ఞానయోగమని పేరు. ఇచట యోగమనగా ధ్యానము. జ్ఞానఫలము చేతికి చిక్కకుండా అడ్డుపడుచున్న ఆటంకమునుండి ఈ నిదిధ్యాసనము జ్ఞానమును విముక్తము చేయును.

నీ స్వంతము అనదగిన జ్ఞానము కూడా వంటబట్టుటకై, నీవు ఇంద్రియములపై ఒక విశిష్టమగు నియంత్రణ కలిగి ఆత్మస్వరూపమును నిదిధ్యాసన చేయవలెను. ఇందువలననే ఏకాగ్రత ఇత్యాదులన్నియు ధ్యానములో భాగమై యుండును. శాస్త్రమునుండి ఆచార్యుని ద్వారా పొందిన అదే జ్ఞానమును సంశయరహితముగా, అపరోక్షముగా చేసుకొనవలెను. అనగా, దానికి గల ఆటంకములనన్నిటినీ తొలగించు కొనవలెను. ఆ జ్ఞానము నీ స్వరూపములో భాగమై, నిష్ఠ యొక్క ఆవశ్యకత తీరిపోయేవరకు నీవు జ్ఞాననిష్ఠుడవై యుండవలెను. ఆత్మస్వరూపనిష్ఠుడవై యుండుటకు ప్రత్యేకమగు యత్నమును చేయ పని లేదు. కాని, ఆ స్థితి వచ్చునంతవరకు ఆత్మ నిష్ఠుడవై ఉండే ప్రయత్నము ఉన్నట్లు కానవచ్చును. దైవీసంపద గలవానికి జ్ఞాననిష్ఠలో కాలమును గడిపే ప్రవణత అతిసహజముగా నుండును. ఆధ్యాత్మిక జ్ఞానమును పొందవలెననే అభిరుచి కూడ దైవీసంపద వలననే కలిగినది.

తరువాతి పదమును వ్యాఖ్యానించుటకు ముందు శ్రీశంకరులు ఇచట ఒక టిప్పణిని చేసిరి. సత్త్వగుణాధిక్యము అనే సంపదకు (సాత్త్వికీ సంపత్) దైవీ సంపదయని పేరు. సాత్త్వికీ అను పదమునకు శ్రీశంకరులు ఒక ప్రధానమైన చిన్న వాక్యములో సామాన్యమగు నిర్వచనమును చెప్పిరి. ఎవరైతే కర్తవ్యకర్మలను మాత్రమే అనుష్ఠించెదరో, వారిది సాత్త్వికీ ప్రకృతిః అనబడును (యత్ర యేషామధి కృతానాం యా ప్రకృతిస్సంభవతి).

వైదికసమాజములో వర్ణాశ్రమధర్మము ఉండెడిది. అది ఒక వ్యక్తి ఏ సముదాయమునకు చెందును అను విషయమును నిర్వచించే ఒక ప్రవర్తనా నియమావళి. సమాజము సజావుగా సాగుటకు అవసరమైన క్రియాకలాపములన్నియు నాల్గు సముదాయములుగా విభజించి, వాటిని

ఆధారముగా చేసుకొని మనుజులు కూడ అటులనే నాల్గు సమూహములుగా చేయబడిరి. ఒక వ్యక్తి ఏ సముదాయమునకు చెంది యుండునో, దానిని బట్టి అతనికి అర్హములైన విధులు నిర్ణయించబడును. ఆ స్థితిలో ఈ విధులు స్పష్టముగా నిర్వచించబడి యుండును.

దీని వెనుక గల భావన యేమనగా, జీవుడు మోక్షపురుషార్థమును సాధించుటకై మానవదేహముతో జన్మించినాడు. మానవుడు ఆ సత్యమును గుర్తించినా, గుర్తించకపోయినా, ప్రతి మానవుడు కోరేది ఇదియే. ఇంతకు తక్కువ యైనచో, మానవహృదయమునకు తృప్తి లేదు. తనకు తాను అంగీకారము కాక పోవుటయే మౌలిక సమస్య. ఆత్మ యందు న్యూనత లేశమైననూ లేదనియు, ఆత్మ పూర్ణమనియు గుర్తించిననాడు మాత్రమే మానవుడు తనకు తాను స్వీకార్యుడగును. ఆత్మ నిత్యపరిపూర్ణము. ఈ సత్యమును గుర్తించిన వ్యక్తి తాను అపూర్ణుడనే భ్రాంతధారణనుండి విడుదలను పొందును. ఎవని జీవితమునకు ఇది చరమలక్ష్యమో, వానికి కర్మలన్నియు విధులుగా మారిపోవును. ఈ తీరున సుస్పష్టముగా నిర్వచించబడిన విధులకు అనురూపముగా జీవించి అతడు మౌలికమగు మోక్షసాధనను చెడగొట్టే రాగద్వేషములను ప్రభావహీనములుగా చేయగల్గును. రాగద్వేషములు ధర్మాను రూపముగా లేని సందర్భములలో ధర్మమునకు లొంగి త్యాగమును చేయుట తప్పనిసరి యగును. కాని, ఇట్లు త్యాగము చేసిన ప్రతి పర్యాయము వ్యక్తిలో వికాసము కలుగును. ఏలయన, త్యాగము చేసినది వ్యక్తి యొక్క పూర్ణతకంటె సర్వదా తక్కువే యగును. అంతరంగము ఈ తీరున వికసించుచుండగా, వ్యక్తిలో ఒక విశిష్టమగు వైరాగ్యము, లేక వాస్తవికదృష్టికోణము నెలకొనును. కాలక్రమములో ఇది అతనికి సహజలక్షణమగును. కావున, వ్యక్తి మానసికముగా, ఆధ్యాత్మికముగా, నైతికముగా పరిపక్వతను చెందాలంటే ఒక మౌలికవ్యవస్థ ఉండవలెను. వైదిక సమాజములో ఇది వర్ణ-ఆశ్రమధర్మముల ద్వారా అందించబడెను.

ఈ వ్యవస్థలో ప్రతి వ్యక్తికి అతడు జన్మించిన కుటుంబమును బట్టి వృత్తి (వర్ణధర్మః) నిర్ణీతమగును. మరియు జీవితదశను బట్టి ఒక ప్రవర్తనా నియమావళి (ఆశ్రమధర్మః) కూడ నిర్ణీతమై ఉండెడిది. బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, సన్న్యాసి అను నాల్గు ఆశ్రమములు గలవు. దీనికి అనురూపముగా జీవించు వ్యక్తి అధికృత-పురుషుడు అనబడును. అతడు కొన్ని కర్మలను చేయవలెనని విధించబడినది. ఒక విశిష్ట పరిస్థితిలో కర్తవ్యము ఏది అను విషయము సుస్పష్టముగా ఉన్నచో, ఇతరక్రియలను కూడ చేయవలెననే ప్రవణత (tendency) అతనిలో ఉన్ననూ, అతడు విధిని మాత్రమే నిర్వర్తించును.

దీనికి ఫలమేమనగా, వ్యక్తికి రాగద్వేషములపై పూర్తి నియంత్రణ ఉండును. అతడు దైవీసంపదయొక్క ఆనందముననుభవించును. అతడు వృత్తిని బట్టి బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు లేక శూద్రుడు అయిననూ, గుణమును బట్టి బ్రాహ్మణుడు అగును. ఈ లక్షణము అతని మానసిక ప్రవృత్తిలో, మరియు నడవడిలో ప్రతిబింబించుచుండును. ఇట్టి వాని లక్షణములు ఈ మూడు శ్లోకములలో వర్ణించబడినవి. అతడు వివిధ కార్యములను చేయునపుడు ఈ జీవనమూల్యములను దృష్టిలో నిడుకొనును; లేదా, అవి అతని సహజలక్షణములగును.

సత్త్వప్రధానమగు ప్రకృతిని పెంపొందించు కొనుటకు విధులు ఆధారముగా గల వ్యవస్థ సహకరించును. విధులు ఏవైనా, వాటిని నిర్వర్తించు వ్యక్తి బ్రాహ్మణుడగును. ప్రతి వ్యక్తి తన విధిని నిర్వర్తించి బ్రాహ్మణుడగుటకై యత్నించే సమాజములో పోటీ ఉండదు. కొద్దికాలము క్రితం వరకు విధినిష్ఠకు భారతీయ సంస్కృతిలో ప్రముఖస్థానము ఉండెడిది. కాని ప్రస్తుతములో సమాజము మారుచున్నది. వర్ణాశ్రమవ్యవస్థ శిథిలమగుచున్నది. కాని దాని స్ఫూర్తి ఇప్పటికీ మాన్యమే. ప్రతి విశిష్ట పరిస్థితిలో ఆ పరిస్థితిని బట్టి చేయవలసిన కర్మ ఒకటి మన యెదుట ఉపస్థితమగును. ఆ పరిస్థితిలో ఆ కర్మ విధియగును.

ప్రతి సమాజములో విధులు, బాధ్యతలు సుస్పష్టముగా నిర్దేశించబడి యుండును. గృహములో గాని, విస్తృతమగు సమాజములో గాని, అట్టి నిర్దేశము లేనిచో, కలిసికట్టుగా పనిచేయుట అసంభవమగును. ఉన్నది ఇద్దరు వ్యక్తులే అయినా, ఎవడు ఏ పనిని చేయాలి అను విషయము సుస్పష్టముగా నుండవలెను. తన కర్తవ్యమును ఖచ్చితముగా పాటించుట మాత్రమే గాక, ఉచితమగు జీవనమూల్యములను ఆదరించే మనఃప్రవృత్తిని కూడ కలిగియున్న వ్యక్తి సత్త్వ గుణప్రధానమగు ప్రకృతి గలవాడై యుండును. ఆ గుణము యొక్క ప్రభావము వలన మాత్రమే అతడు అట్లు ఉండగల్గుచున్నాడు.

ఇట్టి ప్రకృతి గల వ్యక్తి యొక్క లక్షణములలో దానకర్మ ఒకటి. శ్రీ శంకరులు దానమనగా శక్తికి అనురూపముగా యోగ్యమగు రీతిలో విభాగమును చేయుట అని వివరించిరి. దానమును చేయు వ్యక్తి తాను భవిష్యత్తులో దానమును స్వీకరించవలసిన పరిస్థితి రాకుండా చూచుకొనవలెను. దానము బాధ్యతాయుతముగా నుండవలెను. శక్తికి మించి దానము చేయరాదు. ఎంత అధికముగా దానము చేసిననూ, లక్ష్మణరేఖను దాటరాదు. హద్దును మించి దానమును చేయు వ్యక్తి తరువాతి కాలములో ఇడుముల పాలైనచో, అట్టి దానము అర్థరహితము.

యోగ్యమగు పాత్రను చూసి దానము చేయవలెను. దాత సముచితమగు మానసికప్రవృత్తిని కలిగి దానమును చేయవలెను. శ్రద్ధతో దానము చేయవలయుననియు, అశ్రద్ధతో చేయరాదనియు (శ్రద్ధయా దేయమ్, అశ్రద్ధయా అదేయమ్) శాస్త్రము చెప్పుచున్నది. దానము యొక్క పాత్రను గురించి సరియగు అవగాహన ఉండవలెను. దాత, మరియు ప్రతిగ్రహీత ఇద్దరు అనుగ్రహమును పొందితిమనే భావన కలుగవలెను. అదియే దానమనదగును. దానము చేసి, ప్రతిగ్రహీత కృతజ్ఞుడై ఉండునట్లు చేసినచో, అది దానము కాదు. ప్రతిగ్రహీతకు తాను అల్పుడనను భావము కలుగని విధముగా, ఆతనికి ఆనందము కలిగే విధముగా దానమును చేయవలెను. అదియే యథార్థమగు దానము అగును.

దానము చేయుటలో కొన్ని మానసప్రవృత్తులకు ప్రాముఖ్యము గలదు. ఇతరులు మనకు ఇచ్చినది ఎంత అల్పమైననూ, దానిని సర్వదా గుర్తులో నుంచుకొనవలెను. మన కృతజ్ఞత ఎన్నటికీ క్షీణించరాదు. కాని, మనము ఇచ్చిన వెంటనే దానిని మరచి పోవాలి. ఒకవేళ గుర్తుకు వచ్చినా, దానము చేయగలిగే ఆ అవకాశము భాగ్యమని తలంచవలెను. కాని, 'నేను ఇచ్చితిని' అను విషయమును విస్మరించవలెను. ఆ దానము చేసిన ఘటన తల్లక్రిందులై దాత ప్రగ్రహీత అయ్యే సంభావన లేకపోలేదు. ఈ సత్యమును గుర్తించి అది భాగ్యమని భావించవలెను. ప్రతిగ్రహీత చిన్నబుచ్చుకోకుండా, కృతజ్ఞుడై ఉండనక్కరలేని విధముగా చేసిన దానము యథార్థమగు దానము.

సర్వత్రా ఇదే నియమము వర్తించును. ఉదాహరణకు నీవు ఉద్యోగములో క్రింది ఉద్యోగులను నియంత్రించవలయు ననుకొనుము. వారిని నీవు శాసించుచున్నట్లు గాక, నీతో కలిసి పనిచేయుచున్న భావనను ఈయగల్గినచో, నీవు మంచి ప్రబంధకుడవు అగుదువు. వారి మనస్సులో గ్రంథి (complex) ఏదియూ నిర్మాణము కాకుండా నీవు వారిని శాసించవలెను. ఇట్లు నటించినచో, ప్రయోజనముండదు. నీవు నీ తోటి సోదరులయెడ నిర్మలమగు మనఃప్రవృత్తిని కలిగియుండవలెను. పరిస్థితిలో ఇమిడియున్న వాస్తవములను గుర్తించవలెను. ఉద్యోగములన్నియు ఒకే విధముగా నుండవు. 'ఇట్లు చేయుము' అని ఆదేశించ వలసిన స్థానములో ఒకడు కూర్చుండియుండును. మరియొకడు ఆ పనిని చేయవలసిన స్థానములో నుండును. కాని వీరిలో ఒకడు రెండవవానికంటె గొప్పవాడు కాడు. విధులు మారుచుండును. దీనిలో వాస్తవము ఇంతే.

మనము దానమును ఎందుకు చేయవలెను? దానమువలన లభించే ప్రయోజనమేమి? దానము చేయుట యనగా ఒక వస్తువును, లేక ధనమును కోల్పోవుటయే గదా! కాని దానములో కోల్పోయితిమని భావించుటకు అవసరము లేదు. దానము వలన నీ వద్దనున్న ధనము, లేక

వస్తువు ఆ మేరకు తగ్గును. కాని, నీ వ్యక్తిత్వములో తగ్గుదల ఉండదు. వాస్తవానికి అది పెరుగుతుంది. ఒక వస్తువును బహుమానముగా నిచ్చుటలో ఆనందము గలదు. ఇది ఒక ప్రయోజనము. మరియు, దానము వలన ధనము, లేక వస్తువు ఆ మేరకు తగ్గినమూ, నిశ్చితముగా లాభము గలదు. అది యేదనగా, ఈయబడిన వస్తువు కంటె నీవు గొప్పవాడవు అగుదువు. ఇది రెండవది. నీవు ఏ మేరకు ధనమును, లేక వస్తువును ప్రేమతో పరిత్యజించగల్గుదువో, ఆ మేరకు నీ యందు స్వాధీనత (freedom) ఏర్పడును. ఎవని వద్ద ఆనందముగా ఈయజాలని వస్తువు లేదో, ఆతడు పూర్తిగా స్వాధీనత గలవాడు. యోగ్యమగు వ్యక్తి ఎదుట ఉన్ననూ, ఆనందముగా దానము చేయలేనంతటి ఆసక్తి అతని యందు లేదు. అట్టివాడు దానము చేసి అధికధనవంతుడగును.

భారతదేశములో ఈ నాటికీ సర్వత్రా దానము కానవచ్చును. హృషీకేశ్ లో వందలాది ఆశ్రమములు గలవు. అవి అన్నీ ప్రజల దానగుణముపై ఆధారపడి నడుచుచున్నవి. ఇంతేగాక, కావలసినంత ఆహారమును కూడ పంచిపెట్టుచుందురు. దానము అనే ఈ సాంస్కృతిక జీవనమూల్యము ప్రజల హృదయములలో దృఢముగా నాటుకొని యున్నది. నేను పెరిగిన గ్రామములో ధాన్యమునే గాని ఆహారమును అమ్ముట ఎరుంగరు. ఆహారవితరణ మాత్రమే వారికి తెలియును. ఒక స్త్రీ నేయిని అమ్మి అపకీర్తి పాలగుట నేనెరుంగుదును. అట్లు చేయుట మహాపాపముగ పరిగణించబడెడిది. ఒకసారి మా గ్రామములోని ఒక అమ్మాయికి ప్రక్క గ్రామములోని ఒక యువకునితో పెళ్లి సంబంధము ప్రస్తావనకు వచ్చెను. ఆ యువకుని తండ్రి హోటలు యజమాని అగుటచే, ఆ అమ్మాయి తల్లిదండ్రులు ఆ సంబంధమును నిరాకరించిరి. అన్నమును పంచిపెట్టవలెనే గాని అమ్మరాదనియు, అట్లు అమ్మి సంపాదించిన ధనము పాపహేతువు అనియు వారు భావించిరి. ఈ నాటికీ ఆంధ్రప్రదేశ్ లోని గ్రామములలో, ముఖ్యముగా పశ్చిమగోదావరి జిల్లాలోని క్షత్రియులు పాలు పెరుగు మొదలగు వాటిని అమ్మరు. పాలు పెరుగు మొదలగు వాటిని అమ్ముట తమ మర్యాదకు భంగము మాత్రమే గాక, అనుచితమని కూడ వారు భావింతురు. పంజాబులోని సిక్కు దేవాలయములలో ప్రతిదినము ఆహారమును పంచిపెట్టెదరు. పైగా, పుష్టికరమైన ఆహారమును చాలినంత పెట్టెదరు. కావుననే, అచట బిచ్చగాండ్రు మచ్చునకైననూ కానరారు. భారత దేశములో దానమునకు చాల విలువ గలదు. ప్రజలందరి హృదయములలో దానము యొక్క మహిమ దృఢముగా నాటుకొని యున్నది. బీదవాడు కూడ తనకు చేతనైనంతలో దానమును చేయును. దానము వలన వ్యక్తిలో వికాసము కలుగును గాన దానమునకు చాల ప్రాధాన్యము గలదు.

జ్ఞానేంద్రియములు, మరియు కర్మేంద్రియముల స్థాయిలో గల నియంత్రణకు దమము అని పేరు. సాధకుడు చక్కగా ఆలోచించి కార్యములను చేబట్టవలెనే గాని, మనోవిలాసముల వెంటబడరాదు.

యజ్ఞమనగా నిత్యకర్మానుష్ఠానము. ఇది ద్వివిధము. ప్రతినిత్యము చేసే అగ్నిహోత్రము మొదలగు వైదికమైన కర్మలకు శ్రౌతకర్మలు అని పేరు. ప్రార్థనలు, నిత్యపూజ, జపము ఇత్యాదులు స్మార్తకర్మలు అనబడును.

స్వాధ్యాయమనగా వేదమును నిత్యము పారాయణ చేయుట. వేదపారాయణ దైవప్రార్థనయే గనుక పుణ్యదాయకమని భావించెదరు. పుణ్యము వలన స్వర్గాది లోకములను పొందుటయే గాక, ఆధ్యాత్మిక సాధనకు ఆటంకములు కాగలిగే గత కాలీన పాపములు దూరమగును. ఇచట సాధకుడు కోరేది ఇట్టి పుణ్యమే. వేద పారాయణ కూడ ఈశ్వరీయ కర్మయే గనుక, దాని వలన ఒక విశేష పుణ్యము కలిగి దాని ప్రభావముచే ఆధ్యాత్మిక వికాసమునకు దోహదము చేసే వాయు మండలము నిర్మాణమగును.

ఇచట ఆధ్యాత్మిక సాధనమేదైనా తపస్సు అనబడును. మనోవాక్కాయ కర్మలయందు గల ఏకరూపత ఆర్జవమనబడునని మనము 13 వ అధ్యాయములో చూచియున్నాము.

ఏ ప్రాణికైననూ హానిని కలిగించకుండుట అహింస యనబడును. అహింస కేవలము మానవులకు మాత్రమే గాక, వృక్షములతో సహా సర్వప్రాణులకు వర్తించును. సాధనమును బట్టి కాయిక, వాచిక, మానసికములనే మూడు రకముల హింసలు గలవు. ఈ విభాగము సర్వకర్మలకు వర్తించును. మన కాయిక కర్మల వలన ఏ ప్రాణికైననూ హాని కలుగని విధముగా మనము సంకల్పపూర్వకముగా యత్నించవలెను. వాక్కు కూడ కర్మేంద్రియములలోనిదే అయినా, అది ఇచట ప్రత్యేకముగా ప్రస్తావించబడినది. మనము ధ్యానము, ప్రార్థన ఇత్యాది మానసిక కర్మలను కూడ చేయుచుందుము. మన మనస్సులో అప్పుడప్పుడు ఇతరుల గురించి హింసాత్మకమగు ఆలోచనలు వచ్చుట స్వాభావికము. కాని సంకల్ప పూర్వకముగా అట్టి భావనలకు మనస్సులో ఆశ్రయమిచ్చినచో, అది మానసిక కర్మ యగును. సరళమగు మనోవృత్తి మానసిక కర్మ కాదు. కాని దాని వెనుక సంకల్పమును వినియోగించే కర్త యున్నచో, అది కర్మ యగును.

సత్యమనగా యథార్థమగు వచనమును పలుకుట. చాల హానిని కలిగించే సామర్థ్యము

వచనములకు కలదు గావున, మనము సత్యమును మాత్రమే గాక, హితకరము మరియు ప్రియము అగు వచనమును పలుకవలెను. సత్యమును మాత్రమే పలుకవలెనని విధి గలదు. మనము పలికే ఆ సత్యము ఇతరుల మనస్సునకు కష్టమును కలిగించు అవకాశము గలదు. కావున, ప్రియమును పలుకవలెనని విధి గలదు. ప్రియమును పలుకుట ముఖ్యమే అయినా, అది సత్యమునకు భంగకారి కారాదు. అసత్యమును పలుకరాదు.

సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్
న బ్రూయత్ సత్యం అప్రియమ్
ప్రియం చ అనృతం న బ్రూయాత్.

మానవుడు అసత్యమును పలుకుటకు కారణమేమి? వ్యక్తి తన గురించి కొన్ని సత్యములను ఎదుర్కొనుటకు భయపడును. కాని, సత్యమును ఎదుర్కొన జాలని వ్యక్తి అంతకంతకు దుర్బలుడగును. కావున, పరిస్థితులను మరియు వాస్తవములను యథాతథముగా నిష్కపటమగు హృదయముతో ఎదుర్కొని సంభాషణలో కూడ నిష్కపటముగా నున్నచో, ఈ భయములను అధిగమించవచ్చును. ఒక విషయమును గురించి మాటలాడునప్పుడు మన వచనములు సత్యమును యథాతథముగా దోషములు లేకుండగా, మెరుగులు దిద్దకుండగా ప్రతిబింబించ వలెను. సత్యము మరియు ప్రియము అగు విషయము కూడ ఒకప్పుడు నిరర్థకము కావచ్చును. కావున, మనము నిష్ప్రయోజనములగు పదములను ప్రయోగించని విధముగా శ్రద్ధ వహించవలెను. అనగా, మనము విశేషణములను, పదములను జాగరూకతతో ప్రయోగించవలెను. వస్తువును, లేక పరిస్థితిని మనము వాడే పదములు ఉన్నది ఉన్నట్లుగా చెప్పగలిగాలి. మాటలను అవసరము ఉన్నంత మేరకు మాత్రమే పరిమితము చేసినచో, పలికే పలుకులపై బుద్ధికి సహజముగా నియంత్రణ ఉండును.

అక్రోధమనగా కోపము లేకుండుట. శ్రీశంకరులు ఇచట ఈ పదమును ఉదయించిన కోపము ఉపశమించుట అని అందముగా నిర్వచించిరి. ఈ నిర్వచనములో కోపము యొక్క ఉనికి స్వీకరించ బడినది. ఒక విశిష్ట పరిస్థితిలో మనయందు కోపము ఉప్పొంగును. మన అభిలాషలు పరిపూర్ణము కానప్పుడు కలిగే వేదన నుండి కోపము పుట్టును. కోపము ప్రతి మానవునియందు గలదు. మానవుని జీవితములో బాల్యమునుండి నిరాశలు కోకొల్లలుగా గలవు. ఈ అనుభవముల నాధారముగా చేసుకొని వ్యక్తి కొన్ని నిష్కర్షలను చేసుకొనును. వాటి వలన వ్యక్తికి తనపై మరియు

ప్రపంచముపై కోపము పెరుకొనును. మనము సంతాపము నుండి పుట్టిన ఈ కోపమును ఉపశమింప జేయవలెను. లేనిచో, అది మనలను పీడించుచునే యుండును. మనలో కోపము సంసిద్ధముగా నుండుటచే, కొత్త కొత్త పరిస్థితులు దానిని పురికొల్పుచుండును. కోపిష్టివాడీ లోకములో సాధించగలిగేది ఏదీ లేదు. అతడు తనకు, ఇతరులకు హానిని మాత్రమే కలిగించును. కాని క్రియాశీలుడగు వ్యక్తి హానికారకమగు పరిస్థితిని కూడ సరిదిద్ద గలిగే అవకాశము గలదు. ఒకసారి నేను విమానములో ప్రయాణించుచుండగా, తోటి ప్రయాణీకుడు ఒకడు తనకు ఈయబడిన పానీయము సరియైనది కాదని బిగ్గరగా కేకలు వేయ దొడ్చెను. అతని కేకలు విమానమంతటా ప్రతిధ్వనించెను. అతడు ఆ విమానములో ప్రయాణము చేయు కాలము రెండు మూడు గంటలకు మించి లేదు. పానీయమును మార్చుమని కోరినచో, విమానములోని కర్మచారులు మార్చుటకు సంసిద్ధముగనే యున్నారు. అంతటి తీవ్రకోపమునకు హేతువు ఏమి? అతనిలో కోపము అప్పటికప్పుడు పుట్టునని అనుకోరాదు. ఆ కోపము గతములో ఎప్పుడో నిర్మాణమై యున్నది. అది బయట పడే అవకాశము కొరకు ఎదురు చూచు చున్నది. కోపమును గురించిన వాస్తవమిదియే. దీనిని ఉపశమింప జేయుట ఎట్లు? వివిధ పద్ధతులలో విచారమును, శమమును పాటించి దీనిని పరిష్కరించవచ్చును. పరిజ్ఞానము ద్వారా ఈ పరిస్థితిలో మార్పును తీసుకురావచ్చును. ఏలయన, ఇతరభావావేశములన్నింటి వలెనే, కోపములో కూడ దానికి ముందు ఒక స్థిరముగా నిర్ణీతమైన మనో వృత్తి ఉండును. 'నాకు ఈ విధముగా జరుగుటకు వీలు లేదు'; 'వానికి నచ్చచెప్పుట నా వల్ల కాదు'. ఆ మనోవృత్తి యొక్క రూపము ఇట్లుండును. గతకాలీన కోపమునకు, ప్రస్తుత పరిస్థితికి మధ్యలో ఇట్టి మనోవృత్తులు కంటికి కానరాని సేతువుల (links) వలె పనిచేయును. జనులు సాధారణముగా ఈ మనోవృత్తిని గుర్తుపట్టలేరు. దీనికి యాంత్రిక-ఆలోచనా-ధోరణి అని నేను పేరు పెడతాను. ఇది మన అనుమతి లేకుండగానే కొనసాగుచుండును. మౌలికక్రోధహేతువును స్మరింపజేసే ఏ పరిస్థితియైననూ,ఈ మనోవృత్తికి ఆరంభకమగును. ఈ మనోవృత్తి పుట్టగానే క్రోధము ఉప్పొంగును. ఇట్టి పూర్వనిర్ణీతమైన మనోవృత్తులతో సంబంధము లేని భావవ్యక్తీకరణ లేదు. క్రోధమును నిలబెట్టునవి ఇవియే. కావున, సరియగు రీతిలో విచారమును చేసి, దానిని ప్రభావహీనముగా చేయవచ్చును.

ముందుగా మూలములోనున్న ఈ మనోవృత్తిని తీసి ప్రక్కన బెట్టవలెను. మూలములో స్థిరముగానున్న ఈ మనోవృత్తిని గుర్తించుట తోడనే, యాంత్రికముగా ప్రవర్తిల్లే సామర్థ్యము దానికి తగ్గిపోవును. దానిని ఎంత అధికముగా గుర్తించగల్గితే, దాని యాంత్రికత అంతమేరకు తగ్గి పోవును. దానిని గుర్తించగల్గుటయే ఇట్లు తగ్గుటకు కారణము. కొంతకాలమునకు ప్రమాత

(తెలుసుకునే వాడు) వగు నీకు, ఈ యాంత్రికమగు ఆలోచనలకు మధ్యలో కొంత వివేకము (space) నిర్మాణమగును. ఆలోచన ఉదయించుటతోడనే మనము దానిని గుర్తించాలి. ఆరంభములో అది ఉదయించిన తరువాత మాత్రమే మనము దానిని గుర్తించగల్గుతాము. తరువాత అది ఉదయించుచుండగనే మనకు తెలిసిపోతుంది. కాలక్రమములో అది ఉదయించే సందర్భము మనకు అవగతమగును. ఆ తరువాత అది ఉదయించుట ఆగిపోవును. ఈ తీరున వివిధస్థాయిలలో ఆ మౌలికమగు మనోవృత్తిని గుర్తించినచో, తద్ద్వారా కోపము ఉపశమించును.

గతకాలీనక్రోధముయొక్క ఒత్తిడి అధికముగానున్నచో, దానిని హాని కలుగని విధముగా చల్లార్చుటకు తడి తువ్వాలుతో నేలపై కొట్టుట, తోచిన భావనలన్నిటినీ కాగితముపై వ్రాయుట మొదలగు ఉపాయములు గలవు. క్రోధమును ఉపశమింప జేయవలెను (క్రోధస్య ఉపశమనమ్) అని మాత్రమే చెప్పి శ్రీశంకరులు విరమించిరి. దానిని ఉపశమింప జేయు ఉపాయములు పరిస్థితిని బట్టి మారుచుండును.

త్యాగః అనగా ఆత్మజ్ఞానము కొరకై సన్న్యాసాశ్రమ జీవనము, లేదా కర్మఫలత్యాగము అని శ్రీశంకరులు వ్యాఖ్యానించిరి. త్యాగము గలవానికి అర్థకామములకు చెందిన ఫలముల యందు అభిరుచి ఉండదు. అట్టివాడు వివిధకర్మలను కర్తవ్యబుద్ధితో అంతఃకరణశుద్ధి కొరకు మాత్రమే ఆచరించును. సాధకుడు ఆశ్రమరూపమగు సన్న్యాసమును స్వీకరించక పోయినన్నూ, త్యాగముయొక్క స్ఫూర్తి గలవాడై మమకారమును, ఆసక్తిని వీడి యుండును. మనః పరి పక్వత నుండి ఉదయించిన ఇట్టి వైరాగ్యము సాత్త్వికవైరాగ్యము అనబడును.

అంతఃకరణసమాధానము (resolution) నకు శాంతి అని పేరు. ఆత్మనింద లేని వ్యక్తి యందు మాత్రమే ఇది సంభవమగును. మనస్సునకు వివిధదశలు గలవు. వాటికి ఆత్మనింద తోడైనచో, ఒక విషవలయము నిర్మాణమగును. ఉదాహరణకు మనస్సులో అశాంతి ఉన్నదనుకొనుము. 'నేను శాంతిని ఎరుంగని మనస్సు గలవాడను' అని నిన్ను నీవు నిందించుకొని కూర్చున్నచో, మనస్సులోని అశాంతి ద్విగుణీకృతమగుట తప్ప మరియొక లాభము లేదు. అపుడా అశాంతిని నిర్మూలించుట మరింత కష్టమగును. కావున, మనోదశను ఆధారముగా చేసుకొని తనను తాను నిందించుకొనే అలవాటును ప్రక్కన బెట్టి, మనస్సులో విషవలయము నిర్మాణము కాకుండునట్లు చూచుకొనవలెను. ఇది తెలుసుకోదగిన అతిప్రముఖమైన విషయము. మనస్సునకు దాని తర్కము దానికి గలదు. అది దేనితోనైననూ సంబంధము లేని విషయమును గురించి

హఠాత్తుగా ఆలోచించనారంభించును. దాని వెనుక గల హేతువును గూర్చి మనము విచారణ చేయవచ్చును. కాని, మనస్సునకు దాని తర్కము దానికి గలదని తెలుసుకున్నచో చాలును. అది ఆ తీరులో ఏల ఆలోచించుచున్నదియో నాకు తెలియదు. తెలియవలసిన ఆవశ్యకతయూ లేదు. ప్రముఖ విషయమేమనగా, మనోదశను ఆధారముగా చేసుకొని ఆత్మనిందను చేసుకోరాదు. మనోదశను గాంచి ఉల్లాసమును పొందవలెను. నాకు ఎప్పుడు అవసరమైతే, అప్పుడు మనస్సు నాకు ఉపలభ్యమగుచునే యున్నది. అది తన విరామసమయములో తనకు తోచిన ఆలోచనలలో మునిగి యుండు గాక! నేను దానిగురించి పట్టించుకోను. మనస్సునకు తగినంత విశ్రాంతిని ఒసంగుట చాల ముఖ్యము. నేను విశ్రాంతిని ఈయనిచో, అది నా అనుమతి లేకుండగనే విశ్రమించును. అప్పుడు అది నాకు అవసరమైనపుడు సంసిద్ధముగా నుండదు. ఇట్టి పరిస్థితిలోనైననూ, మనస్సును ఆధారముగా చేసుకొని ఆత్మనిందను చేసుకోనంతవరకు పరవా లేదు. మనస్సు ఆధారముగా ఆత్మ నిందకు ఒడిగట్టనివానికి సర్వవిధముల మానసిక సమస్యలు దూరమగును.

ఇట్టి ఆత్మనిందవలన వేదాంతము యొక్క అవగాహన కూడ భ్రష్టమగును. 'నేను సచ్చిదానందుడనని వేదాంతము చెప్పుచున్ననూ, అది నాకు అనుభవమునకు వచ్చుట లేదు' అనే రూపములో ఈ సమస్య తరచుగా వ్యక్తమగుచుండును. సచ్చిదానందము అనుభవించ దగినది కాదు; అర్థము చేసుకోదగినది. సర్వముయొక్క స్వరూపసత్యము, సర్వముకంటె విలక్షణము అగు సచ్చిదానందము నీవేనని శాస్త్రము యొక్క తాత్పర్యము. ఇది నీకు అర్థము కాలేదని నీవన్నచో, ఆ సమస్య యుక్తియుక్తముగా నున్నది. ఇందువలననే, మనకు ఇన్ని గ్రంథములు లభ్యమగుచున్నవి. జనులు సులభముగా అర్థము చేసుకొనే పక్షములో శ్రీశంకరులు ఇంతటి విస్తృతమగు భాష్యములను వ్రాసియుండెడివారు గాదు. అధ్యయనము చేయువానికి అర్థము కాకపోవుట సమస్య కారాదు. అనగా, అర్థమగుట ఇంకనూ తరువాయి గనుక, సాధకుడు అర్థము చేసుకుంటూ ఉండవలెను.

నీ మనస్సులో, మరియు నీ ఉపాధిలో అభిలషితములు, మరియు అనభిలషితములు అగు లక్షణములు ఎన్ని ఉన్ననూ, నీవు సచ్చిదానందస్వరూపుడవని శాస్త్రము చెప్పుచున్నది. మనకు సచ్చిదానందము తెలియుటకు ప్రజ్ఞాశాలి, శుద్ధము అగు అంతఃకరణము ఆవశ్యకమని పరిగణింప బడును. కాని, మనము సర్వజ్ఞత్వాది గుణవిశిష్టమగు ఆత్మను గురించి మాటలాడుచున్నాము గనుక, దానికి అంతటి ప్రాముఖ్యము లేదు. ఇది చీపురుగట్టను విలువైన

ఆభరణములతో అలంకరించుట వంటిది. ఉపాధి ఎంతటి అద్భుతమైనది అయిననూ, అనంతసచ్చిదానంద ఆత్మ కాజాలదు. కావున, ఇచట పోలికలకు అర్థము లేదు. అంతటా గల్గా ఉన్నది ఒకే ఒక సచ్చిదానంద ఆత్మ గనుక, సచ్చిదానందములో పోలికలకు తావు లేదు. ఉపాధి భేదములు నిషేధయోగ్యములే గాని, పోలికలకు యోగ్యమైనవి గావు. పరమాత్మ యొక్క సోపాధికరూపములకు, జీవునకు మధ్యలో భేదము (జీవేశ్వర-ఉపాధి-భేదః)ను కూడ నిషేధించవలసియుండగా, వ్యక్తికి ఇతరవ్యక్తులతో గల భేదముపై దృష్టిని సారించుటవలన ప్రయోజనమేమున్నది? శ్రుతి సర్వత్రా బాధించుట (negation) ను గురించి ప్రస్తావించుచున్నది. నా గురించి నాకు గల వివిధధారణలను విడనాడుమని శాస్త్రము బోధించుచుండగా, నేను క్రొత్త లక్షణములనేల జత చేసుకొనవలెను? ఇది దహనమునకు ముందు మృతదేహము లావుగా నుండవలెనా, లేక సన్నముగా నుండవలెనా యని విచారణ చేసినట్లున్నది. నేను దేహేంద్రియమనస్సంఘాతముపై గల ఆత్మ భావనను విడనాడవలసి యుండగా, వాటికి మెరుగులను దిద్దనేల? ఉపాధికి సంస్కృతభాష వచ్చినా, రాకపోయినా, దానిని విడనాడక తప్పదు. ఇది ఉపాధిలక్షణములకు సందర్భము కాదు. ఏలయన, 'ఉపాధిని ఆధారముగా చేసుకొని నీవు నీ స్వరూపమును గూర్చి నిష్కర్ష చేయరాదు' అనునది పూర్ణ-ఉపదేశ-సారమై యున్నది.

ఆపేక్షికముగానైననూ దీనిని స్పష్టముగా తెలుసుకున్నచో, దానివలన నీకు కొంత వ్యవధానము లభించును. నీవు తరుచుగా నిన్ను నిందించుకున్నావనుకో. ఈ ఆత్మనింద కూడ ఒక మనోవృత్తియేననియు, ఒక ఆలోచనాధోరణి అనియు స్పష్టమే గదా! ఈ నిందకు గల హేతువును పరిశీలించుము. కాని హేతువు ఏదైననూ స్వీకరించుటకు సంసిద్ధుడవై యుండుము. నీకు సత్యమును స్వీకరించుటకు అభ్యంతరము లేనిచో, మనశ్శాంతి సహజసిద్ధమగును. సమస్యతో గూడిన పరిస్థితి అటులనే మిగిలియుండుగాక! దానిని పరిష్కరించే ప్రయత్నమును నీవు ఎప్పుడైననూ చేయవచ్చును. కాని, ఒక వాస్తవపరిస్థితిని స్వీకరించలేకపోవుట అనే సమస్య నీ నుండి దూరమైనది. వాస్తవికస్థితిని గనుటకు నిరాకరించి, మనము ఏ సమస్యనైననూ పరిష్కరించలేము. ఈనాడు కాకపోతే, రేపైనా వాస్తవమును గుర్తించక తప్పదు. వాస్తవములను అంగీకరించుటకు మనము ఎంత అధికముగా సంసిద్ధులమైతే, మనస్సునకు అంత అధికముగా శాంతి లభించును. ప్రాణాయామము మొదలగు వివిధ-అనుశాసనములు కూడ మనశ్శాంతిని పొందుటలో సహకరించును.

ఇతరులలోని ఆలోచనలలో మరియు ప్రవర్తనలో దోషములను వెదకుట, ఆ దోషములు

అందరికీ తెలియునట్లు శక్తివంచన లేకుండా యత్నించుట అను లక్షణమునకు పైశునమని పేరు. ఇది లేకపోవుట అపైశునమనబడును. ఇతరుల మంచిని గురించి మాటలాడుటలో తప్పు లేదు. పైగా, ఇది మంచిది కూడా. ఏలయన, అది నీలో మరియు ఇతరులలో గల మంచికి పుష్టిని కలిగించును. కాని ఇతరులలోని దోషములను గురించి మాటలాడుట, దోషములను వెదికి వాటిని నలుగురి మధ్యలో గోరింతలు కొండంతలుగా చేసి సందర్భము కాకపోయినా చెప్పుట పైశునమనబడును. దీని వలన ప్రయోజనమేమియూ లేదు. మనలో ఆత్మతృప్తి లేకపోవుటయే ఇట్టి బాతాఖానీలలో పాల్గొనుటకు హేతువు. ఇది మనలో దాగియున్న అసూయయొక్క అభివ్యక్తియని కూడ చెప్పవచ్చును. నాకు ఏ వ్యక్తిపై అసూయ గలదో, వాని దోషములను గురించి మాటలాడుట వలన నాలోని అసూయ నియంత్రణలో నుండును. కాని అసూయను పోగొట్టుకొనే పద్ధతి ఇది కాదు. దానివలన నాకు నేను అదనపు సమస్యలను సృష్టించుకున్నట్లు అగును. ఇట్టి బాతాఖానీలు నా నుండి నేను పారిపోవునట్లు చేయును. మానవుడు తననుండి తాను పారిపోవుటకు అధికభోజనము, అధికముగా శ్రమించుట, బాతాఖానీ ఇత్యాది పద్ధతులను అవలంబించును. వీటిలో బాతాఖానీ చెప్పువాని మనస్సును మాత్రమే గాక, వినువాని మనస్సునుకూడ చెడగొట్టును. ఇది వినాశకరమగు అలవాటు. ఇతరుల గురించి మాటలాడాలనే ఒత్తిడి నాలో ఏల కలుగుచున్నది? అను విషయమును పరిశీలించుకొని, ఈ సమస్యను పరిష్కరించుకోవాలి. మనము కొంత సమయము ఏకాంతమును అలవరచు కోవాలి. దీనివలన అపైశునము అనే గుణము అబ్బును.

ఏదో ఒక దుఃఖమును, లేక పీడను అనుభవించుచున్న ఇతరవ్యక్తి యెడల మనము దయను కలిగి ఉండవలెను. ఇది మానవులయెడల మాత్రమే గాక, సర్వప్రాణులయెడ ఉండవలెను. ఒక వృక్షము, లేక తీగ, లేక కప్ప బ్రతికి యుండుటకు ఇబ్బంది పడుచున్నచో, లేక ఒక మనిషి శారీరకమైన, లేదా మానసికమైన దుఃఖముతో బాధ పడుచుండగా, చూచిన వెంటనే దయ కలుగును. హృదయములోనున్న ప్రేమ ఇతరులు కష్టపడుచున్నప్పుడు సహానుభూతి రూపములో వ్యక్తమగును. ఇట్లు సహానుభూతిని చూపే సామర్థ్యము మానవునిలో సహజముగా నున్నది. అత్యంత స్వాభావికమగు ఈ స్పందనను అణచివేయరాదు. ఆ సహానుభూతికి అనురూపముగా చర్యను చేబట్టినచో, అది దయ అగును. ఆ ప్రక్రియలో నీవు కష్టముల పాలు కానక్కరలేదు. దయ సర్వదా క్రియాన్వితము కావాలి. క్రియాశీలము కాని దయవలన నీకు సమస్య నిర్మాణమగును. సహానుభూతి కలిగిన వెంటనే, సహాయక చర్యను చేబట్టినచో, అక్కడితో

అది సరి. లేనిచో, 'నేను దోషిని' అనే భావన నెలకొనును. ఏమియు చేయలేకపోవుటకు కారణమును అన్వేషించి సమర్థించుకొనుట అవశ్యకమగును. దీనివలన, అతిసహజము, స్వతఃప్రవృత్తము అగు ప్రవృత్తిని అణిచిపెట్టుటయే గాక, ఆలోచనలో ఒక వికృతి నిర్మాణమగును.

ప్రేమయొక్క అభివ్యక్తియే దయ. దుఃఖములోనున్న ప్రాణి ప్రేమకు విషయమైనప్పుడు, ప్రేమ దయ అనే రూపములో అభివ్యక్తమగును. ప్రతి మానవునియందు దయ గలదు. నీ వ్రేలికి దెబ్బ తగిలినప్పుడు నీవు దయామూర్తివి. పైగా, నీవు ఇతరులనుండి కూడ దయను అపేక్షించెదవు. ఈ భావావేగము (emotion) అందరికీ పరిచితమే. మనము దీనిని అణిచివేయకుండగా, పెంచి పోషించవలెను. కాని కొన్ని సందర్భములలో దానిని యథోచితముగా సంస్కరించవలెను. ఏమీ చేయలేని నిస్సహాయస్థితిలోనైననూ, మనము దుఃఖితుని గూర్చి కనీసము ప్రార్థనను చేయవలెను. దయను లోపల దాచుకోరాదు. ఏదో ఒక చర్యను చేపట్టి, దానిని ప్రకటించవలెను. ఇందువలననే, 'మనము సర్వప్రాణులు సుఖించుగాక! (లోకాస్సమస్తాస్సుఖినో భవంతు)' అని ప్రార్థించుచుందుము. దుఃఖము నాకు అభీష్టము కాదు గనుక, ఏ ప్రాణికైననూ అది అభిలషితము గాదని నేను గుర్తించవలెను. మనలోని సహానుభూతి విషయములో మనము అధికముగు శ్రద్ధను చూపుచున్నచో, మన నుండి అధికముగు దయాగుణము అభివ్యక్తమగుచుండును.

అభీష్టములగు భోగవస్తువులు ఎదుటనున్ననూ, వాటిపై తృష్ణ లేకుండుట అలోలుప్త్వమ్ అనబడును. భోగవస్తువులు ఎదుట లేనప్పుడు చలనము లేకుండుట ఒక స్థాయి. కాని వాటి సన్నిధిలో చలనము లేకుండుట మరియొక స్థాయి. ఇందువలననే, మనము సూపర్ బజారునకు వెళ్ళినప్పుడు ఆరంభములో కొనాలని అనుకున్న వాటికంటె అధికమగు వస్తువులతో బయటకు వస్తాము. ఎంత అవసరమో, అంతే కొనుటకు చాల ఆత్మ నియంత్రణ కావాలి. ఈ అలోలుప్త్వమును పెంపొందించుకొనుటలో అభ్యాసమునకు ప్రముఖస్థానము గలదు. ప్రారంభములో బహుశః భోగవస్తువులను దూరముగా నుంచుటయే మంచిది. కాని ఆ తరువాత వాటి సన్నిధిలో మనస్సులో తృష్ణ ఉదయించని విధముగా వాటి స్వభావమును పరిశీలించవలెను. ఒకచో మనస్సులో ఆసక్తి ఉదయించిననూ, దానికి నీవు స్పందించరాదు. ఉదాహరణకు, వస్తువులను కొనుటకై బజారునకు వెళ్ళినప్పుడు, మనస్సులో అనేక ప్రేరణలు, అభిరుచులు ఉదయించినచో, ఉదయించనిమ్ము. కాని, ఖచ్చితముగా ఎంత అవసరమో, అంతే కొనవలెను. ఇట్లు చేయుటకు మనస్సు వివేకము కలది అయి ఉండవలెను. కనుక, ఇది సాత్త్వికలక్షణమని

పరిగణించబడును. ఈ లక్షణము లేని వ్యక్తి తృష్ణకు వశుడై యుండుటచే, రాగప్రేరితుడై వివిధవస్తువులను కొనుచుండును. దీనికి లోలుప్త్వమని పేరు. రజోగుణము ఈ రూపములో ప్రకటమగును.

మార్దవమ్ అనగా క్రౌర్యము లేకుండుట. ఈ పదము 'మెత్తని' అను అర్థము గల 'మృదు' అను పదమునుండి పుట్టినది. పువ్వులలోని పత్రములు మృదువుగా నుండును. మనఃప్రవృత్తిలో ఉండే మెత్తదనమునకు మార్దవమని పేరు. ఇతరులు నీతో స్వతంత్రముగా, ఆనందముగా, పరుషవాక్యములను పలికెదవేమో యను భయము లేకుండగా, మాటలాడ గలగాలి. అది మార్దవమనబడును. కొందరు వ్యక్తులు దయాహృదయులే అయిననూ, వారి భావాభివ్యక్తి చాల పరుషముగా నుండును. వ్యక్తులలోని వివిధస్వభావములను వర్ణించే కథ ఒకటి గలదు. ఒక వృద్ధ బ్రాహ్మణుడు ఒక గ్రామమునకు భోజన సమయములో విచ్చేసెను. ఒక వ్యక్తి ఆయనతో ఐదు నిముషములు ప్రేమగా మాటలాడి, భోజనమును చేసితిరా? యని ప్రశ్నించెను. ఆ బ్రాహ్మణుడు లేదని సమాధానమును చెప్పెను. అపుడా గ్రామస్థుడు తన గృహములోని వారందరు భోజనములను ముగించినందులకు సంతాపమును వ్యక్తము చేసి ఆయనను మరియొక గృహమునకు వెళ్ళుడని సలహానిచ్చెను. అతడు ఈ పలుకులను వెన్నలోనికి ప్రవేశించే చాకు వలె అతి మృదువుగా చెప్పెను. ఆ బ్రాహ్మణుడు మరియొక గృహమునకు వెళ్ళగా, ఆ యజమాని సంక్షిప్తముగా కొద్ది మాటలను మాత్రమే పలికి కడుపునిండా భోజనమును పెట్టి విశ్రమించుడని సూచించి విరమించెను. ఇవి రెండు రకముల ప్రకృతులు. ఒకాయన చాల మెత్తగా మాటలాడి ఉత్తి చేతులతో పంపిస్తాడు. రెండవవాడు కటువుగా మాటలాడి కడుపునిండా భోజనమును పెట్టి పంపిస్తాడు. రెండవవాడు మొదటివానికంటె నయమనుటలో సందేహము లేదు. కాని మనలో దానము, మెత్తదనము అనే రెండు గుణములు ఉండుట శ్రేష్ఠము. మార్దవము చాల ప్రధానమైనది. ఏలయన, దాని నుండి ఇతరుల సౌఖ్యమునకు అనురూపముగా తాను సర్దుబాటు చేసుకొనుట, ఇతరులలోని లోటుపాట్లను అర్థము చేసుకొని సహృదయముతో స్వీకరించుట అను సల్లక్షణములు ఉదయించును.

సంకోచస్వభావమునకు హ్రీః అని పేరు. ఇది సాధారణముగా అన్ని సందర్భాలలో ఉండే సంకోచస్వభావము కాదు. ఇతరులు తనను పొగిడే సందర్భములో ఉండే సంకోచమునకు హ్రీః అని పేరు. ఒకప్పుడు నీ అర్హతలను స్వయముగా చెప్పవలసియుండును. అప్పుడు గొప్పలను చెప్పకుండగా ఉన్నది ఉన్నట్లుగా చెప్పవలెను. హ్రీః అనగా స్వాభావికమగు వినయము.

అచాపలమ్ అనునది మరియొక ప్రముఖగుణము. ప్రయోజనము లేకుండగా మాటలాడకుండుట, చేతులు కాళ్ళు మొదలగు అవయవములను ఊపకుండుట అచాపలమనబడునని శ్రీ శంకరులు వివరించిరి. అనగా, సావధానచిత్తుడై విచారవిమర్శలతో కూడిన కర్మలనాచరిస్తూ ప్రయోజనయుతమగు జీవితమును గడుపుట అని యర్థము. ఇట్టి జీవనము వలన మనస్సులో మార్పు వచ్చును. ఏలయన, మనస్సులోని ఆందోళనయే చపలత రూపములో బయట పడును. అభ్యాసముచే అచాపలమును తేలికగా సాధించవచ్చును. కాని దీనికి కొంత సావధానత అవసరము. ఉద్రేకమును పొందకుండగా దీనిని సాధించుట చాల ముఖ్యము. ఏలయన, మనస్సు ప్రశాంతముగా నుండి శ్రవణయోగ్యము కావలెను. ఆత్మజ్ఞానము గలవానికి ఇది సహజగుణమగును. కాని, అంతరంగములో విశ్రాంతిని ఎరుంగని వానికి ఈ జాగరూకత (alertness) బరువై ఉద్రేకహేతువు కావచ్చును. ఇచట ఇది ఒక అభ్యాసము చేయదగిన అనుశాసనమని సూచించబడు చున్నది. అంతరంగములో స్వాయత్తత నిర్మాణమగుటయే దీని ప్రయోజనము. ఇదియే జీవిత పరమార్థము అనుకోరాదు. సాత్త్వికమగు మనస్సులో ఈ అచాపలము అతిసహజముగా నెలకొని యుండును. సాత్త్వికుడైన వ్యక్తి కూడ ఒకప్పుడు ఆందోళనకు గురి కావచ్చును. అపుడాతడు సముచితమగు అనుశాసనమును అభ్యసించి ఆందోళనను తగ్గించు కొనవచ్చును.

తేజః అనగా దీప్తి. అనగా కాంతివంతమైన శరీరమును కలిగియుండుట కాదు. అంతరంగము లోని దీప్తి తేజః అనబడునని శ్రీశంకరులు వివరించిరి. క్లిష్ట పరిస్థితులను ఆపదలను ఆత్మ విశ్వాసముతో ఎదుర్కొనే సామర్థ్యము తేజః అనబడునని శ్రీశంకరులు నిర్వచించిరి.

క్షమా అనగా సహనశక్తి. ఎదుటివాడు కోపముతో నిందించినా, దాడి చేసినా, అంతరంగములో వికారమును పొందకుండుట క్షమ యనబడును. ఇతరవ్యక్తి యొక్క ప్రవర్తనను అంతరంగములో ప్రవేశించనీయకపోవుటచే ఇది సంభవమగును. ఎదుటివానిని వాని దారిన వానిని ఉండనిమ్ము. కొద్ది సేపటిలో ఆ గొడవ సద్దు మణుగును. నీలో క్రోధపూర్ణమైన స్పందన ఉదయించరాదు. నీలో క్రోధము పుట్టి దానిని నీవు ఉపశమింప జేసినచో, అది అక్రోధము అగును. క్రోధము ఉదయించనిచో, అది క్షమ యగును. ఈ సహనగుణములవలన ఎదుటి వ్యక్తిని అర్థము చేసుకొనే అవకాశము నీకు లభించును. ఎదుటి వ్యక్తి తనకు ఇచ్చవచ్చిన రీతిని తాను ఉండుటకు నీవు సంసిద్ధుడవు కానిచో, నీవాతనిని అర్థము చేసుకొనుట అసంభవమగును. 'నన్ను

అర్థము చేసుకొనే ప్రయత్నమునీతడు చేయుచున్నాడు' అనే విశ్వాసమును ఎదుటి వానిలో కలిగించుట సరళమైన పని కాదు. దానికి క్షమ పెద్ద మోతాదులో నుండవలెను.

ధృతిః అనగా ధైర్యము అని సామాన్యార్థము. శ్రీశంకరులు దానిని మరింత స్పష్టముగా వ్యాఖ్యానించిరి. అనారోగ్యమువలన గాని, వయస్సు పైబడుట వలన గాని, లేదా మరియొక దోషము వలన గాని, దేహము మరియు ఇంద్రియములు అలసి పీడకు గురియగుచున్న తరుణములో దుఃఖమును సరకు చేయకుండా ఉండే మానసిక ప్రవృత్తికి ధృతి అని పేరు. పీడ ఉన్ననూ, దాని గురించి ఫిర్యాదు చేయకుండగా ఉత్సాహముతో సహించగలిగే సామర్థ్యము ధృతి యనబడును.

శౌచమ్ అనగా పరిశుభ్రముగా నుండుట. ఇది బాహ్యము, అంతరము అని రెండు రకములు. దేహమును, వస్త్రములను, చుట్టుప్రక్కల వాతావరణమును పరిశుభ్రముగా నుంచుకొనుట బాహ్యశౌచమనబడును. ఇది మనఃస్థితి స్వస్థముగా నుండుటలో సహకరించును. కావున, ఇది చాల ప్రముఖమైన అనుశాసనము. ద్వేషము ఇత్యాది భావావేగములచే ప్రహతమై ఉండే మనోదశకు విరుద్ధమైన మానసిక స్థితి అంతరశౌచమనబడును. ఇట్టి ఆందోళనకరములగు భావావేగములను గుర్తించగానే, వాటి స్థానములో ప్రతిపక్షభావనలను ప్రవేశపెట్టవలెను. శత్రుత్వము ఉన్నచో, దానిని అవగాహనతో, వీలువడితే స్నేహముతో మార్చివేయవలెను. ద్వేషము ఉన్నచో, ద్వేష్యమును విశ్లేషించి దానిని తెలుసుకొనే ప్రయత్నమును చేయవలెను. సమగ్రమగు అవగాహన కలిగిన వెంటనే, ప్రేమ మరియు దయ సహజముగా ఉద్బుద్ధమగును. అట్లు గానిచో, మనము సంకల్ప పూర్వకముగా ఈ భావనలను ప్రవేశపెట్టవలెను. ద్వేషింపబడే వ్యక్తిలో ప్రేమించదగిన గుణముపై మన దృష్టిని సారించవలెను. ఆ వ్యక్తిలో దయార్హములగు లక్షణములను కనుగొనవలెను. సాధకుడు తన మనస్సు లోతులలో పరిశీలించి, ఈ భావనలను ఉదయించుటతోడనే, ప్రతిపక్షభావనలను సృష్టించి, తద్ద్వారా సత్త్వప్రధానమగు మనస్సును వికసింపజేసుకొనవలెను. నిత్యప్రార్థనలు, జపము మరియు ధ్యానము అనునవి అంతరశౌచమును పెంపొందించుకొనుటలో సహకరించే ప్రముఖసాధనములు. వీటన్నింటిలో సమర్పణాభావము కలదు గనుక, ఇవి అంతఃకరణశుద్ధికి సహకరించును. మనస్సు ప్రోగుచేసుకున్న చెత్త అంతా ప్రార్థనలో జారిపోవును. మనస్సు కొన్ని మాలిన్యములను ప్రోగుచేయును. అందువలన, శుద్ధీకరణము అవశ్యకమగు చున్నది. ఈ మాలిన్యములేవి? వంచన, ఇష్టానిష్టముల సమ్మోహము అని శ్రీశంకరులు వివరించిరి. ఇష్టానిష్టములను కలిగియుండుటలో సమస్య లేదు. కాని వాటి సమ్మోహమునకు వశుడైయున్న

వ్యక్తి అధర్మమునాచరించును. ఇష్టానిష్టములు ధర్మమునకు అనురూపముగానున్న వ్యక్తి పూర్ణముగా ముక్తుడు. కాని, తన రాగ ద్వేషరి పూర్తికొరకై ధర్మమునుల్లంఘించు వ్యక్తి వాటి సమ్మోహములో పడినాడని చెప్పక తప్పదు. మనోమాలిన్యమనగా నిదియే. ప్రార్థన, మరియు ప్రతిపక్ష భావనలద్వారా దీనిని శుద్ధి చేయవలెను.

అద్రోహః అనగా ద్రోహమును చేయకుండుట. మనము అహింసను గూర్చి చర్చించి యున్నాము. కావున, అద్రోహమనగా, ఇతరవ్యక్తి హానిని కలిగించినను, వానికి హాని కలగాలనే తలంపుకూడ ఉదయించకపోవుట. ఈ గుణమును ప్రత్యేకముగా ప్రస్తావించనిచో, హింసాత్మకమగు ఆలోచనలు లేకుండుట కూడ అహింసగనే పరిగణింపబడెడిది. కాని, ఇచట అద్రోహము ప్రత్యేకముగా ప్రస్తావించబడినది. కావున, అహింసయనగా వాక్కాయముల ద్వారా హింస లేకుండుట అని సంకోచార్థమును చెప్పవలెను. ఇపుడు హింసాత్మకమగు భావనలు కూడ నిరాకరించ బడుచున్నవి. కావున, తలపులోనైననూ హింసాత్మకప్రవృత్తి లేకుండుట అద్రోహమగును.

ఇతరులు తనను మర్యాద చేయాలనే ఆగ్రహమునకు అతిమానితా అని పేరు. ఒక వ్యక్తిగా పొందిక కలిగి జీవించుటకై కొద్దిగానైననూ ఆత్మగౌరము (మానితా) ఉండుట అత్యావశ్యకము, ఆరోగ్యకరము. అది లేని వ్యక్తి ఆత్మ నిందతో తనను తాను వినాశము చేసుకొనును. కాని ఇచట ఇతరులు తనను ఆదరించి తీరాలనే పట్టుదల నిరాకరించ బడుచున్నది. మానిత అతిశయించినచో, అతిమానితయగును. ఈ లక్షణము లేకుండుట నాతిమానితా అనబడును. ఇది గల వాడు మిక్కిలి సరళమైన వ్యక్తిగా నుండును.

అభయముతో మొదలిడి ఈ మూడు శ్లోకములలో చెప్పబడిన సద్గుణములన్నియు దేవతల లక్షణములు. ఇవి గల మానవులు దైవీసంపద గలవారని చెప్పబడుదురు. అట్టివారు ఆత్మజ్ఞానమును పొందకుండగనే మరణించినచో, దేవతలగుదురు. కాని వారు వేదాంతప్రమాణములో ఉద్యాసితులైనచో జీవన్ముక్తులగుట నిశ్చయము.

ఇపుడు శ్రీకృష్ణుడు అసురీసంపదను ముందు సంగ్రహముగను, ఆ తరువాత వివరముగను వర్ణించబోవుచున్నాడు. మనకు ఏది పరిహరించవలయునో తెలియుటకొరకై ఈ లక్షణములిచట వర్ణింపబడుచున్నవి. తాత్పర్యమేమనగా, చెడు గుణములను దూరముగా పెట్టి, సద్గుణములను అలవరచుకొనవలెను.

**అధ్యాయము 16, శ్లోకము 4:**

दंभो दर्पोऽभिमानश्च क्रोधः पारुष्यमेव च।
अज्ञानं चाभिजातस्य पार्थ संपदमासुरीम् ॥ ४ ॥

దంభో దర్పోభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్ (4)

**పార్థ** = పృథాతనయుడవగు ఓ అర్జునా!, **ఆసురీమ్** = అసురులకు సంబంధించిన, **సంపదమ్** = సంపదను, **అభిజాతస్య** = అభిముఖముగా పుట్టినవానికి, **దంభః** = తన గొప్పను ప్రకటించు కొనుట, **దర్పః** = గర్వము, **చ** = మరియు, **అభిమానః** = ఇతరులు తనను గౌరవించవలెననే ఆగ్రహము, **క్రోధః** = కోపము, **ఏవ** = నిశ్చయముగా, **చ** = మరియు, **పారుష్యమ్** = కటుత, **చ** = మరియు, **అజ్ఞానమ్** = అజ్ఞానము ఉండును.

> పృథాతనయుడవగు ఓ అర్జునా! అసురుల సంపదకు అభిముఖముగా పుట్టినవానియందు తన గొప్పను ప్రకటించుకొనుట, గర్వము, ఇతరులు తనను గౌరవించవలెననే ఆగ్రహము, కోపము, కటుత మరియు అజ్ఞానము నిశ్చయముగా నుండును (4).

ఆసురీ యనగా అసురులకు సంబంధించినది. మన సాహిత్యమంతా దేవాసుర సంగ్రామముల గాథలతో నిండియున్నది. మన మనస్సులో చెలరేగే ఘర్షణలను ఈ గాథలు ప్రతిబింబించుననని ఇప్పుడు మనకు స్పష్టమైనది గదా! ప్రతివానిలో దైవీగుణములు కొంతవరకు ఉండును. అహింస, దయ, ప్రేమ ఇత్యాదులు అతిసహజగుణములు. ప్రతివ్యక్తి కొన్ని విశిష్ట పరిస్థితులలో కనీసము తన విషయములోనైననూ ఈ గుణములను కలిగియుండును. ఇవి మాత్రమే గాక అసురగుణములు కూడ ఉండును. ఈ రెండింటి మధ్యలో ఘర్షణ సర్వదా చెలరేగుచుండును. ఈ ఘర్షణయే మన గాథలలో దేవాసురసంగ్రామము అని వర్ణించబడును. మూర్తీభవించిన ఆసురీ సంపద అనదగ్గ వ్యక్తి ఎవరైనా ఉన్నా, దానికి కారణము అతని ఆలోచన దుష్టమగుటయే గాని వ్యక్తి దుష్టుడగుట కాదు. సంఘర్షణలన్నీ మున్ముందుగా మనస్సు లోపల జరిగి, ఆ తరువాతనే బాహ్యప్రపంచములో ప్రకటమగును. యుద్ధములన్నీ ముందుగా మనస్సులో జరుగును. దానికి అచట పరిష్కారము దొరకనిచో, అపుడు అది బయట చెలరేగును.

యోగ్యమగు విచారణను చేసినచో, ఈ ఘర్షణలు ఉదయించుటతోడనే అస్తమించును. అవి ఉదయించకుండగా ఆపే ప్రయత్నమును మనము చేయుట లేదు. అవి ఉదయించుట సహజము. కాని వాటిని మనము మనస్సు లోపలనే సమాధానపరచుకొనుటకు యత్నించెదము. అట్లు చేసే శక్తి లేనిచో, లేదా చుట్టుప్రక్కలనున్నవారు సమాధానపరుచుటకు బదులుగా అగ్నికి ఆజ్యమును తోడు చేసినచో, సంఘర్షణ చెలరేగును.

ఈ ఆసురీసంపదవలననే మహాభారత యుద్ధమును తప్పించుట అసంభవమయ్యెను. అర్జునుడు ఎదుర్కొనుచున్న యుద్ధమునకు మూలములో ఉన్నది ఆసురీసంపదయే గనుక, శ్రీకృష్ణుడు దానిని వర్ణించుట ఎంతయూ యుక్తియుక్తముగా నున్నది. ఆసురీసంపదయని ఇచట వర్ణించబడిన ఆలోచనాధోరణి దుర్యోధనుని యందు ఉండుట వలననే ఈ సమస్యలన్నియు ఉత్పన్నమైనవి. ఈ గుణములు మాత్రమే గల వ్యక్తి ఒక్కడైననూ ఉండడని మనము తెలియుట ముఖ్యము. ప్రతి వ్యక్తిలో కొద్దో గొప్పో దైవీసంపద ఉండును. మన అవగాహన కొరకు మాత్రమే ఇచట ఆసురీసంపద వర్ణింపబడుచున్నది.

ధర్మము విషయములో ఉండే మిథ్యాచారము (ధర్మధ్వజిత్వమ్) దంభమనబడునని శ్రీశంకరులు నిర్వచించిరి. ఇతరుల క్షేమముకొరకు గాక, తన పేరు ప్రతిష్ఠలకొరకై ధర్మకార్యములను చేయుచూ, తాను ధర్మాత్ముడనని నలుగురివద్ద చాటించువాడు దంభము గలవాడనబడును. ఉదాహరణకు అతడు దానమును చేయును. కాని దాని వెనుకనున్న ప్రేరణ దానబుద్ధి కాదు; తన ప్రతిష్ఠను పెంచుకొనుటకై దానమును చేయును. దీనిని దానము అనుటకంటె, స్వీయఖ్యాతి సంవర్ధనముకొరకై పెట్టే పెట్టుబడియని చెప్పవచ్చును. అతడు తనలోని సుగుణములను ఉన్నవాటిని, లేనివాటిని కూడ ప్రచారము చేయుచుండును.

దర్పః అనగా గర్వము. ఒకనివద్ద కొద్దిగా జ్ఞానము, లేక నైపుణ్యము, లేదా సంపాదించినది గాని, వారసత్వములో సంక్రమించినది గాని ధనము ఉన్నది. అతని వద్ద అవి ఉండుటకు అనేక కారణములు ఉండును. కాని అతడు వాటిని పరిగణించనివాడై, గర్వించియుండును. కొందరు గొప్ప వంశములో పుట్టినందులకు గర్వించియుందురు.

తన గురించి అతిశయించిన మాన్యతను కలిగియుండుట, ఇతరులు తనను గౌరవించవలెననే పట్టుదల అభిమానమనబడునని మనము చూచియున్నాము.

క్రోధః అనగా కోపము. నీవు ఒక పనిని చేయుటలో విఫలుడవైనచో, నిరాశ కలిగి దాని నుండి దుఃఖము కలుగును. ఈ దుఃఖము కోపముగా రూపాంతరమును చెందును. కోపమునకు వశుడైన వ్యక్తి కర్తవ్య-అకర్తవ్య-వివక్షణను పూర్తిగా విస్మరించి, పూర్వములో తనకు విపరీతమగు హానిని కలిగించిన చర్యలను మరల ఆచరించును. అతని ప్రవర్తన అతనికి మాత్రమే గాక, ఇతరులకు కూడ వినాశకారిగా పరిణమించును.

పారుష్యము మార్దవమునకు విరోధి. ఇది మాటలాడుట మొదలగు చేష్టలలో ప్రకటమగును. వెటకారముతో, మరియు పరిహాసపూర్వకమగు నవ్వుతో ఇతరవ్యక్తికి మనస్సునకు కష్టము కలుగు విధముగా కటువుగా మాటలాడుట పారుష్యమనబడును. గుడ్డివానిని, లేక కుంటివానిని అందగాడని వెటకారము చేయుట అను దృష్టాంతమును శ్రీశంకరులు ప్రస్తావించిరి. వెటకారముతో గూడిన విమర్శ ఇతరుల మనస్సునకు చాల కష్టమును కలిగించును. పదములకు మనస్సులో పీడను కలిగించే శక్తి గలదు. ఈ శక్తిని గురించి పట్టించుకోకుండా, హానికరమగు మాటలను పలుకుట పారుష్యమనబడును. ఇందువలననే, నా మాట అత్యంతమధురముగా నుండువలెను (జిహ్వా మే మధుమత్తమా) అని మనము ప్రార్థించెదము.

వివేకములేని విషయపరిజ్ఞానమునకు అజ్ఞానమని పేరు. తెలియకపోవుటలో ఇబ్బంది లేదు. కాని ఏది మంచి, ఏది చెడు అను విషయములో తప్పుడు నిష్కర్షలను చేసుకొని కూర్చున్నచో, వాటివలన చాల హాని కలుగును. ఉదాహరణకు నీతివిహీన ప్రవర్తనను లౌకికవ్యాపారసరళి యని సమర్థింప జూచెదరు. నీతి భ్రష్టమగుట అనగా నిదియే. దీనికి అంతకూ మూలము ఎట్లాగైనా ధనమును సంపాదించాలనే ఒత్తిడి. ధనము రక్షణనిచ్చుననే తప్పుడు నిష్కర్ష దీనికి హేతువు. చేయకూడదని తెలిసినా, తప్పనిసరియై చేయుట ఒక స్థాయి. తప్పు పనిని సమర్థించే తత్త్వశాస్త్రమును వల్లించుట మరో స్థాయి. ఇదియే అజ్ఞానము. ఇది సరళమగు అజ్ఞానము కాదు. ఇది తప్పుడు అవగాహన. వస్తువులో లేని విలువను దానికి ఆపాదించుట. రక్షణ లేశమైననూ లేని దానియందు రక్షణను దర్శించుట. జీవనమూల్యముల విషయములో గల సమ్మోహముతో ఇది ఆరంభమగును. దాని నుండి ధర్మ-అధర్మ-వివేకము లేకుండుట, ప్రాథమికతల (priorities) విషయములో సమ్మోహము సహజముగా నిర్మాణమగును. దీనికి ఆత్మ-అనాత్మ-సమ్మోహము తోడగును. ఇవి అన్నియు అజ్ఞానమే. కాని ఇచట మనము ఆత్మ-అనాత్మ-అజ్ఞానమును గురించి గాక, అసురులను గురించి చర్చిస్తున్నాము గనుక, ఇచటి అజ్ఞానము నైతిక-అజ్ఞానము మాత్రమే.

ఇవి ఆసురీసంపదతో నలరారువాని ఘనలక్షణములు.

దైవీ మరియు అసురీ సంపదలతో కూడియున్నవారి గతిని గురించి శ్రీకృష్ణుడు తరువాతి శ్లోకములో చెప్పుచున్నాడు:

**అధ్యాయము 16, శ్లోకము 5:**

दैवी संपद्विमोक्षाय निबंधायासुरी मता ।
मा शुचस्संपदं दैवीमभिजातोऽसि पाण्डव ॥ ५ ॥

దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా
మా శుచస్సంపదం దైవీమభిజాతోఽసి పాండవ (5)

**దైవీ సంపత్** = దైవీ సంపద, **విమోక్షాయ** = మోక్షము కొరకు, **ఆసురీ** = అసురీ సంపద, **నిబంధాయ** = బంధము కొరకు, **మతా** = చెప్పుబడినది, **మా శుచః** = చింతిల్లకుము, **పాండవ** = ఓ పాండుపుత్రా అర్జునా!, **దైవీం సంపదం అభి** = దైవీ సంపదకు అభిముఖముగా, **జాతః అసి** = పుట్టితివి.

> దైవీ సంపద మోక్షమునకు, అసురీ సంపద బంధమునకు హేతువు అగునని చెప్పబడినది. ఓ పాండుపుత్రా అర్జునా! చింతిల్లకుము. నీవు దైవీ సంపదతో జన్మించిన వాడవు (5).

దైవీసంపద్యుక్తుని సంస్కారములన్నియు సంసారబంధమునుండి విముక్తికి సహకరించును. ఈ విషయమును నొక్కి చెప్పుటకొరకై 'వి' అను ఉపసర్గ ప్రయోగించబడినది. అభీష్టములగు విషయములనుండి విముక్తిని గోరువారు లేరు గదా! బంధము లేనిదే మోక్షము లేదు గనుక, బంధము ఉన్నపుడు మాత్రమే మోక్షము ప్రస్తావించబడును. ఈ బంధము ఎట్టిది? బంధము భౌతికము కావచ్చును. లేదా, మానసికము కూడా కావచ్చును. ఈ వివిధవస్తువులను నేను విడువలేకున్నాను. వీటికి నేను యజమానిని అనిపించిననూ, వాస్తవములో అవియే నాకు యజమానులై యున్నవి. ఆరంభములో బహుశః నేను వాటిని పట్టుకున్ననూ, కాలక్రమములో అవి నన్ను పట్టుకొనుట నారంభించినవి.

కారాగారములో వ్యక్తి బంధింపబడియున్ననూ, తాను బద్ధుడనని భావించ వలసిన ఆవశ్యకత లేదు. సమస్తస్థూలప్రపంచము, మరియు దేహేంద్రియమనస్సంఘాతము కలిసిననూ నిన్ను బంధించలేవు. 'నేను బద్ధుడను; నాలో లోటు గలదు; నేను అల్పుడను; నేను మర్త్యుడను; నేను ఈశ్వరుని కంటె భిన్నుడను' అనే భావనలతో గూడియున్న ఈ మౌలికబంధమునుండి మనము విముక్తిని ఆకాంక్షించుచున్నాము. నన్ను నేను ఏ క్షణములో ఇతరముకంటె భిన్నముగా దర్శించెదనో, ఆ క్షణములో భయము, బద్ధుడననే భావన గలవు. భేదమును దర్శించనివాడు భయమునుండి మాత్రమే గాక, సర్వమునుండి విముక్తుడగును. మనమిచట సంసారాంతర్గతముగా నుండి కొంతకాలము వరకు కొనసాగే మోక్షమును గాక, ఆత్యంతిక సంసారోపరమము అనే మోక్షమును గోరుచున్నాము.

ఈ దైవీసంపద మోక్షరూపమగు జ్ఞానమునకు అలంబనమగును. దీనికి భిన్నముగా ఆసురీసంపద బంధహేతువు అగును. ఇది బంధమును క్రొత్తగా సృష్టించదు. ఏలయన, ఈ బంధభావన ఉండనే ఉన్నది. కాని, ఈ లక్షణములున్నచో, బంధము శాశ్వతమగును. ఆసురీసంపద సంసారమును సుస్థిరము చేయును. మనము సంసారమునుండి విముక్తిని పొందుటకై దైవీసంపద ఆవశ్యకమగును.

శ్రీకృష్ణుడు రాక్షసీ సంపదను గురించి ప్రస్తావించలేదు. కాని శ్రీశంకరులు ప్రస్తావించినారు. ఎవనినుండి స్వీయవస్తువులను, ఆత్మగౌరవమును, పిల్లలను, ఆఖరికి ప్రాణములను, మరియు పుణ్యమును కూడ రక్షించుకునే అవసరముండునో, వాడు రాక్షసుడనబడును. ఇతరులు పుణ్యకార్యములను చేసుకొనుచుండగా, వాటికి కూడ అడ్డు తగులువాడు రాక్షసుడనబడును.

రాక్షసీసంపదకు, ఆసురీసంపదకు యథార్థమగు భేదము లేదు. కావుననే, శ్రీకృష్ణుడిచట ఆసురీసంపదను మాత్రమే చర్చించినాడు. ఇటువంటి విభాగములను ప్రస్తావించిన ప్రతి సందర్భములో, జనులలో 'నేను ఏ వర్గమునకు చెందెదను?' అను ఉత్కంఠ కలుగుట సహజము. ఇట్టి ఆత్మ విమర్శ మానవుల సహజస్వభావము. అర్జునునకు కూడ ఇట్టి స్వభావమే ఉండియుండును. అతనికి ధైర్యమును కలిగించుటకై, శ్రీకృష్ణుడు 'చింతిల్లకుము (మా శుచః)' అని చెప్పు చున్నాడు. ఎవనికి వాడు విమర్శ చేసుకుంటే, ప్రతివానిలో కొంత దైవీసంపద, మరికొంత ఆసురీసంపద ఉన్నట్లు స్పష్టమగును. దీనికి అర్జునుడు కూడ అపవాదము కాదు.

అర్జునునకు తన యోగ్యత విషయములో సందేహము ఉండుట శ్రీకృష్ణునకు సమ్మతము కాదు. కావుననే, 'నీవు దైవీసంపదతో జన్మించినావు' అని భగవానుడు ఆతనితో చెప్పుచున్నాడు. భగవానుడాతనిని 'పాండవ' అని సంబోధించి, ఆతడు మహాత్ముడగు పాండుని కుమారుడనియు, కావున ఆతనికి మోక్షమునకు సజ్జీతుని చేసే దైవీ సద్గుణములన్నియు గలవనియు గుర్తు చేయుచున్నాడు.

ఇపుడు శ్రీకృష్ణుడింకనూ అసురీసంపదయొక్క వర్ణనను కొనసాగించు చున్నాడు. ఈ రాబోవు భాగముతో ఆధునిక ఆలోచనా ధోరణికి, ప్రధానముగా విపణి-మనస్తత్త్వమునకు, అత్యాధునిక వ్యాపారసంస్థల విచారధారకు చాల దగ్గర సంబంధము గలదు. అంతర్జాతీయ వాణిజ్య వేత్తల మనోవిజ్ఞానమును ఒకే ఒక వాక్యములో చెప్పవచ్చును. 'ఈ నాటికి దీనిని సాధించినాను; రేపటికి దీనిని సాధిస్తాను'. ఇతరులు తమ ధనమును ఖర్చుపెట్టే విధముగా వారికి నచ్చ జెప్పుటయే ఈనాటి వాణిజ్యవిచారధారలోని ప్రధానాంశము.

**అధ్యాయము 16, శ్లోకము 6:**

द्वौ भूतसर्गौ लोकेऽस्मिन् दैव आसुर एव च ।
दैवो विस्तरशः प्रोक्त आसुरं पार्थ मे शृणु ॥ ६ ॥

ద్వౌ భూతసర్గౌ లోకేస్మిన్ దైవ అసుర ఏవ చ
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు (6)

అస్మిన్ = ఈ, లోకే = లోకములో, దైవః = దేవతలకు సంబంధించినది, చ = మరియు, ఏవ = నిశ్చయముగా, అసురః = రాక్షసులకు సంబంధించినది అనే, ద్వౌ = రెండు, భూతసర్గౌ = ప్రాణుల సృష్టులు గలవు, దైవః = దైవసర్గము, విస్తరశః = విస్తారముగా, ప్రోక్తః = చెప్పబడినది, పార్థ = ఓ పృథాకుమారా! అర్జునా!, అసురమ్ = అసుర లక్షణములను గూర్చి, మే = నా (మాటలలో), శృణు = వినుము.

ఈ జగత్తులో దైవ, మరియు ఆసుర అనే ద్వివిధ ప్రాణిసృష్టి గలదు. దైవసర్గమును గురించి విస్తారముగా చెప్పియున్నాను. ఓ పృథాకుమారా! అర్జునా! అసుర లక్షణములను గూర్చి చెప్పెదను. వినుము (6).

ఈ జగత్తులోని ద్వివిధప్రాణిసృష్టిని గూర్చి ఈ శ్లోకము ప్రస్తావించుచున్నది. ఆ ప్రాణులు మానవులే. ఏలయన, కర్తృత్వభోక్తృత్వములను నెత్తిమీద వేసుకొని కర్మవశులై ఉండే జీవులు మానవులు మాత్రమేనని శ్రీశంకరులు వివరించిరి. ఈ మానవులలో దైవీగుణములతో విరాజిల్లు వారు, అసురసంబంధి గుణములతో కూడియున్నవారు అను రెండు రకములు గలవు. కొందరికి ఈ గుణములు పుట్టుకతో వచ్చునని శ్రీశంకరులు అభిప్రాయపడిరి. ఏలయన, ప్రజాపతికి దేవతలు, అసురులు అనే ద్వివిధసంతానము గలదని శ్రుతి (ద్వయా హ వై ప్రాజాపత్యా దేవాశ్చాసురాశ్చ, బృహదారణ్యక ఉపనిషత్, 1-3-1) చెప్పుచున్నది. అనగా, సృష్ట్యాది నుండియు ఈ రెండు రకముల జీవులు గలరు. కొందరు పుట్టుకనుండియు కొన్ని విశిష్ట లక్షణములను కనబరచుట మనకు అనుభవములో నున్నది. ఈ రెండు రకములలో దేవలక్షణములు వర్ణించబడినవి. ఇపుడు శ్రీకృష్ణుడు అసురలక్షణములను విస్తారముగా వర్ణించబోవు చున్నాడు. 'అర్జునా! నా మాటలను వినుము (మే శృణు)' అని ఆయన హెచ్చరించుచున్నాడు. సాధారణముగా ఒక ప్రధానమైన విషయమును చెప్పుటకు ముందు ఇట్లు హెచ్చరించుట సహజము. శ్రీకృష్ణుడు ఆసురీలక్షణముల వర్ణనను వినుమని అర్జునుని ఆహ్వానించుటకు కారణమేమి? ఆ లక్షణములకు దూరముగా నుండవలెనని భగవానుని అభిప్రాయమని శ్రీ శంకరులు వివరించిరి. నిషిద్ధవిషయముల పరిజ్ఞానమునకు కర్తవ్యవిషయముల పరిజ్ఞానముతో సమానమగు ప్రాముఖ్యము గలదు. ఈ అధ్యాయము పూర్తియగునంతవరకు ఆసురీసంపదను తప్పించి మరియొక విషయము చర్చకు రాదు. ఏలయన, వీటిగురించి స్పష్టమగు పరిజ్ఞానము ఉన్నవాడు మాత్రమే వీటిని పరిహరించగల్గును. కావున, ఈ గుణములు తరువాతి శ్లోకముతో మొదలిడి విస్తారముగా వర్ణించబడుచున్నవి.

**అధ్యాయము 16, శ్లోకము 7:**

प्रवृत्तिं च निवृत्तिं च जना न विदुरासुराः ।
न शौचं नापि चाचारो न सत्यं तेषु विद्यते ॥ ७ ॥

ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే (7).

ఆసురాః = అసురలక్షణములు గల, జనాః = జనులు, ప్రవృత్తిమ్ = కర్తవ్యకర్మను, చ = మరియు, నివృత్తిమ్ = వెనుకకు తగ్గవలసిన దానిని, న విదుః = ఎరుంగరు, చ =

మరియు, తేషు = వారియందు, శౌచమ్ = అంతరశౌచము, న విద్యతే = ఉండదు, అపి చ = మరియు, ఆచారః = సచ్ఛీలము, న = ఉండదు, సత్యమ్ = సత్యము, న = ఉండదు.

అసురలక్షణములు గల జనులు కర్తవ్యకర్మను, వెనుకకు తగ్గవలసిన దానిని కూడ ఎరుంగరు. వారి యందు అంతరశౌచము గాని, సచ్ఛీలము గాని, సత్యము గాని ఉండదు (7).

ఇంద్రియభోగవములను మించి మరియొక పురుషార్థమును కనజాలని వ్యక్తి అసురుడనబడునని మనము చూచి యున్నాము. ఇట్టివానికి ప్రవృత్తి గాని, నివృత్తి గాని తెలియదు. ఇవి క్రమముగా కర్తవ్యకర్మలను మరియు నిషిద్ధకర్మలను నిర్దేశించే పారిభాషికపదములు. వీటిలో కొన్ని యజ్ఞయాగాదులు, ప్రార్థనలు మరియు నైతికవిలువలు మొదలగు వాటికి సంబంధించిన విధి నిషేధములు కాగా, మరికొన్ని వంట, భోజనము మరియు దానము ఇత్యాది లౌకిక క్రియా కలాపమునకు సంబంధించి యుండును. శ్రుతి విహితములైనవి మాత్రమే కాకుండా, ఈ ధర్మాధర్మములు మనకందరకీ సామాన్యవివేకమును బట్టి తెలియుచుండును. ఇతరులు మనవిషయములో ఎట్లు ప్రవర్తించవలెనని మనము అపేక్షించెదమో, అటులనే మనము వారియెడల ప్రవర్తించుట ధర్మము అగును. దానికి విరుద్ధమైనది అధర్మము. వీటికి పురుషార్థముతో గల సంబంధమును శ్రీశంకరులు వివరించిరి. మానవుడు తన జీవితములో పొందగోరే పరమ లక్ష్యమునకు పురుషార్థమని పేరు. మానవుడు అర్థమును గాని, కామమును గాని, లేక మోక్షమును గాని కోరవచ్చును. ఆ అభీష్టలక్ష్యమును సాధించుటకై కొన్ని చేయదగిన కర్మలు, మరికొన్ని చేయకూడని కర్మలు గలవు. ఏ కర్మలను చేయవలెను? ఏ కర్మలను చేయరాదు? అను పరిజ్ఞానము అసురీప్రవృత్తి గలవారి యందు ఉండదు. ఒకవేళ వారికి తెలిసిననూ, వారు దానిని పట్టించుకోరు. ఉదాహరణకు, దొంగతనము చేయుట తప్పని తెలియని చోరుడు ఎవడు గలడు? దొంగతనము తప్పని తెలియని చోరుడు లేడు. ఏలయన, తన వస్తువులు అపహరించబడుట అతనికి సమ్మతము కాదు గదా! ఈ ధర్మము అతనికి తెలియునే గాని, వంటబట్టలేదు. అతనికి ఈ జీవనమూల్యము గురించి తెలిసిననూ, దాని మహత్త్వము గురించి తెలియదు. తన ప్రవర్తన తనకు క్షేమకారి కాదనియు, పైగా అది తనకు అనర్థమును కలిగించుననియు అతనికి తెలియదు.

ఇంతేగాక, ద్వేషము ఇత్యాదులను దూరముగా పెట్టి, మనస్సును శుచిగా నుంచుకొనుట

వారికి తెలియదు. మరియు, వారిలో ఆధ్యాత్మిక-అనుశాసనము గాని, ఇతరులతో వ్యవహరించునపుడు సచ్ఛీలము (న అపి చ ఆచారః) గాని లేదు. వారి పలుకులకు సత్యము బహుదూరము (న సత్యమ్). ఒక అసత్యమును పలికిన తరువాత, దానిని నిలబెట్టుటకై వరుసగా అసత్యములను పలుకక తప్పదు. ఒకే ఒక అసత్యమును పలికి అంతటితో దానికి స్వస్తి పలుకగల వాడు లేడు. ఒక అసత్యమును పరిరక్షించుటకై మరికొన్ని అసత్యములు ఆవశ్యకమగును. వాటిని మరల కాపాడుటకు ఇంకో కొన్ని అసత్యములను పలుకవలసి యుండును. సేమ్యాతో చేసిన పదార్థమును ఆరగించునపుడు, ఒకే ఒక సేమ్యా శకలమును పైకి తీయుట సంభవము కాదు. ఒకే ఒక అబద్ధమును చెప్పుట కూడ అట్టిదియే. అది జరిగే పని కాదు. కావుననే, శ్రీశంకరులు వీరిని అసత్యమును పలికే మోసగాళ్ళు (అనృతవాదినః మాయావినః) అని వర్ణించిరి.

**అధ్యాయము 16, శ్లోకము 8:**

असत्यमप्रतिष्ठं ते जगदाहुरनीश्वरम् ।
अपरस्परसंभूतं किमन्यत् कामहैतुकम् ॥ ८ ॥

అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్
అపరస్పరసంభూతం కిమన్యత్ కామహైతుకమ్ (8).

**జగత్** = జగత్తు, **అసత్యమ్** = అసత్యము, **అప్రతిష్ఠమ్** = ధర్మాధర్మముల ఆలంబనము లేనిది, **అనీశ్వరమ్** = భగవానుడు లేనిది, **అపరస్పరసంభూతమ్** = స్త్రీపురుషుల కలయికవలన పుట్టినది, **కామ హైతుకమ్** = కామమే కారణముగా గలది, **కిం అన్యత్** = మరియేమి గలదు? (అని), **తే** = వారు, **ఆహుః** = పలికెదరు.

> జగత్తు అసత్యము. దీనికి ధర్మాధర్మముల ఆలంబనమేమియు లేదు. దీనికి మూలములో భగవానుడు లేడు. స్త్రీపురుషుల కలయికచే పుట్టిన ఈ జగత్తునకు కామమే కారణము. ఇంతకు మించి మరియేమి గలదు? అని వారు పలికెదరు (8).

వారు ఇట్టి జీవితమును గడుపు చుండుటయే గాక, వారు తమకు గల దృఢమగు కొన్ని అభిప్రాయములను ఇతరులపై రుద్దుటకు యత్నించెదరు. ఇచట జగత్ అనగా ప్రపంచము అని

గాక, మానవులు అని అర్థమును చెప్పవలెను. మానవులలో సత్యము లేదని (అసత్యమ్) వారు చెప్పెదరు. తాము అసత్యములను పలుకుచుందురు గనుక, ఇతరులు కూడ అటులనే చేయుదురని వారి భావన. వారి స్వీయప్రవర్తన వారికి ప్రపంచముపై గల దృష్టికోణమును రంజితము చేయును. బ్రతుకుటకు అసత్యము అనివార్యమని వారు విశ్వసించెదరు. కావున, ఎవరు బాగుగా అసత్యమును పలుకగలరు అనునది ప్రధానాంశమగును. మరియు, మానవుల ప్రవర్తనకు అలంబనమనదగిన నైతిక విలువలు ఏమియూ లేవని వారు విశ్వసించెదరు. మనము ప్రపంచములో వ్యవహరించునప్పుడు ధర్మాధర్మములను పరిగణనలోనికి తీసుకొనెదము. ఉచితమగు ప్రవృత్తి పుణ్యమునకు, అనుచితప్రవృత్తి పాపమునకు హేతువని మనము విశ్వసించెదము. కాని వీరు అట్లు అంగీకరించరు. మనిషి బ్రతికినంతకాలము సుఖముగా జీవించవలెననియు, అప్పు చేసి పప్పు కూడు తినవలెననియు వారి సిద్ధాంతము. దేహము బూడిద అయిన పిదప మరల ఎక్కడ నుండి తిరిగి వచ్చును? (యావజ్జీవేత్సుఖం జీవేత్ ఋణం కృత్వా ఘృతం పిబేత్, భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః) అని వారు చెప్పెదరు. సుఖమును పొందుట అను లక్ష్యము సిద్ధించుటకై వారు అడ్డదారులను త్రొక్కుటకు వెనుకాడరు. వారి దృష్టిలో చేసిన కర్మకు ప్రతిఫలము లేదు. వీరికి లోకాయతికులు, ప్రకృతివాదులు, అనియమవాదులు, లేక భౌతికవాదులు అని పేరు. అప్పుచేసి, ఋణ–ఆర్థత–పత్రములను (credit cards) విచ్చలవిడిగా వాడుకొంటూ, వాటిని తిరిగి తీర్చాలనే ఆలోచన లేకుండగా సుఖించదగును. పుణ్యపాపములు కంటికి కనబడేవి కావు గనుక, వాటి ఉనికియందు వారికి విశ్వాసము లేదు. ఈ దేహము బూడిద అయిన తరువాత చేసిన పుణ్యపాపములకు జవాబు దారీ చెప్పవలసిన జీవుడు అనే వాడు లేడు గనుక, ఎటువంటి పాపమును చేసిననూ తప్పించుకొనవచ్చును. జీవితము సుఖానుభవము కొరకు మాత్రమే ఉన్నదని వారి విశ్వాసము. ఈ మాట మనకు కూడ అంగీకారమే. కాని, దానిని సాధించుటకు మనము అనుసరించే మార్గము వేరు. పుణ్యపాపములను అంగీకరించినచో, మన కర్మలకు మనము బాధ్యులమై, భవిష్యత్తులో కర్మఫలమును అనుభవించక తప్పదు. లోకాయతికుల సిద్ధాంతములో ఈ దేహము రాలిపోవుటతో సర్వము అంతమగును గనుక, ధర్మాధర్మములకు అలంబనము లేదు. మానవుడు ఇక్కడ పొందేవాటిపై, పొందగలిగే వాటిపై మాత్రమే వాని ఆనందము నిర్భరమై ఉన్నది గనుక, వాటిని పొందుటకు ఏ విధమైన సాధనమునైననూ అవలంబించవచ్చును. సాధనముల మంచి–చెడులతో పని లేదు.

ఇట్లు గాక, పుణ్యపాపములను అంగీకరించినచో, కర్మనియతిని, దానిని అమలు చేసే కర్మ ఫలదాతను కూడ అంగీకరించవలసి యుండును. అనగా, కర్మనియతికి అనురూపముగా

ధర్మాధర్మములకు అనుగుణముగా భగవానుడు కర్మఫలములను ఒసంగును. అసురసంపద గలవారు భగవానుని స్వీకరించరు. అది వారి సిద్ధాంతమునకు విరుద్ధము. కావున, కర్మనియతి గాని, కర్మఫలదాతగాని లేడని వారు వాదింతురు. ఈ జగత్తు అనీశ్వరము అని వారు స్వీకరించెదరు.

ధర్మాధర్మములు లేనిచో, మానవులు ఎట్లు జన్మించిరి? మానవులు జన్మించుటకు కామప్రేరితులైన (కామహైతుకమ్) స్త్రీపురుషుల కలయికయే ఏకైక కారణము. ఒక వ్యక్తికి గల విశిష్టలక్షణములకు జన్యుకణములు మాత్రమే కారణము. పుణ్యపాపములు ఆధారముగా, జన్మించే వంశము నిర్ధారితమగుట అనుదానికి వారి వాదములో మాన్యత లేదు. ఈ సర్వము ప్రకృతిలో తనంత తానుగా ఘటిల్లుచున్నది. జన్మ అనే ఘటనలో పుణ్యపాపములు గాని, ఈశ్వరుడు గాని కానవచ్చుట లేదు గనుక, అవి లేవనియే వారు నిర్ధారించెదరు. స్త్రీపురుషులు కామప్రేరితులై కలియుట మాత్రమే కానవచ్చుచున్నది గనుక, అదియే పుష్కలకారణము. మరియేమి గలదు? ఇది వారి సిద్ధాంతము. పుణ్యపాపములు, వ్యక్తి తన కర్మకు తాను బాధ్యుడగుట అను వాటిని అంగీకరించని ఈ సిద్ధాంతములో, మనిషి కనీసవ్యవధిలో అత్యధికసుఖములను గుంజుకొని అనుభవించుటయే జీవితలక్ష్యమగును. అకాలమరణము సంభవించినచో, సుఖానుభవములనుండి వంచితుడయ్యే ప్రమాదము కలదు గనుక, సమయమును వృథా చేయరాదు. పైగా, వృద్ధాప్యము మీద బడిన తరువాత భోగానుభవము సాధ్యము కాకుండును. ఈ విచారధారలోని సారమేమనగా, నీకు మిగిలియున్న కొద్ది సంవత్సరముల జీవితకాలములో వీలైనన్ని భోగముల ననుభవించవలెను. ఎవని శక్తి అత్యధికమో, వాడు రంగములో మిగిలియుండును. ఎవడైతే పరవంచనలో మరియు పరిస్థితులను తనకు అనుకూలముగా మలుచుకొనుటలో సిద్ధహస్తుడై ఉండునో, వాడు మాత్రమే అత్యధికశక్తిమంతుడై ఉండును.

**అధ్యాయము 16, శ్లోకము 9:**

एतां दृष्टिमवष्टभ्य नष्टात्मानोऽल्पबुद्धयः ।
प्रभवंत्युग्रकर्माणः क्षयाय जगतोऽहिताः ॥ ९ ॥

ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోల్పబుద్ధయః
ప్రభవంత్యుగ్రకర్మాణః క్షయాయ జగతోహితాః (9).

**ఏతామ్** = ఈ, **దృష్టిమ్** = దృష్టికోణమును, **అవష్టభ్య** = ఆశ్రయించినవారై, **నష్టాత్మానః** = నశించిన మనస్సు గలవారై, **అల్పబుద్ధయః** = అల్పమగు వివేకము గలవారై, **ఉగ్రకర్మాణః** = క్రూరమగు కర్మల నాచరించుచున్నవారై, **జగతః** = జగత్తునకు, **అహితాః** = శత్రువులై, **జగతః** = జగత్తుయొక్క, **క్షయాయ** = వినాశము కొరకు, **ప్రభవంతి** = సమర్థులగుచున్నారు.

> వారి దృష్టికోణమునాశ్రయించి, నశించిన మనస్సు గలవారై, అల్పమగు వివేకము గలవారై, క్రూరకర్మల నాచరించుచూ, జగత్తునకు శత్రువులై జగత్తుయొక్క వినాశము కొరకు సమర్థులగు చున్నారు (9).

ఈ దృష్టికోణమునాశ్రయించిన వారికి పరలోకసాధనము లుప్తమగును. మరియొక జన్మ గలదను ఆలోచనయైననూ వారికి కలుగదు. ఏలయన, వారి మస్తిష్కము నశించినది (నష్టాత్మానః). ఏది సత్యము? ఒక విశిష్ట పరిస్థితిలో ఏ కర్మను ఎన్నుకొని ఆచరించ వలయును? ఇత్యాది వివేకము వారియందు ఉండదు. చిన్న చిన్న విషయములలో కూడ వారు అతిశయించిన సమ్మోహమునకు వశులై యుందురు. ధర్మాధర్మవివేకము నుండి చ్యుతులైన ఆ నష్టాత్ములు భవిష్యత్తులో కడగండ్ల పాలగుదురని శ్రీశంకరులు వివరించిరి.

వారి ఆలోచనాశక్తి అల్పముగా నుండును (అల్పబుద్ధయః). ఇంద్రియగోచరమగు విషయములను మించి ఇతరమునందు వారి మనస్సునకు శ్రద్ధ ఉండదు. కంటికి కనబడేది మాత్రమే సత్యము. ఇంద్రియభోగ్యములగు విషయములను మించిన సత్యము లేదు. అల్పమనగా తక్కువ. వారికి బుద్ధిశక్తి సున్న అని చెప్పుటకు వీలులేదు. ఏలయన, వారు కూడ ఆలోచించి నిర్ణయించిన కార్యములను మాత్రమే చేబట్టెదరు. కాని వారి ఈ ఆలోచనల వెనుకనున్న వివేకము అత్యల్పము. ఏమి తినవలెను? బ్రతుకుటకు ఏమి చేయవలెను? పశువులకు ఇంత మాత్రము పరిజ్ఞానమే ఉండును. వారు కూడ పశువుల వలె వివేకము, సంకల్పశక్తి లేనివారైనచో, శాస్త్రము వారికి వర్తించెడిది గాదు.

ఇంతేగాక, వారు క్రూరమగు కర్మల నాచరించెదరు (క్రూరకర్మాణః). స్వార్థము మాత్రమే ప్రముఖమై దాని సాధనకు అవలంబించే సాధనము విషయములో అడ్డదారులను త్రొక్కుటకు సిద్ధపడే వ్యక్తి తన చర్యలవలన ఇతరులకు కలిగే హానిని గురించిగాని, ఇతరుల అవసరములను గురించి గాని, వారి ఆకాంక్షలను గురించి గాని పట్టించుకోడు. స్వార్థసాధనయే

జీవితపరమార్థము అనే దృష్టి గలవానికి సాధనమును ఎన్నుకొనే సమయములో లక్ష్యసిద్ధి మాత్రమే ముఖ్యప్రేరణ యగుటచే, ధర్మాధర్మాది భావనలన్నియు ప్రక్కకు నెట్టివేయబడును. పద్ధతి మంచిది అయినా, కాకపోయినా పని జరిగిపోవాలి. ఇట్టివాడు క్రూరకర్మలను ఆచరించుటకు, స్వార్థసాధనకై ఇతరులకు హానిని కలిగించుటకు వెనుకాడడు.

జగత్ అను పదమును అహితః, క్షయాయ అను రెండు పదములకు కూడ అన్వయించ వచ్చును. గడపపై పెట్టిన దీపపు కాంతి ముందు వెనుకలకు రెండు వైపులా సమానముగా ప్రసరించును (దేహలీదీపన్యాయము). అటులనే, రెండు పదముల మధ్యలోనున్న పదము ఆ రెండిటికీ విశేషణము కాగల్గును. అహితాః అనగా (జగత్తునకు) శత్రువులు. వారి ప్రవర్తన ఇతరుల క్షేమమునకు భంగకారి యగును. వారు జగత్తునకు సమస్యలను సృష్టించి వినాశమును కొనితెచ్చుటలో (క్షయాయ జగతః) సమర్థులై యుందురు (ప్రభవంతి). మనవద్ద ప్రస్తుతము ఏమి గలదు? మనము దేనిని సంపాదించవలెను? దానికొరకై ఏమి చేయవలెను?-వారు సర్వదా ఇట్టి గణనములో నిష్ణాతులై తదనుగుణముగా యోజనలను చేయు చుందురు. దాని వలన ఇతరుల సుఖశాంతులకు కలుగబోయే హానితో వారికి సంబంధము లేదు.

అధ్యాయము 16, శ్లోకము 10:

कामम‌ाश्रित्य दुष्पूरं दंभमानमदान्विताः
मोहाद् गृहीत्वासद् ग्राहान् प्रवर्तंतेऽशुचिव्रताः ॥ १० ॥

కామమాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః
మోహాద్ గృహీత్వాసద్గ్రాహాన్ ప్రవర్తంతేశుచివ్రతాః (10)

దుష్పూరమ్ = పరిపూర్తి చేయ శక్యము కాని, కామమ్ = కామనను, ఆశ్రిత్య = పట్టుకొని, దంభ మానమదాన్వితాః = దంభము, అభిమానము, గర్వములతో గూడినవారై, మోహాత్ = సమ్మోహము వలన, అసద్గ్రాహాన్ = దోషయుక్తమగు లక్ష్యములను, గృహీత్వా = పట్టుకొని, అశుచివ్రతాః = అయోగ్యమగు నిష్ఠ గలవారై, ప్రవర్తంతే = ప్రవర్తిల్లుచున్నారు.

పరిపూర్తి చేయ శక్యము కాని కామనను పట్టుకొని, దంభము, అభిమానము, గర్వములతో గూడినవారై, సమ్మోహము వలన

దోషయుక్తములగు లక్ష్యములను పట్టుకొని, అయోగ్యమగు నిష్ఠ గలవారై ప్రవర్తిల్లుచున్నారు (10).

దంభః, మానః, దర్పః అను పదముల మధ్య అర్థభేదము అత్యల్పము. కాని, వాటిని ఒకే చోట ప్రయోగించినపుడు వాటి తాత్పర్యములో గల భేదమును పరిశీలించి వెలికి తీయవలెను. దంభమనగా వ్యక్తి తనలో ధర్మనిష్ఠ, మరియు విశేషసామర్థ్యము ఉన్నా లేకున్నా, వేషభాషల ద్వారా అవి ఉన్నట్లే నలుగురికీ చాటించే స్వభావమని మనము చూచియున్నాము. 'నేను శ్లాఘనీయుడను; కావున, మీరందరు నన్ను మన్నించుటను నేర్చుకొనుడు' అనే మనఃప్రవృత్తి మానమనబడును. ఈ లక్షణము గల వ్యక్తి ఈ మాటలను పలికినా, పలుకక పోయినా, అతని ప్రవర్తనలో ఈ లక్షణము బయటపడుచుండును. ఒక ప్రత్యేకమగు కోవకు చెందిన గర్వమునకు మదమని పేరు. ఒక వ్యక్తికి సంపద, విద్య, లేక నైపుణ్యము ఉండవచ్చును. అతడు అవి లేనివారితో తనను పోల్చుకొని, కృతజ్ఞతను, వినయమును కలిగియుండుటకు బదులుగా, అయోగ్యము నిరుపయోగము అగు గర్వమును కలిగియుండును. ఇచట మనము చర్చించుచున్న వ్యక్తులలో ఈ మూడు లక్షణములు గలవు. కావున, వారు అశుభములు, అయోగ్యములు అగు లక్ష్యముల వెనుక పడుటలో ఆశ్చర్యము లేదు.

వారు పట్టుకున్న కామనలకు పరిపూర్తి అనే ప్రసక్తి లేదు (కామం దుష్పూరమాశ్రిత్య). అనగా, వారి కామనలకు అంతము లేదని యర్థము. ఇందువలననే, మనము కామమును అనలము ('ఇక చాలును' అనే మాటను ఎరుంగని అగ్ని) తో పోల్చెదము. అగ్నిలో ఎంత ఇంధనమును వేసినా, 'ఇక చాలును' అనే మాట ఉండదు. ఇంద్రియభోగానుభవముచే కామము ఎన్నటికీ చల్లారదు (న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి) అని శాస్త్రము చెప్పుచున్నది. నిప్పులో ఇంధనమును వేయుట వలన అది చల్లారక పోగా, మరింత తీవ్రముగా మండును. అదే విధముగా, భోగ్యవస్తువులను సంపాదించి అనుభవించుట ద్వారా, కామనలు ఎన్నటికైననూ ఉపశమించవు. అగ్నిలో ఆజ్యమును పోయుట దానిని చల్లార్చుటకు హేతువు కాదు. కామనను అనుభవించిన ప్రతి పర్యాయము మనస్సు మరల అదే అనుభవమును గాని, లేదా అంతకంటె అధికమగు ఉల్లాసమునిచ్చే అనుభవమును గాని వాంఛించును.

వీరు పూరింప శక్యముగాని కామనల వెనుకబడి, వివిధ కార్యములలో హడావుడిగా నుందురు. ఎందువలన? మోహము వలన; జీవనమూల్యముల అవగాహనలో దోషము ఉండుట

వలన; ప్రాథమికతలకు (priorities) అలంబనము అవివేకము అగుట వలన. వారు విలువ లేని దానిపై విలువను ఆరోపిస్తారు. వారు భద్రత లేని చోట భద్రతను, ఆనందము లేనిచోట ఆనందమును, సాహాయ్యము లేనిచోట సాహాయ్యమును దర్శించి కటిబద్ధులై వాటి వెంటబడెదరు. ముందుగా వారు వివిధవస్తువులను తప్పుగా అంచనా వేసెదరు (గృహీత్వా అసద్గ్రాహాన్). వారు వివేకము లేని వారగుటచే, విలువ లేనిదానికి విలువను అంటగట్టి, దానితో వేగుచుందురు. వారికి తమకు అనుకూలముగా జరుగుబాటు అగుచున్నంతవరకు, మంచి–చెడుల విచక్షణతో పని లేదు. తమ సౌకర్యమునకు భంగము కలుగరాదు. ఇదియే ఏకైకనియమము. ఇది కొనసాగుటకై తప్పు పనిని చేయుటకు వారికి అభ్యంతరము లేదు.

**అధ్యాయము 16, శ్లోకము 11:**

चिंतामपरिमेयां च प्रलयांतामुपाश्रिताः ।
कामोपभोगपरमा एतावदिति निश्चिताः ॥ ११ ॥

చింతామపరిమేయాం చ ప్రలయాంతాముపాశ్రితాః
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః (11)

**అపరిమేయామ్** = విశాలమైన, **ప్రలయాంతామ్** = మరణము వరకు కొనసాగే, **చింతామ్** = చింతను, **ఉపాశ్రితాః** = ఆశ్రయించినవారై, **చ** = మరియు, **కామోపభోగపరమాః** = కామ్యములగు వస్తువులను భోగించుటలో ఏకాగ్రమైన మనస్సు గలవారై, **ఏతావత్** = ఇంతమాత్రమే, **ఇతి** = అని, **నిశ్చితాః** = నిశ్చయించుకున్నవారై.

వారు మరణమువరకు కొనసాగే అపరిమితమైన చింతను కలిగి యుందురు. కామ్యములగు వస్తువులను భోగించుటలో ఏకాగ్రమైన మనస్సు గలవారై, ఇంత మాత్రమే అని నిశ్చయించుకొని జీవించెదరు (11).

**అధ్యాయము 16, శ్లోకము 12:**

अशापाशशतैर्बद्धाः कामक्रोधपरायणाः ।
ईहन्ते कामभोगार्थमन्यायेनार्थसंचयान् ॥ १२ ॥

ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః
ఈహన్తే కామభోగార్థమన్యాయేనార్థసంచయాన్ (12)

**ఆశాపాశశతైః** = ఆశలు అనే వందలాది సంకెలలచే, **బద్ధాః** = బంధింపబడినవారై, **కామక్రోధ పరాయణాః** = కామక్రోధములకు కట్టుబడినవారై, **కామభోగార్థమ్** =అభీష్టవస్తువులను భోగించుట కొరకై, **అన్యాయేన** = అధర్మ మార్గముచే, **అర్థసంచయాన్** = సంపదలను ప్రోగు చేయుటను, **ఈహంతే** = ఇష్టపడెదరు.

> వారు ఆశలు అనే వందలాది సంకెలలచే బంధింపబడినవారై కామ క్రోధములకు కట్టుబడి, అభీష్టవస్తువులను భోగించుట కొరకై అధర్మ మార్గములో సంపదను ప్రోగు చేయుట యందు రమించెదరు (12).

వీరి చింతలకు అంతు లేదు (అపరిమేయయామ్). వీరి మనస్సు ఆదుర్దాలతో నిండియుండును. కనీసము వృద్ధాప్యములోనైననూ వారు వ్యవహారములన్నిటినీ పిల్లలకు అప్పజెప్పి నిశ్చింతగా పరమేశ్వరుని ధ్యానిస్తూ జీవించెదరని అపేక్షించుట సహజము. కాని వారి చింతలు మరణించే క్షణమువరకు (ప్రలయాంతామ్) కొనసాగుచుండును. ఆ క్షణమువరకు వారు ఆస్తిపాస్తులు, డబ్బు బాకీ పడిన వారు, సంతానము ఇత్యాదులను గురించి చింతించుచుందురు. ఈ చింతలకు తోడుగా, వారి యందు విషయవస్తువులను భోగించవలెననే తీవ్రమగు ఆకాంక్ష ఉండును. వారి మనస్సులో దానికి మాత్రమే సర్వోపరి స్థానమీయబడి యుండుటచే, ఇతరమునకు తావు లేదు. ధర్మము లేదు; మోక్షము లేదు; వివేకము లేదు; భోగేచ్ఛ మాత్రమే గలదు. వారికి సంతోషమును కలిగించే వస్తువులు లభించుచున్నంతవరకు, వారు ఆనందముగా నుండెదరు. ఇంతకు మించి జీవిత లక్ష్యము మరియొకటి లేదనే తాత్త్వికచింతన వారి ఈ ప్రవృత్తికి దోహదము చేయుచుండును. 'జీవితమనగా నింతే' అనే దృఢనిశ్చయమును వారు కలిగియుందురు (ఏతావదితి నిశ్చితాః). వారి దృష్టిలో మానవజీవితమునకు ఇంతకు మించి మరియొక పరమార్థము లేదు.

వారు బంధింపబడియున్నారు (బద్ధాః). ఆశ మరియు తృష్ణ అనునవి వారిని బంధించు పాశములు. ఒకే ఒక త్రాడుచే బంధింపబడిన వ్యక్తి బహుశః దానినుండి విడిపించుకొనగల్గును. కాని వారు వందలాది ఆకాంక్షలచే (ఆశాపాశశతైః) బంధింపబడియున్నారు. ఒక ఆకాంక్ష సిద్ధించుసరికి మరియొకటి పుట్టును. కావున, ఈ ఆశలన్నిటినీ పరిపూర్తి చేసే ఆశ లేదు. పైగా,

వారు కామక్రోధములకు అంకితమై ఉంటారు (కామక్రోధపరాయణాః). కామక్రోధములు ప్రతి వ్యక్తిలో నుండును. కాని అవి వీరిలో అతిశయించిన బలమును కలిగియున్నవి. మనము క్రోధము నుండి బయటపడే ప్రయత్నములో నుండగా, వారికి అదియే పరమార్థమగు చున్నది. జనులను శాసించి, తమ పనులను నెరవేర్చుకొనుటకు వారికి అది ఉపాయమగు చున్నది. వారి ఆలోచనలకు, ఆ ఆలోచనలను బట్టి ప్రవర్తిల్లే కార్యకలాపములకు ఆధారము కామక్రోధములే గాని, ధర్మాధర్మములు, నిత్యానిత్యవివేకము కాదు. వారి ఆలోచనలలో వీటికి స్థానము లేనే లేదు. అపుడు వారు ఏమి చేయుదురు?

వారు అనేకములగు అభీష్టవస్తువులను భోగించుటకొరకై (కామభోగార్థమ్) మున్ముందుగా ధనమును ప్రోగుచేసే పనిలో నిమగ్నమై యుందురు (అర్థసంచయాన్ ఈహంతే). ఎట్లు? న్యాయబద్ధమగు మార్గములో గాక, శాస్త్రమునకు గాని, సమాజమునకు గాని సమ్మతము గాని మార్గములలో ధనమును ఆర్జించెదరు. అనగా వారు చట్టమునకు మరియు నైతికతకు విరుద్ధమగు ఉపాయముల నవలంబించెదరు. అనగా ఇతరుల ధనమునపహరించుట, ఇతరుల ఆస్తులనాక్రమించుట మొదలగు ఉపాయములని శ్రీశంకరులు వివరించిరి. ఇతరుల భూమిని అన్యాయముగా ఆక్రమించి, తాను అగ్రనాయకుడననియు, భూమి స్వంతదారులు వలస వచ్చినవారనియు ప్రకటించుట అన్యాయార్జనమే యగును. వీరు సంపదను ప్రోగు చేసేది తమ భోగములకొరకు మాత్రమే; ఇతరులకు పంచిపెట్టుట కొరకు కాదు. కొంతకాలము తరువాత వారి ధనార్జనకు లక్ష్యము అహంకారమును సంతోషపెట్టుట మాత్రమే యగును. సుఖజీవనమునకు ఆవశ్యకమగు సర్వవస్తుజాతమును కలిగియున్న వ్యక్తి ఇంకనూ ధనార్జనలో నిమగ్నుడై ఉండుటకు భోగానుభవము కారణము కాజాలదు. ఒక వ్యక్తి ఒక సమయములో ఒకటికంటె ఎక్కువ మోటారులలో పయనించ లేడు గదా! ఒక మోటారులోనైననూ ఒక వ్యక్తి ఒక సీటులో మాత్రమే నివసించగలడు. ఇంతేగాక, వ్యక్తికి పోషించవలసిన పొట్ట ఒకే ఒకటి గలదు. సాధారణముగా మహాధనికులు సంతతచింతాగ్రస్తులై ఉండుటచే, వారు అజీర్ణవ్యాధితో బాధపడు చుందురు. వారు తృప్తిగా భోజనమును చేసే అదృష్టమునకు నోచుకోరు. కావున, ఒక స్థాయి వరకు విక్రయశక్తిని సాధించిన తరువాత కూడ సంపదను ప్రోగుచేయుటకు కారణము వ్యక్తియొక్క ధనిత్వాభిమానమును తృప్తిపరచుట మాత్రమే అగును. మహాధనికులు కూడ ఇతరధనికులతో సరిదూగుటకై సంపదను ప్రోగుచేయుచుందురు.

మరియు, వీరి ఆలోచనా ధోరణి విలక్షణముగా నుండును.

**అధ్యాయము 16, శ్లోకము 13:**

इदमद्य मया लब्धमिदं प्राप्स्ये मनोरथम् ।
इदमस्तीदमपि मे भविष्यति पुनर्धनम् ॥ १३ ॥

ఇదమద్య మయా లబ్ధమిదం ప్రాప్స్యే మనోరథమ్
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్ (13).

అద్య = ఈనాడు, మయా = నాచేత, ఇదమ్ = ఇది, లబ్ధమ్ = పొందబడినది, ఇదమ్ = ఈ, మనోరథమ్ = కోరికను, ప్రాప్స్యే = పొందగలను, మే = నాకు, ఇదమ్ = ఈ, ధనమ్ = ధనము, అస్తి = కలదు, ఇదం అపి = ఇది కూడ, భవిష్యతి = లభించగలదు.

ఈనాడు నేను దీనిని పొందితిని. ఈ కోరికను పొందగలను. నాకు ఈ ధనము గలదు. ఈ ధనము కూడ లభించగలదు (13).

వారి ఆలోచనాధోరణి అంతా స్వార్థయోజనా పూర్ణమై యుండును. ఈ రోజు నా వద్ద ఉన్న స్థిరాస్తి ఎంత? చరాస్తి ఎంత? రొక్కము ఎంత ఉన్నది? అను లెక్కలు వారికి సర్వదా మనస్సులో కదలాడుచుండును. వారు ప్రతిదినము ఆనాటి సంపాదనను బేరీజు వేసుకొనుచుందురు. ఇట్టివాడు తన మనోరథపరిపూర్తికై అనేకవస్తువులను కొనవలసి యుండును. వాటికి కావలసిన ధనమునకు, ఆనాటి తన సంపాదనకు మధ్య గల వ్యత్యాసమునాతడు ఎప్పటికప్పుడు సరిచూచుకొనును. అతనికి తనకు అభీష్టములగు వస్తువులను ప్రోగుచేసుకొనుటకై రోజువారీ యోజన, వారము రోజులకు సంబంధించిన యోజన, నెలవారీ యోజన మరియు సాంవత్సరిక యోజన కూడ ఉండును. తనకు వివిధరూపములలో గల సంపదనంతనూ కూడుకొని 'నావద్ద ఇంత సంపద గలదు (ఇదం ధనం అస్తి మే)' అని అతడు లెక్క చూచుకొనును. అతడు తనకు గల యోజనలననుసరించి 'భవిష్యత్తులో నాకు ఇంత ధనము రాగలదు (ఇదం ధనం అపి మే భవిష్యతి పునః)' అని కూడ లెక్క చూచు కొనును.

ఈ శ్లోకము మన అంతర్జాతీయ వ్యాపారసంస్థల విచారధారను ప్రతిబింబించు చున్నది. దీనిలో సంపదను ప్రోగుచేయుటయే ప్రధానలక్ష్యము. పెద్ద పెద్ద కంపెనీల యజమానులు తమవద్ద

ప్రస్తుతము గల స్థిరచరాస్తులను దృష్టిలో నిడుకొని, లాభాలను విపరీతముగా పెంచే యోజనలను చేయుచుందురు. ఈ వ్యాపార ధురంధరులు అతి విశాలమగు ఆస్తులను కలిగి యుండే అధికారము గల బృహత్ వ్యాపారనిగమములను నిర్మించే మహత్త్వాకాంక్షను కలిగియుందురు. కాని, ఇంతటి సంపదను ప్రోగు చేయుట సరళము కాదు. ఏలయన, విపణిలో ఇటువంటి అసురులు మరికొందరు గలరు. వీరు వారితో పోటీ పడుతూ ఉండాలి. ఈ పోటీలో కొందరిని బలి చేయుట తప్పనిసరి యగును. కాని అది వారికి ఇబ్బందిని కలిగించదు.

**అధ్యాయము 16, శ్లోకము 14:**

असौ मया हतश्शत्रुर्हनिष्ये चापरानपि ।
ईश्वरोऽहमहं भोगी सिद्धोऽहं बलवान् सुखी ॥ १४ ॥

అసౌ మయా హతశ్శత్రుర్హనిష్యే చాపరానపి
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ (14)

మయా = నాచేత, అసౌ = ఈ, శత్రుః = శత్రువు, హతః = సంహరింపబడినాడు, అపరాన్ అపి = ఇతరశత్రువులను కూడ, హనిష్యే = సంహరించెదను, అహమ్ = నేను, ఈశ్వరః = శాసకుడను, అహమ్ = నేను, భోగీ = భోగములననుభవించువాడను, అహమ్ = నేను, సిద్ధః = విజయమును పొందువాడను, బలవాన్ = బలవంతుడను, సుఖీ = సుఖము గలవాడను.

> ఈ శత్రువు నాచే సంహరింపబడినాడు. మిగిలిన శత్రువులను కూడ సంహరించెదను. శాసకుడను, భోగముల ననుభవించువాడను నేనే. విజయము నాదే. బలవంతుడను, సుఖము గలవాడను నేనే (14).

'నాతో పోటీకి దిగి నా దారికి అడ్డుగానున్న ఈ శత్రువును నేను నిర్మూలించినాను' అని అతడు ప్రగల్భములను పలుకుతూ, తనవంటి మిత్రులు కొందరితో గలసి ఆ శత్రువినాశ సందర్భములో పండుగ జరుపుకొనుచుండును. అతనికి ఈ శత్రువు మాత్రమే గాక, మరికొందరు శత్రువులు కూడ గలరు. వారు దురదృష్టవంతులని శ్రీశంకరులు అభిప్రాయపడినారు. ఈతడు వారిని కూడ సంహరించే ప్రయత్నములో నున్నాడు. కొందరు కాబూలీవాలాలు జనుల దుర్బలతను తమకు అనుకూలముగా మలుచుకొని, వారు తీర్చలేని అప్పులను అధికవడ్డీలకు ఇచ్చి

వారిని సర్వనాశము చేసెదరు. వారి ప్రధానలక్ష్యము ధనార్జన మాత్రమే గనుక, వారు తమ లక్ష్యసాధనకై నిరుపేదలను కూడ బలిచేయుటకు వెనుకాడరు. వీరు కూడ అట్టివారే. ఆర్థికరంగమును శాసించు నాయకులు ఈ ఆలోచనాధోరణి గలవారైనచో, ధనికులు మరింత ధనికులుగను, పేదలు మరింత నిరుపేదలుగను మారెదరు. అసురీ ప్రవృత్తిగల జనులు తమతో సమానస్థాయిలో నుండి తమకు అడ్డు వచ్చే పోటీ దారులను మాత్రమే గాక, తమతో పోటీకి రాని బీదలను కూడ మట్టుపెట్టుటకు సంసిద్ధులగుదురు.

వారు తమతో సరిదూగ గలవాడు మరియొకడు లేడనే దృఢవిశ్వాసములో నుందురు. ఈ స్వభావము ప్రహ్లాదుని తండ్రిలో మూర్తీభవించి యుండెను. అతడు తన పుత్రుడు నారాయణనామమును జపించినందులకు కోపించి, నేను ఈశ్వరుడనని ప్రకటించెను. ఇట్టివారు తాము సర్వజనులకు అధీశ్వరులమనియు, కావున సర్వులు తమను ఆరాధించవలెననియు అపేక్షించెదరు. ఇతరులు చేసిన పనికి తగ్గ భత్యమును పంచియుచ్చుటకు వారు సిద్ధమే. పైగా, ఇట్టి వ్యక్తి సర్వభోగములు తన పాదములవద్ద నుండవలెనని భావించును (అహం భోగీ). ఇంతేగాక, అతడు అన్ని దృష్టికోణములలో తానే విజేతననే (సిద్ధః) గర్వము కలిగియుండును. అతడు ధనికుడు గనుక, జనులు అతని స్నేహము కొరకు ప్రార్థించుచుందురు. మరియు అతనికి సంతానము కూడ గలదని శ్రీశంకరులు వివరించిరి. వంశవృక్షమును నిలబెట్టే సంతానము లేని వాడు ధనికుడే అయిననూ భాగ్యవంతునిగా పరిగణింపబడడు. కావున, ఇట్టివానికి సంతానమున్నచో, తాను అన్నివిధములుగా భాగ్యవంతుడననే ధీమాలో అతడు ఉండును. అతనికి పరిచారకులు మాత్రమే గాక, కొడుకులు, కూతుళ్ళు, వారి సంతానము మరియు బంధువులు చుట్టువారి యుందురు.

ఇవి అన్నీ ఉండి కూడా ఒకడు అనారోగ్యకారణముగా వాటిని అనుభవించే భాగ్యమునకు నోచుకొనక పోవచ్చును. కడుపులో పుండుతో బాధపడువాడు, చెవిటివాడు, లేక కాళ్ళు లేక పోవుటచే చక్రాల కుర్చీలో జీవించువాడు భోగముల నెట్లు అనుభవించగల్గును? కాని మనము చర్చిస్తున్న వ్యక్తికి ఈ సమస్యలేమియు లేవు. ఈతడు సుఖి. అతని ఇంద్రియములు, శరీరములోని ఇతరావయవములు చురుకుగా పనిచేయుచున్నవి. కావున, తాను అత్యంతసుఖిని అనే గర్వమునాతడు కలిగియుండును. ఇవన్నీ ఉన్నా, అధికారము, పలుకుబడి లేనిచో, ప్రభుత్వాధికారులు వేధించెదరు. వ్యక్తి ఏ విధముగా డబ్బును సంపాదించినా ప్రభుత్వమునుండి చిక్కులు తప్పవు. కావున, ధనవంతునికి వెనుక శాసనసభ్యులు, లేక పార్లమెంట్ సభ్యుల బలము

ఉండవలెను. ఈతనికి వారి సహకారము కూడ గలదు. కావున, తాను బలవంతుడనని ఆతడు విర్రవీగుచుండును.

ఇతరజనుల మాట యేమి? శ్రీశంకరులు ఇట్లు వివరించిరి. ఆతని దృష్టిలో అలగా జనమంతా భూమికి భారము మాత్రమే. ఏ విధమైన మహత్త్వము లేని ఈ జనులు పరిగణింపదగిన వారు కాదని ఆతడు భావించును.

ఆతడు ఇంకనూ ఇట్లు ప్రగల్భములను పలుకును :

**అధ్యాయము 16, శ్లోకము 15:**

आढ्योऽभिजनवानस्मि कोऽन्योऽस्ति सदृशो मया ।
यक्ष्ये दास्यामि मोदिष्य इत्यज्ञानविमोहिता: ॥ १५ ॥

ఆఢ్యోభిజనవానస్మి కోన్యోస్తి సదృశో మయా
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః (15)

**ఆఢ్యః** = ధనవంతుడను, **అభిజనవాన్** = గొప్ప వంశములో జన్మించినవాడను, **అస్మి** = అగుచున్నాను, **మయా** = నాతో, **సదృశః** = సమానమైనవాడు, **అన్యః** = మరియొకడు, **కః** = ఎవడు, **అస్తి** = గలడు, **యక్ష్యే** = నేను యాగములను చేయగలను, **దాస్యామి** = దానములను చేయగలను, **మోదిష్యే** = భోగముల ననుభవించగలను, **ఇతి** = అని, **అజ్ఞానవిమోహితాః** = వివేకము లేకపోవుటచే పూర్తిగా సమ్మోహితులై యుందురు.

> నేను ధనవంతుడను; గొప్ప వంశములో జన్మించినవాడను. నాతో సమమైనవాడు మరియొకడు ఎవడు గలడు? నేను యాగములను చేయగలను; దానములను చేయగలను; భోగములననుభవించగలను అని పలుకుతూ వారు వివేకము లేకపోవుటచే పూర్తిగా సమ్మోహితులై యుందురు (15).

ఆఢ్యః అను పదమునకు కొనియాడ దగినవాడు అనే అర్థము ఉన్ననూ, ఈ ప్రకరణములో ధనవంతుడు అని యర్థము. ఈ ప్రకరణములో మనము చర్చించుచున్న వ్యక్తికి

ఉన్న ఒకే ఒక అర్హత అతడు కొంత ధనమును సంపాదించియుండుట. తాను శ్లాఘనీయుడనని అతడు భావించుకొని 'విజేత అగుట ఎట్లు?' అను విషయముపై ఒక గ్రంథమును వ్రాసి దానిని ముద్రించి అమ్మి మరింత ధనమును సంపాదించవచ్చును. అతడు గ్రంథమును వ్రాసినా, వ్రాయకపోయినా, 'నేను ధనవంతుడను' అని ప్రకటించుకొనును.

ఇంతేగాక, 'నేను గొప్ప వంశములో జన్మించినవాడను (అభిజనవాన్ అస్మి)' అని కూడ అతడు గొప్పలు చెప్పుకొనును. ఇది సత్యము కావచ్చును; కాకపోవచ్చును. ఎట్టి వంశము? ఏడు తరములవరకు (సప్తపురుషమ్) మహాశ్రోత్రియులు గల వంశమని శ్రీశంకరులు వివరించిరి. అది వాస్తవమే అయినా, దాని వలన ఈతనికి ఒరిగినది ఏమున్నది? ఈతడు అసుర ప్రకృతి గలవాడు. భారతదేశములో ప్రతి వ్యక్తి ఋషుల పరంపర (గోత్రము) లో జన్మించినవాడే. కాని అతడు ప్రవర్తనమబట్టి అసురుడు కావచ్చును. అట్టివాని వంశము గొప్పదియే అయిననూ, నిరర్థకము. వీరు తమ ఆధిక్యమును సుస్థిరము చేసుకొనుటకై ఇట్టి ప్రకటనలను చేయుచుందురు. వారి తాత్పర్యమేమనగా, 'జన్మించిన వంశము అను విషయములోనైననూ, నా కంటె అధికుడు లేడు'. వారీ అభిప్రాయమును తమ మనస్సులో దాచుకొనరు. 'నాతో సమానమైన వారు ఎవరు గలరు? (కః అన్యః అస్తి సదృశో మయా)' అని వారు బహిరంగముగా ప్రకటించెదరు. అనగా, నాతో సమమైనవాడు లేడని యర్థము.

మరియు, అతడు 'నేను యజ్ఞయాగాదులను చేసెదనని' గొప్పలు చెప్పును. అతడు యజ్ఞయాగాదులను ఉన్నతమగు ఆదర్శముకొరకు గాక, శత్రునాశము కొరకు గాని, లేదా కనీసము కొంత కీర్తిని సంపాదించుట కొరకు గాని చేయును. అతని ఇతరములగు సమస్త చర్యలవలెనే, వీటిని కూడ అతడు తన స్వార్థము కొరకు, పేరు ప్రతిష్ఠల కొరకు చేయును. అతడు అందరికంటె ఉన్నతస్థానములో నిలబడి ప్రజలను శాసించగోరును. దీనికొరకై వైదికకర్మల ననుష్ఠించుట అవశ్యకమైనచో, అతనికి అభ్యంతరము లేదు. రావణుడు ఇతరులను వినాశము చేయుట కొరకై గొప్ప తపస్సును చేసెను. అతడు సామవేదమును అధ్యయనము చేసిన బ్రాహ్మణుడు. కొన్ని విషయములలో అతడు గొప్ప నియమనిష్ఠలు గల వైదికుడు. కాని ఈ సర్వమును అతడు వినాశకరమగు శక్తిని సంపాదించుటకై చేసినాడు గాన, అతడు రాక్షసుడైనాడు.

'నేను ధనమును ఇచ్చెదను (దాస్యామి)' అని అతడు వాగ్దానములను చేయును. 'నేను భోగించెదను (మోదిష్యే)' అని కూడ అతడు చెప్పుటచే, అతడీ ధనమును దానధర్మముల కొరకు

గాక, నాట్యగత్తెలు మొదలగు విలాసములకొరకు ఇచ్చుచున్నాడని స్పష్టమగుచున్నది. అతడు ఇంద్రియభోగములను అనుభవించుటకు పెద్ద పెద్ద విందులు, ఈతకొలను ఇత్యాది శతాధికమగు ఉపాయముల వెంట బడుచుండును. ఇట్టివారియందు వివేకము సున్న యగుటచే, వారు పూర్తిగా భ్రాంతులై (విమోహితాః) ఉందురు. వారి జీవనమూల్యసంరచన మరియు మానసికప్రవృత్తి భ్రాంతిమూలకములై యుండును. అందువలన వారి యందు ఒక మోహము తరువాత మరియొక మోహము ప్రకటమగుచుండును. వారికి తాము జీవితములో సాధించిన ఘనకార్యములను గురించి గల ధారణలు, మరియు వారికి తమ గురించి గల కల్పనలు సర్వమునకు మూలములో ఈ అజ్ఞానము గలదు.

**అధ్యాయము 16, శ్లోకము 16:**

अनेकचित्तविभ्रांता मोहजालसमावृताः ।
प्रसक्ताः कामभोगेषु पतंति नरकेऽशुचौ ॥ १६ ॥

అనేకచిత్తవిభ్రాంతా మోహజాలసమావృతాః
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ (16).

**అనేకచిత్తవిభ్రాంతాః** = వివిధరకముల ఆలోచనలచే పూర్తిగా భ్రాంతిని పొంది యున్నవారు, **మోహజాలసమావృతాః** = అవివేకము (మోహము) అనే వలచే కప్పి వేయబడినవారు, **కామభోగేషు** = అభీష్టవస్తువులను అనుభవించుటయందు, **ప్రసక్తాః** = తల్లీనమై యున్నవారు, **అశుచౌ** = అశుచియగు, **నరకే** = నరకమునందు, **పతంతి** = పడుదురు.

వారు వివిధరకముల ఆలోచనలచే పూర్తిగా భ్రాంతిని పొందియున్నవారై,
అవివేకము అను వలచే కప్పివేయబడిన వారై, అభీష్టవస్తువుల భోగము
నందు తల్లీనులై అశుచియగు నరకమునందు పడెదరు (16).

ఈ అసురులను ఇచట వర్ణించిన పద్ధతిని గమనించినచో, వారి ఆలోచనల స్వరూపము మనకు స్పష్టమగును. చింతలు, ఆందోళనలు, కామనలు, క్రోధము ఇత్యాది వివిధరకముల ఆలోచనలతో వారు పూర్తిగా సమ్మోహితులై యుందురు. అవివేకమునుండి పుట్టిన భ్రాంతి అనే వలలో వారు చిక్కుకొని దానిచే కప్పివేయబడి యుందురు. జంతువులు వలలో చిక్కినట్లే,

మానవులు అజ్ఞానము (అవివేకము) అనే వలలో చిక్కుకొనియుందురు. కావున, వారు అభీష్టములగు ఇంద్రియభోగములను అనుభవించుటలో తల్లీనులై (ప్రసక్తాః) యుండుటలో ఆశ్చర్యము లేదు. అభీష్టవస్తువుల నుండీ లభించే అనుభవములలో వారు లోతుగా చిక్కుకొని యుందురు. వారి జీవితము కామనాపరిపూర్తికి మాత్రమే కట్టుబడి యుండును గాన, వాటిని సాధించే ఉపాయముల విషయములో వారు ధర్మాధర్మవివేకమును ప్రక్కన బెట్టి రాజీలకు సిద్ధపడి అధికమగు పాపమును మూటగట్టుకొనెదరు. దీని ఫలితముగా వారు నరకములో పడెదరు. నరకమనగా జీవులు యాతనలను అనుభవించే స్థానము. అచటకు వెళ్ళాలని కోరుకొనే వారు లేరు. కాని, జీవులు తమ అభీష్టమునకు వ్యతిరేకముగా నిస్సహాయులై అచటకు చేరెదరు. కావుననే, ఇచట పడెదరు (పతంతి) అని ప్రయోగించబడినది. కాని స్వర్గసుఖమువలె నరకయాతన కూడ కొంతకాలవు మాత్రమే ఉండును. సుఖమైనా, దుఃఖమైనా అనుభవక్షేత్రములన్నియు తాత్కాలికములు మాత్రమే. కావున, శాశ్వతమగు స్వర్గము గాని, నరకము గాని లేదని తెలియవలెను.

**అధ్యాయము 16, శ్లోకము 17:**

आत्मसंभाविताः स्तब्धा धनमानमदान्विताः ।
यजन्ते नामयज्ञैस्ते दंभेनाविधिपूर्वकम् ॥ १७ ॥

ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః
యజన్తే నామయజ్ఞైస్తే దంభేనావిధిపూర్వకమ్ (17).

**ఆత్మసంభావితాః** = స్వీయఖ్యాతిని చాటుకొనుటకు కట్టుబడినవారై, **స్తబ్ధాః** = గర్విష్ఠులై, **ధనమాన మదాన్వితాః** = ధనమూలకమైన అభిమానము, గర్వము గలవారై, **తే** = వారు, **దంభేన** = దంభముచే, **అవిధిపూర్వకమ్** = శాస్త్రవిహితమగు విధిని పాటించని వారై, **నామయజ్ఞైః** = పేరుకు మాత్రమే యజ్ఞమనదగిన యజ్ఞములచే, **యజంతే** = ఆరాధించెదరు.

స్వీయఖ్యాతిని చాటుకొనుటకు కట్టుబడి గర్విష్ఠులై, ధనమూలకమైన అభిమానము, గర్వము గలవారై, వారు దంభముచే శాస్త్రవిహితమగు విధిని పాటించనివారై, పేరుకు మాత్రమే యజ్ఞమనదగిన యజ్ఞములచే ఆరాధించెదరు (17).

సమస్తసద్గుణములకు తాము నిలయమని వారు తలపోయుచూ (ఆత్మ సంభావితాః), దానికి తగ్గట్లుగనే స్వీయమహిమలను ప్రకటించుచుందురు. వారిలో దైవీసంపదకు చెందిన సద్గుణములు ఏమియూ లేకున్ననూ, తమలో అవి నిండుగా గలవని ఆత్మస్తుతిని చేయుచుందురు. తాము అద్భుతమగు చారిత్రము గలవారమనియు, కాని తమ మహిమను అంచనా వేసే శక్తి జనులకు లేదనియు వారు వేదికనుండి చాటెదరు. కావున, వారు ఇతరులనుండి స్తోత్రపాఠములను అపేక్షించే పొగరుబోతులు (స్తబ్ధాః) అగుటలో ఆశ్చర్యము లేదు. వారు స్థూలముగా నుండుటచే శరీరమును వంచి నమస్కరించుటను ఎరుంగరు. వారి మనస్సులో వినయమునకు తావు లేదు. ఇతరులయందు మర్యాద, వినయము వారిలో లేకుండుటచే, వారు నమస్కారమును చేసి యెరుగరు. దీని ఫలితముగా వారికి దేనియందైననూ శ్రద్ధ లేకుండును. వారికి తామే ఈశ్వరులమనే గర్వము ఉండుటచే, భగవానుడే స్వయముగా వారి ముందు ప్రత్యక్షమైననూ, వారు ఆయనకు భక్తిని నివేదించుటను గాని, శరణు పొందుట గాని చేయరు.

వారు ఇతరులనెవ్వరినీ ఆదరించకపోయిననూ, సర్వులు తమను ఆదరించవలెనని అపేక్షించెదరు. వారు ధనమూలకమగు గర్వముతో నిండియుందురు (ధనమానమదాన్వితాః). నన్ను మన్నించవలెను అనే మానసిక ప్రవృత్తికి మానమని పేరు. మనమీ పదమును ఇదివరలో చూచియున్నాము. మదమనగా గర్వము. ఇంతే గాక, వారు యజ్ఞములను చేసెదరు. అవి కేవలనామమాత్ర యజ్ఞములు మాత్రమే (యజంతే నామయజ్ఞైః). యజ్ఞమును చేయువాడు శ్రద్ధతో శాస్త్రోక్తవిధానమును పాటించవలెను. యజ్ఞమును చేయవలసిన విధివిధానమునకు ఇతికర్తవ్యత అనే పారిభాషికనామము గలదు. కాని వారు యజ్ఞమును శాస్త్రోక్తవిధానములో చేయరు (అవిధిపూర్వకమ్). వారు వాటిని చేయుటకు కారణమేమి? దంభము కొరకై చేయుచుందురు. పేరు-ప్రతిష్ఠలు మాత్రమే వారి ఏకైకలక్ష్యము. ఆ యజ్ఞములో అగ్నిని ప్రతిష్ఠించి, ఏవో కొన్ని హోమములను చేసి, ఎవరికో కొందరికి భోజనమునిడుటచే, దానికి యజ్ఞమను పేరును పెట్టవలసియుండును. కాని, వేదోక్తనియమములన్నియు పాటింపబడకపోవుటచే, అది యథార్థముగా యజ్ఞము కాజాలదు. నియములనన్నిటినీ పాటించక పోయినా, తగినంత శ్రద్ధ ఉన్నచో, అది అంగీకారమగును. కాని వారియందు అట్టి శ్రద్ధ లేదు.

**అధ్యాయము 16, శ్లోకము 18:**

अहंकारं बलं दर्पं कामंक्रोधं च संश्रिता : ।
मामात्म परदेहेषु प्रद्विषंतोऽभ्यसूयका: ॥ १८ ॥

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః
మామాత్మ పరదేహేషు ప్రద్విషంతోభ్యసూయకాః (18)

**బలమ్** = బలమగు, **అహంకారమ్** = అహంకారమును, **దర్పమ్** = ఔద్ధత్యము (insolence)ను, **కామమ్** = భోగానుభవమును, **క్రోధమ్** = కోపమును, **సంశ్రితాః** = గట్టిగా పట్టుకున్నవారై, **ఆత్మపరదేహేషు** = తమ యొక్క మరియు ఇతరుల దేహములయందు, **మామ్** = నన్ను, **ప్రద్విషంతః** = అవమానించువారై, **అభ్యసూయకాః** = మిథ్యాదోషములను ఆరోపించువారై.

> బలమగు అహంకారమును, ఔద్ధత్యమును, భోగానుభవమును, కోపమును గట్టిగా పట్టుకున్నవారై, తమ యొక్క మరియు ఇతరుల దేహములయందు నన్ను అవమానించువారై, వారు మిథ్యాదోషములను ఆరోపించుచుందురు (18).

**అధ్యాయము 16, శ్లోకము 19:**

तानहं द्विषतः क्रूरान् संसारेषु नराधमान् ।
क्षिपाम्यजस्रमशुभानासुरीष्वेव योनिषु ॥ १९ ॥

తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు (19)

**ద్విషతః** = తిరస్కారమును చేయువారు, **క్రూరాన్** = క్రూరులు, **నరాధమాన్** = మానవులలో నీచులు, **అశుభాన్** = పాపములను ఆచరించువారు అగు, **తాన్** = వారిని, **అహమ్** = నేను, **అజస్రమ్** = ఒకదాని తరువాత ఒకటి చొప్పున, **సంసారేషు** = జన్మజన్మాంతరములలో, **ఆసురీషు** = అసురులకు సంబంధించిన, **యోనిషు ఏవ** = యోనులయందు మాత్రమే, **క్షిపామి** = పడవేసెదను.

> నన్ను తిరస్కరించువారు, క్రూరులు, మానవులలో నీచులు, పాపముల నాచరించువారు అగు వారిని నేను ఒక దాని తరువాత ఒకటి చొప్పున

జన్మజన్మాంతరములలో అసురయోనులయందు మాత్రమే పడ వేసెదను (19).

వీరందరు వీటిని గట్టిగా పట్టుకొని యున్నారు (సంశ్రితాః). దృఢమగు వైయక్తికనిష్ఠ అహంకారమునుండి పుట్టును. అహంకారమనగా కర్తృత్వభోక్తృత్వములను, సుఖిత్వ దుఃఖిత్వములను ఆత్మయందు అధ్యారోపము చేయుట అని సామాన్యనిర్వచనము. కాని ఇచట ఈ పదము ప్రయోగించబడిన ప్రకరణమును బట్టి అధికమగు వ్యక్తినిష్ఠయను అర్థము వచ్చును. ఇందువలననే, దీనికి బలమ్ అను విశేషణము జోడించబడినది. ఆత్మపై ఆరోపించబడిన ధారణలకు మూలము అహంకారము. మన సమస్యలన్నియు దీని నుండియే పుట్టుచున్నవి. మన లక్ష్యాన్వేషణలు ఒకప్పుడు సందేహాస్పదములుగను, మరియొకప్పుడు న్యాయసమ్మతములుగను ఉండవచ్చును. కాని వీటిని అన్నింటినీ ప్రేరేపించేది అహంకారము మాత్రమే. ఇది వీరిలో చాల దృఢముగా నాటుకొని ఉండుటయే గాక, అది సరియైనదేనను మాన్యతను కూడ పొందియున్నది. దీనికి దర్పము తోడగును. ఇది గలవాడు ధర్మాధర్మముల హద్దులను అతిక్రమించుటకు వెనుకాడడు. వీరు భోగానుభవలాలసులై యుండుటచే కామనలు పరిపూర్తి కాని సందర్భములలో కోపము కలుగుట స్వాభావికమగును. ఇట్టి బలమగు అహంకారము గల వ్యక్తులలో దర్పము, కామము, కోపము ఇత్యాదులు దానికి తోడుగా నుండును. ఇది అపరాధుల ప్రపంచములోని అధినాయకుని వంటిది. అతడు ఎచటికి వెళ్లిననూ అతని కింకరులు వెంట వచ్చు చుందురు గదా!

ఏ వస్తువులవెంట తాము పరుగెత్తుచుంటిమో, అవి అన్నీ కలిసినా తాము యథార్థముగా కోరేదానిని ఈయజాలవనియు, తమ దేహములో మాత్రమే గాక ఇతరుల దేహములలో కూడ ఒకే పరమాత్మ నివసించి ఉన్నాడనియు, ఆ పరమాత్మను తెలుసుకున్నవాడు సర్వదుఃఖములనుండి విముక్తుడగుననియు తెలిసియున్ననూ, వీరు తమ దేహములో మరియు ఇతరుల దేహములలో సచ్చిదానంద-ఆత్మ రూపములో ఉపలభ్యమయ్యే ఆ పరమాత్మను విద్వేషించెదరు (ప్రద్విషంతః). వారు అట్టి ద్వేషమును కలిగియుండుటచే, ఈశ్వరుని విశ్వజనీన-అధ్యాదేశములను ఉల్లంఘించెదరు. ఏ పని చేయదగినది? ఏది కాదు? అను విషయమును మనము సామాన్యవివేకము ద్వారా అతి సరళముగా తెలుసుకొనవచ్చును. ఈ జ్ఞానమును మానవుడు సృష్టించక పోయినా, ఇది మానవులకు అతిసహజముగా తెలియుచుండును. కావుననే, దీనిని మనము ఈశ్వరుని నియతి అంటాము. ఇచట మనము చర్చించే వ్యక్తులు విశ్వజనీనమగు నైతికవిలువలను మాత్రమే గాక, శాస్త్రవిహితములగు ధర్మములను కూడ ఉల్లంఘించెదరు. ఈ

ధర్మోల్లంఘనమే ఈశ్వర విద్వేషము అని పరిగణించబడినది. కావున, ధర్మానురూపమగు జీవనముకూడ ఒక విశిష్టమైన ఈశ్వరార్చనయే యగును. కావున, నీతిబద్ధమగు జీవితమును గడుపు వారందరు, ఈశ్వరుని అంగీకరించినా, అంగీకరించకపోయినా, ఈశ్వరారాధకులే యగుదురు.

మరియు, ఈ అసురప్రవృత్తి గల జనులు మిథ్యాదోషముల నారోపించుటలో దిట్టలు (అభ్యసూయకాః). ఎదుటివానిలో ఉన్న గుణమును ప్రక్కన బెట్టి, వానిలో దోషమును వెదికి పట్టుకొని, దానిని బయట పెట్టుటకు ప్రయత్నించెదరు. ఇతరుల గుణములను దర్శించగానే, తాము అల్పులమనే భావన వారికి కలుగుటచే, దానికి విరుగుడు కొరకై ఎదుటి వ్యక్తిలోని లోపమును అన్వేషించెదరు. వీరు ప్రత్యేకించి ఆధ్యాత్మికసాధకులు మరియు ధర్మబద్ధమగు జీవితమును గడుపు వారు అగు జనులయొక్క గుణములను, జీవనశైలిని, అనుశాసనములను మరియు నైతిక విలువలను చూచి సహించలేరు. ఇట్టి జనులను ఈశ్వరుడు ఏమి చేయవలెను?

ధర్మమునకు విరుద్ధముగా జీవిస్తూ, ధార్మికజీవనము గలవారియెడల శత్రుత్వమును నెరపుతూ జీవించు ఇట్టి జనులను ఈశ్వరుడు సంసారజీవితములో పారవేయును. వారు ఈశ్వరుని ద్వేషించిననూ ఆయన వారిని ద్వేషించడు. కాని వారు ఇట్టి ఫలమునకు అర్హులై యున్నారు. వారి కర్మలను బట్టి వారి దుష్పరిణామములను పూర్తి మాత్రలో అనుభవించెదరు. ఈశ్వరుని ఆధ్యాదేశములను ఉల్లంఘించే ఈ క్రూరులు వారికి ఈయబడిన వివేకశక్తిని వినియోగించకపోవుటచే నరాధములని వర్ణించబడినారు. సంసారేషు అను బహువచన ప్రయోగమును బట్టి వీరు ఒకదాని తరువాత మరియొకటి చొప్పున వరుసగా (అజస్రమ్) వివిధజన్మలను పొందెదరని సూచితమగు చున్నది. వారు చాల అధికమగు పాపమును మూటగట్టుటచే, దానిని అనుభవించుటకు ఒక జన్మ చాలదు. మానవజన్మ కూడ సంసారమే అయిననూ, కొంతకాలమువరకు వీరు అసురయోనులయందు మాత్రమే జన్మించెదరు (ఆసురీషు ఏవ యోనిషు). వారు మానవులై యుండగా పెద్దపులులవలె దుమికెడివారు. గాడిదలవలె తన్నెడివారు. వృశ్చికములవలె కుట్టెడివారు. వివిధజంతువులవలె అత్యాశతో కలియబడి భుజించెడివారు. వారిలోని ఆ క్రూరత్వము పూర్తిగా క్షయమగువరకు వారు ఆయా జంతువుల రూపములో జన్మించెదరు. దేనిని చూడగానే మనకు భయము కలుగునో, అది అసురయోని యగును. ఉదాహరణకు దయ లేకుండగా విషము గ్రక్కే పాము అసురయోని యగును. ఆలోచించే సామర్థ్యము మరియు ఎన్నుకొనే స్వాతంత్ర్యము గల మానవులమై జన్మించినందులకు

మనము అంతరాత్మ ఆదేశమునకు విలువనిచ్చి ధర్మమునకు అనురూపముగా జీవించాలని అపేక్షింప బడుతున్నది. అట్లు గాక, క్రూరుడై సర్వులను హింసపెట్టు వ్యక్తి కర్మనియతిని అనుసరించి ఈ దేహము రాలిపోయిన తరువాత అసురయోనిలో జన్మించును. కర్మనియతి జీవులకు నిష్పక్షపాతముగా ఫలముల నిచ్చును.

**అధ్యాయము 16, శ్లోకము 20:**

असुरीं योनिमापन्ना मूढा जन्मनि जन्मनि ।
मामप्राप्यैव कौंतेय ततो यांत्यधमां गतिम् ॥ २० ॥

అసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని
మామప్రాప్యైవ కౌంతేయ తతో యాంత్యధమాం గతిమ్ (20)

కౌంతేయ = కుంతీపుత్రుడవగు అర్జునా!, మూఢాః = ఆ మూర్ఖులు, జన్మని జన్మని = ప్రతి జన్మయందు, ఆసురీమ్ = అసురసంబంధియగు, యోనిమ్ = యోనిని, ఆపన్నాః = పొందినవారై, మామ్ = నన్ను, అప్రాప్య ఏవ = నిశ్చితముగా పొందకుండగనే, తతః = అచటనుండి, అధమామ్ = నికృష్టమగు, గతిమ్ = గతిని, యాంతి = పొందెదరు.

కుంతీపుత్రుడవగు ఓ అర్జునా! ఆ మూర్ఖులు ప్రతిజన్మయందు అసుర సంబంధియగు యోనిని పొందినవారై, నిశ్చితముగా నన్ను పొందకుండ గనే అచటనుండి నికృష్టమగు గతిని పొందెదరు (20).

ఏ పనిని చేయవలెను? ఏ పనిని చేయరాదు? అనే ఇంత చిన్న విషయములో కూడ వివేకము లేనివారు మూఢులు అనబడుదురు. ఇట్టివారు అసురయోనులలో కేవలము ఒక్కసారి మాత్రమే గాక, పలుమార్లు జన్మించెదరు. ఏలయన, వారు మూటగట్టిన పాపము క్షయమగుటకు ఒక జన్మ చాలదు. కావున, వారీ విధముగా క్రూరమృగములై గాని, లేదా తమోగుణప్రధానమగు మరియొక జన్మను పొంది ఆ క్రూరత్వమును అనుభవించెదరు. ఇట్టి దేహములలో దేహికి వివేకము ఉండదు. పెద్దపులి తాను క్రూరజంతువునని అనుకోదు. ఆ పరిస్థితి నుండి మారాలనే తలంపు దానికి రాదు. ఈ విశేషాధికారము మానవులకు మాత్రమే గలదు. కాని, వీరు మానవులై యుండగా ఆ వరమును సద్వినియోగము చేయలేదు. కావున, వారు అంతకంతకు నికృష్టము

మరియు వివేకహీనము అగు యోనులలో జన్మించెదరు. వారు చేసిన పాపముల ఫలము పూర్తియగు వరకు ఈ జన్మపరంపర కొనసాగును. వారు మానవులై యుండగా ప్రవర్తించిన తీరు వారు ఈశ్వరుని పొందే అవకాశమును దూరము చేసినది.

వారు ఈశ్వరుని పొందెదరా? పొందరా? అను సందేహమునకు అవకాశము లేదనియు, ఈశ్వరుడు వారికి అందనంత దూరములో నున్నాడనియు శ్రీశంకరులు వివరించిరి. కావున, మానవులు ముందుగా వేదప్రతిపాద్యమైన ఈశ్వరీయ-అధ్యాదేశమును పాటించుట నారంభించవలెను. వీరు ప్రస్తుతములో చెడుదారులలో నిమగ్నులై యున్నారు. వారిలో ఈ చెడు అలవాట్లపై వైరాగ్యమును కలిగించుటకై వారు మరింత అధమగతిని పొందెదరని శ్రీకృష్ణభగవానుడు హెచ్చరించుచున్నాడు.

అసురుల సామాన్యలక్షణములు ఇచట వర్ణించబడినవి. వారిలో ఈ లక్షణములు ప్రకటమయ్యే తీరును బట్టి అసురులలో అనేకరకములు గలవు. ఒకనిలో క్రౌర్యము ప్రధానలక్షణము కాగా, మరియొకనిలో వినాశము చేసే లక్షణము ప్రధానముగా నుండును. కాని, వారందరిలో మూడు మౌలిక లక్షణములు సమానముగా నుండును. ఈ మూడు దుర్గుణములను దూరముగా నుంచగల్గినచో, అసుర ప్రకృతి అభివ్యక్తమయ్యే నానావిధలక్షణముల నుండి మనము విముక్తులమై ఉండే అవకాశము గలదు. ఈ మూడు సర్వ-అనర్థములకు కారణమగుచున్నవి.

**అధ్యాయము 16, శ్లోకము 21:**

त्रिविधं नरकस्येदं द्वारं नाशनमात्मनः ।
कामः क्रोधस्तथा लोभस्तस्मादेतत्त्रयं त्यजेत् ॥ २१ ॥

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః
కామః క్రోధస్తథా లోభస్తస్మాదేతత్త్రయం త్యజేత్ (21)

**నరకస్య** = నరకమునకు, **కామః** = కామము, **క్రోధః** = కోపము, **తథా** = మరియు, **లోభః** = లోభము అనే, **ఇదమ్** = ఈ, **త్రివిధమ్** = మూడు రకముల, **ద్వారమ్** = ద్వారము, **ఆత్మనః** = జీవుని, **నాశనమ్** = నశింపజేయునది, **తస్మాత్** = అందువలన, **ఏతత్** = ఈ, **త్రయమ్** = మూడింటిని, **త్యజేత్** = విడువవలెను.

నరకమునకు కామము, క్రోధము, లోభము అనే మూడు రకముల ద్వారములు గలవు. ఇవి జీవుని వినాశమునకు హేతువులగును. కావున, ఈ మూడింటిని విడువవలెను (21).

దుఃఖానుభవమేదైనా నరకమే. ఆ నరకములోనికి ఈ మూడు ద్వారములలో దేనిగుండానైనను ప్రవేశించవచ్చును. ఇవి అన్నియూ వ్యక్తి యొక్క వినాశమునకు (ఆత్మనః నాశనమ్) దారి తీయునవియే. ఈ ద్వారములోనికి ప్రవేశించినంత మాత్రాన వ్యక్తి నాశమగునని శ్రీశంకరులు వక్కాణించిరి. ఇది కానరాని గోతిలోనికి అడుగిడుట వంటిది. అది వానిని వెంటనే కబళించి వేయును. మానవులు పశువులకు అభీష్టములైన వస్తువులను ఎర చూపి, అవి వలలో చిక్కునట్లు చేయుదురు. అటులనే, ఈ మూడు మానవులను పట్టి వినాశము చేయును. ఇచట వినాశమనగా వాటిలో చిక్కినవాని మనస్సు ఆందోళనాభరితమై యుండుటచే, మోక్షము మాట అవలనుంచి, అతడు ఇతరపురుషార్థములకైననూ అర్హతను గోల్పోవును.ఈ మూడింటివలన, అతడు ఆశించే చిన్న చిన్న సుఖముల నుండి కూడ వంచితుడగును.

అభీష్టములగు వస్తువులపై మానవునకు గల కామము వానిని ఈ వలలోనికి నెట్టి వేయును. కామము ఉన్నచోట క్రోధము, లోభము దానిని అనుసరించి యుండును. దీనికి విలోమముగా, నీవు కామమును నియంత్రించ గల్గినచో, క్రోధలోభములు వాటంతట అవియే సద్దుమణుగును. మరియు, కోపమును తగ్గించుకొన గల్గినచో, కామము కూడ నియంత్రణలో నుండును. దానిని సమర్థముగా హద్దులలో నుంచుట సంభవమగును. లోభము ఆఖరున చెప్పబడినది. ఏలయన, లోభము ఉన్నచోట క్రోధము ఉండితీరును. కాని, లోభము వశములోనున్నచో, క్రోధమును,ఆ తరువాత కామమును కూడ నియంత్రించవచ్చును. సరళము, బంధహేతువు అగు కామము యొక్క సరిహద్దులో లోభము ఉండును. లోభము యొక్క ఈ ఆరంభబిందువును వివేకముతో గుర్తించుట చాల ప్రముఖమైన విషయము. కామము విఫలమైనప్పుడు కోపము వచ్చినచో, ఆ కామము బంధహేతువు అగును. లోభము యొక్క ఆరంభస్థానమును మనము గుర్తు పట్టవలెను. ఒక వస్తువుతో అవసరము లేకపోయినా, అది లేకున్ననూ సుఖముగా జీవించగల్గినా, దాని యందు కామన ఉన్నచో, అదియే లోభము. కామనా పరిపూర్తిలో ధర్మమునుల్లంఘించినచో, ఆ కామనయే లోభము అగును.

కామక్రోధలోభములనే ఈ మూడు యాతనానుభవములకు సింహద్వారములు గనుక,

అవి ఆత్మవినాశమునకు హేతువులగును (ఆత్మనః నాశనమ్). తెలివితేటలు గలవాడెవడైననూ ఆత్మవినాశమును కోరి తెచ్చుకొనరాదు గనుక, ఈ మూడింటికి దూరముగా నుండవలెను (త్యజేత్). ఈ మూడింటిని నీవు అదుపులో నుంచగల్గినచో, మిగిలిన అసురసంపద అంతయూ నియంత్రణలో నుండును. ఇచట ఈయబడిన అసురీసంపదయొక్క విస్తృతమగు వర్ణనను విన్నచో దానిని జయించుట అసంభవమనిపించును. కావుననే, శ్రీకృష్ణుడు దానినంతనూ కామక్రోధలోభములు అను మూడింటిలోనికి సంక్షిప్తము చేసినాడు. ఈ మూడింటిని ఇంకనూ క్లుప్తము చేసినచో, కామము మిగులును. వీటిని మానవుడు పరిత్యజించవలెను. కాని ఎట్లు? అవి నా స్వరూపమై యుండ వాటిని పరిత్యజించుట సంభవము గాదు. కావున, నాకు ప్రార్థన, కొన్ని అనుశాసనములు మరియు విచారము కూడ అవశ్యకమగును.నేను అవగాహనతో నా ప్రాథమికతల (priorities) లో పరివర్తనను తీసుకురాగల్గినచో, భయంకరభూతమువలె కానవచ్చే ఈ అసురీసంపద దాని వాస్తవరూపమును దాల్చును; అనగా, అదుపులోనికి వచ్చును. మనిషి వికాసమును చెందే ప్రక్రియ ఇదియే. రబ్బరు బుడగ పగిలినచో, అది పిల్లవాని దృష్టిలో పెద్ద సమస్య. కాని, దానివలన పెద్దవారికి సమస్య ఏమియూ లేదు. కారణమేమనగా, మనము బుడగలకు సంబంధించినంతవరకు మానసిక పరిపక్వతను పొందియున్నాము. కాని, నా దగ్గర ఉన్న షేర్ల ధర పడిపోయినచో, అది నాకు పెద్ద సమస్య యగును. షేర్ల ధరలు పడిపోయిన కారణముగా ఆత్మహత్య చేసుకున్నవారు, గుండె ఆగి మరణించినవారు లేకపోలేదు. దీనిని బట్టి మన ప్రధానసమస్య కామమని తెలుచున్నది. మనము దీనిని అధిగమించుటలో విచారము నిస్సందేహముగా సహకరించును. మనము ఎన్నింటినో అధిగమించి యున్నాము. రాగద్వేషములనగా కామమే. దీనిని సమర్థవంతముగా అదుపు చేయగల్గినచో, క్రోధలోభములు వాటంతట అవియే దూరమగును. కామము లేనిచోట అవి ఉదయించనే ఉదయించవు.

ఈ మూడింటి పరిత్యాగమును తరువాతి శ్లోకము స్తుతించుచున్నది.

**అధ్యాయము 16, శ్లోకము 22:**

एतैर्विमुक्तः कौंतेय तमोद्वारैस्त्रिभिर्नरः ।
आचरत्यात्मनः श्रेयस्ततो याति परां गतिम् ॥ २२ ॥

ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారైస్త్రిభిర్నరః
ఆచరత్యాత్మనః శ్రేయస్తతో యాతి పరాం గతిమ్ (22)

**కౌంతేయ** = కుంతీపుత్రుడవగు ఓ అర్జునా!, **ఏతైః** = ఈ, **త్రిభిః** = మూడు, **తమోద్వారైః** = చీకటి ద్వారములనుండి, **విముక్తః** = విముక్తుడైన, **నరః** = మానవుడు, **ఆత్మనః** = తన యొక్క, **శ్రేయః** = శ్రేయస్సును, **ఆచరతి** = అనుష్ఠించును, **తతః** = దానివలన, **పరామ్** = అతిశ్రేష్ఠమగు, **గతిమ్** = లక్ష్యమును, **యాతి** = పొందును.

> కుంతీపుత్రుడవగు ఓ అర్జునా! ఈ మూడు చీకటి ద్వారములనుండి విముక్తుడైన మానవుడు తనకు శ్రేయోదాయకములగు కార్యములననుష్ఠించి, దానివలన పరమగతిని పొందును (22).

ఇచట నరకము చీకటి (తమస్) అని నిర్దేశించబడినది. ఏలయన, అచట వివేకము కప్పివేయబడి యుండును. కావున, దానికి మోహము, దానితో బాటు దుఃఖము తోడగును. ఈశావాస్యోపనిషత్తులోని 3వ మంత్రము ఇట్లు చెప్పుచున్నది: ఆత్మ వినాశమును కోరి తెచ్చుకొనే ఆ జనులు అంధుని చీకటివంటి చీకటితో కప్పివేయబడియుండే అసుర్య అనబడే లోకములను పొందెదరు (అసుర్యా నామ తే లోకా అంధేన తమసావృతాః, తాంస్తే ప్రేత్యాభిగచ్ఛంతి యే కే చాత్మహనో జనాః). అనగా, వారిలో సమ్మోహము అధికముగా నున్నదనియు, కావున వారికి సుఖము దూరమనియు అభిప్రాయము. వ్యక్తి పందికొక్కు అయినప్పుడు, వివేకము ఏమి ఉండును? వారిలో ఆలోచించి తెలుసుకొనే శక్తి అత్యల్పముగా నుండుటచే, ఆ స్థితికి అంధుని చీకటితో రూపకము చేయబడినది. వివేకము లేనివాని మస్తిష్కము పూర్తి విలక్షణముగా నుండును. అట్టి వానికి మనకు గల సమస్యలు ఉండకపోవుట అనే లాభము గలదు. కాని, ఆ బుద్ధికి ఒక్క వాక్యమైననూ అర్థము గాదు. మనము గీతను గాడిద ముందు ఉంచినచో, అది దానిని పూర్తిగా తినివేయును. దాని దృష్టిలో గీతకు అంతకు మించిన విలువ లేదు. అదే విధముగా, వీపుపై గంధపు చెక్కలనుంచినచో, దానికి వాటి బరువు మాత్రమే తెలియును. 'దానికి సుగంధము గాని, గంధపు చెక్కల విలువ గాని తెలియవు (భారస్య వాహీ న తు చందనస్య). అవివేకము ఇట్లుండును. అత్యల్పమగు వివేకముగల ఇట్టి జన్మలలో సుఖము ఉండదు. కామాదులు ఇట్టి జన్మలను ఇచ్చే ద్వారములు.

ఈ నరకద్వారములు మూడింటినుండి పూర్తిగా విముక్తుడైయున్న వ్యక్తిని గురించి ఈ శ్లోకము చర్చించుచున్నది. నరః అనగా మానవుడు. అవినాశియగు ఆత్మ అని కూడ నరశబ్దమునకు అర్థమును చెప్పువచ్చును (న రీయతే ఇతి నరః). ఈతడు కామక్రోధ లోభములచే

ఆక్రమించబడలేదు గనుక, తన వివేకమును వినియోగించి సచ్ఛీలముతో కూడిన జీవితమును గడుపగల్గును (ఆచరతి). పూర్వశ్లోకములో చెప్పబడిన ఆత్మ-వినాశమునకు విలక్షణముగా, ఈతడు తనకు హితము కలిగే విధముగా (ఆత్మనః శ్రేయః) ఆచరించును. పూర్వములో తప్పుడు పనులకు పురిగొల్పిన కామక్రోధలోభములనే ఆటంకములనుండి ఆతడు విముక్తుడై యున్నాడు గనుక, ఇది ఆతనికి సాధ్యమైనది. ఈ మూడింటి వెనుక బడి తన శక్తిని అంతనూ దుర్వ్యయము చేయువాని యందు ఏమి వివేకము ఉండును? ఆతనికి సరిగా ఆలోచించే సమయము కూడ ఉండదు. కామక్రోధలోభములనుండి విముక్తిని పొందే ప్రక్రియను ఆరంభించుటకైననూ, కొంత వివేకము ఉండవలెను. కాని, ఒకసారి ఈ ప్రక్రియ ఆరంభమైనచో, ఆతనికి హితకరమగు విషయములను గురించి బోధింపబని లేదు. ఏలయన, ఆతనిలో అంతవరకు కొరవడిన అంతరంగిక విశ్రాంతి ఇపుడాతని సొత్తు. దీనికి అంతకు కారణము వివేకము. కామక్రోధ లోభములు ఉండుట సహజము. ప్రతి శిశువునందు కూడ వీటి స్పర్శ గలదు. కాని, వాటి బారినుండి బయట పడుటకు చాల వివేకము ఆవశ్యకమగును.

తగినంత వివేకము గల వ్యక్తి అర్థకామధర్మమోక్షములకు సంబంధించిన విషయములన్నిటియందు తనకు శ్రేయస్సు కలుగు విధముగా ఆచరించును. ఆ నాలుగు ఆతనికి హితకరములే. సందేహము లేదు. కాని, యథార్థమగు హితకారి మోక్షము మాత్రమే. ఉదాహరణకు, వస్తువులను సంపాదించి పరిరక్షించిననూ, అవి కాలక్రమములో నిశ్చితముగా నశించునవియే గనుక, వాటియందు భద్రత లభించదు. సర్వము వలన భయము లేకుండుటయే యథార్థమగు భద్రత. అది మోక్షము మాత్రమే. ఇదే విధముగా, మనము కామము, ధర్మము అనే పురుషార్థములను విశ్లేషించినచో, వాటి వాస్తవికమగు పరిపూర్తి మోక్షములో మాత్రమే గలదని స్పష్టమగును. మానవుని సర్వవిధముల అన్వేషణల వెనుకనున్న యథార్థమగు పురుషార్థము మోక్షము మాత్రమే. పూర్వములో ఆతనికి కామక్రోధలోభములనే సంకెలలు దృఢముగానుండుటచే, ఆతడు ఏ పురుషార్థమునైననూ విజయవంతముగా సాధించలేక పోయెడివాడు. చేతులకు సంకెలలు గల వ్యక్తి వీపుమీద దురదను గోకుకొనుటకైననూ సమర్థుడు కాడు. కాని, ఇపుడాతడు విముక్తిని పొందినాడు. కావున, సచ్ఛీలముతో ప్రవర్తించే శక్తి ఆతనికి కలిగినది (ఆచరతి). దానివలన (తతః) ఆతడు సర్వాభీష్టమగు లక్ష్యమును పొందును (యాతి పరాం గతిమ్). అది మోక్షము కూడ కావచ్చునని శ్రీశంకరులు అభిప్రాయపడిరి. ఆతడు కామక్రోధలోభముల బందీలో లేడు గనుక, తాను వాస్తవముగా కోరే లక్ష్యము మోక్షమేనని

అతడు గుర్తించగల్గినచో, దానిని అతడు నిశ్చయముగా సాధించగలడు. కాని, ఈ మూడింటిపై నియంత్రణను పొందలేక పోయిన వ్యక్తికి అవి ఇక్కట్లను కలుగజేయును.

అతడు ఈ మూడింటిని మాత్రమే గాక, అసురసంపదను అంతను పరిత్యజించి, తనకు శ్రేయస్సు కలిగే విధముగా ధర్మమోక్షముల బాటలో పయనించుటకు కారణమేమి? ఏది కర్తవ్యము? ఏది కర్తవ్యము కాదు? మానవునకు శ్రేయస్సును కలిగించునది ఏది? దేనివలన మానవుడు దుఃఖభాజనుడగును? అను విషయములను శాస్త్రము బోధించుననియు, మరియు శాస్త్రము మోక్షసాధనమనియు తరువాతి శ్లోకము వివరించుచున్నది. ఈ విషయములలో మానవుడు శాస్త్రముకేసి చూడనిచో, ఏ ఫలితము లభించును?

**అధ్యాయము 16, శ్లోకము 23:**

यश्शास्त्र विधिमुत्सृज्य वर्तते कामकारतः ।
न स सिद्धिमवाप्नोति न सुखं न परां गतिम् ॥ २३ ॥

యశ్శాస్త్ర విధిముత్సృజ్య వర్తతే కామకారతః
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ (23)

యః = ఎవడైతే, శాస్త్రవిధిమ్ = శాస్త్రము యొక్క ఆదేశములను, ఉత్సృజ్య = పారద్రోసి, కామ కారతః = బంధహేతువులగు కామనలచే ప్రేరితుడై, వర్తతే = కర్మలననుష్ఠించునో, సః = వాడు, సిద్ధిమ్ = పరిపక్వతను, న అవాప్నోతి = పొందడు, సుఖమ్ = సుఖమును, న = పొందడు, పరామ్ = సర్వోత్కృష్టమగు, గతిమ్ = లక్ష్యమును, న = పొందడు.

ఎవడైతే శాస్త్రము యొక్క ఆదేశములను పారద్రోసి బంధహేతువులగు
కామనలచే ప్రేరితుడై కర్మలననుష్ఠించునో, వాడు పరిపక్వతను గాని,
సుఖమును గాని, సర్వోత్కృష్టమగు లక్ష్యమును గాని పొందడు (23).

బంధహేతువులగు కామనలకు పూర్తిగా వశుడై యుండే (కామకారతః) వ్యక్తిని గురించి ఈ శ్లోకము వర్ణించు చున్నది. శాస్త్రవిధులయందు లేశమైననూ ఆదరము లేని వాడై అతడు పూర్ణముగా కామనాపరిపూర్తికి అంకితమైన జీవితమును గడుపును (వర్తతే). ఇచట శాస్త్రమనగా

వేదము. ఏది చేయదగిన కర్మ? ఏది కాదు? అను విజ్ఞానమునకు వేదము ఆకరమై యున్నది. మనము చేయవలసిన కర్మలను బోధించే విధులు మరియు చేయకూడని కర్మలను బోధించే నిషేధములు కూడ వేదమునందు గలవు. విశ్వజనీనమైన విధినిషేధములను గురించి మనకు సహజసిద్ధమైన సామాన్యవివేకజ్ఞానము (Common sense knowledge) గలదు. కాని, ఈ సామాన్యవివేకమువలన తెలియవచ్చే ప్రవర్తనానియమావళిని ఆదరించినదానికి, తిరస్కరించిన దానికి ఉండే పరిణామములగురించి మనకు తెలియదు. ఈ అంశములో శాస్త్రమునకు ప్రముఖస్థానము గలదు. మనము చేసే కర్మల ఫలమును గురించి శాస్త్రము బోధించును. ఒక వ్యక్తి చేసిన అకృత్యమును ఇతరులు గుర్తించకపోవుటచే అతడు శిక్షనుండి తప్పించుకొనవచ్చును. కాని అతడు కర్మనియతిని తప్పించుకొనలేడని శాస్త్రము చెప్పుచున్నది. శాస్త్రము యొక్క ఆధ్యాదేశములను గాలికి బార్వైచి, కేవలము కామనాప్రేరితుడై కర్మలనాచరించే వ్యక్తినిగురించి మనమిచట తెలుసుకొనుచున్నాము.

అతడు సిద్ధిని పొందడు (సః న సిద్ధిం అవాప్నోతి). ఇచట సిద్ధియనగా మానవునకు హితమును కలిగించే సాధనను చేపట్టే యోగ్యతయని (పురుషార్థయోగ్యతా) శ్రీశంకరులు వివరించిరి. మానసిక పరిపక్వత యనగా నిదియే. తన శరీరమును జాగ్రత్తగా పరిరక్షించుకొనగల్గుట మానవుని మొదటి ఉపలబ్ధి (accomplishment). బౌద్ధిక (intellectual) అనుశాసనమును మరియు మానసికభావావేగముల (emotional) అనుశాసనమును పెంపొందించే విద్యను నేర్చుకొనుట రెండవది. ఇది సామాన్యమైన విషయము కాదు. పెద్ద హాని లేకుండగా యౌవనమును దాటినవాడు తన జీవితములో అతి ప్రముఖమైన విజయమును సాధించినట్లే యగును. అది చాల ఇబ్బందులతో నిండియున్న వయస్సు. దానిని సద్వినియోగము చేసినచో, వ్యక్తి తనకు హితమును కలిగించే అర్థకామధర్మ మోక్షములనే పురుషార్థములలో నేటినైననూ చేపట్టి సాధించే సామర్థ్యమును పొందగల్గును. ఏ పురుషార్థమునకైననూ మానసిక పరిపక్వత అత్యావశ్యకము. శాస్త్రాదేశములను ఉల్లంఘించు వ్యక్తి ఈ పరిపక్వతను పొందుట అసంభవము. కావున, అట్టివాడు జీవితములో చెప్పుకోదగిన సాధనను చేయజాలడు; సాఫల్యమును పొందజాలడు. ఇట్టి స్థితిలో అతనికి ఈ జీవితములో సౌఖ్యము మృగ్యమగును. మానసికపరిపక్వత గల వాడు మాత్రమే సుఖించగల్గును. అది లేనివాడు ప్రతి చిన్న విషయమునకు ఆందోళనకు గురియగును. అతడు ఈ లోకములో సుఖమునకు దూరమగుటయే గాక, మరణించిన తరువాత స్వర్గము, మోక్షము మొదలగు అభీష్టలక్ష్యము (పరాం గతిమ్)ను పొందజాలడు.

యౌవనములో వ్యక్తియొక్క ఇంద్రియశక్తులన్నియు అత్యున్నతస్థితిలో నుండును. చక్కగా చదువుకొని, ఆ చదువును బుద్ధిలో ధారణ చేయుటకు అది చాల అనువైన కాలము. అది చేయి జారిపోయినచో, మరల లభించేది కాదు. కావున, దానిని సద్వినియోగము చేయుట అత్యావశ్యకము. తరువాతి కాలములో ధనసంపాదన ఇత్యాది శతాధికకార్యములలో మనకు ఊపిరి సలపకుండ నుండును. ఈ కాలములో తన శక్తియుక్తులను ఇంద్రియభోగలాలసతలో దుర్వినియోగము చేసిన వ్యక్తి శేష జీవితములో తాను దేనినీ సాధించలేకపోయితినని దుఃఖిస్తూ, మానసిక గాయములను, వైఫల్యములను గుర్తు చేసుకుంటూ బ్రతుకవలసి యుండును. అట్టి వ్యక్తి నలభై సంవత్సరముల వయస్సు వచ్చునాటికే తన పని అయిపోయినదని భావించును. బుద్ధిలో మరియు మనస్సులో పరిపక్వతను పొందలేకపోయిన వ్యక్తి తాను ఏ సుఖము కొరకై తన శక్తిని అంతనూ వినియోగించి తంటాలు పడుచుండెనో, ఆ సుఖమునుండి వంచితుడగును. ఇది ఎంతటి నష్టదాయకమగు బేరమో గమనించుడు. కావున, మనము ఈ కామక్రోధలోభములనే మూడింటిపై నియంత్రణను సాధించవలెనని గీతాచార్యుని ఆకాంక్ష. ఇవి అసురుల హృదయములలో మాత్రమే గాక, కొద్దో గొప్పో సర్వమానవుల హృదయములలో గలవు.

**అధ్యాయము 16, శ్లోకము 24:**

तस्माच्छास्त्रं प्रमाणं ते कार्याकार्यव्यवस्थितौ ।
ज्ञात्वा शास्त्रविधानोक्तं कर्म कर्तुमिहार्हसि ॥ २४ ॥

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి (24).

**తస్మాత్** = అందువలన, **తే** = నీకు, **కార్యాకార్యవ్యవస్థితౌ** = ఏది చేయదగినది? ఏది చేయకూడనిది? అను విషయమును నిర్ణయించుటలో, **శాస్త్రమ్** = శాస్త్రము, **ప్రమాణమ్** = జ్ఞానసాధనము, **శాస్త్రవిధానోక్తమ్** = శాస్త్రవిధులచే చెప్పబడిన, **కర్మ** = కర్మను, **జ్ఞాత్వా** = తెలుసుకొని, **ఇహ** = ఇచట, **కర్తుమ్** = చేయుటకు, **అర్హసి** = తగుదువు.

అందువలన నీకు ఏది చేయదగినది? ఏది చేయకూడనిది? అను
విషయమును నిర్ణయించుటలో శాస్త్రము జ్ఞానసాధనమగును. నీవు ఈ

లోకములో శాస్త్రవిధులచే చెప్పబడిన కర్మను తెలుసుకొని చేయుటకు తగుదువు (24).

శాస్త్రము అనగా వేదము. అది అర్జునునకు మాత్రమే గాక సర్వమానవులకు ప్రమాణము. ప్రమాణమనగా అధికారిక వచనము అని గాని, మార్గదర్శకము అని గాని జనులు తరుచుగా అనువదించెదరు. కాని ప్రమాణమనగా జ్ఞానసాధనము. ప్రమాకరణం ప్రమాణమ్ అని దాని వ్యుత్పత్తి. అనగా, జ్ఞానము ఉదయించుటలో సహకరించే సాధనము అని యర్థము. ఈ జ్ఞానము యొక్క స్వరూపమేమి? ఒక విశిష్టపరిస్థితిలో ఏమి చేయవలెను? ఏమి చేయకూడదు? అను విషయమును నిర్ణయించుటకు ఆవశ్యకమైన జ్ఞానము. ఒక కర్మను చేయవచ్చునా? చేయకూడదా? నేను సంపదను ఎంత ఉంచుకొని, ఎంత దానము చేయవలెను? ఇత్యాది విషయములను తెలియవలసిన అవసరము మనకు ఎప్పుడు కలిగినను, అవి శాస్త్రము యొక్క ఆదేశములలో చెప్పబడి సిద్ధముగా నున్నవి. శాస్త్రము యొక్క అధ్యాదేశమునకు విధానమని పేరు. ఉదాహరణకు, 'హింసించకుము (హింసాం న కుర్యాత్)', 'అసత్యమును పలుకకుము (అనృతం న బ్రూయత్)' అని శాస్త్రము చెప్పుచున్నది. మరియు శాస్త్రము వర్ణాశ్రమకర్మలను సుస్పష్టముగా బోధించుచున్నది. ఇపుడు ఆ వ్యవస్థ అంతయు ఛిన్నాభిన్నమగుటచే, మనము ఆ శాస్త్రమును సామాన్యముగా ఏది కర్తవ్యము? ఏది అకర్తవ్యము? అను రూపములోనికి యథోచితముగా మార్చుకొనవలెను. కర్తవ్యకర్మలు పుణ్యమును, అకర్తవ్యకర్మలు పాపమును ఇచ్చునని శాస్త్రము చెప్పుచున్నది.

మానవుడు ఈ లోకములో కర్మను చేయుటకు అర్హుడై యున్నాడు (ఇహ కర్మ కర్తుం అర్హసి). ఈ భూలోకములో మానవరూపములోనున్న జీవునకు కర్మను చేయుటకు గాని, మానుటకు గాని స్వేచ్ఛ గలదు. ఈ సత్యమును మనము గుర్తించుటకై భగవానుడిచట ఇహశబ్దమును ప్రయోగించినాడు. దీనికి భిన్నముగా స్వర్గాది ఇతరలోకములలో జీవుడు తన పుణ్యము క్షయమగునంతవరకు భోగములను అనుభవించగలడే గాని, ఈ రకమైన స్వేచ్ఛ అచట ఉండదు. ఈ భూమండలములో కూడ వివిధదేశముల మధ్య తారతమ్యము గలదు. భారతదేశము పుణ్యమును సంపాదించుటకు యోగ్యమైన కర్మభూమి కాగా, అమెరికా మానవుడు పుణ్యఫలమును అనుభవించుటకు దగిన భోగభూమియని పరిగణించవచ్చును. కాని, ఈ భూమండలముపై ఎక్కడైనను, మానవునకు తనకు నచ్చిన కర్మను ఎన్నుకొనుటకు మరియు జ్ఞానమును సంపాదించుటకు స్వేచ్ఛ గలదు. కాని, గంధర్వలోకములో జీవులు తమ

సమయమునంతనూ సంగీతమును ఆస్వాదించుటలో గడిపివేయుదురు. అచట జ్ఞానమును సంపాదించే అవకాశమేమి ఉండును? అట్టి స్వేచ్ఛ మానవులకు కలదు గాన, ఈ మానవజన్మ చాల అరుదైనది, మరియు విలువైనది. కావున, ఆ స్వేచ్ఛను సద్వినియోగము చేయవలెనే గాని, దుర్వినియోగము చేయరాదు. మనము శాస్త్రమును విశ్లేషించినచో, కర్మల విషయములో శాస్త్రతాత్పర్యము ఇదియేనని స్పష్టమగును. ఏ కర్మను చేయవలెనని శాస్త్రము ఉద్బోధించుచున్నదో, ఆ కర్మను చేసే అర్హత నీకు గలదు (కర్తుం అర్హసి).

శ్రీకృష్ణార్జునసంవాదరూపమైనది, బ్రహ్మజ్ఞానము మరియు యోగము విషయవస్తువుగా గలది అగు భగవద్గీతలో దైవాసురసంపద్విభాగయోగము అనే పదునారవ అధ్యాయము ముగిసినది.

శ్రీకృష్ణార్పణమస్తు.

# పదునేడవ అధ్యాయము

## శ్రద్ధాత్రయ విభాగయోగము

గడచిన అధ్యాయములో ఆఖరి శ్లోకములో ఇట్లు చెప్పబడినది: కావున, ఏది కర్తవ్యము? ఏది కర్తవ్యము కాదు? అను విషయమును నిర్ణయించుటలో శాస్త్రము నీకు జ్ఞానసాధనము (తస్మాత్ శాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ). మంచి-చెడుల పరిజ్ఞానము సామాన్యవివేకము వలననే లభించును. కాని, జనులు మంచిని స్వీకరించి చెడును దూరముగానుంచే పరిస్థితి కానరాదు. దీనికి కారణము అజ్ఞానము కాదు. ఉదాహరణకు చౌర్యము తప్పని అందరికీ తెలియును. కాని, చోరులు ఉండనే ఉన్నారు. తన వస్తువులు అపహరింపబడుట చోరునకైననూ సమ్మతము కాదు. కావున, చౌర్యము నేరమని చోరునకు తెలియుచుండును. కావుననే, అతడు చౌర్యమును రహస్యముగా చేయును. కావున, చౌర్యము దోషము అనే అతని జ్ఞానము అసమగ్రమని నా అభిప్రాయము. తన సొత్తు అపహరింపబడుట తనకు ఎట్లు సమ్మతము కాదో, అదే విధముగా ఇతరులు కూడ తమ సొత్తు అపహరింపబడుటను అంగీకరించజాలరని చోరునకు తెలియుచునే యుండును. దాని వలన తనకు కలిగే లాభము మరియు దానియందున్న పట్టుబడే ప్రమాదము కూడ అతనికి తెలియనివి కావు. కాని, అదే సమయములో తాను చౌర్యమును చేసి పొందే నష్టమును గురించి అతనికి అంచనా లేదు. ఈ విషయమును మనము శాస్త్రము ద్వారా మాత్రమే సమగ్రముగా తెలియగలము.

మనము ఒక కర్మను చేసి దాని ఫలితమునుండి తప్పించుకొనజాలము. ఇచ్ఛాస్వాతంత్ర్యము మరియు కర్మనియతి సమాంతరముగా నడుచుచుండును. మనకు గల ఇచ్ఛాస్వాతంత్ర్యము ఒక ప్రవర్తనానియమావళిని అపేక్షించును. మనకు గల ఎన్నుకొనే అధికారమును అది నిర్ధారించును. దీనిని మనము స్పష్టముగా తెలియవలెను. చౌర్యము చేసే సామర్థ్యము నాకు గలదు. కాని, నేను అట్లు చేయవలసిన ఆవశ్యకత లేదు. ఇతరులను హింసించుటకు, లేదా హింసించకుండుటకు నాకు స్వేచ్ఛ గలదు. సత్యమును పలుకుటకు, లేదా అసత్యమును పలుకుటకు నాకు శక్తి గలదు. నేను దానము చేయవచ్చును; లేదా, మానవచ్చును. ఈ రకమైన ఎన్నుకొనే హక్కు నాకు ఉన్నప్పుడు, ఆ ఎన్నికకు ఆధారమేది? నాకు ఎన్నుకొనే స్వేచ్ఛ ఉన్నది. కాని ఎన్నిక మంచి కావచ్చును; లేదా, చెడు కావచ్చును. ఈ విషయము కూడ నాకు తెలిసియుండవలెను. మంచి-చెడుల గురించి సరియగు అవగాహనను సంపాదించే శక్తి నాకు

ఉండవలెను. భగవానుడు సర్వులకు సామాన్యవివేకమునిచ్చి యున్నాడు. తద్వారా వాటి పరిజ్ఞానము నాకు గలదు. మంచి-చెడుల గురించి గల ఈ విశ్వజనీనమైన ధారణకే ధర్మమని పేరు. ఇది బోధించకుండగనే, సర్వులకు తెలియుచుండును. ఇతరప్రకృతినియములవలె ఇది కూడ సర్వులకు సమానముగా తెలిసే సంగతియే. తల్లి కోతి ఒక చెట్టు కొమ్మ నుండి మరియొకదానిమీదకు దుముకునప్పుడు గట్టిగా పట్టుకోనిచో క్రింద పడెదనని పిల్ల కోతికి తెలియుటకై దానికి గురుత్వాకర్షణ సిద్ధాంతమును బోధించనక్కరలేదు. గురుత్వాకర్షణ నియమమును మానవుడు సృజించలేదు. అటులనే, సర్వజనసాధారణమగు ఈ మంచి-చెడుల పరిజ్ఞానము (ధర్మః) మనచే సృజింపబడలేదు. ఈ విషయమును తెలియుట చాల ముఖ్యము. ఇది మానవకృతమైనచో, దాని యందు అనేక భేదములు ఉండి యుండును. అమెరికాలో కారును బాటకు కుడివైపున నడిపెదరు. కాని, భారత్ లో ఎడమవైపున నడిపెదరు. పన్నువిధానము, నేరము-శిక్ష ఇత్యాదులన్నియు మానవకృతములే. ఈ చట్టములన్నియు సృష్టిలో అంతర్భాగమై యున్న ఈ ధార్మికసంరచనకంటె విలక్షణమైనవి.

ఈ ధర్మనియతి నిత్యసిద్ధమై నాచే తెలియబడుతూ ఉన్నది. ఇంతేగాక, నాకు ఇచ్ఛాస్వాతంత్ర్యము గలదు. అనగా, నేను చేయబోవు కర్మను ఎన్నుకొనే అధికారము, సామర్థ్యము నాకు గలవు. నేను నా కర్మను ధర్మమునకు అనురూపముగా గాని విరుద్ధముగా గాని ఎన్నుకొని ఆచరించినపుడు, ఆ నియతి తదనురూపముగా నన్ను ప్రభావితము చేయక తప్పదు. నేను ధర్మమునకు విరుద్ధముగా నాచరించినచో, దాని వలన కలిగే ఘర్షణను నేను భరించవలయును. నేను ధర్మానురూపముగా నాచరించినచో, దాని సత్ఫలితము నాకు లభించును. నియతి పని చేయు విధమిట్టిది. ఒక వస్తువును పైనుండి జారవిడచినచో, అది ఎటువంటి వస్తువు అయిననూ, క్రింద పడి తీరును. అది సృష్టినియమము. మనము కర్మను ఎన్నుకొనే స్థాయిలో ధర్మనియతిగను, కర్మను ఆచరించే స్థాయిలో కర్మనియతిగను తెలియబడే నియతి ఒక్కటియే. మానవ కృతమగు చట్టమునుండి తప్పించుకొనుట సంభవమే. కాని ప్రకృతినియమమునుండి తప్పించుకునే ఉపాయము లేదు. పోలీసు కన్ను కప్పి చట్టవిరుద్ధమగు చర్యను చేసి, పట్టుబడకుండగా జాగ్రత్త పడి, శిక్షను తప్పించుకొనవచ్చును. కాని, నీవు ప్రకృతి నియమమునకు విరుద్ధముగా ఆచరించినచో, ఎవరికీ తెలియకుండగా కన్నుగప్పుట, మరియు దాని ఫలమునుండి తప్పించుకొనుట అసంభవము. నీకు ఏదేని సందేహమున్నచో, విద్యుత్తు తీగను స్పృశించుము; వెంటనే తెలియును. విద్యుత్తు తీగను స్పృశించినవాడు విద్యుదుత్పత్తికేంద్రమునకు అధిపకుడే

అయిననూ, వానికి విద్యుదాఘాతము తగిలి తీరును. ప్రకృతినియమమునుండి ఎవ్వరికైననూ మినహాయింపు లేదు. నిప్పును తాకినచో, కాలుట తప్పదు. అదే విధముగా, ధర్మమునకు బాధను కలిగించువాడు తాను బాధను పొందక తప్పదు. ధర్మనియతిపై కేంద్రితమైయున్న ఈ కర్మనియతి వ్యక్తి యొక్క ఇచ్ఛాస్వాతంత్ర్యమునకు, మరియు కర్తృత్వభావనకు కలుపబడియున్నది. ఇది మానవునకు గల విలక్షణమగు విశేషాధికారము. దేవతలతో సహా ఇతరప్రాణులకు కర్మఫలానుభవయోగ్యమగు ఉపకరణములు మాత్రమే గలవు. వారికి ఇచ్ఛాస్వాతంత్ర్యము లేదు గనుక, క్రొత్త కర్మలను చేసి, కర్మఫలమును ఉత్పత్తి చేసే అవకాశము వారికి లేదు. కర్తృత్వధారణ ఉన్నచోట స్వాతంత్ర్యము కూడ ఉండవలెను.

ఒక కర్మను చేయుటకు గాని, మానుటకు గాని నీకు స్వేచ్ఛ గలదు. నీవు ఒక కర్మను పరిహరించగల్గినచో, దానిని పరిహరించవలెను. లేనిచో, దాని ఫలమును నీవు పొందక తప్పదు. ధర్మము తెలిసియున్ననూ, జనులు దాని ఉల్లంఘించుటకు కారణమేమి? వారికి దానివలన తమకు కలిగే నష్టముగురించి తెలియదు. తమకు కలిగే లాభము వారికి చక్కగా తెలియుచుండును. ఇతరుల సొత్తును అపహరించినచో, వెనువెంటనే ఆర్థికపరిస్థితి మెరుగుపడును. దానివలన లభించే ప్రయోజనము కొట్టవచ్చినట్లు కానవచ్చును. కాని దానివలన కలిగే నష్టము గురించి మనకు తెలియదు. శాస్త్రము ఈ విషయమునే బోధించును. కర్మనియతి అనేది ఒకటి గలదనియు, దానివలన మానవుడు ఆచరించే కర్మలన్నింటికీ అదృష్టఫలము నిర్మాణమగుననియు శాస్త్రము మనకు బోధించుచున్నది. ఇంతేగాక, ఏది కర్తవ్యము? ఏది కాదు? అను విషయమును కూడ శాస్త్రము బోధించుచున్నది. దీనిని తెలిపే జ్ఞానసాధనము శాస్త్రము మాత్రమే. పూర్వాధ్యాయములోని అంతిమశ్లోకములో శ్రీకృష్ణుడు అర్జునునితో 'కావున కర్తవ్య–అకర్తవ్యములను తెలియుటకై నీకు శాస్త్రము జ్ఞానసాధనము (తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ)' అని చెప్పియున్నాడు. ఈ వాక్యమును వినిన అర్జునునకు దాని నుండి ఒక శంక ఉదయించినది. అతడీ క్రింద ప్రశ్నను వేయుచున్నాడు :

**అధ్యాయము 17, శ్లోకము 1:**

अर्जुन उवाच।
ये शास्त्रविधिमुत्सृज्य यजंते श्रद्धयान्विताः
तेषां निष्ठा तु का कृष्ण सत्त्वमाहो रजस्तमः ॥ १ ॥

అర్జున ఉవాచ
యే శాస్త్రవిధిముత్సృజ్య యజంతే శ్రద్ధయాన్వితాః
తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః (1)

కృష్ణ = ఓ శ్రీకృష్ణా!, తు = కాని, యే = ఎవరైతే, శ్రద్ధయా = శ్రద్ధతో, అన్వితాః = కూడినవారై, శాస్త్రవిధిమ్ = శాస్త్రముచే నిర్దేశించబడిన విధానమును, ఉత్సృజ్య = విడిచి పెట్టి, యజంతే = వేదవిహితమగు కర్మను అనుష్ఠించెదరో, తేషామ్ = వారియొక్క, నిష్ఠా = మూలగుణము, కా = ఏది?, సత్త్వమ్ = సత్త్వమా?, ఆహో = అట్లుగాక, రజః = రజోగుణమా?, తమః = తమో గుణమా?

> ఓ శ్రీకృష్ణా! కాని ఎవరైతే శ్రద్ధతో గూడినవారై శాస్త్రముచే నిర్దేశించబడిన విధానమును విడిచి పెట్టి వేదవిహితమగు కర్మను అనుష్ఠించెదరో, వారియొక్క మూలగుణము సత్త్వమా? రజోగుణమా? లేక తమోగుణమా? (1)

ఇది చాల ప్రముఖమైన ప్రశ్న. శాస్త్రము దేవతలకు చేసే వివిధపూజలకు విధానమును నిర్ణయించి యున్నది. కాని కొందరు ఆ నియమములను ఉల్లంఘించి దేవతల నారాధించుచుందురు. ఇట్టి వారి స్వరూపమేమి? వేదములలో మరియు వాటికి అనుబంధముగా నుండే వివిధస్మృతులలో వివిధరకముల దేవతారాధనములు మరియు వాటిని అనుష్ఠించదగిన నియమములు నిర్దేశింపబడియున్నవి. కొందరు అగ్నిహోత్రము మొదలగు వైదిక కర్మనుగాని, పూజ ప్రార్థన ఇత్యాది దేవతారాధనారూపమగు స్మార్తకర్మను గాని, శాస్త్రోక్తవిధి విధానమును విడిచిపెట్టి (శాస్త్రవిధిముత్సృజ్య), అనగా ఖచ్చితముగా మరియు సమగ్రముగా పాటించకుండగా చేసినారనుకొనుడు. వారు శాస్త్రమును అసలే అనుసరించుట లేదని చెప్పుటకు వీలులేదు. అట్లైనచో, ఆరాధనయే ఉండెడిది గాదు. వారు అనేకనియమములను పాటించుచునే యున్నారు. కాని, వారు శాస్త్రోక్తములగు నియమములనన్నిటినీ ఖచ్చితముగా అమలు చేయుట లేదు.

ఒక దేవతను ఆరాధించే వైదికకర్మలో తత్క్షణమే ఫలము లభించదు. సాధారణముగా వెనువెంటనే ఫలము లభించే సందర్భములో మనము అడ్డదారులను తొక్కే అవకాశము గలదు. ఆ పనిని తొందరగా పూర్తి చేయాలనే ఒత్తిడి ఉండుట సహజము. కాని, ప్రస్తుతములో దేవతను ఆరాధించుమని గాని, వైదికకర్మను చేయుమని గాని ఒత్తిడి చేయువారు ఎవ్వరూ లేరు. ఇది

ఆరాధించే పద్ధతి అను విషయము మనకు శాస్త్రము వలన మాత్రమే తెలియుచున్నది. ఆ శాస్త్రమే ఆరాధనానియమములను కూడ నిర్దేశించియున్నది. కావున, నియమములకు విరుద్ధముగా చేయుటకు కారణమేమున్నది? ఆ మాటకు వస్తే, దానిని చేయకపోయినా అడిగేవారు లేరు. చేయాలనే నిర్ణయము నాదే అయినప్పుడు నియమములను పాటించకపోవుటకు కారణమేమి? ఎవ్వరైననూ నియమములనన్నిటినీ పాటించకుండగా, వైదికకర్మను చేయుటకు హేతువు ఏమి గలదు? ఈ విషయములో రెండు వికల్పములు గలవు. ఒకటి వారికి తెలియకుండుట. పూజలలో పరిస్థితి తరుచుగా నిదియే. పూజ చేయదగినది అని వారికి తెలియును. కాని అది చేసే విధానమును వారు తమ ఇంటిలోని వారు గాని, లేక పైవారు గాని చేయుచుండగా చూచి నేర్చు కొనియుందురు. వారా ఆచారమును తగినంత పరిశీలన లేకుండగనే చేయుచుందురు. ఎందువలన? శ్రద్ధ ఉండుటవలన. వారు లోకాచారముననుసరించి పూజను చేయుదురు. దానికి కారణము శ్రద్ధ ఉండుటయే. కాని దాని నియమములన్నియు వారికి తెలియకపోవుటచే పాటించరు. తెలిసి ఉండి కూడా పాటించకపోవుట రెండవ వికల్పము. దీనిలో వ్యక్తియందు శ్రద్ధ కొరవడినది. అట్టివారు పూజాదికమును చేయుటకు కారణమేమి? పేరు ప్రతిష్ఠలు. కాని మనమిచట శ్రద్ధ గల వారిని గురించి చర్చించుచున్నాము.

వారి ఆరాధనలను చేయుటకు మూలములోనున్న నిష్ఠ ఏమి అయి ఉండును? అని అర్జునుడు చకితుడగుచున్నాడు. వారి అంతఃకరణప్రవృత్తికి మూలములోనున్న ప్రధాన గుణము ఏమి? సత్త్వమా? రజస్సా? లేక తమస్సా? వారు చేసే పూజ సాత్త్వికమా? రాజసమా? లేక తామసమా? అని శ్రీశంకరులీ ప్రశ్నను వివరించిరి. ఆరాధించబడే దేవత, ఆరాధకుని ఉద్దేశ్యము మరియు మనఃప్రవృత్తి అను వాటిపై ఆధారపడి ఆరాధనలలో పలురకములు గలవు. రావణుని ప్రార్థనలు, అభిచారికకర్మలు (ఇవి కూడ ఆరాధనలే) తామసికములు. ఒక ఆరాధనాక్రియను నియమములనన్నిటినీ పాటించకుండగా శ్రద్ధతో చేసినచో, అది ఏ వర్గమునకు చెందును? అది సాత్త్వికము అని శ్రీకృష్ణుడు ఒకే ఒక వాక్యములో సమాధానమును చెప్పవచ్చును. కాని అర్జునునకు శ్రద్ధాస్వరూపము పూర్తిగా తెలియకుండుటచే ఈ ప్రశ్నను వేసినాడు. ఇటువంటి సామాన్యప్రశ్నను విశేషరూపముల లోనికి విభజించకుండగా సమాధానమునీయరాదని శ్రీశంకరులు శ్రీకృష్ణుని సమాధానము యొక్క ఉపక్రమభాష్యములో వివరించిరి. ఏ విషయవస్తువునైననూ తెలుసుకొనుటలో ఇది ప్రముఖమైన విషయము. ఎవ్వరైననూ నాకు నొప్పిగా మున్నదని వైద్యునివద్దకు వెళ్లినచో, ఆ నొప్పి యొక్క స్థానమును స్వరూపమును తెలియుటకై

వైద్యుడు కొన్ని విశేషప్రశ్నలను వేయును. దీనికి ప్రవిభాగమని పేరు. సమస్య యొక్క యథార్థస్వరూపము తెలియనంత వరకు అధ్యారోపము చేసి నిషేధించుచుండవలయును.

శ్రద్ధలో అనేకరకములు గలవు. దానిని సత్త్వరజస్తమోగుణముల నాధారముగా చేసుకొని మౌలికముగా మూడు రకములుగా విభజించవచ్చును. ఈ అధ్యాయమంతయు ఈ మూడు రకముల శ్రద్ధయే విషయవస్తువుగా కలిగియున్నది (శ్రద్ధాత్రయవిభాగయోగః). వ్యక్తియొక్క ఆహారపుటలవాట్లు ఇత్యాదులనేకములు వానికి గల శ్రద్ధయొక్క రకముపై ఆధారపడి యుండును. ఈ తీరున, త్రివిధశ్రద్ధలు అభివ్యక్తమయ్యే రూపములో గల పలుభేదములు కూడ ఈ అధ్యాయములో ప్రదర్శించబడును.

**అధ్యాయము 17, శ్లోకము 2:**

त्रिविधा भवति श्रद्धा देहिनां सा स्वभावजा ।
सात्त्विकी राजसी चैव तामसी चेति तां शृणु ॥ २ ॥

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు (2).

శ్రీభగవాన్ = శ్రీభగవానుడు, ఉవాచ = పలికెను, దేహినామ్ = మానవులయొక్క, సా = ఆ, స్వభావజా = మనస్సు యొక్క ప్రకృతి నుండి పుట్టిన, శ్రద్ధా = శ్రద్ధ, సాత్త్వికీ = సాత్త్వికి, రాజసీ = రాజసి, చ = మరియు, తామసీ = తామసి, ఇతి = అని, ఏవ = నిశ్చయముగా, త్రివిధా = మూడు విధములుగా, భవతి = ఉన్నది, చ = మరియు, తామ్ = దానిని గురించి, శృణు = వినుము.

> శ్రీ భగవానుడు ఇట్లు పలికెను : మానవులలో మనస్సుయొక్క ప్రకృతి నుండి పుట్టిన శ్రద్ధ సాత్త్వికి, రాజసి మరియు తామసి అను మూడు విధములుగానున్నది. దానిని గురించి వినుము (2).

శ్రద్ధ ఒక్కటియే అయినా, దాని స్వభావములో కానవచ్చే కొద్దిపాటి భేదములను బట్టి దానిని మూడు రకములుగా (త్రివిధా) పరిగణించవచ్చును. బియ్యము ఒక్కటియే అయినా, దానియందు దంపుడు బియ్యము, మరబట్టిన బియ్యము ఇత్యాది భేదములు గలవు. కాని, శ్రద్ధ

బియ్యమువంటి బాహ్యవస్తువు కాదు. అది మానవుని మస్తిష్కములో మాత్రమే గలదు. శ్రద్ధయనగా విశ్వాసమని కొందరు భావించెదరు. కాని, శ్రద్ధ విశ్వాసము కంటె అధికమైనది. అది వ్యక్తియొక్క పూర్ణవ్యక్తిత్వమును నిర్దేశించును. కొన్ని విశ్వాసముల సమూహమే శ్రద్ధ అనుకోరాదు. మానవజీవితమును గురించి వ్యక్తికి గల సమగ్రమగు మానసికప్రవృత్తికి శ్రద్ధయని పేరు. దేహము, సంపద, ఇతరజనులు, పూజ, ఆహారము, దానధర్మములు ఇత్యాది విషయములన్నింటిలో వ్యక్తికి గల మానసిక ప్రవృత్తి అతనికి పరమేశ్వరునిపై గల శ్రద్ధను నిర్ధారించును. ఒక వ్యక్తియొక్క వేషమును బట్టి అతని జీవనమూల్యసంరచనను, మరియు అతని మానసికప్రవృత్తులను చాలమటుకు అంచనా వేయవచ్చును. వ్యక్తి యొక్క ఆడంబర వేషము అతనికి గల సంపదను చాటిచెప్పేది కావచ్చును. మరియొకని వేషము చాల అవకతవకగా నుండి అతని మోటుస్వభావమును బైటపెట్టును. మరికొందరు ధరించే శుచియగు వస్త్రములు వారి నాజూకు స్వభావమును ప్రకటించును. ఆలోచనాశీలము, జీవనమూల్యముల అవగాహన కలిగి గంభీరచింతన గలవాడై మరింత జ్ఞానమును సంపాదించాలనే తహతహ గల వ్యక్తి సాత్త్వికుడనబడును. అట్టి వ్యక్తిని మనము అతని వేషమును బట్టి గుర్తు పట్టవచ్చును. వ్యక్తియొక్క వేషభాషలు, ప్రవర్తించే తీరు తెన్నులు, పనిని చేసే విధానము, అతని నివాసము మరియు పరిసరముల శుచిశుభ్రతలు ఇత్యాదులన్నియు అతనికి గల శ్రద్ధయొక్క స్వభావమును సూచించును. ఈ శ్రద్ధ మనిషి యొక్క అంతరంగమునుండి అతడు చేబట్టే కార్యములన్నింటిలోనికి ఉబికి వచ్చుచుండును. శ్రద్ధ బయట ఉండేది గాదు. వ్యక్తి యొక్క ఆలోచనాధోరణి, అవగాహన, జీవనమూల్య సంరచన మరియు అతనికి గల ప్రాథమికతలు అతని శ్రద్ధచే నిర్ణీతములగును. శ్రద్ధలో ఈ సర్వము అంతర్గతమగును. కావున, ఇది సామాన్యమైన పదము కాదు. కావుననే, మనకు దీనిని బోధించుటకై ఒక అధ్యాయము పూర్తిగా కేటాయించబడినది.

ఈ శ్రద్ధ ఎవరికొరకు? మానవదేహము గలవారి కొరకు (దేహినామ్). మానవ దేహములోనున్న జీవునకు ఈ త్రివిధశ్రద్ధ గలదు. వ్యక్తికి గల శ్రద్ధయొక్క స్వరూపమును నిర్ణయించునదేది? అది అంతఃకరణస్వభావమునుండి ఉదయించును (స్వభావజా). మనిషి యొక్క మనస్సునకు గల స్వభావమును బట్టి అతనికి గల శ్రద్ధలోని రకము నిర్ణీత మగును. శ్రద్ధలోని రకమును నిర్ణయించే కొన్ని విశిష్టలక్షణములు మనిషియందు పుట్టుక తోడనే వచ్చును అని చెప్పుటకంటె ఇది మరింత యుక్తియుక్తముగా నున్నది. పుట్టుక సర్వమును నిర్ణయించునన్నచో, రాజసతామసస్వభావము గల వ్యక్తులు తమ ప్రారబ్ధము అంతేనని

సరిపెట్టుకొనవలసి యుండును. కాని అది సరిగాదు. వ్యక్తి సాత్త్వికుడగుట సంభవమే. ఈ ఉపదేశమునకు మనుష్యులను వర్గీకరించుట తాత్పర్యము కాదు. ఇది మనిషిని సాత్త్వికునిగా తీర్చిదిద్దుటకై ఉద్దేశించబడినది. కావున, ఇచట స్వభావశబ్దమునకు అంతఃకరణము యొక్క తీరుతెన్నులు అని మాత్రమే అర్థమును చెప్పవలెను.. అంతఃకరణ స్వభావమును బట్టి మూడురకముల శ్రద్ధలు గలవు. మానవుడు తన శ్రద్ధాస్వరూపములో మార్పులను తెచ్చుకొనుట సంభవమే.

హరిః ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీ గణేశాయ నమః

శ్రద్ధలోని మూడు రకముల గురించి విస్తారమగు వర్ణనను ఆరంభించుటకు ముందుగా శ్రీకృష్ణ భగవానుడు శ్రద్ధను గురించి మరియు శ్రద్ధాళువు అగు వ్యక్తిని గురించి ఒక సర్వజన సాధారణమగు ప్రస్తావనను మనముందు ఉంచుచున్నాడు :

**అధ్యాయము 17, శ్లోకము 3:**

सत्वानुरूपा सर्वस्य श्रद्धा भवति भारत ।
श्रद्धामयोयं पुरुषो यो यच्छ्रद्धस्स एव सः ॥ ३॥

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత
శ్రద్ధామయోయం పురుషో యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః (3).

భారత = భరతవంశములో జన్మించిన ఓ అర్జునా!, సర్వస్య = ప్రతివానికి, సత్త్వానురూపా = మనస్సునకు తగిన, శ్రద్ధా = శ్రద్ధ, భవతి = ఉండును, అయమ్ = ఈ, పురుషః = మానవుడు, శ్రద్ధామయః = శ్రద్ధచే నిండియుండును, యః = ఎవడు, యత్-శ్రద్ధః = ఏ శ్రద్ధ గలవాడో, సః = అతడు, ఏవ = ఆ శ్రద్ధకు అనురూపముగా మాత్రమే ఉండును.

> భరతవంశములో జన్మించిన ఓ అర్జునా! ప్రతివ్యక్తి యందు వాని మనస్సునకు తగిన శ్రద్ధ ఉండును. ఈ మానవుడు శ్రద్ధచే నిండియున్నాడు. ఎవడు ఏ శ్రద్ధ గలవాడో, వాడు దానికి అనురూపముగా మాత్రమే ఉండును (3).

శ్రద్ధ అను పదమును సాధారణముగా 'నమ్మకము' అని అనువదించెదరు. కాని శ్రద్ధ నమ్మకము కంటె చాల అధికమైనదని మనము చూచియున్నాము. కావున, మనము దానిని అనువదించకుండగా అటులనే ఉంచెదము. ఇచట సత్త్వమనగా గుణము గాక, అంతః కరణము అని యర్థము. ప్రతి వ్యక్తి యందు గల శ్రద్ధ వాని మనస్సునందు గల స్వభావమునకు, ప్రవణతలకు (tendencies), జీవనమూల్యసంరచనకు అనురూపముగా నుండును. శ్రద్ధ వ్యక్తి యొక్క మనస్సునకు అనుగుణమైన రూపమును దాల్చును. మనస్సు అనగా ఆలోచించే విధానము

మాత్రమే కదా! కావున, ఆలోచించే విధానమును మార్చుకున్నచో, సర్వమును మార్చుకున్నట్లే యగును. కావున, వ్యక్తికి గల శ్రద్ధను మార్చుకొనుటకు అవకాశము గలదు. మనిషి యొక్క అవగాహనలో మార్పు వచ్చినచో, దాని వలన మానసికప్రవృత్తిలో మార్పు వచ్చి, దాని ప్రభావము శ్రద్ధపై పడును. కావున, వ్యక్తికి గల ప్రవణతలు, మరియు అవగాహన ఆతని యందు గల శ్రద్ధ యొక్క స్వరూపమును నిర్ధారించును.

మానవుని వ్యక్తిత్వము వానికి గల శ్రద్ధచే వ్యాప్తమై యుండును (శ్రద్ధామయోఽయం పురుషః). ఒక వ్యక్తికి ఎటువంటి శ్రద్ధ ఉండునో, వాని వ్యక్తిత్వము సరిగా అటులనే యుండును. ఇచట శ్రద్ధామయః అను పదములోని మయట్ ప్రత్యయమునకు నిండి యుండుట (ప్రాచుర్యము) అని యర్థము. మానవుని వ్యక్తిత్వము వాని శ్రద్ధయొక్క అభివ్యక్తి తక్క మరియొకటి కాదు. ఇచట పురుషశబ్దమునకు సంసారియగు జీవుడు అనియే అర్థము; ఆత్మ అని కాదు. మానవునకు ఎట్టి శ్రద్ధ ఉండునో, ఆతడు అట్టివాడు అగును. ఆతని శ్రద్ధ సాత్త్వికమైనచో, ఆతడు సాత్త్వికుడగును. రాజసమైనచో రాజసుడు, తామసమైనచో తామసుడు అగును. మానవుని జీవితములోని సకలకార్యకలాపములు ఆతనికి గల శ్రద్ధయొక్క అభివ్యక్తి మాత్రమే అగుచుండును. మానవజీవితము శ్రద్ధామయము.

ప్రస్తుతానికి శ్రద్ధను ప్రక్కనబెట్టి మనము మానవజీవితము యొక్క స్వరూపమును నిర్ధారించే అంశములను పరిశీలించెదము. జీవనమూల్యసంరచన మరియు ప్రాథమికతలు (అనగా ఏది ముందు? ఏది వెనుక? అను నిర్ణయము) అను అంశములు జీవిత స్వభావమును నిర్ధారించును. ఉదాహరణకు నీవు నీ మిత్రుని సినిమాకు రమ్మని ఆహ్వానించితివనుకొనుము. పేకాటకు వెళ్ళుచున్నాను గాన ఇపుడు సమయము లేదని ఆతడు చెప్పినాడు. అనగా ఆతని ప్రాథమికతలు స్పష్టమైనవి గదా! ఆతనికి సినిమాకంటె పేకాట ఎక్కువ విలువైనది. మరో మిత్రుడు నీతోబాటు వచ్చుటకు సంసిద్ధుడగును. కాని ఇంకో మిత్రుడు ఆశ్రమమునకు వెళ్ళే పని ఉండుటచే నీతో రాడు. నేను బహిరంగసభలలో ప్రసంగించే సందర్భములలో నాకు ఇదంతా కంట బడుచుండును. మూడు రోజులు వరుసగా ప్రసంగములు ఉన్నవనుకొనుడు. మొదటి రోజున నేను బుద్ధిపూర్వకముగా విషయమును శిఖరాగ్రముపైకి తీసుకువచ్చి వదిలినను, ఆ నాటి శ్రోతలలో చాలమంది మరునాడు కానరారు. నేను మొదలు పెట్టి మధ్యలో ఆపిన విషయవస్తువును వారు తమంత తాముగా ఆలోచించి తెలుసుకొనే అవకాశము లేనే లేదు. అయిననూ, వారు మరునాటి ప్రసంగములో ఉండరు. ఎందువలన? ప్రాథమికతలు. విందు, సంగీత విభావరి

మొదలగు మరియొక కార్యక్రమము వారి దృష్టిలో దీనికంటె ప్రముఖమైనది. ఆ రోజున భగవానుడే వచ్చిననూ, ఆయన మరియొక రోజు వేచియుండక తప్పదు. మానవుని వ్యక్తిత్వము అతనికి గల ప్రాథమికతలకంటె వేరుగా లేదు. కావున, దేని ప్రాముఖ్యము ఎంత? అనే స్పష్టమైన కల్పన మనకు ఉండవలెను. ప్రాథమికతలలో మార్పు వచ్చినప్పుడు మాత్రమే వ్యక్తియొక్క పూర్ణవ్యక్తిత్వములో మార్పు సంభవమగును. దేని ప్రాముఖ్యము ఎక్కువ? ఏది తక్కువ ప్రముఖమైనది? అను విషయమును స్పష్టముగా తెలుసుకొని ప్రాథమికతలలో యథోచితమగు మార్పును చేసుకోగల్గినచో అట్టి వ్యక్తి యొక్క జీవనము నూతనదిశలో ముందుకు సాగును. ఈ విధముగా ప్రాథమికతలను, జీవితలక్ష్యములను సరియగు క్రమములో పాటించే వ్యక్తియందు ఏ రకమగు శ్రద్ధ గలదు? అను విషయము స్పష్టముగా సూచితమగు చుండును. కావున, సర్వ దేశములలోని సర్వజనులకు అన్వయించే తిరుగులేని వచనమును భగవానుడు ఇచట చెప్పుచున్నాడు : ఎవనికి ఎట్టి శ్రద్ధ గలదో, వాడు దానికి తగ్గట్లు జీవించును (యో యత్-శ్రద్ధః స ఏవ సః).

**అధ్యాయము 17, శ్లోకము 4 :**

यजन्ते सात्त्विका देवान् यक्षरक्षांसि राजसाः ।
प्रेतान् भूतगणांश्चान्ये यजन्ते तामसा जनाः ॥ ४ ॥

యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామసా జనాః (4)

**సాత్త్వికాః** = సత్త్వగుణ ప్రధానులగు జనులు, **దేవాన్** = దేవతలను, **రాజసాః** = రజోగుణ ప్రధానులగు జనులు, **యక్షరక్షాంసి** = యక్షులను, రాక్షసులను; **చ** = మరియు, **అన్యే** = ఇతరులగు, **తామసాః** = తమోగుణప్రధానులగు, **జనాః** = జనులు, **ప్రేతాన్** = దెయ్యములను, **భూతగణాన్** = పిశాచాదులను, **యజంతే** = ఆరాధించెదరు.

> సాత్త్వికులగు జనులు దేవతలను, రాజసులు యక్షరాక్షసులను, ఇతర తామసజనులు దెయ్యములను మరియు పిశాచాదులను ఆరాధించెదరు (4).

ఒక వ్యక్తికి గల శ్రద్ధ సాత్త్వికమా? రాజసమా? లేక తామసమా? అను విషయమును మనము వివిధదృష్టికోణములనుండి పరిశీలించవచ్చును. మానవుడు ఆరాధించే దేవతను బట్టి అతని

శ్రద్ధను నిర్ణయించ వచ్చును. ఇది ఒక పద్ధతి. అతడు వేదోక్తములగు అగ్ని-ఇంద్ర-వరుణాది దేవతలను గాని, లేదా బ్రహ్మవిష్ణుమహేశ్వరులను గాని ఆరాధించువాడైనచో, అతని శ్రద్ధ సాత్త్వికీ శ్రద్ధ యగును. కొందరు యక్షరాక్షసులను, భైరవ భేతాళులను ఆరాధించెదరు. వారి ఆరాధన రాజసి యనబడును. ఇతరులకు హానిని కలిగించే భూత ప్రేతపిశాచాదులను ఆరాధించు వారి శ్రద్ధ తామసికము. జీవించియుండగా ధర్మమును పాటించని వ్యక్తి మరణించిన తరువాత ఇతరలోకములకు వెళ్ళుటకు ముందు కొంతకాలము ఇచటనే సూక్ష్మశరీరధారియై ఉండును. అట్టి జీవునకు ప్రేతమని పేరు. మాయమంత్రములతో జనులను వంచించు దుష్టులు ఇట్టి ప్రేతములను పూజించెదరు. వారికి గల శ్రద్ధ తామసి యనబడును.

వేదము విధినిషేధములను ప్రవచించునపుడు ఒక ప్రక్రియను అవలంబించును. ముందుగా ఒక సామాన్యనియమము (ఉత్సర్గము)ను చెప్పి, తరువాత దానికి గల విశేషణములను మరియు మినహాయింపుల (అపవాదము)ను నిర్దేశించును. ఉదాహరణకు, ఇతరప్రాణులను ఎవ్వరైననూ హింసించరాదు (హింసాం న కుర్యాత్) అనునది సామాన్య నియమము. కాని న్యాయస్థానము విధించే శిక్ష ఇత్యాదులలో హింస అధర్మము కాదు. హంతకుడు ఉరితీయబడును. భగవానుని అధ్యాదేశములతో సహా, అపవాదములు లేని నియమములు లేవు. బ్రహ్మవిష్ణుమహేశ్వరులను, అగ్ని-ఇంద్ర-వరుణాది దేవతలను ఆరాధించే విధానమును నిర్దేశించే సామాన్య నియమములను శాస్త్రము నిర్దేశించు చున్నది. ఈ దృష్టి కోణములోనైననూ, ఒక వ్యక్తి యొక్క ఆరాధన సాత్త్వికము కావచ్చును; కాకపోవచ్చును. ఈ దేవతల ఆరాధనకు కట్టుబడినవారిలోనైననూ కొద్దిమంది మాత్రమే సత్త్వగుణప్రధానులై యున్నారు. వీరిలో కొందరు ఈ దేవతలనారాధించుటవలన లభించే ఫలములను అపేక్షించి కేవలము వాటికొరకు మాత్రమే ఆరాధించెదరు. మరికొందరు అంతఃకరణశుద్ధి కొరకై దేవతల నారాధించెదరు. శుద్ధమగు అంతఃకరణములో జీవబ్రహ్మైక్యజ్ఞానము ఉదయించును. కాని అత్యధికశాతము జనులు రాజస-తామస-ఆరాధనలయందు అభిరుచిని కలిగి యుందురు. దీనికి కారణమేమి? వారు సంసారాంతర్గతముగా నుండే అధికారము ఇత్యాది అల్పఫలములను కాంక్షించుటయే దీనికి కారణము.

ఇది ఎట్లు సంభవమగుచున్నది?

**అధ్యాయము 17, శ్లోకము 5 :**

अशास्त्रविहितं घोरं तप्यन्ते ये तपो जनाः ।
दंभाहंकारसंयुक्ताः कामरागबलान्विताः ॥ ५ ॥

అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపో జనాః
దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః (5).

**దంభాహంకారసంయుక్తాః** = దంభము మరియు గర్వముతో కూడియున్నవారు, **కామరాగ బలాన్వితాః** = తీవ్రమగు తృష్ణ మరియు ఆసక్తితో కూడినవారు అగు, **యే** = ఏ, **జనాః** = జనులు, **అశాస్త్రవిహితమ్** = శాస్త్రముచే విధింపబడని, **ఘోరమ్** = దుఃఖముతో నిండియున్న, **తపః** = తపస్సును, **తప్యంతే** = చేయుచున్నారో.

దంభము, గర్వము, తీవ్రమగు తృష్ణ మరియు ఆసక్తితో నిండిన అంతః కరణము గల ఏ జనులు శాస్త్రముచే విధింపబడని దుఃఖరూపమగు తపస్సును చేయుచున్నారో ...... (5).

**అధ్యాయము 17, శ్లోకము 6 :**

कर्शयंतश्शरीरस्थं भूतग्राममचेतसः ।
मां चैवांतश्शरीरस्थं तान् विद्ध्यासुरनिश्चयान् ॥ ६ ॥

కర్శయంతశ్శరీరస్థం భూతగ్రామమచేతసః
మాం చైవాంతశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్ (6).

**అచేతసః** = వివేకము లేనివారై, **శరీరస్థమ్** = శరీరమునందున్న, **భూతగ్రామమ్** = ఇంద్రియ సముదాయమును, **చ** = మరియు, **అంతశ్శరీరస్థమ్** = శరీరములోపల ఉపలభ్యమయ్యే, **మామ్** = నన్ను, **కర్శయంతః** = కృశింపజేయుదురో, **తాన్** = వారిని, **అసుర నిశ్చయాన్** = అసురులకు సంబంధించిన నిశ్చయము గలవారినిగా, **విద్ధి** = తెలుసుకొనుము.

వివేకము లేని ఏ జనులు శరీరములో భాగమైయున్న ఇంద్రియ సముదాయమును మరియు శరీరములోపల ఉపలభ్యమయ్యే నన్ను కృశింపజేయుదురో, వారు అసురులకు సంబంధించిన నిశ్చయము గలవారని తెలుసుకొనుము (6).

ఈ రెండు శ్లోకములను కలిపి అన్వయించినచో వాక్యము పూర్తి యగును. ప్రార్థనలు, క్రతువులు ఇత్యాది ఆధ్యాత్మికమగు ఆరాధనకు ఇచట తపస్సు అని పేరు. వీరు చేసే తపస్సు శాస్త్రవిహితమైనది కాదు (అశాస్త్రవిహితమ్). వీరు దేహేంద్రియ మనస్సంఘాతమునకు పీడను కలిగించే ఘోరమగు తపస్సును చేసెదరు. ఇంతే గాక, వీరు ఆరాధించే సమయములో ఇతరులు కూడ దుఃఖమునకు గురియగుదురు. అమ్మవారి జాతరలో అనేక జంతువులు ప్రాణములను కోల్పోవును. మానవుడు దేవతను ఆరాధించ వలెనని నిశ్చయించిన కారణముగా ఎన్నో మేకలు బలియగును. అవి నోరు లేని జంతువులని ప్రసంగములను జేయు మానవుడు వాటిని భక్షించేనేల? వాటిని భక్షించు మానవుడు బుద్ధిమంతుడు ఎట్లు అయినాడు? జీవించే హక్కు మానవునితో సమముగా వాటికి కూడ గలదు. తప్పుడు ఆలోచనలు గల కొందరు మానవులు హఠాత్తుగా భగవానుని ఆరాధించవలెనని తలచిన కారణముగా, ఎన్నో ఇతరప్రాణులు దుఃఖమునకు గురియగును. ఇట్టి వారు తమను తాము కష్టముల పాలు చేసుకొనుటయే గాక, ఇతరులను కూడ కష్టములకు గురి చేయుదురు.

శాస్త్రవిహితముకాని తపస్సును చేయు ఈ జనులు మిథ్యాభిమానము, ఆడంబరము మరియు అహంకారము అనువాటికి లోబడి యుందురు (దంభ-అహంకార-సంయుక్తాః). మేము ధార్మికులము అని ప్రపంచమునకు చాటి చెప్పుటకై వారు ధార్మికకార్యములను చేపట్టుచుందురు. దంభమనగా నిదియే. ఇంతేగాక, వారు అహంకారమును నిలబెట్టుకొనుటకు కూడ ధర్మమును చేయుదురు. వారిలో కామనలు తీవ్రస్థాయిలో నుండును (కామ రాగబలాన్వితాః). మనకు సామాన్యంగా ఉండే కోరికలకు కామనలు అని పేరు. దానికి రాగము తోడైనచో, అది లాలసత అగును. లేదా, కామమనగా భావావేగమనియు, రాగమనగా లాలసత అనియు చెప్పవచ్చును. కేవలము ఈ కామరాగములచే మాత్రమే ప్రేరితులై, వారు ఈ వివిధధార్మిక కార్యములను చేయుచుందురు. తపస్సు యొక్క స్వభావము దాని వెనుకనున్న ప్రేరణపై ఆధారపడియుండును. రావణుడు కూడ నిశ్చితముగా ఎంతో కష్టమునకు ఓర్చి కఠినమగు తపస్సును చేసెను. కాని అతడు తపస్సును అంతఃకరణశుద్ధికొరకు గాని, అంతఃకరణనైర్మల్యము కొరకు గాని, తద్వారా

మోక్షము కొరకు గాని చేయలేదు. అతడు వినాశకరమగు శక్తిని కోరి తపస్సును చేసెను. అదే విధముగా, హిరణ్యకశివుడు ఘోరమగు తపస్సును చేసి, తనను ఎవ్వరైననూ పగలు గాని, రాత్రి గాని, ఇంటి లోపల గాని, బయట గాని, భూమిపై గాని, ఆకాశములో గాని చంపుటకు శక్యము కారాదని వరమును కోరెను. తనను జంతువులు గాని, మానవులు గాని, సర్వవిధముల ఆయుధములు గాని చంపజాలక పోవుట కూడ అతని వరములో భాగమే. ఇతరులు తనను సంహరించుటకు గల వికల్పములనన్నిటినీ తాను మూసివేసినానని అతడు ఆశపడెను. కాని మృత్యువును తప్పించుకొన గల వారు లేరు. కావుననే, భగవానుడు సింహపు తలను మరియు మానవదేహమును దాల్చి (జంతువు కాదు, మానవుడు కాదు) వచ్చి సంధ్యాసమయములో (పగలు కాదు, రాత్రి కాదు) తన ఒడిలో పెట్టు కొని (భూమి కాదు, ఆకాశము కాదు) సంహరించెను. అన్ని నియమములలో ఏదో ఒక లొసుగు ఉండితీరును. రావణుడు, హిరణ్యకశివుడు మొదలగు రాక్షసులు కామరాగములచే ప్రేరితులై (కామరాగబలాన్వితాః) కఠోరమగు తపస్సును చేసిరి. అంతటి కఠోరమగు తపస్సును అంతటి వినాశకరప్రయోజనమునపేక్షించి వారు చేయుటకు కారణమేమి? వారిలో వివేచనాశక్తి కొరవడినది (అచేతసః). వారు వివేకహీనులై మొండి పట్టుదలతో ఇంద్రియములకు భోగవస్తువులను దూరముగా నుంచి తమను తాము కృశింప జేసుకొనెదరు. వారికి ఈ సంకల్పబలము ఎక్కడ నుండి వచ్చినది? వారికి కావలసిన ప్రేరణను కామము మరియు రాగము ఇచ్చును. ఒకడు తన సంకల్పబలముచే అమెరికా అధ్యక్షపదవికి పేరును నమోదు చేయుట మాత్రమే గాక ఉత్సాహముతో ఎన్నికలలో పాల్గొనినాడు. వాని ఇచ్ఛాశక్తి కొనియాడదగినది అని నా అభిప్రాయము. అది సరళమైన విషయము కాదు. ఆ ఎన్నికలో పేరు నమోదు అగుటకు అవశ్యకమగు కృషిని చేయుటకై ఆ వ్యక్తిలో అతిశయించిన మహత్త్వాకాంక్ష ఉండి తీరవలెను. లేనిచో, అది సంభవము కాదు.

వారు ఇంద్రియభోగములనన్నిటినీ త్రోసిపుచ్చి గొప్ప తపస్సును చేసెదరు. సాత్త్వికపురుషుడు కూడ ఇంద్రియభోగములకు దూరముగా నుండి అనుశాసనబద్ధమగు జీవితమును గడుపుతూ నిత్యకర్మలను మరియు ఉపాసనను చేయుచుండును. కాని అతని తపస్సులో ఒక తేడా గలదు. అతనికి మోక్షము తక్క మరియొక కోరిక లేదు. కాని తామసునకు ప్రేరణనిచ్చేది తృష్ణ. సాత్త్వికునిలో గల వివేకము వానిలో లేదు. మోక్షకాములు కాని సంసారులలోనైననూ రెండు రకముల వ్యక్తులు గలరు. కొందరిలో సరళమైన ఆకాంక్షలు ఉండును. మరి కొందరు కామరాగములచే మరియు అహంకారముచే ప్రేరితులై తీవ్రమగు

మహత్త్వాకాంక్షను మరియు ధన-అధికార-దాహమును కలిగియుందురు. వారు సామాన్యమగు సంసారులు కారు. వారు భూతావేశమును పొందినవారితో సమానము. వారిలో కూడ అల్పభేదములు గలవు. కొందరు ధర్మమార్గములో యత్నశీలురై యుండగా, మరికొందరికి ధర్మాధర్మములతో పని లేదు. వారే అసురులు. వారికి వివేకము లేదు గనుక, ఏది అనుకూలమో, దానిని వారు ఆచరించెదరు. వారు అందరు తమ లక్ష్యములను సిద్ధింపజేసుకొనుటకై వివిధకష్టములను పడుదురు.

వారు దేహమును, ఇంద్రియములను మాత్రమే గాక, దేహములో ఉపలభ్యుడనై ఉన్న నన్ను కూడ కష్టముల పాలు చేయుదురని (మాం చ అంతశ్శరీరస్థం కర్శయంతి) శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు. నారాయణుడు ఆత్మరూపుడై దేహములో నుండి సకలవ్యవహారములను సాక్షిరూపుడై పరికించుచునే యున్నాడు. ఆత్మ ఇతరముచే చేయబడే క్రియలో కర్మ కాజాలదు గదా! అట్టి స్థితిలో వారు ఆత్మను క్లేశమునకు గురి చేయుట ఎట్లు పొసగును? దేహము నశించిననూ ఆత్మ నశించదని (న హన్యతే హన్యమానే శరీరే) మనము చూచియున్నాము. ఎవరైననూ ఆత్మను ఏమి చేయగల్గుదురు? ఇది కేవలము ఒక అర్థాలంకారము మాత్రమే. వారు భగవానునకు ఏ విధముగా పీడను కలిగించెదరు? భగవానుని అనుశాసనమునకు విరుద్ధముగా జీవించినచో, అది భగవానుని పీడించినట్లే యగును. వారు నన్ను పీడించుచున్నారు (మాం కర్శయంతః) అని భగవానుడు ఈ అర్థములో చెప్పినాడు. వీరి నిశ్చయములు అన్నియు అసురస్వభావము కలవి (అసురనిశ్చయాన్) యని మనము తెలియవలెను. అసురుల గురించి మనకు కొన్ని ధారణలు గలవు. ఇచట అసురుని వర్ణనతో అవి ఖచ్చితముగా సరిపోవు. అసురులు అనగా చెడ్డవారు అని చెప్పుట నాకు అభీష్టము కాదు. ఏలయన, చెడ్డది అనేది ఏదీ లేదు. అసురుడు అనగా తప్పు ఆలోచనాధోరణి కలవాడు. అనగా సరియగు పద్ధతిలో ఆలోచించుట చేతకాని వాడు. ఆలోచించుట చేతకాని వారు ఎందరో గలరు. వారివలన ఎవ్వరికీ హాని లేదు. కాని అసురునకు తప్పుడు ఆలోచనలు ఉండుటయే గాక, అతనికి వాటి విషయములో ఆవేశము కూడ గలదు. దీనిని తెలుసుకొనుము (విద్ధి) అని భగవానుడు ఇచట చెప్పుటకు కారణమేమి? మనము దీనిని తెలియవలసిన కారణమేమి? మనలో అటువంటి ధోరణి మరియు ప్రవర్తన లేశమైననూ ఉన్నచో, దానిని వెంటనే మనము త్రోసివుచ్చవలెను. కావున తెలియుట ముఖ్యమని శ్రీశంకరులు వివరించిరి. ఆ ఉద్దేశ్యముతో మాత్రమే అసురనిశ్చయమును గురించి తెలుసుకొనుమని ఇచట చెప్పబడినది.

శ్రద్ధ యొక్క అభివ్యక్తి మాత్రమే గాక, మనము ఇష్టపడే భోజనము, చేసే విహితకర్మలు, ఆధ్యాత్మిక అనుశాసనములు మరియు దానము కూడ సాత్త్వికా, రాజసిక, తామసిక భేదముచే త్రివిధముగా నున్నవి. వీటిలో ఆఖరి రెండింటినీ దూరముగా పెట్టి సాత్త్వికగుణమును పెంపొందించుకొనవలెను. ఆ ఉద్దేశ్యముతో ఈ వర్ణన చేయబడినది. వీటిలో కొన్నింటిని ఆచరణలో పెట్టవచ్చును. మరి కొన్నింటిని గురించి అవగాహన చేసుకొని వాటి స్థాయికి తగ్గట్లుగా జీవితమును తీర్చిదిద్దుకొనవలెను.

ఆహారము సత్త్వ, రజస్, తమస్ అను భేదముచే మూడు విధములుగా నున్నది. మన స్వభావములో సత్త్వరజస్తమోగుణములలో ఏది ప్రముఖముగా నున్నది అను అంశము మనకు గల ఆహారపు అభిరుచులను నిర్ణయించును. కొందరికి చేపల కూర ప్రియమైనది. మరి కొందరు దాని దరిదాపులకు వెళ్లరు. మనకు వివిధరకముల భక్ష్యములపై అభిరుచి ఉండును. కాని మనమిచట తినదగిన ఆహారమును మూడు రకములుగా విభజించుట లేదు. వీటిలో రెండింటిని మనము పరిహరించవలెను. మనము తినే ఆహారము ప్రధానముగా సాత్త్వికమైనచో, మన ఆలోచనాసరళి సరిగానుండునని ఆశించవచ్చును. కాని ఆహారమునకు మనిషి యొక్క స్వభావమునకు మధ్య పూర్ణమగు పరస్పరసంబద్ధత గలదని అనుకోరాదు. సాత్త్వికాహారమును తిను వ్యక్తి పరమక్రూరుడై ఉండవచ్చును. వైష్ణవబ్రాహ్మణుల కుటుంబములో జన్మించి ఖచ్చితమైన శాకాహారియగు గాడ్సే గాంధీజీని కాల్చి చంపెను గదా! శాకాహారి యొక్క మనోభావములు సక్రమముగా నుండుననుకొనుట అవివేకము. కాని, మనము తినే ఆహారము మన బుద్ధిని నిశ్చితముగా ప్రభావితము చేయును. వీటి మధ్య తిరుగు లేని సంబంధము లేదనియు, ఆపేక్షిక సంబంధము మాత్రమే గలదనియు తెలియవలెను. లేనిచో, కొందరు తినే భోజనమును బట్టి వారిని అపరాధులని తీర్మానించే అవకాశము గలదు. అది ప్రమాణవిరుద్ధము. మాంసాహారులే అయినా అంతర్ముఖులైన వ్యక్తులను నేను ఎరుగుదును. కాని, సాధారణముగా జీవించాలనే కోరిక గలిగి మననుండి దూరముగా పారిపోవుటకు వీలుగా పాదములను కలిగియున్న ప్రాణులను భుజించుచున్నచో, వ్యక్తిలో ఒక రకమైన హృదయకాఠిన్యము ఉండును. వంగ చెట్టుకు కాళ్ళు చేతులు వచ్చిననాడు, పుచ్చకాయకు పాదములు వచ్చిననాడు మనము వాటిని తినవలెనా, లేక మేకను తినవలెనా అని నిశితముగా ఆలోచించ వలసియుండును. అంతఃకరణశుద్ధిని కోరే దృఢనిష్ఠ గల సాధకుడు తినే ఆహారముతో సహా తాను ఆచరించే పనులన్నిటియందు సంవేదనశీలము కలవాడై ఉండవలెను. కావుననే, ఇచట ఈ విషయము ప్రస్తావించబడినది. అదే విధముగా, విహితకర్మానుష్ఠానము, అధ్యాత్మిక-అనుశాసనములు మరియు దానము కూడ సాత్త్వికా, రాజసిక,

తామసిక భేదమును కలిగియున్నవి. మనము సత్త్వమును చేబట్టి మిగిలిన రెండింటిని పరిహరించవలెను. కావుననే గీతలో ఈ విషయము విపులముగా చర్చించబడినది.

**అధ్యాయము 17, శ్లోకము 7 :**

आहारस्त्वपि सर्वस्य त्रिविधो भवति प्रियः ।
यज्ञस्तपस्तथा दानं तेषां भेदमिमं शृणु ॥ ७ ॥

ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః
యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేదమిమం శృణు (7).

సర్వస్య = అందరికి, ప్రియః = ప్రియమైన, ఆహారః అపి = ఆహారము కూడ, త్రివిధః = మూడు రకములుగా, భవతి = ఉన్నది, యజ్ఞః = యజ్ఞము, తపః = తపస్సు, తథా = మరియు, దానమ్ = దానము, తేషామ్ = వాటియొక్క, ఇమమ్ = ఈ, భేదమ్ = భేదమును, శృణు = వినుము.

మానవులందరు ఇష్టపడే ఆహారము కూడ మూడు రకములుగా నున్నది. అదే విధముగా యజ్ఞము, తపస్సు మరియు దానము కూడ మూడు రకములుగా నున్నవి. వాటిలోని ఈ భేదములను వినుము (7).

ఇంతకు ముందు చెప్పిన విషయవస్తువు శ్రద్ధ. దాని కంటె ఇది భిన్నమైన ప్రకరణమని 'తు' అనే అవ్యయము సూచించును. శ్రద్ధవలెనే త్రివిధభేదము గలవి మరికొన్ని గలవు. వాటిలో కొన్ని ఇచట ప్రస్తావించబడినవి. ఆహారము అనగా స్వీకరించబడేది (ఆహ్రియతే ఇతి ఆహారః) అని అర్థము. విషయవస్తువులు అన్నియు ఇంద్రియములచే గ్రహించబడు చున్నవి గనుక, ఆహారశబ్దము వాటిని అన్నింటిని నిర్దేశించును. కాని ఇచట ఆహారమనగా మనము తినే మరియు త్రాగే పదార్థములు. అందరు తినే ఆహారము మూడు విధములుగా నున్నది (సర్వస్య ఆహారః త్రివిధః). ఏ విధముగా? పౌష్టికవిలువను బట్టి ఈ భేదము వచ్చినదా? మాంసకృత్తులు, పిండిపదార్థము, క్రొవ్వు పదార్థము అను మూడు రకముల ఆహారమును అందరు వ్యక్తులు ఒక విశిష్టపరిమాణములో భుజించవలెనా? లేక, మనము కొంత సాత్త్వికాహారమును, కొద్దిగా రాజసాహారమును, మరికొంత తామసాహారమును తినవలెనా? ఇచటి త్రివిధ భేదము ఈ అర్థములలో కాదు. గుణమును బట్టి మరియు జనుల అభిరుచి (ప్రియః) ని బట్టి ఈ విభాగము చేయబడుచున్నది.

వీటిలో గల ఈ భేదమును గురించి వినుము (తేషాం భేదమిమం శృణు).

**అధ్యాయము 17, శ్లోకము 8:**

अयुस्सत्त्वबलारोग्यसुख प्रीतिविवर्धनाः ।
रस्यास्स्निग्धाः स्थिरा हृद्या आहारास्सात्त्विक प्रियाः ॥ ८ ॥

ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః
రస్యాస్స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్విక ప్రియాః (8).

ఆయుస్సత్త్వబలారోగ్య సుఖప్రీతివివర్ధనాః = ఆయుర్దాయమును మనోనిర్మలతను బలమును ఆరోగ్యమును రుచిలోని సుఖమును మరియు రసానుభూతిని పెంపొందించే, రస్యాః = రసయుక్తమైన, స్నిగ్ధాః = నూనె గల, స్థిరాః = పుష్టికరమైన, హృద్యాః = ఉల్లాసకరమైన, ఆహారాః = ఆహారములు, సాత్త్వికప్రియాః = సాత్త్వికులగు వ్యక్తులకు అభీష్టమైనవి.

ఆయుర్దాయమును మనోనిర్మలతను బలమును ఆరోగ్యమును రుచిలోని సుఖమును మరియు రసానుభూతిని పెంపొందించే, రసయుక్తమైన, నూనె గల, పుష్టికరమైన, ఉల్లాసకరమైన ఆహారములు సాత్త్వికులగు వ్యక్తులకు అభీష్టములైనవి (8).

మానవుడు జీవించే కాలమునకు ఆయుః అని పేరు. సత్త్వమనగా మనోవికాసము. కాఫీని గాని, చక్కెరను గాని అధికముగా సేవించినచో, చిత్త-ఏకాగ్రతకు భంగము కలుగును. కావున ఆహారమునకు మనస్సుపై ప్రభావము గలదని స్పష్టమగు చున్నది. మనము దేనిని తిన్నా, అది చిత్త-ఏకాగ్రతకు, ప్రసన్నతకు మరియు ఆలోచనాసామర్థ్యమునకు సహకరించేది అయి ఉండాలి. ఇచట అదియే సాత్త్వికాహారమని వర్ణించబడినది. ఆహారము మనకు బలమును కూడ ఇచ్చును. కేవలము ఆరోగ్యమును మాత్రమే ఇచ్చుటకు ఉద్దేశించబడిన భక్ష్యములు కొన్ని గలవు. ఇంతేగాక, భక్ష్యము రుచిగా నుండవలెను. అది ఉల్లాసదాయకముగా నుండవలెను (సుఖ). ఇంతేగాక, అది చూచుటకు ఇంపుగానుండవలెను (ప్రీతి). కొన్ని రకముల ఆహారములు ఆరోగ్యదృష్ట్యా మంచివే అయినా, వాటిని చూడగానే ఆకలి నశించును. సత్త్వగుణప్రధానులగు వ్యక్తులు ఈ గుణములనన్నిటినీ పెంపొందించే ఆహారమును ఇష్టపడుదురు. ఈ ఆహారవిభాగము ఇంకనూ కొనసాగుచున్నది. కొన్ని ఆహారములు రసప్రధానముగా నుండును (రస్య). మరికొన్ని నూనె

గుణమును కలిగియుండును (స్నిగ్ధ). కొన్ని రకముల ఆహారములు శరీరములో స్థిరముగా నుండి ఎముకల నిర్మాణము మొదలగు ప్రయోజనములను సిద్ధింపజేయుటచే వాటికి స్థిరాహారము అని పేరు. ఈ వివిధరకముల ఆహారపదార్థములు మనస్సునకు ఆహ్లాదకరముగా నుండవలెను (హృద్యాః). ఆహారమును చూచుటకు ఇంపుగా ఉండు విధముగా ముందు పెట్టవలెను. ఇది చాల ముఖ్యము. పదార్థమును చూడగానే మనస్సునకు ఆనందము కలుగవలయును. ఇట్టి పదార్థములను సాత్త్వికులు ఇష్టపడెదరు (సాత్త్విక ప్రియాః).

రాజసాహారము ఎట్లు ఉండును?

**అధ్యాయము 17, శ్లోకము 9:**

कट्वम्ललवणात्युष्णतीक्ष्णरूक्षविदाहिनः ।
आहारा राजसस्येष्टा दुःखशोकामयप्रदाः ॥ ९ ॥

కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః (9).

**కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్ష విదాహినః** = అతిశయించిన చేదు–పులుపు–ఉప్పు–వేడి–వగరు కలిగి కషాయములో కడుపులో మంటను కలిగించు, **ఆహారాః** = ఆహారములు, **రాజసస్య** = రాజసికునకు, **ఇష్టాః** = అభీష్టమైనవి, **దుఃఖశోకామయప్రదాః** = శారీరకపీడను శోకమును మరియు రోగమును కలిగించును.

> అతిశయించిన చేదు–పులుపు–ఉప్పు–వేడి–వగరు కలిగి కషాయలక్షణములతో కడుపులో మంటను కలిగించు ఆహారములను రాజసికులు ఇష్టపడెదరు. ఇవి శారీరక పీడను శోకమును మరియు రోగమును కలిగించును (9).

కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః అను సమాసపదములో అతిశయార్థమును నిర్దేశించే అతి అను అవ్యయమును సమాసాంతర్గతపదములన్నింటికీ అన్వయించవలెనని శ్రీ శంకరులు చెప్పిరి. ఇది ఆవశ్యకము. ఏలయన, ఈ రుచులన్నియు మనకు అవసరమైనవియే. వీటిని ఆయుర్వేదము కూడ ఓషధులలో నిర్దేశించుచున్నది. ఇచటి తాత్పర్యమేమనగా వాటిని

మోతాదు మించి వాడరాదు. అతికటు అనగా అతిశయించిన చేదు గలది. అతి-అమ్ల అనగా అతిశయించిన పులుపు. అనగా రెండు రోజుల క్రిందటి పెరుగు వంటిది. అతిలవణ అనగా ఉప్పు ఎక్కువ యని అర్థము. అతి-ఉష్ణ అనగా నోరు కాలిపోయేటంతటి వేడిగా నున్నది; లేదా, ఎండు మిర్చి, మిరియము వంటి కన్నులవెంబడి నీటిని రప్పించే పదార్థము. అతి-తీక్ష్ణ అనగా అధికమగు వగరు గలది. అతిరూక్ష అనగా అతిశయించిన కషాయలక్షణము కలది. కడుపులో మంటను పుట్టించునది విదాహి అనబడును. ఇట్టి ఆహారమును రాజసికులు అధికముగా ఇష్టపడెదరు (రాజసస్యేష్టాః). వీటి వలన శారీరక దుఃఖము మాత్రమే గాక శోకము మరియు అనారోగ్యము కలుగును (దుఃఖశోకామయప్రదాః).

ఇవి గాక, మరియొక రకము ఆహారము కూడ గలదు.

**అధ్యాయము 17, శ్లోకము 10:**

> यातयामं गतरसं पूति पर्युषितं च यत् ।
> उच्छिष्टमपि चामेध्यं भोजनं तामसप्रियम् ॥ १० ॥

> యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్
> ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్ (10).

**చ** = మరియు, **యత్** = ఏ, **భోజనమ్** = భోజనము, **యాతయామమ్** = మూడు గంటల క్రితము వండినది లేదా సరిగా ఉడకనిది, **గతరసమ్** = సారము లేనిది, **పూతి** = కుళ్లినది, **పర్యుషితమ్** = నిన్నటిది, **అపి** = మరియు, **ఉచ్ఛిష్టమ్** = తినగా మిగిలినది, **చ** = మరియు, **అమేధ్యమ్** = సమర్పించుటకు అర్హము కానిది, **తామసమ్** = తామసికునకు ఇష్టమగునది.

> మూడుగంటల క్రితము వండినది, లేదా సరిగా ఉడకనిది, సారము లేనిది, కుళ్లినది, నిన్నటిది, తినగా మిగిలినది మరియు సమర్పించుటకు అర్హము కానిది అగు భోజనమును తామసికులు ఇష్టపడుదురు (10).

నలభై ఎనిమిది నిముషములు ఒక ముహూర్తము. నాలుగు ముహూర్తములు ఒక యామము. అనగా సుమారు మూడు గంటలు. శీతలీకరణవ్యవస్థ లేని సందర్భములో

ఉష్ణదేశములో మూడు గంటల క్రితము వండిన ఆహారము సూక్ష్మక్రిమిభరితమై ఉండును. ఇటువంటి ఆహారమును గతసారమ్ అను పదము కూడ నిర్దేశించును. కావున, శ్రీశంకరులు ఈ పదమునకు సరిగా ఉడకని ఆహారము అని అర్థము చెప్పిరి. తాజా ఆహారములో గల రుచి నిలవ ఉన్న ఆహారములో ఉండదు గనుక, దానిని గతసారము (రుచి మరియు పౌష్టిక విలువలు లేనిది) అని చెప్పవచ్చును. తెల్లటి బియ్యములో సారము ఉండదు. దానిని గతసారము అనవచ్చును. దానిలో పుష్టినిచ్చే గుణము తొలగిపోయినది.

పూతి అనగా దుర్వాసన కలది. పర్యుషితమనగా నిన్న వండినదగుటచే రాత్రి అంతా నిలవ ఉన్న ఆహారము అని శ్రీశంకరులు వ్యాఖ్యానించిరి. ఈ విధముగా పులువ పెట్టబడిన ఆహారములను కొన్ని మందులలో కషాయరూపములో వాడెదరు. కాని ఇది తినుటకు యోగ్యమైన ఆహారము కాదు. ఇతరులు తినగా మిగిలి పోయిన ఆహారమునకు ఉచ్ఛిష్టమ్ అని పేరు. అమేధ్యమ్ అనగా పరమేశ్వరునకు సమర్పించనిది, లేదా సమర్పించుటకు అర్హము కానిది అగు ఆహారము. తామసికవ్యక్తులు ఇట్టి ఆహారమును ఇష్టపడుదురు (తామసప్రియమ్). దీనిని బట్టి ఇటువంటి ఆహారమును తినుచున్నవాడు తామసికుడని నిర్ణయించరాదు. అట్టి నిర్ణయము సరి కాదు. కొందరికి అది అలవాటు అయి ఉండవచ్చును. మనము పరిహరించుటకొరకై ఇచట తామసాహారము వివరించబడినది.

ఇప్పుడు మూడు విధముల ఆరాధనలు చెప్పబడుచున్నవి.

**అధ్యాయము 17, శ్లోకము 11:**

अफलाकांक्षिभिर्यज्ञो विधिदृष्टो य इज्यते ।
यष्टव्यमेवेति मनस्समाधाय स सात्त्विकः ॥ ११ ॥

అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే
యష్టవ్యమేవేతి మనస్సమాధాయ స సాత్త్వికః (11)

**అఫలాకాంక్షిభిః** = (అంతఃకరణశుద్ధి కంటె భిన్నమైన) ఫలమును అపేక్షించని వారిచే, **విధిదృష్టః** = శాస్త్రము ద్వారా తెలియబడిన, **యః** = ఏ, **యజ్ఞః** = యజ్ఞము, **యష్టవ్యం ఏవ** = కర్తవ్యకర్మ కనుక చేయవలసినదే, **ఇతి** = అని, **మనః** = మనస్సును, **సమాధాయ**

= ఏకాగ్రము చేసి, ఇజ్యతే = అనుష్ఠించబడుచున్నదో, సః = ఆ యజ్ఞము, సాత్త్వికః = సాత్త్వికము.

> అంతఃకరణశుద్ధిని మించిన ఫలమునందు అపేక్ష లేనివారిచే కర్తవ్య కర్మ గనుక చేయవలసినదే అని మనస్సును ఏకాగ్రము చేసి శాస్త్రము ద్వారా తెలియబడు ఏ యజ్ఞము అనుష్ఠించబడుచున్నదో, అది సాత్త్వికము (11).

యజ్ఞశబ్దమునకు మూలమునందున్న యజధాతువునకు దేవతను ఆరాధించుట (దేవపూజాయామ్) అని అర్థము. యజ్ఞమనగా సాధారణముగా వేదవిహితమగు కర్మను నిర్దేశించును. ఇచట యజ్ఞశబ్దమునకు శాస్త్రదృష్టః అను విశేషణము కలదు. అనగా శాస్త్రము ద్వారా తెలియబడునది అని యర్థము. మనము చేయదగిన కర్మలగురించి చెప్పే వాక్యములు వేదమునందు గలవు. కొన్ని ప్రతి దినము చేయదగిన కర్మలు (నిత్యకర్మ) కాగా, కొన్ని ప్రత్యేకసందర్భములలో చేయదగినవి (నైమిత్తికకర్మ).

వీటిని చేయునది ఎవరు? ఈ సాత్త్వికకర్మలను ఫలముపై దృష్టిలేనివారు (అఫలాకాంక్షిభిః) చేయుదురు. ఫలాపేక్ష లేకుండగా ఎవ్వరైననూ కర్మను ఎట్లు చేయగల్గుదురు? ఈ పదమునకు అర్థమేమనగా వారు ఈ కర్మలను ఈశ్వరార్పణబుద్ధితో పాపప్రక్షాళనము ద్వారా అంతఃకరణశుద్ధి కొరకు మాత్రమే చేయుచున్నారు. ఈకర్మలను చేయుటలో వారికి గల మనఃప్రవృత్తిని యష్టవ్యమేవ (చేసి తీరవలసినదే) అను పదములు సూచించుచున్నవి. ఎందువలన? శాస్త్రముచే విధించబడినది గనుక. కర్మలన్నింటికీ విశిష్టఫలము గలదు. కాని ఇచట ఈ కర్మ విశిష్టఫలము కొరకు గాక, అంతఃకరణశుద్ధి కొరకు చేయుబడుచున్నది. దీనివలన పురుషార్థమేదియు అపేక్షించబడుట లేదు అనే నిశ్చయముతో ఈ కర్మ చేయబడును. భద్రత (అర్థ), సుఖము (కామ), లేదా పుణ్యము (ధర్మ) అనే పురుషార్థములు ఈ కర్మకు ఉద్దేశ్యములు కావు. ఇచట సాధకునకు వీటియందు అభిరుచి లేశమైననూ లేదు. పైగా, వీటన్నిటినుండి విముక్తిని (మోక్ష) కలిగించే జ్ఞానమును అతడు కోరుచున్నాడు. లక్ష్యము అది అయినప్పుడు, ఏ కర్మయైననూ ఈ జ్ఞానము పొందుటకు అవశ్యకమైన మనస్సును మించి ఈయగలిగే ఫలము లేదు. కావున, అతడు పురుషార్థవిషయములో స్థిరమగు ధారణ కలవాడై (మనః సమాధాయ), కర్మను చేపట్టును. లేదా, మనః సమాధాయ అనగా మనస్సును ప్రసన్నముగానుంచుకొని అని అర్థమును చెప్పవచ్చును. అనగా అతని యందు ఒకానొక ఉత్సాహము కలదని యర్థము. అట్లు

గానిచో, ధర్మార్థకామముల యందు అభిరుచి లేని వ్యక్తికి ఒక యజ్ఞమును అప్పజెప్పినచో, అతడు దానిని నిరుత్సాహముగా విముఖతతో చేయుటకు అవకాశము మెండు. అట్టి మనః ప్రవృత్తితో చేయబడిన కర్మ సాత్త్వికము కాజాలదు. కావున, ఇచట ఈ కర్మ ప్రసన్నమగు ఉల్లాసభరితమైన మనస్సుతో చేయబడినది. పురుషార్థము మోక్షము అనే విస్పష్టమగు నిశ్చయము గలవానికి మనస్సు సహజముగా ప్రసన్నమై ఉండును. ఇతర కామనల తాకిడి లేని మనస్సుతో అతడు ఈ కర్మను చేయును. ఇట్టి కర్మ సాత్త్వికమని పరిగణించబడినది.

ఈ లక్షణములన్నియు గల యజ్ఞము సాత్త్వికమగును. మోక్షము కొరకై అంతఃకరణశుద్ధి తప్ప మరియొక దానియందు అపేక్ష లేనివాడు దానిని చేయుచుండవలెను. అపుడు మనస్సు దానియందు దృఢముగా నెలకొని యుండును (మనస్సమాధాయ). మరియు ఇది నాకు కర్తవ్యకర్మ అనే మనః ప్రవృత్తి ఉండవలెను. ఇంతేగాక, దానిని శాస్త్రోక్తవిధానములో చేయవలెను.

శ్రీ కృష్ణభగవానుడు కర్మయోగము యొక్క సారమునంతనూ ఈ ఒక్క శ్లోకములో ఇమిడ్చినాడు. కర్మయనగా వేదవిహితక్రతువు అని సామాన్యార్థము. అట్టి కర్మను జనులు సాధారణముగా పుణ్యమును సంపాదించుటకొరకై చేయుదురు. దానిని అంతఃకరణశుద్ధి కొరకు చేసినచో, అదియే కర్మయోగము. మనము కర్మయోగమును వివరించే సందర్భములలో కర్మశబ్దము కర్తవ్యకర్మలను కూడ నిర్దేశించును. కావున, ఇచట కర్మశబ్దము వైదికక్రతువులను మాత్రమే గాక, సర్వకర్తవ్యకర్మలను మరియు మానవీయ సంబంధములను నిర్దేశించును.

ఇపుడు రాజసికయజ్ఞము నిరూపించబడుచున్నది.

**అధ్యాయము 17, శ్లోకము 12 :**

अभिसंधाय तु फलं दंभार्थमपि चैव यत् ।
इज्यते भरतश्रेष्ठ तं यज्ञं विध्दि राजसम् ॥ १२ ॥

అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్ (12)

**తు** = కాని, **ఫలమ్** = ఫలమును, **అభిసంధాయ** = మనస్సులో నిడుకొని, **చ** = మరియు, **ఏవ** = నిశ్చయముగా, **దంభార్థమ్** = తాను ధార్మికుడనని చాటి చెప్పుట కొరకై, **అపి** = కూడ, **యత్ ఇజ్యతే** = ఏ విధముగా చేయబడుచున్నదో, **భరత శ్రేష్ఠ** = భరత

వంశీయులలో శ్రేష్ఠుడవగు ఓ అర్జునా!, తమ్ = ఆ, యజ్ఞమ్ = యజ్ఞమును, రాజసమ్ = రాజసమని, విద్ధి = తెలుసుకొనుము.

> భరతవంశీయులలో శ్రేష్ఠుడవగు ఓ అర్జునా! ఫలమును మనస్సులో పెట్టుకొని, అంతే గాక, తాను ధర్మాత్ముడనని పదిమందికి తెలియుట కొరకై చేయబడే యజ్ఞము రాజసమని తెలుసుకొనుము (12).

పూర్వశ్లోకములో చెప్పబడిన సాత్త్వికయజ్ఞమునకు ఈ యజ్ఞమునకు గల భేదమును 'తు' అను అవ్యయము ఎత్తి చూపును. ఈ యజ్ఞము కూడ శాస్త్రోక్త విధానముగా చేయబడినదే అయిననూ, మనః ప్రవృత్తిలో భేదములు గలవు. ఫల విషయములో స్థితి పూర్తి విరుద్ధము. ఒక విశిష్ట ఫలమును ఉద్దేశించి (ఫలం అభిసంధాయ) ఈ యజ్ఞము చేయబడును. అది సంపద గాని, ఒకానొక సుఖవిశేషము గాని, లేక పుణ్యము గాని కావచ్చును. ఈ పుణ్యఫలము ఈ లోకములో సుఖము కొరకు గాని, పరలోక సుఖము కొరకు గాని కావచ్చును. ఏది ఎట్లున్ననూ, ఒక విశిష్ట ఫలమును మనసులో నిడుకొని చేయబడే యజ్ఞమును గురించి మనమిచట చర్చించుచున్నాము. ఆ దృష్టితో చేయబడే యజ్ఞము రజోగుణము నుండి పుట్టినదని ఎరుంగుము (రాజసం విద్ధి).

ఇంతేగాక, కొందరు తాము ధర్మాత్ములమని లోకములో చాటి చెప్పుటకొరకై (దంభార్థమ్) యజ్ఞమును చేయుదురు. కర్తవ్యకర్మ అను భావనతో చేయబడే సాత్త్విక యజ్ఞము (యష్టవ్యం ఏవ) వలె గాక, ఇది తన గొప్పదనమును చాటిచెప్పుట కొరకై చేయబడును. ఇవి పరస్పర విరుద్ధములగు మనః ప్రవృత్తులు. ధార్మికుడు అనే గుర్తింపును సంపాదించుట కొరకై చేయబడే యజ్ఞము రాజసికము.

ఇక మూడవ యజ్ఞము ఎట్టిది?

**అధ్యాయము 17, శ్లోకము 13 :**

> विधिहीनमसृष्टान्नं मंत्रहीनमदक्षिणम् ।
> श्रध्दा विरहितं यज्ञं तामसं परिचक्षते ॥ १३ ॥

> విధిహీనమసృష్టాన్నం మంత్రహీనమదక్షిణమ్
> శ్రద్ధా విరహితం యజ్ఞం తామసం పరిచక్షతే (13)

**విధిహీనమ్** = శాస్త్రోక్త విధానము లేనిది, **అసృష్టాన్నమ్** = అన్న వితరణ లేనిది, **మంత్రహీనమ్** = మంత్రపఠనము లేనిది, **అదక్షిణమ్** = దక్షిణలు లేనిది, **శ్రద్ధావిరహితమ్** = శ్రద్ధలేనిది అగు, **యజ్ఞమ్** = యజ్ఞమును, **తామసమ్** = తామస యజ్ఞమని, **పరిచక్షతే** = చెప్పెదరు.

> శాస్త్రోక్త విధానము, అన్న వితరణ, మంత్ర పఠనము, దక్షిణలు మరియు శ్రద్ధ అను లక్షణములు లేని యజ్ఞమును తామస యజ్ఞమని అందురు (13).

ఈ శ్లోకములో వర్ణించబడిన యజ్ఞము తమోగుణము నుండి పుట్టినదని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు (పరిచక్షతే). ఈ శ్లోకములోని పదములన్నియు యజ్ఞవిశేషణములే. శాస్త్రము విధించిన ఆదేశములను పాటిస్తూ యజ్ఞమును చేయవలసి యుండును. అనగా విధి విధానమును దాటి అధికము చేయరాదు; అంతకంటె తక్కువ చేయరాదు. ఆ విధముగా విధిని ఖచ్చితముగా పాటించవలెను.

కాని ఇచటి పరిస్థితి దీనికి విరుద్ధము. ఈతడు యజ్ఞమును చేయుచున్నాడు. బాగున్నది. కాని నియమములనన్నింటినీ పాటించుట లేదు. ఈతని యందు యజ్ఞమును చేయవలెననే కోరిక గలదు. కాని దానిని సరియైన పద్ధతిలో చేయుటకు అవసరమగు శ్రద్ధ చాలినంత లేదు.

యజ్ఞమునకు సంబంధించిన నియమములలో కొన్నింటిని ఇతరపదములు నిర్దేశించు చున్నవి. యజ్ఞము జరిగే కాలములో జనులకు అన్నమునిడుట అవశ్యకర్తవ్యము. యజ్ఞమునకు విచ్చేసిన బ్రాహ్మణులకు మరియు ఋత్విక్కులకు భోజనము నీయవలెను. అది కూడ యజ్ఞములో భాగమే. ఈ విధి విహితమగు అన్నదానము లేని యజ్ఞము 'అసృష్టాన్నః' అనబడును. అంతే గాక, ఈతడు మంత్రముల నన్నిటినీ పఠించుట లేదు; లేదా, తప్పుగా పఠించుచున్నాడు. అనగా, కొన్ని వర్ణములను మ్రింగి వేయుచున్నాడు. స్వరము సరిగా లేదు. స్వరము లేని మంత్రము మంత్రమే కాదు. ఈ విధముగా పఠించబడిన మంత్రములతో నడిచే యజ్ఞము మంత్రహీనః అనబడును. తరువాత, ప్రతి యజ్ఞములో కొంత దక్షిణను ఈయవలెను. ధనము, భూమి, పశువులు ఇత్యాదిగా దక్షిణలో భేదములు గలవు. ఋత్విక్కులకు, అర్హులగు ఇతరులకు ఏదో ఒక రూపములో ధనమును పంచి ఈయవలెను. అది లేని యజ్ఞము అదక్షిణః అనబడును. దక్షిణ ఈయనిదే, యజ్ఞము పూర్తి కాదు.

ఇట్టి యజ్ఞములో గల ప్రధానసమస్య శ్రద్ధ లేకపోవుట (శ్రద్ధా విరహితః). అదియే మిగిలిన దోషములన్నింటికీ కారణము. యజ్ఞములో ఏవో కొన్ని లోపములు ఉన్ననూ, శ్రద్ధ ఉన్నచో అవి సర్దుబాటు అగును. కాని ఈ యజ్ఞములో ఆ శ్రద్ధయే లేకున్నది. ఒక వేళ శ్రద్ధ ఉన్ననూ, అది తామసిక శ్రద్ధ. అట్టి శ్రద్ధ గలవాడు భూతప్రేత పిశాచాదులను ఆరాధించి అభిచారిక కర్మలననుష్ఠించునని మనము చూచి యున్నాము.

బ్రహ్మ విద్యకు ఆధ్యాత్మిక-అను శాసనము ఆవశ్యకము. దానిలో మూడు రకములు గలవు. వాటిని వర్ణించే మూడు ప్రముఖ శ్లోకములు ఇపుడు వచ్చుచున్నవి. బ్రహ్మ విద్యను కోరువారు కాకపోయిననూ, మానవులు ఈ తపస్సులను ఆచరించినచో, వాటివలన పరిపక్వత ఏర్పడును. ఇవి మనము చేయగలిగే తపస్సులలో కెల్లా శ్రేష్ఠమైనవి.

**అధ్యాయము 17, శ్లోకము 14 :**

देवद्विजगुरुप्राज्ञ पूजनं शौचमार्जवम् ।
ब्रह्मचर्यमहिंसा च शारीरं तप उच्यते ॥ १४ ॥

దేవద్విజగురుప్రాజ్ఞ పూజనం శౌచమార్జవమ్
బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే (14)

**దేవద్విజగురు ప్రాజ్ఞ పూజనమ్** = దేవతలను బ్రాహ్మణులను గురువులను మరియు జ్ఞానులను పూజించుట, **శౌచమ్** = బాహ్యమునందు పరిశుభ్రత, **ఆర్జవమ్** = సరళస్వభావమును కలిగియుండుట, **బ్రహ్మచర్యమ్** = బ్రహ్మచర్యము, **చ** = మరియు, **అహింసా** = అహింస, **శారీరమ్** = శరీరమునకు సంబంధించిన, **తపః** = తపస్సు అని, **ఉచ్యతే** = చెప్పబడుచున్నది.

దేవతలను బ్రాహ్మణులను గురువులను మరియు జ్ఞానులను పూజించుట,
బాహ్యములో పరిశుభ్రత, సరళ స్వభావమును కలిగియుండుట,
బ్రహ్మచర్యము మరియు అహింస అనునవి శరీరమునకు సంబంధించిన
తపస్సు అని చెప్పబడుచున్నది (14).

ఆధ్యాత్మిక-అనుశాసనమునకు తపస్సు అని పేరు. దానిని అనుష్ఠించుటలో ఉపయోగించబడే ప్రధాన సాధనముల దృష్టికోణములో అది త్రివిధముగా నున్నది. అది

ప్రధానముగా శరీరముతో చేసేది (శారీరమ్, లేదా కాయికమ్) గాని, వాక్కుతో చేసేది (వాచికమ్) గాని, లేదా మనస్సుతో చేసేది (మానసమ్) గాని కావచ్చును. వీటికి అన్నింటికీ శుద్ధియే ప్రయోజనము. మనము వాడే పరికరములనన్నింటినీ శుభ్రము చేయుచుందుము. కళ్లజోడును పెట్టుకొనే ముందు తుడుము కొనెదము గదా! అదే విధముగా కరణము (సాధనము) లనన్నింటినీ ఈ అనుశాసనముల ద్వారా శుద్ధి చేసి సంసిద్ధము చేసినచో, జ్ఞానము ఉదయించును. కరణములు శుభ్రముగా నున్నపుడు మాత్రమే విషయము స్పష్టముగా కానవచ్చును.

ఈ శ్లోకములో ప్రధానముగా స్థూలదేహమునకు సంబంధించిన అనుశాసనములు చెప్పబడినవి (శారీరం తపః). మొదటిది పూజనమ్; అనగా భక్తి, ఆరాధన, ఆదరము ఇత్యాది. ఇది చాల ప్రముఖమైనది. ఏదో ఒక రూపములో నిత్యము భగవానుని ఆరాధించవలెను. దీనినే దేవపూజనము అందురు. ఇది అత్యావశ్యకము. దీనిని ఏనాడూ విడువకుండగా ప్రతి దినము చేసినచో, అది తపస్సు అగును. అట్లు గానిచో, దానిని తపస్సు అనజాలము. ఒక వ్రతమును స్వీకరించి, దానిని ఖచ్చితముగా అమలు చేసినచో, అది తపస్సు అగును. ఏది ఏమైనా సరే, దానిని చేసి తీరవలసినదే.

ఇంతేగాక బ్రాహ్మణులకు మరియు గురువులకు సముచితమగు మర్యాదను ఈయవలెను. బోధించువాడు గురువు. మనకు జీవితములో మూడు రకముల గురువులు తారసిల్లెదరు. తల్లిదండ్రులు మొదటి గురువులు. వీరు గాక మనకు వివిధ విజ్ఞాన శాఖలను నేర్పిన ఉపాధ్యాయులు మరియు మనకు జీవితమునకు చెందిన గుణపాఠములను నేర్పిన గురువులు గలరు. మనకు మంత్రమును లేక బ్రహ్మ విద్యను ఉపదేశించిన ఆధ్యాత్మిక గురువు మూడవ వాడు. వీరు అందరు గురువులే గనుక, సమ్మానమునకు అర్హులు. ఈ ఆదరమును ప్రకటించుటకై మనము చేయవలసిన కర్తవ్యములు కొన్ని గలవు. వీటిని క్రమము తప్పకుండగా పాటించవలెను. ఇది ఒక తపస్సు.

విద్వాంసుడు, లేక జ్ఞాని (ప్రాజ్ఞః) అగు వ్యక్తిని కూడ ఆదరించవలెను. పుష్పములను సమర్పించుట, సేవచేయుట ఇత్యాది మర్యాదను సూచించే చేష్టలన్నియు మనము చర్చిస్తున్న శారీరతపస్సులో అంతర్భాగములే అగును. సందర్భము వచ్చినప్పుడు మనము సముచితమగు సేవను చేసి తద్వారా వీరిని ఆరాధించవలెను.

పరిశుభ్రత (శౌచమ్) అతి ప్రముఖమైన అనుశాసనము. మనము శారీర తపస్సును గురించి మాటలాడు చున్నాము గనుక, ఇది బాహ్యశౌచము మాత్రమే యగును.

అంతరశౌచమును భగవానుడు తరువాత మానస తపస్సులో భాగముగా చర్చించగలడు. మన చుట్టూ ఉన్న పరిసరములను మరియు స్థూల దేహమును నియమిత వేళలలో పరిశుభ్రముగా నుంచి పరిరక్షించవలెను. ఇది ఆధ్యాత్మికసాధనకు మాత్రమే గాక సర్వవిధముల సాధనలకు అనుకూలమైన వాతావరణమును నిర్మాణము చేయుటలో ప్రముఖ పాత్రను వహించును.

వివిధ వ్యక్తులతో నిష్కపటమగు హృదయముతో వ్యవహరించుటను ఆర్జవమందురు. సత్యాన్వేషకులగు సాధకులలో నిష్కపటవర్తన నిర్ణాయకమగు పాత్రను వహించును. ఇచట తపస్సు అనగా ఇతరులతో జరిపే వ్యవహారములన్నింటిలో నిష్కపటతకు కట్టుబడి ఉండుటయే. దీనిలో మనస్సునకు మరియు వాక్కునకు కూడ ఖచ్చితమగు పాత్ర గలదు. కాని ఇది క్రియాప్రధానముగా నుండే సందర్భములలో శారీర తపస్సుగా పరిగణించబడును.

బాహ్యమగు ఇంద్రియముల స్థాయిలో ఉండే ఖచ్చితమగు నియంత్రణ (బాహ్యేంద్రియనిగ్రహః) కు బ్రహ్మచర్యమని పేరు. ఇది దమములో అంతర్భాగము అగును. ఇతర ప్రాణులను హింసించకుండుట అహింస యగును. అహింస క్రియ కాక పోయినా, హింస క్రియయే. శరీరావయవములతో హింసను చేసే ప్రవృత్తిని నియంత్రించుటయే ఇచటి తపస్సు. హింసించే ప్రవణత గల వ్యక్తి తనకు సంబంధము ఉన్నా లేకపోయినా, ఇతర ప్రాణులను హింసించును. నివసించే గదిలో పురుగు కనబడినప్పుడు దానికి హాని కలుగని విధముగా తీసి బయట పారవేయవలెను. ఇదియే అహింస. దీనిలో శరీరావయవముల పాత్ర కలదు గనుక, శారీర తపస్సు అగుచున్నది. దీనిలో ఇంద్రియములకు, మనస్సునకు కూడ పాత్ర గలదనుటలో సందేహము లేదు. కాని క్రియ ఆవిర్భవించేది స్థూలదేహమునందు గనుక, దాని పాత్ర ప్రముఖమైనది. కావుననే దీనిని శారీరతపస్సు అని వర్ణించుట రూఢి యగుచున్నది.

దీని తరువాతిది వాగింద్రియమునకు సంబంధించిన అనుశాసనము (వాక్ తపః). దీనిని మనము ఇదివరలో చూచి యున్నాము. కాని ఇచట ఇది స్పష్టముగా ఒకే ఒక వాక్యములో ప్రస్తుతింపబడుచున్నది.

**అధ్యాయము 17, శ్లోకము 15 :**

अनुद्वेगकरं वाक्यं सत्यं प्रियहितं च यत् ।
स्वाध्यायाभ्यसनं चैव वाङ्मयं तप उच्यते ॥ १५ ॥

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్ మయం తప ఉచ్యతే (15)

యత్ = ఏ, వాక్యమ్ = వాక్యము, అనుద్వేగ కరమ్ = అందోళనను కలిగించదో, సత్యమ్ = సత్యమో, చ = మరియు, ప్రియహితమ్ = వినుటకు ఇంపైనది మరియు ప్రయోజనకారి యగునో, చ = మరియు, ఏవ = నిశ్చయముగా, స్వాధ్యాయ-అభ్యసనమ్ = ప్రతి దినము స్వీయ వేద శాఖను అధ్యయనము చేయుట, వాఙ్ మయమ్ = వాక్కునకు సంబంధించిన, తపః = తపస్సు అని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

> అందోళనను కలిగించనిది, సత్యమును ప్రకటించునది, వినుటకు ఇంపైనది మరియు లాభదాయకము అగు వాక్యమును పలుకుట, మరియు ప్రతిదినము స్వీయ వేద శాఖను అధ్యయనము చేయుట అనునవి వాగ్రూపమైన తపస్సు అనబడును (15).

మనము ఇతరులతో మాటలాడుచుందుము. అట్లు మాటలాడుటకు కారణమేమి? ఒకప్పుడు వార్తను చెప్పుటకు, లేదా మనకు కలిగిన అనుభవమును లేక మనకు తెలిసిన జ్ఞానమును పంచుకొనుటకు మనము మాటలాడెదము. ఈ సందర్భములన్నింటిలో మనయందు ఖచ్చితముగా ఒక ఉద్దేశ్యము (వివక్ష) గలదు. ఇతరవ్యక్తిలో ఒక అవగాహనను కలిగించుట కొరకై మనము వాక్యమును ప్రయోగించెదము. అట్టి వాక్యము తపస్సు కావాలంటే, దానిలో కొన్ని విశిష్టలక్షణములు ఉండి తీరవలెను.

మనము మాటలాడునప్పుడు అవతలి వ్యక్తికి లేశమైననూ పీడ కలుగని విధముగా మాటలాడుట (అనుద్వేగకరమ్) చాల ప్రముఖమైన విషయము. మనము మాటలాడే వ్యక్తికి మనము చెప్పే వాక్యము గాని, లేదా చెప్పే తీరు గాని చిత్తక్షోభను కలిగించునదిగా ఉండరాదు. ఇంతేగాక, మనము చెప్పే వచనము సత్యము అయి ఉండవలెను. ఆ మాటను చెప్పుచుండగనే, అది ఎదుటి వానికి ఆనందమును కలిగించునదిగా నుండవలెను. దానికే ప్రియమని పేరు. ఇంతేగాక, అది ఎదుటి వానికి దీర్ఘకాలమునందు కూడ లాభకారి కావలెను. ఇట్టి ప్రయోజనకారి యగు వచనము హితమనబడును. శ్రీ శంకరులీ పదములను విపులముగా చర్చించిరి. ఇచటి 'చ' కారము ఈ నాల్గు పదములకు సమానమగు ప్రాముఖ్యమును సూచించుచున్నదని శ్రీ శంకరులు ఉద్ఘాటించిరి. ఈ నాల్గు లక్షణములు గల వచనములు మాత్రమే వాఙ్మయతపస్సు

అగును. ఒకటి గాని, రెండు గాని, లేక మూడు గాని లక్షణములు లోపించినచో, అది వాఙ్మయతపస్సు కాజాలదు. మనము పలికే వాక్యము చాల ఉల్లాసకరముగ నున్ననూ (ప్రియమ్), లేశమైననూ క్షోభను కలిగించక పోయిననూ (అనుద్వేగకరమ్), అది సత్యము కానిచో, హితము కూడ కాబోదనుటలో సందేహము లేదు. లేదా, అది ప్రియము మరియు సత్యము కూడ అయిననూ, ఎదుటి వానికి మంచిని చేసేది (హితమ్) కాకపోవచ్చును. ఉదాహరణకు, ఈ రోజు గుర్రపు పందెములను చూచుటకై ప్రవేశము ఉచితము అను వర్తమానము వినుటకు ఇంపైన యథార్థ వచనమే అయిననూ, ఆ వార్తను జూదపు పిచ్చి గలవానికి చెప్పినచో, అది వానికి హితకారి కానే కాదు. దీనికి భిన్నముగా కొన్ని వాక్యములు యథార్థములే అయిననూ, కర్ణకఠోరముగ నుండును. నా మిత్రుడు తెలివితేటలు గలవాడు కాదు. కాని ఆ విషయమును నేనాతనికి చెప్పినచో, అతనికి చిత్తక్షోభ కలుగుట తథ్యము. పైగా దాని వలన అతనికి ఒరిగేది ఏమీ లేదు. ఇట్టి వాక్యము సత్యమే అయినా, అనుద్వేగకరము కాదు; ప్రియము కాదు; హితము కాదు. ఇట్టి వాక్యములు తపస్సు అనబడువు.

ఈ నాల్గు లక్షణములు గల వాక్యము మాత్రమే వాఙ్మయ తపస్సు అనబడును. శ్రీ శంకరులు ఒక దృష్టాంతము నిచ్చిరి : శాంతో భవ వత్స. స్వాధ్యాయం యోగం చ అనుతిష్ఠ. తథా తే శ్రేయో భవిష్యతి. అనగా, ప్రియమైనవాడా! శాంతిని పొందుము. నిత్యము వేదమును పఠిస్తూ కర్మయోగము ననుష్ఠించుము. అపుడు నీకు మోక్షము లభించును. ఈ వాక్యము ఎంత సుందరముగ నున్నదియో గమనించుడు. ఈ తీరున ''శాంతుడవు కమ్ము (శాంతో భవ వత్స)'' అని చెప్పుచుండగనే, ఎదుటి వాని మనస్సులో ప్రశాంతి నెలకొనును. ఇది అనుద్వేగకరము. సాధారణముగా మనకు కోపము వచ్చినప్పుడు 'నోరు మూసుకొనుము' 'ఇక చాలించుము' ఇత్యాది వాక్యములను పలుకుచుందుము. వీటి వలన ఇట్టి ప్రయోజనము సిద్ధించదు. ఎదుటి వాడు నోరు మూసుకున్ననూ, ప్రసన్నతను పొందుట అసంభవము. ఇవి ఉద్వేగకరమగు వచనములు. ఆ తరువాత శాస్త్రమును పఠించి, కర్మయోగ జీవనము ననుసరించుమని చెప్పబడెను. దీని వలన వానికి వెనువెంటనే ఆనందము కలుగుట (ప్రియమ్) మాత్రమే గాక, భవిష్యత్తు కూడ సుఖమయము (హితమ్) అగును. అట్లు చేసినచో, మోక్షము లభించుననియు చెప్పబడెను. ఇది హితము మాత్రమే గాక, యథార్థము కూడా. అతడీ లోకములో జీవన్ముక్తుడు కాకపోయిననూ, మరుజన్మ మంచిది లభించి, ఆతని సాధన ఆగి పోయిన స్థానము నుండి మరల ముందునకు సాగిపోవును. దీనిలో సమస్య లేశమైననూ లేదు. ఈ సలహా వర్తమానములో మరియు భవిష్యత్తులో కూడ క్షేమకరము. ఈ సలహాను పాటించినచో, వానికి ఈ జన్మలో రాగద్వేషముల

పట్టు నుండి ఆపేక్షికమగు విముక్తి లభించును. ఈ విధముగా పైన చెప్పిన నాలుగు లక్షణములతో విరాజిల్లే ఇట్టి వాక్యములకు వాఙ్మయతపస్సు అని పేరు.

స్వీయవేదశాఖాధ్యయనము (స్వాధ్యాయాభ్యసనమ్) కూడ వాఙ్మయతపస్సులో భాగమే యగును. ప్రతి దినము మనము స్వీయ వేదశాఖను పూర్తిగా గాని, పాక్షికముగా గాని పారాయణ చేయవలెను. ఇట్టి పారాయణ చేయలేని వారు కనీసము గాయత్రిని జపించవలెను. సర్వవేదముల సారము గాయత్రి యని చెప్పెదరు. దానిని జపించ లేనివారు 'ఓం తత్ సత్' అను మంత్రమును జపించవలెను. దీనిని గురించి భగవానుడు చెప్పబోవు చున్నాడు. కర్మలన్నింటియందు ఇట్టి వికల్పములు ఉండును. కర్మను ఏదో ఒక రూపములో చేయుట ఆవశ్యకము. ప్రతి దినము మోక్షశాస్త్రమును అధ్యయనము చేయుట కూడ తపస్సే యగును. కావున, స్వాధ్యాయాభ్యసనమనగా ప్రతిదినము ఒక మంత్రమును గాని, స్తోత్రమును గాని పునః పునః జపించుట అని చెప్పవచ్చును. ఇది చాల ప్రముఖమగు సాధన.

ఈ విధముగా వాఙ్మయ తపస్సు నిరూపించబడినది. మానస తపస్సు అనగా నేమి?

**అధ్యాయము 17, శ్లోకము 16 :**

मनः प्रसादः सौम्यत्वं मौनमात्म विनिग्रहः ।
भावसंशुध्दिरित्येतत् तपो मानसमुच्यते ॥ १६ ॥

మనః ప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మ వినిగ్రహః
భావసంశుద్ధిరిత్యేతత్ తపో మానసముచ్యతే (16)

**మనః ప్రసాదః** = మనస్సు ప్రసన్నముగా నుండుట, **సౌమ్యత్వమ్** = మాటలలో మరియు చేష్టలలో ఉల్లాసము, **మౌనమ్** = మాటలాడవలెననే ఒత్తిడి లేకుండుట, **ఆత్మ వినిగ్రహః** = మనస్సును వశములో నుంచుకొనుట, **భావసంశుద్ధిః** = నిష్కపటమగు హృదయమును కలిగియుండుట, **ఇతి** = అనే, **ఏతత్** = ఇది, **మానసం తపః** = మానస తపస్సు అని, **ఉచ్యతే** = చెప్పబడు చున్నది.

మనస్సు ప్రసన్నముగా నుండుట, మాటలలో మరియు చేష్టలలో ఉల్లాసము, మాటలాడవలెననే ఒత్తిడి లేకుండుట, మనస్సును వశములో

నుంచుకొనుట, నిష్కపటమగు హృదయమును కలిగియుండుట అనే ఈ లక్షణములు మానస తపస్సు అనబడును (16).

మనః ప్రసాదః అనగా మనస్సు ప్రసన్నముగా, ఉల్లాసముగా నుండుట. ఒకప్పుడు మనము పైకి ముఖములో ప్రసన్నతను కనబరచిననూ, మనస్సులో ప్రసన్నత లేశమైననూ ఉండక పోవచ్చును. అది మానసతపస్సు కాదు. కావుననే, మనః అను పదము జోడించబడినది. మానసికోత్సాహమును పొంది, దానిని నిలబెట్టుకొనే ఈ అనుశాసనము ఒక తపస్సు. ప్రార్థనా భావముతో కూడిన హృదయము, వ్యక్తికి తనకు తాను మరియు తాను ఉన్న పరిస్థితులు అంగీకార్యమగుట అనునవి ఈ తపస్సులో భాగములు. గతమును అంగీకరించి చింతిల్లకుండుట, మన ఎదుట నున్న ప్రపంచమును యథాతథముగా స్వీకరించుట అనునవి దీనికి చాల అవశ్యకము. వస్తుస్థితిని యథాతథముగా అవగాహన చేసుకొని, భగవానుని శరణు జొచ్చియున్నామనే భావనలో భవిష్యత్తును గురించిన చింతలు విలీనమగును. చీమ తన జీవితమును ఉత్సాహముగా గడిపి వేయుచుండగా, మనము అట్లు చేయుటకు ఆటంకమేమి గలదు? నా శక్తి యుక్తులను నేను ఇతరుల యెదుట నిరూపించే ఆవశ్యకత లేదు.

ఇవి అన్నీ అతి సరళమైన విషయములు. కాని వీటికి గల ప్రాముఖ్యము అధికము. ఇట్టి చిన్న చిన్న విషయములే మనస్సులో ఉత్సాహమును నింపును. ఏ దినమునకు ఆ దినము జీవించుట వాస్తవికమగు జీవనము. ఈ రోజు వాస్తవము. రేపు నేను ఈ లోకములో ఉండకపోవచ్చును. అనగా, రేపటి గురించి నేను చింతిల్లుతున్నానని అనుకోరాదు. ఈ రోజు నేను జీవించి యున్నాను. ఈ రోజు నా కర్తవ్యమును నేను తిన్నగా చేయుదును. భవిష్యత్తు తన సంగతి తానే చూచుకొనును. నేను ఈ రోజును నిర్వహించగల్గినచో, రేపు నిర్వహించవలసిన రోజు ఒకే ఒకటి ఉండును. ఇది జీవితసత్యము. మానవుడు జీవితమంతా చేయవలసినది ఒకే ఒక రోజును నిర్వహించుట. నీవు ఒక రోజునకు సరిపడ్డ ఆహారమును సంపాదించి వండుకున్న చాలును. వాస్తవంలో, ఒక రోజు అనుట కంటె ఒక పూట అనుట మరింత మంచిది. వాస్తవానికి ఒక రోజు చాల దీర్ఘమైన కాలము. కాని ఈ సత్యమును గుర్తించుటకు ఒక రోజును కొలబద్దగా తీసుకొనుట మంచిది. నీవు చింతాగ్రస్తుడవై ఉన్న సందర్భములోనైననూ, ఆ చింత ఒక రోజు మాత్రమే ఉండును. నిన్నటి చింత నిన్ననే మాయమైనది. నిన్న జరిగినది ఏదైనా నిన్న జరిగినది మాత్రమే. అది ఈ రోజు కాదు. నీవు తప్పు చేసినది నిన్న అయినచో, దాని గురించి బెంగ వద్దు. దాని వలన నీవు ఒక గుణపాఠమును నేర్చుకున్నావు. నీ వివేకము పెరిగినది. దాని గురించి నీవు ఈ

రోజు దుఃఖిస్తూ కూర్చుంటే, నిన్నటి దినము చెడుటయే గాక, నిన్న జరిగిన దాని గురించి దుఃఖించుటలో ఈ రోజు కూడ వ్యర్థమగుచున్నది. కర్తవ్యకర్మ మరియు కర్మఫలము అను విషయములలో కొంతవరకైననూ భగవంతునికి ఆత్మ సమర్పణము చేయగలిగినచో, మనము ఆనందముగా జీవించగల్గెదము.

దీనికి చీమయొక్క జీవితము ఒక చక్కని దృష్టాంతమని నా అభిప్రాయము. చీమ చాల చురుకుగా పని చేయును. కాని దానికి కూడ విశ్రాంతి సమయములు కొన్ని గలవు. అది ఒక చోట ప్రశాంతముగా కొంతసేపు కూర్చుండుట మనకు కానవచ్చును. ఆ తరువాత అది మరల చురుకుగా పని చేయుచుండును. ఇంతలో మరియొక చీమ దాని వద్దకు వచ్చుచుండును. ఇది దానికి తన భాషలో ఏదో చెప్పినదా యనిపించును. వెంటనే ఆ రెండు చీమలు కలిసి ఒక పనిని చేయుటకై వేగముగా ముందుకు సాగును. ఆ రెండు చీమలు మరికొన్ని చీమలతో జట్టు గట్టి పంచదార శకలముపై దండయాత్రను చేయును. ఆ శకలము ఒక్క చీమకు చాల పెద్దది యగును. కాని కొన్ని చీమలు కలిసి దానిని తమకు నచ్చిన స్థానమునకు దొర్లించుకొని పోయి తరువాత తీరికగా దానిని అవి భక్షించును. మధ్య మధ్యలో అవి విశ్రాంతి తీసుకొనును. వాటికి కంగారు లేదు. చుట్టు ప్రక్కల జనులు నడచుచున్ననూ, ఆ సందడికి అది అందోళన చెందినట్లు కానరాదు. ఏ క్షణములోనైననూ అది కాలి క్రింద నలిగి చనిపోవచ్చును. కాని అది చింతిల్లుతున్నట్లు కనబడదు. అది చురుకుగా తన పనిని తాను చేయుచుండును. ఆ చీమయే గాక, అటువంటి కోట్లాది చీమలు మనము నడిచే దారులలో బ్రతుకగల్గుచుండగా, నేను కూడ ఈ సువిశాల ప్రపంచములో బ్రతుకు తెరువును సంపాదించుట అసంభవము కాదు. పైగా తేలిక కూడా. భవిష్యత్తు తనను గురించి తాను చింతిల్లు గాక! భవిష్యత్తు గురించి యోజన చేయుటలో తప్పు లేదు. కాని నేను ఇపుడు ఈనాడు చేయగలిగిన దానిని చేసెదను. అంతే. ఈ నాటి యోజన ఇట్లున్నది. రేపటి యోజన కూడ సమానముగా నుండవచ్చును. లేదా, నేను దానికి కొన్ని మార్పులను చేర్పులను చేయవచ్చును. కాని ఏ నాటికి ఆనాడు మాత్రమే అనే ఈ దృష్టికోణములో ఎన్నటికీ మార్పు ఉండదు. ఇట్టి మానసిక ప్రవృత్తి ఉన్నచో, భగవచ్ఛరణాగతి సుకరమగును.

దీనికి తోడు ఒక ప్రకృతి సూత్రము (law) గలదు. జరుగవలసినది జరిగి తీరును (భవితవ్యం భవత్యేవ). ఇది ఆఘాతమును కాచుకొనే (shock-absorber) స్ప్రింగు వంటిది. జరిగేది జరుగుతూ ఉంటుంది; నేను చేయగలిగినది చేస్తాను. జీవించవలసిన వాస్తవిక దృష్టికోణము ఇదియే. నీవు జీవితములో ఇప్పుడు ఉన్న స్థితిలో ఉండగలవని ఎప్పుడైనా ఊహించేవా? ఇప్పుడు

నీకు గల స్థితి వెనుక ఎన్నో కారణములు గలవు. అన్నీ కలిసి వచ్చి నిన్నీ స్థితిలో నిలబెట్టినవి. మనకు తెలియకుండగనే ఒక విశిష్టయోజన పనిచేయుచుండుటచే, మనము ఈ నాడు ఉన్న పరిస్థితి సంభవమైనది. దానంతట దానిని బహిర్గతము కానిమ్ము. నీవు ఏ దినమునకు ఆ దినము సంప్రాప్తమైన దానిని స్వీకరించి, నీకు ఎదురైన పరిస్థితిని తీర్చి దిద్దుచుండుము. కాని నదీ వేగములో కొట్టు కొని పోయే దుంగవలె నుండరాదు. నీ జీవన నౌక యొక్క చుక్కానిని నీవే పట్టుకొని నడిపించుము. కాని నీ జీవితములో ఒక విశిష్టమగు అంతర్గత యోజన పనిచేయుచూ దినదినమునందు అదియే ప్రకటమగుచున్నదని గుర్తించుము. దానికి గంభీరమగు అర్థము గలదు. ఆ అర్థమును ఆవిష్కరించుకొనుము. అది ప్రకటమవుతూ ఉంటే, దానిని స్వీకరించుము. దానిలో ఊహించని వింతలు అనేకము ఉండవచ్చును. సర్వము మన యోజన ప్రకారముగా మాత్రమే జరిగే పక్షంలో జీవించవలసిన ఆవశ్యకతయే లేదు. ఉదాహరణకు, జరుగబోవునది సర్వము నీకు ముందుగనే తెలియుననుకో. నీవు శేషజీవితములో తినబోయే పదార్థములన్నింటి జాబితా నీముందు ఉన్నదనుకో. దీనిలో ఆనందమేమి గలదు? ఊహించని పరిణామములు గాని, అనుకోని మలుపులు గాని లేనే లేవు. నీవు ఆశ్చర్యమగు ఘటనలను, ఆకస్మిక పరిణామములను చూడగోరుచున్నావా? అట్లైనచో, నీ యోజనలను నీవు చేయుము. తరువాత వివిధ ఘటనలు ఒక దాని తరువాత మరియొకటి మన ముందుకు వచ్చుచుండును. వాటిని నిర్ణయించే అంశములనేకము గలవు. నీ ప్రారబ్ధము ఇతరుల ప్రారబ్ధముతో విడదీయలేని విధముగా ముడివడి యున్నది. ఈ జగత్తు నడిచే విధము ఇటులనే యుండును. ఇంతవరకు నీ జీవితములో జరిగిన ఘటనలను నీవు అవగాహన చేసుకొని జీర్ణము చేసుకొన్న పక్షములో నీవు ఆకస్మిక పరిణామములకు సంసిద్ధుడవై ఉందువు. ఈ సంసిద్ధతనుండి ఉల్లాసము, మనః ప్రసన్నత నిర్మాణమగును.

దీనిలో అనేకములగు అంశములు ఇమిడి యున్నవి. మనస్సులో ఆందోళన గాని, ఆదుర్దా గాని చెలరేగినప్పుడు, సముచితమగు మనః ప్రవృత్తితో దానిని తొలగించి ప్రసన్నతను నెలకొల్పవలెను. వ్యక్తి ఆత్మనిష్ఠుడై (తనలో తాను) ఉండుట చాల మధురమని నీవు గుర్తు చేసుకొనుము. 'నాకు నేనుగా నుండుట చాల మధురము' అని నీకు నీవు నచ్చజెప్పుకొనుము. ఏ అంశములలో నీలో మార్పు వచ్చుట అభీష్టమో, అట్టి మార్పు కొరకు యత్నించుము. అవసరమైతే ఇతరుల సాహాయ్యమును స్వీకరించుము. దీనిలో ప్రార్థన బాగుగా సహకరించును. నా ప్రతిభను నేను ఇతరుల యెదుట నిరూపించవలసిన పని లేదు. ఇతరులెవ్వరైననూ నా గురించి చెడుగా తలపోసినచో, అది వారి సమస్య. నాకు నేను యథాతథముగా అంగీకారమే. 'నాలో

నేను ఉండుట చాల మధురము'. ఇట్టి వాక్యమునొక దానిని అప్పుడప్పుడు మంత్రము వలె జపించుము. దీని వలన నీ వ్యక్తిత్వములో ఒక పొందిక నిర్మాణమగును. ఇది వేదాంతబోధ నుండి లభించే కనీసమగు మనో వైజ్ఞానిక ప్రయోజనము. వాస్తవములో నీ స్వరూపముకంటె భిన్నముగా ద్వితీయ వస్తువు లేనే లేదు. ఈ సర్వము నీవే. కావున సమస్యయే లేదు. కాని మానసిక స్థాయిలో నైననూ నాలో నేను ఉండుట చాల ఆనందదాయకము. నాకు నేను యథాతథముగా పూర్తిగా అంగీకార్యుడను. ఈ భూమండలముపై ఎవరిముందైననూ నా ప్రతిభను నిరూపించబని లేదు. భగవంతునికైననూ నిరూపించనక్కరలేదు. నేను నా గురించి భగవంతునికి నిరూపించవలెనన్నచో, అయన నన్ను స్వీకరించుటలో ప్రతిబంధకములు, షరతులు ఉండును. అప్పుడాయన భగవానుడు కాజాలడు. అయున కూడ ఇతరవ్యక్తులతో సమానమగును. నీ సంరక్షకునకు నీవు యథాతథముగా అంగీకారము కానిచో, నీ సంరక్షణ అతనికి నీపై గల అభిప్రాయముపై ఆధారపడేది అయినచో, అది ఏపాటి సంరక్షణ? నిన్ను యథాతథముగా స్వీకరించలేని వాడు నిన్ను ఎట్లు సంరక్షించగల్గును? రోగికి సేవను చేయు సంరక్షకురాలికి (nurse) రోగి యథాతథముగా అంగీకారము కాడను కొనుడు. అతడు సర్వదా గోకుకొనుచున్నాడని ఈమె ఫిర్యాదు చేసినదనుకొనుడు. అతని గల సమస్యయే అది. దాని వలననే ఆమె అతనికి సంరక్షకురాలైనది. అధికముగా గోకవద్దని ఆమె అతనికి చెప్పవచ్చును; లేదా, అతనికి చేతులకు తొడుగులను వేయవచ్చును; లేదా క్రొత్త సమస్యలు రాకుండుట కొరకై అతని చేతి గోళ్లను కత్తిరించవచ్చును. కాని ఆమె అతనిని యథాతథముగా అంగీకరించవలసి యుండును. సంరక్షణ అనగా నదియే. కావున నన్ను సంరక్షించువాడు నన్ను యథాతథముగా అంగీకరించవలెను. అట్టి సంరక్షణకు మాత్రమే విలువ గలదు. నిన్ను వాస్తవముగా సంరక్షించు వ్యక్తులు మంచి-చెడు అనే అభిప్రాయములను ప్రక్కన బెట్టి నిన్ను యథాతథముగా స్వీకరించెదరు. ఎవరైననూ నిన్ను అపార్థము చేసుకున్నచో, అది వారి సమస్య. 'నాలో నేను ఉండుట సుఖకరము' అను విషయమును సర్వదా జ్ఞప్తిలో నుంచుకొనుము. ఉదయము నిద్ర లేవగానే, ఇంకనూ జీవించి యున్నందులకు ఆనందముతో కృతజ్ఞతను ప్రకటించుము. జీవించియుండుటకు విలువ ఏమీ లేదని తలంచకుము. మరియొక దినము లభించినందులకు పండుగ జేసుకొన దగును. ఈనాటి పండుగను ఎట్లు గడుపవలెనో యోజన చేయుము. పండుగను స్నానము చేయుచూ ఆరంభించవచ్చును. అదే విధముగా, నీ కర్తవ్యములననుష్ఠిస్తూ రోజంతా పండుగ చేసుకొనుము. అనగా ప్రతి దినము పిండివంటలను తినాలని అభిప్రాయము కాదు. నీవు ఏ పనిని చేస్తూ ఉంటే, అదియే పండుగ యగును. 'ఈనాడు నేను జీవించి యున్నాను. ఇట్లు జీవించియుండుట

మహానందము. నా కర్తవ్యము ననుష్ఠించుటలో ప్రమోదము గలదు'. ఈ రకమైన మనః ప్రవృత్తి ఉండవలెను. ఇదియే మనః ప్రసాదము.

మనస్సునకు ఈ లక్షణము ఉన్నచో, సౌమ్యత్వము నెలకొనును. ఈ పదము మనోదశ (వృత్తి) ను బోధించును. సౌమ్యత్వమనగా స్వచ్ఛత అని శ్రీ శంకరులు చెప్పిరి. ఇది కూడ ఉల్లాసములో భాగమే. ఇచట శ్రీశంకరులు ఒక చక్కని సంగతిని చెప్పిరి. తండ్రి కొడుకు కేసి కనుబొమలను విరచి చూచినాడనుకొనుడు. ఈ బాహ్య లక్షణమును బట్టి తండ్రి యొక్క మనోదశ (క్రోధము) ను కొడుకు తెలుసుకొనును. అవుడు తండ్రి మనస్సును సంతోషపెట్టుటకు ఆ కొడుకు యత్నించును. తండ్రి మనస్సులో సంతోషము కలుగగానే, ఏమగును? ముఖముపై చిరునవ్వు ప్రత్యక్షమగును. ఈ చిరునవ్వును బట్టి తండ్రి కోపము తొలగి పోయినదని కొడుకునకు తెలియుచుండును. మనోభావములను ముఖకవళికలు బయట పెట్టును. అట్టి సంతోష భరితమైన మనోదశ (వృత్తి)కు సౌమ్యత్వమని పేరు. 'ముఖములో కానవచ్చే ఉల్లాసమును బట్టి మనోదశను ఊహించవచ్చును' అని శ్రీ శంకరులు వివరించిరి. మనస్సులో ప్రసన్నత నెలకొనగానే, దాని బాహ్య చిహ్నములు గోచరించును. వాటికి సౌమ్యత్వమని పేరు. మనః ప్రసన్నతకు సౌమ్యత్వము చిహ్నము. నోరు, కన్నులు, కనుబొమ్మలు, మాటలు, మరియు వ్యక్తి యొక్క ఆచరణ అను సర్వమును బట్టి ఆ వ్యక్తి సంతోషముగా నున్నాడని మనము ఊహించగల్గుదుము. ఇచట చెప్పబడే తపస్సు యేదనగా, దుఃఖము కలిగిన సందర్భములలో మనస్సులో ఉల్లాసమును దెచ్చుకొని చిరునవ్వుతో ఉండవలెను. ఇది ప్రవర్తనలో మార్పులను తెచ్చుకొనుట అనుకోరాదు. అవగాహనను పెంపొందించుకొనే ప్రక్రియలో ఈ మార్పు సహజముగా వచ్చును.

వాగింద్రియముపై గల నియంత్రణకు మౌనమని పేరు. ఇది వాగింద్రియము యొక్క అనుశాసనము గనుక, వాక్-తపస్సులో అంతర్గతముగా దీనిని చర్చించవచ్చును. కాని ఇచట ఇది మానసిక తపస్సు అని పరిగణించబడినది. కారణమేమి? అంతరంగములో మౌనము గలవాడు మాత్రమే కొన్ని సమయములలో మాటలను కట్టి బెట్టి, మరికొన్ని సమయములలో సముచితముగా మాటలాడగల్గును. నీకు కొన్ని మాటలను చెప్పాలని అనిపించిన సందర్భములో అట్లు చేయకుండగా నిన్ను నీవు నియంత్రించుకున్నచో, అది మౌనమనబడును. మాటలను పలు కాలనే ఆలోచనయే రాని పక్షములో, అది కూడ మౌనమేనని చెప్పనేల? ఆలోచనలు ఉదయించిననూ, సరియగు అవగాహన ఉన్నచో, మనము వాటిని బయటకు వ్యక్తము చేయకుండగా ఆపివేయగల్గుదుము. ఈ తీరున అంతరంగములో మాటలాడవలెననే ఒత్తిడి

నిర్మాణము కాదు. మాటలాడాలనే ఒత్తిడి లోపల లేనిచో, దాని ప్రభావము బయటకు మౌనరూపములో ప్రకటమగును. మనలో మాటలాడాలనే ఒత్తిడి సర్వదా ఉండును. మనమే దానిని వృద్ధి చేస్తూ ఉంటాము. అట్లుగాక, ఇతరవ్యక్తితో మాటలాడాలనే ఒత్తిడి లేని స్థితికి మౌనమని పేరు. మనస్సులో మౌనము ఉన్నది గనుక, వాగింద్రియస్థాయిలో మౌనము సంభవమగును. దీనిని అనుశాసనము ద్వారా సంపాదించవచ్చును. కావుననే, ఇది తపస్సు అయినది. దీనిలో సరియగు అవగాహనను పెంపొందించుకొని మౌనమును సాధించే ప్రయత్నము ఇమిడి యున్నది.

సాధారణముగా మనస్సు యొక్క విక్షేపముపై గల నియంత్రణకు ఆత్మ వినిగ్రహః అని పేరు. ఇచట ఆత్మ శబ్దము యొక్క అర్థము విషయములో సందిగ్ధత ఏమియు లేదు. మనము మానసిక తపస్సు అనే ప్రకరణములో నున్నాము గనుక, ఆత్మ యనగా ఇచట మనస్సు అని మాత్రమే అర్థమును చెప్పవలెను. సాధారణమగు మనోనియంత్రణలో వాగింద్రియమునకు చెందిన విశిష్టాంశము మౌనము అనబడును. కాని మనోనిగ్రహము అన్ని మనోవ్యాపారములకు వర్తించును. సరియగు అనుశాసనము గల వ్యక్తికి మానసిక వృత్తులపై ఒక విశిష్టమగు నియంత్రణ లభించును. అట్టివాడు ఒక విశిష్ట ఆలోచనా ప్రవాహములో కొట్టుకొని పోడు. ఈ అనుశాసనములో పాటించదగిన నియమములు తపస్సు అనబడుచున్నవి. మనస్సులోని భావజాలమును ఇతరుల యెదుట ప్రకటించే అభిప్రాయము లేని వ్యక్తి వాటిని ఒక కాగితముపై వ్రాసి పెట్టుకొనవచ్చును. దీనివలన మనో భారము తగ్గును. అవసరమైనచో మానసిక శాస్త్రవేత్తను సంప్రదించి సలహాను పొందవచ్చును. ఇవి అన్నియు ఆత్మ వినిగ్రహములో అంతర్భాగమే యగును. మనస్సులోని ఒత్తిడిని, బరువును తగ్గించుటకు చేసే ప్రయత్నము లన్నియు దీనిలో భాగమే.. మనస్సులోని భావావేగములనన్నింటినీ ఒక క్రమములో అమర్చుకొనవలెను. దానిని సాధించుటకై చేసే ప్రయత్నములన్నియు ఆత్మ వినిగ్రహములో అంతర్భాగములగును. మానసిక - ఆరోగ్యము కొరకై చేసే పనులన్నియు సాధనయగును. ఇవి అన్నియు యోగములో అంతర్భాగము అగుచున్నవి.

భావసంశుద్ధిః అనునది ఒక విశిష్టమగు పారిభాషిక పదము. వ్యక్తులతో వ్యవహరించునప్పుడు నిష్కపటమగు భావనలను కలిగి యుండవలెను. ఇదియే భావసంశుద్ధి. ఇతరులు మన హృదయములోని అభిప్రాయములను అర్థము చేసుకొనవచ్చును; లేదా, మానవచ్చును. కాని ఈ అభిప్రాయములు శుద్ధముగా నుండవలెను. భావన మానసిక స్థాయిలో మాత్రమే ఉండును. దానికి క్రియతో సంబంధము లేదు. భావన శుద్ధముగా లేనిచో, దానికి గల కారణమును విశ్లేషించవలెను. అట్లు విశ్లేషించి భావనలో అట్టి దోషమును ప్రవేశింపజేసిన అట్టి

విశిష్ట-ఆలోచనా-ధోరణిని నిర్మూలించవలెను. దీనికే అమాయావిత్వము అని పేరు. ఈ ప్రకరణములో మాయావి యనగా మోసగాడు. అతని ఆలోచన వేరు; చెప్పేది వేరు; చేసేది మరియొకటి. జనులతో వ్యవహరించునప్పుడు ఇట్టి మోసమునకు లేశమైననూ తావీయని వ్యక్తి యందు భావసంశుద్ధి ఉండును.

కాయిక వాచిక మానసికములనే త్రివిధములగు ఈ తపస్సులు వాటిని అనుష్ఠించే వ్యక్తి యొక్క స్వభావమును బట్టి మరల మూడు రకములుగా ఇపుడు వర్గీకరించబడుచున్నవి. చేసే పని ఒకటియే అయినా, అది చేసే తీరుతెన్నులు, మరియు దాని ప్రయోజనము అనునవి దాని స్వరూపమును నిర్ధారించును. వీటిని బట్టి అది సాత్త్విక, రాజస, లేదా తామసతపస్సు అగును.

**అధ్యాయము 17, శ్లోకము 17 :**

श्रद्धया परया तप्तं तपस्तत् त्रिविधं नरैः ।
अफलाकांक्षिभिर्युक्तैस्सात्त्विकं परिचक्षते ॥ १७ ॥

శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్ త్రివిధం నరైః
అఫలాకాంక్షిభిర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే (17).

**తత్** = ఆ, **త్రివిధమ్** = మూడు రకములైన, **తపః** = తపస్సు, **అఫలా కాంక్షిభిః** = (అంతఃకరణ శుద్ధి కంటె అధికమగు) ఫలమును కోరని, **యుక్తైః** = మనస్సమాధానము గల, **నరైః** = మానవులచే, **పరయా** = పూర్ణమైన, **శ్రద్ధయా** = శ్రద్ధతో, **తప్తమ్** = అనుష్ఠించబడినదై, **సాత్త్వికమ్** = సాత్త్వికతపస్సు అని, **పరిచక్షతే** = చెప్పుచున్నారు.

> అంతః కరణ శుద్ధి కంటె అధికమగు ఫలమునందు కాంక్షలేనివారు, మనస్సమాధానము గలవారునగు మానవులు ఈ మూడు రకముల తపస్సును పూర్ణ శ్రద్ధతో ఆచరించినచో, అది సాత్త్వికతపస్సు అనబడునని పెద్దలు చెప్పుచున్నారు (17).

శ్రద్ధయా పరయా అనగా పూర్ణశ్రద్ధతో అని యర్థము. ఆ శ్రద్ధలో లొసుగులు ఏమియూ లేవు. వారు పూర్ణశ్రద్ధతో అనుశాసనమును పాటించెదరు (తప్తం తపః). ఈ శ్రద్ధ దేని యందు? శాస్త్రము చెప్పునది సత్యము అను శ్రద్ధ (ఆస్తిక్య బుద్ధి) వారికి గలదు. కావుననే, వారు శాస్త్రోక్త

నియమములనన్నింటినీ రాజీ పడకుండగా పాటించెదరు. ఇంతేగాక, వారికి గురువచనములయందు కూడ సమానమగు ఆస్తిక్యబుద్ధి గలదు. గురువచనములు సత్యమనే దర్శనము వారికి గలదు. ఒకవో వారికి గురువచనము తెలియక పోయిననూ, అది సత్యమే యను మాన్యత గలవారై తెలుసుకొనే ప్రయత్నమును చేసెదరు.

మానవులు ఈ మూడు రకముల తపస్సులను చేయుచున్నారు. అది కాయికము, వాచికము మరియు మానసికము అను మూడు విధములుగా నుండునని మనము చూచి యున్నాము.

ఇచట చర్చించబడే ఈ తపస్సును చేయు జనులు ఎవరు? వారు అర్థము కొరకు గాని, కామము కొరకు గాని, లేదా భవిష్యత్తులో సుఖమునొసగు పుణ్యము కొరకు గాని ఈ తపస్సును చేయుట లేదు. ఈ విధమగు సర్వఫలాకాంక్షల నుండి వారు విముక్తులై యున్నారు (అఫలాకాంక్షిణః). వారు ఈ తపస్సును అంతః కరణ శుద్ధి కొరకు మాత్రమే చేయుచున్నారు. వారికి ప్రసన్నమైన, మరియు అంకితభావము గల మనస్సు ఉన్నది. ఇట్టి వ్యక్తులు చేసే ఇట్టి తపస్సు సాత్త్వికమగునని విద్వాంసులు చెప్పుచున్నారు (పరిచక్షతే).

తరువాత రాజసతపస్సు చెప్పబడుచున్నది.

**అధ్యాయము 17, శ్లోకము 18 :**

सत्कारमानपूजार्थं तपो दंभेन चैव यत् ।
क्रियते तदिह प्रोक्तं राजसं चलमध्रुवम् ॥ १८ ॥

సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్ (18).

**యత్** = ఏ, **తపః** = తపస్సు, **సత్కారమానపూజార్థమ్** = ఇతరులు తనను ధర్మాత్ముడని తలపోసి మర్యాద చేసి పూజించుట కొరకై, **చ** = మరియు, **ఏవ** = నిశ్చయముగా, **దంభేన** = దంభముతో, **క్రియతే** =చేయబడు చున్నదో, **తత్** = ఆ తపస్సు, **ఇహ** = ఇచట, **రాజసమ్** = రాజసమని, **ప్రోక్తమ్** = చెప్పబడినది, **చలమ్** = చంచలమైనది, **అధ్రువమ్** = చిరస్థాయి కానిది.

ఇతరులు తనను ధర్మాత్మునిగా భావించి మర్యాద చేసి పూజించవలెననే తలంపు కలిగి దంభముతో చేయబడే తపస్సు చంచలమై చిరస్థాయిగా నుండదు. ఇట్టి తపస్సు రాజసమనబడును (18).

ఈ రకమైన ఆరాధనను జనులు అంతః కరణశుద్ధి కొరకు గాక, కేవలము తాము ధర్మాత్ములమనే కీర్తిని పొందుటకై చేసెదరు. ఈతడు మంచివాడు, తపశ్శాలి యగు బ్రాహ్మణుడు (అయం సాధుః తపస్వీ బ్రాహ్మణః) అని జనులచే ప్రశంసల నందుకొనుటకై వారి పూజను చేయుదురని శ్రీశంకరులు వివరించిరి. 'చూడండి, ఆయన ఎంత అనుశాసనయుతముగా నున్నాడో! ఎంత మధురముగా మాటలాడు చున్నాడో! ఎంత మితముగా భుజించుచున్నాడో!' ఇత్యాది వచనములను జనుల నోటినుండి వినుట కొరకై అతడు వ్రతనియమముల ననుష్ఠించును. అతడు ఖచ్చితముగా అభిలషించేది ఈ ప్రశంసలను మాత్రమే. అతడు చేసే తపస్సునకు మరియొక లక్ష్యము లేదు. ఇతరుల యెదుట తన ప్రతిభను ప్రదర్శించుటకై మానవులు పడే పాట్లలో ఇది ఒక రకము.

తాను గొప్ప తపస్వినని విషయమును నలుగురికీ చాటి చెప్పే వేషములో అతడు మనకు దర్శనమిచ్చును. అతడు తన తపస్సును ఇంటిలో నాలుగు గోడల మధ్య రహస్యముగా చేయడు. సార్వజనిక స్థలములో పదిమందికి కనబడే విధముగా అతడు తపస్సును చేయును. మరియు అతడు సాధువువలె కమండలము మొదలగు వాటిని చేతబట్టి మనముందుకు వచ్చి తన ఎదుట అందరు నిలబడి యుండవలెనని శాసించును. దీనికి మానమని పేరు. అందరు తాను తపస్వినని విషయమును గుర్తించి, తనకు సాష్టాంగప్రణామముల నాచరించి తనకు మర్యాదతో స్వాగతము పలుకు విధముగా అతడు జాగ్రత్త పడును. ఇంతే గాక, ఆయనకు అత్యున్నతమగు ఆసనము నిచ్చి తీరవలెను. ఇతరుల కంటె తక్కువ ఎత్తులో కూర్చుండుట అవమానకరమని ఆతని దృఢవిశ్వాసము. ఈ విధముగా వీరిలో అనేక సమస్యలు గలవు. వీటిని మనము సరిగా తెలుసుకొనవలెను. మన దృష్టి ఇట్టి అత్యల్ప విషయములపై కేంద్రితమై యున్నచో, శ్రవణము చేసి సాక్షాత్కరించు కొనదగిన ఆత్మవస్తువు మాట యేమి? ఈ సత్యవస్తువు సాక్షాత్కరించుటకై చేయవలసిన సాధన ఎంతేని గలదు. ఈ అల్ప విషయముల గురించి చింతిల్లు చున్నచో, యథార్థమగు సాధన భ్రష్టమగును. మానమనగా నిట్లుండును.

ఇతరులు తనను పూజించాలనే ఆకాంక్షతో అతడు తపస్వియైనాడు. ఇతరులు నమస్కరించుటకై అతడు పాదములను సంసిద్ధముగా నుంచును. పాదపూజ, పాదములను కడిగి

ఆ నీటిని నెత్తిపై చల్లుకొనుట, పుష్పములను పాదములపై సమర్పించుట ఇత్యాది మర్యాదలను జనులు సాధారణముగా సాధువులకు చేయుచుందురు. వీటిని పొందుట కొరకై సాధువేషమును దాల్చిన వ్యక్తిని గురించి మనము చర్చించుచున్నాము. ఈ ప్రవృత్తి సాధువునకు ఉండవలసిన ప్రవృత్తికి పూర్తి విరుద్ధమైనది. తాము చేసే తపస్సునకు ఈ విధమైన ఫలమును గోరు వ్యక్తులు యథార్థముగా గలరు. అట్టి వారిని ఒకరిని నేను ఎరుగుదును. మార్గశీర్ష మాసములో మేము తెల్లవారు జామున ప్రతిదినము పురవీధులలో ఊరేగుతూ భజనలను పాడెడి వారము. మా భజనబృందమునకు ముందు నాయకుడు ఒకాయన నడిచెడివాడు. ఈ బృందమును ఆయనయే నిర్వహించెడివాడు. మేము ఊరేగే సమయములో కొందరు గృహములలో నుండి బయటకు వచ్చి మాకు నమస్కారములను చేసెడివారు. మా ముందు నడిచే ఆయన ఈ నమస్కారముల నన్నింటినీ స్వీకరించెడివారు. ఆయనను మీరు చూచి యుండిన బాగుండెడిది! ఆయన భజన జరిగినంత సేపు తన పాదములను నమస్కారముల కొరకై సంసిద్ధముగా నుంచెడివాడు. కొందరికి ఆ విధముగా నమస్కారములను స్వీకరించుట యందు అభిరుచి మెండు. దీనిలో అతిశయోక్తి లేశమైననూ లేదు. ఇది యథార్థము. ఇట్టి వ్యక్తులు లోకములో కలరు. వారికి ఇతరులు చూపే మానమర్యాదలు కావాలి. దీనికి కారణము వారి యందు ఆత్మ గౌరవము లేకుండుటయే. ఆత్మ గౌరవము కొరవడిన వ్యక్తి ఇతరుల నుండి గౌరవము నపేక్షించును. ఇతరులు ఇచ్చే గౌరవమును బట్టి అతనికి తనపై గౌరవము ఏర్పడును. ఇట్టి వారిని గౌరవించు వ్యక్తులకు లోకములో కొదవ లేదు.

జనుల గుర్తింపును కోరి దంభముతో కొందరు ఇట్టి తపస్సును చేయుచుందురు. తాను తపస్వినని లోకము గుర్తించవలెను. తద్ద్వారా తనకు ఈ మర్యాదలన్నియు దక్కవలెను. ఇట్టి వారు పదిమంది చూచుచున్నారని నిర్ధారించుకున్న పిదప మాత్రమే తపస్సును చేసెదరు.

ఇచట, అనగా ఈ శాస్త్రములో (ఇహ) ఈ విధమైన రజోగుణమునుండి పుట్టిన తపస్సునకు రాజసతపస్సు (రాజసమ్) అని పేరు పెట్టబడినది (తత్ తపః ప్రోక్తమ్).

ఈ తపస్సు చంచలమైనది. ఇది నాలుగు కాలాలు పాటు నిలిచేది కాదు (చలం అధ్రువమ్). కొందరు జనులు కొంత కాలము ఇట్టి వారికి గౌరవమర్యాదల నీయవచ్చును. కాని అతడు తపస్వి కాదని వారికి శీఘ్రముగనే తెలియగలదు. ఉన్నతమగు అనుశాసనము మరియు మనః పరిపక్వత గల ధార్మికుడగు వ్యక్తి తపస్వి యనబడును. తపస్వి కాని వానికి తాను తపస్వియని జనులను నమ్మించవలెనన్న తపన వలన బుద్ధి చెడిపోతుంది. ఈ ధ్యాసతో తపస్వి అని

మోయుట అసంభవమగును. జనులకు వానిపై గల మంచి భావనలో శీఘ్రముగా మార్పు వచ్చును. ఏదో ఒకనాడు ఆ వ్యక్తి యొక్క జీవితము ఛిన్నాభిన్నమగును. ఆతనికి నచ్చిన విధముగా మర్యాదనీయని వ్యక్తి ఒకడు తారసిల్లగనే, ఆతనికి క్రోధము వచ్చును. దానితో ఆతని తపస్సు ఎంతటిదో జనులకు తెలిసిపోవును. కావున, ఇది చిరకాలము నిలిచే తపస్సు కాదు. ఈ తపస్సునకు అనుష్ఠానములో బలము లేదు. ఫలము అత్యల్పముగ నుండును. ఇపుడు తామసతపస్సు వర్ణించబడుచున్నది.

**అధ్యాయము 17, శ్లోకము 19:**

मूढग्राहेणात्मनो यत् पीडया क्रियते तपः ।
परस्योत्सादनार्थं वा तत्तामसमुदाहृतम् ॥ १९ ॥

మూఢగ్రాహేణాత్మనో యత్ పీడయా క్రియతే తపః
పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్ (19)

**మూఢగ్రాహేణ** = వ్యామోహముతో కూడిన ధారణతో, **ఆత్మనః** = తన దేహమునకు, **పీడయా** = పీడతో, **వా** = లేదా, **పరస్య** = ఇతరవ్యక్తి యొక్క, **ఉత్సాదనార్థమ్** = వినాశము కొరకు, **యత్** = ఏ, **తపః** = తపస్సు, **క్రియతే** = చేయబడుచున్నదో, **తత్** = ఆ తపస్సు, **తామసమ్** = తామసమని, **ఉదాహృతమ్** = చెప్పబడినది.

వ్యామోహపూరితమగు ధారణతో తన దేహమునకు పీడను కలిగిస్తూ, లేదా ఇతర వ్యక్తి యొక్క వినాశము కొరకు చేయబడే తపస్సు తామసమని చెప్పబడినది (19).

మూఢగ్రాహేణ అనగా వ్యామోహభరితమైన ధారణతో. ఆత్మను గురించి, కర్తవ్యమును గురించి, మరియు ధర్మాధర్మముల గురించి, వివేకము లేకపోవుటచే ధారణలు వ్యామోహముతో కూడియుండును. వారికి ఆత్మ, కర్తవ్యము, ధర్మము అనువాటి గురించి స్పష్టమగు అవగాహన ఉండదు. ఈ వివేకము లేనివారు తపస్సును చేసి తమ దేహమునకు హానిని కలిగించుకొనెదరు. ఈ తపస్సు దేహమునకు మాత్రమే గాక, మనస్సునకు కూడ హానిని కలిగించును. కాని దానివలన లభించు ఫలము అల్పము. ఒంటి కాలిపై నిలబడుట, మేకుల శయ్యపై పరుండుట అనునవి ఇట్టి తపస్సునకు దృష్టాంతములు. ఆతడు చేసే ఈ తపస్సును పదిమంది చూచి తీరాలి. ఆతడు అట్టి

ఏర్పాటును చేసుకొని, ఆ తరువాత ఈ తపస్సును చేయును. ఇట్టి తపస్సును చేయువారు కుంభమేళాలో దర్శనమిచ్చెదరు.

ఇంతేగాక, కొందరు ఈ తపస్సును ఇతరుల వినాశము కొరకు (పరస్య ఉత్సాదనార్థమ్) చేసెదరు. రాక్షస ప్రకృతి గాని, లేక అసుర ప్రకృతి గాని కలవారు కేవలము తమ శత్రువుల వినాశము కొరకై కఠోరమగు తపస్సును చేసెదరు. దీనికి రావణుడు దృష్టాంతము. ఇట్టివారు ఒక విశిష్టశక్తిని పొందుటకై శ్రమించెదరు. లేదా ఒక ప్రేతమును వశము చేసుకొని దానిని జనుల వినాశము కొరకై వదిలి పెట్టే లక్ష్యముతో తపస్సును చేసెదరు. ఇట్టి తపస్సునకు అభిచారిక కర్మ అను పేరు వాడుకలో గలదు. దీనికి సంబంధించిన మంత్రశాస్త్రము ఒకటి కలదు. కాని అది ఈ రోజులలో నిర్వీర్యముగా నున్నదని నా భావన. ఇది పని చేయుటకు ఉగ్రమగు అసుర తపస్సును చేయవలసి యుండును. అట్టి తపస్సును చేయువారు ఈ కాలములో లేరని నా అభిప్రాయము. ఇట్టి తపస్సునకు తామసతపస్సు అని పేరు.

తపస్సును అనుష్ఠించే వ్యక్తిలో ప్రముఖముగా నున్న గుణమును బట్టి తపస్సులో ఉండే మూడు రకములను మనము తెలుసుకున్నాము. వీటిలో సాత్త్విక తపస్సు మాత్రమే యథార్థమగు తపస్సు. మిగిలిన రెండు తపస్సులను మనము దూరముగా నుంచవలెను. వాటిని వర్ణించుటలో గల ఉద్దేశ్యము అదియే.

ఇదే విధముగా దాతలో ప్రముఖముగా నుండే గుణమును బట్టి దానము కూడ త్రివిధముగా నున్నది.

**అధ్యాయము 17, శ్లోకము 20:**

दातव्यमिति यद्दानं दीयतेऽनुपकारिणे ।
देशे काले च पात्रे च तद्दानं सात्त्विकं स्मृतम् ॥ २० ॥

దాతవ్యమితి యద్దానం దీయతేనుపకారిణే
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ (20).

**యత్** = ఏ, **దానమ్** = దానము, **దాతవ్యమ్** = ఈయదగును, **ఇతి** = అను భావనతో, **దేశే** = యోగ్యమగు దేశమునందు, **చ** = మరియు, **కాలే** =సముచితమగు

కాలములో, చ = మరియు, పాత్రే = అర్హుడగు వ్యక్తి యందు, అనుపకారిణే = ఉపకారమును అపేక్షించదగని వ్యక్తికి, దీయతే = ఈయబడునో, తత్ = ఆ, దానమ్ = దానము, సాత్త్వికమ్ = సాత్త్వికమని, స్మృతమ్ = చెప్పబడినది.

> ప్రతిగ్రహీతనుండి ఉపకారమును అపేక్షించకుండగా వానికి దానము నీయవలెను. దానమును చేయవలెను అను కర్తవ్యభావనతో యోగ్యమగు దేశకాలముల యందు అర్హుడగు పాత్రయందు చేసిన దానము సాత్త్వికదానమని చెప్పబడినది (20).

'దానము కర్తవ్యము' అనే మానసిక ప్రవృత్తితో చేసిన దానము (దాతవ్యమితి) సాత్త్వికదానమనబడును. ఒక విశిష్టపరిస్థితిలో దానమును చేయవలసి యుండును. అప్పుడు 'నేనీ దానమును చేయవలెను' అనే స్పందన వ్యక్తిలో ఉదయించవలెను. కర్మయోగములో కూడ 'ఈ కర్మ నా కర్తవ్యము' అను గుర్తింపు కలదు గదా! ఆ మానసిక ప్రవృత్తిని దానమునకు కూడ అన్వయింప చేయవలెను. కావున, ఇది కూడా కర్మయోగమే. దానము వస్తురూపములో నుండవచ్చును. లేదా, శ్రమదానము చేసి ఉపకరించుట కూడ దానమే యగును. కావున దానమును చేసే మనః ప్రవృత్తిని బట్టి ఆ దానము సాత్త్వికమగును.

ఒక దానము సాత్త్వికమగునా? కాదా? యను విషయము ఆ దానము ఈయబడిన వ్యక్తిపై కూడ ఆధారపడి యుండును. మనము ఏ వ్యక్తి నుండి ప్రత్యుపకారము నపేక్షించమో (అనుపకారిణే) అట్టి వ్యక్తికి చేసిన దానము సాత్త్వికమగును. అనగా మనము దానము చేయు వ్యక్తి ప్రత్యుపకారమును చేసే సామర్థ్యము లేని వాడు కావచ్చునని శ్రీశంకరులు వివరించిరి. పండు ముదుసలికి గాని, లేక మిక్కిలి నీరసించి యున్నవానికి గాని, లేక భవిష్యత్తులో పరిస్థితి బాగుపడునునే ఆశలేని పరమదరిద్రునకు గాని దానమును చేసినచో, వారివలన ప్రత్యుపకారము లభించే అవకాశము లేనే లేదు. ఇట్టి వారికి మాత్రమే గాక, ప్రత్యుపకారమును చేయ గల సమర్థునకైననూ అట్టి ఉపకారమును అపేక్షించకుండగా దానము చేసినచో, అది కూడ సాత్త్వికదానమేనని శ్రీశంకరులు వివరించిరి. ప్రత్యుపకారాపేక్షతో ఇచ్చినచో, అది పెట్టుబడి యగును గాని, దానము కాదు. కృతజ్ఞతా ప్రకటనతో సహా ప్రత్యుపకారమును దేనినీ అపేక్షించకుండగా చేయు దానము మాత్రమే యథార్థమగు దానము. 'నేను వానికి ఒక బహుమానము నీయగా, అతడు కృతజ్ఞతనైననూ చూపలేదు; కనీసము thanks అనియైననూ చెప్పలేదు; అతనికి నేను గుర్తు లేను; నాకు ఉత్తరము వ్రాయడు' ఇత్యాదిగా జనులు ఫిర్యాదులను

చేయుచుందురు. ఇది ఒక సమస్య. కాని దానము ఈయబడే వ్యక్తి ప్రత్యుపకార సమర్థుడే అయిననూ, సాత్త్వికదానములో అట్టి ప్రత్యుపకారాపేక్ష ఉండదు. కుడి చేతితో చేసిన దానము గురించి ఎడమ చేతికి తెలియరాదని పెద్దలు చెప్పెదరు. ఇచ్చి వెంటనే పూర్తిగా మరిచి పోవాలి. అదియే యథార్థమగు దానము. దానికే సాత్త్విక దానమని పేరు.

దానము ఈయబడే వ్యక్తి దానికి యోగ్యుడై (పాత్రమ్) ఉండవలెను. ఇది కూడ ప్రముఖమైన అంశము. పాత్రమ్ అనగా గిన్నె; దానమును పొందే వ్యక్తి కూడ పాత్రమ్ అనబడును. మనము ఉపకారమును చేయునప్పుడు, బహుమానముల నిచ్చునప్పుడు, అవతలి వ్యక్తి వాటికి అర్హుడై యుండవలెను. అడిగిన వారికి అందరికీ ఇచ్చుకుంటూ పోరాదు. ఎదుటి వాని యోగ్యతను పరిశీలించి ఈయవలెను. ఇంతేగాక, ఆరు వేదాంగముల పరిజ్ఞానము గల వ్యక్తి దానమునకు అర్హుడని శ్రీశంకరులు చెప్పిరి. శిక్షా (ధ్వని విజ్ఞానము, Phonetics), కల్పమ్ (యజ్ఞములను చేయు విధానము), వ్యాకరణమ్, జ్యోతిషమ్ (ఖగోళవిజ్ఞానము మరియు గ్రహఫల విజ్ఞానము), నిరుక్తమ్ (వైదిక పదముల వ్యుత్పత్తి) మరియు ఛందస్సు అనునవి ఆరు వేదాంగములు.

ఇంతేగాక, దానమును ఉచిత దేశములో మరియు ఉచిత కాలములో చేయవలెను (దేశే కాలే చ). ఇది ధార్మిక సంస్కృతిలో భాగమై యున్నది. కురుక్షేత్రము వంటి పుణ్యక్షేత్రములలో [illegible]యు దానము మహాపుణ్యప్రదమని శ్రీశంకరులు చెప్పిరి. ఇట్టి క్షేత్రములలో పర్వదినములలో [illegible]నులు స్నానమును చేయుటకు వచ్చెదరు. కురుక్షేత్రము ఢిల్లీకి సమీపములో గలదు. అచట ఒక సరస్సు గలదు. సూర్యగ్రహణ సమయములో దాని యందు స్నానము పరమ పవిత్రమని భావించెదరు. జనులు ఆ సమయములో దానియందు పుణ్యస్నానములను చేయుచుందురు. పన్నెండు సంవత్సరములకు ఒక సారి గురువు మేషరాశిలోనికి ప్రవేశించినప్పుడు కుంభమేలా జరుగును. ఆ సమయములో లక్షల సంఖ్యలో జనులు పవిత్రస్నానములను చేయుదురు. దేవాలయముగాని, పవిత్రస్నానము చేయదగిన నది వంటి జలాశయము గాని ఉన్న స్థానమునకు పుణ్యక్షేత్రమని పేరు. జనులు అట్టి స్థానములకు తీర్థయాత్రలను చేయుచుందురు. హిమాలయములనుండి గంగ మైదానములోనికి ప్రవేశించే స్థానములో హిమవత్పర్వత శ్రేణి ఆరంభమయ్యే చోట హృషీకేశమనే పుణ్యక్షేత్రము గలదు. అదే విధముగా, హరిద్వార్, కాశీ అనునవి పుణ్యక్షేత్రములు. రెండు నదులు కలిసే సంగమ స్థానములు కూడ పుణ్యక్షేత్రములే. గంగాయమునల సంగమ స్థానమగు ప్రయాగ గొప్ప పుణ్యక్షేత్రము. కొన్ని స్థలములు మహా పురుషులతో సంబంధము కలవగుటచే పుణ్యక్షేత్రములగును. శ్రీ రాముని సంబంధముచే అయోధ్య, శ్రీ కృష్ణుని సంబంధముచే బృందావనము పుణ్యక్షేత్రములైనవి. ఇంతేగాక,

సాధుసంతుల సంబంధము వలన కొన్ని స్థలములకు ప్రజల హృదయములో పవిత్ర భావన గలదు. కొన్ని స్థలములకు పురాణములలో మాహాత్మ్య వర్ణన వలన పవిత్రత కలుగును. హిందూ సంస్కృతిలో విస్తారమగు క్షేత్రవాఙ్మయము గలదు. ఇట్టి పుణ్యక్షేత్రములన్నియు దానమునకు యోగ్యమగు దేశములే. అంతే గాదు. ఇట్టి క్షేత్రములను దర్శించు వారు తప్పని సరిగా దానములను చేయవలెను.

దానములో మరియొక ప్రముఖమగు అంశము గలదు. అది ఉచితమగు కాలము. సరియగు సమయములో సాహాయ్యమును చేయవలెను. ప్రమాదము జరిగిన ఏడు గంటల తరువాత ప్రాథమిక చికిత్సను చేయుట వ్యర్థము. ఆపదలో నున్న వ్యక్తికి వెనువెంటనే సహాయపడవలెను. చేసే దానము అవసరములను తీర్చేదిగా, ఆపద నుండి గట్టెక్కించేదిగా ఉండవలెను. ధర్మశాస్త్రము కూడ దానోచితమగు కాలములను నిర్దేశించి యున్నది. ఉత్తరాయణ పుణ్యకాలము అట్టి కాలములలో ప్రముఖమైనదని శ్రీ శంకరులు చెప్పిరి. గ్రహణ సమయము కూడ దానమునకు చాల యోగ్యమైన కాలము. సంక్రాంతి అన్నదానమునకు శ్రేష్ఠము. ఈ కాలములో కూడ జనులు ఈ నియమములను పాటించు చున్నారు.

వైదిక సంప్రదాయములో దానమునకు ప్రముఖపాత్ర గలదు. ఈనాటికీ యజ్ఞము మొదలగు సందర్భములలో అన్నము, గోవులు, భూమి, ఇళ్లు, వస్త్రములు అనునవి దానము చేయబడును. వివాహములో కన్య దానమీయబడును. దానములలో కన్యాదానము చాల గొప్పది. దానికంటె గొప్పది జ్ఞాన ప్రదానము.

ఇపుడు రాజసదానము వర్ణించబడు చున్నది.

**అధ్యాయము 17, శ్లోకము 21 :**

यत्तु प्रत्युपकारार्थं फलमुद्दिश्य वा पुनः ।
दीयते च परिक्लिष्टं तद्दानं राजसं स्मृतम् ॥ २१ ॥

యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ (21).

తు = దీనికి భిన్నముగా, యత్ = ఏ దానము, ప్రత్యుపకారార్థమ్ = తిరిగి ఉపకారమును పొందుట కొరకై, వా = లేదా, ఫలమ్ = ఫలమును, ఉద్దిశ్య = మనస్సులో

నిడుకొని, చ = మరియు, పునః = తరువాత, పరిక్లిష్టమ్ = క్లేశముతో కూడి యుండు విధముగా, దీయతే = ఈయబడుచున్నదో, తత్ = ఆ, దానమ్ = దానము, రాజసమ్ = రాజసమని, స్మృతమ్ = చెప్పబడినది.

> దీనికి భిన్నముగా ఏ దానమైతే తిరిగి ఉపకారమును పొందుట కొరకు గాని, ఫలమును మనస్సులో ఉంచుకొని గాని చేయబడునో, ఏ దానము తరువాతి కాలములో తాపమునకు హేతువు అగుచున్నదో, అట్టి దానము రాజసిక దానమనబడును (21).

భవిష్యత్తులో తిరిగి ఉపకారము లభించగలదనే అపేక్షతో చేయబడే దానము రాజసము. ఒకడు సరియగు కాలములో ఆవశ్యకత ఉన్నదని గుర్తించి దానము చేయును. కాని సమయము వచ్చినప్పుడు ప్రతిగ్రహీత తనకు ఉపకారమును చేయగలడని ఆతడు ఆశించును. అతని దానమునకు ప్రేరణ ఇదియే. ప్రతిగ్రహీత యందు కృతజ్ఞతా భావనను ఉద్బుద్ధము చేసి, ఆతడు తిరిగి తనకు ఉపకరించుననే అపేక్షతో ఈతడు దానమును చేయును. ఇది కూడా దానమే. కాని దానికి ప్రతి ఫలముగా ఉపకారమును పొందవలెననే ఆకాంక్ష ఉన్నది గనుక, దీనిని దానము అనుట కంటె పెట్టుబడి అనుట మేలు.

మరికొందరు ఫలమును మనస్సులో నుంచుకొని (ఫలం ఉద్దిశ్య) దానమును చేసెదరు. ప్రత్యుపకారమును కోరి దానమును చేయుట యనగా ఫలాపేక్షతో చేయు దానమే గదా! మరల ఈ ఫలమును వేరుగా ప్రస్తావించుటకు కారణమేమి? దీని అభిప్రాయమేమనగా, ఈ దాతకు దీర్ఘకాలికమగు యోజన గలదు. ఇచట ఫలమనగా పుణ్య రూపమగు అదృష్టఫలము. ఆతడు దానిని భవిష్యత్తులో ఈ జన్మలో గాని, లేదా మరుజన్మలో గాని అనుభవించ గోరుచున్నాడు.

ఇంతేగాక, ఈ దానమును చేయుటలో కొంత క్లేశము గలదు (పరిక్లిష్టమ్). కొందరికి దానమును చేసిన ప్రతి సందర్భములో, 'అయ్యో! నష్టపోతిమి' అను బాధ కలుగుచుండును. వారిలో యథార్థమగు దానగుణము ఉండదు. కాని లోభి అనే అపకీర్తిని పరిహరించ గోరి, వారు దానమును చేయుదురు. వారు పేరు నిలబెట్టు కొనుటకై దానమును చేయుదురు. ఈ విధముగా ఈయబడే ధనము ఆ దాతయొక్క చేతికి తుమ్మజిగురు వలె అంటి పెట్టుకొని యుండి, ఓ పట్టాన ఊడి పడదు. ఈ విధముగా క్లేశముతో ఈయబడే దానము రజోగుణ కార్యమని సుస్పష్టము. ఇపుడు మూడవ రకము దానము వర్ణించబడు చున్నది :

**అధ్యాయము 17, శ్లోకము 22 :**

अदेशकाले यद्दानमपात्रेभ्यश्च दीयते ।
असत् कृतमवज्ञातं तत्तामसमुदाहृतम् ॥ २२ ॥

అదేశకాలే యద్దానమపాత్రేభ్యశ్చ దీయతే
అసత్ కృత మవజ్ఞాతం తత్తామసముదాహృతమ్ (22)

**యత్** = ఏ, **దానమ్** = దానము, **అదేశకాలే** = అయోగ్యమగు దేశములో మరియు అయోగ్యమగు కాలములో, **చ** = మరియు, **అపాత్రేభ్యః** = అర్హులు కాని వారి కొరకు, **అసత్ కృతమ్** = అనుచితమగు రీతిలో, **అవజ్ఞాతమ్** = తిరస్కారపూర్వకముగా, **దీయతే** = ఈయబడునో, **తత్** = అది, **తామసమ్** = తామసిక దానమని, **ఉదాహృతమ్** = పిలువబడుచున్నది.

అయోగ్యమగు దేశములో, అయోగ్యమగు కాలములో, అనుచితమగు రీతిలో, తిరస్కారపూర్వకముగా, అర్హులు కాని వారికి ఈయబడే దానము తామసిక దానము అని పిలువబడును (22).

అయోగ్యమగు దేశములో మరియు అయోగ్యమగు కాలములో ఈయబడు దానము తామసదానము అగును. అయోగ్యదేశమనగా అశుచియగు దేశము. దానమునకు అయోగ్యమగు కాలము లేదు. కాని మనము సమయము మించి పోవుటకు ముందుగా సాహాయ్యము నందించవలెను. అనగా సమయము నెరింగి దానమును చేయవలెను. అనర్హులకు (అపాత్రేభ్యః) దానము నీయరాదు. అనర్హులనగా ఎవరు? ధనమును దుర్వినియోగము చేయువారు, దొంగల బారి నుండి ధనమును కాపాడు కొనలేనివారు అనర్హులని శ్రీశంకరులు వివరించిరి. ధనము యొక్క విలువ తెలియని వానికి దానము చేసినచో, వాడు ఆ ధనమును దుర్వ్యయము చేసి ఉత్తి చేతులతో మరల దానమునకు సిద్ధమగును. ఇట్టివానికి ఒకసారి దానమునిచ్చిన చాలదు. మరల మరల ఇచ్చుచుండవలెను. ఈయనిచో, అతడు దాతను నిందించి, అతనిపై కత్తి గట్టి లేనిపోని వార్తలను కల్పించి ప్రచారము చేయును. ఇట్టి దుష్టులు అసలే ఈయనివాని జోలికి పోరు. కాని రెండు మూడు పర్యాయములు ఇచ్చి నాల్గవసారి ఈయనిచో, వారి దృష్టిలో ఆ దాత దుర్మార్గుడగును. కావున, ఇట్టి వారికి ఈయరాదు. అదే విధముగా, చోరులకు, త్రాగుబోతులకు, జూదగాళ్లకు, ధనమును సద్వినియోగమును చేయుట తెలియని వారికి దానమునీయరాదు. 'నేను

రేపు గెలుచుట ఖాయము' అని జూదగాడు సర్వదా నమ్ముచుండును. జూదగాళ్లు తీసుకున్న అప్పులను తీర్చజాలరు. ఇట్టి వారికి దానమును చేయుట సరిగాదు. అట్టి దానము దానమే కాదు.

దానమును తీసుకొనే వాడు యోగ్యుడే అయిననూ, సముచిత మగు రీతిలో ఈయనిచో (అసత్కృతమ్) అది యథార్థమగు దానము కాబోదు. భారతదేశములో దానమును చేయువారు ఒక విశిష్ట ధార్మిక నియమావళిని పాటించెదరు. ఉల్లాసమునిచ్చే వచనములను పలుకుట దీనిలో భాగము. కొన్ని సందర్భములలో ప్రతిగ్రహీతను కాళ్లను కడిగి పూజించెదరు. అర్హుడగు ప్రతిగ్రహీతకు యోగ్యమగు దేశములో యోగ్యమగు కాలములో కొంత ధనమును ఇచ్చేటప్పుడు, దానిని అతని ముఖముపైకి విసిరే విధముగా ఇచ్చినచో, అది కూడ తామస దానమే యగును.

మన వద్దకు వచ్చి సాహాయ్యమును కోరిన వ్యక్తి సిగ్గు పడే విధముగా ప్రవర్తించినచో, దానికి అవజ్ఞాతమ్ అని పేరు. ఆ వ్యక్తిని అరగంట సేపు విమర్శించి దానమును చేసినచో, అది అతనికి అవమానముగా పరిణమించును. ఇట్టి విధముగా తిరస్కారబుద్ధితో అవమానకరముగా చేయు దానము అవజ్ఞాతం దానమ్ అనబడును.

శ్రద్ధావంతుడే అయిననూ శాస్త్రవిధిని పాటించకుండగా యజ్ఞమును చేయు వ్యక్తిని గురించి అర్జునుడు ప్రశ్నించెను. ఈ అధ్యాయము ఆ ప్రశ్నతో ఆరంభమైనది. ఈ గుణముల దృష్టికోణములో ఆ కర్మలను ఏమని వ్యాఖ్యానించవలెను? అవి సాత్త్వికమా, రాజసమా, లేక తామసమా? శ్రీ కృష్ణుడు ఆ ప్రశ్నకు ఇప్పుడు సమాధానమును చెప్పుచున్నాడు.

శ్రద్ధ గల వ్యక్తి శాస్త్ర విధులను పూర్ణముగా పాటించక పోయిననూ కర్మను చేయుటకు ముందు మరియు వెనుక ఓం తత్ సత్ అని ఉచ్చరించి కర్మను చేసినచో, ఆ కర్మ సాత్త్వికమే యగును. అజ్ఞానముచే గాని, కంగారు వలన గాని, మనస్సునకు విక్షేపము కలుగుట వలన గాని, కొన్ని ద్రవ్యములు దొరకకపోవుట వలన గాని కర్మలో ఏదో ఒక లోపము ఉండవచ్చును. కాని ఓం తత్ సత్ అని ఉచ్చరించుట వలన ఆ దోషము సర్దుబాటు అగును. ఈ పదములను కర్మకు ముందు వెనుకలలో ఉచ్చరించినచో, ఆ కర్మ సంపూర్ణమగును. ఈ విషయము మనకు ఎట్లు తెలియును? కేవలము శాస్త్రము వలన మాత్రమే. ఓం తత్ సత్ అని ఉచ్చరించుటచే కర్మ సఫలమగును. మనము పూజను చేయునప్పుడు వస్త్రములు ఆభరణములు ఇత్యాదుల స్థానములో అక్షతలను సమర్పించుచున్నాము. ఇతరమానవులతో వ్యవహరించునప్పుడు ఈ పద్ధతి ఎన్నటికీ అంగీకారము కాదు. కాని పూజ మొదలగు కర్మలలో మనకు ఇట్టి వికల్పములు గలవు. ఓం

తత్ సత్ అని ఉచ్చరించుట వలన కర్మలోని లోటు పాట్లు అన్నియు సర్దుబాటు అగును. ఈ శ్లోకములో సూచన ప్రాయముగా చెప్పబడిన పూర్ణవాక్యము ఇట్లు ఉన్నది: ఓం తత్ సత్ ఈశ్వరార్పణం అస్తు. అనగా, ఓం తత్ సత్ అగు ఈశ్వరునకు ఇది సమర్పణమగు గాక! వైదిక కర్మలకు ఆరంభము నందు మరియు అంతములో జనులు సర్వసాధారణముగా ఓం తత్ సత్ అని ఉచ్చరించెదరు. అట్లు ఉచ్చరించుట వలన ఆ కర్మ సాత్త్వికమై ఉత్తమ ఫలమునిచ్చును.

**అధ్యాయము 17, శ్లోకము 23 :**

ओं तत् सदिति निर्देशो ब्रह्मणस्त्रिविधः स्मृतः ।
ब्राह्मणास्तेन वेदाश्च यज्ञाश्च विहिताः पुरा ॥ २३ ॥

ఓం తత్ సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా (23)

**బ్రహ్మణః** = బ్రహ్మకు, **ఓం తత్ సత్ ఇతి** = ఓం తత్ సత్ అని, **త్రివిధః** = మూడు విధముల, **నిర్దేశః** = వాచక పదము, **స్మృతః** = చెప్పబడినది, **తేన** = దాని చేత, **పురా** =సృష్ట్యాది యందు, **బ్రాహ్మణాః** = బ్రాహ్మణులు, **చ** = మరియు, **వేదాః** = వేదములు, **చ** = మరియు, **యజ్ఞాః** = యజ్ఞములు, **విహితాః** = సృష్టించబడినవి.

> బ్రహ్మను నిర్దేశించుటకు ఓం తత్ సత్ అను మూడు పదములు మహర్షులచే స్వీకరించబడినవి. సృష్ట్యాదిలో వీటిచే బ్రాహ్మణులు, వేదములు మరియు యజ్ఞములు సృష్టించబడినవి (23).

నిర్దేశమనగా అర్థవంతమగు పదము, అనగా ఒక వస్తువును బోధించే పదము. వేదాంత శాస్త్రమునందు మరియు వేదాంతశాస్త్రము తెలిసిన వారి చేత ఓం తత్ సత్ అనే మూడు పదములు నిర్దేశించబడినవి (త్రివిధః నిర్దేశః స్మృతః). నిర్దేశమేదైనా ఒక వస్తువు (నిర్దేశ్యము)ను బోధించును. అది యేది? ఓం తత్ సత్ అనే ఈ మూడు పదములు బ్రహ్మను నిర్దేశించును. తత్ అను పదము బ్రహ్మను నిర్దేశించును. దీనికి తత్త్వమసి అను వాక్యము (ఛాందోగ్యోపనిషత్) దృష్టాంతము. ఓం కూడా బ్రహ్మను నిర్దేశించును. ఓం ఇతి బ్రహ్మ (తైత్తిరీయోపనిషత్), ఓం ఇతి ఏతత్ అక్షరం ఇదం సర్వమ్ (మాండూక్యోపనిషత్) అను వాక్యములు దీనికి దృష్టాంతములు. సత్ అను పదము సదేవ సోమ్య ఇదం అగ్ర ఆసీత్ ఏకమేవ అద్వితీయమ్ అనే

ఛాందోగ్యోపనిషద్వాక్యములో సర్వజగత్కారణమగు బ్రహ్మను నిర్దేశించు చున్నది. ఈ త్రివిధ నిర్దేశము నుండి బ్రాహ్మణులు, వేదములు మరియు యజ్ఞములు సృష్టించబడినవి. ఇచట బ్రాహ్మణ శబ్దము వేదోక్తమగు నాల్గు వర్ణముల వారికి ఉపలక్షకము. లేదా, ఆ పదము వేదాః అను పదమునకు విశేషణమై, బ్రాహ్మణములనబడే వేదములు అను అర్థము వచ్చును. వీటిలో నాల్గు వేదములు అంతర్గతములగును. సర్వవేదములు ఓంకారముతో ఆరంభమగును. వేదవిహితములైన అగ్నిహోత్రాది కర్మలే గాక, భగవంతుని ఆరాధించే సర్వవిధముల పూజలు యజ్ఞములనబడును. ఈ బ్రాహ్మణులు, యజ్ఞములు మరియు వేదములు అనే సర్వము ఓం తత్ సత్ అను త్రివిధ నిర్దేశముచే సృష్టింపబడెను. అనగా బ్రహ్మగారు ఈ శబ్దములనుచ్చరించి సర్వమును సృష్టించెను. సృష్ట్యాది యందు (పురా) బ్రహ్మగారి నోటినుండి ఈ పదములు బహిర్గతమైనవి. తరువాత సర్వము సృష్టించబడె ను. కావున వీటికి అత్యధిక ప్రాముఖ్యము వచ్చినది. వాటిని ఉచ్చరించినంత మాత్రాన ఒక శక్తి ఉదయించి కర్మానుష్ఠానములో ఒక అంగమును తప్పుగా ఆచరించినప్పుడు, లేదా విస్మరించినప్పుడు కలిగే దోషమును సర్దుబాటు చేయును. ఓం తత్ సత్ ఉచ్చారణ యొక్క ఫలోత్పాదన సామర్థ్యమునందు మనకు శ్రద్ధ ఉండవలెను. మనము శ్రద్ధ లేకుండగా కేవల-ఉచ్చారణ-మాత్రమును చేసినచో, అది వ్యర్థము.

తరువాత భగవానుడు ఈ మూడు పదములను విడివిడిగా వివరించబోవు చున్నాడు. ముందు ఓం కారము.

**అధ్యాయము 17, శ్లోకము 24 :**

तस्मादोमित्युदाहृत्य यज्ञदानतपः क्रियाः ।
प्रवर्तंते विधानोक्तास्सततं ब्रह्मवादिनाम् ॥ २४ ॥

తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపః క్రియాః
ప్రవర్తంతే విధానోక్తాస్సతతం బ్రహ్మవాదినామ్ (24)

**తస్మాత్** = అందువలన, **బ్రహ్మవాదినామ్** = వేదవేత్తల యొక్క, **విధానోక్తాః** = వేదవిధులచే చెప్పబడిన, **యజ్ఞదానతపః క్రియాః** = యజ్ఞము, దానము, తపస్సు అనే కర్మలు, **సతతమ్** = సర్వకాలములలో, **ఓమ్** = ఓమ్, **ఇతి** = అని, **ఉదాహృత్య** = ఉచ్చరించి, **ప్రవర్తంతే** = ఆరంభమగును.

అందువలన వేదవేత్తలు చేసే వేద విధులచే చెప్పబడిన యజ్ఞ దానతపోరూప కర్మలు సర్వకాలములలో ఓం కారమునుచ్చరించుటతో ఆరంభమగును (24).

ఋత్విక్కులు ఓంకారమును ఉచ్చరించిన తరువాత మాత్రమే వైదిక కర్మల నారంభించెదరు. అంతే గాక, వైదిక కర్మ కొనసాగే సమయములో కూడ ఓం కారము పదే పదే ఉచ్చరించబడును (ఓమితి బ్రహ్మ, ఓమితీదగ్ం సర్వమ్, ఓమిత్యేతదనుకృతి హ స్మ వా అప్యోశ్రావయేత్యాశ్రావయంతి, ఓమితి సామాని గాయంతి, తైత్తిరీయోప నిషద్ 1-8-1). వివిధ రకముల దానములను ఓం కారమునుచ్చరించి చేసినచో, అవి ఫలదాన సమర్థములగును. దానము మూడు విధములుగా నున్నదని మనము చూచి యున్నాము. కాని ఇచట చెప్పబడేది సాత్త్వికదానము మాత్రమే. ఓంకారమును ఉచ్చరించినంత మాత్రాన రాజస, తామస దానములకు ఉత్కర్ష కలుగదు. కాయిక వాచిక మానసికములనే మూడు రకముల తపస్సును ఓంకారముతో ఆరంభించి చేయుట శ్రేష్ఠము. యథాశాస్త్రముగా (విధానోక్తాః) ఈ తపస్సులను చేసినచో, ఎట్టి ఫలము లభించునో, ఓంకారోచ్చారణ పూర్వకముగా చేసినచో, అంతటి మహాఫలము లభించును. ఓం కారమునుచ్చరించి చేయబడే తపస్సులు ఫలము నిచ్చునది ఎవరికి? వేదములను పఠించి, వాటి అర్థమును తెలిసే అర్హత గల బ్రహ్మవాదులకు ఈ ఫలము లభించును. వేద వేత్తలు శాస్త్రోక్త విధానముతో చేసే యజ్ఞతపస్సులకు ఎంతటి ఉత్కర్ష కలదో, ఓంకారోచ్చారణ పూర్వకముగా చేయబడే యజ్ఞ దాన తపస్సులకు అంతటి ఉత్కర్ష గలదు. వారు ఓం కారమును ఏయే సమయములలో ఉచ్చరించెదరు? అప్పుడప్పుడు కాదు. సర్వదా (సతతమ్) ఉచ్చరించెదరు. కొన్ని కర్మలు ఓంకారముతో ఆరంభమై, మరికొన్ని అట్లు ఆరంభము కావనుకోరాదు. సర్వమంత్రములు మరియు సకల-ఆరాధనలు ఓంకారముతో ఆరంభమగును. అదే విధముగా, సకల యజ్ఞములు, దానములు మరియు తపస్సులు ఓంకారముతో ఆరంభమగును. ఎందువలన? ఓంకారము సర్వమును పవిత్రము చేయును. పరమ పవిత్రమగు ఓంకారము నుచ్చరించి చేసినచో, మనము చేయు కర్మ పరిపూర్ణమగును.

తత్ అను పదము విషయములో కూడ పరిస్థితి ఇంతే.

**అధ్యాయము 17, శ్లోకము 25 :**

तदित्यनभिसंधाय फलं यज्ञ तपः क्रियाः
दानक्रियाश्च विविधाः क्रियंते मोक्षकांक्षिभिः ॥ २५ ॥

తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞ తపః క్రియాః
దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః (25).

**తత్ ఇతి** = తత్ అని పలికి, **ఫలమ్** = ఫలమును, **అనభి సంధాయ** = (అంతః కరణశుద్ధి కంటె భిన్నమైన ఫలమును) అపేక్షించకుండగా, **యజ్ఞతపః క్రియాః** = యజ్ఞములు, తపస్సులు (ధార్మిక - అనుశాసనములు) అనే క్రియలు, **చ** = మరియు, **వివిధాః** = పలువిధములు, **దానక్రియాః** = దానక్రియలు, **మోక్షకాంక్షిభిః** = మోక్షమును గోరువారిచే, **క్రియంతే** = చేయబడుచున్నవి.

మోక్షమును కోరువారు అంతఃకరణశుద్ధి కంటె భిన్నమైన ఫలమును అపేక్షించకుండగా యజ్ఞములు, తపస్సులు (ధార్మిక - అనుశాసనములు) మరియు దానములు అనే వివిధ క్రియలను 'తత్' అని ఉచ్చరించి చేయుదురు (25).

పూర్వశ్లోకమునుండి ఉదాహృత్య (ఉచ్చరించి) అను పదమును ఈ శ్లోకములోనికి అధ్యాహారము చేయవలెను. తత్ అనే సర్వనామము దేనినైననూ నిర్దేశించ వచ్చును. కాని పరామర్శించదగిన నామవాచకము లేని సందర్భములలో అది సర్వకారణమగు పరం బ్రహ్మను మాత్రమే నిర్దేశించును. తత్త్వమసి వాక్యములోని తత్ దీనికి దృష్టాంతము. ఓంకారము వలె తత్ కూడా పరం బ్రహ్మకు శబ్దప్రతీక యగు చున్నది. శ్రద్ధతో దానిని ఆ అర్థములో ఉచ్చరించు వారికి అది ఓంకారముతో సమానమగు ఫలమునిచ్చును. ఓంకారము, తత్ అనునవి ముముక్షువులకొరకు ఉద్దేశింపబడినవి. సంసారము నుండి విముక్తిని గోరువారు (మోక్షకాంక్షిభిః) వీటిని ఉచ్చరించెదరు. యజ్ఞములు, ధార్మిక-అను శాసనములు (తపస్), దాన ధర్మములు (దాన క్రియాః) ఇత్యాది వివిధ కర్మలను (వివిధాః క్రియాః) వారు పుణ్యము మొదలగు ఫలముల యందు తృష్ణ లేనివారై (అనభిసంధాయ ఫలమ్) అనుష్ఠించెదరు. ఫలాపేక్ష లేకుండగా ఎవ్వరైననూ కర్మను చేయజాలరు. కాని వారు అపేక్షించే కేవల-అంతః కరణ-శుద్ధి ఫలములోనికి లెక్కరాదు. వారి లక్ష్యము పుణ్యము మొదలగు ఫలములు కావు. వారు ఈశ్వరుని ప్రీతి కొరకు (ఈశ్వరప్రీత్యర్థే) కేవలము అంతఃకరణ శుద్ధిని మాత్రమే అపేక్షించి ఈ కర్మలను అనుష్ఠించెదరు. మోక్షకాములగు ఈ సాధకులు ఈ పవిత్రపదములనుచ్చరించి ఆయా కర్మల నారంభించెదరు. సాధారణముగా తత్ అను పదమును మాత్రమే గాక, ఓం తత్ సత్ అను మూడు పదములను కలిపి ఉచ్చరించెదరు. కర్మను అరంభించుటకు ముందు ఈ మూడు పదములను గాక కేవలము

ఓంకారమును మాత్రమే ఉచ్చరించెదరు. కాని వీటిలో ప్రతి పదమునకు సమానమగు మహత్త్వము గలదని ఇచట చెప్పబడుచున్నది. వీటిని ఉచ్చరించి చేసే యజ్ఞతపోదానవములనే కర్మలు సాత్త్వికములగును.

ఓం, తత్ అను పదముల వినియోగము చెప్పబడినది. సత్ అను పదము కూడ అదే విధముగా వినియోగించబడును. భగవానుడు ఇపుడా విషయమును చెప్పబోవు చున్నాడు :

**అధ్యాయము 17, శ్లోకము 26 :**

सद्भावे साधुभावे च सदित्येतत् प्रयुज्यते ।
प्रशस्ते कर्मणि तथा सच्छब्दः पार्थ युज्यते ॥ २६ ॥

సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే (26).

**సత్** = సత్, **ఇతి** = అనే, **ఏతత్** = ఈ పదము, **సద్భావే** = ఉనికిని కలిగించుట అను అర్థమునందు, **చ** = మరియు, **సాధుభావే** = పవిత్ర జీవనము అనే అర్థమునందు, **ప్రయుజ్యతే** = ప్రయోగింపబడు చున్నది, **తథా** = అదే విధముగా, **పార్థ** = పృథాకుమారా, ఓ అర్జునా!, **సచ్ఛబ్దః** = సత్ అను పదము, **ప్రశస్తే** = శ్రేష్ఠమగు, **కర్మణి** = కర్మ అను అర్థమునందు, **యుజ్యతే** = ప్రయోగింపబడు చున్నది.

> పృథాకుమారుడవగు ఓ అర్జునా! ఉనికిని కలిగించుట, పవిత్రమగు జీవితము, మరియు శ్రేష్ఠమగు కర్మ అనే అర్థములలో ఈ 'సత్' అను పదము ప్రయోగింపబడు చున్నది (26).

సత్ అను పదమునకు అనేకార్థములు గలవు. ఈ అర్థములన్నియు పవిత్రమైనవియే. పూర్వములో లేని వస్తువునకు ఇప్పుడు ఉనికిని ప్రసాదించుట సద్భావమనబడును. దీనికి పుత్రుడు జన్మించుట అనునది శ్రీ శంకరులచే దృష్టాంతముగా నీయబడినది. ఒక వ్యక్తికి అంతకు ముందు లేని పుత్రసంతానము ఇప్పుడు కలిగినది. ఆ పుత్రుని నిర్దేశించుటకు సచ్ఛబ్దము ప్రయోగించబడును. ఇప్పుడు పుత్రుడు 'ఉన్నాడు'. ఉనికి గల పదార్థములన్నిటి యందు సచ్ఛబ్దము ప్రయోగించబడును. ఘటము ఉన్నది (ఘటః సన్), వస్త్రము ఉన్నది (పటః సన్).

వాస్తవములో ఒకే ఒక ఉనికి గలదు. అదియే పరమేశ్వరుడు. కావున, ఉనికి అనే అర్థములో ప్రయోగింపబడే ఈ 'సత్' పావనమగు చున్నది. ఘటము ఉన్నది, వస్త్రము ఉన్నది ఇత్యాది ప్రయోగములలో కానవచ్చే 'ఉనికి' (సత్) పరం బ్రహ్మయే.

ధర్మమునకు అనురూపముగా ఉండే పవిత్రజీవనమునకు సాధు భావమని పేరు. ధర్మమును అనుష్ఠించు వానిని సదాచారుడు, లేక సత్పురుషుడు అందురు. ఇట్టి వారి సన్నిధిలో నున్నచో దానికి సత్సంగమని పేరు. ధర్మ జీవనమును గడుపు వాడు, మరియు సద్వస్తువును తెలుసుకున్న వాడు సత్పురుషులనబడుదురు. ఆ అర్థములో కూడ సచ్ఛబ్దము ప్రయోగించబడును (ప్రయుజ్యతే). శ్రేష్ఠమగు కర్మ అను అర్థములో కూడ (ప్రశస్తే కర్మణి) ఈ శబ్దము ప్రయోగించబడు చున్నది. శ్రీ శంకరులు దానికి వివాహమును దృష్టాంతముగా నిచ్చిరి. వివాహము మరియు ఉపనయనము సత్కర్మలుగా పరిగణించ బడినవి. జీవితములోని ప్రధానమైన ఘట్టములకు పవిత్రతను ఆపాదించే ప్రముఖమగు కర్మ ఏదైనా సత్కర్మ యనబడును.

**అధ్యాయము 17, శ్లోకము 27 :**

यज्ञे तपसि दाने च स्थितिस्सदिति चोच्यते ।
कर्म चैव तदर्थीयं सदित्येवाभिधीयते ॥ २७ ॥

యజ్ఞే తపసి దానే చ స్థితిస్సదితి చోచ్యతే
కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే (27).

చ = మరియు, యజ్ఞే = యజ్ఞమునందు, తపసి = తపస్సునందు, చ = మరియు, దానే = దానమునందు, స్థితిః = ఉండుట, సత్ = సత్, ఇతి = అని, ఉచ్యతే= చెప్పబడుచున్నది, చ = మరియు, తదర్థీయమ్ = వాటి కొరకు (లేదా ఈశ్వరుని కొరకు) చేసే, కర్మ = కర్మ, ఏవ = నిశ్చయముగా, సత్ = సత్, ఇతి ఏవ = అనియే, అభిధీయతే = చెప్పబడుచున్నది.

యజ్ఞదానతపస్సులయందు ప్రయత్న శీలియై ఉండుట సత్ అనబడును.
వాటి కొరకు, లేదా ఈశ్వరుని కొరకు చేయబడే కర్మ కూడ సత్ అనియే
చెప్పబడును (27).

ఇచట స్థితిః అనగా స్థిరముగా నుండుట, లేదా నడుము కట్టి యుండుట. ఒక యజ్ఞమును, లేదా ధార్మిక-అనుశాసనము (తపస్సు)ను లేదా దానమును చేయుట యందు గల కటిబద్ధతకు సత్ అని పేరు. ఇవి తప్పక చేయదగిన కర్మలు. కాని వీటిని సముచితమగు మనః ప్రవృత్తితో మరియు శ్రద్ధతో చేయవలెను. ఇంతేగాక, వీటిని సంపాదించుటకై చేసే కర్మ కూడ 'సత్' అనియే పిలువబడును. 'తదర్థీయమ్' అను పదమునకు 'ఈశ్వరుని కొరకు' అని కూడ అర్థమును చెప్పవచ్చును. పరమేశ్వరార్పణ బుద్ధితో చేయబడే కర్మ ఏదైనా సత్కర్మ యనబడును. ధర్మాను రూపముగా చేయబడే లౌకిక కర్మ కూడా సత్కర్మయే యగును. ధర్మము పరమేశ్వర స్వరూపమే గనుక, ధర్మానురూపముగా చేయబడే క్రియాకలాపమంతయు సహజముగా ఈశ్వరార్పిత కర్మ యగును. అట్టి కర్మయే సత్కర్మ.

మనము చేయుచున్న కర్మ సాత్త్వికము కాకపోయిననూ, ఓం తత్ సత్ అను మూడు పదములను ఉచ్చరించి శ్రద్ధాపూర్వకముగా చేసినచో, అది పరిపూర్ణము మరియు సాత్త్వికము అగునని శ్రీ శంకరులు వివరించిరి. దానిలో లోటుపాట్లన్నియు సర్దుబాటు అగును. ఒకప్పుడు సరియగు మనః ప్రవృత్తి లేక పోవుటచే, చేసే కర్మ అసాత్త్వికమగును. కొన్ని కర్మలలో అంగవైకల్యము ఏర్పడవచ్చును; లేదా, తప్పులు జరిగియుండవచ్చును. ఇట్టి దోషముల నన్నింటినీ ఓం తత్ సత్ సర్దుబాటు చేయును. కాని, శ్రద్ధ లేకుండగా ఓం తత్ సత్ అని ఉచ్చరించిననూ ప్రయోజనము ఉండబోదని శ్రీశంకరులు అంతిమముగా హెచ్చరించిరి. కావున దీనిలో శ్రద్ధ అత్యంత ప్రముఖమైన అంశము. అది సరిగా నున్నచో, కర్మను సాత్త్వికముగా తీర్చిదిద్దే శక్తి దానికి గలదు. దీనితో అర్జునుని ప్రశ్నకు సమాధానము లభించినది. ఈ కర్మలన్నియు కర్తయొక్క శ్రద్ధకు అనుగుణముగా ఫలముల నొసంగును. వాటి యందు ఫలప్రదాన సామర్థ్యము శ్రద్ధవలననే కలుగును. కావున, శ్రద్ధ వలన సర్వము సుసంపన్న మగును.

కావున,

**అధ్యాయము 17, శ్లోకము 28 :**

अश्रद्धया हुतं दत्तं तपस्तप्तं कृतं च यत् ।
असदित्युच्यते पार्थ न च तत् प्रेत्य नो इह ॥ २८ ॥

అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ ప్రేత్య నో ఇహ (28)

పార్థ = ఓ అర్జునా! యత్ = ఏది, అశ్రద్ధయా = శ్రద్ధ లేకుండగా, హుతమ్ = హోమము చేయబడినదో, దత్తమ్ = దానమీయబడినదో, చ = మరియు, తపః = తపస్సు, తప్తమ్ = చేయబడినదో, తత్ = అది, అసత్ = అసత్, ఇతి = అని, ఉచ్యతే = చెప్పబడుచున్నది, తత్ = అది, న ప్రేత్య = మరణించిన పిదప (ఫలమునీయదు), చ = మరియు, ఇహ = ఈ లోకములో, న = ఫలము నీయదు, ఉ = నిశ్చయము.

> ఓ అర్జునా! శ్రద్ధ లేకుండగా చేయబడే హోమము దానము మరియు తపస్సులకు అసత్ అని పేరు. వీటికి ఇహలోకములో గాని పరలోకములో గాని సత్ఫలము లభించదు (28).

మనము చేసే దానమును శ్రద్ధతో చేయవలెను, అశ్రద్ధతో చేయరాదు (శ్రద్ధయా దేయమ్, అశ్రద్ధయా అదేయమ్) అని తైత్తిరీయోపనిషత్తు చెప్పుచున్నది. శ్రద్ధ లేకుండగా చేయబడే దానము, మరియు ధార్మిక - అనుశాసనము అసత్ అనబడును. బ్రహ్మ లేదని తలంచువాడు తానే స్వయముగా లేనివాడు (అసన్నేవ స భవతి, అసద్బ్రహ్మేతి వేద చేత్) అని అదే ఉపనిషత్తులో తరువాత చెప్పబడినది. పరమేశ్వరుని అస్తిత్వము నందు, మరియు శాస్త్రవచనముల యందు శ్రద్ధ లేకుండగా ఈ కర్మలను చేసిననూ, చేసినట్లు లెక్కలోనికి రాదు (అసత్). అగ్నిహోత్రములో నేతిని హోమము చేస్తూ, 'దీనిని నిప్పులలో పోసి నేను వ్యర్థము చేయుచున్నాను; దీనిని బీదలకు పంచినచో సద్వినియోగమయ్యెడిది' అని భావించినచో, ఆ హోమము వ్యర్థము. కొన్ని కేజీల నేతిని నిప్పులలో బూదిద చేయుటకు బదులుగా, దానిని బీదలకు పంచిపెట్టదగునని కొందరు జనులు వాదించెదరు. కాని సాధారణముగా నేతిని అంత అధిక పరిణామములో హోమము చేయరు. మరియు, ఆ హోమము ఉన్నవారికి, లేని వారికి కూడ హితకారియగును. ఈ సత్యము తెలియనిచో, ఇట్టి వాదములు వ్యక్తిలోని శ్రద్ధకు విఘాతమును కలిగించును. శ్రద్ధ లేని హోమము వ్యర్థమగును. కొందరు ధర్మ బుద్ధి గలవారగుటచే దానమును చేయుదురు. కొందరు ఇతరుల మాటను కాదనలేక దానమును చేయుదురు. తల్లిదండ్రుల మాటను కాదనలేక, కొందరు వేదవిహితములగు కర్మలను చేయుదురు. కొందరు సమాజములో పేరు ప్రతిష్ఠలు అను అంశముచే ప్రేరితులై దానములను చేయుదురు. 'నేనీ దానమును చేయనిచో, జనులు ఏమని తలపోయుదురు?' అని భావించి, మంచి పేరును పొందగోరి, లేదా చెడ్డపేరు వచ్చునేమో యను భయముతో కొందరు దానధర్మములను చేయుచుందురు. కొందరు మనస్సులో నాస్తికులైననూ, ఆస్తికుడనే మాన్యతను గోరి

దానధర్మములను చేయుచుందురు. కొందరు శ్రద్ధ లేకుండగనే ధనమును ఇచ్చుచుందురు. కొందరు శ్రద్ధ లేకున్ననూ పేరు ప్రతిష్ఠల కొరకై తపస్సును చేయుదురు. అదే విధముగా కొందరికి హృదయములో శ్రద్ధ లేకున్ననూ, ఒక సంప్రదాయమునకు అలవాటు పడి యుండుటచే ఈశ్వరస్తుతి, నమస్కారము మొదలగు కర్మలను చేయుచుందురు. ఇట్టి కర్మలు అన్నియు అసత్ అగును. వాటి వలన పుణ్యము లభించదు. అవి చేయనట్లుగనే పరిగణించబడును.

ఈ కర్మలు ఏమియూ ఈశ్వరప్రాప్తికి సాధనములు కావని శ్రీ శంకరులు వివరించిరి. శ్రద్ధతో చేయబడిన కర్మలు మనకు అంతఃకరణశుద్ధి లభించుటలో సహకరించును. ఆ విధముగా సంసిద్ధమైన మనస్సు గలవానికి జీవేశ్వర-అభేదము సాక్షాత్కరించును. ఆ జ్ఞానముచే ఈశ్వరుడు పొందబడును. జ్ఞానము ఉదయించవలసిన మనస్సు పరిశుద్ధముగా నుండవలెను. జ్ఞానము అంతః కరణ శుద్ధిపై ఆధారపడును. కర్మను యోగ్యమగు మానసిక ప్రవృత్తితో ఆచరించినచో, అంతః కరణశుద్ధి సిద్ధించును. శ్రద్ధ లేకుండగా చేయబడే కర్మ వ్యర్థము. కావున, శ్రద్ధ అతి ప్రముఖమైనది. జ్ఞాన ప్రాప్తిలో శ్రద్ధకు అతిశయించిన ప్రాముఖ్యము గలదు. శ్రద్ధ గలవాడు జ్ఞానమును పొందును (శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్) అని మనము చూచి యున్నాము. ఈ కర్మలన్నింటి యందు ప్రయత్నము అధికముగనే యున్ననూ, శ్రద్ధ లేనిచో దేహత్యాగానంతరము వాటి వలన లభించే ఫలము శూన్యము. పైగా హోమాదులలో సమర్పించబడిన ద్రవ్యములు కూడ వ్యర్థమగును. ఈ లోకములో గాని, పరలోకములో గాని ఇట్టి కర్మలకు ఫలము లేదని మనమెట్లు చెప్పగలము? ఇట్టి కర్మలను సాధువులు నిందించి యుండుటచే (సాధుభిః నిందితత్వాత్) మనము అట్లు చెప్పగల్గుచున్నాము. సాధువులనగా శాస్త్రము తెలిసిన వారు. ఇట్టి కర్మలు యథాశాస్త్రముగా శ్రద్ధాపూర్వకముగా చేయబడుట లేదు గనుక, ఇవి నిరర్థకములని సాధువులు చెప్పుచున్నారు.

అర్జునుడు తన కర్తవ్యమును చేయవలెనని భగవానుడు నొక్కి చెప్పినాడు. ఆ కర్మయేది? యుద్ధము. శ్రీకృష్ణ భగవానుడు రెండవ అధ్యాయములో 'కావున యుద్ధమునకు సంసిద్ధుడవు కమ్ము (తతో యుద్ధాయ యుజ్యస్వ)' అని చెప్పి యున్నాడు. సాధకుడు స్వధర్మమును సముచితమగు మనః ప్రవృత్తితో అనుష్ఠించినచో, దాని వలన అంతః కరణ శుద్ధి సిద్ధించి, తద్ద్వారా జీవ-ఈశ్వరులకు తత్త్వములో గల అభేదము యొక్క సాక్షాత్కారము సంభవమగును.

దీనిని బట్టి మనకు ఒక విషయము స్పష్టమగుచున్నది. గీతయనగా అర్జునునకు ఉత్సాహమును కలిగించి, లేచి నిలబడి యుద్ధమును చేయునటుల చేసే ప్రోత్సాహక ప్రసంగము

కాదు. గీత బ్రహ్మ జ్ఞానమును బోధించే శాస్త్రము. ఆ బ్రహ్మజ్ఞానము ఉదయించుటకు ఆవశ్యకమగు కర్మయోగమును కూడ గీత విస్తారముగా వర్ణించుచున్నది. అనగా, జీవన మూల్యములు, మానసిక ప్రవృత్తులు, కర్తవ్య-అకర్తవ్యములు ఇత్యాది విషయములను గీత నిరూపించును.

ఓం తత్ సత్. ఉపనిషత్తుల సారము, బ్రహ్మజ్ఞానము మరియు కర్మయోగము విషయవస్తువులుగా గలది, శ్రీకృష్ణార్జున సంవాద రూపము అగు భగవద్గీతలో త్రివిధ శ్రద్ధను ప్రముఖముగా నిరూపించే శ్రద్ధాత్రయ విభాగయోగమనే పదనేడవ అధ్యాయము ముగిసినది.

శ్రీకృష్ణార్పణమస్తు.

# పదునెనిమిదవ అధ్యాయము

## మోక్ష సన్న్యాస యోగము

ఇది పెద్ద అధ్యాయము. దీనిలో కొత్త సంగతులు ఏమియూ చెప్పబడ లేదు. గీతా శాస్త్రములో వివిధ-అధ్యాయములలో ఇంతకు ముందు చెప్పబడిన విభిన్న విషయములపై మరికొంత విస్తృతమగు నిరూపణము దీనియందు కానవచ్చును. కావున, శ్రీశంకరులు పద్దెనిమిదవ అధ్యాయమును ఉపక్రమిస్తూ ఇట్లు సెలవిచ్చిరి : గీతాశాస్త్రమునంతనూ ఈ అధ్యాయములో ఉపసంహరించి, వేదముల తాత్పర్యమును ప్రతి పాదించ వలసి యున్నది. ఈ ప్రయోజనము కొరకు మాత్రమే ఈ అధ్యాయము ఆరంభింపబడుచున్నది. వేదమునకు, గీతాశాస్త్రమునకు విషయవస్తువు ఒక్కటియే. ఈ విషయవస్తువు ద్వివిధముగా నున్నది. మొదటిది బ్రహ్మ విద్య; అనగా జీవేశ్వరుల అభేదమును చెప్పే తత్త్వమసి మహావాక్యమును తెలుసుకొనుట. రెండవది యోగము; అనగా వ్యక్తి తనను తాను బ్రహ్మవిద్యకు సజ్జీతము చేసుకొనే సాధనము. సముచితమగు మనః ప్రవృత్తితో భక్తి పూర్వకముగా చేయబడే ధర్మానురూపమగు కర్మలు అన్నీ యోగములో అంతర్భాగమే యగును. త్యాగమయ జీవితమగు సన్న్యాసము కూడ యోగములోనిదే యగును.

మోక్షసాధనలో రెండు జీవనశైలులు గలవు. ఒకటి త్యాగమయ జీవితమగు సన్న్యాసము. రెండవది కర్మ ప్రధానమగు జీవనము. కాని సరియగు మనః ప్రవృత్తి లేని కర్మమయజీవనము మోక్షహేతువు కాజాలదు. కర్మను అందరు జేయుదురు. కర్మయోగియొక్క మనః ప్రవృత్తితో చేయబడే కర్మ మాత్రమే మోక్షమునకు దారిని సుగమము చేయును. ఈ విషయమును మనమిదివరలో చూచి యున్నాము. ఈ మనః ప్రవృత్తియే భక్తి. దృఢమగు ముముక్షుత్వము మరియు ఈశ్వరుని యందలి భక్తి కర్మయోగికి మాత్రమే గాక, సన్న్యాసికి కూడ అత్యావశ్యకము.

ఫలమును గోరి కర్మను చేయు ప్రతి వ్యక్తి ఆ కర్మఫలమును తనకు అనుగ్రహించుమని పరమేశ్వరుని ప్రార్థించును. అట్టి వారి యందు కూడ భక్తి గలదు. ఈశ్వరుని గుర్తించిన ప్రతి వారియందు సామాన్యముగా భక్తి ఉండును. కాని ఎవనికి మోక్షము లక్ష్యము కాదో, వాడు ఈశ్వరుని అడ్డుగా పెట్టుకొని సాంసారికములగు ప్రయోజనములను పొందగోరు చుండును. ధనము, లేక అధికారమును కాంక్షించువాడు తన ప్రయత్నములో భాగముగా కొద్దో గొప్పో

భగవంతుని సాహాయ్యమును కూడ అర్థించును. వారు ప్రార్థించేది ఈశ్వరుడినే అయినా, ఆ ప్రార్థనలకు లక్ష్యము ఈశ్వరుడు కాదు. ఈ పరిస్థితిని బట్టి వారికి పురుషార్థము అను విషయములో భ్రాంతి, లేక సమ్మోహము ఉన్నదని మనకు స్పష్టమగుచున్నది. అర్థకామములే జీవితములో ప్రధానలక్ష్యములుగా గలవారికి వాటిని సంపాదించుకొనుటలో ఈశ్వరుని సాహాయ్యము అపేక్షితమగుటలో ఆశ్చర్యము లేదు. ఈ రకము భక్తిని గురించి శ్రీకృష్ణుడు ఇట్లు చెప్పియున్నాడు : మానవులు అందరు అనుసరించేది నా మార్గమే. కాని వారికి ఆ సంగతి తెలియక పోవుటచే అల్పమగు ఫలములను గోరి ఇతర దేవతలను ఆరాధించు చున్నారు (మమ వర్త్మ అను వర్తంతే మనుష్యాః పార్థ సర్వశః, కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః, క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా 4-11, 4-12). కష్టము వచ్చినప్పుడల్లా చేతులను పైకెత్తి, 'ఓ భగవాన్! దయచేసి నాకు సాహాయ్యమును చేయుము; నీవు ఎక్కడ ఉన్నావు?' అని మొరపెట్టు కొనే భక్తుడు ఆర్తభక్తుడనబడునని మనము చూచి యున్నాము. తాను కోరే వస్తువును పొందుట కొరకై ఈశ్వరుని అనుగ్రహమును సాధనముగా వాడు కొనే భక్తుడు అర్థార్థి. నోటి ముందున్న ముద్ద నోటిలోనికి వెళ్లకుండగా జారిపోవునట్లు చేసే ఆటంకములు అనేకములు గలవు. ఇట్టి ఆటంకములను పారద్రోలుటకై అర్థార్థి భగవంతుని కృపను అర్థించును. ఈ రెండు రకముల భక్తిలో దోషమేమియు లేదు. వీరిద్దరు మాత్రమే గాక మరియొక భక్తుడు గలడు. అతడు ఈశ్వరుని వద్ద నుండి ఒక వస్తువును కోరేవాడు కాదు. అతడు ఈశ్వరుని మాత్రమే కోరుచున్నాడు. అతడే జిజ్ఞాసువు. అతడే కర్మయోగి. ఏదో ఒక దానిని సాధించాలనే తృష్ణ అతనికి లేదు. అతడు మోక్షమును కోరుచున్నాడు. జ్ఞానము మోక్ష హేతువు గనుక, అతడు జ్ఞానమును గోరుచున్నాడు. అతడు తనకు ఈశ్వరునితో గల ఐక్యమును తెలియగోరుచున్నాడు. కావున, అతడు కూడ భక్తుడే. ఇదే జీవిత లక్ష్యముగాగల సన్న్యాసి కూడా భక్తుడే. భక్తియోగమనేది వేరుగా లేదు.

మానవుడు తప్పకుండా అనుష్ఠించవలెను అని వేదముచే విధింపబడిన నిత్యనైమిత్తిక కర్మలనుండి సన్న్యాసి సన్న్యాస దీక్షాసమయములో విముక్తుడగును. సన్న్యాసి సర్వసంగపరిత్యాగియై కేవల జ్ఞాననిష్ఠ యందు ఉండుట కొరకై విహితకర్మలనన్నిటినీ పరిత్యజించి పూర్తిగా స్వతంత్రుడగును. కర్మయోగి విహితములగు నిత్యకర్మల నన్నిటినీ చేయుచున్ననూ, అధికమగు భద్రతను ఇచ్చే పుణ్యము ఇత్యాది ఫలములను కోరువారి కొరకై ఉద్దేశింపబడిన కామ్యకర్మలనన్నింటినీ పరిత్యజించును. అతడు ఈ కామనలు నిస్సారములని గ్రహించి, సరియగు మనః ప్రవృత్తి గలవాడై నిత్యకర్మలనాచరిస్తూ, జ్ఞానముకొరకై శ్రవణాదికమును కూడ

చేయుచుండును. సన్న్యాసికి చేయవలసిన విధులు ఏమియు లేవు; కర్మయోగికి మాత్రమే కర్తవ్య విధులు గలవు. భక్తియోగి అనే మూడవ రకం యోగి లేడు. భక్తియోగము వేరే అన్నచో, భక్తుడు కర్మను చేస్తాడా? చేయడా? కర్మను చేయనిచో, అతడు సన్న్యాసి యగును. కర్మను చేసే పక్షంలో కర్మయోగి యగును. అర్థకామములనుద్దేశించి ఏ కర్మలు చేయబడునో, అంతఃకరణ శుద్ధి కొరకు కూడ అవియే చేయబడును. అల్పఫలముల నుద్దేశించి చేసే క్రియలు కర్మలు అనబడునే గాని, వాటికి కర్మయోగము అనే స్థాయి లభించదు. ఏలయన, వాటిలోని పురుషార్థము అత్యల్పముగా నున్నది. ఈ రెండు పక్షములలో అనగా కర్మిగాని, కర్మయోగి గాని ఇద్దరు భక్తులే.

గీతాశాస్త్రము రెండు రకముల నిష్ఠను మాత్రమే నిర్దేశించుచున్నది. ఒకటి కర్మయోగము; రెండవది సన్న్యాసము. ఏ కర్మను చేయవలెను? దానిని ఎట్టి మనః ప్రవృత్తితో చేయవలెను? అనే రెండు అంశములు కలిసి కర్మయోగము అగును. ధ్యానము, ఉపాసన, అమానిత్వాది జీవన మూల్యములను పెంపొందించుకొనుట, పూజ ఇత్యాదులన్నియు కర్మయోగములో అంతర్గతమగును. గీతలోని పద్దెనిమిది అధ్యాయములను విశ్లేషించినచో, కర్మయోగ సన్న్యాసములలో ఒకదానికంటె రెండవదానికి అధికప్రాధాన్యము ఈయబడలేదని స్పష్టమగును. గీతలోని విషయవస్తు ప్రతిపాదనములో ఈ రెండింటికీ కూడ తగినంత స్థానము ఈయబడి యున్నది. దీనిని బట్టి గీతాచార్యుని దృష్టిలో ఈ రెండింటికీ మోక్షసాధనములుగా సమానమగు ప్రాముఖ్యము గలదని స్పష్టమగు చున్నది. వేదములలోని కర్మకాండలో అగ్నిష్టోమము మొదలగు విశిష్టమైన కర్మలను విధించే వాక్యములు గలవు. బ్రాహ్మణుడు అగ్నిష్టోమమును చేయవలెను (బ్రాహ్మణః అగ్నిష్టోమేన యజేత) అని వేదము విధించుచున్నది. దీనివలన ఫలమేమి? స్వర్గము గాని, లేదా అంతః కరణశుద్ధి గాని ఫలము. కావున కర్మకాండ పరిచ్ఛిన్న ఫలములను గోరే కామియగు వ్యక్తి కొరకు మాత్రమే గాక, ముముక్షువు కొరకు కూడా ఉద్దేశించ బడినది. కావుననే అది నిరర్థకమని ఇచట పూర్ణముగా తిరస్కరించబడుట లేదు. కాని ఈ కర్మల నన్నిటినీ యోగబుద్ధితో అనుష్ఠించవలెను. ఈ విషయమే ఇచట నొక్కి చెప్పబడుచున్నది.

సమస్త గీతా శాస్త్రమును మాత్రమే గాక సకల వేద సారమును శ్రీకృష్ణభగవానుడు ఈ అధ్యాయములో సంక్షిప్తముగా ప్రదర్శించుటకు నిశ్చయించునట్లు కన్పట్టునని శ్రీశంకరులు 18వ అధ్యాయమునకు ఉపక్రమభాష్యములో వక్కాణించిరి. ఈ సమయములో అర్జునుడు ఒక ప్రశ్నను వేయుచున్నాడు. సన్న్యాసమునకు, త్యాగమునకు మధ్య గల భేదము ఏమి? అర్జునుడీ విషయమును తెలియగోరెను. అతని ఈ ప్రశ్నను బట్టి ఈ రెండింటి మధ్య గల భేదము అతనికి

తెలియలేదని స్పష్టమగుచున్నది. మనము వరుసగా అర్జునుని ప్రశ్నలను పరిశీలించెదము. ఆరంభములో మూడవ అధ్యాయములో సన్న్యాసము, కర్మ అను రెండింటిలో ఏది మంచిది అను విషయము నాతడు తెలియగోరెను. 'ఓ కేశవా! కర్మ కంటె జ్ఞానమే శ్రేష్ఠమని నీవు భావించే పక్షంలో, నన్నీ ఘోరమగు కర్మ యందు ఏల నియోగించుచున్నావు? ఓ కృష్ణా! నీవు పరస్పర విరుద్ధములుగా భాసించే వచనములతో నా బుద్ధికి విభ్రాంతిని కలిగించు చున్నట్లు ఉన్నావు. నాకు మోక్షమునిచ్చే ఉపాయమును ఖచ్చితముగా నిశ్చయించి చెప్పుము (జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన, తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ, వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే, తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోహమాప్నుయామ్, 3-1, 3-2) అని అతడు శ్రీకృష్ణుని నిలదీసెను. కాని నాల్గవ అధ్యాయములో అర్జునుడు ఒక వినూత్నమైన ప్రశ్నను లేవదీసెను. ఆ సమయములో బోధించియున్న జ్ఞానము కొంగ్రొత్తది కాదనియు, తానీ జ్ఞానమును సృష్ట్యాదియందు వివస్వానునకు బోధించినాననియు (ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్, 4-1) శ్రీకృష్ణుడు చెప్పెను. కాని శ్రీకృష్ణుని జన్మ వివస్వానుని జన్మకు తరువాతి కాలములోనిదై యుండగా, ఆయన ముందుగా ఈ జ్ఞానమును వివస్వానునకు బోధించెననుట ఎట్లు పొసగును? (అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః, కథ మేతద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి, 4-4) అని అర్జునుడు తెలియగోరెను. అపుడు శ్రీకృష్ణుడు తన జన్మ అందరి జన్మ వంటిది కాదని వివరించెను. ఆయన తన మాయా ప్రభావముచే తన కొరకై ఒక దేహమును నిర్మించుకొనెను (సంభవామి ఆత్మ మాయయా). అర్జునుని వలె ఆయనకు కూడ అనేక జన్మలు గలవు. ఆయనకు వాటి గురించి పూర్ణమైన జ్ఞానము గలదు. కాని అర్జునునకు వాటి గురించి తెలియదు (బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున, తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప, 4-5). ఆ తరువాత శ్రీకృష్ణుడు జ్ఞానమును గురించి మరికొంత వివరించి, జ్ఞాన సన్న్యాసములను రెండింటినీ స్తుతించెను. లేచి నిలబడి కర్మయోగ జీవనమును చేపట్టుము (యోగం ఆతిష్ఠ, ఉత్తిష్ఠ) అని ఆయన అంతిమ శ్లోకములో అర్జునుని హెచ్చరించెను. 'నీవు కర్మసన్న్యాసమును మరియు కర్మయోగమును రెండింటినీ స్తుతించు చున్నావు; ఈ రెండింటిలో నాకు ఏది శ్రేయస్కరము అను విషయమును ఖచ్చితముగా చెప్పుము (సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి, యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్, 5-1)' అని మరల అర్జునుడు 5వ అధ్యాయమునకు ఆరంభములో శ్రీకృష్ణుని ప్రశ్నించెను.

కర్మ సన్న్యాస, కర్మయోగములు అనే రెండు పరస్పర విరుద్ధములు గనుక, వాటిలో

ఒక దానిని స్వీకరించవలెనని అర్జునుని ఆకాంక్ష. కర్మను అనుష్ఠించవలెను. జ్ఞానమును ప్రమాణముచే పొందవలెను. ఇట్టి పరస్పర భిన్నమగు కర్మ మరియు జ్ఞానము ఆధారముగా గల కర్మయోగ, సన్న్యాసములకు అభేదము ఎట్లు పొసగును? అవి అభిన్నములు కానిచో, భగవానుడు వాటిలో ఒక దానిని పొగడి, మరియొక దానిని చేయుమని నన్ను ఏల నిర్దేశించు చున్నాడు? దీనికి భగవానుడు సమాధానమును చెప్పూ, సన్న్యాస కర్మయోగములను వివరించి, ఆ రెండింటికీ ఫలము ఒక్కటియేనని (యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే, 5-5) అని వివరించెను. కావున ఈ రెండింటికీ భేదము లేదు (ఏకం సాంఖ్యం చ యోగం చ). కాని యోగము లేనివాడు సన్న్యాసమును సాధించుట కష్టము (సన్న్యాసస్తు మహాబాహో దుఃఖం ఆప్తుం అయోగతః, 5-6). కర్మయోగికి అది సులభమగును (యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి). తరువాత, శ్రీకృష్ణుడు సన్న్యాస కర్మయోగములను మరల వివరిస్తూ, కేవల కర్మ త్యాగము సన్న్యాసము కాదనియు, జ్ఞానముచే సర్వకర్మలను విడుచుట (సర్వకర్మ సన్న్యాసము) యథార్థమగు సన్న్యాసమగుననియు నిర్వచించెను. అర్జునుడు మిన్నకుండుటను గాంచి, ఆతనికి అర్థము కాలేదని తెలుసుకొని, శ్రీకృష్ణుడు అదే విషయమును విడువకుండగా కొనసాగిస్తూ, ఒక విశిష్ట పరిస్థితిలో కర్తవ్యరూపముగా సంప్రాప్తమైన కర్మలను ఎవడైతే కర్మఫలములపై ఆధారపడకుండగా అనుష్ఠించునో, వాడే యథార్థమగు సన్న్యాసి అనియు, యోగి కూడా వాడేననియు వివరించెను. వైదిక కర్మలను గాని, లేక లౌకిక కర్మలను గాని యోగ్యమగు మనః ప్రవృత్తి లేనివాడై కేవలపరిత్యాగమును చేయువాడు సన్న్యాసి కాబోడు (అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః, స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః, 6-1).

దీని తరువాత భగవానుడు ధ్యానమును గురించి వివరించెను. ధ్యాత ఆత్మను తప్ప ఇతరమును దేనినైననూ భావించరాదని (ఆత్మ సంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్) చెప్పి, ధ్యానములో మనస్సు గాలిలేని చోట పెట్టిన దీపమువలె నిశ్చలముగ నుండునని (యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా, 6-19) చెప్పెను. తన మనస్సు చాల కల్లోల భరితముగ నున్నదనియు (చంచలం హి మనః కృష్ణ), గాలిని మూటగట్టినట్లు ఈ మనస్సును నియంత్రించుట దుష్కరమనియు (తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్, 6-34) అర్జునుడు ఫిర్యాదు చేసెను. ఆతని ఈ సమస్య వాస్తవమైనదే యనియు, ఆందోళనతో కూడియున్న మనస్సును వశము చేసుకొనుట నిస్సంశయముగా క్లేశముతో కూడిన పని అనియు (అసంశయం మహా బాహో మనో దుర్నిగ్రహం చలమ్) భగవానుడు చెప్పి అర్జునుని అభిప్రాయమును

సమర్థించెను. కాని దానిని అభ్యాసవైరాగ్యములచే దారికి తేవచ్చునని (అభ్యాసేన చ కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే, 6-35) ఆయన అర్జునునకు నచ్చచెప్పెను. వైరాగ్యమనగా వస్తువును యథాతథముగా దర్శించుట మాత్రమే. మనస్సు పనిచేసే తీరుతెన్నుల గురించి తెలుసుకొని విశిష్టమగు అనుశాసనమును పాటించుటయే అభ్యాసమగును.

దీని తరువాత అర్జునుడు మరియొక సమస్యను లేవనెత్తెను. ఈశ్వరుని యందు శ్రద్ధ గల ఒకానొక వ్యక్తి ఈ యోగము ననుష్ఠించుట మొదలిడెననుకొనుడు. కాని అతని ప్రయత్నము చాలక పోవుటచే మనస్సు చెల్లాచెదరై, అతడు యోగసిద్ధిని పొందజాలక, ఈ యోగము నుండి జారిపోయినచో, అతని గతి యేమి (అయతిశ్శ్రద్ధయోపేతో యోగాచ్చలిత మానసః, అప్రాప్య యోగ సంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి, 6-37)? అతడు ఏమియు సాధించలేక మరణించడా? తనకు పరమానందము లభించునని ఆశతో అతడు చిన్న చిన్న లౌకికమగు ఆనందములను దూరము చేసుకొనినాడు. కాని అతడు ఈ రెండింటికి చెడ్డ రేవడియై (ఉభయభ్రష్టః) మరణించినచో, ఏమగును? ప్రధానమగు మేఘరాశి నుండి విడివడి ముక్కలై నశించే మేఘశకలమువలె అతడు నశించిపోడా (కచ్చిన్న ఉభయ విభ్రష్టః ఛిన్నాభ్రం ఇవ నశ్యతి, 6-38)? ఒక పెద్ద మేఘరాశి మెల్లగా ముందుకు సాగుచుండగా, తొందరగా గమ్యమును చేరవలెననే ఆదుర్దాతో దానినుండి విడివడిన మేఘశకలము చెల్లాచెదరై నశించును గదా! సాధకుని పరిస్థితి కూడ అటులనే లేదా? అతడు ఉభయ భ్రష్టుడైనచో, అతని సంగతి యేమి? భగవంతుడు అర్జునునకు ఈ విషయములో అద్భుతమగు హామీని ఇస్తూ సమాధానమును చెప్పినాడు. ఈ మార్గములో ప్రయాణము నారంభించిన వానికి వెనుకకు మరలే ప్రసక్తి లేదు. మోక్షమును గురించి ప్రయత్నమును చేయువాడెవడైననూ దుర్గతిని పొందడు (నహి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి, 6-40). ఒకవేళ అట్టివాడు చేయు సాధనలో కొన్ని లోపములున్ననూ, అతడు చేసిన పుణ్యకర్మలకు ఫలరూపముగా కొంతకాలము స్వర్గాది సుఖానుభవరూపమగు ఆటంకము మాత్రమే అతనికి కలుగును. తరువాత అతడు ధనవంతులు మరియు సంస్కారవంతులు అగు వారి కుటుంబములో జన్మించి తాను విడిచి పెట్టి యున్న సాధనను మరల అందుకొని కొనసాగించును. అతడు గొప్ప పరిజ్ఞానము గల కర్మయోగుల గృహములోనైననూ జన్మించవచ్చును (ప్రాప్య పుణ్య కృతాం లోకాన్ ఉశిత్వా శాశ్వతీస్సమాః, శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభి జాయతే, అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్, 6-41, 42). అపుడాతని మనస్సునకు పూర్వజన్మలో చేసిన సాధనతో సంయోగమేర్పడును (తత్ర పౌర్వదైహికం బుద్ధి సంయోగం లభతే, 6-43). అతనికి ఈ జన్మలో ఒక విశిష్టఘటన ఘటిల్లి వెనువెంటనే

మనస్సు పూర్వజన్మలో సముపార్జించిన సాధనోన్నతితో కలునుకొనును. అనగా, అతడు ఆ పరమ పురుషార్థ సాధనను పూర్వజన్మలో విడిచిపెట్టిన స్థాయివద్ద మరల అందుకొనును. అతనికి ఆ సాధనపై ప్రేమ ఏర్పడును. అతడు దానిని మరింత ముందుకు గొనిపోయి జ్ఞానమును పొందును. ఈ విధముగా ఈ యాత్ర కొనసాగిపోవును. కావున దీనిలో నష్టపోయేది ఏదీ లేదు.

అర్జునుని ప్రశ్నలలో అధికశాతము అయా ప్రకరణములకు సంబంధించిన సరళమైన ప్రశ్నలు మాత్రమే. మూడు నాలుగు ప్రశ్నలు మాత్రమే ప్రధానమైనవి గలవు. జ్ఞాని యొక్క లక్షణములేవి (స్థితప్రజ్ఞస్య కా భాషా)? అని అర్జునుడు ప్రశ్నించి యుండెను. ఇది సరియైన ప్రశ్న. అదే విధముగా, కర్మ కంటె జ్ఞానము గొప్పదని నీ అభిప్రాయమై యున్నచో, నన్నీ ఘోరమగు కర్మయందేల నియోగించుచున్నావు (జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన, తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ, 3-1)? అని అర్జునుడు ప్రశ్నించెను. ఇది మరియొక వాస్తవమగు సమస్య. 5వ అధ్యాయములో మరల అర్జునుడు ఇదే విషయమును మరియొక రూపములో ప్రశ్నించెను : ఓ శ్రీకృష్ణా! నీవు కర్మ సన్న్యాస-కర్మయోగములను రెండింటినీ ప్రశంసించు చున్నావు. ఈ రెండింటిలో ఏది గొప్పదియో నాకు తెల్పి చెప్పుము (సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి, యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్, 3-1)'. ఇపుడు ఇన్ని అధ్యాయములు గడచిన పిదప అతడు మరల అదే ప్రశ్నను పదములను మార్చి అడుగు చున్నాడు.

**అధ్యాయము 18, శ్లోకము 1 :**

अर्जुन उवाच ।
सन्यासस्य महाबाहो तत्त्वमिच्छामि वेदितुम् ।
त्यागस्य च हृषीकेश पृथक् केशिनिषूदन ॥ १ ॥

అర్జున ఉవాచ ।
సన్న్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్
త్యాగస్య చ హృషీకేశ పృథక్ కేశినిషూదన (1)

మహాబాహో = ఓ గొప్ప బాహువులు గలవాడా!, హృషీకేశ = ఇంద్రియాధిపతీ!, కేశినిషూదన = కేశి యను రాక్షసుని సంహరించిన వాడా!, సన్న్యాసస్య = సన్న్యాసము

యొక్క, చ = మరియు, త్యాగస్య = త్యాగము యొక్క, తత్త్వమ్ = సత్య స్వరూపమును గూర్చి, పృథక్ = వేర్వేరుగా, వేదితుమ్ = తెలియుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

> ఓ గొప్ప బాహువులు గలవాడా! ఇంద్రియాధిపతీ! కేశియను రాక్షసుని సంహరించిన వాడా! సన్న్యాసము, మరియు త్యాగము అను వాటి యథార్థ స్వరూపమును నేను వేర్వేరుగా తెలియగోరు చున్నాను (1).

సన్న్యాస త్యాగశబ్దములు రెండింటికీ పరిత్యజించుట అనియే అర్థము. శ్రీకృష్ణుడీ పదములను గీతలో సర్వత్రా ప్రయోగించెను. ఈ సన్న్యాస త్యాగములకు మధ్యలో గల ఏదేని భేదమును శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడా యేమి? అను విషయమును అర్జునుడిపుడు తెలియగోరుచున్నాడు. అర్జునుడిట్లు ప్రశ్నించుటకు ఆధారము గలదు. కర్మ ఫలముల యందలి ఆసక్తిని వీడి, ఇతరముపై దేనిపైననూ ఆధారపడకుండగా, తనతో తాను ఆనందముగా నుండే వ్యక్తిని గురించి (త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః ......., 4-20) శ్రీ కృష్ణభగవానుడు చెప్పియున్నాడు. ఈ సందర్భములో త్యాగమనగా కర్మఫలములను వీడుట. కాని తరువాతి శ్లోకములో భగవానుడు సర్వవస్తువులపై 'ఇది నాది' యను మమకారమును విడనాడిన వ్యక్తిని గురించి వర్ణించిన సందర్భములో (నిరాశీర్యత చిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః, 4-21), త్యాగపదమును సర్వకర్మ సన్న్యాసము అను అర్థములో ప్రయోగించినాడు.

మరియొక సందర్భములో (యోగ సన్న్యస్త కర్మాణమ్, యోగముచే కర్మలనన్నిటినీ విడిచి పెట్టిన వాడు, 4-41), ఆయన సన్న్యాసపదమును 'కర్మలను విడిచి పెట్టుట' అను అర్థములో వాడినాడు. జ్ఞేయస్స నిత్య సన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి (5-3) అను శ్లోకములో, దేనినైననూ కాంక్షించని వాడు మరియు ద్వేషించని వాడు సన్న్యాసియగునని భగవానుడు నిర్వచించినాడు. ఇచట కర్మయోగియే సన్న్యాసి అను పదముచే నిర్దేశించబడినాడు. యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతిమాప్నోతినైష్ఠికీమ్ (5-12) అను శ్లోకములో కర్మఫలములను విడనాడి శాశ్వతమగు శాంతిని పొందే కర్మయోగిని వర్ణించిన సందర్భములో త్యక్త్వా అను పదము కర్మయోగి యొక్క ఈ పరివర్తనమును నిర్దేశించుటకు వాడబడినది.

తరువాత, 'జ్ఞానముచే కర్మలనన్నింటినీ విడనాడి జితేంద్రియుడై జ్ఞాని సుఖముగా విశ్రమించును (సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ, 5-13)' అని భగవానుడు చెప్పిన సందర్భములో, జ్ఞాని జ్ఞాన ప్రభావముచే పొందే సర్వకర్మ సన్న్యాసమును సన్న్యాసశబ్దముచే

నిర్దేశించినాడు. కాని, కర్మఫలములచే ప్రేరితుడు కానివాడై కర్మను కర్తవ్యబుద్ధితో చేయువాడే సన్న్యాసి యగును; కేవలము అగ్ని హోత్రాది కర్మలను మరియు లౌకిక కర్మలను పరిత్యజించినంత మాత్రాన మానవుడు సన్న్యాసి కాబోడు; ఆ విధముగా కర్మలను చేయువాడు మాత్రమే యథార్థమగు సన్న్యాసి మరియు కర్మయోగి కూడ అగును (అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః, స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః, 6-1) అను శ్లోకములో కర్మయోగికి సన్న్యాసితో సామ్యము చెప్పబడినది.

తరువాత మరల ఇదే అభిప్రాయము మరియొక శ్లోకములో చెప్పబడినది : ఓ అర్జునా! ఏది సన్న్యాసమో, అదియే యోగమని చెప్పబడుచున్నది (యం సన్న్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధి పాండవ, 6-2).

ఈ క్రింది శ్లోకములలో కర్మయోగి వర్ణించబడినాడు :

తన సంకల్పములనన్నింటినీ విడువని వాడు ఎవడైననూ యోగి కాజాలడు (న హి అసన్న్యస్త సంకల్పః యోగీ భవతి కశ్చన, 6-2).

సంకల్పములనన్నింటినీ విడనాడినవాడు యోగసిద్ధిని పొందినవాడని చెప్పబడును (సర్వసంకల్ప సన్న్యాసీ యోగారూఢస్తదోచ్యతే, 6-4).

సంకల్పము నుండి జన్మించే కర్మలనన్నిటినీ పూర్తిగా విడనాడి (సంకల్పప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వానశేషతః....., 6-24).

సన్న్యాసయోగముచే సంపన్నమైన మనస్సు గల నీవు విముక్తిని పొంది నన్ను చేరగలవు (సన్న్యాస యోగ యుక్తాత్మా విముక్తో మాముపైష్యసి, 9-28).

కర్మలనన్నింటినీ విడిచి పెట్టి నా యందు అంకిత భావము గలవారు ..... (యే సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః, 12-6).

తరువాత ఆత్మ నియంత్రణ గలవాడవై కర్మలన్నింటి యొక్క ఫలమును విడిచి పెట్టుము (సర్వకర్మ ఫలత్యాగం తతః కురు యతాత్మవాన్, 12-11).

ఈ క్రింది శ్లోకములలో సర్వకర్మసన్న్యాసము చెప్పబడినది :

ఉపక్రమములనన్నిటినీ పరిత్యజించిన నా భక్తుడు నాకు ప్రియమైనవాడు (సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః, 12-16).

ఉపక్రమములనన్నింటినీ పరిత్యజించినవాడు గుణాతీతుడు (గుణములనతిక్రమించినవాడు) అని చెప్పబడుచున్నాడు (సర్వారంభ పరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతే, 14 - 25).

జ్ఞానముచే కర్మలనన్నింటినీ నా యందు విడిచి పెట్టువాడు (మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా, 3-30).

ఈ వాక్యములన్నియు చాల భ్రాంతిని కలిగించునా యన్నట్లు ఉన్నవి. సన్న్యాస, త్యాగశబ్దములు ఒకప్పుడు సమానార్థకములుగను, మరియొకప్పుడు వేర్వేరు అర్థములలో వాడబడినవి. మరియు, త్యాగమనగా కర్మను విడిచి పెట్టుట (కర్మత్యాగము) అన్నచో, దానికి యోగముతో సంబంధమేమియు ఉండజాలదు. ఏలయనగా, కర్మయోగములో కర్మను విడిచి పెట్టుట సంభవము కాదు. కర్తవ్యకర్మను (అనుష్ఠేయం కర్మ) చేయుట యోగములో అంతర్భాగము. త్యాగమనగా కర్మత్యాగము అనే పక్షములో, త్యాగమునకు యోగమునకు పరస్పర విరోధము ఉండును. యోగమనగా చేయుట; త్యాగమనగా చేయకుండుట. కర్మను విడిచి పెట్టినచో, అది యోగము ఎట్లు అగును? కర్మను విడిచి పెట్టినచో, అది సన్న్యాసము అగును. అర్జునుని ప్రశ్న యుక్తి యుక్తమే.

సన్న్యాస, త్యాగ శబ్దములు రెండింటికీ 'విడిచి పెట్టుట' అనియే అర్థము. కాని శ్రీకృష్ణభగవానుడు తరుచుగా త్యాగశబ్దమును యోగశబ్దముతో కలిపి ప్రయోగించినట్లు మనకు గోచరించుచున్నది. ఉదాహరణకు ఈ క్రింది శ్లోకమును గమనించుడు : యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మశుద్ధయే (5-11). అనగా, కర్మయోగులు ఆసక్తిని విడనాడి అంతః కరణశుద్ధి కొరకై కర్మను చేయుదురు. ఇది సుస్పష్టమగు వాక్యము. కేవల కర్మ వలన ఆత్మశుద్ధి లభించదు. కాని కర్మనలాసక్తిని విడనాడి (సంగం త్యక్త్వా) చేసిన కర్మయైనచో, ఆత్మశుద్ధిని ఈయగలదు. అట్లు గానిచో, కర్మ మానవుని బంధించగలదే గాని, విముక్తిని ఈయజాలదు. ఇంతేగాక, భగవంతుడింకనూ ఇట్లు చెప్పినాడు : బ్రహ్మణి ఆధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః, లిప్యతే న స పాపేన పద్మ పత్రమివాంభసా (5-10). అనగా, ఆసక్తిని విడిచి పెట్టి కర్మలను ఎవడైతే పరమేశ్వరార్పణ బుద్ధితో చేయునో, అట్టివాడు తామరాకు నీటిచేతను వలె, పాపముతో

లేపమును పొందడు (ప్రభావితుడు గాడు). ఇట్టి సందర్భములలో, త్యాగశబ్దము తరుచుగా కర్మయోగ ప్రకరణము నందు వాడబడు చున్నది. కొన్ని సందర్భములలో సన్న్యాస శబ్దము కూడ అదే అర్థములో వాడబడినది. కొన్ని సందర్భములలో సన్న్యాసమనగా కర్మను విడిచి పెట్టుట (కర్మసన్న్యాసము) కాగా, కర్మఫలములను విడిచి పెట్టుట (కర్మఫలత్యాగము) త్యాగమగు చున్నది. తరువాత శ్రీకృష్ణుడు 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అని చెప్పబోవు చున్నాడు. అనగా సర్వధర్మములను విడిచి పెట్టుట. అనగా సర్వకర్మలను విడిచి పెట్టుట (సర్వకర్మ సన్న్యాసము). ఇది కేవలము జ్ఞానము చేత మాత్రమే సంభవమగుచున్నది. ఈ జ్ఞానమును పొందుటకై మన యెదుట సన్న్యాసము మరియు కర్మయోగము అనే రెండు జీవనశైలులు గలవు. సన్న్యాసమనగా విహిత కర్మలనన్నింటినీ విడిచి పెట్టుట (కర్మసన్న్యాసము). త్యాగమనగా కర్మఫలములను విడిచిపెట్టుట. ఇదియే యోగము. కావున ఇచట త్యాగము మరియు యోగము కలిసి యుండును.

సన్న్యాస, త్యాగముల మధ్య గల ఈ భేదమును అర్జునుడు గన లేక పోయెను. అతని హృదయములో ఇంకనూ కదలాడుచున్న సంశయము ఇప్పుడు ఈ ప్రశ్నలో ప్రకటమయ్యెను. ఈ సారి అతడు 'ఈ రెండింటిలో ఏది గొప్పది?' అని ప్రశ్నించుట లేదు. దానికి కారణము ఆ విషయములో అతనికి గల భ్రాంతి తొలగి పోవుట కాదు. అదే ప్రశ్నను అతడు మరియొక రూపములో వేయుచున్నాడు. సన్న్యాసమునకు, త్యాగమునకు మధ్య గల భేదమును తెలియవలెననే కోరిక రూపములో ఆ ప్రశ్నయే మరల ప్రస్తుతించబడినది.

ప్రశ్న యొక్క సారము శ్రీకృష్ణునకు పూర్తిగా దెలియును. కావుననే ఆయన అన్ని అంశములను స్పృశించే విస్తారమైన సమగ్రమగు సమాధానము నిచ్చుచున్నాడు. కొన్ని ప్రశ్నలకు సూటియైన సమాధానములు ఉండవు. ఇది కూడా అట్టి ప్రశ్నలలో ఒకటి. సన్న్యాస, కర్మయోగములలో ఏది గొప్పది? అనే అర్జునుని ప్రశ్నను బట్టి అతనికి ఈ రెండింటి గురించిన అవగాహన లేదని స్పష్టమగు చున్నది. అతని అవగాహనలోని అస్పష్టత ప్రశ్నలో బయటపడినది. ఒక దేశము యొక్క రాజధాని యేది? అని ప్రశ్నించినచో, సూటిగా సమాధానము నీయవచ్చును. కాని ఈ ప్రశ్న చాల విలక్షణమైనది. ఇచటి విషయవస్తువును గురించి వ్యక్తికి గల లోతైన అస్పష్టత నుండి ఈ ప్రశ్న ఉదయించినది. కావున దీనికి సావధానముగా ప్రత్యుత్తరము నీయవలసి యున్నది. గడచిన అధ్యాయములలో అర్జునుని వివిధ ప్రశ్నలకు మూలములో నున్న అస్పష్టతయే ఈ ప్రశ్నను కూడ వేయించినది. శ్రీకృష్ణ భగవానుడు ఈ విషయమును వివరించుటలో చాల సమయమును వెచ్చించి యున్నాడు. అర్జునుని అవగాహనలో ప్రశ్నించిన ప్రతి పర్యాయము మెరుగు

కనబడి తీరాలి. కాని, ఇంకనూ ఈ విషయము అతనికి అస్పష్టముగనే మిగిలి యున్నది. ఈ పర్యాయము నందు అతడు సన్న్యాస కర్మయోగముల గురించి ప్రశ్నించుటకు బదులుగా, సన్న్యాసత్యాగముల గురించి ప్రశ్నించినాడు. కాని అతని మనస్సులోని వాస్తవసమస్య సన్న్యాస కర్మయోగములే. అతడు వినగోరేది వాటి గురించి మాత్రమే. శ్రీకృష్ణుడు అతని కోరికను వమ్ము చేయలేదు.

శ్రీకృష్ణుడు పరాక్రమశాలి. కావుననే, అర్జునుడు అతనిని 'ఓ గొప్ప బాహువులు గలవాడా! (మహాబాహో)' అని సంబోధించెను. 'నేను సన్న్యాసము యొక్క స్వరూపమును తెలియగోరు చున్నాను (సన్న్యాసస్య తత్త్వం వేదితుం ఇచ్ఛామి)' అని అతడు పలికెను. అంతేగాక, అతడు త్యాగము యొక్క స్వరూపమును గూడ వేరుగా తెలియగోరెను (త్యాగస్య చ పృథక్). ఇచట అతడు శ్రీకృష్ణుని 'హృషీకేశా!' అని కూడ సంబోధించెను. అనగా, ఇంద్రియము లన్నింటికి అధీశ్వరుడు, సర్వప్రాణుల యందు ఆత్మరూపములో నుండువాడు అని యర్థము. ఇంద్రియముల ఉనికి, వాటి వ్యాపారములు ఆ పరమేశ్వరుని వలన మాత్రమే సంభవమగు చున్నవి. మరియు అర్జునుడు ఆయనను కేశిని సంహరించిన వాడా! (కేశినిషూదన) అని సంబోధించెను. కేశి యనగా గుర్రము రూపములో నున్న ఒక రాక్షసుడు. సన్న్యాసమనగా నేమి? త్యాగమనగా నేమి? ఈ విషయములను నేను వేర్వేరుగా (పృథక్) తెలియగోరు చున్నానని అర్జునుడు స్పష్టము చేసెను. ఏలయన, శ్రీకృష్ణుడు ఈ రెండు పదములను విభిన్నమగు అర్థములలో వాడు చున్నాడు. కాని వాటి అర్థము సమానమే యన్నట్లు కానవచ్చుచున్నది. సన్న్యాసమనగా విడిచి పెట్టుట. కాని ఈ పదమునకు లోకప్రియమగు మరియొక అర్థము కూడ గలదు. భగవానుడీ రెండు పదములను విభిన్న ప్రకరణములలో ప్రయోగించినాడు గాన, ఆయన తాత్పర్యములో ఈ త్యాగము మరియు సన్న్యాసము అను వాటి తత్త్వమును గురించి అర్జునుడు మరింత సమగ్రముగా తెలియగోరెను. 'నేను తెలియగోరుచున్నాను (వేదితుం ఇచ్ఛామి)' అని మాత్రమే అర్జునుడు పలికి యున్ననూ, సందర్భమును బట్టి 'దయచేసి నాకు బోధించుము' అనే ప్రార్థన ఇచట లక్షితమగుచున్నది. శ్రీకృష్ణ భగవానుడాతనికి బోధించు చున్నాడు. ఈ విధముగా సన్న్యాసమును గురించి విస్తారముగా వర్ణించే పద్దెనిమిదవ అధ్యాయము మనకు సంప్రాప్తమైనది.

ఇంత మాత్రమే గాక, భగవానుడీ అధ్యాయములో బ్రాహ్మణ క్షత్రియవైశ్య శూద్రులు, సత్త్వరజస్తమోగుణములు ఇత్యాది వివిధ విషయములను గురించి వివరించి యున్నాడు.

శ్రీ శంకరులు తరువాతి శ్లోకము యొక్క అవతారికలో నిట్లు వివరించిరి : గీతా శాస్త్రములో సన్న్యాస త్యాగశబ్దములు రెండు ప్రయోగించబడినవి. కాని గీత స్వయముగా వాటి అర్థమును వివరించి యుండలేదు. కావున వాటి అర్థము విషయములో కొంత అస్పష్టత గలదు. పృచ్ఛకుడగు అర్జునునకు ఆ పదముల అర్థమును సుస్పష్టముగా తెలుపుడు జేయుట కొరకై భగవానుడిట్లు చెప్పుచున్నాడు.

**అధ్యాయము 18, శ్లోకము 2 :**

श्री भगवानुवाच ।
काम्यानां कर्मणां न्यासं सन्न्यासं कवयो विदुः ।
सर्वकर्मफलत्यागं प्राहुस्त्यागं विचक्षणाः ॥ २ ॥

శ్రీ భగవానువాచ ।
కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః (2).

శ్రీ భగవాన్ = శ్రీ భగవానుడు, ఉవాచ = పలికెను, కామ్యానాం కర్మణామ్ = కామ్యకర్మల యొక్క, న్యాసమ్ = విడిచి పెట్టుట, సన్న్యాసమ్ = సన్న్యాసమని, కవయః = జ్ఞానులు, విదుః = చెప్పెదరు, సర్వకర్మఫలత్యాగమ్ = కర్మలన్నింటి యొక్క ఫలమును విడిచి పెట్టుట, త్యాగమ్ = త్యాగము అని, విచక్షణాః = విద్వాంసులు, ప్రాహుః = చెప్పుచున్నారు.

శ్రీ భగవానుడిట్లు పలికెను -

> కామ్య కర్మలను విడిచి పెట్టినచో అది సన్న్యాసమనియు, కర్మలన్నింటి యొక్క ఫలములను విడిచి పెట్టినచో అది త్యాగమనియు జ్ఞానులు చెప్పుచున్నారు (2).

వేదవిహితములైన కర్మలు అనేకరకములుగా నున్నవి. వాటిలో కొన్ని (నిత్య, నైమిత్తిక కర్మలు) తప్పక చేయదగినవి. మరికొన్ని మనకు గల కోరికలపై ఆధారపడి చేయదగినవి (కామ్య కర్మలు). అవి అన్నియు పుణ్యదాయకములే. కాని, అర్థకామముల కొరకై చేసినచో నిత్యకర్మలు

కూడ కామ్యకర్మలుగనే పరిగణించబడును. ఏలయన, ఇవి అన్నియు మానవుడు కోరే ఫలములనిచ్చును. నిత్యకర్మను ప్రతి దినము చేయవలయును. ఉదాహరణకు, గాయత్రీమంత్రోపదేశమును పొందిన వ్యక్తి ప్రతిదినము ఉదయ, మధ్యాహ్న, సాయం సమయములలో సంధ్యావందనమును చేయును. తరువాత అతడు వివాహమాడగనే, అగ్నిహోత్రాది కర్మలు దీనికి జతగూడును. ఇవి అన్నియు నిత్యకర్మలే.

కొన్ని విశేష సందర్భములలో చేయు కర్మలకు నైమిత్తిక కర్మలని పేరు. ఉదాహరణకు, గ్రహణము పట్టిన సమయములో కొన్ని కర్మలు విధింపబడినవి. అదే విధముగా కొన్ని విశిష్ట గ్రహకూటములు ఏర్పడినప్పుడు చేయవలసిన కర్మలు విహితములై యున్నవి. అటులనే పితృతిథినాడు శ్రాద్ధమును చేయవలెను. వీటికి నైమిత్తిక కర్మలని పేరు. ఇవి తప్పని సరిగా చేయదగినవి.

కామ్య కర్మ వీటి కంటె భిన్నమైనది. దానిని చేయవచ్చును; లేదా మానవచ్చును. పుత్రుని గోరు వ్యక్తి ఆ ఫలమునుద్దేశించి విధించబడిన పుత్రకామేష్టిని చేయవచ్చును. కాని పుత్రుని యందు ఇచ్ఛ లేనివాడు, లేదా పుత్రకామేష్టిని చేయుటకు ఆవశ్యకమగు ధనము లేనివాడు దానిని మానవచ్చును. అట్లు మానినచో, అది విధి-ఉల్లంఘనము కాబోదు. ఇదే తీరున విభిన్న ఫలములనుద్దేశించి విధింపబడిన అసంఖ్యాకములగు కామ్యకర్మలు గలవు. ఇవి అన్నియు ఐచ్ఛికములు (optional) మాత్రమే. వేదములో నిత్యనైమిత్తిక కర్మల ఫలము ఇదమిత్థముగా నిర్దేశింపబడలేదు. అయిననూ అవి కర్మలే గనుక ఫలమునిచ్చును. శాస్త్రములో ఒక సామాన్య నియమము గలదు. విహిత కర్మకు ఫలము చెప్పబడని సందర్భము లన్నింటిలో స్వర్గమును ఫలముగా స్వీకరించవలెను. ఈ నిత్యనైమిత్తిక కర్మలను కూడ ఆ ఫలమును ఉద్దేశించి చేసినచో, అవి కామ్యకర్మలే యగును. లేదా, వాటిని అంతఃకరణ శుద్ధి కొరకు చేయవచ్చును. ఇది కూడా ఫలమే యైననూ, దీనికొరకు చేయబడే కర్మను కామ్య కర్మగా పరిగణించరు. కామ్యకర్మ అనే ముద్ర పడిన కర్మను కూడ అంతః కరణ శుద్ధి కొరకు చేయవచ్చును. అట్టి స్థితిలో అది కామ్య కర్మగా పరిగణించబడదు.

కర్మలో మనము తెలియదగిన భేదములు ఇంకో రెండు గలవు. ఒకటి నిషిద్ధకర్మ. ఈ కర్మను చేయరాదని శాస్త్రము నిషేధించు చున్నది. మనము ఇతరప్రాణులకు హానిని కలిగించరాదు. కావుననే, 'హింసించకుము' అని శాస్త్రము చెప్పుచున్నది. ఇట్టి కర్మల నాచరిము

వారికి పాపము చుట్టుకొనును. కావుననే, మన హితమును గోరే (హితైషిణీ) శ్రుతి వీటిని చేయవద్దని శాసించు చున్నది. కామ్యకర్మలను చేయవద్దని శాస్త్రము నిషేధించుట లేదు. వాటి వలన మనకు అభీష్టఫలములు లభించును. కాని ఆ ఫలములు పరిచ్ఛిన్నములుగా నుండును. రెండవది ప్రాయశ్చిత్త కర్మ. గతములో చేసిన పాపములకు పరిహారముగా దీనిని చేసెదరు. దీనిని చేసినచో గతమునందాచరించిన పాపకర్మల ఫలము నుండి పూర్తిగా విముక్తి లభించును. ఇట్టి ప్రాయశ్చిత్తములు కూడ వేదమునందు విధించబడి యున్నవి. పురుషార్థ నిశ్చయము గల వ్యక్తి సహజముగా కామ్య కర్మలను ప్రక్కన బెట్టి నిత్యనైమిత్తిక కర్మలను మాత్రమే అనుష్ఠించును. ఈ సందర్భములలో విడిచి పెట్టుట (న్యాసమ్) అనగా నిదియే.

నిత్యనైమిత్తిక కర్మలను కూడ విడిచి పెట్టినచో, అది సన్న్యాసమగును. మిఠాయిని విడిచి పెట్టినట్లుగా కర్మను విడిచి పెట్టుట సంభవము కాదు. కాని కర్మను చేయుటను ఆపివేయవచ్చును. అట్లు చేసినచో, అది సోమరితనము గాని, అధర్మము గాని కావచ్చును. ఏలయన, విధ్యుక్తధర్మములపై ఆధారపడి నడిచే సమాజములో కర్తవ్య కర్మను ఆచరించక పోవుట వలన అనేక సమస్యలు తలయెత్తును. ఉదాహరణకు, యంత్రములోని ఒక పిస్టను 'నేనినాడు పనిని చేయబోవుట లేదు' అని ప్రకటించినదనుకొనుడు. ఆ పిస్టను పనిని మానివేసినచో, యంత్రము చేసే పని పూర్తిగా చెడును. అదే విధముగా సమాజములో ప్రతి వ్యక్తికి తప్పక చేయదగిన కర్తవ్యములు ఉండును. అతడు వాటిని చేయనిచో, సమాజమంతయు నష్టమును పొందును; లేదా అస్తవ్యస్తమగును. కావున, సన్న్యాసమనగా ఒక విధికి అనురూపముగా నిత్యనైమిత్తిక కర్మలను పరిత్యజించుట అని మనమిచట అర్థమును చెప్పవలెను. ముందుగా సాధకుడు గురువు వద్దకు వెళ్లును. అతడికి తాను కోరే దాని విషయములో స్పష్టమగు అవగాహన (పురుషార్థనిశ్చయము) ఉండవలెను. ఏది కాలపరిచ్ఛిన్నము (అనిత్యము)? అను విషయములో అతనికి స్పష్టమగు అవగాహన ఉండవలెను. మరియు అతనికి ఆ అనిత్యవస్తువులపై వైరాగ్యము ఉండవలెను. ఇంతేగాక, అతనికి కాలపరిచ్ఛిన్నము కాని నిత్యవస్తువుపై ప్రేమ ఉండవలెను. అతనికి అట్టి నిత్యవస్తువు యొక్క జ్ఞానము తక్క ఇతరమునందు అభిరుచి ఉండరాదు. అతడు గురువు వద్దకు వెళ్లి, ఆయన సన్నిధిలో కొంతకాలము జీవించి, సర్వముయొక్క పరిజ్ఞానమును పొందవలెను. అప్పుడు గురువు అతనికి సన్న్యాసము నిచ్చును. అంతవరకు అతడు కర్మలను చేయుచుండును. కాని అతడు సన్న్యాస స్వీకార సమయములో శాస్త్రోక్త విధానముననుసరించి కర్తవ్య కర్మలన్నిటినుండి విముక్తిని పొందును. సన్న్యాసమనగా నదియే. విధి నిర్వహణకు అంకితమైన సమాజములో ఇది సామాన్య మగు విషయము కాదు. సన్న్యాసి కాబోవు వ్యక్తి ఒక వ్రతమును

అనుష్ఠించి, తాను అంత వరకు చేయుచున్న విధుల నుండియు మరియు పోషించు చున్న పాత్రలనుండియు పూర్ణముగా విముక్తుడగును. ఇట్టి పరిత్యాగమునకు వేదము అభ్యనుజ్ఞను ఇచ్చుటచే, సమాజము దానిని స్వీకరించును.

సన్న్యాసమనగా ఇదియేనని మనకు ఎట్లు తెలియును? కవుల వచనములను బట్టి తెలిసినది. శాస్త్రజ్ఞానము కలిగి విషయములపై స్పష్టమగు పరిజ్ఞానము గల వ్యక్తి కవి యనబడును. జ్ఞానమును పొందవలెననే ఆకాంక్ష కలిగియున్న మానవుడు కామ్య కర్మలతో బాటు నిత్యకర్మలను కూడ పరిత్యజించ దగుననియు, దీనికే వివిదిషా సన్న్యాసమని పేరనియు వారు చెప్పెదరు. కేవల జ్ఞాననిష్ఠారూపమగు సర్వకర్మ సన్న్యాసమే యథార్థమగు సన్న్యాసము. 'నేను కర్తను గాను' అను సత్యమును దర్శించుటచే లభించే ఈ సన్న్యాసమునకు భౌతికమగు కర్మపరిత్యాగముతో సంబంధము లేదు. కాని ఇచట ఒక విశిష్ట జీవనశైలి అను రూపములో నున్న సన్న్యాసము ప్రస్తావింపబడు చున్నది.

త్యాగమనగా నేమి? సర్వకర్మల ఫలములను విడిచిపెట్టుట (సర్వకర్మఫలత్యాగః) త్యాగమనబడునని విద్వాంసులు (విచక్షణాః) చెప్పుచున్నారు. ఇచట కామ్యకర్మలకు ప్రవేశమే లేదు. ఎవరైననూ కర్మఫలమును పరిత్యజించుట కొరకై కామ్యకర్మను చేయరు గదా! అట్లు చేసినచో, అది కామ్య కర్మయే కాదు. అగ్నిహోత్రము, జ్యోతిష్టోమము ఇత్యాది కర్మలను ఫలాభిసంధి లేకుండగా కేవలము అంతఃకరణ శుద్ధి కొరకై చేయవచ్చును. అంతః కరణ శుద్ధి సాధకుని కంటె భిన్నముగా లేదు గనుక, దానిని కర్మఫలములో లెక్క వేయరు. ఇతర ఫలములన్నింటిలో ఏదో ఒక లబ్ధి (ప్రాప్తి) ఉండును. కర్మానుష్ఠానముచే పుణ్యము, దాని వలన అర్థకామములు సిద్ధించును. కర్మల వలన సాక్షాత్తుగా అర్థకామములు సిద్ధించవు.

ఒకడు ధనమును గోరి ఒక క్రతువును చేసినాడనుకొనుడు. ఆ క్రతువు వలన అతనికి వెనువెంటనే ధనము లభించదు. పైగా అగ్నిహోత్రములో సమర్పించబడే వస్తురూపములో కొంత ధనము కాలి బూడిద యగును. కాని దీనిలోని తాత్పర్యమేమనగా, ఆ భస్మములో నుండి ఒక కంటికి కానరాని అపూర్వము పుట్టి ఆ సాధకుడు కోరిన ధనము అతనికి లభించే పరిస్థితులను సృష్టించును. దానికే పుణ్యము అని పేరు. ఈ విధముగా అదృష్టమును ఉత్పన్నము చేసే శక్తి ఈ వేదవిహితకర్మలకు గలదు. ఈ అదృష్టము ఈ కర్మలను చేయువానికి మాత్రమే గాక, చేయించే యజమానికి కూడ లభ్యమగును. ఆ అదృష్టము అనుకూల పరిస్థితుల రూపములో ప్రకటమై వారి వారి కామనలను నెరవేర్చును.

కాని ఈ ప్రకరణములో మనము సర్వకర్మలను అంతః కరణశుద్ధి కొరకు చేసే పరిస్థితిని గురించి మాటలాడు చున్నాము. స్వర్గాది సాధ్యములు సాధకుని కంటె భిన్నముగా నుండగా, ఈ ఫలము సాధకుని కంటె భిన్నముగా లేదు. జీవుడు జీవత్వమునందు ఆగ్రహము గలవాడై తన అభీష్టసిద్ధి కొరకై కర్మలనాచరించినచో, ఆతడు ఆయా కర్మఫలములను పొందును. కాని ఈ అంతఃకరణశుద్ధి కర్మఫలము కాదు. ఏలయన, పవిత్రమగు కర్మ తనంత తానుగా అంతః కరణశుద్ధినొసంగును. అంతః కరణశుద్ధిని కర్మఫలముగా లెక్కించరు. కావుననే మన శాస్త్రములో దాని కొరకై కర్మలను చేయుట కర్మఫలత్యాగమని వర్ణించబడినది. ఈ విధముగా చేయు కర్మకు లక్ష్యము స్వర్గము గాని, భద్రత (అర్థము) గాని, వివిధ రకముల కామనాపరిపూర్తి (కామము) గాని కాదు. దీనికి లక్ష్యము మోక్షము. మోక్షము సాధకుని స్వరూపమే.

కేవలము అంతః కరణశుద్ధి కొరకై కర్మను చేయువాడు మానసికముగా కర్మఫలమునంతనూ విడిచిపెట్టిననూ, కర్మఫలము ఉండి తీరును. అట్టి సాధకుడు నిత్యనైమిత్తిక కర్మలనన్నింటినీ కేవలము అంతఃకరణ శుద్ధికొరకై ఆచరిస్తూ, జ్ఞానోదయము కాకుండగనే, మరణించి నాడనుకొనుడు. అపుడాతని కర్మఫలముల మాట యేమి? ఆతడు కర్మఫలములను కోరియుండలేదు. అయిననూ, ఆతనికి ఆ కర్మఫలము పుణ్యరూపములో లభించును. ఆ పుణ్యము ఆతనికి సాధనను మరింత ముందుకు గొని పోగల జన్మను ప్రసాదించును. కావున జ్ఞానిని మినహాయించి, ఇతరులందరికీ కర్మఫలము గలదు. కర్మయోగికి కూడ కర్మఫలము ఉన్ననూ, ఆతని సంచితకర్మను బట్టి అనంత వికల్పములు సంభవమే అయిననూ, ఆతడు అధోగతిని పొందే ప్రసక్తి లేదు. సిద్ధాంతపరముగా ఆలోచిస్తే, కర్మయోగికి కూడ ఏరకమైన జన్మనైననూ పొందుటకు అవకాశము గలదు. అట్టి స్థితిలో ఆయన బొద్దింకగా గాని, పాముగా గాని ఏల జన్మించ రాదు? ఆతడు కర్మయోగిగా నుండి చేసిన కర్మకు ప్రాముఖ్యము కలుగును. జీవుని ఖాతాలో అనేక సంచితకర్మలు గలవు. వాటిలో చిరకాలము క్రితం చేసిన కర్మలు పరిపక్వమై ముందునకు వచ్చును. అవి ఇప్పుడు ప్రకటమై ఒక విశిష్టదేహముతో జన్మించునట్లు చేయును. కాని కర్మయోగ జీవనమును గడుపుతూ ఆధ్యాత్మిక-అనుశాసనమును అనుష్ఠించే సాధకుడు జ్ఞానోదయమునకు పూర్వమే మరణించినచో, ఈ కర్మలు తత్పూర్వము నందలి కర్మలనన్నిటినీ త్రోసిపుచ్చి తాము ముందునకు వచ్చును. కర్మయోగిగా నుండి చేసిన కర్మలు ఆధ్యాత్మికములు గనుక, అవి ప్రాముఖ్యమును సంతరించుకొనును. ఇందువలననే 'యోగభ్రష్టుడు పుణ్యముచే లభించే లోకములను పొంది, అచట అనేక సంవత్సరములు జీవించి, తరువాత పరిశుద్ధులు

మరియు సంపన్నులు అగు వారి గృహములో గాని, లేదా జ్ఞానులగు యోగుల వంశములో గాని జన్మించును (ప్రాప్య పుణ్యకృతాం లోకాన్ ఉషిత్వా శాశ్వతీస్సమాః, శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోభి జాయతే, అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్, 6-41, 6-42)' అని చెప్పబడినది. అట్టి యోగి తాను పూర్వజన్మలో చేసిన సాధనను అందుకొని అచటనుండి ముందునకు గొని పోవును (బుద్ధి సంయోగం లభతే పౌర్వదైహికమ్).

ఈ పుణ్యము అర్థకామరూపములగు ఫలములనిచ్చు పుణ్యము కంటె విలక్షణమైనది. ఇందువలననే ఆధ్యాత్మిక సాధనకు అనురూపమగు పరిస్థితిని జ్యోతిష్కులు చెడుదశ యని వర్ణించెదరు. లౌకిక దృష్టితో చూస్తే, అది యథార్థమే. అట్టి సాధకునకు స్థానభ్రంశము కలుగవచ్చును; లేదా అతడు నిరుద్యోగియై ఉండవచ్చును. కాని సాధకుడు జ్ఞానమును సంపాదించి ఉన్నతిని పొందుటకు అనుకూలించే మంచి కాలము అదియేనని నా అభిప్రాయము. ఇతర కాలములలో మానవుడు కేవలము కాయకష్టమును చేస్తూ గాలిని పీలుస్తూ జీవించుచున్నాడు. ఆ కాలములో ఉల్లేఖించదగిన అభివృద్ధి లేనిచో, అది ఆ వ్యక్తికి బ్రతుకును ఈడుస్తూ కొనసాగించే కాలము మాత్రమేనని చెప్పవచ్చును. కాని సాధకునకు తన ఆత్మను దర్శించే భాగ్యమునొసంగే సాధనా కాలమే భవ్యమగు కాలము. ఇది మహాభాగ్యము. పెద్ద ఇల్లు మొదలగు భాగ్యములు వాస్తవములో భాగ్యములు కానే కాదు. తన ఆత్మకేసి దృష్టిని మరల్చ గలిగే సాధకునకు ఆ దర్శనములో లభించే విశ్రాంతి భాగ్యములలోకెల్లా భాగ్యమని చెప్పుదగును.

కొన్ని పవిత్రకర్మలను చేసి సంపాదించిన పుణ్యప్రభావము వలన మాత్రమే మానవునకు ఈ సాధనలలో లగ్నమయ్యే భాగ్యము కలుగును. కర్మయోగియై నిత్య నైమిత్తిక కర్మలననుష్ఠిస్తూ జ్ఞానోదయమునకు పూర్వమే తనువును చాలించిన సాధకునకు ఆ పుణ్యఫలరూపముగా ఈ భాగ్యము కలుగును. అతని కర్మల యందు ఒక దివ్యత్వము కలదు. అతని లక్ష్యము అర్థకామములు కానిచో, అది ఖచ్చితముగా ఈశ్వరీయలక్ష్యము అగును. తనలో పరివర్తనను తెచ్చుకోవాలనే ఆకాంక్ష కూడ ఈశ్వరీయమే. ఇది సామాన్యమగు ఆకాంక్ష కాదు. ఏలయన, జనులు మారుటకు అంగీకరించరు. వారు తమ సౌకర్యమునకు అనురూపముగా జగత్తు అంతయు పరివర్తనను చెందవలెనని ఆకాంక్షించెదరు. కాని, దీనికి భిన్నముగా, సాధకుడు మానసిక ప్రసన్నతను పొందగోరి తనలో మార్పును కోరుచున్నచో, అది ఆధ్యాత్మిక పరివర్తనకు దారి తీయు ఆకాంక్ష యగును. ఈ రకమైన అంతః ప్రేరణకు మూలము ఒకటి ఉండవలెను. ఇట్టి ప్రేరణ

అందరిలో ఏల కలుగుట లేదు? ఇది మానసిక పీడలనుండి ఉదయించబోదు. మానసిక దుఃఖము గలవారందరు ఆధ్యాత్మిక సాధకులుగా మారిపోరు. అట్టి దుఃఖము గలవారు మాదకద్రవ్యములకు, మద్యమునకు బానిసలై ఆసుపత్రులు పాలు కావచ్చును; లేదా, నేరగాండ్రు కావచ్చును; లేదా, అట్టి వారు తిరుగుబోతులు (vagabonds) కావచ్చును. ఇట్టి వికల్పములు శతాధికముగా గలవు. ఈ పరివర్తనా ప్రక్రియలో కొంత మనః క్లేశము అంతర్భాగమై యుండును. బహుశః దుఃఖకరములగు ఈ పరిస్థితులు మనలో పరివర్తనను దెచ్చే ఈశ్వరీయ యోజనలో భాగము కావచ్చును! కాని పూర్వజన్మలో అంతః కరణశుద్ధి కొరకై ఆచరించిన నిత్యనైమిత్తిక కర్మల నుండి మాత్రమే పరివర్తనను చెందాలనే ఈ అంతః ప్రేరణ ఉదయించును. తనలో మార్పును గొనివచ్చుటకై సాధకుడు చేయు ప్రార్థనలన్నియు భవ్యములు, మరియు ఈశ్వరీయములు అని చెప్పదగును. మద్యపానమునకు బానిసలైన వారికి Alcoholics Anonymous అను సంస్థ చికిత్సను చేయును. మానవుడు తన కంటె అధికమగు ఒక మహాశక్తిని గుర్తించి, దాని యెదుట శరణాగతిని చేయుట వారి చికిత్సలో ఒక అంశమై యున్నది. 'నీవు వదిలి పెట్టి, భగవానునకు అప్పజెప్పుము' అని వారు ఉద్బోధించెదరు. పరిస్థితులను నీవు నియంత్రించే ప్రయత్నమును మానివేయుము. నిర్ణయమును భగవానునకు వదిలి పెట్టుము. ఇది వారి బోధయొక్క సారాంశము. మానసిక ప్రవృత్తిని తీర్చిదిద్దే ఈ బోధను ఆచరణలో పెట్టుట సరళము కాదు. భగవంతుని స్వరూపమును గురించి పరిజ్ఞానము లేనివారికి ఇది మరింత క్లేశముతో గూడిన పని. నా అభిప్రాయములో ఇట్టి ప్రార్థన ఈశ్వరీయమైనది మరియు ఆధ్యాత్మికమైనది. ఈ ప్రార్థనకు లక్ష్యము అర్థకామములు కావు. మారాలనే ఆకాంక్షతో నిండిన పరిపక్వమగు హృదయము నుండి ఈ ప్రార్థన ఉదయించినది. ఇదియే యథార్థమగు ప్రార్థన. ఇది పూర్వకృత పుణ్యఫలము కూడా. కావున, కేవలము అంతఃకరణశుద్ధి కొరకు చేయబడే నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానము త్యాగమనబడును.

సన్న్యాసమునకు, త్యాగమునకు మధ్య గల భేదము గురించి అర్జునుడు వేసిన ప్రశ్నకు భగవానుడీ శ్లోకములో సంగ్రహముగా సమాధానము చెప్పినాడు. సర్వకామ్యకర్మపరిత్యాగము సన్న్యాసము కాగా, సర్వకర్మఫలత్యాగము త్యాగమనబడును.

ఈ విషయములో కొన్ని వాదములు గలవు. వాటిని భగవానుడు స్వయముగా ప్రస్తావించుచున్నాడు.

అధ్యాయము 18, శ్లోకము 3:

त्याज्यं दोषवदित्येके कर्म प्राहुर्मनीषिणः ।
यज्ञदानतपः कर्म न त्याज्यमिति चापरे ॥ ३ ॥

త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః
యజ్ఞదానతపః కర్మ న త్యాజ్యమితి చాపరే (3)

కర్మ = కర్మ, దోషవత్ = దోషముతో గూడి యున్నది, త్యాజ్యమ్ = విడువ దగినది, ఇతి = అని, ఏకే = కొందరు, మనీషిణః = పండితులు, ప్రాహుః = చెప్పుచున్నారు, చ = మరియు, యజ్ఞదానతపః కర్మ = యజ్ఞము, దానము, తపస్సు అనే రూపములో నున్న కర్మ, న త్యాజ్యమ్ = విడువదగినది కాదు, ఇతి = అని, అపరే = మరికొందరు పండితులు.

> కర్మసహజముగా దోషముతో కూడియున్నది అగుటచే విడువదగినది అని కొందరు విద్వాంసులు చెప్పుచున్నారు. కాని యజ్ఞము, దానము మరియు తపస్సు అనే కర్మలను విడిచిపెట్ట తగదని మరికొందరు పండితులు చెప్పుచున్నారు (3).

మనీషిణః అనగా ఆత్మస్వరూపము యొక్క పరిజ్ఞానము (సాంఖ్యమ్) గల విద్వాంసులని శ్రీ శంకరులు వివరించిరి. మోక్షము కొరకై కర్మను త్యజించవలెను (త్యాజ్యం కర్మ) అని ఈ విద్వాంసులలో కొందరు (ఏకే) చెప్పుచున్నారు (ప్రాహుః). ఎట్టి కర్మను విడువవలెను? సహజముగా దోషము గల కర్మ (దోషవత్ కర్మ). కర్మ బంధమునకు కారణమగుటచే, అది దోషయుక్తమని పరిగణించెదరని శ్రీ శంకరులు వివరించిరి. దీని యర్థమేమనగా, సర్వకర్మలను పరిత్యజించి మానవుడు సన్న్యాస జీవనమును చేపట్టి జ్ఞానసాధనను మాత్రమే చేయవలెను. అట్టి స్థితిలో మాత్రమే మానవుడు మోక్షమును పొందగల్గును. కాని భగవానుని దర్శనమేమనగా, మానవుడు మోక్షము కొరకై సర్వకర్మలను విడిచి పెట్టి సన్న్యసించవచ్చును; లేదా, కర్మయోగ జీవనమును గడుపవలెను.

దోషవత్ కర్మ అను పదమునకు శ్రీ శంకరులు మరియొక అర్థమును చెప్పిరి. 'వత్' అను ప్రత్యయమునకు 'కలిగియుండుట' అని మాత్రమే గాక, 'వలె' అను అర్థము (తుల్యార్థః) కూడ గలదు. కుళ్లిన పండు మొదలగు చెడి పోయిన వస్తువులను మనము పారవేయుచుందుము

గదా! అదే విధముగా, కర్మను విడిచి పెట్టవలెను. ఏలయన, కర్మలు బంధహేతువులు. కర్మలన్నియు పాపపుణ్యఫలములనిచ్చి సంసార చక్రమును నిరంతరముగా త్రిప్పు చున్నవి. కర్మను చేయుట ద్వారా ఈ చక్ర భ్రమణము నుండి మనము బయట పడుట కల్ల. కావున మోక్షమును గోరువారు సర్వవిధముల కర్మలను పరిత్యజించవలెనని వారి వాదము.

కొందరు ఈ వాదమునకు చాల గట్టిగా కట్టుబడి యున్నారు. కాగా, కొన్ని కర్మలను విడువరాదని (న త్యాజ్యమ్) మరికొందరు (అపరే) అభిప్రాయపడుచున్నారు. యజ్ఞము, దానము, తపస్సు అను కర్మలను విడువరాదు. ఈ మూడింటిలో మరల దానమునకు విశేషప్రాధాన్యము గలదు. ఈ మూడింటిని విడువకుండగా అనుష్ఠించినవారికి మాత్రమే అంతః కరణశుద్ధి, మరియు తద్ద్వారా జ్ఞానము లభించునని కొందరు విద్వాంసుల (విచక్షణాః) అభిప్రాయము. భగవానుని అభిమతము కూడ అదియే. జ్ఞానయోగ్యత రానంతవరకు కర్మలను విడువరాదు. మోహముచే ఈ మూడు కర్మలను విడిచి పెట్టిన వాడు ఇటు సన్న్యాసి గాడు; అటు కామి గాడు. అట్టివాడు రెండింటికి చెడ్డవాడు (ఉభయ భ్రష్టః) అగును. జ్ఞాన నిష్ఠాయోగ్యత గల వ్యక్తి కర్మలను పూర్తిగా విడువదగును. దీనికే సర్వకర్మసన్న్యాసమని పేరు. ఇది పూర్తిగా విలక్షణమగు విషయము.

గీతాచార్యుడు ఇచట రెండు వాదములను ప్రస్తుతించుచున్నాడు. మోక్షమును గోరువాడు కర్మలనన్నిటినీ విడువవలెను అనునది మొదటిది. కామ్యకర్మలను విడిచి పెట్టి యజ్ఞదానతపస్సులను తప్పకుండగా చేయవలెను అనునది రెండవది. ఇట్లు సన్న్యాస, కర్మయోగములనే రెండు వికల్పములు గలవు. కాని ఈ వికల్పములు కర్తృత్వాభిమానము గల అజ్ఞానులకు సంబంధించినవి మాత్రమే. ఇచట వారు మాత్రమే చర్చనీయాంశము. మోక్షమును పొందుటకై మానవుడు సర్వకర్మసన్న్యాసి కాదగునా? లేక, కర్మయోగి కాదగునా? అనునది ఇచటి చర్చనీయాంశము కాదు. వాస్తవమగు సన్న్యాసమనదగిన సర్వ కర్మ సన్న్యాసము ఈ వికల్పములకు అతీతమైనది. దాని విషయములో ఈ సమస్య ఉదయించనే ఉదయించదు. ఏలయన, సర్వకర్మసన్న్యాసమే జ్ఞానము. అదియే మోక్షము. కావున ఆ సన్న్యాసము ఇచటి చర్చనీయాంశము కాదు. జ్ఞానమును పొందుట కొరకై చేపట్టదగిన సన్న్యాసమనే జీవన శైలిని గురించి మాత్రమే మనము చర్చించుచున్నాము. దానికి వివిదిషా సన్న్యాసమని పేరు. ఈ సన్న్యాసము, కర్మయోగము అను రెండింటిలో ఒక దానిని ఎన్నుకునే స్వేచ్ఛ మనకు గలదు. ఇందువలననే గీత యొక్క ఆరంభములో, మోక్షము కొరకై ద్వివిధ నిష్ఠ గలదనియు, వాటిలో ఒకటి విహితకర్మలనన్నిటినీ

పరిత్యజించుట, మరియొకటి యోగ్యమగు మనః ప్రవృత్తితో కర్మలనాచరించుట అని భగవానుడు చెప్పి యున్నాడు. ఈ రెండు మోక్షసాధనములే. భగవానుని తాత్పర్యము ఇదియే. శాస్త్ర తాత్పర్యము కూడ ఇదియే. ఈ ప్రకరణములో సర్వకర్మసన్న్యాసము చర్చింపబడుట లేదు. కాని సన్న్యాసము మరియు కర్మయోగము అనే జీవన శైలులు రెండు సర్వకర్మసన్న్యాసమునందు పర్యవసానమును చెందవలసినవే. సర్వకర్మసన్న్యాసమనగా ఆత్మ అకర్త మరియు అభోక్త అని తెలియుట తక్క మరియొకటి గాదు. జ్ఞానప్రభావముచే సంసారము నతిక్రమించిన వారు పుత్ర-ఏషణ (సంతానమును పొందవలెననే కోరిక), విత్త-ఏషణ (ధనమునందలి కోరిక), మరియు లోక-ఏషణ (స్వర్గాది లోకములయందలి కోరిక) అనే మూడు రకముల అతి ప్రముఖమగు కామనలనుండి విముక్తులై యుందురు. ఇట్టి సన్న్యాసమునకు విద్వత్సన్న్యాసమని పేరు. ఇచట అది చర్చనీయాంశము కాదు. మనమిచట వివిదిషా-సన్న్యాస కర్మయోగములను గురించి చర్చించు చున్నాము. ఈ రెండింటిలో మనము ఒక దానిని ఎన్నుకొని స్వీకరించుట ఖచ్చితముగా సంభవమే. ఈ రెండు వికల్పములు ఉన్న ఈ సందర్భములో గీతాచార్యుడగు శ్రీకృష్ణభగవానుడు ఇట్లు చెప్పుచున్నాడు :

**అధ్యాయము 18, శ్లోకము 4 :**

निश्चयं शृणु मे तत्र त्यागे भरतसत्तम ।
त्यागो हि पुरुषव्याघ्र त्रिविधस्संप्रकीर्तितः ॥ ४ ॥

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధస్సంప్రకీర్తితః (4)

భరతసత్తమ = భరతవంశములో శ్రేష్ఠమైన వాడా!, తత్ర = ఆ, త్యాగే = త్యాగము విషయములో, మే = నా యొక్క (వచనమును), నిశ్చయమ్ = నిశ్చయముగా, శృణు = వినుము, పురుష వ్యాఘ్ర = ఓ మనుష్యశ్రేష్ఠా!, త్యాగః = త్యాగము, త్రివిధః = మూడువిధములుగా నున్నదని, సంప్రకీర్తితః = కీర్తింపబడినది, హి = నిశ్చయము.

భరతవంశములో శ్రేష్ఠమైనవాడా! ఆ త్యాగము విషయములో నా యొక్క వచనమును నిశ్చయముగా వినుము. ఓ మనుష్యశ్రేష్ఠా! త్యాగము మూడు విధములుగా నున్నదని కీర్తింపబవడినది సుమా! (4)

అర్జునుడీ విషయమును స్పష్టముగా తెలుసుకొనవలెననే ఆకాంక్షతో, శ్రీకృష్ణుడు 'నా మాటను వినుము (శృణు మే)' అని పలికి అతనిని సావధానుని చేయుచున్నాడు. మనము సత్యమును తెలియుటకై విచారమును చేయుచున్నాము. కావున ఈ విధముగా వాదవివాదములు ఉన్న ప్రకరణములో భగవానుని నిశ్చితాభిప్రాయమును మనము తెలియవలసి యున్నది. ఇది సత్యముతో సంబంధము లేకుండగా కేవలము వివిధ వాదములను ప్రస్తావించుటతో మాత్రమే సరిపెట్టే సైద్ధాంతిక చర్చ కాదు. అర్జునునకు అట్టి చర్చ యందు అభిరుచి లేదు. అతడు M.A. (ఫిలాసఫీ) చదువుతున్న కాలేజీ విద్యార్థి కాడు. అతడు మృత్యు ముఖములో నున్న మానవుడు. అతడు ధర్మ సంకటములో పడి, శోకగ్రస్తుడై, దాని నుండి బయటపడే ప్రయత్నములో నున్నాడు. అతడు శ్రవణము చేయుచున్న విషయమునకు అతని జీవితమును ప్రభావితము చేయు శక్తి గలదు. కావున ఇతరుల వాదములయందాతనికి అభిరుచి లేదు. అతనికి సత్యమునందు మాత్రమే అభిరుచి గలదు. ఇతరుల వాదముల నుటంకించుటలో శ్రీకృష్ణునకైననూ అభిరుచి లేదు. కేవలము తన ఉపదేశమునకు ఉపక్రమములో ఆయన రెండు విభిన్నవాదములను వినిపించెను. ఈ రెండు వాదములు పూర్తిగా సరియైనవి గావనియు, వాటిలో ఎంతో కొంత సత్యము లేకపోలేదనియు ఆయనకు తెలియును. సన్న్యాస, కర్మ యోగములకు రెండింటికీ మోక్షమునిచ్చుటలో సమానమగు సామర్థ్యము గలదు. సర్వము వీటినీ ఎన్నుకొనే వ్యక్తిపై ఆధారపడి యుండును.

సోమరితనముచే కర్మను చేయుటకు భయపడి దానిని పరిత్యజించగోరు వ్యక్తి సన్న్యాసమునకు అర్హుడు కాడు. అతడు ఇంకనూ దానికి సంసిద్ధుడు కాలేదు. కర్మను అనుష్ఠించుటలో అధికమగు క్లేశము గలదు. వ్యక్తి ఉదయమే లేచి స్నానాదికమును పూర్తిచేసుకొని నిత్యకర్మానుష్ఠానమునకు కావలసిన వస్తువులనన్నిటినీ సమకూర్చు కొనవలెను. వేదవిహితకర్మ వరకు పోనేల? నిత్యకృత్యములైననూ తేలిక కాదు. ప్రతిదినము ఉదయమే నిద్రలేచి, గెడ్డము గీసుకొనుచుండుట సరళము కాదు. ఆపైన ధరించే వస్త్రముల విషయములో శ్రద్ధ తీసుకొనవలెను. అంగీ ఇస్త్రీ చేసినదై ఉండవలెను. ఈ తీరున ప్రతిదినము ఇది నిరంతరముగా కొనసాగుచుండును. నిన్న ధరించిన వస్త్రము ఈ రోజు ధరించుటకు పనికిరాదు. ఇదంతా పెద్ద తలపోటు. బస్సులో ఎక్కి ఆఫీసుకు వెళ్లవలెను. ఆ బస్సు జనులతో క్రిక్కిరిసి యుండును. లేదా, కారును తుడిచి శుభ్రము చేసుకొనవలెను. అది సరియగు స్థితిలో నుండునట్లు చూచు కొనవలెను. కాని సన్న్యాసియైనచో, భార్య మరియు పిల్లలు ఉండరు గనుక బాధ్యతలు ఉండవు. సన్న్యాసి సర్వమును సంపూర్ణముగా పరిత్యజించును. సన్న్యాసికి కర్తవ్యములు ఉండవు. ఇదంతా చూస్తే,

సన్న్యాసమే మేలు అనిపించును. సన్న్యాసి ఉద్యోగమునకు వెళ్లనక్కరలేదు. కర్మిష్ఠియగు గృహస్థుడు నియమిత కాలములో అగ్ని హోత్రమును చేయవలసి యుండును. కాని సన్న్యాసికి ఆ ఇబ్బంది లేదు. అతడు తెల్లవారు జామున లేవనక్కరలేదు. ఉదయము 12 గంటలకు లేచి అల్పాహారమును, భోజనమును కలిపి ఒకే సారి చేయవచ్చును. సన్న్యాసి ఎవరో ఒకరి గృహమునకు వెళ్లి భిక్షను చేసినచో, పని తీరిపోవును. మరియు, సన్న్యాసికి వస్త్రధారణలో ఇబ్బంది లేశమైననూ ఉండదు. సన్న్యాసి గెడ్డమును గీసుకొనే పనిలేదు. అతడు సర్వకాలములలో ఒకే రకము బట్టలను ధరించును. కావున అంగీ, ప్యాంటు ఇత్యాదులు పరస్పరము అనురూపముగా (match) ఉండ బనిలేదు. సన్న్యాసము చాల తేలికగా నుండే జీవనశైలి. ఇట్టి ధారణ మోహము. ఈ మోహముచే వ్యక్తి కర్మను చేయుటకు భయపడి, నిత్యనైమిత్తిక కర్మలను పరిత్యజించినచో, అతడు సాధించేది ఏమీ ఉండదు. మోహముచే ఈ తీరున కర్మను విడిచి పెట్టరాదని (మోహాత్ న త్యాజ్యమ్) మనము తెలుసుకొనుట ఆవశ్యకము.

భగవంతుడు తన తాత్పర్యమును ఇప్పుడు చెప్పబోవుచున్నాడు. అందువలననే, ఆయన అర్జునుని సావధానపరచినాడు. ఈ త్యాగము విషయములో (తత్ర త్యాగే) తాను చెప్పబోవు విషయమును అర్జునుడు ఖచ్చితముగా (నిశ్చయమ్) తెలుసుకోవాలని భగవానుని ఆకాంక్ష. ఆయన అర్జునుని 'భరతవంశీయులందరిలో శ్రేష్ఠమైనవాడా (భరతసత్తమ)' అని సంబోధించినాడు. ఈ జ్ఞానమును ఉపదేశించుమని గోరి అర్జునుడు తనకు గల మనః పరిపక్వతను ప్రకటము చేసినాడు. దుర్యోధనుడు ఇట్టి ఉపదేశమును కోరలేదు. గదా! యుద్ధరంగములో వీరులందరినీ దుర్యోధనుడు కూడ చూచినాడు. కాని అర్జునుని యందు గల దయాగుణము అతని యందు లేకుండుటచే అర్జునునికి వచ్చిన సమస్య అతనికి రాలేదు. అర్జునుని యందు పరిపక్వత గలదు. అందువలననే శ్రీకృష్ణుడు అతనిని 'భరతసత్తమ' అని సంబోధించినాడు. ఇంతేగాక, ఆయన అర్జునుని 'పురుషవ్యాఘ్ర' అని కూడ సంబోధించినాడు. అనగా, అతడు భయము నెరుంగని వాడు అని అర్థము.

ఈ త్యాగము మూడు రకములుగా నున్నదని శ్రీకృష్ణుడు అర్జునునితో చెప్పుచున్నాడు. ఈ విషయము మనకు తెలియుట ఎట్లు? ఇది శాస్త్రములో చక్కగా వివరించబడి యున్నది (సంప్రకీర్తితః). ఆత్మ జ్ఞానము లేనివాడు, కర్మను చేయదగినవాడు అగు సాధకునికి మాత్రమే ఈ త్యాగము వర్తించునని శ్రీశంకరులు గుర్తు చేయుచున్నారు. అట్టివాని విషయములో మాత్రమే ఈ త్రివిధ త్యాగము సంభవమగును. ఆత్మజ్ఞానము గలవానికి ఇది వర్తించదు. కర్మాధికారము

గల సాధకుడు కర్మ పరిత్యాగము యొక్క స్వరూపమును గూర్చి తెలుసుకొనవలెను.

**అధ్యాయము 18, శ్లోకము 5 :**

यज्ञदानतपः कर्म न त्याज्यं कार्यमेव तत् ।
यज्ञो दानं तपश्चैव पावनानि मनीषिणाम् ॥ ५ ॥

యజ్ఞదానతపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ (5)

**యజ్ఞదానతపః కర్మ** = యజ్ఞము, దానము, తపస్సు అనే కర్మ, న **త్యాజ్యమ్** = విడువబడరాదు, **తత్** = అది, **కార్యం ఏవ** = నిశ్చయముగా చేయబడవలెను, **యజ్ఞః** = యజ్ఞము, **దానమ్** = దానము, చ = మరియు, **తపః** = తపస్సు, ఏవ = నిశ్చయముగా, **మనీషిణామ్** = వివేకజ్ఞానము గలవారికి, **పావనాని** = పవిత్రము చేయునవి.

> మానవుడు యజ్ఞము, దానము, తపస్సు అనే కర్మలను విడిచి పెట్టరాదు; వాటిని నిశ్చితముగా ఆచరించవలెను. యజ్ఞదానతపస్సులు వివేక విజ్ఞానము గలవారిని నిశ్చితముగా పవిత్రము జేయును (5).

యజ్ఞము, దానము మరియు తపస్సు అనే కర్మలను విడిచి పెట్టరాదు (యజ్ఞదానతపః కర్మ న త్యాజ్యమ్). ఇది భగవానుని అభిమతము. ప్రతిదినము దేవతలకు యథావిధిగా హవిస్సును సమర్పించుట యజ్ఞమనబడును. దీనిని పోలిన ఇతరములగు ఆరాధనలు కూడ యజ్ఞమే యగును. తగిన దేశములో, తగిన కాలములో తగు వ్యక్తికి ధనాదికమును ఇచ్చుట దానమనబడును. ఆధ్యాత్మిక-అనుశాసనములన్నియు తపస్సు అనబడును. వీటిలో ఒక్క దానినైననూ విడువరాదు. తప్పక చేయవలెను (కార్యమేవ). ఎందువలన? అవి వివేకజ్ఞానము గలవారి యొక్క అంతః కరణమును శుద్ధి పరచును. మనీషిణామ్ అను విశేషణమునకు ప్రాముఖ్యము గలదు. ఏలయన ఇతరములగు ఫలములను గోరి చేయువారికి యజ్ఞదానతపః కర్మలు అంతః కరణశుద్ధిని ఈయజాలవు. ఇవి ధార్మిక కర్మలు గనుక వీటివలన ఏదో ఒక రకమైన అంతఃకరణశుద్ధి లభించవచ్చును. కాని ఫలాకాంక్షతో చేయువారలకు మోక్షమునకు ఆధారమయ్యే అంతః కరణశుద్ధిని ఈ కర్మలు ఈయజాలవనుటలో సందేహము లేదు. అంతఃకరణ శుద్ధి తక్క ఇతరమగు కర్మఫలమునందు అభిరుచి లేని వారలకు ఇవి అంతః కరణశుద్ధికి సాధనములగును.

భగవానుడీ విషయమును తరువాతి శ్లోకములో మరింత విశదపరచు చున్నాడు.

**అధ్యాయము 18, శ్లోకము 6 :**

एतान्यपि तु कर्माणि संगं त्यक्त्वा फलानि च ।
कर्तव्यानीति मे पार्थ निश्चितं मतमुत्तमम् ॥ ६ ॥

ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్ (6)

**తు** = కానైతే, **పార్థ** = పృథాకుమారా, ఓ అర్జునా!, **ఏతాని** = ఈ, **కర్మాణి** = కర్మలను, **అపి** = కూడా, **సంగమ్** = ఆసక్తిని, **చ** = మరియు, **ఫలాని** = ఫలములను, **త్యక్త్వా** = విడిచిపెట్టి, **కర్తవ్యాని** = చేయదగినవి, **ఇతి** = అని, **మే** = నా యొక్క, **నిశ్చితమ్** = సుస్పష్టమైన, **ఉత్తమమ్** = శ్రేష్ఠమగు, **మతమ్** = తాత్పర్యము.

పృథాకుమారా! ఓ అర్జునా! ఈ కర్మలను కూడ ఆసక్తిని మరియు ఫలములను విడిచి పెట్టి చేయవలెనని నా సుస్పష్టమైన శ్రేష్ఠమగు తాత్పర్యమై యున్నది (6).

ఈ యజ్ఞదానతపస్సులు మూడు నిత్యనైమిత్తిక కర్మలు. దానము నిత్యకర్మ కావచ్చును; లేదా, నైమిత్తిక కర్మ కావచ్చును. ఈ మూడు కర్మలు శుద్ధిని కలిగించుటలో సమర్థములే. అయిననూ, ఇచట ఒక సంగతిని గమనించవలసి యున్నది. ఈ కర్మలైననూ (ఏతాని అపి కర్మాణి) అంతః కరణశుద్ధికి ఉపాయములు కావాలంటే, వాటిని యోగ్యమగు మానసిక ప్రవృత్తితో ఆచరించవలెను. అహంకారమునందలి ఆసక్తిని విడనాడవలెను. 'ఇవి తప్పక చేయదగిన కర్మలు (కర్తవ్యాని)' అను భావనతో వాటిని చేయవలెను. ఈ విహిత కర్మలను చేయుట నా ధర్మము. నేను రోగిష్ఠి వాడనైనచో, వాటిని చేయలేను గదా! కావున వాటిని చేయుట ఆరోగ్యవంతుడనగు నాకు ధర్మము. అంతః కరణశుద్ధి కొరకు ఆధ్యాత్మిక ఉన్నతి కొరకు నేనీ వేదవిహిత కర్మలను చేయవలసి యున్నది. మరియు, నేను వాటి ఫలమును పరిత్యజించవలెను. పుణ్యకర్మలన్నింటికీ స్వర్గము మొదలగు అభీష్టఫలము గలదు. కాని స్వర్గమును పొందవలెను అని గాని, పుణ్యమును సంపాదించవలెను అని గాని ఆలోచన లేనిచో, ఫలమును పరిత్యజించినట్లు అగును. అప్పుడు మాత్రమే ఆ కర్మలు అంతః కరణశుద్ధికి సాధనములగును. కావున నిత్య జీవితములో నేను

చేయదగిన ఇతరకర్తవ్యములకు తోడుగా, ఈ యజ్ఞదానతపస్సులు కూడా నేను చేయదగిన విధులై యున్నవి. ఎట్టి ప్రతికూల పరిస్థితులలోనైననూ, నేను నిత్యపూజను విడనాడను.

'ఇది నా తాత్పర్యము (మే మతమ్)' అని భగవానుడు చెప్పుచున్నాడు. ఇది ఎట్టి దర్శనము? ఇది సందిగ్ధమగు దర్శనము కాదు. ఇది సుస్పష్టమగు దర్శనము (నిశ్చితం మతమ్). ఇది యోగ్యమైనది, మరియు సర్వశ్రేష్ఠమైనది (ఉత్తమమ్). ఈ కర్మలు అంతః కరణశుద్ధికి హేతువులగు చున్నవి. కావున వీటిని తప్పక అనుష్ఠించవలెను.

ఏతాని కర్మాణి అనగా కామ్యకర్మలని కొందరు వ్యాఖ్యానించిరి. శ్రీశంకరులిచట ఆ వ్యాఖ్యానమును ఖండించిరి. ఏతాని కర్మాణి అనగా యజ్ఞదానతపస్సులు అని వారు స్పష్టము చేసిరి. కర్మఫలమునందు అభిరుచి గలవానికి లభించేది పుణ్యమే గాని, అంతఃకరణశుద్ధి కాదు. మానవుడు చేయుచున్న కర్మ రాగద్వేషప్రేరితమై యుండగా, అది రాగద్వేషములనెట్లు ప్రభావహీనము చేయగల్గును? సాధారణముగా మానవుడు తాను చేసే ప్రతి పనిని ఫలమునపేక్షించియే చేయుచుండును. ఆ ఫలము వలన తన పరిస్థితి మెరుగు పడునని అతడు భావించును. మనస్సులో ఉదయించే కోర్కెలన్నిటినీ తీర్చుకున్నప్పుడు ఏమి యగును? ఆ కోరిక పునః పునః ఉదయించుచుండును. కోరిక తీరిన సమయములో కొంత సుఖము లభించును గదా! మరల అదే సుఖమును పొందుట కొరకై మానవుడు ఆ సుఖమునకు దారి తీసిన ప్రక్రియను మరల చేపట్టు చుండును. కోరిక తీరిననూ సుఖము కలుగనిచో, క్రమముగా ఆ కోరిక బలహీనమగును. చేసిన పనికి విరుద్ధమగు ప్రతిఫలము లభించినచో, మానవునకు దానియందు ద్వేషము ఏర్పడును. ద్వేషమనగా రాగము యొక్క రూపాంతరమే. ఒక పనిలో తీవ్రమగు వేదన లభించగా, మానవుడు మరల దాని జోలికి పోడు. ఒక విశిష్ట కామన పరిపూర్ణముగా తీరేది ఎప్పుడు? సాధారణంగా, ఒక కోరిక తీరింది అనుకుంటూ ఉండగానే, ఇది తన వెనుక మరికొన్ని కోరికలను శేషము ఉంచును. రాగము ఏదైనా కొన్ని పిల్ల రాగములకు జన్మను ఈయకుండగా తొలగిపోదు. ఇట్టి స్థితిలో, యజ్ఞ దానతపస్సులను కూడ కొన్ని ఫలములనపేక్షించి చేసినచో, రాగద్వేషములు తొలగేది యెట్లు? అంతః కరణశుద్ధి సంభవము కాదు. కావున, రాగద్వేషములతో వాటిని అనుష్ఠించుట సరిగాదు. ఫలాకాంక్షను విడనాడి వాటిని అనుష్ఠించవలెను. అప్పుడు మాత్రమే అవి అంతః కరణశుద్ధికి హేతువులు అగును. ఇది భగవానుని అంతిమ నిర్ణయము. దీనిలో సందేహములకు తావు లేదు.

హరిః ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీగణేశాయ నమః

మానవుడు అంతఃకరణశుద్ధిని పొందేటంతవరకు యజ్ఞదానతపస్సులను విడిచిపెట్టరాదు. రాగద్వేషముల పట్టునుండి విడుదలపొందిన వ్యక్తి కర్మలనన్నిటినీ పరిత్యజించి స్వేచ్ఛగా నుండవచ్చును. అట్టి జ్ఞాని యొక్క జీవితము ప్రారబ్ధ కర్మాధీనముగా సాగిపోవును. కర్మలను విడిచి పెట్టవలెననే అంతఃప్రేరణ గల వ్యక్తి సన్న్యాసి యగుటలో సమస్యలు ఉండవు. కాని కర్మలను చేయుటలోని క్లేశమునకు జడిసి కర్మలను త్యజించుట తగదు. క్లేశముతో కూడిన దానిని ప్రక్కన బెట్టి ఉల్లాసమగు దానికొరకు అర్రులు చాచుట తగదు. అంతః కరణశుద్ధి లేని వానికి అట్టి కర్మత్యాగము యొక్క పరిణామము శుభదాయకము కాబోదు. కావుననే, భగవానుడిట్లు చెప్పుచున్నాడు :

**అధ్యాయము 18, శ్లోకము 7 :**

नियतस्य तु सन्न्यास : कर्मणो नोपपद्यते ।
मोहात्तस्य परित्यागस्तामस : परिकीर्तित :॥ ७ ॥

నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే
మోహాత్తస్య పరిత్యాగస్తామసః పరికీర్తితః (7)

**తు**=కాని, **నియతస్య కర్మణః** = నిత్యకర్మయొక్క, **పరిత్యాగః** = పరిత్యాగము, **న ఉపపద్యతే** = చేయతగదు, **మోహాత్** = మోహము వలన, **తస్య** = దాని యొక్క, **పరిత్యాగః** = పరిత్యాగము, **తామసః** = తామసమని, **పరికీర్తితః** = చెప్పబడినది.

కాని నిత్యకర్మను విడువతగదు. దానిని మోహముచే విడిచి పెట్టినచో,
అది తామసిక త్యాగము అనబడును (7).

వేదముచే విధింపబడినవి, తప్పక చేయదగినవి అగు నిత్యనైమిత్తిక కర్మలకు నియతకర్మలని పేరు. వాటిని పరిత్యజించుట (నియతస్య సన్న్యాసః) తగదు (న ఉపపద్యతే). అజ్ఞానికి అంతః కరణశుద్ధికొరకై ఈ కర్మలను చేయుట అభీష్ట దాయకమగునని శ్రీశంకరులు చెప్పిరి. అజ్ఞాని రాగద్వేషములచే ప్రేరితుడై ఆ వ్యామోహములో నిత్యకర్మను పరిత్యజించినచో, అట్టి సన్న్యాసము సరియైనది కాదు. ఏలయన, అజ్ఞానికి అంతఃకరణశుద్ధి కొరకై ఉపాయము ఉండుట మంచిది. నిత్యనైమిత్తిక కర్మలు అట్టి ఉపాయము అగుచున్నవి. కాని మానవుడు మోహము వలన (మోహాత్)

సన్న్యాసమునందు శోభనాధ్యాస గలవాడై నిత్యనైమిత్తిక కర్మలను పరిత్యజించినచో, ఆ పరిత్యాగమునకు తామసికమని పేరు (తామసః పరికీర్తితః). కర్మలవలన అంతః కరణమునందు శుద్ధి నిర్మాణమగును. అందువలననే, వేదములో అనేక కర్మలు విధింపబడి యున్నవి.

ఇచట తాత్పర్యము సన్న్యాసమును పూర్తిగా త్రోసిపుచ్చుట కాదు. విహితకర్మపరిత్యాగము మాత్రమే త్రోసిపుచ్చబడుచున్నది. ఒక కర్మ విహితము అన్నచో, దానిని పరిత్యజించుట విరుద్ధమే గదా! కావున విహితకర్మను విడువరాదు. ఏల విడువరాదు? విహితము గనుక. మానసికముగా సంసిద్ధుడైన వ్యక్తికి సన్న్యాసము సంభవమే. కాని సన్న్యాసము అపవాదమే (exception) గాని; ఉత్సర్గము(rule) కాదు. మోహము వలన స్వీకరింపబడిన సన్న్యాసము తామస–సన్న్యాసమనబడును. ఇపుడు భగవానుడు రాజస–సన్న్యాసమును గురించి చెప్పుచున్నాడు :

**అధ్యాయము 18, శ్లోకము 8 :**

दुःखमित्येव यत्कर्म कायक्लेशभयात्त्यजेत् ।
स कृत्वा राजसं त्यागं नैव त्यगफलं लभेत् ॥ ८ ॥

దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ (8)

**యత్** = ఏ, **కర్మ** = కర్మను, **కాయక్లేశ భయాత్ ఏవ** = శరీరమునకు శ్రమ కలుగుననే భయము వలన మాత్రమే, **దుఃఖం ఇతి** = కష్టముతో కూడినది అను కారణముచే, **త్యజేత్** = విడిచిపెట్టునో, **సః** = అట్టివాడు, **రాజసమ్** = రాజసమగు, **త్యాగమ్** = త్యాగమును, **కృత్వా** = చేసినవాడై, **త్యాగఫలమ్** = త్యాగము యొక్క ఫలమును, **న లభేత్** = పొందడు, **ఏవ** = ఇది నిశ్చయము.

ఎవడైతే శరీరమునకు శ్రమ కలుగుననే భయముతో కష్టముతో కూడియున్నదను కారణముచే కర్మను విడిచి పెట్టునో, అట్టి వాడు చేయు త్యాగమునకు రాజసత్యాగమని పేరు. వానికి త్యాగము యొక్క ఫలము లభించదు. ఇది నిశ్చయము (8).

ఎవరైననూ నిత్యకర్మను విడిచిపెట్టుటకు కారణమేమి? అది క్లేశముతో కూడినది గనుక.

ప్రతిదినము కర్మను చేయుట కొరకై తెల్లవారు జామున నిద్ర లేచుచుండుట సరళమైన పని కాదు. మానవుడు తన శరీరమునకు కష్టము కలుగుననే భయముతో (కాయక్లేశభయాత్) కర్మను పరిత్యజించును (త్యజేత్). ఈ త్యాగము ఎట్టిది? ఇది రజోగుణమునుండి, తీవ్రమగు కామనలనుండి పుట్టిన రాజసత్యాగము. ఇట్టి త్యాగమును చేసిన వ్యక్తికి త్యాగఫలము లభించదు (త్యాగఫలం న లభేత్). శ్రీ శంకరుల దృష్టిలో సన్న్యాసి యనగా జ్ఞానము, లేదా కనీసము వివేకము గలవాడు. అట్టి సన్న్యాసము మోక్షము కొరకు ఉద్దేశించబడినది. అది మోక్షఫలమునిచ్చును. శరీరమును కష్టపెట్టరాదనే భావనతో కర్మలనన్నిటినీ విడిచిపెట్టి సోమరిపోతువలె జీవించే వ్యక్తి సన్న్యాసి కాడు. అట్టి వానికి త్యాగఫలము లభించదనుటలో సందేహము లేదు.

తామస, రాజసత్యాగములను వర్ణించిన పిదప, భగవానుడిపుడు సాత్త్వికత్యాగము యొక్క లక్షణములను వర్ణించుచున్నాడు :

**అధ్యాయము 18, శ్లోకము 9:**

कार्यमित्येव यत्कर्म नियतं क्रियतेऽर्जुन ।
सङ्गं त्यक्त्वा फलं चैव स त्यागस्सात्त्विको मत: ॥ ९ ॥

కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేర్జున
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగస్సాత్త్వికో మతః (9)

**అర్జున** = ఓ అర్జునా!, **యత్** = ఏ, **నియతం కర్మ** = నిత్యనైమిత్తిక కర్మ, **కార్యం ఇతి ఏవ** = చేయదగినది అను హేతువుచేత మాత్రమే, **సంగమ్** = ఆసక్తిని, **చ** = మరియు, **ఫలమ్** = ఫలమును, **ఏవ** = నిశ్చయముగా, **త్యక్త్వా** = విడిచిపెట్టి, **క్రియతే** = చేయబడుచున్నదో, **సః** = ఆ, **త్యాగః** = త్యాగము, **సాత్త్వికః** = సాత్త్వికమని, **మతః** = పరిగణించబడుచున్నది.

> ఓ అర్జునా! ఆసక్తిని మరియు ఫలమును విడిచిపెట్టి, ఇది తప్పక చేయదగినది అను హేతువు చేత మాత్రమే నిత్య నైమిత్తిక కర్మను చేసినచో, అది సాత్త్వికత్యాగ మనబడును (9).

తప్పనిసరిగా చేయవలెను అని శాస్త్రముచే విధించబడిన కర్మకు నియత కర్మయని పేరు. దీని అనుష్ఠానములో వికల్పమునకు తావు లేదు. లౌకికములు మరియు వైదికములు అగు నిత్య

విధులన్నియు నియతకర్మలో అంతర్భాగములే. 'వీటిని అనుష్ఠించుట నా విధి (కార్యం ఇతి)' అను మనః ప్రవృత్తితో ఆ కర్మలను చేసినచో, అవి సాత్త్వికకర్మలు అగును. వీటిని చేయుటలో కర్తవ్యభావన తక్క మరియొక ప్రేరణ లేదు. మనము వీటిని అంతః కరణశుద్ధి కొరకు చేసెదము. అంతః కరణశుద్ధి వ్యక్తి కంటె భిన్నముగా లేదు. కావున దానిని ప్రత్యేకఫలముగా పరిగణించరు. మానవుడు కర్మను చేయునప్పుడు 'దీనిని నేను చేయుచున్నాను' అనే అహంకారభావనతో చేయును. కాని ఇట్టి ఆసక్తిని విడిచి (సంగం త్యక్త్వా) నిత్యకర్మను చేయవలెను. దీనిని చేయునప్పుడు అహంకారభావనకు బదులుగా ' ఇది నాకు కర్తవ్యము గనుక నేను దీనిని చేయుచున్నాను' అను భావనతో చేయవలెను. దీనికే సమర్పణమని పేరు. 'ఈ కాలములో, ఈ దేశములో ఈ కర్మను చేయుట అవశ్యకము; దీనిని చేసి తీరవలెను. దీనిలో నాకు మరియొక వికల్పము లేదు; దీనిని నేను ఈశ్వరార్పణ బుద్ధితో చేయుచున్నాను. సంగత్యాగమనగా నిదియే. ఫలమును విడిచిపెట్టుట (ఫలం త్యక్త్వా) యనగా కర్మను పుణ్యము కొరకు గాని, కీర్తి ప్రతిష్ఠల కొరకు గాని, లేదా అధికారము కొరకు గాని చేయకుండుట. ఇట్టి ఫలప్రేరణ లేకుండగా, కేవలము అంతః కరణశుద్ధి మరియు ఈశ్వరప్రీతి కొరకు కర్మను చేసినచో, దానియందు ఫలము త్యజించబడినది. ఇచట త్యాగము చేయబడేది కర్మఫలమే గాని, కర్మ కాదు. ఇదియే సాత్త్వికత్యాగమని చెప్పబడినది (త్యాగస్సాత్త్వికో మతః). రాజస తామస త్యాగములలో మోహము వలన గాని, కాయక్లేశభయము వలన గాని కర్మ పరిత్యజింపబడును. కాని సాత్త్వికత్యాగములో కర్మ అనుష్ఠింపబడి, కర్మఫలము పరిత్యజించబడును.

శ్రీశంకరులిచట ఒక టిప్పణిని చేసిరి. నిత్యకర్మలకు కూడ ఖచ్చితముగా ఫలము గలదని ఇంతకు ముందే చెప్పబడినది. భగవానుడే స్వయముగా ఆ విషయమును చెప్పియున్నాడు. శ్రీశంకరులీ విషయమును ఇచట గుర్తుచేయుచున్నారు. ఏలయనగా, నిత్యనైమిత్తిక కర్మలకు ఫలము లేదనియు, కాని వాటిని చేయనిచో ప్రత్యవాయము చుట్టు కొనును గనుక (అకరణే ప్రత్యవాయః) వాటిని చేయవలెననియు ఒక వాదము గలదు. కాని అది సరిగాదు. నిత్యనైమిత్తిక కర్మలతో సహా కర్మలన్నియు ఫలమునిచ్చును. అందువలననే, వాటిని పరిత్యజించుట సంభవమగుచున్నది. కావున నిత్యనైమిత్తిక కర్మలకు కూడ ఖచ్చితముగా ఫలము గలదు. కాని ఆ విధమగు పుణ్యమునందు ఆకాంక్ష లేని సాధకుడు వాటిని ఆ సంకల్పముతో ఆచరించడు. అతని ఆకాంక్ష అంతఃకరణశుద్ధి మాత్రమే అయి ఉన్నది.

నిత్యకర్మలకు ఫలము లేదనే వాదమును కూడ శ్రీశంకరులు తాత్కాలికముగా అంగీకరించి సాత్త్వికత్యాగమును మరల వివరించిరి. నిత్యకర్మలకు శ్రుతి ఫలమును చెప్పలేదు గనుక, వాటిని

ఆచరించినచో అంతఃకరణశుద్ధి యను ఫలము లభించుననియు, ప్రత్యవాయ దోషము దూరమగుననియు భావించి శాస్త్రపరిజ్ఞానము లేని వ్యక్తి ఆ కర్మను చేయుచుండవచ్చును. అతడు ఆ సంకల్పమును కూడ విడిచి పెట్టినచో, అది ఫలత్యాగమగునని శ్రీశంకరులు చెప్పిరి. ఇట్టి సాధకుడు కర్మను దేనికొరకు చేయవలెను? కేవలము ఈశ్వరప్రీతి కొరకు మాత్రమే. శ్రద్ధ అనగా నదియే. అతడు అంతఃకరణశుద్ధి గురించి యైననూ ఆలోచించనక్కరలేదు. శాస్త్రము ఒక కర్మను విధించుచున్నది. కావున అతడు దానిని చేయును. దానివలన అంతఃకరణ శుద్ధి లభించునా? లేక, మరియొకటి లభించునా? అను విషయము నాతడు పట్టించుకొనడు. అతడు శాస్త్రముయొక్క ఆదేశమును, అనగా భగవానుని ఆదేశమును పాటించుట కొరకు మాత్రమే కర్మను ఆచరించును. ఆ ప్రేరణ చాలును. ఇట్టి మనః ప్రవృత్తి మరియు శ్రద్ధ ఉన్నచో, అది సాత్త్వికత్యాగము అగును.

మనము చేసే వైదిక కర్మలన్నింటిలో సంకల్పమును పఠిస్తాము. సకలదురితములు నశించి తద్ద్వారా ఈశ్వరుని ప్రీతి కొరకై నేను ఈ కర్మను చేయుచున్నాను (మమ ఉపాత్తసమస్తదురిత క్షయ ద్వారా శ్రీపరమేశ్వరప్రీత్యర్థమ్) అని మనము ప్రకటిస్తాము. ఇదియే కర్మయోగము. పరమేశ్వరప్రీతి యనగా ఆయనకు ఉల్లాసమును కలిగించుట అనుకోరాదు. శాస్త్రముయొక్క ఆదేశమును పాటించుట కొరకై మనము అట్లు చెప్పెదము. అదియే ఈశ్వరప్రీతి. నిత్యనైమిత్తిక కర్మలకు సంచితమై యున్న పాపములను ప్రభావహీనముగా చేయు సామర్థ్యము గలదని శాస్త్రము చెప్పుచున్నది. కావున వాటి అనుష్ఠానము వలన అంతఃకరణ శుద్ధి సిద్ధించుట సహజమే. ఈ భావనను కూడ విడువదగును. శాస్త్ర విహితము గనుక కర్మను చేయవలెను; ఉల్లాసముతో చేయవలెను. అట్లు చేయగలిగిన సాధకునకు ఫలము తప్పక లభించును. దానిలో సందేహము లేదు.

శ్రీశంకరులిచట ఒక అభ్యంతరమును ప్రస్తావించిరి. కర్మ పరిత్యాగము (సన్న్యాసము) మూడు విధములని ఆరంభములో చెప్పబడెను. తరువాత వాటి వివరణ కొనసాగెను. కాని వాటిలో రెండు కర్మ పరిత్యాగములై యుండగా, మరియొకటి ఫలత్యాగము అగుచున్నది. అనగా రెండు కర్మసన్న్యాసములు కాగా, మూడవది కర్మయోగము అగుచున్నది. వీటిని ఒకే వర్గములో కలిపి జతగట్టుట ఎట్లు సంభవమగును? షడంగవేత్తలగు ఇద్దరు బ్రాహ్మణులు మరియు ఒక క్షత్రియుడు కలిసి వచ్చుచుండగా, 'ముగ్గురు బ్రాహ్మణులు వచ్చుచున్నారు' అని ఒకడు పలికినాడు. 'ముగ్గురు బ్రాహ్మణులు' అనే అతని వచనము ఎట్లుపొసగును? ప్రస్తుతములో మనముందు మూడు త్యాగములు గలవు. ఒకటి మోహము వలన చేసే కర్మత్యాగము (తామసత్యాగః). రెండవది కాయక్లేశభయము వలన చేసే కర్మత్యాగము (రాజసత్యాగః). మూడవది కర్మఫలత్యాగము (సాత్త్వికత్యాగము).

వీటిలో మొదటి రెండు కర్మత్యాగములు కాగా, మూడవది కర్మఫలత్యాగము. శ్రీశంకరులిట్లు వివరించిరి: ఇది దోషము కాదు. ఏలయన, మనము కర్మత్యాగమును గురించి మాటలాడుట లేదు. కేవలము కర్మఫలత్యాగమును గురించి మాత్రమే మాటలాడుచున్నాము. ఈ మూడింటిలో త్యాగము సమానాంశము. ఈ వర్గీకరణ వలన కర్మఫలత్యాగము స్తుతించబడుచున్నది. ఏలయన, సాత్త్వికత్యాగము అనే ఘనత దానికి దక్కినది. మోహము వలన (తామసః), లేదా కాయక్లేశభయము వలన (రాజసః) చేయబడే త్యాగములు పూర్తిగా త్రోసిపుచ్చబడినవి. ఈ వర్గీకరణ వలన రెండు త్యాగములు నిందింపబడినవి. కర్మఫలత్యాగము సాత్త్వికము అని గుర్తించుట ద్వారా అది స్తుతించబడినది. కావున కర్మఫలమును ప్రక్కన బెట్టి కర్మను చేయుచుండుటయే శ్రేష్ఠము. అట్లు చేయుట వలన అంతఃకరణ శుద్ధి లభించును.

తరువాతి శ్లోకమును శ్రీశంకరులిట్లు ఉపక్రమించినారు : అహంకారమును, కర్మఫలాసక్తిని విడిచిపెట్టి కర్మలనాచరించు వాని మనస్సునందు ఫలాకాంక్ష అను దోషము నెలకొనదు. ఈ తీరున నిత్యకర్మల వలన మనస్సు పరిశుద్ధమగును. అంతవఁకు మనస్సులో నెలకొని యున్న రాగద్వేషములు కూడ తొలగిపోవును. కామ్యకర్మలను ప్రక్కన బెట్టి నిత్యకర్మలను చేయుచుండుట వలన సాధకుని మనస్సు రాగద్వేషములలో చిక్కుకొనదు. ఈ తీరున కామ్యకర్మలను పరిహరిస్తూ, యోగ్యమగు మనః ప్రవృత్తితో నిత్యకర్మలను చేయుచుండుట వలన సాధకుని మనస్సు ఈ శుద్ధి ప్రక్రియకు లోబడి పరిశుద్ధమగును. అట్టి మనస్సులో ప్రసన్నత సామ్రాజ్యమేలును. అది ఆత్మదర్శనయోగ్యమగును. అనగా దానియందు ప్రతిబంధకములు లేని ఆత్మానాత్మవివేకసామర్థ్యము నెలకొనును. కావున కర్మయోగ జీవనమును గడుపుతూ, మోక్షసాధనమగు ఆత్మజ్ఞానమునకు అంకితమైన వ్యక్తియందు ఇంచుమించు పరిశుద్ధమైన ఇట్టి అంతఃకరణము నెలకొనును. అట్టి వానికి క్రమముగా సుస్పష్టమగు ఆత్మజ్ఞానము ఉదయించును. ఈ విషయమును భగవానుడు తరువాతి శ్లోకములో ఇట్లు చెప్పుచున్నాడు:

**అధ్యాయము 18, శ్లోకము 10:**

न द्वेष्ट्यकुशलं कर्म कुशले नानुषज्जते।
त्यागी सत्त्वसमाविष्टो मेधावी च्छिन्नसंशय: ॥ १० ॥

న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే
త్యాగీ సత్త్వ సమావిష్టో మేధావీ ఛిన్న సంశయః (10)

సత్త్వసమావిష్టః = శుద్ధమగు అంతఃకరణముతో కూడియున్న వాడు, త్యాగీ = కర్మఫలములను పరిత్యజించిన వాడు, మేధావీ = వివేకజ్ఞానము గలవాడు, ఛిన్నసంశయః = తొలగిపోయిన సందేహములు గలవాడు, అకుశలమ్ = అశుభకరమగు, కర్మ = కర్మను, న ద్వేష్టి = ద్వేషించడు, కుశలే = శుభకర్మయందు, న అనుషజ్జతే = పట్టుకొని వ్రేలాడడు.

కర్మఫలములను పరిత్యజించినవాడు, శుద్ధాంతః కరణము గలవాడు, వివేకజ్ఞానము గలవాడు, మరియు తొలిగిపోయిన సందేహములు గలవాడు నగు వ్యక్తి అశుభకరమగు కర్మను ద్వేషించడు; శుభకరమగు కర్మను పట్టుకొని వ్రేలాడడు (10).

మనము ముందుగా సాత్త్వికత్యాగిని గురించి తెలుసుకుందాము. అతడు కర్మఫలమును మరియు, అహంకారమును వదిలిపెట్టిన త్యాగియని మనము చూచియున్నాము. అతడు విశిష్టఫలాకాంక్ష లేనివాడై ఈశ్వరార్పణబుద్ధితో నిత్యనైమిత్తిక కర్మలనాచరించును. అపుడాతని హృదయములో సత్త్వ గుణము రాజ్యమేలును (సత్త్వ సమావిష్టః). అతని బుద్ధియందు రజస్తమోగుణముల ప్రాధాన్యము లేదు. అతని బుద్ధి సత్త్వగుణ ప్రధానముగ నుండుటచే అతనికి సుస్పష్టమగు ఆత్మానాత్మవివేకజ్ఞానము కలిగినదని శ్రీశంకరులు వివరించిరి. అతడు త్యాగి (కర్మయోగి) గనుకనే, శుద్ధమగు అంతఃకరణము గలవాడై దానియందు ఆత్మానాత్మవివేకము గలవాడాయెను. ఇచట కర్మయోగము, కావుననే సత్త్వసంశుద్ధి, దానివలన ఆత్మానాత్మ వివేకము అను క్రమము గలదు. ఈ వివేకము గలవాడు మేధావి యనబడును. మేధా, అనగా, ఈ జ్ఞానము కలవాడు మేధావి యనబడును. సాధకుడు ముందుగా కర్మఫలత్యాగి యగును. అనగా ఇట్టి మనః ప్రవృత్తితో కర్మనాచరించి, ఈ జ్ఞానమును పొందుటకు అర్హుడగును (సత్త్వసమావిష్టః). అపుడాతనిలో ఈ జ్ఞానము ఉదయించి, అతడు మేధావి యగును.

ఆతనిలో జ్ఞానము ఉదయించగానే, సంశయములన్నియు తొలగిపోవును (ఛిన్నసంశయః). ఆత్మ కాలపరిచ్ఛిన్నమా? కాలాతీతమా? నిత్యమా? అనిత్యమా? దాని స్వరూపము ఆనందమా? దుఃఖమా? ఆత్మ కర్తయగునా? కాదా? భోక్త యగునా? కాదా? ఈశ్వరుడు నాకంటె భిన్నమా? కాదా? ఆత్మానాత్మ వివేకముతో విచారమును చేసి ఆత్మజ్ఞానమును పొందిన వానికి ఈ సంశయములన్నియు పటాపంచలగును. ఈ సంశయములు అజ్ఞానమునుండి పుట్టును. సంశయమునకు మరియొక హేతువు లేదు. జ్ఞానము, సంశయము ఒకే అధికరణమునందు కలిసి ఉండజాలవు. కావున మేధావియైన వ్యక్తిలో సందేహములన్నియు దూరమగుట సహజమే. శాస్త్రము

కూడ ఈ విషయమును ధ్రువీకరించుచున్నది. 'ఈ అభేదదర్శనము కలుగగానే హృదయములోని ముడి విడిపోవును; సంశయములన్నియు దూరమగును; కర్మలన్నియు నష్టమగును (భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః, క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే)'. హృదయగ్రంథి అనగా అజ్ఞానము, దాని వలన కలిగే కామన, దాని నుండి జనించే కర్మ మరియు దాని ఫలము అను వాటిని (అవిద్యా-కామ-కర్మ) నిర్దేశించే పారిభాషిక పదము. దీనివలననే సంసారము నిరంతరముగా కొనసాగుచున్నది. మానవుడు దీనినుండి బయట పడుట యెట్లు? ముందుగా సాధకుడు కర్మయోగముచే కర్మను ప్రభావహీనముగా చేసి, ఆ స్థాయిలోనే దాని బంధకశక్తిని సర్దుబాటు చేయును. ఈ రకమైన సంసిద్ధతతో అతడు ఆత్మవిచారమును చేసి, అజ్ఞానమును తొలగించుకొనును. దాని ప్రభావముచే ఈ మూడు పేటల ముడి (హృదయ గ్రంథిః) విడిపోవును (భిద్యతే). దీని అర్థమేమనగా, సందేహము లన్నియు తొలగిపోవును; కర్మలకు ఆశ్రయముగా నుండే జీవుడే లేడు గనుక, కర్మలన్నియు నష్టమగును. ఇదంతా జరిగేది ఎప్పుడు? ఈ సమస్త సృష్టికి అభిన్న నిమిత్తోపాదానకారణమగు బ్రహ్మ ఆత్మయే అను జ్ఞానము కలిగిన నాడు. సర్వసంశయ వినిర్ముక్తమగు ఆత్మజ్ఞానమును పొందుటయే మోక్షమనియు, మోక్షమనగా మరియొకటి కాదనియు శ్రీశంకరులిచట వివరించిరి.

ఈ జ్ఞానమును పొందిన వ్యక్తి యందు 'నాకు ఇంకనూ ఇది చాలదు' అనే అపూర్ణత్వభావన యొక్క సమస్య దూరమగును. తనకు మోక్షము లభించినదా? లేదా? యను సందేహము అతనికి కలుగదు. 'ఏమండీ, నాకీ జ్ఞానము కలిగినదంటారా?' అని అతడు ఇతరులను ప్రశ్నించడు. సాధకుడు మేధావి కాగానే ఇట్టి సంశయములన్నియు దూరమగును. ఆత్మజ్ఞానమును పొందిన వ్యక్తి విష్ణువు యొక్క ధామమునకు చేరుకొనే అర్హతను పొందునని కొందరి అభిప్రాయము. అట్టి వారిలో ఒకడు ఈ జ్ఞానిని, 'నీకు ఆత్మజ్ఞానము ఉన్ననూ, నీవింకనూ వైకుంఠమును పొందలేదు గదా! వైకుంఠప్రాప్తియే మోక్షము' అని ఎదుర్కొని వాదను కొనుడు. ఇట్టి వాదములు అతని యందు సంశయములను కలిగించ జాలవు. తనకు మోక్షము లభించి నదా? లేదా? అను సంశయము అతనికి కలుగదు. కొందరు మతదురహంకారులు అతనిని 'నీకు తెలిసినది ఏమి?' అని ప్రశ్నించగా, 'నాకు తెలిసినది నేనే' అని అతడు బదులిడును. వారు వెంటనే సంకోచము లేకుండగా, 'అది చాలదు; నీవింకనూ పాపివే; కావున నీకు నరకము తప్పదు' అని పలికెదరు. వారి ఇట్టి వచనములు అతనియందు సంశయములను కలిగించునా? సంశయములు కలిగినచో, అతడు మేధావి కాజాలడు. అతడు మేధావి యైనచో, సర్వసంశయముల నుండి వినిర్ముక్తుడై యుండును (ఛిన్నసంశయః).

జ్ఞానమును పొందిన వ్యక్తి (మేధావి) ఏమి చేయును? న ద్వేష్టి అకుశలం కర్మ. అనగా అశోభనమగు కామ్యకర్మను అతడు ద్వేషించడు అని శ్రీశంకరులు చెప్పిరి. కామ్యకర్మలు అశోభనమగుటకు కారణమేమి? అవి కూడా వేదవిహితకర్మలే. కాని పుణ్యమును సంపాదించి దాని వలన భవిష్యత్తులో కొన్ని సుఖములననుభవించుటకు ఈ కామ్యకర్మలు ఉద్దేశించబడినవి. ఆ పుణ్యము ననుభవించుటకై దేహమును దాల్చవలెను. ఈ విధముగా ఈ కర్మలు నూతనదేహారంభమునకు, తద్వారా సంసారమును నిత్యము చేయుటకు హేతువులగుచున్నవి. సంసారమును శాశ్వతము చేయుటచే కామ్యకర్మ అశుభమని వర్ణించబడినది. కాని జ్ఞానమును పొందిన వ్యక్తి కామ్యకర్మనైననూ ద్వేషించడు. కామ్యకర్మ లౌకికమైనా, వైదికమైనా సంసారమును బలపరుచునే గాని మోక్షసాధనలో సహకరించదు. ఈ సత్యమును జ్ఞాని యెరుంగును. అయిననూ, ఇతరులు కామ్యకర్మలను చేయుచుండగా చూచి జ్ఞాని ద్వేషించడు. ఇట్లు ద్వేషించు వ్యక్తియందు ఇంకనూ సమస్యలు గలవు. ఇతరులు చేయు కర్మలను గురించి మనము చింతిల్లనేల? వారికి కామనలు గలవు. కావున వారు వాటిని అనుష్ఠించుచున్నారు. ఆ కర్మలపై చిన్నచూపు, లేక ద్వేషమునకు కారణమేమున్నది? ఏ కర్మనైననూ ద్వేషించవలసిన పని లేదు.

ఇంతే గాక, జ్ఞాని మోక్షము కొరకై అనుష్ఠింపబడే శుభకరమైన నిత్యకర్మను పట్టుకొని వ్రేలాడడు. పూర్వములో అతనికి ఆ కర్మయందు ఒక విశిష్టమగు శ్రద్ధ ఉండెడిది. కాని ఇపుడాతడు దానికి బద్ధుడై లేడు. అతడు నిత్యకర్మను అనుష్ఠించిననూ, దానియందు సంలగ్నుడై ఆసక్తిని కలిగి యుండడు. నిత్యకర్మ మోక్షమును పొందుటలో సహకరించును. దానిని అనుష్ఠించి అతడు సత్త్వశుద్ధిని, తద్వారా మోక్షరూపమగు జ్ఞానమును పొందియున్నాడు. కాని అతనికి ఆ కర్మయందు అతిశయించిన ప్రేమ లేదు. ఎందువలన? గాయము తగిలి నప్పుడు దానిపై పట్టీని వేసినచో, అది ఆ గాయమును మరిన్ని దెబ్బలు తగులకుండగా రక్షించును. పట్టీ గాయమును సూక్ష్మక్రిముల బారినుండి రక్షించి తొందరగా మానునట్లు చేయును. గాయము మానిన తరువాత మనము పట్టీని తీసివేయుదుము. ఆ పట్టీ విషయములో మన ప్రవృత్తి ఎట్లుండును? అది ప్రీతి పాత్రమగు వస్తువా? కాదు. దాని పనిని అది పూర్తిచేసినది గావున, మనము దానిని తీసి పారవైచెదము. అదే విధముగా, నిత్యకర్మ జ్ఞానికి ఒకప్పుడు సహకరించిన దనుటలో సందేహము లేదు. కావున అతడు దానిని సర్వదా ప్రేమించవలెననుట సరిగాదు. అతడు దానికి అతీతముగా ఎదిగినాడు. దానిని అతడు ఇప్పుడు కూడా చేయుచుండ వచ్చును. కాని దాని పని పూర్తి అయినది గనుక, దానిపై అతనికి సాధనాభావము ఉండదు. నిత్య కర్మకు అంతిమఫలము మోక్షము. దానిని అతడు పొందినాడు. కావున దానియందు అతనికి విశిష్టప్రయోజనము కానరాదు. అందువలన అతడు దానియందు విశిష్టమగు ఆసక్తిని కలిగియుండడు

(న అనుషజ్జతే). మరియు అతడు కామ్యకర్మను ద్వేషించడు (న ద్వేష్టి). ద్వేషము గాని రాగము గాని లేనివాడు సన్న్యాసి యనబడునని (జ్ఞేయస్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి) నాల్గవ అధ్యాయములో మనము చూచియున్నాము. అతడు ఒక దాని వెంట పడడు; ఇంకొక దానిని ద్వేషించడు. ఇదే విషయము మరల ఇచట చెప్పబడినది.

ఈ శ్లోకములో ద్వితీయార్ధమును ముందుగా అన్వయించవలెను. మనము అటులనే చేసినాము. అట్లు గానిచో, దీని అన్వయములో చాల తికమక పడుటకు అవకాశము గలదు. కొందరు వ్యాఖ్యాతల విషయములో అటులనే జరిగినది. ఇచట ఒక క్రమము గలదు. ముందు త్యాగి. తరువాత సత్త్వసమావిష్టః. పిదప మేధావి. ఆఖరున ఛిన్నసంశయః. ఇట్టివాడు ముక్తుడు. వానికి అశోభనకర్మయందు ద్వేషము గాని, శోభన కర్మయందు అనురక్తి గాని ఉండదు. అతడు ఎట్టి వాడు? సత్త్వసమావిష్టుడగు త్యాగి కర్మయోగియై ఉండవచ్చును; ఇంకనూ ముక్తుడు కాకపోవచ్చును. శ్రీశంకరులీ విషయమును ఇట్లు వివరించిరి: 'నేను కర్తను' అనే ధారణ కలిగి శాస్త్రముచే కర్మయందు నియోగింపబడిన కర్తను గురించి మనమిచట చర్చించుచున్నాము. ఆ కర్త కర్మయోగజీవనమును గడుపు చుండగా కొంతకాలమునకు అతని అంతఃకరణము పరిశుద్ధమై, ఆత్మ సర్వకర్మ వినిర్ముక్తమనియు, పుట్టుక-మరణములకు మరియు వాటి మధ్య నుండే వికారములకు అధీనము గాదనియు అతడు గుర్తించును. అపుడాతడు ఆ జ్ఞానప్రభావముచే సర్వకర్మలను సన్న్యసించును. అనగా అతడు కర్మలను తాను చేయడు; ఇతరులచే చేయించడు (నైవ కుర్వన్ న కారయన్). అతడు నైష్కర్మ్యసిద్ధిలో గూడిన జ్ఞాననిష్ఠయందు ఉండును. ఆత్మ నిష్క్రియము అనే సత్యమునెరింగి అతడు నిష్క్రియాస్వరూపుడై యుండును.

అట్టి స్థితిలో పుణ్యము ఎవరికి చెందును? పుణ్యము కర్తకు చెందునే గాని, నిష్క్రియమగు ఆత్మకు కాదు. నిష్క్రియమగు ఆత్మ ఎన్నడైననూ కర్మలను చేయదు గాన, అది పుణ్యపాపములను ప్రోగు చేసుకొనదు. ఇంతకు ముందు ప్రోగు చేసుకున్న పుణ్యపాపముల మాట యేమి? ఇది మరియొక ప్రశ్న. జ్ఞానియగు వ్యక్తికి జ్ఞానము కలిగిన తరువాత కొత్త కర్మలతో సంబంధము ఉండకపోవచ్చును. కాని పాత కర్మల మాట యేమి? ఉదాహరణకు, ఒక వ్యక్తి అధికముగా మద్యమును సేవించుటచే అతని కాలేయము చెడినదనుకొనుడు. అతడు తరువాత మద్యమును సేవించుట మానివేసినచో, అతని కాలేయము మరింత చెడిపోదను మాట వాస్తవమే అయినా, అంతకు ముందు చెడిన దాని మాట యేమి? పూర్వములో అతని కాలేయము చెడి యుండుటచే, ఇపుడాతడు మద్యమును మాని వేసిన తరువాత కూడా జీర్ణకోశమునకు సంబంధించిన వ్యాధులతో

వేగక తప్పదు. మనకు ఇచట కూడా అదే పరిస్థితి గలదు. ఇపుడాతడు జ్ఞాని యైనాడు. వాస్తవమే. కాని పూర్వములో ఆతడు ప్రోగుచేసియున్న బోలెడు కర్మ ఆతని ఖాతాలో జమయై ఉన్నది. దానికి ఆతడు జవాబు దారీ వహించవలెను గదా! ' ఆతడు' అనగా ఎవరు? ఆత్మ నిష్క్రియమని తెలుసుకొన్న వాడే 'ఆతడు' అన్నచో ఆ 'ఆతడు' ఏడి? ఆతడు వేరు, ఆతడు తెలుసుకున్న ఆత్మ వేరు అనే ధోరణినుండి ఈ ప్రశ్న ఉదయించినది. ఇచటి వస్తుస్థితి ఇట్లున్నది: ఆత్మను తెలుసుకున్నది ఆత్మయే. ఆత్మ సర్వదా నిష్క్రియము. ఇంతకు ముందైననూ ఆత్మ పాపపుణ్యములను ప్రోగుచేయలేదు; ఇప్పుడు ప్రోగుచేయుట లేదు. తాను పాపపుణ్యములను సంపాదించు చున్నానని ఆతడు పూర్వములో తల పోసెడివాడు. ఇప్పుడైతే 'ముందు' లేదు; 'తరువాత' లేదు. తాను నిష్క్రియుడననే సత్యమును ఆతడు దర్శించినాడు. కావున పాత కర్మలన్నియు గాలికి ఎగిరిపోవును. స్వప్నద్రష్టకు తెలివి రాగానే స్వప్నము మటుమాయమగును. కావున గతకాలీన కర్మ లేదు; వర్తమాన కర్మ లేదు; భవిష్యత్కర్మ లేదు. మోక్షమనగా నిదియే. సంసారమనబడే కర్మబంధము ఆతనికి తొలగిపోయినది.

పూర్వము చెప్పబడిన కర్మయోగమునకు ఫలము ఈ శ్లోకములో నిర్దేశించబడినది. అదియే మోక్షము. సన్న్యాసమనబడే జీవనశైలికి ఫలమేమి? మోక్షమే. కావుననే 'సన్న్యాసజీవనము, కర్మయోగము అనే రెండింటినీ ఏకరూపముగా ఎవడు దర్శించునో, వాడు మాత్రమే యథార్థమగు దర్శనము గలవాడు ( ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి)' అని చెప్పబడినది. ఎందువలన ? 'ఓ అర్జునా! కర్మయోగము లేనిదే, యథార్థమగు సన్న్యాసమును పొందుట కష్టము. కర్మయోగమునకు అంకితమైన వివేకి తొందరలోనే బ్రహ్మను పొందును (సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తు మయోగతః, యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి). కర్మయోగము ఇచట క్రమముక్తిలో ఒక సోపానముగా ప్రస్తుతింపబడినది. క్రమేణ అనుభాష్యకారుల పదప్రయోగమును మనము గమనించవలెను. కర్మయోగము సాధకునకు అంతఃకరణశుద్ధినొసంగి జ్ఞానోదయమునకు సంసిద్ధుని చేయును. అందువలననే, భగవానుడు శ్లోకముయొక్క ఆఖరి పాదములో మేధావీ ఛిన్నసంశయః అని వర్ణించినాడు. ఇట్టి జ్ఞాని రాగద్వేషములకు అతీతుడుగ నుండును గనుక, అశోభనకర్మను ద్వేషించడు; శోభన కర్మను అంటిపెట్టుకొని ఉండడు. దీనిని బట్టి ఆతడు సర్వకర్మ సన్న్యాసియని సుస్పష్టమగుచున్నది. మూడవ అధ్యాయములో చెప్పబడిన విషయమే ఇచట పునరావృత్తి చేయబడినది. ఇది శాస్త్రతాత్పర్యము గనుక, దీనిని సరిగా తెలుసుకొన వలసి యున్నది. కావున దీనిని పునరావృత్తి చేయుటలో గుణమే గాని దోషము లేదు.

తరువాతి శ్లోకములో భగవానుడు త్యాగిని నిర్వచించుచున్నాడు :

**అధ్యాయము 18, శ్లోకము 11:**

न हि देहभृता शक्यं त्यक्तुं कर्माण्यशेषतः ।
यस्तु कर्मफलत्यागी स त्यागीत्यभिधीयते ॥ ११ ॥

న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే (11)

**దేహభృతా** = దేహధారియగు జీవుని చేత, **కర్మాణి** = కర్మలను, **అశేషతః** = పూర్తిగా, **త్యక్తుమ్** = విడిచిపెట్టుటకు, **న హి శక్యమ్** = నిశ్చయముగా సంభవము కాదు, **తు** = కాని, **యః** = ఎవడైతే, **కర్మఫలత్యాగీ** = కర్మఫలములను విడిచిపెట్టునో, **సః** = అతడు, **త్యాగీ ఇతి** = త్యాగి యని, **అభిధీయతే** = చెప్పబడు చున్నాడు.

దేహధారియగు జీవుడు కర్మలను సంపూర్ణముగా విడిచిపెట్టుట సంభవము కాదు. ఇది నిశ్చయము. కాని ఎవడైతే కర్మఫలమును విడిచిపెట్టునో, వాడు త్యాగి యనబడును (11).

ఎవడైతే దేహతాదాత్మ్యము గలవాడై తానే దేహమనియు, దేహమే తాననియు స్వీకరించునో, వానికి శాస్త్రము కర్మను విధించుచున్నది. మనము అట్టి దేహధారిని గురించి మాటలాడుచున్నాము. అతడు ఈ తాదాత్మ్యముచే దేహమును ధరించి భరించుచున్నాడు (దేహభృత్). తాను దేహమేననియు, కావున తాను కర్తననియు అతని నిశ్చయము. కావున అతడు అజ్ఞాని. ఆత్మ కర్తయనే అతని ధారణను శాస్త్రము ఇచట త్రోసిపుచ్చుట లేదు. 'నేను కర్తను' అనే ధారణ అతనియందు దృఢముగా నాటుకొని యున్నది. కావున అతడు కర్మలను సంపూర్ణముగా విడిచిపెట్టుట సంభవము కాదు (న శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః). అతడు సన్న్యసించినను, కర్మత్యాగము అసంభవమే. అతడు కొన్ని విధులను పరిత్యజించవచ్చును. కాని 'నేను కర్మలన్నిటినీ పరిత్యజించినాను' అనే క్రొత్త కర్తృత్వమును అతడు తనయందు ఆరోపించుకొనును. కర్మను విడిచిపెట్టినది ఎవరు? సచ్చిదానంద ఆత్మ కాదు. సచ్చిదానంద ఆత్మకు ఏకాలము నందైనను కర్మసంబంధము లేదు గనుక, కర్మను పరిత్యజించే ప్రసక్తి లేదు. 'నేను కర్మను విడిచిపెట్టినాను' అని ప్రకటించే వ్యక్తి తనయందు కర్తృత్వమును ఆరోపించుకొని యున్నవాడని స్పష్టమగుచున్నది. అజ్ఞాని కర్మలను సంపూర్ణముగా విడిచిపెట్టుట అసంభవము. కాని సాధకుడు విధివిహితమగు కర్మలను చేస్తూ, కర్మ ఫలమును పరిత్యజించుట

సంభవమే యగును. సాధకునకు వర్తించే త్యాగము అదియే.

ఇట్టి సాధకునియందు కర్తృత్వభావన ఉండును. కాని అతడు తన రాగద్వేషములను త్రోసిపుచ్చి, ధర్మమునకు అనురూపముగా కర్మలను చేయుట వలన అతని నిత్యజీవితము యోగముగా మారిపోవును. ''నిష్క్రియత్వము కంటె క్రియాశీలత శ్రేష్ఠమైనది. కావున విహితకర్మను ఆచరింపుము (నియతం కురు కర్మ త్వం కర్మజ్యాయో హ్యకర్మణః)''. అతడు కర్మలను చేయుచున్ననూ, ఫలమునందు తృష్ణలేనివాడు గనుక, రాగద్వేషములు ప్రభావహీనములగును. మానసికమగు ఒత్తిడి తొలగి పోవుటచే అతడు ఉల్లాసభరితుడై యుండును. ఈ ఉల్లాసమునకు కారణము అతని మనఃప్రవృత్తియే గాని, అభీష్టప్రాప్తి కాదు; అభీష్టము కానిది రాకుండుటయూ కాదు. వాస్తవంలో అతడు కోరేది లభించక పోవచ్చును; అభీష్టము కానిది జరుగుచుండవచ్చును. కర్మయోగముచే అతడు ఈ పరిస్థితిని ఎదుర్కొనుచుండగా, అతని మనస్సులో ఉల్లాసము నెలకొనును. అతడు ఈ విధమైన ఫలత్యాగమునకు అధికారి; సర్వకర్మసన్న్యాసమునకు కాదు. అతడు కర్మను చేస్తూనే జ్ఞానసాధనను కొనసాగించవచ్చును. దాని కొరకై కర్మను విడిచిపెట్ట వలసిన పని లేదు.

ఆత్మయందు ఆరోపించబడిన కర్తృత్వమును పరిత్యజించుట సర్వకర్మసన్న్యాసమగునే గాని, కేవలకర్మత్యాగము కాదు. ఆత్మ కర్త కాదు అను జ్ఞానము ఉదయించినప్పుడు మాత్రమే అది సంభవమగును. దీనియందు వాస్తవమగు పరిత్యాగము లేదు. ఆత్మ అకర్త అనేది సత్యము. అజ్ఞానము (అవిద్య) చే ఆత్మయందు కర్తృత్వము ఆరోపించబడినది. జ్ఞానోదయము కాగానే ఆ అధ్యారోపము త్రోసిపుచ్చబడును. అప్పుడు జ్ఞాని అకర్తయగుట సహజమే. ' అతడు కర్మలను చేస్తూ ఉండగనే, కర్మలను చేయుట లేదు (కుర్వన్ అపి న కరోతి)'. ఇదియే సర్వకర్మసన్న్యాసమనబడును. ఇది జ్ఞానము కంటె వేరు గాదు. ఆ జ్ఞానమును పొందుట కొరకై వ్యక్తి కర్మయోగి కావచ్చును; లేదా సన్న్యాసి కావచ్చును. ఇచట కర్మయోగి స్తుతింపబడుచున్నాడు. అతడు చేయు త్యాగము కర్మఫలత్యాగము. అతడు అజ్ఞానియై ఉండగా సర్వకర్మలను త్యజించి భిక్షాటనతో జీవించుట దుష్కరము. అతనియందు ఇంకనూ దేహేంద్రియమనస్సంఘాతముతో తాదాత్మ్యము (నేనే అను భావన) గలదు. ఈ తాదాత్మ్యము ఈ దేహమును నిలబెట్టుట మాత్రమే గాక, తరువాతి జన్మకు కూడ హేతువు అగును. అతడు కర్త మాత్రమే గాక కర్మఫలభోక్త కూడ అగు చున్నాడు గనుక, ఈ దేహము నశించగానే మరియొక దేహమును దాల్చును. తాను చేసిన కర్మల ఫలములననుభవించుట కొరకై జీవుడు అనేక జన్మలనెత్తవలయును. జీవుడు మానవదేహమును గాని, లేదా ఈ బ్రహ్మాండములో దానితో సదృశమగు మరియొక దేహమును గాని దాల్చి నప్పుడు, అతడు మరల కర్త యగును.

కావున మరల కర్మఫలము ననుభవించుటకై మరియొక దేహమును దాల్చును. దీనికే సంసారమని పేరు. ఇది కాత్స్న్యముగా, స్థూలదేహముతో తాదాత్మ్యమును పొందియున్న పురుషుడు, లేక స్త్రీ పనికే కాదు. అట్టి వ్యక్తి కర్మలను సంపూర్ణముగా పరిత్యజించుట సంభవము కాదు.

దీనికి భిన్నముగా వివేకికి సమస్య లేదు. అతని యందు తాను కర్తననే అహత్వధారణ లేదు. కర్మలను యథార్థముగా అతడు చేయుట లేదు. హత్యతో సహా ఏ కర్మనైననూ అతడు తాను చేయుట గాని, లేదా ఇతరులచే చేయించుట గాని ఎట్లు ఘటిల్లును? అతడు తాను హింసించడు; ఇతరులచే హింసింపచేయడు; ఏలయన అతని యందు కర్తృత్వము లేశమైననూ లేదు. వేదావినాశినం నిత్యం య ఏనమజమవ్యయమ్, కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కమ్. అనగా, వినాశము లేనిది, నిత్యము, పుట్టుక లేనిది, అపక్షయము లేనిది అగు ఈ ఆత్మను తెలుసుకున్న ఆ పురుషుడు ఎవరిని ఎట్లు హింసించును? ఎట్లు హింసింపచేయును? ఒక పనిని నేను స్వయముగా చేయవచ్చును, లేదా, ఇతరునిచే చేయించవచ్చును. ఈ రెండు సందర్భములలో నేను కర్తను అగుట సమానము. కాని ఆత్మజ్ఞాని తాను స్వయముగా కర్మను చేయడు; ఇతరులచేత చేయించడు. ఈ జ్ఞానమే సర్వకర్మసన్న్యాసము.

దేహముతో తాదాత్మ్యము ఉన్నంతవరకు ఇట్టి సన్న్యాసము సంభవము కాదు. దేహతాదాత్మ్యము గల వ్యక్తి కర్మలను సంపూర్ణముగా విడిచిపెట్టలేడు (నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః). అతడు అజ్ఞానియై తాను కర్తనని భావించుచున్నాడు గనుక, అతనిని ఉద్దేశించి శ్రుతి కర్మలను విధించుచున్నది. ఇట్టి స్థితిలో అతనికి సర్వకర్మసన్న్యాసము సంభవము కాదు. కాని అతడు కర్మఫలమును విడిచిపెట్టి కర్మలను చేయుట సంభవమే. అతడు కామ్యకర్మలను ప్రక్కన పెట్టి అర్థకామములనే ఫలము కొరకు గాక, మోక్షకామియై అంతఃకరణశుద్ధిని మాత్రమే గోరి నిత్యనైమిత్తిక కర్మల నన్నిటిని చేయుచుండును. అతడు స్వర్గముతో సహా అర్థకామములు వేటియందైననూ ఆసక్తి లేనివాడై నిత్యప్రార్థన, యజ్ఞయాగాదులు మొదలగు కర్మలను చేయుచున్నచో, అతనియందు కర్మఫలత్యాగము ఉన్నది. అతడు త్యాగియైనవాడు గనుక, జ్ఞానము ఉదయించుటకు శుద్ధమైన అంతఃకరణము అతనికి సిద్ధించును. జ్ఞానోదయముతో సర్వకర్మసన్న్యాసము సిద్ధించును. అతనికి కర్మఫలము దక్కదని చెప్పుట తాత్పర్యము కాదు. కర్మఫలము ఋతము. అది అవశ్యం భావి. కర్మ ఫలమును ఇచ్చును అనునది మార్చ శక్యముకాని సత్యము. అతనికి ఫలమునందు అపేక్ష లేకున్ననూ, ఫలము లభించి తీరును. కాని అతనికి ఫలతృష్ణ లేదు.

కర్మయోగమును స్తుతించే సందర్భములో ఈ శ్లోకమును తరుచుగా ఉదాహరించెదరు. కర్మయోగి కర్మను చేస్తూ ఉన్నా, త్యాగియే. ఆత్మ అకర్తయనే దర్శనము గల జ్ఞానికి మాత్రమే సర్వకర్మసన్న్యాసము సంభవమగును. అట్టి జ్ఞానికి దేహముతో తాదాత్మ్యము లేకుండుట సహజమే గదా! కావున ఆతడు దేహమును భరించువాడు (దేహభృత్) కాడు. అనగా ఆతడు మరణించినాడని తలంపరాదు. 'దేహము నేనే' అనే భ్రాంతి ఆతనియందు లేదు. అంతే. యథార్థమగు సన్న్యాసము ఇదియే. కాని, దేహములో నీవు తాదాత్మ్యమును పొంది దేహభృత్ అయి ఉన్నంతవరకు నీవు చేయదగినది ఏది? అంతవరకు నీవు కర్మఫలత్యాగమును చేయవలెనని శ్రీకృష్ణుడు ఈ శ్లోకములో చెప్పుచున్నాడు.

ఒక వ్యక్తి దేహములోడి తాదాత్మ్యమునుండి బయట పడి సర్వకర్మసన్న్యాసస్థితిని పొందగల్గినాడను కొనుడు. దాని ఫలమేమి? ఈ విషయమును తరువాతి శ్లోకము వివరించుచున్నది:

**అధ్యాయము 18, శ్లోకము 12:**

अनिष्टमिष्टं मिश्रं च त्रिविधं कर्मण : फलम् ।
भवत्यत्यागिनां प्रेत्य न तु सन्यासिनां क्वचित् ॥ १२ ॥

అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్ (12)

**అనిష్టమ్** = అభీష్టము కానిది, **ఇష్టమ్** = అభీష్టమైనది, **చ** = మరియు, **మిశ్రమ్** = ఆ రెండింటి కలయిక అనే, **త్రివిధమ్** = మూడు విధముల, **కర్మణః** = కర్మయొక్క, **ఫలమ్** = ఫలము, **అత్యాగినామ్** = త్యాగులు కాని వారికి , **ప్రేత్య** = మరణించిన తరువాత, **భవతి** = కలుగును, **తు** = కాని, **సన్న్యాసినామ్** = సన్న్యాసులకు, **క్వచిత్** = ఏకాలమునందైననూ, **న** = కలుగదు.

> త్యాగులు కాని వారికి మరణించిన తరువాత అభీష్టము, అభీష్టము కానిది మరియు ఆ రెండింటి కలయిక అనే మూడు విధముల కర్మఫలము లభించును. కాని సన్న్యాసికి ఎన్నడైననూ అట్లు జరుగదు (12).

అభీష్టము కానిది (అనిష్టమ్), అభీష్టమైనది ( ఇష్టమ్), మరియు ఆ రెండింటి కలయిక (మిశ్రం చ) అని కర్మఫలము త్రివిధముగా నున్నది. అనిష్టకర్మఫలము వలన జీవుడు నరకములో కొంత కాలము దుఃఖముల ననుభవించును. లేదా, ఆ జీవుడు మనుష్యజన్మకంటె నికృష్టమైన పశుపక్ష్యాదియోనులలో జన్మించును. ఇష్టకర్మఫలము వలన జీవుడు మనుష్య జన్మ కంటె ఉత్కృష్టమైన పితృ గంధర్వ దేవాది ఉత్తమయోనులలో జన్మించును. ఈ ఉత్తమ జన్మలన్నియు తైత్తిరీయోపనిషత్తులో ఆరోహణక్రమములో వర్ణించబడి యున్నవి. ఆ క్రమములో ముందున్న జన్మ వెనుక నున్న జన్మకంటె వందరెట్లు అధికఫలమునిచ్చును. ఆ ఉత్కర్ష ఈ క్రమములో వృద్ధి జెందును. ఈ క్రమములో అన్నింటి కంటె పైన బ్రహ్మగారు, బ్రహ్మలోకవాసులు గలరు. అంతవరకు చేరుకోగల్గిన జీవుడు సంసారములోని సర్వోన్నతస్థానమును చేరినట్లు అగును. ఈ రెండింటికీ మధ్యలో అభీష్ట - అనభీష్టములు అనే రెండింటి కలయిక యగు మనుష్యదేహము గలదు. ఇందువలననే, మనుష్య జీవితములో ఉదయము చాల చక్కగా ఆరంభమగును; కాని సాయంకాలము సమస్యయై పీడించును. మానవదేహము మిశ్రకర్మఫలము గనుక, ప్రతి నిమిషములో మార్పులకు లోనగును. కొన్ని పరిస్థితులు అనుకూలంగా ఉంటే, మరికొన్ని ప్రతికూలముగా నుండును. అమెరికా ప్రెసిడెంటును పరిశీలించుడు. అతడు చాల అదృష్టవంతుడు. ఈ భూమండలములో అత్యధికమగు అధికారములో అతడు ఉన్నాడు. కాని అతడు చేతిలో నవల పట్టుకొని నడుమువాల్చి చదువుకోగలిగే భాగ్యమునకు నోచుకోడు. ఆ పదవిలో నుండగా అది అతనికి అసంభవమగును. కావున మానవజన్మ ఇష్టానిష్టముల కలయిక యని చెప్పబడినది. ప్రతి మానవుని జీవితము ఈ రెండింటి కలగాపులగమై యున్నది.

ఈ తీరున కర్మల వలన లభించే ఫలితము (కర్మణః ఫలమ్) మూడు విధములుగా (త్రివిధమ్) నున్నది. వాస్తవములో ఈ ఫలము పుణ్యపాపములనే రెండు రకములుగా మాత్రమే ఉన్ననూ, జీవుడు పొందే జన్మలయొక్క దృష్టికోణములో అది త్రివిధమని చెప్పబడినది. ఈ మూడు రకముల ఫలము ఎవరికి? త్యాగులు కానివారికి మాత్రమే (అత్యాగినామ్). ప్రకృతదేహము వదలిన పిదప (ప్రేత్య), వారు ఈ త్రివిధకర్మఫలముల ననుభవించుట కొరకై ఇతర దేహములను దాల్చవలసి యుండును. కాని త్యాగులకు ఈ ఇబ్బంది లేదు. త్యాగులనగా ఆత్మ అకర్తయనే జ్ఞానమును పొంది సర్వకర్మసన్న్యాసులు అయిన వారు. వారికి కర్మఫలము లేశమైననూ లేదు.

ఈ కర్మఫలము ఏ విధముగా ఉత్పన్నమగును? అను విషయముపై శ్రీ శంకరులివట ఒక టిప్పణిని వ్రాసిరి. అది కర్మమండియు, మరియు కర్త- కర్మ- కరణము ఇత్యాది కర్మానుష్ఠానమునకు ఆవశ్యకమగు వివిధకారకములనుండియు పుట్టును. ఈ సర్వము అజ్ఞానము నుండి పుట్టినది. అవిద్య

లేనిదే మానవుడు తనను తాను కర్తగా భావించుట సంభవము కాదు. సర్వకర్మలకు మూలములో అవిద్య గలదు. కర్మ అనబడే ఇతరవస్తువును, క్రియాసాధనమును దర్శించుట కూడా అవిద్యాకార్యములే. కావున, కర్మఫలము కూడా అవిద్యాకల్పితమగుట సహజమే. ఇది ఇంద్రజాలము వంటి దనియు, లేని పదార్థములను ఉన్నట్లు చూపించే మహావ్యామోహమనియు శ్రీశంకరులు వర్ణించిరి. ఇది ప్రత్యగాత్మ (innermost self) ను బంధించి యున్నదా యన్నట్లు కన్పట్టును. ఫలము అను పదమునకు 'తొందరగా నశించునది' అని వ్యుత్పత్త్యర్థము గలదు. పండ్లబుట్టను రవాణా చేయునప్పుడు దానిపై 'జాగ్రత్త! తొందరగా చెడిపోవును (Perishable)' అని వ్రాసియున్న చీటీని అతికించెదరు. మానవదేహము, సర్వకర్మఫలములు మరియు ఈ సృష్టిలోని సర్వము కూడ ఇట్టి చీటీని కలిగియుండుట యుక్తియుక్తముగా నుండును.

యథార్థమగు సన్న్యాసులెవ్వరికీ కర్మఫలము ఉండదు. కాని కర్మఫలత్యాగి ఇంకనూ కర్తయే గనుక, ఆతనికి కర్మఫలము తప్పదు. కాని అతడు ఈ యాత్రను ఆరంభించి కల్యాణకృత్ అయినాడు. ఆతనికి ఈ జన్మలో మోక్షము లభించక పోయిననూ, మరుజన్మలో ఈ సాధనను ముందుకు గొనిపోవును. అతడు ఒక సారి కర్మయోగి మరియు ముముక్షువు అయిన తరువాత, మరల వెనుకకు మరలే ప్రసక్తి లేదు. ఇప్పుడు కాకపోయినా, భవిష్యత్తులో ఆతనికి జ్ఞానోదయమగుట తథ్యము.

ఇచట భగవానుడు త్యాగి అనుటకు బదులుగా సన్న్యాసి అను పదమును వాడినాడు. దీని అభిప్రాయమేమనగా, త్యాగి సర్వకర్మసన్న్యాసి కావలెను. శ్రీశంకరులిచట రెండు రకముల సన్న్యాసులను వివరించిరి. ఒకడు అపరమార్థసన్న్యాసి. అనగా అతడు ఇంకనూ కర్మయోగియే గాని ఖచ్చితమగు సన్న్యాసి కాదు. రెండవవాడు పరమార్థ సన్న్యాసి. తాను కర్తననే అభిమానము ఆతనికి లేదు. కావున అతడు సర్వకర్మసన్న్యాసి. ఆతనికి అద్వయ-ఆత్మ-జ్ఞానమునందు నిష్ఠ గలదు. ఆతనికి కర్మఫలము ఉండదు. అద్వయ-ఆత్మ-జ్ఞానము సంసారకారణమగు అవిద్యను పూర్తిగా నిర్మూలించును.

ఆత్మ కర్త, భోక్త ఇత్యాది ధారణలు అజ్ఞానముచే కల్పితమైన అధ్యారోపములు మాత్రమే గాని, యథార్థములు కావు. కావున స్పష్టమగు ఆత్మజ్ఞానము గలవారికి మాత్రమే సర్వకర్మ సన్న్యాసము సంభవమగునని మనకు ఈ రెండు శ్లోకములను బట్టి స్పష్టమగుచున్నది. ఆత్మ అకర్తయనే జ్ఞానము లేని వ్యక్తి కర్మయోగిగా జీవించినా, లేక సన్న్యాసియై జీవించినా, ఆతనికి ఇంకనూ కర్మబంధము

తప్పదు. అతడు కర్మయోగి, లేక సన్న్యాసి అయినందులకు ఈ జీవితములో మోక్షము అనే లక్ష్యమును చేరలేకపోయిననూ, ఆ సాధనను మరుజన్మలో మరల అందుకొని సాగించును. అతడు అధమయోనులలో జన్మించే ప్రసక్తి లేదు. కర్మఫలము త్రివిధముగా నున్నది గదా! ఎలుక, కుందేలు మొదలగు జన్మలనీయదగిన సంచితకర్మ అతని ఖాతాలో జమయై ఉన్ననూ ముముక్షుజన్మను ఈయదగిన కర్మతో పోలిస్తే వాటికి ప్రాముఖ్యము లభించదు. అనగా అవి ఫలమునిచ్చుటకై తొందరపడి ముందుకు రావు. మానవుడు పూర్వపుణ్య వశముచే విముక్తిని పొంద వలెననే ఆకాంక్ష (ముముక్షా) ను పెంపొందించుకొనును. ఆ తరువాత అతని యాత్రలో పురోగమనమే గాని, తిరోగమనము లేదు. అనగా అతడు మరల అధమయోనులలో జన్మించే ప్రసక్తి లేదు. ఉదాహరణకు అట్టి సాధకుడొకడు సాధన పూర్తి గాకుండగనే మరణించగా, బొద్దింక జన్మనిచ్చే కర్మ పరిపక్వమైనదనుకొనుడు. అపుడాతడు బొద్దింకయై జన్మించి బీరువా వెనుక నిశ్శబ్దముగా ధ్యానమును చేయుచుండునా యేమి? ఇది అర్థ రహితమనియు, అసంభవమనియు భగవానుడు చెప్పుచున్నాడు. అతడు కొంత కాలము స్వర్గములో భోగములననుభవించి, తరువాత మరల సాధనను కొనసాగించగలిగే జన్మను పొందుట తథ్యము. లేదా, అతడు తిన్నగా ఒక కర్మయోగియొక్క గృహములో జన్మించును. భగవానుడు ఇట్టి హామీని ఇచ్చుచున్నాడు. ఇది ఎంతయు యుక్తియుక్తముగా నున్నది. కావున, ఒకసారి ఇట్టి ముముక్షను పొందిన మానవుడు మరల దానిని వెనుకకు నెట్టి వేసే ప్రసక్తి లేదు. సాధారణ కర్మవాసనా ప్రవాహమునకు ఎదురీదిన వ్యక్తి మాత్రమే ముముక్షువు కాగల్గును. ఆ స్థితికి చేరి సాధకుడు తనస్వరూపమును గురించి విచారింపబూనుకొనుట సామాన్య విషయమేమీ కాదు. జీవనశైలిని, ఆలోచనా ధోరణిని అంతనూ తల్లక్రిందులు చేసినపుడు మాత్రమే అది సంభవమగును. జీవనశైలిని వెనుకకు త్రిప్పగలిగే వేగము అతని కర్మకు లభించినది. దానిని అపుట ఎవరికైననూ తరము కాదు. ఈ జన్మలో వారు కర్మయోగులై యుండుటచే సర్వకర్మ సన్న్యాసము ఇంకనూ తరువాయి ఉన్నది. కాని అది మరుజన్మలో సిద్ధించగలదు. ఏలయన ఈ ప్రక్రియ ఒక సారి ఆరంభమైనచో, వెనుకకు తిరిగే ప్రసక్తి లేదు. సాధారణముగా మానవుని కర్మప్రవాహము సంసారాభిముఖమై ఉండును. ఆ ప్రవాహమును వెను ద్రిప్ప గల్గుటకు మానవుడు మహాపుణ్యము గలవాడు అయి ఉండవలెను. మానవులు సాధారణముగా అర్థకామముల వెంటబడుతూ సంసారాభిముఖులై ఉందురు. ధార్మిక శ్రద్ధ గల వ్యక్తి యైననూ స్వర్గమును పొందగోరుచుండును. కాని ప్రస్తుతములో సాధకుడు '<u>నేను ఎవరిని?</u>, <u>నా సాధన సరియగు దిశలో ఉన్నదా?</u>' అని ప్రశ్నించు కొనుచున్నాడు. ఇట్టి ప్రశ్నల వెనుక గల స్ఫూర్తికి మూలములో ఎన్నో దానధర్మములను చేసిన పుణ్యము గలదు. ఈ ప్రశ్న లక్షరూపాయల విలువ గల ప్రశ్న కాదు. <u>ఇది లక్ష జన్మల విలువ గల ప్రశ్న</u>.

'అనేక జన్మల తరువాత (బహూనాం జన్మనామంతే), వేలలో ఒకడు (మనుష్యాణాం సహస్రేషు)' అని గీత చెప్పుచున్నది. ఆ ప్రశ్నను వేసుకోగలిగిన వాడు వెనుకకు తిరిగి చూచే ప్రసక్తి లేదు.

సాధకుని జీవనశైలి కర్మయోగము కావచ్చును; లేదా, సన్న్యాసము కావచ్చును. కాని ఒక యథార్థమగు విషయము గలదు. పరమార్థ దర్శనము మాత్రమే యథార్థమైన సన్న్యాసము. అది కేవలము జ్ఞానము చేత మాత్రమే లభించును. కర్మయోగ, సన్న్యాసములు రెండింటికీ లక్ష్యము జ్ఞానమే. సాధకుడు తాను అనుసరించదగిన ఈ లక్ష్యములలో ఎన్నుకొనే స్వేచ్ఛ గలదు. అర్జునుని విషయములో కర్మయోగమే సరియగు మార్గమని స్పష్టమే. అతడు క్షత్రియుడే కాని, బ్రాహ్మణుడు కాడు. ఇది ఒక కారణము. బ్రాహ్మణుడు అగ్నిహోత్రాది కర్మానుష్ఠానమునకు, లేదా సన్న్యాసమునకు మాత్రమే అర్హుడని సమాజములో దృఢమగు అభిప్రాయము కలదు. అనగా, క్షత్రియుడు సన్న్యసించరాదని అభిప్రాయము కాదు. అతడు సన్న్యసించునని సమాజము అపేక్షించదు. బ్రాహ్మణుడు ఒకడు సన్న్యసించినచో, దానిని గురించి ఎవ్వరూ పట్టించుకొనరు. కాని అర్జునుడు సన్న్యసించినచో అది పెద్ద వార్త యగును. ఇంతే గాక, బ్రాహ్మణుడు సన్న్యసించిన తరువాత కూడ ధ్యానము, ప్రవచనము మొదలగు పనులను మాత్రమే చేయును. అతని నిత్యకృత్యములో పెద్ద మార్పులు ఉండవు. కాని క్షత్రియుని వ్యవహారశైలి చాల భిన్నముగా నుండును. అతడు ప్రజాక్షేమముకొరకై అనేకములగు పనులను చేపట్టి నిర్వహించుచుండును. కావున అట్టి క్షత్రియుడు సన్న్యసించినచో, పరిణామములు గంభీరముగా నుండును. కావుననే, 'క్షత్రియునకు ధర్మ సమ్మతమైన యుద్ధమును మించిన శ్రేయస్సు లేదు' అని శ్రీకృష్ణుడు చెప్పియున్నాడు.

భగవానుడిచట ఆశ్రమరూపమగు సన్న్యాసమును గురించి గాక, పరమార్థసన్న్యాసమును గురించి మాటలాడు చున్నాడు. ఇట్టి సన్న్యాసము పరమార్థ దర్శనముచే మాత్రమే సంభవమగును. దానికి బ్రహ్మచర్య, గార్హస్థ్య, సన్న్యాసములనే ఆశ్రమములతో పని లేదు. ఆశ్రమమును బట్టి దానియందు భేదము ఏర్పడదు. మనము జ్ఞానమును గురించి మాటలాడు చున్నాము. కావున, దానికి స్త్రీ, పురుషుడు, భారతీయుడు, అమెరికను ఇత్యాది భేదములతో సంబంధము లేదు. వీటితో సంబంధమున్నచో, అది జ్ఞానమే కాదు. వివేక - వైరాగ్యములు, శమ, దమ, ఉపరతి, తితిక్షా, శ్రద్ధా సమాధానములు దానికి కావలసిన అర్హతలు. మానవులలో ఎవ్వరైననూ వీటిని పెంపొందించుకొనదగును. మానవులు కాని ప్రాణులు కూడ వీటిని పొందవచ్చును. రామాయణములో హనుమంతుడు గొప్ప జిజ్ఞాసువు అని వర్ణించబడినాడు. దీనిని బట్టి జ్ఞానము వద్ద మనిషియైనా, మనిషి వంటి ఇతర ప్రాణియైనా, భేదము లేదని స్పష్టమగుచున్నది. జ్ఞానము జ్ఞేయవస్తువుపై తక్క

ఇతరము దేనిపైనమూ ఆధారపడదు. ఈ జ్ఞానమును పొందుటకు ఒక విశిష్టమగు అంతఃకరణము అవశ్యకమగును. అంతే. నీకు అర్హత ఉన్నచో, జ్ఞానము నీది యగును. ఇతర విషయములకు ప్రాధాన్యములేదు. ఇతరులెవ్వరైననూ జ్ఞానమును నీకు కాకుండా చేయజాలరు.

జ్ఞానము లేనివాడు ఆత్మ కర్తయని తలపోయును. అతడు కర్మయోగి కావచ్చును; లేదా సన్న్యాసి కావచ్చును. అతనికి సర్వకర్మ సన్న్యాసము సంభవము కాదు. సర్వకర్మ సన్న్యాసమును చేయు పద్ధతి ఒకే ఒకటి గలదు. అది ఆత్మ అకర్తయని ఎరుంగుటయే. రాబోవు శ్లోకములు ఈ సంగతిని వివరించుచున్నవి :

**అధ్యాయము 18, శ్లోకము 13:**

पंचैतानि महाबाहो कारणानि निबोध मे ।
सांख्ये कृतान्ते प्रोक्तानि सिद्धये सर्वकर्मणाम् ॥१३॥

పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్ (13).

**మహాబాహో** = ఓ గొప్ప బాహువులు గలవాడా!, **మే** = నావచనములను బట్టి, **నిబోధ** = తెలుసుకొనుము, **సర్వకర్మణామ్** = కర్మలన్నింటి యొక్క, **సిద్ధయే** = పరిపూర్తి కొరకు, **ఏతాని** = ఈ, **పంచ** = అయిదు, **కారణాని** = కారణములు, **కృతాంతే** = కర్మకాండయొక్క అంతమునందు, **సాంఖ్యే** = శాస్త్రమునందు, **ప్రోక్తాని** = చెప్పబడియున్నవి.

> ఓ గొప్ప బాహువులు గలవాడా! నా వచనములను బట్టి తెలుసుకొనుము. కర్మలన్నియు సిద్ధించుటలో ఈ అయిదు అంశములు హేతువులగుచున్నవని శాస్త్రములో కర్మకాండయొక్క అంతమునందు చెప్పబడినది (13).

శ్రీకృష్ణుడు అర్జునుని 'గొప్ప బాహువులు గలవాడా!' అని సంబోధించి 'తెలుసుకొనుము (నిబోధ)' అని హెచ్చరించుచున్నాడు. ఈ సంబోధన అర్జునుని సావధానుని చేయుటతో బాటు ఇపుడు విషయవస్తువు మారుచున్నదని సూచించును. చెప్పబోవు విషయమునకు గడచిన ఉపదేశముతో సంబంధము నిశ్చయముగా గలదు. కాని ఉపదేశప్రవాహము ఇచట ఒక మలుపు తిరుగుచున్నది.

ఉపదేశము మలుపు తిరుగు చున్నదని సూచించుటకై భగవానుడు, 'తెలుసుకొనుము (నిబోధ)' అని హెచ్చరించుచున్నాడు.

లౌకికములుగాని, వైదికములు గాని, సర్వవిధముల కర్మలు సిద్ధించుట కొరకై (సర్వకర్మణాం సిద్ధయే) ఈ అయిదు కారణములు గలవు (పంచ ఏతాని కారణాని). తాను చెప్పబోయే హేతువులను మనసులో నిడుకొని, ఆయన 'ఈ అయిదు ( ఏతాని పంచ)' అనుచున్నాడు. ఇట్టి ప్రయోగము మన వాడుక భాషలో కూడ గలదు. 'నేను ఈ వ్యక్తిని కలిసినాను' అని మనము అంటాము. ఆ వ్యక్తిని గురించి దీనికి ముందులో ప్రస్తావించలేదు గనుక 'ఈ' అను సర్వనామమును ప్రయోగించుట, వ్యాకరణదృష్టితో చూస్తే, సరి కాదు. కాని ఆ వ్యక్తిని మనసులో నిడుకొని , వానిని గురించి వివరముగా మాటలాడ బోవుటకు ముందు ఈ విధమగు పదప్రయోగము జనుల వాడుకభాషలో ఉన్నది. ఇచట కూడ భగవానుడు అటులనే ప్రయోగించినాడు. ఈ అయిదు కారణములు చెప్పబడినవి (ప్రోక్తాని). దేనియందు ?

ఈ అయిదు కారణములను స్తుతించుట కొరకై, అవి సాంఖ్యములో చెప్పబడి యున్నవని భగవానుడు చెప్పు చున్నాడు. మనము తెలియదగిన వివిధ విషయములను వివరించే శాస్త్రము సాంఖ్యమనబడునని శ్రీశంకరులు వివరించిరి. కావున, సాంఖ్యమనగా వేదాంతము. ఆ శాస్త్రమునకు ఇచట కృతాంతే అనే ఒక విశేషణ మీయబడినది. కృతమ్ అనగా చేయబడినది; అనగా కర్మ. ఆ కర్మ యొక్క అంతము, అనగా పర్యవసానము కృతాంతమన బడును. కావున ఆత్మ అకర్తయనే జ్ఞానమునందు కర్మలన్నియు విలీనమగును. ఆ జ్ఞానమే శాస్త్రము. దీనిని మరో రకంగా వ్యాఖ్యానించవచ్చును. వేదములోని పూర్వభాగములో కర్మలన్నియు విస్తారముగా నిరూపించబడినవి. అట్టి కర్మకాండయొక్క అంతిమభాగములో ఈ శాస్త్రము గలదు. కర్మలన్నియు అంతఃకరణశుద్ధికి హేతువులై తద్ద్వారా జ్ఞానములో విలీనమగును.

కర్మలన్నియు జ్ఞానములో ఎట్లు విలీనమగును? గడచిన శ్లోకమును శ్రీశంకరులిచట ఉదాహరించిరి: యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే, తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః. అనగా, అంతటా నీరు నిండి యుండగా నూతితో పని లేదు. అటులనే, జ్ఞానికి సర్వవేదములతో ప్రయోజనము లేదు. మూడు వేదములలో చెప్పబడిన వివిధములైన యజ్ఞయాగాదులలో జ్ఞానికి గల ప్రయోజనము, అంతటా నీరు నిండి యుండగా నూతి వలన లభించే ప్రయోజనము వంటిది. వరదలో మునిగియున్న నుయ్యి వలన ఏమి ప్రయోజనము గలదు?

మూడు వేదములలో చెప్పబడిన కర్మలతో జ్ఞానికి గల ప్రయోజనము కూడ అట్టిదియే. కర్మలన్నియు మానవుని ఆనందము కొరకై ఉద్దేశించ బడినవి. కాని జ్ఞాని అట్టి ఆనందమును తన స్వరూపములోననే ఆవిష్కరించు కొనినాడు. అంతకు మించినది ఏదీ లేదు. చేయదగిన పనులనన్నిటినీ అతడు చేసినట్లే. కర్మలన్నియు ఆత్మజ్ఞానములో పరిసమాప్తిని జెందును. కావున అట్టి జ్ఞానము గలవాడు అన్ని విధములుగా కృతార్థుడైనాడు. కావుననే, వేదాంతమునకు కృతాంతము (కర్మల పరిసమాప్తి) అనే పేరు వచ్చినది.

కర్మను మొదలుపెట్టి విజయవంతముగా పూర్తి చేయుటకు ఆవశ్యకమైన అయిదు అంశములు ఈ శాస్త్రములో చెప్పబడినవి. కర్మలన్నియు ఈ అయిదు అంశములనుండి ఉద్భవించుచున్నవి. వాటిని గురించి తెలుసుకొనుట ఆవశ్యకము. ఏలయన, కర్మహేతువులగు ఈ అయిదింటిని మనము తెలుసుకున్నచో, ఆత్మ అకర్తయను సంగతి కొట్ట వచ్చినట్లు కన్పట్టును. ఆత్మ కర్మహేతువులగు పలు అంశములలో ఒకటి కాదనియు, అది వాటన్నింటికి అతీతము మరియు స్వతంత్రమనియు నిరూపించుటకై కర్మహేతువులగు ఈ అంశములనన్నింటినీ భగవానుడు నిరూపించుచున్నాడు. అవి యేవి ?

అధ్యాయము 18, శ్లోకము 14:

अधिष्ठानं तथा कर्ता करणं च पृथग्विधम् ।
विविधा च पृथक् चेष्टा दैवं चैवात्र पञ्चमम् ॥ १४ ॥

అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్
వివిధా చ పృథక్ చేష్టా దైవం చైవాత్ర పంచమమ్ (14)

అధిష్ఠానమ్ = స్థూలదేహము, తథా = మరియు, కర్తా = చిదాభాస, లేక అహంకారము, చ = మరియు, పృథగ్విధమ్ = అనేకవిధములైన, కరణమ్ = ఇంద్రియము, చ = మరియు, వివిధా = అనేకవిధములైన, పృథక్ = భిన్నభిన్నముగా నుండే, చేష్టా = క్రియాశక్తి, చ = మరియు, అత్ర = ఈ క్రియయందు, ఏవ = నిశ్చయముగా, పంచమమ్ = అయిదవది యగు, దైవమ్ = అధిష్ఠానదేవత.

స్థూలదేహము, అహంకారము, వివిధకరముల ఇంద్రియములు,
అనేక రూపములలో ప్రకటమయ్యే క్రియాశక్తి, మరియు

అధిష్ఠానదేవతలు అను ఈ అయిదు అంశములు నిశ్చయముగా సర్వకర్మలకు హేతువులు అగుచున్నవి (14).

అన్ని కర్మలను సిద్ధింపజేసే స్థానము, కర్మానుష్ఠానము ద్వారా సర్వకామనాపరిపూర్తికి వీలు కల్పించే స్థానము అధిష్ఠానమనబడును. జీవుడు ఈ అధిష్ఠానమునందుండి ఈ జగత్తులో వ్యవహరిస్తూ అనేకములగు అనుభవములను పొందును. ఈ స్థూలదేహము జీవుని భోగానుభవమునకు ఆశ్రయము (భోగాయతనమ్). అధిష్ఠానమనగా ఆశ్రయము అని సామాన్యార్థము. ఇది మరియొక ప్రకరణములో ఆత్మను నిర్దేశించుటకై ప్రయోగించబడును. త్రాడును చూచి దానిపై పామును అధ్యారోపము చేసే సందర్భములో త్రాడు అధిష్ఠానమగును. అటులనే, జగత్తునకు సత్యతత్త్వమగు ఆత్మ అధిష్ఠానమగుచున్నది. మనము ఈ ప్రకరణములో కర్మను గురించి చర్చించుచున్నాము. కావున కర్మను చేయుటకు ఆశ్రయమయ్యే అంశములలో ఒకటి స్థూలదేహము. రాగము, ద్వేషము, సుఖము, దుఃఖము మరియు జ్ఞానము అనునవి ప్రకటమగుటకు ఈ దేహమే ఆశ్రయమగుచున్నదని శ్రీశంకరులు వివరించిరి. కామన దానిని పరిపూర్తిచేసుకొనే ప్రయత్నము యొక్క రూపములో అభివ్యక్తమగుచుండును. దూరముగా త్రోసివేసే క్రియ రూపములో ద్వేషము అభివ్యక్తమగును. జ్ఞానేంద్రియములు అందించే సమాచారమును ఆధారముగా చేసుకొని జీవుడు సుఖదుఃఖముల ననుభవించుచుండును. ఈ జ్ఞానేంద్రియములన్నియు స్థూలదేహములో తమ తమ గోళకములయందు నిహితమై యున్నవి. కర్ణభేరి కేవలము ఒక స్థూలపదార్థము. కాని వినుటకు అది అత్యంతము అవశ్యకమగుచున్నది. అదే విధముగా, ఇంద్రియ ప్రత్యక్షములన్నింటికి ఒక స్థూలగోళకము ఆశ్రయమగుచున్నది. ఆ గోళకమునందు నిహితమై యున్న సూక్ష్మమగు ఇంద్రియము తన వ్యాపారమును చేయగల్గుచున్నది. జ్ఞానేంద్రియములు అనే సాధనముతో సంపాదించబడే జ్ఞానమునకు ప్రత్యక్షము అని పేరు. ఆ ప్రత్యక్షము జ్ఞానేంద్రియముల వలన సంభవమగు చున్నది. ఆ ఇంద్రియములు స్థూలదేహమునందు నిహితమై యున్నవి. కావున జ్ఞానమును సంపాదించేవి జ్ఞానేంద్రియములే అయినా, అవి అన్నియు అధిష్ఠానమనబడే స్థూలదేహమును ఆశ్రయించి ఉన్నవి.

క్రియను చేయునది ఎవరు? సంకల్పము చేసి ఉపక్రమించి క్రియను అనుష్ఠించి 'నేను చేయుచున్నాను' అను భావనను కలిగియున్న జీవుడు కర్త యనబడును. క్రియకు అవశ్యకమగు హేతువులలో ఈ కర్త రెండవది. ఈ కర్తయే చిదాభాస మరియు అహంకారము అని కూడ పిలువబడుచున్నాడు. ఈ కర్త కర్మలనాచరించి వాటి ఫలములను భోగించును. ఆచరింపబడే క్రియను బట్టి జీవుడు కర్తయగు చున్నాడు. అనుభవించే ఫలమును బట్టి అతడు భోక్త యగుచున్నాడు.

ఇంతే గాక, క్రియలో కరణము గలదు. కరణమనగా క్రియను అనుష్ఠించుటకు ఉపయోగించే సాధనము. అయిదు కర్మేంద్రియములు, అయిదు జ్ఞానేంద్రియములు, ఒక కర్మను చేయాలనే సంకల్పమును చేసే మనస్సు మరియు ఆ పనిని చేయాలని నిర్ణయించే బుద్ధి అనునవి కరణములు. మానవుడు ముందుగా ఒక పనిని చేయవలెననే కోరిక గలవాడై, తరువాత కన్నులు మొదలగు జ్ఞానేంద్రియములను, మరియు చేతులు, కాళ్లు మొదలగు కర్మేంద్రియములను వినియోగించి ఆ పనిని చేయును. ఈ సాధనములు అనేకముగా మరియు పరస్పర విలక్షణములై (పృథక్) ఉన్నవి. మనస్సు కూడ కరణమే. దానికి అంతఃకరణమని పేరు. ఈ కరణములన్నియు తమ తమ ప్రత్యేకకార్యములను అనుష్ఠించుచుండును.

క్రియానుష్ఠానములో నాల్గవ ప్రముఖ-అంశము ప్రాణము. దానివలననే ఈ క్రియాకలాపమంతయు సంభవమగుచున్నది. ఈ కరణములన్నింటి ద్వారా వివిధక్రియలననుష్ఠించే సూక్ష్మదేహము ప్రాణవిహీనమగు స్థూలదేహములో మనజాలదు. ఈ ప్రాణముయొక్క క్రియాకలాపము (చేష్టా) పలురకములుగా విభజింపబడియున్నది (వివిధా). ఈ రకములన్నియు పరస్పరవిలక్షణమైన స్వీయవిశిష్టప్రవృత్తిని కలిగి యున్నవి (పృథక్). అవి యేవనగా, ప్రాణము (ఉచ్ఛ్వాసతో గూడిన శ్వాసక్రియ), అపానము (గాలిని విసర్జించుట), వ్యానము (నాళములలోని వాయుప్రసారణము), సమానము (అన్నము జీర్ణమగుట) మరియు ఉదానము (వ్యతిరేక దిశలో శారీరక పరిణామములు). ఇవి అన్నీ కలిసి క్రియాహేతువులగు అంశములలో నాల్గవది యగును. ఈ ప్రాణము లేని క్రియ ఉండజాలదు. సర్వక్రియలను అనుష్ఠించుటకై మనకు శక్తి ఉండాలి. ఆ శక్తిని ప్రాణము సమకూర్చును.

ఈ కారకములన్నింటియొక్క అధిష్ఠానదేవతలందరు కలిసి 'దైవమ్' అని నిర్దేశింపబడినవి. ఆ దైవము అయిదవ అంశము. ప్రతి క్రియలో ఒక నియతి లేక సూత్రము (law) ఇమిడియున్నది. నియతి లేని క్రియ లేదు. కన్నులు మాత్రమే ఏల చూడవలెను? చెవులు ఏల చూడరాదు? కన్నులు ఏల వినరాదు? వీటిని అన్నింటిని నియంత్రించే సూత్రము ఒకటి ఉండి తీరవలెను. అది ఎయ్యది? ఆ సూత్రము ఒక వ్యక్తి యొక్క కన్నులను మాత్రమే గాక, సర్వప్రాణుల కన్నులను నియంత్రించుచున్నదని మనకు తెలియుమనే యున్నది. దాని మూలకముగనే కంటివైద్యుడను వాడొకడు ఉండుట సంభవమగుచున్నది. ప్రతి కన్ను కొన్ని నియమములకు లోబడి పనిచేయును. ఆ నియమములలో మార్పులు రావు. అనగా కన్నులరూపములో మాత్రమే గాక, కన్నులను నియంత్రించే నియమముల రూపములో కూడ పరమేశ్వరుడే గలడు. వినుట, ఆఘ్రాణించుట, రుచి చూచుట, ఆలోచించుట అను వ్యాపారముల

నియమములను మాత్రమే గాక సుఖము, దుఃఖము ఇత్యాదుల నియమములను కూడ శాసించువాడు పరమేశ్వరుడే. ఇవి అన్నియు ఖచ్చితమైన నియమములకు లోబడి యున్నవి. అట్లు గానిచో మనోవిజ్ఞానశాస్త్రము గాని, వివిధ శరీర విజ్ఞాన శాఖలు గాని మనకు ఉండెడివి గావు. మనము అన్నింటికీ సమానంగా అన్వయించే సూత్రాలను నిర్వచించ గల్గుతున్నాము. కావుననే, మనకు ఈ విజ్ఞాన శాస్త్రశాఖలు లభ్యమగుచున్నవి. ' ఈ పరిస్థితులు ఉన్నచో, ఈ ఫలము లభించును' అని మనము చెప్ప గలము. ఒక ఘటన జరిగినచో, దానికి సంబంధించిన ఇతరమగు ఘటన కూడ జరిగి తీరును. ఈ విధముగా మనకు సూత్రముల లోపల సూత్రములు, వాటి లోపల మరికొన్ని సూత్రములు అంతర్నిహితములై యున్నవి. స్థూలదేహము, ప్రాణములు, జ్ఞానేంద్రియములు మరియు మనస్సు అనునవి అన్నీ సూత్రములు తక్క మరియొకటి గాదు. మనము ఈ సూత్రముల గుండా ఈశ్వరుని దర్శించినచో, ప్రతి సూత్రము ఒక దేవత యగును. కన్నులకు ఆదిత్యుడు దేవత. వాక్కునకు అగ్ని దేవత. ఈ విధముగా ఇంద్రియములన్నింటికీ దేవతలు గలరు. కంటికి సమస్య వచ్చినచో, మనము కన్నులకు అధిష్ఠానదేవతయగు సూర్యుని ఆరాధించెదము. మనము దేనినీ ఉపేక్ష చేయుట లేదు. మనము ఒక వస్తువును పైకి ఎత్తవలెననుకొనుడు. దాని బరువును బట్టి కొంత శక్తి అవశ్యకమగును. ఇది ఒక సూత్రమునసరించి యుండును. ఈ విధముగా సర్వక్రియలను నియంత్రించే సూత్రమే దైవము. కావున ఒక జ్ఞానేంద్రియము గాని, లేదా కర్మేంద్రియము గాని ఒక క్రియను సమర్థవంతముగా నిర్వహించగల్గినపుడు, దాని వెనుక అధిష్ఠానదేవతయొక్క అనుగ్రహము కూడ గలదు. అ క్రియను నియంత్రించే సూత్రము గుండా మనము ఈశ్వరుని దర్శించినచో, ఆ సూత్రమే దేవత యగును. కావున ఏ క్రియను చేయుటకైననూ దైవానుగ్రహము ఆవశ్యకమగు చున్నది. ఈ సత్యమును గుర్తించిన వాడు ఆస్తికుడనబడును ; గుర్తించని వాడు నాస్తికుడగును. శాస్త్రమును అంగీకరించువాడు ఆస్తికుడనియు, అంగీకరించని వాడు నాస్తికుడనియు నిర్వచింప బడియున్నది. శాస్త్రమును అంగీకరించువాడు దేవతలను కూడ అంగీకరించును గదా! కన్ను, ముక్కు మొదలగు ఇంద్రియములకు అధిష్ఠాన దేవతలుగా ఉండి వాటికి ఆయా వ్యాపారములను చేసే శక్తిని అనుగ్రహించే దేవతలందరు కలిసి 'దైవమ్' అనబడును.

ఈ తీరున ఈ అయిదు అంశములు సర్వక్రియలకు కారణమగుచున్నవి. ఇవి అన్నీ కలిసి నిర్వర్తించే క్రియలు ఎన్ని రకములుగా నున్నవి ?

అధ్యాయము 18, శ్లోకము 15:

शरीरवाङ्ग मनोभिर्यत् कर्म प्रारभते नर : ।
न्याय्यं वा विपरीतं वा पञ्चैते तस्य हेतव : ॥ १५ ॥

శరీరవాఙ్మనోభిర్యత్ కర్మ ప్రారభతే నరః
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః (15)

నరః = మానవుడు, శరీరవాఙ్మనోభిః = శరీరముతో, వాక్కుతో మరియు మనస్సుతో, న్యాయ్యం వా = ధర్మబద్ధమైనది గాని, విపరీతం వా = ధర్మవిరుద్ధమైనది గాని, యత్ = ఏ, కర్మ = కర్మను, ప్రారభతే = ఆరంభించు చున్నాడో, తస్య = దానికి, ఏతే = ఈ, పంచ = అయిదు, హేతవః = కారణములు.

మానవుడు శరీరముతో, వాక్కుతో మరియు మనస్సుతో ఆరంభించే, ధర్మబద్ధమైన మరియు ధర్మవిరుద్ధమైన కర్మలకు ఈ అయిదు అంశములు హేతువులగుచున్నవి (15).

నరః అను శబ్దమునకు 'న రీయతే ' అనగా 'నశించని వాడు' అని వ్యుత్పత్తి. మానవుడు కర్మను చేయుచుండును. తద్వారా సంసారము నిరంతరముగా కొనసాగుచుండును. కావుననే మానవునకు నరుడని పేరు. మానవుడు వివిధరకముల కర్మను ఆరంభించుచుండును. కర్మను చేయుటకు వినియోగించే సాధనమును బట్టి ఆ కర్మ మూడు రకములుగా విభజింపబడి యున్నది. స్థూలదేహముతో చేయబడే కర్మలు కాయిక కర్మలనబడును. వాగింద్రియముచే చేయబడే కర్మ వాచిక కర్మ. మనస్సుతో చేసే ఆలోచనలు మానసిక కర్మ. ఈ విధముగా అనుష్ఠించే సాధనమును బట్టి కర్మ మూడు రకములుగా విభజింపబడియున్నది.

ఈ మూడు రకముల కర్మ మరల రెండు రకములుగా విభజింపబడినది. నైతిక సూత్రములకు కట్టుబడిన కర్మ న్యాయ్యం కర్మ అనబడును. అట్లు గాక, నైతిక సూత్రములకు కట్టుబడి యుండని కర్మ విపరీతం కర్మ అనబడును. తర్క శాస్త్రమునకు కూడ న్యాయము అను పేరు గలదు. యుక్తి యుక్తము మరియు సముచితము అగు కర్మ న్యాయ్యం కర్మ అనబడును. మధురముగా మాటలాడినచో అది న్యాయ్యం కర్మ అగును. ఇతరులను దుర్భాషలాడినచో, అది

విపరీతం కర్మ అగును. అదే విధముగా ఇతరులకు హానిని కలిగించే చేష్టలు, పరధనమును అపహరించుట ఇత్యాదులు కాయికమైన విపరీత కర్మలు. ఇతరులకు హానిని తలపెట్టుట కూడ మానసికమైన విపరీతకర్మయే. శాస్త్రము యొక్క అభ్యనుజ్ఞ (sanction) గల కర్మ న్యాయ్యం కర్మ అనియు, శాస్త్రనిషిద్ధమైన కర్మ విపరీతం కర్మ అనియు శ్రీశంకరులు వివరించిరి. వీటిలో కొన్ని కర్మలను మనము బుద్ధిపూర్వకముగా ఆచరిస్తాము. కాగా, గాలి పీల్చుట మొదలగు క్రియలు అసంకల్పిత చర్యలే అయినా, ప్రాణము నిలబడుటకు అత్యావశ్యకమగు చున్నవి. ఈ విధముగా సంకల్పితములు మరియు అసంకల్పితములు అగు చర్యలన్నింటికీ ఈ అయిదు అంశములే హేతువులగుచున్నవి (పంచ ఏతే తస్య హేతవః). ఈ విషయము ఇంతకు ముందు చెప్పబడినది. అయిననూ భగవానుడు మరల మనలను సర్వక్రియలకు హేతువులగు ఈ అయిదు అంశములను గురించి సావధానులను చేయుచున్నాడు. కావున, క్రియలను ఆచరించే సాధనములను బట్టి అవి మూడు రకములుగా నున్నను, వాటి అనుష్ఠానమునకు అయిదు అంశములు ఆవశ్యకమగుచున్నవి.

ఈ విషయమునిచట చర్చించుటకు కారణమేమి? కర్మస్వరూపమును నిర్ణయించుట యందు భగవానునకు తాత్పర్యము లేదు. ఆత్మకు క్రియలతో సంబంధమేమైన గలదా? అను విషయములో మనకు గల దృష్టిని శోధన చేయుట యందు మాత్రమే భగవానునకు తాత్పర్యము గలదు. ఈ అయిదు అంశములు కర్మకు హేతువులై యుండగా, ఆత్మ కర్తయని నీవు ఎట్లు చెప్పగలవు? అహంకారమైననూ కర్తయని చెప్పుట పొసగదు. ఏలయన, అది కర్మకు ఆవశ్యకమగు హేతువులు అయిదింటిలో ఒకటి మాత్రమే. అదే విధముగా, మిగిలిన నాలుగు అంశములలో కూడ ఏ ఒక్క దానినైననూ ప్రత్యేకించి కర్తయని చెప్పుట పొసగదు. కర్మేంద్రియములు తమంత తాముగా కర్త గావు; మనస్సు ఒక్కటి కర్త కాజాలదు; శరీరము కర్త కాదు; జ్ఞానేంద్రియములు గాని, బుద్ధి గాని కర్త కాజాలవు. వీటిలో ఏ ఒక్కటియైననూ కర్త గానిచో, మరి కర్త యెవరు? కర్త ఎవ్వరూ లేరు. ఇవ్వి అన్నీ కలిసి కర్త యన్నచో, ఆ కర్త మిథ్యయని స్పష్టమగు చున్నది. ఏలయన, ఆ సముదాయము తన ఉనికికి మరియొక దానిపై ఆధారపడుచున్నది. ఈ అయిదింటికీ భిన్నముగా మరియొక తత్త్వము గలదు. అది అకర్తయే యైననూ, ఈ సర్వము సంభవమగునట్లు చేయుచున్నది. అదియే ఆత్మ. కావున కర్మను నిర్వచించుటకు తాత్పర్యమేమనగా, 'నేను' ( ఆత్మ) సర్వదా సర్వక్రియలనుండి వినిర్ముక్తమని నిరూపించుటయే. కర్మస్వరూపమును నిర్వచించుసరికి, ఏ కర్మకైననూ హేతువు కాని ఆత్మ దానికి పూర్తిగా అతీతమై ప్రకాశించును. ఆత్మ క్రియలలో సాక్షాత్తుగా పాల్గొనే అంశము కాదు. కాని ఆత్మ కర్మయొక్క సాక్షి మాత్రమే గాక, కర్మయొక్క స్వరూపసత్యము కూడా. అనగా ఆత్మ లేనిదే కర్మ లేదు.

**అధ్యాయము 18, శ్లోకము 16:**

तत्रैवं सति कर्तारमात्मानं केवलं तु य : ।
पश्यत्यकृतबुद्धित्वान्न स पश्यति दुर्मति : ॥ १६ ॥

తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః
పశ్యత్యకృతబుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః (16)

**తత్ర** = ఆ విషయము, **ఏవమ్** = ఈ విధముగా, **సతి** = ఉంటూ ఉండగా, **తు** = దానికి భిన్నముగా, **యః** = ఎవడైతే, **కేవలమ్** = శుద్ధమగు, **ఆత్మానమ్** = ఆత్మను, **కర్తారమ్** = కర్తగా, **పశ్యతి** = దర్శించునో, **దుర్మతిః** = విపరీత బుద్ధి గల, **సః** = అతడు, **అకృతబుద్ధిత్వాత్** = పరిపక్వము కాని బుద్ధి గలవాడగుట వలన, **నపశ్యతి** = దర్శించుట లేదు.

> ఈ విషయము ఇట్లుండగా, ఎవడైతే దీనికి భిన్నముగా శుద్ధమగు ఆత్మ కర్తయని భావించునో, అట్టి వాడు అపరిపక్వమగు బుద్ధి గలవాడై విపరీతదర్శనము గలవాడగుట వలన సత్యమును దర్శింపజాలడు (16).

'ఇది ఇట్లు ఉండగా (తత్ర ఏవం సతి)'. అనగా ఇంతకు ముందు చెప్పబడిన విధముగా ఈ అయిదు అంశములు కర్మకు హేతువులై యున్నవి. అది అట్లు ఉండగా, ఆత్మ మాత్రమే కర్తయని భావించువాడు దుర్మతి యగును. అనగా వాని బుద్ధి సత్యమును యథాతథముగా గాక, వక్రీకరించి దర్శించును. బుద్ధియొక్క ఈ విపరీత దర్శనము చాల లోతైనది. దీని ప్రభావముచే జీవుడు కర్మల నాచరిస్తూ కర్మఫలానుభవము కొరకై జననమరణ ప్రవాహములో కొట్టుమిట్టులాడుచుండునని శ్రీశంకరులు వివరించిరి. బాహ్యవస్తువులను తప్పుగా చూచిననూ, పెద్ద హాని కలుగక పోవచ్చును. కాని మానవుడు తనను తాను తప్పుగా దర్శించినచో, అది పెద్ద సమస్యయే యగును. మానవుడు తనను తాను తప్పుగా దర్శించుట చాల హానికరము. దాని వలన ఇతరము సర్వము విపరీతముగా భాసిల్లును. ఆత్మ శుద్ధము (కేవలమ్). అనగా అది క్రియలను వేటినీ ఆచరించదు. దానిలో మార్పులేమియు కలుగవు. కాని సర్వక్రియలు దాని సన్నిధిలో జరుగుచుండును. అట్టి ఆత్మను కర్తగా (కర్తారమ్) దర్శించినచో, అది సత్యమును వక్రీకరించుటయే యగును. మానవుడు ఇట్టి తప్పు ధారణకు గురియగుటకు కారణమేమి? అతని బుద్ధి వక్రముగా నుండుటయే (దుర్మతిః).

ఈ విరుద్ధదర్శనమునకు కారణమేమి? అతని బుద్ధి ఇంకనూ పరిపక్వము కాలేదు (అకృతబుద్ధిః). అతని బుద్ధి సంస్కృతము (సంస్కరింపబడినది) కాలేదు. అనగా విపరీతభావనల నన్నింటినీ తొలగించి శుద్ధిని చేసే శ్రవణాది ప్రక్రియలో అతని బుద్ధి శిక్షితము కాలేదు. అతని బుద్ధి సరియగు పద్ధతిలో గురువునుండి స్వీకరించబడిన ఉపదేశముచే ఉద్భాసితము కాలేదని శ్రీశంకరులు వివరించిరి. వేదాంతశాస్త్రమును చదివిన చాలదు. దానిని అవగాహన చేసుకొనుటలో ప్రతిబంధకములున్నచో, వాటిని గురువు సహాయముతో తొలగించుకొని, శాస్త్రతాత్పర్యమును స్పష్టముగా తెలియవలెను. తరువాత దానిని విచారము (మననము) చేసి అనుసంధానము చేసినచో, ఆ జ్ఞానము వంటబట్టి స్వంతమగును. ఇది ప్రహేళిక (puzzle) కు సమాధానమునకు కనుగొనుట వంటిది. దానిని ఒక సారి పరిష్కరించిన తరువాత మననము చేసి వంటబట్టించు కొననిచో, మరల రెండవ సారి పరిష్కరించుట సంభవము కాదు. ఒక వ్యక్తి మీకు పదముల ప్రహేళికను (word puzzle) ఇచ్చి నాడనుకొనుడు. మీరు కొంత శ్రమపడి పదమును కనిపెట్టినారు. కాని ఆ వ్యక్తి ఆ ప్రహేళిక లోని వరుసను పూర్తిగా చెల్లాచెదరుగా చేసి మీ ముందు పెట్టినచో, మరల మీరు పూర్వమునందు వలెనే శ్రమించి పదమును కనుగొనవలసి యుండును. మీకు ఆ పనిలో ఇంకో మూడు రోజులు గడిచిపోవును. ఆ పదము మీకు దొరకవచ్చును; లేదా అసలే దొరకక పోవచ్చును. ఆ సమస్యకు పరిష్కారము గలదని మీకు తెలియును. ఆ పరిష్కారమును మీరు ఒక పర్యాయము కనుగొనియున్నారు కూడా! కాని అది దొరికిన విధానము మీకు గుర్తు లేదు. కావున సమస్యయొక్క సమాధానమును వంటబట్టించుకొనుట ఆవశ్యకమగుచున్నది. మీకు ఆ సమస్యను ఇచ్చిన వ్యక్తి దానిని చక్కగా పరిశీలించి, విశ్లేషించి, అవగాహన చేసుకొని, దాని సమాధానమును స్వంతము చేసుకొని యున్నాడు. ఇప్పుడు ఆ ప్రహేళికలోని వివిధభాగములు ఎట్లు చెల్లాచెదరై యున్ననూ, అతనికి ఇబ్బంది లేదు.

వేదాంతములో మనము అవగాహన చేసుకోవలసినది మాత్రమే గలదు. దీనిలో విశ్వసించవలసినది ఏదీ లేదు. కావున మనము విచారము చేసి ఉపదేశమును తెలుసుకొనవలెనని శ్రీశంకరులు వివరించిరి. ఈ ప్రక్రియలో ముందుకు వెళ్లని వ్యక్తికి ఆత్మ కర్తవలె భాసించును. అతడు శాస్త్రమునందు విశ్వాసము గలవాడే కావచ్చును. కాని ఆత్మయొక్క మౌలికస్వరూపము నిష్క్రియమని అతడు గుర్తించలేదు. కావున అతడు పూర్వమీమాంసకులవలె గొప్ప వేదవిద్వాంసుడే అయిననూ, సరియగు పద్ధతిలో శాస్త్రోపదేశమును పొందినవాడు కాదు గనుక, అతని బుద్ధి ఇంకనూ పరిపక్వము కాలేదు (అకృతబుద్ధిః). అందువలననే అతడు దుర్మతిః అనబడుచున్నాడు. అతనికి కర్మను గురించి మరియు ఆత్మను గురించి సత్యము తెలియదు. ఇంతకు ముందు లెక్కించబడిన

ఈ అయిదు అంశములు మాత్రమే సర్వకర్మలకు హేతువులు అగుచున్నవి. ఆత్మ సర్వదా ఉపస్థితమై యున్ననూ, అది ఈ కర్మలయందు సమ్మిళితము అగుట లేదు. ఆత్మ సర్వదా అకర్తగనే మిగిలియున్నది. కాని అతడీ సత్యమును దర్శించలేకున్నాడు. 'అతడు చూస్తూనే ఉన్నా కనలేకున్నాడు' అని శ్రీశంకరులు వర్ణించిరి (పశ్యన్ అపి న పశ్యతి). ఆత్మ దేహవ్యతిరిక్తమని అతనికి తెలుస్తూనే ఉన్నా, భ్రాంతిలో ఉన్నాడు గనుక చూడని వానితో సమానమగుచున్నాడు. శ్రీశంకరులు ఇచట ఒక దృష్టాంతమునిచ్చుచున్నారు: ఉన్నది ఒక చంద్రుడే అయినా నేత్రదోషముగల వ్యక్తి రెండు చంద్రులను చూచును. ఇంతే గాక, మేఘములు కదులుచుండగా, మనకు చంద్రుడే కదులుచున్నట్లు కన్పట్టును. వస్తువులు ఉన్నవి ఉన్నట్లుగా కానరావు. స్థూలదేహములో ఆత్మ బుద్ధి సాక్షియై ప్రకాశించుచున్నది. అది క్రియలను వేటినీ చేయుట లేదు. ఆత్మ క్రియలను చేయుచున్నట్లు కన్పట్టిననూ, వాస్తవముగా చేయుట లేదు (కుర్వన్ అపి న కరోతి). చూచుట, చేయుట, వినుట, ఆలోచించుట ఇత్యాది క్రియలన్నింటిలో ఆత్మయొక్క సన్నిధి ఉన్ననూ, ఆత్మ క్రియలను వేటినీ చేయుట లేదు.

భగవానుడు దుర్మతిని నిర్దేశించినాడు. మంచి బుద్ధి గలవాడు (సుమతి) ఎట్లుండును?

**అధ్యాయము 18, శ్లోకము 17:**

यस्य नाहंकृतो भावो बुद्धिर्यस्य न लिप्यते ।
हत्वाऽपि स इमांल्लोकान् न हन्ति न निबध्यते ॥ १७ ॥

యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే
హత్వాపి స ఇమాం ల్లోకాన్ న హంతి న నిబధ్యతే (17)

యస్య = ఎవనికి, అహంకృతః = అహంకారముతో గూడిన, భావః = భావము, న = లేదో, యస్య = ఎవని, బుద్ధిః = బుద్ధి, న లిప్యతే = లేపమును పొందదో, సః = అట్టివాడు, ఇమాన్ = ఈ, లోకాన్ = జనులను, హత్వా అపి = సంహరించిననూ, న హంతి = సంహరించుటలేదు, న నిబధ్యతే = బంధింప బడుట లేదు.

ఎవనికైతే అహంకారముతో గూడిన భావన లేదో, ఎవని బుద్ధి లేపమును పొందదో, అట్టివాడు ఈ జనులను సంహరించిననూ, సంహరించుట లేదు; మరియు బంధింపబడుట లేదు (17).

ఆచార్యునిచే ఉపదేశించబడిన శాస్త్రమును చక్కగా శ్రవణము చేసి, ఆ బోధనా ప్రక్రియలో పాల్గొనిన వ్యక్తి యందు 'నేను కర్తను' అనే ధారణ (అహంకృతః భావః) ఉండదు. 'నేను లేనిదే కర్త లేదు; కావున కర్త నేనే; కాని నేను కర్తను గాను' అను సత్యమును అతడు తెలుసుకొని యున్నాడు. 'నేను కర్తను గాను' అనే గుర్తింపును కలిగించిన ఈ వివేకజ్ఞానము అతనికి ఎట్లు లభించినది? అను విషయమును శ్రీశంకరులు వివరించినారు. స్థూలదేహము, ఇంద్రియములు, మనస్సు మొదలుగా గల ఈ అయిదు అంశములు అవిద్యచే ఆత్మయందు అధ్యారోపము చేయబడినవి. వీటిని ఆత్మతో కలిపి గ్రంథిని నిర్మాణము చేయు అంశమే అజ్ఞానము. ఆత్మ స్వతంత్రమే అయినా, అజ్ఞానము వలన దేహేంద్రియమన స్సంఘాతము కలది వలె కన్పట్టును. కర్మలన్నింటికీ ఈ అయిదు అంశములు మాత్రమే హేతువులగుచున్నవి. గుణములు గుణములలో సంచరించుచున్నవి (గుణా గుణేషు వర్తంతే). ఆత్మ అసంగము. ఈ క్రియలన్నింటికీ నేను సాక్షిని. ఆత్మ ప్రాణసంబంధము, మనో సంబంధము లేనిది. కావుననే, ఆత్మ నిత్యశుద్ధము. అది ఈ కారణములకు మరియు సర్వకారణకారణమగు ప్రకృతికి కూడ అతీతమైనది (అప్రాణో హ్యమనాశ్శుభ్రో హ్యక్షరాత్పరతః పరః) అను శ్రుతిని శ్రీశంకరులీ సందర్భములో ఉదహరించిరి. ఈ మాయకు ఆత్మయే ఆశ్రయమగుచున్నది. అట్టి ఆత్మయందు ఎట్టి వికారములు గాని, క్రియలు గాని లేవు. ఈ సత్యము నెరింగిన వాడు స్పష్టమగు అవగాహన గలవాడని చెప్పదగును.

అట్టి వాని బుద్ధి లేశమైననూ ప్రభావితము కాదు (యస్య బుద్ధిః న లిప్యతే). అతనియందు పశ్చాత్తాపమునకు తావు లేదు. 'నేను చేయని మంచి కార్యము ఏమి గలదు? నేను చేసిన తప్పు ఏది గలదు? (కిమహగ్ం సాధు నాకరవమ్, కిమహం పాపమకరవమితి)' అని అతడు ధైర్యముగా చెప్పగలడు. అతని యందు దోషిత్వ భావన (guilt) లేశమైననూ లేదు. తాను చేసిన పాపములకు ప్రతిఫలముగా తనకు నరకయాతనలు తప్పవేమో యను భయము అతనికి లేదు. 'నేను పుణ్యమునేల చేయకపోతిని? పాపమునేల చేసితిని?' అనే బెంగ అతనికి లేదు. జనులు సాధారణముగా ఈ విధమగు అనుతాపముతో బాధపడుచుందురు. కాని ఇట్టి దోషిత్వభావనలతో సతమతము కాని బుద్ధి గల వ్యక్తిని గురించి మనము చర్చించుచున్నాము. ఇది చాల ప్రముఖమైన విషయము. ఏలయన, ఈ దోషిత్వభావనలన్నియు 'నేను' పై కేంద్రితమై యుండును. నేను చేయరాని పనులను చేసి యున్నాను. చేయదగిన కర్మలను చేయనే లేదు అని ప్రతి మానవుడు దుఃఖించుచుండును. జీవితములో విజయములను సాధించుట, చదువు, నైపుణ్యము ఇత్యాది అనేక విషయములలో మనము పలువిధముల దోషములనొనర్చి యుందుము. నేను వైద్యకళాశాలలో చదివి ఉండవలసినది. నేను ఇంజనీరింగు చదివి యుండవలసినది. నేను సంగీతమును నేర్చినచో బాగుండెడిది. నేనీ

సంగీతము జోలికి పోకున్నచో బాగుండేది. మరియొక వృత్తియే లేదా యన్నట్లు, నేనీ బడిపంతులు ఉద్యోగమునకు ఏల వచ్చితినో! నేను పరిశ్రమల రంగమునకు వెళ్లియున్నచో బాగుండెడిది. ఈ విధముగా మానవులు తాము చేసిన వాటిని గురించి మరియు చేయని వాటిని గురించి అనుతాపమును చెందుచుందురు. మానవుని ఈ అనుతాపమునకు మూలములో ఆతడు స్వయముగా ఆచరించిన కర్మలు గలవు. కాని ఈ దుఃఖమునకు కారణము కర్మలు కావు. 'నేను' పై కేంద్రితమైన కర్మ మాత్రమే అనుతాపమునకు దారితీయును. దోషిత్వభావన మరియు 'నేను' అనునవి విడదీయరానంత బలముగా కలిసియున్నవి. కాని అదృష్టవశాత్తు 'నేను' వాస్తవములో సర్వకర్మవినిర్ముక్తమై యున్నది. మనము వంద రకముల వాదములను లేవదీయవచ్చును. కాని 'నేను' క్రియలను వేటినీ చేయుట లేదు. అట్టి స్థితిలో, ఆత్మకు మంచి కర్మగాని, చెడు కర్మగాని ఏది గలదు? ఆత్మ ఎన్నడైననూ ఏ కర్మనైననూ చేసియుండలేదు. కావున ఆత్మ దోషిత్వభావననుండి వినిర్ముక్తమై యున్నది. కావున, ఈ ఆత్మదర్శనము గల వాని బుద్ధి పశ్చాత్తాపములచే లేశమైననూ ప్రభావితము కాకుండుట (తస్య బుద్ధిర్న లిప్యతే) సహజమే. మానసిక భావావేగములను నియంత్రించు కొనుటలో పశ్చాత్తాపము సహకరించవచ్చును. కాని అది ఆత్మ కర్తయనే ధారణ గలవానికి మాత్రమే సహకరించును. మనమిచట పశ్చాత్తాపమును త్రోసివుచ్చుట లేదు. మనము దానికంటె ఒక అడుగు ముందుకు వేసి, ఆత్మ అకర్తయని చెప్పుచున్నాము. కావున ఆత్మస్వరూపుడగు జ్ఞాని గతములో చేసినది గాని, చేయనిది గాని లేదు గనుక, పశ్చాత్తాపమునకు తావు లేదు.

ఇట్టి స్పష్టమగు దర్శనము గల వ్యక్తి జ్ఞాని యనబడును. యుద్ధరంగములో సమగూడిన ఈ జనులనందరినీ సంహరించిననూ, జ్ఞాని సంహారక్రియను చేసినట్లు గాదు (హత్వాపి స ఇమాన్ లోకాన్ న హంతి). యుద్ధరంగములో ఈ జనులనందరినీ జ్ఞాని సంహరించే పక్షములో ఆతడు సంహరించలేదని చెప్పుట యెట్లు పొసగును? చూచేవాని దృష్టిలో జ్ఞాని కర్మలను చేయుచున్నట్లు కానవచ్చును. కాని వాస్తవములో ఆత్మ కర్మలనాచరించదు. కావున జ్ఞాని కర్మఫలములచే బంధింపబడడు (న నిబధ్యతే). దేహము మొదలైన ఈ అయిదు అంశములు మాత్రమే సర్వకర్మలకు హేతువులగుచున్నవి. ఆత్మకు ప్రత్యక్ష క్రియాసంబంధము లేదు. ఆత్మ సాక్షి మాత్రమే. మరియు దేహమునకు సర్వకర్మలకు అధిష్ఠానము ఆత్మయే. కాని ఆత్మ స్వయముగా కర్మల నాచరించదు. మనమీ ప్రకరణములో పురుషుని గురించి మాత్రమే మాటలాడు చున్నాము. ఆ పురుషుడు క్రియలను వేటినీ ఆచరించుట లేదు. న్యాయాధికారి దోషిని ఉరితీయుడని తీర్పు చెప్పును. ఆ న్యాయమూర్తి యందు హత్యాదోషము సంక్రమించినది గనుక, ఆతనిని ఉరితీయవలెనని చెప్పగలమా? అది

సరిగాదు. ఆతడు తన విధిని నిర్వర్తించినాడు. ఆతని యందు పశ్చాత్తాపము పీసమైననూ ఉండదు. తాను న్యాయనిర్వహణలో నిమిత్తమాత్రుడు మాత్రమేనని ఆతడు ఎరుంగును. ఆతనియందు అహంకారము లేదు.

ఈ వాక్యము హత్యకు అనుమోదించుచున్నదనుకోరాదు. అన్నిటికంటె కష్టమైనది మరియు అధర్మము అగు కర్మను మనము పరిష్కరించినచో, మిగిలిన కర్మలనన్నింటినీ పరిష్కరించినట్లే యగును. దీనికి ప్రథమ-మల్ల-న్యాయము అని పేరు. మల్లయుద్ధవీరులలో ప్రథమస్థానమును పొందగోరు వీరుడు ప్రస్తుత ప్రపంచమల్లయుద్ధవిజేతను జయించిన చాలును. అదే విధముగా, హత్య అను కర్మను ప్రస్తావించుటద్వారా భగవానుడు కర్మలనన్నిటినీ ప్రస్తావించినట్లైనది. ''అవినాశి, శాశ్వతము, పుట్టుక లేనిది, అపక్షయము లేనిది అగు ఈ ఆత్మను తెలుసుకున్న వ్యక్తి ఇతర ప్రాణిని తాను సంహరించుట గాని, లేదా ఇతరులచే సంహరింపజేయుట గాని ఎట్లు సంభవమగును? (వేదావినాశినం నిత్యం య ఏనమజమవ్యయమ్, కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కమ్)'' అనియు, ''ఈ ఆత్మ తాను చంపదు; ఇతరులచే చంపబడదు (నాయం హంతి న హన్యతే)'' అనియు, 'పుట్టుక లేనిది, శాశ్వతమైనది, అతి ప్రాచీనమైనది యగు ఈ ఆత్మ దేహము నశించిననూ, తాను నశించదు (అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే)' అనియు మనము చూచియున్నాము. ఆత్మ క్రియలలో కర్మ కాజాలదు; కర్త అయ్యే ప్రసక్తియే లేదు.

తగు విధానములో శాస్త్రపరిజ్ఞానమును పొందని వ్యక్తి నిష్క్రియమగు ఆత్మను కర్తగా దర్శించునని (కేవలం ఆత్మానం కర్తారం పశ్యతి) పూర్వశ్లోకములో చెప్పబడినది. ప్రతిక్రియలో కరణము, కర్త, అధిష్ఠానము, ప్రాణము మరియు దైవము అనే అయిదు అంశములు అవశ్యకమగునని అంతకు ముందు శ్లోకములో చెప్పబడినది. కర్త ఆత్మయే. కాని ఆత్మ కర్త కాదు. శాస్త్రము మనముందు ఆత్మకంటె భిన్నమైన కర్తను ప్రతిపాదించుట లేదు. వాస్తవములో శాస్త్రము ఆత్మకంటె భిన్నమగు దానిని దేనినైననూ ప్రస్తుతించుట లేదు. కర్త ఆత్మయే గనుక, సచ్చిదానందము కంటె భిన్నము కాదు. సచ్చిదానంద ఆత్మయందు క్రియ మచ్చునకైననూ లేదు. ఆత్మను గురించి మనకు గల అజ్ఞానము తొలగిపోనిదే, ఈ సత్యము గోచరించదు.

ఇచట శ్రీశంకరులు ఒక యుక్తి సంగతమగు సందేహమును లేవనెత్తిరి. 'తగినంత పరిజ్ఞానము లేని వ్యక్తి ఒక క్రియను ఆచరించుటకు అవశ్యకమగు మిగిలిన నాలుగు అంశములను పరిగణించనివాడై ఆత్మ ఒక్కటియే కర్తయని భావించును (కర్తారం ఆత్మానం కేవలం పశ్యతి

దుర్మతిః)' అని ఈ శ్లోకమునకు అర్థమును ఏల చెప్పరాదు? ఆత్మ తనంత తానుగా కర్త కాక పోయిననూ, ఈ నాల్గింటితో కలిసి కర్తయగునేమో! దీనిని బట్టి ఆత్మ అకర్త కాదు. ఆత్మ కర్తయే. కాని తనంత తానుగా (కేవలమ్) కాదు అని తెలును. దేహాదులతో సంయోగమును పొందినదై, ఆత్మ కర్త యగుచుండును. ఈ సత్యము అందరికీ తెలిసినదే. కేవల-ఆత్మ ఒక్కటియే కర్తయని ఎవ్వరూ తలపోయరు. తనకు స్థూలదేహసంబంధము లేదని తలంచువాడు ఎవ్వడు? స్థూలదేహము లేకుండగా ఏ జీవుడైననూ నడచుట ఇత్యాది కర్మలను చేయగల్గునా? ఇట్లు భ్రాంతిపడు వారెవ్వరూ లేరు. ఎవ్వరైననూ అట్లు భ్రాంతి పడినచో, వారు దురాత్ములనబడుదురు. ఈ శ్లోకమును ఈ తీరున ఏల వ్యాఖ్యానించరాదు?

దీనికి సమాధానమునిచ్చుటలో ఇబ్బంది లేదని శ్రీశంకరులు వ్యాఖ్యానించిరి. ఆత్మ స్థూలదేహము ఇత్యాదులతో సంయోగమును పొంది కర్త యగుచున్నది అన్నచో, ఆత్మ స్థూలదేహముతో, ఇంద్రియములతో మరియు మనస్సుతో ఈ సంయోగమును పొందు విధమెట్టిది? ఆత్మ అవిక్రియము. కావున ఈ రకమగు సంయోగమును పొందుటకు ఏ మార్పులు అవశ్యకమగునో, ఆ మార్పులను ఆత్మ పొందజాలదు. శుద్ధచైతన్యఘనమగు ఆత్మయందు అవయవములు లేవు. కాని ఇతరముతో సంయోగమును చెందుటకై అవయవములు ఉండవలెను. ఈ శుద్ధ చైతన్యమునకు ద్వితీయపదార్థముతో సంయోగము ఎట్లు సంభవమగును? స్థూలదేహము వంటి సావయవపదార్థమునకు నిరవయవమగు ఆత్మతో సంయోగము ఎట్లు పొసగును? విశిష్టరూపములు గల రెండు వస్తువుల మధ్య సంయోగము సంభవమే. కాని సర్వగుణవినిర్ముక్తమగు ఆత్మ సగుణమగు దేహముతో సంయోగమును పొందుట ఎట్లు కుదురును? ఈ సంయోగము అసంభవము.

ఇంతేగాక, కేవలమ్ అను పదమునకు అర్థమేమి? అభ్యంతరమును లేవనెత్తిన పూర్వపక్షి దానికి 'మాత్రమే' అనే అర్థమును స్వీకరించినాడు. దానికి 'శుద్ధము' అనే అర్థము కూడ గలదు. ఆత్మ మాత్రమే ఉనికిని కలిగి యున్నది. ఇతరము ఏదియూ లేదు. ఆత్మ స్వభావము చేతనే సర్వవికారములనుండి మరియు సర్వగుణములనుండి వినిర్ముక్తమై యున్నది. ఇచట కేవల శబ్దమునకు శుద్ధమనియే అర్థము. ఆత్మయొక్క స్వరూపమును ఈ శబ్దము అనువదించుచున్నది. ఆత్మ మాత్రమే కర్త యని ఈ వాక్యమునకు అర్థము కాదు. తరువాతి శ్లోకము కూడ ఈ విషయమును ధ్రువపరచుచున్నది.

ఆత్మ క్రియలను చేటినీ అచరించదనే సంగతి శ్రుతిలో మరియు స్మృతియగు గీతలో కూడ

విస్తృతముగా ప్రస్తావింపబడుటయే గాక, అది న్యాయసమ్మతము కూడ అగుచున్నది. ఆత్మయందు వికారములు లేవు (అవికార్యః); గుణములు మాత్రమే క్రియలను ఆచరించుచున్నవి (గుణైరేవ కర్మాణి క్రియంతే); ఓ అర్జునా! ఆత్మ శరీరమునందు ఉపలభ్యమగుచున్ననూ, కర్మలను వేటినీ చేయుట లేదు (శరీరస్థోపి కౌంతేయ న కరోతి) అని గీత చెప్పుచున్నది. ఇదే విషయమును 'పురుషుడు ధ్యానమును చేయుచున్నవాడు వలె, ధ్యానమునుండి భంగమును పొందిన వాడు వలె నున్నాడు (ధ్యాయతీవ లేలాయతీవ)' అనే శ్రుతి కూడ చెప్పుచున్నది. ఆత్మ ధ్యానమును చేయుట లేదు; మరియు ఆత్మ ధ్యానభంగమును పొందుట లేదు. కేవలము మనకు అట్లు కానవచ్చుచున్నది.

ఆత్మయందు అవయవములు లేవనియు ఆత్మ ఇతరముపై ఆధారపడి లేదనియు మరియు ఆత్మ నిర్వికారమనియు మనము యుక్తియుక్తముగా నిరూపించవచ్చును. స్వయంప్రకాశమగు తత్త్వము ఒకే ఒకటి గలదు. అదియే ఆత్మ. కావున అది తన ఉనికికి ఇతరముపై ఆధారపడదు. ఆత్మయందు అంశములు ఉన్నచో, అవి ఒక ఆశ్రయమును చేరి యుండవలెను. అట్టి ఆశ్రయము నిశ్చితముగా ఒక పదార్థము అయి ఉండవలెను. అప్పుడు అది అనాత్మయే యగును. ఆత్మయొక్క అంశములు అనాత్మయందు ఉండుట అసంగతము. కావున ఆత్మయందు అవయవములు ఉండుట యుక్తిసంగతము కాదు. ఇంతేగాక, చైతన్యస్వరూపమగు ఆత్మ స్వయంప్రకాశము గనుక, అవయవములు మరియు అంశములతో సహా సర్వము ఆత్మచే ప్రకాశింపచేయబడును. అవి స్వయంప్రకాశము కావు గనుక, ఆత్మ కాజాలవు. ఆత్మయందు వికారములు గలవన్నచో, ఆ విషయము నీకు ఎట్లు తెలిసినది? వికారములను పొందుచున్న ఆత్మను చూచే మరియొక ఆత్మ ఉండవలెను. మనము ఊహాశక్తిని హద్దులను దాటి వినియోగించి ఆత్మ సవికార మని చెప్పగల్గిననూ, అంత మాత్రాన ఆత్మ కర్తయని నిరూపితము కాదు. ఆత్మ చేయగలిగే క్రియ ఏది? ఆత్మయందు వచ్చే వికారము మాత్రమే దాని క్రియ కాగల్గును. దేహము, ఇంద్రియములు మరియు మనస్సు క్రియలను చేసినచో, అవి వాటి క్రియలే అగును. వాటి క్రియ ఆత్మయొక్క క్రియ ఎట్లు అగును? ఆత్మయందు వికారములు సంభవమేనని అంగీకరించిననూ, ఆ వికారములకు కారణమగు క్రియలు స్థూలదేహమునుండి గాని, మనస్సు నుండి గాని, లేదా ఇంద్రియముల నుండి గాని ఉద్భవించలేవు. మరియు ఆత్మ వాటిపై ఆధారపడని స్వతంత్రతత్త్వమని అంగీకరించినచో, అట్టి ఆత్మ స్థూలదేహము ఇత్యాదులచే చేయబడే క్రియలకు కర్త కాజాలదు. ఆత్మ సవికారమే యగుగాక! స్థూలదేహము, మనస్సు మరియు ఇంద్రియములు కర్మలను ఆచరించు చుండగా, ఆత్మ కర్త అగుట ఎట్లు పొసగును? ఒక వ్యక్తిచే చేయబడిన కర్మ దానిని చేయని మరియొక వ్యక్తిని పొందజాలదు. ఆ కర్మతో

అతనికి సంబంధము ఏమియు ఉండదు. ఒక వ్యక్తి చేయు కర్మలకు ఆ వ్యక్తి మాత్రమే బాధ్యుడగును. ఆ కర్మల బాధ్యత ఇతరులకు లేదు. కాని, కర్మలను చేసేది స్థూలదేహమే అయినా, జీవుడు దానితో తాదాత్మ్యమును పొంది అదియే ఆత్మ అనుకొనుచున్నాడు గదా! అనగా, ఇప్పుడు నెలకొనియున్న ఈ అజ్ఞానమును బట్టి దేహము యొక్క కర్మలు ఆత్మకు సంక్రమించుచున్నవి. నీ వాదము ఇదియే అయినచో, చిరంజీవివి కమ్ము. అయుష్మాన్ భవ. ఏలయనగా నేను చెప్పేది కూడా ఖచ్చితముగా అదియే. అప్పుడ కూడ ఆత్మ కర్త కాలేదు. అజ్ఞానముచే ఆత్మ కర్త యని భావించినచో, ఆ కర్తృత్వము వాస్తవము కాదు. శ్రీశంకరులు దీనికి ఒక దృష్టాంతమునిచ్చిరి. అలుచిప్పను చూచి వెండి అని భ్రమ పడినచో, అంత మాత్రాన అది వెండి కాబోదు. ఎదుటనున్నది అలుచిప్ప యనే విషయము తెలియని కారణముగా నీవు దానియందు వెండిని చూచితివి. నీచే చూడబడే ఆ వెండి అచట సుతరాము లేదు. అదే విధముగా, ఆత్మ అకర్తయనే విషయమునెరుంగక, నీవు ఆత్మయందు కర్మను దర్శించినచో, ఆ కర్మ ఆత్మకు చెందే ప్రసక్తి లేనే లేదు. చిన్నపిల్లలు ఆకాశము నీలముగా బోర్లిగించిన గిన్నెవలె నున్నదని తలపోయుదురు. కాని ఆకాశమునందు ఆ లక్షణములు వాస్తవముగా లేవు గదా!

ఏ విధమైన మార్పు లేకుండగా, ఒక క్రియను ఆచరించుట సంభవము కాదు. శ్రీశంకరుల వాదములో ముఖ్యమగు అంశము ఇదియే. క్రియకు ఆశ్రయమగు వస్తువునందు మార్పు లేకుండగా క్రియను ఆచరించుట సంభవము కాదు. దీనికి విలోమముగా, క్రియ ఉన్నచోట దానికి ఆశ్రయమగు వస్తువునందు మార్పు వచ్చుట అనివార్యము. క్రియను చేయకుండగా కనురెప్పలు మూతపడుట గాని, తెరుచుకొనుట గాని సంభవము కాదు. బుద్ధిపూర్వకముగా కన్నులను మూసి యుంచుట కూడ మానసిక క్రియయే యగును. సర్వక్రియలలో ఏదో ఒక చలనము గాని, మార్పు గాని ఉండి తీరును. ఒకానొక శరీరభాగములో వచ్చే మార్పులు శరీరమునకు మాత్రమే చెందును గాని, ఆత్మకు వాటితో సంబంధము లేదు. కావున, యస్య నాహంకృతో భావః బుద్ధిర్యస్య న లిప్యతే, హత్వాపి స ఇమాంల్లోకాన్ నాయం హంతి న హన్యతే అను శ్లోకములోని విషయము యుక్తియుక్తముగనే యున్నది. ఆత్మ కర్తయనే భ్రాంతికి గురికాని వాని మనస్సు కర్మలచే ప్రభావితము గాదు. అట్టి జ్ఞాని యుద్ధములో ఈ జనులను సంహరించిననూ, అతడు సంహరించుట లేదు. అతడు బద్ధుడు కాడు. అతనియందు అహంకారము లేదు గనుక, గతములో చేసిన, మరియు చేయని క్రియలను గురించి అతడు పశ్చాత్తాపముతో వేగవలసిన పని లేదు. అట్టి ఆత్మరూపుడగు జ్ఞాని కర్మలను వేటినీ ఆచరించుట లేదు గనుక, అతడు కర్మఫలములచే బంధింపబడడు.

గీత రెండవ అధ్యాయములో 'అతడు సంహరించుట లేదు; మరియు సంహరింపబడుట

లేదు (నాయం హంతి న హన్యతే)' అని చెప్పబడినది. దానికి కారణమేమనగా 'ఆత్మరూపుడగు ఆతనికి పుట్టుకలేదు (న జాయతే)'. అనగా ఆత్మ నిర్వికారము. ఈ వచనములను శ్రీశంకరులిచట ఉటంకించిరి. గీతాశాస్త్రసారమంతయు ఈ వాక్యములో చక్కగా నిరూపించబడినది. ఆత్మ నశింపజేయుటకు వీలుపడే పదార్థము అని భావించువాడు, మరియు సంహారక్రియను చేసే కర్త ఆత్మయే అని భావించువాడు అనే వీరిద్దరు ఆత్మను ఎరుంగరు (ఉభౌ తౌ న విజానీతః). ఎందువలన? ఆత్మ సంహారక్రియను చేయుట లేదు. మరియు ఆత్మ ఇతరులచే చేయబడే సంహారక్రియలో విషయము కాదు. క్రియలో విషయము కానిదే నశింపజేయుట అసంభవము. అందువలననే, ఆత్మను అయుధములు నశింపజేయలేవు (నైనం ఛిందంతి శస్త్రాణి)' అని భగవానుడు చెప్పియున్నాడు. ఇతరులు ఆత్మ స్వరూపుడవగు నిన్ను క్రియలో విషయము చేయలేరు గనుక నశింపజేయలేరు. ఆత్మ స్వరూపుడవగు నీవు క్రియలను వేటినీ చేయలేవు. అనగా ఆత్మ క్రియలలో కర్తగాని, కర్మగాని కాదు. ఈ విషయమును భగవానుడు మున్ముందుగనే చెప్పి, ఆత్మయందు జన్మ, మరణము ఇత్యాది వికారములు లేకుండుటకు (న జాయతే) గల కారణమును తరువాత వివరించినాడు. ఆత్మయొక్క ఉనికి లేని కాలఖండము గతములో ఎన్నడైననూ లేదు. ఇంతే గాక, ఆత్మ కొంతకాలము వరకు ఉండి భవిష్యత్తులో లేకుండుట జరుగబోదు (నాయం భూత్వా భవితా వా న భూయః). ఆత్మ కాలాధీనము కాదు గనుక, దానియందు ఈ రకం సమస్యలు లేవు. ఆత్మకు పుట్టుక లేదు; అది శాశ్వతము (అజో నిత్యః). ఈ హేతుగర్భవిశేషణముల ద్వారా, ఆత్మయందు వికారములు లేవని (అవిక్రియః) భగవానుడు మనకు బోధించియున్నాడు.

అజ్ఞాని చేసే క్రియ ఎన్ని రకములుగా నుండును? రెండు రకములుగా నున్నది. ఒకటి అతడు తాను స్వయముగా చేయునది; రెండవది అతడు ఇతరులచే చేయించునది. ఈ రెండు ఆతనికి చెందిన కర్మలే అగుచున్నవి. కాని ఈ వినాశములేని, శాశ్వతమైన, పుట్టుకలేని, వికారరహితమైన ఆత్మను తెలుసుకున్నవాడు (వేదావినాశినం నిత్యం య ఏనమజమవ్యయమ్) ఈ రెండు రకములు కర్మలకు కర్త కాడు. అట్టి జ్ఞాని ఎవరిని సంహరించును? లేదా సంహరింపచేయును (కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కమ్) ? అతడు ఏవిధమైన కర్మలనైననూ చేయుట లేదు. జ్ఞానముచే సర్వకర్మసన్న్యాసమనగా నిదియే. ఇట్టి జ్ఞానియందు కర్తృత్వము లేదు గనుక, ఆతనికి విధినిషేధములు వర్తించవు. శ్రీకృష్ణుడు ఈ విషయమును శాస్త్రారంభములో రెండవ అధ్యాయములో క్లుప్తముగా చెప్పి, గీతలో సర్వత్రా సందర్భము వచ్చిన ప్రతిపర్యాయము ఆయన ఆ విషయమును విపులీకరించినాడు. చూచుట, వినుట, స్పృశించుట, ఆఘ్రాణించుట ఇత్యాది కర్మలను

చేయుచున్ననూ, అతడు కర్మలను వేటినీ చేయుట లేదు (కుర్వన్నపి న కరోతి, పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్). కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను దర్శించువాడు జ్ఞాని (కర్మణ్యకర్మ యః పశ్యేదకర్మణి చ కర్మ యః). ఓ అర్జునా! శరీరమునందు ఉపలభ్యమగుచున్ననూ, ఆత్మ కర్మలను చేయుట లేదు (శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి). ఆత్మ కర్మలను వేటినీ చేయుట లేదని బోధించే ఇట్టి అనేకరకముల వాక్యములను మనము గీతలో చూచియున్నాము. ఇప్పుడు భగవానుడు శాస్త్రసారమునంతనూ సంగ్రహించి ఒక్క చోటికి చేర్చుచున్నాడు. ఇది అంతటా చెల్లాచెదరుగానున్న ధాన్యపు గింజలను ఒక చోటికి ప్రోగుచేయుట వంటిది. అర్జుననకు తాను చేయుచున్న ఉపదేశము ముగియనున్నదని భగవానునకు తెలియును. అందువలననే, జ్ఞాని సంహరించుట లేదు; మరియు బంధించబడుట లేదు (న హంతి న నిబధ్యతే) అని చెప్పి, ఆయన ప్రకృతములో చర్చించబడుచున్న విషయవస్తువును ఉపసంహరించుచున్నాడు.

కర్మ మరియు సన్న్యాసము అనే విషయములు గీతాశాస్త్రములో సర్వత్రా చర్చించబడినవి. శ్రీశంకరులు ఉపక్రమభాష్యములో ప్రవృత్తి మరియు నివృత్తి అను విషయములను ప్రధానముగా చర్చించిరి. ఓ అర్జునా! ఈ లోకములో సన్న్యాసులకు జ్ఞాననిష్ఠ, మరియు కర్మయోగులకు కర్మ అనే రెండు రకముల నిష్ఠలు గలవని నేను పూర్వములో చెప్పియున్నాను (లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ, జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్). యథార్థమగు సన్న్యాసము ఏది ? సన్న్యాసము అనే జీవనశైలియొక్క స్వరూపమెట్టిది ? కర్మయోగమనగా నేమి ? అను విషయములను మరల గీతాశాస్త్రము ఈ అధ్యాయములో సుస్పష్టముగా నిరూపించగలదు. మనమా విషయమును చూడగలము. గీతాశాస్త్రము అంతయు ఈ మూడు విషయవస్తువుల చుట్టు తిరుగుచుండును. జీవితములో ముఖ్యముగా సంపాదించవలసినది సర్వకర్మసన్న్యాసము. దానికొరకై కర్మయోగజీవనమును చేపట్టవచ్చును. లేదా, కర్మసన్న్యాసమును చేసి, కేవలజ్ఞాననిష్ఠకు అంకితము కావచ్చును. ఈ రెండు రకముల సాధకుల యందు కర్మఫలత్యాగము (కర్మల ఫలమును విడిచిపెట్టుట) గలదు. ఏలయనగా, వారు ఈ సాధనను పుణ్యము కొరకు గాక, మోక్షము కొరకు చేపట్టియున్నారు.

ఆత్మజ్ఞానమును పొందిన వ్యక్తియందు కర్తృత్వభావన గాని, దేహాత్మ భ్రాంతి గాని లేశమైననూ లేని కారణముగా, అతడు పూర్తిగా కర్మలనుండి వినిర్ముక్తుడై యుండును. కర్తృత్వభావన మరియు దానినుండి ఉదయించే కర్మలు కేవలము అజ్ఞానజనితములు మాత్రమే గనుక, తాను కర్మలను వేటినీ చేయుటలేదనే స్పష్టమగు దర్శనమును అతడు కలిగియుండును. ఇట్టి స్థితిలో అతనియందు జ్ఞానప్రభావముచే సర్వకర్మసన్న్యాసము సంపన్నమై యున్నది. కావున, అతనికి మూడు రకముల

కర్మఫలముతో సంబంధము లేదు. 'కర్తృత్వాభిమానమును వీడని వారికి మరణించిన తరువాత అభీష్టము, అభీష్టము కానిది మరియు మిశ్రమము అనే మూడు రకముల కర్మఫలము లభించును. కాని వీటితో సన్న్యాసికి సంబంధము లేదు (అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్, భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్) ' అని అయిదు శ్లోకముల వెనుకనే చెప్పబడినది. దేహాభిమానము కలిగియుండుటచే కర్తృత్వధారణ కలుగును. అట్టి వానికి కర్మఫలమును తప్పించుకొనుట అసంభవము. కర్మను చేయువానికి దాని ఫలము తగుల్కొనును. ఇదియే సర్వ వేదసారమని శ్రీశంకరులిచట చెప్పియున్నారు. కావున, వివేకముతో విచారము చేయగల బుద్ధిమంతులు ఈ విషయమును చక్కగా విచారణ చేసి తెలుసుకొనవలెను. సూక్ష్మబుద్ధి గల వివేకులు ఈ విషయవస్తువును తరచి చూడగల్గుదురు.

సందర్భము వచ్చిన ప్రతిపర్యాయములో కర్మ, సన్న్యాసము మరియు సర్వకర్మసన్న్యాసము అను విషయములు యథాశాస్త్రముగా మరియు యుక్తియుక్తముగా నిరూపించబడినవి. యుక్తికి ప్రముఖస్థానము గలదు. శాస్త్రార్థమును వంటబట్టించు కొనుటలో యుక్తి సహకరించును. ఏలయనగా, శాస్త్రమునకు పలువిధముల వ్యాఖ్యానములు ఉపలభ్యమగుచున్నవి. శాస్త్రము యొక్క ఉపదేశము యుక్తికి అతీతముగానుండ వచ్చును. కాని యుక్తికి విరుద్ధముగా నుండజాలదు.

ఇచట సంప్రదాయమంతయు సుస్పష్టముగా ప్రతిపాదించబడినది. వైదికసంప్రదాయము కర్మయే కేంద్రముగా కలది. సాధకుడు వేదవిహితమైన నిత్యకర్మలను మరియు ధర్మబద్ధములైన కామ్యకర్మలను చేయవచ్చును. కాని, సాధకుని లక్ష్యము మోక్షము అని నిర్ధారితమైనచో, అతడు కామ్యకర్మలను విడిచిపెట్టి, జ్ఞానసాధనను చేస్తూనే, కర్మయోగభావనతో విహితకర్మలను చేయుచుండవలెను. లేదా, సాధకుడు విహితకర్మలను కూడ పరిత్యజించి కేవలజ్ఞాననిష్ఠుడు కావచ్చును. ఈ సర్వము మోక్షము కొరకు ఉద్దేశింపబడినది. మోక్షమునందు కర్తృత్వము పూర్తిగా దూరమగును. ఇది జ్ఞానముచే మాత్రమే సంభవమగును. దీనియందు స్థూలమగు త్యాగమేమియు లేదు. జ్ఞానోదయము కాగానే, ఆత్మ నిష్క్రియము అనే గుర్తింపు కలుగును. దానిని బట్టి కర్తృత్వ పరిత్యాగము అర్థప్రాప్తమగును. అపుడా జ్ఞానికి కర్మఫలరూపమగు జననమరణములు ఉండవు.

ఈ కొద్ది వాక్యములలో గీతాసారమంతయు సంగ్రహించబడినది.

క్రియలకు అధిష్ఠానము మొదలగు అయిదు హేతువులు కలవనియు, అవి కాయికములు, వాచికములు మరియు మానసికములు అని మూడు రకములుగానున్నవనియు మనము ఇదివరలో

చూచియున్నాము. ఈ క్రియలను చేయుటలో మానవుని ప్రేరేపించునవి ఏవి? వాటి స్వరూపమేమి? ఈ విషయమును శ్రీకృష్ణుడు తరువాతి శ్లోకములో చెప్పుచున్నాడు.

**అధ్యాయము 18, శ్లోకము 18:**

ज्ञानं ज्ञेयं परिज्ञाता त्रिविधा कर्मचोदना ।
करणं कर्म कर्तेति त्रिविधः कर्मसंग्रहः ॥ १८ ॥

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మ సంగ్రహః (18)

కర్మచోదనా = కర్మను ప్రేరేపించునది, జ్ఞానమ్ = (పదార్థ) జ్ఞానము, జ్ఞేయమ్ = జ్ఞానములో విషయమగు పదార్థము, పరిజ్ఞాతా = తెలుసుకొనువాడు, త్రివిధా = మూడు రకములుగా నున్నది, కర్మసంగ్రహః = క్రియలోని అంగములు. కరణమ్ = క్రియాసాధనము, కర్మ = కర్మ, కర్తా = కర్త, ఇతి = అనే, త్రివిధః = మూడు విధములుగా నున్నది.

> పదార్థజ్ఞానము, జ్ఞానములో విషయమగు పదార్థము మరియు జ్ఞాత అను మూడు అంశములు క్రియకు ప్రేరకములు అగుచున్నవి. క్రియలో క్రియాసాధనము, కర్మ మరియు కర్త అను మూడు అంగములు గలవు (18).

సాధారణముగా వేదములోని కర్మను విధించు వాక్యములకు చోదనా అని పేరు. కాని ఇచట చోదనా యనగా మనలను క్రియలను చేయుటకు ప్రేరేపించునది అని యర్థము. మనలను క్రియలను చేయుటలో ప్రేరేపించు అంశములు మూడు మాత్రమే గలవు. మొదటిది జ్ఞానము. జ్ఞాయతే అనేన ఇతి జ్ఞానమ్. దీనిచే పదార్థము తెలియబడును అను అర్థములో జ్ఞానమ్ అను పదము ప్రయోగించబడినది. కావున, ఇచట జ్ఞానమ్ అనగా పదార్థపరిజ్ఞానము. ఈ జ్ఞానము అమానిత్వమ్ ఇత్యాది జీవనమూల్య సముదాయమును బోధించు జ్ఞానము గాని, ఆత్మ-అభిన్నము అగు శుద్ధచైతన్యము (సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ) గాని కాదు. వివిధపదార్థములను గురించి పరిజ్ఞానమును కలిగించే మనోవృత్తియే ఇచట జ్ఞానమ్ అను శబ్దముచే నిర్దేశించబడుచున్నది. ఒక వస్తువును మనము తెలియు విధమెట్టిది? మనము ఒక పువ్వును చూచినప్పుడు మనస్సు ఆ ఆకారములోనికి పరిణమించి, మనకు దాని

జ్ఞానము కలుగును. ఆ మనోవృత్తియే ఇచట జ్ఞానమ్ అనబడుచున్నది. ఈ జ్ఞానము లేకుండగా మనము క్రియలను ఎట్లు ఆచరించగల్గుదుము? కావున, ఈ జ్ఞానము క్రియలకు ఆధారమగుచున్నది. మనము చేసే కర్మ వైదికమైనా, లౌకికమైనా, దాని స్వరూపము మరియు దాని ప్రయోజనము మనకు తెలిసి యుండవలెను. ఫలానా సాధ్యమునకు ఫలానా సాధనము అను జ్ఞానము లేనిదే కర్మలేవియు సంభవము కావు. ఒక సాధ్యము ఉన్నది అని తెలిసినచో, దానిని పొందవలెననే ఆకాంక్ష కలుగును. సాధ్యాకాంక్ష ఉండుటచే మానవుడు క్రియలనాచరించును. ఇంతేగాక, మనము పొందగోరే సాధ్యము మనకు తెలిసినంత మాత్రాన చాలదు. దానిని పొందే ఉపాయము కూడ తెలిసి యుండవలెను. కావున ఒక లక్ష్యమును పొందుటకై నిర్దేశించబడిన సాధనము కూడ మనకు తెలిసి ఉండవలెను. ఈ జ్ఞానము లేకున్ననూ, క్రియ సంభవము కాదు. సాధారణముగా మనము మనకు గల పరిజ్ఞానమును వినియోగించి కార్యములను సాధించెదము. మౌలికమగు పరిశోధనను చేయు శాస్త్రజ్ఞులు కూడా భవిష్యత్తులో వినియోగమునకు వచ్చే జ్ఞానమును కనుగొనుటలో నిమగ్నులై యుందురు. పరిశోధనలలో లభించిన జ్ఞానమును యాంత్రికవిజ్ఞానము వినియోగములోనికి తెచ్చును. ఉదాహరణకు జీవకణమును పరిశోధించి సంపాదించిన పరిజ్ఞానము కేవలపరిజ్ఞానము కొరకు మాత్రమే గాక, ఆ కణములో సంక్రమించే దోషములకు లేక అనభిలషితములగు మార్పులకు విరుగుడును కనుగొనుటలో సహకరించును. గ్రద్ద ఎంత ఎత్తునకు ఎగిరినా, దాని దృష్టి నేల మీద అది వేటాడగోరే ప్రాణిపై లగ్నమగును. అదే విధముగా సర్వమానవుల దృష్టి వస్తువుల వినియోగము విషయములో గ్రద్ద యొక్క దృష్టిని బోలియున్నది. కావున, మనకు గల విషయపరిజ్ఞానము క్రియలనాచరించుటకొరకు మాత్రమే గలదని భగవానుడు ఇచట చెప్పుచున్నాడు. విషయపరిజ్ఞానము కర్మబంధమునుండి తప్పించుకొనుటకు పనికిరాదు. దానికి కావలసిన జ్ఞానము వేరే ఉన్నది. దానిని తరువాత చర్చించెదము.

రెండవది జ్ఞానములో విషయమగు వస్తువు (జ్ఞేయమ్). దీనిని ప్రత్యేకముగా ప్రస్తావించుటకు కారణమేమి? ప్రతి జ్ఞేయము తరువాత జ్ఞానముగా మారును. మనకు ఒక జ్ఞేయవస్తువును గురించి తెలిసిన తరువాత మాత్రమే మనము దానిని కోరెదము. కావున, జ్ఞేయము కూడ మనము చేయు కర్మలకు ప్రేరకమగును. 'నేను దీనిని కోరుచున్నాను' అని మనకు తెలియుట ఎట్లు? జ్ఞానములో విషయమగు వస్తువు ఒకటి కలదు గనుక, దానిపై కోరిక కలిగినది. అది లేనిదే జ్ఞానమే లేదు. మనచే తెలియబడే వస్తువులు మనకు అభీష్టములగుచుండును. కావుననే, మనము వాటిని పొందుటకై కర్మను చేసెదము. కావున కర్మను చేయుటకు జ్ఞానము, జ్ఞేయము అనే రెండు అంశములు ఆవశ్యకమగుచున్నవి. మూడవ అంశము వాటిని తెలియు వ్యక్తి (పరిజ్ఞాతా). ఈ మూడు

కలిసి కర్మకు హేతువులగుచున్నవి. కావున, తెలుసుకొనేవాడు (జ్ఞాతా), తెలియబడేది (జ్ఞేయమ్), మరియు తెలుసుకొనుట (జ్ఞానమ్) అను మూడు అంశములు కర్మలకు ప్రేరకములగుచున్నవి.

మూడు రకముల కర్మలను మరియు, కర్మను చేయుటకు అవశ్యకమయ్యే అయిదు అంశములను మనమిదివరలో చూచియున్నాము. ఇచట మనము అదే కర్మను కారకము అనే మరి యొక దృష్టికోణములో చూచుచున్నాము. దీనిలో ఉన్న అంశములు ఏవి? ఒకటి కర్మను చేయుటకు ఉపయోగించే సాధనము (కరణమ్). క్రియతే అనేన అనే వ్యుత్పత్తిని బట్టి క్రియను చేయుటకు ఉపయోగించే సాధనము కరణమనబడునని శ్రీశంకరులు వివరించిరి. స్థూలదేహము లోని అవయువవములు, మనస్సు, జ్ఞానేంద్రియవములు, కర్మేంద్రియవములు అనే ఈ సర్వము కరణములనబడును. రెండవది కర్మ. ఇచట కర్మయనగా క్రియ కాదు. పాణిని వ్యాకరణములో కర్మ కర్తచే అత్యధికముగా కోరబడేది ( ఈప్సితతమం కర్మ)' అని నిర్వచించబడినది. వంటను చేయగోరువాడు కూరలను తరుగుచున్ననూ, అభీష్టతమమగు క్రియ అది కాదు. అభీష్టతమమగు క్రియ వంటను చేయుట. మద్రాసు వెళ్లగోరువాడు కారులో ప్రయాణము చేయుచున్ననూ, ఈప్సితతమం కర్మ మద్రాసే గాని కారు కాదు. ప్రతిక్రియలో ఒక అప్రధానలక్ష్యము మరియు ఒక ప్రధానలక్ష్యము ఉండును. ప్రధానమగు చరమలక్ష్యమే కర్మ యగును. ఇక మూడవది కర్త. కర్త ఉన్నచో, మిగిలిన సర్వము కర్తను అనుసరించును. నీవు క్రియను ఏల చేయుచున్నావు? అని కర్తను ప్రశ్నించగా, అతడు ఇచ్చే సమాధానములో అతడు ఒక వస్తువును గురించి తెలుసుకొని దానిని పొందగోరుచున్నాడని మనకు స్పష్టమగును. కర్మకు ఈ మూడు అంగములు అగుచున్నవి కర్మసంగ్రహః).

ఒక క్రియలో అనేకకారకములు సమ్మిళితములై యుండును. కాని, కర్త, కర్మ మరియు కరణము అను ఈ మూడు క్రియను చేయుటకు కనీసము ఉండి తీరవలసిన కారకములు గనుక, ఇవి సర్వక్రియలకు మూలాధారములనదగును. వీటిలో ఏ ఒక్కటి లేకపోయినా, క్రియ ఉండజాలదు. మనము చేసే కాయిక, వాచిక, మానసిక కర్మలన్నింటిలో ఈ మూడు అంశములు మిళితములై యున్నవి.

ఆరంభములో శ్రీకృష్ణుడు క్రియకు హేతువులగు అయిదు అంశములను గూర్చి మాటలాడియున్నాడు. కాని ఇచట ఆ ప్రకరణమును సంగ్రహించి ఉపసంహరిస్తూ, కనీసము ఉండవలసిన మూడు అంశములను ప్రస్తావించినాడు. ఇపుడు మరల ఆయన ఈ అంశములన్నింటి

గురించి ప్రస్తావించుచున్నాడు. క్రియ, దానికి హేతువులగు వివిధములైన అంశములు మరియు క్రియాఫలము అను ఈ సర్వము గుణాత్మకములై యున్నవి. గుణములు లేనిదే క్రియ లేదు. ఇది ఎట్లు? క్రియలన్నియు దేహేంద్రియమనస్సంఘాతమునుండి ఉదయించుచున్నవి. ఈ సంఘాతము మాయాకార్యము. మాయ త్రిగుణాత్మకము. కావున, క్రియలన్నింటిలో సత్త్వరజస్తమోగుణములు మూడు మిళితమై యున్నవి. కారకములన్నియు గుణములను బట్టి మూడు రకములుగా విభజింపబడియున్నవి. ఈ వివరములు ఇపుడు చర్చించబడుచున్నవి.

**అధ్యాయము 18, శ్లోకము 19:**

ज्ञानं कर्म च कर्ता च त्रिधैव गुणभेदतः ।
प्रोच्यते गुणसंख्याने यथावच्छृणु तान्यपि ॥ १९ ॥

జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి (19)

*జ్ఞానమ్* = జ్ఞానము, *చ* = మరియు , *కర్మ* = కర్మ, *చ* = మరియు, *కర్తా* = కర్త, *ఏవ* = నిశ్చయముగా, *గుణభేదతః* = గుణములలోని భేదమును బట్టి, *త్రిధా* = మూడు విధములుగా నున్నవని, *గుణసంఖ్యానే* = గుణములను లెక్కించే శాస్త్రమునందు, *ప్రోచ్యతే* = చెప్పబడుచున్నది, **తాని అపి** = వాటిని కూడా, *యథావత్* = ఉన్నది ఉన్నట్లుగా, *శృణు* = వినుము.

> జ్ఞానము, కర్మ మరియు కర్త అనునవి గుణములలోని భేదమును బట్టి మూడు విధములుగా నున్నవని గుణములను లెక్కించే శాస్త్రములో చెప్పబడి యున్నది. ఆ వివరములను యథాతథముగా వినుము (19).

జ్ఞానము, కర్మ ( ఇది క్రియలో విషయము అగు కర్మ కాదనియు, కేవలక్రియ మాత్రమేననియు మనమిదివరలో చూచియున్నాము), మరియు క్రియను ఉత్పన్నము చేసే కర్త అను మూడు అంశములు ఇచట పరిశీలించబడుచున్నవి. వీటిలో ప్రతి ఒక్కటి గుణములలో భేదమును బట్టి ( గుణభేదతః) మూడు రకములుగా మాత్రమే నున్నదని ( త్రిధా ఏవ ప్రోచ్యతే) చెప్పబడినది. జ్ఞానము, కర్మ మరియు కర్త అను వాటిలో ఈ మూడింటి కంటె అధికమగు విభాగము లేదని నొక్కి

చెప్పుటకై ఏవ అను పదము ప్రయోగించ బడినదని శ్రీశంకరులు వివరించిరి. ఈ మూడింటిలో ప్రతి ఒక్కదానియందు సత్త్వరజస్తమోగుణములలో ఏదో ఒక గుణము ప్రముఖముగా ప్రకటమగును. ఇంతకు మించి నాల్గవ రకము లేదు. ఈ మూడు రకములలో వేలాది అవాంతరభేదములకు అవకాశము గలదు. కాని, ప్రాముఖ్యమును పరిగణించినచో, మూడు రకములు మాత్రమే గలవు.

ఈ విషయము ఎచట చెప్పబడినది (ప్రోచ్యతే) ? గుణములను లెక్కించి చక్కగా చర్చించిన శాస్త్రములో చెప్పబడినది. సాంఖ్యసూత్రకర్తయగు కపిలుని శాస్త్రములో చెప్పబడినదని శ్రీశంకరులు వివరించిరి. వేదప్రామాణ్యమునంగీకరించే దర్శనములలో సాంఖ్యము ఒకటి. జగత్కారణము జడమగు ప్రధానమనియు, ఆత్మలు అనేకమనియు వారు వాదింతురు. గుణములు కపిలునికి పూర్వమునందు కూడ ప్రసిద్ధములే అయినా, వాటిని చక్కగా నిరూపించిన ఘనత కపిలునిదే. ఇది తత్త్వశాస్త్రమునకు కపిలుడు చేసిన ఉపకారము. శాస్త్రముయొక్క తాత్పర్యము ఆత్మబ్రహ్మైక్యము అయి ఉండగా, కపిలుని శాస్త్రము దానిని వ్యతిరేకించును. కాని, కపిలశాస్త్రానుయాయులు గుణముల ప్రవృత్తులను మరియు గుణకార్యములను వ్యాఖ్యానించుటలో నిపుణులని శ్రీశంకరులు సూచించిరి. కావున, ఆ క్షేత్రములో మనము వారిని అంగీకరించెదము. వేదాంతసంప్రదాయములో ఇదే పద్ధతి అవలంబించబడును. ఉదాహరణకు నీవు శ్రీశంకరులతో కంప్యూటర్లలో ఉపయోగించే భాషను గురించి మాటలాడుట తటస్థించినచో, నీ క్షేత్రములో నీవు ప్రామాణికుడవు గనుక, ఆయన నీ అభిప్రాయములను మన్నించును. కావున, మనము పూర్వపక్షీయులను కూడ వారి దర్శనములలో పూర్తిగా అంగీకరించెదము. బ్రహ్మసూత్రభాష్యములో శ్రీశంకరులు అయిదవ సూత్రమునుండి ఆరంభించి సాంఖ్యసిద్ధాంతమును పలుపర్యాయములు ఖండించును. కాని, సాంఖ్యుల గుణనిరూపణము ప్రామాణికమైనది మరియు ఉపయోగకరమైనది గనుక, ఆయన దానిని అంగీకరించెదరు.

శ్రీకృష్ణుడు కపిలశాస్త్రమును ప్రస్తావించుటకు కారణమేమి? తాను చెప్పబోయే విషయముయొక్క మహిమను కొనియాడుటకై ఆయన ఆ శాస్త్రమును ప్రస్తావించినాడు. నేను ఇంతకుముందు చెప్పిన (తాని) త్రివిధజ్ఞానమును, త్రివిధకర్మను మరియు త్రివిధకర్తను గురించి నేను ఉపదేశించుచుండగా (యథావత్) నీవు వినుము (శృణు) అని భగవానుడు అర్జునునకు చెప్పుచున్నాడు.

గుణములలోని భేదము వీటిలోని విభాగమును నిర్ధారించును. ముందుగా

త్రివిధజ్ఞానమును గురించి భగవానుడు నిరూపించుచున్నాడు.

**అధ్యాయము 18, శ్లోకము 20:**

सर्वभूतेषु येनैकं भावमव्ययमीक्षते।
अविभक्तं विभक्तेषु तज्ज्ञानं विद्धि सात्त्विकम्॥ २०॥

సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే
అవిభక్తం విభక్తేషు తద్ జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ (20)

**యేన** = ఏ జ్ఞానముచే, **విభక్తేషు** = వేర్వేరుగానున్న, **సర్వభూతేషు** = ప్రాణులన్నింటియందు, **అవిభక్తమ్**= విభాగము లేని, **అవ్యయమ్** = వినాశము లేని, **ఏకమ్** = ఒకే ఒక, **భావమ్** = ఉనికిని, **ఈక్షతే** = చూచుచున్నాడో, **తత్** = ఆ, **జ్ఞానమ్** = జ్ఞానము, **సాత్త్వికమ్** = సాత్త్వికమని, **విద్ధి** = తెలుసుకొనుము.

మానవుడు వేర్వేరుగా కన్పట్టు ప్రాణులన్నింటియందు భేదము లేకుండగా ప్రకాశించే వినాశము లేని సద్రూపమగు అద్వితీయ –ఆత్మను ఏ జ్ఞానముచే దర్శించునో, ఆ జ్ఞానము సాత్త్వికమని తెలుసుకొనుము (20).

ఈ శ్లోకము సాంఖ్యశాస్త్రములోనిది కాదని మనము ముందుగా గమనించవలెను. ముందుగా మనము యేన ఈక్షతే (దేనిచే చూచుచున్నాడో) అను వాక్యభాగమును పరిశీలించెదము. ఇచట చూచుట అనగా జ్ఞానము. ఏ జ్ఞానముచే మానవుడు చూచుచున్నాడో, ఆ జ్ఞానము సాత్త్వికమనబడును. మానవుడు చూచేది ఏది? మానవుడు ఈ జగత్తులో అనేకములను చూచి, ఆ భేదమే సత్యమని తలంచినచో, ఆ జ్ఞానము సాత్వికమగునా? కాదు. ఏ జ్ఞానముచే మానవుడు విభిన్నవస్తువులను చూచుచున్ననూ, అదే సమయములో అనేకమునందు ఏకమును గాంచునో, ఆ జ్ఞానము సాత్త్వికము. అవ్యాకృతమునుండి మొదలిడి వ్యాకృతము వరకు, మరల ఆ వ్యాకృతములో సమస్తజడపదార్థములయందు, మరియు ప్రాణులలో కదలాడని చెట్లనుండి సర్వోత్కృష్టజీవుడగు బ్రహ్మగారి వరకు గల అన్ని పదార్థములలో (సర్వభూతేషు) అతడు ఒకే ఒక ఉనికిని దర్శించును (ఏకం భావం ఈక్షతే). ఈ విధముగా ఒకే ఉనికిని చూపించే ఆ జ్ఞానము సాత్త్వికము. భావము అనగా

ఉనికి గలది అని యర్థము. కావున ఆ శబ్దము ఏ పదార్థమునైననూ నిర్దేశించగలదు. కాని ఈ ప్రకరణములో భావమనగా ఏకైక-ఆత్మవస్తువు అని శ్రీశంకరులు వివరించిరి. ఒకే ఆత్మ సర్వజగద్రూపముగా పరిణమించినది అనుకోరాదు. సృష్టికి పూర్వము అది ఒకటి. ఇప్పుడు కూడా అది ఒకటియే. అందువలననే అది మార్పులు లేనిది (అవ్యయమ్) అని భగవానుడు చెప్పుచున్నాడు. తాను స్వయముగా గాని, లేక గుణములలో గాని ఏ విధమైన మార్పులను చెందని (అవ్యయమ్) ఆత్మయే సర్వపదార్థములలో ప్రకాశించుచున్నది. అదియే సర్వమునకు ఆధారము. నామరూపాత్మకమగు జగత్తు అంతయు దానిపైననే అధ్యారోపము చేయబడినది.

ఇంతేగాక, అనేకములుగా విభక్తమై యున్న వస్తువులలో అది అవిభక్తమై (అవిభక్తం విభక్తేషు) యున్నది. దేహములు వేర్వేరుగా నున్ననూ, ఆత్మయందు విభాగము లేశమైననూ లేదు. ఆత్మ ఆకాశము వంటిదని శ్రీశంకరులు దృష్టాంతమునిచ్చిరి. ఆకాశమునందు రంధ్రములు గాని, అంశములు గాని లేవు. అచట ఒక దేహము గలదు. ఇచట మరియొక దేహము గలదు. మధ్యలో దేహములు లేవు. కావున, ఒక దేహము మరియొక దేహముకంటె భిన్నముగా నున్నది. కాని, ఆత్మ విషయములో అట్లు కాదు. ఆకాశమువలె ఆత్మ లేని స్థానము లేదు. ఆకాశమునందు విభాగములు ఏవియూ లేవు. అదే విధముగా అసంఖ్యాకములగు విభిన్నవస్తువులలో ఆత్మ పూర్ణమై అద్వితీయమై నిలిచి యున్నది.

మానవుడు సాత్త్వికజ్ఞానముచే దీనిని దర్శించును (ఈక్షతే). ఇది అద్భుతమైన పదము. జ్ఞాని దర్శించువాడే గాని, ఊహాపోహలను చేయువాడు గాదు. ఈ ఆత్మ అతని స్వరూపమే అయి ఉన్నది గనుక, అతనికి సుస్పష్టముగా గోచరించును. ఆత్మ విభాగములు లేని పూర్ణతత్త్వము. సర్వము దానియందు మాత్రమే గలదు. ఈ దర్శనము గలవానియందు అజ్ఞానము మచ్చునకైననూ లేదు. అఖండపూర్ణతత్త్వదర్శనమునందు దృక్-దృశ్యవిభాగము లేదు. ద్రష్ట ఆత్మయే; దృశ్యము కూడ ఆత్మయే. పరిపూర్ణ-ఆత్మతత్త్వమును దర్శింపజేసే జ్ఞానమునకు సాత్త్వికజ్ఞానమని పేరు. వాస్తవములో జ్ఞానమనగా నిదియే. ఏలయన, ఇది మాత్రమే కర్మబంధమునుండి విముక్తిని ప్రసాదించును. మిగిలిన సర్వము అజ్ఞానాంతర్గతమై కర్మకు పనికి వచ్చునదియే గాని, మోక్షమునకు సహకరించునది గాదు. సాధ్యసాధన రూపమగు సంసారజ్ఞానము విముక్తిని కలిగించుటకు బదులుగా మానవుని ఒక జన్మనుండి మరియొక జన్మకు తీసుకొని పోవుచుండును. సర్వభూతములయందు (సర్వభూతేషు) అద్వితీయముగా ప్రకాశించే అవ్యయసద్రూపమగు (ఏకం

భావం అవ్యయమ్) ఆత్మయొక్క జ్ఞానము మాత్రమే మానవునకు మోక్షము నిచ్చును. ఇదియే సాత్త్వికజ్ఞానము.

ఇచట ఒక అభ్యంతరము ఉదయించవచ్చును. జ్ఞానమునకు సాత్త్వికము ఇత్యాది విశేషణములను తగిలించుట సమంజసమేనా? ఆహారము మొదలగు వాటికి ఈ విశేషణములు ఉండుట యుక్తియుక్తముగనే ఉన్నది. కాని జ్ఞానము సత్త్వగుణప్రధానమగు అంతఃకరణమునందు మాత్రమే ఉదయించును. అంతఃకరణము సాత్త్వికము కానిచో, జ్ఞానము ఉదయించ జాలదు. కావున, సర్వ జ్ఞానములు సాత్త్వికములే. కాని ఇచట ఈ జ్ఞానమును సాత్త్వికమనుటలో ఒక విశిష్టమగు అర్థము గలదు. ఇతరులనుండి మానమర్యాదలను అపేక్షించకుండుట (అమానిత్వమ్), మిథ్యాచారము లేక దంభము లేకుండుట (అదంభిత్వమ్), ఇతరప్రాణులను హింసించకుండుట (అహింసా), సహనగుణము (క్షమా), తిన్ననైన మనస్తత్త్వము (ఆర్జవమ్) ఇత్యాది గుణములతో కూడియున్న అంతఃకరణము ఈ ప్రకరణములో సత్త్వగుణప్రధానమైనదిగా పరిగణించబడు చున్నది. ఈ గుణములన్నియు సాత్త్వికమగు అంతఃకరణమునందు మాత్రమే ఉండును. కావుననే, ఇట్టి అంతఃకరణములో ఉదయించే జ్ఞానమునకు సాత్త్వికజ్ఞానమని పేరు వచ్చినది.

అంతఃకరణము రజోగుణప్రధానముగా నున్నచో, ఆ జ్ఞానము ఎట్లుండును?

**అధ్యాయము 18, శ్లోకము 21:**

पृथक्त्वेन तु यज्ज्ञानं नानाभावान् पृथग् विधान् ।
वेत्ति सर्वेषु भूतेषु तज्ज्ञानं विद्धि राजसम् ॥ २१ ॥

పృథక్త్వేన తు యద్ జ్ఞానం నానాభావాన్ పృథగ్ విధాన్
వేత్తి సర్వేషు భూతేషు తద్ జ్ఞానం విద్ధి రాజసమ్ (21)

తు= దీనికి భిన్నముగా, యత్= ఏ, జ్ఞానమ్=జ్ఞానముచే, సర్వేషు=అన్ని, భూతేషు =ప్రాణుల విషయములో, పృథగ్ విధాన్=వివిధరకములైన, నానాభావాన్=విభిన్నస్వభావములను, వేత్తి =తెలుసుకొనునో, తత్ = ఆ, జ్ఞానమ్ =జ్ఞానము, రాజసమ్ =రాజసమని, విద్ధి= తెలుసుకొనుము.

దీనికి భిన్నముగా, మానవుడు ఏ జ్ఞానముచే సర్వప్రాణుల విషయములో విభిన్నస్వభావములు గల అనేకరకములను చూచునో, ఆ జ్ఞానము రాజసమని తెలుసుకొనుము (21).

అద్వైతమును దర్శించే జ్ఞానము సాత్త్వికము కాగా, రజోగుణప్రధానమగు మనస్సు గలవారి దృష్టిలో ద్వైతమే సత్యము. యత్ జ్ఞానం వేత్తి అను వాక్యములో పూర్వశ్లోకములో వలెనే, కర్త జ్ఞానము. అనగా 'ఏ జ్ఞానము తెలియుచున్నదో' అని అర్థము వచ్చును. కాని ఈ వాక్యమునకు ఏ జ్ఞానముచే మానవుడు తెలుసుకొనుచున్నాడో అను అర్థమును మనము స్వీకరించవలెను. మానవుడు తెలుసుకొనేది ఏమిటి? ప్రతి ఆత్మ ఇతర-ఆత్మలకంటె భిన్నమైనదిగా ఈతడు దర్శించును. దేహములు వేర్వేరుగా నున్నవి గదా! ఆత్మ అనగా దేహమే అని స్వీకరింపబడుటచే, మానవుడు అనేకప్రాణులను (నానాభావాన్) పరస్పరభిన్నములుగా (పృథగ్విధాన్) దర్శించును. ఎవ్వరైననూ మరియొకని దేహమును తన ఆత్మగా స్వీకరించడు గదా! ఈ విధమగు నిర్ణయములోనున్న వ్యక్తి తన వాదమును అనేకవిధములుగా సమర్థించుకొనును. నేను లేచి నిలబడాలని సంకల్పించినపుడు లేచేది నా దేహమే గాని, ఇతర దేహములు కావు. ఈ విధముగా నేను అనే ధారణ ఒకానొక స్థూలదేహమునకు మాత్రమే పరిమితమై యుండుటచే ఇతరదేహముల వరకు వ్యాపించదు. కావున, వీరి దృష్టిలో స్థూలదేహమే ఆత్మ యగుచున్నది.

స్థూలదేహముకంటె వ్యతిరిక్తముగా ఆత్మ గలదనియు, దేహము నశించిననూ ఆత్మ నశించదనియు చాలా మంది అంగీకరించెదరు. కాని వారు కూడ ఆత్మనానాత్వమును దర్శించెదరు. మతానుయాయులందరు దేహభిన్నమైన ఆత్మను అంగీకరించు వారే. కాని వారు ఆత్మయొక్క అద్వితీయస్వరూపమును దర్శింపజాలరు. కావున, వారి దృష్టిలో ప్రతి స్థూలదేహమునందు ఒక ఆత్మ కలదు. ఆ ఆత్మ ఇతర-ఆత్మలకంటె భిన్నమైనది (పృథక్). అనగా, వారు వివిధప్రాణులను మరియు పదార్థములను (నానాభావాన్) వేర్వేరుగా (పృథక్త్వేన) దర్శించెదరు. ప్రతి ప్రాణికి తనవైన ఇష్టానిష్టములు మరియు సుఖదుఃఖములు గలవు. ప్రాణులలో జ్ఞానము, కామనలు మరియు అభిరుచులు వేర్వేరుగా నున్నవి గనుక, ప్రతి ప్రాణి ఇతరప్రాణులకంటె విలక్షణమైనది. సర్వప్రాణుల విషయములో భేదమును గుర్తించి, వాటిలో ఉండే ఆత్మలు వేరు అని దర్శింపజేసే జ్ఞానము రాజసజ్ఞానమని తెలుసుకొనుము (తద్ జ్ఞానం విద్ధి రాజసమ్). ఈ జ్ఞానము రజోగుణమునుండి పుట్టినది గాన, రజోగుణప్రధానమగు అంతఃకరణమునందు మాత్రమే ఈ జ్ఞానము ఉదయించును. ఇట్టి వ్యక్తియందు వివేచనము చేసే సామర్థ్యము కొరవడినది. కావుననే, వీరు దేహమును నశించిననూ

నశించని ఆత్మను అంగీకరించినా, విభిన్నములగు ఆకారములు, సుఖదుఃఖములు, దేహములు, ప్రారబ్ధకర్మలు మొదలగు వాటిని చూచి, ఆత్మలు వేర్వేరు అని భావించెదరు.

ఇచట ఒక ప్రశ్న ఉదయించును. సర్వప్రాణులలో సుఖదుఃఖములు వేర్వేరుగా ఉన్నవనుమాట వాస్తవము కాదా? నీ సుఖదుఃఖములు నీవి. నా సుఖదుఃఖములు నావి. అవి ఖచ్చితముగా వేర్వేరుగానున్నవి. దీనిలో తప్పు ఏమున్నది? ఇది ఉన్న స్థితిని యథాతథముగా చూచుటయే యగుచున్నది. ఇది భ్రాంతిజ్ఞానము అనుటకు వీలు లేదు. ఇది రాజసజ్ఞానమనియు, కావున విపరీతజ్ఞానమనియు చెప్పుట ఎట్లు పొసగును? మన ఎదురుగా ఉన్న సత్యము ఇదియే. పైగా, సర్వప్రాణులలోని ఆత్మ ఒక్కటియే నన్నచో, అందరికీ సమానమగు అనుభవము ఉండవలెను. నాకు సుఖము ఉన్నచో, అందరికి సుఖము ఉండవలెను. నాకు ముక్తి లభించినచో, అందరికి ముక్తి లభించవలెను. నాకు దుఃఖము కలిగినచో, అందరికి దుఃఖము కలుగవలెను. కాని వాస్తవములో పరిస్థితి అట్లు లేనే లేదు. ఒకడు సుఖముగా నుండగా, మరియొకడు దుఃఖము ననుభవించు చున్నాడు. ఒకడు జ్ఞాని కాగా, మరియొకడు అజ్ఞానిగా నున్నాడు. కాన విభేదములు ఖచ్చితముగా నున్నవి. ఇది విపరీతజ్ఞానము అనుట ఎట్లు పొసగును ?

సుఖము, దుఃఖము ఇత్యాదులు అన్నియు అంతఃకరణధర్మములు. ఇవి ధర్మములు గనుక వేర్వేరుగా నున్నవి. కాని, భేదములు ఎన్ని ఉన్ననూ, ఒకే ఒక వస్తువు గలదు. ఈ తేడాను గమనించుము. అసంఖ్యాకములగు భేదములు కన్పట్టిననూ, వస్తువు ఒక్కటి మాత్రమే గలదు. అదియే ఆత్మ. భేదములను దర్శించుట రాజసజ్ఞానము కాగా, ఆ ఆత్మను దర్శించుట సాత్త్వికమగును. వేర్వేరు అంతఃకరణముల ధర్మములు వేర్వేరుగా ఉన్నంతమాత్రాన, వస్తువు ఒకటి కాదనుట సరిగాదు. వివిధపాత్రల పరిమాణములు విభిన్నముగానున్ననూ, ఆకాశము అనేకఖండములుగా విభాగమై ఉన్నదనుట సరిగాదు. ఆకాశము అవిభక్త-అద్వితీయతత్త్వముగనే మిగిలి యుండును. అదే విధముగా వివిధరూపములను దాల్చి యున్ననూ, మట్టి ఒక్కటియే. అదే విధముగా, ప్రస్తుతములో నామరూపములు వేర్వేరుగానున్ననూ, వస్తువు ఒక్కటియే. మారేది అనాత్మధర్మమనబడును. మారేది ఆత్మస్వరూపము కాదు. మనము ద్వైతప్రత్యక్షమునకు దూరముగా పారిపోవుట లేదు. ఏలయన, ఈ ద్వైతము భాసించుచున్ననూ, ఉన్నది అద్వైతము మాత్రమే. ఈ భాసిల్లే భేదములు వాస్తవములో భేదములు కానే కావు. అవి అన్నియు మిథ్య. ఏకైక వస్తువు మాత్రమే గలదు. అదియే నీవు. ఇదియే జ్ఞానము. కేవలము భేదమును మాత్రమే దర్శించినచో, అది రాజసజ్ఞానమనబడును.

తామసజ్ఞానమనగా నేమి? భగవానుడు ఆ విషయమును తరువాతి శ్లోకములో చెప్పుచున్నాడు:

**అధ్యాయము 18, శ్లోకము 22:**

यत्तु कृत्स्नवदेकस्मिन् कार्ये सक्तमहैतुकम् ।
अतत्त्वार्थवदल्पं च तत्तामसमुदाहृतम् ॥ २२ ॥

యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్తమహైతుకమ్
అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్ (22)

**తు** = దీనికి భిన్నముగా, **యత్** = ఏ జ్ఞానముచే, **ఏకస్మిన్** = ఒక, **కార్యే** = పదార్థమునందు, **కృత్స్నవత్** = పూర్ణముగా, **సక్తమ్** = లగ్నమైయున్నది, **అహైతుకమ్** = యుక్తిసంగతము కానిది, **అతత్త్వార్థవత్** = సత్యదూరమైనది, **చ** = మరియు, **అల్పమ్** = మిక్కిలి పరిచ్ఛిన్నమైనది, **తత్** = ఆ జ్ఞానము, **తామసమ్** = తామసమని, **ఉదాహృతమ్** = చెప్పబడినది.

> దీనికి భిన్నముగా, మానవుడు ఏ జ్ఞానముచే ఒక పదార్థమునకు పూర్తిగా కట్టుబడియుండునో, ఏది యుక్తిసంగతము కానిదో, సత్యదూరము మరియు మిక్కిలి పరిచ్ఛిన్నము అయి ఉన్నదో, అట్టి జ్ఞానము తామస మనబడును (22).

తు అను అవ్యయము ఈ జ్ఞానమును మిగిలిన రెండు జ్ఞానములనుండి వేరు చేసి చూపుటకై ఉద్దేశించబడినది. ఈ జ్ఞానములో మానవుడు ఒక పదార్థమునందు అదియే సర్వస్వమాయన్నట్లు సంలగ్నుడై యుండును. వానికి సర్వము ఒకే పదార్థమునందు పర్యవసానమును చెందును. దానికి అతీతముగా ఏది లేదు అని అతడు భావించును. ఏలయన, మనకు గల ప్రతీతియే నిష్కర్షలకు ఆధారమగుచున్నది. ఈ సందర్భములో ఆ పదార్థము స్థూలదేహము. దానికంటె భిన్నముగా మరియొక ఆత్మ లేదు. స్థూలదేహమునకు కొన్ని ధర్మములు గలవు. వీరి సిద్ధాంతములో చైతన్యము కూడ అట్టి ధర్మములలో ఒకటి. సర్వము ఒకే స్థూలదేహమునందు కేంద్రితమై యున్నది గనుక, దేహము నశిస్తే, సర్వము నశించినట్లే. దేహముతో బాటు నేను కూడా నశిస్తాను. దేహము లావుగానున్నచో, నేను లావుగా ఉన్నాను. దేహము పొడవుగా నున్నచో, నేను పొడవుగా నున్నాను. దేహమే ఆత్మ; ఆత్మయే దేహము. అంతకుమించి ఇంకేమీ లేదు. ఇది చార్వాకసిద్ధాంతమని మనము చూచియున్నాము.

శ్రీ శంకరులు ఇచట మరికొన్ని వికల్పములను ప్రస్తావించిరి. ఒక భక్తుడు రాతితో గాని చెక్కతో గాని చేయబడిన ఒకానొక మూర్తిని అది మాత్రమే భగవానుని ఏకైకరూపమనే భావనతో పూజించుచున్నచో, అది తామసజ్ఞానము అగును. మనము భగవానుని పూజించుట కొరకై ఒక దేవాలయమును కట్టి దానియందు ఒక మూర్తిని ప్రతిష్ఠించెదము. ఆ మూర్తియందు భగవానుడు వెలసి యున్నాడు. వాస్తవములో మనము గుడిలో పూజించేది విగ్రహమును కాదు. మనము ఈశ్వరుని పూజించుచున్నాము. ఇతరులు మనలను విగ్రహారాధకులని నిందించుచుందురు. మనము పూజించేది దేనిని అను విషయము వారికి తెలియదు. మరియు ఎవడైతే ఒకానొక మూర్తికి పూర్తిగా కట్టుబడి ( కృత్స్నవత్ సక్తం ఏకస్మిన్ కార్యే), అది మాత్రమే భగవానుడని భావించినచో, వానికి తాను చేసే పూజను గురించి ఏమియు తెలియదని చెప్పవచ్చును. హరేకృష్ణ సంప్రదాయమునకు చెందిన భక్తులు ఈ కోవకు చెందినవారు. వారు జపించే మంత్రమునకు మూలము కలిసంతరణోపనిషత్తులో ఇట్లు గలదు: హరే రామ హరే రామ రామ రామ హరే హరే, హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే. కాని వారు శ్రీకృష్ణుడు మాత్రమే సర్వోత్కృష్టదైవమని నమ్మి ఈ మంత్రముయొక్క క్రమమును మార్చివేసినారు. మతదురహంకారులకు భగవానుని స్వరూపమును గురించి తెలియదు. వారికి తెలియజెప్పుటయు సంభవము కాదు. వారితో మాటలాడుట గోడతో మాటలాడుట వంటిది. ప్రయోజనమేమియు ఉండదు. ఇది తామసజ్ఞానము. అనగా, తమోగుణమునుండి పుట్టిన జ్ఞానము. ఈ జ్ఞానము గలవాడు స్థూలదేహమే ఆత్మయని భావించును; లేదా, ఒకానొక మూర్తి మాత్రమే భగవానుడగునని భావించును. ఈ రెండు పక్షములు తమోగుణజనితములే.

సర్వకర్మల బంధమునుండి విముక్తుడగుటకై జీవుడు తన దేహమును శుద్ధి చేయవలెనని వాదించే సంప్రదాయమును ఒక దానిని శ్రీ శంకరులు ప్రస్తావించిరి. వారు దేహభిన్నమైన ఆత్మను అంగీకరించినా, ఆత్మ దేహపరిమాణము కలదియని చెప్పెదరు. అనగా, దేహము యొక్క పరిమాణము పెరుగుచుండగా, ఆత్మ కూడ పెద్దది యగును. ఈ వాదములో కూడ ఆత్మ దేహము వంటిదే యగును. ఆత్మ దేహభిన్నమని వారు చెప్పినను, అది దేహపరిమాణము కలిగి సావయవమైనచో, దేహమువంటిదే యగును. తామసజ్ఞానమనగా నిదియే. ఆత్మ దేహముకంటె భిన్నమనియు, దేహముకంటె సూక్ష్మమనియు చెప్పి, మరల అది దేహపరిమాణము గలదని చెప్పుట అసంగతముగ నున్నది. దేహముకంటె భిన్నముగా నుండి దేహపరిమాణము గల ఆ ఆత్మ ఎట్లుండును ? అనగా ఆత్మకు అవయవములు ఉన్నవని చెప్పినట్లైనది. ఆత్మకు అవయవములు లేవన్నచో, అది దేహపరిమాణము కలది కాజాలదు. ఈ వాదము యుక్తియుక్తముగా లేదు. ఇట్టి వాదములను

శ్రీకృష్ణుడు అహైతుకమ్ (హేతుబద్ధము కానిది) అని వర్ణించినాడు. ఇట్టి వాదములలో ఆలోచనాశక్తి కొరవడును.

ఇట్టి జ్ఞానములను తదనుయాయులు సత్యమని దృఢముగా విశ్వసించిననూ, దానిలో సత్యము లేశమైననూ లేదు (అతత్త్వార్థవిత్). ఇట్టి జ్ఞానము జ్ఞానమే కాదు. కాని దానిని అనుసరించువారు అదియే సత్యజ్ఞానమనే గట్టి నమ్మకమును కలిగియుందురు. అందువలననే, అది తామసమని చెప్పబడినది (తామసముదాహృతమ్).

అల్పమ్ అను మరియొక విశేషణము గలదు. అది హేతుబద్ధము కాదు (అహైతుకమ్) గనుక, అల్పమ్ (చాల తక్కువది) అనదగునని శ్రీశంకరులు వివరించిరి. లేదా, దానివలన లభించే ఫలము స్వల్పముగా నుండుటచే అది అల్పము అని కూడ చెప్పవచ్చును. దానివలన మానవునకు లభించే ఫలము సున్న. దేహమే ఆత్మ యని స్వీకరించువానికి లభించేది దుఃఖము మాత్రమే. ఏలయన, ఈ దేహమును నిలబెట్టుట సంభవము కాదు. అది కాలక్రమములో జీర్ణమై పడిపోవును. ఇట్టి విశ్వాసమునకు కట్టుబడియున్నవాడు మృత్యుభయమునుండి తప్పించుకోలేడు. కావున, ఈ జ్ఞానమువలన వానికి లభించే ఫలము అతిస్వల్పము. మరియు అతని దృష్టి స్థూలదేహమును దాటి ప్రసరించదు గనుక, ఈ జ్ఞానము అల్పమైనది. అనగా, ఈ జ్ఞానముయొక్క పరిధి చాల చిన్నది.

ఈ విధముగా శ్రీకృష్ణభగవానుడు మూడు రకముల జ్ఞానమును గురించి ముచ్చటించిన పిదప, ఇప్పుడు కర్మయొక్క త్రివిధస్వభావమును గురించి చర్చించుచున్నాడు.

**అధ్యాయము 18, శ్లోకము 23:**

नियतं संगरहितमरागद्वेषत: कृतम् ।
अफलप्रेप्सुना कर्म यत्तत्सात्त्विकमुच्यते ॥ २३ ॥

నియతం సంగరహితమరాగద్వేషతః కృతమ్
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్వికముచ్యతే (23)

**యత్** = ఏ, **నియతమ్** = వేదవిహితమైన, **కర్మ** = కర్మ, **అఫలప్రేప్సునా** = ఫలమునందు (బంధహేతువగు) కామన లేనివానిచేత, **సంగరహితమ్** = అహంకారము లేకుండగా, **అరాగద్వేషతః**

= (కేవల) రాగద్వేషముల ప్రేరణ లేని విధముగా, కృతమ్ = చేయబడినదో, తత్ = ఆ కర్మ, సాత్త్వికమ్ = సాత్త్వికమని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

> వేదవిహితమైన ఏ నిత్యకర్మ ఫలాకాంక్ష, అహంకారము మరియు రాగ ద్వేషముల ప్రేరణ లేని విధముగా చేయబడునో, ఆ కర్మ సాత్త్వికమని చెప్పబడుచున్నది (23).

నియతమ్ అనగా వేదముచే విధించబడినది. వైదికకర్మలలో నియతమ్ కర్మ అనగా నిత్యనైమిత్తికకర్మలు అని అర్థము. ఒక విశిష్టపరిస్థితిలో మానవుని యెదుట ఉపస్థితమయ్యే విధి (duty) అని కూడ ఈ పదమునకు అర్థమును చెప్పవచ్చును. సత్త్వగుణప్రధానమగు అంతఃకరణము గల వ్యక్తిచేత చేయబడే నియతకర్మ సాత్త్వికకర్మ యగును. ఈ సాత్త్వికకర్మను వర్ణించుటతో బాటు భగవానుడు ఇచట కర్మయోగమును కూడ నిర్వచించుచున్నాడు. కర్తవ్యకర్మ ఏదైనా, ఆసక్తి లేకుండగా చేసినచో, అది సాత్త్వికకర్మ యగును. అనగా, ఆ కర్మను అనుష్ఠించుటలో 'దీనిని నేను చేయుచున్నాను' అనే అభిమానమునకు తావు లేదు. అది అహంకారము గాని, సంగము గాని లేకుండగా చేయబడినది.

ఇంతేగాక, రాగద్వేషముల ప్రేరణ లేకుండగా చేయబడే కర్మ (అరాగద్వేషతః కృతమ్) సాత్త్వికకర్మ యగును. తస్ అను ప్రత్యయము సాధారణముగా పంచమీ విభక్తిని బోధించునదే అయిననూ, అది ఒకచో సర్వవిభక్తులను నిర్దేశించవచ్చును. ఇచట శ్రీశంకరులు దానికి తృతీయా విభక్త్యర్థమును స్వీకరించిరి. ధర్మాధర్మముల ప్రసక్తి లేకుండగా, కేవలము రాగద్వేషములతో చేసే కర్మ రాగద్వేషతః కృతమ్ అనబడును. ఫలాకాంక్ష లేకుండగా ఎవ్వరైననూ కర్మను చేయజాలరు. కావున, ప్రతి కర్మయందు ఇసుమంత రాగద్వేషములు ఉండి తీరును. కాని అధర్మమును దూరముగానుంచి, ధర్మమును పాటిస్తూ కర్మను చేయుటకు బదులుగా, మానవుడు కేవలరాగద్వేష ప్రేరితుడై తద్విరుద్ధముగా ఆచరించుట సంభవమే. కావున, రాగద్వేషకృతమ్ అనగా మంచి–చెడు, ధర్మము–అధర్మము అను వివేకము లేకుండగా చేయబడిన కర్మ అని యర్థము. కాని, దీనికి విరుద్ధమైనది, అనగా రాగద్వేషప్రేరణ లేకుండగా చేయబడిన కర్మ (అరాగద్వేషతః కృతమ్) సాత్త్విక కర్మ యనబడును.

ఇంతేగాక, ఫలమును పొందితీరవలెననే బంధహేతువగు కామన లేకుండగా (అఫలప్రేప్సునా) ఈ కర్మ చేయబడినది. జనులు పుణ్యమును సంపాదించి తద్ద్వారా భవిష్యత్తులో

స్వర్గాదులలో భోగముల ననుభవించుటకొరకై వైదిక మరియు లౌకిక కర్మలను చేయుచుందురు. కాని అట్టి ఫలాకాంక్ష లేకుండగా చేయబడే కర్మను గురించి మనమిచట చర్చించుచున్నాము. ఈ సాధకుడు కర్మయోగి. కావున, ఈతనికి అంతఃకరణమును పవిత్రము చేయుటకొరకు (అంతఃకరణశుద్ధ్యర్థమ్), ఈశ్వరుని అనుగ్రహము కొరకు (ఈశ్వరప్రీత్యర్థమ్) మరియు మోక్షము కొరకు చేయబడే కర్మయందు అభిరుచి గలదు. అట్టి కర్మకు సాత్త్వికకర్మయని పేరు.

ఈ కర్మను శాస్త్రము పరమసుందరముగా నిర్వచించినది. మనలో సత్త్వరజస్తమోగుణముల అవగాహన పెరిగే కొలదియు, కర్మయొక్క సూక్ష్మస్వరూపమును తెలుసుకొనగల్గుతాము. అప్పుడు మనలో జాగరూకత కూడ వృద్ధి చెందును. ఈ విభాగముల వెనుకనున్న ఉద్దేశ్యమదియే. ఉదాహరణకు రంగులలోని సూక్ష్మభేదములను గమనించుడు. వివిధవర్ణముల పేర్లు మనకు ఎంత అధికముగా తెలిస్తే, వాటి మధ్యగల సూక్ష్మభేదమును మనము అంత అధికముగా గుర్తు పట్టగల్గుతాము. అదే విధముగా, భావావేగములు, త్యాగము, ఆహారము ఇత్యాది అనేకవిషయములలో గల సత్త్వరజస్తమో గుణాత్మకమైన భేదములను మనము ఎంత అధికముగా తెలుసుకుంటామో, మనలోని అవగాహన అంత అధికముగా పెరుగును. అప్పుడు మనము చేసే కర్మలు కూడ సాత్త్వికములగును. కర్మలన్నింటియందు గల ఈ భేదమును మనము చూచియున్నాము. అయిననూ భగవానుడు ఇచట కర్మలను సామాన్యరూపములో త్రివిధముగా విభాగము చేసి సాత్త్వికకర్మలను నిర్వచించినాడు.

ఇపుడు ఆయన రాజసకర్మను నిర్వచించు చున్నాడు :

**అధ్యాయము 18, శ్లోకము 24:**

यत्तु कामेप्सुना कर्म साहंकारेण वा पुन: ।
क्रियते बहुलायासं तद्राजसमुदाहृतम् ॥ २४ ॥

యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః
క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతమ్ (24)

తు = దీనికి భిన్నముగా, యత్ = ఏ, కర్మ = కర్మ, కామేప్సునా = కామమును పరిపూర్తి చేసుకొనవలెననే ఆకాంక్ష గలవానిచే, వా పునః = లేదా, సాహంకారేణ = అహంకారము గలవానిచే,

**బహులాయాసమ్** =అధికమగు శ్రమకు ఓర్చి, **క్రియతే** =చేయబడుచున్నదో, **తత్** = ఆ కర్మ, **రాజసమ్** =రాజసమని, **ఉదాహృతమ్** =చెప్పబడినది.

> కామనను పరిపూర్తి చేసుకొనవలెననే తృష్ణ గలవాడు గాని, లేదా అహంకారి గాని అధికమగు శ్రమకు ఓర్చి చేసే కర్మకు రాజసకర్మయని పేరు (24).

ఈ శ్లోకములో మరల తు అను అవ్యయము, ఈ కర్మను పూర్వశ్లోకములో వర్ణించబడిన కర్మనుండి వేరుచేసి చూపును. కామేప్సునా మరియు ఫలేప్సునా అను పదములు సమానార్థకములు. ఫలములను కోరువాడు అని వాటి యర్థము. కర్మఫలమునకే కామమని పేరు. కొందరు సాధకులు పుణ్యమును సంపాదించి భవిష్యత్తులో భోగములననుభవించుటకొరకై కర్మలను చేయుదురు.

ఇచట పునః అను పదము శ్లోకమును పూరించుట కొరకై ప్రయోగించబడినది గాన, దానికి ప్రత్యేకమగు అర్థము లేదని శ్రీశంకరులు చెప్పిరి. లేదా ఆ పదమునకు మరల అను అర్థమును చెప్పిననూ ఇబ్బంది లేదు. ఈ కర్మను చేయువానియందు అహంకారము గలదు (సాహంకారేణ). కర్తృత్వాభిమానము లేకుండగా కర్మలను చేయు (అనహంకార) జ్ఞాని కంటె భిన్నముగా అజ్ఞాని 'నేను చేయుచున్నాను (అహంకార)' అను అభిమానముతో కర్మలనాచరించును. కాని ఇచట అహంకారశబ్దము ఆ అర్థములో ప్రయోగించ బడలేదు. ఇచట అహంకారమనగా గర్వము. ఉదాహరణకు వేదవిద్వాంసుడగు శ్రోత్రియునియందు ఆత్మజ్ఞానము లేకున్ననూ వినయము ఇత్యాది అనేకసద్గుణములు ఉండును. మనలో జ్ఞానము పెరిగే కొలదీ, మనకు తెలిసినది చాల తక్కువ అనే గుర్తింపు కూడ పెరిగి వినయము నెలకొనును. అట్టి విద్వాంసునియందు అహంకారము అనగా గర్వము ఉండదు. ఇది మనము పూర్వశ్లోకములో చూచిన కర్మయోగి లక్షణము. దీనికి విరుద్ధమైన వాడు సాహంకారుడు. ఇట్టివానియందు 'నేను మహాక్రతువులనుచేసి గొప్ప పుణ్యమును సంపాదించిన మహా బ్రాహ్మణుడను' అనే తీవ్రమగు అభిమానము ఉండును. ఇది యోగ్యమగు ఆత్మాభిమానము కాదు. ఇది అనుచితమగు దర్పము. ఇది శ్రోత్రియత్వాభిమానము. కొందరు సోమయాగమనబడే పెద్ద యజ్ఞమును చేసి, సోమయాజి అనే పేరును సంపాదించి, మేము మహాపుణ్యాత్ములమనే దురహంకారము కలిగియుందురు. వీరు లౌకికులలో తమ భోగభాగ్యములను చూచుకొని మిడిసిపడే వారి కోవకు చెందినవారే యగుదురు. ఒకే దుర్గుణము రెండు విభిన్నరూపములలో ప్రకటమైనది. లౌకికుడైనా, వైదికుడైనా ఇట్టి దురభిమానము గలవాడు సాహంకారుడనబడును.

ఇంతే గాక, ఈ కోవకు చెందిన కర్మను చేయుటలో ప్రయాస అధికము బహులాయాసమ్). ఇట్టి కర్మను చేయువారు విస్తారమగు ఏర్పాట్లను చేసి తాము ఆ గొప్ప కర్మను చేయుచున్న విషయము పదిమందికి తెలియునట్లు శ్రద్ధ వహించెదరు. ఇట్టి కర్మ రజోగుణమునుండి పుట్టుటచే, దీనికి రాజసకర్మ అని పేరు.

ఇక మూడవ కర్మ తప్పక గమనించదగినది.

**అధ్యాయము 18, శ్లోకము 25:**

अनुबन्धं क्षयं हिंसामनपेक्ष्य च पौरुषम् ।
मोहादारभ्यते कर्म यत्तत्तामसमुच्यते ॥ २५ ॥

అనుబంధం క్షయం హింసామనపేక్ష్య చ పౌరుషమ్
మోహాదారభ్యతే కర్మ యత్తత్తామసముచ్యతే (25)

**అనుబంధం** = తరువాత వచ్చే పరిణామములను, **క్షయమ్** = నష్టమును, **హింసామ్** = ఇతరులకు కలిగే) హానిని, **చ** = మరియు, **పౌరుషమ్** = స్వీయసామర్థ్యమును, **అనపేక్ష్య** = పరిగణించకుండగా, **యత్** = ఏ, **కర్మ** = కర్మ, **మోహాత్** = సమ్మోహముచే, **ఆరభ్యతే** = ఆరంభించబడునో, **త్** = ఆ కర్మ, **తామసమ్** = తామసకర్మ యని, **ఉచ్యతే** = చెప్పబడుచున్నది.

తరువాత వచ్చే పరిణామములను, నష్టమును, ఇతరులకు కలిగే హానిని మరియు స్వీయసామర్థ్యమును పరిగణించకుండగా మోహముచే ఆరంభింపబడే కర్మ తామసకర్మ యనబడును (25).

దాని తరువాత వచ్చే పరిణామములను చూచుకోకుండగా, మరియు కొన్ని విషయములను లెక్క లోనికి తీసుకోకుండగా చేసే కర్మ తామసకర్మ యగును. అనుబంధమనగా తరువాత నిర్మాణమయ్యే పరిస్థితి అని శ్రీశంకరులు సరళముగా వ్యాఖ్యానించిరి. చౌర్యము మొదలగు అధర్మకార్యములను చేయువారు తరువాత వచ్చే చెడు పరిణామములను గురించి లేశమైననూ ఆలోచించరు. పైగా, ఈ కర్మను చేయువాడు దానివలన కలిగే వినాశమును గురించి, అనగా వ్యయప్రయాసల గురించి, శక్తియొక్క దుర్వినియోగమును గురించి, మానమర్యాదలకు ఆత్మాభిమానమునకు కలిగే హానిని గురించి పట్టించుకోడు. జూదము దీనికి చక్కని దృష్టాంతము.

జూదగాడు జూదములో వచ్చే నష్టమును అంచనా వేసుకోడు. అతడు సర్వకాలములలో తాను తప్పక నెగ్గి తీరుదుననే ఆశతో ముందుకు సాగుచుండును. తామసకర్మలో కర్త ఆ కర్మ వలన ఇతరులకు కలిగే హానిని గురించి, ముఖ్యముగా దానివలన ఇతరప్రాణులకు కలిగే హింసను గురించి సరకు గొనడు. మానవుడు తన సామర్థ్యమును తెలుసుకొని యుండవలెను. తాను చేపడుతున్న కర్మను తాను విజయంతముగా పూర్తి చేయగల్గుదుననే అంచనా వ్యక్తికి ఉండవలెను. తన వద్ద గల సాధనసంపత్తి, తనకు గల శక్తి, నైపుణ్యము, అంగబలము ఇత్యాది విషయములను మానవుడు అంచనా వేసుకొనవలెను. కర్మను మొదలు పెట్టే సమయములో ఈ అంశములనన్నింటిని పరిగణనలోనికి తీసుకోనిచో, ఆ కర్మ తామసకర్మ యనబడును.

మానవుడు ఈ అంశములనన్నిటినీ పరిగణనలోనికి తీసుకోకుండగా కర్మను అరంభించుటకు కారణమేమి? దీనికి కారణము భ్రాంతి (మోహాత్). ఆడంబరము వలన గాని, లేక దురాశ వలన గాని, కొందరు ఈ విషయములను సరిగా వివేచించ లేరు. దీనిని మూర్ఖత్వమనియు, దుస్సాహసమనియు అందురు. ఈ విధముగా కొనసాగువాడు చేయు కర్మ తామసకర్మ అనబడును (తామసం కర్మ ఉచ్యతే).

ఈ విధముగా మూడు రకముల కర్మ వర్ణించబడినది. పూర్వములో మనము మూడు రకముల జ్ఞానమును చూచియున్నాము. ఇపుడు భగవానుడు మూడు రకముల కర్తను గురించి చెప్పబోవుచున్నాడు.

**అధ్యాయము 18, శ్లోకము 26:**

मुक्तसंगोऽ नहंवादी धृत्युत्साहसमन्वित: ।
सिद्ध्यसिद्ध्योर्निर्विकार: कर्ता सात्त्विक उच्यते ॥ २६ ॥

ముక్తసంగోనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే (26)

ముక్తసంగః =సంలగ్నత లేనివాడు, అనహంవాదీ =అహంకారము లేనివాడు, ధృత్యుత్సాహసమన్వితః =దృఢనిశ్చయము మరియు ఉత్సాహము గలవాడు, సిద్ధ్యసిద్ధ్యోః =సాఫల్యవైఫల్యముల యందు, నిర్వికారః =కంగారు పడనివాడు అగు, కర్తా =కర్త, సాత్త్వికః =సాత్త్వికుడు, ఉచ్యతే =అనబడును.

సంలగ్నత లేనివాడు, అహంకారము లేనివాడు, దృఢనిశ్చయము మరియు ఉత్సాహము గలవాడు, సాఫల్యవైఫల్యములయందు కంగారు పడనివాడు అగు కర్త సాత్త్వికుడనబడును (26).

సాత్త్వికమగు అంతఃకరణము గలవాడు సాత్త్వికకర్త యగును. మనస్సు సాత్త్వికమైనచో, జ్ఞానకర్మకర్తలు అన్నియు సాత్త్వికమగును. కావున, మనము అంతఃకరణమును సాత్త్వికముగా తీర్చి దిద్దుకున్నచో చాలును. దానికొరకై ముందుగా సాత్త్వికమనగా నేమి అను విషయము తెలిసియుండవలెను. ఏలయనగా, ఇది భౌతికమగు మార్పు కాదు. ఇది మానసికప్రవృత్తిలో మరియు ఆలోచనాధోరణిలో రావలసిన మార్పు.

ఇచట కర్తకు సాత్త్వికమగు అంతఃకరణము గలదు. ఆతనికి తాను చేయు కర్మ విషయములో ఆసంగము లేదు (ముక్తసంగః). మరియు ఆతనియందు గర్వము గాని, అహంకారము గాని లేవు (అనహంవాదీ). 'నేను గొప్ప కార్యమును సాధించెదను' అనే భ్రాంతిమూలకమగు అపేక్ష అతనియందు లేదు. ఆతనియందు కర్మఫలముల కొరకై తృష్ణ లేదు. ఆతడు గొప్ప యజ్ఞమును చేయుచుండవచ్చును. 'నేను గొప్పవాడను; నేనీ ఘనకార్యమును చేయుచున్నాను; దీనివలన నా పేరుప్రఖ్యాతులు వృద్ధి చెందగలవు' అను గర్వము ఆతనియందు లేదు. దీనికి భిన్నముగా, ఆతనియందు 'ఇది నా కర్తవ్యము గాన నేను చేయుచున్నాను' అను ప్రవృత్తి గలదు. ఆతడు అధికారస్థానములోనున్ననూ, తనకు ఆ స్థానము ఇతరులనుండి గుంజాటకొరకు గాక, ఇతరులకు ఇచ్చుటకై ఈయబడినదని ఆతడు ఎరుంగును. తాను అధికారమును గోల్పోయి మరి యొక అధికారిని ఆశ్రయించవలసిన వచ్చినచో, అది ఎట్లుండునో ఆతనికి తెలియును. తన వద్దనున్న సర్వము భగవద్దత్తమని ఆతడు గుర్తించినాడు. కావున, ఆతనియందు అహంకారము లేదు. అజ్ఞానజనితమైన అహంకారము లేనివాడు ఈ దేహము, మనస్సు, ఇంద్రియములు, సాధనసంపత్తి, జగత్తు, దానిలోని అవకాశములు ఇత్యాది సర్వము భగవద్దత్తమని గుర్తించును. ఇతరులకు ఈయవలెనని మనము అనుకున్నా, దానిని పొందే భాగ్యము ఇతరునియందు ఉండవలెను.

ఆ భాగ్యము కూడ ఈశ్వరానుగ్రహమేనని ఆతడు గుర్తించినాడు. వానికి ఆ భాగ్యము లేనిచో వీనికి ఇచ్చే భాగ్యము ఉండెడిది కాదు. ఇచ్చే అవకాశము, తీసుకొనే అవకాశము, మరియు ఒక పనిని చేసే భాగ్యముతో సహా సర్వము ఈశ్వరదత్తమేనను గుర్తింపు వినయమనబడును. చక్కని

అవగాహననుండి ఈ వినయము ఉదయించును. ఇది ఆత్మనిందనుండి ఉదయించే అయోగ్యమగు వినయము కాదు. తనలోని సద్గుణములను గుర్తించి వాటిని ఈశ్వరానుగ్రహమని స్వీకరించువాడే యథార్థమగు వినయము గలవాడు. సర్వము ఈశ్వరానుగ్రహమనే గుర్తింపు చాల విలక్షణమైనది. 'ఇవి అన్నియు నాకు ఈయబడినవి. ఇట్టి భాగ్యము మరియు సదవకాశము లేని వారు ఈ లోకములో ఎందరో గలరు. నేను కూడ వారిలో ఒకడుగా అయి ఉండవచ్చును'. ఈ రకమైన మనఃప్రవృత్తి గలవాడు తన గొప్పలను తను చెప్పుకొనడు. ఈతడు అనహంవాదీ అనబడును.

ఇంతేగాక, ఆతనియందు దృఢనిశ్చయము (ధృతిః) గలదు. ఈ నిశ్చయములు పలురకములుగా నున్నవి. ఒకనికి మరియొకనిని నాశనము చేయవలెననే పట్టుదల ఉండవచ్చును. అది కూడ ధృతియే. హిట్లరునకు ధృతి ఉండెను. కాని ఆతని ఆలోచనావిధానము దోషభూయిష్ఠము అగుటచే ఆ ధృతి భయంకరమగు హానిని కలిగించినది. ధృతి ఎవ్వరిలోనైననూ ఉండవచ్చును. కాని అది రాజసము గాని, తామసము గాని కావచ్చును. కాని మనమిచట యోగ్యమగు మనఃప్రవృత్తి గల సాత్త్వికుని గురించి చర్చించుచున్నాము గనుక, ఆతనియందు ఉండే ధృతి ఆతనికి మాత్రమే గాక, ఇతరులకు కూడ సహాయకారి యగును. అంతఃకరణశుద్ధిని తద్ద్వారా మోక్షమును పొందవలెననే ఆతని ధృతి అర్జునుని ధృతిని, ధర్మరాజుయొక్క ధృతిని పోలియుండుటచే, అది ధర్మవిరుద్ధము కాదు. 'ధృతి' అను పదము 'నిలబెట్టుట' అనే అర్థము గల 'ధృ' అనే ధాతువు నుండి పుట్టినది. కావున, ధృతి అనగా నిలబెట్టునది అని యర్థము. మనము ఒక పనిని మొదలుబెట్టి, తరువాత నీరసపడి దానిని మధ్యలో వదలిపెట్టినచో, ధృతి కొరవడినదని గ్రహించవలెను. మనలో కొందరు ఆరంభములో అప్పుడే ఇస్త్రీ చేసిన పంచ వలె కొద్ది సేపు నిలకడగానుండి శీఘ్రముగా వ్రేలాడి పోవుదురు. ఇస్త్రీ చేసిన పిదప చాలసేపు కర్ర వలె నిలబడే పంచలు లేవని చెప్పవచ్చును. అయిదు నిముషములలో అది మరల మొదటికి వచ్చును. కొందరి మనస్సులు అదే తీరున ధృతివిహీనములై ఉండును. ధృతి ఉన్ననూ చాలదు. దానికి ఉత్సాహశక్తి తోడు గావలెను. దృఢమగు నిశ్చయమైననూ కార్యరూపమును దాల్చుటకు సరియగు దిశలో చాలినంత ప్రయత్నము తోడు గావలెను. ధృతిని, దానికి తోడుగా ఉత్సాహశక్తిని మరియు ప్రయత్నశీలమును కలిగియున్న (ధృత్యుత్సాహసమన్వితః) వ్యక్తి సాత్త్వికకర్త యనబడును.

ఇంతేగాక, కార్యము సఫలము, లేదా విఫలము అయినప్పుడు (సిద్ధ్యసిద్ధ్యోః) సాధారణముగా జనుల హృదయములలో చెలరేగే తుఫానులకు అతడు వశుడై యుండడు. విజయములో ప్రహర్షము, పరాజయములో కూలబడుట అతడు ఎరుంగడు. ఆటల పోటీలలో

అభిమానులు ప్రదర్శించే ప్రవృత్తిని దీనికి వ్యతిరేకదృష్టాంతముగా నీయవచ్చును. బాస్కెట్‌బాల్, బేస్‌బాల్ లేదా ఫుట్ బాల్ మొదలగు ఆటలలో అభిమానులు తమ జట్టు పరాజయమును పొందినచో, అల్లర్లకు దిగెదరు. వారిలో కొందరు పరాజయమును తట్టుకొనలేక బజారులో దోపిడీలకు మరియు విధ్వంసమునకు పాల్పడుదురు. San Fransisco నగరములో Forty-Niners అను జట్టు విజయము పొందినపుడు నేరములు తగ్గుననియు, అదే జట్టు పరాజయమును పొందినచో నేరములసంఖ్య గణనీయముగా పెరుగుననియు చెప్పెదరు. ఇంతేగాక, శిక్షకులు(coaches) మరియు నిర్వాహకులు (managers) ఆట జరుగుచుండగా పిచ్చి పట్టినవారివలె చేతులను ఊపుతూ కేకలను వేయుచూ విపరీతమగు ఆందోళనకు గురియగుచుందురు. ఈ విధముగా మానసికమగు ఉత్థానపతనములు సామాన్యమైన విషయము కాదు. ఒక జట్టుపై హద్దులను దాటి విపరీతమగు మోజు పెంచుకొనుటవలన ఈ సమస్య ఉత్పన్నమగును. ఏది ఏమైనా, తమ అభిమాన జట్టు నెగ్గి తీరవలసినదే. ఈనాటి ప్రపంచములో క్రీడలనగా కేవలము యువకులు ఆడే ఆటలు మాత్రమే కాదు. క్రీడాప్రపంచము ఒక పెద్ద వ్యాపారక్షేత్రముగా మారినది. ఈ క్రీడలలో పెద్ద మొత్తములో ధనము, పేరు ప్రతిష్ఠలు మాత్రమే గాక ఇంకనూ వందలాది అంశములు ఇమిడియున్నవి. క్రీడ అనగా నేమి? ఇవి ఏమీ లేకుండగా పిల్లలు మరియు యువకులు ఆడుకొనే ఆటలు ఈ స్థితికి దిగజారినవి. వాస్తవమగు క్రీడలో ఆటగాళ్లు విజయమును, పరాజయమును కూడ మర్యాదతో స్వీకరించెదరు. జీవితము కూడ ఒక క్రీడ వంటిది. జీవితము విషయములో సరియగు దృష్టికోణము గలవానికి జయపరాజయములలో మనస్సు పెద్ద మార్పులకు గురికాదు. అనగా విజయము వరించినప్పుడు ముఖమును ముడుచుకొనవలెనని తాత్పర్యము కాదు. అన్ని విజయములలో మానవుని హృదయములో ఒక విశిష్టపూర్ణత నెలకొనును. కాని అది నిండుకుండవలె తొణకని ఆనందమే గాని, ఎగిరి గంతులు వేసే హర్షము కాదు. ఆ విధముగా ఎగిరి గెంతులు వేయువాడు దుఃఖముతో నేల గూలుటకు ఎక్కువ సమయము పట్టదు. యోగములో మనము మానసిక అవస్థలలో వచ్చే ఇట్టి ఉత్పతన-అధఃపతనముల తీవ్రతను బాగా తగ్గించుకొనుటయే గాక, అవి కొనసాగే కాలవ్యవధి అల్పముగా ఉండునట్లు శ్రద్ధ వహించెదము. అప్పుడు ప్రహర్షము గాని, దుఃఖము గాని హద్దులు దాటకుండగా స్వాధీనమై యుండును. జయ పరాజయములలో ఒకింత మనోవికారము అనివార్యము. కాని వివేకము గలవానిలో అది కొట్టవచ్చినట్లు కానరాదు. దీనికి కారణమేమనగా, జయపరాజయముల వెనుక అనేకకారణములు గలవని వివేకి గుర్తించును. విజయము వరించినప్పుడు, ' ఈ సారికి సర్వము నాకు అనుకూలించుటచే విజయము లభించినది; ఈ విజయము వెనుక అనేక హేతువులు గలవు' అని గుర్తించిన వ్యక్తి పొందే హర్షము హద్దులను దాటి ప్రవహించదు.

విజయము వరించినప్పుడు 'నేను భగవానునకు కృతజ్ఞుడను' అని భక్తుడు పలుకును. అనగా భగవానుడు ఈ నాడు అతనికి విజయమును ప్రసాదించినాడని అనుకోరాదు. అట్లు భగవానుడు కూడ ఒకనాడు కోపించి, మరియొకనాడు అనుగ్రహించినచో, మేనమామ వంటి వాడు అగును. భగవానుడు అనుగ్రహించినాడు అనగా ప్రారబ్ధకర్మ మొదలగు అనేక అంశములు అనుకూలించినవని యర్థము. అట్లు అనుకూలించినప్పుడు టెన్నిసు ఆటలో నీకు పాత స్నేహితుడు తారసపడుటయే గాక, అతని చేయి బెణికి యుండుటచే అతడు కొట్టిన ప్రతి బంతి గీతను దాటి పడుటయు, ఆటలో విజయము నిన్ను వరించుటయు తటస్థించినది. అప్పుడు నీవు ఏమని చెప్పగలవు? సర్వము నీకు అనుకూలించినది. అతనికి అంతటా విధి ఎదురు తిరిగినది. కాని ఇంకో రోజున ఆటలో అతడు మరల ఓడి పోవునని చెప్పుట కుదరదు. అప్పటికి అతని గ్రహబలములో మార్పులు రావచ్చును. సర్వకాలములలో విధి తన వంతు పాత్రను పోషించుచుండును. దీనిని మనము అదృష్టము అని అంటాము. అది పూర్వకృతకర్మఫలము అని కూడ చెప్పవచ్చును. అది ఒకప్పుడు మన కార్యయోజనలకు అనుకూలముగను, మరియొకప్పుడు ప్రతికూలముగను పని చేయుచుండును. దీనినే మనము ఈశ్వరుడు అని అంటాము. మానవుని అదృష్టము పూర్వములో మరియు వర్తమానములో చేసియున్న కర్మ, ప్రార్థన మరియు ప్రవృత్తి ఇత్యాదుల ఫలము మాత్రమే. విజయమునకు ఫలానా అంశము కారణము అని ఖచ్చితముగా నిర్దేశించుట సంభవము కాదు గనుక, ఇది అంతా ఈశ్వరుని అనుగ్రహము అని మనము అంటాము. వాస్తవములో అది అంతా వ్యక్తియొక్క పూర్వకృతకర్మఫలము మాత్రమే. భగవానుడు ఒకనికి ఈనాడు, మరియొకనికి మరునాడు విజయమును పంచిపెడుతూ తిరుగాడడు. ఈ సర్వము స్వీయకర్మఫలము మాత్రమే. దానికే మనము భగవానుడనే పేరును పెట్టినాము. లేదా, సర్వము ఈశ్వరుడు అనుటయు సాగనుగనే యున్నది. ప్రకృతినియమములన్నియు ఈశ్వరుడే గనుక, విజయము కూడ ఈశ్వరుడనుటలో సందేహము లేదు. ఈ వ్యవస్థను మనమీ విధముగా తెలుసుకొనవలెను. లేనిచో, భగవానుడు ఒకనాడు దయామయుడై, మరియొకనాడు క్రూరహృదయుడు అగుటకు కారణమేమి? భగవానుడు ఒక నిరంకుశశాసకుని వంటివాడు అనే ధారణ హానికరమైనది. అట్టి భగవాని స్మరించుట ఎట్లు కుదురును?

జయపరాజయములు రెండింటిలో అదుపు తప్పని అంతఃకరణము గల వ్యక్తియొక్క మానసికప్రవృత్తిని మనమిచట పరిశీలించుచున్నాము. ఇచట చెప్పబడిన ఈ సర్వము కర్మయోగము మాత్రమే. ఈ కర్మయోగి లోకములో అనేకసందర్భములలో కానవచ్చే భోగవస్తువుల వెంట పడడు.

ఈతడు శాస్త్రోక్తమైన ధర్మకార్యములను మాత్రమే చేబట్టుచుండును. ఇట్టి వ్యక్తి సాత్త్వికుడనబడును. సాత్త్వికుడనగా కర్మయోగి అని యర్థము. మనమిచట జ్ఞానిని గురించి గాక, కర్తయగు వ్యక్తిని గురించి చర్చించుచున్నాము. జ్ఞానియొక్క మనఃప్రవృత్తి కూడ సుమారు ఇటులనే యుండును. కాని, జ్ఞానియందు ఆ ప్రవృత్తి అతిసహజముగా అభివ్యక్తమగుచుండును.

తరువాతి శ్లోకములో రాజసకర్త వర్ణించబడుచున్నాడు.

అధ్యాయము 18, శ్లోకము 27:

रागी कर्मफलप्रेप्सुर्लुब्धो हिंसात्मकोऽशुचिः ।
हर्षशोकान्वितः कर्ता राजसः परिकीर्तितः ॥ २७ ॥

రాగీ కర్మఫల ప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః (27)

రాగీ =తీవ్రమగు రాగము గలవాడు, కర్మఫలప్రేప్సుః =కర్మఫలమును పొందవలెననే దృఢమగు ఆకాంక్ష గలవాడు, హింసాత్మకః =హింసించే స్వభావము గలవాడు, అశుచిః =శుభ్రత లేనివాడు, హర్షశోకాన్వితః =హర్షమునకు మరియు దుఃఖమునకు వశుడై యుండువాడు అగు, కర్తా =కర్త, రాజసః =రాజసకర్త యని, పరికీర్తితః =చెప్పబడినాడు.

తీవ్రమగు రాగము గలవాడు, కర్మఫలమును పొందవలెననే దృఢమగు ఆకాంక్ష గలవాడు, హింసించే స్వభావము గలవాడు, శుభ్రత లేని వాడు, హర్షమునకు మరియు దుఃఖమునకు వశుడై యుండువాడు అగు కర్త రాజసకర్తయని చెప్పబడినాడు (27).

ఈ శ్లోకము రాజసకర్తయని చెప్పబడిన వ్యక్తిని (కర్తా రాజసః పరికీర్తితః) గురించి వర్ణించుచున్నది. ఈతడు రాజసుడు అని చెప్పబడుటకు కారణమేమి? ఈతనియందు రాగము దృఢముగా నుండుటయే. ఆతడు చేసే లౌకిక కర్మలన్నింటికీ మూలములో రాగద్వేషములు మాత్రమే గలవు. ఆతడు ఏదేని వైదికకర్మల నాచరించే పక్షములో వాటిని కేవలకర్మఫలము కొరకు మాత్రమే ఆచరించును. ఏలయన, ఆతనికి కర్మఫలమును పొందవలెననే తీవ్రమగు ఆకాంక్ష గలదు

(కర్మఫలప్రేప్సుః). అతడు ధర్మ-అర్థ-కామములను మాత్రమే కోరుచున్నాడు గనుక, కర్మఫలప్రేప్సుః అగునే గాని, కర్మయోగి కాజాలడు.

ఇంతేగాక, అతడు పిసినారి (లుబ్ధః) కూడా. అతని కన్ను ఇతరుల సంపదపై నున్నదని శ్రీశంకరులు వ్యాఖ్యానించిరి. దీనినే మనము తృష్ణ అని అంటాము. ఇతరుల సంపదను, ఆస్తిని కోరుటచే అతడు లుబ్ధుడైనాడు. ఇంతేగాక, అతడు దానము చేయవలసిన పరిస్థితిలో కూడ దానమును చేయడు. భారతదేశములో జనులు సాధారణముగా తీర్థయాత్రలకు వెళ్లినపుడు దానములను చేయుదురు. ఈతడు లుబ్ధుడు గనుక, అప్పుడు కూడా దానమును చేయడు. అతడు ఇతరుల సంపదను ఆశతో చూచుచుండునే గాని, తన వద్దనున్న ధనమును తనకొరకు గాని, ఇతరుల కొరకు గాని ఖర్చు చేయజాలడు. అతడు తాను దానమును చేయకపోవుట మాత్రమే గాక, ఇతరులను కూడ దానము చేయనీయడు. అతనికి జీవనమూల్యముల విషయములో గల భ్రాంతి మాత్రమే దీనికి అంతకూ కారణము. అతడు తన హృదయమును రాజధానీ నగరము లోని ఒక స్థిరాస్తియందో, లేక ఆర్థికవిషయములను ప్రచురించే పత్రికయొక్క పుటలోని ఒక పంక్తిలోనో పారవేసుకొనినాడు. అతని హృదయము ఈ జ్ఞానమునందు తప్ప మిగిలిన స్థానములన్నింటి యందు పెట్టుబడి రూపములో వ్యయమై పోయినది. ఇట్టి లుబ్ధుని హృదయములో అతిశయించిన మార్పు రావలసియున్నది.

ఇంతేగాక, ఈతనియందు పరులను హింసించే స్వభావము గలదు. పైగా అతనికి దాని యందు ఆనందము లభించును (హింసాత్మకః). తాను సర్వదా దుఃఖములో నున్నాడు గనుక, అతడు ఇతరుల సుఖమును చూడలేక, వారిని బుద్ధిపూర్వకముగా కష్టములకు గురిచేయును. లేదా, తన ప్రవర్తన వలన ఇతరులకు కలిగే కష్టమును గురించి అతడు పట్టించుకోడు. మరియు అతనియందు బాహ్యశౌచము గాని, అంతరశౌచము గాని లేవు (అశుచిః). కొందరు కొన్ని దినముల వరకు స్నానమును మాని, అత్తరువు రాసుకొని తిరుగుచుందురు. ఇది బాహ్యమగు అశుచి. కోపము, ద్వేషము ఇత్యాది రూపములలో అంతర్గతమగు అశుచి వ్యక్తమగుచుండును. ఇతరులను హింసించే స్వభావము, మరియు తీవ్రమగు రాగద్వేషములు గలవానియందు అంతరశౌచము లేకపోవుటలో ఆశ్చర్యమేమున్నది ? అతడు కనీసము బాహ్యమునందైననూ శుచిగా నుండవచ్చును. అది కూడా లేదని శ్రీశంకరులు వివరించిరి.

మరియు జయాపజయములలో సునియంత్రితమగు భావావేగములు గల కర్మయోగిని

మనము చూచియున్నాము. ఈతడు దానికి విరుద్ధముగా అనుకూలప్రతికూల పరిస్థితులలో హర్షశోకములకు వశుడై (హర్షశోకాన్వితః) ఉండును. ఇట్టివాడు రాజసకర్త యనబడును.

తరువాత మూడవ రకము కర్త చెప్పబడుచున్నాడు.

**అధ్యాయము 18, శ్లోకము 28:**

अयुक्तः प्राकृतः स्तब्धः शठो नैष्कृतिकोऽलसः ।
विषादी दीर्घसूत्री च कर्ता तामस उच्यते ॥ २८ ॥

అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోలసః
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే (28)

**అయుక్తః** =మనస్సమాధానము లేనివాడు, **ప్రాకృతః** =మనఃపరిపక్వత లేనివాడు, **స్తబ్ధః** = మర్యాదనెరుంగని వాడు, **శఠః** = మోసగాడు, **నైష్కృతికః** = క్రూరుడు, **అలసః** = సోమరి, **విషాదీ** =దుఃఖస్వభావము గలవాడు, **చ** =మరియు, **దీర్ఘసూత్రీ** = పనులను వాయిదా వేయుచుండువాడు అగు, **కర్తా** =కర్త, **తామసః** =తామసుడని, **ఉచ్యతే** =చెప్పబడును.

మనస్సమాధానము మరియు పరిపక్వత లేనివాడు, మర్యాద నెరుంగనివాడు, మోసగాడు, క్రూరుడు, సోమరి, దుఃఖస్వభావము గలవాడు, మరియు పనులను వాయిదా వేయువాడు అగు కర్త తామసకర్త యనబడును (28).

అయుక్తః అనగా పొందిక లేనివాడు, అనగా అందోళన గలవాడు. ఈతడు మనస్సును లగ్నము చేయలేడు. కావున, ఈతని ఆలోచనాధోరణి మరియు ప్రవర్తన అనుచితముగా నుండును. పైగా ఈతని మనస్సు పరిపక్వమైనది కాదు. వయస్సు నలభై దాటియున్ననూ, చాలినంత విద్యావిషయకమగు అనుశాసనము గాని, క్రమబద్ధమైన ఆలోచనాశక్తి గాని లేనివాడగుటచే, ఆతని మనస్సు చిన్నపిల్లవాని మనస్సు వలె ఎదుగుదల లేనిదై ఉండును. ఇట్టి స్థితిలో ఆతడు చాల వినయముగా నుండునని భావించుట సహజము. కాని పరిస్థితి అది కానే కాదు. ఈతడు చాల పొగరును కలిగియుండును (స్తబ్ధః). ఈతడు పెద్దల యెదుట కర్రవలె నిలబడునే గాని ప్రణమిల్లడని (దండవత్ న నమతి కస్మైచిత్) శ్రీశంకరులు వివరించిరి. ఆతడు మర్యాద నెరుంగడు. కావున,

ఆతనియందు సమర్పణాభావము మచ్చునకైననూ లేదు. ఇంతేగాక, అతడు మోసగాడు (శఠః) కూడా. అతడు మోసము తెలియని వానివలె నటించే సామర్థ్యము గల ఘరానా మోసగాడు. ఇంతేగాక అతడు నైష్కృతికుడు. అనగా ఇతరుల మానప్రాణములకు ముప్పును తెచ్చే స్వభావము గలవాడని శ్రీశంకరులు వివరించిరి. అతడు క్రూరాత్ముడు. నైష్కృతికః అను పదమునకు చిరాకు పడే స్వభావము గలవాడని కూడ అర్థము గలదు. కాని ఇచట క్రూరుడు అను అర్థమే సందర్భోచితముగా నున్నది. మరియు, అతడు సోమరి (అలసః). తప్పక చేయదగిన పనులను కూడ చేసే సామర్థ్యము ఆతనియందు లేదు. మరియు అతడు సర్వదా దుఃఖితుడై యుండును (విషాదీ). మనము దుఃఖమును అర్థము చేసుకొని పరిష్కరించు కొనే ప్రయత్నములో నున్నంతవరకు అది చెడు గుణము కాదు. అట్లు చేయువాడు సాత్త్వికుడగును. కాని సమస్యను పరిష్కరించుకొనే ప్రయత్నము చేయకపోతే, అది తమోగుణలక్షణమగును. సర్వదా నిరుత్సాహముగా ఉంటూ దానిని పరిష్కరించుకొనే ప్రయత్నమును చేయని వ్యక్తిని గురించి మనమిచట చర్చిస్తున్నాము. దానిని తొలగించుకొనే ఉపాయమును ఇతరులెవరైననూ బోధించినా, అతడు దీర్ఘసూత్రుడు అగుటచే దానిని వాయిదా వేయుచుండును. చేయవలసిన పనులను అతడు చేయుట మానివేసి వాటిని ఒక దినమునుండి మరియొక దినమునకు నిరంతరముగా వాయిదా వేయుచుండును. ఈ రోజు గాని, లేక రేపు గాని చేయదగిన పనిని అతడు ఒక నెలవరకైననూ చేయడని శ్రీశంకరులు వివరించిరి. దీనికి అంతకూ కారణము అతని అంతఃకరణము తమోగుణప్రధానము అగుటయే. అతనికి తామసకర్త యని పేరు.

కర్మ, కర్త మరియు జ్ఞానము అను వాటిలో గల త్రివిధభేదమును వివరించిన తరువాత భగవానుడు ఇపుడు జ్ఞానమునకు ఆశ్రయమైన బుద్ధిలో గల మూడు రకములను గురించి వివరించ బోవుచున్నాడు. దృఢనిశ్చయము (ధృతిః) సాత్త్వికకర్తయొక్క గుణమని పూర్వములో భగవానుడు చెప్పియున్నాడు. ఈ ధృతి కూడ సాత్త్విక, రాజస, తామస భేదముచే త్రివిధముగా నున్నదని మనము చూచియున్నాము. వ్యక్తి ఏ విషయములో కటిబద్ధుడై దృఢనిశ్చయము కలిగి యున్నాడు అను విషయమును బట్టి అతని ధృతియొక్క స్వరూపము (సాత్త్విక రాజస తామస భేదము) నిర్ణీతమగును. రాబోవు శ్లోకములలో మనము బుద్ధిని, దానిలో చోటు చేసుకొనే వివిధనిష్కర్షలను, దానిలో ఉదయించే జ్ఞానమును, అది ఆలోచించే ప్రక్రియలను, దానికి ప్రేరణనిచ్చే వివిధ అంశములను పరిశీలించెదము. 16,17,18 అధ్యాయములలో సత్త్వరజస్తమోగుణములు ఆధారముగా ఏర్పడే వివిధమానసికభేదములు సమగ్రముగా నిరూపించబడి యున్నవి. వివిధ మనఃప్రవృత్తులు, వాటివలన కలిగే పరిణామములు చాల సుందరముగా విశ్లేషణ చేయబడి యున్నవి. సరియగు ఆలోచనా

విధానము ఎట్లుండును ? చెడు ఆలోచనాధోరణి ఎట్లుండును? అను విషయములు నిరూపించ బడినవి.

**అధ్యాయము 18, శ్లోకము 29:**

बुद्धेर्भेदं धृतेश्चैव गुणतस्त्रिविधं शृणु ।
प्रोच्यमानमशेषेण पृथक्त्वेन धनंजय ॥२९ ॥

బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రి విధం శృణు
ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనంజయ (29)

ధనంజయ = ఓ అర్జునా (సంపదను జయించినవాడా)!, బుద్ధేః = బుద్ధియొక్క, చ =మరియు, ధృతేః = ధృతియొక్క, గుణతః = గుణములను బట్టి, త్రివిధమ్ = మూడు రకములైన, భేదమ్= భేదమును, అశేషేణ =సమగ్రముగా, పృథక్త్వేన=వేరు వేరుగా, ప్రోచ్యమానమ్ =చెప్పబడుచుండగా, ఏవ = నిశ్చయముగా, శృణు = వినుము.

ఓ అర్జునా! బుద్ధి మరియు ధృతి అను వాటిలో గుణములను బట్టి భేదములు గలవు. ఆ భేదములను వేర్వేరుగా మరియు సమగ్రముగా చెప్పెదను. నిశ్చయముగా వినుము (29).

ఈ శ్లోకములో శ్రీ కృష్ణుడు అర్జునుని ' ఓ ధనంజయా! (సంపదను జయించిన వాడా!)' అని సంబోధించుచున్నాడు. అర్జునుడు అనేకయుద్ధములలో విజయమును సాధించి భౌతికమగు సంపదను మాత్రమే గాక పాశుపతము మొదలగు అస్త్ర ములను కూడ సంపాదించియున్నాడు. ఈ తీరున సంబోధించి భగవానుడు ఆతనిని వినుమని (శృణు) హెచ్చరించుచున్నాడు. బుద్ధిలో మూడు రకముల భేదము గలదు (బుద్ధేః భేదం త్రివిధమ్). ఆ వివరములు ఇప్పుడు చెప్పబడుచున్నవి ( ప్రోచ్యమానమ్).

జ్ఞానములో గల త్రివిధభేదమును మనము ఇదివరలో చూచియున్నాము. బుద్ధి అనగా జ్ఞానమే గదా! కావున ఈ విభాగము ఇదివరలో గడచిపోయినదనే సందేహము కలుగుట సహజము. శ్రీశంకరులీ విషయమును వివరించినారు. ఆలోచించే శక్తికి బుద్ధి అని పేరు. బుద్ధియందు ఉపలభ్యమయ్యే బుద్ధివృత్తి ( ఆలోచనారూపములో బుద్ధియొక్క పరిణామము) జ్ఞానమనబడును.

వృత్తి లేనిదే బుద్ధి లేదు. బుద్ధి లేనిదే వృత్తి లేదు. కాని, ఒక సాధారణ బుద్ధిశక్తి గలదు. దాని యందు వృత్తి అవిర్భవించును. అదియే బుద్ధిలో ఉదయించే జ్ఞానము. బుద్ధికి, జ్ఞానమునకు ఈ విధమగు భేదము గలదు.

మరియు ధృతి కూడ మూడు విధములుగా నున్నది. దీనిని భగవానుడు తరువాత వర్ణించగలడు. ధృతి కూడ బుద్ధిలో ఉదయించే మరియొక వృత్తి మాత్రమే. కావున, బుద్ధి మరియు ధృతి (బుద్ధేః ధృతేః చ) అను ఈ రెండు గుణములను బట్టి (గుణతః) మూడు రకములుగా (త్రివిధమ్) నున్నవి. ఇప్పుడు ఈ వివరములన్నియు దేనినీ విడిచిపెట్టకుండగా సమగ్రముగా (అశేషతః) చెప్పబడును (ప్రోచ్యమానమ్). రాబోవు శ్లోకములలో బుద్ధి మరియు ధృతి అను వాటిని గురించి భగవానుడు చెప్పబోవు విషయమునకు పై శ్లోకము ఉపక్రమము. ఇప్పుడు మనము బుద్ధిలోని భేదములను తెలుసుకుందాము. ముందుగా సాత్త్వికబుద్ధిని, మరియు అది ఆలోచించే విధానమును తెలుసుకుందాము.

**అధ్యాయము 18, శ్లోకము 30:**

प्रवृत्तिं च निवृत्तिं च कार्याकार्ये भयाभये ।
बन्धं मोक्षं च या वेत्ति बुद्धिस्सा पार्थ सात्त्विकी ॥ ३० ॥

ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ సాత్త్వికీ (30)

పార్థ = ఓ అర్జునా (పృథయొక్క కుమారుడా)!, ప్రవృత్తిమ్ = కర్మానుష్ఠానమును, చ = మరియు, నివృత్తిమ్ = కర్మపరిత్యాగమును, చ = మరియు, కార్యాకార్యే = ఏది కర్తవ్యము?, ఏది కాదు? అను విషయమును, భయాభయే = దేనికి భయపడవలెను? దేనికి భయపడరాదు? అను విషయమును, బంధమ్ = బంధమును, చ = మరియు, మోక్షమ్ = మోక్షమును, యా = ఏ, బుద్ధిః = బుద్ధి, వేత్తి = తెలుసుకొనునో, సా = ఆ బుద్ధి, సాత్త్వికీ = సాత్త్విక మనబడును (30).

ఓ అర్జునా! కర్మానుష్ఠానమును, కర్మపరిత్యాగమును, ఏది కర్తవ్యము? ఏది కాదు? దేనికి భయపడవలెను? దేనికి భయపడరాదు? అను విషయములను, మరియు బంధమోక్షములను ఏ బుద్ధి తెలుసుకొనునో, ఆ బుద్ధి సాత్త్విక మనబడును (30).

ఈ కొద్ది విషయములను తెలియగలిగే బుద్ధి సాత్త్వికమనబడును. అది తెలియదగిన విషయములు ఏవి? కర్మానుష్ఠానము (ప్రవృత్తి) బంధహేతువని ఆ బుద్ధికి తెలియునని శ్రీశంకరులు వివరించిరి. కాని కర్మయోగి కర్మఫలమును ఈశ్వరప్రసాదముగా స్వీకరించి (కర్మఫలత్యాగః) కర్మలను చేయుటచే అతనికి ప్రవృత్తి కూడ మోక్షహేతువు అగును. అతని ప్రవృత్తి వాస్తవములో నివృత్తియే యగును. వ్యక్తి వివిధకర్మలలో నిమగ్నుడై యున్ననూ, అతడు కర్మఫలమును త్యజించుటచే అది కూడ నివృత్తియే అగుచున్నది. వివిధకర్మలను మానవుడు ఈశ్వరార్పణబుద్ధితో అంతఃకరణశుద్ధికొరకు మరియు తద్ద్వారా మోక్షము కొరకు చేసినచో, వాటికి ఫలము బంధవిముక్తి యగును. వాస్తవములో బంధవిముక్తి కర్మఫలము కాజాలదు. సర్వమానవుల అంతఃకరణము సహజముగా శుద్ధమైనదియే. కావున, అంతఃకరణశుద్ధి యనగా అంతఃకరణములోని మాలిన్యములను తొలగించుట మాత్రమే. ఇందువలననే, శుద్ధమగు అంతఃకరణముయొక్క ధర్మములగు దయ, కరుణ , ప్రేమ ఇత్యాదులు సర్వమానవులలో గలవు. మోక్షము కొరకై మనము కొత్తగా నిర్మించవలసినది ఏదీ లేదు. మనము సర్వజనసాధారణమగు రాగద్వేషములను తొలగించిన చాలును. నేను అపరాధిని అనే ధారణ, నాకు అన్యాయము జరిగినదనే పరితాపము, కోపము ఇత్యాది మాలిన్యములన్నియు రాగద్వేషములు అనే పదము చేతనే నిర్దేశించబడును. వాటిని అన్నిటినీ నిర్మూలించుట కర్మఫలము కాజాలదు. తొలగిపోవుట ఫలము ఎట్లు అగును? సన్న్యాసము నివృత్తియని స్పష్టమే. కర్మయోగియైననూ స్వర్గము, పుణ్యము ఇత్యాది ఫలముల కొరకై కర్మను చేయుట లేదు. అతని చరమలక్ష్యము మోక్షము. అనగా అతనికి వివేకము గలదని స్పష్టమగుచున్నది. కావున, అతని బుద్ధి సాత్త్వికి అగును. అతనికి తాను కోరే పురుషార్థమును గురించి స్పష్టమైన కల్పన గలదు. కొందరు అర్థకామములను కోరుచుండగా, మరికొందరు భవిష్యత్తులో సుఖమునొసంగు పుణ్యము (ధర్మము)ను కోరుచున్నారు. అర్థకామములకు మరియు ధర్మమునకు స్వరూపములో భేదము లేదు. స్వర్గమును పొంది అచట కొంతకాలము సుఖముల ననుభవించుటకు కావలసిన పెట్టుబడియే పుణ్యము. స్వర్గములో జీవులు అనుభవించే సుఖములనగా సంగీతము, నాట్యము ఇత్యాదులే గదా! వీటికి ఈ లోకములోని భోగములకు భేదము లేదు. ఇది అంతా సంసారమే. కర్మయోగికి ఇవి నిస్సారములని తెలియును. అతడు వాటిని కోరుట లేదు. అతడు మోక్షమును కోరుచున్నాడు. ఈ విధమైన స్పష్టమగు పురుషార్థనిశ్చయము ఉండుటవలన సంసారబంధమునకు హేతువు ప్రవృత్తి యని అతడు గుర్తించగలిగినాడు. ఇది తెలిసినా, మోక్షహేతువు ఏది? అను విషయము తెలియాలనే నియమము లేదు. కాని అతనియందు సాత్త్వికబుద్ధి ఉండుటచే, జ్ఞానరూపమగు నివృత్తియే మోక్షసాధనమని కూడ అతడు తెలుసుకొనును. జ్ఞానము ఉదయించుటకు పూర్వములో కర్మయోగము

గాని, సన్న్యాసము గాని సాధకుని జీవనశైలి అయి ఉండును. సాత్త్వికమగు బుద్ధి గలవానికి ఈ జ్ఞానము లభించు ప్రక్రియ స్పష్టముగా తెలియుచుండును.

ప్రవృత్తినివృత్తులనగా విధినిషేధములని అర్థమును ఏల చెప్పరాదు? ఆ పదములకు ఆ అర్థము ఉన్ననూ, ఈ సందర్భములో ఆ అర్థము పొసగదు. శ్రీకృష్ణుడు కార్యాకార్యే అని ప్రత్యేకముగా చెప్పియున్నాడు. కార్యమనగా శాస్త్రవిహితమైన, అనగా చేయవలసిన కర్మ. అకార్యమనగా శాస్త్ర నిషిద్ధమైన, అనగా చేయదగని కర్మ. ప్రయాణీకులు మార్గములో పాటించవలసిన నియమములు, ప్రభుత్వమునకు కట్టదగిన పన్నుకు సంబంధించిన నియమములు, సామాజిక నియమములు ఇత్యాది లౌకికమగు విధినిషేధములు మాత్రమే గాక, వైదికమగు విధినిషేధములు కూడ గలవు. యజ్ఞము మొదలగు విహితకర్మలతో బాటు వేదము అస్తేయము (పరధనమును అపహరించకుండుట) మొదలగు విశ్వజనీనమగు జీవనమూల్యములను కూడ బోధించుచున్నది. ఈ జీవనమూల్యముల విషయములో మనకు సరియగు అవగాహన ఉండవలెను. లేనిచో, మానవుడు మంచిని పాటిస్తూ చెడును దూరముగా నుంచుటకు కారణము యోగ్యమగు విచారము మరియు అవగాహన గాక, పట్టుబడతామేమో యను భయము కారణమగును. అట్టి వానిని అతని ప్రవృత్తిని గురించి ఏవో కొన్ని ప్రశ్నలను అడిగే సరికి అతని అసలు రంగు బయట పడును. అతని వద్ద సరియగు సమాధానము ఉండదు. లౌకికమగు విధి నిషేధములలో కొన్ని దేశకాలములపై ఆధారపడియుండును. ఒక సమయములో మరియు స్థానములో వర్తించే నియమము మరియొక దేశములో మరియు కాలములో వర్తించకపోవచ్చును. కొన్ని సందర్భములలో ధర్మాధర్మవివేకము చాల సూక్ష్మముగా నుండును. హింసించరాదు(హింసాం న కుర్యాత్) అని శాస్త్రము చెప్పుచున్నది. ప్రభుత్వములన్నియు ఆ మాటనే చెప్పుచున్నవి. కాని అమెరికాలోని పెన్సిల్వేనియా రాష్ట్రములో జింకల సంఖ్య పెరిగినప్పుడు వాటిని వేటాడుటకై ప్రభుత్వము జనులకు అనుమతిపత్రముల నిచ్చును. ఆ జింకలన్నియు ఒక సమావేశము జరిపి పెన్సిల్వేనియాలో మానవుల సంఖ్య లెక్కకు మించి పెరుగుచున్నది గనుక దీనిని అరికట్టుటకై చర్యలను చేపట్టవలెనని తీర్మానించి తుపాకీలను పట్టుకొని మానవులను వేటాడుట మొదలిడినచో ఎట్లుండునో ఊహించుడు. ఈ రకమైన ఆలోచనాధోరణిలోని మహాదోషము మనకు అప్పుడు అవగాహనకు వచ్చును. మానవులు జింకలను వేటాడుటకు బదులుగా, ఒకే ఒక రోజు అవి మానవులను వేటాడినచో, మానవుడు తప్పక గుణపాఠమును నేర్చుకొనును. ఈనాడు మానవుడు వేటాడుచుండవచ్చును. కాని ఒకనాడు మానవుడు వేటాడబడును. బహుశః ఈ జింకలన్నియు పూర్వజన్మలో జింకలను వేటాడిన మానవులై ఉండవచ్చును. మనము చెప్పలేము. మనము వాటిని విశ్వజనీనమూల్యములను సునిశ్చితముగా నిర్వచించుట సంభవము కాదు. మనము వాటిని

దేశకాలానుగుణముగా వివిధములగు అంశములను పరిగణనలోనికి తీసుకొని నిర్ణయించవలెను. వేదవిహితకర్మను అనుష్ఠించుటకైననూ దినము, కాలము, మంత్రము, క్రమము మరియు హవిస్సు నిర్ణీతములై యున్నవి. ఏదో ఒక సమయములో ఏదో ఒక పద్ధతిలో చేయుటకు వీలు లేదు. పుణ్యమును సంపాదించి పాపమును పరిహరించగోరు వైదికులకు, ఏది కర్తవ్యము? ఏది కాదు? (కార్యాకార్యే) అను విషయము ఖచ్చితముగా తెలిసి ఉండవలెను. వారే ముముక్షువులైనచో, సత్త్వగుణప్రధానమగు వారి అంతఃకరణమునందు కార్యాకార్యపరిజ్ఞానము మరింత స్పష్టముగా లోతుగా ఉండును.

ఇంతేగాక, ఈ సాధకునకు తాను 'దేనికి భయపడ వలెను? దేనికి భయపడరాదు?' అను విషయము స్పష్టముగా తెలిసియుండును. అనగా జాగరూకత వహించవలసిన పరిస్థితిలో నాతడు దుస్సాహసమునకు ఒడిగట్టునని అభిప్రాయము కాదు. చోరుడు గాని, లేక పెద్దపులి గాని యెదుట నుండగా 'నేను లెక్క చేయను; నాకు భయము లేదు' అని పలుకబూనుట సరిగాదని శ్రీశంకరులు వివరించిరి. 'నేను పెద్దపులిని ఎదిరించగలను. అది నాకు లెక్కలోనిది కాదు. దానికి నాలుగు కాళ్లు మాత్రమే ఉండగా, నాకు కాళ్లు మరియు చేతులు కూడ గలవు' అని పలుకుట శ్రేయస్కరము కాదు. తెలివైనవానికి పెద్దపులి యెదుట ఎట్లు మసులుకొనవలెనో తెలిసియుండును. పది మంది అడవిలో పయనించుచుండిరి. వారిలో ఒకడు పెద్దపులిని చూచి, 'అదిగో ! పెద్దపులి! భయము గలవారందరు రండి ! నాపై పరుండుడు' అని సలహానిచ్చెను. నిర్వహణాకౌశలమనగా అదియే కాబోలు! మనము నిర్వహింపజాలని పరిస్థితిని మనము కల్పించు కొనరాదు. అడవికి వెళ్లవలసి వచ్చినచో, జీపులో వెళ్లవలెను; లేదా మానవలెను. విపత్కరములు, భయపడవలసినవి అగు పరిస్థితులకు మనము భయపడి వాటికి దూరముగా నుండవలెను. ఉదాహరణకు కరాటే తెలిసినవారు కూడ అర్ధరాత్రమునందు ముంబయి లోని కొన్ని వీధులలో నడుచుట మూర్ఖత్వమే యగును. దారి దోపిడీ చేయువాడు నియమములనన్నిటినీ పాటిస్తూ కరాటే పోటీకి దిగడు. దోపిడీ దొంగలు వెనుకనుండి కొట్టెదరు; లేదా తుపాకీతో కాల్చెదరు. సందర్భశుద్ధి లేని ధైర్యముతో వెళ్లకూడని స్థలములకు వెళ్లుట హానికరమగును. సినిమాలలో ఉన్నట్లు నిజజీవితములో నుండదు. ఇది తెలివితేటలతో జీవించుట యగునే గాని, భయపడుట కాదు. భయహేతువులగు వస్తువులకు మనము దూరముగా నుండవలెను. కొన్ని విషయములు కంటికి కానవచ్చును (దృష్ట). మరికొన్ని కంటికి కానరావు (అదృష్ట). ఏవో కొన్ని సిద్ధులను పొందుటకై క్షుద్రదేవతలనారాధించుట అదృష్టభయమునకు దృష్టాంతము. మానవుడు ఇట్టి అదృష్టము వెంట పడరాదు. మనము కేవలము పుణ్యమును

మాత్రమే కోరవలెను. దేనికి భయపడాలి? దేనికి భయపడకూడదు? అను విషయములో స్పష్టమగు కల్పన గల వివేకికి అదృష్టభయమును గురించి కూడ తెలియును. భయపడనక్కర లేకుండగా (అభయమ్) మనము దగ్గరకు వెళ్లదగ్గ విషయములు కూడ గలవు. బ్రహ్మ మరియు బ్రహ్మజ్ఞానము అట్టి అభయస్థానములే. ఏది యోగ్యము ? ఏది అయోగ్యము ? ఏది భయహేతువు ? దేనికి దూరముగా నుండవలెను ? దేనిని సాధించవలెను ? అను విషయములను తెలియగలిగే బుద్ధి సాత్త్వికబుద్ధి యనబడును.

ఇంతేగాక, ఈతనికి బంధమనగా నేమి? మోక్షమనగా నేమి? అను విషయము కూడ తెలిసియుండును. భార్య, పిల్లలు, ఇల్లు, వాకిలి, ఉద్యోగము మొదలగు వాటిని కలిగియుండుట బంధమగునని కొందరి అభిప్రాయము. క్షురకర్మను చేయించుకొనుట, గెడ్డమును గీసుకొనుట బంధమని మరికొందరి అభిప్రాయము. బంధమును గురించి జనులలో రకరకముల కల్పనలు గలవు. కాని మనము చర్చిస్తున్న వ్యక్తికి బంధమనగా అజ్ఞానమని తెలియును. అజ్ఞానమునుండి సంసారము (సంతతపరివర్తనశీలమగు జీవితము) ఉదయించును. అదియే బంధము. కావున, జనులచే కోరబడే మోక్షమనగా ఆత్మజ్ఞానమే. ఈ సత్యమునెరింగిన బుద్ధి సాత్త్వికబుద్ధి యనబడును.

రాజసబుద్ధి యనగా నేమి?

**అధ్యాయము 18, శ్లోకము 31:**

यया धर्ममधर्मं च कार्यं चाकार्यमेव च ।
अयथावत्प्रजानाति बुद्धिस्सा पार्थ राजसी ॥ ३१ ॥

యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ
అయథావత్ప్ర జానాతి బుద్ధిస్సా పార్థ రాజసీ (31).

పార్థ = అర్జునా! (కుంతీపుత్రా!), యయా = ఏ బుద్ధిచే, ధర్మమ్ = ధర్మమును, చ = మరియు, అధర్మమ్ = అధర్మమును, చ = మరియు, కార్యమ్ = చేయదగిన కర్మను, చ = మరియు, అకార్యమ్ = చేయకూడని కర్మను, అయథావత్ = తప్పుగా, ప్రజానాతి = తెలుసుకొనుచున్నాడో, సా = అ, బుద్ధిః = బుద్ధి, రాజసీ = రాజసబుద్ధి.

ఓ అర్జునా! మానవుడు ఏ బుద్ధిచే ధర్మాధర్మములను మరియు కర్తవ్య

–అకర్తవ్యములను తప్పుగా గ్రహించుచున్నాడో, ఆ బుద్ధి రాజసబుద్ధి యనబడును (31).

మానవుడు ఈ బుద్ధితో కొన్ని సంగతులను తెలుసుకొనును. ఏది శాస్త్ర విహితమైన ధర్మము? ఏది శాస్త్రముచే నిషేధించబడిన అధర్మము ? దేనిని చేయవలెను (కార్యమ్)? దేనిని చేయరాదు (అకార్యమ్)? ఈ వరుసను చూచినచో శ్రీకృష్ణుడు పూర్వశ్లోకమును మరల పునరావృత్తి చేయుచున్నాడు అనిపించును. కాని రెండవ పంక్తిలోని ఒకే ఒక పదముతో ఆయన సర్వమును మార్చివేసినాడు. మానవుడు వీటిని తెలుసుకొనే విధమెట్టిది? అయథావత్. ఉన్నది ఉన్నట్లుగా తెలుసుకున్నచో, అది యథావత్ అనబడును. ఈ విషయములను శాస్త్ర తాత్పర్యమునకు అనురూపముగా గాక, తప్పుగా తెలుసుకున్నచో, అది అయథావత్ అనబడును. కొందరు శాస్త్రమును తప్పుగా అర్థముచేసుకొని, శాస్త్రతాత్పర్యమును సమగ్రముగా మరియు సునిశ్చితముగా తెలుసుకొనకుండగనే, దానిని తమకు అనుకూలమైన రీతిలో వ్యాఖ్యానించి ఉదహరించుచుందురని శ్రీశంకరులు వివరించిరి. కావున, ఈ రకమగు బుద్ధి గలవాడు కేవలము తెలుసుకొనుట (జానాతి) మాత్రమే గాక, గట్టిగా తెలుసుకొనును (ప్రజానాతి). కాని తప్పుగా తెలుసుకొనును.

తరువాతిది తామసబుద్ధి.

**అధ్యాయము 18, శ్లోకము 32:**

अधर्मं धर्ममिति या मन्यते तमसावृता।
सर्वार्थान् विपरीतांश्च बुद्धिस्सा पार्थ तामसी ॥ ३२ ॥

అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ తామసీ (32)

పార్థ = ఓ అర్జునా! (పృథయొక్క కుమారుడా!), తమసా = అజ్ఞానముచే, అవృతా = కప్పివేయబడిన, యా = ఏ, బుద్ధిః = బుద్ధి, అధర్మమ్ =అధర్మమును, ధర్మం ఇతి = ధర్మముగను, చ =మరియు, సర్వార్థాన్=విషయములనన్నింటినీ, విపరీతాన్= తల్లక్రిందులుగా, మన్యతే =తెలుసుకొనునో, సా = ఆ బుద్ధి, తామసీ =తామసబుద్ధి.

ఓ అర్జునా! అజ్ఞానముచే కప్పివేయ బడియున్న ఏ బుద్ధిచే

మానవుడు అధర్మమును ధర్మముగను, మరియు విషయములనన్నింటినీ తల్ల క్రిందులుగను తెలుసుకొనునో, ఆ బుద్ధి తామసబుద్ధి యనబడును (32).

రాజసబుద్ధి గలవాడు తెలుసుకొనును; కాని సరిగా తెలుసుకొనడు అని పూర్వశ్లోకములో చెప్పబడినది. అనగా అతనికి జీవనమూల్యముల గురించి తెలిసియుండ వచ్చును. కాని వాటి మహత్త్వము తెలియదు గనుక, అతడు వాటి విషయములో అడ్డదారులను త్రొక్కుచుండును. కాని విషయములను ఉన్నదానికి విపరీతముగా తెలుసుకొనే వ్యక్తిని గురించి మనమీ శ్లోకములో చర్చించుచున్నాము. అట్టి వాడు అధర్మమును ధర్మమని వాదించును. 'ఈ ప్రపంచములో ఈ రకమైన పనులను చేయకుండగా బ్రతుకుట కష్టము. మనము ముందుకు దూసుకుపోయే విధముగా వ్యవహరించి తీరాలి' అని అతడు వాదించును. ఇది అర్థరహితమైన వాదన. ముందుకు దూసుకుపోవుట అనగా నేమి? నా యెదుట నిలబడియున్న వ్యక్తిని త్రోసివేసి నేను ఆ స్థానమునాక్రమించవలెనా? ఈ ముందుకు దూసుకుపోవుట అను దాని నిర్వచనమేమి? దీనికి హద్దును నిర్ణయించుట ఎట్లు? కొన్ని దేశములలో ఈ స్వభావము ఒక సద్గుణముగా కూడ పరిగణించబడుచున్నది. 'నీవు అసత్యమును పలికి తీరవలెను; లేనిచో, జీవించుట అసంభవము' అని కొందరు చెప్పెదరు. వారు సత్యవ్రతునితో, ' ఓ మిత్రమా! నీ సత్యవ్రతము చెల్లుబాటు కాదు. నీవు ఈ పాఠమును నేర్చుకొనుము. నీకు ప్రపంచ పరిజ్ఞానము సున్న. మేము అందరము జీవితములో దెబ్బలను తిని తిని ఈ గుణపాఠమును నేర్చుకున్నాము. మనము సందర్భానుసారము అసత్యమును పలుకవచ్చును' అని ఉపదేశించుచుందురు. ఇట్టి ప్రవృత్తియే ధర్మమని భావించే బుద్ధి తామసబుద్ధి యనబడును. ఈ బుద్ధి గలవాడు అధర్మమును ధర్మముగా పరిగణించి అకార్యమును అనుష్ఠించుచుండును.

ఇంతేగాక, అతడు ప్రపంచములో తెలియదగిన విషయముల నన్నింటినీ (సర్వార్థాన్) ఉన్న స్థితికి తల్లక్రిందులుగా (విపరీతాన్), అనగా వాటియందు ఉన్న యథార్థమగు విలువకంటె అధికమగు విలువను వాటి యందు ఆరోపించి, తెలుసుకొనును. ఈ విధముగా సర్వమును విపరీతముగా గ్రహించుటకు కారణమేమి? అతని బుద్ధి జాడ్యము లేక అజ్ఞానముచే కప్పివేయబడి ఉండుటయే (తమసా ఆవృతా).

అంతఃకరణములో ఉండే సాత్త్విక, రాజస, తామసములనే మూడు రకముల భేదములు

ఇచట చెప్పబడినవి. దీనిని బట్టి అవి సర్వకాలములయందు అదే తీరున ఉండుననుకోరాదు. తామసబుద్ధి గల వ్యక్తిని మనము రజోగుణ ప్రధానమగు స్థితికి తీసుకు రావలెను. దానికొరకై ఆతడు పనులను చేయునట్లు చేయవలెను. ఆతడు ప్రతిదినము ఒక మైలు దూరము పరుగెత్తుట మంచిది. ఆతడు కొంత అనుశాసనమును పాటిస్తూ చదువుకుంటూ ఉంటే, ఆ తమస్సు దూరమగును. తమస్సును తరిమివేయుటకు ఆటలు చక్కని ఉపాయము. ఆటలు మానవునిలో ఒక ఉల్లాసమును కలిగించును. ఆ తరువాత సత్త్వగుణమును పెంపొందించుకొనుట సరళమగును. సత్త్వమనగా నేమి? తమస్సు అనగా నేమి? అను విషయములో మనకు చక్కని అవగాహనను కలిగించుట ఈ విభాగముయొక్క ప్రయోజనము కాదు. ప్రతి వ్యక్తిలో ఈ మూడు గుణములు గలవు. వాటి పాళ్లలో కొద్దో గొప్పో సర్దుబాటు ఆవశ్యకమగును. సమస్యను గుర్తించిన తరువాత వ్యక్తి తదనుకూలమగు మార్పును చేబట్టి ఆ సమస్యను పరిష్కరించుకొనవచ్చును. ఈ విభాగముయొక్క ఉద్దేశ్యమదియే.

ఇప్పుడు మనము ధృతిలోని మూడు రకములను పరిశీలించెదము. ముందుగా సాత్త్వికధృతిని తెలుసుకుందాము.

**అధ్యాయము 18, శ్లోకము 33:**

धृत्या यया धारयते मन:प्राणेन्द्रियक्रिया: ।
योगेनाव्यभिचारिण्या धृतिस्सा पार्थ सात्त्विकी ॥ ३३ ॥

ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేంద్రియక్రియాః
యోగేనావ్యభిచారిణ్యా ధృతిస్సా పార్థ సాత్త్వికీ (33)

పార్థ = ఓ అర్జునా! (కుంతి యొక్క కుమారుడా!), అవ్యభిచారిణ్యా = చలనము లేని, యయా = ఏ, ధృత్యా = ధృతిచే, యోగేన = అభ్యాసముచే, మనఃప్రాణేంద్రియక్రియాః = మనస్సు, ప్రాణము, జ్ఞానేంద్రియములు మరియు కర్మేంద్రియముల వ్యాపారములను, ధారయతే = అలంబనమై ధరించునో, సా = ఆ, ధృతిః = ధృతి, సాత్త్వికీ = సాత్త్వికి యనబడును.

సాధకుడు చలనము లేని ఏ ధృతిని అలంబనముగా చేసుకొని అభ్యాసముచే మనస్సు, ప్రాణము, జ్ఞానేంద్రియములు మరియు కర్మేంద్రియముల వ్యాపారములను ధరించియుండునో, ఆ ధృతి సాత్త్వికధృతి యనబడును (33).

ధృతి యనగా దృఢనిశ్చయము అని మనము చూచియున్నాము. సాత్త్వికధృతి చలనము లేకుండగా స్థిరముగా నుండును. సాధకుడు మనోవృత్తులను, శారీరక వ్యాపారములను, కర్మేంద్రియ మరియు జ్ఞానేంద్రియ వ్యాపారములను (మనః ప్రాణేంద్రియక్రియాః) చలనము నెరుంగని ధైర్యముతో (ధృత్యా అవ్యభిచారిణ్యా) కొన్ని హద్దుల లోపల నిలబెట్టి యుండును (ధారయతే). శాస్త్రముచే ఉపదేశించబడిన ధార్మికజీవనము ఈ హద్దులను నిర్వచించును. ఈ సాధకుడు శాస్త్రోపదేశమునకు విరుద్ధమైన జీవనవిధానములోనికి తాను జారిపోకుండా జాగ్రత్త పడును. దీనికి చాల దృఢనిశ్చయము కావలెను. ఏలయన, ధర్మవిరుద్ధమైన పనులను చేయాలనే ప్రవణత మానవులలో అతి సహజముగా (స్వాభావికీ) గలదు. సరియగు అవగాహన గల వ్యక్తి ధర్మమునకు అనురూపముగా జీవించుట కూడ స్వాభావికమే. కాని శిశువు సమాజములో పెరిగి పెద్ద అయ్యే సమయములో అమాయకత్వముచే మౌలికమగు మానవస్వభావమునకు విరుద్ధమగు కొన్ని ప్రవణతలను అలవరచుకొనును. కొంతకాలము తరువాత అవి సహజములా యన్నట్లు భాసించును. మానవునకు ఏది ధర్మము అను విషయము అంతరంగములో తెలియుచుండును. కావున, మానవునకు సహజములైన ప్రవృత్తులే శాస్త్రములో ఆదేశరూపముగా ప్రస్తుతించబడు చున్నవి. కావున, ధర్మమును పాటించి అధర్మమునకు దూరముగా నుండవలెననే ప్రవృత్తి సాధకునియందు సహజత్వమును సంతరించుకొనును. ధర్మ-అధర్మసంస్కారములకు రెండింటికి మధ్యలో నిత్యము యుద్ధము జరుగుచుండును. ప్రపంచములోని పురాణగాథలన్నింటిలో మంచి-చెడుల మధ్య నిరంతరముగా జరిగే ఈ యుద్ధమే దేవాసురసంగ్రామరూపములో వర్ణించబడినది. సంస్కృత సాహిత్యములో వినాశము సర్వాధికముగా వర్ణించబడినది. అందువలననే, సంస్కృతభాషలో వినాశము అనే అర్థమునిచ్చే ధాతువులు అనేకముగా గలవు. దీనికి కారణమేమనగా, మానవుడు జీవితములో నాశనము చేయదగిన అధర్మములు అనేకముగా గలవు. ధర్మముయొక్క పరిధికి లోబడి యుండుటయా? లేక దానిని అతిక్రమించుటయా? అనే సంఘర్షణను ప్రతి మానవుడు నిజజీవితములో ఎదుర్కొనుచుండును. ధర్మబద్ధముగా జీవించుటకు ఆరంభములో దృఢనిశ్చయము కావలెను. మానవునియందు ఈ నిశ్చయము ధర్మాధర్మవివేకము నుండి జనించును. అభ్యాసము, అనుశాసనబద్ధమగు జీవితము, యోగ్యమగు మనఃప్రవృత్తి (యోగేన) ఇత్యాదుల వలన ఆ నిశ్చయము దృఢత్వమును సంతరించుకొనును. అనుశాసనబద్ధమగు జీవితమును గడుపుతూ ఈ దేహేంద్రియమనస్సంఘాతము యొక్క వ్యాపారములను దృఢనిశ్చయముతో నియంత్రించగలిగే వ్యక్తిలో ఉండే ధృతి సాత్త్వికధృతి యనబడును. ఈ ధృతి గల వాని అంతఃకరణము సత్త్వగుణప్రధానముగా నున్నదని మనకు స్పష్టమగుచుండును.

రజోగుణప్రధానమగు అంతఃకరణము గలవానియందు కూడ ధృతి గలదు. రాక్షసుల యందు మరియు అసురులయందు కూడ దృఢనిశ్చయము ఉండును. భస్మాసురునియందు సాటి లేని ధృతి ఉండెడిది. అందువలననే ఆతడు ఘోరమగు తపస్సును చేసి శివుని సాక్షాత్కారమును పొంద గలిగినాడు. దృఢనిశ్చయము లేనివాడు శివుని దర్శనమును పొందజాలడు గదా! కాని శివుడు ప్రత్యక్షమై 'నీకు ఏమి కావాలి?' అని ప్రశ్నించగానే, 'నేను ఎవరిని ముట్టుకుంటే వారు బూడిద కావాలి' అని ఆతడు కోరెను. ఇది ఎట్టి ధృతి యగును? Stock Exchange లలోని కొందరు మేధావులకు మరియు అంతర్జాతీయ కంపెనీల అధిపతులకు ఇతరులనందరినీ నాశనము చేయాలనే ఇట్టి ధృతి ఉండును. పెద్ద పెద్ద కంపెనీలకు అధిపతులు కాగలిగే చాకచక్యము ఎవరో కొద్దిమందియందు మాత్రమే ఉండును. అట్టి వారిలో, ఒకరిద్దరిని మినహాయిస్తే, అందరిలో మోసము, దగా మరియు కుట్ర అధికముగా నుండును. వారు 'జీవితములో విజయమును సాధించే ఉపాయము' అనే పుస్తకమును వ్రాసి దానిని ప్రచురించి అమ్ముటలో కూడ విజయమును సాధించగల సమర్థులు. ఇట్టి వారందరిలో గొప్ప ధృతి గలదు. కాని అది రాజసధృతి. గొప్ప ధృతి ఉన్నంతమాత్రాన వ్యక్తి గొప్పవాడు కాబోడు. వాని ధృతి వెనుకనుండే ప్రేరణను కూడ మనము గమనించవలెను.

**అధ్యాయము 18, శ్లోకము 34:**

यया तु धर्मकामार्थान् धृत्या धारयतेऽर्जुन ।
प्रसंगेन फलाकांक्षी धृतिस्सा पार्थ राजसी ॥ ३४ ॥

యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేర్జున
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిస్సా పార్థ రాజసీ (34)

పార్థ = ఓ పృథాకుమారా!, అర్జున = ఓ అర్జునా!, తు = దీనికి భిన్నముగా, యయా = ఏ, ధృత్యా = ధృతిచే, ప్రసంగేన = సందర్భమును బట్టి, ఫలాకాంక్షీ = ఫలమును కోరు వ్యక్తి, ధర్మకామార్థాన్ = ధర్మార్థకామములనే పురుషార్థములను, ధారయతే = ధరించునో, సా = ఆ, ధృతిః = ధృతి, రాజసీ = రాసజసధృతి యనబడును.

పృథాకుమారుడగు ఓ అర్జునా! దీనికి భిన్నముగా, సందర్భమును
బట్టి ఫలమును కోరుతూ ఉండే మానవుడు ఏ ధృతిచే

ధర్మార్థకామములనే పురుషార్థములను నిలబెట్టుకొనునో, ఆ ధృతి రాజసధృతి యనబడును (34).

ధర్మకామార్థములను నిలబెట్టుట యనగా దేహేంద్రియమనస్సులతో వాటికొరకై ఉద్దేశించబడిన వ్యాపారములను నిర్వహించుచుండుట అని యర్థము. అట్లు నిలబెట్టే ధృతి రాజసధృతి యగును. ఇచట ధర్మమనగా పుణ్యము. అధికమగు పుణ్యమును తేలికగా సంపాదించే ఉపాయమేమి? అను విషయమును గురించి యోజన చేయుటలో సమయమును వెచ్చించే వ్యక్తిని గురించి మనమిచట చర్చించుచున్నాము. ఆ పుణ్యమునకు ప్రయోజనమేమి? భవిష్యత్తులో మెరుగైన భద్రత (అర్థ) ను మరియు సుఖము (కామ) ను పొందుటయే. అతడు అర్థకామములను సంపాదించుటకొరకు మాత్రమే యోజన చేసి శ్రద్ధతో ధర్మమునాచరించును. అతడు ధర్మమునకు సంబంధించిన వివిధకార్యములను పట్టుదలతో ఆచరించు వాడే అయిననూ, అతని దృష్టి మోక్షముపై లేదు. ఇంతేగాక, సందర్భము వచ్చినప్పుడల్లా (ప్రసంగేన) అతడు ఫలమును పొందగోరును (ఫలాకాంక్షి). అనగా అతడు ప్రతి సందర్భమును తనకు ప్రయోజనము చేకూరే విధముగా మలుచుకొనే ప్రయత్నమును చేయుచుండును. అతని దృష్టిలో ప్రయోజనమనగా అర్థకామములే గాని, అంతఃకరణశుద్ధి కాదు. అతనిలో ఈ ధృతి దృఢముగా నెలకొని యుండుటచే, ధర్మార్థకామములను ప్రోగుచేసే అవకాశమును దేనినైననూ అతడు విడనాడడు. అతడు అవకాశములనన్నింటినీ స్వార్థసాధనకై వినియోగించుకొనును. అనగా అతడు అవకాశవాది యని చెప్పవచ్చును. అతనిలో గల ధృతి కారణముగా అతడు రాబందువలె ఇతరుల కంట బడని అవకాశములను కూడ కనిపెట్టి వినియోగించుకొనును. రాబందు ఆకాశములో చాల ఎత్తున ఎగురుచున్ననూ, దాని దృష్టి నేలమీది మృతదేహముపై నుండును. కాని ఆకాశములో చాల ఎత్తున ఎగురుచున్న రాబందును చూచినచో, అది విరాగివలె నిర్లిప్తముగా నున్నట్లు కానవచ్చును. కాని ఇంతలో నేలమీద మృతదేహము కానరాగానే అది హఠాత్తుగా క్రిందకు దూసుకువచ్చి దానిని పట్టుకొని పోవును. అదే విధముగా ఈ వ్యక్తి కూడ సర్వదా అవకాశము కొరకు ఎదురు చూచుచుండును. అవకాశమును బట్టి అతడు ఫలమును కోరుచుండును. అతనిని ఈ విధముగా సర్వకాలములయందు ధర్మార్థకామముల గురించి ఆలోచించే అవకాశవాదిగా తీర్చిదిద్దిన దృఢనిశ్చయమునకు మూలములో రజోగుణమునుండి పుట్టిన రాజసధృతి గలదు. ఇచట ధర్మమనగా అర్థకామములను సంపాదించి పెట్టే పుణ్యము అని స్పష్టముగా తెలుసుకొనవలెను.

ఇప్పుడు మూడవ రకము ధృతి చెప్పబడుచున్నది.

**అధ్యాయము 18, శ్లోకము 35:**

यया स्वप्नं भयं शोकं विषादं मदमेव च।
न विमुञ्चति दुर्मेधा धृतिस्सा पार्थ तामसी ॥ ३५ ॥

యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ
న విముంచతి దుర్మేధా ధృతిస్సా పార్థ తామసీ (35)

పార్థ = అర్జునా!, దుర్మేధాః = అయోగ్యమగు విచారము గల వ్యక్తి, యయా = ఏ ధృతిచే, స్వప్నమ్ = నిద్రను, భయమ్ = భయమును, శోకమ్ = శోకమును, చ = మరియు, ఏవ = నిశ్చయముగా, విషాదమ్ = నిరుత్సాహమును, మదమ్ = మత్తును, న విముంచతి = విడిచిపెట్టుట లేదో, సా = ఆ, ధృతిః = ధృతి, తామసీ = తామసి యనబడును.

ఓ అర్జునా! అయోగ్యమగు విచారము గల వ్యక్తి ఏ ధృతిచే నిద్రను, భయమును, శోకమును మరియు నిశ్చయముగా నిరుత్సాహమును, మత్తును విడిచిపెట్టడో, ఆ ధృతి తామసధృతి యనబడును (35).

మనమిచట కొన్ని విషయములను విడిచిపెట్టకపోవుటలో కటిబద్ధత మరియు దృఢనిశ్చయము (ధృతి) గల మరియొక వ్యక్తిని గురించి చర్చించుచున్నాము. అతనికి వీటి విషయములో ధృతి ఉండుటచే మనము చెప్పి చూచిననూ, అతనిలో మార్పును తెచ్చుటకు ప్రయత్నించిననూ, అతడు వీటిని విడువకుండగా గట్టిగా పట్టుకొనును. ఉదాహరణకు ఏది ఏమైనా, అతడు తన నిద్ర (స్వప్నమ్) ను విడిచిపెట్టడు. అది అతనికి చాల ప్రముఖమైనది. శ్రీకృష్ణుడు ఇచట స్వప్నమ్ అను పదమును ప్రయోగించుటలో అంతరార్థము గలదు. ఈ పదమునకు కల మరియు నిద్ర అను రెండు అర్థములు గలవు. దీనిని బట్టి ఈతడు అధికముగా నిద్రించుట మాత్రమే గాక, తెలివిగా ఉన్నప్పుడు పగటి కలలను కంటూ కాలమును గడుపునని సూచితమైనది. అనగా అతడు నిద్ర పోవుచుండును; లేదా, పగటి కలలను కనును. రెండు పరిస్థితులలో అతడు స్వప్నమును మాత్రము విడిచి పెట్టుట లేదు.

యోగము దుఃఖమును పోగొట్టుననియు, అధికముగా నిద్రించువానికి యోగము

దూరమేననియు మనము 6 వ అధ్యాయములో చూచియున్నాము. ఇంతేగాక, ఈతడు తెలివిగా నున్నప్పుడు సర్వదా ఏదో ఒకదాని గురించి భయపడుచుండును. అతనియందు స్వాభావికమగు మరణ భయము మాత్రమే గాక, సోమరి యగుటచే తన వద్దనున్న ఆస్తిపాస్తులు లేకుండగా పోవునేమో యను భయము కూడ ఉండును. ఈ భయమును తొలగించుకొనుటకు అతడు ప్రయత్నమును చేయడు. కావున, ఇది అతనిని వెన్నాడుచుండును. ప్రయత్నమును చేసి భయమును దూరము చేసుకొనవచ్చును. కాని ప్రయత్నమును చేయుటకు కావలసిన ధృతి అతనిలో లేదు. సమస్యను ఎదుర్కొని పరిష్కరించనంతవరకు భయము విడనాడదు. ఈ కారణము చేతనే అతడు శోకమును కూడ విడువజాలడు. శోకమును పోగొట్టే ప్రయత్నమును దేనినీ అతడు చేయడు. అతనితో రెండు నిముషములు మాటలాడినచో, ఆ శోకము మనకు కూడ సంక్రమించును. అతని శోకము అంటువ్యాధి వలె చుట్టు ప్రక్కలనున్న వారికి కూడ సోకును. అతడు ఈ శోకమును విడనాడక పోవుట మాత్రమే గాక, అతని నిత్యకృత్యములన్నింటిలో నిరుత్సాహము (విషాదమ్) చోటు చేసుకొని వ్యాపించి యుండును. అతడు మత్తు మందుయొక్క నిషాలో ఉన్నవాడు వలెనుండును. ఇంద్రియభోగానుభవము మాత్రమే అతనికి కొంత ఉల్లాసమును ఇచ్చుచుండుటచే, అతడు సర్వదా వాటి వెనుక పడుచుండును. అతడు సదుపదేశమును చెవిని పెట్టడు. అట్లు చేసియున్నచో, అతడు తప్పక మారి యుండెడి వాడు.

ఇతరుల సామర్థ్యమును చులకన చేసి తన గొప్పను ప్రకటించుకొనే వ్యక్తియందు ఉండే ధృతి కూడ తామసధృతియే యగును. ఇట్టి వ్యక్తి తనలో దాగియున్న హైన్యభావన అనే మనో గ్రంథి (inferiority complex) ని ఎదిరించుటకై ఇతరుల యెదుట తన గొప్పలను చాటుచుండును. అట్లు గాక, అతడు తన శక్తిని సరిగా అంచనా వేసుకున్నచో, అది దుఃఖహేతువు అగును. ఆ ఇబ్బందిని దాటుటకై అతడు దర్పమును ప్రదర్శించును. అధికనిద్ర, భయము, శోకము మరియు విషాదము గల వ్యక్తికి ఏమి ఆత్మాభిమానము ఉండును ? అతడు తనలోని హైన్యభావనను పోగొట్టుకొనే ఉపాయమేది గలదు ? అతనికి ఏదియు కానరాదు. అతడు ఈ హైన్యభావనను పోగొట్టుకొనుటకై ప్రపంచమును ధిక్కరించును. ఈ భావన వలన అతనిలో అహంకారము నెలకొనును. దానివలన మహాత్ములవద్ద జ్ఞానమును స్వీకరించే అవకాశము దూరమగును. అతడు మదమును విడనాడడు (మదం న విముంచతి) అను వాక్యముయొక్క తాత్పర్యము ఇదియే. ఇతరుల మాటను వినే స్వభావము గలవాడైనచో, అతడు మారే అవకాశము ఉండును. కాని అతనియందలి మదము అతనిని పెద్దల యెదుట తలను వంచనీయదు. అజ్ఞానము ఇట్టి దురహంకారరూపములో బయట పడుచుండును.

ఇట్టి వ్యక్తి ఆలోచించినా, ఆ ఆలోచన సరిగా ఉండదు (దుర్మేధాః). విపరీతజ్ఞానముతో నిండిన ఆలోచనలు గలవానియొక్క ధృతి తామసధృతి యనబడును.

ఈ విధముగా వివిధకర్మలు, మరియు కర్త, జ్ఞానము, బుద్ధి మరియు ధృతి అనే కర్మోపకరణములు కూడ గుణములను బట్టి మూడు రకములుగా విభజింపబడి యున్నవని మనము చూచియున్నాము. మనకు కొన్ని కర్మలను చేసే సందర్భములో సుఖరూపమగు ఫలము లభించును. వివిధక్రియలలో లభించే ఈ సుఖములో కూడ మూడు రకములు గలవు. ఈ సుఖము లభించే విధము ఏది ? అది ఎంతకాలము ఉండును ? దాని శ్రేణి మరియు స్వరూపము ఎట్టివి ? అను అంశములపై ఆధారపడి సుఖములో గల సాత్త్వికౘ రాజస, తామసభేదములు నిర్ధారింపబడును.

**అధ్యాయము 18, శ్లోకము 36:**

सुखं त्विदानीं त्रिविधं शृणु मे भरतर्षभ ।
अभ्यासाद्रमते यत्र दुःखांतं च निगच्छति ॥ ३६ ॥

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి (36)

భరతర్షభ = భరతవంశీయులలో శ్రేష్ఠుడవగు ఓ అర్జునా!, తు = తరువాత, ఇదానీమ్ = ఇప్పుడు, మే = నా మాటలను, త్రివిధమ్ = మూడు రకముల, సుఖమ్ = సుఖమును గురించి, శృణు = వినుము, యత్ర = ఏ సుఖమునందు, అభ్యాసాత్ = అభ్యాసముచే, రమతే = రమించునో, చ = మరియు, దుఃఖాంతమ్ = దుఃఖముయొక్క అంతమును, నిగచ్ఛతి = పొందునో.

> భరతవంశీయులలో శ్రేష్ఠుడవగు ఓ అర్జునా! తరువాత ఇప్పుడు నేను మూడు రకముల సుఖమును గురించి చెప్పెదను వినుము. ఏ సుఖమునందు మానవుడు అభ్యాసముచే రమించునో, మరియు దుఃఖముయొక్క అంతమును పొందునో ---(36).

భరతవంశీయులలో శ్రేష్ఠమైనవాడా (భరతర్షభ)! అని భగవానుడు అర్జునుని సంబోధించినాడు. కొత్త విషయము ఆరంభమగుచున్నదని తు అను అవ్యయము సూచించును. మూడు రకముల సుఖము (త్రివిధం సుఖమ్) అనే కొత్త విషయవస్తువును ఆరంభిస్తూ భగవానుడు

అర్జునుని సావధానుని చేయుటకొరకై, 'ఇప్పుడు నా మాటను వినుము (ఇదానీం శృణు)' అని పలుకుచున్నాడు.

మానవుడు అభ్యాసముచే సాత్త్వికసుఖమునందు రమించును (అభ్యాసాత్ రమతే యత్ర). శ్రవణ, మనన, నిదిధ్యాసనముల వలన మానవుడు పొందే సుఖము సాత్త్వికసుఖము. వీటిలో ఆవృత్తి అంతర్భాగమై యున్నది. ఈ ఆవృత్తి విసుగును కలిగించదు. పైగా, దానివలన సుఖము లభించును. మరియు ఈ సుఖము వచ్చి పోయేది కాదు. దీని వలన మానవుడు తన యందు నిహితమై యున్న దుఃఖమును తొలగించుకొన గల్గును (దుఃఖాంతం చ నిగచ్ఛతి). 'నేను' లేనిదే దుఃఖము లేదు. దుఃఖభావనలన్నింటియందు 'నేను' అనే ధారణ అంతర్నిహితమై యున్నది. ఆత్మస్వరూపము సుఖమని గుర్తించి, ఈ 'నేను' పై ఆరోపించబడి దుఃఖహేతువులగుచున్న వివిధధారణలనుండి విముక్తిని పొందుట ద్వారా మానవుడు దుఃఖముయొక్క ఆవలి తీరమునకు చేరుకొనును.

**అధ్యాయము 18, శ్లోకము 37:**

यत्तदग्रे विषमिव परिणामेऽमृतोपमम्।
तत्सुखं सात्त्विकं प्रोक्तमात्मबुद्धिप्रसादजम् ॥ ३७ ॥

యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్ (37).

**ఆత్మబుద్ధి ప్రసాదజమ్** = ఆత్మజ్ఞానము వలన కలిగే ప్రసన్నతనుండి పుట్టిన, **యత్** = ఏ, **సుఖమ్** = సుఖము, **అగ్రే** = ఆరంభములో, **విషం ఇవ** = విషము వలె నుండునో, **పరిణామే** = మార్పు వచ్చినప్పుడు, **అమృతోపమమ్** = అమృతము వలె నుండునో, **తత్** = ఆ సుఖము, **సాత్త్వికమ్** = సాత్త్వికసుఖమని, **ప్రోక్తమ్** = చెప్పబడినది.

ఆత్మజ్ఞానము వలన కలిగే ప్రసన్నతనుండి పుట్టి, ఆరంభములో
విషమువలె ఉన్ననూ, పరివర్తనము వచ్చినప్పుడు అమృతము వలె
ఉండే సుఖము సాత్త్వికసుఖ మనబడును (37).

ఆరంభములో విషమువలె నుండునని (విషమివ) ఇచట చెప్పబడినది. సాత్త్వికసుఖము ఆరంభములో విషమువలె నుండునని (విషమివ) ఇచట చెప్పబడినది. సాత్త్వికసుఖము ఆరంభములో విషమువలె నుండునని

అతడు అన్వేషించేది తన స్వరూపమే గనుక, దానిలో కొంత క్లేశము లేకపోలేదు. దీని లోనికి రాకముందు అతడు వివిధలక్ష్యముల వెనుక పడుతూ చాల హడావుడిగా నుండెడివాడు. వాటిలో అతనికి ఏదో కొంత సంతోషము లభించెడిది. ఒక వస్తువు లభించినప్పుడు కలిగే ఆనందములో దానిని పొందుటకు పడిన శ్రమ మరుపునకు వచ్చును. కాని, సాధకుడు ధ్యానమును తన వైపునకు మళ్లించగానే, దానికి పూర్వమునందున్న స్థితియే బాగున్నదని అనిపించుట సహజము. కాని అది వాస్తవము కాదు. పూర్వములో పరిస్థితి బాగున్నచో, ఇప్పుడ వచ్చిన నష్టమేమి ? అతనిలో కొత్తగా వచ్చిన మార్పు ఏదీ లేదు గదా! వాస్తవమేమనగా, దీనికి ముందు ఉన్న స్థితి గర్వించదగ్గది కానే కాదు. ఆ సమయములో జిజ్ఞాసువు దృష్టిని తన వైపునకు సారించకపోవుటచే 'అంతా బాగున్నది' అనే భ్రాంతి కలిగినది. అంతే. ఇప్పుడు జిజ్ఞాసువు ఒక్కసారిగా దృష్టిని తన వైపునకు మళ్లించే సరికి, అతడు పూర్వములో ఎన్నడూ ఆలోచించి యుండని దుఃఖములన్నియు పైకి ఉబుకును. అతడు తన దృష్టిని అంతర్ముఖము చేసి యుండకపోవుటచే, తనలో ఇటువంటి దుఃఖములు దాగియున్నవనే సంగతి కూడ అతనికి తెలియకుండెను. ఇప్పుడు దృష్టిని అంతర్ముఖము చేయగానే, అవి పైకి త్రోసుకు వచ్చుచుండును. కావున, ఈ సాధన ఆరంభములో విషప్రాయముగా నుండును. ఈ సాధనలో వైరాగ్యము, మనఃపరిపక్వత, వాస్తవిక దృష్టి, నిర్లిప్తత, మనస్సుయొక్క స్థితిగతుల అవగాహన, పరిస్థితులను యథాతథముగా అంచనా వేయగల్గుట ఇత్యాది లక్షణములు అవశ్యకమగును. ఇవి సామాన్యమగు లక్షణములు కాదు. పైగా, సాధకుడు తన గతమును దూరముగా నెట్టివేయవలెను. దీనికై సాధకుడు స్వీయవ్యక్తిత్వమును తరచి శోధించవలెను. ఇది సరళమైన పని కాదు. ఇది చాల క్లేశముతో కూడిన సాధన. కావున, ఈ అధ్యాత్మవిద్య మరియు ఆత్మాన్వేషణము ఆరంభములో దుఃఖదాయకములే యగుచుండును.

హరిః ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు.

జిజ్ఞాసువు వైరాగ్యమును పొంది ధ్యానమును చేయగలిగే సామర్థ్యమును సంపాదించి జ్ఞానమును బడయుటకు ఆరంభములో అధికమగు శ్రమను చేయ వలసి యుండును. ఏదో కొంత క్లేశము లేని ఆధ్యాత్మికసాధన లేదు. ఆరంభములో ఉండే ఆ క్లేశము చేదు విషముతో పోల్చబడినది. ఒకప్పుడు ఈ క్లేశము జిజ్ఞాసువును వినాశము వైపునకు నెట్టి వేయునా అనిపించును. ఇట్టి క్లేశముతో గూడిన సాధన జిజ్ఞాసువునకు రుచించదు. కాని సాధకుడు దానిని అధిగమించవలెను. ఇంతేగాక, ఆరంభములో కష్టము అనిపించినా, జిజ్ఞాసువు జీవనమూల్యములను కూడ పాటించవలెను. క్రమముగా అవి స్వాభావికములు అగును. ఈ అన్వేషణలో సర్వము క్రొత్తగా కనప్పట్టును. శాకాహారనియ మము కూడ కొందరికి ఇబ్బందిని కలిగించవచ్చును. ఉదయము పెందలకడనే లేచుట, తరగతులకు హాజరు అగుట క్లేశముతో కూడిన పని. పైగా, విషయవస్తువులో అభివృద్ధి లేశమైననూ కానరాదు ! ' నీవు బ్రహ్మవు ' అని గురువు మొదటి తరగతిలో చెప్పినాడు. మూడు వందల తరగతుల తరువాత కూడ ఆయన అదే మాటను చెప్పును. ఆయన వెంట వెళ్లగల్గినచో, పన్నెండు సంవత్సరముల తరువాత కూడ ఆయన అదే మాటను చెప్పును. గ్రంథములు మరియు శ్లోకములు మాత్రమే మారుచుండును. విషయవస్తువులో మార్పు లేశమైననూ ఉండదు. ఇంతేగాక, ఈ అధ్యయనములో జిజ్ఞాసువు కూర్చుండి ధ్యానమును చేయవలెను. అయిదు పది నిముషములు ధ్యానమును చేయుటలో ఇబ్బంది లేకపోవచ్చును. కాని గంట సేపు ధ్యానమును చేయమన్నచో, అది ఇబ్బందియే అగును. కావున, ఈ అన్వేషణ ఆరంభములో చేదుగానుండునని మనము చెప్పెదము. కాని, నీతో నీవు ప్రసన్నముగా నుండి, నీతో నీవు యథాతథముగా సంతుష్టుడవై, అనుశాసనయుత మగు జీవితమును గడుపగల్గినచో, అది మనఃపరిపక్వతకు నిదర్శనమగును. నీవు భావావే గములను నియంత్రించుకొని, గతమునకు స్వస్తి చెప్పి, ఆత్మనిష్ఠుడవై ఉండవలెను. ఈ విధమగు మార్పు జిజ్ఞాసువునకు ఆవశ్యకము. ఇట్టి మార్పు వచ్చిన తరువాత ఏమగును?

జిజ్ఞాసువుయొక్క అంతఃకరణములో ఇట్టి మార్పు ( పరిణామే ) వచ్చిన పిదప, అవగాహన, వైరాగ్యము మొదలగు సద్గుణముల వలన అతని హృదయములో ఒక ఆనం దము నెలకొనునని శ్రీశంకరులు వివరించిరి. ఈ వైరాగ్యము సంకల్పపూర్వకముగా చేసే భోగపరిత్యాగము కాదు. ఇది అవగాహననుండి ఉదయించిన వాస్తవికదృష్టి. ఇటువంటి మనఃపరిపక్వతనుండి ఉదయించే ఆనందము అమృతము వంటిది ( సుఖం అమృతోపమమ్ ). ఈ ఉపమానము విలక్షణమైనది. మనకు సుతరాము తెలియని వస్తువు దృష్టాంతము ఎట్లు కాగల్గును ? అమృతము స్వర్గములో నుండునని మనకు శాస్త్రము చెప్పగా తెలిసినది. ఈ దృష్టాంతము ఇతరదృష్టాంతములవలె మనచే పూర్వము చూడబ డినది కాకపోయినా, దీనిని గురించి పూర్వములో మనము విని యున్నాము ( శ్రుతపూ ర్వమ్ ). ఇట్టి దృష్టాంతము మనకు అరుదుగా కనపడును. పురాణములలో అమృతమును

గురించి విస్తారమగు వర్ణన గలదు. అది ఒక రకమైన క్షీరము వంటిదని వర్ణించబడినది. దానిని కొద్దిగానైననూ సేవించిన జీవుడు మృత్యువునకు అతీతుడగును.

వాస్తవంలో ఆ అమృతము జ్ఞానము తక్క మరియొకటి కాదు. ఈ సాత్త్వికసుఖము జ్ఞానిని అమరుని చేయును గనుక, అమృతము వంటిదే యగును. కాలాతీతమగు ఆత్మ యొక్క జ్ఞానమునుండి ఉదయించే మనఃప్రసన్నతనుండి పుట్టినది ( ఆత్మ బుద్ధి ప్రసాదజమ్ ) గనుక, ఈ సుఖము తొలగి పోయేది కాదు. ఒక వస్తువు వలన పుట్టే సుఖమైనచో, అది కొద్ది కాలమునకే దూరమగుట తథ్యము. ఆత్మబుద్ధి యనగా ఆత్మజ్ఞానము గల అంతఃకరణము. ఆత్మజ్ఞానము వలన అంతఃకరణములో ఒక విశిష్టమైన ప్రసన్నత నెలకొనును. సరస్సులోని నీరు స్వచ్ఛముగా మరియు కదలిక లేకుండగా నున్నచో, నీటి అడుగున ఉన్న ఇసుక మరియు రంగు రంగుల గులక రాళ్లు సుస్పష్టముగా కానవచ్చును. గులకరాళ్లకు పొడిగా నున్నప్పుడు ఆ సుందరమగు రంగులు ఉండవు. అంతఃకరణముయొక్క ప్రసన్నత కూడ ఇట్టిదియే. ఇంతేగాక, ఈ అంతఃకరణము ప్రవహించే నీరు వలె, దారిలో ఏది ఎదురైనా, దానిని దాటుకుంటూ, ఎచ్చటనైననూ చిక్కుకోకుండగా, ముందుకు సాగిపోవుచుండును. ప్రవహించే జలమునకు పెద్ద రాయి ఎదురైనచో, నీరు దానిని చుట్టి ముందుకు సాగును. పెద్ద మైదానము ఎదురైనచో, నీరు దానిని నింపి ముందుకు సాగును. ఏది ఎదురైనా, నీరు ఇబ్బంది పడదు ; ఆగిపోదు. అదే విధముగా పవిత్రము మరియు ప్రసన్నము అగు అంతఃకరణము గల వ్యక్తి దేనినైననూ విరోధించకుండగా, ఎక్కడనైననూ చిక్కుకొనకుండగా, జీవితములో సజావుగా ముందుకు సాగిపోవును. అట్టి వ్యక్తికి తన అంతఃకరణముతో సహా దేనితోనైననూ విరోధము లేదు. ఏది ఉంటే, అదే మంచి. దానిని అటులనే ఉండనిమ్ము. ఈ తీరున పరిస్థితులను యథాతథముగా అంగీకరించే మనస్తత్త్వమునకు ఆత్మబుద్ధిప్రసాదము అని పేరు. ఆ ప్రసాదము ఆత్మజ్ఞానమే. దానినుండి ఉదయించే సుఖము బాహ్యవస్తువులపై వేటిపైననూ ఆధారపడదు. ఈ సుఖము జ్ఞానరూపము గనుక, మానసిక-అవస్థలపై కూడ ఆధారపడదు. ఇట్టి జ్ఞానమును పొందిన వ్యక్తి సాధనయొక్క ఆరంభములో ఈ జ్ఞానము ఉదయించుటకు కావలసిన అర్హతలనన్నింటినీ సంపాదించియున్నారు. ఇందువలననే, ఆరంభములో ఈ సాధన చేదు విషముతో పోల్చబడినది ( విషమివ ). కాని, అంతఃకరణములో యోగ్యమగు పరివర్తనము వచ్చిన తరువాత ఈ అన్వేషణ అమృతతుల్యముగా ( అమృతోపమమ్ ) నుండును. అంతఃకరణము సత్త్వగుణప్రధానమగుట చేతనే ఈ సుఖము సంభవమైనది. కావున, ఈ సుఖము సాత్త్వికసుఖమని చెప్పబడినది.

తరువాతి శ్లోకము రాజససుఖమును వర్ణించుచున్నది.

**అధ్యాయము 18 , శ్లోకము 38 :**

विषयेन्द्रियसंयोगाद्यत्तदग्रेऽमृतोपमम् ।
परिणामे विषमिव तत्सुखं राजसं स्मृतम् ।। ३८ ।।
విషయేంద్రియసంయోగాద్యత్తదగ్రేమృతోపమమ్
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ( 38 ).

యత్ = ఏ, సుఖమ్ = సుఖము, విషయేంద్రియసంయోగాత్ = ఇంద్రియములకు విషయ వస్తువులతో కలిగే సంయోగము వలన, అగ్రే= ఆరంభములో, అమృతోపమమ్ = అమృత మును పోలియుండునో, పరిణామే = దానిలో మార్పు వచ్చినప్పుడు, విషమివ= విషము వలె నుండునో, తత్ = ఆ సుఖము, రాజసమ్ = రాజససుఖమని, స్మృతమ్ = చెప్పబడి నది.

ఇంద్రియములకు విషయవస్తువులతో కలిగే సంయోగమునుండి పుట్టే సుఖము ఆరంభములో అమృతమువలె నున్ననూ, పరిణామములో విషమును బోలియుండును. అట్టి సుఖము రాజససుఖమనబడును ( 38 ).

ఇంద్రియములకు విషయవస్తువులతో సంయోగము ఏర్పడినప్పుడు కలిగే ( విషయేంద్రియసంయోగాత్ ) సరళమైన ఉల్లాసమునకు రాజససుఖమని పేరు. ఆ విష యవస్తువులు అభీష్టములైనచో, సుఖము పుట్టును. ఈ సుఖమును పొందుట చాల సరళ ము. కావున, ఇది ఆరంభములో అమృతమును బోలియుండును( అగ్రే అమృతోపమమ్ ). ఏలయనగా, ఇంద్రియములకు విషయవస్తుసంయోగము కలుగుటకొరకై అంతఃకరణమును తీర్చి దిద్దవలసిన పని లేదు. కేవలప్రత్యక్షజ్ఞానాత్మకమగు ఈ సుఖమును జంతువులు కూడ అనుభవించుచుండును. ఇది చాల సరళమైనది మాత్రమే గాక, మిక్కిలి ప్రీతికరమై నది కూడ అగుటచే, అమృతముతో పోల్చబడినది.

కాని ఈ సుఖానుభవములో ఒకానొక మార్పు కలుగును. ఇట్టి భోగము దేహము నకు గల భోగానుభవసామర్థ్యమును క్షీణింపజేయును. ఈ భోగములు మానవుని బలము ను, అందమును, జ్ఞానమును, తెలివితేటలను, సంపదను, మరియు ఉత్సాహశక్తిని కూడ నశింపజేయునని ( బల-వీర్య-రూప-ప్రజ్ఞా-మేధా-ధన-ఉత్సాహ-హాని-హేతుత్వాత్ ) శ్రీశంకరులు వర్ణించిరి. ఇంద్రియభోగలాలసుడగు వ్యక్తియొక్క ఆరోగ్యము మరియు ఇంద్రియముల పటుత్వము కూడ క్షీణించును. వయస్సు పెరిగే కొలదీ మానవుని ఆరో గ్యము మరియు ఇంద్రియముల భోగానుభవసామర్థ్యము క్షీణించుట సహజమే. కాని దేహ మును భోగములతో దుర్వినియోగము చేయువానిలో ఈ అపక్షయము వేగమును పుంజు కొనును. ఇంద్రియసుఖానుభవము ఆరంభములో అతిసరళముగా భాసించును. ఈ సుఖము పూర్తిగా ఇంద్రియముల పటుత్వముపై ఆధారపడి యుండును. కాని కాలక్రమ ములో ఈ పటుత్వము తగ్గిపోయి, ఆ సుఖములను పొందుట దుర్ఘటమగును. మరి కొంత కాలమునకు ఇంద్రియములు పూర్తిగా క్షీణించుటచే ఆ సుఖము పూర్తిగా లుప్తమగును. మరియు, సౌందర్యము వ్యక్తికి కొంత సుఖమును ఇచ్చును. ఇతరుల పొగడ్తలను విన్న ప్పుడు అందగానిలో తాను గొప్పవాడిననే భావన ఉదయించును. కాని దానికి ఆలంబన మగు అందము నిలబడేది కాదు. అందగాడు అందములోని ఆనందమును అనుభవించు చుండగనే, అది దూరమగును. ఇంద్రియభోగలాలసుడగు వ్యక్తికి ఏ విధమైన ఆలోచనను చేయుటకైననూ తీరిక ఉండదు. అట్టి వాడు ధర్మాధర్మములను, ఆత్మానాత్మలను గురించి ఆలోచించడని వేరుగా చెప్పనేల ? అట్టి వానిలో వివేకశక్తి ( ప్రజ్ఞా ) మరియు దానితో బాటు విషయములను గుర్తు పెట్టుకొనే సామర్థ్యము కూడ వినష్టమగును. ఇంత మాత్రమే

గాక, భోగి తాను అనుభవించే భోగములన్నింటికి వెలను కట్టవలసియుండును. కావున, ఆతని సంపద కరిగి చినా, దాని కొరకై చాల శ్రమను పడవలసి యుండును. తీరా దానిని సంపాదించే సరికి దానిలోని మజా మటుమాయమగును. అపుడు మిగిలేది నిరుత్సాహము మాత్రమే. మొదటి సారి కలిగిన మజా మరల రెండవ సారి కలుగుట కల్ల. ఒకప్పుడు ఒక వస్తువుపై గల మోజు తీరిపోగానే, మరల దాని స్థానములో రెండవ వస్తువు కొరకు అన్వేషించవలసి యుండును. కావున, ఈ సుఖము ఆరంభములో అమృతమే అయిననూ, క్షణికము అగుటచే, మరియు తాత్కాలిక-అనుభవరూపము అగుటచే, అంతములో మిగిలేది దుఃఖమే యగును.

ఇంద్రియసుఖములను సంపాదించుటకు అధికముగా శ్రమ పడవలసి యుండును. ఆ శక్తి క్రమముగా తగ్గుచుండును. ఇట్టి మార్పు వచ్చునప్పుడు అది విషప్రాయమగును ( విషం ఇవ ). అంతఃకరణములో సుఖానుభవసామర్థ్యము క్షీణించినపుడు, దేహములో మరియు ఇంద్రియములలో పటుత్వము తగ్గినప్పుడు, మరియు సంపద కరిగిపోయినప్పుడు సుఖానుభవము సంభవము కాదు. కాని భోగలాలసుడగు వ్యక్తి ఆ ఆకర్షణలో పడి వివేకమును పెంచుకొనే ప్రయత్నమును చేయకపోవుటచే, ఆతనికి 60-70 సంవత్సరముల వయస్సు వచ్చుసరికి పెద్ద వయస్సులో కులాసాగా గడిపే మానసిక విశ్రాంతి కరువగును. ఆ సమయములో సేవానివృత్తి ( retirement ) ని వరముగా తీర్చి దిద్దగలిగే వివేకము హఠాత్తుగా నిర్మాణము కాదు. జీవితమంతయు వివేకమును నిలబెట్టుకున్న వానికి సేవానివృత్తి సహాయకారి యగును. కానిచో, అది వానికి శాపమే యగును.

ఈ తీరున ఈ రాజససుఖము ఆరంభములో అమృతము వలెనున్ననూ ( అగ్రే అమృతోపమమ్ ), దానిలో మార్పు వచ్చినప్పుడు ( పరిణామే ) విషమువలె నగును ( విషం ఇవ ). దీనికి భిన్నముగా, సాత్త్వికసుఖము ఆరంభములో విషమువలె నుండును. ఏలయన, దానిని పొందుటకై వ్యక్తి అరుచికరమగు అనుశాసనమును పాటించవలసి యుండును. కాని, అంతములో అది అమృతతుల్యము అగును. ఆరంభములో మహోల్లాసమునిచ్చే రాజససుఖము అంతములో దుఃఖహేతువు అగును. ఇంతేగాక, సుఖమనగా ఇంద్రియసుఖమే అనే పరిస్థితిలో ఉండే వ్యక్తికి వాటిని సంపాదించుట తప్ప గత్యంతరము లేకుండుటచే, ఆతనికి ధర్మముతో రాజీపడుట అనివార్యమగును. అట్టి ధర్మోల్లంఘనముయొక్క ఫలము దుఃఖము మాత్రమే. కావుననే, ఈ సుఖము అంతములో విషతుల్యమనియు, ఇది మానవుని అధర్మమార్గములో నడిపి భవిష్యత్తులో నరకయాతనలకు గురిచేయుననియు శ్రీశంకరులు వివరించిరి.

తరువాతి శ్లోకములో మూడవ రకము సుఖము వర్ణించబడుచున్నది.

**అధ్యాయము 18 , శ్లోకము 39 :**

**यदग्रे चानुबन्धे च सुखं मोहनमात्मनः ।**

**निद्रालस्यप्रमादोत्थं तत्तामसमुदाहृतम् ।। ३९ ।।**

యదగ్రే చానుబంధే చ సుఖం మోహనమాత్మనః
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్ ( 39 ).

**యత్** = ఏ, **సుఖమ్** = సుఖము, **అగ్రే** = ఆరంభములో, **చ** = మరియు, **అనుబంధే** = **అంతమునందు**, **ఆత్మనః** = తనకు, **మోహనమ్** = మోహమును కలిగించునది, **చ** = మరియు, **నిద్రాలస్యప్రమాదోత్థమ్** = నిద్ర, సోమరితనము మరియు ఉపేక్షాభావములనుండి పుట్టినదో, **తత్** = ఆ సుఖము, **తామ-సమ్** = తామససుఖమని, **ఉదాహృతమ్** = చెప్పబడినది.

వ్యక్తికి ఆరంభములో మరియు అంతమునందు తనకు మోహమును
కలిగించునది, మరియు నిద్ర, సోమరితనము, ఉపేక్షాభావము అనే
లక్షణములనుండి పుట్టినది అగు సుఖము తామససుఖమగునని
చెప్పబడినది ( 39 ).

ఇది వ్యక్తికి ఆరంభములో మరియు అంతమునందు మోహమును కలిగించే సుఖము ( అగ్రే చ అనుబంధే చ మోహనమాత్మనః ). మానవుడు అనుభవించే నిద్రాసుఖము ఇదియే. నిద్రలో కొంత సుఖము ఉన్నమాట వాస్తవమే. కాని, ఆ సుఖమును అనుభవించుటకు అంతఃకరణము తెలివిగా లేదు. నిద్రలో సుఖము లేదని మనము చెప్పజాలము. కాని, ఆ సుఖము అజ్ఞానముచే పూర్తిగా పరాభూతమై యుండును గనుక, సకారాత్మకమగు సుఖానుభవము లేదు. కాని దుఃఖానుభవము కూడ లేదు. గాఢనిద్రలో నీవు మాత్రమే ఉన్నావు గనుక, నీవు నీ స్వరూపములో ఐక్యమగుదువు. అప్పుడు ఆత్మానందము మాత్రమే గలదు. మానవుడు నిద్రలో స్వరూపనిష్ఠుడై ఉన్ననూ, మనస్సు పూర్తిగా తమోగుణముచే కప్పి వేయబడి యుండుటచే ఆ సత్యమును గుర్తించజాలదు. కావున, ఆ సుఖము తామససుఖమని చెప్పబడినది.

ఇంతేగాక, సోమరితనము ( ఆలస్య ) నుండి పుట్టే మరియొక సుఖము కలదు. పనిని చేసేవానికి శ్రమ తప్పదు. కాని పనిని ఎగగొట్టు వానికి శ్రమ లేదు గనుక దుఃఖము కూడ లేదు. అది కూడ తామససుఖమే యగును. కర్తవ్యకర్మలయందు గల ఉపేక్షాదృష్టి కూడ ఇట్టి సుఖమునే ఇచ్చును. ఇట్టి సుఖమునకు అలవాటు పడినవారు, మనము అధికమగు ఒత్తిడికి గురి కారాదనియు, ప్రతి వ్యక్తి తగినంత సమయమును తనకొరకై కేటాయించుకొన వలయుననియు చెప్పి తమ సోమరితనమును సమర్థించుకొన జూచెదరు. కర్తవ్యకర్మను చేయకపోవుటలో గల సుఖము తామససుఖమనుట నిస్సందేహము. ఒక వ్యక్తి వద్ద కర్తవ్యకర్మను చేసే సామర్థ్యము కొరవడినచో, అది వేరే. దానికి దీనితో సంబంధము లేదు. కాని వ్యక్తి కర్తవ్యకర్మను పట్టించుకోకుండగా, దానిగురించి కనీసము చింతిల్లకుండగా విశ్రమించినచో, అది తామససుఖము అగును. చేయవలసిన పనిని చేయకపోవుటలో కొంత సుఖము ఉన్నది గదా !

వివిధములగు అంశములలో గల త్రివిధభేదమును వివరించే ఈ భాగమును భగవానుడు తరువాతి శ్లోకములో ఉపసంహరించుచున్నాడు.

**అధ్యాయము 18 , శ్లోకము 40 :**

न तदस्ति पृथिव्यां वा दिवि देवेषु वा पुनः ।
सत्त्वं प्रकृतिजैर्मुक्तं यदेभिस्स्यात् त्रिभिर्गुणैः ।। ४० ।।
న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్ త్రిభిర్గుణైః ( 40 ).

పృథివ్యాం వా= భూలోకములో గాని, పునః = ఇంతే గాక, దివి = దేవలోకములో , దేవేషు వా = దేవతలలో గాని, తత్ = ఆ, సత్త్వమ్ = ఉనికి గల పదార్థము, న అస్తి =లేదు, యత్ = ఏదైతే, ఏభిః = ఈ, ప్రకృతిజైః = ప్రకృతినుండి పుట్టిన, త్రిభిః = మూడు, గుణైః =గుణములచే, ముక్తమ్ =సంబంధము లేనిదై, స్యాత్ =ఉండునో.

భూలోకములో గాని, అంతే గాక, దేవలోకములో దేవతలలో గాని,
ప్రకృతినుండి పుట్టిన ఈ మూడు గుణములతో సంబంధము లేని
ప్రాణి లేనే లేదు ( 40 ).

సత్త్వమనగా ఉనికి గల ప్రాణి. ఈ మూడు గుణములతో సంబంధము లేని ప్రాణి లేనే లేదు ( *ముక్తం యదేభిః స్యాత్ త్రిభిర్గుణైః* ). ఎక్కడ ? భూలోకములో ( *పృథివ్యామ్* ), అనగా మనుష్యులలో అని శ్రీశంకరులు వివరించిరి. మరియు దేవలోకములో దేవతలలో ( *దివి దేవేషు* ). ఈ మూడు గుణములతో సంబంధము లేని ప్రాణి ( *ముక్తం స్యాత్ యదేభిస్త్రిభిర్గుణైః* ) భూలోకములోని మనుష్యులు మొదలగు ప్రాణులలో గాని, దేవలోకములోని దేవతలలో గాని లేదు. సత్త్వము, రజస్సు, తమస్సు అనే ఈ మూడు గుణములు ప్రకృతి అనగా మాయనుండి పుట్టినవి. వీటినుండి పూర్తిగా విముక్తమై ఉండే సత్త్వము లేదు. సత్త్వశబ్దమునకు ప్రాణి అని శ్రీశంకరులు అర్థమును చెప్పిరి. మనము ఈ అర్థమును ఉనికి గల సర్వపదార్థములకు వర్తింపజేయవచ్చును. ఈ గుణములనుండి వినిర్ముక్తమైనది ఏదీ లేదు. రాయి మొదలగునవి పూర్తిగా తామసములు కాగా, చెట్లులో తమస్సు ప్రధానగుణమై యున్నది. పశువులు కూడ తమోగుణప్రధానములే అయినా, వాటిలో భేదములు గలవు.

మనుష్యులలో కూడ సత్త్వరజస్తమోగుణములలో ఏదో ఒక దాని ప్రాముఖ్యము ఉండును. దీనిని బట్టి నాలుగు ప్రధానవికల్పములు సంప్రాప్తమైననూ, వాటిలో కూడ మరల కోట్లాది స్వల్పభేదములు ఉండును. గుణములు మరియు కర్మ ఆధారముగా చేసుకొని మానవులలో నాలుగు సమూహములు గలవు. గుణములు ఆధారముగా గల విభాగము విశ్వజనీనమైనది. వ్యక్తియొక్క మానసిక-పరివక్వత కొరకై వేదము కర్మను ఆధారముగా చేసుకొని ఒక వ్యవస్థను నిర్దేశించియున్నది. ఈ విభాగము ఇప్పుడు ప్రస్తావింపబడుచున్నది. ఈ ప్రస్తావమును ఆధునిక సమాజదృష్టితో మనము వ్యాఖ్యానించవలెను. కాని గీత ఆవిర్భవించిన పరిస్థితులలో బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రుల గుణములు మరియు కర్మలు ఖచ్చితముగా నిర్ణీతములై యుండెను. కర్తవ్యకర్మ అనే దృష్టికోణములో ఒక బ్రాహ్మణుడు గలడు. గుణము అనే దృష్టికోణములో ఒక బ్రాహ్మణుడు గలడు. ఈ రెండు ఒకటియే అయినచో, అది ఆదర్శస్థితి యగును. అట్టి ఆదర్శస్థితిని ఆధారముగా చేసుకొని భగవానుడు ఇచట ముందుగా బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులనే నాలుగు సము

దాయముల గుణములను తరువాత కర్మలను గురించి చర్చించుచున్నాడు. ఈ విధమగు
శ్రమవిభజనము గల సమాజమునకు ఇట్టి వ్యవస్థ వర్తించును. కాని, గుణమును మాత్రమే
ఆధారముగా చేసుకొని చేసే విభాగము విశ్వజనీనమని చెప్పవచ్చును. భారతదేశములో
కూడ కర్మను ఆధారముగా చేసుకొని ఉండే విభాగము ఇంచుమించు లేదని చెప్పవచ్చు
ను. ఏవో కొన్ని అవశేషములు మాత్రమే మిగిలి ఉన్నవి. ఆచార్యపదవులలో క్షత్రియులు,
సేనాధ్యక్షులుగా వైశ్యులు, తోళ్ల వ్యాపారమును చేయు బ్రాహ్మణులు కూడ మనకు కానవ
చ్చెదరు. కావున, ఈ నాడు ఆ వ్యవస్థ అంతరించినది. కాని గీత ఉపదేశించబడిన కాల
ములో ఆ వ్యవస్థ ఉండెడిది.

గుణకర్మలను ఆధారముగా చేసుకొని చేయబడిన ఈ చాతుర్వర్ణ్యవిభాగమును
శ్రీశంకరులు ఇట్లు ఉపక్రమించిరి : సంతతపరివర్తనశీలము మరియు ప్రవృత్తిప్రధానము
అగు సంసారము, ప్రవృత్తికి హేతువులు మరియు ప్రవృత్తిఫలము అను విషయములు
15 వ అధ్యాయములో కొమ్మలు పైకి వ్రేళ్లు క్రిందికి ఉండే వృక్షము (ఊర్ధ్వమూలమ్ )
ను దృష్టాంతముగా తీసుకొని వర్ణింపబడినవి. కర్మలవలన వాటి ఫలరూపముగా దేహము
సంప్రాప్తమైనది. దేహము ఉండుటచే ప్రవృత్తి సంక్రమించినది. దానికి మరల ఫలము
తప్పదు. అనగా మరల మరియొక దేహము సంప్రాప్తమగును. ఈ విధముగా సంసారము
సహజముగా కొనసాగుచుండును. వీటన్నింటిలో సత్త్వరజస్తమోగుణములు మాత్రమే
వేర్వేరు పాళ్లలో గలవు. కావున, ఈ సంసారము త్రిగుణాత్మకమగుచున్నది. ఈ సంసా
రము ఎవరికి ? నేను లేని సంసారము లేదు గనుక, సంసారము ఆత్మకే యని చెప్పవల
యును. ఆత్మ సంసారహేతువు కాదు. కాని సంసారమునకు ఆశ్రయము ఆత్మయే. సచ్చి
దానంద-ఆత్మ తద్విరుద్ధమగు సంసారమునకు ఆశ్రయము ఎట్లు కాగల్గును ? అవిద్యచే
సంసారము ఆత్మయందు అధ్యారోపము చేయబడినది. ' నేను కర్తను మరియు కర్మఫల
భోక్తను' అనునది కేవలము అ జ్ఞానము మాత్రమే. ఈ అజ్ఞానమే సంసారహేతువు అగు
చున్నది. సంసారము మోక్షము కాదు కనుక అభీష్టము కాదు. సర్వప్రాణులు ఈ మూడు
గుణముల వశములో నున్నారనియు, ఇదియే సంసారమనే అనర్థమనియు మనము పూర్వ
శ్లోకములో చూచియున్నాము. మానవుడు పుణ్యప్రభావముచే దేవరూపమును దాల్చిననూ
త్రిగుణాత్మకమగు సంసారమునకు లోపల మాత్రమే కొనసాగుచుండును.

పైకి వ్రేళ్లు మరియు క్రిందికి కొమ్మలు గల ఈ సంసారవృక్షమును అసంగము
అనే గొడ్డలితో మాత్రమే ఛేదించదగునని ( *అసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా* ) కూడ 15 వ
అధ్యాయములో స్పష్టముగా నిరూపించబడినది. ఇచట అసంగశస్త్రమనగా సుస్పష్టమగు
ఆత్మ-అనాత్మవివేకము. తరువాత మానవుడు పునరావృత్తి లేని ఆ లక్ష్యమును చేరవలెను
( *తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్ గతా న నివర్తంతి భూయః* ). మానవులు ఈ
మూడు గుణముల వ్యామోహములో పడి యున్నారు. వారు ఎక్కడకు వెళ్లిననూ, వాటికి
అతీతులు కాలేరు. సంసారము సత్త్వరజస్తమస్సులనే ఈ మూడు గుణములతో నిర్మితమై
యున్నది గనుక, సంసారమునుండి విడుదలను పొందాలంటే ఈ మూడు గుణములకు
అతీతుడు కావాలి. మానవుడు వాటి ఆకర్షణకు మరియు వ్యామోహమునకు అతీతుడు

కానంతవరకు సంసారబంధమునుండి తప్పించుకొనలేరు. ఈ సంసారములో ఉండే మానవుడు సాత్త్వికబంధనమనే బంగరు సంకెలచేత గాని, రాజసబంధనమనే వెండి సంకెలచేత గాని, లేదా తామసబంధనమనే ఇనుప సంకెలచేత గాని బంధింపబడి యుండును. ఏవో కొన్ని మార్పులను తెచ్చి ఈ సంసారమునుండి విముక్తిని పొందుట అసంభవము. సంకెలను మార్చవచ్చును. అంతే. ఉదాహరణకు నేను ఈ మానవదేహమును మార్చి దేవదేహమును పొందవచ్చును. కాని, అప్పుడు కూడ, ' ఆ దేవతలకు బంగరు రెక్కలు ఉండగా, నాకు రెక్కలు లేనే లేవు' ఇత్యాదిగా కొత్తరకము మనోగ్రంథులను కలిగియుండుట సంభవమే. మనకు తెలిసిన ఈ ఉపాయములతో సంసారమునుండి విముక్తి సంభవము కాదు. కావున, ఈ త్రిగుణాత్మకమగు సంసారమునుండి విముక్తిని పొందే ఉపాయమును బోధించవలెను. దీని కొరకై మరియొక పరిచ్ఛేదము ఆరంభమగుచున్నది.

ఇంతేగాక, పూర్ణగీతాశాస్త్రముయొక్క తాత్పర్యమును సంగ్రహముగా ప్రతిపాదించవలసియున్నది. ఏలయన, ఇది సర్వవేదముల మరియు స్మృతుల సారమై యున్నది. మోక్షపురుషార్థమునందు అభిరుచి గల జనులు దీనిని అధ్యయనము చేయవలెను అని శ్రీశంకరులు వివరించిరి. దీనికొరకు మాత్రమే బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రవిభాగము ప్రస్తావింపబడుచున్నది. ఈ విభాగము గుణసంబద్ధమే అయిననూ, ఇది కొత్త పరిచ్ఛేదమే అగును.

**అధ్యాయము 18 , శ్లోకము 41 :**

**ब्राह्मणक्षत्रियविशां शूद्राणां च परंतप ।**

**कर्माणि प्रविभक्तानि स्वभावप्रभवैर्गुणैः ।। ४१ ।।**

బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః ( 41 ).

పరంతప = శత్రువులను తపింపజేయు ఓ అర్జునా ! , బ్రాహ్మణక్షత్రియవిశామ్ = బ్రాహ్మణుల, క్షత్రియుల, మరియు వైశ్యులయొక్క, చ = మరియు, శూద్రాణామ్ = శూద్రులయొక్క, కర్మాణి = కర్మలు, స్వభావప్రభవైః = ఈశ్వరుని మాయ / వ్యక్తిగతస్వభావము / వైయక్తిక కర్మ నుండి పుట్టిన, గుణైః = గుణములచే, ప్రవిభక్తాని = విభాగము చేయబడినవి.

శత్రువులను తపింపజేయు ఓ అర్జునా ! బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రుల
కర్మలు ఈశ్వరుని మాయ/ వ్యక్తిగతస్వభావము /వైయక్తిక కర్మనుండి
పుట్టిన గుణములచే విభాగము చేయబడినవి ( 41 ).

ఇది బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులకు సంబంధించిన విధులయొక్క విభాగము. బ్రాహ్మణక్షత్రియవైశ్యులు ఒక సమాసపదములో చెప్పబడగా, శూద్రులు వేరే పదముచే చెప్పబడినారు. దీనికి కేవలము శ్లోకములోని ఛందస్సు కారణము కావచ్చును. ఈ నాల్గు సముదాయములలో ప్రతి ఒక్క సముదాయమునకు విశిష్టమగు విధులు గలవు. ఒక సముదాయముయొక్క విధులు ఇతరసముదాయముల విధులు కంటె విభిన్నముగా నుండును.

ఈ విభాగమునకు మూలమేమి ? మొట్టమొదట్లో గుణములపై ఆధారపడి ఈ విభాగము చేయబడినది. ఈ ప్రకరణములో కూడ అటులనే వర్ణించబడినది. ఈ గుణములు స్వభావ మునుండి పుట్టినవి ( స్వభావప్రభవైః ). స్వభావమనగా ఈశ్వరుని మాయోపాధి యని శ్రీశంకరులు వివరించిరి. ఈశ్వరుని ఉపాధియగు మాయయే ప్రకృతి యనబడును. ఆ ప్రకృతి త్రిగుణాత్మిక. ఆ గుణములే ఈ విభాగమునకు మూలములో నున్నవి.

సత్త్వము గాని, రజస్సు గాని, లేక తమస్సు గాని ప్రముఖముగా నున్న వ్యక్తుల విధులు ( కర్మాణి ) ఏవి ? సత్త్వగుణప్రధానుడగు వ్యక్తికి సహజసిద్ధములగు విధులు గల వు. రజోగుణప్రధానుడగు వ్యక్తి తనకు నిర్దేశించబడిన విధులను యోగ్యమగు మనఃప్రవృ త్తితో అనుష్ఠించినచో, ఆతడు సాత్త్వికుడగును. తమోగుణప్రధానుడగు వ్యక్తి తన విధిని నిర్వర్తించినచో, ముందుగా రాజసుడుగను, తరువాత సాత్త్వికుడుగను ఎదుగును. కావున ఇది మానవుడు సాత్త్వికునిగా ఎదుగుటకు కావలసిన ఉపాయమును నిర్దేశించుచున్నది. ఈ తీరున సర్వమానవులు సాత్త్వికులు కావాలనే అపేక్ష దీనియందు గలదు. కాని అంత టితో ఆగిపోరాదు. మానవుడు గుణముచే బ్రాహ్మణుడై, తరువాత తప్పక సాధించదగిన చరమలక్ష్యమును సాధించవచ్చును.

శ్రీశంకరులు స్వభావశబ్దమును మరియొక విధముగా వ్యాఖ్యానించిరి. మానవుడు చేసే కర్మలకు వాని స్వభావము కారణమగును. ఆ స్వభావమునకు గుణముల అనుపా తము ( proportion ) కారణము. సత్త్వగుణాధిక్యమునుండి బ్రాహ్మణస్వభావము ఉద యించును. రజోగుణము ప్రధానముగను, సత్త్వము అప్రధానముగను ఉండే అంతఃకరణ మునుండి క్షత్రియస్వభావము ఉదయించును. వైశ్యునిలో కూడ రజోగుణమే ప్రధానముగా నున్ననూ, తమోగుణము అప్రధానముగ నుండును. శూద్రునిలో తమోగుణము ప్రధానము గను, రజోగుణము అప్రధానముగను ఉండును. బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రుల యథార్థ మగు నిర్వచనము ఇదియే. ఈ నిర్వచనము విశ్వజనీనము. ఈ నాల్గు రకముల జనులు లేని సమాజము ఏది గలదు ? ఒకానొక వ్యక్తిలో సత్త్వము, రజస్సు, లేక తమోగుణము ప్రధానముగానున్నదని తెలియుట ఎట్లు ? ఆతని ప్రవర్తనను బట్టి కొంత సూచన లభించు ను. సత్త్వగుణప్రధానుడగు వ్యక్తిలో శాంతస్వభావము మరియు ప్రసన్నత ఉండును. రజస్సు ప్రధానముగను, సత్త్వము అప్రధానముగను ఉన్న వ్యక్తి ఎక్కడ ఉన్ననూ, అతిసహజముగా అక్కడి పరిస్థితులను ఆయోజన చేసి నాయకత్వము వహించును. స్వార్థపరత్వము, పేరాస ఇత్యాది గుణములు అధికముగానున్న వ్యక్తిలో రజస్సు ప్రధాన ముగను, తమస్సు అప్రధానముగను ఉన్నదని తెలియవలెను. మోహము, జాడ్యము ఇత్యాది గుణములు అధికముగా నున్నచోట తమస్సు ప్రధానగుణము. ఈ స్వభావములకు గుణములు హేతువులు అగుచున్నవి. ఈ స్వభావములు ఆయా వ్యక్తులయందు కొన్ని రక ముల ప్రవృత్తులకు ప్రేరకములగుచున్నవి.

శ్రీశంకరులు స్వభావశబ్దమును మరియొక విధముగా కూడ వ్యాఖ్యానించిరి. స్వభా వమనగా ప్రారబ్ధము. సమస్యలన్నియు దానితోడనే ఆరంభమగును. ఒక వ్యక్తి బ్రాహ్మణ కుటుంబములో జన్మించుటకు కారణమేమి ? ఒక జీవుడు జన్మించదగిన యోనిని ఆతని

ఖాతాలో జమ అయి ఉన్న కర్మసమూహము నిర్ణయించును. జీవుడు ఒక విశిష్టకుటుంబములో జన్మించి, కొన్ని విశిష్టవిధులను నిర్వహించే అధికారమును ఆతనికి ఆతని పూర్వకర్మ కల్పించును. విధిప్రధానమగు సమాజములో సర్వమానవులకు విధులు ఉండును. ఆ వ్యవస్థలో జీవుని జన్మను ఆతని పూర్వకర్మ నిర్ధారించును. కర్మసిద్ధాంతమునందు విశ్వాసము లేని వ్యక్తికి ఈ విషయములు సరిగా అవగాహనకు రావు. ఈ వ్యవస్థ లేని అమెరికా ఇత్యాది సమాజములలో విధిప్రధానమగు సామాజికవిభాగముయొక్క ప్రసక్తి ఉదయించదు. అట్టి సమాజములలో గుణము మాత్రమే పరిగణించబడును. కాని ఈ వ్యవస్థ ఉన్న సమాజములలో కర్మ వర్తించును. ఇట్టి స్థితిలో మానవుల విధులు నిర్వచించబడియుండును. ప్రతి మానవుడు తన విధిని నిర్వర్తించవలెను. 'భయహేతువగు పరధర్మమునునుష్ఠించుటకంటె స్వధర్మములో మరణించుటయే మేలు ( స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ) '. ఇట్టి వ్యవస్థ ఉపలభ్యమయ్యే పక్షములో, ఒక జీవుడు జన్మించవలసిన కుటుంబమును ఆ జీవుని కర్మ నిర్ణయించును. ఆతడు ప్రారబ్ధకర్మానుసారముగా ఆ జన్మలో కొన్ని విధులను అనుష్ఠించి, ప్రారబ్ధమును క్షయము చేసుకొనును. మానవుని త్రిగుణాత్మకమగు స్వభావము పూర్వజన్మకర్మలచే నిర్ణీతమగుచుండును. ఈ వ్యవస్థ లేని సమాజముల విషయములో కూడ మానవుడు తన ప్రారబ్ధకర్మాధీనముగా ఒక విశిష్టపరిస్థితిలో జన్మించును.

మానవుడు ఏ పరిస్థితిలోనికి జన్మించియున్ననూ, ఆతడు దానితో సంబంధము లేకుండగా యథోచితమగు పరిణతిని సంపాదించి బ్రాహ్మణస్వభావమును పొందుటకు యత్నించవలెను. ఒక వ్యక్తి జన్మను బట్టి మరియు కర్మను బట్టి క్షత్రియుడు అయి ఉన్ననూ, ఆతనిలో రజోగుణోద్రేకము ఉండుననే నియమము లేదు. ఆతడు యుద్ధవీరుడే అయిననూ, స్వభావముచే బ్రాహ్మణుడు కావచ్చును. శ్రీకృష్ణుడు అర్జుననకు అదే విషయమును చెప్పుచున్నాడు. నీవు నీ విధిని యోగ్యమగు మనఃప్రవృత్తితో ఆచరించినచో, నీవు బ్రాహ్మణుడవే అగుదువు. కాని, నీవు నీ విధిని విడనాడి మరియొక విధిని చేపట్టుటచే బ్రాహ్మణుడవు కాబోవు. నీవు ఉన్న స్థానములో ఉంటూ నీ విధిని నీవు చేసినచో, బ్రాహ్మణుడగుటకు అది చాలును. మనిషిని మార్చేది స్వభావపరివర్తనమే గాని, స్థానపరివర్తనము లేక విధిపరివర్తనము కాదు. ఈ సారభూతమగు విషయమును మనము రాబోవు పుటలలో చూడనున్నాము.

ఒక వ్యక్తిలో సత్త్వగుణము అధికముగా నున్నచో, అది వానియందు ఏ రూపములో అభివ్యక్తమగును ?

**అధ్యాయము 18 , శ్లోకము 42 :**

शमो दमस्तपश्शौचं क्षान्तिरार्जवमेव च ।

ज्ञानं विज्ञानमास्तिक्यं ब्रह्मकर्म स्वभावजम् ।। ४२ ।।

శమో దమస్తపశ్శౌచం క్షాంతిరార్జవమేవ చ

జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్ ( 42 ).

\

**శమః** = అంతరింద్రియనిగ్రహము, **దమః** = బాహ్యేంద్రియనిగ్రహము, **తపః** = తపస్సు, **శౌచమ్** = ( బయట మరియు లోపల ) పరిశుభ్రత, **క్షాంతిః** = సహనము, **ఆర్జవమ్** = తిన్ననైన స్వభావము, **చ** = మరియు, **ఏవ** = నిశ్చయముగా, **జ్ఞానమ్** = జ్ఞానము, **విజ్ఞానమ్** = వంటబట్టిన జ్ఞానము, **ఆస్తిక్యమ్** = వేదవాక్యమునందు ప్రమాణబుద్ధి, **స్వభావజమ్** = స్వభావమునుండి పుట్టిన, బ్రహ్మకర్మ = బ్రాహ్మణుని విధి.

అంతరింద్రియనిగ్రహము, బాహ్యేంద్రియనిగ్రహము, తపస్సు, బయట మరియు లోపల పరిశుభ్రత, సహనము,తిన్ననైన స్వభావము, పరోక్ష జ్ఞానము, ప్రత్యక్షజ్ఞానము మరియు వేదవాక్యమునందు ప్రమాణబుద్ధి అనునవి నిశ్చయముగా బ్రాహ్మణుని విధులు అగుచున్నవి ( 42 ).

ఈ వర్ణన కేవలము గుణమును గురించి మాత్రమే ననియు, దీనిలో కర్మయొక్క ప్రస్తావన లేదనియు గమనించవలెను. శాస్త్రముయొక్క తాత్పర్యమేమనగా ప్రతి వ్యక్తి గుణముచే బ్రాహ్మణుడు కావలెను. శాస్త్రమునకు వ్యక్తియొక్క ఎదుగుదలకు దోహదపడుటయందు మాత్రమే తాత్పర్యము కలదు. కర్మలను నిర్వచించుట శాస్త్రతాత్పర్యము కాదు. ప్రతి మానవుడు తన విధిని ఒక విశిష్టమగు మనఃప్రవృత్తితో నిర్వర్తించి స్వభావముచే బ్రాహ్మణుడు కావలెననునదియే శాస్త్రతాత్పర్యము. ఒక వ్యక్తి తాను ఉన్న పరిస్థితిలో తన యెదుట కర్తవ్యవిధిరూపములో సంప్రాప్తమైన కర్మను ఆనందముగా అనుష్ఠించుచున్నచో, ఆతనికి మనఃపరిపక్వత లభించునని శ్రీకృష్ణుడు తరువాత చెప్పబోవుచున్నారు ( *స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః* ). జన్మతః సంప్రాప్తమైన కర్మ మానవునకు అభీష్టమైనచో ఆతని మానసికమగు పరిపక్వతకు అది చాలును. అట్లుగాక, ఆతడు ధనమును లేదా అధికారమును సంపాదించ గోరినచో, ఆతడు తాను ఉన్న పరిస్థితిలో మార్పును సాధించవలెను. కాని ఆతడు మనఃపరిపక్వతను మాత్రమే కోరువాడైనచో, ఆతడు ఉన్న స్థితిని దాటి బయటకు వెళ్లవలసిన పని లేదు. మనఃపరిపక్వతకొరకై పరిస్థితిని గాని, వృత్తిని గాని మార్చవలసిన పని లేదు. ఉన్న స్థితిలోననే సర్వము సుసంపన్నమై యున్నది. ఏలయన, లక్ష్యము మనఃపరిపక్వత అయినప్పుడు అభివృద్ధి అంతయు అంతరంగమునందు మాత్రమే కలుగును.

ఈ మనఃపరిపక్వతను సాధించుటకు శ్రుతి విశ్వజనీనమైన ఒక ఉపాయమును బోధించుచున్నది. ఆ ఉపాయము ఇచట వివరించబడినది. వైయక్తికమైన ఎదుగుదలకు ఉపాయము ఆ వ్యక్తికి ఉన్న సమస్యలను బట్టి వ్యక్తి వ్యక్తికీ మారుచుండును. ఒక వ్యక్తికి ఉపకరించిన ఉపాయము మరియొక వ్యక్తికి సరిపడకపోవచ్చును. కాని, ఇచట సర్వమానవులకు వర్తించే ఉపాయము బోధించబడుచున్నది. నీవు నీ కర్తవ్యమును యోగ్యమగు మనఃప్రవృత్తితో, అనగా ఈశ్వరార్పణబుద్ధితో అంతఃకరణశుద్ధి కొరకై ఆచరించుము. కర్మయోగమనగా నిదియే. దీనిని అభ్యసించే కర్మయోగికి రాగద్వేషములపై నియంత్రణ ఏర్పడుటచే ఆతడు పరిణతిని గాంచును. ఆతడు స్వభావముచే బ్రాహ్మణుడగును. దీనిని సాధించుటకై మానవుడు శ్రద్ధ పెట్టవలసిన విషయములు ఏవి ?

ఈ శ్లోకములో బ్రహ్మకర్మ యనగా బ్రాహ్మణునకు సంబంధించిన కర్మ; అనగా ంషివి బ్రాహ్మణునిగా తీర్చిదిద్దే కర్మ. మానవుడు స్వభావమునుండి పుట్టే ఈ బ్రాహ్మ త్వమును పెంపొందించుకొనవలెను. ఈ బ్రాహ్మణస్వభావమునకు ఆలంబనమగు అంశ ులేవి ? మొదటిది శమము. అనగా మనిషికి తన ఆలోచనలపై గల నియంత్రణ అని ధము చూచియున్నాము. మనము స్వీయ-అవగాహనలకు మరియు ఆలోచనలకు ధ్యలో తగినంత అంతరమును పొందియుండవలెను. అట్టి స్థితిలో ఒక భావావేశము లేదా మోహము గాని వ్యక్తిని తన వెంట పడునట్లు చేయజాలదు. తనకు తన ంతఃకరణమునకు మధ్యలో అట్టి అంతరమును ఆవిష్కరించుకున్న వ్యక్తిలో శమము లకొని యుండును. శమమనగా ఆలోచించే ప్రక్రియను ప్రక్కకు నెట్టివేయుట కాదని లుసుకొనుట చాల ముఖ్యము. అది సంభవము కాదు ; మరియు అభీష్టము కూడ కాదు. ోచనాప్రవాహము కొనసాగుతూ ఉంటుంది. కాని ఏదో ఒక ఆలోచనను పట్టుకొని దాని ంట పడరాదు. మనస్సులో ఉదయించే ఆలోచనలలో దేనిని స్వీకరించవలెను ? దేనిని రాకరించవలెను ? అనే విషయములో స్వాతంత్ర్యమును కలిగియున్న వ్యక్తికి శమము ోని ఆనందము స్వంతమగును. ఆ లక్షణమును చేపట్టి అభ్యసించు వ్యక్తికి అది సహజ స్వభావముగా తయారగును.

అదే విధముగా నియంత్రించదగిన ఇంద్రియావేశములను నియంత్రించుట దమము నబడునని మనము ఇదివరలో చూచియున్నాము. మనోవాక్కాయములతో పాటించే ధార్మిక-అనుశాసనము తపస్సు అనబడునని ఇదివరలో వివరించబడినది. తరువాతి లక్షణము శౌచము. ఇది బాహ్యము మరియు ఆంతరము అని ద్వివిధము. మానవుడు ద్వేషము ఇత్యాది దుఃఖహేతువులగు భావావేశములను, వాటికి విరుద్ధమగు మనోవృత్తిని భావన చేసి ప్రభావహీనముగా చేయుటను అభ్యసించవలెను. సాధకుడు ఈ ప్రవృత్తిని నిత్యము అభ్యసించవలెను. ప్రతిదినము మనము దేహమును శుభ్రము చేసినట్లే మన స్సును కూడ శుభ్రము చేయుచుండవలెను. ఈ అంతశ్శౌచమును ఉపేక్ష చేయరాదు. ఒక వ్యక్తిపై ద్వేషము ఉన్నచో, క్షమాగుణమును అలవరచుకొని దానిని త్రోసిపుచ్చవలెను. అదే విధముగా ఇతరములగు నకారాత్మకభావావేశములను సరియగు అవగాహనను పెంపొందించుకొని త్రోసిపుచ్చవలెను. అట్లు చేసినచో, ద్వేషము స్థానములో క్రమముగా ప్రేమ, స్నేహము మొదలగునవి నెలకొనును. ఆరంభములో ఇతరులయెడ సహనశక్తిని అభ్యసించవలెను. వ్యక్తులను మార్చే ప్రయత్నమును చేయకుండగా, వారిని నియం త్రించే ప్రయత్నమును చేయకుండగా, వారిని యథాతథముగా అవగాహన చేసుకొనే ప్రయత్నమును చేయవలెను. సాధారణముగా మనము గీసే హద్దులలో జనులు అందరు మసులుకోవాలని మనము ఆకాంక్షిస్తాము. కాని మనము వాస్తవముగా ఆ హద్దులను పరి లించినచో, మారవలసినది ఇతరులు కాదనియు, నేనేననియు స్పష్టమగును. కొన్ని సం ర్భములలో న్యాయము నీ పక్షమునందు మాత్రమే గలదని అనిపించును. కాని, ఆవ వ్యక్తియొక్క గతము మరియు ఆతని స్వభావము అను వాటి దృష్టికోణములో పరికిం నచో, న్యాయము ఆతని పక్షములో కూడ గలదని స్పష్టమగును. ఆతడు ఆ విధము

ప్రవర్తించుటకు కారణము ఆతడు మరియొక విధముగా ప్రవర్తించ లేకపోవుటయే. ఆతడు మరియొక విధముగా ప్రవర్తించ గల్గినచో, తప్పక అటులనే చేసియుండెడివాడు. ఇది చాల సరళమైన విషయము. ' అట్లు కాదు ; ఆతడు మరియొక విధముగా ప్రవర్తించగలడు. కాని ఇష్టము లేకపోవుట చేతనే ఇట్లు చేసినాడు ' అని నీవు అన్నచో, సరే. ఆతనిలో ఆ ఇష్టము లేకపోవుట కూడ ఆతడు ప్రవర్తించే తరహాలో భాగమై యున్నది. ఆతడు ప్రవర్తించే ఈ తరహాకు మూలములో ఆతని గతము ( పూర్వపీఠిక ) మరియు స్వభావము ఉన్నవి. కావున, ఇతరుల ఇచ్ఛకు వారిని వదిలి పెట్టువానికి శాంతి లభించును. అట్టి శాంతి నీకు అభీష్టము కానిచో, నీవు ఇతరుల గురించి చింతిల్లుచుండవచ్చును.

మనస్సు, వాక్కు మరియు క్రియ అను వాటి మధ్య ఉండే సారూప్యమునకు ఆర్జవమని పేరు. నీ మనస్సులోని ఆలోచనల నన్నింటినీ పైకి చెప్పవలసిన పని లేదు. కాని, చెప్పే మాట ఆలోచనకు సరిపడు విధముగా నుండవలెను. ఇంతేగాక,చేసే పని చెప్పిన మాటకు ఖచ్చితముగా సరిపడవలెను.ఇచట జ్ఞానమనగా ధర్మాధర్మవివేకము. ఇది శాస్త్రాధ్యయనము వలన లభించును. కాని కేవలజ్ఞానము చాలదు. మనకు జీవనమూల్యములను గురించి పూర్తిగా తెలియును. కాని ఈ ఎరుక మాత్రమే చాలదు. దానిని వంట బట్టించుకొనవలెను ( విజ్ఞానమ్ ). ఆత్మసాత్ చేసుకొనబడిన( assimilated ) జీవనమూల్యమునకు, వ్యక్తిత్వమునకు మధ్యలో అంతరము లేదు గనుక, దానివలన మనస్సులో సంఘర్షణ చెలరేగదు. కాని జీవనమూల్యమును గురించి కేవలజ్ఞానము మాత్రమే ఉండి, అది వంట బట్టనిచో, అది ఇతరులు అనుసరించదగిన ఆదర్శముగా మిగిలి పోవునే గాని, దాని వలన ఆ వ్యక్తికి ప్రయోజనము ఉండదు. మనము ఇతరులనుండి నూటికి నూరు శాతము నీతిమంతమగు ప్రవృత్తిని అపేక్షించెదము. అనగా ప్రతి వ్యక్తిలో జ్ఞానము గలదని స్పష్టమగుచున్నది. కాని స్వీయప్రవృత్తి వద్దకు వచ్చుసరికి, 'తరచుగా' ఆ జీవనమూల్యములను వంటబట్టించుకోని కారణముగా సమస్యలు ఉదయించును. కొన్ని సందర్భములలో ఒక జీవనమూల్యము వంటబట్టి యున్ననూ, దానికి విరుద్ధమగు పాత అలవాటు ఇంకనూ కొద్దిగా మిగిలియుండవచ్చును. కావుననే, 'తరచుగా ' అని ప్రయోగించడమైనది. కాని జీవనమూల్యమును పూర్తిగా వంటబట్టించుకున్న పక్షములో పాత అలవాటును త్రోసిపుచ్చుటలో క్లేశము ఉండదు. అట్లు గాక, జీవనమూల్యము ఆత్మసాత్ కానిచో, వ్యక్తియొక్క ప్రవృత్తి ఆతని జీవనమూల్యజ్ఞానమునకు విరుద్ధముగా నుండుటచే హృదయములో సంఘర్షణ ఏర్పడును.

అట్లైనచో, ఆ జీవనమూల్యమును ప్రక్కకు బెట్టి సంఘర్షణకు దూరము కావచ్చును గదా ? ఎవరైననూ ఇట్లు వాదించినచో, ఆతని కాళ్లపై బూటు కాళ్లతో త్రొక్కవలెను. అపుడాతనికి అహింసయొక్క విలువ అవగతమగును. నేను నా బూటు కాళ్లతో ఆతని పాదములను త్రొక్కుట ఆతనికి అంగీకారమైనచో, నేను ఆతని వాదమును అంగీకరించెదను. నేను ఆతని పాదములను త్రొక్కుట ఆతనికి అంగీకారము కానిచో, అందరికి సర్వప్రాణులకు వర్తించే సర్వసాధారణజీవనమూల్యము ఒకటి కలదని స్పష్టమగుచున్నది. అది సమాజము ఒక వ్యక్తియొక్క నెత్తిపై రుద్దిన వైయక్తికమూల్యము కాదు. సర్వప్రాణులకు వర్తి

న్నూ, సర్వమానవులకు తెలిసియున్న జీవనమూల్యసంరచన ఒకటి గలదు. ఈ అహింస కూడా దానిలో అంతర్భాగమై యున్నది. ఈ సంరచనయే ధర్మమనబడును. ఈ సంరచన మన ప్రవృత్తులలో పలు రూపములలో వ్యక్తమగుచున్ననూ, ధర్మము ఒక్కటియే. ఆ ప్రకృతిలోని నియతికి, సృష్టిలో అంతర్లీనముగానున్న ఆ సమరసతకు విరుద్ధమైనది ఏదైనా అధర్మమనబడును. కావున, ఈ సృష్టిలో ధర్మము అనేది ఒకటి గలదు. దానిని స్వంతము చేసుకొని పాటించని వారికి సంఘర్షణ అనివార్యమగును.

ధర్మము విషయములో జ్ఞానవిజ్ఞానముల మధ్యలో ఈ అంతరము కలదు గదా ! ఆత్మజ్ఞానము విషయములో పరిస్థితి ఎట్లుండును ? ఆత్మజ్ఞానప్రకరణములో ప్రయోగించ బడిన జ్ఞానమ్, విజ్ఞానమ్ అనే ఈ రెండు పదములు ఆధునిక కాలములో మాత్రమే గాక, చారిత్రకముగా కూడ వేదాంతముయొక్క అపవ్యాఖ్యానమునకు ఆలంబనమైనవి. ముందుగా శ్రుతినుండి ఆత్మయొక్క పరోక్షజ్ఞానమును పొందవలెననియు, తరువాత దానిని ప్రత్యక్షము చేసుకొనవలెననియు ఆధునిక వేదాంతులు చెప్పుచున్నారు. వాస్తవములో ప్రత్యక్షము చేసుకొనవలసిన ఆత్మ వేరుగా లేదు. అది నీవే ( తత్ త్వం అసి ). నీవు బ్రహ్మను ప్రత్యక్షము చేసుకొనవలెనని శ్రుతి చెప్పుట లేదు. నీవే బ్రహ్మవని శ్రుతి చెప్పుచున్నది. ఈ రెండింటికి మధ్యలో చాల వ్యత్యాసము గలదు. ఆనందమయమగు ఆత్మ ఒకటి గలదనియు, దానిని మనము ప్రత్యక్షము చేసుకొనవలెననియు ఆధునిక వేదాంతులు చెప్పే వచనము సత్యదూరము.

బ్రహ్మ అనబడే సృష్టికారణము ఒకటి గలదనియు, ఆ బ్రహ్మ ఈ స్వయంప్రకాశ-ఆత్మయేననియు శ్రుతి చెప్పుచున్నది. అట్టి ఆత్మయొక్క జ్ఞానము అపరోక్షమే గాని పరోక్షము కాజాలదు. బ్రహ్మ కలదు అని మాత్రమే మనము తెలుసుకున్నచో, దానికి మనము పరోక్షజ్ఞానమని పేరు పెట్టిననూ, అది వాస్తవములో శ్రద్ధ మాత్రమే. ఈ రకం జ్ఞానము వెనుక కొంత యుక్తి కూడ ఉండవచ్చును. కాని ఇది యథార్థమగు బ్రహ్మజ్ఞానము కాదు. ఏలయన, బ్రహ్మ ఆత్మయే. అట్టి స్థితిలో బ్రహ్మను ఒక వస్తువును వలె పరోక్షముగా తెలుసుకొనుట ఎట్లు సంభవమగును ? బ్రహ్మ అనే వస్తువు ఏదీ లేదు. ఆత్మ కంటె భిన్నమైన బ్రహ్మజ్ఞానము ఏదీ లేదు. బ్రహ్మ అనేది ఒక పదము అనియు, దానికి జగత్కారణము అని అర్థమనియు మాత్రమే తెలుసుకున్నచో, అది హానికరము గాని శ్రద్ధయే గాని, యథార్థజ్ఞానము కాదు. లేదా, అది కూడ స్వర్గజ్ఞానము వంటి పరోక్షజ్ఞానము అగును. అయితే, ఈ రెండు విశ్వాసములలో ఒక తేడా గలదు. స్వర్గము ఉన్నదా ? లేదా ? అను విషయమును నిర్ధారించుటకు నేను కొంతకాలము వేచియుండవలెను. కాని ఈ క్షణములో కూడ జగత్తు బ్రహ్మయే గనుక, ఆ విషయమును నేను తెలుసుకున్నచో, నేను బ్రహ్మను ఇప్పుడే తెలియవచ్చును. ' జగత్తు బ్రహ్మ ఎట్లు అగును ? నాకు కనబడేది జగత్తు మాత్రమే. బ్రహ్మ కాదు. నాకు ఈ విషయము తెలియకున్నది ' అని నీవు అన్నచో, అది శ్రద్ధయే యగును గదా ! ' బ్రహ్మ జగత్కారణము. కావున, ఈ జగత్తు బ్రహ్మయే ' అని నీవు అన్నచో, బ్రహ్మను గురించి నీకు కొంత అవగాహన గలదని చెప్పవచ్చును. కాని ఇది కూడ యథార్థమగు జ్ఞానము కాదు. ఏలయన, బ్రహ్మ యనగా ఆత్మ

యే. కావున, ఈ జ్ఞానమును 'ఆ బ్రహ్మను నేనే' అనే అపరోక్షజ్ఞానములోనికి మార్చు కొనవలెను. అట్లు గాక, ఈ జ్ఞానము ఉండియు, నాకు నా గురించి కొన్ని సంశయములు గాని, విపరీతభావనలు గాని ఉన్నచో, వాటిని క్రమముగా మననినిదిధ్యాసనలచే నివారణ చేసుకొనవలెను. అట్లు చేయుటవలన, ఈ జ్ఞానమునకు విరుద్ధముగా నుండే సంశయము, అస్పష్టత, భ్రమ, పాత అలవాటు వలన వచ్చే అభిముఖ్యము ( orientation ) అను దోషములనుండి జ్ఞానము విముక్తమగును. ఆత్మవిషయములో జ్ఞానమునకు, విజ్ఞానము నకు మధ్య గల భేదము ఈ విధముగా నున్నది.

మనమిచట బ్రాహ్మణకర్మను చూచియున్నాము. అతడు జ్ఞానమును పొంది దానిని విజ్ఞానముగా మార్చుకొనుటకు కావలసిన ప్రయత్నమునంతనూ చేయవలెను. అనగా అతడు గురువువద్దకు వెళ్లి ఆయన వద్ద కూర్చుండి కొంత కాలమును అధ్యయనములో గడుపవలెను. సంశయము, అస్పష్టత మరియు భ్రాంతి అను దోషములకు తావు లేని విధ ముగా సుస్పష్టమగు జ్ఞానము లభించుటకై ఆవశ్యకమగు ప్రయత్నమునంతనూ అతడు చేయవలెను. జ్ఞానము తనంత తానుగా ఆకాశమునుండి ఊడిపడదు. దానికొరకై కొంత ప్రయత్నము ఆవశ్యకమగును.

శాస్త్రము సరియైన జ్ఞానసాధనము అనే అంగీకారము ( ఆస్తిక్యమ్ ) ఉన్నప్పుడు మాత్రమే ఈ సర్వము సంపన్నమగును గదా ! అది లేనిదే, జ్ఞానము గాని, విజ్ఞానము గాని సంభవము గావు. ఆస్తిక్యము అనగా సచ్చిదానంద-ఆత్మయొక్క జ్ఞానము కాదు. ఈ స్థూలదేహము నశించిననూ, నశించని ఆత్మ ఒకటి గలదనియు, మనము చేసే కర్మలకు పుణ్యపాపరూపమైన అదృష్టఫలము గలదనియు స్వీకరించుటయే ఆస్తిక్యము అగును. అట్టి ఆస్తిక్యము గల వ్యక్తికి నైతికజీవనముయొక్క విలువ తెలియును. దాని ప్రభావముచే అతని మనస్సు పరిపక్వమగును. దానివలన అతడు తన స్వరూపమును గురించి విచారిం చనారంభించును. ఆస్తికుడు గనుక శాస్త్రము ఆత్మజ్ఞానసాధనమని అతడు స్వీకరించును. శాస్త్రముయొక్క ఉపదేశము వెనువెంటనే అతనికి తెలియకపోయినా అది యథార్థమని అతడు స్వీకరించి దానిని తెలుసుకొనే ప్రయత్నమును చేయును. శాస్త్రోపదేశము అతనికి తెలిసిపోయిన తరువాత అతనియందు ఉండేది జ్ఞానమే గాని ఆస్తిక్యము కాదు. స్వర్గము ఇత్యాది నిత్యపరోక్షములగు వాటి విషయములో అతనియందు ఆస్తిక్యము కొనసాగుచుం డును. కాని ఆత్మజ్ఞానము కలిగిన వ్యక్తికి శ్రద్ధ అప్రస్తుతమగును. మతపరమగు విశ్వాస ములకు మరియు వేదాంతమునకు మధ్యలో గల ప్రముఖమగు భేదమిదియే.

నీవు పాపివి అనియు, దానికి కారణము నీవు పూర్వములో చేసిన కర్మ గాదనియు, నీ జన్మ నిష్కలంకము కాకపోవుటయే నీవు పాపి యగుటకు కారణమనియు, నీవు దీనిని విశ్వసించవలయుననియు ఒక మతము బోధించుచున్నది. ఇంతవరకు విశ్వసించిన వ్యక్తి ఆ పాపము పోవుటకు ఆ మతమును స్వీకరించవలయుననే బోధను కూడ విశ్వసించవ లసి యుండును. నీవు ఈ జన్మలో చేసిన పాపములను మతబోద్ధ యెదుట ప్రకటించి పశ్చాత్తాపమును పొందుట ద్వారా పోగొట్టుకొనవలయునని కూడ వారు బోధింతురు. సాధా రణముగా జనులకు ఈ రెండవ బోధయందు కంటె మొదటి బోధయందు విశ్వాసము

అధికముగా ఉన్నట్లు కన్పట్టును. ఒక నాడు ఈ విధముగా అపరాధస్వీకారము (confession ) ను చేసియూ ఇంకనూ తాను పాపిననే ధారణ గల వ్యక్తి ఒకడు నన్ను సంప్రదించినాడు. తాను పాపిననే ఈ ధారణ తొలగిపోయే ఉపాయమును తెలియుటకై అతడు నా వద్దకు వచ్చినాడు. అనగా తాను పాపిననే భావనయందు ఆతనికి గల విశ్వాసము ఈ అపరాధ స్వీకృతియందు గల విశ్వాసము కంటె అధికమని స్పష్టమగుచున్నది. ఈ రెండు విశ్వాసములకు మతబోధయే ఆధారము. మరణించిన వ్యక్తి స్వర్గమునకు పోవుటకై ఆతని దేహమును పాతిపెట్టవలయుననియు, మరణించిన తరువాత భగవానుడు నీపై తీర్పును చెప్పుననియు, ఈ సంగతులను విశ్వసించని వారు స్వర్గమునకు అర్హులు కారనియు ఇత్యాదిగా అనేకవిశ్వాసములు గలవు. కనీసము భగవానుడు ఒక్కడైననూ నా తప్పులను పరికించడనియు, నేను ఆయన వద్దకు యథాతథముగా నిష్కపటహృదయముతో వెళ్లవచ్చుననియు, ఆయన నన్ను పూర్ణముగా అనుగ్రహించుననియు ఇంతకాలము భావిస్తూ వచ్చితిని. కాని, ఈ సర్వమును సృష్టించిన వాడు తానే అయినా, ఆయన తీర్పును చెప్పి కొందరిని మాత్రమే రక్షించుననియు, మరికొందరిని నరకములో పడవేయుననియు నాకు ఇప్పుడు తెలిసినది. అట్టి భగవానుడు లేకపోవుటయే మనకు మంచిది. సామాన్యమానవుడైననూ అంతకంటె నయమని తోచును.

ఆస్తిక్యబుద్ధి అనబడే ఈ శ్రద్ధ వేరు ; ఆ శ్రద్ధ వేరు. ఏలయన, ఇచట శాస్త్రము 'నీవు బ్రహ్మవు కాబోతావు ' అనే హామీని ఇచ్చుట లేదు. నీవు బ్రహ్మవు అని శాస్త్రము చెప్పుచున్నది. 'నాకు అట్లు అనిపించుట లేదు' అని నీవు చెప్పవచ్చును. అది సరియే. కాని శాస్త్రము ఆ విధముగా బోధించుచున్నది. ఆస్తిక్యబుద్ధి గలవాడు ఆ సత్యమును తెలుసుకొనే ప్రయత్నమును చేయును. ఆత్మ బ్రహ్మయే అను సత్యము ఈ జీవితములో తెలుసుకొన దగినది గనుక, ఈ శ్రద్ధయొక్క స్వరూపము విలక్షణమైనది. ఇది శాస్త్రము యొక్క సత్యత్వమునందు, బోధకత్వసామర్థ్యము ( ప్రామాణ్యము ) నందు గల శ్రద్ధ. దీనివలన శాస్త్రవచనములు తమ పనిని చేయుటకు కావలసిన మనఃప్రవృత్తి జిజ్ఞాసువు నందు నెలకొని, తద్ద్వారా శాస్త్రము వలన సిద్ధించవలసియున్న అద్భుతము సిద్ధించును.

శాస్త్రము జ్ఞానసాధనము ( ప్రమాణమ్ ). కావున, అది ఇతరప్రమాణనిరపేక్షముగా తన పనిని తాను చేయవలెను. ప్రమాణము ఏదైనా, పని చేసే తీరు ఇదియే. కన్నులు మాత్రమే చూడగలవు. చెవులు మాత్రమే వినగలవు. కన్నులు చూడగలవు గనుక, చెవులు వినలేవని అనుకోరాదు. చెవులు వినగల్గుచున్నవి గనుక, కన్నులు చూచే రూపము అసత్యమనుకోరాదు. ఇవి రెండు స్వతంత్రప్రమాణములే. ఇవి మన అనుమతికొరకు ఎదురుచూడకుండగా స్వతంత్రముగా తమ పనిని చేయుచుండును. కన్నులు రూపజ్ఞానమును మాత్రమే అందీయగా, చెవులు శబ్దజ్ఞానమును మాత్రమే కలిగించును. మనకు నచ్చినా, నచ్చకపోయినా, ఒక జ్ఞానేంద్రియము ఒక విశిష్టవిషయవస్తువుయొక్క జ్ఞానమును అందించుచుండును. ధ్యానము చేసే సమయములో చెత్తను కొనిపోయే మోటారుయొక్క శబ్దమును వినాలని ఎవరు కోరుకొనును ? కాని, శబ్దమును అందజేసే ముందు చెవులు మన అనుమతిని తీసుకోవు. అవి స్వతంత్రముగా తమ పనిని చేసుకొని పోవుచుండును. పరామ

ర్యజ్ఞానము ( invariable concomittance ) ఉన్నచోట అనుమానప్రమాణజన్యజ్ఞానము ( inferential knowledge ) కూడ తనంత తానుగా ఉదయించును. పొగ కానరాగానే నిప్పు ఉన్నదని తెలియును. ఒక విశిష్ట శబ్దమును వినగానే మోటారు వెళ్లుచున్నదని తెలియుచుండును. ఇట్టి నిర్ణయములు వెనువెంటనే కలుగుచుండును.

ఇతరజ్ఞానములన్నింటివలె ఈ ఆత్మజ్ఞానము కూడ ఉదయించవలసిన స్థానము మనస్సే గాని మరియొకటి కాదు. మనస్సును దాటిపోయి ఆత్మ-అనుభూతిని పొందవలెనని కొందరు చెప్పెదరు. మనస్సును దాటిపోతే వచ్చేది నిద్రయే గాని జ్ఞానము కాదు ! సర్వానుభూతులకు ఆశ్రయమగు ఆత్మ అనుభూతివిషయమగుట ఎట్లు సంభవమగును ? మనస్సునకు అతీతుడగుటయే జ్ఞానము అనే పక్షములో, మానవుడు నిద్రనుండి జ్ఞానియై బుద్ధుడై లేవవలసియుండును. కాని నిద్రపోయి జ్ఞానియైన మానవుడు లేనే లేడు. జ్ఞానము ఉదయించవలసినది మనస్సులోననే గాని మరియొక చోట కాదు. ఆత్మకు జ్ఞానముచే తొలగించుకొనవలసిన బంధము ఏదియు లేదు గనుక దానికి జ్ఞానముతో పని లేదు. ఆత్మ నిత్యముక్తము. దేహమునకు ' నేను ' అనే ధారణ ( ఆత్మబుద్ధి ) లేకుండుటచే, 'నేను మరణిస్తాను' అనే భయము గాని ఇతరసమస్యలు గాని దానికి లేవు. అది జడము గనుక దానికి ఇబ్బందులేమియు లేవు. మనస్సునకు కూడ సమస్యలు ఏమియు లేవు. అది కేవలము జ్ఞానమును సేకరించే కరణము మాత్రమే. అల్పత్వము మరియు పరిచ్ఛిన్నత్వము వలన వచ్చే సమస్యలు ఏమియు దానికి లేవు. అట్లైనచో, ఈ సమస్యలు ఎవరికి ? బుద్ధియందు మోహము కలదు. అది ఆత్మతత్త్వమును యథాతథముగా గుర్తించలేక పోవుటయే ప్రధానసమస్య. ఈ సమస్యను పరిష్కరించే ఉపాయమేది ?

కేవల- అనుభవము మనకు నేర్పగలిగే పాఠము ఏదియు లేదు. మనము అనుభవమును సరియైన రీతిలో వ్యాఖ్యానించుకోగలిగితే, దానినుండి కొంత నేర్చుకునే అవకాశము గలదు. ఆ వ్యాఖ్యానము నీకు ఇప్పటికే గల జ్ఞానముపై ఆధారపడి యుండును. ఒక వ్యక్తి తనకు అప్పటివరకు గల జ్ఞానమును దాటి అనుభవమునకు అర్థమును నిర్ణయించుట సంభవము కాదు. నాకు నా గురించి నేను మూర్ఖుడను అని మాత్రమే తెలిసియున్నచో, నేను అనుభవమును వ్యాఖ్యానించిన ప్రతిపర్యాయము నా మూర్ఖత్వము మరింత అధికముగా నిర్ధారితమగుచుండును. మానవునికి గల ఈ నిస్సహాయ పరిస్థితి స్పష్టమగుచునే యున్నది. కావున, మనము వేదమును ఒక స్వతంత్రప్రమాణరూపములో స్వీకరించవలెను. అనగా నేమి ? నేను ఒక స్ఫటికమును చూపించి ఇది కుందేలు అని చెప్పినాననుకొనుడు. మీ స్వామి సత్యమును పలుకుననుకొనుటలో ఒక ఆనందము గలదు. కనీసము స్వామియైననూ సత్యమును పలుకుననే నమ్మకము జనులకు ఊరటనిచ్చును. కాని, నేను అది కుందేలు అని చెప్పి ఊరుకోకుండగా, దాని రంగు మొదలగు వాటిని వర్ణించి, కదలకుండగా కూర్చుండుమని దానితో చెప్పినాననుకొనుడు. మీరు ఏమని భావించెదరు ? అది కుందేలు అని నమ్మాలని మీ మనస్సులో ఉన్నా, మీరు నమ్మజాలరు. ఎందువలన ? అది మీ ప్రత్యక్షజ్ఞానమునకు విరుద్ధము గనుక. ఒక వస్తువు విష

సంశయము ఉన్నప్పుడు, ప్రమాణము మాత్రమే దానిని పోగొట్టగలదు. కాని ఈ
దర్భములో నేను చెప్పిన వచనము ప్రత్యక్షప్రమాణమునకు విరుద్ధముగా నున్నది.
మీకు కన్ను విషయములో గల దృష్టికోణమును పరికించుడు. ఇది చాల అద్భుత
విషయము. వేదము విషయములో కూడ మన దృష్టికోణము అటులనే ఉండవలెను.
అనగా నిదియే. ఇట్టి శ్రద్ధ ఉన్నప్పుడు మాత్రమే శబ్దము తన పనిని చేయగలదు.
గలవాడు జ్ఞానమును పొందును ( శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్ ) అని శాస్త్రము స్వయ
ుగా చెప్పుచున్నది. శ్రద్ధ యనగా గుడ్డి నమ్మకము కాదు. ప్రమాణము విషయములో
నకు గల దృష్టికోణమునకు శ్రద్ధ యని పేరు. ఆస్తిక్యమనగా నిదియే. వ్యక్తికి తన
ించి గల ధారణలన్నియు ఆస్తిక్యభావనచే త్రోసిపుచ్చబడును. నేను మరణిస్తాను అనే
రణ నాకు ఉండెడిది. కాని శాస్త్రవచనములను విన్న తరువాత ఆ ధారణ తప్పు అని
ు తెలిసినది. నీవు ఇటువంటి వాడవు, అటువంటి వాడవు అని మనస్సు నాకు పరిపరి
ధములుగా జన్మజన్మాంతరములనుండి చెప్పుచున్ననూ, జ్ఞానము ఒకే ఒక ఆఘాత
ుతో ఆ పరిస్థితిని పూర్తిగా మార్చివేయును. ఒకప్పుడు జనులందరు సూర్యుడు తూర్పు
ుండి పడమరకు పయనించునని భావించెడివారు. కాని అది సత్యము కాదని ఒకే ఒక
క్తి చెప్పెను. అతని మాటయే సత్యము. కావున అధికశాతము జనులు నమ్మే అభిప్రా
యము సత్యము కానక్కరలేదు. సర్వమానవాళి వ్యతిరేకించినా, ఒకే ఒక వ్యక్తియొక్క
వచనము సత్యము అగును. జ్ఞానముయొక్క మహిమ అట్టిది. భగవానుడే స్వయముగా
వచ్చి, సూర్యుడు తూర్పునుండి పడమరకు పయనించునని చెప్పిననూ, నేను ఆయనకు
బోధించే ప్రయత్నము చేయుదునే గాని, ఆయన మాటను అంగీకరించను. యోగ్యమగు
ప్రమాణము విషయములో మన దృష్టికోణము ఆ విధముగా నుండును. శాస్త్రము విషయ
ములో మన ధోరణి ఆ విధముగా నుండవలెను. ఆస్తిక్యమనగా నదియే.

మనము చర్చించుచున్న ఈ లక్షణములన్నియు బ్రాహ్మణునకు చెందినవి. వేదాం
తమునకు బ్రాహ్మణుడు అధికారి అను పరిగణనలోని అంతరార్థము ఇప్పుడు మీకు అవగ
తమై యుండును. బ్రాహ్మణుడగు వ్యక్తి ఈ లోకసాధారణమగు ఫలములయందు విరక్తిని
పొందును. అతడు కర్మలను చేసి వాటి ఫలములననుభవించినాడు. ఆ అనుభవమును
బట్టి నిత్యసిద్ధమగు మోక్షము కర్మానుష్ఠానముచే లభించేది కాదని అతనికి అవగతమైనది
( పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాత్, నాస్త్యకృతః కృతేన,
తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్ ) అని
ముండకోపనిషత్తు చెప్పుచున్నది. బ్రాహ్మణుడు అనుష్ఠించే కర్మలన్నియు ఈ వివే
కమును కలిగించుటకొరకు మాత్రమే ఉద్దేశించబడినవి. ఈ నిష్కర్షకు సర్వమానవులు
చేరుకొనవలెను.

ఆ స్థితికి చేరుకొనే లోపులో, ఈ మూడు గుణములు వివిధమాత్రలలో కలియుట
చే, వ్యక్తుల స్వభావములలో మరియు విధులలో కొన్ని నమూనాలు ఏర్పడినవి. రజో
ణము ప్రధానముగా మరియు సత్త్వగుణము అప్రధానముగా నుండే క్షత్రియుని స్వభా
వము మరియు కర్మయొక్క స్వరూపమును మనము ఇప్పుడు పరిశీలిద్దాము.

**అధ్యాయము 18 , శ్లోకము 43 :**

शौर्यं तेजो धृतिर्दाक्ष्यं युद्धे चाप्यपलायनम् ।

दानमीश्वरभावश्च क्षात्रकर्म स्वभावजम् ।। ४३ ।।

శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్

దానమీశ్వరభావశ్చ క్షాత్రకర్మ స్వభావజమ్ ( 43 ).

**శౌర్యమ్**= పరాక్రమము, **తేజః** = ఆత్మవిశ్వాసము, **ధృతిః** = దృఢసంకల్పము, **దాక్ష్యమ్** = చాతుర్యము, **చ** = మరియు, **యుద్ధే** = యుద్ధమునందు, **అపలాయనమ్** = పారిపోకుండుట, **అపి** = ఇంతేగాక, **దానమ్** = దానము, **చ** = మరియు, **ఈశ్వరభావః** = నాయకత్వము, **స్వభావజమ్** = స్వభావమునుండి పుట్టిన, **క్షాత్రకర్మ** = క్షత్రియుని విధి.

పరాక్రమము, ఆత్మవిశ్వాసము, దృఢసంకల్పము, చాతుర్యము,
యుద్ధమునందు పారిపోకుండుట, దానము మరియు నాయకత్వము
అనునవి క్షత్రియునకు స్వభావమునుండి పుట్టిన విధులు ( 43 ).

యుద్ధమునందు గాని, లేదా వినాశకరమగు పరిస్థితిలో గాని ధైర్యముతో మరియు నేర్పుతో ముందుకు సాగే లక్షణము శౌర్యము గలవానియందు ఉండును. అట్టి వ్యక్తి సమయము వచ్చినప్పుడు తన వీరత్వమును చూపుటకు వెనుకాడడు. తేజస్సు అనగా ఆత్మవిశ్వాసమనియు, ధృతి అనగా అవిచ్ఛిన్నమగు ఉత్సాహమనియు శ్రీశంకరులు వివరించిరి. ఇబ్బందికరమైన పరిస్థితులలో మాత్రమే గాక, ఒకప్పుడు హానికరమైన పరిస్థితులలో కూడ ఇట్టి వ్యక్తులు స్థిరచిత్తముతో నుందురు. వారియందు ఉండే సంకల్పబలము వలన వారు తొందరగా నిరుత్సాహమును పొందరు ; తేలికగా భయపడరు. వారి ఉత్సాహము నీరు గారిపోదు.

ఇంతేగాక, ఇట్టి వ్యక్తి పనులను వాయిదా వేయడు. అతడు సరియగు కాలములో సరియగు పనిని చేయును. అనుకోని అవాంతరములకు కూడ అతడు సంసిద్ధుడై యుండును. ఏ మాత్రమైననూ ఊహించని విపత్కరపరిస్థితి హఠాత్తుగా ఎదురైననూ, అతడు కంగారు పడకుండగా తన వద్ద ఉపలభ్యమయ్యే అంగబలమును మరియు అర్థబలమును యథోచితముగా సమకూర్చుకొని యోజనను పూర్తిగా మార్చివేసి, ఆ పరిస్థితిని ధైర్యముతో ఎదుర్కొనును. యుద్ధరంగములో పరిస్థితులు సర్వదా ఇటులనే ఉండును. జీవితము కూడ ఒక యుద్ధరంగము వంటిదే. కొందరు తమ వద్ద ఒక యోజనను పెట్టుకొని, అంతా దాని ప్రకారము సజావుగా సాగిపోతున్నంతవరకు చక్కగా పనిని చేయుచుందురు. కాని, యోజనలో మార్పు వచ్చినచో, వారు తీవ్రమగు కంగారుకు లోనై కొత్త పరిస్థితిని ఎదుర్కొనుటలో విఫలులగుదురు. వారి హృదయాంతరాళములలో ఒకానొక భయము మరియు అభద్రత దాగి యుండుటచే, పరిస్థితి తమ అధీనములో లేని సందర్భములో వారు బెదిరిపోయి తమ కార్యకుశలతను కోల్పోయెదరు. మార్పునకు సంసిద్ధముగా నుండుట, యోజనలో యథోచితముగా ఆవశ్యకమగు మార్పులను చేర్పులను చేసుకొనుట, ఉపలభ్యమగుచున్న సాధనసంపత్తిని సమయానుకూలముగా పునర్వ్యవస్థితము చేసుకొనుట, మరియు పరిస్థితులు తల యెత్తుచుండగా వాటిని ఎదుర్కొనుట అను లక్షణము

క్ష్యము అని పేరు. ఒక పరిస్థితి ఎంత అపరిచితముగ నున్ననూ, ఎంత భయంకర
వున్ననూ, దానిని సమర్థతతో ఎదుర్కొని ఆ సమయములో చేయదగిన పనిని చేసే
క్ష్యమనబడును. ఒకప్పుడు వ్యక్తి వెనుకకు తగ్గవలసియుండును. దాక్ష్యము గల
తాత్కాలికముగా ఓటమిని చవిచూసిననూ, అంతిమవిజయము ఆతనిని వరించును.
త్రియుని మరియొక విధి యుద్ధే చాప్యపలాయనమ్. అనగా, యుద్ధమును చేయ
స్థితిలో పారిపోకుండగా నిలబడి యుద్ధమును చేయవలెను. క్షత్రియుడనగా ధర్మ
రక్షించవలసిన యోద్ధ అని యర్థము. రాజదండమును లోకములో ప్రవర్తిల్ల జేయ
వాడు క్షత్రియుడే. క్షత్రియుడు పారిపోరాదు. అనగా, తన వెన్నును శత్రువునకు
దని శ్రీశంకరులు వివరించిరి. యుద్ధమును చేసే క్షత్రియునకు ఇది చాల ప్రముఖ
లక్షణము. రాజస్థాన్‌లో యుద్ధములో గాయపడి వచ్చిన వీరుని భార్య ఆతని
దేహమునకు ముందు భాగములో గలదా ? లేక వీపుపై గలదా ? అను విషయ
పరికించును. గాయము ముందు భాగములోనున్నచో, ఆతనికి ఇంటిలో సుస్వాగ
లభించును. గాయము వెనుకనున్నచో, ఆతనిని మరల యుద్ధరంగమునకు సాగనం
యుద్ధరంగమునుండి పారిపోకుండుట క్షత్రియుని ప్రధానలక్షణము.
దానము కూడ చాల ప్రముఖమైన లక్షణము. శ్రీశంకరులు ఇచట దానమును చాల
ముగా వర్ణించిరి. ఈయదగిన వస్తువుల విషయములో చేతికి గల విడుపు లక్షణము
అనబడును. దానమ్ అనగా ఇచ్చుట అని సామాన్యార్థము. కాని ఈ ఇచ్చుటలో అనే
అంశములు ఇమిడియున్నవని మనము చూచియున్నాము. దానములో ఈయద
స్తువులు, యోగ్యమగు కాలము, యోగ్యమగు దేశము, మరియు యోగ్యమగు ప్రతి
అనే నాలుగు అంశములు గలవు. ఆ అంశములన్నియు సమకూడిన సందర్భ
మానవుడు చేతులను ముడుచుకొని కూర్చుండరాదు. చేతులను వెనుకకు లాగకుం
స్వేచ్ఛగా ఈయవలెను. అది ముందు వెనుకల గురించి ఆలోచించే సందర్భము
గనుక ఆ సమయములో నిస్సంకోచముగా దానమును చేయవలెను. అదియే యథా
దానము. సర్వదా భవిష్యత్తును గురించి చింతిల్లువాడు ఈ తీరున దానమును
లడు. దానమును చేయుటలో కొద్దిపాటి సాహసము ఉండవలెను. కాని ఆ సాహ
మితిమీరకుండగా జాగ్రత్త పడుటయు అవసరమే. లేనిచో, దాత మరునాడు యాచ
గాయలుదేరవలెను. కాని ఏదో కొంత సాహసము లేనిదే మానవుడు తన వద్దనున్న
విడిచిపెట్టజాలడు. ఇట్టి సాహసమునకు శ్రీశంకరులు ముక్తహస్తతా అని పేరిడిరి.
క్షత్రియుడు సహజముగా నాయకత్వలక్షణములను ( ఈశ్వరభావః ) కలిగియుండు
ఆతడు తన ఈ స్వభావమును తనచే నాయకత్వము వహించబడే జనుల యెదుట
కటించునని శ్రీశంకరులు వివరించిరి. తాను అధికారమును చేపట్టినాననే విషయమును
నాయకుడు జనులందరికి స్పష్టముగా తెలువుడు చేయుట చాల ప్రముఖమైన విషయము.
పరిపాలించుట క్షత్రియుని విధి అనుటలో సందేహము లేదు. గుణముచే క్షత్రియుడగు
వానియందు ఈ లక్షణము అతిసహజముగా ప్రకటమగును. రజోగుణము ప్రముఖముగను,
సత్త్వము అప్రధానముగను ఉన్న వ్యక్తిలో పరిపాలించే సామర్థ్యము సహజముగా ప్రకట

మగును. అతనియందు సత్త్వము కూడ ఉన్నది గనుక, అతడు స్వార్థపరుడు కాడు. కాని అది అప్రధానముగా నున్నది గనుక, వంశాభిమానమును మరియు సిద్ధాంతపరమగు అహంకారమును కలిగియుండును. ఆ సిద్ధాంతము కార్యరూపమును దాల్చుటకొరకై అతడు తన సుఖమును మాత్రమే గాక కుటుంబమును కూడ పరిత్యజించుటకు సర్వదా సంసిద్ధుడుగ నుండును. తాను నమ్మిన సిద్ధాంతము కొరకు పని చేసే సిద్ధాంతవాది క్షత్రియుడు. అతడు తన సిద్ధాంతమే సర్వమని నమ్ముటచే దానిని దాటి అతని దృష్టి ప్రసరించదు. ఇది అతనిలోని సమస్య. సత్త్వగుణము ఉండుటచే అతని ఆలోచనలు శ్రేష్ఠముగా నుండును. కాని రజోగుణము ఉండుటచే ఈ శ్రేష్ఠత్వము పూర్ణము కాదు.

గుణములను బట్టి క్షత్రియుడగు ఇట్టి వ్యక్తి పరిణతిని చెంది బ్రాహ్మణుడు కావచ్చును. కాని క్షత్రియునకు విహితకర్మలు ( విధులు ) గలవు. ఒక విశిష్టవంశములో పుట్టిన వ్యక్తికి తన కర్తవ్యము స్పష్టముగా తెలియుచుండును. అతడు యువకుడుగా నుండగనే అతనికి తన విధులు స్పష్టముగా గోచరించుచుండును. కావున, ఈ పరిస్థితిలో ప్రతిస్పర్థ మరియు ఆక్రమణశీలము మొదలగు సమస్యలకు తావు లేదు. మానవుడు తన విధిని నిర్వర్తిస్తూ పరిపక్వతను చెంది గుణముచే బ్రాహ్మణుడగుటకు ఒక విశిష్టమైన మనఃప్రవృత్తి ఉండవలయును. అంతఃకరణములో పరిపక్వతను సాధించుటకు ఇది అద్భుతమైన సాధనము. ఈ వ్యవస్థ మనకు ఇపుడు ఉపలభ్యమగుట లేదు. కావున మనము దానిలోని స్ఫూర్తిని అర్థము చేసుకొని దానికి యథోచితముగా మార్పులను చేర్పులను చేసుకొనవలెను. మానవుడు ఒక విశిష్టపరిస్థితిలో తన కర్తవ్యమును పాటించుట మాత్రమే గాక, దానిని కర్మయోగముగా తీర్చిదిద్దే భావనతో అనుష్ఠించవలెను. దీనిని గురించి భగవానుడు తరువాత మరల వర్ణించగలడు. ఆయన ముందుగా విధులను నిరూపించి, తరువాత వాటి ప్రయోజనమును వివరించగలడు.

ఇపుడు మనము వైశ్యుని స్వభావమును మరియు విధులను పరిశీలించెదము.

**అధ్యాయము 18 , శ్లోకము 44 :**

कृषिगौरक्ष्यवाणिज्यं वैश्यकर्म स्वभावजम् ।

परिचर्यात्मकं कर्म शूद्रस्यापि स्वभावजम् ।। ४४ ।।

కృషిగౌరక్ష్యవాణిజ్యం వైశ్యకర్మ స్వభావజమ్

పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ( 44 ).

**కృషిగౌరక్ష్యవాణిజ్యమ్** = వ్యవసాయము, పశురక్షణ మరియు వ్యాపారము, **స్వభావజమ్** = స్వభావమునుండి పుట్టిన, **వైశ్యకర్మ** = వైశ్యుని కర్మ, **అపి** = మరియు, **పరిచర్యాత్మకమ్** = సేవారూపమగు, **కర్మ** = కర్మ, **శూద్రస్య** = శూద్రునకు, **స్వభావజమ్** = స్వభావము నుండి పుట్టినది.

వ్యవసాయము, పశురక్షణ మరియు వ్యాపారము వైశ్యుని సహజ కర్మలు. శూద్రునకు సేవారూపమగు కర్మ సహజము ( 44 ).

వ్యవసాయమునకు సంబంధించిన పని ఏదైనా కృషి యనబడును. శ్రీశంకరులు నాగలి దున్నుటను ప్రత్యేకముగా ప్రస్తావించిననూ, వ్యవసాయమునకు సంబంధిం

చిన కర్మలన్నియు కృషిలో అంతర్గతమగును. గౌరక్ష్యమ్ అనగా ఆవులను రక్షించుట. ఇది చాల ఆసక్తికరమైన ప్రయోగము. భగవానుడు గోపోషణ అని గాక, గోరక్షణ అని ప్రయోగించినాడు. ఈ రెండింటికీ గల భేదమేమి ? పశువులను పెంచి వాటిని మాంసము కొరకై సంహరించుట కూడ పశుపోషణయే అనబడును. అట్టి పశుఘాతకులు వాటిని సంహరించుటకు ముందుగా బరువును అధికము చేయుటకై వాటిని అతిక్రూరమగు హింసలకు గురిచేయుదురు. కాని ఇచటి పరిస్థితి అది కాదు. మనము దేనిని రక్షిస్తామో అది మనలను తిరిగి రక్షించును అనే సూత్రముపై ఆధారపడి వీరు పశువులను రక్షించెదరు. మనము ధర్మమును రక్షించినచో, అది మనలను రక్షించును (ధర్మో రక్షతి రక్షితః ). అదే విధముగా, మనము ఆవును రక్షించినచో, అది మనలను రక్షించును. వ్యవసాయదారునకు పశువుల సహకారము అత్యావశ్యకము. కావున, వాటిని రక్షించుట ఆతని దినచర్యలలో ఒకటి. వైశ్యుని మరియొక విధి వ్యాపారము. వ్యాపారస్థులు, పారిశ్రామికులు మరియు ఉత్పత్తిదారులు మొదలగు వారందరు చేసేది వైశ్యకర్మయే. ఇది కూడ గుణకార్యమే గనుక, స్వభావమునుండి పుట్టినదని ( స్వభావజమ్ ) అని చెప్పబడినది. క్షత్రియునకు వలెనే వైశ్యునకు కూడ రజస్సు ప్రధానగుణము. కాని క్షత్రియునకు రెండవ గుణము సత్త్వము కాగా, వైశ్యునకు తమస్సు రెండవ స్థానములో నుండును. కావున, అట్టివాడు స్వార్థసాధనకు అంకితుడగుట సహజమే. కాని ఆతడు తన కర్మలను విధుల రూపములో మలచుకున్నచో, సత్త్వగుణమును పెంపొందించుకొన వచ్చును.

శూద్రునిలో తమస్సు ప్రధానముగను, రజస్సు రెండవ గుణముగను ఉండును. ఆతడు పది చోట్లకు తిరుగుతూ సేవాకార్యములలో నిమగ్నుడై ( పరిచర్యాత్మకం కర్మ ) యుండును. సమాజములన్నింటిలో వివిధకార్యములు వీరి నిరంతర పరిశ్రమ వలన మాత్రమే సంభవమగుచున్నవి. కాని మానవుడు తాను ఏ పనిని చేయుచున్నను, దానిని విధిరూపములోనికి మలుచుకొన వలయును. ఇచటి ప్రముఖతాత్పర్యము అదియే.

తమ విధులను చక్కగా నిర్వర్తించువారు దానికి ఫలముగా స్వర్గమును పొందెదరని చెప్తూ శ్రీశంకరులు ఆపస్తంబస్మృతిని ఉదాహరించిరి : ' జీవితములో తనకు విధించబడిన కర్మలను శ్రద్ధతో నిర్వర్తించు వ్యక్తి మరణించిన తరువాత పుణ్యలోకములలో భోగముల ననుభవించి ఇంకనూ మిగిలియున్న పుణ్యముయొక్క ప్రభావముచే, స్థానము, వర్ణము, వంశము, విధి, ఆయుర్దాయము, విజ్ఞానము, వృత్తి, సంపద, సుఖము మరియు మేధ అను అంశములలో ఉత్కృష్టమైన జన్మను పొందును'. ఈ నాడు భారతదేశములో గాని, పాశ్చాత్యదేశములలో గాని వర్ణాశ్రమవ్యవస్థ పని చేయుట లేదు. కావున, ఈ సందర్భములో తమనుండి అపేక్షించబడే విధులను చేయుటకు కటిబద్ధులైన వ్యక్తుల పరముగా ఈ ప్రకరణమును అన్వయించు కొనవలెను. వీరు విహితకర్మలను అనుష్ఠించిన కారణముగా, మరణించిన తరువాత కర్మఫలరూపమగు స్వర్గముననుభవించెదరు. ఆ సుఖానుభవము పూర్తి అయిన తరువాత వారికి ఇంకనూ కొంత పుణ్యము మిగిలియుండును. పుణ్యమంతయు స్వర్గములో క్షయము కాదు. ఆ పుణ్యశేషముయొక్క ప్రభావముచే అట్టి జీవుడు శ్రేష్ఠమగు దేశములో జన్మించుట మాత్రమే గాక, ఆ దేశములో కూడ సంస్కృతి పర

ముగా శ్రేష్ఠతరమగు స్థానములో జన్మించును. ఒక స్థానము స్వతహాగా మంచిదే అయినా, అచట యుద్ధము లేక కరువు పరిస్థితులు ఉండగా ఇట్టి పుణ్యాత్ములు జన్మించినచో , అది వారి ఆధ్యాత్మిక-అభివృద్ధికి దోహదకారి కాదు. కావున, ఒక వ్యక్తి ఒక దేశములో జన్మించిన కాలమునకు కూడ ప్రాముఖ్యము గలదు. ఇంతేగాక, అధికమగు సంస్కృతి గల వర్గములో, లేదా వంశములో ఇట్టి వ్యక్తి జన్మించినచో, ఆతనికి ఉన్నతశ్రేణికి చెందిన తల్లిదండ్రుల మార్గదర్శనము లభించుటచే ఆధ్యాత్మిక-జ్ఞానము సరళముగా అవగాహనకు వచ్చును. అట్టివాడు ధర్మమునకు అనురూపమైన జీవితమును గడుపగల్గును. ఇట్టి జన్మను పొందినవానికి పూర్ణమగు ఆయుర్దాయము, చక్కని నేర్చుకొనే అవకాశములు, శ్రేష్ఠమగు వృత్తి మరియు అధికమగు ఆర్థికస్వాతంత్ర్యము లభించును. ఈ విధమగు సౌకర్యములన్నియు గల వానికి అధికమగు ఉల్లాసము లభించుట సహజమే గదా ! ఇంతేగాక, ఆతనియందు అధికమగు ప్రజ్ఞ, ప్రతిభ మరియు మేధ ఉండును. ఈ విధముగా నాల్గు వర్ణముల మరియు ఆశ్రమముల ధర్మములను పాటించువారికి పుణ్యలోకములు మరియు ఉత్తమజన్మ అను ఫలములు లభించునని స్మృతులు మరియు పురాణములు చెప్పుచున్నవి. ఆయా వ్యక్తులు తమ జీవితములో విహితకర్మలను ఏ మాత్రలో అనుష్ఠిస్తారో, అదే మాత్రలో వారికి ఆయా పుణ్యఫలములు లభించును.

ఈ విధులను నిర్దేశించుటలో ఉద్దేశ్యము స్వర్గప్రాప్తి మాత్రమే కాదు. దీనికి మరియొక కారణము గలదు. వాటిని వేర్వేరు మనఃప్రవృత్తులతో అనుష్ఠించినచో, వేర్వేరు ఫలములు లభించును. ఒక కర్మను ఉత్కృష్టమగు జన్మకొరకు గాని, స్వర్గలోకప్రాప్తి కొరకు గాని, లేదా భవిష్యత్తులో పొందగోరే ఒకానొక సుఖము కొరకు గాని అనుష్ఠించవచ్చును. అదే కర్మను ఈ జన్మలో ఇప్పుడు లభించే ఫలము కొరకు చేయవచ్చును. భగవానుడు ఆ విషయమును ఇప్పుడు చెప్పబోవుచున్నాడు.

**అధ్యాయము 18 , శ్లోకము 45 :**

स्वे स्वे कर्मण्यभिरतस्संसिद्धिं लभते नरः ।

स्वकर्मनिरतस्सिद्धिं यथा विंदति तच्छृणु ।। ४५ ।।

స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు ( 45 ).

నరః = మానవుడు, స్వే స్వే = తమ తమ, కర్మణి = కర్మయందు, అభిరతః = ఆనందమును పొందుచున్నవాడై, సంసిద్ధిమ్ = విజయమును, లభతే = పొందుచున్నాడు, స్వకర్మనిరతః = తన విధికి అంకితమైనవాడు, యథా = ఏ తీరున, సిద్ధిమ్ = సిద్ధిని, విందతి = పొందునో, తత్ = ఆ విషయమును, శృణు = వినుము.

మానవులు తమ తమ విధులను నిర్వర్తించుటలో ఆనందమును
పొందుచున్నవారై సిద్ధిని పొందగలరు. తన విధికి అంకితమైన
వ్యక్తి ఏ తీరున సిద్ధిని పొందునో, ఆ విషయమును వినుము ( 45 ).

ఇది అంతా కర్మయోగములో భాగమే. అభిరతః అనగా కటిబద్ధత అని శ్రీశంకరులు వ్యాఖ్యానించిరి. తన విధిని నిర్వర్తిస్తూ దానియందు ఆనందమును పొందే వ్యక్తివి

గురించి మనము చర్చించుచున్నాము. ఈతడు తననుండి అపేక్షించబడే కర్మను చేయుటలో ఉల్లాసమును అనుభవించుటయే గాక, ఆతనికి తన కర్మలో యథార్థమగు తృప్తి గలదు. ఆతడు మరియొకని పనిని చేయాలని ఉబలాట పడుట లేదు. అట్టివాడు విజయమును పొందుట సహజమే. ఇచట సిద్ధి అనగా అంతఃకరణశుద్ధి. ఈ సిద్ధి మోక్షము కాదు. ఏలయన, మనము కర్మను గురించి మాటలాడుచున్నాము. ఆత్మజ్ఞానము మాత్రమే మోక్షహేతువు కాగలదు.

మానవునకు విజయము ఏది ? పరిపక్వతను చెందుటయే మొదటి విజయము. నలభై అయిదు సంవత్సరముల వయస్సు గల ఒక వ్యక్తి తన బుడగ పేలిపోయినందులకు ఏడ్చుచున్నాడనుకొనుడు. వానిని గురించి నీవు ఏమని తలపోసెదవు ? అట్టి ప్రవర్తన పరిహాసభాజనమగును. కాని మనందరిలో అట్టి బాలకుడు దాగియున్నాడు. బుడగను పిల్లలు ఇష్టపడతారే గాని, పెద్దలు దానిని గురించి పట్టించుకోరని నాకు తెలుసు. కాని బుడగకు ప్రతిరూపములగు వస్తువులు మనందరి హృదయములలో నున్నవి. పరిపక్వహృదయుని దృష్టిలో కర్మలు అన్నీ ఒక్కటే. కర్మలన్నియు త్రిగుణాత్మకములు; కావుననే సహజముగా బంధహేతువులు. ఈ విషయమును ఆతడెరుంగును. కావున, ఆతని దృష్టిలో తాను చేయుచున్న కర్మకంటె మరియొక కర్మ శ్రేష్ఠమైనది కాదు. బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రవృత్తులలో ఏదైనా కర్మయే గనుక, దాని ఫలమును అనుభవించక తప్పదను మాట చరమసిద్ధాంతము. కర్మయందలి ఈ సహజదోషమునుండి తప్పించుకొనుట కుదిరేది కాదు. కావున, కర్మను మార్చినంత మాత్రాన హృదయములో రాదగిన పరివర్తన రాదు.

ఒక వ్యక్తి తన వృత్తిని మార్చే ప్రయత్నము చేయుచున్నాడంటే, ఆతని సమస్య సాధారణముగా ఆతడు చేసే కర్మయందు గాక, ఆతని అంతరంగమునందు ఉన్నదని గ్రహించవలెను. ఒక విశిష్టపరిస్థితిలో వ్యక్తికి తనకు తాను ఆమోదము కాకపోవుటచే తనను తాను ద్వేషిస్తూ, తాను చేయుచున్న ఉద్యోగము చెడ్డదనియు, తన దుఃస్థితికి అదియే కారణమనియు తలపోయును. అట్టి వ్యక్తి ఏ పనిని చేయుచున్ననూ, సమస్య అటులనే మిగిలియుండును. ఎవరికైననూ కొన్ని ఉద్యోగములకంటె మరికొన్ని ఉద్యోగములు మరింత సానుకూలముగా నుండుట సంభవమే అయిననూ, ఈతని ద్వేషమునకు కారణము ఉద్యోగము కాదు. కాని గీతోపదేశము ప్రకారంగా ఈ పరిస్థితి ఆమోదయోగ్యమైనది కాదు. ఏలయన, కర్మయోగి వ్యవస్థను యథాతథముగా స్వీకరించును. అంతరంగములో విధిభావన స్థిరముగా నెలకొన్న వ్యక్తికి, ఏ ఉద్యోగమైననూ ఉచితముగనే యుండును. విధిభావన లేనిచోట మనము పరిస్థితిని మరియొక విధముగా అంచనా వేయవలెను. సమస్యను వాస్తవికమగు వ్యవహారదృష్టితో పరిశీలించవలెను. వ్యక్తియొక్క అశాంతికి కారణము ఆతడు చేయుచున్న ఉద్యోగమేనా ? అను విషయమును లోతుగా పరిశీలించవలెను. సాధారణముగా అసంతృప్తికి కారణము ఉద్యోగము కాదు. మరియొక కారణము ఉండి తీరును. దానిని సావధానముగా గమనించుట ఆవశ్యకము. భారతదేశములో వలె పాశ్చాత్యదేశములలో 'కర్తవ్యవిధి' అనే దృష్టికోణము లేకున్ననూ, చేయదగిన కర్తవ్యము

విషయములో అవగాహన గలదు. కాని ఈ కర్తవ్యము పరిస్థితిని బట్టి మారిపోవుచుండును. దానిని ఏ దినమునకు ఆ దినము కనుగొనుచుండవలెను. ఈ వ్యవస్థ లేనందులకు మనము నిరాశను చెందవలసిన పని లేదు. అది యథాతథముగా ఉండనక్కరలేదు. దాని స్ఫూర్తి మనకు చాలును. వ్యవస్థ ఏదైననూ మనము దానిని అతిక్రమించి ముందుకు సాగ వలసినదే. దాని స్ఫూర్తిని స్వంతము చేసుకున్నచో, మనము గుణాతీతులము కావచ్చును. తాను చేయుచున్న ఉద్యోగములో ఉల్లాసమును కనుగొనిన వ్యక్తి ఆ ఉద్యోగమును త్యజించగల్గును. కేవలము ఉద్యోగమును మార్చినంత మాత్రాన ఒరిగేది లేదు. ఒక వ్యక్తి తరుచుగా ఉద్యోగమును మార్చుచున్నచో, అతని సమస్య ఉద్యోగము కాదని తెలిసిపోవు చున్నది. పరిస్థితులలో మార్పు వచ్చిననూ, నాకు తృప్తి కలుగకున్నచో, సమస్య నాలో దాగియున్నదనియు, అది పరిస్థితులపై ఆధారపడి లేదనియు స్పష్టమగుచున్నది. స్థాన ములు మారవచ్చును ; ఉద్యోగములు మారవచ్చును ; కాని నేను మారుట లేదు గదా ! కొందరు ఎక్కడకు వెళ్లియున్ననూ, అసంతృప్తులుగనే ఉందురు. ఈ సమస్య పూర్తిగా వ్యక్తిలో అంతర్నిహితమై యున్నది. దీనికి బయటి పరిస్థితులతో సంబంధము లేదు. కావు న, వ్యక్తి దీనిని పరిష్కరించుకొన వచ్చును. బాహ్యపరిస్థితులు గాని, వ్యక్తులు గాని సమ స్యకు మూలమైనచో, పరిష్కారము దుర్ఘటమగును.

ఈ స్థితిలో ఒక గొప్ప సుగుణము గలదు. సమస్య నాలో ఉన్నది అని నేను గుర్తించ గలిగితే, దాని పరిష్కారము సిద్ధముగా నున్నది. నా గురించి నాకు గల మనోభా వనలను నేను మార్చుకున్నచో సరిపడును. ఈ దేహము నేను ఇటునటు సంచరించుటకు వినియోగపడే యంత్రము మాత్రమే. వివిధములగు అనుభవములకు ఆశ్రయమగు ఈ దేహము నా అధీనములోనున్న సంఘాతము మాత్రమే. నేను దానిని లేవమన్నచో, నడుము నొప్పి, మోకాలి నొప్పి మొదలగు సమస్యలు ఉన్ననూ, అది లేచి నిలబడును. అది అసమర్థము అగు పర్యంతము సర్వకాలములలో ఆజ్ఞను పాలించుచుండును. ఈ విధ ముగా నాకు సేవ చేయువారు మరి యెవ్వరు గలరు ? ఒకప్పుడు నేను దానిని వినియో గించక పోవచ్చును ; మరియొకప్పుడు దుర్వినియోగము చేయవచ్చును. కాని అది నాకు సహకరించుచునే యుండును. ఒకనాడు అది నా వల్ల కాదని నిరాకరించిననూ, అది న్యాయబద్ధమే యగును. దేహమును ఆధారముగా చేసుకొని నా గురించి నేను నిష్కర్ష చేయుటలో వివేక మేమి గలదు ? జనులు తమను తాము తమకు గల మోటారును బట్టి కూడ అంచనా వేసుకొనుచుందురు ! దీనిని బట్టి మానవుడు తన స్వరూపమునకు ఎంత అధికముగా దూరమగుచున్నాడో స్పష్టమగుచున్నది. మనము అలంకారముతో మొదలిడి తలకు రంగు వేసుకొనే స్థితికి ఎదిగి, అంతిమముగా మనకు గల మోటారు లేక ఇల్లు ఆధా రముగా తన గురించి తాను నిష్కర్ష చేసుకొనే స్థితికి చేరుకొనెదము. మనము స్వస్వరూప నిర్ధారణకై సకలబాహ్యలక్షణములను పరిగణనలోనికి తీసుకొనుట ఎంతయు ఆశ్చర్యకర మైన విషయము. కేవలము భోగాయతనము మరియు రథము అగు ఈ దేహమును ఆధా రముగా చేసుకొని ఆత్మస్వరూపమును నిర్ణయించరాదని శాస్త్రము చెప్పుచున్నది. మనము దేహమును వినియోగించుకొని, అది చేయుచున్న ఉపకారమునకు కృతజ్ఞులమై,

దాని వలస కలిగే లాభమును పొంది ఆనందించవలెను. అంతే గాని, దానిని ఆధారముగా చేసుకొని స్వరూపనిర్ణయమును చేయరాదు. తనను తాను పరిశీలించుకొని, తన దేహము లేక మనస్సు ఆధారముగా తనను తాను ఘనుడనుకొనుట లేక నిందించుకొనుట పెద్ద సమస్య. ఈ విధముగా ఆత్మనింద చేసుకొనుట క్షేమకరము కాదు.

తనను గురించి తాను నిర్ణయము చేసుకొనుటకు దేహము గాని మనస్సు గాని సరియగు ఆధారము కానప్పుడు, మనము చేసే కర్మ ఎట్లు ఆధారము కాగల్గును ? ఈ కాలములో వర్ణాశ్రమవ్యవస్థ సరిగా కార్యాన్వితమై లేదు గనుక, స్వే స్వే కర్మణ్యభిరతః అను వాక్యమును మనము ప్రస్తుతపరిస్థితికి అనుగుణముగా వ్యాఖ్యానించుకొనవలెను. ఒక విశిష్టపరిస్థితిలో నా ముందున్న కర్తవ్యమును నేను చేసి, ఆ కర్మలో ఆనందమును పొందవలెను. తన విధిని అంకితభావముతో మరియు సంతోషముతో నిర్వర్తించు వ్యక్తి అంతఃకరణశుద్ధి అనే విజయమును పొందును. ఈ విధముగా అతని మనస్సు జ్ఞానమునకు సంసిద్ధమైనచో, జ్ఞానోదయమునకు తద్ద్వారా మోక్షమునకు ఆటంకములు ఉండవు. ఈ అంతఃకరణశుద్ధిని సాధించే ఉపాయమేది ? వినుము.

**అధ్యాయము 18, శ్లోకము 46 :**

यतः प्रवृत्तिर्भूतानां येन सर्वमिदं ततम् ।

स्वकर्मणा तमभ्यर्च्य सिद्धिं विन्दति मानवः ।। ४६ ।।

యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్

స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః ( 46 ).

**యతః** = ఎవనినుండి, **భూతానామ్** = ప్రాణుల, **ప్రవృత్తిః** = సృష్టి, **యేన** = ఎవనిచే, **ఇదమ్** = ఈ, **సర్వమ్** = సకలజగత్తు, **తతమ్** = వ్యాప్తమై యున్నదో, **తమ్** = వానిని, **స్వకర్మణా** = తన విధిని అనుష్ఠించుట ద్వారా, **అభ్యర్చ్య** = పూజించి, **మానవః** = మానవుడు, **సిద్ధిమ్** = విజయమును, **విందతి** = పొందును.

ఏ పరమేశ్వరునినుండి ఈ సమస్తప్రాణులు పుట్టినవో, ఎవనిచే ఈ
జగత్తు వ్యాప్తమై యున్నదో, అట్టి పరమేశ్వరుని మానవుడు తన
విధ్యుక్తధర్మమును అనుష్ఠించుటద్వారా పూజించి సిద్ధిని బడయును ( 46 ).

ఇచట ప్రవృత్తిః అనగా సృష్టి. యతః అను పదము సృష్టికారణమగు పరమేశ్వరుని నిర్దేశించును. ఆయననుండియే ఈ సమస్తప్రాణులు మరియు పంచభూతములు ఉదయించినవి. కాని ఇచట ఒక సమస్య గలదు. ప్రాణులు పుట్టినవి అన్నచో, వాటికి ఆది ఉండవలెను. కాని ఈశ్వర-అభిన్నుడగు జీవుడు కూడ అనాదియే గనుక, జీవునకు పుట్టుక ఎట్లు సంభవమగును ? కావున, అనాదియగు జీవుడు జన్మించే ప్రసక్తి లేదు. ఇది వాస్తవమే. కాని జీవుడు అనాదియనియు, ఈశ్వర-అభిన్నుడనియు మానవుడు గుర్తించవలెను. ఆ అభేదమును గుర్తించనంతవరకు జీవేశ్వరుల మధ్య కల్పితభేదము గలదు. ఆ జీవుడు ఒకానొక ఉపాధిలో జన్మించినట్లు కన్పట్టును. కాని, వాస్తవములో జీవునకు జన్మ లేదు. ఈ సత్యమునెరుంగుట చాల ముఖ్యము. ఏ జీవునకైననూ జన్మ లేదు. అంతేగాక, జీవత్వము

కేవలమిథ్య. ఆత్మ కంటె భిన్నముగా స్వతంత్రమగు ఉనికి గల జీవుడనే తత్త్వము లేదు. అజ్ఞానముచే ఈ జీవత్వము ఆత్మపై అధ్యారోపము చేయబడినది. అజ్ఞానమునకు ఆది లేదు. కావున, జీవత్వమునకు కూడ ఆది లేదు. కావున, ఈశ్వరుడు జీవులను సృష్టించుట లేదు. భగవానుడు జీవులను సృష్టించే పక్షములో ఆ సృష్టి కుటుంబనియంత్రణ మొద లగు వాటిచే ప్రతిబద్ధమై యుండెడిది ! అనగా భగవానుడు తన పనికి ఆటంకములను కలి గించు వారికంటె నికృష్టుడై ఉండెడివాడు. కావున, భగవానుడు జీవుని సృష్టించుననుకొ నుట యుక్తిసంగతము కాదు.

అట్లైనచో, సృష్టించబడినది ఏది ? పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అనే పంచభూతముల కలయికతో ఏర్పడే దేహేంద్రియమనస్సంఘాతము మాత్రమే సృష్టించబడును. ఈ శాస్త్రీయమైన సృష్టినమూనాలో పంచభూతములు మరియు వాటి కార్యములతో గూడిన దేహము, అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు ప్రాణములు మాత్రమే సృష్టించబడుచున్నవి. ఈ సృష్టిని ఇంకో దృష్టికోణములో కూడ చూడవచ్చును. భౌతికవిజ్ఞానశాస్త్రముననుసరించి మూలకములు చాల ఉన్ననూ, అవి అన్నియు కొన్ని కణములనుండి మాత్రమే నిర్మితమై యున్నవి. మన ప్రస్తుతవిషయమునకు ఆ వివరము లతో పని లేదు. మనము సర్వజగత్తును అయిదు భూతములలో, అంతిమముగా పర బ్రహ్మలో విలీనము చేసెదము. ఈ పంచభూతములతో మరియు వాటి కార్యములతో నిండియున్న ఈ జగత్తులో మన దేహేంద్రియమనస్సంఘాతము కూడ అంతర్భాగమై యున్నది.

సర్వజగత్తు దేనినుండి ఉదయించినదో, ఆ కారణము ఉపాదానము కావచ్చును ; లేదా నిమిత్తము కావచ్చును. ఈ సర్వజగత్తునకు పరమేశ్వరుడు నిమిత్తకారణము మాత్రమే అయినచో, ఆ కారణము ఈ సృష్టించబడిన జగత్తుకంటె భిన్నముగా నుండును. కుండకు కారణమగు కుమ్మరివాడు మట్టికంటె వేరుగానుండును గదా ! అప్పుడు నిమిత్తకా రణమగు ఈశ్వరుడు ఈ పంచభూతాత్మకమగు జగత్తును సృష్టించుటకు ఆయనకంటె పూర్తిగా స్వతంత్రమైన ఒకానొక ఉపాదానము అవశ్యకమగును. మట్టి లేనిదే కుమ్మరివాడు కుండను చేయలేరు గదా ! మతవాదులందరు ఇటులనే చెప్పుచున్నారు. ఈ జగత్తును సృష్టించిన భగవానుడు కూడ కుమ్మరివానివలె మరియొక పెద్దమనిషి యని వారి అభిప్రా యము. భగవానుడు తనచే సృష్టించబడిన జగత్తుకంటె భిన్నముగా నున్న పక్షములో, దేశ కాలములు జగత్తులో అంతర్భాగములే గనుక, ఆయన ఉన్నది ఎక్కడ ? స్వర్గములో ఉన్నాడు అన్న పక్షములో, స్వర్గము సృష్టించబడినదా ? లేదా ? స్వర్గము కూడ ఒకానొక స్థానమే గనుక, అది ఆకాశములో అంతర్భాగమై యుండవలెను. భగవానుడు నిమిత్తకార ణము మాత్రమే అన్నచో, ఈ సమస్యలకు పరిష్కారము లేదు. కావున, ఈశ్వరుడు జగత్తు నకు నిమిత్తకారణము మాత్రమే గాక, ఉపాదానము కూడ ఆయనయే నని ఇచట చెప్పబడి నది. ఈ విషయము మనకెట్లు తెలియును ? జగద్ఘటకములగు ఈ పంచభూతములు ఏ పరమేశ్వరునివలన సృష్టించబడినవో ( *యతః ప్రవృత్తిర్భూతానామ్* ) అని మాత్రమే మొదటి పాదములో గలదు. ఎవనినుండి, లేదా ఎవనివలన ( *యతః* ) అను పదము ఉపా

దాననిమిత్తకారణములు రెండింటికి సమానముగా వర్తించును. యతః అను పదమును బట్టి అర్థమును నిర్ధారించుట సంభవము కాదు.

ఎవ్వనిచే ఈ జగత్తు వ్యాప్తమై యున్నదో ( యేన సర్వమిదం తతమ్ ) అనే రెండవ పాదము ఈ విషయమును స్పష్టము చేయుచున్నది. యత్ అనే సర్వనామము మాత్రమే రెండవపర్యాయము ప్రయోగించబడుటచే, ఏ కారణమునుండి ( యతః ) సర్వ జగద్ఘటకములగు ఈ భూతములు ఉదయించినవో, అదే కారణముచే ( యేన ) అవి అన్నియు వ్యాపించబడి ( తతమ్ ) యున్నవి. ఇచట ఒక వాదమును లేవదీయవచ్చును. సూర్యకాంతి సర్వమును వ్యాపించి ప్రకాశింపజేయు తీరున, భగవానుడు స్వర్గములో కూర్చుండి తన అనుగ్రహముచే సర్వమును వ్యాపించి యుండవచ్చును. కాని ఈ విధ ముగా వాదించువారు ఈ క్రింది ఉపనిషద్వచనమునకు ఏమని అర్థమును చెప్పెదరు ? 'ఘటము అనేది వాక్కుపై ఆధారపడి ఉండే నామధేయము మాత్రమే ; దానిలోని యథార్థ మగు తత్త్వము మట్టి మాత్రమే ( వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్ )'. ఇటువంటి వాక్యములు ఒకటి, రెండు మాత్రమే కాదు ; కోకొల్లలుగా గలవు. ఈ వచనము ఎంతయూ యుక్తియుక్తముగా నున్నది. కావున, నిమిత్తకారణము మాత్రమే గాక, ఉపాదానకారణము కూడ భగవానుడే. సృష్టి ఉపాదానకారణముకంటె భిన్నముగా నుండజాలదు గనుక, అభిన్ననిమిత్తోపాదానకారణమగు భగవానుడు మాత్రమే సర్వవ్యాప కుడు కాగలడు. జగత్కారణము నిమిత్తము కూడ అగుచున్నది గనుక, అది చేతనము కూడ అగును. నిమిత్తకారణము చేతనమే గాని జడము కాజాలదు. ఇంకో సందర్భములో జగత్కారణము సత్యం జ్ఞానం అనంతమ్ అని కూడ వర్ణించబడినది.

జగత్తు మిథ్య గనుక, భగవానుడే దానికి ఉపాదానమగును. జగత్తును విశ్లేషించి నచో, దానియందు సత్యత్వము కానరాదు. సర్వము కేవలనామములలో పర్యవసానమును చెందును. పదార్థము మిథ్య అని తేలగానే, దాని నామము కూడ మిథ్యయే యగును. ఘటము ఒకటి ఉన్నదని నేను అనుకొనుచుంటిని. కాని ఇప్పుడు ఆ ఘటము మాయమై, కేవలము మట్టి మాత్రమే మిగిలియున్నది. ఘటము అనేది కేవలనామము మాత్రమే. దానికి సరితూగే వస్తువు ఏదియు లేదు. తరువాత మనము మట్టిని విశ్లేషించినచో, అది మాయమై పరమాణువులు మాత్రమే మిగులును. వాటిని విశ్లేషించినచో, అవి సత్ లో విలీ నమగును. ఈ విధముగా మిథ్యాభూతమగు సర్వము అధిష్ఠానమగు బ్రహ్మలో విలీనమగు ను. ఇది అన్నింటికంటె గొప్ప ఇంద్రజాలము. ఘటము చూచుచుండగనే మాయమగును. నా నోటిలో ఘటము అనే నామము గలదు. దానిచే నిర్దేశించబడే ఒక వస్తువు ఉండెడిది. కాని విశ్లేషించుసరికి ఆ వస్తువు మాయమైనది. వస్తువు మాయమైతే, నామమునకు స్థాన మేది ? ఈ విధముగా సృష్టిలోని సర్వపదార్థములు మాయమగును. సృష్టియొక్క వాస్తవి కత ఇంత మాత్రమే.

ఈ విధమగు సృష్టికి జవాబుదారీ వహించుటకు దానితో సరిదూగే కారణమున్న చాలును. ఆ కారణమే బ్రహ్మయొక్క స్వభావభూతమగు శక్తి. దానికే మాయ యని పేరు. జగత్తునకు ఉపాదానము మరియు నిమిత్తకారణము కూడ అగు ఈ మాయాసమేతుడగు

బ్రహ్మయే ఈశ్వరుడనబడును. స్వీయజ్ఞానము మరియు శక్తియొక్క దృష్టి కోణములో బ్రహ్మ నిమిత్తకారణమగుచున్నది. కాని శక్తిరూపమగు ఆ మాయోపాధియొక్క దృష్టికోణములో బ్రహ్మ ఉపాదానకారణమనబడును. దీనికి సాలె పురుగు దృష్టాంతము. అది తన చిక్కుముడుల గూడును నిర్మించుటకు తగిన స్థలమును వెదికి ఎన్నుకొనును. అది గది లోని మూలలలో మాత్రమే గూడును కట్టును. ఏదో ఒక మూలలో గాక, దాని భద్రతకు ఇబ్బంది కలుగని మూలను అది ఎన్నుకొనును. మరియు అది కట్టే గూడు రూపపరికల్పనకు ఒక అద్భుతమగు దృష్టాంతమనదగును. కనుక, దానికి ఒక విశిష్టపరిజ్ఞానము, విస్మయావహమగు నైపుణ్యము మరియు శక్తి గలవని స్పష్టమగుచున్నది. కావున, ఆ గూడునకు నిమిత్తకారణము సాలె పురుగు అగును. ఆ గూడును కట్టుటకు కావలసిన ముడి పదార్థము దానికి ఎక్కడ లభించినది ? గూడును కట్టే పక్షిని చూడుడు. అది శ్రద్ధగా పుడకలను ఏరి, వాటిని తెలివితేటలతో జాగ్రత్తగా అమర్చి, సుందరమగు గూడును నిర్మించును. అది ఆ గూడునకు పై భాగములో గట్టి పుడకలను అమర్చి లోపల భాగమును మెత్తని గడ్డితో నిర్మించును. అది ఆ గూడునకు కావలసిన పదార్థములనన్నింటినీ బహు శ్రద్ధతో సమకూర్చుకొని అద్భుతమగు చాకచక్యముతో గూడును నిర్మించును. కాని సాలె పురుగునకు గూడును కట్టుటకై ఈ తీరున పది చోట్లకు పరుగులెత్తి సామగ్రిని ప్రోగు చేయవలసిన పని లేదు. అది గూడునకు కావలసిన ముడి సరుకును అంతను తన నోటిలోని ఒక గ్రంథి నుండి సమకూర్చుకొనును. కావున, సాలె గూడునకు ఉపాదానకారణ మేది ? సాలె పురుగే. గూడును కట్టుటకు కావలసిన తెలివితేటలు, నేర్పు మొదలగు వాటికి ఆలంబనమగు చైతన్యముయొక్క దృష్టికోణములో, గూడునకు నిమిత్తకారణము అదియే అగుచున్నది. ఆ చైతన్యముయొక్క ఉపాధికే సాలె పురుగు అని పేరు. ఆ ఉపాధి యొక్క దృష్టికోణములో అదియే ఉపాదానకారణమగుచున్నది.

ఇపుడు ఈశ్వరుని గురించి పరిశీలిద్దాము. శుద్ధచైతన్యమే ఈశ్వరుడు. సాలెపురుగు యొక్క స్వరూపము కూడ శుద్ధచైతన్యమే. కాని, ఆ సత్య-జ్ఞాన-అనంత-బ్రహ్మ మాయతో గూడి తన దృష్టికోణములో సర్వజ్ఞము మరియు సర్వశక్తిమంతము అగును. ఆ మాయ తన ఉనికికి ఆ సత్య-జ్ఞాన-అనంత-బ్రహ్మపై ఆధారపడి యున్నదని మనము మరువరాదు. మాయ ఉపాధిగా గల చైతన్యముయొక్క దృష్టి కోణములో మాత్రమే ఈశ్వరుడు నిమిత్తకారణమని మనము చెప్తాము. మాయోపాధిచేత మాత్రమే ఈశ్వరునకు ఆ పేరు వచ్చినది. ఆ మాయోపాధియొక్క దృష్టికోణములో ఈశ్వరుని పరిశీలించినచో, ఆయన సృష్టికి ఉపాదానకారణమగును. ఈ సృష్టికి ఉపాదానకారణము ఈశ్వరుడే గనుక, అది ఈశ్వరునికంటె భిన్నముగా నుండజాలదు. కావున, ఉపాదానకారణముయొక్క దృష్టికోణములో సృష్టికి ఈశ్వరునకు భేదము లేదు. ఈ వ్యాకృతస్థూలప్రపంచము పరమేశ్వరుని స్థూలదేహము అగును. ఈ రూపములో ఈశ్వరునకు విరాట్ అని పేరు. సూక్ష్మప్రపంచము పరమేశ్వరుని సూక్ష్మదేహము అగును. ఆ రూపములో ఆయనకు హిరణ్యగర్భుడని పేరు. మాయోపాధికుడగు అవ్యాకృతపరబ్రహ్మకు ఈశ్వరుడనియు, అవ్యక్తమనియు

పేర్లు. ఈ అవ్యక్తమే సృష్టియొక్క కారణావస్థ. పంచభూతములు మరియు వాటి కార్యములతో కూడి అభివ్యక్తరూపములోనున్న సూక్ష్మస్థూలప్రపంచమునకు సృష్టి యని పేరు.

ఈ పాంచభౌతికసృష్టిప్రక్రియ సమగ్రమైనది. జగత్తు అంతయు దీనిలో అంతర్గతమగును. భౌతికప్రపంచము, మానవుని దేహేంద్రియమనస్సంఘాతము ఇత్యాది సర్వము దీనిలో భాగమే. కావున, ఉన్నది ఈశ్వరుడు ఒక్కడే. ఉపాధియొక్క దృష్టికోణములో ఈశ్వరుడు సర్వమును వ్యాపించియున్నాడు. కావున, ఉన్నదానిని మనము యథాతథముగా దర్శించిన చాలును. మనము చేయవలసినది ఇంత మాత్రమే. ఈశ్వరుడు ముందుగా జగత్తును సృష్టించి తరువాత దానిలో వ్యాపించినాడనుకోరాదు. దీనియందు రెండు వస్తువులు లేవు. ముందుగా కుండ సృష్టించబడి తరువాత మట్టి దానిలో వ్యాపించినదని చెప్పుట తగునా ? కాని వైశేషికులు అటులనే వాదించుచున్నారు. కాని యథార్థమేమనగా, ఈ సృష్టియే ఈశ్వరుడు. ఈశ్వరుడు లేనిదే ఈ జగత్తునకు ఉనికియే లేదు.

ఇట్టి స్థితిలో ఈశ్వరుని ఆరాధించగోరు భక్తుని మాట యేమి ? అతడు ఈశ్వరుని ఏ రూపములో ఆరాధించవలెను ? నిమిత్తకారణమునా ? లేక ఉపాదానకారణమునా ? మానవుడు తన నిత్యజీవితములో ఇతరులతో వ్యవహరించునప్పుడు దేనితో వ్యవహరించుచున్నాడు ? మానవుడు తన తండ్రితో, తల్లితో, మిత్రులతో వ్యవహరించునప్పుడు, వారి స్థూలదేహముతో వ్యవహరించునా ? లేక ఆయా వ్యక్తులతో వ్యవహరించునా ? సర్వదా వ్యక్తులతో మాత్రమే వ్యవహరించును. అదే విధముగా భక్తుడు కూడా ఉపాదానకారణముతో గాక, సర్వదా నిమిత్తకారణముతో మాత్రమే వ్యవహరించును. ఇందువలననే భేదము యథార్థమా యన్నట్లు భాసించుచున్నది. మానవునకు తాను అల్పజ్ఞుడననియు, అల్పశక్తిమంతుడననియు, ఈశ్వరుడు సర్వజ్ఞుడు మరియు సర్వశక్తిమంతుడు అనియు భాసించుచున్నది. కావున, మానవుడు ప్రార్థించేది నిమిత్తకారణమునే గాని, ఉపాదానకారణమును కాదు.

నిమిత్తకారణుడగు ఈశ్వరుని ఆరాధించు విధమెట్టిది ? ఇది చాల ఆసక్తికరమగు విషయము. నేను మీకు సమీపములో గూర్చుండి కునికిపాట్లు పడుచున్నాననుకొనుడు. ' ఓ స్వామీజీ ! ' అని మీరు పిలిచిననూ, ప్రయోజనము లేకపోయినది. అప్పుడు మీరు ఏమి చేసెదరు ? నన్ను స్పృశించి లేపుటకు యత్నించెదరు. మీరు నా చిటికెన వ్రేలిని స్పృశించి నన్ను లేపుటకు యత్నించినారనుకొనుడు. నా చిటికెన వ్రేలు మాత్రమే గాక, నా పూర్ణవ్యక్తి నిద్ర లేచునని మీరు ఆశించెదరు. అది నా పూర్ణవ్యక్తిత్వమును నిద్ర లేపుటకు ఉపయోగించే ఒక చిన్న నిమిత్తము మాత్రమే. నా పూర్ణవ్యక్తిని నిద్ర లేపుటకు నా చిటికెన వ్రేలిని పట్టుకొని లాగిన చాలును. భగవానుని విషయములో పరిస్థితి మరింత తేలిక. ఏలయన ఆయన విశ్రమించునే గాని, ఎన్నటికీ నిద్రించడు. మన పురాణములలో భగవానుని సుందరమగు రూపము ఒకటి వర్ణించబడి యున్నది. విష్ణువు ఆదిశేషునిపై పరుండి విశ్రమించును. ఆదిశేషుడు మొట్టమొదటి మెత్తని పరుపు అని చెప్పవచ్చును. ఈ సృష్టిని రక్షించి పాలించేది సర్వవ్యాపకుడగు విష్ణువు మాత్రమే. వాయువు వీచుట, అగ్ని వేడిని ఇచ్చుట మరియు మిగిలిన భూతములు తమ తమ విధులను యథావిధిగా నిర్వర్తిం

చుట మొదలగు ప్రకృతి నియమములను సరిచూడవలసినది ఆయనయే. మానవుడు చేసే ప్రతి చిన్న కర్మకు సరియగు ఫలము లభించుచుండవలెను. అనగా, ప్రకృతి నియమము లన్నియు ఖచ్చితముగా పాటించబడవలెను. ఈ సృష్టిని పాలించుట అనే అతి పెద్ద కార్యమును విష్ణుభగవానుడు ఎట్లు నిర్వర్తించుచున్నాడు ? పది లక్షల కంప్యూటర్లు ఉన్ననూ, ఇంతటి సృష్టిని నిర్వహించుట సంభవము కాదు. కాని, ఆయన వ్రేలినైననూ కదపకుండగా, కనురెప్పను వాల్చకుండగా, ఇంత పనిని చేయుచున్నాడు. పూర్ణశక్తి అనగా నిదియే. శ్రీమహావిష్ణువు ఆదిశేషునిపై పవ్వళించి యుండుట ఈ పూర్ణశక్తికి ప్రతీక. ఆయన సన్నిధి మాత్రముచే సర్వము సిద్ధించుచున్నది. అట్టి భగవానుని మనము ప్రార్థించుచున్నాము. ఈ జగత్తు అంతయు ఆయన రూపమే అయి ఉండగా, ఆయనను ప్రార్థించుటకు ఏ భాగమును స్పృశించవలెను ? ఇందువలననే, మనకు అనేకములగు భగవానుని రూపములు గలవు. మనము ఆకాశమును, వాయువును, అగ్నిని, జలములను మరియు పృథివిని కూడ ఆరాధించెదము. జడమగు దేహమును చేతన-ఆత్మ ధరించి యున్న తీరుననే, ఒక రాతికి కూడ భగవానుడు తన సత్తను అనుగ్రహించి నిలబెట్టుచున్నాడు. జడములు, చేతనములు అని మనము విభాగము చేసే జగత్తు అంతయు పరమేశ్వరుడే. కావున, మనము రూపము లన్నింటిలో భగవానుని ఆరాధించవచ్చును.

సృష్టి ఈశ్వరునికంటె భిన్నముగా లేదు గనుక, మనకు తెలిసినవి మరియు తెలియనివి ఎన్ని ప్రకృతి నియమములు గలవో, అవి అన్నియు కూడ ఈశ్వరునికంటె భిన్నముగా లేవు. ఉదాహరణకు భూమ్యాకర్షణశక్తి భగవానుడే. మనము గాలిలోనికి ఎగిరిపోకుండా కుర్చీలో కూర్చుండగలుగుచున్నాము. దీనికి కారణము భగవానుడు మనలను పట్టి ఉంచుటయే. మనకు కాలు జారినపుడు క్రింద పారవేయునది కూడ భగవానుడే. ఈ సర్వము ప్రకృతి నియతికి అధీనమై యున్నది. కారణము లేనిదే ఏదియు ఘటిల్లదు. ఇందువలననే, మనము వివిధములగు ఘటనలను పరిశీలించి, ఒకానొక బరువు గల వస్తువుపై కొంత బలమును ప్రయోగించినచో, అది పొందే వేగము ఎంత అను విషయమును ఖచ్చితముగా లెక్క కట్ట గలుగుచున్నాము. భగవానుని నియతి అనగా నిదియే. భగవానుని నియతి అనునవి మనము సాధారణముగా వాడే పదములు. ఈ షష్ఠీ విభక్తికి అర్థమేమి ? ఈశ్వరుడు ఒక వ్యక్తి అనియు, ఆయన కొన్ని నియమములను ఏర్పరుచగా మనకు వాటిని బట్టి ఫలములు వచ్చుచున్నవనియు తలంచుటకు అవకాశము గలదు. కాని అది సరి గాదు.

జగత్తునకు నిమిత్తకారణము భగవానుడు అగుటచే, ఆ దృష్టికోణములో భగవానుని నియతి అని మనము వర్ణించెదము. కాని నియతి ఈశ్వరుని కంటె భిన్నముగా లేదు. ఏవో కొన్ని పదార్థములు మాత్రమే గాక, మన కంటికి కనపడే ఫలములను ఇచ్చే కంటికి కానరాని ప్రకృతినియమములన్నియు కూడ భగవానునిచే వ్యాపించబడి యున్నవి. గురుత్వాకర్షణనియమము కంటికి కానరాదు. కాని పదార్థములు క్రింద బడుట, అవి నియమిత పద్ధతిలో ప్రవర్తించుట అను లక్షణములను బట్టి, కంటికి కానరాని ఒక శక్తి గలదని మనకు

అవగతమగును. మన కంటికి కానవచ్చే సర్వపరిణామములకు హేతుభూతములగు శక్తులు అన్నియు ఈశ్వరునిలో అంతర్భాగములే.

మనమీ శ్లోకసందర్భములో ఈ విషయమును మరికొంత లోతుగా పరిశీలించ దగును. చట్టములు పలువిధములుగా నున్నవి. వాహనముల రాకపోకల నియమములు మొదలగునవి మానవనిర్మితములు. కావున, అవి మారుటకు అవకాశము గలదు. వాహనముల అత్యధికవేగమునకు సంబంధించిన చట్టములు వివిధదేశములలో వేర్వేరుగా నున్నవి. వీటికి భిన్నముగా మానవనిర్మితము కాని నియమములు కొన్ని గలవు. అవి ఈశ్వరస్వరూపములే. గురుత్వాకర్షణశక్తి ఈశ్వరుడే. ఇంతకంటె ప్రధానమైన ధర్మము ఒకటి గలదు. మానవుడు దానిని ఆధారముగా చేసుకొని ప్రపంచములో వ్యవహరించవలెను. ఒక పనిని చేయుటకు గాని, చేయకపోవుటకు గాని, లేదా మరియొక విధముగా చేయుటకు గాని మనకు స్వేచ్ఛ గలదు. ధనమును న్యాయబద్ధముగా సంపాదించవచ్చును. లేదా ఇతరులకు అన్యాయము చేసి సంపాదించ వచ్చును. కాని మనము ఏ పద్ధతిని అవలంబించవలెను ? ఇతరుల సొత్తును అపహరించ రాదు అనే మానవనిర్మితమగు చట్టము ఒకటి గలదు. ఇది ఈశ్వరనియతికి అనురూపముగా నున్నది. ప్రత్యేకమగు శిక్షణతో పని లేకుండగా సర్వమానవులకు సమానముగా అర్థమవుతూ సర్వులకు సమానముగా వర్తించే విశ్వజనీన జీవనమూల్యములు కొన్ని గలవు. ఇతరుల బోధనయొక్క ఆవశ్యకత లేకుండగనే ఈ జీవనమూల్యములు సర్వులకు అవగతమగుచుండును అనునది దీనిలోని అతిప్రముఖమగు అంశము. చదివితే గాని తెలియని నియమము విశ్వజనీనము కాజాలదు. ఎస్కిమో గాని, న్యూయార్కు నగరవాసి గాని, భారతదేశములోని బ్రాహ్మణుడు గాని ఎవరైనా చదువుతో నిమిత్తము లేకుండగా తెలియగలిగే నియమము విశ్వజనీన నియమమని చెప్పవచ్చును. ఇతరులచే హింసించబడుట ఎవ్వరికైననూ సమ్మతము కాదు గదా ! కావున, అహింస విశ్వజనీనమని తెలియుచున్నది. ఈ విధముగా సృష్టిలో అవిభాజ్యమగు అంగముగా భాసిల్లే నియతికి ధర్మమని పేరు. కర్మనియతి కూడ ఇట్టిదియే.

కర్మనియతి మనకు గల ఇచ్ఛాశక్తికి సంబంధించినది. మనకు ఎన్నుకునే స్వేచ్ఛ గలదు. కావున, దానిని నియంత్రించే నియమము కూడ గలదు. ఆ నియతికే కర్మ యని పేరు. నేను ఎన్నుకున్న మార్గము సరియైనది కానిచో, దాని దుష్ఫలితమును నేను అనుభవించుట సహజమే. కర్మనియతి అట్టి ఫలమును ఇచ్చి తీరును. నిప్పులో వ్రేలిని పెట్టినచో, కాలుట అనివార్యము. అదియే నియతి. నిప్పును నిందించి ప్రయోజనము లేదు. జీవితములో నిప్పును ఎరుంగని వాడు తనకు ఆ సంగతి తెలియదని చెప్పవచ్చును. కాని ఈ విశ్వజనీనములగు జీవనమూల్యములు తెలియవని చెప్పి తప్పించుకొనుటకు వీలు లేనివి. బ్రతకాలని, పీడకు గురి కారాదని అందరు కోరుకుంటారు. కావున, అహింస విశ్వజనీనము. మన స్థూలదేహమును నియంత్రించే కొన్ని నియమములు గలవు. అటులనే, మన శారీరకక్రియలను మరియు మానసికస్థితులను నియంత్రించే నియమసంరచనలు గలవు. మనకు గల ఎన్నుకునే స్వేచ్ఛను నియంత్రిస్తూ, మన జీవనమూల్యములను నిర్దేశించే ఈ జీవనమూల్యసంరచనకు ధర్మమని పేరు. ఈ ధర్మము సృష్టిలో అంతర్భాగమై యున్న

ది. కావున, ధర్మము ఈశ్వరుడే. వస్తుస్థితి ఇట్లుండగా ఒక విశిష్టపరిస్థితిలో, విశిష్టదేశకాలములలో మన యెదుట ధర్మబద్ధమగు కర్తవ్యకర్మ ఒకటి సంప్రాప్తమగును. ఆ పరిస్థితిలో అది తప్ప మిగిలిన వికల్పములు ధర్మబద్ధములు కావు. చతురస్రాకారపు చెక్క గుండ్రని రంధ్రములోనికి ప్రవేశించలేదు. అటులనే, ఆ పరిస్థితికి ఆ కర్మ మాత్రమే సముచితముగా నుండును. అట్టి ధర్మబద్ధమగు కర్మ సృష్టిలోని అంశము గనుక ఈశ్వరుడే యగును. ఇదియే ఈశ్వరనియతి. ఒక పరిస్థితిలో ఇతరవికల్పములనన్నింటినీ అధిగమించి మన యెదుట కర్తవ్యరూపములో ఉపస్థితమయ్యే కర్మ ఖచ్చితముగా ఈశ్వరుడేనని మనము గుర్తించవలెను. ధర్మము ఈశ్వరుడే గనుక, విధినిర్వహణ ఈశ్వరుని స్వరూపమే యగును.

'నేను వివిధక్రియలను ఆచరించే కర్తను; నాకు ఇచ్ఛాశక్తి గలదు; నాకు గల వివిధములగు కోర్కెలను నేను పరిపూర్తి చేసుకోవాలి' అనే ధారణ ఉన్నంతవరకు, మానవుడు తన రాగద్వేషములను పూర్తిగా ప్రక్కన బెట్టి, విశిష్టపరిస్థితులలో తన యెదుట సుస్పష్టముగా కర్తవ్యకర్మరూపములో సంప్రాప్తమైన కర్మను అనుష్ఠించవలెను. మనము అనుసరించే మార్గము ధర్మబద్ధమై యుండవలెను. వాస్తవములో దీనియందు ఎన్నుకొనే స్వేచ్ఛ లేనే లేదు. ఏలయన, కర్తవ్యము కొట్ట వచ్చినట్లు ఎదురుగా కనబడుచుండును. చేయవలసిన విధిని అనుష్ఠించుటలో ఎన్నుకొనుట అనే ప్రసక్తి ఏమి గలదు ? కర్తవ్యకర్మను పరిస్థితులే నిర్ణయించుచుండగా, మనము దేనినైననూ ఎన్నుకొనవలసిన పూచీ లేదు. కర్తవ్యమును త్రోసిపుచ్చుటలో మాత్రమే మానవుడు తన ఇచ్ఛాశక్తిని వినియోగించవలయును. మానవుడు తన సంకల్పశక్తిని వినియోగించి విధిని ప్రక్కన బెట్టి ధర్మమునకు విరుద్ధముగా ఆచరించును. విధివిషయములో ఎన్నుకొనే స్వేచ్ఛ యనగా ఇది మాత్రమే. లేదా, కొన్ని సందర్భములలో ధర్మమునకు అనురూపమగు రెండు వికల్పములు ఉన్నచో, మనము ఇచ్ఛాశక్తిని వినియోగించ వచ్చును. ఇంతకు మించి మనకు గల స్వేచ్ఛ యెట్టిది ? అధర్మమును పరిహరించుటలో స్వేచ్ఛ అనే ప్రసక్తియే లేదు. విధినిర్వహణ విషయములో స్వేచ్ఛ యనగా దానిని అనుష్ఠించుటయే. అనగా దాని విషయములో ఎన్నుకొనే స్వేచ్ఛ లేదు. కావున, విధి ఈశ్వరుడే యగును. కావున, ఒక విశిష్టదేశములో మరియు కాలములో తన ముందు కర్తవ్యకర్మరూపములో సంప్రాప్తమైన విధిని అనుష్ఠించుట ద్వారా మానవుడు ఈశ్వరుని ఆరాధించుచున్నాడు ( *తం అభ్యర్చ్య* ). ఆ ఈశ్వరుడు ఎట్టివాడు? ఆయన సర్వవ్యాపి, సర్వజ్ఞుడు మరియు సర్వశక్తిమంతుడు.

సాధారణముగా భగవానుని పుష్పములతో కొలుచుట మొదలగు కర్మలకు అర్చన అని పేరు. కాని ఇచట గోరక్షణము మొదలగు విధులు ఈశ్వరార్చన అగుచున్నవి. వివిధ మానవసముదాయముల విధులను శ్రీకృష్ణుడు పూర్వశ్లోకములలో చెప్పియున్నాడు. వాటిని పరిస్థితులకు అన్వయించి మనము ఒక విశిష్టసమయములో చేయదగిన విధిని నిర్ణయించుకొనవచ్చును. నేను నా కర్తవ్యమును ఖచ్చితముగా అనుష్ఠించుచున్నచో, అది ఈశ్వరార్చనయే యగును. విధినిర్వహణ యనగా మానవుడు తనకు ఈశ్వరునితో సంబంధమును ఏర్పరుచుకొనుట అని యర్థము. కావుననే, విధినిర్వహణలో ఒక ఆనందము గల

దు. అధర్మమును అనుష్ఠించే సందర్భములో కర్తకు గాని, ఆ క్రియవలన ప్రభావితులయ్యే ఇతరవ్యక్తులకు గాని సుఖము ఉండదు. ధర్మానుష్ఠానములో కలిగే ఆనందమును బట్టి అది ఈశ్వరార్చనారూపమని మనము గుర్తించవచ్చును. విధినిర్వహణలో కర్మనియతి, ధర్మనియతి మరియు మనము చేసే పని ఏకరూపముగా నుండును. దానివలన మనకు బరువు తగ్గును. మానవుడు తన జీవితములో నిరంతరముగా విధినిర్వహణలో మగ్నుడై యున్నచో, వాని రాగద్వేషములు ఏమగును ? వాటికి వానిపై గల ప్రభావము ఎట్టిది ? అవి జారిపోవును. బంధహేతువులు కాని రాగద్వేషములు మాత్రమే మిగిలియుండును. అవి మానవునకు విలక్షణమగు వ్యక్తిత్వమును సంపాదించి పెట్టే సుందరమగు రాగద్వేషములు. అంతఃకరణశుద్ధి యనగా బంధహేతువులు కాని రాగద్వేషములను కలిగి యుండుటయే. అట్టి అంతఃకరణములో జ్ఞానము ఉదయించును. జ్ఞాని పూర్తిగా కర్మబంధమునుండి విముక్తుడగును. ఈశ్వరార్చన యనగా విధినిర్వహణయే నని గుర్తించిన మానవుడు సిద్ధిని పొందును ( సిద్ధిం విందతి మానవః ). అనగా, ముందుగా అంతఃకరణశుద్ధిని పొంది తద్ద్వారా జ్ఞానరూపమగు మోక్షమును బడయును.

ఇచటి ప్రముఖతాత్పర్యమేమనగా, ఈశ్వరార్చన యనగా మానవుడు యోగ్యమగు మనఃప్రవృత్తితో తన విధిని నిర్వర్తించుటయే. సాధారణముగా శారీరక, వాచిక, మరియు మానసికములగు విశిష్టక్రియలకు అర్చన యని పేరు. అర్చన అను పదమునకు గల ఆ సంకుచితార్థము ఇచట త్రోసిపుచ్చబడినది. పూజ, ప్రార్థన మొదలగు విశిష్టక్రియలు మానవునకు ఈశ్వరునితో సంబంధమును ఏర్పరుచుటలో సహకరించుటచే, వాటికి అర్చన అనే పేరు వచ్చినది. కాని అంతటితో ఆ సంబంధము అంతమగునని జనులు భావించెదరు. కాని అది సరి గాదు. కారణము మాత్రమే గాక, కార్యము కూడ ఈశ్వరుడే. అనగా, ఈ సృష్టి అంతయు ఈశ్వరుడే. మనము అట్టి ఈశ్వరునకు దూరముగా నుండగలిగే సమయము ఏమున్నది ? కావున, ఈశ్వరుని స్వరూపమే యగు ధర్మమునకు అనురూపముగా మానవుడు ఏ కర్మను ఆచరించిననూ, అది ఈశ్వరునితో సంబంధమును నెలకొల్పును. అట్టి వాడు కర్మయోగి యగును. కాని కర్మయోగి యగుటకు ధర్మము ఈశ్వరస్వరూపమే నను గుర్తింపు అత్యావశ్యకము. నాస్తికుడు నీతిమంతుడే అయిననూ, ఈశ్వరుని అంగీకరించడు గనుక, కర్మయోగి కాజాలడు. ఈశ్వరుని అంగీకరించని మరియొక కర్మయోగము లేదు.

నీతిమంతమగు జీవితమును గడిపే కేవలలౌకికులు గలరు. ధార్మికవిశ్వాసము లేకున్ననూ నీతిమంతమగు జీవితమును గడిపే వ్యక్తులు మనకు ఎందరో కానవచ్చెదరు. ఇంతేగాక, ధార్మికవిశ్వాసము గల వ్యక్తులు నీతిమంతమగు జీవితమును గడుపువారే అయిననూ, ధర్మము ఈశ్వరస్వరూపమేనని గుర్తించి అంతఃకరణశుద్ధి కొరకు కర్మానుష్ఠానమును చేయువారు కానిచో, వారు కర్మయోగులు కారు. అట్టివారు మానసికసంఘర్షణలకు దూరముగా పవిత్రముగా జీవించెదరు. కాని వారు యోగులు కారు. కావున, ఈ శ్లోకములో ( యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ) చెప్పిన విధముగా, ధర్మము ఈశ్వరస్వరూపమనే గుర్తింపు గల వ్యక్తి మాత్రమే కర్మయోగి కాగల్గును.

అప్పుడప్పుడు మాత్రమే ఈశ్వరుని ఆరాధించే వారియందు భక్తిని స్థిరము చేయుటలో పూజాదికమునకు విశిష్టమగు పాత్ర గలదు. కాని పూజ ఇత్యాది కర్మ మాత్రమే ఈశ్వరార్చన యగుననుట సరి గాదు. ఈశ్వరుని అర్చించుటకు ఒక విశిష్ట మగు పూజ మొదలగు కర్మను చేసి తీరవలెననే నియమము లేదు. మనము ధర్మమును ఈశ్వరస్వరూపమని గుర్తించి ధర్మమునకు అనురూపముగా ప్రవర్తిల్లిన ప్రతి పర్యాయము అది ఈశ్వరార్చనయే యగును. ఈ విధముగా ఈశ్వరుని అర్చించు వ్యక్తి సిద్ధిని, అనగా ఆత్మజ్ఞానము ఉదయించుటకు ఆవశ్యకమగు అంతఃకరణశుద్ధిని పొందును. మానవజీవిత ముయొక్క విజయము మరియు పరిపూర్ణత ఆత్మజ్ఞానము మాత్రమే.

వివిధవర్ణముల విధులు పై శ్లోకములలో వర్ణించబడినవి. నాల్గు వర్ణములకు విధించ బడిన ఈ కర్మలను వ్యక్తి యోగ్యమగు మానసికప్రవృత్తితో ఆచరించవలెను. అట్టి మాన సికప్రవృత్తి లేకుండగా విధులను అనుష్ఠించిననూ, అది కర్మయోగము కాబోదు. కాని దానివలన స్వర్గఫలము లభించును. కావున-----

**అధ్యాయము 18 , శ్లోకము 47 :**

श्रेयान् स्वधर्मो विगुणः परधर्मात्स्वनुष्ठितात् ।

स्वभावनियतं कर्म कुर्वन्नाप्नोति किल्बिषम् ।। ४७ ।।

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్

స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ( 47 )

**స్వనుష్ఠితాత్** = చక్కగా నిర్వర్తించబడిన, **పరధర్మాత్** = ఇతరుని విధికంటె, **విగుణః** = గుణహీనమగు, **స్వధర్మః** = తన విధియే, **శ్రేయాన్** = గొప్పది, **స్వభావనియతమ్** = స్వభా వమును బట్టి విధించబడిన, **కర్మ** = కర్మను, **కుర్వన్** = చేయు మానవుడు, **కిల్బిషమ్** = దోషమును, **న ఆప్నోతి** = పొందదు.

ఇతరుల విధిని చక్కగా అనుష్ఠించుటకంటె గుణహీనమైననూ తన విధిని నిర్వర్తించుటయే మేలు. మానవుడు స్వభావమును బట్టి విధించబడిన కర్మను ఆచరించినచో, దోషమును పొందదు ( 47 ).

ఇచట విధి యనగా విశ్వజనీనమగు ధర్మము అని మనము వ్యాఖ్యానించవలె ను. అప్పుడు ఈ ఉపదేశము విశ్వజనీనము అగును. లేనిచో, గీత ఒక విశిష్టమగు దేశ ములో మరియు కాలములో ఒక విశిష్టమానవసముదాయమునకు మాత్రమే చెందిన ఉపదే శమగును. అప్పుడు దానికి గల ఆగమస్థాయి తొలగిపోవును. విశ్వజనీనమైన ఉపదేశము గల గ్రంథము మాత్రమే ఆగమమగును. ఈ ఉపదేశముయొక్క సందర్భము ఒకానొక సంస్కృతికి, లేదా పరిస్థితికి సంబంధించినదే అయినా, దాని స్ఫూర్తి ఖచ్చితముగా విశ్వ జనీనము అయి తీరాలి. ఏలయన, శాస్త్రోపదేశము ఒకానొక మానవసముదాయమునకు గాక, మానవ-ఇతిహాసములోని సర్వమానవులకు వర్తించేదిగా నుండవలెను. గీత ఇచట వైదికః అని గాక, మానవః అని ప్రయోగించియున్నది. కాలము మారినా, సమాజము మారినా, మారని కొన్ని విలువలను గీత బోధించుచున్నది. మానవజాతిని అంతనూ మన స్సులో నిడుకొని నేను మాటలాడుచున్నచో, నా యెదుట భారతీయులు గాని, చైనీయులు

గాని ఉన్నప్పుడు, నా ప్రసంగముయొక్క లక్షణము ఆ సముదాయముచే ప్రభావితమగుట సహజమే అయినా, నా ప్రసంగములోని సారాంశములో మార్పు ఉండదు. చైనీయులను ఉద్దేశించి నేను ప్రసంగించినప్పుడు, నేను చైనాకు సంబంధించిన కొన్ని విషయములను ప్రస్తావించుట సహజమే. మానవచరిత్రలో ఏ కాలములోనైననూ ఉపదేశము ఆ కాలమునకు, మరియు ఆ శ్రోతలకు సంబంధించిన సమస్యలను పరిష్కరింపబూనుట స్వాభావికము. బైబిలు మత్స్యకారులకొరకు ఉపదేశింపబడిననూ, దానియందు సర్వమానవాళికి ఉపయోగించే విషయములు గలవు. ఆ ఉపదేశము మత్స్యకారుల పరిస్థితిని మనసులోనిడుకొని చేయబడినదే అయిననూ, విస్తృతమగు పరిభాషలో అందరికీ ఉపయోగపడవచ్చును. అందువలననే, అది మతగ్రంథమైనది. విశ్వజనీనమైన ఉపదేశమును మనకు అందించే రూపములలో భేదములు ఉన్ననూ, వేర్వేరు పరిస్థితులలో మరియు వేర్వేరు కాలములలో చేయబడిన ఇట్టి ఉపదేశముల సారములో మార్పు ఉండదు.

ప్రస్తుతములో వర్ణాశ్రమసందర్భములో ఈ ఉపదేశము చేయబడినది. వ్యక్తి జన్మించిన సామాజికవర్గము ( వర్ణము ) మరియు జీవితములో వ్యక్తియొక్క అవస్థ ( ఆశ్రమము ) అను అంశములపై ఆధారపడి అతని స్వధర్మము నిర్ణీతమగును. బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము మరియు సన్న్యాసము అను ఆశ్రమములు, బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులనే వర్ణములు వివిధజీవనావస్థలలో వ్యక్తియొక్క విధులను నిర్ణయించును. అది స్వధర్మమగును. వ్యక్తియొక్క మానసికపరిణతి ఈ వ్యవస్థయొక్క ప్రధానోద్దేశ్యము. గీతలో ఈ విషయము ప్రముఖముగా ప్రస్తావించబడినది. దీనికి కారణమేమనగా, మోక్షము అనేది మానవుడు మరణించిన తరువాత పొందేది కాదు. అది మానవుని స్వరూపమై యున్నది. ఈ విషయమును బోధించే ఆధ్యాత్మికగ్రంథమే గీత. ఆ లక్ష్యమును చేరుటకై వేదము ఒక జీవనవ్యవస్థను నిర్దేశించి యున్నది.

జీవనచరమలక్ష్యము నీవే అనేది వేదముయొక్క సందేశము. ఆ లక్ష్యము ఇప్పుడైననూ నీకు దూరముగా లేదు. ఈ సత్యమును గుర్తించకపోవుటయే ప్రధానసమస్య. కాని దీనిలో ఒక భాగ్యము కూడ గలదు. సమస్య నీలో ఉన్నది గనుక, దాని పరిష్కారము నీకంటె భిన్నముగా నుండజాలదు. సమస్య నీవే అయినచో, పరిష్కారము కూడ నీవే. కాని నీవు పరిష్కారరూపములోనికి మారవలసినచో, అది పరిష్కారము కానే కాదు. అందువలననే, మనము జన్మజన్మలలో ఆ ప్రయత్నమును చేసి విఫలులమగుచున్నాము. కాని సమస్యకు పరిష్కారము నీవేనని వేదముయొక్క తాత్పర్యమై యున్నది. కావున వేదములో ప్రతిపాదించబడే జీవనవిధానమంతయు ఆ తాత్పర్యమును దర్శింపజేయుటకు మాత్రమే ఉద్దేశించబడినది. శిల్పి రాయిలో ఒక మూర్తిని దర్శించి దానిని కప్పియున్న శిలాశకలములను ఉలితో నిర్మూలించుచుండును. అదే విధముగా, మానవుడు తన జీవితమునంతనూ ఆత్మస్వరూపమును అభివ్యక్తము చేయు విధముగా మలచుకొనవలెను. మనోవిజ్ఞానశాస్త్రము మరియు మానసికచికిత్స అంతయు ఈ విధముగా మనస్సులో దాగియున్న శక్తులను గుర్తింప చేయుటకు ఉద్దేశించబడినవియే. ఆవరణలను అన్నింటినీ తొలగించివేసి ఆత్మను ప్రకాశింపజేయుటయే ఆత్మజ్ఞానమనబడును.

వాస్తవములో ఆత్మ నిత్యపూర్ణము. కావున, అజ్ఞాననిర్మూలనము కంటిలోని శుక్లములను తొలగించుట వంటిది. కంటిలో శుక్లములు గలవానికి జగత్తు చీకటి యగును. జనులు వానియెదుట ప్రకాశమును, రంగులను మరియు సౌందర్యమును వర్ణించెదరు. కాని వానికి తెలిసేది సున్న. ఆతడు ఏమి చేయవలెను ? శుక్లదోషమును నిర్మూలించుకున్నచో చాలును. అది చాల సరళము. అదే విధముగా, నా బుద్ధిలో అజ్ఞానము ఉన్నచో, దానిని తొలగించు కొనవలెను. ఆకాశము మేఘావృతమై యున్నప్పుడు సూర్యుడు ప్రకాశించుట లేదని మూర్ఖుడు భావించును. కాని సూర్యుడు ప్రకాశించుచునే యున్నాడు.కాని ఆ ప్రకాశము మేఘముల ఆవరణచే కానవచ్చుట లేదు. ఆత్మ కూడ సూర్యుని వంటిదే. ఆత్మ సర్వకాలములలో ఉపలభ్యమగుచునే యున్నది. కాని ఆత్మ బంధింపబడి యున్నట్లు భాసించును ( ఘనచ్ఛన్నదృష్టిః ఘనచ్ఛన్నమర్కం యథా మన్యతే నిష్ప్రభం చాతిమూఢః, తథా బద్ధవత్ భాతి యో మూఢదృష్టేః నిత్యోపలబ్ధిస్వరూపోహమాత్మా ) అని శ్రీశంకరుల శిష్యులగు హస్తామలకాచార్యులు వాక్రుచ్చిరి. కావున, మనము ఈ అజ్ఞానమును తొలగించుకున్నచో చాలును. ఆత్మప్రకాశము గోచరమగును. దీనికి కంటి శుక్లములను తొలగించుట అనేది మరింత మంచి దృష్టాంతము. శుక్లములు తొలగిపోగానే చూపు ప్రకాశించును. అదే విధముగా, ఆత్మ-అజ్ఞానము అనే ఆవరణను పూర్తిగా తొలగించుటయే మోక్షమనబడును.

మానవజీవితలక్ష్యము మోక్షమే. కావున మానవుని జీవనవిధానము ఆ మోక్షము ప్రకటమగుటకు అనురూపముగా నుండవలెను. మానవజీవితమునకు ఇంతకు మించి మరియొక లక్ష్యము ఏది గలదు ? దీనిలో వికల్పములు ఏమియు లేవు. అనగా మానవుడు జీవితములో న్యాయబద్ధమగు ఇతరలక్ష్యములను అన్వేషించ రాదని దీని తాత్పర్యము కాదు. ఒక విశిష్టకర్మను చేసినచో ఒక నిర్దిష్టఫలము లభించునని బోధించే వేదము కూడ మానవుని జీవితములో అనేకలక్ష్యములు గలవని గుర్తించినది. మానవుల కామనలను వేదము అనువదించి వాటిని సాధించుటకై యోగ్యమగు ఉపాయములను కూడ బోధించినది. అనగా, వేదము మానవునకు ధర్మబద్ధమగు మార్గములో భోగానుభవమునకు అభ్యనుజ్ఞను ఇచ్చియున్నది. మానవుడు సంసారములో కొనసాగుటకు కావలసినన్ని సాధ్యములు మరియు సాధనములు గలవు. ఇవి అన్నియు ఉరి వేసుకొనుటకు ఉపయోగపడే త్రాళ్లవంటివి. కాని ధర్మమార్గములో చేయు ప్రయత్నము ఉరిత్రాడు కాబోదు. ధర్మమార్గమును అవలంబించు మానవుడు ఈ సంసారసముద్రమునుండి బయట పడే అవకాశము గలదు.

ఈ సర్వము మానవుడు పరిణతిని చెందుట కొరకు మాత్రమేనని వేదము చెప్పుచున్నది. ప్రపంచములోని భోగములయందు అభిరుచి ఉండుటచే మోక్షమార్గమునకు సంసిద్ధుడు కాని వ్యక్తితో నేను మోక్షమును గురించి మాటలాడినచో, జీవితమును అనుభవించుట చేతకాని నాపై ఆతడు జాలిపడును. అనగా, వ్యక్తి మోక్షమార్గమునకు సంసిద్ధుడై యుండవలెను. ఈ సంగతి వేదమునకు తెలియును. కావుననే, అర్థకామములను కోరు నీవు ధర్మమును ఉల్లంఘించ వద్దని మాత్రమే వేదము బోధించుచున్నది. ధర్మమును పాటించు వ్యక్తి ఎన్నో త్యాగములను చేయవలసి యుండును. విధినిర్వహణలో రాగద్వేష

ములు ప్రక్కకు నెట్టివేయబడును. నిషిద్ధకార్యముల జోలికి పోరాదు. వేదవిహితమగు కర్మను అనుష్ఠించి తీరవలెను. మనము కామ్యకర్మను చేయుటలో తప్పు లేదు. కాని ధర్మమును ఉల్లంఘించ రాదు. మానవుని జీవనయాత్రలో ఇది మొదటి మజిలీ. తరువాత ఇది అంతయు నిరర్థకమని వేదము మరియు గీత మనకు బోధించుచున్నవి ( *యథా ఇహ కర్మచితో లోకః క్షీయతే తథా అముత్ర పుణ్యచితో లోకః క్షీయతే* ). వైదికుడు అల్పము లగు లక్ష్యములను కోరి క్రతువులను ఆచరించుచున్ననూ, అదే సమయములో ఉపనిషత్తు లలోని మంత్రములను కూడ పఠించుటచే, ఆతనికి మోక్షమును గురించి చూచాయగా తెలియవచ్చును. పైగా, ఆతనికి ఈశ్వరానుగ్రహము కూడ గలదు. దానివలన ఆతనికి వివేకము అబ్బును. అప్పుడు యథార్థమగు విచారము ఆరంభమగును.

విచారమనగా నేమి ? మానవుడు జీవితములో ఖచ్చితముగా కోరేది ఏది ? అనే మౌలికమగు పురుషార్థవిచారమును చేయవలెను. వ్యక్తి మోక్షమును కోరే సందర్భములో కూడా ఆతనికి మోక్షమును గురించి ఉండే ధారణలను పరిశీలించదగును. కొందరి దృష్టిలో స్వర్గమును పొందుటయే మోక్షము. కొందరికి జీవితలక్ష్యము సకారాత్మకమగు స్వర్గప్రాప్తియైననూ కాదు. వారికి నరకమనగా భయము గలదు. అంతే. వారు భయపడే ఈ నరకమనగా నేమి ? విశ్వాసములైననూ ఒకింత యుక్తియుక్తముగా నుండవలెను. స్వర్గ మనగా సుఖానుభవము. దుఃఖానుభవమే నరకము. ఈ రెండు పరిచ్ఛిన్నములే. అనుభవ రూపములగు స్వర్గనరకములు శాశ్వతములుగా నుండే అవకాశము లేదు. పురుషార్థవిచార మనగా నిదియే. నిత్యవస్తువు కర్మచే లభించేది కాదు అనే సత్యమును గుర్తించిన వ్యక్తి యొక్క జీవనశైలి మారిపోవును. అంతవరకు ఆతడు తన శక్తిని అంతనూ అర్థకామము లను మరియు ధర్మము ( పుణ్యము )ను సంపాదించుటకై వినియోగించెను. ఇపుడు సర్వము మోక్షమనే లక్ష్యము వైపునకు మళ్లించబడును. ఏలయన, ఆతడు తన అనుభవ ములను మాత్రమే గాక, ఇతరుల అనుభవములను కూడ విశ్లేషించి అనుభవముల వలన ప్రయోజనము లేదని గుర్తించినాడు. చాల మంది తమ అనుభవములనుండి యైననూ పాఠములను నేర్చుకొనరు. ఇది ఒక విచిత్రము. మన పూర్వీకులు అందరు మరణించిరి. మనము వరుసలో నిలబడి యున్నాము. అయిననూ, మనము ఆ విషయమును గురించి పట్టించుకొనము. ఇది పెద్ద అద్భుతము. మాయాశక్తి ఇంత గొప్పది. కాని, ఈ సత్యమును గుర్తించిన మానవుడు మిగిలియున్న సమయమును మోక్షము కొరకు వెచ్చించుట సహజ మే. ఆతడు త్యాగమును చేయుట లేదు. తనకు అనావశ్యకమగు దానిని దూరముగా నుంచినాడు. అంతే. మానవుడు తన దృష్టిలో విలువ లేని వస్తువును పరిత్యజించడు. విలువ గల వస్తువు విషయములో మాత్రమే పరిత్యాగము అను మాటకు అర్థము గలదు. చెత్తను పారవేయుటలో త్యాగము ఏమి గలదు ? మోక్షముయొక్క విలువను గుర్తించిన వ్యక్తి దేనిని పరిత్యజించును ? ఆతడు పరిత్యజించేది ఏదియూ లేదు.

ఈ మార్గములో పయనించే వ్యక్తిని ఉద్దేశించి కొందరు,' నీవు సర్వదా నీ గురించి మాత్రమే చింతిల్లే స్వార్థపరుడవు' అని తప్పు పట్టెదరు. వాస్తవములో శాస్త్రము మానవుని ఆత్మావలోకనపరుడవు కమ్మనియే శాసించుచున్నది. ప్రతి మానవుడు తన గురించి

మాత్రమే చింతిల్లును.' నేను నా గురించి చేయుట లేదు' అని చెప్పే వ్యక్తికి తన ప్రవృత్తి యొక్క స్వరూపము తెలియలేదని చెప్పవచ్చును. ' నేను స్వార్థపరుడను కాదు ; నేను ఇతరుల హితము కొరకు పాటు పడుచున్నాను' అని దానధర్మములను చేయు వ్యక్తి చెప్పవచ్చును. ఆతనిని నేను ఇట్లు ప్రశ్నించెదను : ఇతరులను ఉద్ధరించుటకు నీవు ఎవ రివి ? నీ జీవితము సజావుగా సాగుటకు అనేకవ్యక్తుల సహకారము ఆవశ్యకమగుచున్నది. నీవు ఈ రోజు తినే ఆహారము ఎట్లు వచ్చినది ? దాని వెనుక ఎంతమంది వ్యవసాయ కూ లీల శ్రమ గలదు ? వందలాది శక్తుల అనుగ్రహమువలన నీవు జీవించియున్నావు. ఎవరు ఎవరికొరకు పని చేయుచున్నారు ? ఎంతో మంది వ్యక్తులు నీకొరకు పని చేయుచుండగా, ' నేను ఇతరులకొరకు పని చేయుచున్నాను ' అని నీవు బీరములను పలుకుచున్నావు. సమాజము నీకు సేవను చేయు అవకాశమునిచ్చుటయే అన్నింటికంటె గొప్ప సేవ. ప్రతి మానవుడు ఇతరులకు ఇవ్వాలని అనుకుంటాడే గాని, ఇతరులనుండి తీసుకోవాలని అనుకో డు. ప్రతిగ్రహము మానవుని గౌరవమునకు విరుద్ధమైనది. కావున, ఇతరులు మన వద్ద నుండి దానమును స్వీకరించుట మనకు గొప్ప వరమని గ్రహించవలెను. దానమును స్వీక రించువాడు లబ్ధిని పొందుట కనపడుచునే యుండును. కాని దానమును ఇచ్చువాని లబ్ధి మరింత గొప్పది. ఏలయన, ఈయగల్గుట గొప్ప అనుగ్రహము. దానము యొక్క స్వరూపము ఇది.

ఇంతేగాక, మానవుడు దానమును చేయుటకు కారణమేమి ? ఇతరుడు బాధపడు చుండగా చూచి తాను ఆనందించ లేక పోవుటయా ? అట్లైనచో, దాత తన ఆనందము కొరకు మాత్రమే దానమును చేయుచున్నాడని స్పష్టమగుచున్నది. అది సహజమే. మాన వుడు సమష్టిలో అంతర్భాగమై యున్నాడు. కావున, సమష్టిలో దుఃఖము విజృంభించు చుండగా తాను సుఖించలేడు. కావున, ఇతరుల దుఃఖమును తగ్గించుటకై తనకు చేతనైన సాహాయ్యమును చేయగోరును. దీనిలో నిస్స్వార్థము ఏమున్నది ? మానవుడు తన కొరకు, తన అభివృద్ధికొరకు, తన మనశ్శాంతి కొరకు దానధర్మములను చేయుచున్నాడు. దానిలో తప్పు లేశమైననూ లేదు. నిస్స్వార్థసేవ అనేది ఏదీ లేదనియు, స్వసేవ మాత్రమే గలద నియు స్పష్టము చేయుటయే నా తాత్పర్యము. ఈ ' స్వ ' అనునది వర్గము కావచ్చును; లేదా, దేశము కావచ్చును. ఈ స్వత్వము ధార్మికమగు ( పుణ్యమును కోరు ) వ్యక్తియైననూ కావచ్చును. కావున, దానధర్మములతో సహా మానవుడు చేసే సర్వకార్య ములు తన కొరకు మాత్రమే ఉద్దేశించబడినవి. కాని మోక్షమార్గములో వ్యక్తి యొక్క సావ ధానత, సమయము మరియు సాధనసంపత్తి సంసారమునుండి తన విముక్తి కొరకు మాత్రమే వెచ్చించబడును. సమాజసేవలన్నింటిలో అది గొప్పది. ఏలయన, జీవన్ముక్తు డైన వ్యక్తి వలన ఏ ప్రాణికైననూ ఇబ్బంది ఉండదు. మరింత అన్వయముఖముగా చెప్పాలంటే, జ్ఞాని ఇతరులకు ఆశ్రయమగును. జ్ఞానితోడి సంగములో మానవులు మోక్షము సంభవమేనను ఆకాంక్షను తమలో ఆవిష్కరించు కొనెదరు. ఇది అన్నింటి కంటె గొప్ప సేవ.

ఈ మోక్షమును పొందుటకు కావలసిన అర్హతలను సంపాదించుట కొరకై శాస్త్రము కర్మయోగమును విధించుచున్నది. దానివలన వ్యక్తి రాగద్వేషముల పట్టునుండి విడుదలను పొందును. మానవునకు రాగద్వేషములు ఉండరాదని నేను బోధించుట లేదు. ఈ విషయమును గమనించుడు. రాగద్వేషములనుండి పూర్తిగా విముక్తుడైన మనిషి ఏ కాలములోనైననూ లేడని నా అభిప్రాయము. శ్రీకృష్ణుడైననూ గిటారును గాక, వేణువును ఎన్నుకొనినాడు. ఆయనకు కూడ కొన్ని రాగద్వేషములు గలవు. శ్రీశంకర,వసిష్ఠ, వామదేవులు కూడ అంతే. రాగద్వేషములనుండి పూర్ణముగా విముక్తులైనవారు ఎవ్వరూ లేరు. రాగద్వేషములు మానవుని బంధించ గలవు. లేదా, అవి కేవలము విభూతిమాత్రములై కూడ ఉండవచ్చును. శాస్త్రములో రాగద్వేషముల ప్రసక్తి వచ్చిన సందర్భములన్నింటిలో అవి బంధహేతువులు కాని రాగద్వేషములు కావు. శ్రీకృష్ణునకు మురళిని వాయించుట అభీష్టమే అయినా, అది ఆయనకు రాగము కాదు. ఏలయన, ఆయనకు మురళి లభించనిచో, కూర్చుండి దుఃఖించడు. అనగా ఆయనకు మురళిపై బంధహేతువు కాని ప్రీతి గలదు. ఈ విషయమును మనము స్పష్టముగా తెలియవలెను. రాగద్వేషములు బంధించు విధమెట్టిది ? ఒక కోరిక తీరని సందర్భములో నిరాశ, చీకాకు, అనుతాపము లేక క్రోధము కలిగినచో, అది బంధహేతువగు రాగమని తెలియవలెను. మనము కేవలము మనోవిజ్ఞానమునకు మాత్రమే సంబంధించిన మానసిక సంసిద్ధతను గురించి మాటలాడుచున్నాము. మనము వివిధవిషయములను దర్శించి అవగాహన చేసుకొనే సందర్భములలో కొన్ని మనఃప్రవృత్తులు నిర్మాణమగును. మనము కొన్ని సత్యములను దర్శించి అర్థము చేసుకున్నప్పుడు దాని ప్రభావముచే ఒక విశిష్టమగు మనఃప్రవృత్తి నిర్మాణమగును. అది ఈ జ్ఞానమునకు అత్యావశ్యకము. కర్మ మరియు కర్మఫలము అను విషయములను గురించి మనకు సరియగు అవగాహన ఉన్నచో, ఆ అవగాహననుండి ఒక విశిష్టమగు మనఃప్రవృత్తి నిర్మాణమగును. మనఃప్రవృత్తి యనగా మానసిక భావావేగము ( emotion ) మాత్రమే గదా ! ఇట్టి సత్యములను అవగాహన చేసుకొనుట ద్వారా మనము మనఃప్రవృత్తిలో సముచితమగు మార్పులను చేసుకొని మానసిక పరిపక్వతను పొందవచ్చును. అంతరంగములో మనిషి ఎదుగుదలను ఆతని మనఃప్రవృత్తి ( attitude ) సూచించు చుండును.

మనకు హఠాత్తుగా చాల ఇబ్బందికరమైన పరిస్థితి ఎదురైనదనుకొనుడు. ఆ పరిస్థితిని కల్పించిన ఘటనలను గురించి మనకు అవగాహన ఏమియు లేకుండుటచే, అది సంభ్రమాశ్చర్యములను కలిగించును. లేదా, మన యెదుట హఠాత్తుగా చాల ఆనందకరమైన పరిస్థితి సాక్షాత్కరించిన దనుకొనుడు. దానిని ఎట్లు ఎదుర్కొనవలెను ? ఇట్టి పరిస్థితులలో దుఃఖమును, లేదా హర్షమును పొందని వ్యక్తి విజయమును సాధించినట్లే. ఆతని మనస్సు పరిపక్వమైనది. సర్వానుభవములయందు రాగద్వేషములకు లోనుగాని వ్యక్తిని పరిస్థితులు బాధించవు. వాటి వలన ఆతని వివేకము మరింత అధికమగుచుండును. ఆతని నిరాటంకమగు జీవనయాత్రలో ప్రతి దినము నిత్యనూతనముగా నుండును. ఆతని యెదుట వివిధఘటనలు వచ్చి పోవుచుండును. జీవితమనగా నంతే. గడియారములోని ముల్లు టిక్ టిక్ శబ్దమును చేయుచుండగా కొత్త కొత్త ఘటనలు మన ముందుకు వచ్చి

చుండును. ఒక ఘటనకు మరియొక దానితో సంబంధము లేదు. మనము ఏమి చేయవలెను ? మనము కొత్త ఘటనను స్వాగతించుటకు సంసిద్ధులమై యుండవలెనా ? లేక, గతములో మునిగిపోయి ఉండవలెనా ? సాధారణముగా మానవుడు గతము అనే శ్మశానములో గాని, భవిష్యత్తు అనే తల్లి గర్భములో గాని నివసించి యుండును. కొత్త కొత్త ఘటనలు ఎదురగుచున్నప్పుడు మానవుడు ప్రతి ఘటనయొక్క సందేశమును స్వీకరించుటకు సంసిద్ధుడై యుండవలెను. ఆ విధముగా చేయగలిగిన వ్యక్తి యున్నచో, ఆతడే విజేత. అట్టివానిలో రాగద్వేషములు బంధహేతువులు కావు. ఆతనికి మరికొన్ని రాగద్వేషములు ఉన్ననూ ఇబ్బంది లేదు.

శాస్త్రము రాగద్వేషములను ప్రస్తావించిన సందర్భములన్నింటిలో అవి బంధహేతువులగు రాగద్వేషములు మాత్రమే. ఈ విషయమును గమనించుట ముఖ్యము. లేనిచో, సాధకుడు సర్వవిధముల రాగద్వేషములను విడనాడవలెననే భావనలో నుండును. అది అసంభవము. సర్వవిధముల రాగద్వేషములను వీడనిదే జ్ఞానము లేదు అను ధారణ యుక్తియుక్తము గాదు. మనము మాటలాడే మోక్షమునకు అర్థమేమనగా, ఒక ప్రత్యేకస్థితిని పొందాలనే ఆకాంక్షనుండి విముక్తియే.

'నీవు ఉన్నవాడవు ఉన్నట్లుగా ఉండుము ' అని చాలమంది సలహానిచ్చెదరు. తన వ్యక్తిత్వము తనకు ఆమోదయోగ్యము కాని వ్యక్తి విషయములో ఈ సలహాను పాటించుట ఎట్లు సంభవమగును ? మనిషి తనకు తాను ఆమోదయోగ్యుడు అయి ఉండవలెను. ఈ అంశములో వేదాంతమునకు మహత్త్వపూర్ణమైన స్థానము గలదు. ఆత్మ యథాతథముగా ఆమోదయోగ్యమని వేదాంతము బోధించుచున్నది. అనగా మనకు గల సమస్యలు యుక్తియుక్తములే యని ఆమోదించుట వేదాంతముయొక్క తాత్పర్యము కాదు. ఈ జ్ఞానము ఉదయించుటకు కావలసిన తయారీలో ఈ రకమైన ఆమోదము కూడ ఆవశ్యకమగుచున్నది. తనకు గల సమస్యలు యుక్తిసంగతములే అని ఆమోదించే వ్యక్తియొక్క దృష్టిలో తన సమస్యలు గాని, ఇతరుల సమస్యలు గాని విలక్షణమైనవి కావు. సమస్యలు అన్నీ 1+1 = 2 వంటివి మాత్రమే. కొన్ని బాహ్యపరిస్థితులు కొన్ని ప్రత్యేకమగు మానసిక ధారణలకు హేతువులగును. ఈ విధముగా తనకు గల సమస్యలు సర్వజనసాధారణమైనవి మరియు యుక్తిసంగతమైనవి అనే అవగాహనను పొందిన వ్యక్తి ఈ జ్ఞానమార్గములో ముందునకు సాగుటకు కావలసిన అర్హతను సంపాదించినవాడు అగును. ఇట్టి మానసికమగు అవగాహన కర్మయోగము వలన కలుగును. మనముందు అనేకరకముల కర్మలు గలవు. వీటిలో ఏది శ్రేష్ఠమైనది ? ఇల్లు ఊడ్చుటయా ? అన్నము వండుటయా ? మనము చేయవలసిన పనులు వందలాది గలవు. వాటిలో ఏది మంచిది అను విషయమును మనము తెలియగోరు చున్నాము. ఏదియూ మంచిది కాదు. విధి అనే భావనను పెంపొందించుకొని,విధినిర్వహణలోని సౌందర్యము నాస్వాదించుటలో, మనఃప్రవృత్తి పరిపక్వమగుటలో ఏ కర్మ సహకరించునో, అదియే శ్రేష్ఠమగు కర్మ అగును. విధిని నిర్దేశించే వ్యవస్థ ఉపలభ్యముగా నున్నచో, మనకు ఇబ్బంది లేదు. మానవుడు ఎదుగుటకు అంతకు మించిన ఉపాయము లేదు. కాని దానిని అంగీకరించే పరిణతి మానవులకు ఉండవలెను.

కముగా ఎదుగుదల లేని సమాజము దాని విశిష్టతనైననూ గుర్తించజాలదు. దానిలో విభేదము, నియంత్రణ మొదలగు అంశములు మాత్రమే కానవచ్చును. మానవజాతి కరించ గల్గినచో, ఇది చాల గొప్ప వ్యవస్థ. కర్మ పలు విధములుగా నున్నది. ఒక మరియొక కర్మకంటె గొప్పది అను ప్రసక్తియే లేదు. జనుల నైపుణ్యములు విభిన్న నున్నవి. వివిధరకముల పనులకు సమాజములో ఆవశ్యకత గలదు. కావున విభిన్న విభిన్నములగు కర్మలను చేసెదరు. వర్ణాశ్రమవ్యవస్థలో ఇది సుస్పష్టముగా నిర్దే బడి యుండెను. అది లేని పరిస్థితిలోనైననూ మానవుని విధి సర్వకాలములలో ము సర్వదేశములలో సుస్పష్టముగా తెలియుచునే యుండును. దానిని ఇదమిత్థ చెప్పవలసిన ఆవశ్యకత లేదు. ఆ విషయమే ఇచట స్పష్టము చేయబడుచున్నది.

మానసిక పరిణతి లక్ష్యముగా గల వ్యక్తికి తన విధియే శ్రేష్ఠమైనది ( స్వధర్మే శ్రేయః ). కాని మరియొకటి లక్ష్యముగా గల వ్యక్తి ఇతరవిషయములను, అనగా ందు అధికారము గలదు ? ఏ ఉద్యోగము గొప్పది ? ఏ చదువు ప్రయోజనకారి ? ఇత్యాది విషయములను పరిగణించ వలసియుండును. విద్యార్థి 5వ తరగతిలో నే ఈ పరిగణన ఆరంభమగును. మానసికమగు పరిపక్వత గాక ఇతరము లక్ష్య గల సందర్భములలో వర్ణాశ్రమవ్యవస్థ ఉపయోగించదు. అందువలననే, వేదతా గు మోక్షమార్గమునుండి జనులు కొద్దిగా ప్రక్కకు తప్పుకోగానే, ఆ వ్యవస్థ న్నము కాజొచ్చినది. తత్త్వజ్ఞానముయొక్క అవగాహనలోని ప్రయోజనమును ుట ( తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ) జీవనమూల్యములలో ఒకటి యని భగవానుడు కముగా నిర్దేశించి యున్నాడు. మోక్షము లక్ష్యముగా గల వ్యక్తికి జీవితములో ఇత సర్వము తన స్థానములో నుండును. కావున, మోక్షము జీవితచరమలక్ష్యము అను ని మనము విస్మరించరాదు. దానిని విస్మరించినచో, దాని స్థానమును అర్థకామ ఆక్రమించును. అప్పుడు కేవలము మోక్షమునకు ఆవశ్యకమగు మానసిక పరిణ చ్చుటకు మాత్రమే ఉపకరించే ఈ వ్యవస్థ పాడు అగును. జీవితచరమలక్ష్యమును చిన వ్యక్తికి ఏ ఉద్యోగమైనా మంచిదే. ఆతడు చేసే కర్మ ఏదైనా బంధించదు. ఉద్యోగములు మరికొన్ని ఉద్యోగములకంటె గొప్పవి యని గాని, ఒకానొక కర్మ వది యని గాని ఆతడు భావించడు. మానవులకు వారి వారి స్వభావములను బట్టి వృత్తికంటె మరియొక వృత్తి ప్రీతిపాత్రము కావచ్చును. అది సహజమే. కాని కొన్ని గొప్పవి అనియు, మరికొన్ని అల్పములనియు భావించుట తగదు. అట్టి ధారణ ధారముగా చేసుకొని వృత్తిని ఎన్నుకొనుట వలన అంతరంగపరిణతి సిద్ధించదు. కర్మ విషయములో కేవలము తన ఇష్టానిష్టములను మాత్రమే ఆధారముగా చేసు ముందుకు సాగినచో, ఆతనికి నచ్చిన వృత్తి లభించనిచో ఏమి చేయవలెను ?

మనస్సునకు నచ్చిన దానికొరకు అర్రులు చాచుట కంటె, లభించిన దానిని దా ంచుట ఉత్తమము. ఒకవేళ మనకు నచ్చిన ఉద్యోగము లభించిననూ, ఆ నచ్చు తాత్కాలికము మాత్రమే. కొద్ది రోజులలో మనస్సు మరియొకవైపుకు తన దృష్టిని చును. ఈ పరుగునకు అంతము లేదు.

వ్యక్తియొక్క లక్ష్యము అంతరంగపరిణతి యైనచో, చక్కగా అనుష్ఠించబడే పరధర్మముకంటె ఒక మోస్తరుగా చేసిన స్వధర్మమే గొప్పది ( శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ) . ఈ వాక్యములో అపి అను అవ్యయమును జోడించవలెనని శ్రీశంకరులు అభిప్రాయపడిరి. అనగా, స్వధర్మమును సరిగ్గా అనుష్ఠించ లేకపోయినా, ఇతరుల ధర్మమును చక్కగా అనుష్ఠించుటకంటె అదియే శ్రేష్ఠము. విగుణః అను పదము నకు అభీష్టము కానిది అని కూడ అర్థమును చెప్పవచ్చును. తన ధర్మము ప్రీతికరము కాకున్ననూ, దానిలో ధనము లేకున్ననూ, అది గౌరవహేతువు కాకున్ననూ, చక్కగా ఆచరించ బడే ఇతరుల ధర్మము కంటె అదియే శ్రేష్ఠము. భగవానుడు ఇచట శ్రేయః అను పదమును ప్రయోగించుట గమనించ దగినది. మిక్కిలి కొనియాడ దగినది ( అతిశయేన ప్రశంసనీయమ్ ) అని దాని యర్థము.

అది శ్రేష్ఠము అగుటకు కారణమేమి ? వ్యక్తికి తన విధిని తాను నిర్వర్తించుట మానసికముగా చాల ప్రముఖమైన విషయము. ఏలయనగా, ప్రత్యేకించి వర్ణాశ్రమవ్యవస్థలో వ్యక్తియొక్క ధర్మమును వాని స్వభావము నిర్ధారించును ( స్వభావనియతం కర్మ). మనిషియొక్క మానసికసంరచనలో సత్త్వరజస్తమోగుణముల పాళ్లు ప్రధానపాత్రను వహించును. అట్టి సంరచనను ఆధారముగా చేసుకొని శాస్త్రము ఒక కర్మను నిర్దేశించినది. దానిని చేయుటలో వ్యక్తికి దోషమేమియూ అంటదు ( కుర్వన్ న ఆప్నోతి కిల్బిషమ్). దీని తాత్పర్యమేమనగా, వ్యక్తికి స్వధర్మానుష్ఠానములో ఇతరసమస్యలు గాని, సంఘర్షణ గాని ఉండదు. మానవుని మనఃప్రవృత్తి సముచితరూపములో తీర్చి దిద్దబడుటకు ఇది చక్కని ఆలంబనము. ప్రస్తుతములో ఇట్టి మనఃప్రవృత్తి ఆత్మ పూర్ణమనే జ్ఞానమును పొందుటకు సహకరించును. వ్యక్తియొక్క స్వభావమును బట్టి అతనికి విధించబడిన కర్మకు స్వభావనియతం కర్మ అని పేరు. మానవుడు తన స్వభావమునకు అనురూపమైన ధర్మమును అనుష్ఠించినచో, దోషమును పొందదు. మూడు గుణముల మేళవింపుతో ఏర్పడే స్వభావమునకు అనురూపమైన ప్రవృత్తిలో సంఘర్షణకు తావు లేదు ( న ఆప్నోతి కిల్బిషమ్ ). ఇది మనోవిజ్ఞానమునకు సంబంధించిన సత్యము. మానవుడు తన సహజ స్వభావమునకు సరిపడని కర్మను చేయుచున్నచో, అది ఆత్మవిరుద్ధమగుటచే సంఘర్షణకు దారితీసి అంతరంగపరిణతిని కుంటుపరచును.

వర్ణాశ్రమధర్మము అనే ప్రకరణములో *కిల్బిషమ్* అనగా సంఘర్షణ మాత్రమే గాక, పాపము అని కూడ అర్థము వచ్చును. ఏలయనగా, తనకు విహితమైన కర్మను ఆచరించని వ్యక్తి ధర్మమును ఉల్లంఘించుటచే పాపమునకు పాత్రుడగును. వ్యక్తియొక్క స్వభావమునుండి పుట్టే ( స్వభావజమ్ ) కర్మను గురించి చర్చించిన తరువాత ఈ వాక్యము చెప్పబడినది గనుక, ఆ కర్మ వ్యక్తిలోని గుణముల మేళవింపుయొక్క సహజమగు అభివ్యక్తియే గాని, మరియొకటి కాదు. వ్యక్తి తన స్వభావమునకు తగిన కర్మను ఎన్నుకున్నచో, సంఘర్షణనుండి తప్పించుకొనును. సంఘర్షణలు లేని మనస్సు ప్రశాంతికి నిలయమై సత్త్వగుణాధిక్యమును పొందును. స్వభావమును బట్టి తనకు విధించబడిన కర్మను ఆచరించు వ్యక్తిలో మనస్సు పరిపక్వమై, మనము ఇదివరలో చర్చించిన శమదమాదిసద్గుణ

ములు నెలకొనును. అట్టి వ్యక్తి విహితకర్మను కష్టమైనా, తేలికయైనా విడువకుండగా ఆచరించును. ఉదాహరణకు వేదాధ్యయనమును చేయవలసిన బ్రాహ్మణుడొకడు అది చీకాకును కలిగించుటచే విసుగు చెంది, సాహసకార్యములను చేయగోరి సైన్యములో చేరినాడనుకొనుడు. సహజస్వభావమును బట్టి ఆతడు మంచి సైనికుడు కాలేడు. సైన్యములోనున్నాడు గనుక, మంచి బ్రాహ్మణుడు కాలేడు. కావున, అది ఆతనికి సమస్యగా పరిణమించును. విధిని నిర్ణయించే వ్యవస్థ ఉన్న సందర్భములోనైనా, లేక స్వభావమును బట్టి విధిని నిర్ధారించే సందర్భములోనైనా, ఈ చర్చ అంతా అంతరంగవికాసము కొరకు మాత్రమేనని గ్రహించదగును. మనస్సు ప్రశాంతముగా నుండవచ్చును. లేదా, మనస్సు అలజడితో నిండి ఉండే అవకాశము కూడ గలదు. కావున, మానవునిలో అంతరంగవికాసము కొరకై ఒక విశిష్టమగు ప్రక్రియ గలదు.

దేహమునకు భౌతికమగు ఎదుగుదల ఉన్నది. మనస్సునకు బౌద్ధికమగు ఎదుగుదల గలదు. అటులనే, మనస్సునకు భావాత్మకమగు ఎదుగుదల కూడ గలదు. మనస్సులో విజ్ఞానము మాత్రమే పెరిగిన చాలదు. విభిన్నమగు పరిస్థితులను సరిగా అవగాహన చేసుకొని స్పందించే సామర్థ్యము మనస్సునకు ఉండాలి. మనస్సులో బోలెడు సమాచారము ఉన్నచో, అది సరిపడదని మనకు స్పష్టమగుచునే యున్నది. మన పూర్వతరముల వారికి మన వద్ద ఉన్నంత విజ్ఞానము ఉండెడిది కాదు. కాని సర్వమానవులు తెలియదగిన కొన్ని సత్యములు వారికి చక్కగా తెలిసి యుండెడివి. మంచి జీవనమనగా నేమి? ఎట్లు జీవించుట తప్పు అగును ? పరిస్థితులను ఎట్లు ఎదుర్కొనవలెను ? ఇత్యాది విషయములు వారికి తెలిసి యుండెడివి. ఈ విషయములు ఆధునిక మానవునకు రాతియుగపు మానవునితో సమముగా వర్తించును. తన కంప్యూటరు పని చేయనిచో ఆధునిక మానవుడు కంగారు పడును. రాతియుగపు మానవునకు కూడ తన రాతి పనిముట్టు చెడినప్పుడు మానసికమగు అలజడి అనే సమస్య ఉండెడిది. సమస్య ఇద్దరికీ సమానమే. అలజడి చెందియున్న మనస్సును కుదుట పరుచుట అను సమస్యను వారిద్దరు పరిష్కరించుకొనవలెను. అధికమగు సమాచారము తెలిసి ఉన్నంత మాత్రాన అది సమస్యకు పరిష్కారము కాబోదు. వ్యక్తికి తెలిసిన సమాచారము తక్కువ అయినా, ఎక్కువ అయినా, ఆతడు జీవితమును గడుపవలెను గదా ! అనగా, ఆతడు తన మనస్సును తాను ఎదుర్కొనవలెను. ఆతడు భావావేశములపై నియంత్రణను సాధించవలెను. అనగా, ఆతడు అవగాహనను పెంపొందించుకొని మానసికముగా పరిపక్వతను పొందవలెను.

మానసికమగు ఎదుగుదల రెండు రకములుగా నున్నది. ఒకటి జ్ఞానరూపము. రెండవది అనుభవరూపము. జ్ఞానరూపమైన పరిపక్వతను గురించి గీత బోధించుచున్నది. మానవుడు తన జీవితములో ప్రధానముగా ఇతరులతోడి వ్యవహారములలో అనుభవరూపమైన పరిపక్వతను పొందును. దీనికొరకై వ్యక్తి వివాహమాడి ఇద్దరు ముగ్గురు పిల్లలను కనిన చాలును. అపుడా వ్యక్తికి జీవితమంతయు ఇతరులతో కలిసి జీవించుటలోని కష్టసుఖములు అవగాహనకు వచ్చును. ఆ ప్రక్రియలో ఆతడు మానసికముగా ఎదుగుట నిశ్చ

యము. మన పూర్వీకులు అటులనే చేసి మానసికపరిపక్వతను పొందిరి. ఆ పరిపక్వత వారి జీవితములు సుఖముగా గడుచుటకు సరిపడినది.

మానసికమగు పరిపక్వత గల వ్యక్తికి ప్రమాణము లభ్యమైనచో చాలును.ఇతరముతో పని లేదు. కావున, జీవితప్రధానలక్ష్యము మనస్సును వ్యవస్థితము చేసుకొనుటయే. ఉదాహరణకు కలనగణితము నభ్యసించుటకు కావలసిన తయారీకి ఎన్ని సంవత్సరముల కాలము పట్టును ? చాల సంవత్సరములు పట్టును. ప్రస్తుతములో నేను ఆత్మస్వరూపుడనగు నాయొక్క అనంతత్వమును గుర్తించవలసియున్నది. దాని తయారీకి కొంత సమయము పట్టుటలో విడ్డూరమేమియు లేదు. అధికసమయము పట్టునని బెంగ పడనక్కర లేదు. ఆ సమయమంతయు సద్వినియోగమే. కావున, మానవుని ప్రయత్నమంతయు మనస్సును సంసిద్ధము చేయుట కొరకు మాత్రమే. తరువాత జ్ఞానసాధనము, అనగా ప్రమాణము ( తత్ త్వం అసి ) ఉన్నచో, చాలును. ఆ జ్ఞానము ఉదయించుటకు సమయము పట్టదు. జ్ఞానోదయమునకు అనురూపముగా మనస్సును తయారు చేయుటయందు మాత్రమే కాలము పట్టును. ఆ రకమైన సంసిద్ధత కొరకై చేయవలసిన సాధనను గీత మనకు బోధించుచున్నది. కావుననే, గీత యోగశాస్త్రము అగుచున్నది.

శ్రీశంకరులు తరువాతి శ్లోకమునకు అవతారికలో ఇట్లు ప్రస్తావించిరి : మానవుడు తనకు స్వభావానురూపముగా విధించబడిన కర్మను అనుష్ఠించినచో దోషమును పొందడు. దీనికి ఒక దృష్టాంతము గలదు. విషక్రిమినుండి జన్మించే క్రిమికి ఆ విషము హానికరము కాదు. విషక్రిమియొక్క విషము మనకు హానికరమైననూ, దానికి గాని, దాని సంతానమునకు గాని హానికరము కాదు. అదే విధముగా, వ్యక్తి స్వధర్మమును అవకతవకగా ఆచరించిననూ, అది వానికి హానిని కలిగించదు. కాని పరధర్మమును ఆచరించుట హానికరమగును. తన స్వభావమునకు అనురూపముగా ఆచరించు వ్యక్తి అన్ని విధముల సంఘర్షణలనుండి తప్పించుకొనుటయే గాక, రాగద్వేషములకు శీఘ్రముగా అతీతుడగును. కావున, అంతరంగపరిణతి కొరకై మానవుడు తాను ఆచరించుచున్న విధిని మార్చ బని లేదు. అధికమగు ధనమును సంపాదించుటకు, లేదా అధికారము మొదలగు వాటికొరకు, ఉద్యోగములో మార్పు ఆవశ్యకమగునే గాని, అంతరంగపరిణతి కొరకు అట్టి మార్పు అవశ్యకము కాదు. అంతరంగ పరిణతిని కలిగించుటకు కర్తవ్యవిధిని యోగ్యమగు మనఃప్రవృత్తితో ఆచరించుట అనే కర్మయోగము సరిపడును. ధర్మము ఈశ్వరస్వరూపమే. కావున, ధర్మమును తప్పక అనుష్ఠించవలెను. ఈ విధమగు దృష్టితో జీవించు వ్యక్తి సిద్ధిని బడయుట ( సిద్ధిం విందతి మానవః ) తథ్యమని మనము ఇదివరలో చూచియున్నాము.

మనము జ్ఞానులము అయినా, కాకపోయినా, కర్మను విడిచిపెట్టుట సంభవము కాదు. అజ్ఞానికి కర్మను విడిచిపెట్టుట అసంభవము. జ్ఞాని కర్మను శారీరకముగా విడిచిపెట్టడు. జ్ఞాని జ్ఞానప్రభావముచే కర్తృత్వధారణను మాత్రమే విడిచిపెట్టును. జ్ఞాని సన్న్యాసియైనచో భిక్షకు పోవలెను గదా ! భిక్ష కూడా కర్మయే. కావున, కర్మను శారీరకముగా విడిచిపెట్టుట ఎవ్వరికైననూ సంభవము కాదు. కాని జ్ఞానియందు తాను కర్తను అనే ధారణ ఉండదు గనుక, ఆయన కర్మను చేయుట లేదని మనము చెప్పవచ్చును. వాస్తవమగు

సన్న్యాసము అదియే. విహితకర్మను విడిచిపెట్టి సన్న్యాసాశ్రమము అనే జీవనశైలిని జిజ్ఞాసువు చేపట్టవచ్చును. లేదా, జిజ్ఞాసువు కర్మయోగియై సిద్ధిని బడయవచ్చును. కర్మలను శారీరకముగా విడిచిపెట్టుట అనే వికల్పము ఎవ్వరికైననూ ఉపలభ్యము కాదు. కావున -------

**అధ్యాయము 18 , శ్లోకము 48 :**

सहजं कर्म कौन्तेय सदोषमपि न त्यजेत् ।

सर्वारम्भा हि दोषेण धूमेनाग्निरिवावृताः ।। ४८ ।।

సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్

సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ( 48 ).

**కౌంతేయ** = కుంతీపుత్రా, అర్జునా ! , **సహజమ్** = సహజమగు, **కర్మ** = కర్మను, **సదోషమపి** = దోషయుక్తమైననూ, **న త్యజేత్** = విడిచి పెట్టరాదు, **హి** = ఏలయనగా, **సర్వారంభాః** = ఉపక్రమములన్నియు, **అగ్నిః** = అగ్ని, **ధూమేన ఇవ** = పొగ చేతను వలె, **దోషేణ** = దోషముతో, **ఆవృతాః** = కప్పబడియున్నవి.

ఓ కుంతీపుత్రా, అర్జునా ! , దోషముతో కూడినదైననూ సహజమగు కర్మను విడువరాదు. ఏలయనగా, అగ్ని పొగచేతను వలె ఉపక్రమములన్నియు దోషముతో కప్పబడియున్నవి ( 48 ).

మనము ఇదివరలో చూచియున్న స్వభావజం కర్మ మరియు ఈ సహజం కర్మ ఒక్కటియే. మనిషి తాను పుట్టిన కుటుంబమును బట్టి తనకు సంక్రమించిన కర్మను విడువరాదు. అట్లు విడువ వలెననే కోరిక కలుగుటకు కారణమేమి ? కర్మ ఏదైనా స్వభావముచే దోషముతో కూడి యున్నది. ఏలయనగా, కర్మ మూడు గుణములకు లోబడియుండుటచే నిరంతరము మార్పులను చెందుతూ ఉండే జీవితము ( సంసారము ) ను శాశ్వతము చేయును. ఈ కారణము చేతనే ఇదివరలో ఇట్లు చెప్పబడియున్నది : వేదములలోని అర్థవాదములు త్రిగుణాత్మకమగు సంసారమే విషయవస్తువుగా కలిగి యున్నవి. ఓ అర్జునా ! నీవు త్రిగుణములనుండి విముక్తుడవు కమ్ము ( త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ). కర్మతో సహా ఈ జగత్తులోని సర్వము త్రిగుణములలో అంతర్గతమై యున్నది. కర్మానుష్ఠానముచే మోక్షము లభించే ప్రసక్తి లేదు. కావున, కర్మలన్నియు స్వభావము చేతనే దోషయుక్తములై యున్నవి. మానవునకు తాను జన్మించిన పరిస్థితులను బట్టి సంక్రమించిన కర్మ దోషయుక్తమే ( సదోషమ్ ) అయిననూ, దానిని మానవుడు త్యజించరాదు ( న త్యజేత్ ).

ఈ దోషము ఏది ? ఫలమును ఇచ్చుటయే కర్మలోని దోషము. కర్మవలన పుణ్యము గాని, పాపము గాని పుట్టును. ఇవి సమస్యకు పరిష్కారములు కావు. పుణ్యము వలన ఉల్లాసకరమగు అనుభవములు కలుగునే గాని, మోక్షము కలుగదు. పుణ్యము కూడా బంధమే. అది బంగరు సంకెల బంధము. మానవుడు పరిత్యజించవలసినది అజ్ఞానమే గాని, కర్మ కాదు. కేవలము స్వధర్మమును విడిచినంత మాత్రాన మానవుడు కర్మ

నుండి విముక్తి ( నైష్కర్మ్యమ్ ) ని పొందజాలడు. పైగా, స్వధర్మమును సముచితమగు మనఃప్రవృత్తితో ఆచరించు మానవుడు సిద్ధిని పొందును ( స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః ). ధర్మస్వరూపుడగు ఈశ్వరుని గుర్తించి ఈశ్వరార్పణబుద్ధితో తన కర్మను అనుష్ఠించు వ్యక్తి రాగద్వేషముల పట్టునుండి విడుదలను పొందును. కావుననే, జన్మ వలన సంక్రమించిన కర్మ స్వభావముచే దోషయుక్తమే అయిననూ, దానిని విడువవద్దని ( సదోషమపి సహజం కర్మ న త్యజేత్ ) శ్రీకృష్ణభగవానుడు ఇచట చెప్పుచున్నాడు. మానవుడు చేయకూడని కర్మలను నిశ్చితముగా పరిత్యజించవలెను. కాని కర్తవ్యకర్మను విడువరాదు. స్వకర్మను విడనాడిన వ్యక్తి దాని స్థానములో మరియొక కర్మను ఆచరించును. అది స్వకర్మతో సమముగా గాని, లేదా దానికంటె అధికముగా గాని దోషము కలది కావచ్చును. కావున, స్వకర్మను విడిచి మానవుడు సాధించేది ఏదీ లేదు. కర్మను సంపూర్ణముగా విడిచిపెట్టుట అసంభవమని మనము ఇదివరలో చూచియున్నాము. జ్ఞానమును పొందుట కొరకై కర్మను విడువ బూనినచో, జ్ఞానోదయము కర్మపరిత్యాగముపై ఆధారపడి లేదని తెలియవలెను. జ్ఞానము జ్ఞానసాధనమగు ప్రమాణముపై మాత్రమే ఆధారపడియుండును. మనము చేసే కర్మతో గాని, చేయని కర్మతో గాని జ్ఞానమునకు సంబంధము లేదు.

జ్ఞాననిష్ఠలో అధికాధికమగు సమయమును వెచ్చించగోరు జిజ్ఞాసువు సన్న్యాసము అనే జీవనశైలిని ఎన్నుకొనే అవకాశము గలదు. కాని అతనియందు దానికి కావలసిన మానసిక తయారీ లేనిచో, ఆ సన్న్యాసము వ్యర్థమగును. తండ్రి, తల్లి, భర్త, భార్య, కొడుకు, కూతురు మొదలగు అనేకపాత్రలను గృహస్థు పోషించుచుండును. కాని సన్న్యాసములో ఈ పాత్రల సంఖ్య రెండుకు తగ్గిపోవును. గురువు మరియు శిష్యుడు అనే రెండు పాత్రలను మాత్రమే సన్న్యాసి పోషించును. కాని సన్న్యాసికి విహారములు, పిక్నిక్‌లు, క్లబ్బులు, షాపింగ్, సామాజికగోష్ఠులు మొదలగునవి దూరము. సంసిద్ధుడు కానివానిని సన్న్యాసము పిచ్చి పట్టునట్లు చేయగలదు. సన్న్యాసము చాల సరళముగా కనబట్టును. అది సరళము కాదు. పైగా ప్రమాదకరము కూడా. కావున, వ్యక్తి తనకు విధించబడిన కర్మను యోగ్యమగు మనఃప్రవృత్తితో ఆచరించినచో, సన్న్యాసము వలన లభించే ప్రయోజనము అతనికి లభించును. కర్మయోగము కూడ సరళము కాదు. మరియు దానిని తప్పించుకొనుట సంభవము కాదు. తొందరపడి సన్న్యాసమును తీసుకున్న వ్యక్తియైననూ ఆ సన్న్యాసము సిద్ధించుట కొరకై కర్మయోగి కావలెను. కావుననే, దోషములున్ననూ మానవుడు తనకు కుటుంబమును బట్టి సంక్రమించిన కర్మను విడువరాదు ( సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్ ) అని ఇచట చెప్పబడినది.

సహజకర్మను ఏల విడువరాదు ? ఏలయనగా, అగ్ని పొగ చేతను వలె ( ధూమేన అగ్నిరివ ), కర్మలన్నియు ( సర్వారంభా హి ) దోషముచే ఆవరించబడి యున్నవి ( దోషేణ ఆవృతాః ). ఉపక్రమమేదైనా కర్మయే యని మనము భావించవచ్చును. కావున, మొదలుపెట్టుట అనే అర్థము గల *ఆరంభః* అను శబ్దము కర్మను నిర్దేశించును. నిప్పును పొగ వెంటాడును. అటులనే, ప్రతి కర్మయందు దోషము గలదు. పొగను ఊదినచో దూరముగా పోవును. కావున, అది దీనికి చక్కని దృష్టాంతము. పైగా, యజ్ఞయాగా

దులను చేయువారికి ఈ దృష్టాంతము సరళముగా అవగాహనకు వచ్చును. పొగ లేకుండగా చక్కగా మండే అగ్నియందు ఆహుతులను ఈయవలెను. కాని, పాలు మొదలగు కొన్ని ద్రవ్యములను హోమము చేసినప్పుడు కట్టెలు తడిసి పొగ ఉద్భవించును. దానివలన కళ్లకు ఇబ్బంది కలిగి కన్నీరు ప్రవహించును. కాని, ఆ పొగను ఊదివేసినచో, అగ్ని మరల ప్రకాశించును. అటులనే, దుఃఖహేతువు అగు కర్మదోషమును కర్మయోగము ద్వారా పరిహరించవచ్చును. యోగ్యమగు మనఃప్రవృత్తి గలవాడై కర్మఫలమును ఆనందముగా స్వీకరించు ( ప్రసాదబుద్ధి ) వ్యక్తిని అది బాధించదు. కర్మయోగి కర్మను ఎన్నుకొనుటలో ధర్మమును పాటించును. కావున, ఆతనికి మానసికసంఘర్షణయొక్క బెడద ఉండదు. మానవులు తమ స్వభావమునకు అనురూపమైన కర్మలను ఎన్నుకొనే సందర్భములో వ్యక్తి వ్యక్తికి కర్మస్వరూపము మారుచున్ననూ, ఆ కర్మలు ధర్మమునకు అనురూపముగా నుండును. ఒకడు వంటను చేయుచుండగా, మరియొకడు ఊడ్చుచుండును. ఒక వ్యక్తి చేసే కర్మను ఆతని స్వభావము నిర్ధారించవచ్చును ; లేదా, ఆతని స్వభావముతో సంబంధము లేకుండగా పరిస్థితుల బలమైన ప్రభావము ఆతని కర్మను నిర్ధారించును. నాకు సంగీతమునందు అభిరుచి మెండు. కాని ప్రక్కవాడు గాయపడి యుండగా నేను ఆతనిని వెనువెంటనే ఆసుపత్రికి గొనిపోవలెను. దీనిలో నా ఇష్టానిష్టములకు ప్రసక్తి లేదు. ఆ పరిస్థితిలో సంగీతమునకు తావు లేదు. ఆ పరిస్థితిలో నా కర్తవ్యము సుస్పష్టముగా నాకు గోచరించుచునే యున్నది. దానికి నా స్వభావముతో పని లేదు. అట్టి కర్తవ్యకర్మను మానవుడు విడిచిపెట్టరాదు ( న త్యజేత్ ).

కర్మయందు సహజముగానున్న దోషమును కర్మయోగముచే కొంతవరకు తొలగించ వచ్చును. ఆ తరువాత వాస్తవములో కర్మ అనేది లేదు అనే సత్యమును గుర్తించుట ద్వారా కర్మను సంపూర్ణముగా పరిత్యజించుట సంభవమగును. పొగ అసలే లేకుండగా చేయు ఉపాయము ఒకే ఒకటి గలదు. నిప్పులో కట్టెలను వేయుట మానివేసి నిప్పును ఆర్పివేసినచో, పొగ అంతరించును. ఇచట నిప్పులో కట్టెను వేయకుండుట అనగా నేను కర్తను గాను ( అహం అకర్తా ) అనే జ్ఞానమును పొందుట మాత్రమే. ఆత్మ అకర్త అనే సత్యము తెలియకపోవుట ( అవిద్యా )యే ఇచటి ఇంధనము. అది జ్ఞానాగ్నిలో కాలి బూడిద అయిన పిదప దానినుండి పుట్టే కామకర్మలు కూడ ఛిన్నాభిన్నములై నశించును. జ్ఞానాగ్ని కర్తను నశింపజేసిన పిదప కర్మలన్నియు భస్మమగుట సహజమే గదా !

సహజకర్మను విడువకూడని ఈ వ్యక్తి ఎవరు ? తాను కర్తను కాదు అనే సత్యము తెలిసిన జ్ఞాని కాదు. ఏలయనగా , జ్ఞాని శారీరకముగా కర్మను చేయుచున్ననూ, కేవలజ్ఞానముచే సర్వకర్మసన్న్యాసమును చేసియే యున్నాడు. ఈ సర్వకర్మసన్న్యాసమే మోక్షము. శ్రీశంకరులు ఈ శ్లోకముపై తాను వ్రాసిన సంక్షిప్తమగు భాష్యమును ఈ విధముగా ఉపసంహరించిరి : అజ్ఞాని కర్మలను సంపూర్ణముగా విడిచిపెట్టుట అసంభవము. కావున, మానవుడు తన కర్తవ్యవిధిని విడిచిపెట్టరాదని ఇచట చెప్పబడినది. అజ్ఞాని కర్మను విడువరాదని చెప్పుటకు కారణమేమనగా, కర్మను విడిచిపెట్టుటవలన ఆతని పరిస్థితిలో మార్పు

రాదు. అతడు ఒక రకం కర్మను విడిచి మరియొక రకం కర్మను చేపట్టును. మొదటి కర్మ కంటె రెండవది గొప్పది కాదు. ఏలయన, కర్మ ఏదైనా దోషయుక్తమే.

శ్రీశంకరులు ఇచట ఒక అభ్యంతరమును ప్రస్తావించిరి. ఈ అభ్యంతరమును ఏక దేశి ( ఒక విశిష్టసిద్ధాంతమునకు కట్టుబడని వాడు ) లేవనెత్తినాడు. వేదాంతులకు స్వపక్షీయులే అయిననూ, వారికి విరుద్ధముగా వాదించి మననములో సహకరించే కొన్ని సిద్ధాంతములు మన సంప్రదాయములో గలవు. అట్టి వాదులు సుసంగతమగు అభ్యంతరములను లేవనెత్తెదరు. కాని ఏకదేశి అట్లు కాదు. ఆతడు ఒకే ఒక ప్రశ్నను వేయును. దానికి సమాధానము లభించగనే మిన్నకుండును. పూర్వపక్షికి, ఏకదేశికి గల భేదము ఇదియే. ఆత్మ అనగా నేమి ? ఏది సత్యము ? కారణమేమి ? కార్యమేది ? ఇత్యాది విషయములలో విభిన్నమగు దృక్పథము గల పూర్వపక్షి తొలినుండి ఆఖరు వరకు సుసంగతముగా వాదించుచుండును. దీనివలన పూర్వపక్షసిద్ధాంతరూపములో నడిచే విస్తృతమగు వాదము సర్వసంశయములను పోగొట్టి మనకు సుస్పష్టమగు అవగాహన కలుగుటలో తోడ్పడును. శాస్త్రములో అభ్యంతరములను లేవనెత్తుటకు ఉద్దేశ్యము స్పష్టమగు అవగాహనను కలిగించుటయే గాని, విమర్శించుట కాదని మనము తెలియ వలెను.

కర్మను విడువరాదని చెప్పుటకు కారణమేమి ? కర్మను పూర్తిగా విడుచుట అసంభవమగుటయా ? లేక, సహజకర్మను విడిచిపెట్టుట దోషమనియా ? అని ఏకదేశి ప్రశ్నించుచున్నాడు. పాపము సంక్రమించుననే కారణముచే కర్మను విడువరాదా ? లేక, కర్మను విడుచుట అసంభవము గనుక కర్మను విడువరాదా ? అను విషయమును ఆతడు తెలియ గోరుచున్నాడు.

ఈ నిర్ణయమువలన నీకు కలిగే ప్రయోజనము ఏమి ? అని శ్రీశంకరులు ఏకదేశికి ఒక ప్రశ్నతో సమాధానమునీయగా, ఏకదేశి మరల ఇట్లు వాదించుచున్నాడు : కర్మను పూర్తిగా విడుచుట అసంభవము గనుక సహజకర్మను విడువరాదు అని చెప్పే పక్షములో, ఎవరైననూ పూర్తిగా విడువగలిగినచో అది గొప్పదనమే యగును. అనగా అసంభవము అను మాటకు 'సుతరాము విడువశక్యము కానిది' అని కాకుండా, ' విడుచుట దుష్కరమైనది ' అను అర్థమును తీసుకుని, ఏకదేశి సర్వకర్మపరిత్యాగమును ఒక కఠినపరీక్షగా స్వీకరించ వచ్చును. దుష్కరమగు కార్యమును సాధించిన వానికి లభించే ఫలము అధికముగా నుండును. కావున, ఏకదేశి అట్టి దుష్కరకార్యమును చేయుటకు పూనుకొన వచ్చును. మానవుని ఎవరెస్టు శిఖరమును అధిరోహించుటకు పురి గొల్పినది ఇట్టి ఉత్సాహ శక్తియే గదా ! కొందరికి దుష్కరకార్యములను సాధించుటలో ప్రీతి మెండు. కఠినమగు వ్యాయామమును చేయగోరినచో, దానికి అనేకములగు ఉపాయములు గలవు. దానికొరకై ప్రాణాపాయకరమగు ఎవరెస్టు శిఖరారోహణమును చేపట్టనేల ? కొందరికి సాహసకార్యములను చేయుటలో అభిరుచి అధికము. ఏదేని దుష్కరమగు కార్యము ఉన్నచో, వారు దానిని మాత్రమే చేయబూనెదరు. అదే విధముగా కర్మను పూర్ణముగా విడుచుట కఠినము అన్నచో, అది మహాఫలమును ఇచ్చునది అయి ఉండవలెను. కావుననే, వారు ఆ కఠినకార్యమును చేయుటకు నడుము కట్టెదరు.

ఇదే సమయములో మరియొకడు చర్చలో ప్రవేశించి ఇట్లు పలుకుచున్నాడు : సర్వకర్మత్యాగము దుష్కరమైనచో దానిని సాధించుటలో మహాఫలము ఉండి తీరును. ఇచటి సమస్య యేదనగా, సర్వకర్మత్యాగము అసంభవము. న శక్యతే అను వాక్యములోని పదములకు సంభవము కాదు అని అర్థము. కాని లాక్షణికముగా ( figuratively ) చాల కఠినము అని కూడ అర్థమును చెప్పవచ్చును. కాని సర్వకర్మత్యాగము సంభవము కాదు గనుక, శ్రీశంకరులు ఈ పదములకు అసంభవము అను అర్థమును మాత్రమే స్వీకరించినట్లు స్పష్టమగుచున్నది. దీనిని బట్టి సర్వకర్మసన్న్యాసము అనేది లేదనియు, కర్మ మాత్రమే గలదనియు స్పష్టమగుచున్నది. మానవుడు ఈ లోకములో కర్మలను చేస్తూ మాత్రమే వంద సంవత్సరములు జీవించవలెనని కోరవలెను. నీకు కర్మలేపమునుండి తప్పించుకొనుటకు మరియొక ఉపాయము లేదు ( *కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః, ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే* ) అనే ఈశావాస్యోపనిషత్తులోని రెండవ మంత్రము ఈ అభిప్రాయమును బలపరచుచున్నది. మానవుడు శరీరము నిలబడి యున్నంతవరకు కర్మను చేయుచుండవలెను. మానవుడు చేసే కర్మలు నిత్యనైమిత్తికములు మాత్రమే అయినచో, వాటికి ఫలము లేదు గనుక, అవి బంధించవు. ఇది ఈ వాదములోని సారాంశము.

ఈ వాదము సరి గాదు. ఈశావాస్యోపనిషత్తు మొదటి మంత్రములో సన్న్యాసమును చెప్పి, కర్మయందు అధికృతులైన అజ్ఞానులనుద్దేశించి రెండవ మంత్రమును చెప్పినది. ఈ వాది మొదటి మంత్రమును సరిగా అర్థము చేసుకొనకుండగా రెండవ మంత్రమును మక్కికి మక్కి అన్వయించినాడు. ఈతడు ప్రస్తుతచర్చలో ప్రవేశించి, కర్మలను పూర్తిగా విడిచిపెట్టుట అసంభవము గనుక, సర్వకర్మసన్న్యాసము అనేది లేదని వాదించుచున్నాడు.

ఈ వాదిని ఒక ప్రశ్న అడుగవలసి యున్నది. కర్మసన్న్యాసము అసంభవమనుటకు కారణమేమి ? సాంఖ్యుల గుణముల వలె పురుషుడు ( ఆత్మ ) నిరంతరముగా మార్పులను చెందుచుండుటయా ? అవును. ఆత్మ క్రియాశీలము కాని క్షణమే లేనిచో, కర్మపరిత్యాగము ఎట్లు సంభవమగును ? ఆత్మ స్వభావముచే పరివర్తనశీలమైనచో, కర్మత్యాగము సంభవము కాదు. లేదా, కర్మయే కర్త గనుక, పురుషుడు కర్మపరిత్యాగమును చేయజాలడు. బౌద్ధులు పంచస్కంధనిరూపణములో అటులనే వాదింతురు. బౌద్ధులు ఆత్మను అంగీకరించరు. వారు మానవుని సర్వానుభవములను మరియు జగత్తును అయిదు స్కంధములుగా విభజించినారు. ఈ విభాగమునననుసరించి కర్మయే కర్త యగును. అనగా కర్తలోని ఒక అంశము కర్మ యని కాదు. కర్మకంటె భిన్నముగా ఆత్మ లేదు అని వారి వాదము. ఈ స్కంధములలో మొదటిది రూపస్కంధము. జగత్తులో ఉపలభ్యమవుతూ మనచే ఇంద్రియముల ద్వారా గ్రహించబడే వివిధరూపములే ఈ స్కంధము. ఇంద్రియగ్రాహ్యమగు రూపములకంటె అదనముగా జగత్తు లేదని బౌద్ధుల సిద్ధాంతము. అనగా ఇంద్రియానుభవమును దాటి యథార్థమగు జగత్తు లేదు. తరువాత ఆ అనుభవమునకు మనము ఇచ్చే అర్థము గలదు. ఒకానొక రూపమును చూచి, ' ఇది కుండ' అని

మనము గుర్తించినప్పుడు, ఆ గుర్తింపు చూచిన వస్తువునకు అనురూపముగా నున్నచో, దానికే జ్ఞానస్కంధము లేక వేదనాస్కంధము అని పేరు. జగత్తులోని రూపములు అన్నింటితో కూడిన స్కంధము రూపస్కంధము కాగా, ఆ రూపములన్నింటియొక్క నామములతో కూడిన స్కంధమునకు సంజ్ఞాస్కంధము అని పేరు. మనము దర్శించే ప్రతి రూపమునకు ఒక నామము గలదు. కొన్ని సందర్భములలో ఒకే వస్తువునకు అనేకనామములు ఉండవచ్చును. అదియే సంజ్ఞాస్కంధము. ఒకే వస్తువులో అనేకరూపములు ఉండవచ్చును. ఉదాహరణకు వృక్షమునందు బెరడు, కొమ్మలు, ఆకులు మొదలగు రూపములు గలవు. ఇంతేగాక, మరల ఆకునందు హరితపదార్థము, సెల్యులోజు, కణములు మొదలగు అనేక రూపములు గలవు. ఈ తీరున ఒకే వస్తువుతో సంబంధము గల అనేకనామములు గలవు. ఆ వస్తువును గురించి మనకు గల పరిజ్ఞానము పెరిగే కొలదియు ఈ నామముల సంఖ్య కూడ పెరుగుచుండును. నాల్గవది విజ్ఞానస్కంధము. అనగా క్షణికములగు విజ్ఞానముల నిరంతరప్రవాహము. రూప,సంజ్ఞా,వేదనాస్కంధముల ఉనికి దీనియందు మాత్రమే గలదు. కావున, అవి దీనిలో విలీనమగును. మన మనస్సులలో గల స్మృతిప్రపంచమునకు వాసనా స్కంధము అని పేరు. ఈ అయిదవ స్కంధమునకు సంస్కారస్కంధమనియు పేరు గలదు. స్మృతిలో భద్రము చేయబడియున్న సమాచారమంతయు ఈ స్కంధములో భాగము అగును.

ఈ నిరూపణములో ఆత్మ ఏది ? లేదు. వారి వాదములో ఆత్మ అనగా శూన్యమే. బౌద్ధసిద్ధాంతములో ఈ స్కంధములు మాత్రమే గలవు. ఇవి అన్నియు క్షణికవిజ్ఞానప్రవాహముపై ఆధారపడి యున్నవి. ఇంతకు మించి ఏదీ లేదు. క్షణికవిజ్ఞానప్రవాహరూపమగు విజ్ఞానస్కంధము కూడ ఆత్మ కాదు. ఏలయన, ఈ ప్రవాహములోని ప్రతి విజ్ఞానము క్షణికము మాత్రమే. ఈ వాదములో ఆత్మ లేదు. సర్వము ఆభాస మాత్రమే. దీనిలో కర్త ఎవరు ? కర్త యనదగిన ఆత్మ లేదు. కావున, క్రియ మాత్రమే గలదు. ఆ క్రియకంటె భిన్నముగా కర్త లేదు. కర్తకు క్రియకు మధ్యలో భేదము లేదు. ఈ స్కంధములన్నియు క్షణకాలము మాత్రమే ఉనికిని కలిగియున్నవి. అవి విజ్ఞానముపై ఆధారపడి యుండగా, ఆ విజ్ఞానము కేవలము క్షణికము మాత్రమే. సినిమాలో బొమ్మలు ఒక దాని తరువాత మరియొకటి వేగముగా కదులుచుండును. ముందు ఉన్న బొమ్మ అంతర్ధానమై దాని స్థానములో తరువాతి బొమ్మ వచ్చి చేరును. కాని ఆ వేగమును బట్టి మనకు ఆ వ్యవధానము గోచరించదు. అదే విధముగా బౌద్ధుల సిద్ధాంతములో జగత్తు అనగా ఈ అయిదు స్కంధముల నిరంతరప్రవాహము మాత్రమే. కర్మకంటె భిన్నముగా కర్త అనే ఆత్మ లేదు గనుక, ఈ వాదము ననుసరించి కర్మపరిత్యాగము సంభవము కాదు. పరిత్యజించ వలసిన కర్తయే లేని స్థితిలో పరిత్యాగము సంభవించదు గదా !

ఒక పక్షములో, కర్తృత్వము ఆత్మకు సహజస్వభావమై యున్నది గనుక, ఆత్మ కర్మను చేయుచునే యుండును. మరియొక పక్షములో, ఈ అయిదు స్కంధములను మించి జగత్తు లేదు గనుక, కర్మయే ఆత్మ గనుక, కర్త లేదు. కావున, కర్మలను పూర్తిగా విడిచిపెట్టుట సంభవము కాదు. కావున, ఈ రెండు పక్షములలో సర్వకర్మసన్న్యాసము

పొసగదు. కాని గీత పదే పదే సర్వకర్మసన్న్యాసమును గురించి చెప్పుచున్నది. కర్మలన న్నింటినీ విడిచి పెట్టి నన్ను మాత్రమే శరణు పొందుము ( సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ) అని భగవానుడు చెప్పబోవుచున్నాడు. కర్మలనన్నిటినీ మానసి కముగా విడిచిపెట్టి ------- కర్మలను చేయుట లేదు. చేయించుట లేదు ( సర్వకర్మాణి మనసా సన్న్యస్య ------ నైవ కుర్వన్ న కారయన్ ) అను శ్లోకమును మనము ఇదివరలో చూచియున్నాము. కావున, సర్వకర్మసన్న్యాసము సంభవమే. అది ఆవశ్యకము కూడా. ఏలయనగా, సర్వకర్మపరిత్యాగము సంభవము కానిచో, మోక్షము సంభవము కాదు. కావు ఈ రెండు వాదములు సరియైనవి కావు. వైశేషికులు మరియొక వాదమును ప్రతిపా ంచుచున్నారు.

ఒక పదార్థము క్రియను ఆచరించినప్పుడు సక్రియమగును. క్రియను ఆచరించన ్పుడు నిష్క్రియమగును. ఆత్మ విషయములో కూడా ఇంతే. ఆత్మ క్రియాశక్తి గల ఒకా పదార్థము. కాని అది క్రియలకు ఆధారము కాదు. ఉదాహరణకు కుండపై పెట్టే ూత స్థిరముగా నున్నప్పుడు క్రియను చేయుట లేదు. కాని దానియందు క్రియను ఆచ ే శక్తి అంతర్నిహితమై ఉన్నది. గిరగిర త్రిప్పినచో, అది సక్రియమగును. తిరుగుట న పిదప అది మరల నిష్క్రియమగును. అదే విధముగా, ఆత్మ కూడ కొన్ని సమయ ులలో సక్రియముగానుండును. మరికొన్ని సమయములలో అది నిష్క్రియము అగును. న్ని సమయములలో నిష్క్రియము అయ్యే సామర్థ్యము ఆత్మయందు కలదు గావున, ా పూర్తిగా కర్మలనుండి విముక్తము అగుట సంభవమే. ఒకానొక ప్రక్రియచే ఆత్మ సక్రి ుచున్నది. అటులనే, మరియొక ప్రక్రియచే ఆత్మ పూర్ణముగా కర్మవినిర్ముక్తమగుట ుమే. ఈ తీరున ఆత్మకు సర్వకర్మసన్న్యాసము సంభవమగుచున్నది. పైన ఉదహ ిన మొదటి వాదములో వలె ఆత్మ సర్వదా క్రియాశీలము కాదు. రెండవ వాదములో ఆత్మ శూన్యము కాదు. ఈ వాదమునకు పై వాదములతో గల ప్రధానభేదమేమనగా, ో ఆత్మ ఒకప్పుడు సక్రియము, మరియొకప్పుడు నిష్క్రియము అగుచున్నది. అనే ద్రవ్యము ఒకటి ఉన్నది. దానియందు లేని కర్మ పుట్టి కొంతకాలము ఉండి, ువాత ఆ కర్మ నశించును. ఒక సమయములో లేని కర్మ పుట్టి తరువాత నశించినది ుక, ఆత్మద్రవ్యము శుద్ధముగా మిగిలియుండును. ఆత్మయందు కర్మను కలిగి ఉండే ంతర్నిహితసామర్థ్యము ఉన్ననూ, అది కర్మకు ఆశ్రయము కాదు.

ఈ వాదములో దోషము ఏమి గలదు ? ఉనికి గల వస్తువు లేకుండా పోదు. లేని స్తువునకు ఉనికి కలుగదు ( నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః ) అని భగవా డు ఇదివరలో చెప్పియున్నాడు. కాని ఈ వైశేషికసిద్ధాంతములో ఉనికి లేని కర్మ పుట్టు న్నది. తరువాత ఉన్న కర్మ లేకుండా పోవుచున్నది. ఇది శ్రీకృష్ణభగవానుని బోధకు రుద్ధముగా నున్నది. కావున ఈ వాదము శ్రుతికి కూడ విరుద్ధము. వైశేషికవాదములోని ుదటి ప్రతిపాదన ఏదనగా, లేని కర్మ పుట్టుచున్నది. దీనికి అసత్కార్యవాదము అని ారు. కార్యము పుట్టుటకు ముందు లేదు అని ఈ వాదములోని సారాంశము. ఉదాహరణ మట్టినుండి పుట్టుటకు ముందు కుండ లేదు. లేని కుండకు ఉనికి కలిగించ బడినది.

కావున, కుండ సత్యవస్తువు. వారు ఈ ప్రక్రియను సృష్టికి అన్వయించెదరు. ఈ జగత్తు పుట్టినది. పుట్టిన తరువాత దానికి ఉనికి సిద్ధించినది. తరువాత అది వినాశమును పొంది అదృశ్యమగును. ఈ తీరున లేనిది పుట్టును. ఉన్నది నశించును. కావున, నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః అను భగవద్వచనమునకు ఈ వాదము పూర్తిగా విరుద్ధము.

ఈ వాదము భగవానుని బోధకు విరుద్ధముగా నున్ననూ, యుక్తియుక్తముగా నున్నది అని వైశేషికుడు బదులిడుచున్నాడు. వస్తుతత్త్వమును తెలియుటకు శ్రుతిని గాని, శ్రీకృష్ణుని గాని ప్రమాణము ( జ్ఞానసాధనము ) గా అంగీకరించ కుండగా, కేవలము తర్కపటిమపై ఆధారపడే వైశేషికుడు ఇట్లు బదులిడుటలో ఆశ్చర్యము లేదు. అది అట్లు ఉండగా, మనము యుక్తియుక్తమగు విషయమును మాత్రమే స్వీకరించవలెను. భగవానుడు చెప్పిననూ, యుక్తిసంగతము కాని దానిని స్వీకరించ వలసిన పని లేదు. మన యుక్తికి అందినా, అందకపోయినా, భగవానుని వచనము చరమసత్యము అని ధార్మికవిశ్వాసము గల వ్యక్తి స్వీకరించును. కాన అట్టి భక్తుని దృష్టిలో, భగవానుని వచనమును అంగీకరించని వానితో చర్చకు తావు లేదు. కాని శ్రీశంకరులు యుక్తికి విరుద్ధముగా నున్ననూ విశ్వసించే వ్యక్తి కాదు. ఆయన ఆచార్యుడు, మరియు జ్ఞాని. జ్ఞాని దృష్టిలో భగవానునకు, భగవానుడు బోధించే సత్యమునకు భేదము లేదు. కావున, ఈ వైశేషికసిద్ధాంతములోని దోషమును ఎత్తి చూపి దానిని సరిదిద్ద వలసి యున్నది. ఈ వాదము సర్వప్రమాణములకు, మన సర్వానుభవములకు మరియు యుక్తికి కూడ విరుద్ధముగా నున్నది. వైశేషికుడు తన వాదము చాల బాగున్నదని భావించవచ్చును. కాని అది సరి గాదని శ్రీశంకరులు నిరూపించు చున్నారు.

వైశేషికసిద్ధాంతము ననుసరించి సృష్టికి పూర్వములో పరమాణువులు ఉండెడివి. రెండు పరమాణువులు కలిసి ఒక ద్వ్యణుకము ఏర్పడును. జగత్తు అంతయు ఇట్టి ద్వ్యణుకముల కలయికయే. ద్వ్యణుకము పుట్టుటకు ముందు సృష్టి లేకుండెను. అనగా జగత్తు ఒక విశిష్టకాలములో పుట్టినది. రెండు పరమాణువులు కలియుటకు ముందు ద్వ్యణుకము లేకుండెను. అనగా లేని ద్వ్యణుకము కొత్తగా ఉదయించినది. ఉదయించిన తరువాత ఆ ద్వ్యణుకము కొంతకాలము మనుగడ కలిగి మరల నశించును. అనగా దానికి పుట్టుటకు ముందు ఒక అభావము ( ప్రాగభావము ), నశించిన తరువాత ఒక అభావము ( ప్రధ్వంసాభావము ) ఉన్నవి. అనగా, ఉనికి లేనిది ఉనికిని పొందుచుండును. ఉన్నది నశించుచుండును. వైశేషికుల సిద్ధాంతములో సర్వము సత్యమే గనుక, అసత్యమనగా ఉనికి లేనిది అని యర్థము.

ఉనికి లేనిది ఉనికిని పొంది మరల నశించినప్పుడు ఉనికిని కోల్పోవుట ఈ వాదములోని ప్రధానమగు అంశము. ఒక వస్తువు పుట్టుటకు ముందు లేదు. అనగా అది కుందేటి కొమ్ము వంటిది. దానికి ఉనికిని కలిగించుటకై ఒక కారణము ఆవశ్యకమగును. వైశేషికుల సిద్ధాంతములో ఈ కారణము మూడు రకములుగా నున్నది. వస్తువుయొక్క స్వరూపముతో ముడివడి యున్న కారణము మొదటిది. దీనికి సమవాయి కారణము అని పేరు. ఉదాహరణకు దారమునకు ప్రత్తి సమవాయి కారణము. స్వరూపముతో సంబంధము లేని కారణము రెండవది. దీనికి అసమవాయి కారణము అని పేరు. ఉదాహరణకు, వస్త్రి

మునకు దారము అసమవాయి కారణము. మూడవది నిమిత్త కారణము. వస్త్రమునకు నేత గాడు, మగ్గము మొదలగునవి నిమిత్తకారణములు. పుట్టుటకు ముందు లేని వస్తువు కారణములపై ఆధారపడి ఉనికిని పొందును. కాని ఈ వాదము స్వీకారయోగ్యము కాదు. ఉనికి లేని వస్తువు పుట్టుట, దానికి ఒక కారణము ఉండుట అను అంశములు యుక్తియుక్త ములు కావు. దీనికి కుందేటి కొమ్మును ఉదహరించ వచ్చును. కుందేటి కొమ్ము ఏ నాడై ననూ ఉనికిని పొందుట కాని, దాని కొరకై కొన్ని కారణములపై ఆధారపడుట కాని సంభ వము కాదు. ఉనికి లేని వస్తువు ఉనికిని పొందును అనే వాదము మనకు తెలిసిన ప్రమాణ ములన్నింటికి విరుద్ధము.

ఉన్న వస్తువు మాత్రమే ప్రకటమగుననియు, దానికొరకై కారణము ఆవశ్యకమగున నియు అన్నచో, అది యుక్తియుక్తముగా నున్నది. ఇంకనూ పుట్టనిదై పుట్టవలసియున్న, ఉనికి గల కుండ ప్రకటమగుట కొరకై కారణమునపేక్షించును. కుండ మొదలగు పదార్థ ములు ఆయా నామరూపములతో అభివ్యక్తమగుటకు పూర్వమే అవ్యాకృతావస్థలో ఉని కిని కలిగియే యున్నవి. సృష్టి యనగా నామరూపాభివ్యక్తి మాత్రమే. దానికై కారణము అపేక్షించబడును. ఇది సుసంగతముగా నున్నది. సుతరాము ఉనికి లేని వస్తువు ఉనికిని పొందుట ఎట్లు పొసగును ? అట్టి ఉనికి లేని వస్తువు కారణము నపేక్షించుట ఎట్లు సంగత మగును ? ఇట్టి పరిస్థితి మన అనుభవములో లేదు. ఇది మనకు ఉపలభ్యమయ్యే ప్రమాణ ములన్నింటికీ విరుద్ధము.

ఉనికి లేని వస్తువు ఉనికిని పొందుట, ఉన్న వస్తువు లేకుండా పోవుట సంభవ మయ్యే పక్షములో మానవుల వ్యవహారములలో నిశ్చితత్వము లేకుండా పోవును. మన వద్ద గల జ్ఞానసాధనముల గురించి, తెలియ దగిన వస్తువుల గురించి, సర్వసామాన్యమగు కారణకార్యసంబంధముల గురించి మనకు ఒకానొక అవగాహన కలదు. మనము ఈ అవ గాహనపై ఆధారపడి వ్యవహారములను నడుపుచుందుము. ఒకటి కారణము అగుచుండ గా, మరియొకటి కార్యము అనే అవగాహనతో మనము జ్ఞానసాధనములను వినియోగించె దము. కొన్ని విశిష్టపరిస్థితులలో ఒక విశిష్టకారణము ఒకానొక ఖచ్చితమగు ఫలమును ఇచ్చి తీరుననే అవగాహనతో మనము ఒక కర్మను చేయుదుము. నేను పాదమును ముందునకు వేసినచో, ముందుకు సాగెదను. వెనుకకు వేసినచో, వెనుకకు పోయెదను. ఉన్న కారణమునుండి ఉన్న కార్యము పుట్టును అనే మౌలికమగు ధారణతో సర్వవ్యవహార ములు నిర్వహించబడుచుండును. ఉనికి లేని వస్తువునుండి కొత్త వస్తువు పుట్టదు. ఉన్న బంగారము మాత్రమే హారము అగును. ఉన్న మట్టి కుండ యగును. అభావమునుండి ఉనికి గల వస్తువు ఎన్నటికీ ఉదయించ లేదు. అట్లు ఉదయించే పక్షములో, ఏది ఉనికి గలది ? ఏది ఉనికి లేనిది ? అను విషయములో ఖచ్చితమగు నిర్ధారణ లేకుండా పోవును. కుండ ఉన్నది అని మనము అంటాము. అనగా కుండకు ఉనికి గలదు అని మనకు తెలి యుచుండును. కుందేటి కొమ్ము లేదు అని మనము అంటాము. అనగా అట్టి వస్తువు ఏదీ లేదు అని మనకు స్పష్టమగుచుండును. ఇవి ఖచ్చితమగు ధారణలు. లేని వస్తువు హఠా త్తుగా ఉదయించి, ఉన్న వస్తువు లేకుండా పోయే పక్షములో, ఈ విధమగు నిశ్చితస్థితి

మనకు మిగిలి యుండదు. ఉన్నది ఉండును. లేనిది లేదు. కాని వైశేషికుల సిద్ధాంతమును అంగీకరించే పక్షములో ఇట్టి నిశ్చితత్వము అంతరించి పోవును. కాని ఈ విధమగు నిశ్చితస్థితి మన అనుభవములో నున్నది. కావున, ఈ సిద్ధాంతము అంగీకారయోగ్యము కాదు.

వైశేషికులు ఇంకనూ ఇట్లు వాదించెదరు : ద్వ్యణుకము ఉద్భవించుచున్నది. కావున, దానికి ఉనికితో మరియు స్వకారణముతో సంబంధము గలదు. అది ఉదయించుటకు ముందు లేదు. తరువాత దాని కారణమగు పరమాణువులలో వచ్చిన చలనముపై ఆధారపడి, ఉనికి లేని ద్వ్యణుకము స్వకారణముతో మరియు ఉనికితో సమవాయసంబంధమును కలిగియుండును. దీనికి అసత్కార్యవాదము అని పేరు. కారణకార్యములు రెండు విభిన్నతత్త్వములు. వాటి మధ్య గల సంబంధమే సమవాయసంబంధము. ఇచటి ప్రధానవిషయమేమనగా, సమవాయసంబంధము లేని కార్యమునకు కారణముతో సంబంధమును నెలకొల్పి, ఉనికి లేని వస్తువునకు ఉనికిని ప్రసాదించును. ఉదయించిన తరువాత కార్యము కారణముతో సంబంధమును కలిగియుండుట మాత్రమే గాక, ఉదయించుటకు ముందు కూడ అది స్వకారణముతో సమవాయసంబంధమును కలిగియుండును.ఈ తీరున ముందులో ఉనికి లేని ద్వ్యణుకము పుట్టి ఉనికిని పొందును. ఉనికి లేని వస్తువు పుట్టి ఉనికిని పొందునని నిరూపించుటకై వైశేషికులు ఈ విధమగు ప్రక్రియను కల్పించిరి.

ఇచట మేము ఒక ప్రశ్నను వేసెదము. ఉనికి లేని వస్తువు ఉనికి గల కారణమును కలిగియుండుట ఎట్లు సంభవమగును ? ఒక ఉనికి గల వస్తువునకు మరియొక ఉనికి గల వస్తువు మాత్రమే కారణము కాగలదు. ఉనికి లేని వస్తువునకు ఉనికి గల వస్తువుతో కారణకార్యసంబంధము ఎట్లు పొసగును ? ఇంతే గాక, ఉనికి లేని వస్తువు తన కారణముతో గాని, మరియొక కార్యముతో గాని, దేనితోనైనా ఏ విధమగు సంబంధమునైననూ నెలకొల్పుకొనుట ఎట్లు ఘటిల్లును ? కుందేటి కొమ్ము కుందేలుతో ఏ విధమగు సంబంధమును నెలకొల్పుకొనును ? ఈ విధమగు సంబంధము అసంభవము. సంతానము లేని యువతి యొక్క పుత్రునకు ఆమెతో గాని, తండ్రితో గాని సంబంధము ఊహలోనైననూ పొసగదు.

దీనిపై వైశేషికుడు తన అభ్యంతరమును ఈ విధముగా తెలుపుచున్నాడు : ఉనికి లేని వస్తువు తన కారణముతో సంబంధమును కలిగియున్నదని మేము చెప్పుట లేదు. ద్వ్యణుకము మొదలగు పదార్థములు స్వీయకారణములగు పరమాణువులతో సమవాయసంబంధమును కలిగియున్నవని మేము చెప్పుచున్నాము. ఉనికి గల ద్వ్యణుకమునకు స్వీయకారణమగు పరమాణువులతో సంబంధము గలదు. కాని ఈ అభ్యంతరము నిలబడదు. ద్వ్యణుకమునకు తన కారణమగు పరమాణువులతో సంబంధము ఏర్పడుటకు ముందు ఉనికి లేదని వైశేషికులు చెప్పెదరు. ఈ అభ్యంతరమును చూచినచో, కుండ పుట్టిన తరువాత మట్టితో సంబంధమును పొందునని చెప్పినట్లు అగుచున్నది. వీరి సమస్య ఏమనగా, స్వకారణమగు మట్టితో సంబంధమును పొందుటకు ముందు కుండకు ఉనికి లేదని వీరు చెప్పెదరు. అనగా, మట్టి లేకుండగనే కుండ ఉనికిని పొందినది. పుట్టుటకు ముందు కుండకు మట్టితో లేశమైననూ సంబంధము లేదు. పుట్టిన తరువాత కుండ మట్టితో సంబంధమును పొందును. ఇది హాస్యాస్పదమగు వాదమని స్పష్టమగుచునే

యున్నది. స్వీయకారణముతో సంబంధమును పొందుటకు ముందే ఒక పదార్థము ఉనికిని కలిగియుండుట అసంగతము.

ఇంతేగాక, కుమ్మరివాడు, చక్రము మొదలగు వాటియొక్క వ్యాపారమునకు ముందు కుండయొక్క ఉనికిని వైశేషికులు అంగీకరించరు. ఈ కారణములన్నియు తమ తమ పనులను చేయుటకు ముందు కుండకు ఉనికి లేదు. మట్టి మాత్రమే కుండయొక్క రూపమును పొందుననియు, కుండ అనబడే ఈ వికారము మట్టి మాత్రమేననియు, కావుననే కుండకు మట్టితో సంబంధము పొసగుననియు చెప్పినచో, అది వైశేషికులకు అంగీకారము కాదు. కుండ మట్టినుండి యథార్థముగా పుట్టదనియు,కుండ మట్టియొక్క రూపాంతరము మాత్రమేననియు వారు అంగీకరించరు. వారు అంగీకరించినచో, అది వేదాంతమే యగును. అప్పుడు కుండ కేవలము భాసించుచుండును. అది ఒక విశిష్ట మగు కార్యమునకు ఉపయోగపడే ఒకానొక రూపము మాత్రమే. అది మట్టికంటె భిన్న ముగా మనజాలదు. ఈ సత్యమును వారు అంగీకరించరు. ఉనికి లేని కుండ ఉనికిని పొందునని వారు వాదింతురు. కావున, పుట్టుటకు ముందు ఉనికి లేని కుండకు స్వీయకార ణమగు మట్టితో సంబంధము గలదని చెప్పక తప్పదు. వైశేషికులకు ఉనికి లేని వస్తువు స్వీయకారణముతో సంబంధమును కలిగియున్నదని చెప్పుట తప్ప గత్యంతరము లేదు. ఆ వాదము స్వీకారయోగ్యము కాదని మనము చూచియున్నాము. ఉనికి లేని వస్తువునకు కారణమే ఉండదు. ఆ కారణముతో సంబంధము అనే ప్రసక్తి ఎక్కడిది ?

ఒక వస్తువు ఉనికి లేనిదే అయినా, దానికి స్వీయకారణముతో సమవాయసంబం ధము సంభవమేనని వైశేషికులు వాదింతురు. కాని అట్టి సంబంధము సంతానము లేని యువతియొక్క పుత్రుడు వంటి ఉనికి లేని పదార్థముల విషయములో గోచరించుట లేదని శ్రీశంకరులు గుర్తు చేయుచున్నారు. ఆ పుత్రుడు తన తల్లికి ఉత్తరములను వ్రాయునా యేమి ? ఉనికి లేని పుత్రునకు ఉనికి గల తల్లితో సమన్వయము ఏ విధముగ నైననూ పొసగదు.

వైశేషికులు ఇంకనూ ఇట్లు వాదించవచ్చును : సంతానము లేని యువతియొక్క పుత్రునకు తన తల్లితో అనుబంధము పొసగకున్ననూ, పుట్టుటకు ముందు ఉనికి లేని కుండకు స్వీయకారణమగు మట్టితో సమవాయసంబంధము సంభవమే. ఈ రెండు అభావ ములు ఒకటి కాదు. కుండ పుట్టుటకు ముందు కుండకు ఉనికి లేదు. అటులనే, సంతా నము లేని యువతియొక్క పుత్రుడు కూడ లేడు. ఈ రెండు ఉనికి లేనివియే. కుండ యొక్క అభావమునకు, సంతానము లేని యువతియొక్క పుత్రుడు లేకపోవుటకు భేదము ఏమి ? సంతానము లేని యువతియొక్క పుత్రునకు ఎవ్వరితోనైననూ సంబంధము లేదను మాట వైశేషికులకు కూడ అంగీకారమే. కాని కుండయొక్క ప్రాగభావము ( పుట్టుటకు ముందు లేకుండుట ) స్వీయకారణముతో సంబంధమును ఏర్పరచుకొనుచున్నది. కావున ఈ ప్రాగభావమునకు ఆ పుత్రుని అభావమునకు భేదము ఉండి తీరవలెను. ఒక అభావ మునకు సంబంధము ఉండగా, మరియొక అభావమునకు సంబంధము లేదు. కావున, ఈ రెండు అభావములకు మధ్యలో ఏదో ఒక భేదము ఉండవలెను.

శ్రీశంకరులు ఈ వాదమును ఇట్లు త్రోసిపుచ్చుచున్నారు : ఒక వస్తువుయొక్క అభావము, రెండింటి అభావము, అన్నింటి అభావము, ప్రాగభావము, ప్రధ్వంసాభావము ( నశించిన పిదప లేకుండుట ), అన్యోన్యాభావము ( ఒకటి మరియొక దానిలో లేకుండుట ), అత్యంతాభావము ( అసలే లేకుండుట, కుందేటి కొమ్ము ) అని వైశేషికులు అభావమును పలు విధములుగా వర్ణించుచున్నారు. కాని, ఎవ్వరైననూ ఈ అభావముల మధ్య భేదమును చూపజాలరు. ఒకనికి సంస్కృతపరిజ్ఞానము లేదనుకొనుడు. మరియొకనికి హిందీ తెలియదు. సంస్కృతజ్ఞానము లేకుండుటకు, హిందీ తెలియక పోవుటకు భేదము ఏమి గలదు ? భేదము లేశమైననూ లేదు. భేదము ఉన్నచో, సవిశేషమగు ఆ అభావము భావమే యగును. భావపదార్థముల విషయములో మాత్రమే భేదము ఉండగలదు. కావున, అభావముల మధ్యలో భేదము ఉండే అవకాశము లేనే లేదు.

వైశేషికులు మరల ఇట్లు వాదించెదరు : ఈ రెండు అభావముల మధ్య భేదము లేకున్ననూ, ఘటప్రాగభావము ( పుట్టుటకు ముందు కుండ లేకుండుట ) మాత్రమే కుమ్మరివాని సాహాయ్యముతో కుండ అనే స్థితిని పొందును. అది ఉనికి గల కుండ అనే స్థాయిని పొందిన పిదప ఉనికి గల స్వీయకారణముతో సంబంధమును నెలకొల్పుకొనును. ఆ సంబంధము నెలకొనిని తరువాత అది నీటిని తెచ్చుకొనుట మొదలగు ప్రయోజనకరమగు కార్యములకు యోగ్యమగును. దాని అభావమునకు ఇతరములగు అభావములకంటె భేదము లేకున్ననూ, వివరించుటకు వీలు లేని ఒకానొక విధములో ఆ అభావము ఉనికిని పొందినది. ఆశ్చర్యకరమగు పద్ధతిలో అభావమునుండి ఉనికిని పొందియున్న ఈ కుండ నశించిన పిదప ఉనికిని గోల్పోవును. కుండ పుట్టుటకు ముందు, అది నశించిన తరువాత ఘట-అభావము గలదు. ఘటముయొక్క ఈ ప్రాగభావ,ప్రధ్వంసాభావముల మధ్య భేదము ఏమి ? ప్రాగభావ,ప్రధ్వంసాభావములు రెండు అభావములే అయినా, ప్రాగభావము మాత్రమే కార్యకారి యగును. ప్రధ్వంసాభావము వలన ప్రయోజనము ఏమియు లేదు. దానికి వ్యవహారయోగ్యత లేదు. కాని ప్రాగభావమునకు సృష్టింబడే యోగ్యత గలదు. కావున, అది కార్యకారి యగును. అది స్వీయకారణముతో సంబంధమును నెలకొల్పి కొని, సృష్టించబడినది అని వర్ణించే యోగ్యతను సంపాదించుకొనును. కాని ప్రధ్వంసాభావమునకు అట్టి సామర్థ్యము లేదు. ఇదియే భేదము.

ఈ భేదము నిలబడదు. భేదమును నెలకొల్పగలిగే విశేషణములు అభావమునందు ఉండజాలవు.

చర్చలోనికి ఈ అంశము వద్ద సాంఖ్యులు ప్రవేశించుచున్నారు : అభావము భావము కాదు. ఉనికి గల పదార్థము మాత్రమే ఉనికిని పొందును. ఇది సాంఖ్యుల వాదములోని సారాంశము.

ఈ వాదమైననూ నిర్దుష్టము కాదు. కుండ కుండ అగును. వస్త్రము వస్త్రము అగును. అనగా సృష్టి అనేది లేదు. ఇది కూడ మనకు లభించే ప్రమాణమునకు విరుద్ధముగామన్నది. పుట్టుటకు ముందే కుండ ఉండే పక్షములో అది పుట్టి ఉనికిని పొందుట అను ప్రసక్తియే ఉండరాదు. మట్టి రూపాంతరమును పొంది కుండ అయినది అను వాదమైననూ

సరి గాదు. ఈ వాదములో ఒక వస్తువు వాస్తవమగు పరిణామమును చెందును. అంతకు ముందు లేని కొత్త విశేషణము ఆ వస్తువుతో జతగూడును. ఉనికి గల మట్టికి ఘటత్వము అనే కొత్త విశేషణము జతగూడి కుండ పుట్టినది. పుట్టిన వస్తువు నశించినప్పుడు ఆ విశే షణము కూడ నశించును. ఈ వాదములో ఘటత్వము అనే విశేషణమునకు మట్టితో సమా నమగు యథార్థత గలదు. వాస్తవములో ఈ వాదమునకు వైశేషికుల వాదమునకు భేదము లేదు. ఏలయన, వీరు పుట్టుటకు ముందు లేని విశేషణము ఉనికిని పొందినదనియు, అది మరల నశించుననియు స్వీకరించెదరు. ఘటత్వము పుట్టుటకు ముందు ఉన్నదా ? లేదా అని వీరిని ప్రశ్నించవలెను. అది లేని పక్షములో, లేనిది ఉన్నది యగుట అనే సమస్య అటులనే మిగిలి యున్నది. వైశేషికుల వాదములోని దోషములన్నియు దీనియందు కూడ గలవు. అట్లు గాక, ఘటత్వము పుట్టుటకు ముందు ఉన్నది అనే పక్షములో సృష్టి అను మాటకు అర్థము ఉండదు.

సృష్టి అనగా అభివ్యక్తి మాత్రమే ; కనబడక పోవుటయే వినాశము అని అంగీకరిం చినా, అవే సమస్యలు ఇంకనూ మిగిలియుండును. ఉదాహరణకు మట్టిలో ఘటత్వము అనే కొత్త గుణము అభివ్యక్తమై, ఘటము పగిలినపుడు అది అదృశ్యమైనదనుకొనుడు. ఆ గుణము అదృశ్యమైనప్పుడు వినాశమనియు, కనబడినపుడు సృష్టి అనియు మనము వర్ణి స్తాము. ఈ కొత్త గుణముయొక్క అభివ్యక్తిని మరియు అదర్శనమును అంగీకరించినా, ఒక ప్రశ్న మిగిలియుండును. ఆ గుణము పుట్టుటకు ముందు, అదృశ్యమైన పిదప ఉనికిని కలిగియున్నదా ? లేదా ? మట్టియందు అభివ్యక్తమైన ఈ ఘటత్వము అభివ్యక్తికి పూర్వము మట్టియందు ఉన్నదా ? లేదా ? లేదన్నచో, లేనిది ఉదయించుట అనే సమస్య మరల ముందుకు వచ్చును. మరియు అది అదృశ్యమైనప్పుడు ఉన్నది లేకుండా పోవుట అనే సమస్య వచ్చును. అనగా, లేనిది ఉదయించినది. ఉన్నది లేకుండా పోయినది. ఇది మన అనుభవమునకు, ప్రమాణజన్యమగు జ్ఞానమునకు విరుద్ధము.

మరికొందరు ఇట్లు వాదించుచున్నారు : కారణము పరిణమించి కార్యము అనే కొత్త స్థితిని దాల్చును. అనగా, సృష్టి కేవలము కారణముయొక్క నూతనమగు అవస్థ మాత్రమే. తరువాత, అదే కారణము మరల పరిణమించి ఇంకో అవస్థను దాల్చును. దానికే వినా శము అని పేరు. కావున, కారణముయొక్క ఒక అవస్థ సృష్టి కాగా, మరియొక అవస్థ ప్రళయము అగును. ఈ వాదమును వినిన తరువాత, మనము ఒక ప్రశ్నను వేయవలసి యున్నది. ఈ నూతనావస్థ యథార్థమా ? కాదా ? వారి దృష్టిలో కారణము సత్యము గను క, నూతనమగు అవస్థ కూడ సత్యమే యగును. కారణముయొక్క నూతనావస్థ వాస్తవ ముగా ఉదయించిన పక్షములో, అది పుట్టుటకు ముందు ఉన్నదా ? లేదా ? మరల సమస్య మొదటికి వచ్చినది. ఇది ఆరంభములో కొంగ్రొత్త వాదము వలె భాసించిననూ, విశ్లేషించి చూచినచో, సమస్య మరల మొదటికే వచ్చినది.

ఆత్మ మరియు కర్మ అను వాటి స్వరూపమును తెలుసుకొని, సర్వకర్మసన్న్యా సము మరియు తద్ద్వారా మోక్షము సంభవమేనా ? అను విషయమును నిర్ధారించుటకై మనము ఈ చర్చను చేయుచున్నాము. ఈ విషయమును మనము మరువరాదు.

లేని దానినుండి ఉన్నది ఉదయించ లేదు. ఉన్నదానినుండి ఉన్నది ఉదయించు టయు పొసగదు. ఇంతవరకు మనము ఈ విషయమును చూచినాము. ఈ సమస్యను పరిష్కరించుట ఎట్లు ? ఇటువంటి గత్యంతరము లేని పరిస్థితిలో మనము సమస్యను పూర్తిగా కొత్త దృష్టికోణములో పరిశీలించవలెను. మనము సంభవమయ్యే వికల్పములనన్నింటినీ పరిశీలించి ఒకదాని తరువాత మరియొక దానిని త్రోసిపుచ్చినాము. ఇపుడు మన యెదుట ఒకే ఒక దారి గలదు. ఉనికి గల వస్తువు అని మనము చెప్పే కుండ ఉనికి గలది కాదు; ఉనికి లేనిది కూడ కాదు. దానికి స్వతంత్రమైన ఉనికి లేదు. మట్టి కంటె వేరుగా దానికి ఉనికి లేదు. కాని కుండ కార్యకారి యగుచున్నది. కావున అది ఉనికి లేనిది అని పూర్తిగా త్రోసిపుచ్చ లేము. అది ఈ రెండు స్థితులకు మధ్యలో నున్నది; దీనికే మిథ్య అని పేరు. సమస్తజగత్తుయొక్క పరిస్థితి ఇంత మాత్రమే. స్వతంత్రమగు ఉనికి గలది సత్యము. సత్యముపై ఆధారపడేది మిథ్య. ఇతరము దేనిపైననూ ఆధారపడకుండగా స్వతంత్రమగు అస్తిత్వము గల ఒకే ఒక సత్యము ఆత్మ. అనగా నీవు. ఇతరము సర్వము ఆత్మపై ఆధారపడి యున్నది. ఒకే ఒక సత్యము గలదు. కాని ఆ ఏకైకసత్యము అజ్ఞానముచే పుట్టినట్లు, కొంతకాలము మనుగడను సాగించినట్లు, తరువాత నశించినట్లు భాసిల్లుచున్నది. మట్టి కుండ రూపములో పుట్టి కొంత కాలము ఆ రూపములో నుండి తరువాత నశించినట్లు భాసించును. జగత్తు కూడ అంతే.

కుండ ఎప్పుడు ఏ విధముగా పుట్టినది ? ఇది తెలియదగిన విషయము. దానికి కుండ అని పేరు పెట్టవచ్చును. కాని పరిశీలించి చూచినచో, కుండ అనే వస్తువు లేదు. కుండకు మట్టికంటె భిన్నమైన స్వతంత్రమగు అస్తిత్వము ఉన్నచో, అది ఎప్పుడు ఎట్లు పుట్టినది అను విషయమును నిరూపించ వలసిన ఆవశ్యకత ఏర్పడును. కాని కుండకు ఉనికియే లేదు. దాని ఉత్పత్తిని వర్ణించ వలసిన అవసరమేమున్నది ? కేవలము నామధేయము అనే దృష్టితో చూచినచో, మనముందు కుండ మరియు మట్టి అనే రెండు పేర్లు ఉన్నవి. మట్టి అనే పదమునకు సంబంధించి ఒక పదార్థము కానవచ్చుచున్నది. కాని కుండ అనే పేరునకు సంబంధించిన పదార్థమేదియూ కానవచ్చుట లేదు. ఇదిగో కుండ ! అని జనులు చూపించే వస్తువు మట్టి మాత్రమే. కుండ ఎక్కడనున్నది ? ఏది పుట్టినది ? మట్టినుండి బయటకు కుండ అనే వస్తువు వచ్చినచో, కుండ పుట్టినది అని చెప్పవచ్చును. కాని మట్టి ఉన్న స్థితిలో మార్పు ఏమియు లేదు. మట్టి మట్టిగనే ఉన్నది.

అదే విధముగా, జాగ్రదభిమాని, స్వప్నాభిమాని మరియు సుషుప్త్యభిమాని అగుటకై ఆత్మ మార్పులను చెందదు. ఆత్మ అఖండసచ్చిదానందస్వరూపముగనే కొనసాగుచుండును. వాస్తవములో ఆత్మకు జాగ్రత్ మొదలగు అవస్థలు లేవు గనుక, నేను తెలివిగా నున్నాను, కల గనినాను, నిద్ర పోయినాను అనే ధారణలు కేవలము అవిద్యవలన కలిగినవి మాత్రమే. తెలివిగా నుండుట, కల గనుట, మరియు నిద్ర పోవుట అనే అవస్థలు గాని, ఇతరములగు అవస్థలు గాని ఆత్మయందు ఆరోపించబడుచున్నవే గాని, ఆత్మ యథార్థముగా ఆ అవస్థలను అనుభవించుట లేదు. ఈ అధ్యారోపితములగు ధారణలన్నియు అయథార్థములు గనుక, వాటిని త్రోసిపుచ్చవలెను.

అదే విధముగా, కుండ అనే పదార్థము ఏదియు పుట్టుట లేదు. వాస్తవములో ష్టి ( పుట్టుక ) అనేది ఏదీ లేదు. ఆ పదముయొక్క అర్థము కూడ కుండ వలె మిథ్య యే. కుండ అనే పదార్థము సృష్టించబడినది అని చెప్పే వారిని ఒక ప్రశ్న వేయవలెను. ుండ పుట్టినది అనగా ఒక విశిష్టకాలములో పుట్టినది అనియే గదా ! కుండ పుట్టిన ాలము ఏది ? మట్టి పుట్టినప్పుడే కుండ పుట్టినదని చెప్పుట యుక్తతరముగా నుండును. ఎలయన, కుండయొక్క అస్తిత్వము మట్టిపై ఆధారపడి యున్నది. కుండ పుట్టుటకు ఆధా రమైన పదార్థము ఒకటి ఉన్నదా ? లేదా ? ఉన్నది. ఆ పదార్థము ఎప్పుడు పుట్టినది ? ఈ విధముగా ప్రశ్నిస్తూ పోతే, మనకు అవ్యవస్థ ( infinite regression ) ఎదురగును. కుమ్మరి అవస్థను విశ్లేషించినా, మనకు ఇదే పరిస్థితి ఎదురగును. దీనికి ఆరంభము లేదు. దమునకు మాత్రమే ఆరంభము గలదు. అది కూడా కుండయొక్క జన్మనాశములవలె ానజనితము మాత్రమే. ఉన్నది ఒకే ఒక వస్తువు. దానిని పలు విధములుగా ఊహించు ్ జనులు పలు విధములుగా వర్ణించుచున్నారు. జన్మనాశములు దృష్టికోణములు ాత్రమే. కాని కొంగ్రొత్తది ఒకటి పుట్టినదా యన్నట్లు, ఉన్నది నశించినదా యన్నట్లు కులు పలుకుచున్నారు. ఈ సర్వము భాసించుట మాత్రమే ; యథార్థము కాదు. ఈ దముయొక్క సారము ఇదియే.

శ్రీశంకరులు నటుని దృష్టాంతముగా నిచ్చిరి. ఒకే ఒక వ్యక్తియగు నటుడు బిచ్చ ానివలె, సైనికుని వలె, రాజు వలె కన్పట్టును. ఆతడు పాత్రలను, వేషమును మార్చు చుండుటచే, అనేకవ్యక్తులవలె కానవచ్చును. కాని ఉన్నది ఒక్క వ్యక్తి మాత్రమే. అదే ిధముగా అద్వితీయమగు బ్రహ్మాత్మ సృష్టిస్థితిలయములకు అధిష్ఠానమగుచూ, అదియే ారణమువలె మరియు కార్యము వలె భాసిల్లుచున్నది. ఈ జగత్తులోని సర్వము వివిధరూ ములలో కన్పట్టే ఏకైకవస్తువు మాత్రమే. లేని దానికి ఉనికి లేదు ; ఉన్నదానికి అభా వము లేదు ( నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః ) అని భగవానుడు చెప్పుట లోని తాత్పర్యమిదియే. మన దృష్టాంతములో కుండకు స్వతంత్రమగు ఉనికి లేదు ; మట్టికి వాస్తవమగు వినాశము లేదు.

ఉనికి గల వస్తువు ( సత్ ) వినాశమును పొందే ప్రసక్తి లేదు. కుండ ఉన్నది, కుర్చీ ఉన్నది, మేజా బల్ల ఉన్నది, మనుష్యుడు ఉన్నాడు, సూర్యుడు ఉన్నాడు, చంద్రుడు ఉన్నాడు, ఒకానొక వస్తువు ఉన్నది ఇత్యాది వచనములన్నింటిలో ఉన్నది అనే బుద్ధి ( సత్-ప్రత్యయము ) సమానముగా కలదు. ఆ బుద్ధి లేని ఒక క్షణమైననూ గలదా యని పరిశీలించుడు. కుండ ఉన్నది అని మనము అన్నప్పుడు, ఆ బుద్ధి గలదు. కుండ నశించినది అని అన్నప్పుడు కూడా ఆ బుద్ధి మట్టిని పట్టుకొని ఉండనే యున్నది. జ్ఞానము లన్నింటిలో ఈ రెండు అంశములు గలవు. మారిపోతూ ఉండే రూపజ్ఞానము మొదటిది. స్థిరముగా ఉండే ఉనికి రెండవది. సద్బుద్ధి తొలగిపోయే ప్రసక్తి లేదు. ఆ ఉనికియే చైత న్యము. అదియే నీవు. తెలుసుకొనే వాడు, తెలివి, మరియు తెలియబడే వస్తువు అనే విశి ష్టరూపములలో అదియే భాసిల్లుచున్నది. ఈ మూడింటినీ కలిపి మనము సృష్టి అని వ్యవహరించుచున్నాము. నేను కుండను తెలుసుకున్న క్షణములో కుండ-జ్ఞానము గలదు.

కాని దాని స్థానములో పుష్పజ్ఞానము రావచ్చును. కాని సర్వజ్ఞానములలో జ్ఞప్తి ( చైతన్యము ) అంతర్నిష్ఠమై యున్నది. జ్ఞానము ఏ రూపములో నున్ననూ అది తొలగిపోవుట లేదు. విశేషజ్ఞానము లేని సందర్భములోనైననూ, ఉదాహరణకు రెండు విశిష్టజ్ఞానముల మధ్యలో కూడ చైతన్యము ఉండనే యున్నది. ఈ పరిస్థితికి కుండ-మట్టి చక్కని దృష్టాంతము. కుండ ఉన్నప్పుడు మట్టి ఉన్నది. కుండ మరియొక రూపములో ఉన్నా, లేదా లేకుండా పోయినా, మట్టి మాత్రము మిగిలి యున్నది. కుండ అనే దృష్టికోణములో మనము మట్టిని కారణము అని పిలుస్తాము. అప్పుడు కుండ కార్యము అగును. కుండ తన ఉనికికి మట్టిపై ఆధారపడి యుండును. మరియు కుండ పుట్టి నశించును. ఈ రెండు కారణములచే కుండ మిథ్య అనబడుచున్నది.

శ్రీశంకరులు ఒక దృష్టాంతమునిచ్చిరి. ఒకడు కంటిలో తిమిరదోషము ఉండుటచే ఒక చంద్రుని స్థానములో రెండు చంద్రులను చూచుచున్నాడు. ఆ దోషమును నివారించిన పిదప రెండవ చంద్రుని శేషమైననూ మిగిలియుండదు. ఏలయన, రెండవ చంద్రుని చూచుటకు తిమిరదోషము కారణము. కారణము తొలగిపోగానే కార్యము నిశ్శేషముగా తొలగిపోవును. అదే విధముగా అకర్తృ-ఆత్మవిషయములో గల అజ్ఞానము తొలగిపోగానే, ఆత్మయందు క్రియ ఏమియు మిగిలి యుండదు. ఈ సత్యమును గ్రహించిన వానికి భగవానుని ఈ క్రింది వచనము స్పష్టమగును : దేహములో నివసిస్తూ జితేంద్రియుడై ఉండే పురుషుడు మానసికముగా కర్మలనన్నిటినీ పరిత్యజించి కర్మలను తాను చేయకుండగా, ఇతరులచే చేయించకుండగా ఈ తొమ్మిది ద్వారముల నగరములో ఆనందముగా కూర్చుండి యుండును ( *సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ, నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్* ). ఇచట మనసా అనగా జ్ఞానముచే అని యర్థము. ఆత్మ అకర్త అనే జ్ఞానముచే కర్మలను విడిచిపెట్టి ఆతడు తాను స్వయముగా కర్మలను చేయకుండగా, ఇతరులచే చేయించకుండగా, సుఖముగా విశ్రమించును. ఆతడు తన మనస్సునైననూ క్రియలయందు ఆజ్ఞాపించడు. కాని ఆతడు మనస్సులో ఏమి జరుగుచున్ననూ, తన ఆశీర్వచనమును అందజేయును ( *అనుమంతా* ). ఆత్మ లేనిదే మనస్సు లేదు. కాని ఆలోచించేది ఆత్మ కాదు. ఆత్మయొక్క సన్నిధిలో మాత్రమే సర్వము జరుగుచుండును. కాని ఆత్మ అసంగముగా నుండును. ఈ సత్యమును తెలిసిన జ్ఞాని కర్మలను వేటినీ చేయుట లేదు. కావున, ఆతనికి సర్వకర్మసన్న్యాసము సంభవమే.

ఈ దృష్టికోణముతో చూస్తే, విరుద్ధముగా భాసించే అనేకవాక్యములు స్పష్టమగును. స్వీయకర్మయందు ఆనందమును పొందే మానవుడు సంసిద్ధిని పొందును ( *స్వే స్వే కర్మణి అభిరతః సంసిద్ధిం లభతే నరః* ). స్వకర్మానుష్ఠానము ద్వారా పరమేశ్వరుని అర్చించు మానవుడు విజయమును పొందును ( *స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః* ). ఆత్మ అకర్త యనే విషయమునెరుంగక, తాను కర్తననే ధారణ గల వ్యక్తి కర్మయోగియై విశిష్టదేశకాలములలో తాను చేయవలసిన కర్తవ్యమును సముచితమగు మనఃప్రవృత్తితో ఆచరించి మానసికసంఘర్షణలకు దూరముగా జీవిస్తూ రాగద్వేషముల ప్రభావమునుండి విముక్తిని పొందును. అపుడాతడు ఆత్మ అకర్త యనే సత్యమును గ్రహించగల మనఃస్థితిని పొందును. ఈ విధముగా ఈ రెండు రకముల వాక్యములు సుసంగతముగా

నున్నవి. జ్ఞానరూపమగు సర్వకర్మసన్న్యాసమును గురించి ఒక రకము వాక్యములు చెప్పుచుండగా, రెండవ రకము వాక్యములు కర్మయోగమును గురించి చెప్పుచున్నవి. కర్మయోగము కూడ జ్ఞానము కొరకు మాత్రమే ఉద్దేశించబడినను, అది అజ్ఞానిని దృష్టిలోనిడుకొని కర్మను చేయదగిన విధమును నిర్వచించును. స్వకర్మానుష్ఠానము ద్వారా పరమేశ్వరుని ఆరాధించు వ్యక్తి సిద్ధిని పొందును. అనగా, జ్ఞానోదయమునకు దారి తీసే అంతఃకరణపరిశుద్ధిని పొందును.

కర్మానుష్ఠానములో అధికమగు క్లేశము ఉన్ననూ, స్వభావముచే కర్మ దోషయుక్తమే అయిననూ ( సదోషం అపి ), మానవుడు తన కర్తవ్యకర్మ ( సహజం కర్మ ) ను విడువరాదు ( న త్యజేత్ ) అని శ్రీకృష్ణభగవానుడు చెప్పుటలో గల కారణమును మనము ఇప్పుడు అర్థము చేసుకొన గలము. అజ్ఞానము అనే దృష్టికోణములో ఈ వచనము చెప్పబడినది. కర్మబంధమునుండి కర్మ విముక్తిని ఈయజాలదు. కావున, సర్వకర్మలలో ఆ దోషము ఉన్నది. కొన్ని కర్మలను విడిచిపెట్టి మరికొన్ని కర్మలను చేపట్టినచో, దానివలన ఒరిగేది ఏమీ ఉండదు. ఏలయన, వ్యక్తియొక్క ఊహాప్రపంచములో ఎట్లు ఉన్ననూ, ఒక విధి మరియొక విధికంటె ఎన్నటికీ గొప్పది కాని, తక్కువది కాని కాదు. రెండు విధులు కర్మలే. రెండు త్రిగుణాత్మకములే. రెండు పరిచ్ఛిన్నమైనవియే. రెండు సంసారమును కలిగించునవియే. తాను ఉన్నచోటనే ఉండి తన కర్తవ్యమును యోగ్యమగు మనఃప్రవృత్తితో చేస్తూ ఉండే వ్యక్తి రాగద్వేషములనుండి విముక్తిని పొంది మోక్షమునకు అర్హుడగును. ఈ శ్లోకములోని తాత్పర్యము ఇదియే.

సర్వకర్మసన్న్యాసము సంభవమా ? కాదా ? అను విషయమును నిర్ధారించుటకై పై చర్చకు ప్రాముఖ్యము గలదు. ఆత్మ స్వరూపముచే సర్వకర్మవినిర్ముక్తమై యున్నది. కావున, ఈ సత్యమును గుర్తించు మానవుడు సర్వకర్మలనుండి విముక్తిని పొందును. మానవుడు కొత్తగా కర్మలనుండి విముక్తుడు కాబోడనియు, సర్వదా కర్మవినిర్ముక్తుడుగనే ఉన్నాడనియు తెలుసుకొనుట చాల ముఖ్యము. వ్యక్తి జ్ఞానోదయమునకు పూర్వములో సర్వకర్మసన్న్యాసియే. జ్ఞానోదయము తరువాత కూడ సర్వకర్మసన్న్యాసియే. కాని ఆ సత్యము ఆతనికి తెలియకుండెను. కాని ఇప్పుడు తెలిసినది. పూర్వమునందు గల బంధావస్థకు, ఇప్పటి విముక్తికి భేదము ఇంత మాత్రమే. ఈ రెండు అవస్థలు సంసారియగు జీవునకే గాని, ఆత్మకు కాదు. బంధము, మోక్షము అనే ఈ స్థితులు ఆత్మయందు ఉన్నవా యనిపించును. కాని వాస్తవములో ఈ రెండు ఆత్మయందు అజ్ఞానముచే ఆరోపించబడుచున్నవి. దీనిని బట్టి మోక్షము ఒక అవస్థ కాదని మనకు తెలియుచున్నది. మోక్షము అవస్థయే యైనచో, దానిని పొందిన కొంత కాలము తరువాత అది తొలగి పోవును. ఈ విధముగా వచ్చి పోయే మోక్షము మోక్షమే కాదు. జీవునకు అజ్ఞానముచే తాను బద్ధుడననే ధారణ ఉండును. ఆ ధారణ విలీనము అయినప్పుడు, దానికి మోక్షము అని పేరు. అంతకు ముందు ఉన్న అజ్ఞానకృతబంధమును దృష్టిలో నిడుకొని, జ్ఞానమునకు మోక్షము అనే ఆపేక్షికమగు పేరు పెట్టబడినది. కావున, సర్వకర్మసన్న్యాసరూపమగు మోక్షము ఆత్మస్వరూపము కంటె భిన్నము కాదని స్పష్టమగుచున్నది.

మానవుడు కర్మయోగజీవనముచే సిద్ధిని బడయును. ఇచట సిద్ధి యనగా ఆత్మస్వరూపజ్ఞాననిష్ఠకు కావలసిన సంసిద్ధత అని యర్థము. మానవుడు తన నిత్యకృత్యములను ఒక విశిష్టమగు మనఃప్రవృత్తితో ఆచరించినచో, కర్మలన్నియు యోగముగా తీర్చిదిద్దబడును. అట్టి కర్మయోగము అంతఃకరణశుద్ధిని కలిగించును. మనస్సులో వచ్చే ఈ మార్పునకు సంసిద్ధత అనియు, జ్ఞాననిష్ఠాయోగ్యత అనియు పేరు. ఒక అన్వేషణలోని చరమలక్ష్యమునకు నిష్ఠ అని పేరు. కావున, ఆత్మజ్ఞాననిష్ఠ యనగా సర్వోత్కృష్టస్థానమునకు చేరిన ఆత్మజ్ఞానము అని యర్థము. దానియందు దిద్దవలసిన మెరుగులు ఏమియు లేవని యర్థము. అస్పష్టత మరియు భ్రాంతి లేని ఆత్మజ్ఞానము జ్ఞాననిష్ఠ యనబడును. ఇట్టి జ్ఞానమునందు సంశయములకు తావు లేదని వేరుగా చెప్ప బని లేదు.

ముందుగా ఆత్మజ్ఞానమును సంపాదించి తరువాత దానిని అనుభవమునకు తెచ్చుకొనవలెను అని కొందరు చెప్పెదరు. మరికొన్ని వాక్యములతో బాటు జ్ఞాననిష్ఠ అనే ఈ సమాసపదమును తప్పుగా అర్థము చేసుకొనుటవలననే వారీ నిర్ణయమునకు వచ్చినారు.జ్ఞానమునకు, అనుభవమునకు మధ్యలో వారు ఒక అంతరమును సృష్టించినారు. కాని మనకు కావలసినది అనుభవము కాదు. మనకు అనుభవములో లోటు లేదు. ఏలయన, అనుభవము ఆత్మస్వరూపమై యున్నది. సర్వానుభవములు ఆత్మానుభవములో గ్రథితములై యున్నవి. జీవుడు చేతనపురుషుడు. జీవుని సర్వానుభవములలో స్వయంప్రకాశమగు చైతన్యము ' నేను ' అనే ధారణరూపములో సర్వదా ఉపలభ్యముగనే యున్నది. దానికే అనుభూతి, లేక అనుభవము అని పేరు. కావున, దానిని అనుభవించ వలసిన పని లేదు ; తెలుసుకున్నచో చాలును. ముందుగా జ్ఞానమును సంపాదించి, తరువాత దానిని అనుభవముగా మార్చుకొనుట అను కల్పన సరిగాదు. జ్ఞానమే చరమలక్ష్యము. నాకు నా అనుభవము లేకుండుట అనే సమస్య మనకు లేదు. నావద్ద లేనిదాని అనుభవము మాత్రమే నాకు ఉండదు. కాని ' నేను ఉన్నాను' అనే అనుభవము సర్వకాలములలో గలదు. నావద్ద లేనిది ఒకటి గలదు. అదియే ఆత్మస్వరూపమును గుర్తించక పోవుట. ఆత్మస్వరూపమును సరిగా గుర్తించకపోవుటచే అనాత్మయందు ఆత్మభ్రాంతి కలుగుచున్నది. నాకు నా గురించి ఉన్న భ్రాంతిని తొలగించుకొనవలెను. అదియే జ్ఞానము.

కర్మయోగము ఈ జ్ఞానమునకు కావలసిన అర్హతను సంపాదించి పెట్టును. రాగద్వేషముల ప్రభావమునుండి పూర్తిగా విడుదలను పొందుటయే ఈ అర్హత. గీతలో మానవుల రాగద్వేషములయొక్క మనోవిజ్ఞానము సమగ్రముగా నిరూపించబడి యున్నదని మనము చూచియున్నాము. రాగద్వేషముల వశములోనున్న వ్యక్తి జ్ఞాననిష్ఠను పొందజాలడు. కావున, ఈ జ్ఞానమునకు కావలసిన తయారీ రాగద్వేషములను నియంత్రించుట మాత్రమే. కర్మయోగజీవనముయొక్క చరమఫలము ఈ జ్ఞానము. కాని కర్మయోగము సాక్షాత్తుగా జ్ఞానమును కలిగించదు. జ్ఞానము ఏదైనా, దానికి కావలసిన సంసిద్ధత ఉన్నంత మాత్రాన అది పుట్టదు. జ్ఞానసాధనము ( ప్రమాణము ) ను సముచితమగు విధానములో వినియోగించినప్పుడు మాత్రమే జ్ఞానము పుట్టును. ఈ విధముగా పుట్టిన జ్ఞానమునకు తనదైన ఫలము గలదు. దానిని గురించి ఇచట నిరూపించబడుచున్నది. నేను ఇచట మీకు ఒక విషయమును చెప్పదలచితిని. మీకు జ్ఞానము లభించినా, లభించక పోయినా, కర్మయోగ

ఫలము చాల అభీష్టమైనది. జ్ఞానోదయము అనే దృష్టికోణములో దానిని సంసిద్ధత అని వర్ణించినాము. కాని కర్మయోగముయొక్క సాక్షాత్-ఫలము దానంతట అది ఇతరాపేక్ష లేకుండగా మిక్కిలి హితకరమైనది. ఏలయనగా, తన రాగద్వేషములను నియంత్రించుకొన గలిగే వ్యక్తిని జీవితములో విజయము వరించును.

విజయము అను పదమునకు అర్థము ఏమి ? రాగద్వేషముల పరిపూర్తియే విజయము అన్నచో, మానవుడు పరాజయమునకు గురి కాక తప్పదు. ఏలయన, రాగద్వేషములు అన్నీ పరిపూర్తి యగుట అసంభవము. అవి పరిపూర్తి కాని సందర్భములలో మానవుడు తనలో లేమిని భావించి, తనను తాను నిందించుకొని, తన జీవితము విఫలమైనదని నిర్ధారించుకొనును. వ్యక్తి అనేకఘనకార్యములను సాధించిననూ, గొప్ప బహుమతులను, బిరుదములను, సన్మానములను, సమాజములో పేరుప్రతిష్ఠలను పొందియున్ననూ, ఆత్మనిందాపరుడై ఉన్నంతవరకు మానసికమగు విశ్రాంతిని అనుభవించ లేడు. జనులు ఉదారులగుట చేతనే తనను మన్నిస్తున్నారనియు, వారికి తన యథార్థస్వరూపము తెలిసినచో దూరమగుదురనియు ఇట్టి వ్యక్తి భావించును. కొందరికి తమపై తమకు ఇట్టి నికృష్టభావన ఉండును. ఆత్మనిందాపరుడు కాని వ్యక్తికి ఘనకార్యములను సాధించిన సమయములో తనపై తనకు గౌరవము ఇనుమడించును. కాని ఈ ఆత్మగౌరవము ఎన్నటికీ పరిపూర్ణము కాజాలదు. ఏలయనగా, మానవుడు జీవితములో సాధించగలిగే ఘనకార్యములకు అంతము లేదు. మరియు సాధించిన ప్రతి ఘనకార్యమునకు ఇంకనూ మెరుగులు దిద్దే అవకాశము ఉండనే ఉన్నది. మనము ఒక విజ్ఞానశాఖలోని లోతులలో అధికాధికమగు విజ్ఞానమును సంపాదించే కొలదియు, దానిలో మనకు తెలియని క్షేత్రము కూడ అదే నిష్పత్తిలో పెరుగుచుండును. ఎంత అధికమగు విజ్ఞానము గల మానవుడైననూ, తనకు గల విజ్ఞానముయొక్క దృష్టికోణములో తాను పరిపూర్ణుడననే సంతోషమును పొందుట అసంభవము. నైపుణ్యము, పరిజ్ఞానము, ధనము, అధికారము మొదలగు వాటిలో మహత్త్వమును సంపాదించినంత మాత్రాన వ్యక్తియందు యథార్థమగు ఆత్మగౌరవము నిర్మాణము కాదు. మరియు వ్యక్తి ఆత్మనిందాపరుడు కాకున్నచో, అదియే పదివేలు. ఆత్మగౌరవమును కొత్తగా సంపాదించ వలసిన పని లేదు. ఆత్మయందు మహత్త్వము నిత్యసిద్ధము.

వ్యక్తి ఆత్మనింద చేసుకొనంతవరకు అతని క్షేమమునకు లోటు లేనే లేదు. ఆత్మనిందకు అలవాటు పడిన వ్యక్తి ఆత్మన్యూనతాభావమునుండి బయట పడుటకై ఆత్మగౌరవమును పెంపొందించుకొన వలసిన ఆవశ్యకత ఏర్పడును. కాని ఆత్మనింద అనే పృష్ఠభూమిక ( background ) లో జీవించు వ్యక్తి చేపట్టే కార్యములు ఏవియు సఫలము కావు. దీనికి ఆత్మపరీక్షకు చాల భేదము గలదు. ప్రపంచములో సక్రమముగా వ్యవహరించుటకై ఆత్మపరీక్ష హితకరము మరియు ఆవశ్యకము. ఆత్మపరీక్ష వేరు ; సర్వకాలములలో తనను తాను నిందించుకొనుట వేరు. ఈ ఆత్మనింద అనే అలవాటు ప్రతివ్యక్తిలో గలదు. దానిని పరిష్కరించుకో గలిగిన వ్యక్తి పరిపక్వతను పొందును. ఏలయనగా, ఆత్మనిందనుండి బయట పడుట కూడా రాగద్వేషనియంత్రణలో భాగమే. రాగద్వేషములు పరిపూర్ణమైనప్పుడు ఎగిరి గంతు వేయకుండుట, మరియు వైఫల్యము అని జనులు భావించే పరి

స్థితిని హుందాగా స్వీకరించుట అనునవి రాగద్వేషనియంత్రణలో అంతర్భాగములే. జాగ్రత్తగా విశ్లేషిస్తే వైఫల్యము అనేది ఏదీ లేదు. కేవలము క్రియ, ప్రతిక్రియ అనునవి మాత్రమే గలవు. ప్రతిక్రియ గురించి మనకు గల అపేక్ష మరియు ఆశ అను వాటి దృష్టికోణములో మాత్రమే వైఫల్యము అను ధారణ గలదు. ఈ అపేక్ష మనకు గల విజ్ఞానమునుండి ఉదయించును. అపేక్ష ఉండుట తప్పని సరి. అపేక్ష లేనిచో, మనము ఏ క్రియనైననూ ఆచరించ లేము. మనకు గల విజ్ఞానము అల్పము గనుక, మన అపేక్షలు మరియు ఆశలు సఫలము కాకపోవుట కూడ సహజమే. మనము ఒక కార్యమును నిర్వహిస్తూ, అల్పజ్ఞానముతో దానినుండి రాదగిన ఫలమును అంచనా వేయుచుందుము. ప్రతిఫలము మన అంచనాకంటె తక్కువగా ఉన్నప్పుడు, లేదా అంచనాకు విరుద్ధమగు ఫలము లభించినప్పుడు అది వైఫల్యమని మనము భావించెదము. అది మన వైఫల్యము కాదు. మనము చేయదగిన విధానములో కార్యమును అనుష్ఠించి యున్నాము. కాని మనకు గల విజ్ఞానము అల్పమగుటచే, ఫలమును అంచనా వేయుటలో పొరపాటు చేసినాము. మనము ఒక కార్యమును సావధానముగా యోజన చేసి నిర్వహించిననూ, ఫలము వద్దకు వచ్చుసరికి అన్ని రకముల వికల్పములు సంభవమే యగును. మనము అపేక్షించే ఫలము ఒకానొక వికల్పము మాత్రమే. మనము ఒక కార్యమును యోజన చేసి అనుష్ఠించిననూ, దానియందు వైఫల్యము అని మనము భావించే వికల్పము కూడ అంతర్గతమై యున్నది. కాని నా దృష్టిలో అది వైఫల్యము కాదు. ఏలయనగా, మానవుని పరిజ్ఞానము అత్యల్పము. కావున, అట్టి అల్పజ్ఞానముపై ఆధారపడే అపేక్షలో దోషము గలదు. కావున, ఆ అపేక్ష సఫలము కానిచో, దానిలో ఆశ్చర్యము లేదు. కాని, అది సఫలమైనచో, మనము పరమేశ్వరునకు కృతజ్ఞతను ప్రకటించవలెను. కాని తప్పినచో, అది అతిసహజమైన విషయము.

సర్వదా మనము కోరే విధముగనే ఘటనలు ఘటిల్లవు. ఈ సత్యమును గుర్తించినచో, కర్మయోగప్రవృత్తి నిర్మాణమగును. ఈ సృష్టిలో ఒక నియతి గలదు. అది మానవునకు గల ఇచ్ఛాస్వాతంత్ర్యముపై ఆధారపడియున్నది. లేదా, దానిలో మానవుని ఇచ్ఛాస్వాతంత్ర్యము ఒక అంగముగా నున్నది. ఆ నియతి గురించి మనకు గల పరిజ్ఞానము అత్యల్పము. అదియే కర్మనియతి. దానికి ధర్మనియతి అని కూడ పేరు. మానవుల పూర్వకర్మలు దానిలో భాగములే. మనము ఇప్పుడు చేసే కర్మల ఫలమును మన పూర్వకర్మలు వర్ధిల్లజేయ వచ్చును ; లేదా, త్రుంచి వేయ వచ్చును. ఈ కారణముగనే, సంస్కృతులన్నింటిలో అదృష్టము, దురదృష్టము అను అర్థమునిచ్చే ప్రయోగములు గలవు. యాదృచ్ఛికఘటన అనేది ఏదీ లేదు. యాదృచ్ఛికము అనగా మనకు హేతువులు అన్నీ తెలియవని అర్థము. ఒకని శిరముపై హఠాత్తుగా ఒక కాయ పడినది. ఆ సమయములో ఆతడు అచట ఉండుట యాదృచ్ఛికము అని మనము చెప్పవచ్చును. అది ఒక యోజన ప్రకారముగా జరిగిన ఘటన కాదు అనుటలో సందేహము లేదు. కాయ అతని శిరముపై పడవలెనని నిర్ణయించుకొని పడలేదు. కాని అది ఆ సమయములో మరియొకని శిరముపై పడకుండగా అతని శిరముపై మాత్రమే పడుటయు వాస్తవమే. అది ఒక యాదృచ్ఛికఘటన అని తేలికగా భావించవచ్చును. లేదా, అది అట్లు జరుగుటకు మనకు తెలి

యని కొన్ని కారణములు గలవు అని గుర్తించవచ్చును. ప్రతి ఘటన వెనుక కొన్ని కారణములు ఉండును. మానవుడు చేసే ప్రయత్నములన్నింటిలో కర్మనియతి వాని అభీష్టమునకు విరుద్ధముగా గాని, అనుకూలముగా గాని పని చేయుచుండ వచ్చును. ఈ సత్యమును అందరు గుర్తించక పోవచ్చును. కాని అదృష్టము మరియు దురదృష్టము అను భావన సర్వమానవులయందు గలదు. పచ్చని గడ్డితో నిండియున్న మైదానమును చూచి ఆవు, ' నేను అదృష్టవంతురాలను' అని అనుకోదు. ఈ అదృష్టము అనే ధారణ మానవుల యందు మాత్రమే గలదు. మానవులు మాత్రమే అదృష్టమును, దురదృష్టమును అనుభవించుచుందురు. మనము చేసే కర్మల ఫలమును మనము నిర్ధారించ జాలము అని మనము గుర్తించ గలిగినచో, అది సముచితమగు మనఃప్రవృత్తి యగును.

కర్మనియతిని అనుసరించి ఈశ్వరుడు జీవులకు కర్మఫలములను ఇచ్చును ( కర్మఫలదాతా ) అనే గుర్తింపు కూడ ఈ కర్మయోగమనే మనఃప్రవృత్తిలో అంతర్భాగమై యున్నది. సృష్టినియమములు అన్నియు ఈశ్వరస్వరూపములే. ఈ సృష్టినియమములు అన్నియు కలిసి తనపై కుట్ర చేసి తనకు కష్టములను కలిగించినవి అనే ధోరణి ఈ సత్యమును గుర్తించిన వ్యక్తియందు ఉండదు. ఈ నియమములకు పక్షపాతబుద్ధి లేదు. కావున, అవి ఒక వ్యక్తికి వ్యతిరేకముగా కుట్రను చేయజాలవు. అందువలననే, అవి సృష్టినియమములు అయినవి. నియతి కొందరిని అన్యాయమును చేయుట అనే ప్రసక్తి ఉదయించదు. సావధానముగా విశ్లేషిస్తే, మనకు ఇతరులైననూ అన్యాయమును చేయజాలరని స్పష్టమగును. మనము ఇతరులనుండి అధికమును అపేక్షించి నిరాశను చెందుటయే గాని, మనకు ఇతరులు చేసే అన్యాయము ఏమియు లేదు. ఇతరులు పరిపూర్తి చేయలేనంత అధికముగా అపేక్షించి మనము కష్టముల పాలగుచుందుము. ఇతరులు చేసిన దానికంటె అధికముగా చేయగలిగినచో, చేసి యుండెడివారు. దీనిలో ఇంతకు మించి విషయము లేదు. మన అపేక్షను పూర్తి చేయగలిగే సామర్థ్యము ఎదుటివానియందు లేదని మనము గుర్తించవలెను. అట్టి సామర్థ్యము ఎదుటివానియందు లేకపోవుటకు కారణమేమి ? ఉప్పు తియ్యగా కాకుండగా, ఉప్పగా ఉండుటకు కారణమేమి ? ఈ రెండు ప్రశ్నలు ఒకే తీరులోనున్నవి. ఉప్పు ఉప్పగా నున్నదనియు, పంచదార తియ్యగా నున్నదనియు మనము ఫిర్యాదు చేయము. ఒక వ్యక్తి ఒకానొక పరిస్థితిలో ఒక విధముగా ప్రవర్తించినాడు. అతడు పుట్టి పెరిగిన వాతావరణము, తల్లిదండ్రులు, పెంపకము, చదువుసంధ్యలు మొదలగునవి నీకు కూడ అదే విధముగా నున్నచో, నీవు కూడ అటులనే ప్రవర్తించి ఉండెడివాడవు. దాని కంటె భిన్నముగా ప్రవర్తించుట అసంభవమై ఉండెడిది. అతడు ఆ విధముగా ప్రవర్తించుట యుక్తిసంగతమేనని చాల తేలికగా గ్రహించవచ్చును.

సృష్టినియమములు సర్వదా సక్రమముగనే పని చేయును. ఆ విషయములో తప్పు జరుగుటకు అవకాశము లేదు. మన జ్ఞానము అల్పము గనుక, మనము తప్పులను చేయుచుందుము. మనకు గల జ్ఞానము అల్పమేనని గుర్తించినచో, సగము యుద్ధమును గెలిచినట్లే. మానవులము గనుక, సర్వము మన అధీనములో నున్నదని తలపోయుట మనకు అలవాటు. మనస్సులో అభద్రతాభావన ఉండుటచే, మనము పరిస్థితులను నియం

త్రించే ప్రయత్నమును చేయుచుందుము. సర్వము మన అంచనాకు, అనుకూలతకు అను రూపముగా జరుగదనియు, జీవితము హఠాత్పరిణామములతో నిండి యుండుననియు గుర్తించిన వ్యక్తి హృదయములో అభద్రతకు తావు లేదు. అతడు జీవితమును కులాసాగా గడుపును. పరిస్థితులను మనకు అనుకూలముగా మలుచుకోలేక పోతున్నామని మనము కూర్చుండి దుఃఖించవచ్చును. లేదా, మనము హఠాత్పరిణామములకు సంసిద్ధులమై యుండవచ్చును. హఠాత్పరిణామములకు సంసిద్ధముగా నుండి జీవితములో ఎదురయ్యే సుఖదుఃఖములను ఎదుర్కొనే సామర్థ్యమే కర్మయోగము. దీనిలో రాగద్వేషముల ప్రభావము సహజముగా క్షీణించును. వచ్చే దానిని వచ్చిన తీరులో స్వీకరించి, పోయే దానిని వదిలిపెట్టి, హఠాత్తుగా సంభవించే ఘటనలకు సంసిద్ధముగా నుండే మనఃప్రవృత్తి గలవాడే కర్మయోగి. కర్మయోగమనగా ఒక విశిష్టకర్మ అనుకోరాదు. ఇది చాల ప్రముఖమైన విషయము. కర్మయోగము ఒక విశిష్టమగు మనఃప్రవృత్తి. అది ఉన్ననాడు మనము అన్వేషిస్తున్న జ్ఞానము లభించి స్వంతమగును. దానికి ఆటంకములు ఏమియు ఉండవు.

మనకు రాగద్వేషములను నియంత్రించే సామర్థ్యము లేకపోవుటయే జ్ఞానమునకు ప్రధానమగు ఆటంకము అగుచున్నది. మనకు మనస్సు విషయములో కూడ రాగద్వేషములు గలవు. మనస్సు ఒక పద్ధతిలో ఆలోచించాలని మనము కోరుతూ ఉంటాము. కాని కర్మయోగి మనస్సును దాని దారిన దానిని విడిచిపెట్టును. ఎవరి మనస్సు అయినా, పిచ్చిది కానంతవరకు, దానిలో సమస్యలు లేవు. కాని నా మనస్సు ఇట్లు ఉండవలెను, అట్లు ఉండవలెను అని బాధపడుచున్నచో, అది శీఘ్రముగా పిచ్చిది కావచ్చును. మనస్సు సరళమైన ఆలోచనకు ఉపయోగపడే పరికరము. అది కొన్ని సమయములలో స్వీయసూత్రములను అనుసరించి పని చేయును. దాని మానాన దానిని వదిలి వేయుము. నీకు దానితో పని పడినప్పుడు దానినుండి పనిని తీసుకొనుము. నీకు కావలసినది అంత మాత్రమే. ఇతరసమయములలో దానిని విశ్రమించనిమ్ము. మనస్సును బట్టి నిన్ను నీవు నిందించుకొనకుము. చంచలత్వము దాని స్వభావము. అది అటులనే ఉండవలెను. ఆత్మనిందయే ప్రధానసమస్య. బంధహేతువులగు రాగద్వేషములు ఉన్నంతవరకు ఈ ఆత్మనింద సమస్య తీరేది కాదు. బంధహేతువులు కాని రాగద్వేషములు ఎన్ని ఉన్నా ఇబ్బంది లేదు.

ఈ కర్మయోగము సిద్ధించిన తరువాత జ్ఞానము ఉదయించిన చాలును. దానికొరకై ప్రమాణము తన పనిని తాను చేయవలెను. అనగా శాస్త్రమును శ్రవణము చేయవలెను. శ్రవణముతో బాటు విచారము ( మననము ) ను కూడ చేయదగును. అజ్ఞానావస్థకు సంబంధించిన అభిముఖ్యములు, అలవాట్లు ఇంకనూ మిగిలియున్నచో, నిదిధ్యాసనము వాటిని నిర్మూలించును. దానితో జ్ఞానము పూర్ణమగును. ఇప్పుడు గీతోపదేశము పూర్తి యగుటకు ముందు 18 వ అధ్యాయములో పరిపూర్ణజ్ఞానమే లక్షణముగా గల నైష్కర్మ్యమును గురించి చెప్పవలసి యున్నది. పరంబ్రహ్మ సర్వక్రియావినిర్ముక్తము మరియు అవిక్రియము. అకర్త మరియు అవికారి యగు ఈ పరంబ్రహ్మయొక్క జ్ఞానము గల వ్యక్తి నిష్కర్మా అనబడును. వాని స్వభావమే నైష్కర్మ్యము. అనగా క్రియాసంబంధము లేకుండుట. ఈ నైష్కర్మ్యమునకు పనులను చేయుటతో గాని, మానివేయుటతో గాని సంబం

గము చాల సూక్ష్మమైన విషయము. అది కేవలమనఃప్రవృత్తి మాత్రమే. అందువలననే, అది చాల దుర్బోధముగా నున్నది. దానిని సావధానముగా తెలియవలెను. దానిని గురించి అవగాహన పెరిగే కొలదీ దానిని స్వంతము చేసుకొనుట సుగమమగును. రాగద్వేషముల యెడ అసక్తబుద్ధిని కలిగియుండుట అను మాటకు అర్థము ఏమి ? ఆసక్తి లేకుండుట అని మాత్రమే శ్రీశంకరులు చెప్పిరి. అంతకు మించి వారు వివరించలేదు. కాని పూర్వాపరసందర్భమును బట్టి అనాసక్తత యనగా రాగద్వేషముల పరిపూర్తి యెడల ఉండే పట్టుదల నుండి విముక్తి అని తెలియవలెను. కర్మయోగలక్షణమగు మానసికసమత్వము ( సమత్వం యోగ ఉచ్యతే ) అనగా నిదియే. కర్మయోగి అన్ని పరిస్థితులలో ఇంచు మించు సమానమగు మనఃస్థితిని కలిగియుండును. అభీష్టము నెరవేరినపుడు అతడు ఎగిరి గంతులు వేయడు. కోరిక తీరనప్పుడు నిరాశను చెంది చీకాకు పడడు. తన కోరికలు తీరవలసినదే అనే తృష్ణనుండి అతడు విముక్తుడై యుండును. అతని దృష్టిలో రాగద్వేషములకు అధికమగు మహత్త్వము లేదు. కావున, అతడు వాటి పరిపూర్తి కొరకై ధర్మమును ఉల్లంఘించడు. ఇంతే గాక, అతని రాగద్వేషములు ధర్మమునకు అనురూపముగా నుండును. అధర్మమును అతడు ఇష్టపడడు. కర్తవ్యమునాచరించుటలో అతనికి ప్రీతి మెండు.

హరిః ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు

వ్యక్తి తన కోరికలను నెరవేర్చుకొనే ఉపాయములను ఎన్నుకొనే సందర్భములలో మంచి-చెడులను దృష్టిలోనిడుకొని ముందుకు సాగినచో, ఆతనికి సమస్యలు ఏమియు ఉండవు. ఒక లక్ష్యమును చేరుటకై అనేకములగు ఉపాయములు లభించుచుండును. కాని మనము ఎన్నుకొనే మార్గము ధర్మమునకు లోబడి యుండవలెను. మనము ధర్మమునకు అనురూపమగు కర్మను మాత్రమే చేపట్టవలెను. మనస్సులోని రాగద్వేషముల ఒత్తిడి వ్యక్తిని అధర్మమార్గములోనికి నెట్టేటంతటి అధికముగా లేనిచో, అట్టి వ్యక్తి అసక్తబుద్ధి గలవాడు అనబడును. ఇంతేగాక, అట్టి వ్యక్తి ఫలము సంప్రాప్తమైనప్పుడు దానిని హుందాగా స్వీకరించును. కర్మఫలము మన అపేక్షకు అనురూపముగా నుండవచ్చును; లేదా, అపేక్షకంటె అధికముగా గాని, తక్కువగా గాని ఉండవచ్చును; లేదా, అపేక్షించిన దానికి విరుద్ధముగా కూడ ఉండవచ్చును. మనము దానిని ఉల్లాసముగా స్వీకరించుటకు సంసిద్ధులమై యుండవలెను. అనగా రాగద్వేషములకు అధికారమును కట్టబెట్టరాదు. అసక్తబుద్ధి యనగా నిదియే నని తెలియుడు. ఈ పదము చాల గంభీరమగు అర్థము గలది. దీనిని అలవోకగా ప్రయోగించరాదు. ఇట్టి బుద్ధి గల వ్యక్తి అసక్తబుద్ధిః అనబడును.

ఈ ఆసక్తినుండి విముక్తమై ఉండే స్థితి వ్యక్తియొక్క జీవితములోని అన్ని రంగములలో వ్యాపించును. కావుననే, ఆతడు సర్వత్రా ఆసక్తి లేనివాడై యుండునని భగవానుడు చెప్పుచున్నాడు. మానవులకు కొన్ని వస్తువులపై అతిశయించిన ఆసక్తి ఉండును. శ్రీశంకరులు దీనికి పుత్రుని దృష్టాంతముగా నిచ్చిరి. పుత్రుడు / పుత్రిక, భార్య / భర్త మొదలగు వారి విషయములో ఈ విధమైన అనాసక్తత గలవాడు సర్వత్రా అనాసక్తుడై యుండును.

ఇట్టి వ్యక్తి జితాత్మా అనబడును. అనగా, ఆతడు రాగద్వేషములను నియంత్రణలో నుంచుకొని కర్మయోగజీవనమును గడుపుతూ తనపై తాను నిగ్రహమును కలిగియున్నాడు అని యర్థము. ఆతనిపై అధికారము రాగద్వేషములకు గాక, ధర్మమునకు గలదు. ఆతడు తన మనస్సును వశము చేసుకొనినాడు. రాగద్వేషముల ఒత్తిడి లేని మనస్సు ఏ విధముగా నుండును ? ఆ మనస్సు సమస్యలను సృష్టించదు. జీవితము ఈశ్వరాధీనము అనే సమర్పణాభావము గల మనఃప్రవృత్తివలన మనోనిగ్రహము సిద్ధించును. అట్టి వ్యక్తిని మనస్సు వ్యామోహములకు గురి చేయలేదు. ఆతడు జీవితములోని సమస్యలనుండి గట్టెక్కినాడు.

తనపై తనకు నిగ్రహము గలవాడు ( జితాత్మా ) గనుక, ఈతడు వివిధవస్తువులపై ఉండే తృష్ణనుండి విముక్తుడై ( విగతస్పృహః ) ఉండును. తృష్ణ యనగా నేమియో తెలియ గోరుచున్నారా ? తలకు రంగురంగుల రుమాలును కట్టి, మెడలో బంగరు గొలుసును దాల్చి, అంగీకి గుండీలను పెట్టుకోకుండా, గుంపులు గుంపులుగా బజారులో తిరుగుతూ, నాలుక బయటకు వ్రేలాడుచుండగా వివిధవస్తువులను ఆతురతతో చూచే యువకులను పరికించుడు. తృష్ణ అనగా నదియే. ఆందోళనలతో నిండిన మనస్సులు గల ఈ యువకులలో తృష్ణ కొట్టవచ్చినట్లు కానవచ్చును. కాని పెద్ద వయస్సు వచ్చుసరికి ఇది

అంతర్ధానము అగుననను నియమము లేదు. మధ్యవయస్కులు ఈ విధముగా ప్రవర్తించ జాలరు. వారు కొంత శిష్టాచారమును పాటించే పెద్ద మనుషులుగా లోకములో చెలామణీ అగుచుందురు. కాని వారిలో ఈ తృష్ణ ఇంకనూ మిగిలి యుండును. కొందరు శారీరక ముగా పెరిగి పెద్దవారైనా, వారి లోపల ఆందోళనలతో నిండిన యువకుడు దాగియే యుండును. తృష్ణ అనగా నదియే. ఒకడు కొన్ని వస్తువులను పరిత్యజించిననూ, వాటిని కలిగి ఉండాలనే తృష్ణ ఆతనిలో తొలగిపోయినదని చెప్పుటకు వీలు లేదు. కొందరు కొన్ని కోర్కెలను తీర్చుకొను సావకాశము లేకపోవుటచే పరిత్యజించెదరు. వ్యక్తి తన అభీష్టము తీరే ఉపాయము లేనప్పుడు సర్దుబాటు చేసుకొనును. మనము తృష్ణనుండి విముక్తిని గురించి చర్చిస్తున్నాము. అది ఇటువంటి పరిత్యాగము కాదు. ఆత్మను గురించి, జీవిత ములోని అన్వేషణలను గురించి కొంత అవగాహన గల వ్యక్తి ఈ అన్వేషణలు అల్పమై నవనే సత్యమును గుర్తించి కొంత వైరాగ్యమును కలిగియుండును. మనఃపరిపక్వతతో వస్తువులను వాస్తవికమగు దృష్టికోణముతో పరిశీలించుటయే వైరాగ్యమనబడును. వైరా గ్యము గలవానిలో తృష్ణ మటుమాయమగును. అట్టివానిని విగతస్పృహః అందురు.

*అసక్తబుద్ధిః సర్వత్ర, జితాత్మా* మరియు *విగతస్పృహః* అనే ఈ మూడు లక్షణ ములు కర్మయోగమునుండి పుట్టినవే. ఈ లక్షణములను కలిగియున్న వ్యక్తి కర్మనుండి విముక్తిని సాధించును ( నైష్కర్మ్యసిద్ధిః ). నైష్కర్మ్యసిద్ధిలో కర్మపరిత్యాగము లేదని గమనించవలెను. కర్మను సముచితమగు మనఃప్రవృత్తితో అనుష్ఠించువానికి కాలక్రమ ములో ఈ నైష్కర్మ్యము సిద్ధించును. కర్మయోగము సాక్షాత్తుగా నైష్కర్మ్యమును సిద్ధిం పజేయదు. కాని దానివలన నైష్కర్మ్యసిద్ధికి అవశ్యకమగు పరిపక్వత లభించును. ఆత్మ జ్ఞానమునకు అవశ్యకమగు మనఃపరిపక్వత గలవానికి అది లభించి తీరును. అట్టివానిలో జ్ఞానము ఉదయించుటకు ఆటంకములు ఉండవు. కావున, ఆతడు తన స్వరూపములో ఆచార్యుని బోధను యథాతథముగా ఆవిష్కరించుకొనును. శాస్త్రతాత్పర్యమునకు, ఆతని స్వరూపానుభూతికి భేదము ఉండదు. ఇట్టివాడు శాస్త్రోపదేశమును శ్రవణము చేసి నైష్క ర్మ్యసిద్ధిని బడయును.

నైష్కర్మ్యసిద్ధి యనగా నేమి ? ఎవనినుండి కర్మలు అన్నియు నిష్క్రమించినవో, వానియందు ఈ సిద్ధి గలదని శ్రీశంకరులు వివరించిరి. ఈ సిద్ధి గలవానియందు కర్మలు ఏమియు లేకుండుట ఎట్లు ? తన స్వరూపము నిష్క్రియమగు బ్రహ్మయేనను జ్ఞానముచే ఇది సిద్ధించినది. బ్రహ్మాత్మ ఏ విధమైన వికారములకైననూ లోనుగాదు. అది సర్వదా సమముగా నుండును. ఆత్మ సర్వక్రియావినిర్ముక్తమగు బ్రహ్మయేనను జ్ఞానము కలిగిన వ్యక్తి ఆత్మయందు క్రియ లేశమైననూ లేదని గుర్తించును. కావున, ఆతనినుండి కర్మల న్నియు నిష్క్రమించుట సహజమే. ఆత్మ సర్వక్రియావినిర్ముక్తమగు బ్రహ్మయేనను జ్ఞానము ఉదయించగానే, ఆతడు చేసే వైదికకర్మలు, లౌకికకర్మలు, గతములో చేసిన కర్మలు, ఇప్పుడు చేయుచున్న కర్మలు, మరియు భవిష్యత్తులో చేయబోయే కర్మలు అన్నీ ఆతనినుండి నిష్క్రమించును. ఆత్మ ఏ కాలమునందైననూ ఏ క్రియనైననూ చేయుట లేదు. ఈ సత్యమునెరింగిన వ్యక్తి నిష్కర్మా అనబడును. వాని స్వభావమునకు

నైష్కర్మ్యము అని పేరు. దీనివలన వ్యక్తి జీవన్ముక్తుడగును. అందువలననే, ఇది సిద్ధి యనబడినది. నైష్కర్మ్యసిద్ధి యనగా మోక్షమేనని శ్రీశంకరులు వివరించిరి.

ఈ నైష్కర్మ్యసిద్ధి సర్వోత్కృష్టమైనది. ఎందువలన ? జీవుడు పుణ్యకర్మను ఆచరించి ఇహలోకములో పేరుప్రతిష్ఠలు, అధికారము మొదలగు ఫలములను గాని, పరలోకములో స్వర్గసుఖములను గాని పొందగల్గును. ఇవి కూడా సిద్ధులే. కాని వాటివలన జీవుని అన్వేషణ అంతము కాదు. జీవుడు తనకు అదృష్టవశముచే లభించే సుఖానుభవలేశముల కొరకై యాచించే బిచ్చగాని స్థాయిలో శాశ్వతకాలము ఉండిపోవును. కావున, ఇవి చెప్పుకోదగ్గ సిద్ధులు కానే కావు. కాని నైష్కర్మ్యసిద్ధి జీవుని స్వరూపభూతమైన పూర్ణత్వముయొక్క నిధి. దానిని ఎవ్వరైననూ తీసివేయజాలరు. ఇది కర్మల వలన లభించే సిద్ధులు అన్నింటికంటె పూర్తిగా విలక్షణమైనది. ఇది ఇప్పుడు ఇక్కడ జీవన్ముక్తి రూపములో నున్నది. ఈ సిద్ధి బాహ్యవిషయములపై ఆధారపడి లేదు. దీనికి ఆత్మయే నిధానమై యున్నది. జీవన్ముక్తి కొరకై ఆత్మ స్వరూపమును తెలుసుకున్నచో చాలును. నిన్ను గురించి నీవు తెలుసుకున్న మరు క్షణములో నీవు ముక్తుడవు. లేనిచో, నీవు బద్ధుడవు. నీవు ఎంతటి ఘనకార్యములను సాధించిననూ, ఆ పరిస్థితిలో మార్పు ఉండదు. ఆత్మస్వరూపమునెరుంగక సంసారములో బద్ధుడై యున్న పురుషుడు తనకు మెరుగులు దిద్దుకొనుట వలన ప్రయోజనమేమి గలదు ? ఈ పరిస్థితి తాను అందగత్తెను కాదని దృఢముగా నిర్ధయించుకొని యున్న యువతి అలంకారములను చేసుకున్నట్లు ఉన్నది. దానివలన ప్రయోజనము ఏమి ? కాని మానవుడు విముక్తుడై ఉండి ఆ సత్యమును గుర్తించినచో, ఆ మోక్షమును ఏదియూ వానికి దూరము చేయలేదు. జీవునకు ఇతరులు ముక్తిని ప్రసాదించలేరు. మరియు జీవుని ముక్తి ఇతరముపై ఆధారపడి లేదు. ముక్తి కేవలము నీపై ఆధారపడి యున్నది. దానికి నీ దేహముతో గాని, నీ మనస్సుతో గాని, ఇతరములగు వాటితో గాని సంబంధము లేదు. యథార్థమగు విముక్తికి ఆత్మ తక్క మరియొకటి ఆశ్రయము కాజాలదు. ఆత్మ నిత్యముక్తముగా నున్న పక్షములో మాత్రమే మోక్షము సంభవమగును. మోక్షము ఆత్మస్వరూపమై యున్నది. కావున, ఆ సత్యమును మానవుడు గుర్తించిన చాలును. జీవన్ముక్తుని మోక్షమును ఎవ్వరైననూ ఆతనికి దూరము చేయలేరు.

ఆ మోక్షమును పొందే ఉపాయము ఏది ? సన్న్యాసముచే ( సన్న్యాసేన ) దానిని పొందవచ్చునని భగవానుడు చెప్పుచున్నాడు. సర్వకర్మసన్న్యాసము జ్ఞానముచే మాత్రమే సిద్ధించగల్గునని మనము చూచియున్నాము. కావున, సన్న్యాసమనగా సుస్పష్టమగు ఆత్మజ్ఞానమని శ్రీశంకరులు చెప్పిరి. ఇచట సన్న్యాసమనగా సర్వకర్మసన్న్యాసము. జ్ఞానమునకు, దానికి భేదము లేదు. ఆత్మ సర్వదా కర్మవినిర్ముక్తమై యున్నది. ఆ సత్యమును గుర్తించిన వ్యక్తి కర్మలన్నింటినుండి విముక్తుడగును. కావున, నైష్కర్మ్యమనగా కర్మలను వేటినీ చేయకుండగా ఒక మూల మొద్దువలె కూర్చుండుట కాదు. అది కేవలజ్ఞానరూపము మాత్రమే. ఆత్మస్వరూపజ్ఞానమునకే నైష్కర్మ్యసిద్ధి యని పేరు. ఇచటి సన్న్యాసశబ్దార్థమును వివరిస్తూ శ్రీశంకరులు పూర్వములో ఉదహరించిన శ్లోకమును గుర్తు చేయుచున్నారు : జ్ఞానముచే సర్వకర్మలను పరిత్యజించి ------ కర్మలను చేయకుండగా, ఇతరులచే చేయించకుండగా ఉండును ( సర్వకర్మాణి మనసా సన్న్యస్య ------- నైవ

కుర్వన్న కారయన్ ). జ్ఞాని శారీరకముగా కర్మలను విడువడు. ఆత్మ నిష్క్రియము అనే జ్ఞానముచే మాత్రమే కర్మలను విడుచును. అనగా, ఆతడు చేయుచున్ననూ, చేయుట లేదు. మాటలాడుచున్ననూ, నేను మాటలాడుట లేదని ఆతడు చెప్పగలడు. దీనిపై ఎవరైననూ ఒక అభ్యంతరమును లేవదీయవచ్చును : భగవానుడు ఇంతవరకు అనేకశ్లోకములను చెప్పియున్నాడు గదా ! తాను మాటలాడుట లేదని ఆయన చెప్పుట ఎట్లు పొసగును ? ఈ విషయము తెలియుటకై భగవానుని దృష్టిలో ' నేను ' అను పదమునకు గల అర్థము తెలియవలెను.

ఈ విషయమును చక్కగా వివరించే శ్రీకృష్ణుని గురించిన గాథ ఒకటి గలదు. యమునానదీతీరముపై నిలబడియున్న శ్రీకృష్ణుని గోపికలు బహుభార్యాలోలుడని నిష్ఠురములాడుచుండిరి. ఆయన కొంత సేపు వారి మాటలను విని, తరువాత వారిని యమునానదిని దాటి, ఆవలి ఒడ్డున చాల రోజులనుండి ఆహారము లేకుండా ఉన్న ఒక సాధువునకు ఆహారమునిండని చెప్పెను. వారు ఆ స్వామి కొరకై ఆహారమును వండి నదిని దాటబోగా, హఠాత్తుగా వరద వచ్చెను. వారు వెనుకకు వచ్చి, నదిని పడవతోనైననూ దాటుట అసంభవమని శ్రీకృష్ణునితో చెప్పిరి. శ్రీకృష్ణుడు చిరునవ్వు నవ్వి, వారితో నిట్లనెను : ' మీరు మరల యమున వద్దకు వెళ్లి, ఓ యమునా ! శ్రీకృష్ణుడు బ్రహ్మచారి అయినచో, మాకు దారిని ఇమ్ము అని ప్రార్థించుడు.' వారు బిగ్గరగా నవ్వుకుంటూ అయిష్టంగానే యమునా నది వద్దకు వెళ్లిరి. శ్రీకృష్ణుని వచనములు యథార్థము కాదనే దృఢవిశ్వాసము వారికి గలదు. కాని ఆయన వచనములను వారు ఇష్టము లేకున్ననూ యమున వద్ద వల్లించిరి. వెంటనే యమున వెనుకకు తగ్గి పోయెను. నలువైపులా ఇసుక తిన్నెలు కానవచ్చెను. వారు అత్యాశ్చర్యమగ్నులై, నదిని దాటి ఆ స్వామి ఉన్న చోటును కనుగొని ఆయనకు ఆహారమును ఇచ్చిరి. ఆయన వారిచ్చిన ఆహారమునంతనూ నిశ్శేషముగా భక్షించెను. గోపికలు ఖాళీ గిన్నెలతో వెనుకకు మరలిరి. కాని ఇంతలో యమునకు మరల వరద వచ్చెను. ఈ సారి వారికి సహాయపడుటకు సమీపములో శ్రీకృష్ణుడు లేకుండెను. వారు వెనుదిరిగి మరల ఆ స్వామివద్దకు వెళ్లిరి. ఆయన వారి సమస్యను గూర్చి విని చిరునవ్వు నవ్వి, వారితో నిట్లనెను : ' మీరు మరలి యమున వద్దకు వెళ్లి, ఓ యమునా ! ఆ స్వామి తన జీవితములో ఒక్కనాడైననూ భోజనమును చేయని వాడైతే, మాకు దారిని ఇమ్ము అని ప్రార్థించుడు.' వారు మరల ముసి ముసి నవ్వులతో, అట్లు చేయుటకు ఇష్టము లేకున్ననూ యమున వద్దకు వెళ్లి అట్లు పలుకగానే యమున దారిని ఇచ్చెను.

ఈ కథను బట్టి మనకు ఏమి తెలిసినది ? శ్రీకృష్ణునకు తెలిసిన సత్యము ఆ స్వామికి కూడ తెలియును. తాను ఎన్నడైననూ క్రియలను చేయలేదని శ్రీకృష్ణునకు తెలియును. తాను వివాహితుడు గాని, బ్రహ్మచారి గాని, పురుషుడు గాని, స్త్రీ గాని, వృద్ధుడు గాని, యువకుడు గాని కాదు ; తాను నిష్క్రియమగు పరంబ్రహ్మ. ఈ సత్యము ఆ స్వామికి కూడ తెలియును. చేయుచున్ననూ, చేయుట లేదు ( కుర్వన్నపి న కరోతి ); చేయుట లేదు, చేయించుట లేదు ( నైవ కుర్వన్న కారయన్ ) అనే తత్త్వమును ఈ కథ ప్రదర్శించుచున్నది. ఆత్మ ఈ స్థూలదేహములో ఉపలబ్ధమగుచూ, దేహముచే ఆవృతమైనదా యన్నట్లు భాసించుచున్నది. దేహము కదులుచున్ననూ, మనస్సు ఆలోచించుచు

న్ననూ, సర్వము క్రియాశీలముగా నున్ననూ, ఆత్మ క్రియలను వేటినీ చేయుట లేదు. ఈ క్రియాకలాపమంతయు ఆత్మయొక్క సన్నిధిలో మాత్రమే జరుగుచున్ననూ, ఆత్మ స్వయముగా క్రియలను వేటినీ చేయుట లేదు. అదియే యథార్థమగు ' నేను ' . దీనికంటె భిన్నముగా మరియొక ' నేను ' లేదు. ఈ సత్యమును గుర్తించిన వ్యక్తి సర్వోత్కృష్టమగు నైష్కర్మ్యసిద్ధిని పొందును ( నైష్కర్మ్యసిద్ధిం పరమాం అధిగచ్ఛతి ).

ఇది ఫలము. జ్ఞాననిష్ఠారూపమైన ఈ నైష్కర్మ్యసిద్ధిని పొందే ఉపాయమును తరువాతి శ్లోకము సంగ్రహముగా ప్రస్తావించుచున్నది. పూర్వములో చెప్పిన సంగతిని గుర్తు చేసి శ్రీశంకరులు ఈ శ్లోకభాష్యమును ఉపక్రమించిరి. మానవుడు విశిష్ట దేశకాలములలో తన కర్తవ్యకర్మను అనుష్ఠించుట ద్వారా అంతఃకరణ పరిపక్వత అనే యోగ్యతను సంపాదించునని ( స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః ) పూర్వములో చెప్పబడి యున్నది. ఒకని విధి ఆవులను మేపుటయే కావచ్చును. అతడు ఆ పనిని ఈశ్వరార్పణబుద్ధితో చేసినచో, అదే అవగాహనతో చేసిన ఏ ఇతరకర్మతోనైననూ సమముగా అది ఫలమును ఇచ్చును. భగవానుని పుష్పములతో పూజించుట ప్రసిద్ధమైన విషయము. కాని కర్తవ్యకర్మానుష్ఠానము కూడ భగవదారాధనయే. ధర్మము ఈశ్వరస్వరూపము. కావున, ప్రకృతినియతి రూపములో నున్న ఈ ధర్మమును ఈశ్వరస్వరూపముగా గుర్తించి మానవుడు దానికి కట్టుబడి జీవించినచో, అతడు ఈశ్వరునితో సమరసత గలవాడగును. అతని కర్మ ఈశ్వరారాధన యగును. దీని వలస లభించే ఫలమేమి ? ఈ కర్మయోగము వలన అంతఃకరణశుద్ధి లభించును; ఇచట చెప్పబడిన జ్ఞానము ఉదయించుటకు ఆవశ్యకమగు సంసిద్ధత కలుగును. ఆత్మ ఏది ? అనాత్మ ఏది ? కర్త ఎవరు ? అకర్త ఎవరు ? అను విషయములపై అవగాహన గల వ్యక్తి అద్వయ-ఆత్మ-జ్ఞాన-నిష్ఠను పొందును. అది లభించే క్రమము తరువాతి శ్లోకములో చెప్పబడుచున్నది.

**అధ్యాయము 18 , శ్లోకము 50 :**

सिद्धिं प्राप्तो यथा ब्रह्म तथाप्नोति निबोध मे ।
समासेनैव कौन्तेय निष्ठा ज्ञानस्य या परा ।। ५० ।।

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే
సమాసేనైవ కౌన్తేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా ( 50 ).

**కౌంతేయ** = కుంతీపుత్రా, ఓ అర్జునా ! , సిద్ధిమ్ = అంతఃకరణశుద్ధిని, ప్రాప్తః = పొందినవాడు, యథా = ఏ విధముగా, బ్రహ్మ= బ్రహ్మను, ఆప్నోతి = పొందునో, తథా = ఆ విధమును, సమాసేన ఏవ = సంగ్రహముగా మాత్రమే, మే = నా వచనములనుండి , నిబోధ = తెలుసుకొనుము, యా = ఏదైతే, జ్ఞానస్య = జ్ఞానముయొక్క, పరా = సర్వోత్కృష్టమైన, నిష్ఠా = నిష్ఠయో.

ఓ కుంతీపుత్రా, అర్జునా ! అంతఃకరణశుద్ధిని పొందిన వ్యక్తి బ్రహ్మను పొందు విధమును సంగ్రహముగా మాత్రమే చెప్పెదను. వినుము. సర్వోత్కృష్టమగు జ్ఞాననిష్ఠయే బ్రహ్మప్రాప్తి యగును ( 50 ).

ఇచట సిద్ధి యనగా అంతఃకరణశుద్ధియే. సిద్ధి యనగా దేహేంద్రియమనస్సం ఘాతమునకు జ్ఞాననిష్ఠాయోగ్యత కలుగుట అని శ్రీశంకరులు వివరించిరి. సాధకుడు స్వక ర్మానుష్ఠానము ద్వారా ఈశ్వరుని అర్చించి ఈశ్వరానుగ్రహమును పొందును. అట్టి ఈశ్వ రానుగ్రహముచే ఈ సిద్ధి లభించును. స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః అను శ్లోకమువద్ద చెప్పిన విషయమును మరల చెప్పుటలో కారణము గలదు. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ అను శ్లోకము రాబోవుచున్నది. దానిని అర్థము చేసుకొనుటకు ఈ సిద్ధిని తెలియుట ఆవశ్యకము. జిజ్ఞాసువు ఈశ్వరానుగ్రహ ముచే ఆందోళనలనుండి నిర్ముక్తమైన మనస్సును, ఆరోగ్యవంతమైన దేహేంద్రియము లను పొందును. మానవుడు పొందగలిగే సర్వోత్కృష్టమగు ఈశ్వరానుగ్రహము ఇదియే. ఈ అనుగ్రహము వలన మానవుడు తనను తాను నిందించుకొనుటకు బదులుగా, తన స్వరూపముయొక్క వైశిష్ట్యమును తెలియగల్గును. మనము లౌకికములగు పదార్థములకొ రకై ఈశ్వరానుగ్రహమును అపేక్షించెదము. కాని అవసరమైనప్పుడు అక్కరకు వచ్చే దేహేంద్రియమనస్సులను కలిగియుండుటయే యథార్థమైన ఈశ్వరానుగ్రహము. అంతఃక రణశుద్ధితో బాటు దేహారోగ్యము కూడ ఈ అనుగ్రహములో భాగమే యగును. దేహము శిథిలావస్థలో నుండగా మనస్సుపై ఈశ్వరుని అనుగ్రహము ఉండి ఏమి లాభము ? సాధకునకు మిక్కిలి దృఢమగు దేహము ఆవశ్యకము కాదు. కాని సాధనకు అడ్డు రాని విధ ముగా సహకరించే దేహము ఆవశ్యకమే గదా ! దేహము ఆరోగ్యవంతముగను, మనస్సు పరిశుద్ధముగను ఉండవలెను. ఈ రెండింటికీ ఈశ్వరానుగ్రహము ఆవశ్యకమే.

ఈ సిద్ధిని పొందిన వ్యక్తి ( సిద్ధిం ప్రాప్తః ) కి తరువాత ఇంకనూ ఏమి సిద్ధి లభించును ? అతడు జ్ఞాననిష్ఠారూపమగు బ్రహ్మను పొందును ( బ్రహ్మ ఆప్నోతి ). అతడు దానిని ఏ విధముగా పొందును ? ఈ కర్మయోగి అంతఃకరణశుద్ధిని పొందియున్న నూ, ఇంకనూ తాను కర్తననే ధారణను కలిగియున్నాడు. ఈతనికి బ్రహ్మజ్ఞానము లభించు విధమెట్టిది ? నా వచనములను విని తెలుసుకొనుము అని భగవానుడు చెప్పుచున్నాడు. ఆయన మరల ఇంకో పదిహేడు అధ్యాయముల గ్రంథమును బోధించునా యేమి ? లేదు. ఆయన ఈ విషయమును సంగ్రహముగా ( సమాసేన ) చెప్పబోవుచున్నాడు. ఆయన ఇంతవరకు చేసిన ఉపదేశమును సారరూపముగా చెప్పబోవుచున్నాడు. అర్జునుడు దానిని మరల మనస్సులో స్మరించి తన కర్తవ్యమును అనుష్ఠించగల్గును.

ఆ బ్రహ్మప్రాప్తి యనగా నేమి ? బ్రహ్మప్రాప్తి యనగా బ్రహ్మజ్ఞానమే. జ్ఞానము యొక్క చరమలక్ష్యము అదియే ( జ్ఞానస్య యా పరా నిష్ఠా ). ఒక సాధన తన లక్ష్య మును చేరుటకు నిష్ఠ యని పేరు. సాధారణముగా జ్ఞానార్జనకు అంతము లేదు. కొంత తెలిసినప్పుడు అంతకు ముందు కంటె అధికముగా తెలిసిననూ, తెలియనది ఎంతో ఉన్న దని కూడ తెలియుచుండును. ఇంతకు ముందు తెలియనది చాల గలదనే విషయము తెలియదు. కాని ఇప్పుడు తెలియనిది చాల గలదని తెలిసినది. కావున, ఆత్మజ్ఞానమును మినహాయించి, ఇతరరకముల జ్ఞానమునకు అంతము లేదు. ఆత్మ నిరవయవము. కావు న, ఆత్మను గురించి కొంత తెలియుట అను ప్రసక్తి లేదు. ఆత్మ నిత్యప్రసిద్ధము గనుక, దాని విషయములో పొరపడే అవకాశము గలదు. కాని, ఆత్మ నిరవయవము గనుక, దాని

స్వరూపము విషయములో అంశజ్ఞానమునకు తావు లేదు. కావున, ఆత్మజ్ఞానము విషయములో మాత్రమే నిష్ఠ అనే పదము సార్థకమగును.

మిగిలిన జ్ఞానములన్నియు పరిపూర్ణములు కావు. జ్ఞానములో విషయమయ్యే పదార్థములన్నియు సగుణములు గనుక, ఆ జ్ఞానములలో కూడ అంశములు గలవు. జ్ఞానములో విషయమయ్యే సర్వపదార్థములు తమ ఉనికి కొరకై అన్యముపై ఆధారపడుటచే మిథ్య యగుచున్నవి. కావున, జ్ఞానములో విషయమయ్యే పదార్థములన్నియు గుణములు తక్క మరియొకటి గాదు. ఈ జగత్తులో యథార్థమగు వస్తువు అనేది ఏదీ లేదు. ఏలయన, మనము దేనిని వస్తువు అని భావిస్తామో, అది విచారించిన పిదప మరియొక వస్తువునందు గుణమై విలీనమగును. మట్టితో చేసిన కుండ విషయములో కుండ మట్టి అనే వస్తువునకు గుణము మాత్రమే యగును. మట్టి యైననూ వస్తువు కాదు. అది పరమాణువునకు గుణము అగును. సర్వరూపములు ఇదే విధముగా విలీనమగును. కావున, రూపము లేనిది మాత్రమే యథార్థమగు వస్తువు కాగల్గును. ఆ వస్తువు నీవే. కావున, ఆత్మజ్ఞానము మాత్రమే పరిపూర్ణమైన జ్ఞానము. మరియొక పరిపూర్ణజ్ఞానము సంభవము కాదు. కావున, అది మాత్రమే సర్వోత్కృష్టమైనది ( పరమమ్ ). ఆ జ్ఞానము లభించే క్రమమును భగవానుడు ఇచట చెప్పబోవుచున్నాడు. కావుననే, ' నా వచనములను విని తెలుసుకొనుము ( నిబోధ మే ) ' అని పలికి ఆయన అర్జునుని సావధానపరచు చున్నాడు.

ఈ శ్లోకమునకు శ్రీశంకరులు వ్రాసిన భాష్యము చాల ప్రముఖమైనది. కావున, మనము ముందుగా దానిని పఠించెదము.

జ్ఞాననిష్ఠ యనగా బ్రహ్మజ్ఞానముయొక్క పర్యవసానము, లేక అంతిమ-అవధి అని శ్రీశంకరులు వివరించిరి. ఇచట ఒక ప్రశ్న ఉదయించును. ఈ జ్ఞాననిష్ఠయొక్క స్వరూపమేమి ? ఆత్మజ్ఞానముయొక్క స్వరూపమెట్టిదియో, నిష్ఠయొక్క స్వరూపము కూడ అదియే అగునని శ్రీశంకరులు సమాధానమునిచ్చిరి. ఈ జ్ఞాననిష్ఠ ఆత్మజ్ఞానముకంటె వేరుగా లేదు. ఈ ఆత్మజ్ఞానముయొక్క స్వరూపము ఎట్టిది ? అనునది తరువాతి ప్రశ్న. ఆత్మయొక్క స్వరూపము ఎట్టిదియో, ఆత్మజ్ఞానముయొక్క స్వరూపము కూడ అట్టిదియే నని శ్రీశంకరులు సమాధానమునిచ్చిరి. ఆత్మకు, ఆత్మజ్ఞానమునకు మధ్యలో భేదము ఉండదు. ఒక వస్తువునకు, దాని జ్ఞానమునకు స్వరూపములో భేదము ఉండదు గదా ! అట్లైనచో, ఈ ఆత్మయొక్క స్వరూపము ఎట్టిది ? భగవానుడు గీతావచనములలో ఏ రూపములో ఆత్మను వర్ణించినాడో, ఉపనిషత్తులు ఏ రూపములో వర్ణించుచున్నవో, ఏది యుక్తిచే కూడ నిర్ధారితమగుచున్నదో, అదియే ఆత్మయొక్క స్వరూపమగునని శ్రీశంకరులు ప్రత్యుత్తరమునిచ్చిరి. ఆత్మయొక్క స్వరూపము సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ అని శ్రీశంకరులు సమాధానము నీయవచ్చును. కాని వారు అట్లు చెప్పుట లేదు. ఏలయనగా, ఇచటి చర్చనీయాంశము జ్ఞానముయొక్క స్వరూపము. శ్రీశంకరులు ఇచట యుక్తిని కూడ ప్రస్తావించినారు. మనము ఈ విషయమును గమనించవలెను. వస్తునిరూపణము యుక్తియుక్తముగా నుండవలెను. శాస్త్రముయొక్క ఉపదేశమును పరిశీలించి, అది యుక్తి సంగతముగా నున్నదని వారు నిర్ధారించు చున్నారు. శాస్త్రవిరుద్ధములగు ఆత్మనిరూపణములు ఏవైన ఉన్నచో, వారు వాటిని యుక్తిపూర్వకముగా త్రోసిపుచ్చెదరు.

ఇచట ఒక అభ్యంతరము గలదు. జ్ఞానము సర్వదా జ్ఞేయవస్తువునకు అనురూపముగా నుండునని చెప్పబడినది. ఉదాహరణకు, ఘటజ్ఞానము ఘటమునకు అనురూపముగా నుండును. అనగా, మనకు ఘటమును గురించి తెలిసిన సందర్భములో జ్ఞానము ఘటస్వరూపమునకు అనుగుణముగా నుండును. దానికి భిన్నముగా నుండజాలదు. భిన్నముగా నున్నచో, ఘటమును చూచినప్పుడు ఘటజ్ఞానము కలుగదు. కావున, జ్ఞానము జ్ఞేయాకారమును దాల్చియుండునని సర్వజనవిదితము. కాని, ఆత్మ ఒక పదార్థమని గాని, దానికి రూపము కలదని గాని మనము ఎన్నటికీ అంగీకరించము. ఆత్మ దృశ్యమగు పదార్థము కాదు. ఆత్మయే పదార్థమైనచో, దానిని దర్శించే ద్రష్ట ఎవరు ? ఆత్మ నీ స్వరూపము. కావున, నీ జ్ఞానములో ఆత్మ ఎన్నటికీ విషయము కాజాలదు. దృశ్యము కాకుండుట ఆత్మయొక్క సహజస్వభావమై యున్నది. కాని జ్ఞానము సర్వదా జ్ఞేయపదార్థమునకు అనురూపముగా నుండునని చెప్పియున్నాము. ఇట్టి స్థితిలో ఆత్మయొక్క జ్ఞానమును పొందుట ఎట్లు సంభవమగును ? ఇంతేగాక, జ్ఞేయవస్తువునకు ఒక విశిష్టరూపము లేనిదే, దాని జ్ఞానము ఎట్లు కలుగును ? కాని శుద్ధచైతన్యస్వరూపమగు ఆత్మకు రూపము లేదని మీరు చెప్పుచున్నారు. ఆత్మ పదార్థము కాదు. దానికి రూపము లేదు. దానిని తెలియుట ఎట్లు ? కుండ ఒక పదార్థము. దానికి రూపము గలదు. కావున, దానిని తెలియుట సంభవమగుచున్నది. పరమాణువు ఇంద్రియగోచరము కాకపోయిననూ, దానికి కొన్ని విశిష్టగుణములు ఉండుటచే, దానిని గురించి మనము అనుమానప్రమాణముచే తెలియవచ్చును. జ్ఞాతయగు నీ జ్ఞానములో అణువు విశిష్టధర్మములు గల జ్ఞేయవస్తువు అగుచున్నది. అణువును నీవు తెలుసుకొను చున్నావు గనుక, అది నీకంటె భిన్నముగా నున్నది. కావున, నీవు అణువు కాజాలవు. కాని ఆత్మ విషయములో పరిస్థితి యేమి ? అది ఒక పదార్థము కాదు. దానికి ఒక విశిష్టరూపము లేదు. అట్టి ఆత్మయొక్క జ్ఞానమును పొందుట ఎట్లు సంభవమగును ? జ్ఞానమును పొందుటయే అసంభవమైనచో, ఆ జ్ఞానములో నిష్ఠను పొందు ప్రసక్తి ఎక్కడిది ?

ఈ ప్రకరణములో ఒక ఉపాసకుడు సమాధానము నిచ్చుచున్నాడు. ఆత్మకు రూపము గలదని శాస్త్రము చెప్పుచున్నది.ఏ రూపము ? ఆత్మ సూర్యుని రూపము వంటి రూపము గలది ( ఆదిత్యవర్ణమ్ ). అది ప్రకాశరూపములో నున్నది ( భారూపః ). అది తనంత తానుగా ప్రకాశించుచున్నది ( స్వయంజ్యోతిః ). సృష్టిక్రమములో మొట్టమొదటి రూపము గల భూతము అగ్ని. ఆకాశము మొదటి భూతము. రెండవ భూతము వాయువు. ఈ రెండింటికీ రూపము లేదు. తరువాత పుట్టిన అగ్నికి రూపము గలదు. అగ్ని తేజస్స్వభావము కలది అగుటయే దానికి కారణము. అదే విధముగా స్వయంప్రకాశతేజస్స్వభావమగు ఆత్మకు కూడ రూపము ఉండవలెను. అగ్నియొక్క విశిష్టగుణమగు తేజస్సు ఆత్మయందు గలదని శాస్త్రము చెప్పుచున్నది. కావున, ఆత్మకు రూపము గలదని స్వీకరించుటకు అభ్యంతరమేమి ?

చర్చలో పాల్గొనుచున్న మరియొక వాది ఇది సరిగాదని ప్రత్యుత్తరమునిచ్చుచున్నాడు. చైతన్యవిరోధియగు జడత్వము ఆత్మయందు లేదని త్రోసిపుచ్చుటయందు మాత్రమే ఇట్టి వాక్యములకు తాత్పర్యము గలదు. ఆత్మ జడము కాదు. అజ్ఞానము అనే

చీకటికి ఆత్మ అతీతమైనది ( తమసః పరస్తాత్ ). ఆత్మ సూర్యుని వలె ప్రకాశించుచున్నది
( ఆదిత్యవర్ణమ్ ) అని వర్ణించిన తరువాత శ్రుతి ప్రత్యేకముగా ఇట్లు వర్ణించినది. ఆత్మ
అజ్ఞానము కాదనియు, జడము కాదనియు, ఆత్మను ఇతరజ్యోతిస్సులతో ప్రకాశింప జేయ
వలసిన ఆవశ్యకత లేదనియు శ్రుతియొక్క తాత్పర్యము. ఈ వాది ఇంకనూ ఇట్లు వివరిం
చుచున్నాడు : ఆత్మ ఒక పదార్థము కాదు. అది నిర్గుణము. ఈ విషయమును చెప్పగానే,
ఆత్మ అజ్ఞానము, లేదా చీకటి అనే నిర్ణయమునకు ఎవరైననూ రావచ్చును. అట్టి నిర్ణయ
మును నిరాకరించుటకై ఇతరవిశేషణములు చెప్పబడినవి. ఇంతేగాక, ఆత్మకు రూపము
లేదని శ్రుతి అరూపమ్ ఇత్యాది సుస్పష్టమగు వాక్యముల ద్వారా బోధించుచున్నది.
మరియు దృశ్యపదార్థములకు మాత్రమే రూపము ఉండును. ఆత్మ దృశ్యపదార్థము
కాదనియు శ్రుతి అసందిగ్ధముగా ప్రతిపాదించుచున్నది. ఆత్మకు రూపము లేదు. కావున,
ఆత్మను కంటితో చూచుట సంభవము కాదు ( న సందృశే తిష్ఠతి రూపమస్య న చక్షుషా
పశ్యతి కశ్చ నైనమ్ ) ; ఆత్మయందు శబ్దము, మరియు స్పర్శ లేవు ( అశబ్ద
మస్పర్శమ్ ) ఇత్యాది శ్రుతివాక్యములను బట్టి, కన్ను, చెవి, స్పర్శేంద్రియము మొదలగు
జ్ఞానేంద్రియములకు ఆత్మ గోచరమగుట లేదనియు, ఆత్మ ఇంద్రియజ్ఞానములో విష
యము కాదనియు మనకు సుస్పష్టమగుచున్నది. కావున, ఆత్మజ్ఞానము ఆత్మరూపములో
నుండుునను వాదము పొసగదు. సర్వమానసికప్రత్యయములు ఆయా వస్తువుల ఆకారము
లకు అనురూపముగానుండుట మనకు అనుభవసిద్ధము. ఆత్మ నిరాకారమని పదే పదే
చెప్పబడుచున్నది. ఇట్టి స్థితిలో ఆత్మయొక్క జ్ఞానము ఎట్లు సంభవమగును ? జ్ఞానము
వస్తువునకు అనురూపముగా నుండును. ఘటజ్ఞానము ఘటాకారములో నుండును. పటజ్ఞా
నము పటాకారములో నుండును. ఈ తీరున సర్వజ్ఞానములు ఆయా పదార్థముల రూప
ములో నుండును. కాని మనమిచట నిరాకారమగు ఆత్మను గురించి మాటలాడుచున్నాము.
కావున, ఆత్మయొక్క జ్ఞానము సంభవము కాదు.

ఆత్మకు రూపము లేదు. కావున, ఆత్మజ్ఞానమునకు కూడ రూపము లేదు. ఇట్టి
స్థితిలో ఆత్మజ్ఞానమును నిరూపించుట యెట్లు ? ఆత్మజ్ఞానమే పొసగనప్పుడు ఆ జ్ఞాన
ములో నిష్ఠ యనగా నేమి ? నిష్ఠ యనగా ఒక జ్ఞానముపై మనస్సు నిశ్చలముగా నిలబ
డునట్లు చేయుట. కాని మనస్సును దేనిపై నిలుపవలెను ? కుందేటి కొమ్ముయొక్క రస
మును సేవించినచో కేన్సరు వ్యాధి తగ్గునని చెప్పినచో, ఏమి చేయదగును ? అదే విధ
ముగా, ఆత్మజ్ఞానమును పొందినచో, సంసారము మటుమాయమగును. దీనిలో ఒకే ఒక
సమస్య గలదు. అది సంభవము కాదు. ఆత్మ తెలియగలిగే పదార్థము కాదు. దానికి
ఇంద్రియగోచరమగు రూపము లేదు. ఇట్టి స్థితిలో ఆత్మజ్ఞానమును ఎట్లు సంపాదించవ
లెను ? జ్ఞానమును పొందినవాడు మోక్షమును పొందును. కాని ఆత్మ జ్ఞానములో విష
యము అగుట లేదు. కావున, జ్ఞానముచే మోక్షము కల్ల. కావున, మనము సంసారము
అనే సమస్యకు మరియొక పరిష్కారమును చూడవలెను. ఈ స్థితిలో నిదిధ్యాసనమును
గురించి మాటలాడుట వ్యర్థము. ఏలయనగా, ఆత్మకు ఒక రూపము ఉన్నచో, మనస్సును
దానిపై నిశ్చలముగా నిలబెట్టుట సంభవమగును. కాని ఆత్మకు రూపము లేదు. రూపము
లేనిదే బుద్ధివృత్తి లేదు. బుద్ధివృత్తి లేని స్థితిలో నిష్ఠను పొందుట కొరకై మనస్సును దేనిపై

నిలుపవలెను ? ఆత్మను గురించి భావన చేయుము అని నేను చెప్పినచో, నీవు ఏ విధముగా భావన చేసెదవు ? ఆత్మ కూడ జ్యోతి వంటిది, లేదా శబ్దము వంటిది అయినచో, దానికి ఒక విశిష్ఠరూపము ఉన్నచో, దానిని భావన చేయుట సంభవమగును. దానికి రూపము లేని స్థితిలో దేనిని భావన చేయవలెను ?

దీనికి శ్రీశంకరులు ప్రత్యుత్తరమును ఇచ్చుచున్నారు : పైన వర్ణించబడిన నిర్ధయము సరిగాదు. ఆత్మ ఇంద్రియగోచరము కాదను మాట యథార్థమే. కాని ఆత్మయొక్క సన్నిధి ఉపలభ్యమగుచున్నది. ఆత్మ స్వయంప్రకాశము గనుక, మనకు అది తెలియుచునే యుండును. అది బుద్ధియందు గలదు. బుద్ధికి చైతన్యమును ప్రతిబింబించే సామర్థ్యము గలదు. చైతన్యమే ఆత్మ. ప్రతివాదియొక్క వాదనకు ఆధారమేమనగా, ఆత్మకు రూపము లేదు గనుక, ఇంద్రియములకు గాని, మనస్సునకు గాని విషయము కాదు. ఇది వాస్తవమే. ఆత్మకు రూపము లేదు. కాని, ఆత్మ ఉన్నది. ఆత్మ ఒక పదార్థము కాదు. దానికి గుణములు లేవు. కాని ఆత్మ ఉన్నది. ఈ సంగతి మనకు ఎట్లు తెలియును ? అద్దములో ముఖము ప్రతిబింబించు విధముగా, చైతన్యస్వరూపమగు ఆత్మ బుద్ధిలో ప్రతిబింబించును. ఏలయన, బుద్ధి చైతన్యమును ప్రతిబింబించే సామర్థ్యము గల సూక్ష్మభూతముల కలయిక. బుద్ధిలో చైతన్యముయొక్క ప్రతిబింబము, లేక అభివ్యక్తి చైతన్యస్వరూపమగు ఆత్మ కంటె వేరు గాదు. అనగా బింబప్రతిబింబములు ఒక్కటియే. ప్రతిబింబము ఏదైనా వస్తువుకంటె పూర్తిగా వేరు కాజాలదు. ఏలయన, ప్రతిబింబము యథార్థమగు వస్తువు కాదు. నీవు అద్దము ముందు నిలబడినప్పుడు, నీకంటె భిన్నముగా కనబడే ప్రతిబింబము నీవే. అదే విధముగా బుద్ధి కూడ మిక్కిలి సూక్ష్మమగు పదార్థములచే నిర్మితమైనది గనుక, ఈ చైతన్యమును ప్రతిబింబించ గలదు. అనగా చైతన్యము అభివ్యక్తము అగునట్లు చేయగలదు. కావున, చైతన్యము బుద్ధియందు ప్రతిఫలించి అభివ్యక్తమగుచున్నది.

బుద్ధియందలి ' నేను ( అహమ్ ) ' అనే వృత్తి ఆత్మచైతన్యము ప్రతిఫలించుటచే చేతనమగుచున్నది. అదే విధముగా, మనస్సులోని ' ఇది ( ఇదమ్ ) ' అనే వృత్తి చేతనమగుచున్నది. మరియు, మనస్సు జ్ఞానేంద్రియములతో సంలగ్నమై యున్నది గనుక, అవి కూడ చేతనములగుచున్నవి. స్పర్శ అనే ఒక జ్ఞానేంద్రియము దేహమంతటా వ్యాపించి యుండుటచే ఇంద్రియములు చేతనములు కాగానే, దేహము కూడ చేతనమగుచున్నది. నిప్పులో పెట్టి ఎర్రగా కాల్చిన ఇనుపగుండులో అంతటా ప్రకాశము మరియు వేడి వ్యాపించియుండును. అదే విధముగా, స్పర్శజ్ఞానముద్వారా ఆత్మచైతన్యము దేహమంతటా వెలిగిపోవుచున్నది. ఆత్మ ఉన్నదనియు, అది చేతనమనియు తెలియుటకు మరియొక ప్రమాణముతో పని లేదు. అది నిత్యసిద్ధము. కాని ఒకే ఒక సమస్య గలదు. ఆత్మయొక్క స్వరూపమగు చైతన్యము దేహమంతటా వ్యాపించి యుండుటచే, జనులు దేహమే ఆత్మయని భ్రమపడుచున్నారు. చైతన్యము దేహమును వ్యాపించి యున్నది గనుక, దేహమును స్పృశించినప్పుడు వాస్తవముగా స్పృశించబడేది ఆత్మయే. దేహము జడమే అయినా, స్పృశించే చేతియందు మరియు స్పృశించబడే చేతియందు ఆత్మ ఉండుటచే, అనగా నీవు ఉండుటచే, చైతన్యము గలదు. చైతన్యము, చైతన్యప్రతిబింబము ( ఆభాస ) అను వాటికి భేదము లేదు. కాని, ఆభాస చైతన్యమే అయినా, చైతన్యము

ఆభాస కాదు. కావున, స్థూలదేహములోని ఆభాస చైతన్యమే. అదియే ఆత్మ. ఇందువలన నే, శాస్త్రమును అధ్యయనము చేయకపోవుటచే ఆత్మానాత్మవివేకము నెరుంగని సాధారణ జనులు స్థూలదేహమే ఆత్మ యని భావించెదరు. విచారమును చేయని వ్యక్తి దేహమును ఆత్మ యని భ్రమపడును. దేహము చేతనమగుటచే, అది యుక్తియుక్తముగనే యున్నది. ఈ దేహమే నేను ; ఇతరము సర్వము నాకంటె భిన్నమైనది అను నిర్ణయము సహజసిద్ధ ము. ఆత్మ తెలియబడుట లేదని ఎట్లు చెప్పగలము ?

వాస్తవములో మనము దేహమును ఆత్మ యని స్వీకరించుట లేదు. దేహమునందు చైతన్యము ఉపలభ్యమగుచుండుట చేతనే మనము 'ఇది నేను' అని దేహమును వ్యవహ రించుచున్నాము. మనము చేతనపురుషునితో మాత్రమే అభేదభావనను చేయుచున్నాము. కావున, చేతనస్వరూపమగు ఆత్మ నిత్యసిద్ధమై యున్నది. దేహమునందు ఆత్మభావన చేయుటలోని సమస్య ఏదనగా, అట్టి భావన వలన జీవుడు దేహముతో బాటు జన్మజరామ రణములకు వశుడగుచున్నాడు. వివేకము లేకపోవుట చేతనే మానవుడు ఇట్టి నిష్కర్షను చేయుచున్నాడు. కావున, ఆత్మ మనకు సర్వదా తెలియుచునే యున్నది. కాని తప్పుగా తెలియుచున్నది. కావున, మనము ఆత్మ కాని దానిని సర్వమును త్రోసిపుచ్చ వలెను ( *నేతి నేతి* ). అప్పుడు అంతరతమమగు ఆత్మ ( *ప్రత్యక్ ఆత్మా* ) మిగిలియుండును. అదియే బ్రహ్మ యని శాస్త్రము చెప్పుచున్నది ( *అయం ఆత్మా బ్రహ్మ* ). అదియే ఉప దేశము. ఉపదేశము వలన ఆత్మ బ్రహ్మయేనను వృత్తి ఉదయించును. ఆ వృత్తి అజ్ఞాన మును తొలగించి తాను కూడ తొలగిపోవును. ఆత్మ-అజ్ఞానమును ఈ వృత్తి తొలగించిన తరువాత, ఆత్మను తెలియుటకై మరియొక వృత్తితో పని లేదు. ఏలయన, ఆత్మ సర్వవృ త్తులలో ఉపలభ్యమగుచునే యున్నది. వృత్తి- జ్ఞానమ్ అనే పదములోని వృత్తి కేవలనామ రూపములు మాత్రమే. వృత్తిలో ప్రతిఫలించిన చైతన్యమునకే జ్ఞానము అని పేరు. వృత్తి తనంత తానుగా జ్ఞానము కాదని ఈ సందర్భములో గమనించుట ప్రముఖమైన విషయ ము. ఘట-జ్ఞానములోని జ్ఞానము కూడ చైతన్యమే. సర్వత్రా జ్ఞానాంశము చైతన్యమే యగును. దానిని నామరూపములు విశిష్టజ్ఞానముగా మార్చును. కావున, సర్వవృత్తుల యందు చైతన్యము ఉన్నది. జ్ఞాత తెలియబడుచున్నాడు ; జ్ఞానజ్ఞేయములు కూడ తెలి యబడుచున్నవి ; ఈ జ్ఞానములన్నింటిలో ఒకే ఒక చైతన్యము గలదు. కావున, ఏ కాల మునందైననూ ఆత్మ కనుమరుగు అయ్యే ప్రసక్తి లేదు.

నాస్తికవాదులు దేహమే ఆత్మ యని ( *దేహ ఏవ ఆత్మా* ) భావించెదరు. చైతన్య ముచే సంపన్నమైన, లేదా విశిష్టమైన స్థూలదేహమే ఆత్మ యని లోకాయతికులు వాదించెదరు. వారి సిద్ధాంతములో దేహము నశించినప్పుడు చైతన్యము కూడ నశించు టచే ఆత్మ మిగిలి యుండదు. చార్వాకులు ఆత్మను గురించి విచారమును చేసి చైతన్య సంపన్నములగు ఇంద్రియములే ఆత్మ యని నిర్ధారించిరి. కేవల స్థూలదేహము ఆత్మ కాజాలదు. ఇంద్రియవ్యాపారములు లేనిదే దేహము పని చేయజాలదు. నిద్రలో దేహము పని చేయుట లేదు గదా ! కావున, ఇంద్రియములు మాత్రమే వాస్తవమగు ఆత్మ యగు నని వీరి వాదము. మనస్సు ఆత్మ యని చార్వాకులలో మరియొక వర్గము వారి అభిప్రా యము. ఇంద్రియములలో మరియు స్థూలదేహములో మనస్సు ప్రతిఫలించుట చేతనే

అవి చేతనములగుచున్నవి. బుద్ధిలో వెలిగి మరుక్షణములో నశిస్తూ ఉండే చేతనవృత్తుల నిరంతరప్రవాహమే ఆత్మ యని క్షణివిజ్ఞానవాదులు చెప్పెదరు. ఆత్మ బుద్ధికంటె ఆంతర మనియు, ఆత్మ కారణమనియు, బుద్ధి కార్యము మాత్రమే ననియు మరికొందరు వాదించె దరు. గాఢనిద్రలో ఆత్మ కలదు ; కాని బుద్ధి లేదు. కావున, బుద్ధికంటె వ్యతిరిక్తముగా ఆత్మకు ఉనికి గలదు. వీరు అన్వయవ్యతిరేకన్యాయము ( Method of invariable concomitance and discontinuance ) ననుసరించి, ఏదైతే నిద్రలో ఉపలభ్యమగుచున్నదో, అదియే ఆత్మ యని నిర్ధారించెదరు. వీరి దృష్టిలో అవ్యక్త-అవ్యాకృత-అజ్ఞాన-అవస్థ ( unmanifest and undifferentiated state of ignorance ) యే ఆత్మ. ఆత్మ అవిద్యావిలక్షణ మైనది అను సత్యమును గుర్తించని వారు అవిద్య ఆత్మయొక్క ఆంతరవిశేషణమని భావించెదరు.

బుద్ధిని ఆత్మగా అంగీకరించినా, దేహమును ఆత్మయని స్వీకరించినా, ఈ వాద ములన్నింటిలో ఒక విషయము నిశ్చితము. ఆత్మవిషయములో ఉండే భ్రాంతులు అన్నిం టికీ ఆత్మస్వరూపమగు చైతన్యము ప్రతిఫలించుటయే కారణమగుచున్నది. కావున, ఆత్మ విషయముగా గల జ్ఞానము విషయములో విధి ప్రవర్తిల్లదు. ఒక వస్తువు పూర్తిగా తెలియని సందర్భములో మాత్రమే, దానిని తెలుసుకొన వలెను అనే విధి అర్థవంతమగును. ఉదాహ రణకు జంబూఫలమనగా నేమియో నీకు తెలియనిచో, దానిని గురించి తెలుసుకొనుమని నేను చెప్పుట యుక్తియుక్తముగా నుండును. కావున, ఆత్మ పూర్తిగా తెలియని(అజ్ఞాతమ్) వస్తువు కాదు గనుక, ఆత్మను తెలియవలెననే విధివాక్యము అసంగతము. దేహములో, ఇంద్రియములలో మరియు మనస్సులో మాత్రమే గాక, అవ్యక్తావస్థలో కూడ చైతన్యము యొక్క ఆభాస ఉన్నది. ఆ చైతన్యమే ఆత్మస్వరూపము. అవి చైతన్యము ప్రతిఫలించుట చేతనే చేతనములు కాగల్గుచున్నవి. ఈ ప్రతిఫలనము వలననే వాటిలో ప్రతి ఒక్క దాని యందు ఆత్మయనే భ్రాంతి కలుగుచున్నది. దేహమే ఆత్మ యని నేను భావించుటకు కారణమేమి ? చైతన్యము దానియందు ఉపలభ్యమగుటయే. నేనీ ప్రపంచమును దర్శిస్తూ ఉండే చేతనపురుషుడను. కాని నా చైతన్యమునకు ఈ దేహము అనే హద్దు ఉన్నట్లుగా భాసించుచున్నది. కావున, నేను దేహాకారములో నున్న ఒక చేతనవ్యక్తిని అగు చున్నాను. చేతనపురుషుడనగు నేను దేహము, ప్రాణము, ఇంద్రియములు, మనస్సు మరియు బుద్ధి అను వాటియందు ఆత్మయనే భ్రాంతిని పొందుట స్వాభావికమై యున్నది. ఇంతేగాక, గాఢనిద్ర అనే అవస్థ మనందరికీ అనుభవములో నున్నది. దానిని నిరూపించు టకై అవ్యక్తము కూడ ఆత్మయేనని అంగీకరించక తప్పదు. ఆత్మచైతన్యము ఈ ఉపాధు లన్నింటిలో ప్రతిఫలించుటయే ఈ భ్రాంతులన్నింటికీ హేతువు అగుచున్నది. ఆత్మ పూర్తిగా తెలియనిది కాదు గనుక, ఆత్మజ్ఞానమును విధించవలసిన అవశ్యకత లేదని కొందరు నిర్ధారించు చున్నారు. వీరు మరియొక అడుగు ముందుకు వేసి ఒక ప్రశ్నను వేయుచున్నారు : ఓ మైత్రేయీ ! ఆత్మను దర్శించవలెను, వినవలెను, ఆత్మవిరుద్ధము లగు వాదనలను విశ్లేషించవలెను మరియు భావన చేయవలెను ( ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః ) ఇత్యాది శ్రుతివాక్యముల ప్రయోజనము

ఏమి ? ఈ వాక్యములో విధిని సూచించే తవ్యప్రత్యయము పలుమార్లు ప్రయోగించ బడి నది. ఆత్మ జ్ఞాతమై యుండగా, ఇట్టి విధివాక్యము అర్థరహితము. ఈ వాది అంతిమముగా ఒక మౌలికమైన ప్రశ్నను వేయుచున్నాడు : ఆత్మ సర్వదా జ్ఞాతమై యుండగా మనము శాస్త్రమును అధ్యయనము చేసి ప్రయోజనము ఏమి గలదు ? ఈతని హృదయమునందు ఉన్న ప్రశ్న ఇదియే.

జంబూఫలము మొదలగు అజ్ఞాతపదార్థములను తెలుసుకొనే విధములో ఆత్మను తెలియవలసిన ఆవశ్యకత లేదు అను మాట యథార్థము. కాని ఆత్మవిషయములో భ్రాంతి గలదు. ఆ భ్రాంతిని నివారించవలెను. ఆత్మ అందరికీ బాగుగా తెలిసినదే ( ప్రసిద్ధః ). కావుననే, మానవులందురు ఆత్మ విషయములో పలురకముల భ్రాంతికి గురి యగుచు న్నారు. ఈ ప్రపంచములో అత్యధికముగా అపార్థమునకు గురియైన పదము ఆత్మ. మరియు అత్యంతమహత్త్వపూర్ణమైన వస్తువు కూడ ఆత్మయే. నాకు నా గురించి చింత లేదు ; నా చింత నా తండ్రిని గురించి మాత్రమే అని ఎవరైన చెప్పినచో, నేను వారిని ఒక ప్రశ్న వేసెదను. నీవు నీ తండ్రిని గురించి చింతిల్లుటకు కారణమేమి ? ఆయన ఆరో గ్యము బాగుండలేదని నీవు అనెదవా ? అట్లైనచో, దానిని గురించి చింతిల్లవలసినది ఆయనయే గాని నీవు కాదు గదా ! ఆయన అనారోగ్యముతో బాధపడుచుండగా నేను ఎట్లు సుఖించగలను అని నీవు చెప్పెదవా? అట్లైనచో, నీవు చింతిల్లేది ఎవరిని గురించి ? అని ప్రశ్నించవలెను. నీ గురించి మాత్రమే గదా ! మనకు ప్రపంచములోని వివిధవస్తువు లపై వివిధస్థాయిలకు చెందిన ఆదుర్దాలు గలవు. కాని మన ధ్యానమును అత్యంతము అధికముగా ఆకర్షించి మనకు అన్నింటికంటె అధికమగు చింతను కలిగించే వస్తువు ఒక్క ఆత్మ ( నేను ) మాత్రమే. కాని అదే ఆత్మను గురించి మానవులకు సర్వాధికమైన భ్రాంతి గలదు. వాస్తవములో, ఈ చింతకు అంతకూ కారణము భ్రాంతి మాత్రమే. భ్రాంతి ఉండు టచే చింత కలుగుచున్నది. చింత ఉన్నది గనుక భ్రాంతి గలదని స్పష్టమగుచున్నది. కావున, మనము భ్రాంతిని దూరము చేసుకొనవలెనని శాస్త్రము బోధించుచున్నది. మరణ భయము, వృద్ధాప్యమును గురించిన చింత, తనయందు న్యూనతాభావము ఉండుటచే తన సామర్థ్యమును జనులయెదుట నిరూపించుటకు చేసే ప్రయత్నములో కలిగే చింత మొదలగు చింతలన్నియు ' నేను ' పై కేంద్రితమై యున్నవి. ఈ చింతలకే మనము సంసారము అని పేరు పెట్టినాము. సంసారము అనగా, ఒక్క మాటలో చెప్పాలంటే, తన గురించి తనకు గల చింత మాత్రమే. ఈ చింతకు మూలములో అజ్ఞానము గలదు. కావు న, మనకు ఆత్మ తెలియనిది కాదు. ఆత్మ అందరికీ తెలిసినదే; కాని, ఉన్నది ఉన్నట్లుగా కాదు. 'ఇతరపదార్థములను గురించి తెలుసుకొనే విధములో ఆత్మను కూడ తెలియవ లెను' అని శాస్త్రము విధించుట లేదు. ఏలయన, ఆత్మ మనకు తెలిసియే యున్నది. కాని తప్పుగా తెలియబడి యున్నది. మనము ఆత్మ విషయములో తప్పును చేయుచున్నాము. కావున, ఆ తప్పును దిద్దుకున్నచో, చాలును. అంతకు మించి చేయవలసినది లేదు. నేతి నేతి అను నిషేధవాక్యముల ద్వారా శ్రుతి మన దృష్టిని ఈ సత్యము వైపునకు మళ్లించు చున్నది. ఏది ఆత్మ యని మనము భావించుచున్నామో, అది ఆత్మ కాదు.

ఆత్మపై మనము చేయు అధ్యారోపముల నన్నింటినీ మనము తొలగించిన చాలు నని శ్రీశంకరులు వివరించిరి. ఆరోపించబడినవి యేవి ? ఈ ఆరోపముల నన్నింటినీ మనము చూచియున్నాము. వీటిని సంగ్రహముగా నామరూపములు అనే ఒక్క మాటలో చెప్పవచ్చును. జగత్కారణమగు అవ్యాకృతావస్థ ( అవిద్య లేక అవ్యక్తము ), మరియు దానినుండి ఉదయించిన అంతఃకరణము, దానియందలి బుద్ధి, మనస్సు అనే విభాగములు అను వాటియందు ఆత్మయను భ్రాంతి కలుగుచున్నది. బుద్ధి అన్నా, మనస్సు అన్నా, అంతఃకరణములో ఉదయించే వృత్తి మాత్రమే. ఈ వృత్తి ఆత్మను విడచి మనజాలదు. ఆత్మపై అధ్యారోపము చేయబడే ఈ సర్వము కల్పితమే. అదే విధముగా అనాత్మలు అగు దేహేంద్రియాదులు అన్నియు ఆత్మపై ఆరోపించ బడుచున్నవి. ఈ అధ్యారోప మును నిర్మూలించ వలసి యున్నది.

శ్రీశంకరులు ఉపక్రమభాష్యములో చెప్పిన విషయమును మరల ఇచట ఉటంకిం చినారు. మనము సాధించవలసినది ఆత్మచైతన్యవిజ్ఞానము కాదు. భాష్యకారులు ఈ విష యమును ఇంత స్పష్టముగా బోధించియుండగా, మనము చైతన్యమునకు అతీతమైన తత్త్వమును తెలియవలెనని బోధించువారి మాటలకు అర్థమేమి ? దేహమునకు అతీత ముగా మనస్సు, దానికి అతీతముగా బుద్ధి, వీటికి అన్నింటికీ అతీతముగా ఆత్మచైతన్యము గలవనియు, మనము దానిని కనుగొన వలయుననియు కొందరు బోధించుచున్నారు. కాని, ఆత్మచైతన్యముయొక్క జ్ఞానమును కొత్తగా సంపాదించ బని లేదని శ్రీశంకరులు ఇచట సుస్పష్టముగా చెప్పియున్నారు. ఇట్లు చెప్పుటకు కారణమేమి ? కారణమేమనగా, సర్వకా లములలో ఆత్మయే హాజరుగా నున్నది. రూపమును చూచుట, శబ్దమును వినుట, గంధ మును ఆఘ్రాణించుట ఇత్యాది సర్వానుభవములలో ఆత్మచైతన్యము నిత్యము ఉపలభ్య మగుచునే యున్నది.

ఇట్టి స్థితిలో మనము ఏమి చేయవలయును ? మనము ఆత్మపై ఆరోపించుకొని యున్న వివిధరకముల ధారణలను తొలగించు కొనవలయును. ఎట్లు ? ఏది ఆత్మ ? ఏది ఆత్మ కాదు ? అను విషయమును శాస్త్రసాహాయ్యముతో విచారించి తెలియవలెను. ఆత్మ స్వరూపము తెలియకపోవుటచే, వివిధములగు అనాత్మలను దానిపై అధ్యారోపము చేసి మనము వాటినే ఆత్మ యని భ్రాంతి పడుచున్నాము. మనస్సు, కన్నులు, చెవులు, కంటితో చూసే వివిధరూపములు, మనకు తారసిల్లే సర్వానుభవములు అను నామరూప ములన్నింటిలో సర్వదా ఉండే చైతన్యరూపములో ఆత్మ సుప్రసిద్ధమై యున్నది. బౌద్ధులు, చార్వాకులు, ప్రకృతివైజ్ఞానికుడు మొదలగు వారితో సహా సర్వులకు దేహేంద్రియమనస్సు లచే ఉపహితమై ( qualified ) యున్న ఆత్మ తెలియుచునే యున్నది. ఈ దర్శనముల న్నియు ఆత్మకు వివిధవిశేషణములను జోడించుచున్నవి. ఆత్మను గురించి విచారము చేయని వ్యక్తికి కూడ దాని విషయములో ఏదో ఒక నిష్కర్ష ఉండి తీరును. ఈ విధముగా వివిధములగు అధ్యారోపములతో కూడి సర్వులకు తెలిసియే యున్న ఆత్మను మనకు తెలిసిన పరిభాషలో 'తెలియవలసిన' పని లేదు. కాని దానిని ఒక విలక్షణమగు రీతిలో తెలియవలసి యున్నది. ఆత్మ ఇప్పటికే తెలిసియున్ననూ, భ్రాంతిపూర్వకముగా తెలిసి

యున్నది. కావున, ఆత్మజ్ఞానమనగా ఈ భ్రాంతిని తొలగించుటయే. ఆత్మ జ్ఞానములో విషయము కాజాలదు. ఇందువలననే, ఆత్మ తెలిసినదని చెప్పువానికి అది తెలియలేదని కేనోపనిషత్తు చాటుచున్నది. ఆత్మ నాకు తెలియదని చెప్పువానికి కూడ ఆత్మ తెలియలేదని వేరుగా చెప్పనక్కర లేదు. ఒకడు నాకు ఆత్మ తెలియలేదని చెప్పినాడనుకొనుడు. అట్లు చెప్పువాడు ఆత్మయే. ఆత్మ నిత్యప్రసిద్ధము. కావున ఆత్మజ్ఞానము అనగా అప్రసిద్ధమగు వస్తువుయొక్క జ్ఞానము కాదు.

ఉదాహరణకు, నీకు స్ఫటికము గురించి తెలిసినదనుకో. దాని గురించి నీకు పూర్వములో తెలియదు. ఇప్పుడు తెలిసినది. అనగా నీ మనస్సులో ఒక వృత్తి కలిగినది. ఆ వృత్తికి చెందిన పదార్థమే ఆ స్ఫటికము. ఇదియే జ్ఞానము. వివిధవస్తువుల జ్ఞానములలో పరిస్థితి ఇటులనే యుండును. కాని, చైతన్యరూపమగు ఆత్మయొక్క జ్ఞానమును పొందవలయునని నేను చెప్పినాననుకొనుడు. నీవు ఏమి చేసెదవు ? స్ఫటికము ఇత్యాది పదార్థములవలె చైతన్యము జ్ఞానములో విషయము అగుట ఎట్లు సంభవము ? ద్రష్టతో బాటు సర్వజ్ఞానరూపములను ఆత్మచైతన్యమే ప్రకాశింప జేయుచున్నది. ఒక పదార్థమును తెలుసుకొనే రీతిలో తెలియనక్కరలేని ఏకైకవస్తువే ఆత్మ. సర్వవృత్తిరూపములను, సర్వపదార్థములను ప్రకాశింప జేయునది, మరియు సర్వవృత్తుల స్వరూపభూతమైనది ఆత్మచైతన్యమే. ఇట్టి ఆత్మచైతన్యము ఒకానొక విశేషజ్ఞానములో విషయమగుట అసంభవము. అది ఆ విధముగా జ్ఞానవిషయము కావలసిన అవశ్యకతయు లేదు.

శ్రీశంకరులు ఇంకనూ ఇట్లు వివరించిరి : ఆత్మచైతన్యము సర్వవృత్తులలో ప్రతిఫలించుచుండుట చేతనే, బౌద్ధులలో ఒక తెగయగు విజ్ఞానవాదులు వృత్తియే ఆత్మయని స్వీకరించుచున్నారు. ఏ కాలమునందైననూ క్షణకాలస్థాయియగు విజ్ఞానము మాత్రమే గలదనియు, అదియే మనకు ఉపలభ్యమగుచున్నదనియు వారి సిద్ధాంతము. ఉదాహరణకు, ఇచట కూర్చుండి యున్న నన్ను మీరు చూచుచున్నారు. కొన్ని నిముషములనుండి నేను ఇచటనే కూర్చుండి యున్నట్లు మీకు కానవచ్చును. మీ మనస్సు నాపై నిరంతరముగా లగ్నమై యున్నదని మీరు భావించవచ్చును. కాని అది వాస్తవము కాదు. మీ మనస్సు నిరంతరముగా చలించుచున్నది. వృత్తులు మారుచునే యున్నవి. కాని స్మృతిప్రభావముచే ఒకే వ్యక్తి ఉన్నాడు యన్నట్లు కన్పట్టును. కాని వాస్తవములో జరిగేది ఏమంటే, సినిమాలో వలె మనోవృత్తులు నిరంతరముగా మారిపోవుచుండును. చైతన్యముచే వ్యాప్తమై యుండే మనోవృత్తి క్షణికమగుటచే, ఆత్మ యనగా ఈ క్షణికవిజ్ఞానమేనని బౌద్ధులు సిద్ధాంతీకరించిరి. వృత్తి ఆత్మకంటె భిన్నముగా లేదనే బౌద్ధుల నిర్ణయములో తప్పు లేదు. కాని ఆత్మ యనగా వృత్తియేనను వారి నిర్ణయము సరి కాదు. కాని వారు వృత్తియే ఆత్మ యని స్వీకరించిరి. వృత్తి క్షణికమగుటచే,ఆత్మ కూడ క్షణికమగును. అనగా, వారి సిద్ధాంతములో ఆత్మకు యథార్థత లేదు. వారి దృష్టిలో ఆత్మయే లేదు. మనకు ఇచట వారి సిద్ధాంతమును త్రోసిపుచ్చుటయందు తాత్పర్యము లేదు. క్షణివిజ్ఞానముకంటె భిన్నముగా ఆత్మ లేదనియు, బాహ్యమునందు వస్తువు లేదనియు, స్వప్నములో వలెనే నిరంతరపరివర్తనశీలమగు వృత్తి మాత్రమే గలదనియు, దీనిని మించి ఆత్మ అనేది ఏదీ లేదనియు వాదించే బౌద్ధులతో సహా ఆత్మ సర్వులకు పరిచితమేనని చెప్పుట మాత్రమే ఈ చర్చకు తాత్పర్య

ము. ఈ సిద్ధాంతములో అంతఃకరణమునందలి ధారణల కంటె భిన్నముగా బాహ్యమునందలి పదార్థజాతమునకు ఉనికి లేదు. సర్వము మనోవృత్తులు మాత్రమే. అంతకు మించి ఏదీ లేదు. ఈ మనోవృత్తులు నిరంతరముగా మారిపోవుచుండును. మనకు కానవచ్చే అవిచ్ఛిన్నత ( continuity ) భ్రాంతిజన్యము మాత్రమే. క్షణికవిజ్ఞానము మాత్రమే సత్యము. జ్ఞాత లేనిచో వృత్తి ఉన్నదను విషయము మనకు ఎట్లు తెలియును ? ఈ ప్రశ్నకు వారు ఈ విధముగా సమాధానమును చెప్పెదరు : సృష్టి చైతన్యరూపమని వారు అంగీకరించి, దానిని తెలియుటకు మరియొక ప్రమాణముతో పని లేదనియు, అది స్వయంప్రకాశమనియు వారు చెప్పెదరు. అది తనను తాను ప్రకాశింప జేయుచునే ఉదయించును. దానిని అన్యము ప్రకాశింప జేయవలసిన ఆవశ్యకత లేదు. దానిని తెలియుటకు మరియొక ప్రమాణము అవశ్యకము కాదు గనుక, జ్ఞాత కూడ అవశ్యకము కాదని వారి వాదము. ఆత్మ స్వయంప్రకాశమనియే మనము కూడ చెప్పుచున్నాము. కాని ఆత్మ క్షణికము కాజాలదు. క్షణికవిజ్ఞానమే ఆత్మ యని నీకు ఎట్లు తెలిసినది ? క్షణకాలము మాత్రమే ఉండి మాయమయ్యే విజ్ఞానము తనను తాను తెలియజాలదు. అది తనలో వచ్చే పరివర్తనను తాను తెలియజాలదు. దాని దర్శనములో తరువాతి క్షణము ఇంకనూ ఉదయించ లేదు. పూర్వ క్షణమునందు అది లేకుండుటచే, దాని పుట్టుక దానికి తెలియదు. ఈ వాదమును యుక్తితో సమర్థించే మార్గము కాన వచ్చుట లేదు.

శ్రీశంకరులు ఇంకనూ ఇట్లు వివరించిరి : అజ్ఞానముచే బ్రహ్మపై చేసిన అధ్యారోపములను మనము త్రోసిపుచ్చవలెను. మనము చేయవలసినది ఇంతే. బ్రహ్మ అత్యంత ప్రసిద్ధము గనుక, దానిని తెలియుటకై ప్రత్యేకమగు ప్రయత్నము అనావశ్యకము. బ్రహ్మను అనుభవమునకు దెచ్చుకునే ( experience ) ప్రయత్నము అర్థరహితము. ఏలయన, సర్వము బ్రహ్మమునందు మాత్రమే అనుభవమునకు వచ్చుచున్నది. అట్టి బ్రహ్మము నీవే అయి ఉన్నావు. కావున, ఈ విషయములో మనము తప్పుడు ధారణలను త్రోసిపుచ్చుటను మినహాయించి అధికమగు ప్రయత్నము అవసరము కాదు. ఈ త్రోసిపుచ్చుటకు ప్రత్యేకప్రయత్నము అవసరము కాదు. ఇది నేలపైనున్న మురికిని చీపురుతో తుడుచుట వంటిది కాదు. మనము ఆత్మయందు నెలకొనియున్న మాలిన్యమును తొలగించే ప్రయత్నమును చేయుట లేదు. ఏలయన, ఆత్మ నిత్యశుద్ధము. ఇచటి నిరాకరణము త్రాడుపైనున్న పామును నిరాకరించుట వంటిది. దాని కొరకై ఎట్టి ప్రయత్నమును చేయవలెనో, అదే ప్రయత్నమును ఇచట చేసిన చాలును. మనము అనాత్మధర్మములను ఆత్మపై అధ్యారోపము చేసుకుని కూర్చున్నాము. మనము వాటిని త్రోసిపుచ్చిన చాలును. చేయవలసినది ఇంతే. మరియొక ప్రయత్నమునకు తావు లేదు. ఏలయన, ఆత్మకంటె భిన్నము కాని బ్రహ్మ అత్యంతప్రసిద్ధమై యున్నది. అనగా, మనకు దానికంటె అధికముగా తెలిసిన వస్తువు మరియొకటి లేదు. దానిపై చేయబడిన అధ్యారోపములను తొలగించిన వెంటనే, సర్వపరిచ్ఛేదములు తొలగిపోయి, అనంతబ్రహ్మాత్మ తెలియబడును.

బ్రహ్మను తెలియుటలో శ్రమ మరియు ప్రయత్నము లేదన్నచో, సర్వులు బ్రహ్మను ఏల తెలియకున్నారు ? శ్రీశంకరులు ఇట్లు సమాధానమును చెప్పిరి : మాన

వుల మస్తిష్కము వివిధములగు నామరూపములచే అపహరింప బడినది. అవి అన్నియు ఆత్మగనే స్వీకరించ బడుచున్నవి. ఆత్మయందు కర్తృత్వభోక్తృత్వములు, అజ్ఞానము ఇత్యాదులు ఆరోపించ బడుచున్నవి. కాని నామరూపములచే అపహరించ బడిన అంతఃకరణము గలవారికైననూ బ్రహ్మ సర్వకాలములయందు పూర్ణముగా ఉపలభ్యమగుచునే యున్నది. వారికైననూ బ్రహ్మ అత్యంతనికటముగా నుండి సులభముగా తెలియుటకు సిద్ధముగా నున్నది. ఆత్మకంటె మరింత దగ్గరగా మరియొకటి లేదు. ఏలయన, ఆత్మ అనగా నీవే. అయినప్పటికీ, అపహృతమైన అంతఃకరణము గలవారికి అది తెలియవలసి యున్నది. వివేకము లేనిచోట ఉన్నది కూడ లేనట్లే భాసించుటచే తెలియుట దుష్కరమగుచుండును. అత్యంతనికటముగానున్న ఆత్మ బహుదూరములో తనకంటె భిన్నముగా నున్నట్లు కన్పట్టును. సర్వదా సిద్ధమై యున్న బ్రహ్మాత్మ ప్రయత్నసాధ్యమా యన్నట్లు, సర్వమునకు అతీతుడై పొందదగిన వస్తువా యన్నట్లు భాసించును. ఈ తీరున, అతిసులభముగా తెలియదగిన వస్తువు మిక్కిలి జటిలమగుచున్నది. అది మానవుల స్వరూపమై యుండగా, కొందరు దానికొరకై సర్వదా బయట వెదుకులాడుచున్నారు; మరికొందరు హృదయపు లోతులలో మున్కలు వేయుచున్నారు. వివేకము లేని మానవుడు ఏదో ఒక రూపములో సర్వదా అన్వేషించుచునే యున్నాడు. మానవుని మస్తిష్కము వివిధములగు ఇహలోకవిషయములతో బాటు, స్వర్గము మొదలగు పరలోకకాంక్షలతో కూడ నిండి యుండుటచే, అతడు తాను వెదకేది తన స్వరూపముకొరకు మాత్రమేనను సత్యమును గ్రహించ లేకున్నాడు. తాను పొందవలసినది తనకంటె వేరుగా నున్నదని మానవుని విశ్వాసము. కావుననే, వానికి ఆత్మను తెలియుట దుష్కరమగుచున్నది ( దుర్విజ్ఞేయమ్ ).

వీరికి భిన్నముగా మరికొందరు తమ హృదయములో ఒక విశిష్టమగు వాస్తవికదృష్టిని అలవరచుకొని బాహ్యపదార్థములను గురించిన చింతలనుండి విముక్తులై యుందురు. పరిపక్వమగు హృదయము గల ఇట్టి వ్యక్తులయందు రెండు రకములు అనుగ్రహము పండినది. ఒకటి గురువుయొక్క అనుగ్రహము ( గురుప్రసాదము ). అనగా, గురువు శిష్యుని శరీరమును ఒకానొక స్థానములో తాకి తనలోనుండి ఒక శక్తిని శిష్యునిలో ప్రవేశపెట్టి శిష్యునిలో నిద్రాణమై యున్న కుండలినీశక్తిని ఉత్థానము చేయునని కొందరి అభిప్రాయమై యున్నది. ఇది అర్థము లేని మాట. సర్వము మిథ్య యని వారు అంగీకరించెదరు. కావున కుండలిని కూడ మిథ్యయే. కాని వారి దృష్టిలో ఈ కుండలిని మాత్రము సత్యవస్తువై కూర్చున్నది. అనుభవములు ( experiences ) అన్నియు మిథ్య మరియు సంసారాంతర్గతములు అయి ఉన్నవి. కావున, ఇచట గురుప్రసాదము అనగా తత్త్వమసి అను మహావాక్యముయొక్క అర్థమును ఉపదేశించుటయే. ఇంతేగాక, మనకు ఆత్మప్రసాదము కూడ అవశ్యకమగుచున్నది. నిన్ను నీవు ఆశీర్వదించుకోవాలి. నిన్ను నీవు నిందించుకొనుచున్నచో, నీవు బ్రహ్మవేనని ఉపదేశించే శాస్త్రము ఏమి చేయగల్గును ? ఈ జ్ఞానమును పొందే అర్హత నాకు గలదనే ఆత్మవిశ్వాసము జిజ్ఞాసువునకు ఉండవలెను. అప్పుడు మాత్రమే ఈ జ్ఞానము లభించును. ఇట్టి ఆత్మవిశ్వాసముతో బాటు యోగ్యమగు గురువు కూడ లభించి

రెండు రకముల ప్రసాదము లభించినచో, దీనికంటె తేలికగా మరియు
నచో, అనగా ఈ రెండు రకముల ప్రసాదము లభించినచో, దీనికంటె తేలికగా మరియు
సుస్పష్టముగా తెలిసేది, మరియు స్వరూపభూతమైనది అగు జ్ఞానము మరియొకటి లేదు.

ఇదే విషయమును భగవానుడు 9 వ అధ్యాయములో ఇటులనే ( ప్రత్యక్షావగమం ధర్మ్యమ్ ) చెప్పియున్నాడు. ధర్మమునకు దూరము కాని ఈ వస్తువు ( ఆత్మ ) నిత్యసిద్ధమై యున్నది. ధర్మబద్ధమగు జీవితమును గడుపుట ద్వారా దీనిని తెలియవచ్చును. ఇట్టి జ్ఞానము గల మహాత్ముల దృష్టిలో ' నేను ' అను పదమునకు అర్థము సచ్చిదానందబ్రహ్మయే గాని మరియొకటి కాదు. ఆత్మ చైతన్యముయొక్క జ్ఞానముచే ఆత్మయందు ఆరోపించబడిన సర్వపరిచ్ఛేదములు, మరియు సర్వజడములు నిషేధించ బడినవి. ఆత్మయందు ఆరోపించబడే కార్యకారణభావము కూడ నిషేధించ బడినది. ఆత్మయందు ఆరోపించబడిన సంసర్గములను ఈ జ్ఞానము త్రోసిపుచ్చును. ఆత్మ ఒక దేశమునకు కట్టుబడి యుండుననే ధారణ నిరాకరించబడును. ఆత్మ కాలమునకు వశమై యుండుననే ధారణ ఉపమర్దితమగును. బ్రహ్మాత్మ సత్యజ్ఞానానంతము గనుక, దానికంటె దగ్గరగా నుండునది, దానికంటె సుస్పష్టముగా తెలిసేది, మరియు దానికంటె మెరుగైనది మరియొకటి లేదు.

సగుణబ్రహ్మోపాసనమును చేయు భక్తులు ఇచట ఒక అభ్యంతరమును లేవదీయుచున్నారు. ఈ భాగవతులు తరచుగా ఒక శ్లోకమును ఉదహరించెదరు : కలౌ కల్మషచిత్తానాం పాపద్రవ్యోపజీవినామ్, విధిక్రియావిహీనానాం హరేర్నామైవ కేవలమ్. అనగా, కలియుగములో మలినమగు అంతఃకరణము గలవారై, పాపమార్గములో సంపాదించిన ధనముతో పొట్ట పోసుకొనుచూ, విధివిహితములగు కర్మలకు దూరముగా బ్రతికే మానవులకు హరినామము మాత్రమే శరణు అగుచున్నది. హరినామమనగా విష్ణుసహస్రనామపారాయణము మరియు పూజాదికము అని వారి అభిప్రాయము. పుణ్యాపాపములు, రాగద్వేషములు అనే మాలిన్యములతో నిండిన మనస్సు గల మానవులకు కలియుగములో ఇది ఒక్కటి మాత్రమే శరణ్యము. ఈ కలియుగములో మానవులు తరచుగా ఇతరుల ధనమును అపహరించి అనుభవించుచుండుట మనకు కానవచ్చును. ఇతరయుగములలో మానవులు వేదోక్తకర్మానుష్ఠానము ద్వారా పాపపరిహారమును గావించుకొనెడి వారు. అగ్నిహోత్రము మొదలగు ఈ వైదికకర్మలను మానవులీ నాడు చేయుట లేదు. ఇట్టి స్థితిలో మానవులు అంతఃకరణశుద్ధికొరకై ఏమి చేయవలెను ? ప్రార్థన మాత్రమే. ఈ శ్లోకము ఆ ప్రార్థనను హరినామసంకీర్తనరూపముగా ప్రతిపాదించుచున్నది. మనకు అంతఃకరణశుద్ధి కొరకై ప్రార్థనను మినహాయించి మరియొక మార్గము లభ్యమగుట లేదు. మనము హరి, శివుడు మొదలగు భగవానుని ఏ రూపమును ప్రార్థించినను మంచిదియే. కాని ఒక విషయమును మరువరాదు. దీని ప్రయోజనము అంతఃకరణశుద్ధియే గాని, మోక్షము కాదు. కాని వారు ఈ శ్లోకమును వ్యాఖ్యానిస్తూ, ఈ విషయములో పొరపాటు చేయుచున్నారు.

వారి వాదము ఇట్లున్నది : నిరాకారమగు ఆత్మను ధ్యానించుట దుష్కరము. కావున, మనము సగుణబ్రహ్మను ధ్యానించవలెను. ప్రపంచములోని ఆధునికవేదాంతులు ఈ విధముగనే వాదించుచున్నారు. వీరు వేదాంతముపై కొంత పై పై ప్రేమను చూపించి, తరువాత ఆత్మజ్ఞాననిష్ఠ దుస్సాధ్యము గనుక, మనము కుండలినీ శక్తిని స్వస్థానమునుండి పైకి లేపి, దానిని ఏదో ఒక చక్రములోనికి ప్రవేశపెట్టవలయుననియో, లేదా అటువంటి

మరియొక పనిని చేయవలయుననియో బోధించుచున్నారు. ఈ బోధలో పస ఇసుమంతైననూ లేదు. సగుణబ్రహ్మధ్యానము వారు అనుకున్నంత సరళము కాదు. భక్తి చాల సరళమని వారు చెప్పెదరు. భక్తియందు ప్రేమకు ప్రాముఖ్యము గలదు. పరిచయము గల వ్యక్తులను మరియు మనకు మహోపకారమును చేసిన వారిని ప్రేమించలేని మనము భగవానుని ప్రేమించుట ఎట్లు సంభవమగును ? జ్ఞానము దుష్కరమనియు, భక్తి సరళమనియు నీవు తలపోయుచున్నచో, మంచిది. అటులనే కానిమ్ము. నీవు భక్తిని చేయుము. దాని గురించి ప్రసంగించకుము. ప్రముఖమగు ప్రశ్న ఏమనగా, నీవు భక్తిని చేయగలవా ? భక్తి యనగా ఒక విశిష్టమానసికభావన. మనఃప్రవృత్తిని ఎవ్వరైననూ నిర్మించలేరు. ప్రేమ ఒక క్రియ కాదు. అది శుద్ధమగు నామవాచకము. నేను నిన్ను ప్రేమించుచున్నాను అనే క్రియాపదప్రయోగము గలదు. కాని దానికి ' నాకు నీపై ప్రేమ గలదు ' అని మాత్రమే అర్థము. చప్పట్లు కొట్టుట, తలపై టోపీని ధరించుట మొదలగు క్రియలవలె భక్తి కూడ ఒక క్రియ అయ్యే పక్షములో, మనకు తోచిన సమయములు అన్నింటిలో భక్తిని చేయుట సంభవమయ్యేడిది. కాని పరిస్థితి అది కాదు. భక్తి మనము స్వీయసంకల్పశక్తిని వినియోగించి చేసే కర్మ కాదు. భక్తి సరళమని వీరు చెప్పుచున్నారు. కాని, వాస్తవమేమనగా, ఇతరము సర్వము వలె భక్తి కూడ సరళము కావచ్చును ; లేదా, కఠినము కావచ్చును. అది వ్యక్తిపై ఆధారపడి యుండును. మనము చెప్పే జ్ఞానముకంటె భక్తి తక్కువది కాదు. అట్లైనచో, దానిని మనము ప్రార్థనతో ఆరంభించి, ఏదో ఒక రూపములో సగుణబ్రహ్మధ్యానము చేయవలెనను వచనము అర్థవంతముగ నుండును. భగవంతుని స్తుతించుట, ప్రార్థనలను చేయుట, ప్రతిదినము విస్తృతమగు కర్మలను చేయుట మొదలగు భక్తిద్యోతకమగులగు క్రియలు చాల మంచివి. వాటిని మనము తప్పక చేయుచుండవలెను. కాని వాటిపై ఒక తత్త్వశాస్త్రమును నిర్మింపబూనుట పరిశీలింపదగిన విషయము. భక్తుడు భక్తిని గురించి చర్చించడు; చర్చించువాడు భక్తుడు కాడు. వీరు సగుణ-బ్రహ్మ-ఉపాసన అను విషయముపై శాస్త్రార్థములను, గంభీరమగు ప్రసంగములను చేయువారే గాని, వీరికి ఆ ఉపాసనయందు కటిబద్ధత లేదు. వారు యథార్థముగా సగుణ-బ్రహ్మ-ఉపాసనయందు అభిరుచి గలవారైనచో, వారికి ఈ చర్చలకు సమయము ఉండెడిది కాదు. వీరు ఎవరు ? వీరు తమను తాము పండితులమని చెప్పుకొనే వారని శ్రీశంకరులు వివరించిరి. వీరు భక్తితో నిండిన హృదయము గలవారు కారు ; వీరు కేవలము అధికప్రసంగమును చేయుచుందురు. వీరు చెప్పేది ఏమి ? ఆత్మకు రూపము లేదు గనుక, మనస్సు దానిని చేరుకొనలేదని వీరు వాదింతురు. ఆత్మ నిరాకారమని వారు అంగీకరింతురు. కావుననే, మనస్సు దానిపై లగ్నము అగుట కుదరదని వారు సిద్ధాంతీకరించెదరు. నిరాకారమగు ఆకాశమును మనస్సు గ్రహించలేదు. అటులనే, నిరాకారమగు ఆత్మను కూడ మనస్సు గ్రహించలేదు. కావున, ఆత్మజ్ఞాననిష్ఠను సంపాదించుట దుష్కరమని వీరి భావన. జ్ఞాన నిష్ఠ యనగా ఆత్మజ్ఞానము మనస్సులో నిలకడగా నుండుట అని వీరి అభిప్రాయము. శంఖచక్రగదాధారి ఇత్యాది విశిష్టరూపము ఉన్నచో జ్ఞాననిష్ఠ సంభవమగునే గాని, రూపము లేని ఆత్మ విషయములో అది అసంభవమని వీరి అభిప్రాయము.

గురుసంప్రదాయము లేని వారి విషయములో ఇది సత్యమేనని శ్రీశంకరులు అంగీకరించుచున్నారు. శ్రీశంకరులు ఇచట చాల జాగరూకతతో సమాధానము నిచ్చుచున్నారు. వేదాంతపుస్తకమును చదివినంత మాత్రాన వేదాంతము వంట బట్టదు. దానికి గురువు ఆవశ్యకమగును. కొందరికి గురువు ఉండును. కాని, ఆ గురువు సంప్రదాయసిద్ధముగా వేదాంతమును అధ్యయనము చేసిన వాడు కాదు. వేదాంతబోధన చాల లోతుగా ఆలోచించి ఏర్పాటు చేసిన ప్రక్రియ. ఉపక్రమ-ఉపసంహారములతో కూడియున్న ఈ ప్రక్రియ వస్తువును మన ముందు నిలబెట్టును. ఈ ప్రక్రియను ఎరుంగని ఆచార్యుడు శిష్యునకు మంత్రమును బోధించవచ్చును ; లేదా, ఏదో ఒక సలహాను ఈయవచ్చును ; కాని, వేదాంతమును బోధించలేదు. సరిగా బోధించలేక శిష్యునకు వ్యామోహమును కలిగించే ఆచార్యుని కలిగియుండుట చాల పెద్ద దురదృష్టము. శిష్యుని మనస్సులో గురువుపై భక్తిశ్రద్ధలు ఉండుటచే, అతడు వస్తుస్థితిని యథాతథముగా అంచనా వేసి సరియగు నిర్ణయమును గైకొనుట చాల కష్టముతో కూడిన పని. అట్టి వానిని భగవానుడు మాత్రమే రక్షించవలయును. కావున, ఆచార్యుని ఎన్నుకొనే ముందు ఆయన సంప్రదాయమునకు చెందినవాడేనా ? కాదా ? అను విషయమును గమనించవలెను. ఇట్టి ఆచార్యుడు లేనివారలకు ఆత్మజ్ఞాననిష్ఠను సంపాదించుట మిక్కిలి కష్టసాధ్యమని శ్రీశంకరులు అంగీకరించుచున్నారు.

యోగ్యుడగు ఆచార్యుడు ఉన్నచో, చాలదు. జిజ్ఞాసువు ఆయన చేయు బోధను శ్రవణము చేయవలెను. సరియగు విధములో బోధించబడిన వేదాంతమును శ్రవణము చేయని వారికి కూడ ఆత్మజ్ఞాననిష్ఠ దుస్సాధ్యమే యగును. ఇంతేగాక, సంప్రదాయమునకు చెందిన గురువు వద్ద వేదాంతమును కొంత కాలము శ్రవణము చేసియున్ననూ, ఆత్మజ్ఞాననిష్ఠ కష్టసాధ్యమగుట సంభవమే. ఎందువలన ? దీనికి మరికొంత సంసిద్ధత అవశ్యకమగుచున్నది. బాహ్యపదార్థములయందు పూర్ణముగా తగుల్కొనిన మనస్సులు గలవారికి కూడ ఈ ఆత్మజ్ఞాననిష్ఠను సంపాదించుట కష్టతరమగును. స్వర్గము కూడ ఈ బాహ్యపదార్థములలోననే అంతర్గతమగును. ఈ విషయము తప్పక గమనించ దగినది. బాహ్యవస్తువులయందు సంలగ్నమైన మనస్సు గల వ్యక్తి ఆ పదార్థములకు గల వాస్తవికమగు విలువను అంచనా వేయజాలడు. ఆతనికి ప్రాథమికతలను ( priorities ) సరియగు క్రమములో అమర్చుకొనుట చేతకాదు. తాను అన్వేషించే పురుషార్థమును గురించి ఆతనికి సరియగు కల్పన లేదు. కావుననే, ఆతని మనస్సు వివిధవిషయముల వెనుక పరుగులెత్తుచుండును. అనగా, ఆతనియందు పురుషార్థనిశ్చయము ఉండజాలదు. ఆతనియందు వైరాగ్యము మరియు మానసికప్రసన్నత ( సమాధానమ్ ) కొరవడి యున్నవి.

ఈ లక్షణములు అన్నీ ఉన్న జిజ్ఞాసువు కూడ మననము చేయవలసి యుండును. మనస్సులో ఏవో కొన్ని సంశయములు ఉండుట సంభవమే. ఇచట సర్వము తెలియదగి యున్నది. జ్ఞానము సంశయరహితముగా నుండవలయును. సంశయనివారణకై మననము ఆవశ్యకమగుచున్నది. దాని కొరకై ప్రత్యక్షము, అనుమానము మొదలగు ప్రమాణములలో తగినంత కృషిని చేసియుండ వలయును. వ్యక్తిగతమగు అనుభవమును బట్టి గాని, లేదా

యుక్తిని బట్టి గాని మనస్సులో ఒక సందేహము పొడసూపవచ్చును. అప్పుడు ఆ సందేహమునకు గల కారణమును నిశితముగా పరిశీలించ వలయును. సంశయమునకు కారణమైన అనుభవము, లేక వాదములోని యుక్తి ఏమి ? దీనిని విశ్లేషించ వలయును. అట్లు గానిచో, సర్వము బాగుగనే ఉన్నట్లు కన్పట్టును. కాని వస్తుస్థితి అట్లు ఉండదు. కావున, ఈ విధమగు విశ్లేషణను చేయజాలని వారికి ఈ జ్ఞానములో సుస్పష్టత నిర్మాణమగుట చాల క్లేశముతో గూడిన పని యగును. వేదాంతముల బోధ సత్యమే అయినచో, వేదాంతమునకు విరుద్ధముగా ముందుకు వచ్చే సర్వవాదములు తప్పు అయి ఉండవలెను. ఆ వాదములలోని దోషము కొట్టవచ్చినట్లు కనబడవలెను. దీనిలో సర్దుబాట్లకు అవకాశము లేనే లేదు. వేదాంతప్రతిపాద్యమగు సత్యమునకు భిన్నముగా కనబడే వాదము కేవలము భిన్నముగా నుండుట మాత్రమే కాదు ; అది వేదాంతవిరుద్ధము కూడా. నీవు బ్రహ్మవేనని వేదాంతము చెప్పుచున్నది. దీనికి భిన్నమైన అభిప్రాయము దీనికి పూర్తి విరుద్ధము కూడ అగును. ఏలయనగా, బ్రహ్మ అనంతము కాగా, బ్రహ్మము కానిది పరిచ్ఛిన్నము అగుచున్నది. శూన్యమే ఆత్మ; ఆత్మ క్షణికము ; ఆత్మ బద్ధము ; ఇత్యాది వాదములు ఎన్ని ఉన్నూ, అవి అన్నియు ' నేను పరిచ్ఛిన్నుడను ' అను నిర్ణయములోననే అంతర్గతమగును. ఇందువలననే, ఇక్కడ ఈ జన్మలో ఎవరైతే ఆత్మను తెలుసుకొనునో, వాని జీవితములో సత్యము గలదు ( ఇహ చేదవేదీదథ సత్యమస్తి ) అనియు, దీనికి భిన్నముగా ఆత్మను తెలియనిచో, అది చాల పెద్ద నష్టము ( న చేత్ ఇహ అవేదీత్ మహతీ వినష్టిః ) అనియు ఉపనిషత్తు ఉద్ఘోషించుచున్నది. ఇచటి యుక్తి చాల సరళమైనది. నీవు నీ అనంతత్వమును గురించి పొరపాటు చేసినచో, ఆ నష్టము అనంతము. కావున, ఇట్టి తప్పు ధారణల నన్నింటినీ త్రోసివుచ్చుటకై మనకు మననము ఆవశ్యకమగు చున్నది. వివిధప్రమాణములను వినియోగించుటలో తగినంత కృషిని చేయకుండగా, చెప్పబడిన వచనములనన్నింటినీ సత్యమే అయి ఉండునని అంగీకరించు వారికి ఇట్టి మననము కష్టసాధ్యమే యగును.

దీనిని బట్టి మనకు ఒక సంగతి స్పష్టమగుచున్నది. గురుసంప్రదాయము గలవారై, గురువు వేదాంతమును ఉపదేశించుచుండగా శ్రవణము చేసి, తగినంత వైరాగ్యము గలవారై, జ్ఞానసాధనము ( ప్రమాణము ) లను యోగ్యమగు తీరులో వినియోగించే సామర్థ్యము గల జిజ్ఞాసువులకు బ్రహ్మ-అభిన్నమగు ఆత్మయొక్క జ్ఞానములో నిష్ఠను కలిగియుండుట మిక్కిలి తేలికయగు విషయము. జ్ఞానియొక్క దృష్టిలో వాస్తవమగు ద్వైతము లేదు. ఏలయన, అజ్ఞానావస్థలో జ్ఞాతృ-జ్ఞేయవిభాగముతో కూడిన ద్వైతముయొక్క సత్యత్వము జ్ఞానముచే ఉపమర్దితమగును. తెలుసుకొనే వాడు గాని, తెలియుట గాని, తెలియబడేది గాని చైతన్యము కంటె భిన్నముగా లేవు. కావున, ఆత్మ కంటె భిన్నముగా ద్వితీయ వస్తువు లేదు. చైతన్యముయొక్క దృష్టికోణములో భేదమునకు తావే లేదు. జ్ఞానికి కూడ వ్యావహారిక-అనుభవములు పూర్వమునందు వలెనే కొనసాగుచున్ననూ, వాటికి అతని దృష్టిలో వాస్తవికత ఉండదు. అతని దృష్టిలో ఆత్మ కంటె భిన్నమగు వస్తువు ఏదియూ లేదు. ఈ విషయము గీతలో సర్వత్రా ప్రతిపాదించ బడినది. ఇచట శ్రీశంకరులు ద్వితీయాధ్యాయములోని ఒక శ్లోకమును గుర్తు చేయుచున్నారు. సర్వులకు ఏది పగలో, అది జ్ఞానికి రాత్రి ( యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ). దీనికి విలోమముగా

చెప్పాలంటే, గురుసంప్రదాయము కలిగి,శాస్త్రమును యథాతథముగా విశ్లేషణ చేయగలిగే జిజ్ఞాసువులకు శాస్త్రతాత్పర్యము పగలు వలె సుస్పష్టముగా అవగతమగుచుండును. సూర్యుడు ఇంకనూ ఉదయించినాడా ? లేదా ? అను విషయమును తెలియుటకై ఇతరులను సంప్రదించ బని లేదు. సూర్యుడు సుస్పష్టముగా గోచరించుచునే యుండును. అటులనే, వీరికి స్వయంప్రకాశమగు ఆత్మ పగలు వలె సుస్పష్టముగా గోచరించుచుండును. ఈ అర్హతలు లేని ఇతరులకు ఆత్మజ్ఞానము చీకటి రాత్రి వంటిది. ఈ తీరున ఇచట రెండు దర్శనములు గలవని శ్రీశంకరులు వివరించిరి. ఒక దృష్టికోణములో దీనికంటె తేలికయైనది మరియొకటి లేదు. కాని సరియగు సంసిద్ధత లేనిచో, దీనికంటె కష్టమైనది మరియొకటి లేదు.

కావున, బాహ్యరూపములలో గోచరించే భేదమును త్రోసిపుచ్చుటయే ఆత్మస్వరూపజ్ఞానమునకు సాధనమగును. బాహ్యపదార్థమును దర్శించే మనస్సులో సమస్య లేదు: ఈ దర్శనము ఆత్మజ్ఞానమునకు విరోధి కాదు. కాని ఈ బాహ్య-అంతరవిభాగము, అనగా ఈ పదార్థము బాహ్యమునందు ఉండగా నేను దానిని దర్శించుచున్నాను అనే ఈ భేద బుద్ధి మాత్రమే సమస్య యగుచున్నది. దీనిని మాత్రమే నిర్మూలించ వలయును. అవివేకమునుండి పుట్టిన ఈ ద్వైతనిర్ణయమును త్రోసిపుచ్చుట వలన ఆత్మజ్ఞానము ఉదయించుట మాత్రమే గాక, ఆత్మస్వరూపముయొక్క జ్ఞానమునందు నిష్ఠ కుదురును. కావున, మనకు కావలసినది భేదబుద్ధినిరాకరణము మాత్రమే. ఎందువలన ? ఎవ్వరికైననూ ఏ కాలమునందైననూ ఆత్మ దూరముగా లేదు. సర్వులకు ఆత్మ నిత్యసిద్ధమై యున్నది. కావున, ఆత్మను చేరుకొనుట, లేదా సంపాదించుట అనే ప్రసక్తి లేదు. ఆత్మను పరిత్యజించుటయు సంభవము కాదు. నీకు తెలిసినా, తెలియక పోయినా, ఆత్మ నీవే. నీవు చేసే సర్వక్రియలు ఆత్మ కొరకు మాత్రమే ఉద్దేశించ బడినవి. మానవుడు సంపాదించే సర్వపదార్థములు మరియు మానవుని సర్వవిధములైన అన్వేషణలు ఆత్మ కొరకు మాత్రమేననీ శ్రీశంకరులు తరువాత వివరించ గలరు. ఆత్మజ్ఞానమును విరోధించే వ్యక్తి విషయములో కూడ పరిస్థితి ఇదియే.

కావున, ఆత్మ అందరి వద్ద ఉన్నది. అది అందరికీ ప్రసిద్ధమై యున్నది. కాని వ్యక్తి తన గురించి తాను చేసుకున్న నిష్కర్షలు మనస్సునకు చెందినవే గాని, ఆత్మకు చెందినవి కావు. కొందరు ఆత్మను గురించి విచారించి తప్పు నిర్ణయములకు రాగా, మరి కొందరు విచారించకుండగనే తప్పు నిర్ణయములను చేయుచున్నారు. వీరిద్దరిలో అధికమగు భేదము లేదు. మనము ఆత్మను గురించి తప్పు నిర్ణయములతో కొన్ని తరముల నుండి జీవించుచున్నాము. ఇంతలో ఒక మహాత్ముడు వచ్చి, మన తప్పును ఎత్తి చూపినాడనుకొనుడు. మన మౌఢ్యమును మనము అంగీకరించుటలో ఇబ్బంది ఎదురగుట సహజమే. కాని వాస్తవములో , ఎవరైతే ఈ తప్పు నిర్ణయములను పట్టుకొని వ్రేలాడుచుండునో, వారే మూఢుడగును. ఇంతకాలము వరకు తాను మూర్ఖుడనైతినని అంగీకరించే వ్యక్తియే యథార్థముగా తెలివైనవాడు మరియు ధైర్యవంతుడు అగును. ధైర్యమనగా నిదియే. ఆ ధారణలపై అతని హృదయము మరియు మస్తిష్కము అంకితమై ఉండిన మాట వాస్తవమే అయినా, 'నేను పొరపడితిని ' అని చెప్పగలిగే గుండె ధైర్యము అతనికి గలదు. బౌద్ధిక

మగు పరిశుద్ధి, అనగా కపటము లేకుండగా ఆలోచించే లక్షణము ( intellectual honesty ) ఇదియే. యథార్థమగు ధైర్యము ఇదియే. ఈ ధైర్యము ఉండుట మంచిది. వివేకము లేకపోవుటచే తప్పు దారిన నడచిన వ్యక్తిని ఈ ధైర్యము మంచి దారిలోనికి తీసుకొని వచ్చును. మనిషి ఆలోచించునట్లు చేయుట పెద్ద సమస్య కాదు. కాని ఆలోచించ గలిగే వ్యక్తి తాను చిరకాలమునుండి గుండె లోతులలో దాచుకున్న నిష్కర్షలను పరిత్యజించుట చాల కష్టము.

కావున, ఆత్మను గురించి మనకు గల తప్పుడు ధారణలను త్రోసిపుచ్చుటను మినహాయించి, మనము ఇచట చేయదగిన పని మరియొకటి లేదు. ఆత్మకు బ్రహ్మతో గల అభేదమును గుర్తించుట యనగా ఈ తప్పుడు ధారణలను తొలగించు కొనుటయే. నీవు పరిచ్ఛిన్నుడవు కాదు ; అనంతుడవు. నీవు మర్త్యుడవు కాదు ; సత్స్వరూపుడవు. నీవు అజ్ఞానివి కాదు ; జ్ఞానస్వరూపుడవు. నీవు బద్ధుడవు కాదు ; ముక్తుడవు. మనకు ఇన్ని తప్పుడు ధారణలు ఉండుట చేతనే, ఆత్మస్వరూపము నిషేధరూపముగా బోధింప బడుచున్నది.

ఎవ్వరికైననూ ఏ కాలమునందైననూ ఆత్మ తెలియనిది ( అప్రసిద్ధము ) కాదు. కావున, భేదభావనలను ఉపమర్దము చేయుట మాత్రమే ఆత్మస్వరూపము తెలిసే ఏకైక మార్గము. ఆత్మ సర్వదా ఉపలభ్యముగ నున్నది. ఏ కాలమునందైననూ ఆత్మ పూర్తిగా తెలియకుండగా లేదు. ఏలయన, ' నేను ' అను పదముయొక్క అర్థము రూపములో ఆత్మ సర్వదా తెలియుచునే యున్నది. జ్ఞానసాధనముచే తెలియదగిన ఒక పదార్థము గలదనుకొనుడు. అది నీకు తెలిసి యుండవచ్చును ; తెలియక పోవచ్చును ; లేదా, తెలిసిననూ మరచియుండ వచ్చును. ఈ వికల్పములు అన్నియు సంభవమే. కాని మన అధీనములోనున్న జ్ఞానసాధనములు వేటికైననూ ఆత్మ గోచరము కాదు. పైగా, దానిని తెలియుటకు జ్ఞానసాధనములతో పని లేదు. ఏలయనగా, ' నేను ఉన్నాను ' అని నీవు అన్నప్పుడు, అది ఆత్మయే. ఈ ఆత్మను మనము కొత్తగా సంపాదించ నక్కర లేదు ; దీనిని మనము పయనించి చేరుకోనక్కర లేదు ; దీనిని మనము కొత్తగా సృష్టించ నక్కర లేదు; దీనిని తెలియుటకు జ్ఞానసాధనములతో పని లేదు. మరియు మనము ఆత్మను పరిత్యజించ జాలము. మనము అనేకములగు పదార్థములను పరిత్యజించ గల్గుతాము ; కాని ఆత్మను ఏ కాలమునందైననూ పరిత్యజించ లేము. ఏలయనగా, పరిత్యజించ వలసినదియే ఆత్మ. ఈ విషయములో జనులు పొరబడుచున్నారు. జనులు అహంకారమును పరిత్యజించ వలెనని తలంచెదరు. కాని పరిత్యజించ వలసినది అహంకారమే గనుక, ఈ అహంకారపరిత్యాగము సంభవము కాదు. అహంకారము మిథ్య అను జ్ఞానము చేత మాత్రమే అహంకారపరిత్యాగము సంభవమగును. కుండయొక్క ఉనికి మట్టిపై ఆధారపడి యున్న తీరున, అహంకారముయొక్క ఉనికి ఆత్మపై ఆధారపడి యున్నది అను జ్ఞానముచే అహంకారము ' పరిత్యజించ ' బడును. దీనికంటె భిన్నముగా అహంకారమును సమర్పించుట అనేది ఏదీ లేదు. ఆత్మసమర్పణము చేయాలని కోరేది అహంకారమే గాని, సచ్చిదానంద-ఆత్మ కాదు. భక్తులు ప్రతిదినము భగవానునకు సంపద, దేహము,

మనస్సు, ఇంద్రియములు మొదలగు వాటిని సర్వమును సమర్పించుచుందురు. ప్రతిదినము సమర్పించుటకు కారణమేమి ? ఒకసారి సమర్పించినచో ఏల సరిపడుట లేదు ? అహంకారము సమర్పించ దగిన పదార్థము కాదు. అది నీవే. అనగా రెండు ఆత్మలు గలవని అభిప్రాయము కాదు. భ్రాంతితో ఉన్నా, లేక జ్ఞానముతో ఉన్నా, ఒకే ఒక ఆత్మ గలదు. నీ దృష్టిలో ఆత్మ సచ్చిదానందము అయినా, లేక అహంకారమే అయినా, అది నీవే అయి ఉన్నది గనుక, దానిని నీవు పరిత్యజించుట సంభవము కాదు. నీవు నీ స్వరూపమైన ఆత్మకు దగ్గర అగుట గాని, దానినుండి దూరముగా పోవుట గాని సంభవము కాదు.

శ్రీశంకరులు ఇంకనూ ఇట్లు వివరించినారు : ఈ ఆత్మయే లేనిచో ( అప్రసిద్ధమ్ ), సర్వవ్యాపారములు చేయువానికి కొరగాకుండా పోవుట ( వ్యర్థాః ) అనే అభీష్టము కాని పరిస్థితి సంప్రాప్తమగును. ఏదో ఒక దానిని పొందుట కొరకు గాని, లేదా మనకు ఇష్టము కాని దానిని పరిహరించుట కొరకు గాని, మనము చేసే సర్వకార్యములు ఉద్దేశించబడి యున్నవి. మనము ఏ పనిని చేసినా, మన కొరకు మాత్రమే చేసెదము. ఒక పనిని మరి యొక దాని కొరకు చేయుట అనే ప్రసక్తి లేదు. కష్టములో నున్న వానికి మనము సాహాయ్యమును చేయుట కూడ మన మనశ్శాంతి కొరకు మాత్రమే. ప్రతి మానవుని హృదయములో దయ గలదు. కావున, ఎదుటి వాని దుఃఖము మన దుఃఖమే యగును. కావున, ఆ దుఃఖమును దూరము చేయబూనుట సహజమే. దానధర్మములతో సహా మానవుని సర్వకార్యములకు కేంద్రము తాను మాత్రమే అగుచున్నాడు. కావున, ఆత్మయే లేనిచో, సర్వారంభములు నిష్ఫలమగును. ఆత్మ లేనిచో, అనగా కర్త గాని భోక్త గాని లేనిచో, ఏ కార్యమునకైననూ ప్రయోజనము మిగిలి యుండదు. మనము పదార్థములను భోగించెదము ; లేదా, భోగము కొరకై వివిధకార్యములను చేసెదము. ఈ కర్త మరియు భోక్త పరస్పరాశ్రితులై సర్వదా కలిసి యుందురు. భోక్త లేనిదే భోగము సంభవము కాదు. భోగమునకు కావలసిన కార్యములను నిర్వహించే కర్త లేనిచో భోగము లేదని వేరుగా చెప్పనేల ? తాను మిగిలి ఉండి భోగించే అవకాశము లేనిచో, కర్త ఏ కార్యమునైననూ చేపట్టడు. సర్వకార్యములలో కర్త ఉండి తీరును. ఈ కర్తృత్వము యథార్థమా ? కాదా ? అనేది వేరే ప్రశ్న. మనము ఇచట కర్తను త్రోసిపుచ్చుట లేదు. ఆత్మ కర్త యను ధారణను మాత్రమే మనము నిరాకరించుచున్నాము. మానవుడు క్రియలను చేయుచుండును ; లేదా, క్రియాఫలమును అనుభవించుచుండును. ఒకే ఆత్మ కర్త గాని, భోక్త గాని అగుచుండును. ఆ ఆత్మయే లేనిచో ( అప్రసిద్ధమ్ ), సర్వక్రియలు పూర్తిగా నిష్ఫలములగును. ఇది సంభవము కూడా కాదు. క్రియలు వ్యర్థమైనచో కానిమ్ము అని నీవు స్వీకరించిననూ, నీవు లేకుండా నీవు క్రియలను ఆచరించ లేవు. ఇది సర్వథా అసంభవము. కావున, ఆత్మ ప్రసిద్ధమై యున్నది. మనము ప్రసిద్ధ-ఆత్మ కొరకు మాత్రమే సర్వవ్యాపారములను ఆచరించుచున్నాము. మన జీవితము వివిధక్రియలతో నిండి యున్నది. అనగా, ఆత్మ నిత్యము ఉపలభ్యముగనే యున్నది. ఇది మనము ఊహించవలసిన వస్తువు కాదు.

శ్రీశంకరులు ఇంకనూ ఇట్లు వివరించిరి : మనము ఈ సర్వకార్యములను దేహము మొదలగు జడపదార్థము కొరకు ఆచరించుచున్నామని చెప్పుటకు వీలు లేదు. నా దేహములోని అనారోగ్యమును తొలగించుట కొరకై నేను వ్యాయామమును చేయుచు

న్నాననుకొనుడు. ఆ వ్యాయామము నా కొరకు ఉద్దేశింప బడినదే గాని, నా శరీరము కొరకు కాదు. నేను సంగీతమును నా కర్ణభేరి కొరకు గాక, నా కొరకు వినుచుందును. ఈ శబ్దములనన్నింటినీ కర్ణభేరి కోరుట లేదు. ఈ సర్వము నా కొరకు మాత్రమే. కావున, మనము చేసే కార్యములన్నియు దేహము మొదలగు జడపదార్థముల కొరకు ఉద్దేశించ బడినవని ఊహించుట యైననూ సంభవము కాదు. దేహమునకు కోరికలు ఏమియూ లేవు. కావున, మనము కార్యములను దేహముయొక్క కోరికలను నెరవేర్చుట కొరకై చేయుట లేదు.

కొందరు ఇట్లు వాదించెదరు : దేహము, ఇంద్రియములు, మరియు మనస్సు అనునవి జడములు. మనము క్రియలను వాటికొరకు చేయుట లేదను మాట యథార్థమే. కాని, మనము క్రియలను ఏదో కొంత సుఖమును అపేక్షించి చేయుచున్నాము గదా ! ఈ వాదము పూర్తి సత్యము కాదు. ' సుఖము ' అనే వ్యక్తి ఒకడు గలడా యేమి ? ఎందువలన ? సర్వవ్యవహారములు ఆత్మను చేరుకొని దానియందు విలీనమగును. మానవుడు తాను సుఖముగా నుండుట కొరకై కర్మఫలమును భోగించ గోరి క్రియలనాచరించుచున్నాడు. కావున, ఈ క్రియలన్నియు సుఖము అనే తత్త్వము కొరకు గాక, తన కొరకు, తన సుఖము కొరకు ఉద్దేశించ బడి యున్నవి. ఆత్మయే సుఖస్వరూపము అన్నచో, అది వేరే సంగతి. కాని, సర్వక్రియలు వ్యక్తియొక్క సుఖము కొరకే గాని, కేవలసుఖము కొరకు గాదు. అదే విధముగా, దుఃఖము కొరకు గాక, దుఃఖనివారణ కొరకై క్రియలు ఆచరించ బడుచున్నవి. సర్వదా సర్వక్రియల చరమలక్ష్యము ( అవసానము ) ఆత్మను చేరుకొనుట ( ఆత్మావగతిః ) మాత్రమే. ఉదాహరణకు నీవు ఒక పుష్పమును చూచితివి అనుకొనుము. పుష్పమునుండి పరావర్తనము చేయబడిన కాంతికిరణములను కన్నులు గ్రహించును. అవి పుష్పాకారములో నుండే మనోవృత్తిని నిర్మాణము చేయును. ఈ మనోవృత్తిలో విషయమగు పదార్థము ఎచటకు వెళ్లి విలీనమగుచున్నది ? సర్వపదార్థములు, అనగా సర్వరూపములు, సర్వశబ్దములు, సర్వరసములు, సర్వగంధములు మరియు సర్వవిధముల స్పర్శలు ఆత్మ చైతన్యముయొక్క పాదముల వద్ద శరణు పొందుచున్నవి. జనులు వివిధరకములుగా నున్నారు. కొందరు ప్రేమతో మాటలాడగా, మరికొందరు పరుషముగా మాటలాడెదరు. ఈ శబ్దములు అన్నియు ఎవరిని చేరుచున్నవి ? ఆత్మను మాత్రమే చేరుచున్నవి. నీకు ఈ సత్యము తెలిసినచో, మధురవాక్యములు గాని, పరుషవాక్యములు గాని వెళ్లి ఆత్మయందు విలీనమగును. అప్పుడు అధికమగు హర్షము గాని, ద్వేషము గాని ఉండవు ( న అభినందతి న ద్వేష్టి ). ఆ ఆత్మ చైతన్యము నేనేనని నాకు తెలియదనుకొనుడు. అప్పుడు ఈ దేహేంద్రియమనస్సంఘాతమునందు నాకు ఆత్మయను భ్రాంతి కలుగును. నేను ఇట్టి అల్పత్వమును నాయందు ఆరోపించుకొని యుండుటచే, ఉల్లాసకరమగు పరిస్థితి కలిగినపుడు నేను గొప్పవాడిననే భావము నాకు కలుగును. అభీష్టము కాని పరిస్థితిలో నేను ప్రతిక్రియకు పూనుకొనుట సహజమగును. జనులు ప్రయోగించే పరుషవాక్యములు తీవ్రమగు స్పందనకు, ప్రతిక్రియకు దారి తీయును. పది మంది నిలబడి యుండగా ' ఓ రామా! ' అని పిలిచినచో, వారిలో ఒకడు వెనుకకు తిరిగి చూడవచ్చును. కాని ' ఓరీ మూర్ఖుడా ! ' అని పిలిచినచో, వారందరు వెనుకకు తిరిగెదరు. ప్రతి వ్యక్తిలో తనను

గురించి తనకు సందేహము ఉండుట చేతనే వారు ఆ పిలుపునకు స్పందించుట జరిగిన ది. మనము దీనిని విశ్లేషిద్దాము. మూర్ఖుడు అనే పదమును మనస్సు గ్రహించినది. ఆ విశి ష్టభావనను చైతన్య-ఆత్మ ప్రకాశింప జేసినది. ఆ పదము మనోవృత్తి రూపములో తన అర్థమును ప్రకాశింప జేసి వెనువెంటనే విలీనమైనది. ఎక్కడ విలీనమైనది ? చైతన్య-ఆ త్మయందు మాత్రమే. కావున, సర్వవ్యవహారములు నీయందు అంతమగును. వాటికి ఏకైక లక్ష్యము ఆత్మయే గాని, మరియొకటి కాదు. ఉదాహరణకు వైదికకర్మవంటి మంచి పనిని చేసినావనుకొనుము. ఆ కర్మఫలము ఎవరికి లభించును ? ఆత్మకు మాత్రమే. పుణ్యము, పాపము, సుఖము, దుఃఖము, దృష్టము, అదృష్టము అనే సర్వకర్మఫలములు ఆత్మను మాత్రమే పొందుచున్నవి. సర్వవ్యవహారముల ఏకైకలక్ష్యము నీవే. ఒక పదార్థమును చూచే సందర్భములో ఆ చూపు చేరుకునే లక్ష్యము నీవే. వినే సందర్భములో, ఆ వినికి డి చేరుకునే లక్ష్యము నీవే. కావున, సర్వకర్మలు అంతిమముగా నిన్ను మాత్రమే చేరును. నీకు తెలిసినా, తెలియక పోయినా, నీకు స్పష్టముగా అవగాహనకు వచ్చినా, రాకపోయి నా, ఆత్మ సర్వదా ప్రసిద్ధముగనే యున్నది. నీవు జ్ఞానివి అయినా, కాకపోయినా, సర్వక ర్మలు సర్వదా నిన్ను మాత్రమే చేరుకొనును. మనము ప్రతి దినము చేసే చిన్న చిన్న పనులతో సహా ఏ పనిని చేసినా, ఆ సర్వము మన స్వీయపరిపూర్తి కొరకు, స్వీయ-ఉప లబ్ధి కొరకు మాత్రమే చేయబడును. నేను ప్రతిదినము ఉదయము పూలదోట కొరకై వాహ్యాళికి పోవుట లేదు. నన్ను చూడనిచో, 'పాపము ! ఆ తోట దుఃఖించునేమో ! ' అను కారణముతో నేను అచటకు నడచి వెళ్లుట లేదు. నేను నడచి వెళ్లేది నా కోసమే. సర్వక ర్మలకు చరమలక్ష్యము ఆత్మ మాత్రమే. దీనిని గురించి ఆలోచించుడు.

జ్ఞానియగు వ్యక్తి సర్వమును ఆత్మరూపముగా చూచును. అతడు ఇతరులకు ఉప కారమును చేయు సందర్భములో, అది అంతయూ ఆత్మ కొరకు మాత్రమే. ఆత్మ కంటె భిన్నముగా ఏదీ లేదు. ' నేను ఇంకనూ సాధించనిది, ఇప్పుడు సాధించ దగినది ఏదీ లేదు ; అయినా, నేను సర్వదా క్రియాశీలుడనై యున్నాను ( నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ) ' అని శ్రీకృష్ణభగవానుడు చెప్పియున్నాడు. ప్రజల ప్రార్థనలను మన్నించి చేసినా, ' ఇది కర్తవ్యకర్మ' అనే భావనతో చేసినా, శ్రీకృష్ణభగవానుని కర్మలు కూడ ఆత్మయందు మాత్రమే విలీనమగును. పైగా, ఈ కర్మలు ఆ ఆత్మను స్పృశించవు ( న మే లింపంతి కర్మాణి ). ' నేను ' అనే ధారణ ( అహంకారము ) కూడ అంతిమ ముగా ఆత్మయందు విలీనమగును.

వివేకము గలవారు ఆత్మజ్ఞాననిష్ఠయందు ఏ విధముగా ప్రతిష్ఠితులై ( సుప్రసిద్ధమ్) యుందురు అనే విషయమును శ్రీశంకరులు ఇచట విస్తారముగా నిరూపించి యున్నారు. వివిధపదార్థముల మధ్యలో నున్న ఒక పదార్థమును నీవు సుస్పష్టముగా తెలియ గోరుచున్నావనుకొనుము. నీ చూపులు ఆ పదార్థముపై కేంద్రితమై దాని రూపమును మన స్సులో నిలుపును. ఆ రూపదర్శనము దానిని ఇతరపదార్థములనుండి వేరు చేయును. దీనికే ప్రమాణపరిచ్ఛేదనము అని పేరు. కన్ను అనే ప్రమాణము తన చూపులో విషయ మగుచున్న ఆ పదార్థపు హద్దులను నిర్ధారించి ( పరిచ్ఛేదనమ్ ), దానిని ఇతరపదార్థము లనుండి వేరు చేసి చూపినది. నా స్థూలదేహమును తెలియుటకు నేను ఏ ప్రమాణమును

వినియోగించ వలెను ? ప్రత్యక్షమా ? లేక, అనుమానమా ? కన్నులు దేహమును చూడ గలవు. సందేహము లేదు. కాని అవి దేహముయొక్క రంగు మొదలైన గుణములను మాత్రమే గ్రహించగలవు. మరియు, అంధునకు కూడ తన దేహము తెలియుచునే యున్నది గదా ! కన్నులు గలవాడైననూ చిమ్మ చీకటిలో తన దేహముకొరకు వెదుకు కొన డు. నా దేహమును ఇతరదేహములనుండి వేరు చేసి చూపుటకు నాకు ఇతరప్రమాణముల ఆవశ్యకత లేదు. ఆ విషయములో నాకు లేశమైననూ సంశయము లేదు. చెప్పులను, గొడుగును, చొక్కాను వెదుగుకొనే రీతిలో మనము దేహముకొరకు వెదుకుట లేదు. ఎవ్వరి కైననూ ఈ సమస్య లేదు. ఎందువలన ? ఏలయనగా, నీవు నిద్ర లేచిన తరువాత సాక్షి రూపుడవగు నీకు నీ దేహము క్షణకాలమైననూ దూరముగా లేదు. నిద్ర పోయే సమయ ములో దేహప్రసక్తియే లేదు గనుక, మనము దేహముకొరకై అన్వేషించుట లేదు. కల గనే సమయములో మనకు ఒక విలక్షణమైన స్వాప్నికదేహము ఉండును. కావున, కలలో కూడ దేహము కొరకై వెదికే ప్రసక్తి లేదు. నిద్రనుండి లేచిన తరువాత మనము దేహము కొరకై వెదుకుట లేదు. ఏలయనగా, మనము పరోక్షముగానున్న పదార్థములను, మరియు కంటి ముందు ఉన్ననూ గుర్తు పట్టని పదార్థములను మాత్రమే వెదికెదము. కాని దేహము విష యములో పరిస్థితి అది కాదు. సాక్షిస్వరూపుడవగు నీకు దేహము సర్వదా తెలియుచునే యుండును. మరియు, స్పర్శ అనే జ్ఞానేంద్రియము దేహమునంతనూ వ్యాపించి యున్న ది. కావున, మానవునకు తన దేహమును ఇతరదేహములనుండి వేరు చేసి చూపుటకై ఇతరప్రమాణముల ఆవశ్యకత లేదు.

స్థూలదేహము తెలియుటకై అనుమానాదిప్రమాణముల అవశ్యకత లేదని చూచి యున్నాము. నీకు ఆత్మ స్థూలదేహముకంటె మరింత దగ్గరగా నున్నది గదా ! అట్టి ఆత్మను తెలియుటకై ఈ ప్రమాణముల ఆవశ్యకత ఎంతవరకు గలదు ? దేహము సాక్షిచే తెలియబడేదే ( సాక్షివేద్యము ) అయినా, నీ ఎరుకలో విషయము అగుచున్నది. కాని ఆత్మ అనగా నీవు మాత్రమే. ఆత్మకంటె అంతరంగమైనది మరియొకటి లేదు. ఆత్మ అంతరంగము అనగా లోపల ఎక్కడనో దాగియుండుననుకోరాదు. దేశకాలములు, సర్వేం ద్రియములు తమ ఉనికిని ఆత్మచైతన్యమునందు మాత్రమే కలిగియున్నవి గనుక, అవి ఆత్మకంటె భిన్నముగా లేనే లేవు. ఆత్మ అంతఃపురములో రాణీగారి వంటిది కాదు. రాణీ గారిని చూచుటకై అనేకద్వారములను, వరండాలను, ద్వారపాలకులను దాటి, తరువాత లోపల ప్రాసాదములో ద్వారములను రక్షించే యువతులను దాటి, అనేకకక్ష్యలను అతిక్ర మించగా, అంతములో రాణీగారి దర్శనము అగును. అదే విధముగా ముందుగా నీవు అన్నమయకోశమును, తరువాత ప్రాణమయకోశమును, మనోమయ, విజ్ఞానమయకోశముల ను, ఆఖరులో ఆనందమయకోశమును అతిక్రమించిన పిదప అక్కడ లోపల ఆత్మ వెలిగి పోతూ కనబడునని భావించుచున్నావా యేమి ? ఇదంతా తప్పు. నీవు ఏ స్థాయిలో ఏ పదార్థమును చూచినా, ఎక్కడ చూచినా, ఆ పదార్థము మరియు ఆ చూపు కూడ తమ ఉనికిని ఆత్మయందు కలిగియున్నవి. ఆత్మకు దూరముగా ఏదీ లేదు. కావున, నీవు శబ్ద మును విన్నప్పుడు, లేదా రూపమును చూచినప్పుడు, మరియు నీకు సర్వకాలములలో కలిగే సర్వానుభవములయందు, నీవు మూర్ఖముగా ఆలోచించే సందర్భములలో,

మరియు నీవు చాల తెలివితేటలతో ఆలోచించే సందర్భాలలో, వీటికి అన్నింటికి, తరంగ ములకు జలము వలె, ఆత్మయే అధిష్ఠానమై యున్నది. అన్నింటికంటె ' అంతరంగము నందు ఉండే ( అంతరతమః )' ఆత్మ సర్వమునకు అధిష్ఠానమై యున్నది. కాని ఆత్మ స్వయముగా మరియొక ఆశ్రయమును అపేక్షించదు. ఆత్మ చెవికి చెవి ( శ్రోత్రస్య శ్రోత్రమ్ ); కన్నుకు కన్ను ( చక్షుషః చక్షుః ); మనస్సునకు మనస్సు ( మనసః మనః కావుననే, ఆత్మ 'అంతరతమము' అని చెప్పబడినది. అట్టి ఆత్మను గుర్తించుటకు ప్రత్య -అనుమానాది ప్రమాణములతో పని లేదు. ఆత్మను గుర్తించుటకు వేదముతోనైననూ పని లేదు. ఎందువలన ? ఏలయనగా, సర్వజ్ఞానములు ఆత్మమూలకముగనే కలుగుచున్నవి. కావున, వివేకము గల జనులు అనాత్మను నిషేధించుట ద్వారా ఆత్మస్వరూపజ్ఞానము యొక్క నిష్ఠయందు చాల చక్కగా ప్రతిష్ఠితులై యుందురు.

ఇంతేగాక, జ్ఞానము సర్వదా ఉన్నదని మనము అంగీకరించవలెను. చైతన్యరూప మగు జ్ఞానమునకు ఆకారము లేదు ( నిరాకారమ్ ). సాధారణముగా జ్ఞానమునకు ఒక ఆకారము, ఒక విషయము ఉండును ( సాకారమ్ ). విషయము లేని జ్ఞానము ( నిరాకారం జ్ఞానమ్ ) తెలియబడజాలదని ( అప్రత్యక్షమ్ ) కొందరు వాదింతురు. ఈ వాదమునను సరించి సర్వథా నిరాకారము మరియు శుద్ధచైతన్యము అగు ఆత్మను తెలియుట అసంభవ ము. ఈ వాదమును స్వీకరించు వారు కూడ జ్ఞానము సర్వదా ఉండుననియు, పదార్థజ్ఞా నము సర్వకాలములలో ఈ జ్ఞానము ద్వారా మాత్రమే సాధ్యమగుననియు అంగీకరించ వలెనని శ్రీశంకరులు వివరించినారు. పదార్థజ్ఞానము కలుగుటను బట్టి నిరాకారజ్ఞానము సర్వకాలములలో ఉన్నదని సూచితమగుచున్నది. ఉదాహరణకు ఘటజ్ఞానము కలగాలంటే ఈ నిర్విశేషజ్ఞానము ఉండి తీరాలి. ఏలయనగా, ఘటమనగా నామరూపములను జోడిం చిన చైతన్యము తక్క మరియొకటి కాదు. ఈ ఘటజ్ఞానము కలుగుటకై ఏ రకమైన నామ రూపసంబంధము లేని మరియొక జ్ఞానము ఉండి తీరవలెను. ఆ జ్ఞానము కూడ సాకార మైనచో, ఆ ఆకారము ఘటముపై ఆరోపితమై ఆ 'ఘటజ్ఞానము' దోషయుక్తము అగును. కావున, నిర్విశేషజ్ఞానము లేనిదే పదార్థజ్ఞానము కలిగే సంభావనయే లేదు. ఆ నిరాకార చైతన్యము సర్వపదార్థములతో జతగూడుచుండును. కావున, పదార్థజ్ఞానమనగా నిర్విశేష చైతన్యముతో పదార్థము అనబడే దాని కలయిక తప్ప మరియొకటి కాదు. కావున, నిర్విశే షచైతన్యము లేనిదే పదార్థముల యెరుక సంభవము కాదు. కావున, నిర్విశేష చైతన్యము నిత్యసిద్ధమై ( ప్రసిద్ధమ్ ) యున్నది. శ్రీశంకరులు దానిని సుఖదుఃఖముల ఉనికితో పోల్చి రి. వ్యక్తి తన సుఖదుఃఖములను తెలియుటకై ఇతరప్రమాణములను వినియోగించ వల సిన ఆవశ్యకత లేదు. వాటి ఉనికి మానవునకు తెలియుచునే యుండును. అదే విధముగా, ఆత్మయొక్క ఉనికి నీకు సర్వదా తెలియుచునే యుండును. దాని కొరకై ప్రమాణములతో పని లేదు. జ్ఞానసాధనము, జ్ఞేయపదార్థము ఇత్యాది వ్యవహారము అంతయు ఆత్మయొక్క సన్నిధియందు మాత్రమే సంభవమగుచున్నది.

శ్రీశంకరులు దీనిని ఇంకనూ ఇట్లు వివరించిరి : చైతన్యము సర్వదా ఉపలభ్య ముగా లేనిచో, దేనినైననూ తెలియవలెననే కోరికయే పుట్టదు. ఏలయన, జ్ఞాత లేనిదే తెలి యవలెననే కోరికకు ఆలంబనము లేకుండును. ఆత్మ నీకు అసలే తెలియనిచో, ఆత్మ

స్వయంప్రకాశము కానిచో, దానిని గురించి విచారించేది ఎవరు ? విచారమును చేసేది ఆత్మచైతన్యము మాత్రమే కదా ! కావున, ఆత్మ లేనిచో, ఆత్మచైతన్యముతో సహా దేనినైననూ తెలియవలెననే కోరికకు ఆలంబనము లేకుండును. 'నాకు చైతన్యమును తెలియవలెననే కోరిక గలదు' అని చెప్పుటకై నీవు చేతనుడవై యుండవలెను. ' నేను తెలియగోరే పదార్థమే చైతన్యము ; ఘటము వలె చైతన్యము కూడ నా కోరికలో విషయము అగుచున్నది ' అని ఒక వాది చెప్పినాడనుకొనుడు. అపుడాతనిని మనము ఒక ప్రశ్న వేయవలెను : ఈ తెలియ గోరువాడు చేతనుడా ? కాదా ? తెలియ గోరు వ్యక్తి ఎవడైనా జడుడు కాజాలడు. కావున, ఆ వ్యక్తి చేతనుడని అంగీకరించ వలయును. ఈ వ్యక్తి చేతనుడై యుండగా, ఆ చైతన్యము జ్ఞానసాధనములో విషయము ఎట్లు కాగల్గును ? ఆ చైతన్యమును ప్రమాణము ద్వారా తెలియుట ఎట్లు సంభవమగును ? చైతన్యము విచారము చేయువాని స్వరూపమై యున్నది గనుక, అది వాని కోరికలో విషయము అగుట సంభవము కాదు. బ్రహ్మను తెలియాలనే కోరిక ఉండుట సంభవమే. అందువలననే, మనకు 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అను సూత్రము గలదు. కాని ఆత్మను తెలియాలనే కోరిక సంభవము కాదు. ఆత్మ విచారమునకు విషయము కాజాలదు. దేనిచే వ్యక్తి సర్వమును తెలియగల్గుచున్నాడో, ఆ చైతన్యమే ఆత్మ.

మనమీ విషయమును మరింత లోతుగా పరిశీలించెదము. ఆత్మయొక్క స్వరూపమగు ఈ చైతన్యము స్వయంప్రకాశము కానిచో, ఏమగును ? అప్పుడు మనకు ఇతరపదార్థముల వలె దీనిని కూడ తెలియవలెననే కోరిక ఉండును. ఆత్మచైతన్యము తెలియ బడనిచో, అప్పుడు అది తెలియ దగిన పదార్థము అగును. అప్పుడు దానిని తెలియుటకు ఒక ప్రమాణము అవసరమై యుండెడిది. మనము ఘటమును తెలియగోరి విచారమును చేసినట్లే, చైతన్యము కూడ మన విచారములో విషయమై మనచే ఒక పదార్థరూపములో తెలియబడెడిది. కాని ఇది వాస్తవమా ? కాదు. చైతన్యము తెలియని వ్యక్తి ఉన్నచో, ఆ వ్యక్తి జడమై యుండెడివాడు. ఆ వ్యక్తి జడమైనచో, ఆతనిలో దేనినైననూ తెలియాలనే కోరిక ఎట్లు ఉండగల్గును ? ఘటమునైననూ తెలియాలని కోరని జడము చైతన్యమును తెలియాలని కోరదని వేరుగా చెప్పవలయునా ? చైతన్యము ఆత్మయొక్క స్వరూపము. ఈ విషయములో ఎవ్వరికైననూ సందేహము లేదు. ఎవరైననూ బాగుగా ఆలోచించి, తాను అచేతనుడనని నిర్ణయించిననూ, అట్టి నిర్ణయమును చేతనపురుషుడు మాత్రమే చేయగల్గును. జడపదార్థము తాను జడమని గాని, చేతనమని గాని నిర్ణయించబోదు. కావున, మనము చైతన్యమును గురించి విచారము చేయము గనుక, చైతన్యము స్వయంప్రకాశమని స్పష్టమగుచున్నది.

కొందరు దేహేంద్రియమనస్సంఘాతమునకు అతీతముగా పరమచైతన్యము ఒకటి గలదని విశ్వసించి, దానికొరకై పరమగంభీరముగా అన్వేషించుచుందురు. వారు అనంత కాలము అన్వేషించినా, అది వారికి దొరకదు. ఏలయన, ఒకే ఒక చైతన్యము గలదు ; అది అన్వేషించు వాడే. కావున, చైతన్యము తెలుసుకోవాలనే కోరికలో విషయము కాదు గనుక, అది పూర్ణముగా స్వయంప్రకాశము. చైతన్యము లేని ప్రాణి లేదు. దోమకు కూడ తనకు తాను తెలియుచుండును. దానికి 'దోమ' అనే పదము తెలియక పోవచ్చును. కాని

దోమ పరిమాణము గల పురుగులు అనేకములు ఉన్ననూ, అది సాటి దోమలను చక్కగా గుర్తించును. ఆ స్థాయి వరకు అది తనను తాను తెలుసుకొను చుండును.

ఈ తీరున చైతన్యము నిత్యసిద్ధము గనుక, జ్ఞాత కూడ నిత్యసిద్ధుడేనని శ్రీశంకరులు వివరించిరి. ఒక పదార్థమును తెలియగోరు వ్యక్తిలో చైతన్యము జ్ఞాత రూపములో నిత్యసిద్ధముగనే యున్నది. ఆ జ్ఞాత ఆ పదార్థమును తెలియుటకై యోగ్యమగు జ్ఞానసాధనమును వినియోగించును. ఉదాహరణకు నీవు ఒక రూపమును, లేక రంగును చూడగోరితివనుకొనుము. నీవు ఏమి చేసెదవు ? నీవు కన్నులను మూసుకొని చెవులతో రంగును చూడాలని అనుకోవు. రంగును చూచుటకై కన్నులు యోగ్యమైన జ్ఞానసాధనమని నీకు తెలియును. కావున, నీవు సర్వదా కన్నులను తెరచి ఉంచెదవు. జ్ఞానసాధనమును వినియోగించే వ్యక్తి ఎవరు ? జ్ఞాతయే. జ్ఞాతయందు చైతన్యము గలదు. కావున, జ్ఞాత కూడ తెలియబడనివాడు కాడు ; అనగా జ్ఞాత ప్రసిద్ధుడే. జ్ఞాతను తెలియుటకై ఎవ్వరికైననూ జ్ఞానసాధనముయొక్క ఆవశ్యకత ఉండదు. ఏలయనగా, ఒక పదార్థమును తెలియవలసిన సందర్భములన్నింటిలో జ్ఞాత సంసిద్ధముగా లేని సందర్భము లేనే లేదు. తెలియవలసిన పదార్థము ఉపస్థితము కాగానే, చైతన్యము జ్ఞాత అనే స్థాయిని దాల్చును. కావున, చైతన్యమే జ్ఞాత అయినట్లుగా భాసించును.

పైన చెప్పిన కారణములచే ఆత్మజ్ఞానము కొరకై ప్రత్యేకమగు ప్రయత్నమును చేయనవసరము లేదని చెప్పి శ్రీశంకరులు ఈ ప్రకరణమును ఉపసంహరించిరి. వాస్తవములో ఏ జ్ఞానమునకైననూ ప్రయత్నము ఆవశ్యకము కాదు. జ్ఞేయవస్తువు మరియు జ్ఞానసాధనము సిద్ధముగా నున్నచో, ప్రయత్నము లేకుండగనే జ్ఞానము కలుగును. వ్యావహారిక జ్ఞానములలో కనీసము ప్రమాణవ్యాపారము ఆవశ్యకమగుచుండును. కాని వ్యక్తికి తాను చేతనుడని తెలియుటకు ప్రమాణవ్యాపారముతోనైననూ పని లేదు. కాని, ఆత్మ బ్రహ్మ-అభిన్నమనియు, బ్రహ్మ అనగా చైతన్యము మాత్రమే ననియు శాస్త్రము చెప్పుచున్నది. ఈ సత్యమును తెలియుటకు ఆత్మనుండి అనాత్మభావనలను తొలగించుకున్నచో చాలునని శ్రీశంకరులు చెప్పుచున్నారు. ఆత్మ బ్రహ్మయే. కాని, ఆత్మ బ్రహ్మకంటె భిన్నమని తలంచినచో, ఆత్మ అబ్రహ్మ యగుట సహజమే. కావున, మనము అనాత్మయందు 'నేను' అనే ధారణను చేయకున్నచో చాలును. మనము చేసే విచారము అంతయు అనాత్మయందు ఆత్మబుద్ధిని త్రోసిపుచ్చుటకొరకు మాత్రమే ఉద్దేశించబడినది. సంశయనివారణకొరకై మనము చేసే మననముయొక్క ప్రయోజనము కూడ ఇదియే. మనము బ్రహ్మను కొత్తగా నిర్మాణము చేయుట లేదు. మరియు మనము ఆత్మచైతన్యములో మెరుగులు దిద్ది దానిని బ్రహ్మగా తీర్చి దిద్దే ప్రయత్నమును చేయుట లేదు. స్వరూపము చేతనే అనంతము, సద్ఘనము మరియు శుద్ధచైతన్యము అగు బ్రహ్మ ఆత్మయే. కావున, నిషేధరూపమగు జ్ఞానము మాత్రమే ఇచట అపేక్షించ బడుచున్నది. ఆత్మనుండి అనాత్మధారణలను జారవిడచిన చాలును.

ఈ లోకములో పైకి ఎత్తుట కష్టమా ? లేక, జారవిడచుట కష్టమా ? పైకి ఎత్తుటయే కష్టము. జారవిడచుట అత్యంతసరళము. ఇప్పుడు మీరు నాకు ఒక సంగతిని చెప్పుడు. మీకు సంసారము మంచిదా ? చెడ్డదా ? సంసారము మీకు మంచిగా నున్నచో,

దానిని జారవిడచుట కష్టము. కాని, సంసారము కాలిపోతున్న కాయవలె నున్నచో, దానిని జారవిడచుటలో కష్టము ఏమున్నది ? జారవిడచుటకు ఏమి ప్రయత్నము కావలెను ? జారవిడచుటకై ఇతరులను సంప్రదించవలెనా యేమి ? సంసారము దుఃఖముతో నిండి యున్నచో, దాని గురించి నీవు ఏమి చేయవలెను ? విడిచిపెట్ట వలెను. దీనిలో ఇబ్బంది ఏమి ఉన్నది ? ఆత్మను గురించి మనకు గల ధారణలను అన్నింటినీ కాలే ఇటుకలను వలె జారవిడువ వలెను. ఇందువలననే, జ్ఞాననిష్ఠను సంపాదించుట అత్యంతసులభమని ( సుసంపాద్యా ) శ్రీశంకరులు అంతములో చెప్పిరి. దానిలో క్లేశము లేశమైననూ లేదు.

కాని, మనస్సు మనకు హితమును చేయునవి కావని స్పష్టముగా తెలియుచున్న విషయములను కూడ పట్టుకొని వ్రేలాడుచుండునని తోచును. ముట్టుకుంటే కాలే వేడి ఇటుకను చేతితో పట్టుకొని, ' ఏమి చేయాలి ? ఇది చాల వేడిగా నున్నది ; చేయి కాలిపోవుచున్నది' అని గట్టిగా ఫిర్యాదును చేస్తూనే దానిని విడువకుండగా పట్టుకొని ఉండే జనులు ఈ లోకములో లేకపోలేదు. ' నేను పారవేద్దామనుకున్నా అది నన్ను విడుచుట లేదు' అని వీరు చెప్తారు. మన మనస్సులు పని చేసే తీరు ఇటులనే ఉండునని తోచును. బాహ్యపదార్థములను మనము పట్టుకున్నామా ? లేక, అవియే మనలను పట్టుకున్నవా ? అను విషయము తెలియకున్నది. దీనికి ఒక దృష్టాంతము గలదు. ఒకడు నది ఒడ్డున కూర్చుండెను. ఆ నది లోతైనది. దానిలో నీరు నిండుగా నుండెను. అతడు ఆవలి ఒడ్డునకు చేరవలెను. కాని అతనికి ఈత రాదు. ఇంతలో నదీవేగములో ఒక వస్తువు కొట్టుకొని వచ్చుచుండెను. అది అతనికి దుంగవలె కానవచ్చెను. అతడు వెంటనే ఆనందముతో నీటిలోనికి దిగి దానిని పట్టుకొనెను. దాని సాహాయ్యముతో అతడు ఆవలి ఒడ్డునకు చేరాలని కాంక్షించెను. కాని ఇంతలో అతడు పట్టుకొని ఉన్న దుంగ తన రెండు చేతులతో అతనిని పట్టుకొనెను. అతడు దుంగను లాగబోగా, ఆ దుంగయే అతనిని లాగజొచ్చెను. అతడు పట్టుకున్నది ఎలుగుబంటి ! ఏది తన సమస్యకు పరిష్కారమని అతడు భావించెనో, అది అతనికి మరింత క్లిష్టమైన సమస్య ఆయెను. అపుడాతడు దాని పట్టునుండి విడిపించు కోవాలని ప్రయత్నించెను. కాని అది అంత తేలిక కాదు. అతడు దానిని విడిచిపెట్ట లేడు ; దానితో ముందుకు సాగలేడు. దీనికే సంసారమని పేరు.

ఆత్మస్వరూపము స్వయంప్రకాశము. బ్రహ్మస్వరూపము కూడ అదియే. అయిననూ, మనము మనకు గల ధారణలను పట్టుకొని వ్రేలాడెదము. సత్యం జ్ఞానం అనంతం శుద్ధబుద్ధముక్తస్వభావమ్ మొదలైన పదములతో మనము బ్రహ్మాత్మను వర్ణిస్తాము. ఈ పదములన్నియు మనకు అనాత్మలయందు గల ఆత్మభ్రాంతిని తొలగించుటకు మాత్రమే ఉద్దేశించ బడినవి. బ్రహ్మలక్షణములగు ఈ పదములకు అనాత్మను ఆధారముగా చేసుకొని మనము ఆత్మపై ఆరోపించిన వివిధధారణలను నిషేధించుటయే ప్రయోజనము. మనము అనాత్మధర్మములను ఆత్మపై మరియు ఆత్మధర్మములను అనాత్మపై ఆరోపించినాము. ఈ మోహమును తొలగించి పరిస్థితిని చక్కదిద్దవలసి యున్నది.

ఈ సర్వమునందు విడిచిపెట్టుట తక్క మరియొకటి లేదు. మనకు విడిచిపెట్టే సామర్థ్యము గలదు. అయిననూ, మనము సమస్యలను ఎదుర్కొనుచున్నాము. తమకు ఈ ఉపదేశము చక్కగా తెలిసినదనియు, కాని ఇంకనూ తమలో దుఃఖము ఉన్నదనియు చాల

మంది నాతో చెప్తూ ఉంటారు. ఇచట దుఃఖమనగా మానసికమే గాని శారీరకము కాదు. దీనికి కారణము విడిచిపెట్టలేక పోవుటయే. తమకు దుఃఖమును కలిగించు విషయమును వారు ఏల విడువ లేకున్నారు ? వారికి విడువ వలెననియే ఉన్నది. దుఃఖము ఎవ్వరికైననూ అభీష్టము కాదు. మానసికదుఃఖమును కలిగించునది ఏది ? ఒక విశిష్టమగు ఆలోచనాధోరణి మాత్రమే దుఃఖమునకు హేతువు అగుచున్నది. ఈ ఆలోచనాధోరణిని త్రోసిపుచ్చవలసిన అవశ్యకతయైననూ లేదు. అది ఒక ఆలోచనాపరంపర మాత్రమేనని గుర్తించిన చాలును. అప్పుడు వెంటనే దుఃఖము దూరమగును. ఆ ఆలోచనాప్రవాహమును అటులనే ఉండనిండు. దాని గురించి మీరు చింత చేయకుడు.

ఈ ఉపదేశము తెలిసిన తరువాత కూడ ఒక వ్యక్తి తన ధారణలను విడిచి పెట్టలేని పక్షములో, ఆ జ్ఞానమునకు ఆటంకములు గలవని చెప్పక తప్పదు. మానవమస్తిష్కమునకు తనదైన ఒక పని చేసే తీరు, యుక్తి, మరియు సత్యత్వము గలవు. ఈ సమస్యను అధిగమించుట కొరకై శాస్త్రము మనకు జ్ఞాననిష్ఠ ( జ్ఞానమునకు అంకితులై యుండుట ) అను దానిని బోధించినది. ఆత్మచైతన్యము స్వయంప్రకాశము. ఆ ఆత్మచైతన్యమే బ్రహ్మ. అదియే నా స్వరూపము. ఇది చాల సరళమైన జ్ఞానము. కాని ఈ జ్ఞానము ఉదయించుటలో కొన్ని ఇబ్బందులు ఉన్నవని జిజ్ఞాసువుల అనుభవమును బట్టి తెలియుచున్నది. కావుననే, జ్ఞానము అనే పదమునకు నిష్ఠా అను పదము జోడించ బడినది. నిజం చెప్పాలంటే, ఈ సమస్య యుక్తిసంగతము కానే కాదు. ఆత్మచైతన్యమే బ్రహ్మ. కావున, మనకు ఆత్మ-అనాత్మ-వివేకము ఉన్నచో చాలును. జ్ఞానసాధనము (ప్రమాణము) అగు శాస్త్రము ఆత్మ బ్రహ్మయేనని స్పష్టము చేయుచున్నది. ఆత్మ నిత్యము, శుద్ధము, అనంతము, అసంగము మరియు ముక్తము. సర్వముయొక్క అధిష్ఠానసత్యము ఆత్మయే. ఆత్మలేనిదే ఏదీ లేదు. ఈ సర్వజగత్తు బ్రహ్మయై యున్నది. ఆ బ్రహ్మ నీవే. దీనిలో సమస్య ఏమున్నది ? ప్రతి పదము స్పష్టముగా నున్నది. కాని, జిజ్ఞాసువు యోగ్యమగు ఆచార్యుని చేరి ఆయన వద్ద శాస్త్రమును శ్రవణము చేసిననూ, ఆతనికి తెలియ లేదనే ఫిర్యాదు విన వచ్చుచున్నది. దీని అర్థమేమి ? జిజ్ఞాసువులు అందరికీ వారి వారి అనుభవములు గలవు. ఇవి యుక్తియుక్తములు కాకపోయిననూ, ఉన్న మాట వాస్తవము.

ఈ సత్యమును శ్రీశంకరులు గుర్తించినారు ; శాస్త్రము గుర్తించినది ; ఆచార్యులు అందరు గుర్తించినారు. కావుననే, శాస్త్రము ఇట్లు చెప్పుచున్నది : ఓ ప్రియురాలా! ఆత్మను దర్శించవలెను ; వినవలెను ; మననము చేయవలెను ; నిదిధ్యాసనము చేయవలెను ( ఆత్మా వారే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః ). జ్ఞానోదయమునకు శ్రవణమననములు రెండు సరిపడవలెను. ఆత్మ నిత్యప్రసిద్ధమై యున్నది. కాని కర్తగా, భోక్తగా, ఒక్క మాటలో చెప్పాలంటే, సంసారిగా ప్రసిద్ధమై యున్నది. కాని ఆత్మ సర్వదుఃఖవిరహితమైన బ్రహ్మయేనను సత్యమును గుర్తించవలెను. దీనికొరకై శాస్త్రశ్రవణము ద్వారా 'నేను' కాని దాని ( అనాత్మ ) యందు ఉండే 'నేను' అనే ధారణలను విడిచిపెట్టి సర్వసంశయములను నిర్మూలించు కొనవలెను. శ్రు అనే ధాతువునకు విచారించుట (విచారణే ) అను అర్థము గలదు. ఆత్మ బ్రహ్మ అనియు, సంసారి కాదనియు శాస్త్రము చెప్పుచున్నది. ఆ శాస్త్రము పదముల రూపములో నున్నది. కావున, మనము దానిని విశ్లే

షించి తెలుసుకొన వలెను. ఇచట రెండు ఆదేశములు సరిపడును. ఆత్మను దర్శించ వలెను ( ఆత్మా ద్రష్టవ్యః ) అనునది మొదటిది. ఆత్మను గురించి మనకు గల ధారణలు తప్పు అనియు, దానికి పరిష్కారము గలదనియు చెప్పి మనలను సావధానులను చేయుట కొరకై ఈ ఆదేశము ఉద్దేశించ బడినది. ఆత్మ సంసారి యనే భ్రాంతి మనకు గలదు. కావుననే, మనకు ఆత్మను గురించి తెలియవలసిన అవశ్యకత గలదు. అదియే సంసారమునకు పరిష్కారము. ఆత్మను తెలియుటకు మనము ఏమి చేయవలెను ? వినవ లెను ; అనగా శాస్త్రవిచారమును చేయవలెను ( శ్రోతవ్యః ). అది చాలును. శాస్త్రశ్రవ ణము వలన ఆత్మ బ్రహ్మయేనను సత్యము ముందు ఉంచబడును. అనగా ఆత్మను తెలిపే ప్రమాణము సమగ్రముగా నున్నది. ఉదాహరణకు, పారదర్శక ( transparent ) పదార్థము ఒకటి గలదను కొనుడు. అది గాజుపూసయా ? లేక స్ఫటికమా ? ఈ విషయ మును నిర్ధారించుటకు దానిని పరిశీలించ వలెను. దానిని దగ్గరగా చూచి, బరువు మొద లగు ధర్మములను పరిశీలించ వలెను. అది చాలును. పని పూర్తి అయినది. అదే విధము గా, ఆత్మను తెలియుటకై దానిని సరియగు రీతిలో విశ్లేషించ వలెను. దాని కొరకై ఒక అద్దము కావలెను. మామూలు అద్దమును చూచినచో, దేహము ఇత్యాదులు నీవని తేలును. నీకు ఆ సంగతి కొత్త కాదు. అద్దము నా దేహమును గురించి కొన్ని అధికవివరములను చూపగల్గును. కాని భ్రాంతిని కలిగియున్న నాకు నా యథార్థ స్వరూపమును చూపగలిగే అద్దము ఉన్నప్పుడు మాత్రమే ఆ భ్రాంతి తొలగును. అట్టి అద్దము పదముల రూపములో నున్నది. దానికి వేదాంతము అని పేరు. వేదాంతము అనబడే ఈ పదముల అద్దములో చూచినప్పుడు, నాకు కానవచ్చునది ఏది ? సచ్చిదానంద-ఆత్మ. ఈ పదముల అద్దము ద్వారా ఆత్మ పరంబ్రహ్మయే నని నేను గుర్తిస్తాను. తరువాత నేను ఏమి చేయవలెను ? ఆత్మయే బ్రహ్మ యని శాస్త్రము నిరూపించు చున్నది. ఆ జ్ఞానము ఉదయించుటకు ప్రత్యేకమగు శ్రమను పడనక్కర లేదు.

ఈ జ్ఞానము ఉదయించుటకు కష్టపడనక్కర లేని మాట వాస్తవమే అయినా, జనులు శాస్త్రమును శ్రవణము చేసిననూ ఆత్మజ్ఞానమును పొందలేక పోవుట అను పరిస్థి తిని శాస్త్రము గుర్తించినది. కొన్ని సందర్భములలో శ్రవణము వలన సంశయములు అధిక మగును. శాస్త్రమును శ్రవణము చేయుటకు ముందు వ్యక్తికి తనను గురించి కొన్ని సంశ యములు ఉండెడివి. కాని ఆతడు దృష్టిని తన స్వరూపముపై సారించి శ్రవణము చేసిన కారణముగా కొంగ్రొత్త సందేహములు ఉదయించినవా యనిపించును. ఇతరులు తనను ప్రేమించుచున్నారా ? లేదా ? యను సందేహము ఆతనికి పూర్వములో నుండెడిది. కాని ఇప్పుడు ' నేను నన్ను ప్రేమించుచున్నానా ?' అనే నూతనసందేహము దానికి తోడైనది. దీనికి కారణము పూర్తిగా వేదాంతశాస్త్రమే గదా ! ఇది చాల సహజమగు పరిణామము. ఏలయన, వేదాంతము వ్యక్తియొక్క దృష్టిని తన వైపునకు మళ్లించును. నీ స్వరూపము ప్రేమ తక్క మరియొకటి కాదని వేదాంతము బోధిరిచుచున్నది. నిన్ను నీవు ప్రేమించక పోవుటకు కారణమేమియు లేదు. కాని, ఒకాయన ఇట్లు చెప్పుచున్నాడు : 'నాకు నాపై ప్రేమ లేదు ; నా పొడుగు 5' 6" మాత్రమే ఉన్నది ; ఇది నాకు నచ్చలేదు'. దీని అర్థ

మి ? ఈ వ్యక్తికి ఆత్మను గురించి భ్రాంతి గలదు. దేహమే ఆత్మ యని అతని భావన. దేహమే ఆత్మ యైనచో, దానిని ప్రేమించుట ఎట్లు సంభవమగును ? మరియు మనస్సే ఆత్మ యైనచో, నిన్ను నీవు ప్రేమించే ప్రసక్తియే లేదు. నీయందు సర్వజ్ఞత్వాది గుణములు లేవు గనుక, నీవు ఈశ్వరుడవు కాజాలవని అభ్యంతరమును తెలిపే వారు కొందరు లరు. ఆరంభములో నీకు నీ గురించి కొన్ని సందేహములు ఉండెడివి. అవి సరియైనవే యని సామాన్యజనులు సమర్థించెడి వారు. కాని ఇప్పుడు తత్త్వశాస్త్రవేత్తలు, ధర్మాచార్యు మాత్రమే గాక, లక్షల సంఖ్యలో అనుయాయులను కలిగియున్న పెద్ద సంస్థలు కూడ రంగప్రవేశమును చేసి నీపై నీకు గల ఆశంకలను సమర్థింప జూచుచున్నారు. నీవు హ్మవే యను విషయముపై ఇంతమంది అభ్యంతరమును చెప్పుచుండగా, వారి మాటను అంగీకరించాలనే ఒత్తిడి ఏర్పడును. వేదాంతమును వినిన తరువాత, 'బహుశా నేను అంతటి అయోగ్యుడను కాదేమో ' అని నాకు అనిపించినది. నేను అద్భుతమగు త్మనని ఋషులు చెప్పుచుండగా, వారి ఆ అందమైన దర్శనమును త్రోసిపుచ్చి, దానికి రుద్ధమగు నిర్ణయమునకు వచ్చుట నిశ్చితముగా అభీష్టము కాదు. కాని ఈ దర్శనము విరుద్ధముగా ఇంతమంది ఒక్కటియై దండెత్తగా, బహుశా వారిలో ఒకరుగా అగు మంచిది అనిపించును. అట్లు కానిచో, ఒక్కడు అనేకులకు వ్యతిరేకముగా నిలబడ లును గదా ! అట్లు నిలబడినచో, అతడు అద్వయపరబ్రహ్మవలె ఒంటరి వాడు అగు కాని వేదాంతముయొక్క ఉపదేశము పరమసుందరముగా నున్నది. ఏలయనగా, మ్యము నేనే ననియు, నేను ఆనందస్వరూపుడననియు వేదాంతము బోధించుచున్నది. బోధలో కొంత యుక్తి కానవచ్చుట మాత్రమే గాక, అది నా అనుభవమునకు అనురూ ముగా కూడ నున్నది. వ్యక్తి ఎంతటి నిరుత్సాహములో నున్ననూ, చతురోక్తులను విన్న ంటనే విరగబడి నవ్వును. దాని అర్థమేమి ? నా గురించి నాకు గల అంతరాత్మప్రబోధ మును, మరియు వేదాంతతాత్పర్యమును విరోధించే ఈ వివిధవాదములను మనము నిశిత పరిశీలించ వలెను ( మననమ్ ). వేదాంతవచనములు యథార్థమా ? కాదా ? లోతుగా పరీక్షించ వలెను. కావుననే, ఆత్మా వా అరే మంతవ్యః అని శాస్త్రము చెప్పుచున్నది.

' ఆత్మ బ్రహ్మయే నను దృఢవిశ్వాసము నాకు గలదు ' అని అప్పుడప్పుడు ందరు చెప్పుచుందురు. ఆత్మజ్ఞానమునందు దృఢవిశ్వాసము గలవారు అందరు తప్పు ఆలోచనకు బలియైన వారే. పాపమును చేసినచో, నరకము వచ్చును అనే దృఢవిశ్వా సము ఉండవచ్చును. అది సరిగానే ఉన్నది. కాని ఆత్మజ్ఞానమునకు దృఢవిశ్వాసముతో సంబంధము లేశమైననూ లేదు. దృఢవిశ్వాసము ఒకానొక మానసికప్రక్రియ ; ఒకానొక ఆలోచనాధోరణి. దాని వలన వ్యక్తి ఒక విశిష్టజీవనవిధానమునకు కట్టుబడి జీవించును. కాని ఇది దృఢవిశ్వాసమునకు యోగ్యమగు విషయము కాదు. నా స్వరూపము నాకు తెలి యును. అంతే. దానివలన ఏమగును ? సమస్యలు తొలగి పోవును.

కాని — ఇంకనూ మరియొక 'కాని' మిగిలి యున్నది. ' నేను బ్రహ్మనా ? ' అను నది మొదటి ' కాని '. ' అవును ' అని శాస్త్రము చెప్పుచున్నది. శాస్త్రశ్రవణము వలన

ఆ విషయము స్పష్టమైనది. కాని శాస్త్రము నా గురించి చెప్పేది అంతా యథార్థమేనా ? శాస్త్రముయొక్క ఉపదేశమును విశ్లేషించినచో ( మననమ్ ), ఈ సందేహము తొలగిపోవును. అనగా, నేను బ్రహ్మనేనని నాకు తెలిసినది. ఇక సమస్య ఏమి మిగిలి యున్నది ? స్వామీజీ ! నేను బ్రహ్మనేనని నాకు తెలిసినా, నేను బ్రహ్మనే యను విధముగా ప్రవర్తించలేకపోవుచున్నాను. నాకు ఇంకనూ భయము, చింత మొదలగునవి గలవు. నేను బ్రహ్మను అయినచో, నాకు ఆదుర్దా ఉండుటకు కారణమేమి ? చింతలు పుట్టేది అల్పమగు ' నేను ' నుండి మాత్రమే ; విశాలమగు ' నేను ' నుండి కాదు. వాస్తవములో చింత, ఆదుర్దా, ఆందోళన, భయము అను లక్షణములన్నింటికీ మూలము బాల్యమునందు గలదు. కావున, ఇవి చిన్న వ్యక్తిత్వమునుండి మాత్రమే గాక, అతి చిన్న వ్యక్తి యగు బాలుని స్వభావమునుండి ఉద్భవించినవి. వ్యక్తి పెరిగి పెద్దవాడు అయి ఉన్ననూ, ఆ పెద్దరికము వెనుక బాలుడు దాగి యున్నాడు. వ్యక్తికి 40 సంవత్సరముల వయస్సు రాగానే, ఈ బాలుడు మెల్ల మెల్లగా పైకి వచ్చుచుండును. 40 సంవత్సరముల వయస్సు వచ్చువరకు దాగి యున్న ఈ బాలుడు అంతకు మించి దాగియుండ జాలడు. ఈ తీరున, మన అనుభవము మనకు గల జ్ఞానమునకు విరుద్ధముగా పని చేసే ఒకానొక విశిష్టమగు పరిస్థితి ( విపరీత - భావనా ) మనలో పని చేయుచున్నదని తోచును. ఇది కేవలము బాల్యమునుండి సంక్రమించినది. కావుననే, దానికి అలవాటు, లేక కషాయము అని పేరు. దాని మూలము గతములో నున్నది యని తెలుసుకున్న చాలును. దాని పేరు ఏదైనా పరవాలేదు. దానికి వర్తమానముతో సంబంధము లేదు. గతములో పరిష్కరింప బడక మనస్సులో దాగియున్న సమస్యలను వర్తమానములోని ఘటనలు తట్టి లేపును. ఒకనికి ఈ రోజు జరిగిన చిన్న ఘటన వలన తీవ్రమగు కోపము వచ్చినదనుకొనుడు. ఆ కోపము ఆ ఘటనకు అనురూపమైనది కాదు. కారును నడిపే నియమమును ఉల్లంఘించినందులకు ఉరిశిక్ష పడదు గదా ! కోపమునకు, దానిని తట్టి లేపిన ఘటనకు పోలిక లేదనే సంగతి సామాన్యునకు కూడ తెలియుచుండును. దీనికొరకై బ్రహ్మజ్ఞానము ఆవశ్యకము కాదు. కావున, ఆ వ్యక్తిలో గతకాలీనమగు కషాయము ఉన్నదని స్పష్టమగుచున్నది. ఈ సందర్భములో గతము అనగా గత కర్మ కాదు. గతములోని కర్మ మానవునకు కొన్ని పరిస్థితులను సృష్టించును. ఆ పరిస్థితులలో వ్యక్తి తన స్వభావమును బట్టి సుఖదుఃఖములను అనుభవించును. గతమునందలి పాపకర్మ వలన మానవుడు రోగము, ఆపద మొదలైన ఇబ్బందులకు గురియై కష్టముల ననుభవించును. కాని, దుఃఖము వాటినుండి పుట్టదు. దుఃఖము కేవలము మానవుని వ్యక్తిత్వమునుండి మాత్రమే పుట్టును. ఆత్మ బ్రహ్మకంటె భిన్నముగా లేదు. సర్వపరిస్థితులు బ్రహ్మలో విలీనమగును. ఇట్టి స్థితిలో కోపము మొదలగు ప్రతిక్రియలకు ప్రసక్తి ఎక్కడిది ? తాను బ్రహ్మయే అని తెలిసిన జ్ఞాని జీవన్ముక్తుడు ; పూర్ణుడు. అట్టి జ్ఞానికి కోపము వచ్చే ప్రసక్తి లేదు.

ఒకప్పుడు నేను ఇద్దరు స్వామీజీలను కలిసితిని. ఒకాయన వయస్సు 40 దరిదాపులలో నుండగా, రెండవ స్వామీజీ వయస్సు 50 సంవత్సరములు దాటి ఉండెను. వారు వివేకచూడామణిలోని కొన్ని శ్లోకములను గురించి చర్చించుచుండిరి. ఆ శ్లోకములలో జ్ఞాని వర్ణించబడెను. శాస్త్రము ప్రశంస కొరకు మాత్రమే జ్ఞానిని వర్ణించును. ఈ వర్ణనల

ప్రయోజనము ఫలానా వ్యక్తి జ్ఞాని అని నిర్ధారించుటకొరకు కాదు. తాను కూడా జ్ఞాని కావాలనే ఆకాంక్ష మానవుని హృదయములో ఉదయించి అతడు జ్ఞానమార్గములో పయనించునట్లు చేయుట కొరకై ఈ వర్ణనలు ఉద్దేశించ బడినవి. కొన్ని సందర్భములలో జ్ఞాని వర్ణనలో జ్ఞానస్వరూపము కూడ అవగాహనకు వచ్చును. కావున, జ్ఞానిని వర్ణించినచో, ఆత్మవస్తువును వర్ణించినట్లే యగును. ఆ ఇద్దరు స్వాములలో పెద్దాయన జ్ఞానిని వర్ణించే ఇట్టి శ్లోకమును ఒకదానిని వివరించుచుండెను. రెండవ స్వామికి ఆయనకంటె అధికమగు పాండిత్యము గలదు. ' స్వామీజీ ! జ్ఞాని కాని వ్యక్తి జ్ఞానిని గురించి చర్చించుట ఎట్లు పొసగును ? ' అని ప్రశ్నించెను. ఆ పెద్ద స్వామికి తీవ్రమగు కోపము వచ్చెను. 'నేను జ్ఞానిని కానని నీవు ఎట్లు చెప్పగలవు ? ' అని ఆయన కోపపడి అచటనుండి బయటకు వెళ్లిపోవుట మాత్రమే గాక, ఆ స్థానమును శాశ్వతముగా విడిచి వెళ్లెను. ఈ రకమగు సమస్యలన్నింటికీ మూలము బాల్యమునందు గలదు. జ్ఞాని ఎట్లు ఉండును ? జ్ఞాని ఎవరు ? అనునవి ఇచటి చర్చనీయాంశములు కావు. జ్ఞానమనగా నేమి ? అను విషయము మాత్రమే ఇచట విశ్లేషించ బడుచున్నది. ఆత్మయే బ్రహ్మ. ఈ విషయము నీకు తెలియవచ్చును ; తెలియక పోవచ్చును. ఈ విషయములో ఎవరైననూ చెప్పేది ఏమీ లేదు. 'నేను జ్ఞానిని ' అని చెప్పుట అర్థరహితము. ఆత్మ బ్రహ్మయేనని తెలిసిన జ్ఞాని తాను జ్ఞానినని గాక తాను బ్రహ్మనని చెప్పును. ఒకానొక వ్యక్తి జ్ఞానియా ? అజ్ఞానియా ? అను చర్చ వ్యర్థము. జ్ఞానమనగా నేమి ? అను విషయమును మనము బోధనాప్రక్రియ ద్వారా నేర్చుకొని, తెలుసుకొని స్పష్టమగు అవగాహనను పెంపొందించు కొనవలెను. ఒకడు జ్ఞాని యనియు, మరియొకడు కాదనియు నిర్ధారింప బూనుట అర్థరహితము. మన గురించి గాని, ఇతరుల గురించి గాని తీర్పును చెప్పుట మన పని కాదు. కావున, మనము మన గురించి గాని, ఇతరుల గురించి గాని ఏ విధమైన వ్యాఖ్యలనైననూ చేయవద్దు. ఈ విధముగా ఇతరులను అభిశంసించే పనిని మాని మనము నేర్చుకొనే ప్రక్రియలోని ఆనందమును అనుభవించ వలెను. ఇతరులపై తీర్పును చెప్పే ఆవశ్యకత ఏమి గలదు ? జ్ఞానము ఒకానొక శుభముహూర్తములో ఉదయించునని కోరాదు. ఆత్మ నిత్యసిద్ధము. ఆత్మజ్ఞానము ఒక విశిష్టఘటన కాదు. నీవు నిత్యబుద్ధుడవనియు, నిత్యముక్తుడవనియు శాస్త్రము చెప్పుచున్నది. దీనిలో సమస్య ఏమున్నది ? ఒకానొక రోజున ఒక శుభఘడియలో తనకు జ్ఞానము కలిగినదని చెప్పుట ఎట్లు సంభవమగును ? మనకు తెలియని సంగతి హఠాత్తుగా మనకు తెలియునట్లు జ్ఞానము ఉదయించనక్కర లేదు. నీవు నిత్య బుద్ధుడవు.

జ్ఞానియగు తనపై ఇతరవ్యక్తి అజ్ఞాని అనే నిందను వేసిన కారణముగా ఆ స్వామీజీ కోపమును పొందుట యోగ్యముగా లేదు. ఆయన జ్ఞాని యైనచో, పూర్ణుడు మరియు ఆప్తకాముడు అయి ఉండును గనుక, కోపమునకు తావు లేదు అని ఆ రెండవ స్వామి చెప్పుచుండెను. సముద్రములో నీటి బిందువులు పడినచో, ఏమగును ? ఏమీ కాదు. ఆ బిందువు సముద్రములో విలీనమగును. ఇతరులకు కోపమును కలిగించే పరిస్థితులకు ఆప్తకామి యగు జ్ఞానిపై అటువంటి ప్రభావము మాత్రమే ఉండును. జ్ఞాని అఖండ పరంబ్రహ్మస్వరూపుడై ఉండగా, కోపగించు వారు ఏరి ? ఒకచో, జ్ఞానియందు స్పందన

ఉన్ననూ, అది చిరునవ్వు మాత్రమే అగును. ఆయన కొంత ఉల్లాసమును, ప్రేమను మరియు దయను వ్యక్తపరచును. అంతే. కోపమునకు తావు ఏది ? లేనే లేదు. కోపగించు కొనిన ఆ స్వామీజీకి బహుశా శాస్త్రపరిజ్ఞానము ఉండియే ఉండును. శాస్త్రపరిజ్ఞానముతో బాటు అయోగ్యమగు కోపము, అయోగ్యమగు ద్వేషము, అయోగ్యమగు దుఃఖము మిగిలి యున్నచో, దానికే మనము విపరీతభావన యని పేరిడినాము. దీని నివారణ కొరకు మాత్రమే నిదిధ్యాసనము ఉద్దేశించ బడినది. అందువలననే, ఆత్మా వారే నిదిధ్యాసితవ్యః అని శాస్త్రము చెప్పుచున్నది. దీనిని దృష్టిలో నిడుకొని, శాస్త్రము జ్ఞాననిష్ఠకు మరియొక పదమును జోడించినది. ఏ విధమైన ఆటంకములు లేని జ్ఞానమునకు జ్ఞాననిష్ఠ యని పేరు. ఈ పదముయొక్క ఆవశ్యకత యేమి ? ముముక్షువుల అనుభవమును బట్టి ఈ పదము ఆవశ్యకమైనది. ఇది యుక్తియుక్తము కానే కాదు. కాని వస్తుస్థితి అట్లున్నది. ఈ విషయమును గుర్తించని కొందరు ఆచార్యులు సమస్యలతో సతమతమయ్యే జిజ్ఞాసువునకు, ' ఈ సర్వము మిథ్య ; దీనిని త్రోసివుచ్చుము ' అని సలహానిచ్చెదరు. ' నాకు ఇది బాగుండలేదు ' అని శిష్యుడు చెప్పగా, ' ఏది బాగుండలేదు ? నీ దేహమా ? నీ మనస్సా ? ఆత్మయా ? బాగుండక పోయే ప్రసక్తి లేదు. ఇదంతా మిథ్య. దీనిని మరచిపొమ్ము' అని ఆచార్యుడు సలహానిచ్చును. ఇదంతా వాస్తవమే. కాని దీనిని తెలియాలి. సూత్రరూపముగా కొద్ది వాక్యములలో సలహాను ఇచ్చుట వలన ప్రయోజనము లేదు. అట్టి వాక్యములను ప్రయోగించే వానికి తెలిసినది శూన్యము. ఆ వాక్యమును విన్న వానికి ప్రయోజనము సున్న. వారివద్ద కేవలము కొన్ని పదములు ఉన్నవి. ఇదంతా మిథ్య ( మాయా ) అనునది మనము ఆవిష్కరించు కొనదగిన విషయము. దానిని సలహానిచ్చుట వలన లాభము లేదు. సలహా రూపములో దానిని అందజేసినచో, సమస్య సమస్యగనే మిగిలి యుండును. శాస్త్రము ఈ సమస్యను గుర్తించి, దానిని ప్రార్థనాయుతమగు జీవనవిధానము, యోగ్యమగు మానసికప్రవృత్తి మరియు అంతములో నిదిధ్యాసనముల ద్వారా పరిష్కరించే విధానమును మనకు బోధించుచున్నది. మనకు మనగురించి ఉన్న ధారణ మనకు ఆత్మ గురించి తెలిసిన దానికి విరుద్ధముగా నున్నది. నిదిధ్యాసనము ఈ విపరీతభావనను తొలగించి జ్ఞాననిష్ఠకు దారి తీయును.

ఈ జ్ఞాననిష్ఠను పొందుటకు మనము ఏమి చేయవలెను ? ఇక్కడనుండి కొన్ని శ్లోకములు ఆ విషయమును వివరించుచున్నవి. ఆరవ అధ్యాయములో ధ్యానము వర్ణించ బడినది. ఆ విషయమునే ఈ శ్లోకములు కొద్ది మాటలలో సారరూపముగా ప్రస్తావించుచున్నవి.

ఆత్మకు సంబంధించిన జ్ఞానము మూడు రకములుగా నున్నది. ఆత్మయే అనంతమగు బ్రహ్మ అనే సత్యముయొక్క పరోక్షజ్ఞానము మొదటిది. ఇది వాస్తవములో శాస్త్రవచనమునందలి శ్రద్ధయే గాని జ్ఞానము కాదు. ఆత్మస్వరూపము దేహేంద్రియమనస్సంఘాతము కంటె విలక్షణమైనదనియు, ఆత్మకు అనంతబ్రహ్మకు భేదము లేదనియు ఉండే విశ్వాసమే ఈ పరోక్షజ్ఞానము. తరువాత, శాస్త్రమును ప్రమాణరూపములో మన ముందు పెట్టే ఆచార్యుని ఉపదేశమును శ్రవణము చేసినప్పుడు ' బ్రహ్మను నేనే ( అహం బ్రహ్మాస్మి ) ' అనే వృత్తి జ్ఞానము ఉదయించును. శాస్త్రమును శ్రవణము చేయుచుండ

గా, శ్రోతకు ఈ జ్ఞానము సాక్షాత్కరించును. ఈ జ్ఞానమునకు కావలసిన అర్హతలు అన్నియు ఆ వ్యక్తికి ఉన్నచో, ఆటంకములు ఉండవు. ఇది సుస్పష్టమగు అపరోక్షజ్ఞానము. కాని ఈ వృత్తిజ్ఞానము ఆత్మకు సంబంధించినది గనుక, దానికి ప్రతిబంధకములు ండవచ్చును. పదార్థజ్ఞానమైనచో, వృత్తిజ్ఞానము కలగగానే, అది నిశ్చితముగా తెలియుచుండును. దానిలో ఇబ్బంది ఏమియూ మిగిలి ఉండదు. ఆరంభములో ఆ జ్ఞానము కలుగుటలో కొంత ఇబ్బంది ఉండవచ్చును. ఉదాహరణకు, $E = mc2$ అనే సమీకరణమును పరిశీలించుడు. ఇది సామాన్యమగు సమీకరణము కాదు. దీనిని తెలియుటకై భౌతికశాస్త్రపజ్ఞానము అధికముగా నుండవలెను. ఇటువంటి సమీకరణమును తెలియుటలో కొన్ని ్బందులు ఉన్ననూ, ఒకసారి తెలిసిన తరువాత దాని జ్ఞానమునకు ఆటంకములు మియూ ఉండవు. కాని ' నేను బ్రహ్మనే ' అను జ్ఞానము తనకు సంబంధించినది గను అది తెలిసిన తరువాత కూడా, దాని స్పష్టమగు అవగాహనకు కొన్ని ఆటంకములు ండును. ' నేను ' అను విషయములో మనకు గల ఆభిముఖ్యము లేక అలవాటునకు , నేను ' సర్వవిధపరిచ్ఛేదములకు అతీతమైనది అని బోధించే ఈ జ్ఞానమునకు మధ్యలో ర్తి వైరుధ్యము గలదు. శాస్త్రశ్రవణము వలన ఉదయించే వృత్తిజ్ఞానమునకు ఈ హమ్ ఆటంకముగా నిలబడును. దీనికే సప్రతిబంధజ్ఞానము అని పేరు. ఈ ఆత్మజ్ఞానములో ఉండే ప్రతిబంధకములను తొలగించి సుస్పష్టతను పొందుటకై మనము చేసే సాధకు జ్ఞాననిష్ఠ యని పేరు. దీనిలో మనన నిదిధ్యాసనములు భాగము అగుచున్నవి. సాధారణముగా ఈ నిష్ఠకు సన్న్యాసమనే జీవనశైలి తోడుగా నుండును.

ఈ జ్ఞాననిష్ఠను సాధించ వలసిన విధానమును తరువాతి మూడు శ్లోకములు చెప్పుచున్నవి.

**అధ్యాయము 18 , శ్లోకము 51 :**

बुद्ध्या विशुद्धया युक्तो धृत्यात्मानं नियम्य च ।
शब्दादीन् विषयांस्त्यक्त्वा रागद्वेषौ व्युदस्य च ।। ५१ ।।
బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ
శబ్దాదీన్ విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ( 51 ).

విశుద్ధయా = మిక్కిలి స్వచ్ఛమైన, బుద్ధ్యా = బుద్ధితో, యుక్తః = కూడినవారై, చ = మరియు, ఆత్మానమ్ = దేహేంద్రియమనస్సంఘాతమును, ధృత్యా = దృఢనిశ్చయముతో, నియమ్య = నియంత్రించి, శబ్దాదీన్ = శబ్దము మొదలగు, విషయాన్ = ఇంద్రియగోచరములగు పదార్థములను, త్యక్త్వా = విడిచిపెట్టి, చ = మరియు, రాగద్వేషౌ = ఇష్టానిష్టములను, వ్యుదస్య = విడిచి పెట్టి.

మిక్కిలి స్వచ్ఛమైన బుద్ధి గలవారై దేహేంద్రియమనస్సంఘాతమును
దృఢనిశ్చయముతో నియంత్రించి, శబ్దము మొదలగు ఇంద్రియగోచర
ములగు పదార్థములను విడిచిపెట్టి మరియు ఇష్టానిష్టములను
విడిచిపెట్ట వలెను ( 51 ).

**అధ్యాయము 18 , శ్లోకము 52 :**

विविक्तसेवी लघ्वाशी यतवाक्कायमानसः ।

ध्यानयोगपरो नित्यं वैराग्यं समुपाश्रितः ।। ५२ ।।

వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః

ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ( 52 ).

వివిక్తసేవీ = ఏకాంతప్రదేశమునందు నివసించువాడు, లఘ్వాశీ = లఘువుగా భుజించువాడు, యతవాక్కాయమానసః = మాట, దేహము మరియు మనస్సు నియంత్రణలో గలవాడు, నిత్యమ్ = సర్వకాలములయందు, ధ్యానయోగపరః = ఆత్మావలోకనమునకు అంకితమైనవాడు, వైరాగ్యమ్ = వైరాగ్యమును, సముపాశ్రితః = గట్టిగా పట్టుకున్నవాడు.

ఏకాంతప్రదేశమునందు నివసిస్తూ, లఘువుగా భుజిస్తూ, మాటను, దేహమును మరియు మనస్సును నియంత్రణలో నుంచుకొని, సర్వకాలములయందు ఆత్మావలోకనమునకు అంకితమై, దృఢమగు వైరాగ్యమును కలిగియున్నవాడు ( 52 ).

**అధ్యాయము 18 , శ్లోకము 53 :**

अहङ्कारं बलं दर्पं कामं क्रोधं परिग्रहम् ।

विमुच्य निर्ममश्शान्तो ब्रह्मभूयाय कल्पते ।। ५३ ।।

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్

విముచ్య నిర్మమశ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే ( 53 ).

అహంకారమ్ = అహంకారమును, బలమ్ = బలమును, దర్పమ్ = పొగరుమోతు తనమును, కామమ్ = బంధహేతువులగు కామనలను, క్రోధమ్ = కోపమును, పరిగ్రహమ్ = బాహ్యపదార్థములను ప్రోగుచేసే లక్షణమును, విముచ్య = విడిచిపెట్టి, నిర్మమః = మమకారము లేనివాడై, శాంతః = శాంతుడై, బ్రహ్మభూయాయ = బ్రహ్మస్వరూపుడై ఉండుటకు, కల్పతే = సమర్థుడగును.

అహంకారమును, బలమును, పొగరుమోతు తనమును, బంధహేతువులగు కామనలను, కోపమును మరియు బాహ్యపదార్థములను ప్రోగుచేసే లక్షణమును విడిచిపెట్టి, మమకారము లేనివాడై, శాంతుడై, బ్రహ్మస్వరూపుడై ఉండుటకు సమర్థుడగును ( 53 ).

ఈ శ్లోకములలో నిర్దేశించ బడిన లక్షణముల నన్నింటినీ పాటించువాడు బ్రహ్మ ' అగుటకు ' అర్హుడు అగును ( బ్రహ్మభూయాయ కల్పతే ). అనగా, ఆత్మ బ్రహ్మయే నను జ్ఞానమునందు నిష్ఠను పొందుటకు కావలసిన అర్హత లభించును. గీతలో సర్వత్రా చెప్పబడిన వివిధలక్షణములు ఈ మూడు శ్లోకములలో సంగ్రహించ బడినవి.

కొంత కాలము వరకు ప్రార్థనాయుతమగు కర్మయోగజీవనమును గడపిన వ్యక్తికి విశుద్ధమగు బుద్ధి అనుగ్రహించ బడును ( బుద్ధ్యా విశుద్ధయా యుక్తః ). అతనికి తన జీవితలక్ష్యము విషయములో ఇక భ్రాంతికి అవకాశము లేదు. తాను కోరే దాని విషయములో స్పష్టమగు కల్పన ఉండుటచే, అతడు బాహ్యపదార్థములకు వాటికి లేని విలువను అంటగట్టడు ; కావున, వ్యర్థమగు విషయముల వెనుక పరుగులెత్తడు. జీవితలక్ష్యము విషయ

ములో స్పష్టమగు అవగాహన ఉండుట వలన, అతడు రాగద్వేషముల పట్టునుండి విము క్తుడై యుండును.

ధృత్యాత్మానం నియమ్య. యోగ్యమగు మనఃప్రవృత్తి మరియు వివేకము అను వాటి బలముతో కూడిన ధైర్యమునకు ధృతి యని పేరు. ఇచట ఆత్మ యనగా దేహేంద్రి యమనస్సంఘాతము. దేహేంద్రియమనస్సంఘాతముపై అధికారమును, లేక నియంత్ర ణను పొందుట ( నియమ్య ) యనగా, దేహపోషణను ఒక పెద్ద కార్యయోజన రూప ములో చేపట్టకుండగా, దేహమును ఒక వాహనమును వలె వినియోగించు కొనుట. సరి యగు వివేకము, మరియు ఆ వివేకముపై ఆధారపడి పని చేసే సామర్థ్యము లేని వ్యక్తికి దేహమును పోషించుట, ఇంద్రియములకు మరియు మనస్సునకు వాటి సరదాలను తీర్చు చుండుట అనునవి అతి పెద్ద ప్రణాళికలుగా మారి శక్తియుక్తులు అన్నియు దాని కొరకు మాత్రమే వ్యయమగును. జీవితలక్ష్యము కామనాపరిపూర్తి కాదని గుర్తించి, మోక్షపురుషార్థ మునకు అంకితమైన వ్యక్తికి దేహేంద్రియమనస్సంఘాతము తన సాధనకు సహకరించే ఒక వాహనముగా సహకరించును. ఇచట సాధన యనగా జీవనశైలి మరియు నిదిధ్యాసన ము. కావున, దేహేంద్రియమనస్సంఘాతమును నియంత్రించుట యనగా, దానిని కామోప భోగమునకు మాత్రమే వినియోగించ కుండగా, మోక్షమును జీవితలక్ష్యముగా స్వీకరించి, యుక్తిసంగతము మరియు యోజనాబద్ధము అగు జీవితమును గడుపుట అని యర్థము.

మనము ఇచట సన్న్యాసజీవనమును గురించి చర్చించుచున్నాము. ఇంద్రియసుఖ ములను పరిత్యజించుట ( శబ్దాదీన్ విషయాన్ త్యక్త్వా ) దీనిలో భాగము. అనగా శబ్ద-స్ప ర్శ-రూప-రస-గంధములు అనే ఇంద్రియగోచరములగు విషయముల వెంట పరుగులెత్త కుండుట. సన్న్యాసి వాటిని పూర్ణముగా పరిత్యజించ నక్కర లేదు. ఉదాహరణకు, సన్న్యాసి ఆహారమును పరిత్యజించినచో, ఆకలితో మరణించును. సన్న్యాసి జ్ఞాననిష్ఠతో కాలమును గడుపును. దాని కొరకై దేహమును సరియగు రీతిలో నిర్వహించు కొనవలెను. కావున, సన్న్యాసి దేహనిర్వహణకు సంబంధించిన వాటిని మినహాయించి మిగిలిన భోగ ములను పరిత్యజించునని శ్రీశంకరులు ఇచట ఒక టిప్పణిని చేసిరి. సన్న్యాసికి కూడ దేహయాత్రకు సంబంధించిన పదార్థములకు మరియు పరిస్థితులకు సంబంధించినంత వరకు రాగద్వేషములు ఉండును. సన్న్యాసి ఆ రాగద్వేషములను కూడ పరిత్యజించి యుండును. అతని జీవితము పూర్ణముగా జ్ఞాననిష్ఠకు అంకితమై యుండును.

సాధారణముగా సన్న్యాసి భిక్షాటనముచే జీవించును. సన్న్యాసికి ఒక సాధన రూపముగా భిక్షాటన విధించబడినది. సన్న్యాసి వివిధప్రదేశములకు తిరుగుచుండవలెను. అతడు ఒక ప్రదేశములో మూడు రాత్రులను మించి ఉండరాదు. దీని అర్థమేమనగా, అతడు ఒక స్థానమునందు పాతుకొని పోరాదు. కాని, జ్ఞాననిష్ఠకు అంకితమైన వ్యక్తి విష యములో ఈ పరివ్రజనము కూడ ఆగి పోవును. అతడు ఏకాంతములో ( వివిక్తదేశ ) జీవించును. ఈ నిష్ఠను సాధించుటకై అతడు ఒక స్థానములో స్థిరముగా నుండవలెను. వివి క్తదేశమనగా జనులు లేని దేశము ; అనగా చప్పుళ్లు లేని స్థానము. అట్టి స్థానము అడవి గాని, నదుల ఇసుకతిన్నెలు గాని, కొండ గాని, పర్వతగుహ గాని కావచ్చునని శ్రీశంక రులు వివరించిరి. దీని తాత్పర్యమేమనగా, స్థానము ప్రశాంతముగా నుండవలెను. ఇట్టి

స్థానములో నివసించాలనే ప్రవృత్తి కలిగి, అట్లు చేయువాడు వివిక్తసేవీ అనబడును. ఇట్టి వాడు నిదిధ్యాసనప్రధానమగు జీవితమును గడుపును. అట్లు గాక, ఏకాంతప్రదేశమునకు చేరుకొని నిదిధ్యాసనమును చేయలేక పోయినచో, అట్టి వ్యక్తి ఒంటరితనముతో బాధపడు తూ, తోచిన వారందరికీ ఉత్తరములను వ్రాయుచూ, లేదా ఇతరములగు వ్యాసంగముల కొరకు అన్వేషిస్తూ, కాలమును గడుపును. లేదా, అతడు అక్కడనుండి నిష్క్రమించును.

నిదిధ్యాసనమునకు అంకితమై జీవించు వ్యక్తికి శక్తి అధికముగా ఖర్చు కాదు. కావున, అతడు ఆహారమును తక్కువగా భుజించును ( లఘ్వాశీ ). అతడు విందుల నారగించడు ; మరియు పస్తులు ఉండడు. నిదిధ్యాసనమునకు ఈ రెండు పద్ధతులు సరిపడవు. కావున, అతడు లఘువుగా భుజించును. నిదిధ్యాసనమునకు ఆటంకమును కలిగించే నిద్ర మొదలగు వాటి బెడదనుండి తప్పించుకొనుటకై అతడు లఘువుగా భుజించునని శ్రీశంకరులు వివరించిరి. భోజనము అధికమైనచో, అది అరుగుటకై రక్తము అధికముగా ఖర్చు అగును. దాని వలన మస్తిష్కమునకు చాలినంత రక్తము లభించదు. మరియు చేసే పని ఏదీ లేనప్పుడు నిద్ర ముంచుకు వచ్చును. కావున, ఆత్మావలోకనపరమగు జీవితమునకు లఘుభోజనము చాల ప్రముఖము. నిదిధ్యాసనము సిద్ధించుటకై మనస్సు ప్రసన్నముగా, ఆత్మావలోకన క్షమముగా ఉండవలెను.

జ్ఞానమును సంపాదించి దానిని నిష్ఠగా తీర్చి దిద్దుకొన గోరు జిజ్ఞాసువునకు గాని, లేదా తాను సంపాదించియున్న జ్ఞానమును నిష్ఠలోనికి మార్చుకొన గోరు జ్ఞానికి గాని, వాక్కుపై, ఇతరకర్మేంద్రియములపై మరియు మనస్సుపై నియంత్రణ ఉండి తీర వలెను ( యతవాక్కాయమానసః ). ఇది అభ్యాసము చేత మాత్రమే సిద్ధించును. అనగా, అతడు కర్మేంద్రియముల ద్వారా వ్యర్థమగు యాంత్రికచర్యను చేయడు. ఈ నియమమును అభ్యసించుటలో బౌద్ధసన్న్యాసులు నిష్ణాతులు. వారు తమ అవయవముల కదలిక విషయములో మిక్కిలి జాగరూకతతో నుందురు. శరీరావయవముల కదలిక విషయములో ఇట్టి సావధానత చాల ప్రముఖమైన అనుశాసనము. అదే విధముగా, మాటలాడుటపై కూడ కొంత నియంత్రణ ఉండవలెను. ప్రశాంతమగు నిర్జనదేశములో నివసించు వానికి మాటలాడే అవకాశము అధికముగా నుండదు. కాని, ఇట్టి జిజ్ఞాసువునకు మనస్సులో మాటలాడవలెననే ఒత్తిడి ఉండదు. అట్లు గానిచో, అతడు బిగ్గరగా వాగుచుండెడి వాడు. ఏలయనగా, వాగింద్రియనియంత్రణ లేని వ్యక్తి మాటలాడుటకు మనిషి కానరాని పరిస్థితిలో తనలో తాను గాని, లేదా చెట్లతో మరియు పర్వతములతో గాని మాటలాడుటను ఆరంభించుటకు ఎక్కువ కాలము పట్టదు. మాటలాడవలెననే ఒత్తిడి గల వ్యక్తి మాటలాడుటయే మంచిది. లేనిచో, ఆ స్థితి అతనికి హానిని కలిగించును. కావున, వాగింద్రియముపై నియంత్రణ గల వ్యక్తి మాత్రమే వివిక్తసేవి కాగలడు. అతనికి మనస్సుపై కూడ నియంత్రణ ఉండును. కావుననే, కర్మయోగజీవితమును గడిపియున్న సన్న్యాసి కొరకు మాత్రమే జ్ఞాననిష్ఠ ఉద్దేశించ బడినది. సమాజములో యోగ్యమగు మనఃప్రవృత్తితో జీవించిన వ్యక్తికి మాత్రమే ఇటువంటి స్వభావము అబ్బును. ఇట్టి స్వభావమును అలవరచుకున్న పిదప మానవుడు సన్న్యాసజీవనమును చేపట్టినచో, అది అతనికి చాల సుఖమయజీవనము అగును.

ములో స్పష్టమగు అవగాహన ఉండుట వలన, అతడు రాగద్వేషముల పట్టునుండి విము క్తుడై యుండును.

ధృత్యాత్మానం నియమ్య. యోగ్యమగు మనఃప్రవృత్తి మరియు వివేకము అను వాటి బలముతో కూడిన ధైర్యమునకు ధృతి యని పేరు. ఇచట ఆత్మ యనగా దేహేంద్రి యమనస్సంఘాతము. దేహేంద్రియమనస్సంఘాతముపై అధికారమును, లేక నియంత్ర ణను పొందుట ( నియమ్య ) యనగా, దేహపోషణను ఒక పెద్ద కార్యయోజన రూప ములో చేపట్టకుండగా, దేహమును ఒక వాహనమును వలె వినియోగించు కొనుట. సరి యగు వివేకము, మరియు ఆ వివేకముపై ఆధారపడి పని చేసే సామర్థ్యము లేని వ్యక్తికి దేహమును పోషించుట, ఇంద్రియములకు మరియు మనస్సునకు వాటి సరదాలను తీర్చు చుండుట అనునవి అతి పెద్ద ప్రణాళికలుగా మారి శక్తియుక్తులు అన్నియు దాని కొరకు మాత్రమే వ్యయమగును. జీవితలక్ష్యము కామనాపరిపూర్తి కాదని గుర్తించి, మోక్షపురుషార్థ మునకు అంకితమైన వ్యక్తికి దేహేంద్రియమనస్సంఘాతము తన సాధనకు సహకరించే ఒక వాహనముగా సహకరించును. ఇచట సాధన యనగా జీవనశైలి మరియు నిదిధ్యాసన ము. కావున, దేహేంద్రియమనస్సంఘాతమును నియంత్రించుట యనగా, దానిని కామోప భోగమునకు మాత్రమే వినియోగించ కుండగా, మోక్షమును జీవితలక్ష్యముగా స్వీకరించి, యుక్తిసంగతము మరియు యోజనాబద్ధము అగు జీవితమును గడుపుట అని యర్థము.

మనము ఇచట సన్న్యాసజీవనమును గురించి చర్చించుచున్నాము. ఇంద్రియసుఖ ములను పరిత్యజించుట ( శబ్దాదీన్ విషయాన్ త్యక్త్వా ) దీనిలో భాగము. అనగా శబ్ద-స్ప ర్శ-రూప-రస-గంధములు అనే ఇంద్రియగోచరములగు విషయముల వెంట పరుగులెత్త కుండుట. సన్న్యాసి వాటిని పూర్ణముగా పరిత్యజించ నక్కర లేదు. ఉదాహరణకు, సన్న్యాసి ఆహారమును పరిత్యజించినచో, ఆకలితో మరణించును. సన్న్యాసి జ్ఞాననిష్ఠతో కాలమును గడుపును. దాని కొరకై దేహమును సరియగు రీతిలో నిర్వహించు కొనవలెను. కావున, సన్న్యాసి దేహనిర్వహణకు సంబంధించిన వాటిని మినహాయించి మిగిలిన భోగ ములను పరిత్యజించునని శ్రీశంకరులు ఇచట ఒక టిప్పణిని చేసిరి. సన్న్యాసికి కూడ దేహయాత్రకు సంబంధించిన పదార్థములకు మరియు పరిస్థితులకు సంబంధించినంత వరకు రాగద్వేషములు ఉండును. సన్న్యాసి ఆ రాగద్వేషములను కూడ పరిత్యజించి యుండును. అతని జీవితము పూర్ణముగా జ్ఞాననిష్ఠకు అంకితమై యుండును.

సాధారణముగా సన్న్యాసి భిక్షాటనముచే జీవించును. సన్న్యాసికి ఒక సాధన రూపముగా భిక్షాటన విధించబడినది. సన్న్యాసి వివిధప్రదేశములకు తిరుగుచుండవలెను. అతడు ఒక ప్రదేశములో మూడు రాత్రులను మించి ఉండరాదు. దీని అర్థమేమనగా, అతడు ఒక స్థానమునందు పాతుకొని పోరాదు. కాని, జ్ఞాననిష్ఠకు అంకితమైన వ్యక్తి విష యములో ఈ పరివ్రజనము కూడ ఆగి పోవును. అతడు ఏకాంతములో ( వివిక్తదేశ ) జీవించును. ఈ నిష్ఠను సాధించుటకై అతడు ఒక స్థానములో స్థిరముగా నుండవలెను. వివి క్తదేశమనగా జనులు లేని దేశము ; అనగా చప్పుళ్లు లేని స్థానము. అట్టి స్థానము అడవి గాని, నదుల ఇసుకతిన్నెలు గాని, కొండ గాని, పర్వతగుహ గాని కావచ్చునని శ్రీశంక రులు వివరించిరి. దీని తాత్పర్యమేమనగా, స్థానము ప్రశాంతముగా నుండవలెను. ఇట్టి

స్థానములో నివసించాలనే ప్రవృత్తి కలిగి, అట్లు చేయువాడు వివిక్తసేవీ అనబడును. ఇట్టి వాడు నిదిధ్యాసనప్రధానమగు జీవితమును గడుపును. అట్లు గాక, ఏకాంతప్రదేశమునకు చేరుకొని నిదిధ్యాసనమును చేయలేక పోయినచో, అట్టి వ్యక్తి ఒంటరితనముతో బాధపడు తూ, తోచిన వారందరికీ ఉత్తరములను వ్రాయుచూ, లేదా ఇతరములగు వ్యాసంగముల కొరకు అన్వేషిస్తూ, కాలమును గడుపును. లేదా, ఆతడు అక్కడనుండి నిష్క్రమించును.

నిదిధ్యాసనమునకు అంకితమై జీవించు వ్యక్తికి శక్తి అధికముగా ఖర్చు కాదు. కావున, ఆతడు ఆహారమును తక్కువగా భుజించును ( లఘ్వాశీ ). ఆతడు విందుల నారగించడు ; మరియు పస్తులు ఉండడు. నిదిధ్యాసనమునకు ఈ రెండు పద్ధతులు సరిపడవు. కావున, ఆతడు లఘువుగా భుజించును. నిదిధ్యాసనమునకు ఆటంకమును కలిగించే నిద్ర మొదలగు వాటి బెడదనుండి తప్పించుకొనుటకై ఆతడు లఘువుగా భుజించునని శ్రీశంకరులు వివరించిరి. భోజనము అధికమైనచో, అది అరుగుటకై రక్తము అధికముగా ఖర్చు అగును. దాని వలన మస్తిష్కమునకు చాలినంత రక్తము లభించదు. మరియు చేసే పని ఏదీ లేనప్పుడు నిద్ర ముంచుకు వచ్చును. కావున, ఆత్మావలోకనపరమగు జీవితమునకు లఘుభోజనము చాల ప్రముఖము. నిదిధ్యాసనము సిద్ధించుటకై మనస్సు ప్రసన్నముగా, ఆత్మావలోకన క్షమముగా ఉండవలెను.

జ్ఞానమును సంపాదించి దానిని నిష్ఠగా తీర్చి దిద్దుకొన గోరు జిజ్ఞాసువునకు గాని, లేదా తాను సంపాదించియున్న జ్ఞానమును నిష్ఠలోనికి మార్చుకొన గోరు జ్ఞానికి గాని, వాక్కుపై, ఇతరకర్మేంద్రియములపై మరియు మనస్సుపై నియంత్రణ ఉండి తీర వలెను ( యతవాక్కాయమానసః ). ఇది అభ్యాసము చేత మాత్రమే సిద్ధించును. అనగా, అతడు కర్మేంద్రియముల ద్వారా వ్యర్థమగు యాంత్రికచర్యను చేయడు. ఈ నియమమును అభ్యసించుటలో బౌద్ధసన్న్యాసులు నిష్ణాతులు. వారు తమ అవయవముల కదలిక విషయములో మిక్కిలి జాగరూకతతో నుందురు. శరీరావయవముల కదలిక విషయములో ఇట్టి సావధానత చాల ప్రముఖమైన అనుశాసనము. అదే విధముగా, మాటలాడుటపై కూడ కొంత నియంత్రణ ఉండవలెను. ప్రశాంతమగు నిర్జనదేశములో నివసించు వానికి మాటలాడే అవకాశము అధికముగా నుండదు. కాని, ఇట్టి జిజ్ఞాసువునకు మనస్సులో మాటలాడవలెననే ఒత్తిడి ఉండదు. అట్లు గానిచో, ఆతడు బిగ్గరగా వాగుచుండెడి వాడు. ఏలయనగా, వాగింద్రియనియంత్రణ లేని వ్యక్తి మాటలాడుటకు మనిషి కానరాని పరిస్థితిలో తనలో తాను గాని, లేదా చెట్లతో మరియు పర్వతములతో గాని మాటలాడుటను ఆరంభించుటకు ఎక్కువ కాలము పట్టదు. మాటలాడవలెననే ఒత్తిడి గల వ్యక్తి మాటలాడుటయే మంచిది. లేనిచో, ఆ స్థితి ఆతనికి హానిని కలిగించును. కావున, వాగింద్రియముపై నియంత్రణ గల వ్యక్తి మాత్రమే వివిక్తసేవి కాగలడు. ఆతనికి మనస్సుపై కూడ నియంత్రణ ఉండును. కావుననే, కర్మయోగజీవితమును గడిపియున్న సన్న్యాసి కొరకు మాత్రమే జ్ఞాననిష్ఠ ఉద్దేశించ బడినది. సమాజములో యోగ్యమగు మనఃప్రవృత్తితో జీవించిన వ్యక్తికి మాత్రమే ఇటువంటి స్వభావము అబ్బును. ఇట్టి స్వభావమును అలవరచుకున్న పిదప మానవుడు సన్న్యాసజీవనమును చేపట్టినచో, అది ఆతనికి చాల సుఖమయజీవనము అగును.

ఇట్టి వ్యక్తి ధ్యానమునకు పూర్ణముగా అంకితమై యుండును ( ధ్యానయోగపరః ). ధ్యానయోగపరః అను సమాసపదమును రెండు విధములుగా వ్యాఖ్యానించ వచ్చును. ధ్యానప్రధానమగు జీవితము ( ధ్యానయోగము ) నకు అంకితమైన వ్యక్తి ధ్యానయోగపరు డనబడును. లేదా, ధ్యానమనగా ఆత్మస్వరూపావలోకనమనియు, యోగమనగా ఆత్మపై మనస్సును కేంద్రీకరించుట అనియు శ్రీశంకరులు వివరించిరి. శాస్త్రవాక్యములపై మన స్సును కేంద్రీకరించి, వాటి తాత్పర్యమగు నా స్వరూపమును నేను ఆస్వాదించవలెను. ఈ సర్వము ఆత్మయే ( ఇదం సర్వం యదయమాత్మా ) ; ఈ ఆత్మ పూర్ణము ( అయం ఆత్మా పూర్ణః ) ; ఆత్మ శుద్ధము ( ఆత్మా శుద్ధః ) ; ఆత్మ సర్వదా మోక్షమును పొందియే యున్నది ( ఆత్మా నిత్యముక్తః ) ; ఆత్మయే అనంత-బ్రహ్మ ( ఆత్మా పరం బ్రహ్మ ) ; ఆత్మయే సర్వకారణము ( ఆత్మా సర్వస్య కారణమ్ ). ఈ రకమైన శబ్దానువిద్ధసవికల్పస మాధికి ధ్యానమని పేరు. వేదాంతశాస్త్రము అంతయు ఆత్మను గురించి ఉపదేశించుచు న్నది. ఆ ఉపదేశమును మనము ఆత్మకు అన్వయించు కొనవలెను. నేను నా మనస్సును నా గురించి శ్రుతి చేసే ఉపదేశమునందు తల్లీనము చేసినచో, దానికి ధ్యానము అని పేరు. ఆ ఆత్మావలోకనమునందు మనస్సును ఏకాగ్రము చేయుట యోగమనబడును. అనగా మనస్సును పదే పదే ఆత్మవస్తువు వైపునకు మళ్లించి దానియందు స్థిరముగా నుండే ప్రయత్నమును చేయవలెనని దీని యర్థము. ఆత్మవస్తువు మాత్రమే ఏకైకలక్ష్యము అగును. మనస్సు మరియొక దిశలో ప్రసరించినప్పుడు దానిని మరల ప్రయత్నపూర్వక ముగా ఆత్మసంస్థము చేయుట యోగమనబడును.

ఈ విధముగా జ్ఞాననిష్ఠకు అంకితమైన వ్యక్తి ఇతరవిషయములయందు అధికమగు ఆసక్తిని కలిగి యుండడు. ఆతడు ధ్యానయోగమునకు మాత్రమే అంకితమై యుండును. ఆతడు నిత్యము ఆ ధ్యానమునందు ఉండును. అందువలననే, ఈ శ్లోకము సన్న్యాసి కొరకు ఉద్దేశించ బడినది. మరియు నిత్యశబ్దప్రయోగముచే జ్ఞాని మంత్రజపము మొద లగు ఇతరకార్యములను వేటినీ చేయనక్కర లేదని స్పష్టమగుచున్నదని శ్రీశంకరులు వివ రించిరి. ఆతడు సన్న్యాసజీవనమును స్వీకరించి, జ్ఞానమును పొందుట కొరకై భగవానుని కృపను సంపాదించ గోరి విస్తారమగు మంత్రజపమును చేసియున్నాడు. దాని బలము వల ననే ఆతనికి ఆత్మయొక్క యథార్థతత్త్వమును అవలోకించ గలిగే సామర్థ్యము లభించిన ది. కావున, ఆతనికి మంత్రజపము వలన సాధించ దగిన వైయక్తిక ప్రయోజనము మిగిలి లేదు. ఆతని మంత్రజపము జ్ఞాననిష్ఠలో విలీనమైనది. ఈ ధ్యానయోగమునకు అంకిత మైన జీవితమును గడిపే జ్ఞానికి కర్తవ్యములు ఏమియూ మిగిలి యుండవు.

ఈ సర్వము వైరాగ్యము ఉన్నప్పుడు మాత్రమే సంభవమగును. వైరాగ్యమనగా రాగద్వేషముల పట్టునుండి విముక్తిని పొందియుండుట. ఈ వైరాగ్యము తెలిసిన మరియు తెలియని పరిస్థితులకు మరియు పదార్థములకు వర్తించును. జ్ఞానికి స్వర్గమునందైననూ ఆకర్షణ ఉండదు. ఇట్టి మనఃప్రవృత్తికి వైరాగ్యమని పేరు. వైరాగ్యము లేని వ్యక్తి ప్రశాంత మగు స్థలములో కూర్చుండి ధ్యానయోగమునకు నడుము కట్టిననూ, ఆతని మనస్సు నిల బడదు. కాని, వైరాగ్యము గల వ్యక్తి ధ్యానమును తప్ప మరియేమి చేయును ?

ఇంతేగాక, మరి కొన్ని అర్హతలు కూడ చెప్పబడినవి. ఆత్మావలోకనమునకు ఆటంకముగా ఉండే వివిధవిషయములనుండి జ్ఞాని దూరముగా నుండును. వాటిలో మొదటిది అహంకారము. భ్రాంతిచే దేహేంద్రియమనస్సంఘాతమునందు ' నేను ' అను ధారణను కలిగియుండుట, ప్రత్యేకించి కర్తృత్వధారణను కలిగియుండుట అహంకారమనబడును. కర్తవ్యకర్మను ఈశ్వరాజ్ఞ యని భావించి చేసే స్వభావమును అలవరచుకున్నచో, ఈ అహంకారము తొలగిపోవును. ఒక కర్మను ఎన్నుకొని దానిని ఈశ్వరాజ్ఞగా భావించి చేయవలెను. అంతేగాక, దానిని చేయువాడను నేనే. అయినా, చేయగల్గుటకు నాకు దేహము, మనస్సు, మరియు అనేకములగు ఇతరపరికరములు ఆవశ్యకమగుచున్నవి. ఇవి అన్నియు నాకు ఈయబడినవి. కావున, ఈ కర్మానుష్ఠానము నాకు కర్తవ్యము అనే అవగాహనతో కర్మను చేయవలెను. ఈ మనఃప్రవృత్తి ' చేసేది నేనే ' అనే అహంకారమునకు పూర్తిగా విరుద్ధమైనది. ఈ అహంకారమునకు మూలములో అవివేకము, పొగరు మరియు అజ్ఞానము గలవు. ' ఒక విశిష్టపరిస్థితిలో నేను చేయదగిన కర్తవ్యమును పాలించెదను ' అనే అవగాహన గల సన్న్యాసియందు ఈ అహంకారము మచ్చునకైననూ ఉండదు.

కామముచే మరియు రాగముచే సమర్థింపబడే సామర్థ్యము, శక్తి, నైపుణ్యము మొదలగు విశిష్టక్షమతకు బలమని పేరు. వీటిని విడిచిపెట్టుట సాధ్యము కాదు ; విడిచిపెట్టవలసిన ఆవశ్యకతయు లేదు. కాని వీటివలన వ్యక్తియందు గర్వము పెరుగుటకు అవకాశము గలదు. మరియు ఇట్టి క్షమత గల వ్యక్తి తన క్షమతను ఇతరులు గుర్తించవలెనని అపేక్షించును. సన్న్యాసి ఈ లక్షణములను పరిత్యజించును. సన్న్యాసి తనయందు ఉండే కొన్ని క్షమతలను ఈశ్వరానుగ్రహముగా గుర్తించును ; కాని వాటిని నలుగురికి చాటి చెప్పడు ; మరియు వాటిని దుర్వినియోగము చేయడు. సన్న్యాసి తన వద్దనున్న శక్తులతో ప్రపంచమును తనకు అనుకూలముగా మలుచుకొని చాకచక్యమును ప్రదర్శించే ప్రయత్నమును చేయడు.

మానవుడు ఒక ఘనకార్యమును సాధించినప్పుడు, ఆ విజయోత్సాహములో అతిశయించిన సుఖము ( హర్షము ) ను పొందును. తన విజయమును పది మంది గుర్తించాలని అతడు ఆరాటపడును. అదియే దర్పమనబడును. ఈ లక్షణము పిల్లలందరిలో నుండును. ' అవును ; నువ్వు చాలా బాగా చేసినావు ' అనే ప్రశంసను చిన్న పిల్లలు అపేక్షించెదరు. ప్రశంసలు, అభినందనలు పిల్లలలో ఆత్మగౌరవమును పెంపొందించును. ఇది పిల్లల వికాసమునకు చాల ఆవశ్యకము. పిల్లలు పెరిగే వయస్సులో వారియందు ఆత్మగౌరవము మరియు ఆత్మాభిమానము నెలకొనుట అత్యవసరము. చిన్న వయస్సులో ఈ విధమగు అభినందనను ఎరుంగని వ్యక్తి పెద్ద వయస్సు వచ్చినా, దానిని అపేక్షించుచుండును. అప్పుడు దానికి దర్పమని పేరు. బహుశా ఈ దర్పము మానసిక-ఆరోగ్యమునకు మంచిదే కావచ్చును ; కాని, అది ఆధ్యాత్మిక-ఉన్నతికి సహకారి కాదు. ఇట్టి గుర్తింపు కొరకై తహతహలాడే వ్యక్తియందు ఆత్మాభిమానము చిక్కి సన్నబడి యుండుటచే, ఆ లోటును పూడ్చే ప్రయత్నములో అతడు అహంకారమును పెంచి పోషించుకొనును. అతిశయించిన అహంకారము గలవానికి దేవినైననూ ఆదరించుట కఠినమగును. ఇట్టివాడు ధర్మమును ఉల్లంఘించుటకు ఎక్కువ సమయము పట్టదు. అతిశయించిన ఉల్లా

సము గల వ్యక్తి దర్పమును పొందును ; దర్పము గలవాడు ధర్మమునతి క్రమించును అను అర్థము గల వచనము ( హృష్టో దృప్యతి దృప్తో ధర్మమతిక్రామతి ) ను శ్రీశంకరులు ఇచట ఉదహరించిరి. గర్వించి యున్న వ్యక్తికి తనతో సమానమైన మొనగాడు మరియొకడు లేడనే నిశ్చయము ఉండుటచే, అతడు ఇతరులను ఆదరించడు. మరియు అతడు ధర్మనియతినైననూ లెక్క చేయడు. హిరణ్యకశిపునకు వచ్చిన సమస్య ఇదియే. తన నామమును మాత్రమే సర్వులు జపించవలెననియు, నారాయణనామమును జపించ రాదనియు అతడు తన పుత్రుడగు ప్రహ్లాదుని నిర్బంధించెను. ఇది దర్పమునుండి పుట్టిన లక్షణము.

సన్న్యాసికి ఇతరుల గుర్తింపుతో పని లేదు. అతడు తన స్వరూపమునందు జాగరూకుడై యుండును. అతడు తన పూర్ణత్వమునందు మాత్రమే పరిపూర్తిని పొందియుండును. అతనికి ఇతరులు ఇచ్చే గుర్తింపు తన స్వరూపమును గురించి తెలిసిన దాని కంటె చాల తక్కువ స్థాయిలో నుండును. కావున, అది అతనికి హర్షోద్రేకమును కలిగించదు. సర్వము తానే అను సత్యమును అతడు గుర్తించును. కావున, సర్వత్రా కానవచ్చే సర్వవిభూతులు అతని విభూతులే. ఈ విషయమునే అతడు ఇంకో దృష్టికోణములో కూడ చూడగల్గును. ఒక విజయమును సాధించుట అనేకములగు అంశములపై ఆధారపడి యుండును. ఈ అంశములన్నియు పరమేశ్వరదత్తములే అనే అవగాహన అతనికి గలదు. పైగా, తాను ఏ కాలమునందైననూ ఏ క్రియనైననూ ఆచరించని అకర్తనని అతనికి తెలియును. కావున, అతడు సర్వవిజయములయందు అహంకారమమకారములు లేనివాడై యుండును. అహంకారమమకారములను పరిత్యజించిన అతనికి దర్పము కలిగే ప్రసక్తి లేదు.

సన్న్యాసి కామనలను పరిత్యజించి యుండుట సహజమే. అతనియందు ఏవైనా కోర్కెలు ఉన్నా, అవి బంధహేతువులు కావు. ఆ కోరికలు తీరినప్పుడు అతడు ఆనందించును ; అవి సిద్ధించనప్పుడు కూడ అతడు ఆనందించును. కావున, కోరిక విఫలమై కోపమును కలిగించే ప్రసక్తి సన్న్యాసి విషయములో లేదు.

పరిగ్రహము ( ప్రోగుచేసే స్వభావము ) రెండు రకములుగా నున్నది. ఒకటి బాహ్యము కాగా, మరియొకటి ఆంతరము. జ్ఞానేంద్రియములలో మరియు మనస్సులో ప్రోగుపడే కామక్రోధముల సమస్యను జ్ఞాని పూర్వమునందే పరిష్కరించు యున్నాడు గనుక, అతనికి ఆంతరపరిగ్రహము లేదు. బాహ్యపరిగ్రహము మాత్రమే మిగిలియున్నది. ఎప్పుడో సన్న్యాసియై ఉన్నవానికి పరిగ్రహము ఏమి ఉండును ? ఇల్లు, ఉద్యోగము మొదలగు సర్వమును పరిత్యజించిన వాడే సన్న్యాసి. అతని వద్ద వస్త్రములు,కమండలము, జపమాల మొదలగు ఏవో కొన్ని పదార్థములు మాత్రమే మిగిలి యుండును. అయిననూ, పరిగ్రహము ఇచట ప్రస్తావించెబడుచున్నది. ఏలయన, ఆ కొద్ది పదార్థముల విషయములో కూడ ప్రోగుచేసి దాచిపెట్టే ప్రవణత ( tendency ) ఉండవచ్చును. సన్న్యాసి వద్ద పది కమండలములు ఉన్నచో, అది పరిగ్రహమే యగును. సన్న్యాసి భిక్షాటనచే జీవించువాడే అయినా, అతని వద్ద పది భిక్షాపాత్రలు ఉన్నచో, అది పరిగ్రహమనబడును. మానవుడు తన చుట్టూ ఉన్న పదార్థములను ఎప్పటికప్పుడు బుద్ధిపూర్వకముగా తీసివేయవలె

ను. అట్లు కానిచో, చుట్టూ లెక్క లేనన్ని పదార్థములు జమ యగుచుండును. సన్న్యాసి యైన వ్యక్తికి కుటుంబముతో సంబంధములు గాని, బంధుత్వములు గాని ఉండవు. అయి ననూ, సన్న్యాసి ' ఇది నాది ' అనే ధారణను పరిత్యజించునని ఇచట చెప్పబడినది. ఆతడు దేని విషయమై మమకారమును పరిత్యజించును ? ఆతడు సర్వమును పరిత్య జించి యున్ననూ, తన దేహము విషయములో ఇంకనూ మమకారమును కలిగి యుండవ చ్చును. ఆతడు దానిని కూడ విడిచి పెట్టిన పిదప, ఆతనికి దేహమును పోషించుకొన వలెననే మమత్వము కూడ ఉండదు. ఆయుర్దాయమును గురించిన ఆకాంక్షలు ఆతనికి ఏమియూ ఉండవు. దేహము ఎంత కాలము జీవించి యున్ననూ, ఆతనికి సంతోషమే. అనగా ఆతడు ఏ రోజునకు ఆ రోజు జీవించుచుండును. ఆ లక్షణమే ఆతనియందు సంతోషరూపములో ప్రకటమగుచుండును.

ఆతనియందు మమత్వము లేదు గనుక, ఆతడు తనలో తాను సంతుష్టుడై యుండును. ఆతనియందు హర్షము గాని, నైరాశ్యము గాని లేకుండుటచే, ఆతడు సహజ ముగా శాంతుడై యుండును.

అట్టి వానికి ' బ్రహ్మను నేనే ' అను జ్ఞానమునందు నిష్ఠ కుదురును. దానిని బ్రహ్మభూయ అందురు. కల్పతే అనగా సమర్థుడగును. అనగా సత్యము అపరోక్షజ్ఞాన ముగా అగుటకై ఆవశ్యకమగు అర్హతలనన్నింటినీ పొంది సమర్థుడగును. దీనికొరకై ఆతడు జ్ఞాననిష్ఠారూపమగు జీవితమును గడుపవలెను. జీవితలక్ష్యము కూడ అదియే. తాను బ్రహ్మనే అను నిశ్చయజ్ఞానము కలిగి, ఆ జ్ఞానమునందు ప్రతిష్ఠితుడై ఉండే నిష్ఠకు అంకి తుడై యున్న వ్యక్తి జ్ఞాననిష్ఠుడు అనబడును.

**అధ్యాయము 18 , శ్లోకము 54 :**

ब्रह्मभूतः प्रसन्नात्मा न शोचति न काङ्क्षति ।
समस्सर्वेषु भूतेषु मद्भक्तिं लभते पराम् ।। ५४ ।।

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ( 54 ).

బ్రహ్మభూతః = బ్రహ్మను 'పొందినవాడు', ప్రసన్నాత్మా = ఉల్లాసముతో కూడిన మనస్సు గలవాడు, న శోచతి = దుఃఖించడు, న కాంక్షతి = కోరడు, సర్వేషు = అన్ని, భూతేషు = ప్రాణులయందు, సమః = సమముగా నుండువాడు, పరామ్ = సర్వోత్కృష్టమైన, మద్భక్తిమ్ = నా భక్తిని, లభతే = పొందును.

బ్రహ్మను పొంది ఉల్లాసముతో గూడిన మనస్సు గల జ్ఞాని దుఃఖించడు ;
కోరడు. సర్వప్రాణులయందు ( తనతో ) సమమగు భావన గల ఆ జ్ఞాని
సర్వోత్కృష్టమగు నా భక్తిని పొందును ( 54 ).

బ్రహ్మభూతః అనగా బ్రహ్మను ' పొందినవాడు '. ఈ పదమునకు ముఖ్యార్థ మును గాని, ఆపేక్షికార్థమును గాని స్వీకరించవచ్చును. ఏలయనగా, ' ఇట్టి వ్యక్తి నన్ను తరువాత తెలియగలడు ' అని చెప్పే శ్లోకము దీని తరువాత వచ్చుచున్నది. ఆపేక్షికార్థ మును స్వీకరించినచో, ఆత్మయే బ్రహ్మ ( అహం బ్రహ్మాస్మి ) అనే జ్ఞానమును గాక,

బ్రహ్మను గురించి పరోక్షజ్ఞానమును పొందినవాడు అని అర్థము వచ్చును. అనగా, అతడు శాస్త్రమును శ్రవణము చేసి ఆత్మయే బ్రహ్మయని తెలుసుకొని సన్న్యాసియై ఆ సత్యమును తెలియుటకై జ్ఞాననిష్ఠతో కూడిన జీవితమును గడుపుచున్నవాడు అని అర్థము.

అతని మనస్సు ఉల్లాసముతో నిండి యుండును. ఇది చాల ప్రముఖమైన విషయము. దీనిని బట్టి అతడు కర్మయోగజీవనమును గడిపినవాడని స్పష్టమగుచున్నది. ఉల్లాసకరమగు మనఃప్రవృత్తి సహజముగా వచ్చేది కాదు. దానిని మనము కర్మయోగజీవనము ద్వారా సంపాదించు కొనవలెను. అతడు ఉల్లాసముతో కూడిన మనఃప్రవృత్తిని సంపాదించుటకై అవశ్యకమగు సాధనను చేసి తనలో తాను సంతుష్టుడై యున్నాడు. అప్పుడు మాత్రమే బ్రహ్మనిష్ఠ సంభవమగును. బ్రహ్మనిష్ఠ యనగా నిరంతరమగు ఆత్మావలోకనము. విలక్షణమగు ఈ అంతర్ముఖత్వము సంకల్పశక్తిచే సిద్ధించేది కాదు. జిజ్ఞాసువు చిరకాలము ప్రార్థనాయుతమగు జీవితమును గడుపుచుండగా ఆ సామర్థ్యము అతనియందు క్రమముగా నెలకొని, అతని మనోవైజ్ఞానికసమస్యలన్నింటికీ పరిష్కారమగును.

ఇట్టి వ్యక్తి సాధనసంపత్తి లేకపోవుట వలన గాని, దేహేంద్రియమనస్సుల దోషముల వలన గాని, దుఃఖమును పొందదు ( న శోచతి ). అతడు దేహేంద్రియమనస్సంఘాతమును దానికి గల దోషములతో సహా యథాతథముగా అంగీకరించును. దేహము కుంటిది అయిననూ, నీరసముగా నున్ననూ, వయస్సు మీద పడిననూ, అవి అతనిని ప్రభావితము చేయవు. ధనము, రక్షణ మొదలగు వాటి అభావము వలన అతడు ప్రభావితుడుగాడు. అతడు వీటిని అన్నింటినీ పరిత్యజించిన సన్న్యాసి. కాని అతడు అట్టి త్యాగమునకు సంసిద్ధుడు కానిచో, త్యాగము చేసిన తరువాత, తాను పొరపాటు చేసితిననియు, ఏవో కొన్ని వస్తువులను మిగుల్చుకొని యుండవలసినదనియు పశ్చాత్తాపమును పొందును. కాని మనమిచట ఇట్టి అనుతాపములు ఏమియూ లేని జ్ఞానిని గురించి మాటలాడుచున్నాము. అతనియందు లేమి భావన లేదు. అతడు తనకు ఉన్నదానితో సంతృప్తిని చెందును. ఇట్టి తన వద్ద లేని వస్తువులపై అతనికి తృష్ణ లేకుండుట సహజమే ( న కాంక్షతి ). తన వద్ద లేని వాటి గురించి అతడు చింతిల్లడు. మరియు అతడు తన చుట్టు ప్రక్కలనున్న జనులను మాత్రమే గాక, సర్వప్రాణులను తనతో సమముగా దర్శించును. తనకు సుఖమును కలిగించునవియే ఇతరులకు కూడ సుఖకరములగుననియు, తనకు పీడను కలిగించు విషయములు ఇతరులకు కూడ దుఃఖహేతువులు అగుననియు ఆయనకు తెలియును. తన జీవనమునకు ఆవశ్యకమైన పదార్థములనే సర్వప్రాణులు ఆకాంక్షించుననియు, తాను వేటిని ఇష్టపడదో వాటిని ఇతరప్రాణులు కూడ ఇష్టపడవనియు అతనికి తెలియును. స్వార్థపరుడు కానివాడు, సర్వజగత్తునకు ఆధారమగు ధర్మమును గురించి సరియగు అవగాహన గలవాడు అగు వ్యక్తియొక్క స్వభావము ఇటులనే యుండును. స్వార్థపరుని జీవితము రాగద్వేషముల నియంత్రణలో నడచును. సర్వప్రాణులను తనతో సమముగా దర్శించు వ్యక్తి రాగద్వేషములనుండి విముక్తుడై యుండును.

అట్టి వ్యక్తి నాయందు సర్వోత్కృష్టమగు భక్తిని పొందునని ( మద్భక్తిం లభతే పరామ్ ) భగవానుడు చెప్పుచున్నాడు. భక్తుని దృష్టిలో నిడుకొని భక్తి నాలుగు విధములుగా విభజింపబడినది. కష్టసమయములో మాత్రమే భగవంతుని ప్రార్థించు భక్తుడు ఆర్తభ

క్తుడు అనబడును. అట్టి భక్తుడు ఇతరము సర్వము విఫలమై పరిస్థితి పూర్తిగా చేయి దాటి నప్పుడు భగవానుని శరణు వేడును. ఆతడు ఇతరసమయములలో భగవానుని స్మరించ డు. ఆపదలనుండి గట్టెక్కుటకొరకు మాత్రమే గాక, ఒక కార్యమును సాధించుట కొరకు కూడ భగవంతుని శరణు వేడు భక్తుడు అర్థార్థి యనబడును. ఆతడు కార్యసాధనలో భాగ ముగా తన వంతు కృషిని తాను చేసి, తాను తలపెట్టిన కార్యములోని లోటుపాట్లు సర్దు బాటు అయి, ఆ కార్యము సిద్ధించుట కొరకై భగవంతుని ప్రార్థించును. మూడవ భక్తుడు భగవంతుని స్వరూపమును తెలియగోరు జిజ్ఞాసువు. ఆ జ్ఞానతృష్ణ పూర్తియైన జ్ఞాని నాల్గవ రకమునకు చెందిన భక్తుడు. ఇట్టి భక్తుని గురించి ఈ శ్లోకము వర్ణించుచున్నది. వానికి తనకు, ఈశ్వరునకు మధ్యలో ఉన్న అభేదము నిశ్చితముగా తెలియును. మనననిది ధ్యాసనముల ద్వారా జ్ఞానముయొక్క స్పష్టమగు అవగాహనను పొందుట కొరకై చేసే సాధన జ్ఞాననిష్ఠ యనబడునని మనము చూచియున్నాము. అదియే గాక,ఈ చతుర్థభక్తి కూడ జ్ఞాననిష్ఠ యనబడును. ఈ భక్తిలో జీవేశ్వరభేదము లేదు గనుక, ఇది సర్వోత్తమ మైన భక్తి యగును.

ఆ జ్ఞానముయొక్క స్వరూపమెట్టిది ?

**అధ్యాయము 18:, శ్లోకము 55 :**

भक्त्या मामभिजानाति यावान् यश्चास्मि तत्त्वतः ।

ततो मां तत्त्वतो ज्ञात्वा विशते तदनन्तरम् ।। ५५ ।।

భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః

తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్ ( 55 ).

**యావాన్** = నేను ఎంత ఉన్నాను, **చ** = మరియు, **యః** = ఎట్టివాడను, **అస్మి** = అగుచున్నా నో, **తత్త్వతః** = వస్తుస్వరూపమును బట్టి, **భక్త్యా** = భక్తితో, **మామ్** = నన్ను, **అభిజానాతి** = తెలుసుకొనుచున్నాడు, **తతః** = ఆ తరువాత, **మామ్** = నన్ను, **తత్త్వతః** = యథార్థముగా, **జ్ఞాత్వా** = తెలుసుకొని, **తదనంతరమ్** = వెంటనే, **విశతే** = ప్రవేశించుచున్నాడు.

నేను ఎంత ఉన్నాను ? నా స్వరూపము ఏది ? అను విషయమును
ఆతడు భక్తిచే తెలుసుకొని నా స్వరూపమును యథాతథముగా నెరింగి
తరువాత ఆతడు నన్ను ప్రవేశించును ( 55 ).

' ఈతడు నన్ను భక్తిచే తెలుసుకొనును ' అని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. ఈ భక్తి జ్ఞానమే. ఏలయనగా, దేనినైననూ తెలియుటకు జ్ఞానము తప్ప మరియొక మార్గము లేదు. కేవలము ప్రార్థన వలన వస్తువును గుర్తు పట్టుట సంభవము కాదు. ఇది పరమేశ్వర జ్ఞానము రూపములో నున్న భక్తి. జ్ఞానికి ఉండే ఈ రకమైన భక్తిని గురించి మనము ఇదివ రలో చూచియున్నాము. అభిజానాతి అనగా సరియగు రీతిలో పూర్ణముగా తెలుసుకొనును అని యర్థము. అనగా, ఆతడు ఈశ్వరుని ఆత్మరూపునిగా గుర్తించును.

ఇంతేగాక, ' నేను ఎంత ఉన్నాను ? ' అను విషయమును కూడ ఆతడు తెలియు ను. భేదములు ఉన్నట్లు కానవచ్చుటకు హేతువులైన వివిధరకములైన ఉపాధులయొక్క దృష్టికోణములో ఈ పదము ప్రయోగించి బడినది. ఈ జగత్తు సర్వము పరమేశ్వరుని

కంటె వేరుగా లేదు. మాయోపాధికుడగు పరబ్రహ్మయే పరమేశ్వరుడు. ఆ మాయోపాధిలో అంతర్గతమై ఇంద్రాది దేవతలు, ఆకాశాది పంచమహాభూతములు, అర్జునుడు, ధర్మపుత్రుడు మొదలగు వివిధరకములైన జీవ-ఉపాధులు గలవు. పరమేశ్వరుని అతిశయించిన విస్తారము గల ఈ సకలబ్రహ్మాండరూపము ఆ జ్ఞానికి విదితమే. ఈశ్వరుడు సమష్టి-ఉపాధి రూపములో మాత్రమే గాక, వ్యష్టి-ఉపాధుల రూపములో ఎంత విస్తారముగా ప్రకటమై యున్నాడో, ఆ స్వరూపమును అతడు ఎరుంగును. ఉపాధుల దృష్టికోణములో వర్ణింపబడిన ఈ సగుణబ్రహ్మను మాత్రమే గాక, సర్వోపాధివినిర్ముక్తమైన నా యథార్థస్వరూపమును కూడ అతడు ఎరుంగునని ( యశ్చ అహమస్మి తత్త్వతః ) శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. ఈ స్వరూపము 15 వ అధ్యాయములో వర్ణింపబడిన ఉత్తమపురుషుడే. సర్వవిశేషములకు మరియు దేశపరిచ్ఛేదములకు అతీతమైన సత్యజ్ఞానానంతపరబ్రహ్మయే ఈ స్వరూపము. ఈ అద్వయతత్త్వము జ్ఞానికి విదితమేనని శ్రీశంకరులు వివరించిరి. అద్వయతత్త్వమును తెలియుట ఎట్లు పొసగును ? జ్ఞాత ఉన్నచో, ద్వైతము తప్పదు. కావున, అతడు ఈశ్వరుని ఆత్మచైతన్యరూపములో గుర్తించును. శ్రీశంకరులు ఈ విషయమును ఇచట సుస్పష్టముగా నిరూపించి యున్నారు. ఈ పరమాత్మ పుట్టుక లేనివాడు ; వయోధర్మములు లేనివాడు ; వికారములకు మరియు మరణమునకు వశము కానివాడు ; ద్వితీయ వస్తువు లేకపోవుటచే భయమునకు వశము కానివాడు. ఆ బ్రహ్మను ఏ విధముగనైననూ వినాశమునకు గురి చేయుట సంభవము కాదు. ఈ సృష్టి సర్వము నశించునదియే. కాని ఈ సృష్టి దేనియందు విలీనమగునో, అట్టి పరంబ్రహ్మకు వినాశము లేదు.

' నన్ను ' యథార్థముగా తెలుసుకున్న పిదప ( తదనంతరమ్ ), అతడు ' నన్ను ' ప్రవేశించును ( మాం విశతే ). ఇట్టి వాక్యములను సరిగా తెలుసుకొనిచో, ఇవి సమస్యలను సృష్టించును. ఇచట ప్రవేశించుట యనగా, పరమేశ్వరుని తెలుసుకున్నవాడు పరమేశ్వరుని కంటె భిన్నముగా లేడని యర్థము. త్రాడునందు పామును చూచిన పిదప దాని యథార్థస్వరూపమును తెలుసుకున్నచో, ఆ పాము త్రాడునందు ప్రవేశించును. అదే విధముగా, జీవుడు పరంబ్రహ్మను గుర్తించి విలీనమగును.

ద్వైతులకు ఈ శ్లోకము పెద్ద సమస్య. కాని వారికి అది సరిగా తెలియక పోవుట వలన, వారు దీనిని విన్నవెంటనే పండుగను చేసుకొనెదరు. ' అతడు నన్ను ప్రవేశించును ' అనగా, అతడు గోలోకబృందావనములోనికి వెళ్లి, అచట రాధాకృష్ణులను కలుసుకొనునని వారు చెప్పెదరు. వారీ వ్యాఖ్యానమును చాల గంభీరముగా ప్రవచించెదరు. కాని, ' అతడు నన్ను ప్రవేశించును ' అను వాక్యమునకు ఇది ఎంతయూ దూరార్థమని చెప్పక తప్పదు. ఈ వాక్యమును సరిగా తెలియవలెను. అమీబా కడుపులోనికి ప్రవేశించు విధముగా జీవుడు తన జీవత్వమును నిలబెట్టుకుంటూనే బ్రహ్మలోనికి ప్రవేశించునని చెప్పుట సరి గాదు. అట్లు ప్రవేశించిన జీవునకు ఈశ్వరుని అనుగ్రహముచే ఏదో కొంత ఆనందము లభించునని చెప్పినచో, ఆ ఆనందము ఎంత కాలము నిలుచును ? ఆ ఆనందము శాశ్వతమని చెప్పుటకు వీలు లేదు. ఏలయనగా, శాశ్వతమైన దానికి ఆరంభము ఉండరాదు. కావున, ఆ ఆనందము అంతమై, జీవుడు మరల జీవుడుగనే మిగిలి యుండును. ఆ ఆనందము ఎట్టిది ? ద్వైతము సత్యమై, జీవుడు ఆనందించునని చెప్పుటలో ఒక

దోషము గలదు. ద్వైతము సత్యమైనచో, జీవుని వ్యక్తిత్వము మిగిలియే యుండును గనుక, పూర్ణముగా విలీనమగుట సంభవము కాదు. పూర్ణముగా విలీనమయ్యే పక్షములో భగవానుడు మాత్రమే మిగిలి యుండును ; జీవుడు ఉండడు. కావున, జీవుడు వ్యక్తిత్వమును నిలబెట్టుకుంటూనే, శాశ్వతానందమును పొందుననుట పొసగదు. ఆ ఆనందము కూడ ఇతర-సాంసారిక-సుఖముల వలె కాలమునకు వశమై యుండును. ఇట్టి సుఖము బాహ్యము నుండి వచ్చినది గనుక, నిశ్చయముగా నశించును. మరియు, ఈ ఆనందమును జీవుడు పొందే విధమెట్టిది ? జీవుడు దానిని ప్రార్థనయొక్క ప్రభావముచే పొందుననన్నచో, ప్రార్థన పరిచ్ఛిన్నమగు కర్మ గనుక, దాని ఫలము కూడ పరిచ్ఛిన్నముగనే యుండును. కావున, ఇచట ప్రవేశమనగా, తరంగము తన స్వరూపము జలమని తెలుసుకొని సముద్రములోనికి ప్రవేశించు విధంబున, జీవుడు ఈశ్వరునియందు ఐక్యమగును. ఈ విధమైన పదప్రయోగములు అన్నియు జాగ్రత్తగా పరిశీలించి తెలియ దగినవి. (పై)

అదే విధముగా, ' ఆ తరువాత ( *తదనంతరమ్* ) ', ' తెలుసుకొని ( *జ్ఞాత్వా* ) ' అను పదములు భగవానునిలో ఐక్యమగుటకు కావలసిన ప్రాథమిక-అర్హతలను నిర్దేశించును. ఈ పదముల తాత్పర్యము అంత మాత్రమే. రెండు విభిన్నకాలములను నిర్దేశించుట ఇచటి తాత్పర్యము కాదు. ఈశ్వరునితో ఐక్యమగుటకు కావలసిన ప్రాథమిక-అర్హతలు ఏవి? ' నన్ను తెలిసి నాలో ప్రవేశించును ( *జ్ఞాత్వా మాం విశతే* ) '. ఈ వాక్యము ' భుజించిన తరువాత అతడు తృప్తిని చెందును ' అను వాక్యమును పోలియున్నది. భోజనమును చేసిన తరువాత కొంత సేపటికి తృప్తి కలుగునని ఆ వాక్యమునకు అర్థము కాదు. అదే విధముగా, ' నరికి రెండు ముక్కలు చేయుచున్నాడు ' అను వాక్యము నరకుట మరియు రెండు ముక్కలు చేయుట అనే రెండు క్రియలను గాని, వాటి మధ్యలో వ్యవధానమును గాని నిర్దేశించుట లేదు. నరకుట అను క్రియలో రెండు ముక్కలు అగుట అనునది అంతర్గతమై యున్నది. అదే విధముగా ప్రస్తుతప్రకరణములో ' అతడు తెలిసి ప్రవేశించు చున్నాడు ' అను వాక్యములో తెలియుటయే ప్రవేశించుట. ప్రవేశించుటకు తెలియుట ప్రాథమిక-అర్హత. ఏలయన, సత్యము తెలియనంత వరకు జీవుడు సర్వమునుండి విడివడి యుండును. అనగా, జీవుడు ఏ కాలమునందైననూ భగవానునకు దూరముగా లేదని స్పష్టమగుచున్నది. నీవు సర్వకాలములలో ఈశ్వరునితో ఐక్యమును చెందియే యున్నావు. ఈశ్వరుని కంటె భిన్నముగా నున్నాను అనునది కేవలము ఒక ధారణ, ఆలోచన మాత్రమే. ఈ విధమగు భేదము ఉన్నది గనుక, జీవుడు తెలుసుకొని ఈశ్వరునితో ఒకటి యగునని చెప్పవలసిన ఆవశ్యకత యేర్పడినది. ఇచట రెండు వేర్వేరు క్రియలు లేవని శ్రీశంకరులు నొక్కి వక్కాణించిరి. మోక్షము జ్ఞానము తరువాత లభించే ప్రత్యేకఫలము కాదు. జ్ఞానమే మోక్షము. కాని, జ్ఞానము పురుషార్థము కాకపోవుటచే, మోక్షము అను పదము ప్రయోగించబడినది. మానవునకు కోరేది దుఃఖవిముక్తియే గాని, ఆత్మజ్ఞానము మాత్రమే కాదు గదా ! మానవుడు సాధించ దగిన జీవితలక్ష్యము దుఃఖవిముక్తి. ఆ లక్ష్యము ఆత్మస్వరూపయాథార్థ్యమును తెలియుట వలన సిద్ధించును. జ్ఞానము తరువాత ( జ్ఞానానంతరమ్ ) మోక్షము అనగా జ్ఞానముచే మోక్షము ( జ్ఞానేన మోక్షః ), జ్ఞానము వలన మోక్షము ( జ్ఞానాత్ మోక్షః ) అని యర్థము. అనగా, మోక్షము సాధ్యము , జ్ఞానము

సాధనము అగుచున్నవి. ఈ సాధన-సాధ్యముల దృష్టికోణములో ' తదనంతరమ్ ' అని చెప్పబడినది. కాని ఇచట సాధన-సాధ్యములు ఏకమగుటచే ' తరువాత ' అను పదమునకు అర్థము కాలభేదము కాదు.

జ్ఞాని ఈశ్వరుని గుర్తు పట్టే ( అభిజానాతి ) విధమును గురించి శ్రీశంకరులు ఇచట వసందైన చర్చను చేసిరి. జ్ఞానముచే నన్ను తెలియును ( భక్త్యా మామభిజానాతి ) అని ఈ శ్లోకములో చెప్పబడెను. జ్ఞాని సర్వోత్కృష్టమగు ఆ జ్ఞాననిష్ఠచే నన్ను తెలియదగును ( జ్ఞానస్య యా పరా నిష్ఠా తయా మామభిజానాతి ) అని మరియొక శ్లోకములో చెప్పబడెను. చర్చ అంతయు ' నిష్ఠా ' అను పదముయొక్క అర్థము చుట్టూ తిరిగినది. నిష్ఠయనగా ఆవృత్తి అని యర్థము. ఈ రెండు వాక్యములు విరుద్ధముగా నున్నవని ఒక అభ్యంతరము లేవనెత్త బడినది. జ్ఞాతకు ఒక పదార్థముయొక్క జ్ఞానము కలిగిన దనుకొనుడు. అదే క్షణములో జ్ఞాత ఆ పదార్థమును తెలియును. దాని కొరకై జ్ఞాతకు ఆ జ్ఞానమును ఆవృత్తి చేయవలసిన ఆవశ్యకత లేదు. కాని పైన ఉదహరించిన రెండవ వాక్యములో, జ్ఞాత జ్ఞానముచే గాక, జ్ఞానముయొక్క ఆవృత్తి ( జ్ఞాననిష్ఠ ) చే తెలియునని చెప్పబడినది.

ఉదాహరణకు ఒక వ్యక్తికి ' ఇది ఘటము ' అని తెలిసిన దనుకొనుడు. అది అతనికి ఎప్పుడు తెలియును ? ఘటము ఇంద్రియగోచరము కాగానే, జ్ఞాతకు అది ఘటమని తెలియును. దీని కొరకై ఆవృత్తితో పని లేదు. తెలిసిన తరువాత ' ఇది ఘటము, ఇది ఘటము, ఇది ఘటము ' అంటూ ఆవృత్తిని చేయనక్కర లేదు. ఒకనికి రెండున్నర రోజులు ఆవృత్తి చేసిన తరువాత ' ఇది ఘటము ' అని తెలిసిన దనుకొనుడు. అనగా, అతనికి ఆ రెండున్నర రోజులు ఘటము తెలియ లేదు గనుక, అతడు చేసిన ఆవృత్తికి ఘటజ్ఞానముతో సంబంధమేమియూ లేదని తేలుచున్నది. ఒకడు ఘటము తెలియకుండగనే ' ఘటము, ఘటము, ఘటము ' అని ఆవృత్తి చేయుచున్నాడనుకొనుడు. ఇంతలో ఒకడు వచ్చి, ' ఘటము అనగా ఇది ' అని చూపించినాడు. అపుడు వాని ఘట-అజ్ఞానము తొలగిపోయినది. కాని వానికి ఇప్పుడు కలిగిన ఘటజ్ఞానమునకు, వాడు చేసిన ఆవృత్తితో ఏమి సంబంధము గలదు ? అతని ఆ ఆవృత్తి వ్యర్థము. అతనికి ఘటజ్ఞానము ఘటపదమును ఆవృత్తి చేయుటచే కలుగలేదు.

ప్రస్తుతములో, నేను జ్ఞానముచే నా ఈశ్వరత్వమును గుర్తించనిచో, అహం బ్రహ్మాస్మి అను వాక్యమును గాని, లేదా సమానార్థకమగు మరియొక వాక్యమును గాని ఆవృత్తి చేసి ప్రయోజనమేమున్నది ? మొదటి సారి విన్నప్పుడు తెలియని మహావాక్యము యొక్క అర్థము రెండవ సారి, మూడవ సారి, లేదా వందవ సారి విన్నప్పుడు తెలియుట యెట్లు ? మొదటి సారి వినగానే తెలిసినచో, రెండవ సారి వినే పని యేమున్నది ? ఒక సారి తెలిస్తే, తెలిసినట్లే. ఈ ఆవృత్తి సుతరాము అర్థరహితము.

ఈశ్వరుని గుర్తించుట కేవలము ధ్యానము చేత మాత్రమే సాధ్యమగుచుండగా, అహం బ్రహ్మాస్మి అను జ్ఞానమును ఆవృత్తి చేసే ఈ నిష్ఠతో పని యేమి ? నా యొక్క బ్రహ్మత్వమును గురించి నాకు గల అజ్ఞానమును తొలగించే వృత్తికి జ్ఞానవృత్తి అని పేరు. ఈ వృత్తిచే మాత్రమే మనకు జ్ఞానము కలుగును ( అభిజానాతి ). మనము తెలియదగిన

సర్వపదార్థముల విషయములో పరిస్థితి ఇటులనే యున్నది. నాకు ఘటమును గుర్తించి తెలియాలంటే, ఘటమును గుర్తింపజేసే మనోవృత్తి ( ఘటవృత్తి ) ఆ ఘటజ్ఞానమును కలిగించును. కేవల-ఆవృత్తి వలన ఘటజ్ఞానము కలుగదు. కావున, జ్ఞానము ఉదయించుటకు ఆవృత్తిని చేయవలెను అనునది విరుద్ధవచనము. ప్రస్తుతములో నాకు నా గురించి భ్రాంతి గలదు. ఈ భ్రాంతిని తొలగించే వృత్తికి జ్ఞానవృత్తి అని పేరు. నా మనస్సులో ' నేనే బ్రహ్మను ' అనే వృత్తి ఒక కాలములో ఉదయించినచో, ఆ వృత్తి ఆత్మబ్రహ్మైక్యమును గురించి ఉన్న అజ్ఞానమును నశింపజేసి తీరవలెను. ఇక్కడ కావలసినది అట్టి వృత్తి మాత్ర మే. ఆత్మ బ్రహ్మయే నను గుర్తింపు మనయందు లేదు. ఆ భ్రాంతిని నివారించ వలసి యున్నది. సర్వకాలములలో స్వయంప్రకాశముగానున్న ఆత్మ విషయములో అనాత్మ భ్రాంతి గలదు. ఆ భ్రాంతిని తొలగించు కొనవలెను. దానికొరకై మనకు జ్ఞానవృత్తి అన బడే ఒక వృత్తి అవసరమగుచున్నది. కాని, ఒకసారి అట్టి వృత్తి ఉదయించిన పిదప ఆత్మ బ్రహ్మైక్యము గుర్తింపబడి తీరాలి. ఇట్టి స్థితిలో ఒకే వృత్తిని మరల మరల ఆవృత్తి చేయుట అనే ఈ నిష్ఠయొక్క ప్రయోజనము ఏమి ? ' ఇది కళ్లజోడు ' అని నాకు తెలి యును. ఈ జ్ఞానము ఒకసారి కలిగిన చాలును. ' ఇది కళ్లజోడు ' అని పదే పదే ఆవృత్తి చేయవలసిన ఆవశ్యకత లేదు.

నిష్ఠ యనగా మరల మరల ఆవృత్తిని చేయుట ( అభ్యాసము ) అనే అర్థమును స్వీకరించి ఈ వాదము చేయబడినది. దానికి ఆ అర్థము కలదనుటలో సందేహము లేదు. కాని ఇచట ఆ పదము ఆ అర్థములో వాడబడలేదు. శ్రీశంకరులు నిష్ఠ అను పదము యొక్క అర్థమును స్పష్టము చేసి పై వాదమును నిరాకరించిరి. ఈ పదమును రెండు విధములుగా తెలియవచ్చును. ఆచార్యుని వద్ద శాస్త్రమును శ్రవణము చేసి, దానిని మన నము చేసి, ఆ అర్థమును ఆత్మయందు దర్శించే అభ్యాసమునకు జ్ఞాననిష్ఠ, లేక జ్ఞాన యోగము అని పేరు. జిజ్ఞాసువునకు ఈ జ్ఞానము తప్ప మరియొక వ్యాసంగము లేదు. అనగా ఆతడు దీనికి మాత్రమే అంకితమై యున్నాడు. ఈ అంకితభావమునకు నిష్ఠ యని పేరు. ఆతనికి తపస్సు, మంత్రము, కర్మ మొదలగు వాటియందు నిష్ఠ లేదు. ఆతనికి జ్ఞానమును పొందుటయందు మాత్రమే నిష్ఠ గలదు. ఈ స్థితిలో అభ్యాసమునకు పాత్ర గలదని స్వీకరించ బడినది. శాస్త్రతాత్పర్యము విషయములో అవగాహనలోని స్పష్టత క్రమముగా పెరుగవలెను. దీనికొరకై శాస్త్రమును అనేకపర్యాయములు శ్రవణము చేయువ లెను ( అసకృదుపదేశము ). ఒకనాటికి ఈ ఉపదేశము పూర్తి కావలెను గదా ! ఆ అంతి మస్థితి ( అవసానమ్ ) కూడ నిష్ఠ యనబడును. మరింత మెరుగులు దిద్దే అవకాశము లేని జ్ఞానమే చరమనిశ్చయము ( పరా నిష్ఠా ) గల జ్ఞానము అగును. ఈ ప్రక్రియకు మాత్రమే గాక, ఈ ప్రక్రియ వలన సిద్ధించే లక్ష్యమునకు కూడ జ్ఞాననిష్ఠ అనే పేరు గల దు. అంతఃకరణములో నిర్మాణమయ్యే పరిణతి, ఒక జ్ఞానసాధనయొక్క చరమలక్ష్యము, మరియు నిశ్చయజ్ఞానము కలుగుటకు చేసే సాధన అను వాటిని జ్ఞాననిష్ఠా అను పదము నిర్దేశించును.

మనము ఒక ఉదాహరణను తీసుకుందాము. గణితసమస్య ఒకటి గలదు. దానిని సాధించుటకై ఒక జటిలమైన మార్గములో లోతైన పరిశీలనను జరుపవలసి యున్నది. అట్టి

పరిశీలన పూర్తి యగుపరికి పరిష్కారము మన ముందు సాక్షాత్కరించును. అంతములో లభించే ఈ జ్ఞానవిశ్చయము మరియు దానిని చేరుటకు ఉద్దేశించిన ప్రక్రియ అను రెండింటికీ జ్ఞానవిష్ఠ అను పేరు గలదు. కాని, ప్రస్తుతములో ఆత్మస్వరూపమును తెలుసు కొనే ఈ ప్రక్రియయొక్క అవసానమునకు, అనగా ఫలమునకు జ్ఞానవిష్ఠ అను పేరు ఈయబడినది. ఈ అర్థములో విష్ఠా అను పదమును ప్రయోగించిన సందర్భములలో దానికి 'ఆత్మయే బ్రహ్మ యనే అపరోక్షజ్ఞానము' అని అర్థమును చెప్పవలెను. ఆ జ్ఞాన ముయొక్క నిశ్చయస్థితి మాత్రమే ఆ జ్ఞానమునకు చరమఫలమై యున్నది. అట్టి జ్ఞాని సర్వదోషవినిర్ముక్తమైన ఆత్మను పూర్ణముగా తెలుసుకొనును. ఆ విధముగా తెలుసుకొని, 'నన్ను' గుర్తించును (మాం అభిజానాతి); అనగా, 'నాలో' ఐక్యమును చెందును. ఈ వాక్యమునకు ఇదియే అర్థము. ఇందువలననే, తత్త్వతః (యథార్థముగా) అను పదము ప్రయోగించ బడినది. 'నన్ను' యథార్థముగా తెలుసుకున్న వాడు 'నన్ను' ప్రవేశిం చును; అనగా, ఆతడు ఈ పైన 'నాకంటె' భిన్నముగా లేడు.

దీనిని బట్టి ఒక క్రమము గలదని స్పష్టమగుచున్నది. జ్ఞాని ఈ జ్ఞాననిష్ఠచే తనకు ఈశ్వరునితో గల అభేదమును గుర్తించును. జ్ఞానము ప్రకటమగుటకు ఆవశ్యకమగు మాన సికసంసిద్ధత మొదలగు జ్ఞానహేతువులతో కూడి యున్న జ్ఞానము విష్ఠ యనబడునని శ్రీశంకరులు స్పష్టము చేసిరి. మరో మాటలో చెప్పాలంటే, జ్ఞాననిష్ఠ యనగా ప్రతిబంధ కములు లేని జ్ఞానము. ఈ ప్రతిబంధకములు ఏవి ? శమము, దమము, ఉపరతి, తితిక్షా, శ్రద్ధా, సమాధానమ్, వివేకము, వైరాగ్యము, ముముక్షుత్వము మొదలగునవి లేకపోవుట. ఈ జీవనమూల్యములను, మనఃప్రవృత్తులను మనము ఇదివరలో చూచియున్నాము. వీటిలో అన్నీ గాని, కొన్ని గాని తగినంత మాత్రలో లేనిచో, జ్ఞానము ఉదయించిననూ, అది ప్రతిబంధకములతో నిండియుండును. వాటిని నిర్మూలించు విధమేది ? జ్ఞానాభ్యాస ముచే అవి నిర్మూలించ బడును. జ్ఞానములో సంశయములు ఉన్నచో, వాటిని వెంటనే మననము ద్వారా తొలగించు కొనవలెను. నీ గురించి నీకు పరస్పరవిరుద్ధములగు అభిప్రా యములు దృఢముగా నున్నచో, వాటిని సరిదిద్దుకొనుటకై ప్రధానముగా విదిధ్యాసనము అవశ్యకమగును.

ఈ విధమగు జ్ఞానము ఆత్మయే బ్రహ్మయను విశ్చయజ్ఞానమునందు పరిసమాప్త మగును. అట్టి అపరోక్షజ్ఞానమే విష్ఠ యనబడును. విశ్చయముతో కూడిన జ్ఞానము, ప్రతి బంధకములు లేని జ్ఞానము జ్ఞానవిష్ఠ యనబడును. ఇట్టి విష్ఠను కలిగించే అభ్యాసము కూడ విష్ఠయే అనబడును. కాని, ఆత్మ బ్రహ్మయే యను నిశ్చయము అభ్యాసజన్యము కాదు. అభ్యాసము కేవలము ప్రతిబంధకములను నిర్మూలించును. ప్రమాణము జ్ఞానమును కలిగించును. ఈ రెండింటి కలయిక వలన ప్రతిబంధకములనుండి విముక్తమైన జ్ఞానము ఉదయించును.

ఈ శ్లోకములో చెప్పబడిన భక్తి (భక్త్యా మామభిజానాతి) ఇదియే. శాస్త్రతాత్పర్యా మునెరింగిన ఆచార్యునిచే ఉపదేశించబడిన శాస్త్రము ఈ జ్ఞానమును కలిగించే సాధన ము. ఉపదేశము వలన ఒక జ్ఞానము కలుగును. ఆ జ్ఞానమునకు కొంత పరాధీనత గలదు. ఈ విషయము తరువాత మరల చర్చించబడును. ఆచార్యుడు శాస్త్రమును ఉపదేశించి,

నీవు బ్రహ్మవే యని స్పష్టము చేయును.ఈ ఉపదేశమును సరియగు పద్ధతిలో స్వీకరించి, జ్ఞానము ఉదయించుటకై కొన్ని లక్షణములు ఆవశ్యకమగును. జ్ఞానము ఉదయించ వలసినది అంతఃకరణములో గనుక, అది జ్ఞానోదయమునకు సంసిద్ధముగా నుండవలెను. ఇట్టి సంసిద్ధత జ్ఞానోదయమునకు సహకారి కారణమగును. జ్ఞానమును కలిగించేది ప్రమాణము. సరియగు పద్ధతిలో ప్రమాణమును వినియోగించ వలెను. అయిననూ, జ్ఞానము ఉదయించనిచో, ప్రతిబంధకములు ఉన్నవని తెలియుచున్నది. ఆ ప్రతిబంధకములను సహకారి కారణము తొలగించును. ఈ సహకారి కారణములు సారరూపముగా రెండు గలవని శ్రీశంకరులు సంగ్రహించిరి. రాగద్వేషములనుండి విముక్తి మొదటిది. 13 వ అధ్యాయములో చెప్పబడిన అమానిత్వాది గుణసముదాయము రెండవది. ఈ జాబితాలో చాల అంశములు గలవు. అయిననూ, ఇవి ముముక్షువునకు అతిసహజముగా అబ్బును. ఏదో కొంత మాత్రలో ఇవి అందరిలో గలవు. అట్లు లేనివారు ఈ జ్ఞానాన్వేషణ వైపునకు రానే రారు. కావున, ఈ గుణములు జిజ్ఞాసువులు అందరిలో కొద్దో గొప్పో ఉన్నవి. కాని, తగినంత లేకపోవచ్చును.

క్షేత్రజ్ఞునకు పరమేశ్వరునితో గల అభేదమే పొందదగిన జ్ఞానమని శ్రీశంకరులు వివరించిరి. ఈ జగత్తులో ఒకే ఒక పూర్ణబ్రహ్మ మాత్రమే గలదు. ఈ జ్ఞానములో అద్వైతము మరియు అభేదము గలవు. ఈ జ్ఞానమును వర్ణిస్తూ, సర్వకర్మసన్న్యాసము దీనిలో అంతర్భాగమని శ్రీశంకరులు చెప్పిరి. క్రియను చేయువాడు ( కర్త ), క్రియను స్వీకరించు పదార్థము ( కర్మ ), క్రియను చేయు సాధనము ( కరణము ), క్రియను చేసే ప్రయోజనము ( సంప్రదానము ), క్రియ ఉదయించే ఉద్గమస్థానము ( అపాదానము ), మరియు ఆశ్రయము ( ఆధారము ) అనే కారకములు సర్వక్రియలలో తప్పని సరిగా నుండును. క్రియలన్నింటిలో కారకములు అన్నీ లేకపోయినా, కర్త మరియు కర్మ ఉండి తీరును. వీటి మధ్య గల భేదము తెలియనిదే క్రియను ఆచరించుట సాధ్యము కాదు. ఉదాహరణకు, ' నేను స్వర్గసాధనమగు ఈ యజ్ఞమును స్వర్గమును గోరి చేయుచున్న కర్తను ' అను జ్ఞానము ఆ యజ్ఞనిర్వహణకు ఆవశ్యకము. క్రియ నిష్పన్నమగుటకు వివిధకారకములు ఆవశ్యకమగును. వాటి జ్ఞానము భేదజ్ఞానము. అట్టి భేదజ్ఞానప్రయుక్తమైన సర్వక్రియలను సన్న్యసించుట ఇచటి జ్ఞానములో అంతర్భాగము అగుచున్నది.

నేను ఈశ్వరుని కంటె భిన్నముగా లేను అను నిశ్చయరూపములో ఈ జ్ఞానము ఉన్నది. అదియే జ్ఞానముయొక్క పరాకాష్ఠ ( జ్ఞాననిష్ఠ ). నాల్గవ రకము భక్తుడగు జ్ఞానియొక్క భక్తి ఈ జ్ఞాననిష్ఠయే. ఇదియే యథార్థమైన భక్తి. ఈ భక్తి సర్వోత్కృష్టమైనది. ఏలయనగా, ' నన్ను తెలుసుకున్నవాడు నేనే యగును 'అని భగవానుడు చెప్పియున్నాడు. కావున, ఈ జ్ఞాని భగవానునికంటె భిన్నముగా లేడు. ఈ చరమ జ్ఞానమే జ్ఞాననిష్ఠ యనబడుచున్నది.

ఇది ఒక ఎరుక. దీనిని నిర్దేశించుటకు జ్ఞానము అన్న చాలును గదా ! జ్ఞాననిష్ఠ అననేల ? జ్ఞానము అను పదము చాలును. కాని, ప్రతిబంధకములు ఉండుట వలన ఈ జ్ఞానము తిన్నగా ఉదయించుననే హామీ లేదు. కావుననే, జ్ఞాననిష్ఠ అనియు, జ్ఞానాభ్యాసము అనియు అధికమగు పదములు ప్రయోగించ బడుచున్నవి. జ్ఞానసాధనము మరియు

జ్ఞేయవస్తువు ఉపలభ్యమై యుండగా, జ్ఞానము ఉదయించవలెను. కాని, అట్లు ఉదయించక పోవుటకు కారణమేమి ? ' బ్రహ్మవు నీవే ' అని నేను చెప్పిన వెంటనే నీకు ఆ సత్యము తేటతెల్లము కావలెను. కాని, అట్లు అగుట లేదు. జనులకు జ్ఞానము కలుగుచున్నది ; మరియు కలుగుట లేదు. దీని యర్థమేమి ? దీనిలో ఒక సమస్య గలదు. మనము దానిని ఉపేక్షించ రాదు. మనము ఆ సమస్యను గుర్తించి దానిని పరిష్కరించుటకు పూనుకోవాలి. మనము స్వీయమనఃప్రవృత్తులను, జీవనమూల్యములను పరిశీలించుకోవాలి. ప్రార్థనాయుతమగు జీవితమును గడుపవలెను. మనస్సుయొక్క ఆలోచించే తీరుతెన్నులపై నియంత్రణను సాధించవలెను. ఆత్మావలోకనములో కొంత కాలమును గడుపవలెను. జ్ఞాననిష్ఠను పొందుటకు ఇవి అన్నియు ఆవశ్యకములే. జ్ఞానము ఉన్ననూ, ఆ వ్యక్తి ఇంకనూ పూర్ణముగా ముక్తుడు కాని ఒకానొక విలక్షణమగు అవస్థ ఉన్నదా యనిపించును. కొంత కాలము వరకు శాస్త్రమును శ్రవణము చేసిన వ్యక్తి ' బ్రహ్మను నేనే అను విషయము నాకు తెలియదు ' అని గాని, ' నేను బ్రహ్మనే యను విషయములో నాకు నిశ్చయము లేదు ' అని గాని చెప్పజాలడు. కాని అదే సమయములో ' బ్రహ్మను నేనే 'అని కూడ చెప్పలేకున్నాడు. ఈ కారణము చేతనే మనకు ' ఎరుక ( జ్ఞానమ్ )' అనియు, ' ప్రతిబంధకములు లేని ఎరుక ( జ్ఞాననిష్ఠ ) ' అనియు పదప్రయోగములు కానవచ్చుచున్నవి.

ఈ పరిస్థితి అందరికీ సమానమే. ఇది ప్రాచీనకాలమునుండి వచ్చుచున్న సమస్య. ఇందువలననే, ప్రార్థన, జీవనమూల్యములు, మనఃప్రవృత్తి మొదలగు వాటికి అధికమగు ప్రాధాన్యము ఈయబడినది. ప్రార్థన, మరియు సర్వకార్యములయందు శరణాగతిని చేసే మనస్తత్త్వము మిక్కిలి ప్రముఖమైన అంశములు. కావుననే, శ్రీశంకరులు వాటిని ఇచట ప్రస్తావించిరి. మరియొక అంశము సన్న్యాసము. దానికే జ్ఞాననిష్ఠ యని పేరు. దానిలో జిజ్ఞాసువు జ్ఞానసాధనను మినహాయించి ఇతరమును దేనినీ చేయడు.

నిదిధ్యాసనమును అభ్యసిస్తూ, విచారము ద్వారా వైరాగ్యమును పెంపొందించుకొని, క్రమముగా మనస్సులో ఉల్లాసమును ప్రోది చేసుకొనవలెను. దాని వలన ' బ్రహ్మను నేనే ' అను జ్ఞానములో స్పష్టత ఏర్పడును. దానితో జీవేశ్వరుల మధ్య భేదము గలదనే ధారణ అదృశ్యమగును. ఈ జీవ-ఈశ్వర-అభేదమును తెలియుటకు ముందుగా జిజ్ఞాసువు ఈ జగత్తునకు నిమిత్తకారణము మరియు ఉపాదానకారణము అనే రెండు కారణములు ఈశ్వరుడే అనియు, కావున సర్వజగత్తు ఈశ్వరుడేననియు తెలియవలెను. ఈ సర్వజగద్రూపములో నున్న ఈశ్వరుడు నేనే అని తెలియవలెను. అనగా, నామరూపాత్మకమగు ఈ సర్వజగత్తు నాకంటె భిన్నముగా లేదని తెలియవలెను. జీవుని యథార్థస్వరూపము చైతన్య-ఆత్మ గనుక, అది అఖండము గనుక, భగవానుడు నా కంటె వేరుగా లేడు. ఈ సర్వభావమే సకలశాస్త్రసారము. ఈశ్వరునకు, నాకు గల భేదము విలీనము అగుట యనగా నేనే సర్వము అగుదును. నాకంటె భిన్నముగా ఏదీ లేదు.

అంతిమముగా జిజ్ఞాసువునకు సకలసంశయములు తొలగిపోయినవి. ఇదియే భక్తి. దీనికే జ్ఞాననిష్ఠ యని పేరు. ఇదియే చరమజ్ఞానము. జ్ఞాననిష్ఠతో కూడిన జీవితమును గడుపుట ద్వారా చరమలక్ష్యమగు ఈ జ్ఞాననిష్ఠను పొందిన నాడు మాత్రమే సన్న్యాసాశ్ర

మమును విధించిన శాస్త్రమునకు సాఫల్యము కలుగును. ఈ సత్యము తెలిసిన వ్యక్తి జ్ఞానపూర్వకముగా కర్మను విడిచిపెట్టి, జ్ఞాననిష్ఠకు అంకితము కావచ్చును. అట్లు గానిచో, కర్మసన్న్యాసము సంభవము కాదు. కాని సాధకుడు స్వర్గాది కర్మఫలములయందు తృష్ణను విడనాడి కర్మయోగి కావచ్చును. ఈ రెండు మార్గములకు ఫలము సమానమే. అదియే మోక్షము. భద్రత కొరకై ఆరాటము ( అర్థ ), సుఖానుభవము ( కామ ), మరియు భవిష్యత్తులో భోగములు ( ధర్మ ) అను వాటియందలి ఆకాంక్షనుండి విముక్తుడైన వాడు మాత్రమే సర్వకర్మసన్న్యాసమును చేయగలడు. దానికి వైరాగ్యము ఉండవలెను. వైరాగ్యము లేనివాడు కర్మలను పరిత్యజించిననూ, కామనలు మిగిలియే యుండును. అవి జ్ఞానసాధనకు ఆటంకములగును. కామనలను విజయవంతముగా విడిచిపెట్టుట అసంభవము. విచారమును చేసి వైరాగ్యమును పెంపొందించుకొనుట ద్వారా సాధకుడు వాటికి అతీతముగా పరిణతిని చెందవలెను. మనము అందరము కొన్ని కామనలకు అతీతులుగా పరిణతిని చెందినవారమే. యథార్థమగు వైరాగ్యమును తెలియుటకై రబ్బరు బుడగల దృష్టాంతమును గుర్తు చేసుకొనుడు. బుడగ కావాలని నీవు కోరినా, అది బంధహేతువు అగు కామన కాదు. బుడగ లభించినచో, నీవు దానితో కొంత సేపు వినోదించెదవు. బుడగ దొరకనిచో, నీవు దుఃఖించబోవుట లేదు. మరియు నీకు బుడగ లభించి, తరువాత పగిలి పోయినచో, నీవు అశాంతిని పొందవు. అనగా, మనకు అందరికీ బుడగల విషయములో వైరాగ్యము గలదు. మనము బుడగల వెనుక పరుగులెత్తము ; మరియు మనము అవి బంధకారణములగునేమో యని భయపడము. దీనికే సన్న్యాసమని పేరు. కాని, నీకు బాల్యములో బుడగల గురించి ఇటువంటి మనఃప్రవృత్తి ఉండెడిది కాదు. కావున, సన్న్యాసమనగా మానసికమగు పరిపక్వత యని తెలియవలెను. మనము సర్వపదార్థములను బుడగల స్థాయికి తీసుకు రాగల్గినచో, అదియే ఇక్కడ వర్ణించబడిన సన్న్యాసము. మనము బుడగల విషయములో గల మనఃప్రవృత్తితో సంసారములోని సర్వపదార్థములతో వినోదించవచ్చును.

ధర్మార్థకామములనే మూడు పురుషార్థములకు అతీతముగా పరిణతిని చెందిన వ్యక్తి ఏ రోజునకు ఆ రోజు జీవించగలడు. రేపటి గురించి చింత చేయని వ్యక్తి సన్న్యాసితో సమానుడే యగును. సన్న్యాసమునకు మానసిక పరిపక్వత ఉండవలెను. లేనిచో, ఆ సన్న్యాసము దుఃఖకారణమగును. అట్టి పరిపక్వతను, మరియు ఆంతరికభద్రతను పొందుటకై వ్యక్తి కర్మయోగజీవనమును గడుపవలెను. అప్పుడు మానవజీవితము సార్థకమగును.

ఇచట భక్తి అను పదమునకు మరియొక అర్థము లేదు. ఇచట వర్ణించబడిన భక్తి నాలుగవది అగు జ్ఞానిభక్తి మాత్రమే. లేదా, మూడవది యగు జిజ్ఞాసుభక్తి యైననూ కావచ్చును. అట్టి భక్తి వలన జిజ్ఞాసువు ' నన్ను తెలియగలడు ( మాం అభిజానాతి ) ' అని భగవానుడు చెప్పుచున్నాడు.

మోక్షమును పొందుటకై శాస్త్రము జ్ఞాననిష్ఠకు అంకితమైన సన్న్యాసజీవనమును విధించుచున్నది. మోక్షము కర్మఫలము కాదు. ప్రత్యగాత్మ పరబ్రహ్మయే నను జ్ఞానమే మోక్షము. ఆ జ్ఞానమునందు ఏ రకమైన అస్పష్టత గాని, సంశయములు గాని లేనిచో,

ముగా నుండును. కాని, జ్ఞానరూపములోనున్న మోక్షమును గోరువాడు జ్ఞాననిష్ఠయందు అభిరుచిని కలిగియుండును.

శ్రీశంకరులు మరల జ్ఞాననిష్ఠను నిర్వచించిరి. నిరంతరమగు ప్రత్యగాత్మావలోకనమునకు కట్టుబడియుండుట జ్ఞాననిష్ఠ యనబడును. ఆయన అభినివేశము అను పదమును ప్రయోగించిరి. అనగా ఆవేశింపబడినవానికి వలె దృఢమగు పట్టుదలను కలిగియుండుట. మనిషిని కోపము, అధికారదాహము, ధనదాహము మొదలగు వాటితో సహా ఏది ఆవేశించినా, వానియందు ఒక కొత్త శక్తి ఆవిష్కారమగును. ప్రస్తుతములో, జిజ్ఞాసువు ఒకానొక భావావేశముతో జ్ఞానసాధనకు పూర్ణముగా కటిబద్ధుడై యుండును. ఆతడు తన బ్రహ్మత్వమును సంతతప్రవాహరూపముగా మనస్సులో దర్శించుచుండును. శుద్ధమ్, నిత్యమ్, పూర్ణమ్, సత్యమ్, జ్ఞానమ్, అనంతమ్ మొదలైన బ్రహ్మను నిరూపించే పదములను వినియోగించుకొని, ఆతడు నిరంతరముగా బ్రహ్మ-అభిన్నమగు ప్రత్యగాత్మను అవలోకించుచుండును.

ఈ నిష్ఠ కర్మానుష్ఠానమునకు పూర్తిగా విరుద్ధమైనది. కావున, దీనిని కర్మతో బాటు కలిపి అనుష్ఠించుట సంభవము కాదు. కర్మ కర్తపై ఆధారపడి యుండగా, జ్ఞానము కర్తను నిషేధించును. కావున, జ్ఞాననిష్ఠను కర్మనిష్ఠతో సముచ్చయము చేయుట కుదరదు. వాటికి మధ్యలో పర్వతమునకు, ఆవగింజకు ఉన్నంత భేదము గలదు. కావున, వాటి మధ్యలో అన్యోన్యభ్రాంతి కలిగే అవకాశము కూడ లేదు. గుట్టను చూచి, పర్వతమని భ్రాంతి పడవచ్చును. కాని, ఆవగింజను చూచి పర్వతమని భ్రాంతి పడే అవకాశము లేశమైననూ లేదు. జ్ఞాననిష్ఠకు , కర్మానుష్ఠానమునకు అంతటి భేదము గలదు. అవి పరస్పరవిరుద్ధములు. ఈ శాస్త్రస్వరూపమునెరింగిన పెద్దలు ఈ విధముగా నిర్ణయించిరని శ్రీశంకరులు చెప్పిరి.

కావున, జ్ఞాననిష్ఠకు సర్వకర్మసన్న్యాసము తోడు కావలెను. మనము ఇచట ఒక సంగతిని గమనించవలెను. కర్మ జ్ఞానవిరోధియే అయినా, కర్మయోగము పూర్తిగా జ్ఞానవిరోధి కాదు. ఏలయనగా, అంతఃకరణశుద్ధి దాని ప్రయోజనము. ఆ శుద్ధి జ్ఞానోదయమునకు అత్యావశ్యకము. కావుననే, భగవానుడు ఇప్పుడు రాబోయే కొన్ని శ్లోకములలో కర్మయోగమును గురించి చెప్పబోవుచున్నాడు.

శాస్త్రజ్ఞానము దృఢముగా, స్పష్టముగా నుండుట కొరకై ఈ అధ్యాయములో గీతాశాస్త్రము అంతయు సారరూపముగా సంగ్రహించ బడినది. భగవానుడు ఇంతవరకు సన్న్యాసమును గురించి వర్ణించి, భగవద్భక్తియొక్క ఆవిష్కారముతో నిండియుండే జీవనశైలి ( కర్మయోగము ) ని గురించి ఇప్పుడు వర్ణించబోవుచున్నాడు. స్వకర్మానుష్ఠానము ద్వారా భగవానుని ఆరాధించే మానవునకు ఒకానొక సిద్ధి లభించునని ( *స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః* ) మనము చూచియున్నాము. ఈ జగత్తు అంతా పరమేశ్వరునినుండి ఉద్భవించినదనియు, ఈ జగత్తు పరమేశ్వరునిచే వ్యాపించబడి ఉన్నదనియు, ధర్మము ఈశ్వరస్వరూపమేననియు గుర్తించి, విశిష్టదేశకాలములలో తన కర్తవ్యమును అనుష్ఠించుట ద్వారా మానవుడు సిద్ధిని పొందును. ఆ సిద్ధి ఏమి ? జ్ఞాననిష్ఠను పొంద గలిగే యోగ్యత అని శ్రీశంకరులు వివరించిరి. కర్మయోగము అంతఃకరణమును

సజ్జితము చేయును. దాని వలన జ్ఞానము ఉదయించి, తరువాత జ్ఞాననిష్ఠ నెలకొనును. అనగా, పదే పదే బ్రహ్మాత్మావలోకనము అవశ్యకమైనచో, జిజ్ఞాసువు దానినుండి తప్పించుకొనుట సంభవము కాదు. మనస్సు సంసిద్ధముగ నున్నచో, జ్ఞానములో విలంబము లేదు. ఆ జ్ఞానము మోక్షమునందు పర్యవసానమును చెందును. శాస్త్రతాత్పర్యమును సుస్పష్టము మరియు దృఢము చేయుటకై, భగవానుడు ఇప్పుడు మనస్సును జ్ఞానోదయమునకు సజ్జితము చేసే కర్మయోగమును స్తుతించుచున్నాడు.

**అధ్యాయము 18 , శ్లోకము 56 :**

सर्वकर्माण्यपि सदा कुर्वाणो मद्व्यपाश्रयः ।
मत्प्रसादादवाप्नोति शाश्वतं पदमव्ययम् ।। ५६ ।।

సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్ ( 56 ).

సర్వకర్మాణి అపి = అన్ని విధముల కర్మలనైననూ, సదా = సర్వకాలములయందు, కుర్వాణః = చేయుచున్నవారై, మద్వ్యపాశ్రయః = ( సర్వకర్మలకు మరియు వాటి ఫలములకు ) నేనే ఆశ్రయముగా గలవారై, మత్ప్రసాదాత్ = నా అనుగ్రహము వలన, శాశ్వతమ్ = నిత్యము, అవ్యయమ్ = వినాశము లేనిది అగు, పదమ్ = లక్ష్యమును, అవాప్నోతి = పొందును.

సర్వకాలములలో నాయందు ఆశ్రయము గలవారై సర్వకర్మలను
చేయు వ్యక్తి నా అనుగ్రహము వలన శాశ్వతము మరియు వినాశము
లేనిది అగు లక్ష్యమును చేరుకొనును ( 56 ).

జ్ఞాననిష్ఠకు పూర్ణముగా అంకితమైన వ్యక్తి ఏ లక్ష్యమును చేరుకొనునో, కర్మయోగి కూడ అదే లక్ష్యమును చేరుకొనునని భగవానుడీ శ్లోకములో చెప్పుచున్నాడు. ప్రార్థనాయుతమగు జీవితమును గడుపుతూ, భగవంతుని శరణు పొంది తన కర్తవ్యములనన్నింటినీ నిర్వహించుచూ జీవించని వ్యక్తికి సర్వకర్మసన్న్యాసపూర్వకమగు జ్ఞాననిష్ఠ సఫలము కాజాలదు. ' ఓ అర్జునా ! కర్మయోగజీవనమును గడపని వ్యక్తికి సన్న్యాసమును సాధించుట దుష్కరమగును ( సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః ) ' అని భగవానుడు చెప్పియున్నాడు. సన్న్యాసజీవనము కనబడేటంతటి తేలిక కాదు. దానికి ఆత్మావలోకనసమర్థమగు మనస్సు ఉండవలెను. అట్టి మనస్సును మానవుడు తన నిత్యజీవితములో సాధన ద్వారా సంపాదించు కొనవలెను. ఆ విషయమునే ఈ శ్లోకము చెప్పుచున్నది.

ఈ శ్లోకములో సర్వకర్మాణి అను పదమునకు తోడుగా అపి అను పదము ఉండుటచే, చేయదగిన కర్మలు ( విహి-తాని కర్మాణి ) మాత్రమే గాక, చేయకూడని కర్మలు ( ప్రతిషిద్ధాని ) కూడ నిర్దేశించ బడును. కర్మయోగి కర్తవ్యకర్మలను చేయుట మాత్రమే గాక, చేయకూడని కర్మలకు దూరముగా నుండును. భగవానునితో గాని, ధర్మముతో గాని సంబంధము లేని నీతిమంతుడగు వ్యక్తియైననూ ఇటులనే జీవించును. నీతిమంతుడు కర్తవ్యకర్మలను అన్నింటినీ చేయుచూ, చేయకూడని పనులకు దూరముగా

ఉంటూ, చట్టబద్ధమైన మరియు నైతికమైన జీవితమును గడుపుచుండును. చట్టబద్ధము మరియు నైతికము అనే రెండు విశేషణములను వేయవలసిన అవశ్యకత గలదు. ఏలయనగా, చట్టబద్ధముగా జీవించే వ్యక్తియైననూ నీతిమంతుడు కానక్కరలేదు. నీతిసూత్రములను ఉల్లంఘించిన సందర్భములలో కూడా చట్టములను మానవులు తమకు అనుకూలమైన పద్ధతిలో వ్యాఖ్యానించుకొనుటకు అవకాశము గలదు. దీనికి భిన్నముగా, నైతికమైన జీవితమును గడుపు వ్యక్తి చట్టవిరుద్ధముగా ఆచరించే అవకాశము లేకపోలేదు. అమెరికాలో ఇది ఒక పెద్ద సమస్య. అచట వైద్యునకు వ్యతిరేకముగా 'ఈతడు చికిత్సను సరిగా చేయలేదు ' అని దావాను చాల తేలికగా వేయవచ్చును. ప్రమాదము జరిగిన స్థలమునకు ప్రక్కనుండి వెళ్తూ ఉన్న వైద్యుడు ఆగి, గాయపడిన వారికి చికిత్సను చేయుట అతని నైతికబాధ్యత. కాని, ఏదైనా పొరపాటు జరిగినచో, అతనిపై దావా వేయబడును. అనగా, కొన్ని చర్యలు నైతికముగా సమర్థనీయములే అయినా, చట్టబద్ధము కాకపోవచ్చును. కాని, నైతికము మరియు చట్టబద్ధము అగు జీవితమును గడుపుచున్న వ్యక్తిని గురించి మనము మాటలాడుచున్నాము. అతడు కర్మయోగముతో సంబంధము లేనివాడే అయిననూ, వాస్తవికదృష్టి కలవాడగుటచే, అట్టి జీవితమును గడుపుచుండవచ్చును. అది కర్మయోగము కాజాలదు. ఈశ్వరుడే ధర్మనియతి రూపములో నున్నాడనియు, సర్వకర్మలకు ఫలములనిచ్చువాడు ఈశ్వరుడే ననియు గుర్తించిన వాడు మాత్రమే కర్మయోగి కాగల్గును. కర్మయోగమును గురించి సమాజములో చాల భ్రాంతులు గలవు. కావుననే, నేను ఈ విషయమును ప్రత్యేకముగా ప్రస్తావించితిని. క్రియల నాచరించుటలోని నైపుణ్యమే కర్మయోగమని కొందరి అభిప్రాయము. ఆ నిర్వచనము ప్రకారము నిపుణుడగు జేబుదొంగ కూడ కర్మయోగి కావలసి యుండును. ప్రపంచములో కర్మయోగమును గురించి ఇట్టి తప్పు అభిప్రాయములు గలవు. వీటిని సమర్థించు వచనములు గీతలో లేవు.

ఈశ్వరునితో సంబంధము లేని కర్మయోగము గీతలో ఎక్కడనైననూ చెప్పబడలేదు. పరమేశ్వరుని ఆరాధిస్తూ, ఈశ్వరశరణాగతి భావనతో కర్మలను ఆచరిస్తూ గడిపే జీవనము కర్మయోగము అగును. ఇచట శరణాగతి యనగా ఈశ్వరధర్మమును గుర్తించి దానికి అనురూపముగా జీవించుటయే. అది మాత్రమే వ్యక్తిలో పరివర్తననూ తీసుకువచ్చును. ఈ శ్లోకములోని ' నన్ను ఆశ్రయించువాడు ( *మద్వ్యపాశ్రయః* ) ' అను వచనములో భగవానుడీ విషయమును స్పష్టము చేసినాడు. కర్మయోగి దృష్టిలో పరమేశ్వరుడు ధర్మము కంటె భిన్నముగా లేడు. కర్మయోగియందు రాగద్వేషములు పలుచగా నుండును. కావున, అతని చూపు భగవానునినుండి ప్రక్కకు మళ్లిపోదు. చేయవలసిన కర్మను ఎన్నుకొనే సమయములో కర్మయోగి కర్మాధ్యక్షుడగు పరమేశ్వరుని విస్మరించడు. కర్మఫలమును అనుభవించ వలసి వచ్చినప్పుడు అతడు ఈశ్వరుడే కర్మఫలదాతయని గుర్తించి, కర్మఫలమును ప్రసాదబుద్ధితో స్వీకరించును. అనగా, అతని దృష్టి ఏ కాలమునందైననూ ఈశ్వరునినుండి ప్రక్కకు మళ్లిపోదు. ఇట్టి వాని సర్వకర్మలకు ఆశ్రయము మరియు సర్వకర్మఫలములు ఉదయించే ఉద్గమస్థానము ఈశ్వరుడే. కావున, ఈతడు *మద్వ్యపాశ్రయః* అని వర్ణించ బడినాడు. అతడు సర్వకర్మలను ఆచరించుచున్ననూ ( *సర్వకర్మాణి కుర్వాణః* ), అతని దృష్టినుండి ఈశ్వరుడు మరలి పోడు.

ఆతడు ఈశ్వరానుగ్రహముచే ( మత్ప్రసాదాత్ ) వినాశము లేని లక్ష్యమును చేరు కొనును ( అవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్ ). అదియే మోక్షము. అతడు ఈశ్వరుని అనుగ్రహమును ఎట్లు సంపాదించినాడు ? ఆతడు ఈశ్వరుని ఆశ్రయించినాడు ( మద్వ్యపాశ్రయః ) గనుక, అంతఃకరణశుద్ధిని పొంది తద్ద్వారా మానసిక-ఉల్లాసమును, జ్ఞానములో స్పష్టతను మరియు మనఃప్రసన్నతను పొందును. దానికి ప్రసాదము అని పేరు. తరువాత, ఆతడు యోగ్యమగు ఉపదేశమును శ్రవణము చేయును. ఏలయనగా, ఈశ్వరానుగ్రహము లేనిదే, యోగ్యమగు ఆచార్యుడు లభించడు ; శాస్త్రశ్రవణము ఘటిల్లదు. బాహ్యపరిస్థితులతో బాటు దేహము మరియు మనస్సు కూడ ఆతని సాధనకు అనురూపముగా నుండును. ఇవి అన్నియు ఈశ్వరప్రసాదమే. లోతుగా పరిశీలిస్తే ఈ అన్వేషణ అంతా ఈశ్వరానుగ్రహము తక్క మరియొకటి కాదని స్పష్టమగును.

కర్మయోగి కాలక్రమములో అదే జ్ఞాననిష్ఠను పొందును. కర్మయోగి కూడ ముముక్షువే గదా ! అతడు కర్మఠుని వలె స్వర్గాది ఫలముల కొరకు కర్మలను చేయుట లేదు. కావున, ఆతడు ఈ చరమలక్ష్యమును చేరకపోయే ప్రసక్తియే లేదు. కావున,

అధ్యాయము 18 , శ్లోకము 57 :

चेतसा सर्वकर्माणि मयि सन्न्यस्य मत्परः ।
बुद्धियोगमुपाश्रित्य मच्चित्तस्सततं भव ।। ५७ ।।
చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ ( 57 ).

సర్వకర్మాణి = కర్మలనన్నింటినీ, చేతసా = మనస్సుచే, మయి = నాయందు, సన్న్యస్య = సమర్పించి, మత్పరః = నేనే లక్ష్యముగా గలవాడవై, బుద్ధియోగమ్ = కర్మయోగజీవనమును, ఉపాశ్రిత్య = చేపట్టి, సతతమ్ = సర్వదా, మచ్చిత్తః = నాయందు మనస్సు గలవాడవై, భవ = అగుము.

కర్మలనన్నింటినీ మనస్సుచే నాయందు సమర్పించి, నేనే లక్ష్యముగా గలవాడవై, కర్మయోగజీవనమును చేపట్టి, సర్వదా నాయందు మనస్సును నిలిపి యుంచుము ( 57 ).

నీ మనస్సును సర్వదా నాపై నిలిపి యుంచుము ( మచ్చిత్తస్సతతం భవ ) అని భగవానుడు అర్జునునకు సలహానిచ్చినాడు. కొందరికి మనస్సు పరమేశ్వరునిపై లేశమైనను ప్రసరించదు. కొందరికి శుక్రవారము, ఆదివారము మొదలైన కొన్ని రోజులలో ఉదయము, లేక సాయంకాలము మొదలైన కొన్ని సమయములలో అప్పుడప్పుడు మనస్సు పరమేశ్వరుని మీదకు మళ్లును. ఆ సమయములలో వారు ప్రార్థనను చేసి మనస్సును భగవంతునిపై నిలిపెదరు. మిగిలిన సమయములలో ఈశ్వరుని జోలికి పోరు. కాని, ఇచట శ్రీకృష్ణుడు అర్జునుని సర్వదా మనస్సును తనపై నిలుపుమని చెప్పుచున్నాడు. దీని అర్థమేమి ? ఆతనికి పరమేశ్వరుని ఆలోచన తప్ప మరియొక ఆలోచన ఉండరాదా ? అతడు సర్వకాలములలో ఈశ్వరుని ధ్యానించుచున్నచో, తన కర్తవ్యమును ఎట్లు చేయగల్గును ? దీనిలో ఇబ్బంది లేదు. సర్వము ఈశ్వరుడే. అందువలననే, సర్వకర్మలను మనస్సుచే

(చేతసా ) సమర్పించుమని చెప్పినాడు. ఆ మనస్సు ఎట్టిది ? వివేకముతో కూడిన మనస్సు అని శ్రీశంకరులు జోడించిరి.

కర్మలకు దృష్టము, అదృష్టము అనే రెండు రకముల ఫలములు గలవు. ఉదాహరణకు దానమును చేసినప్పుడు దాతకు ఒక తృప్తి కలుగును. అది దృష్టఫలము. మరియు ఆతనికి పుణ్యము లభించి దానివలన భవిష్యత్తులో సుఖము సంప్రాప్తమగును. అది అదృష్టఫలము. అదే విధముగా నిత్యప్రార్థనను చేయుట, యజ్ఞమును చేయుట మొదలగు కర్మల వలన అంతఃకరణశుద్ధి, మనఃప్రసన్నత, జీవితములో తారసిల్లే ఘటనలను అంగీకరించే స్వభావము, రాగద్వేషములనుండి ఒక స్థాయి వరకు విముక్తి అనే దృష్టఫలములు వెంటనే కలుగును. ఇంతేగాక, మనకు ఇష్టము ఉన్నా, లేకపోయినా, ఆ కర్మల వలన పుణ్యము వచ్చును. కొన్ని కర్మలు అంతఃకరణశుద్ధి మొదలగు తత్క్షణఫలముల కొరకు చేయుదురు. మరికొన్ని కర్మలు భవిష్యత్తులో లభించే స్వర్గాదిఫలముల కొరకు చేయబడును. ఈ కర్మలనన్నింటినీ యోగ్యమగు మనఃప్రవృత్తితో పరమేశ్వరునకు సమర్పించవలెను. సర్వకర్మలను నాకు మసస్సుతో సమర్పించవలెను ( సర్వకర్మాణి మయి మనసా సన్న్యస్య ) అని భగవానుడు చెప్పుచున్నాడు. నీవు ఏ కర్మను చేసినా, నాకు సమర్పించి చేయుము ( యత్ కరోషి ---- తత్ కురుష్వ మదర్పణమ్ ) అని ఆయన పూర్వములో చెప్పియున్నాడు. ' ఇది నా కర్తవ్యము ; కావున నేను చేయుచున్నాను ' అనే మనఃప్రవృత్తితో తన యెదుట సంప్రాప్తమైన కర్మను ఆచరించినచో, దానియందు ఈశ్వరుడు ఉండును. ఒక విశిష్టదేశకాలములలో మన యెదుట ఒక కర్తవ్యము సంప్రాప్తమగుటను బట్టి ఈశ్వరుని ఈ జగద్రచనలో మనము ఒక అంగమై యున్నామని స్పష్టమగుచున్నది. నేను చేయదగిన కర్మ ఈశ్వరుని అధ్యాదేశము అనే గుర్తింపు సామాన్యమైన విషయము కాదు. జాగ్రత్తగా విశ్లేషించినచో, తప్పించలేనిది సర్వము ఈశ్వరుడు తక్క మరియొకటి కాదని తేలును. మానవుడు ఒకటి తలపోస్తే, ఈశ్వరుడు మరొకటి తలపోస్తాడు అనే నానుడి ఒకటి గలదు. ఏది జరిగినా ఈశ్వరుని ఇచ్ఛయే అని కూడా చెప్తారు. ఈ మాటలను మనము సరిగ్గా తెలుసుకోవాలి. మనకు ఇది జరగాలి, అది జరగాలి అంటూ ఈశ్వరుడు కోరుకుంటాడు అనుకోరాదు. రేపు నీకు తలపోటు రావాలని ఈశ్వరుడు కోరుకోడు. అది ప్రకృతినియతి ప్రకారముగా జరుగతుంది. ఆ నియతియే ఈశ్వరుడు. ఈశ్వరేచ్ఛలో నీ గతకాలీనకర్మ కూడా అంతర్భాగమై యున్నది. ఫలమునకు హేతువు అయ్యే కర్మసూత్రము, మరియు ధర్మసూత్రము కేవలము యాంత్రికముగా పని చేయవు. ఆ రూపములో చైతన్యస్వరూపుడగు ఈశ్వరుడే ప్రకటమగుచున్నాడు. తప్పించజాలని పరిస్థితులన్నియు ఈశ్వరేచ్ఛయే. ఈ సత్యమును తెలిసిన వ్యక్తి వివిధపరిస్థితులలో తన కర్తవ్యమును పాలించుచుండును. సర్వకాలములలో నిరంతరముగా జరుగుతూ ఉండే సృష్టిస్థితిసంహారములతో కూడియున్న ఈ బ్రహ్మాండము అనే సమష్టిమహాయజ్ఞములో మానవుని కర్తవ్యకర్మ కూడ అంగమై యున్నది. ఈ సృష్టి మరిగే నీటితో నిండియున్న కుండవంటిది. ఆ నీటిలోని బుడగల విన్యాసము మారిపోవుచుండును. కాని ఆ మార్పులు అన్నియు నిర్దిష్టసూత్రములకు అనురూపముగా నుండును. ఒక బుడగ పెద్దది ; మరియొకటి చిన్నది. ఒకటి ఇప్పుడే పగిలినది ; మరియొకటి ఉపరితలమునకు వచ్చుచున్నది.

ఒక బుడగ చిన్నది కాగా, మరియొకటి పెద్దదిగా నుండనేల ? ఈ బుడగ ఇప్పుడు ఇక్కడ నుండుటకు కారణమేమి ? ఈ విషయముల నన్నింటినీ నిర్ధారించే ప్రకృతిసూత్రములు గలవు. దీనిలో యుక్తిసంగతములు కాని అంశములు ఏవియూ లేవు. సూత్రములు అన్నియు మనకు తెలియక పోవచ్చును. మనము ఈ బుడగల వంటి వారము. ప్రతి మానవుడు విశిష్టకాలములలో విశిష్టకర్మలను చేయవలసి యుండును. అదియే ఈశ్వరేచ్ఛ. ఈ సత్యమును గుర్తించి ఆ అవగాహనతో కర్తవ్యకర్మలను చేసినచో, అది ఈశ్వరార్పణమగును.

ఈ వ్యక్తి పూర్ణముగా నాకు అంకితమై యుండును ( మత్పరః ) అని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. అతనికి లక్ష్యము ఈశ్వరుడు తక్క మరియొకటి కాదు. అతడు అల్పఫలముల కొరకై ఈశ్వరుని సాధనముగా వాడుకొనుట లేదు. అల్పఫలములను సంపాదించుట కొరకై ఈశ్వరుని కృపను అర్థించుటలో దోషము లేదు. ఆ విధముగా ఈశ్వరుని ఆరాధించు వ్యక్తి కూడ భక్తుడే ( అర్థార్థీ ). కాని, మనమిచట ఈశ్వరుని కృపను అల్పలక్ష్యముల కొరకు గాక, ఈశ్వరుని కొరకు మాత్రమే అర్థించే జిజ్ఞాసువును గురించి చర్చించుచున్నాము. అతని లక్ష్యము ఈశ్వరుడే గనుక, అతనికి ఈశ్వరుడు తక్క మరియొక ఆశ్రయము లేదు. ఇచట బుద్ధియోగమనగా కర్మయోగమని యర్థము. ' నీవు కర్మయోగజీవనమును చేబట్టి, నీ మనస్సును సర్వదా నాయందు నిలిపి యుంచుము ( బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ ) ' అని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. భగవానుని పాదముల వద్ద శరణాగతి ఉదయము గాని, సాయంకాలము గాని చేసేది కాదు ; సర్వకాలములలో భగవానుని శరణు పొంది ఉండవలెను.

కర్మయోగమనగా శరణాగతి భావనతో కూడిన ఆధ్యాత్మికజీవనము. దీనియందు ఈశ్వరుడు ఉండి తీరును. ఈశ్వరనిరపేక్షమగు కర్మయోగము లేదు. ఈశ్వరసంబంధము లేకుండగనే కార్యములను సాధించ గోరువాడు అనావశ్యకమగు ఒత్తిడిని అధికముగా సృష్టించుకొను చున్నాడు. ఏలయన, అతడు తన అధీనములో లేని విషయములకు తాను బాధ్యత వహించుచున్నాడు. తన బాధ్యత లేశమైననూ లేని విషయములలో కూడ బాధ్యతను వహించే వ్యక్తి ఒత్తిడికి గురియై సమస్యలను కొని తెచ్చుకొనును. ఆరంభములో అతనికి కొంత విజయము లభించవచ్చును. కాని, తరువాత అతడు ఆపదలలో చిక్కుకొనును. కర్మయోగములో ఆదుర్దా ఉండదు గనుక, వ్యక్తిలో సహజముగా కార్యక్షమత నెలకొనును. ఏమి యగునో ! అనే చింత లేని వ్యక్తికి చింతలో సమయము వృథా కాదు. అతనికి స్వీయసామర్థ్యములన్నియు ఉపలభ్యముగా నుండును. అతడు తాను చేయగలిగిన మేరకు కర్మను చేయును. కార్యకుశలత యనగా కార్యసిద్ధి కానక్కరలేదు. వ్యక్తిత్వము పూర్ణముగా కార్యమునందు లభ్యమగుటయే కార్యకుశలత యగును. వ్యక్తి యొక్క సామర్థ్యములు, భావావేగములు, మనస్సు, ఇంద్రియములు మరియు నైపుణ్యములు అన్నీ చేతిలోనున్న పనికొరకై ఉపలభ్యముగా నుండుటయే ప్రముఖమైన విషయము. ఉపలభ్యముగానున్న ఈ శక్తులు అల్పముగా నుండుట సమస్య కాదు. సర్వమానవుల శక్తులు అల్పమైనవియే. కాని, ఆ అల్పశక్తులను వ్యక్తి ఈశ్వరార్పణబుద్ధితో వినియోగించే సందర్భములో అవి పూర్ణముగా ఉపలభ్యమగుచుండును. ఇట్టి స్థితిలో కార్యకుశల

తకు లోపము ఉండే ప్రసక్తి లేదు. మరియు కర్మయోగమనగా కేవలకార్యకుశలత కానే కాదు. కర్మయోగమనగా ఆధ్యాత్మికజీవనము. కావున, భక్తి లేని కర్మయోగము లేదు.

బుద్ధియోగమనగా మనోనిశ్చయమని శ్రీశంకరులు వివరించిరి. మోక్షము మాత్రమే ఏకైకపురుషార్థము అని గుర్తించిన వ్యక్తియొక్క మనస్సు దృఢముగా నుండును. కాని, ఈ లక్ష్యము విషయములో సరియగు అవగాహన లేని వ్యక్తి యొక్క మనస్సు ఛిన్నాభిన్నముగా నుండును ( వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునందన, బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోऽవ్యవసాయినామ్ ) అని మనము 2 వ అధ్యాయములో చూచియున్నాము.లక్ష్యశుద్ధి లేని వాని లక్ష్యములకు అంతము లేదు. కాని లక్ష్యశుద్ధి గలవాని యెదుట ఒకే ఒక కార్యయోజన గలదు. ఆతడు తనకు ఈశ్వరునితో గల అభేదమును దర్శించుట కొరకై తన మనస్సును సజ్జితము చేసుకొనవలెను. సర్వము ఆ ప్రయోజనము కొరకు మాత్రమే ఉద్దేశించ బడును. కావున, సర్వమునకు ఒక లక్ష్యము ఉండును. దాని కొరకై ఎంత క్లేశమును పడవలెను ? ఎంత సమయము పట్టును ? అను విషయములకు ప్రాధాన్యము లేదు. అట్టి వాని బుద్ధి దృఢముగా మోక్షపురుషార్థమునకు అంకితమై యున్నది. కావున, ఆతని కర్మ యోగమగును.

సర్వదా ఈశ్వరునిలో మనస్సు విలీనమై యున్నచో, ఏమగును ?

**అధ్యాయము 18 , శ్లోకము 58 :**

मच्चित्तस्सर्वदुर्गाणि मत्प्रसादात्तरिष्यसि ।

अथ चेत्त्वमहङ्कारान्न श्रोष्यसि विनङ्क्ष्यसि ।। ५८ ।।

మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి

అథ చేత్త్వమహంకారాన్న శ్రోష్యసి వినంక్ష్యసి ( 58 ).

**మచ్చిత్తః** = నాయందు మనస్సును నిలిపిన వాడవై, **మత్ప్రసాదాత్** = నా అనుగ్రహము వలన, **సర్వదుర్గాణి** = కష్టములనన్నింటినీ, **తరిష్యసి** = తరించగలవు, **అథ** = కాని, **త్వమ్** = నీవు, **అహంకారాత్** = అహంకారము వలన, **న శ్రోష్యసి చేత్** = విననిచో, **వినంక్ష్యసి** = వినాశమును పొందగలవు.

నాయందు మనస్సును నిలిపినవాడవై నా అనుగ్రహము వలన కష్టముల నన్నింటినీ తరించగలవు. కాని, నీవు అహంకారముచే నా మాటను చెవిని పెట్టనిచో, వినాశమును పొందగలవు ( 58 ).

దుర్గము అనగా తరించుటకు కష్టమైనది అని యర్థము. కొండకొమ్ము, సన్నని దారి మొదలైన వాటిని దాటుటలో అధికమైన క్లేశము గలదు. వాటికి దుర్గము అని పేరు. కావున, దుర్గము అనగా సంసారహేతువు అని శ్రీశంకరులు వివరించిరి. కర్మలు పుణ్యపాపములకు తద్వారా కొత్త కొత్త జన్మలకు హేతువులగును. కావున, కర్మ దుర్గమనబడును. కర్మలు కర్తృత్వధారణనుండియు, అది అజ్ఞానమునుండియు పుట్టును. ఇవి అన్నియు తరించుటలో అధికక్లేశమును కలిగించునవియే. కాని, తరించుటకు కష్టమైన ఈ దుర్గముల నన్నింటినీ ( సర్వదుర్గాణి ) కర్మయోగజీవనమునకు అంకితమైన నీవు తరించగలవు ( తరిష్యసి ).

నీవు నా మాటను వినవనుకో ( అథ చేత్ న శ్రోష్యసి ). నీకు గల అహంకార ముచే నాకు సర్వము తెలియుననియు, సర్వమును నేను నా అధీనములో నుంచుకొందున నియు, నేను ఈ ఉపదేశమును పాటించ వలసిన పని లేదనియు నీవు తలపోసే అవకా శము గలదు. అజ్ఞానమునుండి పుట్టిన అహంకారము వలన నీకు నా మాటలు తెలియక పోవచ్చును. ఆ పక్షములో నీవు వినాశమును పొందెదవు ( వినంక్ష్యసి ). అనగా నీ లక్ష్యము నెరవేరదు. నీవు కోరే శ్రేయస్సు నీకు దూరమగును. ఏలయన, నీవు దానికి ఇంకనూ అర్హుడవు కాదు. నీవు సన్న్యాసమునకు అర్హత లేకుండగనే కర్మను పరిత్యజించి నచో, నీవు సన్న్యాసివి కావు ; కర్మయోగివి కావు. కావున, నీవు వినాశమును పొందెదవు. అనగా, నీవు అన్వేషిస్తున్న లక్ష్యము నీకు దూరమగును. అర్జునుడు సరిగా తెలుసుకోవా లనే ఆకాంక్షతో శ్రీకృష్ణుడు ఈ విధముగా హెచ్చరించినాడు. ఏలయనగా, నీకు నచ్చిన విధముగా ఆచరించుము ( యథేచ్ఛసి తథా కురు ) అని ఆయన అర్జునునకు పూర్తి స్వేచ్ఛను ఈయబోవుచున్నాడు. కావున, తాను చెప్పదలచిన ఉపదేశమును భగవానుడు ఈ లోపులో సమగ్రముగా చెప్పుచున్నాడు.

శ్రీకృష్ణుడు అర్జునునితో ఇట్లు చెప్పుచున్నాడు : నీవు చేయదగిన కర్తవ్యము ఉల్లా సకరమైనది కాకపోవచ్చును. కాని నీవు దానిని పరిత్యజించినచో, భవిష్యత్తులో ఇంతకంటె అధికమగు పీడను కలిగించే కర్మను చేయవలసి రావచ్చును. ఏలయన, నీ స్వభావము నిన్ను ఆ తీరున ప్రేరేపించును. యుద్ధరంగమునుండి పారిపోయినవాడు అని జనులు అర్జునుని నిందించినచో, అతడు కోపమును ఆపుకొనలేక వారితో యుద్ధమునకు దిగవచ్చు ను. ఏలయనగా, ఎవ్వరైననూ స్వభావమును పూర్తిగా విడనాడలేరు. అర్జునుడు ఆ సమ యములో తన స్వభావములోని బలహీనతను గుర్తించి సరిదిద్దుకొన వలెను. ' నాకు మోహము తొలగిపోయినది ; నేను నీవు చెప్పినట్లే చేయగలను ( నష్టో మోహః స్మృతి ర్లబ్ధా కరిష్యే వచనం తవ ) ' అని అర్జునుడు తరువాత చెప్పగలడు. తన స్వభావమును బట్టి తనకు కర్మను అనుష్ఠించుట కూడ మోక్షసాధనమే యగునని అతడు తెలుసుకున్నా డు. అతనికి జ్ఞానము కలిగిన మాట వాస్తవమే. కాని, భవిష్యత్తులో అతని ప్రవర్తనను బట్టి, మరియు భగవానుడు ఇప్పుడు అర్జునునితో పలికిన పలుకులను బట్టి, అతని జ్ఞానమునకు కొన్ని ఆటంకములు గలవని స్పష్టమగుచున్నది.

' నేను స్వతంత్రుడను ; నేను ఇతరులు చెప్పినట్లు ఏల చేయవలెను ? ' అనే అహంకారము ఉండరాదని చెప్పి, శ్రీశంకరులు తరువాతి శ్లోకమును ఉపక్రమించినారు.

**అధ్యాయము 18 , శ్లోకము 59 :**

यदहङ्कारमाश्रित्य न योत्स्य इति मन्यसे ।
मिथ्यैष व्यवसायस्ते प्रकृतिस्त्वां नियोक्ष्यति ।। ५९ ।।
యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి ( 59 ).

అహంకారమ్ = అహంకారమును, ఆశ్రిత్య = పట్టుకొని, న యోత్స్యే = యుద్ధమును చేయను, ఇతి = అని, మన్యసే యది = నీవు తలంచినచో, తే = నీయొక్క, ఏషః = ఈ,

వ్యవసాయః = నిశ్చయము, మిథ్యా= తప్పు, ప్రకృతిః = ( నీ ) స్వభావము, త్వామ్ = నిన్ను, నియోక్ష్యతి = నియోగించ గలదు.

నీవు అహంకారమును పట్టుకొని ' నేను యుద్ధమును చేయను ' అని తలంచినచో, నీ ఈ నిశ్చయము తప్పు. నీ స్వభావము నిన్ను నియోగించగలదు ( 59 ).

అర్జునుడు యుద్ధమును చేయరాదని నిశ్చయించినచో, ఆ నిశ్చయము అతని స్వభావమునకు అనురూపమైనది కాదు గనుక తప్పు అగునని శ్రీకృష్ణునకు తెలియును. అతని ఆ నిశ్చయమునకు వెనుక ఉండేది సంకల్పశక్తియే గాని, స్వభావము కాదు. స్వభావమునకు అనురూపమైన నిశ్చయమైనచో, అది యోగ్యమగు నిర్ణయమగును. కాని, ఈ నిర్ణయము అట్టిది కాదు గనుక, అది అతనికి సహాయకారి కాదు. అతడు యుద్ధరంగమును విడచి వెళ్లి, సాధుజీవితమును చేపట్టవచ్చును. కాని, దానివలన అతడు భవిష్యత్తులో సమస్యలను ఎదుర్కొన వలయును. ఎందు వలన ? ' నీ స్వభావము నిన్ను బంధించును ( ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి ) '. తరువాతి కాలములో జనులు అతనిని భయముతో యుద్ధరంగమునుండి పారిపోయిన పిరికివాడని నిందించెదరు. అర్జునుడు దయాగుణముచే యుద్ధమును వీడి వెళ్లినాడనే సత్యము జనులకు తెలియని విధముగా దుర్యోధనుడు ప్రచారమును చేయును. అర్జునుడు వెళ్లగానే, యుద్ధము ఆగిపోవును. ఒక్క బాణమునైననూ ప్రయోగించకుండగనే దుర్యోధనుడు విజయమును పొందును. ప్రతిపక్షమునకు యుద్ధమునందు అభిరుచి లేకుండుటచే తాను విజయమును పొందినానని దుర్యోధనుడు చెప్పడు. పైగా, తన సైన్యశక్తిని గాంచి అర్జునుడు భయపడి పారిపోయెనని బీరములు పలుకును. అర్జునుడు దయాగుణము వలననే యుద్ధమును పరిత్యజించినాడని దుర్యోధనునకు తన హృదయములో తెలియుచుండును. కాని తాను పాలించే రాజ్యములోని జనులు పాండవులపై అనురాగమును కలిగియుండుట అతనికి అభీష్టము కాదు. జనులు విప్లవమును తీసుకువచ్చే ప్రమాదము రాకుండా అతడు చూచుకోవాలి. కావున, జనులకు ఆ సత్యము తెలియకుండగా అతడు జాగ్రత్త పడతాడు. వ్యూహములో నిలబడియున్న శత్రుసైన్యమును చూచి అర్జునుడు భయపడి పారిపోయినాడని జనులందరు విశ్వసించే విధముగా దుర్యోధనుడు ప్రచారకార్యక్రమమును చేబట్టును. అపుడు అర్జునుడు కోపముతో మండిపడక తప్పదు. కావున, యుద్ధమును చేయరాదనే నిశ్చయము నిలబడేది కాదు. అర్జునుడు బ్రాహ్మణ స్వభావస్థాయికి ఇంకనూ ఎదగలేదు. అతడు ఇంకనూ క్షత్రియస్వభావమును కలిగియున్నాడు. అర్జునుడు విధిని బట్టి మాత్రమే కాకుండా, స్వభావము చేత కూడా క్షత్రియుడు. భవిష్యత్తులో ఆ స్వభావము అతనిని మరల యుద్ధమునకు పురిగొల్పును. మరియు,

**అధ్యాయము 18 , శ్లోకము 60 :**

स्वभावजेन कौन्तेय निबद्धस्स्वेन कर्मणा ।
कर्तुं नेच्छसि यन्मोहात्करिष्यस्यवशोऽपि तत् ॥ ६० ॥

స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్యస్యవశోపి తత్ ( 60 )

**కౌంతేయ** = కుంతీపుత్రుడవగు ఓ అర్జునా !, **స్వభావజేన** = స్వభావమునుండి పుట్టిన, **స్వేన** = నీ, **కర్మణా** = కర్మచే, **నిబద్ధః** = నిశ్చయముగా బంధించబడిన వాడవై, **మోహాత్** = భ్రాంతి వలన, **యత్** = దేనిని, **కర్తుమ్** = చేయుటకు, **న ఇచ్ఛసి** = నీవు ఇష్టపడుట లేదో, **తత్ అపి** = అదే కర్మను, **అవశః** = నిస్సహాయస్థితిలో, **కరిష్యసి** =చేయగలవు.

కుంతీపుత్రుడవగు ఓ అర్జునా ! నీవు నీ స్వభావమునుండి పుట్టిన కర్మచే నిశ్చితముగా బంధించబడి యున్నావు. నీవు భ్రాంతి వలన ఏ కర్మను చేయుటకు నిరాకరించుచున్నావో, అదే కర్మను నిస్సహాయ స్థితిలో చేయగలవు ( 60 ).

మానవుని స్వభావమును సత్త్వరజస్తమోగుణముల మేళవింపు నిర్ధారించును. అట్టి స్వభావమునుండి పుట్టినది స్వభావజమ్ అనబడును. మానవుడు ఈ స్వభావముచే నిశ్చితముగా బంధించబడినవాడై ( నిబద్ధః ), తనకు ఇష్టము లేని కర్మలను కూడా ( యత్ కర్తుం నేచ్ఛసి ) చేయుచుండును. నీ స్వభావమునకు అనురూపమగు కర్మను చేయుట నీకు ఏల అభీష్టము కాకున్నది ? ఏదో ఒక భ్రాంతి వలన ( మోహాత్ ). ఆవేశములో తీసుకున్న నిర్ణయము వలన గాని, లేక సందర్భము కాని దయ వలన గాని, అర్జునుడు యుద్ధములో పాల్గొనరాదని తలంచెను. దయ చాల మంచి గుణము. కాని, ఎన్ని పాపములు గ్రంథములలో వర్ణించబడినవో అన్నింటినీ దుర్యోధనుడు చేసియుండెను. కావున, ఇప్పుడు అతడు దయకు అర్హుడు కాడు. ఇప్పుడు అతని దూకుడుతనమునకు అడ్డుకట్టను వేయవలెను. అర్జునుడు తన జ్ఞాతిపై సందర్భశుద్ధి లేని దయ గలవాడై యుద్ధమునుండి విరమించుకున్నచో, అతడు భవిష్యత్తులో అనేకసమస్యలను ఎదుర్కొనవలసి యుండును. అది అవివేకమునుండి ( మోహాత్ ) పుట్టిన చర్య యగును. ఏ కర్మను నీవు ఇప్పుడు చేయగోరుట లేదో, అదే కర్మను నీవు భవిష్యత్తులో నీ అభీష్టమునకు విరుద్ధముగా చేయక తప్పని పరిస్థితి వచ్చును ( కరిష్యస్యవశోఽపి తత్ ). ఈ ఆవేశము తగ్గిన తరువాత నీవు చేసిన తప్పును తలచుకొని తాపమును పొందెదవు. లేదా, జనులు మరల నిన్ను యుద్ధములోనికి నెట్టెదరు. ప్రేరణ ఏదైనా, ఒక విశిష్టస్వభావమునకు పూర్తిగా లొంగి యున్న నీవు నిశ్చితముగా ఆ స్వభావమునకు తగిన విధముగా మాత్రమే ఆచరించెదవు. దానినుండి నీవు తప్పించుకొన లేవు. ఏలయనగా, సంకల్పశక్తిచే స్వభావమును మార్చివేయుట సంభవము కాదు. సంకల్పశక్తిచే మానవుడు తనలో మార్పును తెచ్చే పరిస్థితిని కల్పించుకొన వచ్చును. కాని, మార్పు వచ్చుటకు సమయము పట్టును. స్వభావములో మార్పు ఒక రోజులో వచ్చేది కాదు. అర్జునుడు ఈ యుద్ధము అనే అనుభవమును తప్పించుకొనుట కంటె, దానిలో పయనించుటయే మేలు. ఈ పరిస్థితి తనంత తానుగా అతని ముందు సంప్రాప్తమైనది. కావున, అతడు తన వంతు కర్తవ్యమును చేయవలెను. అతడు అట్లు చేయనిచో, స్వభావమునకు విరుద్ధముగా ప్రవర్తించిన వాడు అగును. దీనిని బట్టి మనమందరము మన స్వభావమునకు అనురూపముగా కర్మల నాచరించ వలెనని స్పష్టమగుచున్నది. ఇతరులు చేసే దానివి చూచి, దానిని ఆధారముగా చేసుకొని మన

కర్మను నిర్ణయించుకొనుట సరిగాదు. మనము మనకు ఏది మంచిది అను విషయమును నిర్ధారించుకొని దానికి అనురూపముగా ప్రవర్తించవలెను.

కర్మను యోగరూపముగా ఆచరించుట మోక్షమునకు విరోధి కాదు. కేవలకర్మ దాని స్వరూపముచే మోక్షమునకు విరోధి. ఏలయన, ఆత్మ-అజ్ఞానమునుండి మాత్రమే కర్మ పుట్టును. కొన్ని అల్పములగు ఫలములను గోరి కర్మలనాచరించినచో, ఆ ఫలములు మాత్రమే లభించును. కావున, కర్మ బంధమే గాని మోక్షహేతువు కాదు. కాని కర్మను అల్పఫలముల కొరకు గాక యోగముగా ఆచరించినచో, మోక్షమునకు కావలసిన సంసిద్ధత లభించును. ప్రతిబంధకములు లేని జ్ఞానము ఉదయించుటకు సాత్త్వికస్వభావము ఆవశ్యకమగుచున్నది. మనము మన స్వభావమును సాత్త్వికముగా తీర్చిదిద్దుకొనుటకు కావలసిన క్షేత్రము కర్మయోగికి లభ్యమగుచున్నది. జిజ్ఞాసువు ప్రతిబంధకముల నన్నింటినీ తొలగించుటకై ఈశ్వరునియందు మనస్సును నిలిపి కార్యక్షేత్రములో విధినిర్వహణకు అంకితము కావలెను. సన్న్యాసి దేనిని సాధించునో, అది కర్మయోగికి కూడ లభించును ( *యత్ సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే* ) అని భగవానుడు 5 వ అధ్యాయములో స్పష్టము చేసి యున్నాడు. మనము స్వభావముపై బలవంతముగా సంకల్పశక్తిని రుద్దజాలము. అట్లు చేయుట వలన స్వభావములో మార్పు రాదు. ఆ సంకల్పశక్తి ఒక ఆవేశస్వభావమునుండి పుట్టినది. అనగా స్వభావము ఇంకనూ పరిణతి చెందవలసి యున్నదని స్పష్టమగుచున్నది. ' నేను సన్న్యాసిని కావాలి ' అని గట్టిగా నిర్ధారించుకొని సన్న్యాసి అయినచో, అది సాధారణముగా సఫలము కాదు. కర్మయోగజీవితమును గడుపకుండగా సన్న్యాసియొక్క స్వభావమును పొందుట సరళము కాదు ( *సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః* ). కావుననే, శ్రీకృష్ణుడు అర్జునునకు కర్మయోగము విశిష్టమైనది ( *కర్మయోగో విశిష్యతే* ) అని చెప్పెను.

**అధ్యాయము 18 , శ్లోకము 61 :**

ईश्वरस्सर्वभूतानां हृद्देशेऽर्जुन तिष्ठति ।

भ्रामयन् सर्वभूतानि यंत्रारूढानि मायया ।। ६१ ।।

ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి

భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ( 61 ).

**అర్జున** = ఓ అర్జునా ! , **ఈశ్వరః** = ఈశ్వరుడు, **సర్వభూతానామ్** = సర్వప్రాణులయొక్క, **హృద్దేశే** = బుద్ధిస్థానమునందు, **యంత్రారూఢాని** = యంత్రముపై అధిరోహించినట్లు ఉన్న, **సర్వభూతాని** = సర్వప్రాణులను, **మాయయా** = మాయచే, **భ్రామయన్** = త్రిప్పుచూ, **తిష్ఠతి** = ఉన్నాడు.

ఓ అర్జునా ! యంత్రముపై అధిరోహించినట్లు ఉన్న సర్వప్రాణులను
ఈశ్వరుడు వాటి బుద్ధిస్థానమునందు ఉన్నవాడై మాయచే త్రిప్పు
చున్నాడు ( 61 ).

మనస్సు, ఇంద్రియములు మొదలగునవి సరియగు తీరులో పనిచేయుటకు, మరియు జగత్తు అంతయు స్థితిని పొందుటకు ఈశ్వరుడే కారణమగుచున్నాడు. ఆ ఈశ్వ

రుడు బుద్ధిస్థానమునందు ( హృద్దేశే ) ఉన్నాడని చెప్పబడెను. ఏలయన, చైతన్యము ప్రకటమయ్యేది అచటనే. మానవుడు సర్వజగత్తును అచటనే దర్శించుచున్నాడు ; మరియు, ఆత్మయొక్క ఉనికిని అచటనే గుర్తించుచున్నాడు. మానవుడు 'నేను ఉన్నాను ' అనే అనుభవమును అచటనే పొందుచున్నాడు. ఈ విషయము సర్వప్రాణులకు ( సర్వభూతానామ్ ) సమానముగా నున్నది. ఈశ్వరుడు అచట నివసించి సర్వప్రాణులు కదలాడునట్లు చేయుచున్నాడు ( భ్రామయన్ సర్వభూతాని ). అసంగుడైన ఈశ్వరుని ఉనికి వలననే మనస్సు మనస్సు అయినది ; బుద్ధి బుద్ధి అగుచున్నది ; కన్నులు కన్నులు అగుచున్నవి ; చెవులు చెవులు అయినవి. ఈశ్వరుడు కేవలము తన ఉనికి మాత్రముచే మనస్సు, ఇంద్రియములు మరియు సర్వజగత్తు కదలాడునట్లు చేయుచున్నాడు. వెనుకనున్న ఆత్మ వలన మాత్రమే సర్వము కదలాడుచున్నది. ఆత్మ లేనిదే ఏ పదార్థమునకైననూ ఉనికియే లేదు. ఆత్మ తన ఉనికిని మరియు స్ఫూర్తిని మనస్సు, ఇంద్రియములు మొదలగు వాటికి ఇచ్చి తాను దాగియున్నది.

శ్రీశంకరులు ఇచట అర్జునశబ్దమునకు అర్థమును వివరించిరి. అర్జునుడనగా శుద్ధమగు స్వభావము గలవాడు. అతనికి నిర్మలమగు అంతఃకరణము గలదు. అర్జునశబ్దము స్వచ్ఛత మరియు ప్రకాశము అనే అర్థములో ఋగ్వేదములో ప్రయోగించబడినది. అహశ్చ కృష్ణమహరర్జునం చ ( ఋక్ సంహిత, 6-1-2 ) అను మంత్రములో ఆకాశము నల్లని మేఘములతో నిండియున్న పగలు కృష్ణమ్ అనియు, ఆకాశము స్వచ్ఛముగా నున్నప్పుడు అర్జునమ్ అనియు వర్ణించబడినది. అర్జునునకు కోపము రాదు అని దీని యర్థము కాదు. కాని అతడు మోసగాడు కాదని ఈ పేరు సూచించుచున్నది. అతని మనస్సు స్వచ్ఛముగా నుండుటచే, అతనిలో దయాగుణము గలదు. ఈ విషయమును మనము చూచియున్నాము. కాని, అదే సమయములో అతనియందు న్యాయసంగతమగు కోపము ఉన్నది. అది కూడా జ్ఞానమునకు ఆటంకమే. భీమునితో సహా పాండవులందరికి ఇట్టి స్వచ్ఛమగు అంతఃకరణము ఉండెను. కాని, ఎవరైననూ అతనిని పరిహాసము చేసినచో, అతడు వారి ఎముకలను విరుగగొట్టును. అనగా, అతడు ఇప్పట్లో సాధువు కాలేదు. వారందరు గొప్ప ఆత్మాభిమానము గల వ్యక్తులు. వారిని కొద్దిగా నైననూ అవమానించే విధముగా ఎవరైననూ మాటలాడినచో, వారు దానికి బాధ్యులు చేయబడుదురు. ఇది పరిణతిని చెందియున్న సరళస్వభావము గల వ్యక్తియొక్క అంతఃకరణమే గాని, సాధువుయొక్క అంతఃకరణము కాదు.

తమ తమ దిశలలో తిరుగుతూ తమ తమ క్షేత్రములలో తమ తమ స్వభావములు ప్రకటమగునట్లు సర్వప్రాణులను త్రిప్పుతూ ఈశ్వరుడు బుద్ధియందు నిలిచి యున్నాడు ( హృద్దేశే తిష్ఠతి ). ఆత్మ ఉండుట వలననే కన్నులు చూచుచున్నవి ; చెవులు వినుచున్నవి ; మనస్సు సంకల్పములను మరియు కామనలను చేయుచున్నది ; సర్వకర్మలు చేయబడుచున్నవి.

ఇచట ఒక పసందైన దృష్టాంతము ఈయబడినది. యంత్రముపైకి ఎక్కించిన బొమ్మలను వలె ప్రాణులను ఈశ్వరుడు మాయచే త్రిప్పుచున్నాడు ( భ్రామయన్

సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ). భ్రమ్ అను ధాతువునకు కదలుట మరియు తిరుగుట అను రెండు అర్థములు గలవు. ఇచట 'వలె ( ఇవ ) ' అనే పదమును అధ్యాహారము చేయవలెనని శ్రీశంకరులు సూచించిరి. మనకు పనులను చేసి పెట్టే సంఘాతము ఏదైనా యంత్రమే. ఇచట యంత్రమనగా పురుషులు, స్త్రీలు, జంతువులు మొదలైన వివిధరకముల కర్ర బొమ్మలతో కూడి తిరిగే రంగుల రాట్నము వంటిది. వాటిని ఒక వ్యక్తి త్రిప్పుచుండును. కాని ఆతడు కానరాడు. కావున, అవి మాయచే తిరుగుచున్నవా యనిపించును. తిరుగుట కానవచ్చునే గాని, త్రిప్పువాడు కానరాడు. ఈ చక్రమును త్రిప్పువాని వలెనే, ఈశ్వరుడు కూడా సర్వప్రాణుల బుద్ధియందు దాగి యున్నవాడై ( హృద్దేశే తిష్ఠతి ), అవి తిరుగునట్లు చేయుచున్నాడు ( భ్రామయన్ ). ఈశ్వరుడనగా హిరణ్యగర్భుడు ; అనగా, కర్మనియతితో తాదాత్మ్యమును చెందియున్న పరమాత్మ. కర్మనియతియే ప్రారబ్ధకర్మ రూపములో సర్వప్రాణుల హృదయమునందు ఉన్నది. అదియే ఈశ్వరుడు. దీని ప్రకారముగా, ప్రతి మానవుడు తన స్వభావమునకు అనురూపముగా కర్మలననుష్ఠించుచుండును. మానవుడు సంకల్పించి ప్రయత్నపూర్వకముగా మార్పులను తెచ్చే ప్రక్రియను చేపట్టనిదే, స్వభావములో మార్పు వచ్చే ప్రసక్తి లేదు.

హరిః ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు.

ఈశ్వరుడు ఏల దాగియున్నాడు ? ఈశ్వరుడు ఆత్మరూపుడై యున్నాడు గనుక, కానవచ్చుట లేదు. పరమాత్మ యొక్క సన్నిధి మాత్రముచే మనస్సు తన కార్యములను సమర్థవంతముగా నిర్వహించ గల్గుచున్నది. కర్మనియతి పరమేశ్వరునికంటె భిన్నముగా లేదు. ప్రారబ్ధకర్మ కర్మనియతిలో భాగమే గదా ! మానవులు తమ స్వభావమునకు అనురూపముగా ప్రవర్తించుటకు, మరియు తమ కర్తవ్యములను నిర్వర్తించుటకు ప్రారబ్ధకర్మయే కారణమగుచున్నది. కావున, వాస్తవములో మన చేతిలో ఏమీ లేదు. ఈ సర్వము ఈశ్వరుడే. ఒక విశిష్టపరిస్థితిలో మన ముందు ఒక కర్తవ్యము సంప్రాప్తమగును. మనము దానిని చేయుచుందుము. నీవు సర్వము అధీనమునందున్న వానివలె చింతిల్లుటకు కారణమేమి గలదు ? కావున, సర్వము ఈశ్వరాధీనమై యున్నదని గుర్తించి నీవు నీ కర్తవ్యమును చేయుము.

**అధ్యాయము 18 , శ్లోకము 62 :**

तमेव शरणं गच्छ सर्वभावेन भारत ।

तत्प्रसादात्परां शांतिं स्थानं प्राप्स्यसि शाश्वतम् ।। ६२ ।।

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత

తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ( 62 ).

**భారత** = ఓ భరతకుమారా, అర్జునా ! , **సర్వభావేన** = పూర్ణహృదయముతో, **తమేవ** = ఆ పరమేశ్వరుని మాత్రమే, **శరణం గచ్ఛ** = శరణు పొందుము, **తత్ప్రసాదాత్** = ఆయన యొక్క అనుగ్రహముచే, **పరామ్** = పూర్ణమైన, **శాంతిమ్** = శాంతిని, **శాశ్వతమ్** = శాశ్వతమగు, **స్థానమ్** = స్థానమును, **ప్రాప్స్యసి** = పొందగలవు.

భరతకుమారుడవగు ఓ అర్జునా ! పూర్ణహృదయముతో ఆ పరమేశ్వరుని మాత్రమే శరణు పొందుము. ఆయనయొక్క అనుగ్రహముచే పూర్ణమగు శాంతిని మరియు శాశ్వతమగు స్థానమును పొందగలవు ( 62 ).

నీ జీవితము కొంతవరకు నీ అధీనములోనున్నది. కాని, సర్వము నా వశములో నున్నదని నీవు భావించినచో, అది సత్యదూరము. సర్వము నా వశములోనున్నది అని తలపోసే అహంకారముతో సహా సర్వము మనకు ఈశ్వరునిచే అనుగ్రహించ బడినది. అహంకారమనగా దేహేంద్రియమనస్సంఘాతమునందు ' నేను' అనే భావనయే గదా ! ఈ దేహము, ఇంద్రియములు, మనస్సుతో సహా ఈ ' నేను ' అనే ధారణ కూడ మనకు ఈశ్వరునిచే ఈయబడినది. మానవునకు తన ప్రవర్తన తన అధీనములో లేకుండుట అనుభవములో నున్న విషయమే. దీనికి కారణమేమనగా, ఆ ప్రవర్తనయే ' నేను '. మానవుడు తన మనస్సులో చెలరేగే ఆలోచనలకు అనురూపముగా ప్రవర్తించును. విడిచి పెట్టవలెనని తోచినప్పుడు విడిచిపెట్టును. ఒక పనిని చేయాలని తోచినప్పుడు, ఆ పనిని చేయును. ఇట్టి ప్రవృత్తిలో మానవునకు వివేకము ఉపలభ్యమగుట లేదు. మానవుడు సాక్షిరూపుడై ఒక సత్యమును గుర్తించినచో, వివేకము ఉదయించును. మనకు కర్మలపై మాత్రమే

పెత్తనము గలదనియు, వాటి ఫలములపై లేదనియు ( కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన ) గుర్తించవలెను. ఇంతేగాక, పరమేశ్వరుడే ప్రారబ్ధకర్మరూపములో మనయందు న్నవాడై సర్వమును ఆయనయే ఇచ్చుచున్నాడు. ఆ ప్రారబ్ధకర్మకు అనురూపముగా వివిధ ఘటనలు జరుగుచుండును. దానిని నియంత్రించుట యెట్లు ? కావున, ఈశ్వరునకు సంబంధించిన దానిని ఆయనకు వదలివేయుటయే మంచిది. మనము మన పనిని చేసెద ము. ఆయన తన పనిని చేయును. భగవంతునిలో అంశములైన వ్యక్తుల రూపములో నుండే మనము సర్వమును మన ఇచ్ఛకు అనుగుణముగా నియంత్రింపబూనుట తగదు. కావున, మన అధీనములో లేని విషయముల బాధ్యతను నెత్తికి ఎత్తుకొననేల ?

మన సామర్థ్యమునకు గల హద్దులను గుర్తించుట చాల ప్రముఖమైన విషయము. నేకవిషయములపై మనకు లేశమైననూ అధిపత్యము లేదు. ఉదాహరణకు, ప్రస్తుత ములో అర్జునుడు ఎదుర్కొనుచున్న యుద్ధము ఆతని వశములో నున్నచో, ఆతడు దానిని నిశ్చయముగా తప్పించి యుండెడివాడు. కాని అది ఆతని వశములో లేదు. మనము కొన్ని పరిస్థితులను ఎదుర్కొనక తప్పదు. కాని వాటిని తెలివితేటలతో ఎదుర్కొనవలెను. తప్పింప శక్యము కాని పరిస్థితిని ఎదుర్కొనకుండగా పారిపోవుట తెలివైన పని కాదు. మనకు ఒక పరిస్థితి ఎదురైనప్పుడు మనము దానిని మూర్ఖముగా గాని, సమర్థవంతముగా తెలివితేటలతో గాని ఎదుర్కొనవచ్చును. పరిస్థితులను తెలివితేటలతో ఎదుర్కొనే పద్ధతిని గీత బోధించుచున్నది. అర్జునుని హృదయము కృపచే ఆవేశింపబడి యుండుటచే, ఆత డికి ఈ పరిస్థితిని ఎదుర్కొనుటలో అభిరుచి లేదు. కావుననే, ఆ భగవానుని శరణు పొందుమని ( తస్మాత్ తమేవ శరణం గచ్ఛ ) శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. ప్రారబ్ధకర్మ ఈశ్వరుడేనని గుర్తించి మానవుడు తన స్వభావమును ఆయనకు సమర్పించినచో, అప్పుడు అట్టివాడు ఏది జరుగవలెనో అదియే జరుగునని ( భవితవ్యం భవత్యేవ ) స్వీక రించును. ఇది చాల అందమైన విషయము. దీనిని పూర్తుముగా వంటబట్టించు కొనుట సర ళము కాదు. జరిగేది జరుగుతుంది. నా కర్తవ్యమును నేను చేస్తాను. కర్మనియతి రూప ములో నున్న ఈశ్వరుని గుర్తించగల్గిన వాడు మాత్రమే ఇట్లు స్వీకరించగలడు. ఈ సృష్టి ఒక మహాయజ్ఞము. బ్రహ్మాండమనే ఈ పెద్ద తిరిగే యంత్రములో మానవుడు ఒక విడి భాగము వంటివాడు. ఈ జగత్తు అనే యంత్రములో వ్యక్తియొక్క పాత్ర చాల ప్రముఖమై నది. అట్లు గానిచో, వ్యక్తియే ఉండెడివాడు గాదు. తాను అనామకుడనని ఒకడు తలపోయ వచ్చును. కాని ఆతడు ఈ సమకాలీన సమాజములో ఒక వ్యక్తి అనేది తిరుగు లేని సత్య ము. వివిధపరిస్థితులలో ఆతడు పోషించదగిన పాత్ర గలదు. ఇది ప్రముఖమైన విషయ ము. ప్రతి వ్యక్తి ప్రముఖమైన వాడే. పెద్ద యంత్రములోని ఒక కీల తాను ఏ పనినీ చేయకుండగా స్థిరముగా నుండుటచే తన ఉనికి వ్యర్థమని తలపోయవచ్చును. కాని అది కదలిక లేకుండగా నుండుట చాల ప్రముఖమైన విషయము. ఏలయన, అది అట్లు ఉండ నిచో ఆ యంత్రము ఆగిపోవును. ప్రతి వ్యక్తియొక్క స్థానము ప్రముఖమైనది గనుకనే, ఆ వ్యక్తి ఆ స్థానములోనున్నాడు. వ్యక్తి పోషించాలని అపేక్షించబడే పాత్ర ఏదైనా ప్రముఖమై నదియే. అందువలననే, ఆ వ్యక్తి ఆ స్థానములోనుండుట తటస్థపడినది.

కావున, ఈశ్వరుని శరణు పొందుమని భగవానుడు అర్జునునకు చెప్పినాడు. శరణాగతి వలన సంసారదుఃఖము దూరమగునని శ్రీశంకరులు వ్రాక్రుచ్చిరి. శరణాగతి వలన వ్యక్తియొక్క హృదయములోని ఒత్తిడి తగ్గును. ఈశ్వరుని శరణు పొందినవాడు ఆత్మనిందకు దిగడు ; మరియు, అతడు గతమును ప్రక్కన బెట్టి దైనందిన జీవితములో ఎదురయ్యే సవాళ్లను ఎదుర్కొనును. ఈ నాడు ఉన్న పరిస్థితి రేపటికి మారిపోవును. ఎల్లుండి మరింత కొత్త పరిస్థితి ఎదురగును. అప్పుడు మాత్రమే జీవితములోని రుచిని ఆస్వాదించుట సంభవమగును. రేపు కూడా ఖచ్చితముగా ఈ రోజు వలెనే ఉండే పక్షములో, రేపు వచ్చి ప్రయోజనమేమి గలదు ? కాని ప్రతిరోజు క్రొంగ్రొత్త వింతలతో ముందుకు వచ్చును. నిత్యము కొత్త ఘటనలు జరుగుచునే యుండుటచే మనకు జీవితముపై అభిరుచి పెరుగును. గతమును ప్రక్కన బెట్టి, సర్వము తన అధీనములో నున్నదని తలంచకుండగా, ప్రారబ్ధకర్మ రూపములో నున్న ఈశ్వరుని అధీనములో సర్వము గలదని గుర్తించిన వ్యక్తి దైనందిన ఘటనా ప్రవాహములోనికి చొచ్చుకొని పోయి తన కర్తవ్యమును నిర్వర్తించు చుండును. ఇట్టి జీవితములో లభించే శాంతి అసాధారణము.

మనము శరణాగతిని తార్కికముగా గాక, భావనాత్మకముగా చేయవలెను. మన సమస్యలన్నియు భావనయందు మాత్రమే ఉన్నవి. కావున, మనము హృదయపు లోతులలో శరణాగతభావనను చేయవలెను. ఈశ్వరుని గురించి తెలుసుకొనే ప్రయత్నములో వ్యక్తి హృదయములో పరిజ్ఞానపూర్వకమైన మార్పులు వచ్చును. దానివలన అతడు ఈశ్వరుని హృదయములో తేలికగా భావన చేయగల్గును. ఇచట సర్వభావేన అను పదము అట్టి భావనాత్మకమగు ఈశ్వరశరణాగతిని నిర్దేశించును. సర్వము ఈశ్వరాధీనమని మనము పూర్ణహృదయముతో స్వీకరించవలెను. గీతాధ్యానశ్లోకములో ఒక అందమైన చిత్రణము గలదు. దానిలో శ్రీకృష్ణభగవానుడు పడవవాని ( *కైవర్తకః* ) రూపములో చిత్రించబడినాడు. కృష్ణుడు పడవను నడుపుచుండగా పాండవులు రక్తముతో నిండియున్న నదిని దాటిరి ( *సోత్తీర్ణా ఖలు పాండవై రణనదీ కైవర్తకః కేశవః* ). సంఘర్షణలతో మరియు దుఃఖముతో నిండియున్న సంసారమే ఈ రణనది. ఈ నదిని దాటుట తేలిక కాదు. దీనినిండా పెద్ద పెద్ద బండలు, సుడిగుండములు, భయంకరమగు ప్రవాహములు గలవు. దీనిని ఎట్లు దాటవలెను ? పడవను నడుపుటలో నైపుణ్యము గల వ్యక్తి లేనిచో, పడవ ఉన్ననూ వ్యర్థమే. మామూలుగా పడవను నడిపే వాడు ఈ నదిని దాటించలేడు. ఏలయనగా, ఈ నదిలో అతడు కూడ మునిగిపోవును. పడవను నడిపే వానికి ఆ పనిలో చక్కటి పరిజ్ఞానము ఉండవలెను. అతనికి దారి బాగుగా తెలిసి యుండవలెను. అతనికి ప్రతి చోటా నది లోతు, సుడిగుండములను తప్పించే విధానము తెలియవలెను. కంటికి కానరాని బండల ఉనికి అతనికి అవగతమై యుండవలెను. మన జీవితమనే పడవను ఒక్క భగవానుడు మాత్రమే నడుపగల్గును. నీవు బాధ్యతను ఆయనకు పూర్తిగా అప్పజెప్పుము. నీవు ఆవలి తీరమును చేరుట నిశ్చయము. శ్రీకృష్ణుని తన రథమునకు సారథి కమ్మని కోరి అర్జునుడు అటులనే చేసినాడు. అదే విధముగా మనము మన జీవితమును భగవానునకు అప్పజెప్పవలెను. సృష్టి అనే ఈ మహాయజ్ఞము సాగిపోవుచున్నది. దానిలో అంతర్భాగములైన

మనము నియతి ( ధర్మము ) రూపములో నున్న ఈశ్వరుని శరణు పొంది మన వంతు ఇసుమంత కర్తవ్యమును చేయుదము.

నైతికసూత్రములు మరియు కర్మనియతి ఈ ధర్మములో అంతర్భాగములై యున్నవి. వాస్తవములో, కర్మనియతి అనగా ధర్మమే. ఏలయనగా, ఈ నియతికి మూలములో నున్న పుణ్యపాపములు ధర్మముయొక్క అధీనములో నున్నవి. అర్జునుడు స్వీయపుణ్యపాపములకు అనురూపముగనే ఆ వంశములో జన్మించి, ఆ పరిస్థితిని ఎదుర్కొనుచున్నాడు. మనుష్యుని ఇచ్ఛాస్వాతంత్ర్యముపై ఆధారపడియున్న కర్మనియతికి ధర్మాధర్మములతో విడదీయరాని గాఢమైన సంబంధము గలదు. కావున, కర్మనియతి ( ధర్మము ) రూపములోనున్న ఆ ఏకైకభగవానునకు మనము శరణాగతిని చేసి మన కర్తవ్యములను చేయుచుండవలెను. ధర్మమనగా భగవానుడే గనుక, మనము ధర్మానురూపముగా జీవించెదము.

అప్పుడు ఏమగును ? ఈశ్వరుని అనుగ్రహముచే ( తత్ప్రసాదాత్ ) అంతఃకరణ శుద్ధి కలిగి, సాధకుడు తద్వారా ముందుగా ఆపేక్షికమైన శాంతిని పొందును ( శాంతిం ప్రాప్స్యసి ). అట్టి ఆపేక్షికమగు శాంతిని పొందిన జిజ్ఞాసువు కాలక్రమములో పరమశాంతిని పొందగలడు ( పరాం శాంతిం శాశ్వతం స్థానం ప్రాప్స్యసి ) . ఈ శాంతి మానసికమగు అవస్థ కాదు. ఇది స్వరూపభూతమైన శాంతి. ఇది శరణాగతి ప్రవృత్తి వలన కలిగే సరళమగు శాంతి వంటిది కాదు. జీవుని స్వరూపభూతమగు ఈ శాంతి ఇతరముపై ఆధారపడేది కాదు గనుక, ఇది పునరావృత్తి లేని శాశ్వతమగు స్థానము. ఇదియే మోక్షము. సర్వప్రాణుల బుద్ధియందు నివసించే ఈశ్వరుడే ( సర్వభూతానాం హృద్దేశే తిష్ఠతి ) ఈ మోక్షరూపములో నున్నాడు. జీవుడు తాను ఉన్నానని తలపోయును. కాని జీవుడు లేనే లేడు. మానవుని అహంకారము ఒకానొక స్థాయి మాత్రమే. ఉన్నది పరమాత్మ ఒక్కడు మాత్రమే. ఈశ్వరునికంటె భిన్నముగా స్వతంత్రమగు అహంకారము లేనే లేదు. ఆ ఈశ్వరుని మనము తెలుసుకొనే ప్రయత్నమును చేసి, శరణు పొందవలెను ( శరణం గచ్ఛ ). అట్టి శరణాగతి చేసినవాడు ముందుగా ఆపేక్షికమగు శాంతిని, ఆ పైన మోక్షమును పొందును.

తరువాతి శ్లోకములో భగవానుడు కొంతవరకు సంగ్రహించుచున్నాడు.

**అధ్యాయము 18 , శ్లోకము 63 :**

इति ते ज्ञानमाख्यातं गुह्याद्गुह्यतरं मया ।
विमृश्यैतदशेषेण यथेच्छसि तथा कुरु ।। ६३ ।।

ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు ( 63 ).

**ఇతి** = ఈ విధముగా, **తే** = నీకు, **మయా** = నాచేత, **గుహ్యాత్** = రహస్యమైనదానికంటె, **గుహ్యతరమ్** = రహస్యమైన, **జ్ఞానమ్** = జ్ఞానము, **ఆఖ్యాతమ్** = చెప్పబడినది, **ఏతత్** = దీనిని, **అశేషేణ** = సమగ్రముగా, **విమృశ్య** = విమర్శ చేసి, **యథా** = ఏ విధముగా, **ఇచ్ఛసి** = ఇష్టపడెదవో, **తథా** = ఆ విధముగా, **కురు** = చేయుము.

ఈ విధముగా నీకు నేను రహస్యములలోకెల్లా గొప్ప రహస్యమును చెప్పితిని. దీనిని నీవు సమగ్రముగా విమర్శ చేసి నీకు నచ్చిన

విధముగా చేయుము ( 63 ).

మనము సాధారణముగా రహస్యములు అనుకునే వాటికంటె ఈ జ్ఞానము మరింత రహస్యమైనది ( *గుహ్యాద్గుహ్యతరమ్* ). దీనికి కారణమేమి ? మనకు సామాన్యముగా అధీనములోనుండే ప్రత్యక్ష-అనుమానాది జ్ఞానసాధనము ( ప్రమాణము ) లకు అది లభ్యమగుట లేదు. పైగా, ప్రమాణజన్యములగు జ్ఞానములు కొన్ని సందర్భములలో ప్రమాణము లభ్యమగుచున్ననూ దాగియుండే అవకాశము గలదు. ఉదాహరణకు E = mc2 అనే సమీకరణమును విస్తారముగా వివరించి చెప్పవచ్చును. కాని, మనకు అవగతమగు నంత వరకు అది రహస్యమే. ఆత్మ బ్రహ్మయేనను విషయము శాస్త్రము చెప్పేటంత వరకు మనకు తెలియని రహస్యమే గదా ! శాస్త్రోపదేశము తరువాత కూడ అది రహస్యముగనే యుండవచ్చును. శాస్త్రమును శ్రవణము చేసియున్ననూ దానిని గురించి అవగాహన లేని జనులు ( *శృణ్వంతః అపి న జానంతి* ) మనకు కానవచ్చెదరు. ఎదురుగా నున్ననూ రహస్యముగనే యున్నది గనుక, అది రహస్యములకంటె గొప్ప రహస్యము ( *గుహ్యాత్ గుహ్యతరమ్*). మరియు అది దాని గురించి వెదికే వాని స్వరూపమై యున్నది గనుక, దొరకని రహస్యమగుచున్నది. దాని గురించి అన్వేషణను విడిచిపెట్టినచో, అది అజ్ఞాతముగనే మిగిలి యుండును. ఎవరైతే ఆత్మను వరించునో, వానికి అది లభించును ( *యమే వైష వృణుతే తేన లభ్యః* ) అని ఉపనిషత్తు చెప్పుచున్నది. తెలుసుకోవాలని స్థిరముగా సంకల్పించుకున్న వానికి మాత్రమే ఆత్మ లభ్యమగును ; ఇతరులకు కాదు. అది ఒక పదార్థము కాదు గనుక, వెదుక బోయిన తీగ కాలికి తగిలినట్లు హఠాత్తుగా ఎదురయ్యే అవకాశము లేదు. దానిని తెలియాలనే ఆకాంక్ష మనలో ఉండాలి. ఒకనాడు దానంతట అది తెలిసే సంభావన లేదు. అది మానవుని స్వరూపమై యున్నది గనుక, దానిని తెలుసుకునే ప్రక్రియను మనము ఆరంభించవలెను. జిజ్ఞాసగా పరివర్తనను చెందే ముముక్ష అనగా నిదియే. ఈ జ్ఞానమునకు ఇది అత్యంతప్రముఖమైన అర్హత. ఇంతేగాక, ఆత్మ-అజ్ఞానమును మనము గుర్తించవలెను. ఆ తరువాత ప్రమాణముచే అంతఃకరణమును ఉద్భాసితము చేసినచో, అది సార్థకమగును. మనకు ఉండే ధారణాశక్తిచేత గాని, అనేకములగు ఇతరశాస్త్రముల అధ్యయనము చేత గాని, వేదమును వల్లించుట చేత గాని ఆత్మ లభించదనియు ( *న ఏష లభ్యః ప్రవచనేన న మేధయా న బహునా శ్రుతేన* ), దానిని తెలియాలని కోరువానికి లభించుననియు అదే ఉపనిషత్తు చెప్పుచున్నది. ఈ వాక్యముయొక్క ప్రాముఖ్యమును మనము గుర్తించవలెను. అది కావాలని మనము కోరినప్పుడు మాత్రమే అది మనచే తెలియబడును. కావున, అది రహస్యములకంటె గొప్పదగు రహస్యము. మరియు, ఆత్మ దాగియుండ దగిన మంచి చోటు ఆత్మయే ; అనగా నేను మాత్రమే. మనము వెదుకుచున్న ఆనంద-బ్రహ్మ వెదుకువాని స్వరూపమై ఆత్మరూపములో దాగియున్నది. ఇంతకంటె మంచి రహస్యస్థానము ఉండబోదు.

ఈ జ్ఞానమును నేను నీకు వివరించి యుంటిని ( *తే జ్ఞానం ఆఖ్యాతం మయా* ) అని భగవానుడు చెప్పుచున్నాడు. ఇప్పుడు అర్జునుడు ఏమి చేయవలెను ? అంతవరకు చేయబడిన ఉపదేశమును అతడు సగము సగము కాకుండగా పూర్ణముగా ( *అశేషేణ* )

సముచితమగు రీతిలో తన అంతఃకరణములో ఆలోకించవలెనని శ్రీకృష్ణుడు నొక్కి చెప్పుచున్నాడు. ఉపదేశమును అక్కడక్కడ పరికించిన చాలదు. ఉపదేశమునంతనూ సమగ్రముగా అవలోకించి అవగతము చేసుకొన వలెను. కర్మ అనగా నేమి ? కర్మయోగ మనగా నేమి ? సన్న్యాసమనగా నేమి ? మోక్షమనగా నేమి ? ఈ సర్వమును సరియగు రీతిలో తెలియవలెను. ఏ విషయమైనా సమగ్రముగా తెలుసుకున్నప్పుడు మాత్రమే చరితార్థమగును. అర్జునుడు శ్రేయస్సును కోరుచున్నాడు. కావున, మోక్షాన్వేషణలో కర్మ యొక్క పాత్రను గురించి ఆతడు సుస్పష్టముగా తెలుసుకొన వలెను. కర్మ ఏ విధముగా సహకరించును ? ఏ విధముగా బంధించును ?

ఈ ఉపదేశమును సమగ్రముగా పరిశీలించిన పిదప ( విమృశ్యైతదశేషేణ ) నీకు నచ్చిన విధముగా చేయుము ( యథేచ్ఛసి తథా కురు ) అని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. ఈ వచనములో ఆచార్యుని ఆత్మవిశ్వాసము ప్రకటమగుచున్నది. అర్జునునకు చెప్పవలసిన విషయమును పూర్ణముగా చెప్పుటలో ఆయన జాగరూకతను వహించి యున్నాడు. ఆతడు యుద్ధమును చేయరాదనియే నిశ్చయించినచో, అది తప్పు ( మిథ్యా ) అని కూడ చెప్పినాడు. అంతకు మించి చెప్పుట సంభవము కాదు. శ్రీకృష్ణుడు ఇంత విస్తారముగా చెప్పిన తరువాత నిర్ణయమును అర్జునునకు వదలి వేసినాడు. ఆయన ఆచార్యుడే గాని, సలహాదారు కాదు. ఇంతటి ఉపదేశమును చేసిన తరువాత కూడ అర్జునునకు బదులుగా ఆయన నిర్ణయములను తీసుకో వలసి వచ్చినచో, ఆయన ఎట్టి ఆచార్యుడు ? అర్జునుడు ఎట్టి శిష్యుడు ? 18 అధ్యాయముల ఉపదేశము తరువాత అర్జునునకు బదులుగా ఆయన నిర్ణయించే పక్షములో, ఆయనకు తన ఆచార్యత్వముపై మరియు అర్జునుని శిష్యత్వముపై ఆదరము లేదని చెప్పవలసి యుండును. కావుననే, నీకు నచ్చిన విధముగా చేయుము అని చెప్పి, ఆయన నిర్ణయమును పూర్తిగా అర్జునునిపై వదలి వేసినాడు.

తాను చేయదగిన ఉపదేశమునంతనూ చేసిన పిదప శ్రీకృష్ణుడు అర్జునునకు తన ఇచ్ఛ వచ్చిన తీరున చేయుటకు అభ్యనుజ్ఞను ( యథేచ్ఛసి తథా కురు ) ఇచ్చియున్నాడు. ఆతడు మోక్షమును పొందుటకై సన్న్యాస-కర్మయోగములనే రెండు జీవనశైలులలో దేనినైననూ అనుసరించ వచ్చును. ఈ విధమగు పూర్తి నిర్ణయాధికారమును ఆతనికి ఇచ్చి, శ్రీకృష్ణుడు మరియొక మాటను చెప్పుచున్నాడు.

**అధ్యాయము 18 , శ్లోకము 64 :**

सर्वगुह्यतमं भूय: शृणु मे परमं वच: ।

इष्टोऽसि मे दृढमिति ततो वक्ष्यामि ते हितम् ।। ६४ ।।

సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః

ఇష్టోసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్ ( 64 ).

**సర్వగుహ్యతమమ్** = రహస్యములలోకెల్లా రహస్యమైనది, **పరమమ్** = అంతిమమైనది, **మే** = నా, **వచః** = మాటను, **భూయః** = మరల, **శృణు** = వినుము, **మే** = నాకు, **దృఢమ్** = అధికముగా, **ఇష్టః** = ప్రియుడవు, **అసి** = అగుచున్నావు, **ఇతి** = అని, **తతః** = అందువలన, **తే** = నీ కొరకు, **హితమ్** = మంచి మాటను, **వక్ష్యామి** = చెప్పగలను.

రహస్యములలోకెల్లా రహస్యమైనది, అంతిమమైనది అగు నా మాటను మరల వినుము. నీవు నాకు అధికముగా ప్రియుడవు. అందువలననే, నీకు మంచి మాటను చెప్పెదను ( 64 ).

ఈ జ్ఞానము రహస్యములలోకెల్లా గొప్ప రహస్యమని ( సర్వగుహ్యతమమ్ ) ఇంతకు ముందు చెప్పబడినది. అదే విషయము మరల ఇచట నిర్దేశించ బడినది. మనము వినియోగించగలిగే ప్రమాణములకు వేటికీ లభ్యమగుట లేదు గనుకనే, ఇది అత్యంతరహస్యము అగుచున్నది. ఆత్మ స్వయంప్రకాశమే అయినా, అది బ్రహ్మకంటె వేరుగా లేదు అనే జ్ఞానము ప్రత్యక్షము మొదలగు ప్రమాణములకు లభ్యమగుట లేదు. ఈ విషయమును మనము శాస్త్రము ద్వారా మాత్రమే తెలియవలెను. ఈ కారణముచేత, మరియు ఇదివరలో చెప్పబడిన అనేకములగు ఇతరకారణముల చేత ఆత్మ అత్యంతరహస్యముగనే మిగిలి యున్నది. ఎవరైతే ఆనందము, భద్రత ( సత్యమ్ ) మరియు అజ్ఞానమునుండి విముక్తి ( జ్ఞానమ్ ) అను రూపములలో పరమలక్ష్యమును అన్వేషించుచున్నారో, ఆ పరమలక్ష్యము వాని స్వరూపమే అయి ఉన్నది ; అందువలననే అది దాగియున్నది. అది ఒక విశిష్టపదార్థరూపములో ఉపలభ్యముగా లేదు గనుక, రహస్యము అగుచున్నది. మరియు కొన్ని సందర్భములలో దాని గురించి బోధించిననూ, వినేవాడు సంసిద్ధుడు కానిచో, అది వానికి అవగతము కాదు. అనగా, బోధించిన తరువాత కూడ అది రహస్యముగనే ఉండును. శాస్త్రమును శ్రవణము చేసినంత మాత్రాన వ్యక్తి వెంటనే శాస్త్రముయొక్క తాత్పర్యమును దర్శించుననే గ్యారంటీ లేదు. శ్రుతి వాక్యములు ఆత్మ-బ్రహ్మ-ఐక్యముయొక్క అపరోక్ష-జ్ఞానమును కలిగించుననే అపేక్ష గలదు. శ్రవణము చేయు జిజ్ఞాసువునకు మహావాక్యము లక్షణ ద్వారా వస్తువును నిశ్చితముగా ప్రదర్శించవలసి యున్నది. అట్లు జరుగనిచో, దానికి కారణము వానిలో సంసిద్ధత కొరవడుటయే. కావున, ఈ జ్ఞానము సర్వగుహ్యతమము.

సారభూతమైన నా వచనమును వినుము ( మే పరమం వచః శృణు ) అని ఇప్పుడు శ్రీకృష్ణుడు అర్జునునితో చెప్పుచున్నాడు. భగవానుడు అంతములో ఉపదేశసారమును మరల సంగ్రహముగా చెప్పబోవుచున్నాడు. కావుననే, వినుము ( శృణు ) అని హెచ్చరించినాడు. ఇట్లు చెప్పుటకు కారణమేమి ? నీవు నాకు ఇష్టుడవు గనుక ( ఇష్టోసి మే ). అర్జునుడు చిన్ననాటినుండియు శ్రీకృష్ణునకు అనుంగు చెలికాడు. పైగా, అతడు ఇప్పుడు శిష్యుడు కూడ అయినాడు. మరియు అతడు భక్తుడని మనము ఇదివరలో చూచియున్నాము. నీవు నాకు భక్తుడవు మరియు మిత్రుడవు ( భక్తోసి మే సఖా చేతి ) అని భగవానుడు చెప్పియున్నాడు. నేను నీ శిష్యుడను ( శిష్యస్తేహమ్ ) అని అర్జునుడు ఆరంభములో చెప్పినాడు. అర్జునుడు కొత్తగా ఇప్పుడు శ్రీకృష్ణునకు ఇష్టుడైనాడని తలంచరాదు. అతడు సర్వదా ఇష్టుడగనే యుండెను. ఏ కాలమునందైననూ ఆ పరిస్థితిలో మార్పు రాదని శ్రీకృష్ణునకు నిశ్చయమే. ఆ నిశ్చయము దృఢమైనది.

అర్జునుడు శ్రీకృష్ణునకు ప్రియతముడు గనుకనే, ' నీకు హితమును కలిగించే వచనమును చెప్పెదను ( హితం వక్ష్యామి ) ' అని ఆయన చెప్పుచున్నాడు. గీతాశాస్త్రము అంతా కలిపి మోక్షము కొరకై ఉద్దేశించబడిన ప్రవృత్తిమార్గము మరియు నివృత్తిమార్గము

మాత్రమే. మానవుడు కర్మయోగియై మోక్షమును పొందవచ్చును ; లేదా, జ్ఞానయోగియై మోక్షమును పొందవచ్చును. విహితకర్మలను చేస్తూనే జ్ఞానసాధనను చేయవచ్చును. లేదా, పరిపక్వతను పొందిన జిజ్ఞాసువు విధులను పరిత్యజించి జ్ఞానసాధనకు అంకితము కావచ్చును. ఇదే విషయము మరల ఇచట సంగ్రహముగా చెప్పబడినది. శ్రీకృష్ణుడు ఉపదేశమును క్లుప్తముగా రెండు శ్లోకములలోనికి సంగ్రహించు చున్నాడు. ఒక శ్లోకము కర్మయోగమును, మరియొకటి సన్న్యాసమును నిర్దేశించును.

శ్రీకృష్ణుడు రెండవ అధ్యాయములో ముందుగా జ్ఞానము ( సాంఖ్యము ) ను గురించి చెప్పి, తరువాత ' నేను చెప్పే ఈ కర్మయోగమును వినుము ( బుద్ధిర్యోగే తు ఇమాం శృణు ) ' అని పలికినాడు. ఓ అర్జునా ! ఈ ప్రపంచములో రెండు సాధనారూపములగు జీవనశైలులు గలవనియు, వాటిలో మొదటిది సన్న్యాసుల కొరకు ఉద్దేశించబడిన జ్ఞానయోగము అనియు, రెండవది కర్మయోగుల కొరకు ఉద్దేశించబడిన కర్మయోగము అనియు నేను పూర్వములో చెప్పియున్నాను ( లోకే అస్మిన్ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ, జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్ ) అని భగవానుడు తరువాత మూడవ అధ్యాయములో చెప్పినాడు. ఇచట గీతాశాస్త్రముయొక్క అంతములో ఆయన గీతాసారమునంతనూ కర్మయోగము మరియు సన్న్యాసము అనే రెండు పదములలో నిక్షేపించినాడు.

ఈ వచనము హితకరమైనదని భగవానుడు చెప్పుచున్నాడు. మనకు హితమును చేసే అంశములు అనేకము గలవు. కాని ఆత్మ-బ్రహ్మ-ఐక్య-జ్ఞానరూపమైన మోక్షము పరమహితము. దానికి దారి తీసే సాధనము కూడ హితముగనే పరిగణించ బడును. రాబోయే శ్లోకములో కర్మయోగము చెప్పబడును.

**అధ్యాయము 18 , శ్లోకము 65 :**

मन्मना भव मद्भक्तो मद्याजी मां नमस्कुरु ।

मामेवैष्यसि सत्यं ते प्रतिजाने प्रियोऽसि मे ।। ६५ ।।

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు

మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోసి మే ( 65 ).

మన్మనాః = నాయందు మనస్సు గలవాడవై, మద్భక్తః = నా భక్తుడవై, మద్యాజీ = నన్ను ఆరాధించువాడవై, భవ = అగుము, మామ్ = నన్ను, నమస్కురు = నమస్కరించుము, మామేవ = నన్ను మాత్రమే, ఏష్యసి = పొందగలవు, సత్యమ్ = ఇది యథార్థము, తే = నీ కొరకు, ప్రతిజానే = ప్రతిజ్ఞను చేయుచున్నాను, మే = నాకు, ప్రియః = ప్రియుడవు, అసి = అగుచున్నావు.

నాయందు మనస్సును నిలిపి నా భక్తుడవై నన్ను ఆరాధించి నాకు
నమస్కరించుము. నన్ను మాత్రమే పొందగలవు. ఇది యథార్థము.
ప్రతిజ్ఞను చేయుచున్నాను. నీవు నాకు ప్రియుడవు ( 65 ).

అర్జునుడు ఈ లక్షణముల నన్నింటినీ కలిగియున్నచో, అతడు శ్రీకృష్ణుని చేరును. మనోవృత్తులన్నింటికీ పరమేశ్వరుడు మాత్రమే విషయవస్తువుగా గలవాడు మన్మనాః

అనబడును. అనగా మనస్సు పరమేశ్వరునకు అర్పించి వేయబడినది. అట్టివాడు పరమేశ్వరునకు అంకితమైన భక్తుడగుట ( మద్భక్తః ) సహజమే. అతడు సర్వకార్యములను ఈశ్వరుని కొరకు మాత్రమే చేయును. యజ్ఞములు, పూజలు, ఆరాధనలు అన్నీ ఈశ్వరుని కొరకే ( మద్యాజీ ). అతడు ఈశ్వరుని శరణు పొంది, ఈశ్వరుడు మాత్రమే ఆశ్రయముగా కలిగియుండును. కావుననే, నాకు నమస్కరించుము ( మాం నమస్కురు ) అని శ్రీకృష్ణుడు చెప్పగా, నాకు మాత్రమే నమస్కరించుము అని శ్రీశంకరులు జోడించినారు. ఇట్లు చేసినచో, నీవు నన్ను మాత్రమే పొందగలవు ( మాం ఏవ ఏష్యసి ) అని శ్రీకృష్ణుడు ప్రతిజ్ఞను చేయుచున్నాడు ( సత్యం తే ప్రతిజానే ). ఇచట సాధ్యము ఈశ్వరుడే. సాధనము కూడ ఈశ్వరుడే. సర్వము ఈశ్వరునకు మాత్రమే సమర్పించబడును. మనోవాక్కాయములచే చేయబడే కర్మలు అన్నియు ఈశ్వరారాధనరూపముగా చేయబడును. వాటి ప్రయోజనము కూడ ఆ ఈశ్వరుని పొందుటయే. సాధారణముగా జనులు స్వర్గము మొదలగు ఫలములను కోరువారై క్రియాసాధనములగు ఈ మనోవాక్కాయములను వినియోగించి పూజాదికమును చేయుచుందురు. కాని, ఇచట పరమేశ్వరుడే ఫలము కావలెనని చెప్పబడినది. పరమేశ్వరునికంటె తక్కువ ఫలమును మనము కోరుట లేదు. పైగా, క్రియాసాధనములగు ఈ ఇంద్రియములు అన్నీ పరమేశ్వరుని కంటె భిన్నముగా లేవు. కావున, మనము కర్మలను పరమేశ్వరుని కొరకు మాత్రమే చేయవలెను. విహితకర్మలన్నింటినీ పరమేశ్వరప్రీతి కొరకు మాత్రమే చేయవలెను.

తన విధిని అనుష్ఠించుట ద్వారా పరమేశ్వరుని ఆరాధించు మానవుడు సిద్ధిని బడయునని ( స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః ) మనము ఇదివరలో చూచియున్నాము. ఒక విశిష్టపరిస్థితిలో మననుండి అపేక్షించబడే కర్మకు విధియని పేరు. మనము దీనిని సావధానముగా విశ్లేషించినచో, ఒక విశిష్టపరిస్థితిలో మనము చేయదగిన కర్మ, మరియు ధర్మము అనబడేది, ఈ రెండు ఒకటియేనని తేలును. మనము ఆ పరిస్థితిలో చేయకూడని కర్మ, మరియు అధర్మము ఒకటియే. ఇచట ఆరాధన యనగా ధర్మమునకు అనురూపముగా జీవించుట అని యర్థము. మన జీవితము ధర్మమునకు అంకితము కావలెను. ఏలయన, ధర్మము అభిన్న-నిమిత్త-ఉపాదాన-కారణమగు ఈశ్వరుని కంటె భిన్నము కాదు. ' ఎవనినుండి సమస్తప్రాణులు ఉదయించినవో, ఎవనిచే సర్వము ధరింపబడియున్నదో ( యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ), అటువంటి ఈశ్వరుని ( తమ్ ) ' అని చెప్పుటచే ధర్మము ఈశ్వరుని కంటె భిన్నము కాదని సూచితమైనది. జీవునకు పుట్టుక లేదు. వాస్తవములో జీవుడు ఈశ్వరునికంటె భిన్నముగా లేడు. కాని అజ్ఞానముచే జీవునకు సూక్ష్మ-స్థూల-ఉపాధులు అన్నియు సంక్రమించుచున్నవి. అయిదు సూక్ష్మ-స్థూల-మహా-భూతములు ఆ పరమేశ్వరుని నుండియే ఉదయించుచున్నవి. కావున, సర్వమును వ్యాపించియున్న పరమేశ్వరుడు ఈ జగత్తునకు కేవలము చేతనుడైన నిమిత్తకారణము మాత్రమే గాక, ఉపాదానకారణము కూడ అగుచున్నాడు. కావున, ఈ సృష్టి సర్వము ఈశ్వరుని కంటె భిన్నముగా లేదు. ప్రకృతిసూత్రములు, మరియు ధర్మనియతి మానవనిర్మితములు కావు. ఇవి అన్నియు ఈశ్వరుని కంటె భిన్నములు కావు. మనకు అందరికీ సమానముగా తెలుస్తూ ఉండేదే ధర్మము. అది ఈశ్వరుని కంటె వేరుగా

లేదు. ఆ ధర్మమునకు అనురూపముగా జీవించుటయే ఇచట కర్మయోగము అనబడినది. కర్మఫలములు విభిన్నముగా నున్నవి. కాని, కర్మయోగముయొక్క ఫలము ఒక్కటి మాత్ర మే. అదియే అంతఃకరణశుద్ధి. ఆ శుద్ధివలన జ్ఞానము ఉదయించును. కర్మయోగికి జీవిత లక్ష్య మైన పురుషార్థము విషయములో భ్రాంతులు లేవు. తనకు ఈశ్వరునితో గల ఐక్య మును దర్శించుటయే సంసారమనే బంధము నుండి విముక్తికి ఏకైకసాధనమని ఆతనికి తెలియును. ఇంతకు తక్కువ ఏ జీవునకైననూ అంగీకారము కాదు. ఇంతకు తక్కువదైన చో, దాని వలన మౌలికమగు సమస్య పరిష్కారము కాదు. దీనిని తప్పించి, మానవుడు ఏమి చేసినా, వాని అన్వేషణకు అంతము ఉండదు. మానవుడు తాను వేరే అనే ధారణ నుండి విముక్తుడైనప్పుడు మాత్రమే ఈ సమస్య పరిష్కరింప బడును. అనగా మానవుడు తన సర్వాత్మభావమును గుర్తించిన నాడు మాత్రమే ఇది సంభవమగును. అంతవరకు ఏ జీవునకైననూ విశ్రాంతి లేదు. కావున, భక్తుని లక్ష్యము ఈశ్వరుడు కావాలి.

ఈ తీరున నీవు నన్ను మాత్రమే పొందగలవు ( మామేవ ఏష్యసి ) అని శ్రీకృ ష్ణుడు చెప్పుచున్నాడు. అనగా, నిత్యసిద్ధమై యున్న అభేదము, నిత్యసిద్ధమగు ఐక్యము గుర్తించబడును. ఈ ఐక్యము కొత్తగా నిర్మితమయ్యేది కాదు. కొత్తగా పుట్టే ఐక్యము వియో గముతో అంతమగును. రెండు వేర్వేరు పదార్థములను దగ్గరకు చేర్చినచో, నాశము ఇత్యాది కారణములచే అవి విడిపోవును. దానియందు ఏదో ఒక రూపములో ఎంట్రొపి ( అనియతి ) ప్రవేశించి ఆ ఐక్యము భగ్నమగును. కాని, ప్రస్తుతములో ఐక్యము నిత్యసిద్ధ ము. సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ ఆత్మయే. ఆత్మ యనగా జ్ఞాత కాదు. జ్ఞాత, జ్ఞానము మరియు జ్ఞేయము అనే మూడింటికీ సాధారణమైనది, ఆ మూడింటికి అవికారి యగు అధిష్ఠానము అగు చైతన్యమే ఆత్మ. నిత్యసిద్ధమై యున్న ఆ ఏకత్వమును దర్శిం చుటయే మోక్షమనబడును. అదియే ఈశ్వరప్రాప్తి.

నీవు నన్ను చేరగలవని నేను ప్రతిజ్ఞను చేయుచున్నాను ( సత్యం తే ప్రతిజానే ) అని చెప్పి శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు హామీని ఇచ్చుచున్నాడు. ఈ మాటను చెప్పవ లసిన అవసరము ఆయనకు లేదు. కాని అర్జునునిలో శ్రద్ధను కలిగించుటకై ఆయన అట్లు చెప్పినాడు. భగవానుడు ఆత్మరూపుడు గనుక, ఎవరైననూ ఆయనను చేరక పోయే ప్రసక్తి లేదు. కావున, ఆయన చేసిన ఈ ప్రతిజ్ఞ యుక్తియుక్తముగనే యున్నది. ఈ మాటను చెప్పవలసిన అవసరము ఆయనకు లేనిచో, ఏల చెప్పినాడు ? అర్జునుడు భగ వానునకు ప్రియమైనవాడు గనుక ( ప్రియః అసి మే ). భగవానుడు ఇక్కడ చెప్పిన విధ ముగా చేసినచో, ఆయనను చేరుట నిశ్చితము. కావున, మనము మనస్సును సంసిద్ధము చేసుకొని, ఇప్పుడు చేయుచున్న విధముగా జ్ఞానసాధనను కొనసాగించిన చాలును.

మనకు మోక్షఫలము లభించి తీరును. ఈశ్వరునియందలి భక్తివలన రాగద్వేష ములు తొలగిపోవును. తద్వారా మనకు అంతఃకరణశుద్ధి ఖచ్చితముగా కలుగును. మనము మనకు నచ్చిన కర్మను గాక, కర్తవ్యకర్మను చేయుచున్నాము. పైగా ఆ కర్మను భక్తిభావ నతో చేయుచుండుట వలన రాగద్వేషములు ప్రభావహీనములగును. అదియే అంతఃకరణ శుద్ధి. అది ఉన్నవారికి మోక్షము దూరములో లేదు. కావున, జ్ఞానసాధన కూడ కర్మయోగ ములో భాగమే యగును. రాగద్వేషములకు అంతఃకరణముపై గల పట్టు సడలగానే జ్ఞాన

ములో గల స్పష్టత పెరుగుచుండును. ఈశ్వరునియందు భక్తి గలవానికి ఈ ఫలము నిశ్చితము. మనము పొందదగిన లక్ష్యము ఈశ్వరుడే. జిజ్ఞాసువు తనకు ఈశ్వరునితో గల అభేదమును గుర్తించగోరి ఈశ్వరుని కృపను అర్థించును.

### భగవద్గీత

### 18 వ అధ్యాయము , 66 వ శ్లోకము

మానవుడు చేరదగిన లక్ష్యము ఈశ్వరుడే. ఇచట పొందుట యనగా నేను ఈశ్వరుడనని ( *ఈశ్వరోహమ్* ) గుర్తించుటయే. నీవు ఏ పనిని చేసినా ( *యత్ కరోషి* ), నాకు సమర్పించుము ( *తత్ కురుష్వ మదర్పణమ్* ) అని భగవానుడు పూర్వములో చెప్పియున్నాడు. ఈశ్వరుని మాత్రమే లక్ష్యముగా పెట్టుకొని కర్మలనన్నింటినీ అంతఃకరణశుద్ధికొరకు మాత్రమే ఆచరించి ఆయనకు సమర్పించుచున్నచో, మనకు గల రాగద్వేషములు అన్నియు ప్రభావహీనములై వాటికి మనపై గల పట్టు సడలిపోవును. ప్రతి మానవుని హృదయములో రాగద్వేషములు నివసించియున్నవి గనుక, మనము వాటి వశములో పడకుండగా జాగ్రత్త పడవలెనని ( *రాగద్వేషౌ సర్వేషాం బుద్ధౌ వ్యవస్థితౌ, తయోః వశం న ఆగచ్ఛేత్* ) శ్రీకృష్ణభగవానుడు హెచ్చరించినాడు. రాగద్వేషములను కలిగియుండుటలో సమస్య లేదు. కాని వాటి వశములో మనము ఉన్నచో, మనకు సమస్యలు తప్ప ఇంకేమీ ఉండవు. కర్మయోగప్రభావముచే మనము రాగద్వేషములపై నియంత్రణను సంపాదించవచ్చును. కర్మయోగమనగా ఒక విశిష్టకర్మ కాదు. కర్తవ్యకర్మను అంకితభావముతో యోగ్యమగు మనఃప్రవృత్తితో ఆచరించే జీవనశైలికి కర్మయోగమని పేరు. దాని వలన మానవుడు అంతఃకరణశుద్ధిని పొంది జ్ఞానోదయమునకు అర్హతను సంపాదించును. గీతలో ఈ కర్మయోగము మాత్రమే కాకుండగా, సన్న్యాసము అనే జీవనశైలి, మరియు జ్ఞానపూర్వకమైన సర్వకర్మసన్న్యాసము కూడ చెప్పబడినవి. అదియే మోక్షము. రాబోవు శ్లోకములో శ్రీకృష్ణుడు జ్ఞానముచే కర్మను పరిత్యజించుట ( జ్ఞాన-కర్మ-సన్న్యాసము ) అను విషయమును గురించి చెప్పగలడు.

కర్మయోగమునకు అంకితమగుటలోని పెద్ద రహస్యము ఈశ్వరశరణాగతి యని శ్రీశంకరులు ఈ శ్లోకమునకు అవతారికలో వ్రాకుచ్చిరి. జీవుడు సర్వకర్మలను సమర్పించవలసిన ఏకైకశరణు ఈశ్వరుడు మాత్రమే. ఈ సమర్పణలో ధర్మమును ఈశ్వరరూపముగా దర్శించుట కూడ అంతర్భాగమై యుండును. అట్టి గుర్తింపు ఉన్నప్పుడు మాత్రమే అది కర్మయోగము అగును. అట్టి గుర్తింపు లేని వ్యక్తి నైతికమగు జీవితమును గడుపువాడు కావచ్చును ; కాని కర్మయోగి కాజాలడు. ఏలయనగా, ధర్మనియతి ఈశ్వరస్వరూపమేనను స్వీకారము కర్మయోగములోని ప్రముఖమగు అంశము. ఆ విధమగు స్వీకారముతో కూడిన కర్మయోగమునకు ఫలమేమి ?

కర్మయోగము తనంత తానుగా ఫలము కాదు. కాని దాని ద్వారా తత్త్వముయొక్క యథార్థదర్శనము ( సమ్యక్ దర్శనము ) నకు దారి సుగమమగును. సమ్యగ్దర్శనమనగా బ్రహ్మ-ఆత్మ-ఐక్య-దర్శనమే. ఈ దర్శనమునకే జ్ఞానకర్మసన్న్యాసమని పేరు. కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను దర్శించువాడు మనుష్యులలో బుద్ధిమంతుడు

( కర్మణ్యకర్మ యః పశ్యేదకర్మణి చ కర్మ యః, స బుద్ధిమాన్మనుష్యేషు ) అనియు, ఈ దేహి మనస్సుచే కర్మలనన్నింటినీ విడిచిపెట్టి తొమ్మిది ద్వారములతో కూడియున్న ఈ నగరమునందు తాను స్వయముగా కర్మలను చేయకుండగా, మరియు ఇతరములచే చేయించకుండగా, సుఖముగా నున్నాడు ( సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ, నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్ ) అనియు మనము ఇదివరలో చూచియున్నాము. జ్ఞానముచే కర్మలను అన్నింటినీ పరిత్యజించుట ( జ్ఞాన-కర్మ-సన్న్యాసము ) అను విషయమును గురించి శ్రీకృష్ణుడు గీతలో అంతటా చెప్పియున్నాడు.

ఆ జ్ఞానము ఏది ? ఆత్మస్వరూపుడనగు నేను కర్తను గాదు. ఈ సత్యమును గుర్తించగానే కర్మలన్నియు ఉపమర్దితములగును. ఎవని మనస్సు బ్రహ్మమునందు లగ్నమై యున్నదో, ఆత్మ బ్రహ్మరూపమై యున్నదో, ఎవని నిష్ఠ బ్రహ్మమునందు గలదో, ఎవని దోషములు జ్ఞానముచే దహించ బడినవో, అట్టి వానికి పునరావృత్తి లేదు ( తద్బుద్ధయ స్తదాత్మానస్తన్నిష్ఠాస్తత్పరాయణాః, గచ్ఛంతి అపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః ). చూచుట, వినుట, స్పృశించుట, ఆఘ్రాణించుట, తినుట, నడచుట, నిద్రించుట, గాలిని పీల్చుట, మాటలాడుట, విడిచి పెట్టుట, పట్టుకొనుట, కనురెప్పలను మూయుట మరియు తెరచుట, ఆలోచించుట అను క్రియలలో ఇంద్రియములు ఇంద్రియగోచరములగు విషయములలో ప్రవర్తిల్లుచున్నవే గాని, నేను లేశమైననూ క్రియలను చేయుట లేదు అని జితేంద్రియుడగు తత్త్వవేత్త తలంచును ( నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్, పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్, ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ ఉన్మిషన్ నిమిషన్ అపి, ఇంద్రియాణి ఇంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్ ). ఈ 18 వ అధ్యాయమును చదువునప్పుడు మనము ఈ శ్లోకములను అన్నింటినీ గుర్తులో నుంచుకొనవలెను. ఏలయన, ఇంతవరకు చేయబడిన ఉపదేశమంతయు మరల ఇచట సారరూపముగా ప్రస్తావించబడును.

అంతిమముగా జ్ఞానకర్మసన్న్యాసము మరియు సన్న్యాసమనే జీవనశైలి అనే రెండు అంశములు ఇచట ప్రస్తావించబడినవి. సన్న్యాసము రెండు రకములుగా నున్నది. ఒకటి సాధనారూపమైనది ( యోగము ). కర్మయోగమునకు అంకితమైన జీవితమునకు ఫలమైన ఈ జీవనశైలిరూపములో నుండే సన్న్యాసమునకు వివిదిషా-సన్న్యాసమని పేరు. దీనికి ఫలమైన జ్ఞాన-కర్మ-సన్న్యాసము రెండవది. దీనియందు జ్ఞాని తాను కర్తను కాననే సత్యమును దర్శించి ఆ జ్ఞానముచే సర్వకర్మలను సన్న్యసించును. ఈ రెండు రకముల సన్న్యాసమును ఈ శ్లోకము ప్రస్తావించుచున్నది. కావున, సన్న్యాసము అనే విషయముపై ఈ శ్లోకము సమగ్రమైన సంగ్రహశ్లోకము అని చెప్పవచ్చును. పూర్వశ్లోకములో కర్మయోగము సంగ్రహించబడగా, ఈ శ్లోకములో కేవలజ్ఞానరూపమగు సన్న్యాసము చెప్పబడుచున్నది.

**అధ్యాయము 18 , శ్లోకము 66 :**

**सर्वधर्मान् परित्यज्य मामेकं शरणं व्रज ।**

**अहं त्वा सर्वपापेभ्यो मोक्षयिष्यामि मा शुचः ॥ ६६ ॥**

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ( 66 ).

సర్వధర్మాన్ = కర్మలనన్నింటినీ, పరిత్యజ్య = విడిచిపెట్టి, మాం ఏకమ్ = నన్ను మాత్ర మే, శరణమ్ = శరణు, వ్రజ = పొందుము, అహమ్ = నేను, త్వా = నిన్ను, సర్వపా పేభ్యః = సర్వకర్మలనుండి, మోక్షయిష్యామి = విముక్తిని కలిగించగలను, మా శుచః = దుఃఖించకుము.

కర్మలనన్నింటినీ విడిచిపెట్టి నన్ను మాత్రమే శరణు పొందుము. నేను నీకు సర్వకర్మలనుండియు విముక్తిని కలిగించెదను. నీవు దుఃఖించ కుము ( 66 ).

గీతోపదేశములో ఇది ఆఖరి శ్లోకముగా పరిగణించ బడినది. ఎవరిని గురించి దుఃఖించుట తగదో, నీవు వారిని గురించి దుఃఖించుచున్నావు ( అశోచ్యానన్వశోచస్త్వమ్ ) అను వాక్యముతో గీతోపదేశము ఆరంభమైనది. దుఃఖించకుము ( మా శుచః ) అను వాక్య ముతో ఆ ఉపదేశము ఇచట సమాప్తమైనది. దీనిని బట్టి గీతయొక్క పూర్ణప్రయోజనము దుఃఖనివృత్తి యని స్పష్టమగుచున్నది.

ఈ వాక్యమును మనము సావధానముగా పరిశీలించినచో, ఇచట జ్ఞాననిష్ఠ చెప్పబ డుచున్నదని స్పష్టమగును. సర్వధర్మములను విడిచిపెట్టి ( సర్వధర్మాన్ పరిత్యజ్య ) అను చోట ధర్మశబ్దము ధర్మాధర్మములను రెండింటినీ నిర్దేశించునని శ్రీశంకరులు వివ రించిరి. ఏలయనగా, శ్రుతిస్మృతులు రెండింటికీ తాత్పర్యము నైష్కర్మ్యము. అనగా సర్వకర్మలను పూర్తిగా విడిచిపెట్టుట. మానవుడు కర్మల అధీనములో నున్నంతవరకు సంసారములో నున్నట్లే యగును. కావున, సంసారమునుండి విముక్తిని గోరు మానవుడు సర్వకర్మలనుండి విముక్తిని పొందవలెను. సర్వకర్మపరిత్యాగమునకు ఉపాయమును బోధించినప్పుడు మాత్రమే గీత మోక్షశాస్త్రము అగును. కర్మలు అసంఖ్యాకముగా నున్న వి. కావున, ఫలములను అనుభవించుట ద్వారా సర్వకర్మలను క్షయము చేయుట అసంభ వమని మనకు తెలియును. పైగా, ఒక్క క్షణమైననూ మనము కర్మను చేయకుండగా నుండజాలము ( న హి కశ్చిత్ క్షణం అపి జాతు తిష్ఠతి అకర్మకృత్ ). కావున, కర్మలను విడిచిపెట్టుటకు ఒకే ఒక ఉపాయము గలదు. కేవలజ్ఞానముచే మాత్రమే కర్మలను విడువ దగును ( జ్ఞాన-కర్మ-సన్న్యాసము ). ఆత్మ కర్త కాదు; మరియు క్రియలలో విషయ మయ్యే కర్మ కాదు. పైగా, ఆత్మకు ఏ రకమైన క్రియతోనైననూ ఏ విధముగా నైననూ సంబంధము లేదు. కావున, ఆత్మ స్వభావము చేతనే సర్వకర్మవినిర్ముక్తమై యున్నది. కావున, నైష్కర్మ్యమే మోక్షము అగును.

సర్వధర్మాన్ అను సమాసములోని ధర్మశబ్దము అధర్మమును కూడ నిర్దేశించును. కావున, సర్వధర్మములను విడచుట యనగా ధర్మమును విడచి అధర్మమును పట్టుకొనుట కాదని శ్రీశంకరులు స్పష్టము చేసిరి. తప్పు పనులకు దూరముగా నుండని వ్యక్తి ( నావి రతో దుశ్చరితాత్ ) ఆత్మజ్ఞానమును పొందుట అసంభవమని చెప్పే కఠశ్రుతి ఈ అభిప్రా యమును సమర్థించుచున్నది. సర్వధర్మపరిత్యాగములో అధర్మము కూడ అంతర్గతమగు

నవే విషయమును శ్రుతి మాత్రమే గాక, స్మృతి కూడ సమర్థించుచున్నది. ధర్మమును, అధర్మమును, సత్యమును, అసత్యమును విడిచిపెట్టి, అంతములో దేనిచే వీటిని విడిచి నావో దానిని కూడ విడువవలెను ( *త్యజ ధర్మమధర్మం చ ఉభే సత్యానృతే త్యజ, యేన త్యజసి తత్త్యజ* ) అని మహాభారతము చెప్పుచున్నది. నేను విడిచిపెట్టినాను అనే ధార ణను కూడ జ్ఞానముచే విడువవలెను. అనగా, కర్తృత్వధారణను విడువుము అని యర్థము.

ధర్మాధర్మములు క్రియారూపములో మాత్రమే అనుష్ఠించబడును గదా ! మనము ధర్మముగా పరిగణింపబడే క్రియలను మరియు అధర్మముగా పరిగణించబడే కర్మలను రెండింటినీ కూడ విడువవలెనని ఇచట చెప్పబడినది. అనగా కర్మలన్నింటినీ విడువవలె నని తెలినది. కర్మలను అన్నింటినీ విడిచిపెట్టుట ఎవ్వరికైననూ ఎట్లు సంభవమగును ? దీనికి ఒకే ఒక ఉపాయము గలదు. దానినే శ్రీకృష్ణభగవానుడు ఇచట చెప్పుచున్నాడు : *మామేకం శరణం వ్రజ*. సర్వధర్మములు అను దానిలో మనము కోరికలను తీర్చుకొనుటకై చేసే కర్మలను ( *కామ్యకర్మాణి* ) కూడ కలుపుకున్ననూ, ఈ ఉపాయము వాటికి కూడ వర్తించును. వీటిలో శ్రుతిచే విధించబడిన కర్మలు ( *వైదికకర్మాణి, శ్రౌతకర్మాణి* ), మరియు స్మృతివిహితములైన కర్మలు ( *స్మార్తకర్మాణి* ) కూడ అంతర్భాగములగును. ఈశ్వరీయజ్ఞానమును పొందగోరి సన్న్యాసము అనే జీవనశైలి ( వివిదిషా-సన్న్యాసము ) ని చేపట్టే జిజ్ఞాసువు సర్వకర్మలను పరిత్యజించును. వానికి ఈశ్వరుడు మాత్రమే ఏకైకశర ణ్యుడు. జీవితలక్ష్యము ధర్మార్థకామములు కావనే నిశ్చయము గలవానికి వాటిని సంపా దించి పెట్టే కర్మలతో ప్రయోజనము లేకుండుటచే, ఆతడు వాటిని పరిత్యజించుట సహజ ము. కాని అవి మాత్రమే లక్ష్యములైన వ్యక్తికి కర్మపరిత్యాగము ఎన్నటికీ సంభవము కాదు. ఏలయనగా, కర్మ వలన మాత్రమే ధర్మార్థకామములు సిద్ధించును. ఇందువలననే, ఉపనిషద్భాగమును మినహాయిస్తే, వేదము అంతా కర్మలతో నిండియున్నది. ధర్మార్థకామ ములను సిద్ధింపజేసే ఏకైక-ఉపాయము కర్మ మాత్రమే. వేదములో ఆఖరున ఉండే ఉపని షత్తులను ప్రత్యేకవిభాగముగా పరిగణించుటకు కూడ ఇదియే కారణము. వేదములోని పూర్వకాండ మోక్షము కొరకు ఉద్దేశించ బడలేదు. కావున, కర్మ దానికి విషయవస్తువు. కాని ఉపనిషత్తులు మోక్షము కొరకు ఉద్దేశించ బడుటచే జ్ఞానము వాటికి విషయవస్తువు అగుచున్నది.

పూర్వమీమాంసకులు కర్మయే సర్వమని భావించెదరు. విభిన్నములైన అభీష్టఫల ములు వేదములో చూపబడినవి. వాటిని పొందుటకై మనము ఏయే కర్మలను చేయాలి ? అను సంగతిని నిర్ధారించుటకై వేదమును విశ్లేషించవలెనని వారి అభిప్రాయము. *అథాతో ధర్మజిజ్ఞాసా* ( వేదాధ్యయనము తరువాత ధర్మవిచారము చేయబడుచున్నది ) అనునది పూర్వమీమాంసలోని మొదటి సూత్రము. ఈ సూత్రములో ధర్మముతో బాటు అధర్మము కూడ అంతర్గతమై యున్నది. కావున, అంతతో గత్వా ఇచట ధర్మశబ్దమునకు కర్మ యని అర్థము. ఏలయనగా, ఆ శాస్త్రము పూర్ణముగా కర్మ కొరకు మాత్రమే ఉద్దేశించబడినది. మరియు, ధర్మవిచారమునకు ఉద్దేశ్యము కర్మానుష్ఠానము మాత్రమే. కావున, సంప్రదాయ ము ననుసరించి ధర్మము అనగా కర్మ అని యర్థము. సర్వధర్మాన్ అను పదములో ధర్మ పదము అధర్మమును కూడ నిర్దేశించును గనుక, సర్వధర్మములను విడిచిపెట్టుట యనగా

సర్వకర్మలను విడిచిపెట్టుట అని యర్థము. ధర్మ-అధర్మములను, అనగా మంచి-చెడులను విడిచిపెట్టుట సంభవము కాదు. బహుశః మంచి-చెడు అనే ధారణలను మనము విడిచిపెట్టగల్గుదుమేమో ! కాని, వ్యవహారములో మంచి-చెడులు ఉండి తీరును. కావున, వీటిని దూరముగా పెట్టుట మన అధీనములో నున్న విషయము కాదు. కాని, మనము ధర్మ-అధర్మములపై ఆధారపడి ఉండే కర్మను విడిచిపెట్టుట సంభవమే.

ఎట్లు ? ' నన్ను మాత్రమే శరణు జొచ్చుము' అని శ్రీకృష్ణుడు ఉత్తమపురుషలో చెప్పుచున్నాడు. 'నన్ను మాత్రమే' అని భగవానుడు చెప్పుటకు కారణమేమి ? 'ఇతరదైవముల వద్దకు పోవద్దు. నా వద్దకు మాత్రమే రమ్ము. ఇంద్ర, అగ్ని, వరుణాది దేవతలు నీకు మోక్షమును ఈయజాలరు. నీకు మోక్షము కావాలంటే నా వద్దకు మాత్రమే రావాలి'. శ్రీకృష్ణుడు ఈ విధముగా చెప్పే పక్షములో ఆ వాక్యము మాత్సర్యముతో నిండియున్నదని చెప్పవచ్చును. హరే కృష్ణ సంప్రదాయమునకు చెందినవారు, మరియు అటువంటి కొందరు భక్తులు ఈ శ్లోకమును అటులనే వ్యాఖ్యానించు చున్నారు. శ్రీకృష్ణుడు మాత్రమే వాస్తవమగు దైవమనియు, మనము ఆయనకు మాత్రమే శరణాగతి చేయవలెననియు వారి వాదము. కాని ఈ శ్లోకములోని ఏకం ఏవ ( ఒక్కనిని మాత్రమే ) అను పదములకు మిగిలిన గీతోపదేశమునకు అనురూపముగా నుండు విధములో అర్థమును చెప్పవలెను. శ్రీశంకరులు ఇచట రెండు విషయములను ప్రస్తావించిరి. ఇచట 'నన్ను ( మామ్ )' అనగా 'సర్వమునకు ఆత్మనగు నన్ను ( *సర్వాత్మానం మామ్* )' అని తెలియవలెను. ఈ జగత్తులోని వివిధపదార్థములను చేతనములు మరియు అచేతనములు అనే రెండు శ్రేణులుగా విభజించ వచ్చును. బ్రహ్మ గారితో మొదలిడి చిన్ని కీటకము వరకు గల సర్వ ప్రాణులు ( *ఆబ్రహ్మస్తంబపర్యంతమ్* ) చేతనము లనబడును. ఇది ఒక శ్రేణి. ప్రాణము లేని పదార్థములతో కూడినది ( *జడాత్మకమ్* ) రెండవ శ్రేణి. వీటి అన్నింటి స్వరూపము నేనే అని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. ఎందువలన ? ఈ జగత్తులోని సర్వమునకు ఆయనయే కారణము అగుట వలన ( *సర్వస్య కారణత్వాత్* ). మనము చేతన-అచేతన విభాగమును చేసిననూ, అవి అన్నీ పంచభూతములు తక్క మరియొకటి గాదు. ఈ జగత్తులోని సర్వము పంచభూతముల స్థూలాంశములయొక్క మరియు సూక్ష్మాంశములయొక్క కార్యములు మాత్రమే. ఈ జగత్తును చైతన్యముయొక్క దృష్టికోణములో విశ్లేషించినచో, ఈ భూతములు అన్నియు జడములే. ఏలయనగా, చైతన్య-ఆత్మకంటె భిన్నమైన సర్వము జడమే. మనము చేసే ఈ చేతన-అచేతన విభాగమునకు మూలమేమి ? సూక్ష్మశరీరము గలది చేతనమనియు, సూక్ష్మశరీరము లేనిది అచేతనమనియు పరిగణించ బడుచున్నది. కాని, ఈ జడ-చేతన-విభాగము ఒకానొక దృష్టికోణములో మాత్రమే అర్థవంతముగ నుండును. వాస్తవములో సర్వము చేతనబ్రహ్మ మాత్రమే. చైతన్యమును తీసి ప్రక్కన బెట్టి ఒక పదార్థమును భావన చేసే ప్రయత్నమును చేయుడు. అది సంభవము కాదు. ఒక పదార్థమును చూపి ' ఇది జడము ' అని మనము చెప్పే సందర్భములో నైననూ దానిని చూసి ప్రకాశింప జేసేది మనమే గదా ! దీనిని బట్టి అది ఆత్మచైతన్యమునకు దూరముగా లేదని స్పష్టమగుచున్నది. వాస్తవములో ఆత్మయొక్క ఉనికి ( సత్తా ) అనే అంశము మాత్రమే ఆ పదార్థము రూపములో ప్రకటమగుచున్నది. కాని, చేతనమగు ప్రాణుల

యందు సూక్ష్మశరీరము కూడ ఉండుటచే, చైతన్యము ద్రష్ఠ ఇత్యాది రూపములలో అభివ్యక్తమగుచున్నది. చైతన్యము సర్వత్రా ఉన్నది. చైతన్య-ఆత్మకంటె వ్యతిరిక్తముగా ఏ పదార్థమైననూ మనగలిగే ప్రసక్తియే లేదు. ఆ చైతన్య-ఆత్మయే బ్రహ్మ. కావుననే, సర్వమునకు నిమిత్తకారణము మాత్రమే గాక, ఉపాదానము కూడ అయి ఉన్న భగవానుడు సర్వస్వరూపుడు ( సర్వాత్మా ) అని శ్రీశంకరులు వివరించినారు. ఇచట మనము సర్వజగత్తును కారణ-కార్య-సంబంధము అనే దృష్టికోణములో చూచుచున్నాము. కార్యము కారణము కంటె భిన్నముగా లేదు.

సర్వము నేనే ( అహం సర్వాత్మా ) అని ఒకడు చెప్పినాడనుకొనుడు. సర్వమునందు ఈ ' నేను ' ఎక్కడనుండి వచ్చినది ? 'నేను ( అహమ్ ) ' సర్వభూతముల యందు గలదని ( సర్వభూతస్థః ) శ్రీశంకరులు వ్రాక్రుచ్చిరి. ఆయన అట్లు చెప్పుటకు కారణమేమి ? సర్వాత్మా అని చెప్పిన చాలదా ? చాలదు. సర్వాత్మా అని మాత్రమే చెప్పినచో, ఆత్మ జగద్రూపముగా పరిణమించినదని భావించుటకు అవకాశము గలదు. కావున, ఆత్మ పరిణమించ లేదనియు, అది సర్వమునకు అతీతముగా నున్నదనియు, కాని అదే సమయములో ఆత్మ సర్వాంతర్యామి కూడా అనియు చెప్పవలసి యున్నది. ఆత్మ సర్వభూతస్థము అని మాత్రమే చెప్పి ఊరకున్నచో, లోపల మాత్రమే ఆత్మ ఉండుననియు, బయట ఉండదనియు, కావున ఈ సర్వము ఆత్మ కంటె భిన్నమనియు భావించే అవకాశము గలదు. కావున, అహం సర్వభూతస్థ ఆత్మా, అహం సర్వాత్మా అని రెండు విధములుగా కూడ చెప్పుట ఆవశ్యకము. చైతన్యఘనుడగు పరమేశ్వరుడు సర్వత్రా ఉన్ననూ, బుద్ధియందు ప్రతిఫలించి ఆత్మరూపముగా భాసించే చైతన్యమును మాత్రమే మనము గుర్తించ గల్గుదుము. ఈ సృష్టి అంతయు ఒకే ఒక చైతన్య-ఆత్మయందు స్థితిని కలిగియున్నది. అనగా ఈశ్వరుడు సర్వమునందు కొద్ది కొద్ది మాత్రలలో గాక, పూర్ణరూపములో వ్యాపించి యున్నాడు. పెద్ద ముద్దను ఒకదానిని కొంతమందికి కొద్ది కొద్దిగా పంచినారనుకొనుడు. ప్రతివానికి ఒక చిన్న శకలము లభించును. చైతన్యము అట్టి ముద్దయే అయినచో, ప్రతి ప్రాణియందు చైతన్యధారయొక్క ఒక లేశము ఉండును. ప్రతి వ్యక్తి లోపల నిప్పు రవ్వ వంటి ఒక చైతన్యపు రవ్వ ఉన్నదా ? కాదు. చైతన్యమును చిన్న చిన్న రవ్వలుగా విభజించుట సంభవము కాదు. ఉనికి గల ఏకైకసత్యము అదియే. మానవులందరి బుద్ధిలో పూర్ణమగు సచ్చిదానంద-ఆత్మ గలదు. ఆ సచ్చిదానంద-ఆత్మయే ఈశ్వరుడు. కావున, అద్వయపరమాత్మ సర్వస్వరూపుడై ( సర్వాత్మా ), సర్వప్రాణులలో ఉపలభ్యమగుచున్నాడు ( సర్వభూతస్థః ). అనగా ఆత్మయే సర్వభూతస్థమై యున్నది. హారములోని పూసలన్నింటియందు ఒకే దారము వ్యాపించి యుండు విధముగా, ఒకే ఆత్మ సర్వప్రాణుల లోపల అంతర్యామియై ఉన్నది.

ఈ విషయము 13 వ అధ్యాయములో కూడ నిరూపించ బడినది. అచట శ్రీకృష్ణుడు ఉత్తమపురుషనే ప్రయోగించి, ' క్షేత్రములన్నింటిలో ఉండే క్షేత్రజ్ఞుడను నేనే అని తెలుసుకొనుము ( క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వ క్షేత్రేషు భారత ) ' అని చెప్పియున్నాడు. దేహము, ఇంద్రియములు, మనస్సులతో సహా ఈ జగత్తు అంతా క్షేత్రమే. ఈ క్షేత్రము ను తెలుసుకొనేదే క్షేత్రజ్ఞ-ఆత్మ. కావున, ' నన్ను క్షేత్రజ్ఞునిగా తెలుసుకొనుము ' అనే

శ్రీకృష్ణుని వాక్యమునకు ' నీవు క్షేత్రజ్ఞుడవని తెలుసుకో ; నీ స్వరూపమైన ఆ క్షేత్రజ్ఞుడు నేనే ' అని యర్థము. అనగా, ఇది మహావాక్యము అగుచున్నది.

సర్వముయొక్క స్వరూపము అయి ( సర్వాత్మానమ్ ), సర్వమునందు ఉపలభ్యమయ్యే ( సర్వభూతస్థమ్ ) ఈ ' మామ్ ( నన్ను ) ' నకు సమమ్ ( సమానము ) అనే మరియొక విశేషణము గలదు. ఆత్మ వికారములకు వేటికీ లోను కాదు. ఆత్మ పూర్ణము గనుక, సర్వదా అవిక్రియముగా మరియు సమముగా నుండును. సర్వప్రాణుల హృదయములో ఒకే ఆత్మ గలదు. ఆ ఆత్మ పూర్ణము. ఆత్మ ఒకనిలో పూర్ణముగను, మరియొకనిలో అపూర్ణముగను ఉండదు. సర్వప్రాణులలో ఆత్మ ఏకైక పూర్ణరూపములో నుండును. దానిలో మార్పులు వచ్చే ప్రసక్తి లేదు. అదే విధముగా ఈశ్వరుడు వినాశము లేనివాడు ( అచ్యుతః ). ఈశ్వరునకు గర్భవాసము, పుట్టుక మరియు మరణము లేవు. ఆ ఈశ్వరుడు ఎవరు ? ఆ ఈశ్వరుడు నేనే ( అహమ్ ).

ఈశ్వరుని మాత్రమే శరణు పొందుట అనగా నేమి ? అనగా, ఆత్మస్వరూపుడనగు నాకంటె భిన్నముగా ఏదీ లేదనియు, ఆత్మకు ఈశ్వరునకు తత్త్వములో భేదము లేదనియు అర్థము. ఈశ్వరునికంటె భిన్నముగా ఏదీ లేదు. ఆ ఈశ్వరునకు ఆత్మకు భేదము లేదు. భగవానుడు ఒక్కడే అని మాత్రమే మనము చెప్పి ఊరకుండుట లేదు. ఉన్నది భగవానుడు ఒక్కడు మాత్రమే అని మనము చెప్పుచున్నాము. నేను ఈశ్వరుని కంటె భిన్నముగా లేను. ఈశ్వరుడు నా కంటె భిన్నముగా లేడు. అనగా, ఆ పరంబ్రహ్మ నీవే అయి ఉన్నావు ( తత్ త్వం అసి ). స్వయంసిద్ధుడవై యున్న నీ ( త్వమ్ ) కొరకు మాత్రమే ఈ వచనము ఉద్దేశించ బడినది. భ్రాంతి నీ విషయములో మాత్రమే గలదు. తత్ విషయములో సమస్య లేదు. తత్ విషయములో ఒకచో సమస్య ఉన్ననూ, అది నీ వరకు రాదు. నీ స్వరూపము నీకు తెలిస్తే నీ సమస్య పరిష్కారమగును. నీవే బ్రహ్మవు. నీవే ఈశ్వరుడవు. శరణాగతికి అర్థము ఇదియే. సర్వముయొక్క ఆత్మ అయినవాడు ( సర్వాత్మా ), సర్వప్రాణులయందు ఉపలభ్యమగుచున్నవాడు ( సర్వభూతస్థః ), సముడు ( సమః ), జన్మమరణములు మొదలైనవి మరియు వినాశము లేనివాడు ( అచ్యుతః ) అగు పరమేశ్వరుని శరణు పొందుట యనగా ఆ పరమేశ్వరుని కంటె భిన్నముగా ఏదీ లేదని తెలుసుకొనుటయే.

శ్రీశంకరులు ఇచట ఈ విధముగా వ్యాఖ్యానించిరి. ఈ వ్యాఖ్యానము ఒక్కటి మాత్రమే యుక్తియుక్తమైనది. ఇతరవ్యాఖ్యానములలో ఈ సర్వధర్మపరిత్యాగమును కుదుర్చుట పెద్ద సమస్య యగును. నీవు మంచి-చెడు కార్యములను ( సర్వధర్మాన్ ) విడిచిపెట్టి భగవానుని శరణు పొందుము అని ఒకాయన నాతో చెప్పినాడను కొనుడు. ఈ శరణాగతి మంచి కర్మయా ? లేక, చెడు కర్మయా ? అది మంచి కర్మయైనచో, నేను మంచి-చెడు కర్మలను విడిచిపెట్టి ఏ విధముగా శరణాగతిని చేయవలెను ? శరణాగతి చాల మంచి కర్మ. అది ఇతరములగు మంచి కర్మలు అన్నింటి కంటె గొప్పది కావచ్చును. కాని అది కూడ మంచి కర్మయే కదా ! అనగా, ఏకకాలమునందు మంచి కర్మను విడిచి పెట్టుట మరియు శరణాగతిని చేయుట అసంభవము. శరణాగతిని చేసి నిషిద్ధ-కర్మ

లను మరియు కామ్య-కర్మలను విడిచిపెట్టుట సంభవమగును. కాని, శరణాగతిని చేస్తూ సర్వకర్మలను విడిచిపెట్టుటు అసంభవము.

ఇంతేగాక, ఎవరు ఎవరికి శరణాగతిని చేయవలెను ? నేను శరణాగతిని చేయవలెను. సరే. నేను నా మంచి-చెడు కర్మలను అన్నింటినీ విడిచిపెట్టెదను. నేను ఇతరులకు మంచిని గాని, చెడును గాని చేయను. మంచి-చెడు కర్మలను విడిచిపెట్టినా, ఇంకనూ నేను మిగిలియే యున్నాను. నేను నా అహంకారమును సమర్పించవలెను అన్నచో, నేను ఆ పనిని ఏ విధముగా చేయవలెను ? ఆ పనిని చేయునది ఎవరు ? అహంకారము అహంకారమును సమర్పించవలెను. ఇది ఎట్లు సంభవమగును ? సమర్పించ బడవలసినది అహంకారమే అయి ఉండగా, అహంకారముకంటె భిన్నమైన తత్త్వము మరియొకటి యున్నచో, అది అహంకారమును చేతిలోనికి తీసుకొని భగవానుని చరణముల వద్ద సమర్పించగల్గును. కాని, ఈ అహంకారము నాకు గోచరమయ్యే పదార్థము కాదు. ఏలయనగా, అహంకారము నేనే. అది భగవానుని చరణముల వద్ద నేను సమర్పించ దగిన పదార్థము కాదు. మరియొక ఇబ్బంది గలదు. ఆ చరణములు ఎచట నున్నవి ? నేను భగవానుని చరణములను ఎచట వెదికి పట్టుకొనవలెను ? ఇదంతా ఊహాలోకము మాత్రమే. ఇటువంటి ఊహాప్రపంచములో నుండే మానవుడు సాధించేది గణనీయముగా నుండదు. దీనివలన, భక్తునకు ఒకానొక శరణాగతి భావన కలుగును. అది మంచిదే. కాని, అంతతో గత్యా దాని వలన సమస్య పరిష్కారము కాదు. ఇచట గీతయొక్క అంతములో శ్రీకృష్ణుడు అర్జునునకు గీతాసారమును చెప్పే సందర్భములో, ఆయన కేవలము ఒక సరళమగు మానసిక భావనను బోధించినాడనుట పొసగదు. ఇది మోక్షశాస్త్రము. ఆయన మోక్షోపాయమును గురించి మాటలాడవలెను. కావున, భగవానుని శరణు పొందుట అను వచనమునకు ఈయగలిగే అర్థములను అన్నింటినీ విశ్లేషించినచో, ఇచట శ్రీశంకరులు చెప్పిన అర్థమును మినహాయించి, మిగిలిన అర్థములు యుక్తియుక్తములుగా లేవని స్పష్టమగును.

సర్వకర్మసన్న్యాసము మరియు ఈశ్వరశరణాగతి అనునవి ఇంచుమించు ఒక్కటియే. ఇవి కఱ్ఱను నరుకుట మరియు కఱ్ఱను రెండు ముక్కలుగా చేయుట వంటివి. అవి రెండు విభిన్నమగు కర్మలు కావు. కఱ్ఱను నరుకుట ఒక పని, కఱ్ఱను రెండు ముక్కలుగా చేయుట మరియొక పని అనవచ్చునా ? అది సరిగాదు. అది అంతా ఒకే ఒక కర్మ. కఱ్ఱను రెండు ముక్కలుగా చేయుట యనగా దానిని నరుకుటయే. అది ఎప్పుడు రెండు ముక్కలు అగును ? నరుకుట అనే పని పూర్తి అవుతూనే, అది రెండు ముక్కలు అగును. వాస్తవములో, నరుకుట యనగా రెండు ముక్కలుగా చేయుటయే. అదే విధముగా, ఇచట సర్వకర్మసన్న్యాసమనగా, ఈశ్వరుడే ఆత్మ యనియు, ఆత్మ ఈశ్వరుడే ననియు గుర్తించుటయే. దీనికే జ్ఞాననిష్ఠ యని పేరు. ఇచట ఇంకో రకమైన వ్యాఖ్యానము పొసగదు. ఇంకో విధానములో సర్వకర్మలనుండి విముక్తి ( సర్వపాపేభ్యః మోక్షః ) లభించదు.

నేను నిన్ను సర్వపాపములనుండి విడిపించెదను అనే శ్రీకృష్ణుని వచనము చాల ప్రముఖమైనది. సర్వధర్మములను విడిచిపెట్టి భగవానుని శరణు జొచ్చినచో, ఆయన మనము చేసిన పాపములను అన్నిటినీ తీసివేయునని దీని యర్థమా ? ' నీవు చింతిల్లకు

ము. హత్యలను, దొంగతనములను, ఇతరసామాజికద్రోహములను చేయుచూ నీవు చేయ గలిగినంత బీభత్సమును చేయుము. జనులకు పీడను కలిగించుము. ఆ పైన నీ పాపము లను అన్నింటినీ నేను తుడిచి వేసెదను. కాని ఒక షరతు. నీవు నన్ను శరణు పొందవ లెను.' ఈ భాషణము సర్వజగత్తునకు తండ్రియగు భగవానుని భాషణమును పోలి లేదు. ఇది గూండాల నాయకుని సలహాను పోలియున్నది. ఈ శ్లోకమును జనులు ఈ తీరున తప్పుగా అర్థము చేసుకొనకుండుట కొరకై, ఎటువంటి వ్యక్తి ( నీవు, త్వమ్ ) పాపవిము క్తిని పొందునో వివరించిరి. సర్వజగత్కారణమగు ఈశ్వరుని కంటె భిన్నముగా ఏదీ లేదనే నిశ్చితబుద్ధి గల వ్యక్తి సర్వపాపవినిర్ముక్తుడగును. కారణము కంటె భిన్నముగా కార్యము నకు ఉనికి లేనే లేదు. ఈశ్వరుడు అనగా సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ అనియు, ఆ సత్య-జ్ఞాన-అనంత-బ్రహ్మ ఆత్మయేననియు గుర్తించిన వ్యక్తి విముక్తుడగును. ఆత్మ కంటె వేరుగా జ్ఞానము ఉదయించే మరియొక స్థానము ( చైతన్యము ) లేదు. కావున, బ్రహ్మ యొక్క లక్షణములో ఆత్మలక్షణము అంతర్గతమగును. ఆత్మయే బ్రహ్మ, మరియు బ్రహ్మ ఆత్మయే గనుక, వాటిలో ఏ ఒక్కదాని లక్షణమును చెప్పినా, అది సమగ్రముగా నుండి వాటి ఐక్యమును బోధించును. సచ్చిదానంద ఆత్మ యనగా సత్య-జ్ఞాన-అనంత-బ్ర హ్మయే. *సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ* అనగానే, అది సచ్చిదానంద ఆత్మయే. ఈ రెండింటికీ భేదము లేదు గనుక, ఏ ఒక్క దాని లక్షణమును చెప్పినా చాలును. ఆత్మయ నగా బ్రహ్మయే నని శ్రుతి బోధించుచున్నది గనుక, బ్రహ్మలక్షణము ఆత్మలక్షణమే యగును. ఈ సత్యము తెలిసినచో, నా కంటె భిన్నముగా ఏదీ లేదను ( *మత్తః అన్యత్ కించిత్ నాస్తి* ) సత్యము సహజముగా గోచరించును. ఈ విషయములో సంశయము గాని, అస్పష్టత గాని లేని వ్యక్తి నిశ్చితబుద్ధి యనబడును. ఇట్టి బుద్ధి గల నీకు నేను మోక్షము నీయగలనని భగవానుడు చెప్పుచున్నాడు.

దేనినుండి ? సర్వపాపములనుండి ( *సర్వపాపేభ్యః* ). పాపములు ఎయ్యవి ? సర్వపాపములు అనగా ఇచట కర్మబంధము అని యర్థము. అనగా, ధర్మాధర్మములు రెండు దానిలో అంతర్గతమగునని శ్రీశంకరులు వివరించిరి. మనము చేసే క్రియ ధర్మము అయినా, అధర్మము అయినా, దాని వలన పుణ్యము లభించినా, పాపము లభించినా, అది అంతా సమానమే. నేను నిన్ను పుణ్యపాపములను ఇచ్చే సర్వకర్మలనుండి విడిపించెద నని ( *త్వాం మోక్షయిష్యామి* ) శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు.

ఇచట ఒక అభ్యంతరమును లేవనెత్తుటకు అవకాశము గలదు. నేను ఈశ్వరుడను అనే జ్ఞానముచే నాకు సర్వకర్మలనుండి విముక్తి లభించే పక్షములో, ఆ విముక్తిలో శ్రీకృ ష్ణుని ( ఈశ్వరుని ) పాత్ర ఏమున్నది ? ఒక గిన్నె మనతో ఈ విధముగా చెప్పిన దనుకొ నుడు : ' నన్ను నీటితో నింపి, పొయ్యిపై పెట్టి, ఆ నీటిని మరిగించి, దానిలో టీ పొడిని వేసి, నన్ను చేతితో పట్టుకొని, ఆ నీటిని కప్పులో పోసినచో, నేను మీకు టీని ఈయగ లను' . ఈ ఇచ్చుటలో గొప్ప యేమున్నది ? మనము ఈశ్వరునితో ఈ విధముగా చెప్ప వచ్చును : ' నేను ఈశ్వరుడనని, నేను నీవు ఒకటే నని, నేను నీకంటె భిన్నము కానని, నీవు కూడ నాకంటె భిన్నముగా లేవని తెలుసుకున్న నాడు నన్ను విడిపించుకుటకు నీ పని యేమున్నది ?' ఈ సందర్భములో విముక్తి అనే మాట కేవలము అలంకారిక ప్రయోగము

మాత్రమే. సరియగు నిశ్చితబుద్ధి లేని బంధస్థితిని మనసులో నిడుకొని మనము ఆ దృష్టి కోణములో మాత్రమే విముక్తిని గురించి మాటలాడెదము. విముక్తి యనగా ఈశ్వరుడు కొత్తగా నిర్మించే స్థితి కాదు.

ఈ మోక్షమును శ్రీశంకరులు చాల సుందరముగా నిరూపించిరి. మానవునకు తన స్వరూపము తెలియునట్లు చేయుట ద్వారా ( స్వాత్మభావప్రకాశీకరణేన ) మోక్షము ఈయ బడును. ఆత్మ బ్రహ్మ-అభిన్నము అనే సత్యము అజ్ఞానముచే కప్పివేయబడి యున్నది. కావున, ఆ సత్యమును నిరూపించవలెను. ఆత్మ ఈశ్వర-అభిన్నము అనే తత్త్వమును బోధించి ఆ అజ్ఞానమును పారద్రోలవలెను. ఆత్మ ఈశ్వర-అభిన్నము అనే జ్ఞానము వలన మానవుడు విముక్తుడగును. ఈ విముక్తిలో క్రియ లేదు. ఏలయన, జీవుడు సర్వకాలములలో, అనగా గడచిన కాలములో మరియు ఇప్పుడు కూడా విముక్తుడుగనే యున్నాడు. రాబోయే కాలములలో అటులనే ఉండగలడు. అనగా, మానవుడు నిత్యముక్తుడు. మానవుడు ఈ సత్యమును తెలుసుకొని, దానిని స్వంతము చేసుకొని ముక్తుడు అగును. ఈ విషయమును భగవానుడు ఇదివరలో కూడ చెప్పియున్నాడను విషయమును శ్రీశంకరులు మనకు గుర్తు చేయుచున్నారు. ' నేను ఆత్మస్వరూపుడనై జ్ఞానము అనే దీపముచే అజ్ఞానాంధకారమును పారద్రోలెదను ( నాశయామి ఆత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా )'. ఈ జ్ఞానము ఎయ్యది ? నేను బ్రహ్మను ( అహం బ్రహ్మాస్మి ) అనే వృత్తి-జ్ఞానమే. మనస్సులో ఉదయించే ఈ వృత్తి-జ్ఞానము మాత్రమే అజ్ఞానమునకు విరోధి. జ్ఞానఘనమగు చైతన్యము అజ్ఞాన-విరోధి కాదు. చైతన్యమే అజ్ఞాన-విరోధి అయి ఉన్నచో, చైతన్యము సర్వదా ఉన్నది గనుక, అజ్ఞానమే ఉండెడిది కాదు. అజ్ఞాన-విరోధియై బుద్ధియందలి అజ్ఞానమును పారద్రోలే ఈ వృత్తి-జ్ఞానము జ్ఞానసాధనము ( ప్రమాణము ) ను వినియోగించకుండగా ఉదయించ లేదు. కావుననే, పైన ఉదహరించిన శ్లోకములో దీపము అనే పదము చాల ప్రముఖమైనది. బుద్ధిలో అజ్ఞానమనే చీకటి ఉన్నది. కావున, దీపమును వెలిగించ వలెను. ఈ అజ్ఞానమనే చీకటిని పారద్రోలుటకు మనకు జ్ఞానమనే దీపము ఆవశ్యకమగుచున్నది. నేను బ్రహ్మను అనే వృత్తిజ్ఞానమే ఆ దీపము. సర్వప్రాణుల హృదయములో ఆత్మరూపుడుగా నుండి ( ఆత్మ భావస్థః ), భగవానుడు జ్ఞానదీపముచే అజ్ఞానాంధకారమును తరిమి వేసి ఆత్మ ఈశ్వరాభిన్నమనే సత్యమును దర్శింప జేయును. కావున, ' నీవు దుఃఖించకుము ( మా శుచః ).

ఈ శరణాగతిని ఒక సాధన రూపములో కూడ స్వీకరించ వచ్చును. ' పుణ్యాపాపక ర్మలను అన్నింటినీ విడిచిపెట్టి సన్న్యాసివై నా వద్దకు వచ్చి నన్ను ఆరాధించుము. నీవు నన్ను అన్వేషిస్తున్నావు గనుక, నేను నీకు జ్ఞానమునిచ్చి నా స్వరూపమును దర్శింపజేసె దను. నీవు వృత్తి-జ్ఞానమును పొంది, నీకు నాకు గల అభేదమును తెలుసుకొని, పుణ్యాపాప ములనుండి పూర్తిగా విముక్తిని పొందగలవు '. ఈ విధముగా స్వీకరించినచో, ఈ శ్లోకము స్పష్టముగా సన్న్యాసమును సూచించుచున్నదని చెప్పవచ్చును. దీని ముందు శ్లోకము కర్మయోగమును బోధించగా, ఇది సన్న్యాసమును బోధించును. కర్మ తనంత తానుగా మోక్షమునీయదని స్పష్టము చేయబడినది. జ్ఞానము కూడ కొత్తగా మోక్షమునీయదని

మనకు ఇప్పుడు తెలిసినది. మానవుడు నిత్యముక్తుడై ఉన్నాడు. జ్ఞానము అజ్ఞానము నుండి విముక్తిని కలిగించును. అజ్ఞానము పోగానే, దానితో బాటు బంధము కూడ తొలగి పోవును. నేను బద్ధుడను అనే ధారణను మాత్రమే జ్ఞానము పోగొట్టును. నీవు సర్వదా ముక్తుడవే. కావున, కర్మ గాని, జ్ఞానము గాని కొత్తగా మోక్షమునీయ బని లేదు. కాని, తాను ముక్తుడనని తెలియని వానికి జ్ఞానము అవసరమగును. ఆ జ్ఞానము ఏది ? సంసార హేతువు అగు అజ్ఞానమును పోగొట్ట గలిగేదే ఆ జ్ఞానము. ఆ జ్ఞానము మాత్రమే మనకు కావాలి. మనకు ఇతరముతో పని లేదు. ఈ విషయము ఈ శ్లోకములో చెప్పబడినది. మోక్షమునకు కర్మతో గాని, కర్మ-జ్ఞాన-సముచ్చయముతో గాని పని లేదని శ్రీశంకరులు వివరించనున్నారు. ఆత్మ నిత్యముక్తము గనుక, జ్ఞానమైననూ కొత్తగా మోక్షమును సృష్టించదు. ఆ సత్యమును నీవు ఎరుంగనిచో, నీకు అజ్ఞానము గలదని చెప్పక తప్పదు. కావున, ఆ అజ్ఞానమును పారద్రోలుటకు జ్ఞానము ఆవశ్యకమగును.

ఇంతటితో ఈ శ్లోకముపై శ్రీశంకరులు వ్రాసిన భాష్యము పూర్తి అయినది. ఇపుడు వారు సమస్తగీతాశాస్త్రముయొక్క సారమును సంగ్రహముగా చెప్పదలచి, మోక్షమును బడయుటకు సముచితమగు సాధనమేది అను విషయముపై చర్చను ఆరంభించుచున్నారు. మోక్షసాధనము జ్ఞానమా ? కర్మయా ? లేక, ఈ రెండింటి కలయికయా ? ఈ మూడు వాదములను వారిచట ప్రదర్శించి చర్చించినారు. శ్రీశంకరులు ఈ నిర్ణయమును ఇది వరలో చేసియున్ననూ, విషయమును మరింత స్పష్టము చేయుట కొరకై మరల చర్చను ఆరంభించు చున్నారు. ఈ గీతాశాస్త్రములో నిశ్చితముగా మోక్షసాధనము ఏదని నిర్ణయించబడినది ? కేవల జ్ఞానము మాత్రమే మోక్షసాధనమా ? లేక, శాస్త్రవిహితములైన అగ్నిహోత్రాదికర్మలా ? లేక, ఈ రెండింటి సముచ్చయమా ? అనే శంక గలదు. కావుననే, ఈ చర్చ అవసరమైనది. కేవలజ్ఞానము మోక్షము నీయజాలదనియు, కేవల కర్మ కూడ అంతే ననియు, కావున ఈ రెండింటి కలయిక కార్యకారి యగుననియు కొందరు వాదించెదరు. వారు ఇట్లు చెప్పెదరు : మానవుడు మార్గమును చూపే చిత్రపటమును పరిశీలించినంత మాత్రాన గమ్యమును చేరలేడు. అటులనే,మోటారును నడుపుచున్ననూ, అటువంటి మార్గదర్శనము లేనిచో, గమ్యమును చేరలేడు. ఈ రెండింటినీ కలిపి అనుష్ఠించినచో, గమ్యమును చేరుట ఖాయము. అదే విధముగా, మోక్షమును పొందుటకై కర్మానుష్ఠానముతో గూడిన జ్ఞానసాధన ఆవశ్యకమగును. దీనికి కారణమేమి ? కర్మజ్ఞానములను రెండింటినీ శాస్త్రము విధించుచున్నది. అగ్నిహోత్రము మొదలగు నిత్యకర్మలు మరియు నిత్యప్రార్థనలు శాస్త్రవిహితములు గనుక, జ్ఞానసాధనతో బాటుగా వాటిని కూడ ఆచరించు చుండవలెను. లేదా, జ్ఞానముయొక్క సహకారముతో కర్మయే మోక్షమునిచ్చుననియు చెప్పవచ్చును. ఇది రెండవ పక్షము. జ్ఞానము మాత్రమే మోక్షసాధనమని మూడవ పక్షము.

ఈ శంకలన్నింటికీ మూలము ఏమి ? దేనిని తెలుసుకున్నచో మానవుడు అమృతత్వమును పొందునో, అట్టి తెలియదగిన వస్తువును నేను నీకు చెప్పెదను ( జ్ఞేయం యత్తత్ ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వా అమృతమశ్నుతే ) అని భగవానుడు 13 వ అధ్యాయములో చెప్పినాడు. ఈ విధముగా నన్ను యథాతథముగా తెలుసుకొని, ఆ పై నాలో

ప్రవేశించును ( *తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్* ) అని భగవానుడు ఈ 8 వ అధ్యాయములో చెప్పినాడు. గీతలో ఇటువంటి వాక్యములు ఒకటి లేక రెండు మాత్రమే కాదు ; కోకొల్లలుగా గలవు. కర్మసంబంధము లేకుండగా కేవలము జ్ఞానము మాత్రమే మోక్షసాధనమని నిరూపించే వాక్యమును ప్రతి అధ్యాయమునుండి ఉదహరించ వచ్చును. ఇవి ఒక రకం వాక్యములు. ఇవి గాక, మరియొక రకం వాక్యములు గలవు. నీకు కర్మయందు మాత్రమే అర్హత గలదు ( *కర్మణి ఏవ అధికారస్తే* ).' కర్మను మాత్రమే చేయుము ( *కురు కర్మైవ* ). ఎవడైతే కర్మలను బ్రహ్మయందు సమర్పించి, ఆసక్తిని పూర్తిగా విడిచిపెట్టి చేయునో, ఆతడు తామరాకు నీటిచేతను వలె పాపముచే స్పృశించ బడడు ( *బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః, లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా* ). ఇంతేగాక, కర్మ లేనిదే శరీరయాత్రయైననూ సిద్ధించదనియు, మానవుడు కర్మలను చేయకుండగా క్షణకాలము అయిననూ ఉండ లేడనియు ( *న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్* ) చెప్పబడినది. ఇంతే గాక, స్వకర్మను చేయుచూ తద్ద్వారా ఈశ్వరుని ఆరాధించు మానవుడు సిద్ధిని బడయుననియు ( *స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః* ) చెప్పబడినది. గీతలోని ఈ వాక్యములను చూచినచో, కర్మకు ఒక విశిష్టమగు హోదా గలదనియు, దానిని చేయవలయుననియు తెలియుచున్నది.

ఇప్పుడు మనకు ఏమి తేలినది ? మోక్షము కొరకై కర్మను చేయవలెను అనియు, కేవలజ్ఞానము మోక్షమునిచ్చుననియు రెండు విభిన్నములగు వాక్యములు గలవు. కావున, సందేహము కలుగుటలో ఆశ్చర్యము లేదు. నాకు మోక్షమును ఇచ్చునది యేది ? కర్మ మరియు జ్ఞానము అనే రెండింటినీ ఒకే శాస్త్రము బోధించుచున్నది. అనగా, ఈ రెండింటి సముచ్చయము వలన మోక్షము సిద్ధించునా ? దీనిని ఏ విధముగా అర్థము చేసుకొన వలెను ? బహుశః కేవలకర్మ గాని, కేవలజ్ఞానము గాని మోక్షమును ఈయలేక పోవచ్చును. వాటి సముచ్చయము మోక్షహేతువు కావచ్చును. ఈ రెండు రకముల వాక్యములను బట్టి ఇటువంటి శంక కలుగుట సహజమే.

సంశయము ఉన్నచో ఉండనిండు. బహుశః ఈ మూడు పక్షములలో ప్రతి ఒక్క పక్షము మోక్షమునీయ వచ్చును గాక ! దాని గురించి చింత చేయనేల ? కాదు. మోక్షమును కోరువాడు ఇట్టి సందేహమును తొలగించకుండగా నుండజాలడు. శాస్త్రములోని వాక్యముల విషయములో సంశయము కలిగినచో, దానిని విశ్లేషించి తాత్పర్యమును అరయవలెను. ఎందువలన ? ఈ విశ్లేషణ వలన ఫలమేమి ? ఈ మూడింటిలో మోక్షసాధనమును గుర్తించుట అవసరము. వాటిలో ఒకటి మాత్రమే మోక్షము నీయగల్గును. అట్టి మోక్షసాధనము కర్మయా ? జ్ఞానమా ? లేక, కర్మజ్ఞానసముచ్చయమా ? దీనిని తెలియుట వలన ఫలమేమి ? ఇది తెలిసినప్పుడు మాత్రమే మనకు మోక్షము లభించును. లేనిచో, మనకు సాధనలో ముందుకు సాగవలసిన దారి తోచదు. మన మనస్సు చింతకు మరియు సమ్మోహమునకు నిలయమగును. వీటిలో ఒకింత కర్మను, మరికొంత జ్ఞానమును సంపాదించ వలెనా ? ఉదయము కొంత జ్ఞానము, సాయంకాలము కొంత కర్మ, ఒక రోజు జ్ఞానము, మరియొక రోజు కర్మ ----- ఈ తీరున చేయవలెనా ? ఈ అన్వేష

ఐను ఆరంభించుటకు ముందు మోక్షసాధనము ఏది అను విషయము మనకు ఖచ్చితముగా తెలిసి ఉండవలెను. లేనిచో, మన సమయము వ్యర్థమగును.

ఈ విషయమును మనము ఇదివరలో చర్చించక పోలేదు. మనము కర్మను, దానికి ఉండే హద్దులను అనేకపర్యాయములు చర్చించి యున్నాము. కాని మనము గీతాశాస్త్రముయొక్క తాత్పర్యమును నిర్ధారించ గోరుచున్నాము. గీత యనగా అర్జునుడు లేచి నిలబడి యుద్ధమును చేయునట్లు చేసే ప్రోత్సాహకవచనములు మాత్రమే అని కొందరి అభిప్రాయము. శ్రీకృష్ణుడు ఆరంభములో అటువంటి ప్రోత్సాహకర వచనములను చెప్పిన మాట వాస్తవమే. *కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్, అనార్యజుష్టమస్వర్గ్యమకీర్తికరమర్జున; క్లైబ్యం మా స్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే, క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప* అనే శ్రీకృష్ణుని వచనములు కేవలము అర్జునునిలో ఉత్సాహమును నింపుట కొరకు మాత్రమే ఉద్దేశించ బడినవి. ఈ విషయము 2 వ అధ్యాయములో స్పష్టముగా చెప్పబడినది. కాని, అర్జునునిలో ఉత్సాహము కలుగలేదు. అది ప్రధానమైన సమస్య. అర్జునుడు శ్రీకృష్ణునితో ఇట్లు చెప్పినాడు : ' దయ చేసి నాకు బోధించుము. నేను నీ శిష్యుడను. నాకు గల ఈ శోకము తొలగిపోయే సూచనలు నాకు కానవచ్చుట లేదు. నా హృదయములో ఇది వరకే దాగియున్న దుఃఖము భీష్మద్రోణులను సంహరించ వలసిన ఈ తరుణములో పైకి ఉబుకుచున్నది. నా హృదయములో దాగియుండి ఇప్పుడు అభివ్యక్తమగుచున్న దుఃఖమును నేను శాశ్వతముగా పరిష్కరించ గోరుచున్నాను. దాని కొరకై నేను శిష్యుడనై శ్రేయస్సు ( మోక్షము ) ను సాధించ వలెనని నాకు తెలియును. కావున, దయ చేసి నాకు బోధించుము ( *కథం భీష్మమహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన, ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన ; గురూనహత్వా హి మహానుభావాన్ శ్రేయో భోక్తుం భైక్ష్యమపీహ లోకే, హత్వార్థకామాంస్తు గురూనిహైవ భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్ ; కార్పణ్యదోషోపహతస్వభావః పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః, యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తేహం శాధి మాం త్వాం ప్రపన్నమ్* ) '. అర్జునుని ఈ వచనము వరకు గీతోపదేశము ఆరంభము కాలేదు. అంతవరకు భగవానుడు ఉత్సాహవర్ధకమగు వచనములను మాత్రమే పలికెను. ఆరంభములో భగవానుని ప్రతివచనముయొక్క తాత్పర్యము అతడు తన చర్యకు సిగ్గుపడునట్లు చేసి తద్వారా ఆతనిని కర్తవ్యనిష్ఠుని చేయుట మాత్రమే. కాని, ఇప్పుడు శ్రీకృష్ణుడు ఇట్లు పలికినాడు : ' నీవు జ్ఞాని పలుకదగిన పలుకులను చెప్పుచున్నావు. కాని, శోకింప దగని వారిని గురించి శోకించుచున్నావు. జీవించి యున్న వారిని గురించి గాని, మరణించిన వారిని గురించి గాని జ్ఞానులు శోకించరు ( *అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే, గతాసూనగతాసూంశ్చ నానుశోచంతి పండితాః* ). అభావమునకు ఉనికి లేదు. భావపదార్థమునకు అభావము లేదు. ఈ భావ-అభావముల తత్త్వమును జ్ఞానులు దర్శించెదరు ( *నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః, ఉభయోరపి దృష్టోంతస్త్వనయోస్తత్త్వదర్శిభిః* ) .' ఇంతవరకు ఈ ఉపదేశము అర్థమైనచో, ఉపనిషత్తులలోనైననూ ఇంతకు మించి తెలియ దగినది లేదు. సత్ మరియు అసత్ అనే రెండింటి తత్త్వమును తత్త్వవేత్తలు ( *తత్త్వదర్శినః* ) దర్శించెదరు. పరంబ్రహ్మకు అంకితమైన

బుద్ధిని కలిగి, జ్ఞానముచే నశింప చేయబడిన మాలిన్యములు గల వారికి మరల పుట్టుక లేదు ( తద్బుద్ధయస్తదాత్మానస్తన్నిష్ఠాస్తత్పరాయణాః, గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూత కల్మషాః ). ఇటువంటి వాక్యములు కోకొల్లలుగా గలవు. ' సర్వప్రాణులలోని క్షేత్రజ్ఞుడను నేనే అని తెలుసుకొనుము ( క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ) .' ఇది ఉత్సాహవర్ధనము కొరకు ఉద్దేశించ బడిన వచనము కాదు. ఉత్సాహమును పెంపొందించుటకై శ్రీకృష్ణుడు క్షేత్ర-క్షేత్రజ్ఞుల గురించి మాటలాడ వలసిన పని యేమున్నది ?

అభిమానము మరియు సమ్మోహము అను వాటినుండి విముక్తిని పొందిన వారు, ఆసక్తి అనే దోషమును జయించిన వారు, ఆత్మజ్ఞాననిష్ఠులు, కామనలు తొలగిన వారు, సుఖదుఃఖాది ద్వంద్వములనుండి విముక్తిని పొందిన వారు అగు జ్ఞానులు వినాశము లేని పరమపదమును పొందెదరు ( నిర్మానమోహా జితసంగదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః, ద్వంద్వైర్విముక్తాస్సుఖదుఃఖసంజ్ఞైర్గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్ ).' ఈ వచనము ఉత్సాహమును పెంపొందించేది కాదు గదా ! ఉత్సాహవర్ధకములగు వచనములు ఇట్లుండును : ' లెమ్ము, యుద్ధమును చేయుము. లేచి నిలబడు. నీకు ఈ లాభము ఉన్నది ; ఆ లాభము ఉన్నది. ఈ తీరున నీరు గారి పోవద్దు. ఇది సరియగు మనః ప్రవృత్తి కాదు. నీ వారిని గురించి, నీకు ఉన్న పేరు-ప్రతిష్ఠల గురించి ఆలోచించుము. ' ఇట్టి వచనములను పదే పదే చెప్పినచో, ఎదుటి వానిలో నీరు గారిపోవుచున్న ఆత్మవిశ్వాసము పైకి లేచును. అది వేరే. కాని, ఇచట అంతా ఉపదేశమే ; అంతా ఆలోచించి తెలియ దగినదియే. ప్రోత్సాహక వచనములు ఎక్కడ నున్నవి ? గీత మోక్షశాస్త్రము. కావున, గీతోపదేశము ననుసరించి, మోక్షసాధనము కర్మయా ? లేక, జ్ఞానమా ? లేక, రెండింటి సముచ్చయమా ? అనునది ఇచటి చర్చనీయాంశము. అర్జునుడు శ్రేయస్సును గోరెను. శ్రేయస్సు అనగా మోక్షము. భగవానుడు ఆతనికి దానిని ఇచ్చెను. మోక్షసాధనము విషయములో ఈ సందేహము అర్జునునకు కూడ గలదు. జ్ఞానము గొప్పదియా ? లేక, కర్మ గొప్పదియా ? అను ప్రశ్నను అర్జునుడు వివిధరూపములలో ( జ్యాయసీ చేత్కర్మణస్తే ---- సన్న్యాసం కర్మణాం కృష్ణ ) పలుమార్లు వేసి యున్నాడు. 18 వ అధ్యాయములో కూడ అర్జునునకు ఈ సందేహము ఇంకనూ మిగిలియే యున్నది. త్యాగమునకు , సన్న్యాసమునకు గల భేదము ఏమి ? అని ఆతడు మరల ప్రశ్నించినాడు.

ఈ సంశయము మళ్లీ మళ్లీ తల యెత్తుతూ ఉంటుంది. కావున, దీనిని ఇచట గీతాశాస్త్రముయొక్క అంతములో విశ్లేషించి స్పష్టముగా పరిష్కరించాలనే ఉద్దేశ్యముతో శ్రీశంకరులు ఈ చర్చను ఆరంభించినారు. కర్మ, జ్ఞానము, కర్మ-జ్ఞాన-సముచ్చయము అనే మూడింటిలో ఏదో ఒకటి మోక్షసాధనము కావాలి. సాధారణముగా జీవితములో మనకు అన్నీ కొద్ది మొత్తములలో అవసరమవుతూ ఉంటాయి. అదే విధంగా, ఇక్కడ కూడా కొంత కర్మ, మరికొంత జ్ఞానము కలిసి మోక్షమునిచ్చునా ? ఈ విధముగా కొద్ది కొద్దిగా కలిపి సేవించే స్వభావము అన్ని కాలములలో గలదు. ప్రతి దానిని ఒకింత చేస్తూ, అన్నింటినీ కలిపితే అది పూర్ణమగుననే ధారణ మరియు ఆ ప్రవృత్తి జనసామాన్యములో గలదు. కాని, శ్రీశంకరులు ఆలోచించే తీరు అట్లు లేదు. ఆయన ధీరదర్శనుడగు ఆచార్యుడు. ఈ మూడింటిలో ఏది మోక్షసాధనము అనే విషయమును ఖచ్చితముగా నిర్ధారించ

వలెననియే వారి తాత్పర్యము. ఈ సంగతిని తేల్చి చెప్పుటకై ఆయన ఉపక్రమించుచు న్నారు. మనము ఈ సంగతిని ఖచ్చితముగా నిర్ధారించుకొనుట చాల అవశ్యకము. మోక్ష సాధనము కర్మయా, జ్ఞానమా, లేక వాటి సముచ్చయమా అను విషయములో మనకు సంశయము మిగిలి ఉండరాదు. ఈ విషయమును మనము విశ్లేషించ వలెను.

ఈ ఉపోద్ఘాతముతో శ్రీశంకరులు ఇపుడు చర్చను ఆరంభించు చున్నారు. ఆయన తాను దర్శించిన సత్యమును ప్రకటించి ఈ చర్చను ఆరంభించుచున్నారు. ' కాని ఆత్మ జ్ఞానము మాత్రమే మోక్షహేతువు. ' ఈ ' కాని ( తు ) ' అనే అవ్యయము దీనికి విరుద్ధ మగు కర్మవాదమును మరియు కర్మజ్ఞానసముచ్చయవాదమును సూచించి, అవి మోక్షహే తువులు కాజాలవని నిరాకరించును. శ్రీ శంకరులు ఈ ' తు ' ప్రయోగమును గురించి భాష్యములో మరల తరువాత వివరించ గలరు. ఇపుడు ఆరంభములో ఆత్మజ్ఞానము మాత్రమే మోక్షహేతువని వారు అసందిగ్ధముగా ప్రకటించుచున్నారు. వాస్తవములో జ్ఞానమే మోక్షము. జ్ఞానము లేనిదే మోక్షము లేదు. కావున, జ్ఞానము మోక్షహేతువు అని పరిగణించ బడినది. కాని, చరమలక్ష్యము కూడ జ్ఞానమే. ఏలయనగా, జ్ఞానము ఉదయిం చిన పిదప మోక్షము కొరకై చేయవలసినది ఏదీ మిగిలి యుండదు. కాని, జ్ఞానమే మోక్షము అనే పక్షములో, మనము మోక్షము అనే పదమును వాడవలసిన అవసరమేము న్నది ? దీనికి కారణము ఏమనగా, మానవుడు అన్వేషించే పురుషార్థమును మోక్షము అను పదము మాత్రమే నిర్దేశించ గలదు. పురుషార్థము మోక్షమే గాని, జ్ఞానము కాదు. మానవుడు కాంక్షించేది దుఃఖనివృత్తి. అది మాత్రమే మానవునకు విలువైనది. మానవుని మౌలిక లక్ష్యము విముక్తియే గాని, జ్ఞానము కాదు. కాని, దానికి సాధనము జ్ఞానము గనుక, మానవుడు జ్ఞానమును అన్వేషించును. ద్వైతరాహిత్యము ( కైవల్యము ) మాత్రమే ఈ ఆత్మజ్ఞానముయొక్క చరమలక్ష్యము. ఈ జ్ఞానసాధనను ఎంత కాలము కొనసాగించ వలెను ? అద్వయ-ఆత్మ-దర్శనము అగునంతవరకు. అదియే మోక్షము. ఆత్మజ్ఞానము దానియందు పర్యవసానమును చెందును. ఈ జ్ఞానము లేనిదే, మోక్షము లేదు. ఈ జ్ఞానము లభించినచో, మోక్షము లభించును. కావున, ఈ జ్ఞానమే మోక్షము అగుచున్నది.

ఆత్మజ్ఞానము మోక్షమునందు పర్యవసానమును చెందుట యెట్లు ? మనమీ విష యమును స్పష్టముగా తెలుసుకొన వలెను. ఆత్మజ్ఞానము ద్వైతభావనలను అన్నింటినీ త్రోసిపుచ్చే సామర్థ్యమును కలిగి యున్నది. ఆ విధముగా అది మోక్షమునందు పర్యవసా నమును చెందును. ఆత్మజ్ఞానము ద్వైతమును నిరాకరించుటకు కారణమేమి ? ఆత్మ అద్వయము. అనగా ఆత్మ బ్రహ్మయే. సత్యం జ్ఞానం అనంతం అగు ఆ బ్రహ్మ కంటె భిన్నముగా ఏదీ లేదు. ఈ జగత్తులో ఉన్నది ఒక్క బ్రహ్మ మాత్రమే. అదియే ఆత్మ. ఇత రము ఏదియూ లేదు. కావున, ఆత్మజ్ఞానము కలిగిన వానికి భేదబుద్ధి ఉండదు. శ్రీశంక రులు ఈ విషయమును ప్రస్తావించుటకు కారణమేమి ? సర్వద్వైతభావనలను నిషేధించి అద్వయ-ఆత్మరూపుడుగ నుండుటయే మోక్షము. అనగా, భేదభావన ఉన్నంత వరకు మోక్షము లేదు. ' నేను వేరుగా నున్నాను. నేను పనిని చేయువాడను ( కర్తా ). ఇది క్రియలో విషయము ( కర్మ ). ఇది పని ( క్రియా ). ఇది పనిని చేసే సాధనము ( కర

ణమ్ ). ఇది ఫలము ' ఇత్యాది నిర్ణయములు అన్నియు భేద-ప్రత్యయములు మాత్రమే. అవి ఉన్నంత వరకు మోక్షము లేదు. ఈ విషయమును మనము మరల చర్చించెదము.

భేదభావన నిషేధించ బడినదనుకొనుడు. క్రియను చేసే సమయములో పరిస్థితి ఎట్లుండును ? మనమీ విషయమును బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్, బ్రహ్మైవ తేన *గంతవ్యం* బ్రహ్మకర్మసమాధినా అనే శ్లోకములో చూచియున్నాము. క్రియను చేయువాడు బ్రహ్మ. క్రియలో విషయమగు కర్మ బ్రహ్మ. క్రియాసాధనము బ్రహ్మ. సర్వము బ్రహ్మయే. దీని యర్థమేమి ? క్రియ నడుస్తూనే ఉంటుంది. అయినా, నిషేధించ బడుతుంది. ఇటువంటి క్రియ, వేయించిన గింజ వలె, తినుటకు బాగుండునే గాని, దానినుండి మొక్క మొలకెత్తదు ( *భోగాయ న తు ప్రసవాయ* ). అదే విధముగా, సర్వము బ్రహ్మ అనే దర్శనము గలవానికి కర్త మిథ్య ; కర్మ మిథ్య ; క్రియ మిథ్య. ఏ సత్యమునందు ఈ సర్వము జరుగుచున్నదో, ఏది కర్త కాదో, ఆ సత్యమును తెలుసుకున్ననాడు మాత్రమే ఈ సర్వము మిథ్య యగును. ఆ సత్యము నేనే ( *తత్* బ్రహ్మ అహం అస్మి ) అని తెలిసిన వానికి సర్వము బాధితమగును. ఆ పైన జరిగేది అంతా వినోదమే. విషాదచిత్రమును చూచే సమయము అంతా కన్నుల వెంబడి బాష్పములు ప్రవహించిననూ, అది ఒక సినిమా మాత్రమేనని మనకు తెలియుచునే యుండును. మనము నాయకునితో గాని, నాయికతో గాని తాదాత్మ్యమును చెంది చూచుచుందుము. వారు తెరపై ప్రకాశింప చేయబడిన బొమ్మలు మాత్రమేనని తెలిసిననూ, తాదాత్మ్యము వలన కన్నుల వెంబడి నీరు కారును. భారతదేశములో వినోదపు పన్ను గలదు. అనగా మనము ఆనందముగా నవ్వినందులకు పన్నును కట్టవలెను. కంట తడి పెట్టినచో, దానికి కూడ పన్నును కట్టవలెను. కన్నీరు కార్చుటకై సినిమాకు వెళ్లి పన్నును కట్టనేల ? అది కూడ వినోదమే గనుక. నాటకములో ఈ మనోభావమునకు రసము అని పేరు. తెరపై కన బడేది సత్యము కాదు అని తెలిసినప్పుడు మాత్రమే రసము గలదు. ఒకాయన తనకు కావలసిన వ్యక్తి మరణించుటచే దుఃఖించుచున్నచో, అది రసము కాదు. నిజజీవితములో ఎవరినైననూ తుపాకీతో కాల్చి చంపినచో, మనము భయభీతులము అగుదుము. కాని సినిమాలో అట్టి దృశ్యమును చూచినప్పుడు, విశేషించి నాయకుడు ప్రతినాయకుని కాల్చి చంపినపుడు, దానిని మనము వినోదముగా పరిగణించెదము. ఇక్కడ కూడా పరిస్థితి అంతే. ఈ జగత్తు అంతా మిథ్య అని తెలిసిన జ్ఞానికి కూడ ఏవో కొన్ని భావావేగములు కలిగిననూ, అతడు అసంగుడుగ నుండును. దీనికే బాధిత-అనువృత్తి అని పేరు. ఆతని యందు సర్వము బ్రహ్మయే అను గుర్తింపు ( బ్రహ్మబుద్ధి ) గలదు. ఒక పనిని చేయుటకు వాడే సాధనము బ్రహ్మ ; చేయబడే క్రియ బ్రహ్మ ; చేసే కర్త బ్రహ్మ . దీనిని బాధిత-అనువృత్తి అందురు. సర్వము నిషేధించ బడుట ( బాధిత ) చేతనే సర్వము భగవానుడే నని మనము చెప్పగలుగుచున్నాము. అట్లు బాధితము కానిచో, సర్వము సర్వము అగునే గాని, బ్రహ్మ గాదు. చెట్టు చెట్టే ; గుర్రము గుర్రమే ; ఆవు ఆవే. ఇదంతా మిథ్య అనియు, దీనికి అధిష్ఠానము అద్వయ-బ్రహ్మ అనియు తెలియనిదే, ఇదంతా ఒక్కటే అని చెప్పుట పొసగదు. కలశము, కుండ, బాన, మూత అనేవి అన్నీ ఒకటే అని చెప్పినట్లుగా, ఈ సర్వము భగవానుడే అని చెప్పవచ్చును. ఇదియే బాధిత-అనువృత్తి. మట్టితో చేసిన

పాత్రలు అన్నీ మట్టి మాత్రమే. కాని, మనము కాఫీని ఇచ్చుటకు కప్పును ఉపయోగించె దమే గాని, మూతను వాడము. మట్టితో చేసిన పాత్రలు అన్నీ మట్టి మాత్రమే అనే దర్శన ములో ఆయా పాత్రల విభిన్నవినియోగములకు ఆటంకమేమియూ లేదు. బాధితమనగా నిదియే. కావున, సర్వకర్మలు, కర్త, కరణము ఇత్యాదులు బాధితమైనచో, మిగిలేది అద్వ య-పరం-బ్రహ్మ మాత్రమే.

ఇట్టి స్థితిలో, మోక్షమునకు ఏ రకమైన కర్మ సాధనమగును ? ఆత్మజ్ఞానము ముందుగా కర్తను, తరువాత క్రియతో సంబంధము గల సర్వకారకములను ( కారకాణి ). కూడ నిషేధించును. కర్త గాని, దేహము గాని, కర్మఫలము గాని సచ్చిదానంద-ఆత్మ కంటె భిన్నముగా లేవు. పితృదేవతలతో సహా గతములో నుండిన సర్వము సచ్చిదానంద-ఆత్మ కంటె భిన్నముగా లేదు. భవిష్యత్తులో పుట్టబోయే సర్వము కూడ అంతే. ఇంతవ రకు ప్రకటము కాని జీవులు, మరియు ఎక్కడో ఒకచోట జన్మించుటకు సంసిద్ధముగా నున్న జీవులు అందరు ఈ క్షణములో సచ్చిదానంద-ఆత్మయై ఉన్నారు. వారందరు, వారి కర్మలు మరియు వాటి ఫలములు సచ్చిదానంద-ఆత్మ కంటె భిన్నముగా లేవు. ఇట్టి స్థితిలో కర్మ ఎక్కడ నున్నది ? ఆత్మజ్ఞానము కర్త-కర్మ-క్రియ అనే భేదమును అవలీలగా తీసి పారవేయును. ఈ భేదము పోయిన తరువాత, జ్ఞాన-కర్మ-సముచ్చయమునకు ప్రసక్తి ఎక్కడిది ? కర్మను చేయుటకు ఆవశ్యకమగు ద్వైతభావనలు నిషేధించ బడినవి. జ్ఞాని జ్ఞానోదయము తరువాత కూడ కర్మలను చేయుచుండ వచ్చును. కాని, భేద-ప్రత్యయము నిషేధింప బడినది.

ఒక క్రియలో ఉండుటకు వీలయ్యే విభాగములను శ్రీశంకరులు క్రమముగా పరిగ ణించినారు. సర్వక్రియలలో క్రియాస్వరూపముతో బాటు క్రియకు సంబంధించి ఉండే కార కములు, మరియు ఫలము ఉండును. సర్వకారకములకు క్రియయే ఆధారము. క్రియను చేయునది ఎవరు ? అని మనము ప్రశ్నించినప్పుడు వచ్చే సమాధానము కర్త అనే మొదటి కారకము. కర్త ఏమి చేయుచున్నాడు ? అనే ప్రశ్ననుండి రెండవ కారకము వచ్చును. అతడు ఎట్లు చేయుచున్నాడు ? అనే ప్రశ్న మూడవ కారకమును ఇచ్చును. దేని కొరకు అతడు క్రియను చేయుచున్నాడు ? అను ప్రశ్ననుండి నాల్గవ కారకము వచ్చును. ఎక్కడనుండి క్రియను చేయుచున్నాడు ? అను ప్రశ్న ఐదవ కారకమును ఇచ్చును. ఆఖరులో, క్రియను ఎక్కడ చేయుచున్నాడు ? అను ప్రశ్న ఏడవ కారకమును ఇచ్చును. ఆరవది సంబంధము. కాని దానికి క్రియతో ప్రత్యక్షసంబంధము లేదు గనుక, అది కారకము కాదు. ఈ సంబంధము నామవాచకమునకు చెందియుండును గనుక, శ్రీశం కరులు దానిని ప్రత్యేకముగా ' ఫలము ' అని నిర్దేశించిరి. ఈ కారకములను అన్నింటినీ వేర్వేరుగా దర్శించుట భేద-బుద్ధి అనబడును. క్రియను చేయు వ్యక్తి తాను ఏమి చేయు చున్నాడు, ఎందుకు చేయుచున్నాడు, ఎట్లు చేయుచున్నాడు, ఎప్పుడు చేయుచున్నాడు, ఎక్కడ చేయుచున్నాడు అను విషయములనుండి భిన్నముగా నుండి చేయును. ఫలము కూడ భిన్నముగా నుండును. మనము ఈ పరిస్థితిని జ్యోతిష్టోమము అనే యజ్ఞము విష యములో పరిశీలిద్దాము. దానిని చేసేది ఎవరు ? స్వర్గమును కోరువాడు చేయును ; పరంబ్రహ్మ కాదు. ఎవరైతే తాను కర్తనని భావించునో, స్వర్గము అనే కర్మఫలమును

కోరునో, వాడు చేయును. భేదబుద్ధి అనగా నిదియే. నేను బ్రహ్మను అని తెలిసి చేసినచో, సమస్య లేదు. దానిని చేయుటలో ఒక ఆనందము కలుగును. కాని, ఆత్మ కర్త అనే ధారణ గల వ్యక్తి దానిని చేయుచున్నాడు. ఆతడు సమర్పించేది ఏది ? ఈ యజ్ఞములో నెయ్యి, సమిధలు మొదలగు వాటిని సమర్పించెదరు. అచట నెయ్యి బ్రహ్మ కాదు. పైగా, సమర్పించే వ్యక్తి కంటె అది భిన్నముగా నున్నది. ఆతడు నెయ్యిని ఎక్కడ సమర్పించును ? అగ్నిలో సమర్పించును. కాని ఆతని దృష్టిలో అగ్ని బ్రహ్మ కాదు. అగ్ని ఆతనికంటె భిన్నముగా నున్నది. సమర్పించబడే పదార్థము ( హుతమ్ ) వేరు ; అది సమర్పించబడే అగ్ని-సూర్య-ప్రజాపతి మొదలగు దేవతలు అందరు వేరుగా నున్నారు. వీటిలో దేనియందైననూ బ్రహ్మభావన లేదు. దీనికి భేదబుద్ధి అని పేరు.

ఈ భేదబుద్ధికి కారణమేమి ? ఇది అజ్ఞానము వలన మాత్రమే కలుగుచున్నది. సర్వము బ్రహ్మయే నను సత్యము తెలియక పోవుటచే, ఆ బ్రహ్మయొక్క అజ్ఞానము ఈ ద్వైతమునంతనూ సృష్టించుచున్నది. అజ్ఞానముచే ఆత్మ కర్తగా స్వీకరించ బడి, ' ఇది నా పని ; నేను కర్తను ; నేను ఈ పనిని ఆ ఫలము కొరకు చేయుచున్నాను ' ఇత్యాదిగా సర్వము భిన్నముగా భాసించుచున్నది. ఒకడు ఫలానా కర్మ నాది కాదని త్రోసిపుచ్చిననూ, దాని ఫలము వానికి వచ్చునట్లు కర్మనియతి ఏర్పాటు చేయును. దీనికి అంతకూ మూలము అజ్ఞానము మరియు అజ్ఞానమునుండి పుట్టిన ధారణలు. వాటికి కూడ అజ్ఞానమనియే ( అవిద్యా ) పేరు. శ్రీశంకరులు అవిద్యా అను పదమును ఈ రెండు అర్థములలో ప్రయోగించిరి. బ్రహ్మవిషయకమగు ఈ అజ్ఞానము ఎప్పుడు ఆరంభమైనది ? దానికి ఆరంభము లేదు ( అనాది-కాల-ప్రవృత్తమ్ ). కాని, దానికి అంతము గలదు.

బ్రహ్మవిషయకమగు ఈ అజ్ఞానమును ఏది తొలగించును ? ఆత్మజ్ఞానము. ఎందువలన ? అది భేద-బుద్ధిని తొలగించును గనుక. భేదబుద్ధి యనగా అద్వయ-బ్రహ్మ తెలియక పోవుటయే. ' నేను కర్తను ; ఇది నా కర్మ ; నేను ఈ కర్మను చేయుటకు గల ప్రయోజనము ఇది '. ఈ విధమైన ధారణలతో గూడియున్న భేదబుద్ధియే అవిద్య. దానిని త్రోసిపుచ్చే సామర్థ్యము ఆత్మజ్ఞానమునకు గలదు. ఆ జ్ఞానము ఎట్టిది ? నేను అద్వయ-కేవల-చైతన్యము మాత్రమే. నేను కర్తను గాను. నేను సర్వకర్మవినిర్ముక్తుడను. నాయందు కర్మఫలలేపము లేదు. నేను భోక్తను కానప్పుడు, కర్మలను చేసే ప్రసక్తి ఎక్కడిది ? కావున, ఏ కాలమునందైననూ నేను కర్తను గాని, భోక్తను గాని కాదు. పైగా, ఈ జ్ఞానములోని మరియొక విషయమేమనగా, నాకంటె భిన్నముగా ఏదీ లేదు. నేను తక్క మరేదీ లేని స్థితిలో నేను దేనిని ఎవరి కొరకు దేని కొరకు చేయవలెను ? స్వర్గమే నేను అయి ఉండగా, ఏ స్వర్గమునకు వెళ్లవలెను ? ఇంద్రుడు, అగ్ని నేనే అయి ఉండగా, నేను ఇంద్రునకు మరియు అగ్నికి ఆహుతులనిచ్చుట ఎట్లు సంభవమగును ? నా కంటె భిన్నముగా ఎవ్వరూ లేరు.

ఈ విధమైన ఆత్మజ్ఞానము కలుగగానే, భేదబుద్ధి రూపములో నున్న అజ్ఞానము పటాపంచలగును. మానవుడు ఈ భేదబుద్ధి మూలకముగనే కర్మల వెనుక పడుచున్నాడు. దీనిని బట్టి కర్మ మోక్షహేతువు కాజాలదని స్పష్టమగుచున్నది. భేదబుద్ధినిర్మూలనమే మోక్షము. అవిద్యను తొలగించనంత వరకు ఆ భేదబుద్ధి పోదు. భేదబుద్ధి తొలగిన పిదప

కర్మ మొదలైనవి సంభవము కావు. దీనిని బట్టి, నేను కర్మను చేయుచున్నచో,నాయందు ఈ భేదబుద్ధి గలదు. భేదబుద్ధి ఉన్నచో, అవిద్య ఉన్నదని స్పష్టమే గదా ! అవిద్య ఉన్నంత వరకు మోక్షము ఉండజాలదు. అనగా, నేను సర్వమునుండి విడివడియున్న కర్తను మరియు జీవుడను అగుదును. కావున, మోక్షములో కర్మకు ఏమి పాత్ర గలదు ? మోక్షములో కర్మకు స్థానము లేశమైననూ లేదు. జ్ఞానోదయము కాగానే, అవిద్యనుండి పుట్టి కర్మకు హేతువు అగు భేదబుద్ధి తొలగి పోవును. అది తొలగి పోతే, కర్మ లేదు.

ఇచట మరియొక ప్రశ్న ఉదయించును. నేను కర్మను చేసినచో, దాని వలన నాలోని భేదబుద్ధి నశించునా ? నశించదు. కర్మ భేదబుద్ధినుండి పుట్టినది. కార్యము కారణమునకు విరోధి కాదు. కావున, కార్యము కారణమును నిర్మూలించ లేదు. మట్టినుండి పుట్టిన కుండ మట్టికి విరోధి కాజాలదు. కుండ మట్టికి విరోధి అయినచో, కుండ కానరాగానే, మట్టి అదృశ్యమగును. కార్యము ఏదైనా స్వకారణముపై ఆధారపడి యుండే మిథ్య గనుక, కారణవిరోధి కాజాలదు. కావున, అవిద్య అనే కారణమునుండి పుట్టిన కర్మ అవిద్యకు విరోధి కాజాలదు. మనము చేసే అగ్నిహోత్రాది కర్మ అవిద్యయొక్క కార్యము గనుక, అవిద్యకు విరోధి కాజాలదు. భేదబుద్ధియే అవిద్య. ఆత్మజ్ఞానము ఈ భేదబుద్ధిని నిర్మూలించును. మోక్షమునకు అది చాలును. ఇతరముతో పని లేదు. కర్మ మోక్షసాధనము కాదు. కాని, కర్మకు కర్మయోగమునకు చాల భేదము గలదు. జ్ఞానోదయమునకు ఆవశ్యకమగు అంతఃకరణమును నిర్మించుకొనుటలో కర్మయోగము సాధనమగుచున్నది. కాని, కర్మ తనంత తానుగా జ్ఞానహేతువు కాజాలదు.

'కాని, ఆత్మజ్ఞానము మాత్రమే మోక్షహేతువు కాగల్గును' అని శ్రీశంకరులు ఇచట భాష్యములో ఉపక్రమములో ఉద్ఘోషించిరి. ఇపుడు వారు ఈ వాక్యములోని 'తు ( కాని )' అనే పద ప్రయోగమును వివరించెదరు. మిగిలిన రెండు పక్షములను నిరాకరించుటకై ఈ పదము ప్రయోగించ బడినది. ముందుగా శ్రీశంకరులు మోక్షసాధనము విషయములో మూడు వికల్పములను ప్రస్తావించిరి. ఒకటి కేవల జ్ఞానము. రెండవది కేవల కర్మ. మూడవది జ్ఞాన-కర్మ-సముచ్చయము. జ్ఞానము మాత్రమే మోక్షసాధనము అనే వాక్యములో ఆయన 'తు' అను పదమును ప్రయోగించి, మిగిలిన రెండు పక్షములను త్రోసిపుచ్చిరి. కేవల కర్మ గాని, జ్ఞానకర్మసముచ్చయము గాని మోక్షహేతువులు కావు. వీటికి భిన్నముగా ( తు ), కేవల జ్ఞానము మోక్షసాధనము. వాస్తవములో, జ్ఞానమే మోక్షము. మిగిలిన రెండు మోక్షహేతువులు కావు అనే సంగతిని 'తు' సూచించును. అవి ఏ విధముగా మోక్షసాధనములు కావు అనే విషయమును వారు వివరించినారు.

మోక్షము కొత్తగా సృష్టించ బడేది కాదు ( అకార్యము ). అట్టి స్థితిలో, కర్మ దానికి హేతువు కాజాలదు. ఎందువలన ? కాలమునకు అధీనము కానిది, అనగా నిత్యవస్తువు కర్మ చేత గాని, జ్ఞానము చేత గాని సృష్టించ బడలేదు. మోక్షము తప్పని సరిగా నిత్యము అయి ఉండాలి. నిర్వచనము ప్రకారంగా నిత్యము కానిది మోక్షమే కాదు. మనము చర్చించే ఈ మోక్షము ఎవరి కొరకు ఉద్దేశించ బడినది ? ఇది వ్యక్తి కొరకు ఉద్దేశించ బడినది. వ్యక్తి స్వరూపము నిత్య-ఆత్మ. ఆత్మ నిత్యము అయినప్పుడు మాత్రమే మోక్షము సంభవమగును. మరియు, ఆ నిత్య-ఆత్మయొక్క జ్ఞానము మాత్రమే

మోక్షము అగును. కావుననే, నిత్యమోక్షము ఆత్మతో ఏకరూపమై ఉన్నది. మోక్షము నిత్యసిద్ధము గనుక, అది కర్మ నుండి గాని, మరో దానినుండి గాని పుట్టేది కాదు. నిత్యతత్త్వమునకు పుట్టుక ఉండదు.

నిత్యసిద్ధమగు మోక్షము కర్మ వలన గాని, జ్ఞానము వలన గాని పుట్టేది గాదని ఇప్పుడే చెప్పబడినది. దీనిపై ఒక ప్రశ్న ఉదయించును. మోక్షము జ్ఞానమునుండి పుట్టేది కానిచో, జ్ఞానము ఏ విధముగా మోక్షసాధనము అగును ? జ్ఞానము కూడ కర్మ వలె నిరుపయోగము అగుట లేదా ? జ్ఞానము మోక్షసాధనము అన్నచో, మోక్షము జ్ఞానముచే ఉత్పన్నము చేయబడినది. కాని, మోక్షమునకు పుట్టుక లేదన్నచో, జ్ఞానము గాని, మరి యొకటి గాని, మోక్షసాధనము కాజాలదు. ఈ వాదములన్నియు చాల సూక్ష్మముగా నుండును. కావున, వాటిని జాగరూకతతో తెలుసుకొన వలెను. మోక్షము నిత్యము గనుక, అది కర్మచే గాని, జ్ఞానముచే గాని ఉత్పన్నము చేయబడుట లేదు. మోక్షము నిత్యము అను అంశమునాధారముగా చేసుకొని కర్మను త్రోసిపుచ్చినచో, అదే విధముగా జ్ఞానమును కూడ త్రోసిపుచ్చ వలయును గదా ! అనగా జ్ఞానమునకు మోక్షోపాయము అనే స్థాయి ఉండదు. కావున, జ్ఞానము వ్యర్థమగును. జ్ఞానము మాత్రమే మోక్షమునకు ఏకైకసాధనము అనే వచనము అప్రమాణమగును.

దీనిపై శ్రీశంకరులు ఇట్లు ప్రత్యుత్తరము నిచ్చుచున్నారు : ఈ వాదము సరిగాదు. జ్ఞానము మోక్షమును ఉత్పన్నము చేయునని మేము చెప్పుట లేదు. అది బంధహేతువు అగు అజ్ఞానమును మాత్రమే నిర్మూలించును. అజ్ఞానము తొలగి పోగానే కానవచ్చు ఫలమే మోక్షము. ఈ తీరున, జ్ఞానము మోక్షమును ఉత్పన్నము చేసినదా యన్నట్లు కనబడును. జ్ఞానమునకు అజ్ఞానమును నిర్మూలించే సామర్థ్యము గలదు. మరియు దాని తత్క్షణ ఫలమగు మోక్షము దాని లక్ష్యము అగుచున్నది. ఈ ఫలము స్వర్గాదుల వలె వెనువెంటనే కానరాని అదృష్టఫలము కాదు. జ్ఞానముచే అజ్ఞానము తొలగిన వెంటనే మోక్షము సిద్ధముగా నున్నది. కావున, మోక్షమనగా అజ్ఞాననిర్మూలనము మాత్రమే. కావున, జ్ఞానమైననూ తత్పూర్వము లేని మోక్షమును ఉత్పన్నము చేయుట లేదు. అది బంధహేతువు అగు అజ్ఞానమును నిర్మూలించును. అంతే. సర్వప్రాణులు బంధమునుండి విముక్తిని కోరును. ఈ సంసారబంధము అజ్ఞానము ( అవిద్యా ) చే కలిగించ బడినది. జ్ఞానము అవిద్యను పారద్రోలగనే, మిగిలేది తత్క్షణఫలమగు మోక్షము మాత్రమే. ఆత్మ యొక్క యథార్థస్వరూపము తరువాతి కాలములో గాక, వెనువెంటనే తెలియును. దీనికి పూర్వమునందు అజ్ఞానము ఉండెను. ఈ అజ్ఞానము ఎవరికి ? ఆత్మయే పూర్వమునందు అజ్ఞానావృతమా యన్నట్లు చూడబడినది. అజ్ఞానము ఆత్మధర్మము కాదు. కాని, మానవుడు అజ్ఞానిగా ఉన్నంతవరకు ఆత్మయందు అజ్ఞానము కల్పించ బడినది. వృత్తి-జ్ఞానము అజ్ఞానవిరోధి అయిన విధముగనే, ఈ అజ్ఞానము కూడా జ్ఞానమునకు విరోధి. ఒకసారి ఒక వ్యక్తిలో జ్ఞానము ఉదయించగానే, ఆ జ్ఞానమును కలిగించే వృత్తి అజ్ఞానమును తొలగించి వేసి తాను కూడ అంతర్ధానమగును. ఆ తరువాత ఆత్మను గురించి తెలియక పోవుట అనే పరిస్థితి ఉండదు. ఆత్మ నిత్యముక్తము. కావున, జ్ఞానము మోక్షమును కొత్తగా సృష్టించదు. అదే కేవలము బంధహేతువును తొలగించును. ఈ విషయములో స్పష్టమగు అవగా

హన వచ్చిన తరువాత, జ్ఞానము మోక్షసాధనము అని మనము చెప్పవచ్చును. ఆత్మస్వరూపము అగు మోక్షము నిత్యసిద్ధము గనుక, జ్ఞానము మోక్షమును కొత్తగా ఉత్పన్నము చేయదు. కాని, జ్ఞానము మాత్రమే అవిద్యను నిర్మూలించును. కావున, మనము జ్ఞానసాధనను చేయవలెను. ఇందువలననే, జ్ఞానముచే మాత్రమే మోక్షము లభించును ( జ్ఞానేనైవ మోక్షః ) అని మనము చెప్పెదము.

కర్మ వలన మోక్షము ఏల రాదు ? అజ్ఞానము తొలగి పోగానే వెంటనే కలిగే దృష్ట ఫలము మోక్షము. ఉదాహరణకు, మనము స్ఫటికమును చూచినప్పుడు, అది స్ఫటికమని తెలియుటకు యుక్తులతో పని లేదు. అది స్పష్టముగా ప్రత్యక్షమగుచుండును. ఇక్కడ కూడా అంతే. దీనిలో విశ్వాసమునకు తావు లేదు. జ్ఞానుల ప్రత్యక్షానుభవముచే మోక్షము తత్క్షణమే లభించే ఫలమని సిద్ధించుచున్నది ( విద్వదనుభవాత్ సిద్ధిః ). నేను దేహము ( దేహోహమ్ ) అనే ధారణ ఉన్నది గనుక, అజ్ఞానము ఉన్నదని స్పష్టమగుచున్నది. ఆ ధారణ ఉన్నంత వరకు అజ్ఞానము ఉన్నట్లే. దానితో బాటు బంధము మరియు భేదబుద్ధి కూడ ఉండును. కాని శ్రుతియొక్క దర్శనములో ఆత్మను గురించి మనకు గల ఈ ధారణ తప్పు. ఈ ధారణను తప్పు అని నిరూపించుటయే శ్రుతియొక్క కార్యము. ఈ ధారణ తప్పు గనుక, దానిని ఆ విధముగా నిరూపించుట సంభవమగుచున్నది. అది తప్పు గానిచో, దానిని తప్పు అని నిరూపించుట సంభవమయ్యేడిది కాదు. భ్రాంతి స్థానములో జ్ఞానము వచ్చి చేరును. ఆ జ్ఞానము ( ప్రమా ) జ్ఞానసాధనమగు శ్రుతినుండి పుట్టినది. ఆత్మ కర్త కాదనియు ( అకర్తా ), భోక్త కాదనియు ( అభోక్తా ), సంతతపరివర్తనరూపమగు సంసారము ఆత్మధర్మము కాదనియు ( అసంసారీ ) శ్రుతి బోధించుచున్నది. ఈ సత్యముయొక్క గుర్తింపు అవిద్యకు విరోధి. అది తొలగుట తోడనే, బంధము దూరమగును. జ్ఞానమునకు అజ్ఞానాంధకారమును పటాపంచలు చేసే సామర్థ్యము గలదు. దానికి ఫలము మోక్షము లేక కైవల్యము. ఈ ఫలము వెంటనే లభించును. దీనికి నమ్మకముతో పని లేదు. జ్ఞానమే ఫలము. ఏలయన, మనకు ఆత్మను గురించి అజ్ఞానము గలదు. ఆత్మజ్ఞానమనగా ఆ అజ్ఞానమును తొలగించుటయే. ఆత్మ అద్వయము గనుక, ఆత్మజ్ఞానమే మోక్షము.

ఆ మోక్షము ఎట్లుండును ? చీకటిలో ఒక త్రాడు గలదనుకొనుడు. చీకటి దట్టముగా నున్నచో, ఆ పదార్థమే కానరాదు. కావున, దానిని చూచి మరియొక పదార్థమని భ్రాంతి పడే అవకాశము లేదు. అది సుస్పష్టముగా కనబడినచో, అప్పుడు కూడ భ్రాంతికి అవకాశము లేదు. కాని, సగము చీకటి, సగము వెలుతురు అయినచో, అది సమస్యయే. మన పరిస్థితి కూడా అంతే. ' నేను ఉన్నాను ' అనే రూపములో ఆత్మ సర్వదా ఉపలభ్యమగుచునే యున్నది. పాము అని భ్రాంతి పడుటకు సరిపడే విధముగా మనకు త్రాడు కనబడినది. అదే విధముగా, భ్రాంతి పడుటకు సరిపడేటంతటి ఆత్మజ్ఞానము మనకు గలదు. అందువలననే, నేను కర్తను అనియు, భోక్తను అనియు, ఒక్క మాటలో చెప్పాలంటే, సంసారిని అనియు మనము నిర్ణయించుకొని ఉన్నాము. ఇక్కడ చీకటి అనగా అజ్ఞానము. అజ్ఞానమునుండి పాము మొదలైనవి పుట్టినవి. చీకటిని దీపము పోగొట్టును. అటులనే, అజ్ఞానాంధకారమును జ్ఞానము పారద్రోలును. భ్రాంతి పడుటకు చాలినంత

వెలుతురు మాత్రమే ఉన్నది. ఆ వెలుతురు భ్రాంతిని తొలగించి త్రాటిని చూపుటకు చాలదు. కావున, మనము మంచి దీపమును తీసుకొని రావలెను. దాని వలన ప్రయోజన మేమి ? అది కొత్తగా త్రాడును సృష్టించదు. త్రాడును పాముగా చూపిన చీకటిని అది తొలగించును. దీపమునకు అదియే ఫలము. అదే విధముగా, ' అది నీవే అయి ఉన్నావు ( తత్త్వమసి ) ' అనే మహావాక్యము మన బుద్ధికి ఆవశ్యకమైన అదనపు కాంతిని ఇచ్చే దీపము వంటిది. మన వద్ద ఉన్న బుద్ధి భ్రాంతి పడుటకు చాలును. ఈ భ్రాంతిలో కూడ కొంత యుక్తి ఉన్నట్లు తోచును. ఏలయనగా, ఆలోచించే శక్తి గల చేతన పురుషుడు ఈ దేహమునకు కట్టుబడి ఉన్నట్లు కానవచ్చుచున్నది. ఈ చైతన్యము ఒక దేహమును మించి తాదాత్మ్యమును పొందుట లేదు. దేహము చైతన్యమునకు ఒక సంచీ వలె నున్నది. కావున, చేతనుడగు మానవుడు దేహమే తానని భావించుచున్నాడు. ఈ ఏర్పాటులో పొరబడుటకు కావలసినంత యుక్తి ఉన్నట్లు స్పష్టమగుచున్నది. కాని ఆ భ్రాంతిని తొలగించుటకు చాలినంత వివేకము లేదు. మనవద్ద సరియగు దీపము లేదు. జ్ఞానసాధనము ( ప్రమాణము ) అగు శాస్త్రమే అట్టి దీపము. అది బుద్ధిలో వృత్తి-జ్ఞానము అనే కాంతిని తగు మాత్రలో కలుగుజేయును. దాని వలన అజ్ఞానాంధకారము దూరమగును. ఈ అజ్ఞానములో విషయము ఏది ? నిత్యముక్తమగు ఆత్మ. ఆత్మ స్వయంప్రకాశమగుటచే, ' నేను ఉన్నాను ' అను రూపములో ఉపలభ్యమగుచున్నది. ఇప్పుడు తత్త్వమసి అనే మహావాక్య రూపములోనున్న పెద్ద విద్యుద్దీపమును తీసుకువచ్చినాము. దానిని ఆచార్యుడు ' వెలిగించగానే ' దానినుండి పుట్టే కాంతి, అనగా ఆ వాక్యము వలన కలిగిన జ్ఞానము బుద్ధిలోని అజ్ఞానాంధకారమును పారద్రోలును. అనేకధారణలనుండి వినిర్ముక్తమైన ఆత్మ తనను తాను మనకు ప్రదర్శించును. కావున, మనము జ్ఞానముచే మోక్షమును కొత్తగా సృష్టించుట లేదు ; నిత్యముక్తమై యున్న ఆత్మను గురించి మనకు గల అజ్ఞానమును నివారించుటను మాత్రమే మనము చేయుచున్నాము. త్రాడును ప్రకాశింప జేయుటకై మనము దీపమును తెచ్చినప్పుడు, ఆ కాంతిలో త్రాడుపై ఆరోపించబడిన పాము మొదలగు అధ్యాసలు అన్నీ పూర్తిగా తొలగిపోవును. త్రాడుపై ఆరోపించబడిన పాము, జలరేఖ, భూవివరము మొదలగు భ్రాంతులు అన్నియు, దానిని ఆవరించియున్న చీకటి పోయిన తత్క్షణమే తొలగిపోవును. ఏలయనగా, త్రాడునకు ఏ కాలమునందైననూ ఈ అధ్యారోపములతో సంబంధము లేదు. త్రాడు తనపై చేయబడిన అధ్యారోపములతో లేశమైననూ సంబంధము లేని స్వరూపమును యథాతథముగా ప్రదర్శించును. దీపమునకు ఫలమిదియే.

అదే విధముగా, తత్త్వమసి అనే మహావాక్యమే దీపము. నేను బ్రహ్మను ( అహం బ్రహ్మాస్మి ) అనే జ్ఞానమే దీపకాంతి. ఆ జ్ఞానదీపమే ఫలము కూడా. అది ఆత్మపై చేయబడిన అధ్యారోపములను అన్నింటినీ తేలికగా తొలగించి వేసి అద్వయ-ఆత్మను సాక్షాత్కరింపజేయును. అంతకు మించి ఆ దీపమునకు మరియొక ప్రయోజనము లేదు. అహం బ్రహ్మాస్మి అనునది జ్ఞానము. నేను కర్తను, భోక్తను, అనగా సంసారిని అనే అజ్ఞానకల్పితమగు ధారణలు అన్నీ తొలగి ఉదయించే ' అహం బ్రహ్మాస్మి ' జ్ఞానమే ఫలము. ఈ అధ్యారోపములు అన్నీ నిషేధించబడి, ఆత్మ బ్రహ్మ రూపములో మిగిలి యుండును. అజ్ఞానమును తొలగించి వస్తువును ప్రదర్శించుట తప్ప జ్ఞానము మరియొక ఫలమును

ఈయదు. కావున, మనము మోక్షమును కొత్తగా సృష్టించుట లేదు. ఇదియే శ్రుతితాత్పర్యము.

ఆత్మ నిత్యముక్తము. మోక్షము ఆత్మకంటె భిన్నముగా లేదు. కావున, మోక్షము నిత్యసిద్ధము. కావున, జ్ఞానము మాత్రమే మోక్షసాధనము అను సత్యమును మనము గుర్తించ వలెనని శ్రీశంకరులు ఇంతవరకు ఈ విషయమును నిర్ధారించిరి. కావున, జ్ఞానముచే సాధింపబడే అజ్ఞాననిర్మూలనమే మోక్షము. అజ్ఞాననిర్మూలనముచే మోక్షము సిద్ధించుచుండగా, కర్మయొక్క ఆవశ్యకత యేమి ? కర్మతో పని లేనే లేదు. కర్మ-జ్ఞాన-సముచ్చయము కూడ మోక్షమునకు ఆవశ్యకము కాదు అను విషయమును శ్రీశంకరులు ఇప్పుడు కొన్ని దృష్టాంతములతో ప్రతిపాదించుచున్నారు. మనము ఒక దుంగను రెండు ముక్కలుగా చేయవలెను. ఏమి చేయవలెను ? ఆ దుంగను నరుకుట అనే పనిని చేయవలెను. నరుకుట అనే క్రియ దుంగ రెండు ముక్కలు అగుట అను ఫలము కొరకై ఉద్దేశించబడినది. తరువాత, అగ్గిపెట్టె లేకుండగా నిప్పును పుట్టించుటకై ఏమి చేసెదము ? ఒక చెక్కలో రంధ్రమును చేసి దానిలో ఒక పుల్లను గట్టిగా రాపాడించినచో, నిప్పు పుట్టును. ఈ నిప్పు పవిత్రమైనదిగా పరిగణించబడును. ఈ నాటికి వైదికకర్మలలో నిప్పును పుట్టించుటకు ఈ పద్ధతినే వాడెదరు. వెనువెంటనే మన కంటికి కనబడే ఫలమును ఇచ్చే క్రియలకు ఈ రెండు దృష్టాంతములుగా ఈయబడినవి. వీటి ఫలము దృష్టమే గాని, కంటికి కానరాకుండగా భవిష్యత్తులో లభించే అదృష్టము ( పుణ్యము ) వంటిది కాదు. నరుకుట, రాపాడించుట మొదలైన ఇటువంటి క్రియలలో కర్తయే గాక, చేసే సాధనము, చేయుటకు ప్రయోజనము మొదలైన ఇతరములగు అంశములు కూడ సమ్మిళితమై యుండును. దుంగ రెండు ముక్కలు అగుట అనే ఫలము క్రియ పూర్తి అగుట తోడనే సిద్ధించును. అదే విధముగా, పుల్లతో రాపిడి పూర్తి అవుతూనే, నిప్పు ఉదయించును.

ఆ పైన కర్మను ఇంకా ముందుకు కొనసాగించుట అనవసరము. అంతే కాదు ; ఆ విధముగా కొనసాగించుట సంభవము కూడా కాదు. ఇంతేగాక, ఈ కర్మలకు మరియొక ఫలమును ఇచ్చే సామర్థ్యము లేదు. ఫలము కంటికి కానవచ్చేది కాని ( అదృష్టము ) సందర్భాలలో పరిస్థితి వేరే. ఆ పరిస్థితిలో కర్మ సమర్థవంతముగా చేయబడినదా, లేదా యను విషయమును తెలుసుకొనే అవకాశము ఉండదు. ఉదాహరణకు, ఒక విశిష్టదినమునందు పాత యజ్ఞోపవీతమును తీసివేసి కొత్త దానిని ధరించవలెను. ఆ సమయములో గాయత్రీ మంత్రమును 108 సార్లు జపించవలెను. కాని ఆ సమయములో మనస్సు ఇటునటు సంచరించి యుండును. ఆ విషయము మనకు తెలియును. కావున, 100-200 జపమును అదనముగా చేసెదము. ఎందువలన ? అపేక్షితమగు ఫలము 108 జపము వలన సిద్ధించినదా, లేదా యను విషయమును తెలుసుకునే మార్గము లేదు. కాని, మనము రెండు పుల్లలను రాపిడి చేసి నిప్పును పుట్టించవలసిన కర్మలో సందేహమునకు తావు ఏది ? ఫలము వెంటనే కంటికి కానవచ్చే సందర్భములలో, కర్మను ముందుకు కొనసాగించుట అను ప్రసక్తి ఉండదు.

అదే విధముగా, జ్ఞాననిష్ఠాఫలమగు మోక్షము తరువాతి కాలములో లభించే ఫలము కాదు. ఆత్మ నిత్యముక్తము గనుక, ఈ ఫలము వెనువెంటనే అనుభవమునకు

-చ్చును. ఆత్మజ్ఞానము కొరకై మనము శ్రవణము మొదలగు వివిధసాధనలను చేపట్టెద ము. వీటిలో కూడా తెలుసుకొనువాడు ( జ్ఞాతా ), తెలియబడేది ( జ్ఞేయమ్ ) మరియు రుక ( జ్ఞానమ్ ) అను మూడు అంశములు గలవు. ఆత్మజ్ఞానము కొరకై చేపట్టే ఈ సాధనకు ఫలమేమి ? అద్వయ-ఆత్మ-జ్ఞానమే ఫలము. ఆ ఫలము ఉదయించిన పిదప మరియొక ఫలము గాని, కర్మ గాని సంభవము కావు. కావున, జ్ఞాననిష్ఠకు కర్మతో సము చ్చయము కుదరదు. వస్తువు ఎంతటి సత్యమో, దాని జ్ఞానము కూడ అంతే సత్యము. జ్ఞానమును పొందుటకు జ్ఞానసాధనము ( ప్రమాణము ) మాత్రమే చాలును. ఆత్మ దృశ్యప దార్థము కాదు గనుక, జ్ఞాత ఉపదేశముచే తన స్వరూపమును ఆవిష్కరింపజేసు కొనును. జ్ఞాతయొక్క స్వరూపము బ్రహ్మ యని శాస్త్రము నిరూపించును. కన్నుకి కన్ను, చెవికి చెవి, మనస్సునకు మనస్సు బ్రహ్మయే ( శ్రోత్రస్య శ్రోత్రం చక్షుషశ్చక్షుర్మనసో మనః ). దష్ట, శ్రోత అను వాటి యథార్థస్వరూపము నీవే. నీవు కర్తవు కాదు ( అకర్తా ). శాస్త్రము ట్లు బోధించుచున్నది. ఈ జ్ఞానమును పొందిన పిదప మనము ఇంకనూ పొందవలసినది మిగిలి యున్నదా ? చేయవలసిన కర్మలు మిగిలియుండునా ? కర్మలు దేనికొరకు ? కర్మలను చేసే సందర్భములలోనైననూ ఫలము లభించిన పిదప మనము కర్మను కొనసా గించము గదా ! కావున, జ్ఞానోదయము తరువాత మరల జ్ఞానము కొరకై కర్మను చేయుట అను పరిస్థితిని ఊహించుటయు సంభవము కాదు. మనము శ్రవణము మొద లగు సాధనలను చేసి, జ్ఞాననిష్ఠారూపమగు మోక్షమును పొందిన తరువాత కర్మలను ఏల చేయవలెను ?

జ్ఞానకర్మలను సమకాలములో కలిపి అనుష్ఠించుట సంభవము కాదని అంగీకరించి నా, ఒక ప్రశ్న ఉదయించును. రెండు వేర్వేరు కర్మలను చేసిన విధముగా వాటిని ఒక దాని తరువాత మరియొకటి ఏల చేయరాదు ? ఉదాహరణకు ఒకాయనకు స్వర్గకామన గలదు. దాని కొరకై ఆయన అగ్నిహోత్రాది కర్మను చేయును. కావున, ఆ సమయములో భోజనమును చేయలేడు. ఒకే కర్త ఒకే సమయములో రెండు కర్మలను చేయలేడు. కాని, అగ్నిహోత్రము అయిన పిదప ఆతడు భుజించవచ్చును. అగ్నిహోత్రము అనే కర్మ స్వర్గ ప్రాప్తి కొరకు, భోజనము ఆకలి ఉపశమించుట కొరకు ఉద్దేశించ బడినవి. ఒక పనిని ముందు చేసి, తరువాత రెండవ పనిని చేయవచ్చును. అదే విధముగా, ముందుగా జ్ఞాన మును సంపాదించి, తరువాత కర్మను ఏల చేయరాదు ? ఆ రెండు ఏకకాలములో సంభ వము కాకపోయినా, ఒక దాని తరువాత ఒకటి చేయుటకు అభ్యంతరమేమి ? పైగా, అట్లు చేయుట వలన ఒకే వ్యక్తి రెండు ఫలములను సంపాదించ వచ్చును. ఒకటి ప్రత్యక్షఫల మగు మోక్షము ; రెండవది తరువాతి కాలములో లభించే స్వర్గము అనే అదృష్టఫలము. కావున, ఒక వ్యక్తి రెండు పనులను ఏకకాలములో చేయలేక పోయిననూ, అదే వ్యక్తి వేర్వేరు సమయములలో వేర్వేరు పనులను ఏల చేయరాదు ?

ఈ వాదము నిలబడదు. ఇది మహారాజు వద్దకు వెళ్లి రాజ్యమును, మరియు అదే రాజ్యములో రెండు ఎకరముల భూమిని కోరినట్లు ఉన్నది. రాజ్యము లభించిన తరువాత, క్షేత్రమును కోరువాడు ఉండదు. క్షేత్రములన్నియు రాజ్యములో భాగమే గదా !

పై ప్రశ్నను మరియొక రకముగా వివరించవచ్చును. సర్వకర్మలలో కొంత జ్ఞానము కూడ సమ్మిళితమై యుండును. పని ఎట్టిది ? దానిని ఎట్లు చేయవలెను ? ఎందుకు చేయవలెను ? అను జ్ఞానము లేనిదే, ఎవడైననూ అర్థవంతముగా ఏ పనిని అయిననూ చేయజాలడు. విశేషించి వైదికకర్మ జ్ఞానముపై ఆధారపడియుండును. కాని, కేవలము వేదము తెలిసినంత మాత్రాన ఫలము లభించదు. ఫలము లభించాలంటే, తగిన కర్మను అనుష్ఠించాలి. జ్ఞానముతో కూడిన అనుష్ఠానము మాత్రమే స్వర్గము, సంతానము ఇత్యాది ఫలములను ఈయగల్గును. అగ్నిహోత్రము అనే వైదికకర్మ స్వర్గసాధనము అనే విషయము తెలిసి, దానిని చేసే విధానము కూడ తెలిసినా, దానిని అనుష్ఠించకుండగా, స్వర్గము లభించదు. అదే విధముగా, ఆత్మ బ్రహ్మయేనని తెలిసినంత మాత్రాన మోక్షము లభించదు. ఆ జ్ఞానమునకు ప్రక్కన విహితకర్మానుష్ఠానము కూడ తోడు గావలెను. అప్పుడు మోక్షము లభించును. ఈ వాదము కూడ అంగీకారము కాదు. ఎందువలన ? ఫలము ఆత్మజ్ఞానమే. పైగా, అది దృష్టఫలము. ' నేను బ్రహ్మనే ' అను జ్ఞానమును పొందుటయే మోక్షము. కావున, జ్ఞానము తరువాత మోక్షమును పొందుటకై మరియొక కర్మను చేయవలసిన ఆవశ్యకత లేదు.

ఆత్మజ్ఞానాన్వేషకునకు కర్మఫలమునందు ఆశ ఉండదు. కావున, ఒకే వ్యక్తి ఏకకాలములో కర్మజ్ఞానములను రెండింటినీ అనుష్ఠించ లేడు. ఈ విషయమును మనము ఇదివరలో చూచియున్నాము. ఆ రెండింటినీ ఒక దాని తరువాత మరియొక దానిని చేయవలెననే అభిప్రాయమును శ్రీశంకరులు త్రోసిపుచ్చిరి. దీనికి కారణమేమనగా, మోక్షమునిచ్చే జ్ఞానమును పొందిన తరువాత అల్పఫలములయందు కామన పొసగదు. శ్రీశంకరులు దీనిని ఇట్లు వివరించిరి : దశమపురుష దృష్టాంతమును పరిశీలించుడు. పదిమందిలో ఒకడు తనను మినహాయించి లెక్కపెట్టి తొమ్మిది మంది మాత్రమే ఉన్నారనియు, ఒక వ్యక్తి అదృశ్యమైనాడనియు దుఃఖించుచుండెను. ' ఆ పదవ వాడవు నీవే ' అని ఆతనికి చెప్పగానే, ఆతడు ఆ సత్యమును గుర్తించెను. ఇచట అదృశ్యమైన పదవ వ్యక్తి మరల దొరుకుట యనగా ఆతడు తానే పదవ వ్యక్తిని అనే జ్ఞానమును పొందుటయే. అనగా, ఇచట దశమపురుషజ్ఞానమే ఫలము. అదే విధముగా ఆత్మజ్ఞానమే ఫలము. ఆ అద్వయ-ఆత్మ-జ్ఞానరూపమగు ఫలము లభించిన తరువాత మరియొక ఫలమును గురించి గాని, ఆ ఫలమును ఇచ్చే కర్మ గురించి గాని, ఆకాంక్ష జ్ఞానికి ఉండదు. జ్ఞానికి వైదికకర్మలను గాని, లౌకిక కర్మలను గాని చేయాలనే ఆకాంక్ష ఉండదు. ఎందువలన ?

కోరికలు అన్నియు మానవుని హృదయములో నెలకొనియున్న అపూర్ణభావననుండి పుట్టును. అది అజ్ఞానము వలన కలుగును. అనగా, ' ఒక వ్యక్తిగా నేను పూర్ణుడను కాను' అనే ధారణ ఈ కోరికలకు ఆశ్రయమగుచున్నది. ఈ అపూర్ణభావనకు ఆశ్రయము మన దేహము గాని, మనస్సు గాని కాదు. ఈ ధారణ ఉదయించేది మనస్సే. కాని, ఇది మనస్సునకు గాని, మరియొక దానికి గాని చెందినది కాదు. ఇది కేవలము ' నేను ( కర్తా ) ' కు మాత్రమే చెంది యున్నది. ' నేను అయోగ్యుడను ' అనే ధారణకు అయోగ్యతయొక్క వాస్తవికమైన అంచనాతో సంబంధము లేశమైననూ లేదు. ఉదాహరణకు, దర్జీవాడు ఒక లావుపాటి ఆయనకు అంగీని కుట్టవలెననుకొనుడు. ఆతని వద్ద గల వస్త్రము అంగీకి చాల

స్థితిలో, వస్త్రము సరిపడలేదు అనే అంచనా వాస్తవికమైనది. కాని మనకు మన
గల ' నేను అయోగ్యుడను ' అనే అంచనాకు దేహముయొక్క మరియు మన
యొక్క వాస్తవికస్థితితో సంబంధము లేశమైననూ లేదు. ఈ అయోగ్యభావన దేహము
గాని, మనస్సునకు గాని లేదు. దీనికి కారణము బాహ్యమునందలి ఇతరపరిస్థితులు
పదార్థములు కావు. ఇది మానవుని వ్యక్తిత్వముపై, ' నేను ' పై కేంద్రితమై యున్న
కావున, ' నేను అపూర్ణుడను ' అనేది మాత్రమే సమస్య. కాని, శాస్త్రము ఈ ధారణ
నిషేధించి, ' నేను ' పూర్ణమనియు, అదియే పరంబ్రహ్మ అనియు, కావుననే అది
ంతమనియు చెప్పుచున్నది. ఈ సత్యమును గుర్తించిన నాడు, ఈ అయోగ్యతాభావ
తావేది ?

మనకు గల కోరికలన్నియు ఈ అపూర్ణత్వభావనమునుండియే ఉదయించుచున్నవి.
పనిని చేయుట ద్వారా నాకు ఫలానా వస్తువు లభించును. దాని వలన నా స్థాయి
ుడు ఉన్నదానికంటె కొంత మెరుగుపడినచో, నాకు కూడ ఒక వ్యక్తిత్వము కలుగును.
ారా నేను ఆమోదయోగ్యుడనగుదును '. మన ఆలోచనలు ఈ తీరున ఉండును.
పూర్ణమనే సత్యము తెలియక పోవుటచే ఇటువంటి కోరికలు ఉదయించి మానవుని
ును. ఆత్మ పూర్ణము అనే సత్యమును గుర్తించిన వానియందు ఈ కోరికలు ఉండ
వు. ఒక పనిని చేసే సామర్థ్యము గల వ్యక్తియందు ఆ పనిని చేయాలనే సరళమైన
ఉండవచ్చును. ఆ సామర్థ్యము మరియు ఆ కోరిక భగవానుని విభూతియొక్క
వ్యక్తి మాత్రమే. అది అయోగ్యతాభావనమునుండి పుట్టిన కోరిక వంటిది కాదు. మనము
ట అయోగ్యతాభావనమునుండి ఉదయించిన కోరికలను గురించి మాత్రమే చర్చిస్తున్నా
జ్ఞానియందు అట్టి కోరికలు ఉండవు. జ్ఞానఫలము మోక్షము. జ్ఞానికి అల్పఫ
ములతో పని యేమి గలదు ? ఆత్మ పూర్ణము గనుక, దానికి మెరుగులు దిద్దాలనే కోరిక
కి ఉండదు. శ్రీశంకరులు ఒక దృష్టాంతమునిచ్చిరి. దీనిని మనము రెండవ అధ్యాయ
కూడ చూచియున్నాము. ఒకడు వర్షము కొరకై భగవంతుని ప్రార్థించగా, కుండపోత
కురిసి సర్వము జలమయము అయినదనుకొనుడు. అంతటా నీరు ప్రవహించు
, నూతిని గాని, చెరువును గాని ఎవడు కోరుకొనును ? భారతదేశములో వేసవిలో
గర్భము ఇసుక మేట వేసియుండును. అపుడు జనులు నీటికొరకై నదిలోపల నూతిని
్వేదరు. వర్షము రాగానే నది నీటితో నిండును. అపుడు నది అంతా నీరే. అప్పుడ
ుడు నీరు గట్లను తెంచుకొని ప్రవహించును. ఆ స్థితిలో ఆ నూతియొక్క ఉపయోగ
ుమి ? నీరు కావలసిన వానికి అంతటా నీరు లభ్యమగుచుండగా, ఆతడు నూతిని గాని,
చెరువును గాని ఏల కోరును ? ఆతడు దేనిని కోరి భగవంతుని ప్రార్థించినాడో, అది ఆత
నికి దక్కినది.

అదే విధముగా ఇక్కడ కూడా ' నేను పరంబ్రహ్మను ' అనే జ్ఞానమును పొందిన
తరువాత, దానికంటె వేరుగా ఏదీ లేదు. అనగా, బ్రహ్మలోకముతో సహా లోకములు అన్ని
దానిలో అంతర్గతములే యగును. మనము ఒకచో బ్రహ్మలోకమునకు వెళ్లిననూ, ఇక్కడ
ఉండే సౌకర్యము ఉండదు. అక్కడ క్రికెట్, ఫుట్ బాల్ మొదలగు క్రీడలు ఉండవు.
బ్రహ్మలోకమును పొందిన వాడు ఇతరలోకములలోని సౌకర్యములన్నింటినుండి వంచితుడ

గును. కాని, బ్రహ్మను పొందినచో, సర్వమును పొందినట్లే. ఏడు అధోలోకములు మరియు ఏడు ఊర్ధ్వలోకములు, వెరసి పదునాల్గు లోకములు దానిలో అంతర్భాగమే యగును. ఇంతకు మించిన ఫలమును కోరుట సంభవము కాదు. జ్ఞానము లభించిన తరువాత వ్యక్తి ఏ కర్మను దేని కొరకు చేయవలెను ? తానే బ్రహ్మయై ఉన్న జ్ఞాని దేనిని పొందవలెను? ఈ జ్ఞానమును పొందగోరే జిజ్ఞాసువు అయిననూ, ధర్మార్థకామములనుండి విముక్తినే గోరు చున్నాడు. అతడు కోరే మోక్షపురుషార్థములో ఈ మూడు అంతర్భాగములే యగును. కావున, అతడు ఇతరములైన అల్పఫలములను కోరుట లేదు. అతడు కోరేది ఒకే ఒకటి. ఆ ఒకటిలో ఇతరము సర్వము అంతర్గతమగును. ' నేను అపూర్ణుడను ' అను ధారణయే తన సమస్య యని అతడు గుర్తించినాడు. అతడు ఆ సమస్యను తిన్నగా పరిష్కరింప బూనుకున్నాడు. ఈ అపూర్ణవ్యక్తిని సంతోషపెట్టే ప్రయత్నమును అతడు చేయుట లేదు. అట్టి ప్రయత్నమునకే సంసారమని పేరు. ఆ ప్రయత్నము అంతమయ్యేది కాదు. ఈ సంతోషపెట్టే ప్రయత్నములో ఎవడైనా ఎక్కడైనా సఫలుడైనాడా ? లేనే లేదు. సంతుష్టీక రణమునకు అంతము ఉండదు. కోరికలను తీర్చే కొలదీ, కొత్త కొత్త కోరికలు పుట్టుకు వచ్చును. ఈ సంతుష్టీకరణవిధానము సంస్థల యాజమాన్యములో పని చేయదు ; నిజజీవితములో కూడ పని చేయదు. సంతుష్టీకరణము వలన తాత్కాలికముగా కొంత కాలము కలిసి వచ్చును. ఇంతలో మరియొక కోరిక పుట్టుటలో విలంబము ఉండదు. కాని, తానే బ్రహ్మను అనే జ్ఞానము గల వ్యక్తికి ఈ సంతుష్టీకరణముతో పని లేదు. అతడు పూర్ణుడు.

ఇచట శ్రీశంకరులు మరియొక దృష్టాంతమునిచ్చిరి. ఒక వ్యక్తి కొత్త సామ్రాజ్య మును సంపాదించే పనిలో నిమగ్నమై ఉన్నాడనుకొనుడు. అదే సామ్రాజ్యములోపల కొద్ది ఎకరముల స్థలమును సంపాదించే ప్రయత్నమును కూడ అతడు చేయునా ? మోక్షమును కోరు వ్యక్తి యొక్క చూపు ఎల్లలు లేని అనంతసామ్రాజ్యముపై నున్నది. బ్రహ్మ అనే పేరు గల ఈ ఎల్లలు లేని సామ్రాజ్యమునకు ఆత్మ-సామ్రాజ్యమని పేరు. ఎల్లలు లేని ఈ ఆత్మ-సామ్రాజ్యమును పొందాలని తహతహలాడుతున్న వ్యక్తికి స్వర్గము, సంతానము, కొద్ది భద్రత మొదలగు వాటిపై అభిరుచి ఎట్లు ఉండును ? ఇవి నిరర్థకములు. ఒకడు తన అధీనములోనున్న బంగరు గనిలోని బంగారమునంతనూ బయటకు తీయాలని ప్రయ త్నించు చుండగా, ఆ గనిని ఒక నాణెమునకు అమ్ముటలో అతనికి అభిరుచి ఉండదు. రాజ్యమును కోరువాడు దాని లోపల కొద్ది ఎకరముల స్థలమును కోరడు. అదే విధముగా, తాను బ్రహ్మ అని తెలిసిన వాడు గాని, తెలియగోరువాడు గాని ఇతరమును కోరడు. ఏల యన, బ్రహ్మ కానిది ఏదీ లేదు.

కావున, కర్మ మోక్షసాధనము కాదు. ఇచట కర్మ యనగా వేదవిహితమైన కర్మ. అదియే మోక్షసాధనము కాకపోతే, ఇతరములగు లౌకికకర్మలు ఎంతవరకు మోక్షహేతువు లు కాగల్గును ? ఏ రకమైన కర్మయైనా మోక్షహేతువు కాదు. జ్ఞానసముచ్చితమైన కర్మ యైననూ అంతే. కొద్ది కర్మ, మరికొంత జ్ఞానము కలిసి మోక్షమునిచ్చుననే ఈ సముచ్చ యయోగమును గురించి వాదించు వారు లేకపోలేదు. తామలపాకులను నమిలినచో, నోరు ఎఱ్ఱపడదు. వాటికి సున్నమును, వక్కపొడిని కూడ జత చేయాలి. అదే విధముగా కేవల జ్ఞానము గాని, కేవలకర్మ గాని మోక్షమును ఈయజాలవు. వాటిని సముచ్చయము

యాలి అని వీరు వాదింతురు. వీటిని కలిపి అనుష్ఠించినచో, వాస్తవముగా ఏమి జరు
? కర్మ మంచి ఫలమును ఇచ్చును. చేసే కర్మ మంచిది గనుక, జ్ఞానసాధనను
మొదలిడినాడు గనుక, మరు జన్మలో ఆతడు కేవలజ్ఞానమును సాధన చేయగలడు.
తడు చెడిపోడనియు, ఏ స్థాయిలో సాధనను పూర్వజన్మలో విడిచినాడో, మరు జన్మలో
ధనను అదే స్థాయిలో అందుకొని కొనసాగించునని ( నహి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం
గచ్ఛతి ) శ్రీకృష్ణభగవానుడు హామీని ఇచ్చియున్నాడు. కాని, జ్ఞానసాధనచే ఈ
లో మోక్షము వచ్చుచుండగా, కర్మపై అభిరుచి ఎవరికి ? కర్మానుష్ఠానముచే
ాక్షము సిద్ధించదు.

మరియు, మోక్షము ఫలముగా గల ఈ జ్ఞానము కర్మయొక్క సాహాయ్యమును
పేక్షించదు. కేవలము స్వర్గసాధనమును గురించి తెలిసినంత మాత్రాన స్వర్గము లభిం
అను మాట వాస్తవమే. కర్మ కూడా సముచితమగు విధివిధానములో చేయనిచో
గ్ర ఫలమునీయజాలదు. కర్మకు జ్ఞానము తోడు కావాలి. ఆ విధముగా అనుష్ఠించ
ు కర్మ అభీష్టఫలమునిచ్చును. కాని మోక్షము అనే ఫలము విషయములో పరిస్థితి
ు కాదు. జ్ఞానము కర్మసాహాయ్యమును అపేక్షించదు. ఏలయనగా, జ్ఞానమే మోక్షము.
వ్యక్తి బరువును ఎత్తుచుండగా మరియొకడు వచ్చి ఒక చేయిని వేసినచో, ఆ పని
చ్చితముగా తేలిక యగును. అదే విధముగా, మోక్షమును ఇచ్చేది జ్ఞానమే ఆయినా,
ు తోడైనచో, పని తేలిక యగునేమో ! కాదు. జ్ఞానమునకు కర్మతో సముచ్చయము
వమే కాదు. జ్ఞానము ప్రమాణజన్యము. అది జ్ఞేయవస్తువుపై ఆధారపడి యుండును
స్తుతంత్రమ్ ). కాని కర్మ పూర్తిగా పురుషుని ఇచ్ఛాశక్తిపై ఆధారపడి ( పురుషతం
ు ) యుండును. వస్తువు ఎంతటి సత్యమో, దాని జ్ఞానము కూడ అంతే సత్యము.
ులో కర్మకు ప్రవేశము ఏది ?

ఇంత మాత్రమే గాదు. జ్ఞానము పూర్తిగా కర్మకు విరోధి. జ్ఞానము ఏమి చేయును ?
అజ్ఞానము కర్మను చేయుటకు అత్యావశ్యకమో, ఆ అజ్ఞానమును నిర్మూలించును.
కర్మహేతువు అగు అజ్ఞానమును జ్ఞానము నిర్మూలించిన తరువాత, మరల కర్మను
చేయుట ఎట్లు సంభవమగును ? కర్మకు కర్త ఉండవలెను. జ్ఞానము చేసే పని యేమి ?
ముందుగా అది ' నేను కర్తను ' అనే ధారణను నశింపజేయును. అది పోయిన తరువాత
కర్మను ఎవరు దేనికొరకు చేయుదురు ? కర్తృత్వధారణ తొలగినప్పుడు మాత్రమే
మోక్షము కలుగును. కావున, మోక్షమునకు జ్ఞానము ఒక్కటియే చాలును. కావున, కర్మకు
హేతువు అగు అజ్ఞానమును తొలగించుట ద్వారా కర్మకు విరోధి అగుచున్న జ్ఞానము
మోక్షమునిచ్చుటలో కర్మసాహాయ్యమును అపేక్షించదు.

ఇచట ఒక విషయమును తెలుసుకొన వలెను. కర్మ వ్యర్థము అని మనము చెప్పు
టలేదు. కర్మ మోక్షసాధనము కాదు. అంతే. వేడి లేనిచో, అన్నము ఉడకదు. కావున,
అన్నము ఉడుకుటకు వేడి సాధనము అని మనము అంటాము. అనగా, ఇంధనము ఆవశ్య
కము కాదని తాత్పర్యము కాదు. అన్నమును ఉడికించేది వేడియే గాని, ఇంధనము కాదు.
అదే విధముగా, మోక్షమునకు జ్ఞానము సాధనము. వంట వండుటకు ఇంధనమును
మరియు ఇతరసామగ్రిని ఏర్పాటు చేసుకొనవలెను. అదే విధముగా, మోక్షమును పొందు

టకు మనస్సును సంసిద్ధము చేసుకొనవలెను ; యోగ్యమగు మానసికప్రవృత్తి ఉండవలెను. ఇట్టి మనస్సును నిర్మించుకొనుటలో ప్రార్థన ఇత్యాదులు సహకరించును. ఈ అనుశాసనములు అన్నియు మనోనిర్మాణము అనే ఈ అంశములో ప్రవేశమును పొంది సార్థకము లగును. మనము దేనినీ త్రోసిపుచ్చుట లేదు. యోగము మొదలగు అనుశాసనములు మాత్రమే గాక, ఆహారనియమములు కూడ ఈ ప్రక్రియలో అంతర్భాగమగును. ఇవన్నీ మానసికమగు తయారీకి సహకరించును. ఇచట లక్ష్యము మహాఫలమై యున్నది గనుక, ఈ సంసిద్ధత అధికమగు పరిశ్రమచే మాత్రమే లభించును. వేలలో ఒక్కనికి మాత్రమే మోక్షమునందు అభిరుచి కలుగునని చెప్పబడినది. అటువంటి అభిరుచి గల వేలాది మనుష్యులలో ఒక్కడు మాత్రమే ప్రయత్నించును ( మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ). ఈ విధముగా ప్రయత్నించు వారిలో జ్ఞానమును ఎవరు పొందెదరు ? ఎవరు సంసిద్ధులైనారో వారు. ఈ సంసిద్ధత అనగా నేమి ? అంతఃకరణశుద్ధియే.

ఒకడు కోటి రూపాయలను సంపాదించాలని తలపోసినాడనుకొనుడు. అది తేలికయైన పని కాదు. కాని, ఇచట మన లక్ష్యము అనంతము. దాని కొరకై ఏదో ఒక దానిని త్యాగము చేసిన చాలదు. సర్వమును త్యాగము చేయవలెను. ముందుగా, మనము మన గతమును, అనగా గతములో జరిగిన విషయములను, విషాదమును మరియు సర్వసమస్యలను త్యాగము చేయవలెను. తరువాత వర్తమానములో మనవద్ద ఉన్న సర్వమును పరిత్యజించ వలెను. సర్వమును పరిత్యజించిన తరువాత ' నేను పరిత్యజించితిని ' అను ధారణము విడువవలెను ( యేన త్యజసి తత్త్యజ ). బ్రహ్మ అనంతము. కావున, 'నేను బ్రహ్మను ' అని తెలియదగునే గాని, బ్రహ్మను బయటనుండి పొందుట సంభవము కాదు. ఈ లక్ష్యము సామాన్యమైనది కాదు. ఇది చాల పెద్ద పందెము. కాని, మరో విధంగా చూస్తే, దీనిలో పందెము లేనే లేదు. ఇది జూదము కాదు. జీవుడు సర్వదా బ్రహ్మరూపుడుగనే ఉన్నాడు. ఏదీ పోనక్కరలేదు ; ఏదీ రానక్కరలేదు. విడువ వలసినది లేదు ; చేరుకోదగ్గది లేదు. మానసిక సంసిద్ధత మాత్రమే ఉన్న చాలును. లక్ష్యశుద్ధి ( పురుషార్థనిశ్చయము ) గలవానికి ఇది చాల తేలికగా లభించును. సర్వమును పరిత్యజించుట యనగా అజ్ఞానమును పరిత్యజించుటయే ( త్యాగేనైకే అమృతత్వమానశుః ). ఈ పరి త్యాగము ' నేను దీని యజమానిని ' అను భావనను పరిత్యజించుట మాత్రమే. ఏలయనగా, ' నేను దీని యజమానిని ' అనే భావనలో ఒక అల్పత్వము గలదు. ఈ అవగాహనతో గతము పూర్తిగా పరిత్యజింప బడును ; కులాభిమానము పరిత్యజించ బడును ; పురుష-స్త్రీభేదముయొక్క అభిమానము పరిత్యజించ బడును ; చిన్న-పెద్ద అనే తేడాలు విడువబడును ; బలవంతుడు-దుర్బలుడు, నిపుణుడు-చేత కానివాడు, చదువుకున్నవాడు-చదువుకోనివాడు అను భావనలు పరిత్యజించ బడును ; కర్తృత్వభావన మరియు భోక్తృత్వభావన పూర్తిగా పరిత్యజించ బడును . మోక్షమనగా నేమి ? పరిత్యజించుటయే. మోక్షమనగా ఆరంభమునుండి అంతము వరకు పరిత్యాగము మాత్రమే. లేదా, మోక్షము అంతా లాభమేనని కూడా చెప్పవచ్చును ! మోక్షముయొక్క ఈ రూపమును మనము చూచెదము. సూర్యుడు నేనే, చంద్రుడు నేనే, ఆకాశము నేనే, కాలము నేనే, భూమి నేనే,

ర్వము నేనే. గతము నేనే, వర్తమానము నేనే, భవిష్యత్తు నేనే, రాబోవు సర్వము నేనే. ంద్రుడు నేనే. వరుణుడు నేనే. గంగ నేనే. యమున నేనే. మిసిసిపి కూడ నేనే.

మనము సర్వమును విడిచిపెట్టినా, సర్వమును పట్టుకున్నా, ఈ రెండు ఒక్కటే. ఈ ండింటికీ మానసిక పరిపక్వత కావాలి. అగ్నికి ఇంధనము కావాలి. అదే విధముగా, నము ప్రకటించ బడినప్పుడు ప్రకాశించే బుద్ధి మనకు కావాలి. ఇంధనము తడిగా ండరాదు ; పొడిగా నుండవలెను. దానిని పొడిగా నుంచుటకై మనము అనేకములగు పాయములను చేయుచుందుము. ఇంధనమును పొడిగా నుంచే ఉపాయములు న్నియు ప్రయోజనకరములే. అదే విధముగా మానసిక పరిపక్వత కొరకై చేసే సాధనలు ద మంచివే. మనస్సునకు ప్రసన్నతనిచ్చే ప్రార్థన మొదలైన సాధనలు అన్నీ ప్రయోజ రములే. సాధనామయ జీవితమనగా నిదియే. దీనిలో అలసటకు స్థానము లేదు. అవశ్య గు అనుశాసనములను మనము పాటిస్తూనే ఉంటాము. ఈ విషయమును మనము ర్థముగా గమనించవలెను. ఏలయనగా, ఈ భాష్యభాగములో కర్మ పూర్తిగా త్రోసిపు బడినది. ఈ వాక్యముల తాత్పర్యమును మనము ఖచ్చితముగా తెలుసుకొన వలెను. భాగమును ఆచార్యుడు బాధ్యతాయుతముగా బోధించవలెను ; శిష్యుడు బాధ్యతతో ు చేసుకొన వలెను. మన అవగాహన సుస్పష్టముగా నుండవలెను. రోజూ మూడు ు భోజనము చేయుట వలన సంస్కృతము రాదని ఒక సందర్భములో నేను చెప్పి ను. అనగా, భోజనము మానేస్తే సంస్కృతము వచ్చునని నా తాత్పర్యము కాదు. మోక్షము నీయదని శాస్త్రము చెప్పుచున్నది. దీనిలో సందేహమునకు తావు లేదు. గా, మోక్షము కర్మఫలము కాదు. పైగా, మోక్షము నిత్యసిద్ధము. నేను బ్రహ్మను ( బ్రహ్మాస్మి ) అను సత్యమును నేను గుర్తించవలెను. ఆ జ్ఞానమే మోక్షము. అన నము కర్మను చేయరాదని గాని, మానసిక పరిపక్వతకు ఆవశ్యకమైన సాధనలను దని గాని, తాత్పర్యము కాదు. నీవు ఏ కర్మను చేసినా , దానిని నాకు సమర్పిం ( యత్కరోషి ----- తత్కురుష్వ మదర్పణమ్ ) అని ఇదివరలో శ్రీకృష్ణుడు ు గురించి చెప్పియున్నాడు. ఇచట సన్న్యాసరూపమైన జ్ఞాననిష్ఠ చర్చించబడుచు ఇది భిన్నమైన ప్రకరణము. ఈ అంశములో కర్మ సహకరించదు. ఎందువలన ? చీకటిని తొలగించ లేదు. జ్ఞానము మాత్రమే ఏకైకమోక్షసాధనము అని శ్రీశంకరులు ుచిరి. నేను చీకటిలో నిలబడి, దీపమును తెమ్మని ఒకనికి చెప్పగా, వాడు మాడిపో బల్బును తెచ్చినాడనుకొనుడు. అచట కాంతిని నింపుటకు అది ఏ విధముగా సహక మను ? మంచి దీపమును తీసుకు రావలెను. అదే విధముగా, అజ్ఞానకార్యమగు కర్మ జ్ఞానమును తొలగించ లేదు. కాని, ఆత్మ నిత్యముక్తము గనుక, అజ్ఞాననివారణయే క్షము.

వేదాంతుల సిద్ధాంతము ఈ విధముగా నున్నది. ఉపాసనతో సహా ఏ విధమైన కర్మ యొక్క సాహాయ్యము లేకుండగనే కేవలజ్ఞానము మోక్షమునీయగలదు. అట్లైనచో, ' పురు ర్థములు నాలుగు ; అవి ధర్మ, అర్థ, కామ,జ్ఞానములు ' అని యేల చెప్పుట లేదు ? యనగా, మానవుని పరమలక్ష్యము మోక్షమే గాని, జ్ఞానము కాదు గదా ! అట్లైనచో, నమునకు మోక్షముతో గల సంబంధమెట్టిది ? వీటి మధ్య సాధన-సాధ్య-సంబంధము

గలదు. జ్ఞానము సాధనము కాగా, మోక్షము సాధ్యము అగుచున్నది. మనము శ్రవణము చేసి సంపాదించేది జ్ఞానము మాత్రమే. నేను బ్రహ్మను, పూర్ణుడను, ఆనందఘనుడను అను రూపములో ఆ జ్ఞానము ఉండును. కాని, మానవుని లక్ష్యము మోక్షము మాత్రమే. దానికి సాధనము జ్ఞానము. ఈ విధముగా మనము జ్ఞాన,మోక్షముల మధ్య గల సాధన-సాధ్య-సంబంధమును తెలియవలెను. కావున, మోక్షమునిచ్చుటలో జ్ఞానము కర్మయొక్క సాహాయ్యమును అపేక్షించదని శ్రీశంకరులు ఉద్ఘోషించిరి.

ఇచట కర్మకాండి ఒక అభ్యంతరమును లేవదీయుచున్నాడు. కర్మిష్ఠుల అభిప్రాయములో వేదము సర్వము కర్మను మాత్రమే బోధించుచున్నది. జైమిని మహర్షి కర్మమీమాంసాసూత్రములను రచించెను. ఆ సూత్రములు ధర్మవిచారమును చేయును. ధర్మమనగా కర్మయే. వేదమునకు కర్మను బోధించుట మాత్రమే తాత్పర్యమనియు, కావున ఆత్మయే బ్రహ్మ అని చెప్పె వాక్యములతో సహా కర్మతో సంబంధము లేని వాక్యములు వ్యర్థమనియు చెప్పే ఒక ప్రముఖసూత్రము ( ఆమ్నాయస్య క్రియార్థత్వాత్ ఆనర్థక్యమతదర్థానామ్ ) జైమిని సూత్రములలో గలదు. ఆత్మ-బ్రహ్మ-ఐక్యమును చెప్పే వాక్యములో విధి లేదు. ఇది వస్తుస్వరూపమును బోధించే వాక్యము అన్నచో, వారు దానిని అంగీకరించరు. వస్తుస్వరూపమును బోధించే వాక్యములను చెప్పుట వేదముయొక్క తాత్పర్యము కాదని వారు వాదింతురు. దుఃఖమును పరిహరించి, సుఖమును పొందుట కొరకై ' దీనిని చేయుము, దీనిని చేయకుము ' అని చెప్పుటయే వేదముయొక్క తాత్పర్యము. వేదము అంతయు విధినిషేధరూపము మాత్రమే అని గ్రహించవలెను. ఒకానొక పనిని చేయుమని చెప్పినచో, అది విధి. ఒక పనిని చేయవద్దని చెప్పినచో, అది నిషేధము. వేదతాత్పర్యము ఇట్టి విధినిషేధములు మాత్రమే. 'నీరు అనగా ఆక్సిజన్ మరియు హైడ్రోజన్ ల కలయిక ' ఇత్యాది సిద్ధవస్తునిరూపకములగు వాక్యములయందు వేదమునకు తాత్పర్యము లేదు. ఆత్మ బ్రహ్మ మైనచో, అటులనే కానిమ్ము. దాని వలన మనకు ఒరిగేది ఏమి గలదు ? ఇంతకాలము ఆత్మ బ్రహ్మయే అయి ఉన్ననూ, మానవునకు కోరికలు తప్ప లేదు ; వాటిని తీర్చుకొనే హడావుడి తప్ప లేదు. దేహముయొక్క బరువు 75 కేజీలు అను వాక్యమునకు ప్రయోజనము ఎంతయో, ఆత్మ బ్రహ్మ అను వాక్యమునకు కూడా అంతే. ఈ సమాచారము వలన ప్రయోజనము ఏమీ ఉండదు. వస్తుస్థితిని చెప్పే వాక్యమును విధితో గాని, నిషేధముతో గాని జతగూర్చినచో, అది ప్రయోజనకారి యగును. మానవుడు ఒక విధిని చేసి, ఒక నిషేధమును పరిహరించి, తద్ద్వారా సుఖమును పొంది దుఃఖమునకు దూరము కావలెనని వేదమాతయొక్క ఆకాంక్ష. మీమాంసకుల అభిప్రాయము ఇది. మీమాంసకులలో ప్రాభాకరులు, భాట్టులు అను రెండు వేర్వేరు దార్శనికులు గలరు. కాని, వారందరు కర్మయే మోక్షమునిచ్చునని వాదించెదరు.

కర్మవలన మోక్షము లభించదని ఈ మీమాంసకులలో ఒక వర్గమునకు చెందిన వారు అంగీకరించెదరు. మోక్షము క్రొత్తగా పుట్టేది అయ్యే పక్షములో నశించును గనుక, అది నిత్యసిద్ధమని కూడ వారు అంగీకరించెదరు. కాని, మోక్షము నిత్యసిద్ధమై యున్ననూ, మనము పుణ్యకర్మలను చేయుచుండవలెనని వారు వాదించెదరు. కర్మలలో అనేకరకములు గలవు. ఈ కర్మలు శాశ్వతము కాకుండునట్లు మనము జాగ్రత్త వహించవలెను.

ము అనే స్థితి మనము చేసే కర్మలచే పాడుగారాదు. కావున, మనము కర్మను విడు వారు ఈ విధముగా వాదింతురు. ఈ వాదముననుసరించి రెండు సమాంతరసత్య గలవు. ఆత్మ నిత్యముక్తమే అయిననూ, ఈ సమయములో కర్మ వలన ఆత్మ ఆకు యున్నది. కర్మ మాత్రమే పునర్జన్మ ఇత్యాదులకు కారణమగుచున్నది. కావున, కర్మ విషయములో జాగ్రత్త పడినచో, మోక్షము భద్రముగా నుండును. ఇది వారి ము. ఈ వాదమును పరికించుడు. ఈ వాది మోక్షము నిత్యమని అంగీకరించుచున్నా మన నిశ్చయము కూడ అదియే. కాని, మోక్షము నిత్యము గనుక, జ్ఞానముచే లభిం గాదని ఈ వాదియొక్క అభిప్రాయము. అది పొందబడేది అయితే, నిత్యము కాజాల ాని మోక్షము నిత్యము. కావున, మోక్షము జ్ఞానలభ్యము కాదని వీరి వాదము.

మోక్షము జ్ఞానముచే లభించునని చెప్పుటలో ఈ వాదికి మరియొక సమస్య గల మోక్షము లభించిన పిదప నీవు నిత్య-నైమిత్తిక-కర్మలను చేయుదువా ? చేయవా ? ము జ్ఞానముచే లభించేది అయ్యే పక్షములో అది దృష్టఫలమై యుండును. ఆ పక్ష కర్మను చేయవలసిన అవసరము ఉండదు. ఇది ఈ వాదికి అంగీకారము కాదు. లన ? నిత్యకర్మను చేయని వ్యక్తి ప్రత్యవాయదోషమును పొందును. ఈ దోషము త్తులో సమస్యలను సృష్టించును. గోటితో పోయే దానికి గొడ్డలి యేల ? అను గలదు. ఉదాహరణకు, ఒకడు స్నానమును చేయలేదనుకొనుడు. దాని వలన ే ప్రయోజనము ఏమియూ లేదు. కాని, దాని వలన వానికి మాత్రమే గాక, ఇతరు కూడ ఇబ్బంది కలుగువచ్చును. కర్మకు అంకితమైన ఈ మీమాంసకులు ఈ తీరున చెదరు. కర్మను చేయనిచో, దాని ఫలస్వరూపముగా దోషము చుట్టుకొనును. దాని మును అనుభవించుటకై మానవుడు మరల జన్మించవలెను. అనగా, మోక్షము లేదు. ాదము ఇంకనూ వివరింప బడుచున్నది.

ఈ మీమాంసకుల అభ్యంతరమును ఇచట ప్రస్తావించుట యుక్తియుక్తముగనే న్నది. ఏలయనగా, మనము ఇచట వైదికసంప్రదాయమునకు లోబడి చర్చించుచున్నా ఈ వాది ఇట్లు చెప్పుచున్నాడు : శ్రుతి నిత్యకర్మలను విధించుచున్నది. ఆత్మ ్మయేనని వేదము చెప్పుచున్నదనియు, ఆ సత్యమును తెలుసుకొనుటయే మోక్షమని ావున మోక్షమునకు జ్ఞానము సరిపడుననియు నీవు చెప్పుచున్నావు. మనము వేదా యులము. కావున, మనము వేదవాక్యములను విశ్లేషించి, వేదము చెప్పినట్లు వలెను. అగ్నిహోత్రాది నిత్యకర్మలను మరియు శ్రాద్ధము మొదలగు నైమిత్తిక కర్మ శ్రుతి విధించుచున్నదనుటలో సందేహము లేదు. వాటిని చేయకున్నచో, పాపము అదృష్టఫలము సంక్రమించును. దాని ప్రభావముచే నరకములో కొంతకాలము యాత లను అనుభవించ వలసియుండును. నరకమనగా శాశ్వతమగు అధోగతి కాదు. స్వర్గము సుఖానుభవక్షేత్రమునకు విరుద్ధమైన దుఃఖానుభవక్షేత్రమునకు నరకము అని పేరు. ర్గములో కొంత కాలము నిరంతరమగు సుఖము లభించును. అదే విధముగా, నరక ములో జీవుడు కొంత కాలము వరకు యాతనలను అనుభవించును. ఇంతే గాక, పాపప్ర ావముచే జీవుడు పశుపక్ష్యాది జన్మలను గాని, క్రిమికీటకాది నికృష్టజన్మలను గాని ొందును. ఈ జన్మలలో జీవునకు ఇచ్ఛాస్వాతంత్ర్యము ఉండదు. కావున, మనము ఈ

వేదవిహితకర్మలను ఖచ్చితముగా చేయవలెను. వాటిని చేయనిచో, పాపము చుట్టుకొనును. దానిచే నరకవాసము తప్పదు. అనగా ఈ జన్మప్రవాహము కొనసాగును. అనగా, మోక్షమునకు స్వస్తి చెప్పినట్లు అగును.కేవలము ' నేను బ్రహ్మను ' అని తెలియుట వలన ప్రయోజనము లేదు. నాకు పునర్జన్మ లేదని నీవు తలపోయుచుండ వచ్చును. కాని, విహితకర్మలను చేయకపోయినచో, నరకములో గాని, నికృష్టయోనులలో గాని, పునర్జన్మ అనివార్యమగును. ఆత్మ అకర్త గనుక, నేను కర్మలను చేయుట లేదని తలపోసి, విహితకర్మలను గాలికి వదిలి ' నేను స్వతంత్రుడను ' అని మురిసిపోవు వ్యక్తి కేవలము ఊహాప్రపంచములో మాత్రమే విహరించుచున్నాడు. వానికి అధోయోనులలో పునర్జన్మ తప్పదు.

ఈ వాదమునకు శ్రీశంకరులు సమాధానము నిచ్చుచున్నారు. జ్ఞానముచే మోక్షము లేనిచో, కర్మచే కూడ మోక్షము లేదు. మోక్షము నిత్యము అని అంగీకరించే పక్షములో, అది కర్మ వలన ఎట్లు ఉత్పన్నము కాగలదు ? జ్ఞానము మోక్షము నీయనిచో, కర్మ కూడ మోక్షము నీయనిచో, మోక్షమే లేకుండగా పోవును. ఈ వాదములో పురుషార్థములు ధర్మార్థకామములనే మూడు మాత్రమే. మోక్షము లేనే లేదు. కాని, సమస్య ఏమనగా, ఈ పూర్వమీమాంసకులు కూడ మోక్షమును గురించి మాటలాడవలసి యుండును. వైశేషికులు గాని, నైయాయికులు గాని, సాంఖ్యులు గాని, బౌద్ధులు గాని, ముస్లిములు గాని, క్రిష్టియన్లు గాని, అందరు పరమలక్ష్యము మోక్షమేనని అంగీకరింతురు. వీరందరు మోక్షమును వేర్వేరు విధములుగా నిర్వచించెదరు. మోక్షమును పరిగణించక పోవుట కుదరదు. ఆ మోక్షము నిత్యమన్నచో, అది కొత్తగా పుట్టే ప్రసక్తి ఉండదు. కర్మ మోక్షమునీయజాలదు. మీమాంసకుల వాదము ప్రకారముగా జ్ఞానము కూడ మోక్షమునీయదన్నచో, మోక్షమే లేకుండును. మోక్షము ఉన్నది అని అంగీకరించిననూ, అది లభించే ఉపాయము ఏది ?

మీమాంసకుని వద్ద ఈ ప్రశ్నకు సమాధానము గలదు. మోక్షము నిత్యము గనుక, దానిని కొత్తగా ఉత్పన్నము చేయబని లేదు. కావున, కర్మ మోక్షమునీయ నవసరము లేదు. అట్టి స్థితిలో మనము కర్మను ఏల చేయవలెను ? మీమాంసకుని వద్ద ఒక స్పష్టమైన యోజన గలదు. ఆతడు మోక్షము లభించే విధమును ఈ తీరున వర్ణించును : కర్మ మనలను సంసారములో కట్టి పడవేయును. ఈ విషయమును అందరు అంగీకరించుచున్నారు. కర్మ మూలకముగనే జీవుడు మరల మరల జన్మించుచున్నాడు. కావున, మనము ఈ కర్మను వదిలించుకోవాలి. ఎట్లు ? ముందుగా వేదవిహితములైన నిత్యకర్మలను అన్నింటినీ చేయాలి. వాటి వలన ఫలము ఉత్పన్నము కాదు. కాని, వాటిని ఆచరించుట వలన ప్రత్యవాయదోషము పరిహరింప బడును. ఈ విధముగా కర్మఫలములోని ఒక అంశమును మనము పరిహరించినాము. వేదము కొన్ని కర్మలను నిషేధించుచున్నది. అట్టి ప్రతిషిద్ధకర్మలకు అన్నింటికీ మనము దూరముగా నుండవలెను. అట్లు చేయుట వలన పాపయోనులలో జన్మించే సంభావన తొలగిపోవును. కావున, సారాంశమేమనగా, మనము విహితకర్మలను అన్నింటినీ చేసి ప్రత్యవాయదోషమునుండి, నిషిద్ధకర్మలకు దూరముగా నుండి పాపమునుండి విముక్తులము అగుదుము. ఈ విధముగా పాపకర్మసంచయము పూర్తిగా దూరమైనది. ఇకపోతే, ఇష్టాపూర్తి మొదలైన పుణ్యఫలమునిచ్చే కామ్యకర్మలను చేయవద్దు. వేదము పుణ్యమునిచ్చే వివిధరకముల కర్మలను బోధించుచున్నది. వాటిని

చేసినచో, మహాపుణ్యము వచ్చును. పుణ్యమును సంపాదించినచో ఏమగును ? పుణ్యాత్ముడగు జీవుడు ఉత్కృష్టయోనులలో జన్మించును. కావున, కామ్యకర్మలను అన్నింటినీ దూరముగా పెట్టవలెను. దాని వలన పుణ్యయోనులలో జన్మించే అవసరము ఉండదు. కామనాపరిపూర్తి కొరకై చేసే ప్రార్థనలు, పూజలు మొదలగు వాటిని చేయని వ్యక్తికి ఆ పుణ్యఫలానుభవము కొరకై దేహమును దాల్చవలసిన ఆవశ్యకత ఉండదు గదా ! ఈ విధముగా, పాపమునిచ్చే కర్మలను మరియు పుణ్యమునిచ్చే కర్మలను కూడ చేయకున్నచో, మరియొక దేహమును దాల్చవలసిన అవసరమే ఉండదు. కావున, పునర్జన్మ ఉండదు.

అట్లైనచో, ఈ దేహమును ఆరంభించిన ప్రారబ్ధకర్మ మాట యేమి ? పరిపక్వమై ప్రస్తుతము మనకు గల దేహమును ఆరంభించిన ప్రారబ్ధకర్మ అనుభవముచే క్షయమగుచునే యున్నది. ప్రతి దినము మనకు వచ్చే వివిధరకముల అనుభవములు ప్రారబ్ధకర్మయొక్క ఫలమే గదా ! ప్రారబ్ధకర్మ వలన లభించే ఆఖరి అనుభవము కూడ లభించిన పిదప దాని చరమాంకములో ఈ దేహము అంతమగును. కావున, పునర్జన్మ ఉండబోదు. ఏలయనగా, మరియొక దేహమును ఆరంభించే కారణము ఉండదు. దేహమును ఆరంభించే కారణము లేకపోవుటకు హేతువు ఏమి ? కర్మశేషము లేదు. మనము సర్వవిధముల కర్మకు జమా-ఖర్చును చూసినాము. ప్రారబ్ధకర్మ నిశ్శేషముగా క్షయమైనది ; నిత్యనైమిత్తికకర్మలను చేయుటచే ప్రత్యవాయదోషము దూరమైనది ; అసత్యభాషణము, హింస మొదలగు నిషిద్ధకర్మలు పరిహరించబడుటచే, పాపము దూరముగా నున్నది ; పుణ్యమునిచ్చే కామ్యకర్మలు విడువబడినవి. కావున, పుణ్యము ప్రోగుపడదు. కామ్యకర్మను చేయకుండుట ఎట్లు సంభవమగును ? కామనలు లేనివారై కేవలము మోక్షమును మాత్రమే కోరే వ్యక్తి కామ్యకర్మల జోలికి పోడు. ఈ విధముగా సర్వకర్మలు లెక్క లోనికి వచ్చినవి. జన్మకు హేతువు కర్మయే గనుక, ఇంకో జన్మను ఈయగలిగే హేతువు లేదు. అనగా, కర్మసంబంధము లేని ఆత్మ మిగిలి యుండును. కావున, అట్టి ఆత్మకు సంసారబంధము లేదు. కావున, అదియే మోక్షము అగును. దేహమును దాల్చినప్పుడు మాత్రమే జీవునకు సంసారము ఉండును. కాని, దేహమును ఇచ్చే కర్మ లేకుండుటచే, మరల జన్మరాదు. ఆత్మ నిత్యము. కావున, ఇట్టి జీవుడు శాశ్వతకాలము ఆత్మస్వరూపుడై యుండును. ఇదియే మోక్షము. ఇది ప్రయత్నము లేకుండగనే లభించినది. ఈ మోక్షము కొత్తగా పుట్టినది కూడా కాదు.

ఈ వాదిని ఒకటి, రెండు ప్రశ్నలు వేయవలసి యున్నది. ప్రస్తుతానికి మనము ఈతని ఈ యోజనను అంగీకరిద్దాము. ఈ వాది కర్మను అంగీకరించును. కాని కర్మసిద్ధాంతమును పూర్తిగా అంగీకరించవలెను. అంగీకారము యుక్తియుక్తముగా నుండవలెను. ఈ వాది ప్రారబ్ధకర్మను అంగీకరించినాడు గదా ! మనము ఒక ప్రశ్నను వేయవలెను. ఈ దేహమును ఇచ్చి ప్రతి దినము మన ముందు ప్రకటమవుతూ ఉండే ఈ ప్రారబ్ధకర్మ ఎప్పుడు ఆరంభమైనది ? పూర్వజన్మ ( ల ) లో ఆరంభమైనదని ఆతడు చెప్పే పక్షములో మనము ఒక ప్రశ్నను వేసెదము. నీకు ఎన్ని పూర్వజన్మలు గలవు ? పూర్వజన్మ అను మాటను అంగీకరించగానే, ఈ వాది ఇబ్బందులలో పడును. పూర్వజన్మ ఎట్లు లభించినది ? దానికి ముందు ఉండిన జన్మ వలన. దీనికి ఆది లేదు. జన్మలు అనంతముగా

గలవు. ఈ అనంతజన్మలలో నీవు ఎంత కర్మను మూటగట్టినావు ? అది కూడా అనంతమే. కల్పమునకు ఒక జన్మను మాత్రమే పొందియున్ననూ, కల్పముల సంఖ్య అనంతము గనుక, నీవు మూటగట్టిన కర్మలు కూడ అనంతముగనే యుండును. ఈ అనంతకర్మలు ఈ ఒకే ఒక జన్మలో క్షయమగునా ? కావు. ఈ దేహము వంద సంవత్సరములు బ్రతికిననూ, అది సంభవము కాదు. ఒక వ్యక్తికి అనంతకర్మలు ఉన్నచో, వాటిలో ఉండే రకములు కూడ అనంతముగనే ఉండును. కావున, ప్రతి జీవునకు వైరస్ తో మొదలిడి ఈ లోకములో మాత్రమే గాక పరలోకములలో కూడా ఎన్ని రకముల ప్రాణులు గలవో, అన్ని దేహములను ఈయగల కర్మభేదములు ఉండి తీరును. మనకు ఈ లోకములో మానవులు, పశుపక్ష్యాదులు, చెట్టుచేమలు మొదలైన జీవరాశులు తెలియును. ఇతరగ్రహములలో ఇంతకంటె గొప్ప జీవరాశులు ఉండవచ్చును. అచట మానవులతో జట్టాపట్టాలు వేసుకొని దేవతలు జీవించుచుండ వచ్చును. వారు విలక్షణమైన స్వీయభాషలలో మాటలాడుచుండ వచ్చును. వారికి రెక్కలు మొదలగునవి ఉండవచ్చును. ఒక దేవతకు ఎర్రని ముక్కు, మరియొక దేవతకు తెల్లని ముక్కు ఉండవచ్చును. ఒక దేవతకు నీలి కన్నులు ఉండవచ్చును. ఒక దేవతకు బంగరు రెక్కలు ఉండగా, మరియొక దేవతకు వెండి రెక్కలు ఉండవచ్చును. కొందరు దేవతల పాదములు నేలకు తగులుచుండగా, మరి కొందరు దేవతల పాదములు నేలకు తగలక పోవచ్చును. కావున, ప్రతి జీవునికి గల అనంతకర్మలను బట్టి, అనంతవిధముల దేహములు లభించే అవకాశము గలదు. ఈ ఒకే ఒక అల్పమగు జీవితములో ఆ కర్మలను అన్నింటినీ క్షయము చేయుట ఎట్లు సంభవమగును ? సంభవము కాదు. మానవుడు పొందగలిగే అనుభవములన్నింటినీ పూర్తిగా పొందుటకైననూ ఒక మానవజన్మ చాలదు. ప్రతి వ్యక్తి ఏవో కొన్ని అనుభవములను మాత్రమే చవి చూచును. చైనాలో చైనీయుని అనుభవములు, రష్యాలోని ఆ దేశస్థుని అనుభవములకంటె భిన్నముగా నుండును. ఒక స్థానములో పుట్టిన వ్యక్తికి మిగిలిన అన్ని స్థానములలో ఎదురయ్యే అనుభవములు ఎదురు కావు. అనంతకర్మలను బట్టి లభించదగిన అనంతములగు అనుభవములను ఒకే జన్మలో పొందుట అసంభవము. జీవుడు ఒక జన్మలో ఏవో కొన్ని కర్మలను క్షయము చేసుకొనును. మనము ఈ జన్మలో అనుభవించే ప్రారబ్ధకర్మ సముద్రములో ఒక బొట్టు కూడా కాదు. కావున, కర్మక్షయము అసంభవము అని శ్రీశంకరులు ఈ వాది యొక్క వాదములో దోషమును చూపించిరి. ఎందువలన అసంభవము ? ఇంతవరకు ఫలమునిచ్చుట ఆరంభము కాని కర్మల ఫలమును ఈ జన్మలో అనుభవించుట అసంభవము కదా ! గడచిన అసంఖ్యాకములగు జన్మలలో చేసిన లెక్క లేనన్ని కర్మల వలన స్వర్గము, నరకము మొదలైన అనేకములగు భోగములు ఇంకనూ రావలసియున్నది. ఆ ఫలములు ఇంకనూ పరిపక్వము కాలేదు. కావున, అవి ఇప్పట్లో భోగమునకు రావు. అవి ఖాతాలో మిగిలియుండును. అవి పరిపక్వమై ప్రకటమగుటకు కొంత కాలము పట్టును. వాటిని ఇప్పుడు అనుభవించే అవకాశము లేదు గనుక, కర్మక్షయము సంభవము కాదు.

కర్మక్షయమును మనము ఇచట తాత్కాలికముగా మాత్రమే అంగీకరించి ముందుకు సాగెదము. ఈ అంగీకారమును తరువాత మనము వాపసు తీసుకొనెదము. నిత్యకర్మానుష్ఠానమునకు ఫలము లేదు అను వాదమును మనము అంగీకరించము. కాని,

ప్రస్తుతానికి ఆ అభ్యంతరమును కూడా ప్రక్కన పెడదాము. ప్రారబ్ధకర్మ క్షయమగునని అంగీకరించ వచ్చును. కాని, పూర్వజన్మలలో సంపాదించుకున్న కర్మ ( సంచిత కర్మ ) మాట యేమి ? పశువుల జీవితములు నిత్యకర్మానుష్ఠానపూర్వములై యుండును. ఉదాహరణకు, గేదె నిత్యకర్మను చేయునే గాని, ధర్మమును ఎన్నటికీ ఉల్లంఘించదు. అది నిత్యము చెరువులో స్నానము చేయును ; గడ్డిని మేయునే గాని, మాంసమును ముట్టుకొనదు. దాని ప్రారబ్ధకర్మ క్షయమగుచున్నది. కావున, ఆ జీవునకు గేదె జన్మ అంతమైన తరువాత మోక్షము లభించవలెను. అట్లు జరుగక పోవుటకు కారణమేమి ? సంచితకర్మ ఇంకనూ మిగిలి ఉండుటయే. ఇక్కడ కూడా పరిస్థితి అదియే. జీవుని ఖాతాలో అనంతములగు కర్మలు మిగిలి యుండును. అవి క్షయమయ్యే ఉపాయము ఏది ? ఈ జన్మలో కొత్త కర్మలను వేటినీ చేయకున్ననూ, పూర్వజన్మలనుండి సంక్రమించిన సంచితకర్మలు ఇంకనూ పరిపక్వము కావలసి యున్నది. దాని కొరకై ఎన్ని జన్మలను ఎత్తవలెనో మనకు తెలియదు. ఇంతే గాక, కొత్త కర్మలను చేయకుండుట అసంభవము. జీవుడు కర్తయై ఉన్నంతవరకు నిశ్చితముగా కర్మలను ప్రోగు చేయుచునే యుండును. కర్మను చేయుటకై ప్రోత్సహించే రాగద్వేషములనుండి తప్పించుకొనుట యెట్లు ? ఇది కల మాత్రమే. ఈ వాదముననుసరించి మోక్షము లభించే ప్రసక్తి లేదు.

దీనిపై పూర్వమీమాంసకుని వద్ద సమాధానము గలదు. మనము ప్రతిదినము నిత్యకర్మలను చేయుచుందుము. వీటిని చేయనిచో, ప్రత్యవాయము చుట్టుకొనును ; కాని, చేసినచో ఫలము లేదు. వీటిని చేయుటలో దుఃఖము గలదు. ఉదయము పెందలకడనే నిద్ర లేవవలెను. అగ్నిహోత్రమునకు కావలసిన సామగ్రిని అంతనూ పోగుచేసుకొన వలెను. అగ్ని ప్రజ్వరిల్లునట్లు చేసి, దాని ముందు కూర్చుండి, మంత్రములను అన్నింటినీ సక్రమముగా పఠించి ఆహుతులను యథావిధిగా సమర్పించవలెను. ఇది చాలా పెద్ద పని. దీనిలో చాల క్లేశము గలదు. ఈ దుఃఖముననుభవించుట ద్వారా సంచితకర్మల ఖాతాలో నున్న పాపకర్మలు అన్నియు క్షయమగును. దీనికి అభ్యంతరమేమున్నది ? దీనిని ఇట్లు వివరించవచ్చును : నిత్య నైమిత్తికకర్మలను చేయుట ప్రాయశ్చిత్తమును చేయుట వంటిది. ఇదివరలో చేసిన పాపకర్మలను నిర్వీర్యములుగా చేయుటకై ప్రాయశ్చిత్తకర్మ చేయబడును. మనము నిత్యజీవితములో కూడ ఇటులనే చేయుచుందుము. కూరలో ఉప్పు ఎక్కువ అయినచో, మరికొంత కారమును కలిపెదము. ప్రాయశ్చిత్తకర్మ అనగా ఇటులనే ఉండును. చేయకూడని పనిని చేసిన తరువాత ఆ విషయమును గుర్తించి దానికి పరిహారముగా మరియొక కర్మను చేసి, దాని చెడు ఫలితమునుండి తప్పించుకొనే యత్నమును చేయుదుము. వేదములో ప్రాయశ్చిత్తకర్మలు విస్తారముగా గలవు. క్రైస్తవమతములో కూడ పాపనివేదనము ( confession ) గలదు. పాపనివేదనము తరువాత ఆ పాపములను పోగొట్టుకొనుటకై తపస్సును చేయుదురు. అది కూడా ప్రాయశ్చిత్తకర్మయే. తప్పు పనులు అన్నింటికీ వేదములో ప్రాయశ్చిత్తములు గలవు. పుణ్యపాపముల విషయములో దృఢవిశ్వాసము కలిగి ప్రాయశ్చిత్తకాండను చదివిన వ్యక్తి ప్రాయశ్చిత్తముల పీడనుండి తప్పించుకొనుటకైననూ పాపమును చేయడు. తప్పు పనిని చేసి పొందిన లాభము కంటె ప్రాయ

శ్చిత్తకర్మలో కలిగే క్లేశము అధికముగా నుండును. కావున, ప్రాయశ్చిత్తమునుండి తప్పించుకోవాలంటే, పాపములకు దూరముగా నుండవలెను.

ఈ మీమాంసకుని వాదమేమనగా, మనము అగ్నిహోత్రాది నిత్యకర్మలను చేసినచో, అవి ప్రాయశ్చిత్తకర్మలవలె పని చేసి మన సకలపాపములను పోగొట్టును. మనము వైదికకర్మను చేయునప్పుడు సంకల్పములో ' నేను ఈ కర్మను నా సంచితములై యున్న పాపములను పోగొట్టుకొనుట కొరకై చేయుచున్నాను ( మమ ఉపాత్తదురితక్షయార్థం అహం ఇదం కరిష్యే )' అని చెప్పుచున్నాము. ఈ వాక్యమును మనము భగవానుని ఉద్దేశించి చెప్పెదము. ఇది ఎవనికి వాడు చేసుకొనే ఉపదేశము ( auto-suggestion ) వలె కూడ పని చేయును. ఈ వాక్యమును మనస్సులో అనుకోకుండగా, పైకి చెప్పుటకు కారణమేమి ? మనస్సులో అనుకున్నచో, స్పష్టత తక్కువగా నుండును. కాని, పైకి చెప్పినచో, భావన స్పష్టముగా నిర్మాణమగును. నేను పూర్వజన్మలలో చేసిన పాపములు మాత్రమే గాక, ఈ జన్మలో ఇంతవరకు చేసిన పాపములు కూడ తొలగి పోవుటకై ఈ కర్మను చేయుచున్నాను అని ఈ సంకల్పముయొక్క తాత్పర్యము. కావున, నిత్యకర్మలయొక్క ప్రయోజనము కొత్తగా పుణ్యమును సంపాదించుట కాదు ; అవి జీవుని ఖాతాలో ప్రోగుపడి యున్న దురితములను నివారించుటకై ఉద్దేశించబడినవి.

నిత్యకర్మానుష్ఠానములో మానవుడు అనుభవించే దుఃఖము ఆతని ఖాతాలో ఉన్న పూర్వదురితములను పోగొట్టును అనే వాదము మీమాంసకుని ఈ మోక్షప్రణాళికకు మూలస్తంభము. ప్రతిదినము మానవుడు పొందే అనుభవములచే ఈ దేహమును ఆరంభించిన ప్రారబ్ధకర్మ క్షయమగును. తలపోటు వచ్చినచో, ఒక పాపము క్షయమైనది. ఈ విధముగా ప్రతినిత్యము అనుభవింపబడే సుఖదుఃఖముల వలన క్రమముగా పుణ్యపాపములు క్షయమగును. ఈ ప్రారబ్ధకర్మ క్షయమగుటకై మనము ప్రత్యేకముగా చేయవలసినది ఏమీ లేదు. ఈ జీవనయాత్రలో అది క్షయమగును. కాని, మనము తప్పు పనులను చేయకుండగా, మరియు పుణ్యమును సంపాదించకుండగా చాల జాగ్రత్త పడవలెను. ఈ విధముగా పుణ్యపాపముల ద్వారా మరియొక జన్మను ఇచ్చే కర్మలను పూర్తిగా పరిహరించి, నిత్యకర్మానుష్ఠానముచే పూర్వదురితములను తొలగించుకున్నచో, అట్టి వానికి ఇతరములగు ప్రయత్నములు ఏమియూ లేకుండగనే మోక్షకైవల్యము లభించును. ఈ దేహమును ఆరంభించిన కర్మ జీవనయాత్రలో క్షయమగును. దేహము నశించుసరికి ప్రారబ్ధకర్మ పూర్తిగా క్షయమై యుండును. పూర్వకర్మలు నిత్యనైమిత్తికకర్మలచే వినష్టమైనవి. ప్రతిషిద్ధకర్మలు మరియు కామ్యకర్మలు దూరముగా నుంచబడినవి. కావున, కొత్త కర్మఫలము లేదు.

ఇది చాల పసందైన యోజన ; కాని నిలబడేది కాదు. ఈ యోజనకు ఆధారము లేదు. దీనిని సమర్థించే ప్రమాణభూతములైన శ్రుతివాక్యములు ఏమైన గలవా ? లేవు. పైగా, దీనికి విరుద్ధముగా, ' దానిని తెలుసుకున్నవాడు మృత్యువును అతిక్రమించును ; మరియొక మార్గము లేదు ( తమేవ విదిత్వా అతిమృత్యుమేతి ) ' అని శాస్త్రము చెప్పుచున్నది. ప్రత్యగాత్మ బ్రహ్మయేనని తెలుసుకున్నవాడు మృత్యువును అతిక్రమించును ; అనగా సంసారమునుండి విముక్తుడగును. ఈ జ్ఞానము కంటె భిన్నమైన మార్గము మరి

యొకటి లేదు ( నాన్యః పంథా అయనాయ విద్యతే ). ఈ విషయమును చెప్పవలసిన అవశ్యకత గలదు. ఏలయనగా, ఒకటి కంటె ఎక్కువ మార్గములు గలవని చెప్పువారు అన్ని కాలములలో గలరు. నాలుగు మార్గములు గలవనే అభిప్రాయము కేవలము ఊహ మాత్రమేనని మనము చూచియున్నాము. వాస్తవములో, మానవులు ఎంతమంది గలరో, మోక్షమార్గములు అన్ని గలవని వివేకానందుడు చెప్పియున్నాడు. ఈ వాక్యము మతముల విషయములో, మరియు మతముల లక్ష్యముల విషయములో సత్యమే కావచ్చును ; కాని, మోక్షము విషయములో పరిస్థితి ఇది కాదు. మనము వెనువెంటనే సంపాదించదగిన లక్ష్యము అంతఃకరణశుద్ధి. దానిని అనేకమార్గములలో సాధించవచ్చును. దాని కొరకై ప్రతి మానవుడు స్వీయమతమునకు సంబంధించిన ఆరాధనాపద్ధతిని అవలంబించ వచ్చును. ఒకే మతములోనైననూ ఒక వ్యక్తి చేసే పూజలు మరియు ప్రార్థనలు మరియొక వ్యక్తి చేయువాటి కంటె భిన్నముగా నుండవచ్చును. ప్రతి వ్యక్తి తనకు అనురూపమైన వాటిని ఎన్నుకొన వచ్చును. కాని, మోక్షము విషయములో పరిస్థితి ఇది కాదు. ఏ సర్వజగత్కార ణమగు బ్రహ్మ పై వాక్యములో ఈ సర్వజగద్రూపముగా నున్నదని ( ఇదం సర్వమ్ ) నిరూపించబడినదో, ఏది భూతభవిష్యద్వర్తమానకాలములలో ఏకరూపముగా నిలిచియుం డునో ( యద్భూతం యచ్చ భవ్యమ్ ), అదియే మన హృదయములో మరియు బుద్ధిలో ఆత్మరూపముగా భాసిల్లుచున్నది. ఆత్మ యనగా కేవలము ఈ ఒక్క దేహమునకు మాత్రమే పరిమితమై లేదు. తలలు అన్నీ దానికి చెందినవియే ; కాళ్లు అన్నీ దానివే ; చేతులు అన్నీ దాని చేతులే. ఈ సత్యమును దర్శించు వ్యక్తి మృత్యువును అతిక్రమించి మోక్షమును పొందును. మరియొక మార్గము లేదని చెప్పుటకు కారణమేమి ? మోక్షము బంధమునకు విరోధి. బంధము సత్యమైనచో, దానిని తొలగించుట సంభవము కాదు. ఏది తొలగించ శక్యము కాదో, అదియే సత్యమని మనము నిర్వచించియున్నాము. ఆత్మ బంధింపబడి యున్నచో, ఆ బంధము యథార్థమైనచో, దానిని తీసివేసే ప్రసక్తి లేదు. అది సత్యము కానిచో, దానికి ఉనికి లేదు గనుక, దానిని తొలగించనక్కర లేదు. కాని బంధము ఉన్నదనే ధారణ నీకు ఉన్నచో, దానిని నీవు తొలగించుకొన వలెను. అది జ్ఞానముచే మాత్రమే సాధ్యమగును. ' నేను బద్ధుడను ' అనే భ్రాంతి పోవాలి. అది జ్ఞానముచే మాత్రమే సంభవము. ఆలోచించుట మానివేసినచో, చాలదు ; ఆలోచించుటను మానివే యుట మత్తుమందును సేవించుట వంటిది. ఆత్మ బ్రహ్మయేనని గుర్తించి ఈ ధారణ తప్పు అని మనము గ్రహించవలెను. కావుననే, దీనికి మరియొక మార్గము లేదని ( నాన్యః పంథా విద్యతే ) శ్రుతి చెప్పుచున్నది. జ్ఞానము ( విద్యా ) తక్క మరియొక మార్గము లేదు. ఈ విషయమును ఈ ఒక్క వాక్యము మాత్రమే గాక, పలు శ్రుతివాక్య ములు బోధించుచున్నవి. దేహము పూర్తిగా చర్మముచే కప్పబడియున్న తీరున, ఆకాశ మును కూడ చర్మముచే పరివేష్టించుట సంభవమైనచో, అప్పుడు మానవుడు జ్ఞానము లేకుండగా మోక్షమును పొందవచ్చునని శ్రుతి చెప్పుచున్నది. అనగా, ఆకాశమును పరివే ష్టించుట ఎట్లు అసంభవమో, ఆత్మజ్ఞానము లేనిదే మోక్షము అటులనే అసంభవము. జ్ఞానము మాత్రమే మోక్షహేతువు. శ్రుతివాక్యములు మాత్రమే గాక, పురాణములు కూడ ఇటులనే చెప్పుచున్నవి. ఈ విషయమును అన్వయవ్యతిరేకరూపముగా చెప్పినచో, పొర

బడే అవకాశము ఉండదు. జ్ఞానము లేనిదే మోక్షము లేదు ; జ్ఞానముచే మాత్రమే మోక్షము లభించును. జ్ఞానము వలన మోక్షము లభించును అని చెప్పి ఊరకున్నచో, కర్మ వలన కూడ మోక్షము లభించుననే ధారణ కలుగవచ్చును. కావుననే, శ్రీశంకరులు అన్వయవ్యతిరేకముఖముగా చెప్పినారు.

ఈ మీమాంసకుని యోజనలో ఇంకనూ మరియొక సమస్య మిగిలియున్నది. నిత్య నైమిత్తికకర్మలను చేయుటలో కలిగే క్లేశము వలన పాపకర్మలు అన్నియు క్షయమగునని తాత్కాలికముగా అంగీకరించిననూ, సంచితకర్మల ఖాతాలోని పాపకర్మలు మాత్రమే ఈ తీరున క్షయమగును. పుణ్యకర్మల మాట యేమి ? అవి కూడ అనంతముగా గలవు. నిత్య కర్మ పూర్వమునందు చేయబడిన పాపములకు విరుగుడు అనేది చాల పెద్ద కల్పన. దానిని అంగీకరించినా, పూర్వమునందు చేయబడిన పుణ్యము మిగిలియే యుండును. అది పరిపక్వమైనప్పుడు దానిని అనుభవించుటకై మరియొక జన్మ తప్పదు. అనగా ఆ జీవుడు బహుశః అమెరికాలోని టెక్సస్ రాష్ట్రములో ఒక పెద్ద కోటీశ్వరుని ఇంటిలో జన్మించవలెను. అప్పుడైననూ పుణ్యము అంతయూ ఖర్చు కాకపోవచ్చును. ఆ పుణ్యము ఫలమును ఇచ్చి తీరును.

నిత్యకర్మానుష్ఠానముచే పూర్వకృతపాపములు అన్నియు నశించునను వాదమును మనము తాత్కాలికముగా మాత్రమే అంగీకరించి యున్నాము. కాని ఆ వాదము నిలబడ దు. మానవుడు నిత్యకర్మను ఎంత కాలము చేయును ? 50 సంవత్సరములా ? 60, 70, లేక 80 సంవత్సరములా ? ఈ నిత్యకర్మ అనంతజన్మలలో ఆతడు చేసిన పాపము నంతనూ ఎట్లు తొలగించ గల్గును ? ఏవో కొన్ని నిత్యకర్మలు పాపమునంతనూ నిర్మూలిం చుట అసంభవము. మరియు, ఇంకనూ ఫలమునిచ్చుట ఆరంభము కాని పుణ్యము అంతయు ఈ జన్మలో క్షయమగుట అసంభవము. ఆ పుణ్యము అటులనే మిగిలి యుండు ను. దానిని అనుభవించుటకై మరియొక జన్మ తప్పదు. పూర్వజన్మలలో సంచితమై ఇంకనూ పరిపక్వము కాని పాపములతో బాటు పుణ్యములు కూడ క్షయము కాకుండగా మిగిలియే యుండును. మరియొక దేహమును స్వీకరించకుండగా అవి క్షయము కావు. కావున, మోక్షము సంభవము కాదు.

మరియొక సమస్య కూడ గలదు. ఈ యోజన ప్రకారముగా ముముక్షువు నిత్య నై మిత్తికకర్మలను మాత్రమే చేయును ; కామ్యకర్మలను గాని, ప్రతిషిద్ధకర్మలను గాని చేయ డు. మరో మాటలో చెప్పాలంటే, ఆతడు ధర్మ-అధర్మములను చేయడు. ఇది అసంభవ ము. మానవుడు ధర్మ-అధర్మములను చేయుటకు కారణమేమి ? ఒక ఫలమును కోరి, అది ధర్మమార్గములో లభ్యము కానప్పుడు, మానవుడు తప్పు పనికి పూనుకొనును. ధర్మ మార్గములో ధనమును సంపాదించుటకు 25 సంవత్సరముల కాలము పట్టును. కావున, మానవుడు అడ్డదారులను త్రొక్కి, ధర్మమునుల్లంఘించును. లేదా, ఒకడు మరియొకనిని ద్వేషించి వానికి హానిని తలపెట్టును. ఈ విధముగా అధర్మమునకు రాగద్వేషములు కార ణమగుచున్నవి. ఇవి గాక, మనలో కొన్ని తప్పుడు ధారణలు గలవు. మనయందు భద్రత లేదనే భయము ఉండును. మరియు, మనము కొన్ని విషయములకు వాటికి వాస్తవముగా ఉన్నదానికంటె అధికప్రాముఖ్యమును ఇచ్చుచుందుము. దీనికే శోభనాధ్యాస అని పేరు.

మనలను కొంత కాలమునుండి వేధించుచున్న సమస్యలు పరిష్కారమగుననే మోహములో పడి, మనము రాగద్వేషములను పెంచుకొని, వాటిచే ప్రేరితులమై ధర్మము (కామ్యకర్మలు ) ను, మరియు అధర్మము ( ప్రతిషిద్ధకర్మలు ) ను కూడ చేయుచుందుము. రాగద్వేషములు మరియు మోహము ఉండగా, వాటిని దూరముగా నుంచుట ఎట్లు కుదురును ? ఈ రాగద్వేషములు దూరమయ్యే ఉపాయము ఏది ? జ్ఞానముతో పని లేదనియు, కర్మ చాలుననియు పూర్వమీమాంసకుడు చెప్పును. ఈ మోహము పోయే మార్గము ఏమి గలదు ? ఆత్మ పూర్ణము అనే జ్ఞానము వలన మాత్రమే మోహము పోవు ఆత్మస్వరూపము తెలియనిదే, మానవుడు మోహమును త్రోసిపుచ్చలేడు. ఆత్మస్వరూపము తెలియని వానికి అభద్రతాభావన స్థిరముగా నుండును. దాని వలన రాగద్వేషములు ఉండుట సహజమే. వాటిచే ప్రేరితుడైన మానవుడు ధర్మ-అధర్మములను చేయుచుండును. కావున, కామ్యకర్మలను, ప్రతిషిద్ధకర్మలను చేయకుండుట అనునది వాగాడంబరము మాత్రమే యగును. ఆత్మ పూర్ణము అనే జ్ఞానము ఉదయించనిదే, కామ్యప్రతిషిద్ధలకు దూరముగా నుండుట సాధ్యము కాదు. ఆ జ్ఞానము గలవాడు వాటికి దూరముగా ండగలడు. ఆత్మజ్ఞానము లేకుండగా, ధర్మ-అధర్మముల కారణము నిర్మూలించబడదు. వున, పుణ్యపాపములను నిషేధించుట సాధ్యము కాదు. కావున, మోక్షము లేదు.

మరియు, నిత్యకర్మానుష్ఠానమునకు ఫలము లేదని మీమాంసకులు చెప్పినారు. కూడ సరిగాదు. నిత్యకర్మలను చేయువారికి స్వర్గఫలము లభించును. ఈ విషయము సమర్థించే శ్రుతి-స్మృతి-వాక్యములు అనేకములు గలవు. పైగా, ఒక కర్మను యుమని విధించే శ్రుతి వాక్యము ఫలమును స్పష్టముగా నిర్దేశించని సందర్భములలో, కర్మ స్వర్గలోకఫలమునిచ్చునని తెలియదగునని చెప్పే న్యాయము కూడ గలదు. వర్ణాశ్రమధర్మములను పాటిస్తూ జీవితములో తన యెదుటనున్న పరిస్థితికి అనురూపముగా వ్యకర్మలను చేయు వ్యక్తి కూడ పుణ్యలోకములను పొందునని స్మృతులు కూడ సూచుచున్నవి. ఫలము లేని కర్మను చేయుమని శ్రుతి విధించదు. విహితకర్మను ఆచరించకపో ప్రత్యవాయము కలుగుననే వాదము కూడ సరిగాదు. విహితకర్మను చేసినచో, ము లభించును. నిత్యకర్మను చేయకపోవుట వలన సాక్షాత్తుగా పాపము కలుగదు. , నిత్యకర్మలను మానిన వ్యక్తి ఆ సమయములో తప్పు పనులను చేయుటకు అవకా గలదు. మంచి పనిని మానివేసిన వ్యక్తి తప్పు పనిని ఆరంభించుటకు ఎక్కువ సమ పట్టదు. మరియు, నిత్యకర్మలను మానివేసినచో, సోమరితనము పెరుగును. నేర అన్నియు సోమరితనమునుండియే పుట్టును. పాపకర్మలను పూర్తిగా విడిచిపెట్టి, కేవలము నిత్యకర్మలను మాత్రమే చేసినచో, కర్మఫలము ఉండదని మీమాంసకుని వాదము. కాని, అట్టి వ్యక్తి మరణించిన పిదప ఏమగునో తెలియునా ? ఆ నిత్యకర్మలకు చెందిన దేవతలు అందరు ఆతనిని స్వర్గములోనికి సాదరముగా ఆహ్వానించెదరు. ‘ నాకు స్వర్గము వద్దు ; మోక్షము కావాలి ’ అని ఆతడు అభ్యంతరమును చెప్పిననూ ప్రయోజనము ఉండదు. ఏలయనగా, నిత్యకర్మ కూడ కర్మయే గనుక, ఫలమునిచ్చి తీరును. ఫలమును ఉత్పన్నము చేయకుండగా కర్మను చేయుట ఎట్లు సంభవమగును ? జలాశయములో తరంగములు పుట్టకుండగా రాతిని వేయుట అసంభవము. కావున, కర్మఫలమును అనుభ

వించి తీరాలి ; దానిని తప్పించుకొనే మార్గము లేదు. కాని ఒకే ఒక మార్గము గలదు. అది యేది ?

ఆత్మ కర్త కాదు ( అకర్తా ) అని గుర్తించినచో, ఈ కర్మ అనే నమూనా అంతయు వినష్టమగును. ఈ విధముగా బుద్ధిపూర్వకముగా ఒక విషయమును ఆరోపించి తరువాత నిషేధించే పద్ధతికి అధ్యారోప-అపవాద-న్యాయము అని పేరు. ముందుగా ఆత్మయందు కర్తృత్వము ఆరోపించబడును. కర్త చాల కర్మలను చేసి పుణ్యపాపములను సంపాదించును. ఆ విధముగా సంసారియైన జీవుడు వివిధలోకములలో జన్మించి ఈ సకలపుణ్యపాపముల ఫలమును అనుభవించును. తరువాత, వేదముయొక్క అంతములో, ఆత్మకు యథార్థమగు పుట్టుక లేదనియు, ఆత్మ ఏ కాలమునందైననూ క్రియలను చేయదనియు చెప్పబడును. ఈ సత్యమును గుర్తించిన వ్యక్తి సర్వకర్మలనుండి విముక్తుడగును. జ్ఞానమనే అగ్ని సర్వకర్మలను భస్మము చేయును ( జ్ఞానాగ్నిః భస్మసాత్ కురుతే ). ఏలయనగా, కర్మలన్నియు కర్త యగు ఒక విశిష్టజీవుని ఖాతాలో జమ అయి ఉండును. ఆ కర్తయే లేనిచో, ఈ ఖాతా సమాప్తమగును. ఇదియే అధ్యారోప-అపవాదమనబడును. కర్మసిద్ధాంతము చాల యుక్తియుక్తమైనది. కావున, అది స్వీకార్యమే యగును. కాని, అది ఒక నమూనా మాత్రమే. మనము దానియందు చిక్కుకొని లేము. అంతములో కర్తృత్వమును త్రోసిపుచ్చి, మనము సంచితకర్మతో సహా సర్వకర్మలను త్రోసిపుచ్చెదము. ప్రారబ్ధము కూడ లేనిదానితో సమానమే. ఏలయన, ఆత్మయొక్క దృష్టికోణములో ప్రారబ్ధము లేదు. దేహముయొక్క దృష్టికోణములో మాత్రమే ప్రారబ్ధము గలదు. కాని, ఆత్మకు దేహసంబంధము లేదు. ఆత్మ సచ్చిదానందబ్రహ్మ. కావున, దానికి ఏ కాలమునందైననూ కర్మసంబంధము లేదు. ఆత్మకు సంచితకర్మలు గాని, ఆగామి కర్మలు గాని లేవు. సర్వకర్మలకు ఆత్మయే అధిష్ఠానమై యున్నది. కాని, ఆత్మ కర్మలచే లేపమును పొందదు. కర్మను చేయుచున్ననూ, ఆత్మ కర్మను చేయుట లేదు ( కుర్వన్నపి న కరోతి ). వినుచున్ననూ, ఆత్మ వినుట లేదు ( శృణ్వన్నపి న శృణోతి ) ; చూచుచున్ననూ, చూచుట లేదు ( పశ్యన్నపి న పశ్యతి ). ముస్లిము యువతి వలె ఆత్మ సర్వమును చూచుచున్ననూ, ఎవ్వరికీ కానరాదు. ఆత్మ స్వరూపము అట్టిది. ఆత్మ క్రియలను చేయదు. కర్మబంధవిముక్తికి ఈ సత్యజ్ఞానము మాత్రమే ఏకైకమార్గము.

పూర్వమీమాంసకుల ( కర్మఠాః ) మతమును శ్రీశంకరులు ఇచట మరల చెప్పుచున్నారు : అధికారి కొన్ని కర్మలను ప్రతినిత్యము చేయవలెనని వేదము చెప్పుచున్నది. వీటికే నిత్యకర్మలని పేరు. ఉదాహరణకు బ్రాహ్మణుడు నిత్యము సంధ్యావందనమును మరియు అగ్నిహోత్రమనే కర్మను చేయవలెను. ఇంతేగాక, ఆతడు ప్రతిదినము వేదమును అధ్యయనము చేసి, దానిని ప్రతిదినము ఇతరులచే అధ్యయనము చేయించవలెను. మరియు, ఆతడు సంపదను ప్రోగుచేయకుండగా ( అపరిగ్రహః ) తన వద్ద ఉన్న కొద్ది సంపదను ఇతరులతో కలిసి పంచుకొనవలెను. బ్రాహ్మణునకు విధించబడిన మూడు నిత్యకర్మలు ఇవియే. ఇదే విధముగా సర్వవర్ణముల వారికి కొన్ని విధులు చెప్పబడియున్నవి. సామాన్యముగా చెప్పాలంటే, ప్రతి మానవుడు కొన్ని విధులను చేయవలెను. వాటిలో కొన్ని నిత్యప్రార్థనలు, అగ్నిహోత్రాదికర్మలు అనే రూపములో నున్నవి. వీటికే నిత్యకర్మ

లని పేరు. ఇంతేగాక, కొన్ని ప్రత్యేకసందర్భములలో చేయదగిన కర్మలు గలవు. వాటికి నైమిత్తికకర్మలు అని పేరు. వీటిని కూడ వేదమే విధించుచున్నది. వీటిని విధించే సందర్భములో వేదము వాటికి ఫలమును దేనినీ నిర్దేశించలేదు. సాధారణముగా వైదికకర్మలకు ఫలము చెప్పబడి యుండును. ఉదాహరణకు స్వర్గఫలమును కోరువాడు చేయదగిన యజ్ఞము జ్యోతిష్టోమము ( జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత ). పుత్రుని కోరువాడు పుత్ర కామేష్టిని చేయవలెను. కాని నిత్యనైమిత్తికకర్మల వద్దకు వచ్చుసరికి వేదము ఫలమును దేనినీ చెప్పుట లేదు. ఈ స్థితిని ఆధారముగా చేసుకొని పూర్వమీమాంసకుడు తన వాదమును పొడిగించుచున్నాడు. నిత్యకర్మలకు ఫలము నిర్దేశింపబడలేదు గాన, వాటికి ఫలము లేదని మీమాంసకుల అభిప్రాయము. ఫలము లేని కర్మను ఎవరైననూ చేయవలసిన పని యేమున్నది ? అవి వేదముచే విధింపబడినవి గనుక, వాటిని చేయవలెను. విహితకర్మానుష్ఠానములో క్లేశము గలదు. లేచి వెళ్లి పనిని చేయుట తేలిక కాదు. జనులు సాధారణముగా కొంత సోమరితనమును కలిగియుందును. ప్రస్తుతములో, బ్రాహ్మణుడు సూర్యుడు ఉదయించుటకు ముందే నిద్ర లేవవలెను. అది తేలిక కాదు. ఆ తరువాత వైదికకర్మను చేయవలెను. దానికి ఒక గంట సమయము పట్టును. కావున, ఈ కర్మను చేయుటలో శ్రమ మరియు నొప్పి గలవు. ఇట్టి స్థితిలో వేదము నిత్యకర్మలకు ఫలమును నిర్దేశించలేదు గనుక, వాటికి ఫలమే లేదను నిష్కర్ష చాల ఉదాత్తమైనది. ఈ వాదములకు మన నిత్యజీవితములో సంబంధము ఏమియూ లేకున్ననూ, వీటిని తెలుసుకొనుట చాల మంచిది. దాని వలన మనలో అనుశాసనబద్ధముగా ఆలోచించే సామర్థ్యము కలుగును. వేదము ఫలము చెప్పకున్ననూ, ఈ కర్మలను విధించుచున్నది గనుక, వాటికి మనకు తెలియని ఫలము ఉండి తీరవలెను. ఆ కర్మలను చేయుటలో క్లేశమే మిగిలి, ఫలము లేదన్నచో, ఆ క్లేశము ఒక రకమైన పూర్వపాపానుభవరూపము అయి ఉండవలెను. అనగా, దానివలన అతడు చేసిన పూర్వపాపము క్షయమగుచున్నది. కష్టము వచ్చిన సందర్భములన్నింటిలో కొంత పాపము క్షయమైనదనే తృప్తిని పొంది బుద్ధిమంతుడగు వ్యక్తి దానిని సహనముతో స్వీకరించును. అదే విధముగా, ప్రస్తుతములో దుఃఖరూపములగు నిత్యకర్మలకు ఒకప్పుడు చేసిన పాపములు క్షయమగుటయే ఫలమని స్వీకరించబడుచున్నది. కాని, ఇది శాస్త్రము చేసే ఉపదేశము కాదనియు, కేవలము ప్రతివాదియొక్క వాదము మాత్రమేననియు మనము మరువరాదు. మనము శాస్త్రోపదేశమును నిర్ధారించుటకై ఈ వివిధదృక్కోణములను విశ్లేషించుచున్నాము. మల్లయుద్ధమును నేర్చుకొనే వీరులకు వారితో ఆ యుద్ధమును చేసే మిత్రులు ఉందురు. దాని వలన వారి యుద్ధకౌశలము పెరుగును. అదే విధముగా, మన అవగాహనకు మెరుగులు దిద్దుటలో ఈ ప్రతివాది సహకరించును. ఈ నిత్యకర్మలు క్లేశముతో కూడియున్నవి గనుక, వాటి అనుష్ఠానము పూర్వములో చేసిన పాపముయొక్క ఫలరూపమేనని వీరి వాదము. మనమిచట ఈ కర్మల దృష్టఫలమును గురించి మాటలాడుట లేదు. వేదవిహితమగు కర్మను చేసినచో, పుణ్యము అనే కంటికి కానరాని ( అదృష్టము ) ఫలము లభించవలెను. కాని, నిత్యకర్మలకు వేదము ఫలమును చెప్పలేదు గనుక, వాటిని చేయుట వలన ఇట్టి పుణ్యము లభించదని ఈ ప్రతివాదియొక్క అభిప్రాయము.

నిత్యకర్మలకు ఫలము లేదనుటలో మరియొక హేతువును ఈ వాది చూపించుచు న్నాడు. మనము గాలిని పీల్చుట మొదలైన కొన్ని కర్మలను కేవలము జీవించుట కొరకై చేసెదము. వాటికి జీవించియుండుట తప్ప మరియొక ప్రయోజనము లేదు. గాలిని పీల్చుట వలన నీకు కలిగిన లాభమేమి అని ప్రశ్నించినచో, ఏమి సమాధానమును చెప్ప వలెను ? కేవలము జీవించి యుండుట కొరకై మనము గాలిని పీల్చుచుండవలెను. ఆ కర్మకు జీవించి యుండుట తప్ప మరియొక ప్రత్యేకఫలము లేదు. గాలిని పీల్చకుండగా జీవించి యుండుట సంభవము కాదు. ప్రాణాయామములో మనము ఒక పద్ధతిలో గాలిని పీల్చెదము. దాని వలన మనస్సులోని అలజడి తగ్గును. కాని, సరళమగు శ్వాసక్రియకు జీవితములో ప్రత్యేకఫలము లేదు. జీవించియుండుట యనగా గాలిని పీల్చుచుండుటయే. అదే విధముగా నిత్యకర్మ కూడ జీవితములో ఒక విడదీయరాని అంగము. కావున, మనము దానిని చేసి తీరవలెను. నిత్యకర్మ శ్రుతివిహితమగుటచే, దానిని విడిచి పెట్టరా దు. శ్రుతియందు శ్రద్ధ గలవారు ఈ కర్మలను చేయవలెను. మానవుడు జీవించియు న్నాడు గదా ! ఈ కర్మలను చేయుటకు ఆ కారణము చాలును.

ఇప్పుడు దీనికి ప్రత్యుత్తరము వచ్చుచున్నది. ఈ వాదము యుక్తియుక్తము కాదు. ఎందువలన ? శ్రీశంకరులు రెండు కారణములను చెప్పిరి. నిత్యకర్మానుష్ఠానములో అను భవమునకు వచ్చే దుఃఖము పూర్వకర్మఫలమైనచో, అది పరిపక్వము చెందిన కర్మఫ లము అయి ఉండవలెను. అది పరిపక్వమైన కర్మఫలమైనచో, ప్రారబ్ధకర్మలో భాగము మాత్రమే కాగలదు. అది ఇంకనూ ఫలమును ఈయనారంభించని కర్మల ఫలము ( అనార బ్ధకర్మ ఫలమ్ ) కాజాలదు. జీవునిచే పూర్వజన్మలలో చేయబడి అతని ఖాతాలో దీర్ఘకాలిక డిపాజిట్ వలె నిలిచియున్న కర్మలు సంచితకర్మలనబడునని మనము చూచియున్నాము. ఆ కర్మలు ఇంకనూ పరిపక్వము కాలేదు. అందువలననే, వాటికి *అనారబ్ధ-కర్మ-ఫలాని* అని పేరు. కర్మలన్నియు ఒకే జన్మలో పరిపక్వము కావు. ఈ వంశములో జన్మించి ఈ రకమైన బాల్యము మొదలగునవి కలిగియున్న ఈ జన్మలో ఒక కర్మసముదాయము మాత్రమే అనుభవమునకు వచ్చి క్షయమగును. ఫలమును ఈయనారంభించిన ఈ కర్మ లకు *ఆరబ్ధ-కర్మాణి*, లేక *ప్రారబ్ధ-కర్మాణి* అని పేరు. నిత్యకర్మానుష్ఠానముచే పాపము క్షయమగునని అంగీకరించిననూ, ఆ పాపము అనారబ్ధ-కర్మ-ఫలము కాజాలదు.

ఇంతేగాక, నిత్యకర్మలో ఒకే రకము పరిశ్రమ మరియు ఒకే రకము క్లేశము గలవు. ఆ దుఃఖము పాపముల ఫలమైనచో, ఆ పాపములు కూడ ఒకే రకమైనవి అయి ఉండ వలెను. కాని, సంచితకర్మలో పలు రకముల పాపములు ఉండును. వాటి మాట యేమి ? మనకు వచ్చే దుఃఖానుభవములన్నియు పూర్వములో చేసిన దురితముయొక్క ఫలమే. నిత్యకర్మానుష్ఠానములో కలిగే దుఃఖము పూర్వపాపఫలమన్నచో, రోగము మొదలైన వివిధ సమస్యల వలన కలిగే దుఃఖము మాట యేమి ? మనకు వచ్చే దుఃఖములు పలు రకములుగా నున్నవి. హఠాత్తుగా షేర్ల ధర పడిపోవును. ఆ దుఃఖమునకు నిత్య కర్మానుష్ఠానదుఃఖముతో పోలిక లేదు. ఇంటి యజమాని తన స్వగృహములోనికి మారాలని తలపోయును. కాని అద్దెకు ఉన్న వ్యక్తి ఇంటిని ఖాళీ చేయడు. అద్దెకు ఉన్న వ్యక్తి అట్టి మొండి ఘటము ఏల కావలెను ? అద్దెకు ఉండే వారిలో ఎందరో మంచివారు గలరు. కాని

నాకు ఈతడు చెడ్డవాడు దొరికినాడు. ఎందువలన ? ఏదో ఒక పాపము. పాపములో అనేక రకములు గలవు. పాపఫలము సర్వదా ఏకరూపముగా నుండదు. కావున, సర్వపాపములు నిత్యకర్మానుష్ఠానదుఃఖముచే క్షయమగుననన్నచో, మనము అనుభవించే ఇతరపాపఫలమును ఎక్కడనుండి వచ్చినవి ? మానవులకు ఒకే ఒక రకమైన దుఃఖము, అనగా నిత్యకర్మానుష్ఠానదుఃఖము మాత్రమే ఉన్నచో, అద్భుతముగా నుండెడిది. ఇతరదుఃఖములు ఏవియూ లేనిచో, ఈ నిత్యకర్మలను ఆనందముగా చేయవచ్చును.

నిత్యకర్మలను చేయుటలో కలిగే దుఃఖము పూర్వజన్మలలో చేసిన పాపముల ఫలము అనే వాదమును ఇపుడు శ్రీశంకరులు పరిశీలనకు స్వీకరించుచున్నారు. నిత్యకర్మలో కలిగే క్లేశము పూర్వము చేసిన పాపముల ఫలము అను వాదము పొసగదు. ఈ విషయమును గమనించుడు. తన జీవితమునంతయు అగ్నిహోత్రాది నిత్యకర్మలను చేస్తూ గడిపిన వైదికుని గురించి మనము మాటలాడుచున్నాము. ఈతడు ఇతరప్రాణులకు దుఃఖమును కలిగించే కర్మలను కూడ చేసియుండ వచ్చును. ఈతడు జీవితములో కొన్ని పుణ్యకర్మలను, మరికొన్ని పాపకర్మలను చేసియుండవచ్చును. ఈతడు మరణించే సమయములో, ఏ కర్మలు పరిపక్వమై తరువాతి జన్మను ఇచ్చును ? ఈ కర్మలు అన్నీ ఒకే సారి పరిపక్వము కావు. ఒక కర్మసమూహము ఒక విశిష్టజన్మను ఇచ్చును. ఉదాహరణకు, ఆతడు చేసిన అగ్నిహోత్రాది కర్మలు ఆతనికి స్వర్గసుఖానుభవమునకు యోగ్యమైన దేహమునిచ్చి స్వర్గమునకు గొనిపోవును. ఆతనికి దేవశరీరము లభించినదనుకొనుడు. ఆతడు చేసిన పాపకర్మల మాట యేమి ? వాటిని అదే దేవశరీరముతో అనుభవించుట కుదరదు. అంతవరకు ఫలమునిచ్చుటను ఆరంభించని కర్మల ( అనారబ్ధకర్మలు ) ఫలము అదే జన్మలో అనుభవమునకు రాదు. అవి మరుజన్మలో మాత్రమే అనుభవమునకు రావలయును. ఒక దేహమునకు ఒక కర్మసముదాయముతో మాత్రమే సంబంధము ఉండును. ఆతడు దేవశరీరధారియై ఉండగా, ఆతడు చేసిన పాపములు ఫలమునీయజాలవు. ఏలయనగా, దేవశరీరము సుఖానుభవము కొరకే గాని, దుఃఖానుభవము కొరకు కాదు. కావున, పాపములు తాత్కాలికముగా స్థగితమై యుండును. అవి అభివ్యక్తమగుటకు అనురూపమైన కాలము కొరకు వేచి యుండవలెను. అనగా, ఒక విశిష్టకర్మసముదాయము యొక్క ప్రభావముచే నిర్మాణమైన దేహము కొనసాగుచుండగా, ఇంకనూ ఫలమునిచ్చుట ఆరంభము కాని కర్మల ఫలము అదే జన్మలో అభివ్యక్తమగుట యుక్తియుక్తముగా లేదని శ్రీశంకరులు వాక్రుచ్చిరి.

అటులనే జరిగినచో, యేమగును ? ఉదాహరణకు, ఒక వ్యక్తి అగ్నిహోత్రాదివిధులను శ్రద్ధతో చేసినాడనుకొనుడు. ఆ పుణ్యప్రభావముచే స్వర్గసుఖానుభవమునకు యోగ్యమైన దేహమును పొందినాడు. అనగా, ఆతని పుణ్యము దుఃఖసమ్మిశ్రితము గాని సుఖమును ఈయవలెను. దాని కొరకు మాత్రమే ఆతడు స్వర్గమునకు వచ్చినాడు. ఆతడు పూర్వములో చేసిన పాపములు కూడ ఆతనితో బాటు స్వర్గమునకు రాకూడదు. ఆతడు అచట పాపఫలమును కూడ అనుభవించే పక్షములో స్వర్గము ఏది ? నరకము ఏది ? నరకమునకు వెళ్లి పుణ్యమును, స్వర్గమునకు వచ్చి పాపమును అనుభవించుట పూర్వమీమాంసకునకైననూ అంగీకారము కాదు. పూర్వమీమాంసకులు కూడ స్వర్గములో దురితఫలము

ఉండదనియే చెప్పెదరు. కాని, మీమాంసకుని ఈ వాదమననుసరించి, అగ్నిహోత్రాదివు ణ్యకర్మల వలన పొందబడిన స్వర్గములో జీవుడు పాపఫలములను అనుభవించ వచ్చు ను. కావున, ఒక విశిష్టకర్మసముదాయము మాత్రమే పరిపక్వమై కర్మఫలమునిచ్చునని అంగీకరించి వలయును. అనగా, ఒక జన్మలో ఆ కర్మసముదాయము మాత్రమే క్షయమ గును. సంచితకర్మలు అన్నియు ఒకే జన్మలో క్షయమగుట సంభవము కాదు.

ఇచట శ్రీశంకరుల ప్రతిపాదనము ఎంత యుక్తియుక్తముగా నున్నదో గమనించుడు. శ్రీశంకరులు జైన-బౌద్ధ-సాంఖ్య-వైశేషిక-నైయాయిక-ఆది సిద్ధాంతములను విశ్లేషించిన సందర్భములలో, ఆయన ఆయా దర్శనములను ఖచ్చితముగా మరియు సమగ్రముగా ప్రతిపాదించి, వాటికి ప్రతి స్థాయిలో సమాధానమునిచ్చెదరు. ఒక విశిష్టస్థాయిలో ఈ సర్వము మిథ్యయని వారు క్షమాపూర్వకముగా త్రోసిపుచ్చెదరు. కాని, కర్మ-నమూనాను అంగీకరించియు, దానిపై మీమాంసకుల దృష్టికోణములో గల దోషమును ఎత్తిచూపెదరు. వాదియొక్క అవగాహనలో దోషము ఉన్న సందర్భములలో శ్రీశంకరులు పాండిత్యప్రతి భను ప్రదర్శిస్తూ వాదించెదరు. ఆ ధోరణి ఇక్కడి వాదములో కూడ కానవచ్చును. ఈ అంశమును వారు పలుమార్లు ప్రస్తావించినారు. వారు చేసే వాదములోని ప్రతి అంశము ప్రముఖమైనదియే. దుఃఖములు అనేకరకములుగా నున్నవి. దుఃఖహేతువులగు పాపములు కూడ పలు విధములుగా నుండును. సర్వపాపములు కేవలము నిత్యకర్మానుష్ఠానక్లేశముచే మాత్రమే క్షయమయ్యే పక్షములో, మిగిలిన దుఃఖముల మాట యేమి ? జీవితములో మనకు విజయముతో బాటు పరాజయము కూడ ఎదురగుచుండును. దానిలో దుఃఖము గలదు. ఉదయము ఆరోగ్యముగా నున్న వ్యక్తి సాయంకాలమగుసరికి రోగగ్రస్తుడు కావ చ్చును. నిన్నటి రోజు అద్భుతముగా నుండెను. కాని, ఈ నాడు బాగుండలేదు. రేపు పరి స్థితి మరింత అధ్వాన్నముగా నుండవచ్చును. ఒకే దినములో వృద్ధి-పతనములు ఉండవ చ్చును. రోగము ఇత్యాది పీడలు మానవుని బాధించుచునే యుండును. సర్వపాపములు నిత్యకర్మానుష్ఠానక్లేశముచే మాత్రమే క్షయమయ్యే పక్షములో ఈ దుఃఖములన్నియు హేతువు లేకుండగనే కలుగుచున్నవని చెప్పవలయును. ఉదాహరణకు, ఒకడు తలపై రాళ్లను పెట్టుకొని మోయుచున్నాడు. ఆ క్లేశము పూర్వకృతపాపఫలము కాదనియు, కేవ లము నిత్యకర్మానుష్ఠానములో కలిగే క్లేశమే పూర్వకృతపాపఫలమనియు చెప్పుట సబ బుగా లేదు. కొందరు ప్రతి దినము రాళ్లను పగుల గొట్టి తలపై మోయుచుందురు. ఇది చాల కఠినమైన పని. అట్టి బండ పనిని చేయాలనే కోరిక ఎవ్వరికైననూ ఉండదు. కాని కొందరు గతి లేక అట్టి పనులను చేయుచుందురు. ఈ జన్మలో గాని, పూర్వజన్మలో గాని చేసిన పాపము వలన ఆ క్లేశము కలిగియుండును. కావున, నిత్యకర్మలోని క్లేశము మాత్రమే పాపఫలమనియు, ఇటువంటి ఇతరక్లేశములు కావనియు ఎట్లు చెప్పగలము ? శ్రీశంకరులు ఈ విషయమును తరువాత మరింత అధికముగా విశ్లేషించెదరు.

మనము ముందుగా ఈ విషయములో శాస్త్రముయొక్క తాత్పర్యమును తెలుసు కొని, తరువాతనే ముందుకు సాగెదము. ఈ జన్మలో గాని, పూర్వజన్మలలో గాని చేసిన పాపములను క్షయము చేయుట కొరకై శాస్త్రము నిత్యకర్మలను విధించుట లేదు. నిత్యక ర్మల వలన పుణ్యఫలము లభించి తీరును. ఆ పుణ్యము జీవుని స్వర్గమునకు గొనిపోవు

ను. కాని, అదే నిత్యకర్మను అంతఃకరణశుద్ధి కొరకై ఆచరించినచో, అది పూర్వమునందలి పాపములను ప్రభావహీనములుగా చేయును. కాని, శ్రుతి ఈ కర్మలకు ఫలమును నిర్దే శించ పోవుటకు కారణమేమి ? మనము నిత్యకర్మలను అంతఃకరణశుద్ధి కొరకై చేయాలని శ్రుతియొక్క అభిమతము. నిత్యకర్మలు స్నానము చేయుట వంటివి. ' నీవు ప్రతిదినము స్నానము చేయవలెను ; అట్లు చేయుట వలన నీకు హితము కలుగును ' అని ప్రత్యేక ముగా చెప్పనక్కర లేదు. స్నానము తప్పనిసరిగా చేయదగిన కర్మ. అదే విధముగా, మనము ప్రతి దినము పరమేశ్వరుని ప్రార్థించవలెను. మనము నిత్యజీవితములో అనేకరాగ ద్వేషములను హృదయములో నింపుకొనుచుందుము. కావుననే, నిత్యప్రార్థన అత్యవసర మగుచున్నది. మనస్సులో నెలకొని యున్న దోషిత్వభావన, మరియు అపకారము జరిగిన దనే వ్యథ మొదలైన బాధలు నిత్యప్రార్థన వలన కొంత వరకు నిర్వీర్యములగును. నిత్యక ర్మలను చేయనిచో, బాల్యములో మరియు యౌవనములో మానవుని యందు ఉండే అమాయకత్వము క్రమముగా మాయమై వ్యక్తిత్వములో ఒక రకమైన తీక్ష్ణత మరియు క్రౌర్యము నిర్మాణమగును. మానవుడు జన్మించినప్పుడు నూటికి నూరు శాతము అమా యకుడై యుండును. తరువాత ఆ శిశువు క్రమముగా పెరిగి పెద్దవాడగును. మనస్సు కూడ పెరుగుతూ చాల సమాచారమును సేకరించుచుండును ; ఒకప్పుడు వ్యక్తి గొప్ప విద్యావంతుడు కూడ కావచ్చును. ఆ స్థితిలో మానవుడు మనోగ్రంథులు లేని సరళమైన వ్యక్తిత్వము గలవాడై ఆనందముగా నుండవలెను. కాని వాస్తవములు ఆ విధముగా లేవు. ప్రతి మానవునియందు ఒక విశిష్టవ్యక్తిత్వము నిర్మాణమగుచున్నది. మనము కొన్ని విష యములను సుతరాము సహించలేము ; మరి కొన్ని విషయములు మనకు అంగీకారమగు చుండును. మనలో అనేకధారణలు మరియు మనోగ్రంథులు నిర్మాణమగుచున్నవి. ఎందు వలన ? అంతఃకరణశుద్ధి లేకపోవుటయే. ప్రతినిత్యము మనము వివిధరకముల మాలిన్య ములను ప్రోగుచేయుచుందుము. వాటిని నిర్మూలించవలసిన ఆవశ్యకత గలదు. అట్లు చేయనిచో, వర్షపు నీరు నేలపై పడే పరిస్థితి ఉండును. వర్షపు నీరు నేలపై పడునంతవ రకు పరిశుద్ధముగా నుండును. దానిని పాత్రలో పట్టుకొని త్రాగవచ్చును. కాని నేలపై పడ గానే బురద యగును. అదే విధముగా, శిశువు ఈ ప్రపంచములోనికి పుట్టునాటికి నూటికి నూరు శాతము అమాయకుడుగా నుండును. కావుననే, శిశువులు ఎవరైనా ముద్దు వచ్చు చుందురు. పల్లెటూరి దంపతుల శిశువు అయినా, మురికి వాడలో నివసించే దంపతుల శిశువు అయినా, గొప్ప విజ్ఞానశాస్త్రవేత్తయొక్క శిశువు అయినా, సమానమైన ఆహ్లాద మును కలిగించెదరు. అందరు శిశువులు అమాయకులే. గణితశాస్త్రజ్ఞుని శిశువు కడుపులో కలనగణితముతో పుట్టడు. తరువాత యేమగును ? శిశువు పెరుగుచుండును. అంతవరకు బాగున్నది. శిశువు పెరిగి పెద్ద కావలసినదే. కాని, ఆ ప్రక్రియలో అమాయకత్వము, మానసికపరిశుద్ధి బలి కారాదు. శిశువులో ఆరంభమునందు మనోగ్రంథులు, మోసము, దగా ఇత్యాదులు ఉండవు. శిశువు శుద్ధముగా, సరళముగా, అమాయికముగా నుండును. కాని ఆ తరువాత శిశువు పరిస్థితులను ఎదుర్కొనుచుండును. అతనిలో భయము, ఆదుర్దా మొదలైన వివిధమానసికసమస్యలు చోటు చేసుకొనును. ఈ విషయములో మనము ఏమి చేయగలము ? తల్లిదండ్రులు పిల్లలలో ప్రార్థనపై మహత్త్వబుద్ధి మరియు ప్రార్థన చేసే

మనఃప్రవృత్తి నిర్మాణమగునట్లు చేయవలెను. ఆ తరువాత సమయము వచ్చినప్పుడు వారికి ప్రార్థనయొక్క స్వరూపము అవగతమగును. వారు ప్రార్థనను చేయుట వలన మనస్సులో నెలకొనే ఈ సమస్యలు అన్నీ పరిష్కారమగుచుండును. ఇందువలననే, మనము పిల్లలకు 7-8 సంవత్సరముల వయస్సు రాగానే మంత్రమును ఉపదేశించి, జపము చేసే అలవాటును కలిగించెదము. పిల్లలు పెరిగి పెద్దవారు అయ్యే కొలదీ వారికి ప్రార్థనయొక్క ప్రాముఖ్యము అవగాహనకు వచ్చి, వారి మనస్సులోని రాగద్వేషములు, భయము మొదలగు దోషముల బలము తగ్గును. మనము దేహమును ప్రతి దినము శుభ్రము చేసినట్లుగనే, మనస్సును కూడ శుభ్రము చేయవలెను. కావున, స్నానము వలెనే ప్రార్థన కూడ నిత్యము చేయదగిన కర్మ. ఇందువలననే, శాస్త్రము నిత్యకర్మలకు ఫలమును నిర్దేశించుట లేదు. దాని యర్థము వాటికి ఫలము లేదని కాదు. నిత్యకర్మలు నిశ్చితముగా పుణ్యమును ఇచ్చును. వాటి వలన అంతఃకరణశుద్ధి అనే అదనపు ఫలము కూడ లభించును. ఇందువలననే, మనము సంధ్యావందనమునకు ఆరంభములో మమ సమస-ఉపాత్త-దురిత-క్షయార్థమ్ ( నేను చేసిన పాపములు అన్నియు క్షయమగుట కొరకై ) అని సంకల్పమును చెప్పెదము. మనము ఈ జన్మలో గాని, పూర్వజన్మలలో గాని చేసియున్న పాపకర్మలు పరిపక్వమగుచున్నవి. ఆ వివరములు మనకు తెలియదు. కాని అవి మనకు దుఃఖమును కలిగించి మన సాధనలో విఘ్నములను నిలబెట్టగలవు. సర్వమానవదేహములు పుణ్యపాపమిశ్రమఫలములే. ఇందువలననే, మనలను జయము సర్వకాలములలో వరించదు ; వరించనక్కర లేదు కూడా. కాని, నిత్యప్రార్థన దురితమును నియంత్రణలో నుంచును. అది కొత్త దురితములను దగ్గరకు రానీయదు ; పాత దురితములను ప్రభావహీనము చేయును. ఈ విధముగా కాలము గడిచే కొలదీ మనస్సు శుచియై సర్వవిధములు పరిస్థితులను ఎదుర్కొనే సామర్థ్యము కలుగును. నిత్యప్రార్థన వలన తల పోవలసిన సందర్భములో తలపాగా మాత్రమే పోవును. అర్జునునకు అటులనే అయినది. అతని పైకి నాగాస్త్రము వచ్చుచుండగా, శ్రీకృష్ణుడు రథమును భూమిలోపలికి నొక్కి యుంచుటచే అది గురి తప్పి అర్జునుని తలకు బదులుగా కిరీటమును తన్నుకు పోయెను. అర్జునుడు భగవానుని శరణు జొచ్చుట వలననే ఆ విధముగా రక్షింపబడెను. శ్రీకృష్ణుడు రథమును భూమిలోపలికి మరికొంత నొక్కినచో, అర్జునునకు కిరీటము కూడ దక్కి యుండెడిది. కాని అతని ప్రార్థనకు అంత మాత్రమే బలము గలదు. ఆ విషయము భగవానునకు ఎరుకయే. తల ఎగిరి పోవుటకు బదులుగా కిరీటము పోయినది. అది ప్రార్థనాఫలమే.

నేను చాల ప్రార్థనను చేసిననూ, ప్రయోజనమేమియు కలుగలేదని జనులు తరుచుగా చెప్పుచుందురు. ప్రార్థనను చేసియుండనిచో, ఏమి అయ్యెడిదో ! మనము ఆ విషయమును గమనించవలెను. 1962 లో అష్టగ్రహకూటము వచ్చినది. ఈ విధముగా ఎనిమిది గ్రహములు ఒకే రాశిలోనికి వచ్చుట చాల అరుదైన విషయము. ఇది విశ్వశాంతికి మంచిది కాదని ప్రపంచములోని జ్యోతిషశాస్త్రజ్ఞులు అందరు హెచ్చరించిరి. ఏదో ఒక ముప్పు రాబోవుచున్నదని జనులు అందరు వేచియుండిరి. కాని భారతదేశములో జనులు ఎదురు చూడరు. ప్రతి గ్రామములోని ప్రతి దేవాలయములో వారు పూజాదికమును చేయ వారంభించిరి. అనేకయజ్ఞములు చేయబడెను. కాని ఏమీ కాలేదు ! ఏమీ జరుగక పోవు

టచే యజ్ఞాదులలో చాల ధనము దుర్వినియోగమైనదని కొందరు జనులు ఫిర్యాదు చేయసాగిరి. కాని యజ్ఞాదులను చేయుట వలననే ఏమీ కాలేదు. చాల ధనము ఖర్చు అయిననూ, మనకు మాత్రమే గాక, ప్రపంచమునకంతకూ ఘోరవిపత్తు తప్పిపోయినది. కావున, మనము చేసిన ప్రయత్నమును మనము అంచనా వేసే దృష్టికోణముపై సర్వము ఆధారపడి యుండును.

ఒక కర్మను చేయకపోవుట వలన పాపము వచ్చుననే అభిప్రాయము తప్పు. కర్మను చేయకపోవుట ఫలమునిచ్చే పక్షములో మనము కర్మను ఏల చేయవలెను ? మరియు, ఏ కర్మ-అభావము ఏ ఫలమునిచ్చును ? వేదవిహితమైన కర్మను చేయకపోవుట వలన ఫలము ఏమియూ పుట్టదు. కాని, నిత్యకర్మను చేయకపోయినచో, మన జీవితము దురితములకు నిలయమై అనేకసమస్యలు ఉత్పన్నమగును. నిత్యకర్మలను చేయుచున్నచో, ఈ సమస్యలు దూరమగును. ఇందువలననే, శాస్త్రములో అకరణే ప్రత్యవాయః అను వచనము కనబడుచున్నది. ఆ వచనమునకు తాత్పర్యము పూర్వమీమాంసకులు పైన చెప్పిన విధముగా కాదు. శాస్త్రతాత్పర్యమేమనగా, అంతఃకరణము శుద్ధముగా నుండవలెను. దేహమును స్నానము చేసి శుభ్రము చేయవచ్చును. కాని, మనస్సును నీటితో కడుగుట సంభవము కాదు ( వారిణా న శుధ్యతే అంతరాత్మా ). మనస్సును శుద్ధి చేయుటకు ఏ రకమైన సబ్బును వాడవలెను ? పుర్రెను తెరిచి లోపల కడుగుట సంభవము కాదు గదా ! మనస్సు స్థూలపదార్థము కాదు. అది చాల సూక్ష్మమైనది. కావున, కంప్యూటరులో వైరస్‌ను నివారించుటకై ప్రోగ్రాము ( software ) ను ప్రవేశపెట్టిన తీరుగా, మనస్సును శుద్ధి చేసే ప్రోగ్రామును చేపట్టవలెను. మనస్సులోని వైరస్ లు ఏవి ? సర్వపాపములు మరియు రాగద్వేషములే. వాటి నివారణ కొరకు మాత్రమే నిత్యకర్మ ఉద్దేశించ బడినది. శ్రీశంకరులీ విషయమును తరువాత మరల చర్చించగలరు.

మీమాంసకుని వాదములో మరియొక సమస్య గలదు. నిత్యకర్మానుష్ఠానమే కర్మ ఫలమయ్యే పక్షములో, శాస్త్రము దానిని విధించనేల ? ప్రతి నిత్యము సంధ్యావందనమును చేయవలెనని చెప్పే శ్రుతివాక్యము ( అహరహస్సంధ్యాముపాసీత ) గలదు. ప్రతి ఉదయము సూర్యోదయకాలమునందు, ప్రతి సాయంకాలము సూర్యుడు అస్తమించే సమయములో, మరియు ప్రతి మధ్యాహ్నము సూర్యుడు కుడివైపు గాని, ఎడమవైపు గాని కాకుండా ఖచ్చితముగా శిరస్సుపై నున్నప్పుడు, ఈ సంధ్యావందన కర్మను చేయవలెను. అదే విధముగా ప్రతి వసంతకాలములో జ్యోతిష్టోమము అనే యజ్ఞమును చేయవలెను ( వసంతే వసంతే జ్యోతిషా యజేత ). ఈ విధముగా శాస్త్రము చేసే ఆదేశములకు విధి అని పేరు. ఇట్టి నిత్యకర్మలను అనుష్ఠించుటలో కలిగే క్లేశము పూర్వపాపముల ఫలము అయ్యే పక్షములో ఆ ఫలము ఖచ్చితముగా దానంతట అదే సంప్రాప్తమగును. కావున, వీటిని శాస్త్రము విధించ వలసిన ఆవశ్యకత యేమున్నది ? ఒక దృష్టాంతమును గమనించుడు. ఈ దేహము పుట్టినది. ఎందువలన పుట్టినది ? శాస్త్రము విధించుటచే దేహము పుట్టలేదు. దేహము కర్మఫలము ; కావుననే, పుట్టినది. ఫలసంబంధము లేని కర్మను చేయుమని శ్రుతి ఆదేశించనక్కరలేదు. ఒక కర్మను శ్రుతి విధించుటను బట్టి ఒక విష

యము నిర్ధారితమగుచున్నది. ఆ కర్మను చేయుటకు గాని, మానుటకు గాని మనకు స్వాతంత్ర్యము గలదు. కావున, దానికి ఫలము ఉండి తీరును. కాని, నిత్యకర్మానుష్ఠానములో కలిగే క్లేశము ఈ దేహము ద్వారా అభివ్యక్తమయ్యే పరిపక్వమై యున్న పూర్వకృతపాపముల ఫలము అనే పక్షములో, ఆ నిత్యకర్మను శాస్త్రము విధించుట వ్యర్థము. ఈ దేహము పుట్టుట తోడనే ఆ కర్మలు అన్నియు ఫలమును ఈయనారంభించి యున్నవి గనుక ( ఆరబ్ధత్వాత్ ), అవి కాలక్రమములో అనుభవము ద్వారా క్షయమగును. పాపములు రోగము మొదలగు ఫలములనిచ్చి సహజముగా క్షయమగుచుండును. వాటి ఫలము ప్రారబ్ధకర్మఫలమే. కావున, వాటి విషయములో మనము చేసేది ఏమీ లేదు. కావున, శాస్త్రవిహితకర్మ ఇతరకర్మల ఫలము కాజాలదు.

ఈ వాదములో మరియొక దోషము కూడ గలదు. ఆరబ్ధకర్మకు, అనారబ్ధకర్మకు భేదమేమి? అనారబ్ధము అనేది ఒకటి లేనిదే, ఒక కర్మను ఆరబ్ధకర్మ అనుటలో ఔచిత్యమేమి గలదు ? ఇంకనూ పరిపక్వము కాని కర్మ ఒకటి ఉండుటచే, ఇప్పుడు ఫలమునిచ్చుచున్న ఈ కర్మను ఆరబ్ధకర్మ అనుట పొసగును. కావున, ఇప్పుడు అనుభవింపబడే ఫలము ఆరబ్ధకర్మఫలమగునే గాని, అనారబ్ధకర్మఫలము కాదు. అనగా, ఈ అనుభవముచే అనారబ్ధకర్మ క్షయమగుట సంభవము కాదు.

నిత్యకర్మలో కలిగే దుఃఖము సంచితపాపములను క్షయింపజేయునను వాదము మనకు అంగీకారము కాదు. కాని, దానిని తాత్కాలికముగా అంగీకరించిననూ, మనము నిత్యజీవితములో పడే కష్టముల వలన సర్వదురితము క్షయమయ్యే పక్షములో, శాస్త్రవిధులు వ్యర్థమగును. ఇందువలననే, శాస్త్రము పశువులకు విధులను నిర్దేశించుట లేదు ; నిర్దేశించినా అవి పాటించలేవు. మానవుడు మాత్రమే విధిని అనుష్ఠించగలడు. మానవుడు అనుష్ఠించి కొంత ఫలమును పొందుట కొరకై శాస్త్రము విధులను నిర్దేశించుచున్నది. వేదము విధించే కర్మలు అన్నింటికి ఏదో ఒక ఫలము ఉండును. పైగా, ఈ ఫలములు అభీష్టములై యుండును. అభీష్టఫలమునిచ్చే కర్మ మాత్రమే విధించబడును. శాస్త్రము నిరుపయోగమైన కర్మను విధించదు. విధికి ఫలము ఉండి తీరును. నిత్యకర్మ పూర్వకర్మల ఫలము అయ్యే పక్షములో శాస్త్రము దానిని విధించుట అనవసరము. మానవుడు సహజముగనే ఆ దుఃఖముననుభవించును. శాస్త్రము దాని గురించి ప్రస్తావించుట వ్యర్థము. 'నీకు జ్వరము రావాలి ; నీకు కేన్సరు రావాలి ' అని శాస్త్రము చెప్పదు. కర్మకు అనురూపమైన ఫలమును ప్రాణులు పొందుచునే యుందురు. దాని గురించి శ్రుతి ప్రస్తావించుట అనవసరము. కాని, మనకు గల సమస్యలను మరియు దురితములను పోగొట్టే కర్మలను శాస్త్రము మనకు బోధించును. శాస్త్రము మన కామనలు పూర్తి అయ్యే సాధనములను చెప్పును. దురితములను పోగొట్టుకొనుటలో శాస్త్రము మనకు చేయూతనిచ్చును.

మనము చేయరాని కర్మలు కొన్ని గలవు. శాస్త్రము వాటిని స్పష్టముగా నిర్దేశించుచు. హింసను చేయరాదు ( *హింసాం న కుర్యాత్* ) ; మాంసమును భక్షించ కూడదు ( *కలంజం న భక్షయేత్* ) ; మద్యమును త్రాగరాదు ( *సురాం న పిబేత్* ) మొదలైనవి నిషేధములు. ఇవి నిషేధించబడుటకు కారణమేమి ? కేవలము ఇవి ఆరోగ్యమునకు హానికరము అగుట మాత్రమే కారణము కాదు. ఆ విషయము పౌష్ఠికాహారశాస్త్రమును అధ్యయ

నము చేసిన ప్రతి వానికి తెలియుచునే యుండును. దాని కొరకై వేదము దాకా పోనక్కరలేదు. ఈ కర్మలకు కంటికి కానరాని పాపఫలము గలదని శ్రుతి చెప్పుచున్నది. ఈ కర్మలను నిషేధించుటలో శ్రుతి తాత్పర్యము ఆ అదృష్టఫలము అభీష్టము కాదని మాత్రమే. అప్పుడు మాత్రమే, శ్రుతి మనకు ప్రమాణమగును. ఏలయనగా, ఏయే కర్మలు పుణ్యపాపములనిచ్చుననే విషయము తెలియుటకు మన వద్ద మరియొక ప్రమాణము లేదు. ఈ విధి నిషేధములను మనకు గల సామాన్యజ్ఞానము కూడ సమర్థించవచ్చును. కాని, ఇచటి ప్రముఖవిషయమేమనగా, ఒక కర్మను శ్రుతి నిషేధించినచో, ఆ కర్మను చేయుట వలన పాపము వచ్చునని మనకు అవగతమగును.

మనము నిత్యజీవితములో తెలిసి గాని, తెలియక గాని, అనేకపాపములను చేయుచుందుము. వీటికి పరిహారము చేయుటకై ప్రాయశ్చిత్తకర్మను అనుష్ఠించవలెను. కారణము లేనిదే ఎవ్వరైననూ ప్రాయశ్చిత్త కర్మను చేయరు. వాస్తవములో ప్రాయశ్చిత్తకర్మ ఒక రకంగా నైమిత్తికకర్మయే. ఉదాహరణకు, రుద్రమును వంద సార్లు జపించినచో, బంగారమును అపహరించిన పాపము తొలగునని ( యశ్శతరుద్రీయమధీయేత స్వర్ణస్తేయాత్పూతో భవతి ) చెప్పబడినది. పాపకర్మను నిమిత్తముగా చేసుకొని దానిని పరిహరించుట కొరకై ప్రాయశ్చిత్తకర్మ విధించబడును. ప్రాయశ్చిత్తకర్మ వలన ఏమగును ? పాపఫలము పరిహరించబడును. అదే విధముగా, కేవలము జీవించియుండుటను నిమిత్తముగా చేసుకొని విధించబడిన నిత్యకర్మ ( జీవనాదినిమిత్తం విహితం కర్మ ) కు కూడ ఫలము ఉండితీరును. నిత్యకర్మ వేదవిహితము గనుక, దానికి ఫలము ఉండదని చెప్పుట తగదు. నిత్యకర్మ పూర్వకర్మఫలము కాజాలదు. ప్రాయశ్చిత్తకర్మయైననూ పూర్వమునందు చేయబడిన కర్మయొక్క ఫలము కాదు. ఈ రెండు రకముల కర్మలు శ్రుతిచే సహేతుకముగా విధించబడినవి. కావున, వాటికి ఫలము ఉండవలెను. మానవుడు జీవించియుండుట నిత్యకర్మలను విధించుటలో హేతువు. మానవుడు తన జీవితమును సరియైన మార్గములో నడుపుటకై ఈ కర్మలను చేయుట అవశ్యకమని వేదము చెప్పుచున్నది. కావున, ప్రాయశ్చిత్తకర్మ పూర్వమునందు చేసిన కర్మయొక్క ఫలము కాదు. అదే విధముగా నిత్యకర్మ కూడ పూర్వమునందు చేసిన కర్మయొక్క ఫలము అని చెప్పుట కుదరదు.

ఈ విధముగా పూర్వమీమాంసకుడు ఇబ్బందిలో పడి, మరల తన మొదటి వాదమునకు వచ్చుచున్నాడు. నీటిలో మునిగిపోవుచున్న వాడు గడ్డిపోచను కూడ పట్టుకొనును. ఇపుడీ వాది పరిస్థితి అటులనే యున్నది. ప్రాయశ్చిత్తకర్మను చేయుటలో కూడ కొంత క్లేశము గలదు. ఆ క్లేశము పూర్వపాపఫలము అయి ఉండును. మనము పూర్వములో చేసిన పాపమునకు పరిహారముగా ప్రాయశ్చిత్తకర్మ విధించబడినది. సర్వకర్మలలో కొంత క్లేశము తప్పదు. కావున, ఆ ప్రాయశ్చిత్తకర్మలో కూడ క్లేశము గలదు. ఆ క్లేశము కూడ పాపఫలమే. ఏ పాపము ప్రాయశ్చిత్తకర్మకు నిమిత్తమైనదో, ఆ పాపము దానిని చేయుటలో అనుభవించ బడినది. ఇట్టి స్థితిలో, నిత్యకర్మక్లేశము కూడ నిత్యకర్మకు హేతువు అయిన జీవించియుండుటయొక్క ఫలము అగునని శ్రీశంకరులు వాదించుచున్నారు. అనగా, అది పూర్వజన్మలో చేసిన పాపముల ఫలము కాజాలదు. ఇది ముఖ్యమైన విషయము. నిత్యకర్మకు హేతువు గలదు ; ప్రాయశ్చిత్తకర్మకు కూడ హేతువు గలదు. ఈ విషయములో

రెండింటికి భేదము లేదు. నిత్యకర్మను చేయుటకు జీవించియుండుట హేతువు కాగా, గత ములో పాపమును చేసియుండుట ప్రాయశ్చిత్తకర్మకు హేతువు. అనగా, ఈ రెండు ఒక ప్రత్యేకనిమిత్తమును ఆధారముగా చేసుకొని విధించబడినవే గాని, పూర్వములో చేసిన పాప ముయొక్క ఫలములు కావు.

శ్రీశంకరులు మరియొక విషయమును చెప్పిరి. ప్రాయశ్చిత్తకర్మయే గాక, నిత్య కర్మ మరియు కామ్యకర్మ అనే ఇంకో రెండు రకముల కర్మలు గలవని మనము చూచి యున్నాము. వీటిలో దేనిని చేసినా, క్లేశము గలదు. ఒకే అగ్నిహోత్రకర్మ చేసే వాని సంక ల్పమును బట్టి నిత్యకర్మ కావచ్చును ; లేదా, కామ్యకర్మ కావచ్చును. ఏదైనా, దానిని చేయుటలోని క్లేశము సమానమే. ఇట్టి స్థితిలో నిత్యకర్మను చేయుటలోని క్లేశము మాత్రమే పూర్వములో చేసిన పాపముల ఫలమనియు, కామ్యకర్మలోని క్లేశము పూర్వములోని పాప ముల ఫలము కాదనియు చెప్పుట ఎట్లు పొసగును ? కామ్యకర్మలోని క్లేశము నిత్యకర్మ లోని క్లేశముతో సమానముగా నున్నది గనుక, ఈ రెండు క్లేశములు పూర్వములోని పాప ముల ఫలమేనని చెప్పవలయును. అనగా, కామ్యకర్మ పూర్వములో చేసిన పాపమును క్షయము చేసి చరితార్థమైనది గనుక, దానికి ప్రత్యేకమైన ఫలము ఉండరాదు. అప్పుడు కామ్యకర్మ అనే కర్మయే లేకుండా పోవును. ఇది అంగీకారము కాదు.

నిత్యకర్మకు ఫలము లేదనియు, అది కేవలము పూర్వములో చేసియున్న పాప మును క్షయము చేయుననియు చెప్పుటలో మరియొక దోషము గలదు. మనము నిత్యకర్మ లను వేటినీ చేయలేదనుకొనుడు. అప్పుడు ఏమగును ? ఆ కర్మను చేయుటలోని క్లేశము తప్పిపోయినది. అనగా, పూర్వములో చేసిన పాపములు అటులనే వేచియున్నవని చెప్పవ లయును. కాని, మనము నిత్యకర్మను చేసినచో, పూర్వములో చేసిన పాపము క్షయమగు ను. ఒకవైపున నిత్యకర్మకు ఫలము లేదని చెప్పి, మరో వైపున పూర్వములో చేసిన పాపము క్షయమగుట నిత్యకర్మకు ఫలము అని చెప్పుట స్వవచన వ్యాఘాతము అగుచున్నది.

ఇంతేగాక, మరియొక సమస్య కూడ గలదు. అగ్నిహోత్రము స్వర్గము కొరకు చేసి నచో, కామ్యకర్మ అగును. అదే అగ్నిహోత్రమును అంతఃకరణశుద్ధి కొరకు చేసినచో, నిత్య కర్మ యగును. ఈ రెండు పక్షములలో చేసే కర్మ ఒక్కటియే. అనగా ఆ అగ్నిహోత్రము స్వర్గమును ఇచ్చినా, లేక ఏ ఫలమునైననూ ఈయకపోయినా, దానిని చేయుటలో కలిగే క్లేశము సమానము. దానిని చేసే పద్ధతిలో కొన్ని అధికాంశములను చేర్చుట గాని, ఉన్నవా టిని తీసివేయుట గాని లేదు ; ఏ విధమైన మార్పులు లేవు. అనగా, కామ్యకర్మయగు అగ్నిహోత్రమునకు, నిత్యకర్మయగు అగ్నిహోత్రమునకు, చేసే మనఃప్రవృత్తిని మినహాయిం చి, లేశమైననూ భేదము లేదు. చేయబడే కర్మ ఒకటియే అగుచుండగా, అది ఒక పక్ష ములో ఫలమునిచ్చుననియు, మరియొక పక్షములో దానికి ఫలము లేదనియు చెప్పుట ఎట్లు పొసగును ? మనకు ఫలమునందు ఆసక్తి లేకున్ననూ, వేదవిహితకర్మను చేసినచో, పుణ్యఫలము లభించి తీరును. ఆ పుణ్యమునందు ఆసక్తి లేనివానికి ఆ కర్మ అంతఃకరణశు ద్ధిని ఇచ్చును. కాని, అదే సమయములో, అతనికి పుణ్యమునందు ఆసక్తి లేకున్ననూ, ఆ పుణ్యము అతని ఖాతాలో జమయగుచుండును. ఒకప్పుడు పిల్లల పేర పెద్దలు ధనమును

దాచుచుందురు. పిల్లవానికి దానిపై ఆశ లేకున్ననూ, ఆ ధనము పెరుగుచుండును. మనకు అభీష్టము కాని విషయములు జరుగవనే నియమము ఏదీ లేదు. ఇదీ అంతే. కర్మ ఫలము నిచ్చును. వైదికకర్మ పుణ్యమునిచ్చును.

ఇచటి ప్రముఖవిషయమేమనగా, కర్మ వలన మోక్షము లేదు. కామ్యకర్మలను మరియు ప్రతిషిద్ధకర్మలను దూరముగానుంచి నిత్యకర్మలను చేస్తూ ఉంటే, ప్రారబ్ధకర్మ క్షయము కాగానే మోక్షము వచ్చును అనే యోజన సరి గాదు.

కర్మయోగమనగా ఒకానొక కర్మను చేయుట కాదు. మనస్సులో నిర్మాణమయ్యే ఒకానొక విశిష్టమగు ప్రవృత్తికి కర్మయోగమని పేరు. ఫలము కొరకై చేసే కర్మకు, యోగ బుద్ధితో చేసే కర్మయోగమునకు గల భేదము ఈ మనఃప్రవృత్తి మాత్రమే. కర్మను చేయు వ్యక్తి మోక్షమును కోరువాడు ( ముముక్షువు ) అయినచో, ఆతనికి ధర్మార్థకామముల యందు అభిరుచి ఉండదు. కావున, ఆతడు కర్మను ఫలాకాంక్షతో చేయడు. ఆతడు జ్ఞానో దయమునకు అనుకూలముగా మనస్సును తీర్చిదిద్దుటకై కర్మను చేయును. అగ్నిహోత్ర మును నిత్యకర్మరూపములో అనుష్ఠించుటయందు కొంత క్లేశము గలదు. కాని, ఆ క్లేశము పూర్వములో చేసిన పాపకర్మయొక్క ఫలమని పూర్వమీమాంసకుని వాదము. కాని, అదే అగ్నిహోత్రమును కామ్యకర్మరూపములో చేసినచో నేమగును ? ఆ కర్మలోని అంగములు, మంత్రములు, ఆహుతులు మొదలైనవి సమానమే. ఆ క్లేశము నిత్య-అగ్నిహోత్రములో పూర్వమునందలి పాపముల ఫలమైనచో, అనుష్ఠానము సర్వసమానము గనుక, కామ్య-అ గ్నిహోత్రములో కూడ అటులనే గావలెను. అట్లైనచో, ఆ కామ్యాగ్నిహోత్రము స్వర్గమును ఏ విధముగా నిచ్చును ? కామ్య-అగ్నిహోత్రమునందలి క్లేశమునకు, నిత్య-అగ్నిహోత్రము నందలి క్లేశమునకు భేదము లేనిదే, ఒకే రకమైన క్లేశము ఒక కర్మలో పాపమును పోగొట్టు ననియు, మరియొక కర్మలో స్వర్గము నిచ్చుననియు చెప్పుట అసంగతము. కావున, కామ్యకర్మకు కూడ పాపక్షయము తప్ప మరియొక ఫలము లేదని చెప్పవలయును. కాని, ఈ వాది కామ్యకర్మకు ఫలమున్నదని స్వీకరించును. కామ్యకర్మ ఫలమునిచ్చును గనుక, దానిని చేయకుండుట కూడ ఈ వాదియొక్క యోజనలో ఒక భాగమే గదా !

దీనిపై పూర్వమీమాంసకుడు ఇట్లు చెప్పుచున్నాడు : ఇది సరిగాదు. శ్రుతి నిత్యక ర్మకు ఫలమును చెప్పుటలేదు. కాని శ్రుతి కామ్యకర్మకు ఫలమును నిర్దేశించుచున్నది. కావున, కామ్యకర్మకు ఫలము ఉండును. దీనిని శ్రీశంకరులు త్రోసిపుచ్చినారు. అగ్నిహో త్రాది కామ్యకర్మకు స్వర్గాది ఫలము ఉన్నదని చెప్పినచో, కామ్యాగ్నిహోత్రమునకు పాపక్ష యము కంటె భిన్నముగా స్వర్గము అనే అధికఫలము కలుగుచున్నది. అనగా, కామ్యాగ్ని హోత్రమునకు, నిత్యాగ్నిహోత్రమునకు అనుష్ఠానములో కలిగే క్లేశములో ఏదో కొంత భేదము ఉండవలెను. కాని, భేదము ఏమీ కానవచ్చుట లేదు. ఒక వ్యక్తి ఒకే కర్మను ఒకే విధముగా చేయుచున్నాడు. అనుష్ఠానములో భేదము లేకుండగా, ఒక కర్మ ఫలమునిచ్చున నియు, మరియొక కర్మను ఆ ఫలమును ఈయదనియు చెప్పుట ఎట్లు సంగతమగును ? ఒక కర్మను ఒక విశిష్టమనఃప్రవృత్తితో చేసినంత మాత్రాన అది ఫలమునీయక పోవుట యుక్తియుక్తము గాదు. కాయక్లేశము దృష్టఫలము. రెండు పక్షములలో అది సమానముగా మున్నది. అదియే ఫలమైనచో, ఆ ఫలము రెండింటికీ సమానముగా ఉండవలెను. కాని,

కామ్యకర్మ మైననూ నిత్యకర్మ ఈయని స్వర్గము అనే అధికఫలమును ఇచ్చునని యెట్లు చెప్పగలము ?

ఈ వాదములో మరియొక సమస్య గలదు. మనము చేసే కర్మలలో అనేకములు లౌకికకర్మలు ; అనగా, అవి శాస్త్రముచే విధింపబడినవి గాని, నిషేధింపబడినవి గాని కావు. ఉదాహరణకు, వ్యాయామము శాస్త్రవిహితకర్మ కాదు. వ్యాయామము శాస్త్రనిషిద్ధము కూడ కాదు. శాస్త్రము ప్రాతస్సాయంసంధ్యలయందు మరియు మిట్ట మధ్యాహ్నము అధికారి సంధ్యావందనమును చేయవలెనని విధించుచున్నది ( అహరహస్సంధ్యాముపాసీత ). కాని వ్యాయామము అట్టిది కాదు. ఈ విధముగా శాస్త్రవిహితములు కానివి, నిషిద్ధములు కానివి అగు అనేకకర్మలను మనము చేయుచుందుము. వాటికి ఫలమేమి ? ఈ కర్మలకు వెనువెంటనే అనుభవమునకు వచ్చే దృష్టఫలము ఉండును. వ్యాయామమును చేసినప్పుడు చెమట పట్టుట, నీరసము వచ్చుట మొదలగు కంటికి కానవచ్చే ఫలము కలుగును. వ్యాయామమును శాస్త్రము విధించుట లేదు ; నిషేధించుట లేదు. కావున, దాని వలన పుణ్యము గాని, పాపము గాని కలుగదు. దీనిని బట్టి శాస్త్రము విధించిన, మరియు నిషేధించిన కర్మలకు అదృష్టఫలము గలదని మనకు తెలియుచున్నది. ఆ అంశములో మాత్రమే మనకు శాస్త్రము ప్రమాణమగుచున్నది. శాస్త్రము అదృష్టఫలముల విషయములో ప్రమాణమగునే గాని, దృష్టఫలముల విషయములో కాదు. మాంసమును భక్షించరాదు ( *న కలంజం భక్షయేత్* ) అని శాస్త్రము చెప్పుచున్నది. శాస్త్రతాత్పర్యము ఆరోగ్య పరిరక్షణము కాదు. శాస్త్రము మన సామాన్యవిజ్ఞానమునకు, మనకు సహజముగా తెలుస్తూ ఉండే జీవనమూల్యములకు అనురూపముగా నున్ననూ, శాస్త్రప్రయోజనము లౌకికఫలము కాదు. మాంసభక్షణమును నిషేధించుటలో శాస్త్రతాత్పర్యమేమనగా, దాని వలన పాపము కలిగి భవిష్యత్తులో దుఃఖమునకు హేతువు అగును. నిషిద్ధకర్మ పాపము అనే అదృష్టఫలమును, విహితకర్మ పుణ్యము అనే అదృష్టఫలమును ఇచ్చును. కాని ఈ పుణ్యపాపములు కంటికి కానరావు. కావుననే, వాటికి అదృష్టము అని పేరు వచ్చినది. అవి జీవుని ఖాతాలో జమ యగుచుండును. ఈ విషయము మనకు ఎట్లు తెలిసినది ? శాస్త్రము చెప్పుట వలన. ఈ విషయమును తెలియుటకు మరియొక ఉపాయము లేదు. కంటికి కనబడే ఫలమును గురించి శాస్త్రము పట్టించుకొనదు. దృష్టఫలము శాస్త్రముయొక్క పరిధిలోకి రాదు. కావున, కామ్యకర్మను మరియు నిత్యకర్మను అనుష్ఠించుటలో కలిగే క్లేశము మాత్రమే వాటి ఫలమైనచో, శాస్త్రము వాటిని విధించుటకు కారణమేమి ? వెంటనే లభించే ఫలమును గురించి శాస్త్రము మనకు చెప్పనక్కరలేదు. పైగా, క్లేశమును ఇచ్చే కర్మను చేయుమని మనకు శాస్త్రము చెప్పనేల ? వాస్తవములో విహితకర్మను చేసినచో, మనకు గల క్లేశము తొలగిపోవును. మనకు అగ్నిహోత్రకర్మ గురించి ఏమీ తెలియదు. వేదమును చదువగా, అది తప్పక చేయదగిన నిత్యకర్మ యని తెలిసినది. దానిని మనము చేయుటకు కారణమేమి ? ఫలము వచ్చుననే ఆశతో మానవుడు కర్మను చేయును. కాని, ఏమి వచ్చినది ? దుఃఖము కలిగినది. ఇట్టి కర్మను ఎవరు చేయుదురు ? శాస్త్రము ఇట్టి కర్మను ఏల విధించుచున్నది ? దృష్టఫలమును గురించి శాస్త్రము చెప్పేది ఏమీ లేదు. శాస్త్రము దృష్టఫలములను వర్ణించే పక్షములో, స్వర్గాది అదృష్టఫలమును ఇచ్చే కర్మలను విధించే ప్రయా

సను శాస్త్రము చేయకుందును. కర్మలు కేవలము దృష్టఫలములను మాత్రమే ఇచ్చే పక్ష ములో, శాస్త్రము స్వర్గాది అదృష్టఫలములను గురించి వర్ణించనేల ? అదృష్టఫలములు ఈ జన్మలో గాని, మరుజన్మలో గాని పరిపక్వమగును. కావున, కర్మను విధించుట లో, శాస్త్రముయొక్క తాత్పర్యము అదృష్టఫలము మాత్రమే.

నిత్యకర్మ గాని, కామ్యకర్మ గాని స్వరూపములో భేదము లేదు. కామ్యకర్మకు ఫలము గలదని పూర్వమీమాంసకులు అంగీకరించెదరు. కామ్యకర్మయగు అగ్నిహోత్రము నందు అధికమగు అంగములు ఉన్నచో, ఈ ఆధిక్యము వలన అది అధికఫలమునిచ్చునని చెప్పవచ్చును. కాని, అగ్నిహోత్రముయొక్క స్వరూపములో మార్పు ఏదీ లేదు. దానికి అధికముగా ఏదీ జతగూడలేదు. అగ్నిహోత్రము కామ్యమైనా, నిత్యమైనా, దానిని చేసే విధానము ( ఇతికర్తవ్యతా ) సమానమే. కావున, కామ్య-అగ్నిహోత్రమునకు స్వర్గము అనే ప్రత్యేకఫలమును ఇచ్చే సామర్థ్యము, దానిని చేసే కర్తకు అట్టి కామన ఉండుట వలన మాత్రమే కలుగుచున్నదని చెప్పవలెను. ఆ కర్మను చేయు కర్తకు స్వర్గమునందు కామన ఉండుట వలన అది స్వర్గమునిచ్చునని చెప్పవలెను. ఇది ఎంతయు అసంగతముగా నున్న ది. కారును ఒకడు కేవలము నడుపుట కొరకు మాత్రమే నడుపుచున్నచో, ఆతడు దాని వలన ముందుకు పోడు అని చెప్పినట్లు ఉన్నది. అది సత్యమా ? ఒకడు ఒక కర్మను తన కొరకు చేయగా, మరియొకడు దానిని సమాజము కొరకు చేసినాడనుకొనుడు. వాటి ఫల ములు భిన్నముగా నుండునా ? వారిద్దరు ఒకే కర్మను చేసినారు గనుక, ఒకే ఫలమును పొందెదరు. ఒకడు తాను శుభ్రమగు పరిసరములలో నుండుట కొరకై బస్తీలోని చెత్తను తీసి వేసి శుభ్రము చేసినాడనుకొనుడు. మరియొకడు ఆ బస్తీలోని జనుల సంతోషము కొరకై అదే పనిని చేసినాడనుకొనుడు. ఈ రెండు సందర్భములలో ఫలము సమానము. ఆ బస్తీ శుభ్రపడును. వారిలో ఒకడు తన స్వార్థము కొరకు చేయలేదు గనుక, ఆ కర్మకు అధికఫ లము ఉండునా ? దాని వలన ప్రక్కనున్న బస్తీ కూడా శుభ్రపడునా ? అట్లు జరుగదు. ఆతడు ఏ బస్తీని శుభ్రపరచినాడో, అది మాత్రమే శుభ్రముగా నుండును. భావనలో భేదము ఉన్నా, ఫలము సమానముగా నుండును. ఒకడు గిన్నెస్ పుస్తకములో తన పేరు నమోదు అగుటకై పరుగెత్తగా, మరియొకడు వికలాంగుల పునరావాసము కొరకై పరుగెత్తినాడనుకొ నుడు. ఆ పరుగుల ఫలము, అనగా కొంత దూరమునతిక్రమించుట అనే ఫలము సమాన ము. ఆ పరుగుల వెనుక నున్న భావన వేరైనా, వాటి ఫలము సమానము.

కామ్య-అగ్నిహోత్రము నిత్య-అగ్నిహోత్రము వలెనే చేయబడును. మార్పులు, చేర్పులు ఏమీ లేవు. కావున, ఈ రెండు రకముల కర్మలకు ఫలము సమానముగా నుండ వలెను. కామ్యకర్మకు ప్రత్యేకఫలము ఉండరాదు. కావున, నిత్యకర్మకు ఫలము లేదని యు, కామ్యకర్మ స్వర్గమునిచ్చుననియు చెప్పుట ఎట్లు పొసగును ? ఇది ఊహకైననూ అందని విషయము. నిత్యకర్మ కూడ వేదవిహితమైనదే గనుక, దానిని అనుష్ఠించినచో, పుణ్యము అనే అదృష్టఫలము ఉండి తీరును. కావున, నిత్యకర్మను చేసినచో ఫలము లేద నియు, చేయనిచో ప్రత్యవాయదోషము గలదనియు ( అకరణే ప్రత్యవాయదోషః ) చెప్పే మౌలిక వాదము అసంగతము.

నిత్యకర్మకు పుణ్యము ఉన్నదని చెప్పినచో, మీమాంసకుడు మరియొక చిక్కులో పడును. ఆ పుణ్యమును అనుభవించుటకై మరియొక జన్మ ఆవశ్యకమగును. మరియు, నిత్యకర్మ పూర్వజన్మల నుండి వచ్చుచున్న మరియు ఈ జన్మలో చేసిన దురితమును అంతను నిర్మూలించిననూ, ఇంకనూ ఫలమునిచ్చుట ఆరంభము కాని పుణ్యకర్మ అటులనే మిగిలియున్నది. మరియు, కేవలము నిత్యకర్మను చేయుట వలన సమస్తదురితములు పూర్ణముగా నిర్మూలించబడునని ఖచ్చితముగా చెప్పజాలము. వాటిలో కొన్ని పూర్తిగా తొలగి, మరికొన్ని కొంత భాగమే మాత్రమే నశించి, ఇంకో కొన్ని అటులనే మిగిలియుండవచ్చును. ఉదాహరణకు దోమను చంపిన పాపము రెండు హోమములను చేసినచో నశించవచ్చును. కాని, మనిషిని హత్య చేసిన పాపము ఉన్నచో, అది అంత తేలికగా నశించదు. మానవుడు జీవనయాత్రలో నిత్యము అనేకపాపములను చేయుచుండును. వాటినుండి తప్పించుకొనుట శక్యము కాదు. కావున, వాటికొరకై ప్రాయశ్చిత్తమును చేయవలెను. నిత్యకర్మల ప్రయోజనము అదియే. నిత్యకర్మ వలన పుణ్యము నిశ్చితముగా కలుగును. ఆ పుణ్యము పాపమును నశింపజేయవచ్చును. నిత్యకర్మ ఫలమును ఉత్పన్నము చేయకుండగా, పాపమునైననూ నిర్మూలించలేదు. ఒక అదృష్టమును ప్రభావహీనము చేయుటకై మనము మరియొక అదృష్టమును ఉత్పన్నము చేయవలెను. ఆ రెండు ఒకే శ్రేణిలోని సత్యత్వమునకు చెంది యుండవలెను. అదృష్టపుణ్యము మాత్రమే అదృష్టపాపమును పోగొట్టగలదు. మరియు, ఆ అదృష్టము ప్రారబ్ధపాపకర్మను నశింపజేయునే గాని, అనారబ్ధకర్మఫలమును స్పృశించజాలదు.

ఇప్పుడు శ్రీశంకరులు ఆరంభములో చెప్పిన సిద్ధాంతమును మరల ఉటంకించుచున్నారు. కర్మకు ఆధారము అజ్ఞానము. కావున, జ్ఞానము మాత్రమే కర్మను నశింపజేయగలదు. కర్మలన్నింటికీ ఫలము గలదు. చేసే సాధనమును బట్టి కర్మ కాయిక-వాచిక-మానసికములనే మూడు రకములుగానున్నదని మనము చూచియున్నాము. ఈ మూడు రకముల కర్మలలో మనస్సునకు పాత్ర గలదు. భగవాముని కీర్తించునపుడు వాగింద్రియము మరియు మనస్సు అనే రెండు దానిలో భాగమగుచున్నవి. కాని ధ్యానము కేవలము మానసికము మాత్రమే. కర్మను ఈ మూడు రకములుగా విభజించుట వలన మానవాళి యొక్క సర్వవిధముల ప్రార్థనలు దానిలో అంతర్గతమగును. ప్రార్థన వైదికమైనా, లేక ఇతరమైనా దానికి ఫలము ఉండును. ఈ రకమైన కర్మలను చేయునది ఎవరు ? ప్రతి కర్మ వెనుక, ' నేను చేయుచున్నాను ' అని చెప్పే కర్త ఉండును. గీత మరియు ఉపనిషత్తుల దర్శనములో నీవు కర్తవు గావు. నీవు సచ్చిదానంద-ఆత్మవు ; నీవు కర్మలను వేటినీ చేయుట లేదు. సర్వకర్మలు నీ సన్నిధిలో జరుగుచున్నవి. జ్ఞానేంద్రియములు తమకు గోచరమయ్యే ఆయా విషయములయందు ప్రవర్తిల్లుచున్నవి ; ఆత్మ క్రియలను వేటినీ చేయుట లేదు ( *ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంతే, అహం న కించిత్ కర్మ కరోమి* ). కావున, అవిద్య ఉండుట వలననే మానవుడు ' నేను కర్తను ' అనే నిష్కర్షకు వచ్చుచున్నాడు. పుణ్యమునిచ్చే శుభకర్మ అయినా, పాపమునిచ్చే అశుభకర్మ అయినా, కర్తృత్వధారణతో కూడిన కర్మ అవిద్యనుండి మాత్రమే పుట్టుచున్నది. ఈ రెండింటికీ అజ్ఞానము

మూలములో నున్నది. కావున, అవి జ్ఞానముచే మాత్రమే వినష్టమగును. జ్ఞానము కర్త యొక్క ఖాతాలో నున్న కర్మను అంతనూ నశింపజేయును.

కర్త అజ్ఞానముచే తన ఖాతాలో చాల కర్మను ప్రోగుచేయును. ఈ ఖాతాలో ఒకటి ఫిక్సెడ్ డిపోజిట్. దానికే సంచితకర్మ యని పేరు. కర్త కొత్త కర్మలను చేయుచుండును. అవి ఆగామి కర్మలు అనబడును. ఇవి గాక, ప్రారబ్ధకర్మ ఉండనే ఉన్నది. ఈ మూడు రకముల కర్మలు కర్త ఉన్నంతవరకు ఆతని ఖాతాలో జమ యగుచుండును. వాటిని నశింపజేయుట ఎట్లు ? నిత్యకర్మను గాని, ఇంకో కర్మను గాని చేయుట వలన ఈ కర్మాశయము పెరుగుచునే యుండును. కాని, నిత్యకర్మలను సముచితమగు మనఃప్రవృత్తితో అంతఃకరణశుద్ధి కొరకై యోగభావనతో చేసినచో ' నేను అకర్తను ' అనే సత్యము తెలిసే అవకాశము గలదు. ఆ జ్ఞానముచే అంతవరకు ఖాతాలో జమ అయి ఉన్న కొత్త-పాత కర్మలు అన్నీ వినష్టమగును.

జ్ఞానము ( విద్యా ) ఒకే ఒక అఘాతముతో కర్మలను నశింపజేయును. ఒకే ఒక అఘాతము అనుటకు కారణమేమి ? మూలస్తంభమును పగులగొట్టినచో, దానిపై నిలబడియున్న సర్వము కుప్పగూలును. స్వప్నమును చూచుచుండగా తెలివి వచ్చినదనుకొనుడు. స్వప్నములో స్వప్నద్రష్ట చేసిన మంచి-చెడు కర్మలు అన్నియు రద్దు అగును. ఆతడు స్వప్నములో ఒకనికి అప్పును ఇచ్చియుండవచ్చును. కాని, తెలివి వచ్చిన తరువాత, ఆతడు ఆ అప్పును తీర్చమని ఆ వ్యక్తి వెంట పడుటకు వీలు లేదు. ఈతడు అట్లు వెంట పడినచో, ఆ వ్యక్తి ' నేను మరల నిన్ను స్వప్నములో కలిసి అప్పును తీర్చెదను ' అని చెప్పుటలో తప్పు లేదు. ఆ విధముగా వెంట పడుట అర్థరహితము. అదే విధముగా, ఆత్మ అకర్త అనే సత్యమును దర్శించిన జ్ఞానియొక్క ఖాతాలో కర్మలు మిగిలి యుండవు. దీనికే మోక్షమని పేరు. అవిద్యయే మనకు ప్రధానమగు శత్రువు. ఆ శత్రువును జయించుటకై మనము జ్ఞానమును ప్రవేశపెట్టవలెను.

కొన్ని మంచి కర్మలు కొన్ని చెడు కర్మల ప్రభావమును పోగొట్టే అవకాశము గలదు. కాని, కర్మలను నిశ్శేషముగా ( అశేషతః ) నిర్మూలించుటకై సర్వకర్మలకు హేతువు అగు కర్తృత్వధారణను నిర్మూలించవలెను. ' నేను కర్తను ' అనే ధారణ తనంత తానుగా నిష్క్రమించదు. ' అహంకారమును సమర్పించుడు ; కలియుగములో శరణాగతి తేలిక ' అని కొందరు చెప్పెదరు. కాని వాస్తవము దీనికి విరుద్ధముగా నున్నది. ఏ యుగములోనైనా సమర్పణము చాల కఠినము. ఎందువలన ? ఈ సమర్పణము చాల పసందైన విషయము. మనము ఎవరికి సమర్పించ వలెను ? రాజును శరణు పొందవలెనని చెప్పినచో, అది రాజునకు నాకు మధ్యలో ఒక ఒప్పందము అగును. నేను ఆయనను శరణు జొచ్చెదను ; ఆయన నాకు రక్షణనిచ్చును. భగవానుని విషయములో కూడ నింతే. ఆ శరణాగతి ఏ రూపములోనుండును ? అది కేవలము ఒక ఒప్పందము మాత్రమే. దానిలో సమర్పణ లేదు. నేను నీకు నమస్కారములను చేస్తూ ఉంటాను ; నీవు నాకు వీటిని అన్నింటినీ ఇస్తూ ఉండు. ఇది కాంట్రాక్టు అగునే గాని, సమర్పణమెట్లగును ? శరణాగతి, లేక సమర్పణము అంత తేలిక కాదు. సమర్పించవలసినది ఎవరు ? అహంకారుడు. వాడు దేనిని సమర్పించవలెను ? తనను మాత్రమే. ఇతరమును సమర్పించే ప్రసక్తి లేదు. ఏలయన, ఇతరము

సర్వము భగవానునిదే. అహంకారముయొక్క దేహము కూడ సృష్టిలో భాగమే గనుక, భగవానునిదే అగును. కావుననే, ఆత్మహత్య చట్టసమ్మతము కాదు. పుత్రుని దేహముపై తండ్రికి, తల్లికి, రాజ్యమునేలే ప్రభువునకు, మరియు సూక్ష్మక్రిములకు అధికారము గల దు. దేహము లోపలనున్న సూక్ష్మక్రిములు ' ఇది మా యిల్లు ' అని తమ ఆధిపత్యమును చాటుచున్నవి. ఈ దేహముపై నీకు ఏమి అధికారము గలదు ? నీకు చెందినది ఏదీ లేదు. కావున, నీవు సమర్పించగలిగినది ఏదీ లేదు. నీ వద్ద నీ గురించి నీకు గల ధారణ ( అహంకారము ) మాత్రమే గలదు. దానిని మాత్రమే నీవు సమర్పించవచ్చును. అహంకార మును ఎట్లు సమర్పింపవలెను ? ఇతరమును సర్వమును సమర్పించేది అహంకారమే. అట్టి అహంకారము తనను తాను ఎట్లు సమర్పించగలదు ? ' నేను ' అనే ధారణ ( అహంకా రము ) ను సమర్పించుటకై మరియొక ' నేను ' ఉండవలెను. కాని, మన వద్ద ఒక అహంకారము మాత్రమే గలదు. ఈ అహంకారము ' ఇది ' అయినచో, దానిని సమర్పిం చుట సంభవమగును. దానిని బయటకు తీసి సమర్పించవచ్చును. కాని బయటకు తీయవ లసినది ఎవరు ? నేనే. కావున, నేను దేనినైననూ ఎవ్వరికైననూ సమర్పించ లేను. కావు ననే, మనము ప్రతినిత్యము, ' నా దేహము, నా సంపద, ఈ సర్వము నీకు మాత్రమే చెందును ( *తన మన ధన సబ కుఛ తేరా హై జయ జగదీశ హరే* ) ' అని పాడి సమ ర్పించుచుందుము. భక్తుడు నిన్న అదే పాటను పాడి సర్వమును సమర్పించినాడు. మరల ఈ రోజు అదే పనిని చేయుచున్నాడు ! ఒకే పదార్థమును పదే పదే సమర్పించుట ఎట్లు యుక్తియుక్తమగును ? ఒక వ్యాపారికి వ్యాపారములో ఇబ్బంది వచ్చి ఒక మిత్రుని వద్దకు వెళ్లి 10,000 రూపాయలు అప్పు అడిగెను. ఆ మిత్రుడు వెంటనే ఆ ధనమును కవరులో పెట్టి ఇచ్చెను. ఆ వ్యాపారి ఆనందముతో ఆ కవరును తీసుకొని వెళ్లబోవుచుండగా, ఆ మిత్రుడు ' దయచేసి ఆ కవరును అక్కడ పెట్టి వెళ్లుడు ' అని చెప్పెను. ఆ వ్యాపారి ఆశ్చర్యపడి ' ఏమిటి ?' అని అడుగగా, ' నేనీ ధనమును మీకు రేపు ఇచ్చెదను ' అని ఆ మిత్రుడు చెప్పెను. అపుడు డబ్బునకు ఇబ్బంది పడుచున్న ఆ వ్యాపారి ' సరే, చేసేది ఏమి గలదు ? రేపు వచ్చి ధనమును తీసుకొనెదను ' అని భావించి, ఆ నాటికి నిష్క్రమించి, మరునాడు వచ్చెను. ఆ మిత్రుడు మరల అటులనే చేసెను. అపుడాతడు ' అయ్యా ! మీరీ తీరున ప్రవర్తించుటకు కారణమేమి ? ' అని అడుగగా, ' నేను మీకు ప్రతి దినము 10,000 రూపాయలను ఈయవలెనని సంకల్పించినాను ' అని ఆ మిత్రుడు చెప్పెను. దీని యర్థమేమి ? ఇది దెబ్బ కొట్టి ఆ పైన అవమానించినట్లున్నది. ఒకే వస్తు వును మరల మరల సమర్పించుట తగదు. కాని, మనము ప్రతిదినము భగవానుని విషయ ములో ఇటులనే చేయుచున్నాము. ఆయన భగవానుడు గనుక, మనలను ఇచట బ్రతుకని చ్చుచున్నాడు. ఈ రకమైన ప్రార్థనను విడిచి పెట్టుడని నేను బోధించుట లేదు. ప్రార్థన మంచిదే. దానికి మంచి ఫలము ఉండును. కాని ఇది యథార్థమైన సమర్పణ కాదు. ఒకే ఒక సమర్పణ గలదు. అదియే అహంకారమును త్రోసిపుచ్చుట. అహంకారమును త్రోసి పుచ్చే ఉపాయము ఒకే ఒకటి గలదు. అదియే విచారము. అహంకారము మిథ్య గనుక, విచారము ముందు నిలబడ లేదు ( *విచారం న సహతే* ). కావున, కర్త తొలగి పోయే ఉపా యము ఒకే ఒకటి గలదు. అది కర్తృస్వరూపమును విచారము చేసి తెలుసుకొనుటయే.

కాని ఇచట ఒక సమస్య గలదు. నేను అహంకారమును గురించి విచారమును ఎట్లు చేయవలెను ? నేను ఎవరు ? నేను ఎవరు ? నేను ఎవరు ? అని ప్రశ్నించుకుంటూ కూర్చుంటే, నాకు ఏమి సమాధానము లభించును ? నేను ప్రశ్నించేది నన్నే గనుక, నా గురించి నాకు గల ధారణలపై ఆ సమాధానము ఆధారపడి యుండును. నేను మూర్ఖుడ నని నాకు ధారణ ఉన్నచో, వచ్చే సమాధానము అదియే యగును. ' నేను ఎవరు ? ' అనే ప్రశ్నను వేసుకున్నచో, నాకు నా గురించి అప్పటి వరకు తెలిసిన దాని కంటె అధిక మగు సమాధానమును నేను పొందుట ఎట్లు సంభవమగును ? నా గురించి నాకు తెలిసి నది ఏమన్నా ఉంటే, అది నా మనఃస్థితి మాత్రమే. నాకు తెలిసినది అంతే. దాని వలన సమస్య పరిష్కారము కాదు. దాని వలన కొంత ఉపయోగము లేకపోలేదు. కాని, దాని వలన సమస్య మౌలికముగా పరిష్కారము కాదు. జ్ఞానసాధనము ( ప్రమాణము ) లేకుండ గా, ఈ ప్రశ్నకు సమాధానము లేదు. మనము విచారము చేసే వేదాంతశాస్త్రమునకు విష యవస్తువు ఏది ? ఆత్మ మాత్రమే. అగ్నిహోత్రాది కర్మలు కూడ విశ్లేషించబడిననూ, వాటి పర్యవసానము ఎక్కడ ? కర్మలను చేయు కర్త యందు మాత్రమే. అనగా, మరల విషయము నా వరకు వచ్చినది. మనమిచట విచారించేది ఈ ఆత్మను గురించియే. నేను కర్మఫలములను అనుభవించువాడను, నేను కర్తను అనే ధారణలు పలు విధములుగా విశ్లే షించబడును. శాస్త్రవిచారమును చేయనిదే, ఆ కర్తృత్వము మరియు దానిపై కేంద్రితమై యున్న సర్వము తొలగిపోదు. కావున, శాస్త్రము నా స్వరూపమును నాకు చూపెట్టే అద్దము వంటిది అగుచున్నది. ఈ అంశములో అహంకారము చేసే పని ఏదీ లేదు. పైగా, అది అదృశ్యమగును. ' నేను ( అహమ్ ) ' అను విషయములో బుద్ధియందు తప్పు అభి ప్రాయము ( వృత్తి ) గలదు. ఆ తప్పు వృత్తిని నశింపజేసే వృత్తిని శాస్త్రము ఉత్పన్నము చేసి, నేను బ్రహ్మను ( అహం బ్రహ్మాస్మి ) అనే సత్యమును ప్రదర్శించును. అహంకార మును నశింపజేసే వృత్తి ఇదియే. తద్వారా ఈ వృత్తి కర్మనివారణకు దారి తీయునే గాని, నిత్యకర్మానుష్ఠానమునకు సహకరించదు. నిత్యకర్మ వలన అంతఃకరణశుద్ధి కలుగును. నిత్యకర్మ వలన లోపల, బయట జ్ఞానోదయమునకు అనురూపమగు వాతావరణము నిర్మా ణమగును. యోగ్యమగు మనఃప్రవృత్తిని నిత్యకర్మానుష్ఠానము నిర్మాణము చేయును. అట్టి మనశ్శుద్ధి జ్ఞానసాధనలో చేయూతనిచ్చును. మనము కోరేది కూడా అంతే. అపై విచా రము చేయగా, జ్ఞానము ఉదయించును. ఇది మాత్రమే కర్మనివృత్తికి ఏకైకమార్గము.

వైదికకర్మలైనా, లౌకికకర్మలైనా, సర్వకర్మలకు మూలము కామన మరియు అజ్ఞా నము మాత్రమే. కర్మలో ముందుగా కర్త ఉండును. ' నేను కర్తను ' అనే ధారణ లేనిదే, కర్మ ఉత్పన్నమయ్యే ప్రసక్తి లేదు. ' నేను కర్తను ' అనే ధారణ లేని సందర్భములో కర్మాభాసమే గాని ( కర్మ ఉన్నట్లు కనవట్టుట ) కర్మ లేదని చెప్పవచ్చును. కాని ఇచటి ప్రసంగము అది కాదు. తాను కర్తననే ధారణ లేనివారై జ్ఞాని కర్మలను ఆచరించును. ఆ కర్మలు బాధితములగును. ఆ విధమైన కర్మకు అదృష్టఫలమునిచ్చే సామర్థ్యము ఉండ దు. ఆ కర్మ వేయించిన గింజ వంటిది. వేయించిన గింజనుండి మొలక రాదు. జ్ఞాని యొక్క ఆ ప్రవృత్తి జ్ఞానమే గాని, కేవలమానసికప్రవృత్తి కాదు. మనము జ్ఞానియొక్క ఆ విధమైన కర్మను గురించి ఇప్పుడు చర్చించుట లేదు. ' ఈశ్వరుని అనుగ్రహముచే నేవీ

కర్మను చేయుచున్నాను ' అని భావించే మనఃప్రవృత్తి ఉన్నచో, అట్టి వాడు భక్తుడగును. అట్టి మనఃప్రవృత్తి వలన మనకు అంతఃకరణశుద్ధి లభించును. భక్తుడు కర్మఫలమును ఈశ్వరప్రసాదముగా భావించి స్వీకరించ గల్గును. కాని, అది కూడా కేవలము ఒక విశిష్ఠ మనఃప్రవృత్తి మాత్రమే. ఆత్మ అకర్త అనియు, ఆత్మయొక్క స్వరూపము నైష్కర్మ్యమనియు ఆతనికి తెలియదు. ఆ జ్ఞానము లేని వ్యక్తిలో ఉన్నది యేమి ? అజ్ఞానము. ' నేను కర్తను ' అని మనము భావించినచో, అదియే అజ్ఞానము. ఆ ధారణ గల వ్యక్తి పరిచ్ఛిన్నమగు వ్యక్తి యగును. ఆత్మ అకర్త యని తెలియుటకు ఆత్మ బ్రహ్మయని తెలియవలెను. ఆత్మ బ్రహ్మ అనే జ్ఞానములో అపూర్ణతకు తావు లేదు. పూర్ణునియందు కామన ఉండదు. అజ్ఞానము ఉన్నచో; కర్తృత్వము ఉండును. అప్పుడు చిన్న చిన్న ఫలములను కోరే స్వభావము తప్పదు. కావున, అజ్ఞానము మరియు కామన కలిసి సర్వకర్మలకు కారణమగుచున్నవి.

హరిః ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు

గీతాశాస్త్రము కర్మాధికారమును విశ్లేషించి అజ్ఞాని మాత్రమే కర్మకు అధికారి యని నిరూపించియున్నది. కామనాప్రయుక్తములైన కర్మలను చేసే కర్తకు మూలములో అజ్ఞానము ఉండి తీరును. కాని, జ్ఞానికి సర్వకర్మసన్న్యాసపూర్వకమగు జ్ఞాననిష్ఠయందు మాత్రమే అధికారము గలదు. ఈ విషయమును గీత పలు మార్లు చెప్పియున్నదను విషయమును చూపుటకై శ్రీశంకరులు అనేకశ్లోకములను ఉదహరించిరి. కర్మయోగము కూడ సాధనమే గనుక, అజ్ఞాని కొరకు మాత్రమే ఉద్దేశించబడినది. యోగ్యమగు మనఃప్రవృత్తితో యోగరూపముగా ఆచరించే కర్మలు అయినా, కామనచే ప్రేరితుడై చేసే కర్మలు అయినా, సర్వకర్మలకు కేంద్రము అజ్ఞానము మాత్రమే. దీనికి భిన్నముగా, ఆత్మ-అజ్ఞానము లేని జ్ఞాని సర్వకామనావినిర్ముక్తమగు జ్ఞాననిష్ఠకు అంకితుడై యుండును. భాష్యములో జ్ఞాననిష్ఠకు ఒక విశేషణము గలదు. జ్ఞాననిష్ఠకు ముందు కర్మలు అన్నియు విడువబడునని ( సర్వకర్మసన్న్యాసపూర్వికా ) శ్రీశంకరులు చెప్పిరి. దీని అర్థమేమి ? జ్ఞాని కర్మను చేయరాదని దీని యర్థము కాదు. అట్లైనచో, శ్రీశంకరులు ఈ భాష్యమును వ్రాసి యుండెడి వారు కాదు. శ్రీకృష్ణుడు కర్మను చేయకుండగనే ఈ గీతను బోధించినాడా ? కావున, ఇచట విడిచిపెట్టుట యనగా కర్తృత్వమును విడిచిపెట్టుట. దానిని విడిచిపెట్టుట యెట్లు ? జ్ఞానముచే మాత్రమే అది సంభవమగును. సర్వకర్మలను విడిచిపెట్టుటకు మరియొక మార్గము లేదు. ఏ మానవుడైననూ ఏ కర్మనైననూ చేయకుండగా క్షణకాలమైననూ ఉండజాలడని ( *న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్* ) మనము చూచియున్నాము. కర్మలను చేయనిచో జీవించియుండుటయైననూ అసంభవమగును ( *శరీరయాత్రాపి చ న ప్రసిద్ధ్యేత్* ). గాలిని పీల్చుట, తినుట, కూర్చుండుట మొదలైనవి అన్నీ కర్మలే. కర్మలను చేయకుండగా జీవించియున్న వ్యక్తి ఎవ్వరూ లేరు. కాని ' నేను కర్తను గాను ' అనే సత్యమును తెలుసుకున్న జ్ఞాని సర్వకర్మలనుండి పూర్తిగా విముక్తుడగును. ఈ రెండు విషయములను గీత సర్వత్రా దృఢముగా నిరూపించి యున్నది. ఆత్మజ్ఞానము లేనివానికి కర్మ ఉద్దేశించబడినది. ఈ విషయమును నిరూపించే కొన్ని వాక్యములను శ్రీశంకరులు భాష్యములో ఉదహరించిరి.

వారిద్దరికి తెలియలేదు ( *ఉభౌ తౌ న విజానీతః* ) అనునది శ్రీశంకరులు ఉదహరించిన మొదటి వాక్యము. సంహరించేది కర్తయగు ఆత్మ అని భావించువాడు ( *య ఏనం వేత్తి హంతారమ్* ), మరియు సంహరింపబడేది భోక్తయగు ఆత్మ అని తలపోయువాడు ( *యశ్చైనం మన్యతే హతమ్* ) అనే ఇద్దరికీ ఆత్మ తెలియలేదు. ఆత్మ కర్త గాని, భోక్త గాని కాదనే అతిప్రముఖమైన సత్యముతో ఆయన మొదలిడినారు. ఈ విషయమును బోధించుటకై శ్రీకృష్ణుడు సంహారక్రియను దృష్టాంతముగా స్వీకరించుటకు కారణమేమి ? సంహారక్రియను స్వీకరించుట ద్వారా ప్రథమమల్లన్యాయముచే ఇతరక్రియలన్నియు దానిలో అంతర్గతమగును. మల్లయుద్ధములో ప్రపంచవిజేత కావాలని కోరు వ్యక్తి ఏమి చేయవలెను ? సర్వమానవాళితో మల్లయుద్ధమును చేయవలెనా ? అక్కరలేదు. ప్రస్తుత

ములో ప్రపంచవిజేత అనే బిరుదమును కలిగియున్న వ్యక్తిని ఓడించిన చాలును. అదే విధముగా, క్రియలు అసంఖ్యాకములుగా గలవు. వాటిలో మిక్కిలి ఘోరమైనది, అత్యధికమగు హానిని కలిగించి తీవ్రమగు పశ్చాత్తాపమునకు హేతువు అగునది అగు క్రియ హత్య. దానిని దృష్టాంతముగా తీసుకొని ఈ శ్లోకము ఇట్లు చెప్పుచున్నది : తాను ఒక వ్యక్తిని సంహరించినానని భావించు వాడు, మరియు ఒక వ్యక్తి సంహరింపబడినాడని తలపోయువాడు, వీరిద్దరికీ ఆత్మ తెలియలేదు. ఎందువలన ? ఆత్మ సంహరించదు ( న హంతి ). అనగా ఆత్మ క్రియలను వేటినీ చేయదు. ఆత్మ సంహరింపబడుట లేదు ( న హన్యతే ). అనగా, ఇతరులు చేసే క్రియలకు ఆత్మ విషయము అగుట లేదు. కావున, ఆత్మ ఒక క్రియలో కర్త గాని, కర్మ గాని అగుట లేదు. రెండవ వస్తువు ఉన్నచో, అది కర్త గాని, కర్మ గాని కావచ్చును. కాని, ఆత్మ కంటె భిన్నముగా రెండవ వస్తువే లేదు ( ఆత్మనః అన్యత్ కిమపి నాస్తి ). కర్మయు ఆత్మయే. కర్త కూడ ఆత్మయే. కావున, కర్తృ-కర్మ-విభాగము కేవలము మిథ్య మాత్రమే. దీనిని బట్టి ఏమి తేలినది ? ఆత్మ కర్త కాదు. కావున, కర్మ లేదు. అదియే జ్ఞానము.

శ్రీశంకరులు మరియొక శ్లోకమును ఉదహరించినారు : కాలాధీనము కానిది, కావున నే వినాశము లేనిది అగు ఆత్మను తన స్వరూపముగా తెలుసుకున్న వ్యక్తి ఎవరిని ఎట్లు సంహరించును ? లేదా సంహరింపజేయును ? ( *వేదావినాశినం నిత్యం య ఏనమజమవ్యయమ్, కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కమ్* ). క్రియ ద్వివిధము. ఒకటి నేను స్వయముగా చేసేది. మరియొకటి ఇతరులచే చేయించేది. ఈ రెండు పక్షములలో ప్రధానకర్త నేనే. కాని, ఆత్మ ఈ రెండు రకముల క్రియలను చేయదు. సర్వక్రియలు ఆత్మ సన్నిధిలో జరుగుచుండును. కావున, ఆత్మ అకర్త.

శ్రీశంకరులు మరియొక శ్లోకమును ఉదహరించిరి : సన్న్యాసులకు జ్ఞానయోగము, మరియు కర్మిష్ఠులకు కర్మయోగము గలవు ( *జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్* ). ఈ శ్లోకము మూడవ అధ్యాయము లోనిది. ' ఓ శ్రీకృష్ణా ! నీవు జ్ఞానమును మరియు కర్మను కూడ ప్రశంసించుచున్నావు. నాకు మతి పోవుచున్నది. ఈ రెండింటిలో నాకు మోక్షమునిచ్చేది ఏది ? నీవు ఈ విధముగా నన్ను భ్రాంతికి ఏల గురి చేయుచున్నావు ? ఇది నీకు మంచిది గాన, దీనిని చేయుము అని ఖచ్చితముగా ఏల చెప్పుట లేదు ? ( *జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన, తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ ; వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే, తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోహమాప్నుయామ్* ) ' అని అర్జునుడు ప్రశ్నించగా, శ్రీకృష్ణుడు పై శ్లోకమును చెప్పినాడు. అర్జునునకు శ్రీకృష్ణుని ఉపదేశముపై ఫిర్యాదు గలదు. ఆ ఉపదేశము ప్రహస్తుడు రావణునకు ఇచ్చిన సలహాను పోలియున్నదని అతని అభిప్రాయము.

సీతను రామునకు అప్పజెప్పుమని ప్రహస్తుడు రావణునకు సలహానిచ్చెను. 'సీతను మనమేల అప్పజెప్పవలెను ? ' అని రావణుడు ప్రశ్నించగానే, ' మహారాజా ! మనము సీతను ఎందుకు అప్పజెప్పవలెను ? అప్పజెప్పనక్కర లేదు ' అని ప్రహస్తుడు అంగీకరించెను. ' కాని, ఒక్క కోతి వచ్చి లంకలో ఇంతటి వినాశమును సృష్టించినది గదా ! ' అని రావణుడు సందేహమును వ్యక్తము చేయగానే, ' అవును, ఒకే ఒక కోతి

ఇంత వినాశమును చేసినది ; ఇటువంటి పెద్ద కోతులు వారివద్ద అనేకము గలవు ; అవి అన్నీ వచ్చి లంకపై విరుచుకు పడినచో, మన పని అయినట్లే ; సీతను అప్పజెప్పుటయే మంచిది ' అని ప్రహస్తుడు చెప్పను. ' నీవు కోతులకు భయపడుచున్నావా ? ' అని రావణుడు ప్రశ్నించగానే, ' మహారాజా ! మనము కోతులకు ఏల భయపడవలెను ? ' అని ప్రహస్తుని సమాధానము. ' కాని, రాముడు గొప్ప ధనుర్ధారియని నేను వినియున్నాను ' అని రావణుడు చెప్పగా, ' మహారాజా ! రాముడు విష్ణువుయొక్క అవతారమని అందరు చెప్పుకొనుచున్నారు ; ఆతనికి లక్ష్మణుడనే సోదరుడు కూడ గలడు ; మనము సీతను అప్పజెప్పుటయే మంచిది ' అని ప్రహస్తుడు చెప్పను. ' ఓరీ ! రాక్షసులమగు మనము మానవులకు భయపడుటయా ? ' అని రావణుడు గద్దించగానే, ' కాదు, మహారాజా, మానవులకు మనమేల భయపడవలెను ? ' అని ప్రహస్తుడు గంభీరముగా పలుకును. దీనికే ' ప్రహస్తుని సలహా ' అని పేరు. ఇది సలహా కాదు. ఎదుటి వాడు ఏది చెప్తే, దానికి తలను ఊపినచో, అది సలహా అనబడదు.

అర్జునుని ఫిర్యాదుపై శ్రీకృష్ణుడు ఇట్లు సమాధానమును చెప్పుచున్నాడు : మోక్షమునకు అంకితమై ఉండే జీవనశైలులు రెండు రకములుగా నున్నవని నేను పూర్వములో చెప్పియున్నాను. ఒకటి కేవలము జ్ఞానాన్వేషణ కాగా, మరియొకటి జ్ఞానసాధనతో గూడియున్న కర్మయోగజీవనము ( *లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ, జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్* ). ఈ రెండు రకముల జీవనశైలులు ఉన్ననూ, జ్ఞాననిష్ఠ మరియు కర్మసన్న్యాసము కలిసి యుండునని శ్రీశంకరుల అభిప్రాయము. జ్ఞానము కొరకై కర్మలను పరిత్యజించినవాడు కర్మసన్న్యాసి అనబడుననియు, అట్టివాడు కాలక్రమములో జ్ఞానమును పొంది సర్వకర్మసన్న్యాసి అగుననియు శ్రీశంకరులు వివరించిరి.

శ్రీశంకరులు మరియొక శ్లోకమును ఉదహరించిరి : అజ్ఞానులు కర్మలయందు ఆసక్తిని కలిగియుందురు. వారి మనస్సునకు భేదమును కలిగించరాదు. వారు కొన్ని మంచి కర్మలను చేయుచున్నారు. వారి వద్దకు వెళ్లి, కర్మ మోక్షమునీయదని చెప్పరాదు ( *న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసంగినామ్* ). వారికి గల శ్రద్ధను చెడగొట్టరాదు. శ్రద్ధను చెడగొట్టినచో, వారు కర్మలను పరిత్యజించెదరు. కర్మ సాక్షాత్తుగా మోక్షమునీయలేకపోయిననూ, మానవుడు శ్రద్ధతో కర్మను చేసినచో, దాని వలన ఒక విశిష్టమగు మనఃప్రవృత్తి నిర్మాణమై, జ్ఞానోదయమునకు సహకరించును. ఆతని వద్ద మనఃపరిపక్వతను సంపాదించుటకై ఉన్న ఒకే ఒక సాధనము కర్మ. వివేకము లేని వారి వద్ద కర్మను నిందించినచో, వారా కర్మను విడిచిపెట్టెదరు. దాని వలన వారు కర్మ వలన కలిగే ప్రయోజనమునుండి వంచితులగుదురు. జ్ఞానము వారికి అందుబాటులోనికి ఇంకనూ రాలేదు. కర్మయొక్క తత్త్వమును తెలిసిన జ్ఞాని ( *తత్త్వవిత్* ) తాను చూచుచున్ననూ, వినుచున్ననూ, మాటలాడుచున్ననూ, ఇతరకర్మలను చేయుచున్ననూ, తాను యథార్థముగా కర్మలను వేటినీ చేయుట లేదని యెరుంగును ( *నైవ కించిత్కరోమీతి మన్యేత* ). ఈ కర్మలు అన్నియు ఇంద్రియములు తమకు గోచరమయ్యే విషయములయందు ప్రవర్తిల్లుట మాత్రమే ( *ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంతే* ).

ఆత్మ క్రియలను వేటినీ చేయదని తెలుసుకొని, ఇంద్రియములు, మనస్సు మొదలగు కరణముల రూపములో నున్న గుణములే గుణములయందు తిరుగాడుచున్నవని (గుణా గుణేషు వర్తంతే ఇతి మత్వా న సజ్జతే) గుర్తించిన తత్త్వవేత్త కర్మలచే గాని, వాటి ఫలములచే గాని బంధింపబడడు.

ఈ దేహములో నివసించియున్న జీవుడు ఆత్మ నియంత్రణను కలిగి సర్వకర్మలను మనస్సుచే విడిచిపెట్టి, తాను స్వయముగా కర్మలను చేయకుండగా, చేయించకుండగా, తొమ్మిది ద్వారముల ఈ నగరములో సుఖముగా కూర్చుని యుండును (సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ, నవద్వారపురే దేహే నైవ కుర్వన్న కారయన్) అని కూడ మనము 5 వ అధ్యాయములో చూచియున్నాము. ఈ విధముగా జ్ఞాని కర్మలనన్నింటినీ విడిచిపెట్టి యుండును. ఇచట సర్వకర్మాణి అను పదమును బట్టి విడిచిపెట్టబడేది ఏదో ఒక కర్మ కాదనియు, అన్ని కర్మలు విడువబడుననియు స్పష్టమగుచున్నది. ఆత్మ అకర్త అనే జ్ఞానము లేనిదే ఇది సంభవము కాదు. కావున, కర్మలను భౌతికముగా విడువనక్కర లేదనియు, మనస్సుచే విడువవలెననియు గ్రహించవలెను. జ్ఞాని ఈ దేహములో జీవించియుండగనే సర్వకాలములలో కర్మయందలి క్లేశమునుండియు, కర్మఫలము విషయములో కలిగే ఆశాభంగమునుండియు విముక్తుడై యుండును. ఈ స్థితి మరణించిన తరువాత లభించేది కాదు. మానవుడు ఈ దేహములో జీవించియుండగనే అకర్తృ-ఆత్మ-స్వరూపమునెరింగి మోక్షమును పొందును. ఆత్మతత్త్వమునెరింగిన జ్ఞాని తాను కర్మలను వేటినీ చేయుటలేదని యెరుంగును (నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్). జ్ఞాని తాను ఆలోచన అనే క్రియతో సహా లేశమైననూ కర్మలను చేయుట లేదని యెరుంగును. ఆలోచించిన పిదప కాదు ; ఆలోచించుచుండగనే తాను ఆలోచించుట లేదని జ్ఞాని యెరుంగును. అందువలననే వర్తమానకాలము ప్రయోగింపబడినది. చూచుచున్ననూ, వినుచున్ననూ, స్పృశించుచున్ననూ, ఆఘ్రాణించుచున్ననూ (పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్), తాను క్రియలనాచరించుట లేదని జ్ఞానికి తెలియును. దీనిని బట్టి, ఆత్మస్వరూపమునెరుంగని వాడు మాత్రమే తాను కర్మలను చేయు కర్తనని భావించునని మనకు స్పష్టమగుచున్నది. అజ్ఞాని సర్వకర్మలకు తానే కర్త యగుచుండును. కన్నులు చూచుచుండగా తాను ద్రష్ట యగును. చెవులు వినుచుండగా, తాను శ్రోత యగును. ఈ విధముగా, అజ్ఞాని తాను క్రియలచే నియంత్రింపబడే వ్యక్తినని భావించును.

ఆత్మజ్ఞానమును పొందగోరు వ్యక్తి (ముముక్షుః) కి కర్మ సాధనమగును (ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే). కర్మయోగసిద్ధిని పొందిన జ్ఞానికి సర్వకర్మసన్న్యాసము (ఆపేక్షికము గాని, లేదా పారమార్థికము గాని) మోక్షసాధనము (యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే). దీని తరువాత, శ్రీశంకరులు 7 వ అధ్యాయమును గుర్తు చేయుచున్నారు. ఆచట నాలుగు రకముల భక్తులు గలరని చెప్పబడినది. ఆర్తభక్తుడు మొదటివాడు. ఈతడు తాను కష్టములో నున్నప్పుడు కాపాడుమని భగవంతుని ప్రార్థించును. అట్లు ప్రార్థించుట చాల మంచిది. రెండవవాడు అర్థార్థి. ఈతడు కష్టము వచ్చినప్పుడు మాత్రమే గాక, క్రొత్త యోజనలను చేపట్టినప్పుడు కూడ భగవంతుని ప్రార్థించును. ఈతడు తాను చేయు పనులలో సత్ఫలితములను సాధించుట కొరకై

ముందుగా భగవంతుని ప్రార్థించి, తరువాతనే తన పనిని మొదలిడును. ఇది చాల చక్కటి ప్రవృత్తి. ఈతనికి వివిధలక్ష్యములను సాధించుటలో అభిరుచి గలదు. కావున, ఈతడు భగవానుని వివిధదేవతల రూపములో ఆరాధించి, తరువాతనే కార్యములను చేపట్టును. మూడవవాడు జిజ్ఞాసువు. అనగా, ఈశ్వరుని తెలియగోరువాడు. ఈతడు కర్మయోగి గాని, సన్న్యాసి గాని కావచ్చును. ఒకడు ఈశ్వరీయజ్ఞానమునకు మాత్రమే అంకితమైనవాడు కావచ్చును. మరియొకడు కర్మతో బాటు, జ్ఞానసాధనను కూడ చేయుచుండవచ్చును. వీరిద్దరు భక్తులే. జిజ్ఞాసువు అధ్యయనము చేసే వేదములోని పదములు అన్నియు భగవానుని వచనములే. కావున, జిజ్ఞాసువుయొక్క దృష్టిలో వేదము ప్రమాణము. ఆతనికి వేదమునందు శ్రద్ధ గలదు. భగవానునియందు శ్రద్ధ అనగా నదియే. కావున, జిజ్ఞాసువు భగవానుని వచనములలో భగవానుని ప్రార్థించును. కాలక్రమములో నాతడు శాస్త్రతాత్పర్యమును దర్శించి జ్ఞాని యగును. ఈ మొదటి మూడు రకముల భక్తులు మంచివారే. కాని వారియందు ఆత్మజ్ఞానము లేదు. వీరికి భిన్నముగా జ్ఞాని నా స్వరూపమే యగును ( జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ) అని శ్రీకృష్ణుడు చెప్పెను. వీరు నలుగురు ఈశ్వరుని ఆరాధించువారే. వీరిలో మొదటి ఇద్దరు తమ స్వప్రయోజనములు సిద్ధించుట కొరకై ఈశ్వరుని ఆరాధించుచున్నారు. జిజ్ఞాసువు ఈశ్వరుని తెలుసుకొనుటకై ఈశ్వరుని ఆరాధించుచున్నాడు. జీవుని మౌలికసమస్యను ఆతడు తెలుసుకొని, తిన్నగా ఈశ్వరుని కొరకై ఈశ్వరుని వేడుచున్నాడు. ఉన్న వాటికి తోడుగా మరియొక దానిని పొందుట కొరకై ఆతడు ఈశ్వరుని ఆరాధించుట లేదు. ఆతడు ఈశ్వరీయజ్ఞానము కొరకై ఈశ్వరుని ఆరాధించుచున్నాడు. ఈ భక్తునకు ఇంకనూ ఈశ్వరుడు ఆత్మరూపుడేనని తెలియలేదు గనుక, ఈశ్వరుని కంటె భిన్నముగా నున్నాడు. కాని, జ్ఞాని మాత్రము ఈశ్వరుని కంటె భిన్నముగా లేడు.

దీని తరువాత, శ్రీశంకరులు వైదికకర్మానుష్ఠానపరుల గురించి గుర్తు చేయుచున్నారు. వారు ఋగ్యజుస్సామవేదములను వినియోగించి వేదవిహితకర్మలను చేయుచూ యజ్ఞప్రసాదమగు సోమరసమును పానము చేసి సకలపాపములనుండి వినిర్ముక్తులగుదురు ( *త్రైవిద్యా మాం సోమపాః పూతపాపాః* ). వారు యజ్ఞము ద్వారా ఈశ్వరుని ఆరాధించి స్వర్గమును ప్రార్థించెదరు ( *యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే* ). తరువాత యేమగును ? వారి ప్రార్థనలు సహజముగనే సఫలమగును. వారు మరణించిన పిదప ఇంద్రుడు నివసించే పుణ్యలోకమును పొందెదరు ( *తే పుణ్యమాసాద్య సురేంద్రలోకమ్* ). ఆ స్వర్గములో వారు దేవభోగములను అనుభవించెదరు ( *అశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్* ). ఈ విధముగా స్వర్గసుఖములను అనుభవించిన తరువాత ( *తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలమ్* ), వారిని అచటకు తీసుకువెళ్లి భోగములను అనుభవింప జేసిన పుణ్యము క్షయము కాగానే ( *క్షీణే పుణ్యే* ), మరల మర్త్యలోకమునకు చేరెదరు ( *మర్త్యలోకం విశంతి* ). రోగము, ముసలిదనము మొదలగు లక్షణములతో కూడిన ఈ ప్రపంచమునకు మరియు ఇటువంటి ఇతరలోకములకు మర్త్యలోకము అని పేరు. వివిధపదార్థములపై కామవలు గల ఈ అజ్ఞానులు తాము వెళ్లిన ఆ పుణ్యలోకములనుండి మరలి వత్తురు ( *అజ్ఞాః కామినః కామకామాః గతాగతం లభంతే* ). వారు మూడు వేదములచే విహితమైన కర్మలను మాత్రమే చేసిననూ, అంతిమముగా వారికి లభించినది యేమి ? ఒకానొక భోగ

ఖనకు వెళ్లి మరలి వచ్చిరి. దీనికి అంతిమమగు ఫలమేమి ? వారు ఇంకనూ సంసా
మునిగి యుండుటయే.
దీనికి భిన్నముగా, ఈశ్వరుడు ఆత్మ కంటె భిన్నముగా లేదని గుర్తించి ఆ విధ
విదిధ్యాసనము చేయువారిని ( అనన్యాశ్చింతయంతో మామ్ ) పరిశీలించుడు. స
ఈశ్వరునితో అభిన్నమగు ఆత్మస్వరూపమునందు ప్రతిష్ఠితులై యుండువారి యోగ
ములకు అన్నింటికి నేనే బాధ్యత వహించెదనని ( తేషాం నిత్యాభి యుక్తానాం
మం వహామ్యహమ్ ) భగవానుడు చెప్పియున్నాడు. వారు కర్మయోగులైనచో,
దబుద్ధిని కలిగియుందురు. వారే జ్ఞానులై పూర్ణులై యుందురు. ఆ అధ్యాయములో
బడిన తీరున వీరు నిరంతరముగా ఆత్మస్వరూపమును అనుసంధానము చేయు
నిత్యయుక్తాః యథోక్తం చింతయంతః ). వారు బ్రహ్మాత్మతో ఐక్యమును చెంది
ను వలె శుద్ధులై పూర్ణులై పుణ్యపాపసంబంధము లేనివారై యుందురు. నన్ను
పరమప్రేమతో నన్ను అన్వేషించే వారికి నన్ను పొందునట్లు చేసే జ్ఞానమును
చ్చెదను ( దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే ) అని కూడ భగ
చెప్పియున్నాడు. ఇదియే ఇచటి ప్రముఖవిషయము. ఆ భక్తులు స్వర్గము
ద స్థలములకు వెళ్లరు. వారు ఈశ్వరునితో ఐక్యమును చెందెదరు. దీనిని బట్టి కామ
రిపూర్తికి అంకితమై యున్న అజ్ఞానులగు ఇతరులు ఈశ్వరుని పొందలేరని స్పష్టమగు
ది. మానవుడు జ్ఞానముచే ఈశ్వరుని పొందునే గాని, కర్మచే పొందజాలడు. కర్మ
కేవలము వివిధభోగప్రధానమగు లోకములను పొందెదరు.
భగవానుని వచనములైన వేదవాక్యములచే విధింపబడిన కర్మలను చేయువారి
యేమి ? కర్మను చేసే మానసికప్రవృత్తి రెండు రకములుగా నున్నది. కొందరు
ఏ పనిని చేయమంటే ఆ పనిని మారు మాటలాడకుండగా చేయుదురు. భగవా
విధించుటచే వారికి ఈ కర్మలను చేయుటలో మరియొక ఆలోచనతో పని లేదు.
దృష్టిలో వేదము కంటె అధికపవిత్రత గలది మరియొకటి లేదు. ఇట్టి భక్తులు మనకు
రతదేశములో దేవాలయములలో కానవచ్చెదరు. వారు దేవాలయము చుట్టూ ఉన్న
చ్చి మొక్కలను పీకుట, నేలను ఊడ్చుట, పూలను తెచ్చి మాలను కట్టుట మొదలైన
విధరకముల కర్మలను చేయుచుందురు. మరికొందరు ఈశ్వరుని ప్రీతి కొరకై విహితక
లను చేయుచుందురు ( భగవదారాధనార్థం అహమిదం కరిష్యే ). ఈ విధముగా, కర్మ
వంతుని ఆదేశము గనుక తప్పక చేయదగినది అని గాని, భగవంతుని కొరకు అవి
ని చేయబడును. ఈ రెండు భావనలతో చేయబడే కర్మ భగవత్కర్మ యగును. ఈ
భావనలతో కర్మలను చేయువారు కర్మయోగులనబడుదురు. వీరు కర్మయోగభావన అనే
అంశములో చాల స్థిరచిత్తము గలవారే ( యుక్తాత్మానః ) అయిననూ, వీరు ఇంకనూ
కర్మక్షేత్రమునకు పరిమితమైన వారు మాత్రమే. వీరు సర్వదా వేదవిహితమైన యజ్ఞము,
ప్రార్థన మొదలైన ఆధ్యాత్మికకర్మలను మాత్రమే చేయుచున్నారు గదా ! వారిని గురించి
అట్లు చెప్పుటకు కారణమేమి ? వారు అజ్ఞానులగుటయే. వారి దృష్టిలో ఆత్మ కర్త.
అజ్ఞాని ఆత్మ కర్తయనే ధారణను కలిగియుండునని ( కర్తారమితి మన్యతే ) మనము 3 వ
అధ్యాయములో చూచియున్నాము. ఇంద్రియములు ఇంద్రియగోచరమగు విషయముల

యందు ప్రవర్తిల్లుచుండగా ( ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంతే ), భ్రాంతిని పొందియున్న వ్యక్తి ( మూఢః ) ఆత్మయే కర్తయని భావించును. కాని, ఈ అజ్ఞాని తనను తాను ఉద్ధరించుకొనుటకై అనేకసాధనములు గలవు. కర్మఫలత్యాగము వాటిలో ఆఖరుది. ఈ విషయము 12 వ అధ్యాయములో ఇట్లు చెప్పబడినది : పదములచే నిర్దేశింప శక్యము కాని అక్షరపరంబ్రహ్మస్వరూపము( అనిర్దేశ్యం అక్షరమ్ ) ను ధ్యానించే సామర్థ్యము లేనివాడు మరియు భగవానుని సగుణరూపముపై కూడ మనస్సును నిలుపలేనివాడు అగు వ్యక్తి ధ్యానాభ్యాసముచే భగవానుని పొందవచ్చును. దానిని కూడ చేయలేని వ్యక్తి భగవానుని కొరకై కర్మలనాచరించి సిద్ధిని బడయవచ్చును ( అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్, అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ ; అభ్యాసేప్యసమర్థోసి మత్కర్మపరమో భవ, మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి ). అది కూడా చేయలేని వ్యక్తి ఆఖరుగా కర్మఫలములను విడిచి పెట్టవలెను. దీనిని ఆఖరుగా చెప్పుటకు కారణమేమి ? ఇది ముందుగా చెప్పబడిన ఇతరసాధనములను దృష్టిలో నిడుకొని చెప్పబడినది. అవి ఏవీ కుదరక పోతే, కనీసము దీనినైననూ చేయవలెను. ఇది కూడా జీవుని భగవానునితో జతగూర్చే అకర్మయే. కాని ఆతడు అజ్ఞాని యగుటచే, కర్మి యగుచున్నాడు.

అదే అధ్యాయములో అద్వేష్టా సర్వభూతానామ్ ( ఏ ప్రాణినైననూ ద్వేషించనివాడు ) అను శ్లోకముతో మొదలిడి అధ్యాయాంతము వరకు జ్ఞానియందు సహజసిద్ధముగా అభివ్యక్తమయ్యే వివిధలక్షణములు చెప్పబడినవి. జిజ్ఞాసువు ఈ లక్షణములను తనలో పెంపొందించుకొన వలెను. ఆత్మజ్ఞాని మాత్రమే రాగద్వేషములకు అతీతుడై యుండును. కావుననే, స్నేహశీలము, దయ, అహంకారమమకారములు లేకుండుట అను లక్షణములు జ్ఞానియందు సహజముగా అభివ్యక్తమగును. రాగద్వేషములకు అతీతుడు కానివాడు సర్వప్రాణులయందు పూర్తిగా ద్వేషము లేనివాడై ( అద్వేష్టా సర్వభూతానామ్ ) యుండుట అసంభవము. వస్తుస్వరూపమును తెలియగోరు సాధకులు 12 వ అధ్యాయములో ఈ శ్లోకముతో ఆరంభించి అంతము వరకు చెప్పబడిన లక్షణములను వృద్ధి చేసుకొనవలెను. ఇవి వారికి జ్ఞానాన్వేషణలో సహకరించును. కర్మను యోగబుద్ధితో ఆచరించే యోగులకు, ఈ జ్ఞానులకు మధ్యలో చాల అంతరము గలదు. క్షేత్రాధ్యాయము అనబడే 13 వ అధ్యాయములో జ్ఞానసాధనములు మరల చర్చించబడినవి. అచట అగ్నిహోత్రము మొదలగు కర్మలు ఏవియు జ్ఞానసాధనరూపములో ప్రస్తావించ బడలేదు. గర్వము లేకుండుట ( అమానిత్వమ్ ), తాను ధార్మికుడననే ప్రచారము లేకుండుట ( అదంభిత్వమ్ ), ప్రాణులను హింసించకుండుట ( అహింసా ), సహనశీలము ( క్షమా ), తిన్నని స్వభావము ( ఆర్జవమ్ ), గురుశుశ్రూష ( ఆచార్యోపాసనమ్ ), శుభ్రత ( శౌచమ్ ), స్థిరచిత్తమును కలిగియుండుట లేదా స్వధర్మనిష్ఠ ( స్థైర్యమ్ ), తనపై తాను నియంత్రణను కలిగి యుండుట ( ఆత్మవినిగ్రహః ), భోగవస్తువులయందు రాగము లేకుండుట ( ఇంద్రియార్థేషు వైరాగ్యమ్ ), అహంకారము లేకుండుట ( అనహంకారః ), పుట్టుక-మరణము-ముసలి తనము- రోగము అను వాటి లోని దోషమును పునః పునః సుస్పష్టముగా దర్శించుట ( జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ ) అనునవి జ్ఞానసాధనములు. జ్ఞాని అభీష్టము కానిది సంప్రాప్తమైనప్పుడు ద్వేషించడు ; తాను కోరేది దూరమైనదని దుఃఖిం

చదు. ఆతదు గుణములచే చలనమును పొందనివాడై ఉదాసీనునివలె కూర్చుండి యుండును ( *న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి, ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే* ) అని 14 వ అధ్యాయములో చెప్పబడినది. జ్ఞాని ఉదాసీనునివంటి వాడు అను ప్రయోగమును గమనించవలెను. ఆతదు ఉదాసీనుడు అనగా దేనినీ పట్టించుకొని వాడు అనుకోరాదు. ఆతదు ఇష్టానిష్టములగు పరిస్థితులకు అతీతుడై యుండును. బాహ్యములో మాత్రమే గాక, అంతరంగములో చెలరేగే వివిధపరిస్థితులచే ఆతదు చలింపచేయబడదు. ఆత్మ కర్తయనే భ్రమ లేనివారు ; ఆసక్తి, కామన మొదలగు సంగదోషములను జయించినవారు ; ఆత్మస్వరూపదర్శనమునకు పూర్తిగా కట్టుబడి యున్నవారు ; స్వర్గము మొదలగు వాటిపై గల కామనలనుండి పూర్తిగా విముక్తమైనవారు ; సుఖదుఃఖాదిద్వంద్వములకు పూర్తిగా అతీతులైనవారు ----- మోహము లేని ఇట్టి జనులు పునరావృత్తి లేని ఆ పరమపదమును పొందెదరు ( *నిర్మానమోహా జితసంగదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః, ద్వంద్వైర్విముక్తాస్సుఖదుఃఖసంజ్ఞైర్గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్* ) అని 15 వ అధ్యాయములో చెప్పబడినది. 13,14,15 అధ్యాయములలో జ్ఞానమును పొందే ఉపాయములు చెప్పబడినవి. ఈ ఉపాయములు కేవలము జిజ్ఞాసువుల కొరకు మాత్రమే ఉద్దేశించబడినవి.

ఇష్టము, అనిష్టము మరియు మిశ్రమము అని కర్మఫలము మూడు రకములుగా గలదు. కాని సర్వకర్మసన్న్యాసులకు ఈ కర్మఫలముతో సంబంధము లేదు. కర్మకు స్థూలదేహము, ఇంద్రియములు, అహంకారము, కరణములు మరియు సర్వేంద్రియముల అధిష్ఠాన దేవతలు అనే అయిదు హేతువులు గలవని మనము ఈ అధ్యాయమునకు ఆరంభములో చూచియున్నాము. ఇవి అన్నియు కర్మను చేయుటకు ఆవశ్యకమగును. కాని జ్ఞానులు సర్వకర్మలను పరిత్యజించినారు. వారీ కర్మలను పరిత్యజించిన విధమెట్టిది ? మానవుదు జీవించియుండగా దేహము, ఇంద్రియము మొదలగు వాటిని విడువజాలదు. కావున, మానవునకు కర్మను సంపూర్ణముగా విడిచి పెట్టుట ఎట్లు సంభవమగును ? అద్వయ-ఆత్మ-స్వరూపము వారికి తెలియును. కావున, వివిధకర్మల కర్తృత్వము వారియందు లేదు. కర్మకు అయిదు అంశములు ఆవశ్యకమగుచున్నవి. ఆత్మ అద్వయము. ఈ అయిదింటితో సహా ఆత్మకంటె భిన్నమైనది సర్వము మిథ్య. కావున, ఒకటికి అయిదు కలిపితే ఒకటియే అగును. ఈ సత్యమునెరింగిన జ్ఞాని కర్మతో సంబంధము గల సర్వకారకముల నుండి విముక్తుడై యుండును. సర్వకారకవినిర్ముక్తుడైన జ్ఞాని ఏ క్రియలోనైననూ కర్త గాని, కర్మ గాని కాదు. సర్వక్రియావినిర్ముక్తమైన అద్వయ-ఆత్మను తెలుసుకున్న జ్ఞానులకు కర్మఫలములతో సంబంధము లేదు. కర్మఫలము ఇష్టము గాని, అనిష్టము గాని, లేదా ఆ రెండింటి మిశ్రమము గాని కావచ్చును. ఈ జ్ఞానమునందు నిష్ఠ గల వారికి ఈ మూడు రకముల ఫలములతో సంబంధము లేదు. ఈ ఫలములు ఆత్మయందు మెరుగులను దిద్దలేవు. వీరే భగవానుని యథార్థస్వరూపమును తెలుసుకున్న వాస్తవమగు సన్న్యాసులు. వీరు భగవానుని యథార్థస్వరూపమును ఎరింగినవారై, పరం-బ్రహ్మ-అభిన్నమైన అద్వయ-ఆత్మ-స్వరూపమునందు నిష్ఠను కలిగియుందురు. వారికి త్రివిధకర్మఫలములతో పని లేదు. ఈ కర్మఫలములు ఇతరుల కొరకు మాత్రమే ఉద్దేశించబడినవి.

మానవుడు వేదానుయాయి (వైదికః) అయినా, కేవలలౌకికుడు మాత్రమే అయి నా, ఆస్తికుడైనా, నాస్తికుడైనా, ధర్మాత్ముడైనా, కాకపోయినా, పండితుడైనా, పామరుడైనా, కర్మఫలమును అనుభవించుట తప్పదు. మంచి కర్మలను చేయువారు అభీష్టఫలములను పొందెదరనుటలో సందేహము లేదు. కాని, వారు కూడా కర్మఫలములకు లోబడి యుందు రు. ఆత్మజ్ఞానము గలవారు కర్మఫలమునకు వశములో నుండరు. మిగిలిన వారు అందరు ఆత్మస్వరూపమునెరుంగక ఆత్మయే కర్తయని భావించి కర్మఫలమునకు వశవర్తులై యుందురు. వారికి ఇంకనూ ఆత్మజ్ఞానము కలుగలేదు గనుక, వారు కర్మ క్షేత్రమునకు చెందియున్నారు. వారు జ్ఞానముచే కర్మసన్న్యాసమును చేయలేదు గనుక, కర్మఫలవశవ ర్తులై యుందురు. కావున, మనకు ఈ విభాగము గలదు. ఆత్మస్వరూపమునెరింగిన జ్ఞాను లకు కర్మఫలసంబంధము గాని, కర్తవ్యము గాని లేవు ; కాని అజ్ఞానులకు గలవు. వారికి కర్మఫలము ఉన్నది గనుక, వారు తాము కోరే ఫలములను పొందుట కొరకై కర్మలను చేయవలసి యుండును. వేదము కర్మవినిర్ముక్తుడై యున్న జ్ఞానిని ఉద్దేశించి కర్మలను విధించుట లేదు. కాని వేదము అజ్ఞానికి కర్మను విధించుచున్నది. ఆ కర్మ అజ్ఞానికి తాను కోరే ఫలములను పొందుట కొరకు గాని, లేదా అంతఃకరణశుద్ధి కొరకు గాని సహకరించు ను. అజ్ఞాని తాను కర్తనని భావించును. వేదము వాని ఆ భావనకు అనురూపముగా, పాప నివృత్తి జరిగి అంతఃకరణము శుద్ధమై జ్ఞానము ఉదయించుట కొరకై వానికి నిత్యనైమిత్తిక కర్మలను విధించుచున్నది. ఈ విధముగా మోక్షమును పొందుటలో తోడ్పడే పవిత్రమగు జీవితమును గడుపుటకు కావలసిన సుస్పష్టమగు యోజనను వేదము మనకు ఇచ్చుచు న్నది.

పరమపురుషార్థము మోక్షమేనని వేదముయొక్క తాత్పర్యము. ఆత్మజ్ఞానముతో ఏ విధమైన సంబంధము లేని జీవితమును గురించి ఊహించుడు. దీని వద్దకు రాకముందు మీరు ఎట్లు జీవించెడి వారు ? ఈ జ్ఞానముయొక్క దరిదాపులకు రాక పూర్వము నా జీవి తము ఎట్లు ఉండినదో అని నేను కూడ ఊహించుచున్నాను. ఈ జ్ఞానమునకు దూరమైన ఆ జీవితము పూర్తిగా నిరర్థకము మరియు మూర్ఖత్వముతో నిండినది. ఆ స్థితిలో నున్న మానవునకు తాను చేయు కర్మల స్వరూపమును గురించి అవగాహన లేకపోవుటచే, ఆ జీవితమునకు అర్థము లేదు. సర్వజనసాధారణమైన ఏవో కొన్ని లక్ష్యముల వెనుక పరుగు లెత్తే ఆ జీవితము అల్పములగు కామనలకు బానిసయైన మూర్ఖజీవితము. ఇప్పుడు వెను కకు తిరిగి చూచుకున్నచో, అది పరిహాసభాజనముగా కానవచ్చును. మనము ప్రేమించే వస్తువులలో మనకు ఏదో కొద్ది సుఖము లభించుచుండుటచే, మనము దాని వెనుక పడి యుంటిమి. మన అహంకారము వాటితో కలిసిపోయి ఉండుటచే మనకు ఆ అల్పభోగమే భగవంతుడా యన్నట్లు భాసించినది. సంసారములో సరళమైన ప్రేమను మినహాయించి సారవంతమైన వస్తువు మరియొకటి లేదు. సంసారములోని సారమంతయు ఆభాస మాత్ర మే. కావున, ఆత్మజ్ఞానము లేని జీవితమును గడుపుట నిరర్థకము. ఈ సత్యమును గుర్తిం చిన తరువాత, ఈ జ్ఞానమునకు దూరముగా ఇంతకాలము ఎట్లు గడుప గల్గితినో అని ఆశ్చర్యము కలుగును. వైదికకర్మలు మొదలగువాటిని చేసే వ్యక్తి విషయములోనైననూ, ఈ జ్ఞానమునకు దగ్గరగా రాకుండినచో, సర్వము అర్థరహితమగును. కాని, ఈ జ్ఞానము

నకు దగ్గరగా వచ్చిన వ్యక్తి చేసే కర్మ యోగము అగును. అప్పుడు ఆతడు చేసే సర్వక ర్మలు కొత్త అర్థమును సంతరించుకొనును. ఆతని జీవితమునకు ఒక లక్ష్యము మరియు ఒక దిశ ఏర్పడును.

వైదికకర్మలైనా, లౌకికకర్మలైనా, సర్వకర్మల మూలములో అజ్ఞానము (అవిద్యా ) గలదు. ఇట్లు చెప్పుటలో తాత్పర్యమేమనగా, కర్మకు మూలములో అజ్ఞానము కలదు గనుక, కర్మ అజ్ఞానమును నివృత్తి చేయలేదు. దీనిపై ఒక అభ్యంతరము గలదు. సర్వక ర్మలకు అజ్ఞానమే మూలమని చెప్పుటకు వీలులేదు. ఒక వైదికకర్మకు మూలములో ఆ కర్మను గురించిన జ్ఞానము గలదు. ఆ జ్ఞానము వేదమును చదివి పొందినదియే. వేదము అగ్నిహోత్రాది కర్మలను చేయు విధమును బోధించుచున్నది. ఆ జ్ఞానము లేనిదే కర్మను చేయుట సంభవము కాదు. ఈ కర్మను ఈ విధముగా చేయవలెను అనే జ్ఞానమును వేదమే మనకు ఇచ్చుచున్నది. కావున, కర్మానుష్ఠానమునకు మూలములో ఈ జ్ఞానము గలదు. ఈ జ్ఞానమును పొందుటకు వేదము తక్క మరియొక సాధనము లేదు. కావుననే వేదము ఇట్టి జ్ఞానమునిచ్చే ప్రమాణమని స్వీకరించబడినది. కావున, వైదికకర్మకు మూల ములో జ్ఞానము గలదు. ఇట్టి స్థితిలో వేదవిహితకర్మను చేయుటకు మూలములో అవిద్య గలదని చెప్పుట ఎట్లు పొసగును ? లౌకికకర్మలకు మూలము అజ్ఞానమే యగుగాక ! కాని, వైదికకర్మలకు మూలము అవిద్య కాజాలదు. వైదికకర్మలకు మాత్రమే గాక, మరి కొన్ని కర్మలకు కూడ వెనుక అజ్ఞానము లేదు. లేని పామునకు భయపడి నేను పారిపోవు చున్నచో, దాని వెనుక అజ్ఞానము గలదు. కాని, శరీరవ్యాయామము వంటి చిన్న చిన్న కర్మల వెనుకనైననూ, ' ఈ వ్యాయామమును చేయుట వలన శరీరములోని ఈ క్రొవ్వు తగ్గును' ఇత్యాది జ్ఞానము గలదు. వంట వండుటకైననూ జ్ఞానము కావలెను. చేసే పనిలో లొసుగు ఉన్నచో, ఆ పని వెనుక అజ్ఞానము గలదని చెప్పవచ్చును. కాని, వ్యావహారికజ్ఞా నమును కలిగి బుద్ధిపూర్వకముగా చేసే పనుల వెనుక అవిద్య గలదని చెప్పుట తగదు.

' ఈ వాదము సరిగాదు ; బ్రహ్మహత్య వలె ' అని శ్రీశంకరులు సంగ్రహముగా సమాధానమును చెప్పి దానిని వివరించిరి : బ్రహ్మహత్య మహాపాపమని శాస్త్రము చెప్పు చున్నది. ఒక అమాయకుడు, ధార్మికుడు అగు వ్యక్తి పల్లెటూరి బడిలో పాఠములను చెప్పు రాజకీయములలో తల దూర్చకుండగా తన బ్రతుకు తాను బ్రతుకుచుండగా, ఆతనిని నిష్కారణముగా హత్య చేయుట లౌకికములగు చట్టముల దృష్టిలోనైననూ పెద్ద నేరమే యగును. ఈ అంశములో మానవుల చట్టములు శాస్త్రదృష్టితో సరిదూగుచున్నవి. శాస్త్రము నిందించే ఇతరవిషయములు చట్టసమ్మతములు కావచ్చును. ఉదాహరణకు మద్యపానము పాపమని శాస్త్రము నిందించుచున్ననూ ( సురాం న పిబేత్ ), అది చట్టస మ్మతమే. ఈ మధ్యకాలములో మద్యపానము వలన త్రాగే వానికి మాత్రమే గాక, వాని కుటుంబమునకు కూడ కలిగే హానిని గురించి ప్రజలలో చైతన్యము కలుగుచున్నది. అంతే గాక, దాని వలన పాపము కూడ వచ్చునని శాస్త్రము చెప్పుచున్నది. కాని, దీనికి భిన్న ముగా బ్రహ్మహత్య శాస్త్రదృష్టిలో మాత్రమే గాక, చట్టముయొక్క దృష్టిలో కూడ పెద్ద నేరము. బ్రహ్మహత్య మొదలగు ఘోరకృత్యముల వలన కలిగే పరిణామములు భయంక రముగా నుండును. కావుననే, శాస్త్రము వాటిని నిషేధించుచున్నది. అయిననూ, జనులు

వాటిని చేయుచునే యుందురు. ఎందువలన ? శాస్త్రము ఎవరిని ఉద్దేశించి ఈ నిషేధ మును చేయుచున్నది ? ఇట్టి కర్మను చేసే అవకాశము ఎవరికి గలదు ? అవిద్య గల వాడు ఇట్టి కర్మను చేయగల్గునని శ్రీశంకరులు వివరించిరి. ఒకనిలో అవిద్య గలదు. దాని ప్రభావముచే వానియందు ఒకానొక వస్తువును తాను పొందవలెననే రాగము, మరియొక దానికి తాను దూరముగా నుండవలెననే ద్వేషము గలవు. ఇవి లేనిచో, అతడు అట్టి పనిని చేసే ప్రసక్తియే ఉండదు. అతని మనస్సులో పెద్ద ఒత్తిడి ఉండుట చేతనే అతడు ఆ పనిని చేసినాడు. వానికి గల తప్పుడు అభిప్రాయముల మూలకముగా శాస్త్రవచనము కంటె ఇతరవిషయములకు ప్రాముఖ్యము అధికమగును. ఆ పనివలన వచ్చే దుష్పరిణా మములు అతనికి తెలియును. ఆ పని శాస్త్రనిషిద్ధమని కూడ అతనికి తెలియును. అతడు స్వయముగా శాస్త్రమును చదివి ఉండవచ్చును ; లేదా, శాస్త్రవచనమును అతడు ఇత రుల వద్ద వినియుండవచ్చును. ఈ విధముగా జ్ఞానము ఉన్ననూ, అతడు ఆ నిషిద్ధకర్మను చేసినాడు. దీని యర్థమేమి ? వ్యక్తికి జ్ఞానము ఉన్ననూ, కర్తృత్వబుద్ధి తొలగిపోదు ; కావు న, కామన దూరము కాదు. అదే విధముగా, ఒక విశిష్టఫలమును ఉద్దేశించి వేదము ఒక కర్మను విధించినదనుకొనుడు. ఆ కర్మను గురించి వ్యక్తికి జ్ఞానము ఉండవచ్చును గాక ! కాని, అతడు ఆ కర్మను ఫలమునందలి కామన వలన మాత్రమే చేయును. ఆ కామన అజ్ఞానమునుండి పుట్టినది. ఆ జ్ఞానము ఉండి కూడా ఆ కర్మను చేయని జనులు ఎందరో గలరు. సాధ్యము ( లభించే ఫలము ) ను గురించి మరియు దాని సాధనమును గురించి జ్ఞానము చాల మందికి ఉన్ననూ, కొందరు ఆ సాధనమును స్వీకరించెదరు ; మరికొందరు దాని జోలికి పోరు. కావున, కేవలసాధ్యసాధనజ్ఞానము మానవునిచే కర్మను చేయించలే దు. మానవునిచే కర్మను చేయించేది అజ్ఞానము మాత్రమే. ఎట్టి అజ్ఞానము ?

సర్వకర్మలకు మూలములో అజ్ఞానము గలదు అని శ్రీశంకరులు చెప్పినారు. అన గా, కర్మను చేయువారికి వేదములో చెప్పబడిన సాధ్య-సాధన-జ్ఞానము లేదని వారి తాత్పర్యము కాదు. ఆత్మ కర్త కాదనియు, ఆత్మ పూర్ణమనియు, కర్మ వలన ఆత్మకు ఒరి గేది ఏదీ లేదనియు తెలియని వాడు మాత్రమే కర్మలను చేపట్టునని వారి తాత్పర్యము. శాస్త్రము నిత్యనైమిత్తికకర్మలను విధించుచున్నది. వాటిని చేయునది ఎవరు ? ఏ విధము గానైతే అజ్ఞానులు నిషిద్ధకర్మలను చేయుచున్నారో, అదే విధముగా ఆత్మస్వరూపజ్ఞానము లేనివారు ఈ కర్మలను చేయుదురు. కావున, శాస్త్రము విధులను మరియు నిషేధము లను ఆత్మస్వరూపజ్ఞానము లేనివారిని మాత్రమే ఉద్దేశించి బోధించుచున్నది.

అవిద్యను గురించి తనకు ఉన్న అవగాహనను ఆధారముగా చేసుకొని ఇప్పుడు మీమాంసకుడు ఒక అభ్యంతరమును లేవదీయుచున్నాడు. ఆత్మ దేహముకంటె వేరుగాను న్నది అనే జ్ఞానము లేకుండగా అగ్నిహోత్రాది నిత్యనైమిత్తికకర్మలను చేయుట సంభవము కాదు. ఎందువలన ? వేదవిహితమైన కర్మను చేసినచో, పుణ్యము వచ్చును. నిషిద్ధక ర్మను చేసినచో పాపము వచ్చును. ఇవి కంటికి కనబడునా ? కనబడవు. అవి కర్మను చేసే జీవుని ఖాతాలో జమ యగును. వాటి ఫలము వానికి తరువాత లభించును. కావున, దేహము కంటె భిన్నముగా ఆత్మ గలదనియు, దేహము నశించినా అది నశించదనియు, ఆ ఆత్మ ఈ జన్మలో చేసిన కర్మల ఫలమును అనుభవించుననియు తెలిసిన వ్యక్తి

మాత్రమే కర్మలను చేయును. ఈ జ్ఞానము లేకుండగా మానవుడు పుణ్యకర్మలను ఎట్లు చేయగల్గును ? దేహము మరణించిననూ జీవుడు మరణించడని స్వీకరించనిదే ఆ జీవుని కొరకై శ్రాద్ధకర్మను చేయుట సంభవము గాదు. అదే విధముగా నశించేది దేహము మాత్రమే అనే అవగాహన లేనివాడు స్వర్గఫలమును ఇచ్చే కర్మను చేయడు. దేహమే ఆత్మ అని స్వీకరించు వ్యక్తి యజ్ఞమును చేయడు. దేహము ఇక్కడనే నశించును. దేహభిన్నమైన జీవుడు లేనిచో స్వర్గములోనికి ప్రవేశించేది ఎవరు ? కావున, దేహభిన్నమైన ఆత్మ గలదు అనే జ్ఞానము లేనిదే, ఏ వ్యక్తియైననూ వేదవిహితకర్మను చేయడు. అనగా, కర్మకు మూలములో ఉన్నది విద్యయే గాని, అవిద్య కాదు. కావున, సర్వకర్మలకు మూలములో అజ్ఞానము గలదని చెప్పుట ఎట్లు పొసగును ? ఇది మీమాంసకుని వాదము.

ఈ వాదము సరిగాదు. ఏలయనగా, పైన చెప్పబడిన జ్ఞానము పూర్ణజ్ఞానము కాదు. ఆత్మ దేహభిన్నమైనది అనే జ్ఞానము ఇస్లాం-క్రైస్తవ-బౌద్ధములతో సహా సర్వమతములలో గలదు. దానిని జ్ఞానము అనుట కంటె విశ్వాసము అనుట మంచిది. వేదాంతము కూడ పునర్జన్మను గురించి చెప్పుచున్ననూ, ఆ చెప్పుటయందు వేదాంతమునకు తాత్పర్యము లేదు. మానవుడు మరల జన్మించునని బోధించుటకై వేదాంతము ప్రవర్తిల్లుట లేదు. ఆత్మకు ఎన్నడైననూ జన్మ లేదు. ఆత్మ మరల జన్మించే ప్రసక్తియే లేదు. ' నేను పుట్టినాను ' అని తలంచుటయే మనకు గల ప్రధానసమస్య. కావున, వేదాంతముయొక్క తాత్పర్యము పునర్జన్మ కాదు. కాని కర్మసిద్ధాంతమును పరిశీలించిన సందర్భములో వేదాంతము కూడ దానిని ప్రస్తావించును. వేదాంతములో అనేకబోధనాప్రక్రియలు గలవు. వాటిలో పునర్జన్మ ఒకటి. కాని వేదాంతమునకు వాటియందు తాత్పర్యము లేదు.

దేహము నశించిననూ, ఆత్మ నశించదని మనకు ఎట్లు తెలియును ? శాస్త్రవచనము వలన మాత్రమే ఆ విషయము తెలియుచున్నది. మరణించే వరకు ఆ విషయము ఖచ్చితముగా తెలిసే అవకాశము లేదు. మరణించిన తరువాత ఆ విషయమును నిర్ధారించుకొని మరలి వచ్చి మనకు చెప్పిన వాడు ఎవ్వడూ లేడు. ప్రతి మానవుడు ఈ దేహముతో జన్మించగానే, పూర్వజన్మస్మృతిని గోల్పోవును. ఎన్ని జన్మలనెత్తిననూ, ఈ పరిస్థితిలో మార్పు లేదు. కావున, ఇది ఒక నిగూఢరహస్యముగా మిగిలియుండును. కావున, ఇది శ్రద్ధకు సంబంధించిన విషయమని చెప్పవచ్చును. శాస్త్రము ప్రస్తావించుటచే,ఈ విషయము కూడ జ్ఞానముగనే పరిగణింప బడుచున్నది. కాని, ఈ జ్ఞానము సర్వకాలములలో పరోక్షముగనే మిగిలియుండును ( నిత్యపరోక్షం జ్ఞానమ్ ). ఈ జ్ఞానమునకు ఆత్మజ్ఞానముతో పోలిక లేదు. దేహభిన్నమైన ఆత్మను అంగీకరించే వ్యక్తి కూడ ఆత్మ కర్తయనియు, తాను సర్వము కంటె భిన్నముగా నున్న వ్యక్తిననియు, తాను కర్మఫలములను అనుభవించే భోక్తననియు భావించును. వ్యక్తి తాను కర్తననియు, భోక్తననియు భావించుచున్నంత వరకు ఆ జ్ఞానము పూర్ణము కాదు. ఆ జ్ఞానము మరియు సాధన-సాధ్య-జ్ఞానము వాస్తవమగు జ్ఞానములు కావు. అవి ఆత్మస్వరూపమునకు విరుద్ధముగా నున్నవి గనుక, అజ్ఞానములే యగును. ఆత్మ యథార్థముగా కర్త గాని, భోక్త గాని కాదు. కావుననే, కర్మకు మూలములో అజ్ఞానము గలదని చెప్పబడినది.

శ్రీశంకరులు ఇచట అజ్ఞానమును నిర్వచించి, దానితో బాటు ' చలనరూపములో నున్నది ( చలనాత్మకమ్ ) ' అని కర్మను కూడ నిర్వచించిరి. కర్మ ఏదైనా, వేదవిహిత మైన కర్మ, స్మృతివిహితమైన కర్మ, ప్రాయశ్చిత్తకర్మ, ప్రతిషిద్ధకర్మ, నిత్యనైమిత్తికకర్మ, కామ్యకర్మ, కేవలలౌకికకర్మ, కాయికకర్మ, వాచికకర్మ, మానసకర్మ ఇత్యాది సర్వక ర్మలలో ఏదో ఒక రకమైన చలనము ఇమిడియున్నది. గాలిని పీల్చుట, కన్నులను తెరచు ట, మూయుట, వినుట ఇత్యాది కర్మలలో కూడ ఒకానొక చలనము మరియు మార్పు గల వు. మానసికకర్మ కూడ చలనాత్మకమే. మనస్సు ఒక ఆలోచననుండి మరియొక ఆలోచ నలోనికి మారుచుండును. మనస్సు ఒక క్షణములో ఒక వస్తువు గురించి ఆలోచించుచుం డగా, మరు క్షణములో అది మాయమై దాని స్థానములో మరియొక వస్తువు వచ్చి చేరును. కర్తయందు నిరంతరమగు మార్పు వచ్చుచుండును. కర్త ఒక క్షణములో ద్రష్ట ; మరు క్షణములో శ్రోత ; ఇంకో క్షణములో మంత ( మననము చేయువాడు ). మార్పు మరియు చలనము లేనిదే కర్మ లేదు. మార్పులతో కూడియుండే ఈ కర్మను చేసేది ఎవరు ? అనాత్మ మాత్రమే. దేహము ఆత్మయా ? అనాత్మయా ? ఈ వాదమును చేసే మీమాంస కుని సిద్ధాంతములోనైననూ దేహము అనాత్మయే. కర్మను చేసేది దేహమేననియు, ఆత్మ దేహముకంటె భిన్నమనియు ఈ వాదికి స్పష్టముగా తెలియును. కాని ఆతడు ఏమని చెప్పును ? ' నేను చేయుచున్నాను ( అహం కరోమి ) ' అని మాత్రమే చెప్పును. ' నా చేయి ఆహుతిని ఇచ్చుచున్నది ; నా దేహము స్నానమును చేసినది ' అని ఆతడు చెప్ప డు. ' నేను ఆహుతిని ఇచ్చుచున్నాను ; నేను స్నానమును చేసినాను ' అని మాత్రమే ఆతడు చెప్పును. తన నాలుక మంత్రములను వల్లించుచున్నదని ఆతడు అనుకోడు. నాలుకకు పుణ్యఫలము లభించుననియు ఆతడు భావించుట లేదు. కర్మఫలభోక్త ఎవరు ? తాను ఫలములను పొందగలనని భావించే వ్యక్తియే. కర్మలను చేసేది దేహమే అయినా, దేహము తాను కర్తనని గాని, తాను కర్మఫలములను భోగించగలనని గాని భావించదు. కాని, తానే కర్మలను చేసినాననియు, తాను వాటి ఫలములను భోగించగలననియు వ్యక్తి ఎలుగెత్తి చాటును. అదియే అవిద్య. ఆత్మ దేహముకంటె భిన్నము అని నాకు తెలిసిననూ, అది కేవలము మరణానంతరస్థితికి సంబంధించిన విశ్వాసము మాత్రమే. కావున, నేను దేహముతో తాదాత్మ్యమును ఎన్నటికీ తప్పించుకొనలేను. ఆత్మజ్ఞానము పూర్ణము కావలె ను. లేనిచో, అది కేవలము ఒక విశ్వాసము మాత్రమే యగును. సూక్ష్మశరీరము స్థూలశరీ రముతో కలిసియున్నది. కావున, వ్యక్తికి ఆత్మజ్ఞానము కలుగనంతవరకు దేహమునందు ఆత్మబుద్ధి మరియు తాను కర్తననే ధారణ తప్పవు. కావున, దేహమునకు జరిగే ఘటనల న్నియు తనకు జరిగినట్లుగనే వ్యక్తి భావించును. దేహముకంటె భిన్నమైన ఆత్మ గలదు అనే విశ్వాసముచే ఆత్మయందలి కర్తృత్వధారణ తొలగిపోదు. ఆత్మయందు చలనము లేశమైననూ లేదు. అట్టి ఆత్మయందు కర్తృత్వము ఎక్కడనుండి వచ్చును ? ఆత్మను ఉద్దేశించి శాస్త్రమైననూ కర్మలను విధించలేదు. శాస్త్రము కర్తను మాత్రమే ఉద్దేశించి కర్మలను విధించును. శాస్త్రము సచ్చిదానంద-ఆత్మను ఉద్దేశించి కర్మలను విధించ గ లదా ? విధించలేదు. నీవు సచ్చిదానంద-ఆత్మస్వరూపుడవనియు, నీవు కర్మలను వేటినీ చేయుట లేదనియు, నీవు సంసారివి కావనియు శాస్త్రము బోధించుచున్నది. కాని,

మనస్సు ఆత్మయందు, ఆత్మ మనస్సుపైన అధ్యారోపము చేయబడియున్న పరిస్థితిని దృష్టిలో నిడుకొని శాస్త్రము కర్మలను విధించుచున్నది. ఈ పరస్పర-అధ్యాస మూలకము గనే కర్తృత్వబుద్ధి కలిగినది. ఈ బుద్ధి తప్పు. కావున, సర్వకర్మలకు మూలములో అజ్ఞానము గలదు.

మీమాంసకుడు మరల ఇట్లు వాదించుచున్నాడు : ' నేను చేయుచున్నాను ' అను వాక్యము గౌణప్రయోగము ( figure of speech ) మాత్రమే. ' నేను 60 మైళ్ల వేగముతో వచ్చితిని ' అను వాక్యమును గమనించుడు. ఆ వేగము నేను పయనించిన కారుదే గాని, నాది కాదని నాకు తెలియును. ' నేను చేయుచున్నాను ' అనే ప్రయోగము కూడ అట్టిదియే. నేను దేహము కంటె భిన్నుడననియు, పని చేసేది దేహము మాత్రమే ననియు నాకు తెలియును. అయిననూ, ' నేను చేయుచున్నాను ' అని నేను చెప్పెదను. దేహేంద్రియ మనస్సంఘాతమునందలి నేను-బుద్ధి కేవలము గౌణము మాత్రమే. ఆ బుద్ధి మిథ్యాబుద్ధి కాదు. ' దేహము నేను కాదు ' అని తెలిసిన వ్యక్తి కూడ ' నేను లావుగా నున్నాను' అని పలుకును. అతడు ఈ వచనమును ముఖ్యార్థములో గాక, గౌణార్థములో ప్రయోగించినాడు. ఆ ప్రయోగమునకు కారణము త్రాడును చూచి పాము అని భ్రాంతి పడిన విధముగా మిథ్యాప్రత్యయము కాదు. దేహమే ఆత్మ అనియు, ఆత్మ దేహమేననియు భ్రాంతిపడిన వ్యక్తి కూడ ' నేను చేయుచున్నాను ( అహం కరోమి ) ' అని చెప్పును. ఆ విధమైన భ్రాంతికి అవకాశము గలదు. కాని ప్రస్తుతములో కర్తృత్వము గౌణమే గాని, మిథ్యాప్రత్యయము కాదు.

శ్రీశంకరులు ఈ వాదమును త్రోసిపుచ్చినారు. ఇదియే సత్యమైనచో, దేహము నుండి పుట్టిన సర్వము గౌణమే యగును. ఈ విషయమును శ్రీశంకరులు తరువాత మరల వివరించగలరు. ఇంతలో ప్రతివాది తన వాదమును మరింత వివరించుచున్నాడు. దేహము మొదలగువాటియందు గల 'నేను' అనే ధారణ గౌణము. వేదములో కూడ ఇట్టి ప్రయోగములు గలవు. నీవు పుత్రుడు అనే పేరు గల ఆత్మవు ( ఆత్మా వై పుత్రనామాసి ) అని వేదము చెప్పుచున్నది. మనము ముందుగా ఈ గౌణము అనే పదమును స్పష్టముగా తెలుసుకోవాలి. గౌణము అనగా గుణములకు సంబంధించినది. తండ్రి కొడుకుతో ' నీవు నాకంటె వేరుగా లేవు ' అని చెప్పును. ఇది గౌణప్రయోగము. ఆ వాక్యమునకు తాత్పర్యమేమనగా, ' నీవు ఆనందముగా ఉంటే నేను ఆనందిస్తాను ; నీవు దుఃఖిస్తే నేను దుఃఖిస్తాను'. తండ్రి, కొడుకుల మధ్య గల భేదము స్పష్టముగా గోచరించుచునే యుండును. అయిననూ, ఆ ఇద్దరు ఒక్కటియే అని చెప్పే ప్రయోగము గలదు. గౌణప్రయోగమనగా నిదియే. తండ్రినుండి పుట్టిన కొడుకు తండ్రియొక్క ప్రతిరూపమే యగును. అంతే గాక, తండ్రికి కొడుకుతో పూర్ణతాదాత్మ్యము ఉండుటచే, తనకు తన కుమారునకు భేదము లేదని ఆయన చెప్పవచ్చును. ఇది గౌణప్రయోగమునకు వైదికదృష్టాంతము. లోకవ్యవహారములో కూడ మనకు ఇటువంటి ప్రయోగములు కానవచ్చును. 'ఈ ఆవు నా జీవితము' అని ఒకడు చెప్పును. ఆ మాటను చెప్పువానికి తనకు, ఆవునకు మధ్య గల భేదము స్పష్టముగా తెలియుచునే యుండును. కాని, అతనికి ఆవు జీవనాధారము అగుటచే, ఆవు

తన జీవితమని ఆతడు చెప్పవచ్చును. ఇది కూడా గౌణప్రయోగమే. అదే విధముగా, 'నేను చేయుచున్నాను' అనునది గౌణప్రయోగమని ప్రతివాదియొక్క అభిప్రాయము. ఈ మాటను చెప్పువానికి ఆత్మ దేహముకంటె భిన్నమనియు, దేహము కూడ ఆత్మ కంటె భిన్నమనియు తెలియుచునే యుండును గనుక, ఇది భ్రాంతిప్రత్యయము కాదు. మిథ్యాప్రత్యయములో రెండు పదార్థముల గుణములు సరిగా తెలియకపోవుటచే భ్రాంతి కలుగును. ఉదాహరణకు, ఒకడు స్తంభమును చూచి మనిషి యని భ్రమపడినాడు. స్తంభము స్పష్టముగా కనబడక పోవుటచే, దానిపై మనిషి ఆరోపించ బడినాడు. ఇది భ్రాంతి. ఇట్టి సందర్భములలో ఆరోపించబడిన వస్తువు మాత్రమే కానవచ్చును. అధిష్ఠానము కానరాదు. కాని, ' నేను యజ్ఞమును చేయుచున్నాను ' అని చెప్పిన వానికి దేహము, ఆత్మ వేర్వేరుగా తెలియుచుండును గనుక, ఇది గౌణమే గాని, మిథ్యాప్రత్యయము కాదు.

శ్రీశంకరులు ఈ వాదము సరిగాదని ప్రత్యుత్తరమునిచ్చుచున్నారు. గౌణప్రత్యయమును గురించి తెలియదగిన అంశములు గలవు. గౌణప్రత్యయములో అధిష్ఠానమునందు గల క్రియాదికముతో ఆరోపితమునకు సంబంధము ఉండదు. ఉదాహరణకు, తనకు తన కుమారునకు భేదము లేదని తండ్రి చెప్పిననూ, కుమారుడు భోజనము చేసినచో, తండ్రి భోజనము చేసినట్లు కాదు. కాని, ప్రస్తుతములో, కర్మను చేసేది దేహేంద్రియమనస్సంఘాతము కాగా, ఆత్మయందు ' నేను కర్తను ' అనే ధారణ దృఢముగా గలదు. అది లేని వ్యక్తి అగ్నిహోత్రాదికర్మను ఎట్లు చేయగల్గును ? కాని వైదికుడు చేయుచునే యున్నాడు. అనగా, ఆత్మయందు కర్తృత్వము అధ్యారోపితమైనదని స్పష్టమగుచున్నది. దేహముచే చేయబడే సర్వము ఆత్మకు అంటగట్టబడుచున్నది. గౌణప్రత్యయములలో పరిస్థితి ఇది కాదు. కుమారుడు చేసిన కర్మ తండ్రి చేసినట్లు కాదు. కాని, ప్రస్తుతములో దేహము కర్మను చేయుచుండగా, వ్యక్తి తాను కర్మను చేయుచున్నానని భావించుచున్నాడు. ఇది మిథ్యాప్రత్యయమే గాని, గౌణప్రత్యయము కాదు.

ఈ విషయమును శ్రీశంకరులు ఇంకనూ వివరించుచున్నారు. పోలికను చెప్పే ప్రయోగములు రెండు రకములుగా నున్నవి. ఈతడు ధైర్యములో పులివంటి వాడు అను వాక్యములోని పోలిక స్పష్టముగా తెలియుచున్నది ( వ్యక్త-ఉపమా ). ఈతని ధైర్యము పులియొక్క ధైర్యముతో పోల్చబడినది. ఇంకో రకము వాక్యములో పోలిక స్పష్టముగా నిర్దేశించబడదు. దీనికి రూపకము, లేక లుప్త-ఉపమా అని పేరు. ' దేవదత్తుడు సింహము ' అను వాక్యము దీనికి దృష్టాంతము. సింహలక్షణములు అన్నియు దేవదత్తుని లక్షణములతో సరిదూగి యుండవు. సింహమునకు నాలుగు కాళ్లు ఉండగా, దేవదత్తునకు రెండు మాత్రమే గలవు. సింహమునకు జూలు ఉండును. దేవదత్తునకు జూలు లేదు. ఈ విధముగా అనేకభేదములు గలవు. కాని, దేవదత్తుడు సింహము అను ప్రయోగము గలదు. దీని యర్థమేమి ? సింహముయొక్క ఒకానొక లక్షణముతో దేవదత్తునకు సామ్యము గలదు. సింహపదము ఆ సామ్యమును నిర్దేశించును. ఆతనికి సింహముయొక్క పరాక్రమము గలదు. ఇది గౌణప్రయోగము. ఈ పోలిక ఉన్ననూ, సింహము చేసే పనిని దేవదత్తుడు సుతరాము చేయలేడు. సింహము తుపాకి లేకుండగనే ఏనుగును, పులిని చంపగలదు. ఆ పనిని దేవదత్తుడు చేయగలడా ? అదే విధముగా, 'ఈ విద్యార్థి నిప్పు' అనే ప్రయోగ

ములో తేజస్సు, లేదా దేహవర్ణము అనే అంశములో పోలిక గలదు. ఆ విద్యార్థి తలపై టీని కాచుకొన వచ్చునని యర్థము కాదు. కావున, గౌణప్రయోగములలో పోల్చబడే వస్తువు దేనితో పోల్చబడినదో దాని ధర్మములను అన్నిటినీ ఖచ్చితముగా కలిగియుండు నని అనుకోరాదు.

కాని, ' నేను చేయుచున్నాను ' అను వాక్యమును మనము ముఖ్యార్థములో మాత్రమే ప్రయోగించుచున్నాము. మన దృష్టిలో ఆత్మయే కర్త. ఆత్మ కర్త కాదు అన్నచో, అదియే వేదాంతము. దేహము, మనస్సు వివిధకార్యములను చేయుచున్ననూ, నేను దేనినీ చేయుట లేదు అని నీకు తెలిసినచో, నీకు ఆత్మ సచ్చిదానందమని తెలిసినట్లే. ఆత్మ సచ్చిదానందమని తెలిసినాడు మాత్రమే ఆత్మ అకర్త యని చెప్పగల్గును. అట్లు చెప్పువానితో వాదించవలసినది ఏదీ లేదు. కాని, దేహము చేసే పనులన్నియు ఆత్మయే చేయుచున్నదనియు, దేహధర్మములే ఆత్మధర్మములనియు స్వీకరించినచో, ఆ అవగాహన తప్పు. అది మిథ్యాప్రత్యయమే గాని, గౌణము కాదు. ఒక వ్యక్తిని, లేదా వస్తువును స్తుతించుటకు మాత్రమే రూపకమును ప్రయోగించెదరు. సింహము చేసే పనిని దేవదత్తుడు చేయలేడు. నిప్పు చేసే పనిని బ్రహ్మచారి చేయలేడు. ఆ ప్రయోగములు గౌణములు. దీనికి భిన్నముగా, మానవుడు మిథ్యాప్రత్యయము వలన దుఃఖమునకు వశుడగును. దేహమే ఆత్మయని భ్రాంతిని పొందియున్న వ్యక్తికి పుణ్యపాపములు, సుఖదుఃఖములు, రాగద్వేషములు మరియు ఇతరములగు అభీష్టము కాని విషయములు సంప్రాప్తమగును. ఒక్క మాటలో చెప్పాలంటే, అదియే సంసారము.

ఇంతే గాక, గౌణప్రయోగమును వినే వ్యక్తికి కూడ ఆ ప్రయోగముచే నిర్దేశించబడే వస్తువు స్పష్టముగా వివిక్తముగా తెలియుచుండును. దేవదత్తుడు సింహము కాదనియు, బ్రహ్మచారి నిప్పు కాదనియు వినే వానికి తెలియుచునే యుండును. వినే వానియందు తప్పు అభిప్రాయము కలుగుట లేదు. వానియందు వివేకము ఉన్నది. వివేకము లేని వ్యక్తి ఒక వస్తువును చూచి మరియొకటి యని పొరపడును ( అతస్మింస్తద్బుద్ధిః ). అదియే మిథ్యాప్రత్యయమనబడును. అతస్మింస్తద్బుద్ధిః అనునది మిథ్యాప్రత్యయ-గౌణప్రత్యయములకు సమానమే అయినా, మిథ్యాప్రత్యయము అవివేకమునుండి పుట్టును. గౌణమునకు, మిథ్యకు భేదము ఇదియే. దేవదత్తుడు దేవదత్తుడే గాని సింహము కాదు అని తెలిసి దేవదత్తుడు సింహము అని చెప్పినచో, అది గౌణప్రత్యయమగును. చెట్టు మోదును చూచి మనిషి యని పొరపడినచో, అది మిథ్యాప్రత్యయమగును. ఈ రెండింటి మధ్య గల భేదము వివేకమే.

' నేను కర్తను. వేదము నన్ను కర్మను చేయుమని ఆదేశించుచున్నది. కావున, నేను కర్మను చేయుచున్నాను ' అని వైదికుడు చెప్పును. కర్మను చేసేది దేహేంద్రియమనస్సంఘాతము మాత్రమే. అదియే కర్త. కాని, ఈతని దృష్టిలో అదియే ఆత్మ. ఆత్మ దేహము కంటె వేరుగానున్నదని ఈతడు విశ్వసించును. కాని, ఆత్మయే కర్తయని ఈతడు భ్రాంతి పడుచున్నాడు. వివేకము లేకపోవుటచే కలిగిన ఈ తప్పు నిర్ణయమునకు మిథ్యాప్రత్యయము అని పేరు. రెండు వస్తువుల గురించి వివేకజ్ఞానము ఉన్న సందర్భములలో

మాత్రమే గౌణప్రత్యయము సంభవమగును. కావున, దేహేంద్రియసంఘాతము విషయములో మనకు గల ' నేను ' అనే ధారణ గౌణము మాత్రమే అను వాదము పొసగదు.

దేవదత్తునకు, సింహమునకు గల భేదము తెలిసియున్ననూ, ఒకానొక అంశములో ఆ ఇద్దరి మధ్య గల పోలికను చెప్పుటకై ' దేవదత్తుడు సింహము ' అని చెప్పినచో, అది గౌణప్రత్యయమగును. ఆ ప్రయోగములో ముఖ్యవస్తువు అగు దేవదత్తుడు గౌణవస్తువు అగు సింహము చేసే పనులను చేయడని మనకు స్పష్టముగా తెలియుచుండును. అదే విధముగా, ముఖ్య-ఆత్మ దేహము కంటె భిన్నము అనియు, దేహేంద్రియమనస్సంఘాతమునందు ఆత్మశబ్దప్రయోగము గౌణము మాత్రమే ననియు తెలిసియున్న పక్షములో పరిస్థితి ఈ క్రింది విధముగా నుండును. గౌణ-ఆత్మయగు దేహేంద్రియమనస్సంఘాతము చేసే కర్మను ముఖ్య-ఆత్మ చేయదు. 'నేను' అను ప్రత్యయములో విషయము అయ్యే తత్త్వమే ముఖ్య-ఆత్మ. గౌణప్రత్యయము ఉన్న సందర్భములలో ముఖ్య-గౌణములకు గల భేదము స్పష్టముగా తెలియుచుండును. వాటిలో ఒక దాని క్రియలు రెండవ దాని యందు ఆరోపించబడవు. 'నా కుమారుడు నా కంటె వేరు కాదు' అని తండ్రి చెప్పిననూ, కుమారుడు భోజనము చేసినచో, తండ్రి చేసినట్లు కాదు. గౌణసింహము అగు దేవదత్తుని కర్మ వాస్తవసింహము యొక్క కర్మ కాదు. గౌణ-అగ్ని యగు బ్రహ్మచారి చేసే కర్మలకు ముఖ్య-అగ్నితో సంబంధము లేదు. గౌణ-అగ్నియగు బ్రహ్మచారి పుస్తకమును చదువుచుండగా, ముఖ్య-అగ్ని పుస్తకమును చదువుచున్నదని అనుకొనే వారు లేరు. ప్రతివాది అభిప్రాయములో ఆత్మ గౌణప్రత్యయముచే మాత్రమే దేహము అగుచున్నది. అనగా, దేహము చేసే కర్మలు దేహముచే చేయబడినవి అగునే గాని, ఆత్మచే చేయబడేవి కావు. కాని, ' నేను కర్తను ' అని అతడు చెప్పుచున్నాడు. శ్రుతి తనను ఉద్దేశించి కర్మలను విధించుచున్నదనియు, అందు వలననే తాను కర్మలను చేయుచున్నాననియు, తాను కర్మ ఫలమును అపేక్షించుచున్నాననియు అతడు చెప్పును. కావున, అతనియందు కర్తృత్వ బుద్ధి గలదు. అది గౌణము కాదు. అది గౌణమే అయినచో, కర్మలను చేసేది దేహమే గాని, తాను కాదని అతడు తలచి యుండెడివాడు. కాని అతడు తానే కర్మలను చేసినానని భావించుచున్నాడు. పైగా, కర్మఫలమును కూడ అపేక్షించుచున్నాడు. కావున, ఇది మిథ్యాప్రత్యయమే గాని, గౌణప్రత్యయము కాదు. దేహమునకు, ఆత్మకు మధ్యలో మిథ్యా సంబంధము గలదని స్పష్టముగా తెలియుచున్నది. వాటి మధ్యలో పరస్పరభ్రాంతి గలదు.

దీనిని శ్రీశంకరులు మరింత వివరించినారు. దేనితో ముఖ్యవస్తువు పోల్చబడుచున్నదో, అది చేసే పనులను ముఖ్యవస్తువు చేయదని మనము చూచియున్నాము. దేవదత్తుడు చేసే పనిని సింహము చేయలేదు. కాని బహుశః సింహము చేసే పనిని దేవదత్తుడు చేయగలడేమో ? ముఖ్యసింహమునందు క్రౌర్యము గలదు. అది దేవదత్తుని యందు కూడ గలదు గదా ! శ్రీశంకరులు ఈ వాదమును త్రోసిపుచ్చినారు. దేవదత్తుడు సింహము అని మనము చెప్పుటలో, దేవదత్తుడు యథార్థముగా సింహము చేసే పనులను చేయునని మన అభిప్రాయమా ? కాదు. మనము కేవలము దేవదత్తుని ఒకానొక గుణమును సింహముతో పోల్చి ప్రస్తుతించుచున్నాము. అంతే. దేవదత్తుని కర్మలకు

సింహముయొక్క కర్మలతో సామ్యమును చెప్పుట మన తాత్పర్యము కాదు. ఇట్టి వాక్యములు కేవలము వ్యక్తిని స్తుతించుట కొరకు మాత్రమే ఉద్దేశించ బడును. అదే విధముగా, 'బ్రహ్మచారి నిప్పు' అని చెప్పుటలో మన తాత్పర్యమేమనగా, అతడు నిప్పు వలె ప్రకాశించే దేహవర్ణము గలవాడని మాత్రమే. శ్రీశంకరుల కాలములో అటువంటి దేహవర్ణమునకు కొంత మహత్త్వము ఆపాదించ బడెడిది. అంతే. ఇంతే గాక, ఆ స్తుతించబడే వ్యక్తికి తాను దేనితో పోల్చబడినాడో, తాను అది కాదని తెలియుచునే యుండును. దేవదత్తునకు తాను సింహము కాదనియు, బ్రహ్మచారికి తాను నిప్పు కాదనియు తెలియును. అందు వలననే, వారు ఆ స్తుతిని స్వీకరించి కృతజ్ఞతలను చెప్పవచ్చును. తాము దేనితో పోల్చబడినామో, దాని కర్మలను తాము చేయబోమని కూడా వారికి తెలియును. సింహము చేసే కర్మలు తన కర్మలు కావని దేవదత్తునకు తెలియును. నిప్పు చేసే పని తన కర్మ కాదని బ్రహ్మచారికి తెలియును. ' నేను నిప్పును కాను ; నీళ్లను కాచుటకు నేను పనికి రాను ' అని అతనికి తెలియును. అదే విధముగా, దేహేంద్రియమనస్సంఘాతము గౌణ-ఆత్మయే గాని, ముఖ్య-ఆత్మ కాదు అనే పక్షములో, 'దేహేంద్రియాదుల కర్మలతో ముఖ్య-ఆత్మ నగు నాకు సంబంధము లేదు' అనే అవగాహన ఉండుట యుక్తియుక్తముగా నుండును. 'నేను కర్తను ; ఈ కర్మలు నావి ' అనే అవగాహన ఉండెడిది కాదు. కర్మలను దేహేంద్రియమనస్సంఘాతము మాత్రమే చేయుచున్నదనియు, దాని కర్మలకు ముఖ్య-ఆత్మ యగు తాను కర్త కాదనియు అతనికి స్పష్టముగా తెలిసియుండవలెను. అట్టి జ్ఞానము గౌణప్రత్యయమునకు అనురూపముగా నుండునని శ్రీశంకరులు వివరించిరి.

ఇప్పుడు మనము ప్రతివాదిని ఒక ప్రశ్నను వేయవలసి యున్నది. కర్మలను చేసేది నీవు కానిచో, కర్మఫలము ఎవరి కొరకు ? నీ కొరకు కారాదు. మరియు, కర్మలను చేసేది నీవు కానిచో, శాస్త్రము నిన్ను ఉద్దేశించి ఎట్లు కర్మలను విధించును ? ఉదాహరణకు, నల్లని జుట్టు గల బ్రాహ్మణుడు ( బ్రాహ్మణః కృష్ణకేశః ) ఒక కర్మను చేయవలెనని శాస్త్రము చెప్పుచున్నది. వయస్సు, కులము, వర్ణము, ఆశ్రమము మొదలగు వాటిపై ఆధారపడే ఇటువంటి నియమములు అసంఖ్యాకములుగా నున్నవి. అవి ఎవరికి వర్తించును ? దేహేంద్రియమనస్సంఘాతమునందు ' నేను ' అనే ధారణ లేకుండగా, మానవుడు ఈ కర్మలను చేసే అర్హతను పొందే ప్రసక్తియే లేదు. అటువంటి తాదాత్మ్యము గల వ్యక్తి మాత్రమే ' నేను బ్రాహ్మణుడను ' అని తలపోయును. శ్రుతి బ్రాహ్మణుని ఉద్దేశించి ఒకానొక కర్మను విధించుచున్నది. తాను బ్రాహ్మణుడని భావించు వానికి మాత్రమే ఆ విధి వర్తించును. కావున, తాను బ్రాహ్మణుడనని తలపోయుట గౌణప్రత్యయము కాదనియు, మిథ్యాప్రత్యయము మాత్రమే ననియు స్పష్టమగుచున్నది. ఈ రెండింటికి గల భేదము సుస్పష్టముగా తెలియుచున్నది. కావున, దేహము గౌణ-ఆత్మ మాత్రమే అయినచో, ' నేను కర్తను ' అనే ధారణ యుక్తియుక్తముగా నుండదు.

నైయాయికులు మరియొక సలహాను ప్రతిపాదించిరి. వారు కూడ ఆత్మ కర్త కాదనియు, గౌణముగా మాత్రమే కర్మలను చేయుననియు స్వీకరించెదరు. ఆత్మ తనయొక్క స్మృతి, కామన మరియు ప్రయత్నముల ద్వారా కర్మలను చేయునని వారి వాదము. మానవుడు ఒక వస్తువును పూర్వములో చూచియుండును ; లేదా, వినియుండును ; లేదా, అను

భవించి యుండును. కావుననే, అతడు దానిని ఇప్పుడు మరల కోరును. ఈ విధముగా కామనకు మూలము స్మృతి లేక జ్ఞానము అగుచున్నది. తరువాత, ఆ కోరికను నెరవేర్చు కొనుటకై ప్రయత్నము ఆవశ్యకమగును. ఈ తీరున, ఈ మూడు సర్వకర్మలకు కారణము లగుచున్నవి. కావున, ఆత్మ తనంతట తానుగా కర్మలను చేయదు. స్థూలదేహము, మన స్సు, ఇంద్రియములు జడములు గనుక, తమంతట తాముగా కర్మలను చేయజాలవు. కావున, దేహేంద్రియమనస్సంఘాతమునకు కర్తృత్వము ఉండలేదు. ఆత్మయే కర్త. అది దేహేంద్రియమనస్సంఘాతముయొక్క సాహాయ్యముతో కర్మలను చేయును. అనగా, తార్కికులు కూడ దేహభిన్నమైన ఆత్మను అంగీకరించుచున్నారు. కాని, ఆత్మ దేహేం ద్రియమనస్సంఘాతముయొక్క సాహాయ్యముతో కర్మలను చేసే కర్త యని వారు స్వీకరిం చెదరు. వారి దృష్టిలో కూడ మిథ్యాప్రత్యయము లేదు. ఆత్మయే కర్త. దీనిలో భ్రాంతికి అవకాశము లేదు అని వారు వాదింతురు.

ఈ వాదము నిలబడదని శ్రీశంకరులు వివరించిరి. ఏలయనగా, తార్కికులు చెప్పె
స్మృతి-కామనా-ప్రయత్నముల వెనుక కూడ తప్పు అవగాహన గలదు. స్మృతి-కామనా-ప్ర
యత్నములు కూడ మిథ్యాప్రత్యయమునుండియే పుట్టుచున్నవి. ఎట్లు ? మిథ్యాప్రత్యయ
ములో మున్ముందుగా అనాత్మ యగు దేహాదులయందు ఆత్మబుద్ధి కలుగును. దానివలన
వ్యక్తియందు తాను అపూర్వుడననే ధారణ నిర్మాణమగును. అపుడా వ్యక్తి తన వ్యక్తిత్వ
మును నిరూపించుకునే ప్రయత్నమును మొదలిడును. వ్యక్తి సచేతనుడు గనుక, తన
గురించి తాను కొన్ని నిష్కర్షలను చేసుకొనును. ఆత్మ అపూర్వము అనేది వాటిలో మొదటి
ది. అపుడాతడు ఆ అపూర్వవ్యక్తిత్వమును నిర్మాలించుటకై ఆకాంక్షించును. కాని, ఆతడు
ఆ సత్యమును గుర్తించక పోవుటచే, తనలో మనస్సులో చెలరేగే వివిధకామనలను పరి
పూర్తి చేసుకొనుటకు యత్నించును. ఆతడు పుట్టి పెరిగిన సంస్కృతి మరియు ఆతనికి
గల అభిరుచులను బట్టి, ఆతనికి కొన్ని వస్తువులు నచ్చుతాయి ; మరికొన్ని నచ్చవు. అన
గా, ఆతనికి రాగద్వేషములు గలవు. ఆతడు కోరిక పుట్టగానే, ఆ కోరబడే వస్తువును
సంపాదించి అనుభవించుటకై యత్నమునారంభించును. ఆతడు తనకు అభీష్టము కాని
వారినుండి దూరముగా నుండుటకు కూడ ప్రయత్నించుచుండును. ఆ అనుభవము ఆతని
మనస్సులో స్మృతిరూపములో స్థిరపడును. ఇట్టి సంస్కారరాశి భవిష్యత్తులో ఇంకనూ అధి
కమగు కామనలకు ఆలంబనమగును. వాటి వలన ప్రయత్నము కూడ నిరంతరముగా ఆవ
శ్యకమగుచుండును. ఈ చక్రము తిరుగుచుండును. వాస్తవములో ఈ భ్రమణము అనాది
యని శ్రీశంకరులు వివరించిరి. దేహేంద్రియమనస్సంఘాతమే ఆత్మ యనెడి మిథ్యాప్ర
త్యయము వలన కామనలు, కర్మలు, కర్మఫలములు, వాటి వలన ఇష్ట-అనిష్టములగు
అనుభవములు, వాటి వలన సంస్కారములు క్రమముగా కలిగి స్మృతిలో నెలకొనును.
కావున, ఈ సర్వము మిథ్యాప్రత్యయము నుండి పుట్టినది. కావున, ఆత్మ కర్త యని ప్రక
టించి, స్మృతి-కామనా-ప్రయత్నముల చక్రములో పరిభ్రమించుచుండుట అవివేకము.
వీటితో బాటు ఆత్మ కర్తయనే ధారణ కూడ మిథ్యాప్రత్యయమునుండియే పుట్టినది. కావు
న, కర్మాదుల ఉత్పత్తికి మిథ్యాప్రత్యయము మూలము అగుచున్నది.

శ్రీశంకరులు ఇంకనూ ఇట్లు వివరించిరి. ఈ సంసారమునకు ఆది లేదు. మానవుడు పుట్టుక తోడనే ఈ మిథ్యాప్రత్యయముతో పుట్టినాడు. ఇది ఎక్కడనుండి వచ్చినది ? పూర్వజన్మనుండి. పూర్వజన్మకూడ మిథ్యాప్రత్యయము వలననే కలిగినది. దీనికి ఆది లేదు అనే విషయమును మనము పుట్టుక తోడనే ఉన్న పరిస్థితిని బట్టి ఊహించవలెను. మిథ్యాప్రత్యయము మనయందు పరిచ్ఛిన్న భావనను కలిగించును. దానినుండి కామన పుట్టును. కామనాపరిపూర్తికై మనము కర్మలను చేపట్టెదము. కర్మ అనుభవమునకు దారి తీయును. అనుభవము స్మృతిరూపముగా స్థిరపడును. ఈ చక్రము నిరంతరముగా తిరుగుచుండును. ఈ పరిస్థితి గతములో ఇటులనే ఉండినదనియు, భవిష్యత్తులో కూడ ఇటులనే కొనసాగుననియు మనకు దీనిని బట్టి స్పష్టమగుచున్నది. మానవుడు తాను కర్తనని భావించుచున్నంత వరకు మిథ్యాప్రత్యయము ఉన్నట్లే.

దీనిని మరింత వివరించవచ్చును. మనము ఈ జన్మలో దేహేంద్రియమనస్సంఘాతముతో తాదాత్మ్యమును పొంది కర్మఫలములననుభవిస్తూ ఉంటాము. ఆ అనుభవముల నుండి రాగద్వేషములు నిర్మాణమగును. వాటికి వశులమై మనము ధర్మ-అధర్మ రూపమైన కర్మలను చేస్తాము. పూర్వజన్మలో మాత్రమే గాక, అంతకు ముందు జన్మలలో కూడ పరిస్థితి ఇదియే. దీనిని బట్టి, అజ్ఞానముచే సృష్టించబడినది, ఆది లేనిది, భూతభవిష్యత్కాలములలో కొనసాగేది అగు సంసారము గలదని మనము ఊహించగలము. మానవుడు తాను దేహేంద్రియమనస్సంఘాతముతో తాదాత్మ్యమును చెంది ఉండుటయే మిథ్యాప్రత్యయము. దీని వలననే, ఒంటరితనము, భేదబుద్ధి, పరిచ్ఛిన్నభావన గలవు. పరిచ్ఛిన్న భావననుండి రాగద్వేషములు ఉదయించును. వాటిని పరిపూర్తి చేసుకొనుటకై మానవుడు మంచి-చెడు కర్మలను చేసి, వాటి పలన సుఖదుఃఖములను అనుభవించును. ఇంతే గాక, ఆ కర్మలకు అదృష్టఫలము కూడ ఉండును. దాని ఫలమును మానవుడు భవిష్యత్తులో మరియొక జన్మలో అనుభవించ వలసి యుండును. ఇదియే సంసారము. దీనికి ఆది లేదు. ఇది అజ్ఞానమునుండి పుట్టినది. అవివేకముచే దేహాదులతో తాదాత్మ్యమును చెంది ఉండుటయే ఈ అజ్ఞానము. దానికి ఆది లేదు. అది నశించుటకు కావలసిన జ్ఞానము ఇంకనూ ఉదయించ లేదు. కావున, అది భవిష్యత్తులో కూడ కొనసాగుచుండునని మనము తేలికగా ఊహించవచ్చును. అది అంతము అయ్యేది ఎప్పుడు ?

జ్ఞాననిష్ఠను పొంది దాని వలన కలిగే సర్వకర్మసన్న్యాసము వలన సంసారము పూర్తిగా విలీనమగునని శ్రీశంకరులు వాక్రుచ్చిరి. ప్రతిబంధకములు లేని జ్ఞానమునందు మాత్రమే ' నేను కర్తను ' అనే మిథ్యాప్రత్యయము విలీనమగును. అప్పుడు తత్క్షణమే సర్వకర్మసన్న్యాసము అర్థప్రాప్తము ( సహజసిద్ధము ) అగును. ఆత్మ స్వరూపము నైష్కర్మ్యము అను జ్ఞానము చేత మాత్రమే సర్వకర్మసన్న్యాసము సంభవమగును. అదియే ఆత్యంతికసంసారోపరమము. ఆత్యంతికమనుటకు కారణమేమి ? నిద్ర, మహాప్రలయము ఇత్యాది కొన్ని విశిష్టస్థితులలో జీవుడు తాత్కాలికముగా సంసారమునుండి పూర్తిగా విముక్తుడై యుండును. కాని, ఇంతలో ఆ స్థితి అంతమై సంసారము మరల ఆరంభమగును. కావున, ఆత్మ కర్త కాదు అనే జ్ఞానమునందు మాత్రమే సంసారము పూర్తిగా విలీనమగునని నిర్ధారించ బడినది.

ఇచట ఒక ప్రశ్న ఉదయించును. సంసారము శమించినదని నిర్ధారించుట ఎట్లు పొసగును ? జ్ఞాననిష్ఠ వేరే ; సంసారోపశమము వేరే. జ్ఞానము వలన సంసారము ఎట్లు ఉపశమించును ? జ్ఞానము తనంత తానుగా పరిష్కరించే సమస్య ఏదీ లేదు. రోగమును తగ్గించే మందు గురించి ఒకనికి పూర్ణజ్ఞానము ఉండవచ్చును.కాని, ఆ జ్ఞానము వలన రోగము తగ్గదు. ఆచరణ తోడు కాని కేవలజ్ఞానము వ్యర్థము గదా ! ఆధునికవేదాంతులు తరచుగా ఇటులనే చెప్పుచుందురు. ఆత్మ నిత్యము అనే బౌద్ధికజ్ఞానము మాత్రమే మీకు గలదనియు, నీవు ఆ నిత్యత్వమును అనుభవించవలెననియు వారు చెప్పెదరు ( శాశ్వత తత్త్వమును అనుభవించ వలసినది ఎవరు ? శాశ్వతతత్త్వమును ఎంత కాలము అనుభ వించ వలెను ? ఒక నిముషమా ? ఒక గంటయా ? ఈ వాదము అర్థరహితము ). ఇచటి ప్రశ్న యేమనగా, సంసారము మన కళ్ల యెదుట కొట్టవచ్చినట్లు కానవచ్చుచున్నది. మనము ఈ పరిస్థితులను అన్నింటినీ గాఢముగా అనుభవించుచున్నాము. ఈ అనుభవ ములు సంసారమునుండి విముక్తికి అనుకూలముగా లేవు. ఉదాహరణకు, నాకు పరిచ్ఛేద ములకు లోబడి యుండే స్థూలదేహము గలదు. నాకు జ్ఞాననిష్ఠ ఉన్నంత మాత్రాన సంసారము ఎట్లు తొలగిపోవును ? శ్రీశంకరులు ఈ ప్రశ్నకు సమాధానమునిచ్చుచున్నారు. దేహమునకు ఆత్మతో, మరియు ఆత్మకు దేహముతో గల తాదాత్మ్యమే స ము. ఈ తాదాత్మ్యము తప్పు. ఇది అజ్ఞానమునుండి పుట్టినది. అజ్ఞానము తొలగి పోగా ఈ భ్రాంతిమూలకమగు తాదాత్మ్యము కూడ తొలగి పోవును. అజ్ఞానమును తొలగిం యెట్లు ? జ్ఞానముచేత మాత్రమే. అజ్ఞానము తొలగిన తరువాత ఇంకో దేహము ఉ కావున, సంసారము శాశ్వతముగా సాగే అవకాశము లేదు. ఇచట ఒక ప్రశ్న చును : ' ఆత్మజ్ఞానము వేరే ; దేహముతో తాదాత్మ్యము వేరే. ఆత్మజ్ఞానమును పిదప నేను దేహముతో తాదాత్మ్యమును ఎట్లు విడువగల్గుదును ? నాకు జ్ఞానము చ్చును ; కాని దేహతాదాత్మ్యము కూడ కొనసాగవచ్చును గదా ! ' ఇది సంభ కాదని శ్రీశంకరులు ప్రత్యుత్తరమునిచ్చినారు. జ్ఞానము ఉండి కూడా, దేహముతో త్మ్యము కొనసాగునన్నచో, ఆ జ్ఞానము ఎట్టిది ? ఆత్మ సచ్చిదానందము నము అనే పక్షములో, ఆ జ్ఞానము ఉండియు ఆత్మకు దేహముతో తాదాత్మ్యము గును అను మాటకు అర్థము ఏమి ? దేహమునందు ఆత్మ అనే భ్రాంతి ఉండే , ఆత్మ సచ్చిదానందమనే జ్ఞానము కలిగినదని చెప్పుట ఎట్లు కుదురును చ్చిదానందము అని నీకు తెలిసినచో, దేహము ఆత్మయని భ్రాంతిపడుట వమగును ? ' నా అనుభవము అట్లు ఉన్నది ' అని నీవు అన్నచో, నీకు అ ండదని ఎవరు చెప్పినారు ? ఈ అనుభవము అనేది పెద్ద సమస్య యని సుగా చెప్తూ ఉంటాను. నీవు దేహేంద్రియమనస్సంఘాతమును అనుభవించవని చెప్పినారు ? ఆ అనుభవము ఆత్మ సచ్చిదానందమనే జ్ఞానమునకు విరోధి దేహము సచ్చిదానంద-ఆత్మకంటె భిన్నముగా లేదు. కాని, సచ్చిదానంద-ఆత్మ ఈ దేహాదికము కాబోదు. ఈ సత్యము నీకు స్పష్టముగా తెలిసియూ, ఇంకనూ త్మ్యము అనుభవములో నుండుట సంభవము కాదు.

ప్రతిపక్షి ఇంకనూ ఇట్లు వాదించును : ఆత్మ సచ్చిదానందమని తెలిసిననూ, దేహముతో తాదాత్మ్యము తొలగిపోదు. జ్ఞానము కలిగిన తరువాత ఆకలి ఉన్నదా ? లేదా ? జ్ఞాని భోజనమును చేయుచున్నాడా ? లేదా ? భోజనమును చేయుచున్నచో, ఆత్మ వీటికి అన్నింటికీ అతీతమైన సచ్చిదానందమని చెప్పుట ఎట్లు పొసగును ? జ్ఞాని స్థూలదేహమును పరిత్యజించవలెను. కాని అది ఎట్లు సంభవము ? మనము కోరినా, కోరకపోయినా, ఒకనాడు అందరు స్థూలదేహమును విడువ వలసిన వారే. అప్పుడు జ్ఞానికి సంసారము నుండి విముక్తి కలుగును. మనము ప్రతిదినము నిద్రలో స్థూలదేహము తోడి తాదాత్మ్యమును విడిచి పెట్టుచున్నాము. కాని, నిద్ర లేచిన తరువాత ఆ మోక్షముయొక్క గతి యేమి ? ఈ వాదమునకు శ్రీశంకరులు ఇట్లు సమాధానమునిచ్చుచున్నారు : దేహముతో తాదాత్మ్యమును విడిచిపెట్టుట భౌతికప్రక్రియ కాదు. అది ఒక విశిష్ట-అనుభవము కూడ కాదు. ఈ తాదాత్మ్యమును విడుచుట యనగా మిథ్యాప్రత్యయనివృత్తి మాత్రమే. అది కేవలజ్ఞానరూపము. ' నాకు జ్ఞానము గలదు ; కాని, దేహేంద్రియమనస్సంఘాతమునుండి నన్ను నేను ఉపసహరించుకొనుటకు మరియు దానికి అతీతుడనగుటకు కొంత ప్రయత్నమును చేయవలెను ' అని చెప్పుట యుక్తియుక్తముగా లేదు. ఆత్మ స్వరూపము చేతనే సర్వమునకు అతీతము. మనము ఒక వస్తువును చూచుచున్న సమయములోనైననూ, ఆత్మ సర్వకాలములలో మనయొక్క సర్వవిధముల అనుభవములకు అతీతముగా నుండునని తెలియవలెను. ఆత్మను వాస్తవముగా ఏదీ స్పృశించదు. కావున, అజ్ఞానమునుండి పుట్టిన దేహేంద్రియమనస్సంఘాతముతోడి తాదాత్మ్యము జ్ఞానము చేతనే నిర్మూలించబడును. ఈ నిర్మూలనము కేవలము మిథ్యాజ్ఞాననిర్మూలనమే గాని, భౌతికమగు నిర్మూలనము కాదు. అట్లు గానిచో, ఈ దేహమునకు జీవుడు దూరముగా జరిగే ప్రసక్తి లేదు. ఈ దేహమును విడిచిపెట్టిననూ, జీవుడు మరియొక దేహముతో తాదాత్మ్యమును చెంది యాత్రను కొనసాగించును. మిథ్యాప్రత్యయము తొలగనంత వరకు ఈ సంసారము కొనసాగుచునే యుండును. మిథ్యాప్రత్యయమేదైనా జ్ఞానము ఉదయించనిదే తొలగిపోదు. ఏలయనగా, మిథ్యాప్రత్యయమనగా అజ్ఞానమే. కావున, జ్ఞాననిష్ఠయందు మాత్రమే సంసారము పూర్ణముగా విలీనమగును.

ఆత్మజ్ఞానము ఉండియు దేహాదులతో తాదాత్మ్యము తప్పదు అను మాట సరిగాదు. శ్రీశంకరులు దీనికి ఒక దృష్టాంతమును ఇచ్చిరి. వ్యక్తికి తాను ఆవుల కంటె వేరుగా నున్నాననియు, ఆవులు తన కంటె వేరుగా నున్నవనియు తెలియును. కావున, ఆతనికి ఆవులయందు ' నేను ' అనే భావన కలుగదు. ఈ విధముగా, రెండు వస్తువుల మధ్య గల భేదము స్పష్టముగా తెలిసినప్పుడు, ఒక దానిని చూచి మరియొకటి యని భ్రమపడే అవకాశము ఉండదు. ఆవును చూచి తానేమోనని భ్రాంతి పడువాడు ఉండడు. కాని గౌణప్రత్యయమునను సరించి ఒక వ్యక్తిని 'ఆవు' అని వర్ణించుట సంభవమే. ' ఆవు నా ప్రాణము ' అనే వాక్యము కూడ గౌణప్రత్యయమే గాని, మిథ్యాప్రత్యయము కాదు. ఏలయనగా, ఆవునకు మనిషికి గల భేదము స్పష్టముగా తెలియుచున్నది. శ్రీశంకరులు మరియొక దృష్టాంతమునిచ్చిరి. ఈ దృష్టాంతములో రెండు వస్తువుల మధ్య గల భేదమును గ్రహించక పోవుటచే, ఒక దానిని చూచి మరియొకటి యని భ్రాంతి కలుగును. ఒకడు

చెట్టు మోడును చూచి మనిషియని తెలుసుకొనును. అదే విధముగా, వివేకము లేని కారణముగా వ్యక్తి దేహేంద్రియమనస్సంఘాతమునందు ' నేను ' అనే ధారణను కలిగియుండును. చెట్టు మోడును తెలుసుకున్న తరువాత అది మనిషి అనే భ్రాంతి తొలగి పోవును. అదే విధముగా, ఆత్మజ్ఞానము కలిగిన తరువాత జ్ఞానియందు దేహాత్మభ్రాంతి ఉండదు. కావున, ' నేను సచ్చిదానంద-ఆత్మనని నాకు తెలుసు ; కాని, ఇంకా నాకు దేహమునందు ఆత్మబుద్ధి గలదు ' అని చెప్పుట యుక్తియుక్తము గాదు. నీవు సచ్చిదానంద-ఆత్మవని నీకు తెలిసినచో, నీవు సచ్చిదానంద-ఆత్మవు మాత్రమే. నీవు దేహాదులయందు ఆత్మభ్రాంతిని పొందే అవకాశమే లేదు. ఈ జ్ఞానము ఉన్న వ్యక్తి కూడ కొన్ని సందర్భములలో ' నేను మనుష్యుడను ' అని చెప్పిననూ, అది కేవలము గౌణము మాత్రమే. సచ్చిదానందమనగా ఒకానొక మానవుడు కాదు. సచ్చిదానందము, మానవుడు అనే రెండు విషయములు స్పష్టముగా తెలిసిన తరువాత, ' నేను మనుష్యుడను ( మనుష్యోహమ్ ) ' అని చెప్పినచో, అది కేవలము గౌణప్రయోగము మాత్రమే యగును. జ్ఞాని ' నేను వెళ్లుచున్నాను ' అని చెప్పినప్పుడు, సచ్చిదానంద-ఆత్మ వెళ్లుచున్నదని ఆతని అభిప్రాయము కాదు. అట్లైనచో, వెళ్లునది ఎవరు ? దేహము మాత్రమే. దేహముతో జ్ఞానికి బాధితమైన తాదాత్మ్యము ఉండును. కావున, ఆత్మస్వరూపము తెలిసిన వ్యక్తి దేహేంద్రియసంఘాతమే ఆత్మయని పొరపడే అవకాశము లేశమైననూ లేదు.

ఇచట మరియొక అభ్యంతరము గలదు. శ్రుతి కొన్ని కర్మలను విధించుచున్నది. స్వర్గమును కోరు వ్యక్తికి శ్రుతి జ్యోతిష్టోమము అనే యజ్ఞమును విధించుచున్నది ( జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత ). స్వర్గము ఇత్యాది అదృష్టవిషయములను గురించి తెలియుటకు శ్రుతి తప్ప మరియొక మార్గము లేదు. కావున, ఈ విషయములో శ్రుతి ప్రమాణము అగుచున్నది. కర్మను చేసే కర్త ఉండబట్టి శ్రుతి ప్రమాణము కాగల్గుచున్నది. ఆత్మ కర్తయే కానిచో, శ్రుతికి ఆత్మ కొరకై జ్ఞానమును బోధించే ప్రమాణము అనే స్థాయి లేకుండా పోవును. అట్టి స్థితిలో కర్తను ఉద్దేశించి విధించే శ్రుతికి ప్రామాణ్యము లోపించును. కర్తయే లేనిచో, జ్యోతిష్టోమేన యజేత అను వాక్యము నిరర్థకమగును. ఈ పరిస్థితి శ్రోతలు లేని సభలో వక్త ప్రసంగించే పరిస్థితిని పోలియుండును. అదే విధముగా, శ్రుతి కూడ జ్యోతిష్టోమేన యజేత అని చెప్పును. కాని ఆ వాక్యమును వినే వాడు ఉండడు. ఈ విధి అనాత్మ యగు దేహము కొరకు కాదు. జడమగు దేహము విధివాక్యమును వినలేదు ; స్వయముగా కర్మను చేయలేదు. కావున, శ్రుతివాక్యము కర్తయగు ఆత్మకు మాత్రమే ఉద్దేశించబడినది. అట్లు గానిచో, శ్రుతియొక్క ప్రామాణ్యమునకు భంగము వాటిల్లును. కాని, ఆత్మ తనంత తానుగా కర్మను చేయదు. అది కరణముల ద్వారా కర్మను చేయించును. ఆ కరణములే దేహేంద్రియమనస్సంఘాతము. కావున, స్వర్గమును పొందగోరు వ్యక్తి గౌణ-ఆత్మయగు దేహాదికముయొక్క సహకారముతో జ్యోతిష్టోమమనే యజ్ఞమును చేయును. దేహము, ఆత్మ వేర్వేరు అని తెలిసినా, వాటి మధ్య ఒకానొక సంబంధము గలదు. దేహాదికము ఆత్మకు చెందియుండును. కావున, దేహము గౌణ-ఆత్మ యగును. ముఖ్య-ఆత్మ గౌణ-ఆత్మను సాధనముగా చేసుకొని కర్మలను నిర్వర్తించును. ఆత్మయొక్క కర్తవ్యములు గౌణ-ఆత్మయగు దేహేంద్రియాదుల కర్తవ్యములే యగును.

శ్రీశంకరులు ఈ వాదమును త్రోసిపుచ్చిరి. అవిద్యాకార్యములగు దేహేంద్రియమనస్సులు గౌణ-ఆత్మ కాజాలవు. దేహాదికమునందు 'నేను' అనే భావన మిథ్యయే గాని, గౌణము కాదు. అట్లు గానిచో, గౌణ-ఆత్మ లావుగా ఉన్నందులకు, ముసలిది అయినందులకు దుఃఖించువారు ఉండెడివారు కాదు. దేహేంద్రియమనస్సంఘాతము కంటె వేరుగా ఆత్మ స్వీకరింపబడుట లేదు గనుకనే, ఇవి సమస్యలగుచున్నవి. దేహమునకు జరిగే మంచి-చెడులు అన్నీ నాకు జరుగుచున్నవనియే మానవుడు స్వీకరించుచున్నాడు. కావున, ఇది మిథ్యాప్రత్యయమే గాని, గౌణప్రత్యయము కాదు. గుడ్డి వాడు 'నేను గుడ్డివాడను' అనియు, చెవిటి వాడు 'నేను చెవిటి వాడను' అనియు భావించుచున్నారు. వారికి ఆ గుడ్డిదనము మొదలైనవి యథార్థములు. ముఖ్య-ఆత్మ దేహాదికము కంటె భిన్నమైనచో, ఈ సమస్యలు ఏమియూ ఉండెడివి కావు. కావున, ఈ సర్వము మిథ్యాప్రత్యయము మాత్రమే. దానికి కారణము అజ్ఞానము.

ఆత్మ అకర్త కాదని నిరూపించుట పూర్వమీమాంసకుని అభిమతము. శ్రుతి కర్తను ఉద్దేశించి విధించుచున్నది గనుక, ఆత్మ అకర్త యైనచో, శ్రుతి అప్రమాణమగును. శ్రుతి ప్రమాణము కావాలంటే, మానవుడు తాను శ్రుతివిహితమగు కర్మలను చేసే కర్తను అని భావించాలని మీమాంసకుల అభిమతము.

సామాన్యమానవుని దృష్టిలో దేహమునకు, ఆత్మకు భేదము లేదు ; దేహమే
ఆత్మ. కావున, దేహము చేసే పనులన్నియు ఆత్మ చేసినట్లే. ఆత్మకు దేహసంపర్కము
అసలే లేనిచో, 'ఈ కర్మను నేను చేయుచున్నాను' అనే ధారణ ఉండెడిది కాదు. కాని,
ఈ ధారణ గలదు. కావున, దేహము, ఇంద్రియములు, మనస్సు, ఆత్మ అనునవి కలిసి
పోయి ఒక్కటిగా అయినవి అని మీమాంసకుల వాదము. శ్రీశంకరులీ వాదమును త్రోసిపు
చ్చిరి. ముఖ్య-ఆత్మకు, గౌణ-ఆత్మకు గల భేదమును తెలిసియున్న వ్యక్తి తాను కర్తనని
భావించే ప్రసక్తి ఉండదు. కాని, వాస్తవము దానికి భిన్నముగా నున్నది. ప్రతి వ్యక్తి తాను
మానవుడననియు, మర్త్యుడననియు, దుఃఖిని అనియు వాపోవుచుండును. ఈ విషయ
ములో సందేహము లేదు. కావున, దేహేంద్రియాదులయందు మనకు ఉన్నది ముఖ్య-
ఆత్మ అనే ధారణయే గాని, గౌణ-ఆత్మ అనే ధారణ కాదు.

ఇట్లు జరుగుటకు కారణమేమి ? భ్రాంతిమూలకమగు తాదాత్మ్యము మాత్రమే.
ఆత్మకు దేనితో నైననూ లేశమైననూ సంపర్కము లేదు. ఆత్మ శుద్ధచేతనస్వరూపము,
నిరవయవము. కావున, దానికి ఇతరముతో సంగము సంభవము కాదు. నీరు, పాలు అను
నవి సగుణద్రవ్యములు గనుక, నీరు పాలతో కలిసిపోవును. కాని, ఒక దానికి గుణములు
ఏవియూ లేనిచో, మరియొకదానికి గుణములు, రూపము ఉన్నచో, ఆ రెండింటికి కలయిక
ఎట్లు సంభవమగును ? మనము ఆకాశమునకు కొన్ని మేకులను కొట్టి కీలలను బిగించలే
ము. అదే విధముగా, నిరవయవచైతన్యమగు ఆత్మకు కొట్టవచ్చినట్లు కానవచ్చే ఈ దేహ
ముతో సంగము ఎట్లు కుదురును ? ఇది కేవలము మిథ్యాప్రత్యయముచే మాత్రమే సంభ
వమగును. మిథ్యాప్రత్యయము సర్వమును ఘటిల్లజేయును. అది త్రాడును పాముగా
మార్చివేయగలదు. అది చైతన్యమును జడముగా కూడ చేయగలదు. 'నేను' అను
ప్రత్యయమునకు దేహేంద్రియమనస్సులతో గల సంపర్కము కేవలము మిథ్యాప్రత్యయ

మూలకము మాత్రమే. ఈ విషయము మనకు ఎట్లు తెలియుచున్నది ? ఆ మిథ్యాప్రత్యయము లేని సమయములో మనకు వీటియందు ' నేను ' అనే ధారణ లేదు. అది ఉన్నప్పుడు ఈ ధారణలు గలవు. ఉదాహరణకు, నిద్రలో మనస్సు పూర్తిగా విలీనమై యుండుటచే, ఈ తప్పు భావనలు లేవు. జాగ్రదవస్థలోనైననూ మానవుడు ఆనందముగా నున్న క్షణములలో దేహేంద్రియాదులయందు ఆత్మభావన లేదు. మరియు, ఆత్మజ్ఞానము ఉదయించిన తరువాత కూడ ఈ తప్పు ధారణలు లేవు. ఒకటి ఉండగా, రెండవది గలదు ; ఆ ఒకటి లేనప్పుడు రెండవది కూడ లేదు. కావున, ఆ ఒకటి రెండవ దానికి కారణమగుచున్నది. ఆత్మను గురించి మిథ్యాప్రత్యయము ఉన్నప్పుడు, ఆత్మకు దేహేంద్రియమనస్సంఘాతముతో తాదాత్మ్యము గలదు.

శ్రీశంకరులు దీనిని మరింత వివరించిరి. అజ్ఞానము, అవివేకము గల వ్యక్తులలో దేహేంద్రియసంఘాతమునందు ' నేను ' అనే ధారణ కానవచ్చును. ' నేను పొడవుగా నున్నాను ; నేను చామన చాయ గలవాడును ' ఇత్యాది ధారణల రూపములో ఈ తాదాత్మ్యము అనుభవమునకు వచ్చుచుండును. అజ్ఞానమోహితులైన జనులలో వివేకము లేకుండుట సహజమే. కాని, వివేకము గలవారియందు ' నేను దేహాదులకంటె విలక్షణమైనవాడను ' అను జ్ఞానము ఉండుటచే, ఈ మిథ్యాభూతమగు దేహతాదాత్మ్యము ఉండదు. ఈ సమస్య పూర్వమునందు వారికి కూడ ఉండెడిది. అందువలననే, వారు ముముక్షువులై శాస్త్రమును అధ్యయనము చేయుచున్నారు. పూర్వమునందు ఉన్న విధముగా దేహాత్మభ్రాంతి అధ్యయనము తరువాత ఉండదు. అది బాధితమైనది గనుక, ఉన్ననూ పూర్వమునందు వలె ఉండదు. ఆత్మజ్ఞానము గల వ్యక్తికి దేహాదులయందు ' నేను ' అనే ప్రత్యయము ఇంకనూ ఉన్నచో, అది చాల విలక్షణముగా నుండును. జ్ఞానికి దేహేంద్రియమనస్సంఘాతమునందు ఆత్మభ్రాంతి ఉండే ప్రసక్తి లేదు. కాని, దేహాదులయందు గౌణ-ఆత్మప్రత్యయము సంభవమే. జ్ఞానికి దేహము, ఆత్మ వేరు వేరుగా తెలియుచుండును. కావున, నేను ఈ మధ్యలో బరువు పెరిగినాను ' ఇత్యాది వచనములను జ్ఞాని పలుకుటకు భ్రాంతి కారణము కాదు. స్థూలదేహము మాత్రమే బరువు పెరుగుచున్నది యని మాత్రమే ఆయనయొక్క అభిప్రాయము. ఆయనకు దేహమునకు, ఆత్మకు గల వైలక్షణ్యము స్పష్టముగా తెలియుచుండుట మాత్రమే గాక, ఆత్మ సచ్చిదానందమని కూడ ఆయనకు స్పష్టముగా తెలియును. కావున, తాను బరువు పెరుగుచున్నానని జ్ఞాని పలికినప్పుడు ఆయనయొక్క అభిప్రాయము దేహము బరువు పెరుగుచున్నదనియే గాని, మరియొకటి కాదు. ఆయనకు దేహమునందు ' నేను ' అనే భ్రాంతి లేదు. కావున, ఈ మిథ్యాప్రత్యయము లేనప్పుడు దేహేంద్రియమనస్సంఘాతమునందు ఆత్మభ్రాంతి ఉండదని మనము చెప్పగలము. ఆ తాదాత్మ్యము మిథ్యాప్రత్యయమునుండి పుట్టినదియే గాని, అది గౌణప్రత్యయము కాదు.

గౌణప్రత్యయములో రెండు పదార్థములకు గల సామాన్యగుణములు, విశేషగుణములు, భేదములు, సామ్యములు వేర్వేరుగా తెలియుచుండును. ఉదాహరణకు, దేవదత్తుడు మానవుడనియు, సింహము కాదనియు స్పష్టముగా తెలియుచుండును. దేవదత్తుడు సింహము అని చెప్పు సందర్భములో మనము చూపించేది మానవుడే గాని, సింహము

కాదు. మనము దేవదత్తుని మానవునిగను, సింహమును సింహముగను గుర్తించెదము. అదే సమయములో, ఆ రెండింటికీ క్రౌర్యము అనే ఒక సమానగుణము గలదు. సింహములో కనపడే క్రౌర్యము దేవదత్తునిలో కూడ కనబడును. ఆతడు సింహము అని ఒకడు చెప్పగానే, మనము వెంటనే వాని వెనుకకు వెళ్లి తోక ఉన్నదా, లేదా యను విషయమును పరిశీలించము ; జూలు కొరకు వెదకము. మనము సింహములో ఉండే ఒక విశిష్టగుణమును దేవదత్తునిలో దర్శించెదము. సింహముయొక్క క్రౌర్యము మనకు దేవదత్తునిలో దర్శనమిచ్చును. ఆ గుణము సింహములో మరియు దేవదత్తునిలో కనబడును. బ్రహ్మచారి నిప్పు అని మనము అన్నప్పుడు, మనకు బ్రహ్మచారి మరియు నిప్పు వేర్వేరుగా సుస్పష్టముగా తెలుస్తూనే ఉంటాయి. ఆ విషయములో మనకు భ్రాంతి లేశమైననూ లేదు. వారిద్దరిలో సమానముగా నుండే తేజస్సు కూడ మనకు అవగతమగుచుండును. ఈ ప్రయోగములు అన్నియు గౌణప్రత్యయములు. వీటిలో రెండు పదార్థముల మధ్య గల భేదము మరియు వాటి సామాన్యగుణము సుస్పష్టముగా తెలియుచుండును. ఇట్టి భేదజ్ఞానము లేనిచో, దానిని గౌణప్రత్యయము అనుటకు వీలు లేదు. అప్పుడు అది మిథ్యాప్రత్యయము అగును. దేహమునకు, ఆత్మకు గల భేదము స్పష్టముగా తెలియుట లేదు. కావున, దేహమును ఆత్మ అని భావించుట మిథ్యాప్రత్యయము అగును. కావున, మనము ఆత్మను ఆత్మగా, అనాత్మను అనాత్మగా తెలుసుకొన వలెను. మనము ఇచట వాటి సత్యమిథ్యాత్వములను గురించి చర్చించుట లేదు. మనము వాటి మధ్య గల వైలక్షణ్యమును మాత్రమే పరిశీలించుచున్నాము. కాని, ఆత్మ-అనాత్మల సత్యత్వము మాట యేమి ? అవి కుర్చీ- బల్ల వలె రెండు విభిన్నపదార్థములు కావు. కుర్చీ లేకున్ననూ, బల్ల ఉండవచ్చును. బల్ల లేకున్ననూ, కుర్చీ ఉండవచ్చును. ప్రస్తుతములో, అనాత్మ లేకున్ననూ ఆత్మ ఉండును. కాని, ఆత్మ లేనిదే అనాత్మ మనజాలదు. ఇది సత్యమిథ్యావిచారము. కాని, మనమిచట కేవలము ఆత్మ-అనాత్మల లక్షణములను గురించి మాత్రమే మాటలాడుచున్నాము. మనకు ఆత్మస్వరూపము తెలిసి, అనాత్మ ధర్మములు అనాత్మకు మాత్రమే సీమితమై యున్నచో, సమస్య లేదు. అట్టి జ్ఞాని 'నేను లావుగా నున్నాను' అన్నచో, అది గౌణప్రత్యయమగును. కాని, ఆ సత్యము తెలియనిచో, అది రజ్జు-సర్ప-భ్రాంతి వంటి మిథ్యాప్రత్యయము అగును. రజ్జు-సర్పము మిథ్యయే గాని, గౌణము కాదు. రజ్జు-సర్ప భ్రాంతిలో మనము ఎగిరి గంతులు వేయునట్లు చేసే భయకారణము పామే గాని, త్రాడు కాదు.

శ్రుతి కర్తను ఉద్దేశించి విధులు మొదలగు వాటిని బోధించుచున్నది గనుక, ఆత్మ కర్త కానిచో, శ్రుతియొక్క ప్రామాణ్యమునకు భంగము వాటిల్లుననే వాదమును ఇప్పుడు శ్రీశంకరులు పరిశీలించుచున్నారు. ఈ వాదమునకు మూలము అర్థాపత్తి. ఎట్లు ? 'నీకు ఈ కోరిక ఉన్నచో, ఈ కర్మను చేయుము ; నీవు దుఃఖమును పరిహరించగోరుచున్నచో, ఈ కర్మను చేయకుము ' అని శ్రుతి కర్మలను చేసే కర్తను ఉద్దేశించి బోధించుచున్నది. ఆత్మ అకర్తయైనచో, శ్రుతి వివిధకర్మలను విధించి యుండెడిది కాదు. బట్టతలవానికి జుట్టును సరిగా ముడి వేసుకొనుమని ఎవ్వరైననూ సలహాను ఈయరు. 'నీ కొమ్మునకు మెరుగు పెట్టుకొనుము ' అని మానవుని ఉద్దేశించి బోధించుట వ్యర్థము. కావున, శ్రుతి

యొక్క దర్శనములో ఆత్మ కర్త యగునని అర్థాపత్తి ( presumption ) ద్వారా మనకు తెలియుచున్నది. ఈ వాదము సరిగాదని శ్రీశంకరులు నిరూపించిరి. ప్రత్యక్షము మొదలైన ఇతరప్రమాణములకు గోచరము కాని విషయములలో మాత్రమే శ్రుతి ప్రమాణమగుచున్నది. కంటికి కానరాని అట్టి విషయములు అదృష్టములు అనబడును. స్వర్గము అనే సాధ్యమునకు అగ్నిహోత్రము అనే కర్మ సాధనమని మనకు శ్రుతి వలన మాత్రమే తెలియుచున్నది. కాని, ప్రత్యక్షాదిప్రమాణగోచరమగు విషయములలో శ్రుతి ప్రమాణము కాదు. ఈ ప్రమాణములకు అందని విషయములు మాత్రమే శ్రుతియొక్క క్షేత్రములోనికి వచ్చును. శ్రుతి ఏమిటో తెలియక ముందు నీకు ' నేను చేయుచున్నాను ; నేను చూచుచున్నాను ; నేను సంతోషముగా నున్నాను ' అనే అనుభవములు ఉన్నవా ? లేవా ? కావున, నీవు కర్తవు అగుదువా, కావా యను విషయమును బోధించుటకు శ్రుతి ఆవశ్యకము కాదు. ఈ కర్తృత్వము మనకు ప్రత్యక్షాది ప్రమాణములను వినియోగించినప్పుడు భాసించుచునే యున్నది. కావున, కర్తృత్వమును నిర్ధారించుటకు మనకు బాహ్యప్రమాణముతో పని లేదు. అది మనకు స్వభావము చేతనే సిద్ధించుచున్నది.

మనకు తెలియని ( అనధిగత ) విషయములలో మాత్రమే ప్రమాణము వ్యాపించును. ప్రమాణముచే పొందబడే జ్ఞానము సత్యము కావచ్చును ; కాకపోవచ్చును. ఉదాహరణకు త్రాడునందు చూడబడే పాము సత్యము కాదు. కావున, ప్రమాణముచే తెలియబడే సర్వము సత్యమేనని చెప్పుటకు వీలు లేదు. వివిధవస్తువులను మనకు చూపే కన్నులే త్రాడునందు లేని పామును చూపించి ఎగిరి గంతులను వేయునట్లు చేయును. కావున, ప్రమాణమును నిర్వచించునప్పుడు ఒక అధికవిశేషణమును జోడించవలెను. ప్రమాణము ఇదివరలో తెలియని విషయమును ( అనధిగతమ్ ) మాత్రమే గాక, త్రోసిపుచ్చుటకు వీలు లేని విషయమును ( అబాధితమ్ ) ప్రకాశింప జేయును. కావున, జ్ఞానేంద్రియముల ద్వారా తెలియబడే జ్ఞానము, యుక్తిచే తెలియబడే జ్ఞానము సర్వదా యథార్థముగా నుండునని చెప్పలేము. వాటిలో భ్రమ ఉండే అవకాశము సర్వదా గలదు. ప్రత్యక్ష-అనుమాన-అర్థాపత్తి-ఉపమాన-అనుపలబ్ధి అనే ప్రమాణములచే తెలియబడని జ్ఞానమును తెలిపే స్వతంత్రప్రమాణము వేదము. వేదము బోధించే జ్ఞానము ఈ ప్రమాణములకు అందనిది అయి ఉండవలెను. ఇంతే గాక, వేదము బోధించే విషయవస్తువు ఇతరప్రమాణములకు గోచరము కాదు గనుక, అది ఇతరప్రమాణములచే బాధింపబడరాదు. వేదముచే బోధింపబడే జ్ఞానము ఇతరప్రమాణములచే బాధింపబడే పక్షములో, ఆ జ్ఞానము ఇతరప్రమాణములకు గోచరమగుచున్నదని స్పష్టమగుచునే యున్నది. శ్రుతి స్వర్గమును గురించి చెప్పుచున్నది. ఆ విషయమును త్రోసిపుచ్చుట ఎట్లు సంభవమగును ? స్వర్గము కంటికి కనబడేది కాదు. కావున, అది లేదని మనము వాదించుట సరిగాదు. స్వర్గము కంటికి కనబడే పక్షములో, దాని గురించి శ్రుతి చెప్పే ఆవశ్యకత ఉండదు. ఇందువలననే, అంటార్కిటికా గలదని మనకు వేదము చెప్పుట లేదు. మనమా విషయమును చూచి తెలుసుకొన గలము. శ్రుతికి తెలియును. కావున, ఇతరప్రమాణములకు గోచరము కాని విషయములను మాత్రమే శ్రుతి బోధించవలెను. స్వర్గము అనే సాధ్యమును గురించి, దానిని

పొందుటకై అగ్నిహోత్రకర్మ అనే సాధనమును గురించి వేదము వర్ణించగలదు. శ్రుతి లేనిదే, స్వర్గము ఉన్నదని గాని, అగ్నిహోత్రకర్మను గురించి గాని, ఆ రెండింటికి గల సాధన-సాధ్య-సంబంధమును గురించి గాని మనకు తెలిసే అవకాశము లేదు. ఇటువంటి విషయములలో మాత్రమే శ్రుతికి ప్రామాణ్యము గలదు. కంటికి కనబడే విషయములలో శ్రుతిప్రామాణ్యమునకు వ్యాప్తి లేదు. కావున, నీవు కర్తవని శ్రుతి నిర్ధారించే ఆవశ్యకత లేదు. ఆత్మ గురించి శ్రుతి నిర్ధారించ దగినది ఏదైనా ఉంటే, అది ఆత్మ కర్త కాదని మాత్రమే. అదృష్ట విషయములలో వ్యాపించే ప్రామాణ్యము గల శ్రుతి ప్రవేశించి నీవు కర్తవని చెప్పే అవసరము లేదు. ఆ విషయము మనకు తెలియుచునే యున్నది ( దృష్టమ్ ). అది మనకు అనుభవములోనున్న విషయమే. కావున, దేహేంద్రియమనస్సంఘాతమునందు ' నేను ' అనే ధారణ గౌణము అయ్యే అవకాశము లేదు. అది కేవలము మిథ్యాప్రత్యయమునుండి పుట్టినది మాత్రమే.

అగ్ని చల్లగా కాంతివిహీనముగా నుండునని వంద శ్రుతివాక్యములు చెప్పిననూ, వాటికి ప్రామాణ్యము ఉండదు. ఎందువలన ? ఒక ప్రమాణము ఇతరప్రమాణగమ్యమగు జ్ఞానమునకు విరుద్ధముగా నుండరాదు. శ్రుతి బోధించే జ్ఞానము ప్రత్యక్షాదిప్రమాణములకు విరుద్ధముగా నుండరాదు. దేహేంద్రియమనస్సంఘాతమునందు మనకు ఉండే ఆత్మభావన గౌణము ఎట్లు అగును ? ఆ రెండింటికి మధ్య గల వైలక్షణ్యము స్పష్టముగా తెలిసినప్పుడు మాత్రమే అది గౌణము కాగల్గును. మనకు గల సామాన్యవిజ్ఞానమునకు విరుద్ధముగా చెప్పే మతగ్రంథము ఏదైనా ప్రమాణమనిపించుకోదు. భగవంతుడు స్వర్గములో కూర్చుండి జగత్తును సృష్టించినాడని మతగ్రంథము చెప్పినచో, ఆ బోధ సత్యము కాజాలదు. ఏలయన, అది పూర్తిగా యుక్తివిరుద్ధము. యుక్తివిరుద్ధమగు విషయమును యథాతథముగా గుర్తించి మనము త్రోసిపుచ్చవలెను. మతగ్రంథము చెప్పినంత మాత్రాన దానికి సత్యత్వము సిద్ధించదు. కావున, అగ్ని చల్లగా నుండునని శ్రుతి చెప్పినచో, అది ప్రమాణము కాదని శ్రీశంకరులు వివరించిరి. దీనిపై శ్రీశంకరులింకనూ ఇట్లు వివరించిరి : అట్టి శ్రుతివాక్యము కనబడినచో, దానికి మరియొక అర్థము గలదా యని మనము పరిశీలించవలెను. దీనికే శ్రద్ధ అని పేరు. శ్రుతి చెప్పే విషయము ఇతరప్రమాణవిరుద్ధముగా గాని, లేదా శ్రుతియే మరియొక సందర్భములో చెప్పిన విషయమునకు విరుద్ధముగా గాని ఉన్నచో, అప్పుడు మనము మరల శ్రుతివాక్యమును పరిశీలించి పూర్వాపరములకు విరుద్ధము కాని మరియొక అర్థము గలదా యను విషయమును శోధించెదము. అనగా, మనము శ్రుతియొక్క తాత్పర్యమును తెలుసుకొనే యత్నమును చేసెదము. మనము నిత్యజీవితములోనైననూ, అనేకవాక్యములను జాగ్రత్తగా పరిశీలించి వాటి వివక్షను తెలుసుకొనే ప్రయత్నమును చేయుచుందుము. ఒకప్పుడు పదములు పూర్తి అర్థమును ప్రకటించలేకపోవచ్చును. జనులు తక్కువ మాటలలో చెప్పే ప్రయత్నమును చేయుచుందురు. ఒకప్పుడు సరియగు పదములను ప్రయోగించే సామర్థ్యము కొరవడును. ప్రతి వాక్యమునకు ఒక వివక్ష ( చెప్పదలచుకున్న విషయము ) ఉండును. మనము వాక్యమును పరిశీలించి ఆ వివక్షను పట్టుకొన వలెను. కావున, శ్రుతిలో అటువంటి వాక్యములు కానవచ్చినచో, మనము వాటిని సావధానులమై పరిశీలించవలెనని శ్రీశంకరులు హెచ్చరించుచున్నారు.

ఎందువలన ? పరస్పరవిరుద్ధములగు వచనములను బోధించే శ్రుతి అప్రమాణమగును. స్వవచనవ్యాఘాతమునకు ఒడిగట్టే శ్రుతి ప్రమాణము అనే స్థాయిని కోల్పోవును. రెండు విరుద్ధవాక్యములు ఉన్నచో, వాటిలో దేనిని ప్రమాణముగా స్వీకరించవలెను ? దేనిని ప్రక్కన పెట్టవలెను ? ఒక ప్రమాణము మరియొక ప్రమాణమునకు విరుద్ధముగా నుండ రాదు. ఈ నియమము శ్రుతికి కూడ వర్తించును. శ్రుతి స్వవచనవిరుద్ధముగా చెప్పుననుట పొసగదు. ఉదాహరణకు, ఒక సందర్భములో శ్రుతి మనకు కర్మను చేయుమని ఉపదేశిం చుచున్నది. ఆ తరువాత, జ్ఞానకాండలో ' కర్మ చేత గాని, సంతానము చేత గాని, సంపద చేత గాని మోక్షము లేదు ; వీటిని త్యజించినచో, మోక్షము లభించును ( న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః ) ' అని వేదము చెప్పుచున్నది. ఈ రెండింటికి పరస్పరవిరోధము గలదా ? లేదు. ఏలయనగా, కర్మచే మోక్షము లభించునని శ్రుతి చెప్పలేదు. ఇవి రెండు విభిన్నములగు అంశములు. ఒకటి కర్మ ; మరియొకటి జ్ఞాన ము. కావున, విరోధము లేదు. కావున, శ్రుతివచనములను మనము జాగ్రత్తగా తెలుసుకొన వలెను. శ్రుతివాక్యము ఇతరప్రమాణములకు విరుద్ధముగా భాసించినచో, మనము ఆ వాక్యమును మరల జాగ్రత్తగా పరిశీలించవలెను. కొన్ని విషయములలో మాత్రమే శ్రుతి ప్రమాణమనియు, ఇతరవిషయములలో కాదనియు చెప్పుట అంగీకారము కాదు. గ్రుడ్డులో సగభాగమును పొదిగి, మిగిలిన సగభాగమును ఆమ్లెట్ కొరకు వినియోగించుట సంభవము కాదు. అదే విధముగా, మనము శ్రుతిలోని కొన్ని వచనములను ప్రమాణముగా స్వీకరించి, మరికొన్ని వచనములు ప్రమాణములు కావని త్రోసిపుచ్చుట తగదు. మనము శ్రుతిని పూర్ణముగా స్వీకరించవలెను. 'నేను కర్తను' అనే అనుభవము సర్వులకు గలదు. ఆ విష యమును శ్రుతి బోధించుట లేదు. నీ స్వరూపము నీకు తెలియదని మాత్రమే శ్రుతి చెప్పు చున్నది.

దీనిపై మరియొక అభ్యంతరము గలదు. కర్మ ఏదైనా, కర్తను అపేక్షించును. శ్రుతి విధించే కర్మలన్నింటికి కర్త అపేక్షించబడును. కాని, కర్తృత్వము మిథ్యాప్రత్యయము అన్నచో, కర్తకు ఉనికి లేకుండును. అప్పుడు వేదము అప్రమాణమగును. ఈ వాదమునకు శ్రీశంకరులు ఇట్లు ప్రత్యుత్తరమునిచ్చిరి. మిథ్యాప్రత్యయము లేనిదే, కర్త లేడు. కర్మను చేసేది దేహము. కావున, ఆత్మయందు కర్తృత్వమును ఆరోపించనిదే కర్త లేడు. కర్మను చేసేది దేహేంద్రియమనస్సంఘాతమేననియు, తాను వాటిని వినియోగించుకొనుచున్నాన నియు, సర్వులకు అనుభవములో నున్నది. కాని, అదే సమయములో, ' నేను కర్మను చేయుచున్నాను ' అనే ధారణ కూడ మానవునియందు గలదు. ఆ ధారణ మిథ్యాప్రత్యయ మని స్పష్టమగుచునే యున్నది. ఏలయనగా, ఈ దేహేంద్రియాదులు అన్నియు కర్మలను చేయుచుండగా దర్శిస్తూ ఉండే ద్రష్టకు కర్మసంబంధము ఉండజాలదు. మనము చదివే పుస్తకమును ప్రకాశింప జేసే దీపము ' నేను చదువుచున్నాను ' అని చెప్పరాదు గదా ! దీపము కర్మను దేనినీ చేయుటలేదు. ప్రకాశము దీపముయొక్క స్వరూపము గనుక, అది ప్రకాశింపజేయుట అనే కర్మను కూడ చేయుట లేదు. దీపప్రకాశములో పదార్థములు ప్రకాశించుచున్నవి. అదే విధముగా, ఆత్మయొక్క స్వరూపము చైతన్యము. ఆ చైతన్య ప్రకాశములో మాత్రమే జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయములు అన్నియు ప్రకాశించుచున్నవి. అవి అన్నియు

చైతన్యమునందు మాత్రమే ఉనికిని కలిగియున్నవై, ఆ చైతన్యముననుసరించి ప్రకాశించు చున్నవి. కావున, ఆత్మ కర్మలను చేయుట లేదని స్పష్టమగుచున్నది. ఇట్టి స్థితిలో, ఆత్మ కర్తయని స్వీకరించినచో, అది మిథ్యాప్రత్యయము అగును. మిథ్యాధారణ వలన ఆత్మ యందు కర్తృత్వము ఆరోపించ బడుచున్నది. ఈ విషయములో ప్రతివాది ఇట్లు చెప్పును: కర్త మిథ్య యనగా, కర్త లేదనియే గదా ! కాని, వేదము వివిధకర్మలను విధించుచున్నది. అనగా, వేదము కర్త కాని ఆత్మను ఉద్దేశించి కర్మలను విధించుచున్నది. ఇది కుంటి వానిని సైకిలు త్రొక్కుమని చెప్పినట్లు ఉన్నది. అనగా, వేదము అప్రమాణమగుచున్నది. కావున, వేదప్రామాణ్యమును నిలబెట్టుటకై ఆత్మ కర్తయని అంగీకరించవలెనని ప్రతివాది యొక్క తాత్పర్యము.

శ్రీశంకరులీ వాదమును త్రోసిపుచ్చినారు. కర్త లేనిచో కర్మను విధించే వేదము అప్రమాణమగునను మాట యథార్థమే. కాని కర్త స్వభావము చేతనే సిద్ధించుచున్నాడు. దాని కొరకై ప్రమాణము ఆవశ్యకము కాదు. ‘ నేను కర్తను ’ అనే ధారణ సర్వులకు గల దు. ఆ విషయమును గుర్తించియే వేదము ‘ ఈ కర్మను చేయుము ; ఈ కర్మను చేయ కుము ’ అని వ్యక్తిని ఆదేశించుచున్నది. కాని, అదే వ్యక్తి కొంత వివేకమును పొంది ఇంతకు మించిన సత్యమును తెలియగోరినచో, అప్పుడు ‘ నీవు కర్తవు గావు ’ అని వేదము బోధించుచున్నది. ‘ దీనిని చేయుము ; దానిని చేయుము ’ అని వేదము సర్వదా బోధించుచుండును. కాని ఆయా ఫలములయందు అభిరుచి లేని ముముక్షువు ‘ నేనీ కర్మ లను ఏల చేయవలెను ? ’ అని ప్రశ్నించగానే, ‘ సరే ; కాని, నీవు అకర్తవు ; ఆ సత్య మును గుర్తించుము ’ అని వేదము ఉపదేశించును. ఈ విధముగా కర్త ఉన్న సందర్భ ములో మాత్రమే గాక, కర్త లేని సందర్భములో కూడ వేదము ప్రమాణమగుచున్నది. కావున, బ్రహ్మజ్ఞానమును బోధించే వేదవాక్యములు ప్రమాణములే యగుచున్నవి.

ఆత్మ కర్త అను ధారణ భ్రాంతిమూలకము అయినచో, కర్మలను విధించే శ్రుతి అప్రమాణమగునని భావించి, పూర్వపక్షి ఇప్పుడు మరియొక అభ్యంతరమును లేవనెత్తు చున్నారు. కర్మలను విధించే శ్రుతి ప్రమాణము కానిచో, బ్రహ్మజ్ఞానమును బోధించు శ్రుతి కూడ అప్రమాణమే యగును. తనను తాను కర్తనని భావించే వ్యక్తికి ఆత్మస్వరూప మును బోధించే శ్రుతి అప్రమాణమగును. అట్టివానికి వేదములోని జ్ఞానకాండయందు అభి రుచి ఉండదు. అదే విధముగా, ఆత్మస్వరూపుడగు తాను అకర్తయని గుర్తించిన వ్యక్తికి వేదములోని కర్మకాండయందు అభిరుచి ఉండదు. ఆత్మ కర్త కాదని గుర్తించిన వానికి కర్మను బోధించు విధులు వర్తించవు. అదే విధముగా, ఆత్మ కర్తయను నిష్కర్ష గలవానికి బ్రహ్మజ్ఞానమును గోరు ముముక్షువు కొరకై ఉద్దేశించ బడిన విషయములు వర్తించవు. ఆత్మను గురించి శ్రవణము చేసి, మనననిదిధ్యాసనములను చేసి దాని స్వరూపమును తెలియవలెను ( ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః ) అనే శ్రుతివాక్యమునందు కర్మిష్ఠునకు అభిరుచి ఉండదు. వేదములోని ఈ రెండు కాండలు జాగ్రత్-స్వప్న-అవస్థలవలె ఒకదానిని మరియొకటి రద్దు చేయుచుండును. ఈ రెండు ఆత్మలలో ఏది యథార్థము ? జ్ఞానకాండ కర్మకాండను, కర్మకాండ జ్ఞానకాండను త్రోసిపు చ్చును. ఆత్మ కర్తయనే ధారణ ఉన్నప్పుడు మాత్రమే కర్మనిష్ఠ సంభవమగును. కాని

జ్ఞానాన్వేషణలో ఆత్మ అకర్త యని దర్శించవలెను. కావున, కర్మను విధించే శ్రుతి ప్రమాణము కానిచో, బ్రహ్మజ్ఞానమును బోధించు శ్రుతి కూడ ప్రమాణము కాకుండ పోవును. తాను పాము అనుకున్నది వాస్తవములో త్రాడు మాత్రమే అని వ్యక్తి గుర్తించగానే, పాము మాయమగును. పాము మాయమైన విధముగా త్రాడు కూడ మాయమగునేమో ! త్రాడు వాస్తవమనే హామీ ఏమి గలదు ? పూర్వపక్షియొక్క ఇబ్బంది ఇట్లున్నది.

పాము మాయమగును. కాని త్రాడు సత్యమైనచో, అది మాయము కాదు. జ్ఞానము యొక్క స్థాయి పెరిగినప్పుడు అది కూడ మాయము కావచ్చును. ఏది బాధితము కాదో, అదియే సత్యము. బాధితమగునది మిథ్య. అదే విధముగా ఆత్మయందలి కర్తృత్వము మిథ్య. ఆత్మ అకర్త అనునది సత్యము. ఈ రెండింటియొక్క సత్యత్వశ్రేణి ఒకటి కాదు. ఆత్మ కర్త యని శాస్త్రము బోధించుట లేదు. శాస్త్రము కర్తను ఉద్దేశించి కర్మలను విధించుచున్నదే గాని, ఆత్మ కర్త అను విషయములో శాస్త్రము ప్రమాణభూతమగుట లేదు. మనకు తెలియని సాధ్యములను, మరియు వాటికి సాధనములను బోధించుటయందు మాత్రమే శాస్త్రము ప్రమాణము అనే పాత్రను నిర్వహించుచున్నది. ' నేను కర్తను ; నేను భోక్తను ; నేను దుఃఖిని ; నేను సంసారిని ' అని ప్రతివానికి తెలియును. దీనిని బోధించుటకు శాస్త్రముతో పని లేదు. ఈ విషయము పశుపక్ష్యాదులకు కూడ తెలియును. ఆహారమును తినే కుక్క ఇంకో ప్రాణి భుజించుచున్నదని అనుకోదు. తోకను ఊపాలని తలంచిన కుక్క ఊపేది తన తోకయే గాని, తనకు సంబంధము లేని తోక కాదు. దీనికి కర్తృత్వబుద్ధి అని పేరు. ఇది ప్రతి ప్రాణియందు గలదు. నీవు కర్తవని శాస్త్రము బోధించవలసిన ఆవశ్యకత లేదు.

కాని శాస్త్రము ఒక విషయమును చెప్పుచున్నది. మనము చేసే కర్మలు పుణ్యపాపములనే అదృష్టఫలమునిచ్చును. ఆయా కర్మల వలన లభించే ఫలములను కూడ శాస్త్రమే బోధించుచున్నది. అగ్నిహోత్రకర్మ గాని, దాని వలన స్వర్గము లభించునని గాని, స్వర్గముయొక్క స్వరూపము గాని, దేహము మరణించినా జీవుడు మరణించడని గాని మనకు తెలియదు. ఈ విషయములు ప్రత్యక్ష-అనుమాన-ప్రమాణములకు గోచరము కావు. కావున, వీటిని తెలియుటలో మనకు శాస్త్రము ప్రమాణమగుచున్నది. కాని, కర్తృత్వమును నిర్ధారించుటలో శాస్త్రము ప్రమాణము కాదు. పైగా, ఆత్మకు క్రియాసంబంధము లేదనియు, ఆత్మ కర్త కాదనియు, ఆత్మ బ్రహ్మ-అభిన్నమనియు శాస్త్రము నిర్ధారించుచున్నది. ఆ జ్ఞానము వలన ఆత్మయందు ఆరోపించ బడిన కర్తృత్వ-భోక్తృత్వములు నిషేధించ బడును. ఒక్క మాటలో చెప్పాలంటే, ఆత్మయందు ఆరోపించ బడిన సంసారిత్వము తొలగిపోవును. శాస్త్రము అంతిమముగా ఆత్మయొక్క యథార్థస్వరూపమును బోధించి కర్తృత్వబుద్ధిని నిర్మూలించును.

ఇచట ఒక ప్రశ్న ఉదయించును. కర్తృత్వబుద్ధిని అకర్తృత్వబుద్ధి త్రోసిపుచ్చిన విధముగా, అకర్తృత్వబుద్ధిని కర్తృత్వబుద్ధి త్రోసిపుచ్చలేదా ? లేదని శ్రీశంకరులు ప్రత్యుత్తరమునిచ్చినారు. ఎందువలన ? ఆత్మ సత్యమనియు, అకర్త అనియు దర్శించిన జ్ఞానియందు ఆత్మ కర్తయనే మిథ్యాప్రత్యయము తొలగి పోవును. మరల అదే జ్ఞానియందు కర్తృత్వబుద్ధి ఉదయించే ప్రసక్తి లేదు. జ్ఞానముచే తొలగించ బడిన తప్పు ధారణ మరల

ఎట్లు ఉదయించును ? అజ్ఞానము ఉన్ననూ, మిథ్యాప్రత్యయము ఉండుననే నియమము లేదు. ఉదాహరణకు, నిద్రలో అజ్ఞానము ఉన్నది ; కాని, మిథ్యాప్రత్యయము లేదు. కాని, మిథ్యాప్రత్యయము ఉన్నచోట అజ్ఞానము ఉండి తీరును. ఆ అజ్ఞానము తొలగి పోయిన తరువాత, మరల మిథ్యాప్రత్యయము ఉదయించే ప్రసక్తి లేదు. జ్ఞానము ఉదయించగానే, అజ్ఞానము దూరమగును. కావున, మరల భ్రాంతి ఉదయించదు. సత్యము బాధించబడదు. మిథ్య మాత్రమే బాధించబడును. ఏలయన, ఏది బాధించబడదో, అదియే సత్యమగును గదా !

శ్రీశంకరులు ఇంకనూ ఇట్లు వివరించిరి : అగ్ని వేడిని, ప్రకాశమును కలిగియుండు నని మనకు తెలియును. ఆ జ్ఞానము బాధింపబడుట సంభవమేనా ? అగ్ని సర్వదా బూడి దచే కప్పబడియుండునని ఒకాయన తలచుననుకొనుడు. అది వాస్తవమా ? కాదు. అది మిథ్యాప్రత్యయము. అగ్ని వేడిని, ప్రకాశమును కలిగియుండును అనే జ్ఞానము కలుగగానే, అది బాధించబడును. కాని, ఆ జ్ఞానము తరువాతి కాలములో బాధించబడదు. అదే విధ ముగా, 'సూర్యుడు తూర్పున ఉదయించును ; భూమి బల్లపరుపుగా నుండును' ఇత్యాది ధారణలు మిథ్యాప్రత్యయములు. ఒకప్పుడు అవి సత్యమేనని జనులు తలపోసిననూ, తరువాత అవి త్రోసిపుచ్చబడినవి. అదే విధముగా, ప్రస్తుతములో ఆత్మ అకర్త అనే జ్ఞానము కూడ త్రోసిపుచ్చబడునని చెప్పగలమా ? ఆత్మను త్రోసిపుచ్చే ప్రసక్తియే లేదు. అకర్తృ-అభోక్తృ-ఆత్మను నిషేధించుట సంభవము కాదు. కావున, అబాధితమగు ఆత్మయే సత్యము. సర్వమును త్రోసిపుచ్చువాడే ఆత్మ. అట్టి చేతన-ఆత్మను ఏ కాలమునందైననూ బాధించుట అసంభవము. మనచే తెలియబడే సర్వదృశ్యపదార్థములను బాధించుట సంభ వమే. కాని, సర్వనిషేధములకు అవధియగు ఆత్మచైతన్యము నిషేధించ బడదు. ఆత్మ ఆకాశము వంటిది. సర్వమును ఆకాశములో ఇటునటు కదల్చవచ్చును. కాని, ఆకాశ మును ఇటునటు కదల్చుట సంభవము కాదు. కావున, ఆత్మస్వరూపమును నిషేధించుట సంభవము కాదు.

బ్రహ్మజ్ఞానమును బోధించే శ్రుతి ఆత్మయందు కర్తృత్వమును బాధించునన్నచో, కర్తను ఉద్దేశించి కర్మలను విధించే శ్రుతి కూడ బాధింపబడును. అట్లు శ్రుతి బాధింపబడే పక్షములో, దాని ప్రామాణ్యమునకు భంగము వాటిల్లును. ఇది మీమాంసకుల వాదము. ఈ వాదము సరిగాదు. కర్మను విధించే శ్రుతిని బ్రహ్మవిద్యాబోధకమగు శ్రుతి బాధించును. ఇందువలననే, వేదాంతము వేదమునకు ఆఖరున గలదు. వేదమునకు ఆదిలో కర్మ గల దు. మిథ్యాప్రత్యయములు అన్నియు ఇటులనే యుండును. సత్యజ్ఞానము ముందు కలు గునా ? తరువాత కలుగునా ? తప్పును దిద్దే జ్ఞానము సర్వదా మిథ్యాప్రత్యయమునకు తరువాత వచ్చును. ఆత్మ కర్తయను ప్రత్యయము ముందుగా కలుగును. ఈ ప్రత్యయము సర్వులకు గలదు. తరువాత, శ్రుతి వచ్చి ఆత్మ కర్త కాదని మనకు చెప్పును. అప్పటికే నిషేధింపబడి యున్న ఈ కర్తృత్వజ్ఞానము తరువాతి కాలములో వచ్చిన అకర్తృత్వజ్ఞాన మును నిషేధించ లేదు. పూర్వమే నిషేధింపబడిన కర్తృత్వము తరువాతి సత్యమును నిషేధించ లేదు. త్రాడు అనే జ్ఞానము సర్పజ్ఞానమును త్రోసిపుచ్చిన తరువాత, మరల అచట ఆ త్రాడునందు సర్పము కనబడదు. ఈ దృష్టాంతములో ఆ పొరపాటు మరియొక

కాలములో మరియొక దేశములో జరిగే అవకాశము గలదు. కాని, ప్రస్తుతములో దేశకాలములకు ప్రసక్తి లేదు. ఆత్మ ఎప్పుడు మరుగైనది ? నీయందు ఎన్ని ఆత్మలు గలవు చాలినంత కాంతి లేకపోవుటచే పొరబడుటకు అవకాశము గలదని చెప్పుటకు వీలు లేదు. ఏలయన, ఆత్మయే కాంతి. ఆత్మ విషయములో పొరబడే అవకాశము ఎక్కడిది ? ఆత్మ స్మృతిపై ఆధారపడి లేదు. ఆత్మ ఒక మూల ఉండే పదార్థము కాదు. ఆత్మ అనగా నీవే. ఆత్మ కాలాధీనము కాదు. కాలము మిథ్య. ఆత్మ ఒక విశిష్టమగు అవస్థకు పరిమితమై ఉండదు. ఏలయనగా, అవస్థలు అన్నీ ఆత్మపై ఆధారపడి యుండును. కావున, ఒకసారి ఆత్మజ్ఞానము కలిగిన తరువాత, మరల ఆత్మ విషయములో పొరబడే అవకాశము ఎక్కడిది ? ఇది సంభవము కాదు. మిథ్యాప్రత్యయమును మిథ్య యని తెలుసుకొని త్రోసివుచ్చిన తరువాత అది బాధితముగనే కొనసాగును. సత్యము మాత్రమే మిగిలి యుండును.

మనకు ఇతరప్రమాణముల వలన తెలియుటకు వీలు లేని వివిధలక్ష్యములను మరియు వాటిని పొందే సాధనములను శ్రుతి బోధించుచున్నది. కాని ఈ శ్రుతివాక్యములు ఆత్మ-బ్రహ్మ-ఐక్యమును బోధించే శ్రుతివాక్యములను బాధించ లేవు. ఈ రెండు రకముల శ్రుతివాక్యముల గురించి మనము తెలియదగిన అంశము మరియొకటి గలదు. కొన్ని లక్ష్యములను మరియు వాటిని చేరుటకై ఉద్దేశించ బడిన సాధనములను వేదములోని పూర్వభాగము బోధించుచున్నది. ఉత్తరభాగములో శ్రుతి స్వయముగా సాధనము కాగా, శ్రుతివాక్యముల వలన కలిగే జ్ఞానమే స్వయముగా సాధ్యమగుచున్నది. ఈ జ్ఞానమే మోక్షము. వేదాంతశాస్త్రమును మనము చదువుటకు కారణమేమి ? వేదముయొక్క పూర్వభాగములో ఏది మనకు అభీష్టము ? ఏది కాదు ? అను విషయముతో బాటు వివిధలక్ష్యములను పొందగలిగే సాధనములను మనము తెలుసుకొనవచ్చును. కాని, ఒకానొక సత్యవస్తువును గురించి బోధించే ఉత్తరభాగమును మనము ఎందుకు చదువవలెను ? మనకు అభీష్టమైనవి, మనము పొందగోరేవి వివిధలక్ష్యములే గాని, సత్యవస్తువు కాదు గదా ! మనము వేదాంతమును కేవలము సత్యవస్తువును తెలియుటకు మాత్రమే చదువుట లేదు. మనము మోక్షమును పొందుటకై వేదాంతమును అధ్యయనము చేయుచున్నాము. మన అభీష్టము మోక్షము. కాని, జ్ఞానమే ఆ లక్ష్యము అగుచున్నది. సాధకుడు వెదికే వస్తువు తన స్వరూపమే అయి ఉన్నది. కావున, వేదాంతములో లక్ష్యము ఆత్మజ్ఞానము మాత్రమే. ఈ జ్ఞానము లభించిన తరువాత పొందదగిన మరియొక లక్ష్యము లేదు. వేదాంతమును గాని, ఇతరశాస్త్రములను గాని అధ్యయనము చేయుట వలన ఏమి లభించును ? జ్ఞానము మాత్రమే. శాస్త్రము ప్రమాణము. కావున, అది జ్ఞానమును మాత్రమే ఇచ్చును. వేదాంతమునకు విషయవస్తువు ఆత్మ. ఆ ఆత్మయే సర్వముయొక్క యథార్థస్వరూపమై యున్నది. ఈ సత్యమునెరింగిన జ్ఞాని తానే సర్వము అని తెలుసుకొనును. కావున, ఈ జ్ఞానమే లక్ష్యము అగును. ఇది ఇతరజ్ఞానముల వంటిది కాదు. ఈ జ్ఞానమునకు దృష్టాంతమునిచ్చుట కష్టమే అయినా, ఒక దృష్టాంతమునీయవచ్చును. ఒకడు తానే పదవ వాడు అయి ఉండియు, తనను మినహాయించి లెక్కించుటచే పదవవాడు లేడని భ్రమించి, వాని కొరకు వెదుకుచుండెను. అప్పుడు ఒక పుణ్యాత్ముడు ' ఆ పదవవాడవు నీవే ' అని చెప్పగా, అతడు సత్యమును గ్రహించెను. ఈ సందర్భములో అతడు వెదికేది తన కొరకు

మాత్రమే గనుక, జ్ఞానమే లక్ష్యము అగుచున్నది. వేదాంతము నిరూపించే ఈ విశిష్టలక్ష్యమును కర్మకాండ నిషేధించ లేదు.

జ్ఞానికి దేహేంద్రియమనస్సంఘాతమునందు ' నేను ' అనే ధారణ బాధితమగును ( బాధ్యతే ). వినాశమగుట వేరు ; బాధింపబడుట వేరు. ఒక పదార్థము వినష్టమైనచో, అది ఆ రూపములో మనకు లభించదు. కాని, ఒక పదార్థము బాధించబడినప్పుడు అది ఆ రూపములో కానవచ్చుచున్ననూ సత్యము కాదని మనకు తెలియుచుండును. దేహేంద్రియాదులయందలి ' నేను ' అనే ధారణ తప్పు అని తెలియుచుండును. మిథ్యను మిథ్యగా గుర్తించనిదే బాధించుట ( negation ) ఉండదు. మిథ్యను మిథ్యగా గుర్తించుటయే జ్ఞానము. జ్ఞానియందు దేహేంద్రియమనస్సంఘాతమునందలి ' నేను ' అనే తప్పు ధారణ బాధింపబడి యుండును. అది బాధింపబడిన విధమెట్టిది ? ఆత్మజ్ఞానముచే అది బాధింపబడినది. ఇది ఎట్లు సంభవము ? ఆత్మజ్ఞానము సత్యము ; దేహేంద్రియమనస్సంఘాతము మిథ్య. ఈ జ్ఞానము కలుగనంతవరకు మిథ్య సత్యము యొక్క వేషములో దగా చేయుచుండును. మోసగాని మోసమును బయట పెట్టనంత వరకు వాడు మోసమును చేయుచునే యుండును. విచారించినచో మోసగాని అసలు రంగు బయట పడును. అదే విధముగా, విచారము చేయనంతవరకు దేహాదులయందలి 'నేను' అనే ధారణ సత్యమువలె భాసించును. కాని, ఆత్మజ్ఞానము ఉదయించిన తరువాత దానికి నిషేధము ఉండదు.

ఆత్మజ్ఞానమును ఎవరు నిషేధించ వలెను ? దానిని నిషేధించుటకై మరియొక ఆత్మ ఉండవలెను. కాని రెండవ ఆత్మ లేదు. కావున, ఆత్మజ్ఞానము దేనిచేతనైననూ నిషేధించబడదు. ఇంతే గాక, ఆత్మజ్ఞానము కాలాధీనము కాదు గనుక, అది ఏ కాలమునందైననూ నిషేధించ బడదు. ఆత్మ కాలాధీనము కాకపోవుట మాత్రమే గాక, కాలము యొక్క ఉనికి నిత్య-ఆత్మయందు మాత్రమే గలదు. సర్వథా కాలవినిర్ముక్తమై యున్న ఆత్మ ఏ కాలమునందైననూ మార్పులకు ఎట్లు లోనగును ? కావున, ఆత్మజ్ఞానమును ఏ కాలమునందైననూ త్రోసిపుచ్చుట సంభవము కాదు. ఇంతే గాక, ఆత్మజ్ఞానమును బాధించుటకు ఒక ప్రమాణము ఆవశ్యకమగును గదా ! ఆత్మ అనుమానప్రమాణమునకు గాని, ప్రత్యక్షప్రమాణమునకు గాని గోచరము కాదు గనుక, అవి ఆత్మజ్ఞానమును బాధించలేవు. ఆత్మజ్ఞానముకంటె శ్రేష్ఠమగు జ్ఞానము మాత్రమే దానిని బాధించ గల్గును గదా ! కాని, శ్రుతి సర్వమును బాధించియే యున్నది. శ్రుతి జ్ఞానసాధనము ( ప్రమాణము ) ను మాత్రమే గాక, జ్ఞేయపదార్థము ( ప్రమేయము ) ను కూడ బాధించియున్నది. ఈ ఆత్మను ఏ ప్రమాణము బాధించగల్గును ? ఆత్మను గురించి ఇంతకంటె విశిష్టమైన జ్ఞానమును సంపాదించే ప్రమాణము లేదు గావున, దానిని బాధించుట అసంభవము. ఆత్మ శుద్ధచైతన్యస్వరూపము ; సర్వపరిచ్ఛేదరహితము ; దేశకాలములకు అతీతమైనది ; సర్వగుణవినిర్ముక్తము. అట్టి ఆత్మను బాధించుట ఎట్లు సంభవమగును ? మనకు ఒక గుణము తెలిసి యున్నచో, ఆ తెలిసియున్న దానిని బాధించుట సంభవమే. సర్వగుణములు చైతన్యములో విషయములగుచున్నవి. ఆ చైతన్యమును ఆత్మయని గుర్తించుటకు బదులుగా

మనము దేహమును గాని, ఇంద్రియములను గాని, మనస్సును గాని ఆత్మయని గుర్తించిన
చో, ఆ గుర్తింపును బాధించుటకు అవకాశము గలదు. ఎందువలన ? మనచే తెలియబడే
దేహేంద్రియాదికములు అనాత్మ గనుక, అవి అన్నియు బాధయోగ్యములే యగుచున్నవి.
ఈ సర్వమును బాధించిన పిదప మిగిలియున్న దానిని మరల బాధించుట కుదరదు.
బాధించదగిన సర్వము చైతన్యములో విషయమగుచున్నది. బాధించబడే సర్వము మన
స్సుచే ఆ విధముగా గుర్తించబడియే యున్నది. కావున, నిషేధించ బడిన సర్వము
మరియు నిషేధయోగ్యమైన సర్వము చైతన్యములో విషయముగనే యున్నది. కాని, ఆ
చైతన్యమును నిషేధించుట సంభవము కాదు. ఏలయన, దానిని నిషేధించ వలసినది
చైతన్యమే. ఒక వ్యక్తి తన జన్మను గాని, తన తల్లిదండ్రుల వివాహమును గాని దర్శించ
లేదు గదా ! అదే విధముగా, ఆత్మను నిషేధించుట సంభవము కాదు. నేను సర్వమును
నిషేధించ గలను. కాని నిషేధించే నన్ను నేను నిషేధించ జాలను.

'నాకు జ్ఞానము గలదు ; కాని, నాకు మోక్షము లభించ లేదు ' అని చెప్పుట
సంభవము కాదు. జ్ఞానఫలమగు మోక్షము జ్ఞానము కంటె భిన్నముగా లేదు. ఆ ఫలము
ఆత్మ కంటె భిన్నముగా లేదు గనుక, దానిని నిషేధించుట సంభవము కాదు. ఈ ఫలము
కంటె శ్రేష్ఠమైన ఫలము మరియొకటి లేదు. కావున, ఈ ఫలమును మరియొక ఫలము
త్రోసిపుచ్చే ప్రసక్తి లేదు. స్వాతంత్ర్యమే ఈ ఫలము. ఒకడు స్వాతంత్ర్యమునుండి విము
క్తిని పొందినాడనుకొనుడు. వానికి ఏమి లభించినట్లు ? బంధమే. కావున, ఈ ఫలమును
మించి యుండే మరియొక ఉత్కృష్టఫలము లేదు. ఇంతే గాక, సర్వప్రమాణాతీతమగు
ఆత్మజ్ఞానముకంటె ఉత్కృష్టమగు మరియొక జ్ఞానము ఉండజాలదు. 'బ్రహ్మవు నీవే'
అనునది శాస్త్రముయొక్క అంతిమమగు ఉపదేశము. దీనిపై ఇంకనూ మెరుగులు దిద్దుట
ఎట్లు సంభవమగును ? బ్రహ్మ అనంతము. బ్రహ్మకంటె భిన్నముగా ద్వితీయవస్తువు
లేదు. దీనికి మెరుగులు దిద్దవలసినది ఎవరు ? బ్రహ్మకంటె భిన్నముగా రెండవది ఉన్న
చో, అది బ్రహ్మకంటె నికృష్టము మాత్రమే కాగల్గును.

ఉష్ణము మరియు ప్రకాశము అగ్నియొక్క ధర్మములని మనకు తెలియును. దానిని
నిషేధించుట ఎట్లు సంభవమగును ? ఉష్ణప్రకాశములు అగ్నియొక్క స్వరూపములై
యున్నవి గాన, వాటిని నిషేధించుట సంభవము కాదు. ఒక పదార్థముయొక్క స్వరూపము
కాని వాటిని నిషేధించవచ్చును. ఆత్మయందు ఆరోపించబడే గుణములనన్నింటినీ త్రోసి
పుచ్చవచ్చును. కాని, ఆత్మయందు ఆరోపించబడే గుణములన్నియు నిషేధింపదగినవే
యను వచనమును నిషేధించుట ఎట్లు సంభవమగును ? శుద్ధచైతన్యస్వరూపమగు
ఆత్మను బాధించుట అసంభవము. ఈ సత్యమును బోధించే శ్రుతిని కర్మను విధించే
శ్రుతివాక్యములు బాధించలేవు.

బ్రహ్మవిద్యను బోధించే శ్రుతి కర్మను విధించే శ్రుతిని బాధించునని మనము
చెప్పినాము. కాని, బ్రహ్మవిద్యాశ్రుతికి మాత్రమే ప్రామాణ్యము గలదనియు, కర్మను
విధించే శ్రుతులకు ప్రామాణ్యము లేదనియు మన తాత్పర్యము కాదు. ఆత్మ కర్త కాదు
అనే అవగాహనయొక్క దృష్టికోణములో మాత్రమే ఆత్మయందలి కర్తృత్వము నిషేధించ
బడినది. ఆ సత్యము తెలిసినచో, అనగా ఆత్మ మాత్రమే సత్యమనియు, శ్రుతితో సహా

మిగిలినది అంతా మిథ్య అనియు తెలిసిన జ్ఞానికి కర్మను విధించే శ్రుతి ప్రమాణము కాజాలదు. కాని, కర్మను విధించే శ్రుతి బ్రహ్మవిద్యాశ్రుతిచే బాధింపబడుటచే దానికి సుతరాము ప్రామాణ్యము లేదనుట సరిగాదు. ఈ విషయమును ఇట్లు వివరించవచ్చును. కర్మకాండలో ఒక విశిష్టకర్మను చేయవలసిన క్రమము నిర్దేశించబడి యుండును. ఉదాహరణకు, ముందుగా ఉపనయనసంస్కారమును పొందియున్న వ్యక్తి మాత్రమే వివాహమునకు అర్హుడగును. వివాహము వలన వ్యక్తికి వైశ్వదేవమనే కర్మను, దాని వలన అగ్నిహోత్రకర్మను చేసే అధికారము సంక్రమించును. అగ్నిహోత్రమును చేయువాడు జ్యోతిష్టోమమును చేయుటకు అర్హుడగును. జ్యోతిష్టోమమును చేసిన వ్యక్తి వివిధచాతుర్మాస్యక్రతువులను చేయుటకు అర్హుడగును. ఈ విధముగా ఈ అర్హత పెరుగుచుండును. ఒక కర్మను చేయుట వలన మరియొక కర్మను చేసే అర్హత సంక్రమించును. మరియు, అవి ఒక క్రమములో పరిత్యజింప బడును. ఉదాహరణకు, ఉపనయనసంస్కారమును పొందిన వ్యక్తి దానిని మరల చేయనక్కర లేదు. దీనిని బట్టి శాస్త్రము క్రమములో ముందుగా విధించిన కర్మ అప్రమాణము అగుననుకోరాదు. దాని ప్రయోజనము తీరినది. కావున, ఆ తరువాత దానితో పని లేదు. అదే విధముగా, శ్రుతి విధించిన వివిధకర్మలు వేదముయొక్క ఆఖరులో జ్ఞానకాండయందు బోధించబడిన జ్ఞానమునకు మనస్సును సంసిద్ధము చేయుటకై ఉద్దేశించ బడినవి. ఇంతే గాక, సర్వకర్మలకు వాస్తవమగు ప్రయోజనమేమి ? కర్మలను క్రమముగా చేయుచుండగా, వ్యక్తియందు అంతఃకరణశుద్ధి నిర్మాణమగును. దాని వలన తాను ఆరాధించే ఈశ్వరుని స్వరూపమును తెలుసుకొన వలెననే కోరిక ఆతనియందు ఉదయించును. నేను ఆరాధించే ఈ ఈశ్వరుని స్వరూపమెట్టిది ? నాకు, ఈశ్వరునకు మధ్య గల సంబంధమెట్టిది ? ఈశ్వరుని యథార్థస్వరూపమేమి ? నా స్వరూపమేమి ? జగత్తుయొక్క స్వరూపమేమి ? ధార్మికజీవనమును గడిపిన వ్యక్తిలో ఈ జిజ్ఞాస ఉదయించును. కర్మకాండకు అంతకూ తాత్పర్యము మానవునియందు ఆత్మజ్ఞానము కొరకై అభిరుచిని నిర్మాణము చేయుట మాత్రమేనని శ్రీశంకరుల సిద్ధాంతము.

ఆత్మజ్ఞానసాధన కొరకు మాత్రమే ఈ కర్మలన్నియు ఉద్దేశించ బడినవి. క్రమముగా విధించబడిన కర్మలలో రెండవ కర్మను చేయు సందర్భములో మొదటి కర్మ బాధితమగును. అంత మాత్రాన, ఆ మొదటి కర్మను విధించిన శ్రుతి ప్రమాణము కాకుండాపోదు. మొదటి కర్మను విధించే శ్రుతికి రెండవ కర్మను విధించే శ్రుతితో సమానమగు ప్రామాణ్యము ఉండును. కాని ఎవరికి ? మొదటి కర్మను అప్పటికే పూర్తి చేసిన వానికి కాదు. ఇంకనూ మొదటి కర్మను చేయనివానికి అది ప్రమాణమగును. అదే విధముగా, 'ఆత్మ బ్రహ్మ ; కావుననే, ఆత్మ అకర్త' అని శ్రుతి బోధించే ప్రకరణములో అప్పటికే కర్మ అంతయూ బాధించబడినది. కావున, 'అమృతత్వము కర్మచే గాని, సంతానముచే గాని, సంపదచే గాని సిద్ధించదు ; త్యాగముచే మాత్రమే అమృతత్వము సిద్ధించును ( న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః ) ' అనే శ్రుతివాక్యములో స్వవచనవ్యాఘాతము లేనే లేదు. ఒక విశిష్టస్థాయిలో శ్రుతి కర్మను బోధించును. ఆ కర్మను చేయుట కర్మపరిత్యాగమునకు దారి తీయును. అనగా, అది సాధకుని మనస్సును జ్ఞానోదయమునకు సంసిద్ధము చేయును. కావుననే, వేదాంతవిచారమును చేయగోరు

వ్యక్తి ధార్మికజీవనమును గడుపవలెనని విధించ బడినది. ధార్మికజీవనము లేని వేదాంత
విచారము సఫలము కాదు. అట్టి విచారము శుష్కవేదాంతము అగును. ధార్మికవాయుమం
డలములో మాత్రమే వేదాంతమును అధ్యయనము చేయవలెను.

బ్రహ్మకంటె భిన్నమగు సర్వము మిథ్య అని శ్రుతి చెప్పు ప్రకరణము వచ్చు
సరికి కర్మకాండ అప్పటికే బాధితమై యున్నది. కాని, మిథ్యాభూతమగు శ్రుతి ఎట్లు
ప్రమాణమగును ? శ్రుతి మిథ్యయే అయినా, ఉపాయమగుటలో దోషము లేదు. చరమల
క్ష్యముయొక్క దృష్టికోణములో దానికి ఒకానొక వ్యావహారికసత్యత్వము గలదు. ఈ వ్యావ
హారికసత్యత్వము ఆత్మయొక్క పారమార్థికసత్యత్వమునకు అనురూపమైనదియే గాని,
విరుద్ధము కాదు. ఉదాహరణకు, ఒకడు పామును చూచి భయపడినాడనుకొనుడు. ఇంతలో
అతని మిత్రుడు అచటకు వచ్చి, అతడు త్రాడును చూచి పాము అని భ్రమపడినాడని
గ్రహించెను. అపుడా మిత్రుడు ఏమి చేయును ? అతడు దీపమును తెచ్చి త్రాడును
చూపును. ఇచట దీపము ఉపాయము. ఈ ఉపాయము క్రొత్తగా దేనినీ సృష్టించలేదు. అది
పాము భయపడి పారిపోవునట్లు చేయలేదు. అది కేవలము సత్యమును చూపును. అంతే.
ఆ విధముగా సత్యమును చూపించి, అది మిథ్యాభూతమగు సమస్యను పరిష్కరించినది.
సంసారబంధము మొదలగు వాటినుండి విముక్తమై యున్న బ్రహ్మవు నీవే. ఇట్టి స్థితిలో
మోక్షమనగా నేమి ? సాధకుడు గాని, ఈ జ్ఞానమును కోరే ముముక్షువు గాని, మోక్షము
గాని యథార్థముగా లేవని శాస్త్రము అంతిమవాక్యముగా చెప్పును. ఇదియే సత్యము.
సమస్య పూర్తిగా మిథ్య. కావున, దానిని పరిష్కరించే ఉపాయము కూడ మిథ్యయే. అయి
ననూ, ఆ ఉపాయమునకు ఒకానొక వ్యావహారికసత్యత్వము గలదు. సత్యవస్తువును
మనకు చూపించే ఆ ఉపాయమునకు ఆ స్థాయికి చెందిన సత్యత్వము చాలును. ఇచ్చటి
ప్రతివాది పూర్వమీమాంసకుడు. ఆ విషయమును దృష్టిలో నిడుకొని శ్రీశంకరులు మీమాం
సకులకు తేలికగా అర్థమయ్యే దృష్టాంతమునిచ్చుచున్నారు. కర్మకాండలో విధివాక్యము
లకు అంగములుగా పనిచేసే అర్థవాదములు అనే వాక్యములు కొన్ని గలవు. ఈ వాక్య
ములు సిద్ధవస్తువును బోధించును. కాని, పూర్వవేదముయొక్క తాత్పర్యము విధియే గాని,
సిద్ధవస్తుప్రతిపాదనము కాదని మీమాంసకుల నిర్ణయము. అర్థవాదములవంటి సిద్ధవస్తుబో
ధకవాక్యములు ఉన్నచో, వాటిని విధివాక్యములకు అంగములుగా చేయవలెను. అట్లు గాని
చో, అవి నిరర్థకములగును ( ఆమ్నాయస్య క్రియార్థత్వాత్ ఆనర్థక్యం అతదర్థానామ్ ).
అగ్ని ఏడ్వగా, ఆ కన్నీరు వెండి అయినదని వేదము చెప్పుచున్నది. ఈ జ్ఞానము వలన
మనకు ప్రయోజనము ఏమి గలదు ? వేదము సాహిత్యము వంటిది కాదు. అది మనకు
కర్తవ్యములను బోధించే ధర్మశాస్త్రము. దాని బోధ నిరుపయోగముగా నుండరాదు. ఈ
వాక్యమునకు ప్రయోజనము గలదు. వెండియొక్క ఈ విధమైన జన్మను ఆధారముగా
చేసుకొని, 'యజ్ఞములో వెండిని దక్షిణగా నీయరాదు' అని వేదము నిషేధించుచున్నది.
వెండిని దానము చేయు యజమాని దుఃఖించే పరిస్థితులు కలుగును. ఈ విధముగా ఈ
అర్థవాదము యజ్ఞమును చేసే విధానము ( ఇతికర్తవ్యత ) లో భాగమగుచున్నది. అదే
విధముగా, పూర్వమగు కర్మకాండ జ్ఞానకాండకు అర్థవాదము వంటిది అగునని శ్రీశంకరులు
ఉద్ఘోషించినారు. ఉపాయము మిథ్యయే అయినా, దానికి చరమలక్ష్యముయొక్క సత్యత్వ

ముతో పోలిస్తే ఒకానొక స్థాయికి చెందిన సత్యత్వము గలదు. కర్మ జ్ఞానమునకు సాక్షాత్సాధనము కాదు. కాని, కర్మ పరంపరగా జ్ఞానమునకు దారి తీయును. లౌకికవ్యవహారములలో కూడ మనము ఇట్టి ఉపాయములను వినియోగించుచుందుము. పిల్లవాడు పాలు త్రాగనని మారాము చేసినచో, తల్లి వానితో పాలు త్రాగుట వలన జుట్టు ఒత్తుగా పెరుగునని చెప్పును. ఆ వాక్యము యథార్థము కాదు. కాని, దాని వలన ఒక ప్రయోజనము ఒనగూరినది. ఈ విధముగా పిల్లలు తమకు హితకరములగు పనులను చేయునట్లు ప్రేరేపించుటకై మనము ఎన్నో కథలను చెప్పుచుందుము. అదే విధముగా, కర్మకాండ మిథ్యయే అయినా, శాస్త్రము దానిని ప్రమాణరూపములో మాత్రమే ప్రతిపాదించును. అట్లు బోధించుట వలన సాధకుడు తన కర్తవ్యములను నిర్వర్తించి తద్ద్వారా అంతఃకరణశుద్ధిని పొందును. ఈ తీరున సంసిద్ధుడైన జిజ్ఞాసువు జ్ఞానమును, తద్ద్వారా మోక్షమును పొందును. కావున, మనము మిథ్యాభూతమగు ఉపాయమును ఆధారముగా చేసుకొని, సత్యలక్ష్యమును చేరవచ్చును. శ్రీశంకరులు ఈ విధముగా పూర్వమగు కర్మకాండకు బ్రహ్మవిద్యతో సంబంధమును కలిపిరి.

శ్రీశంకరులు మరియొక విషయమును స్పష్టము చేసిరి. కర్మకాండ మిథ్యయే అయిననూ కర్మవిజ్ఞానమునకు సాక్షాత్సాధనము ( ప్రమాణము ) అగుచున్నది. మానవులందరు ముముక్షువులు కారు. కర్మ మరియు దాని ఫలము యథార్థమనియే వారు భావింతురు. వారికి ఆయా అల్పఫలములను పొందుటకై కర్మకాండ సాక్షాత్తుగా సాధనమగుచున్నది.

వేదాంతశాస్త్రమునుండి పుట్టిన జ్ఞానము బాధింపబడదు ( అబాధితం జ్ఞానమ్ ). కావున, ప్రమాణనిర్వచనము దానికి పూర్తిగా వర్తించును. ఇతరప్రమాణములకు లభ్యము కానిది, మరియు ఇతరప్రమాణములచే బాధింపబడనిది అగు జ్ఞానమును ఇచ్చే జ్ఞానసాధనము ప్రమాణము ( అబాధిత- అనధిగత -జ్ఞాన- జనకం ప్రమాణమ్ ) అని మనము నిర్వచించియున్నాము. వాస్తవములో అనుమానము మొదలైన ఇతరప్రమాణములు అబాధితజ్ఞానమును ఇచ్చుట లేదు. ఆ దృష్టితో చూస్తే కర్మకాండ కూడ ప్రమాణము కాదు. కర్మకాండ మనకు ఇతరత్రా తెలియుటకు వీలు లేని సాధన-సాధ్యములను గురించి బోధించుచున్ననూ, బ్రహ్మజ్ఞానముచే ఆ సాధన-సాధ్యములు బాధితములగును. సర్వము అద్వయ -ఆత్మ మాత్రమే అను జ్ఞానము కలుగగానే, అవి అన్నియు బాధితములగును. కాని, స్వీయక్షేత్రములో సాధన-సాధ్యములను బోధించే కర్మకాండ ప్రమాణమే యగును. ఈ కర్మలను అంతఃకరణశుద్ధి కొరకై వినియోగించుకొనవచ్చును. దాని వలన మోక్షము లభించును. ఈ తీరున కర్మకాండ సాక్షాత్తుగా మోక్షసాధనము కాకపోయినా, పరంపరాసాధనము అగుచునే యున్నది. ఇంతే గాక, అజ్ఞానక్షేత్రమునకు పరిమితమై యున్న వారికి అది సాక్షాత్తుగా సహాయకారి అగుచున్నది. కేవలము అర్థకామములతో సంతృప్తి పడే వాని విషయములో కర్మకాండ అల్పలక్ష్యములను సాధించే సాధనములను బోధించే సాక్షాత్-ప్రమాణము అగుచున్నది.

వివిధకర్మలను బోధించే శ్రుతివాక్యములు ఆత్మ-జ్ఞానమును ఇంకను పొందని వారికి ప్రయోజనకరములగుచున్నవి. ఆ వాక్యములు మోక్షమును పొందుటలో పరంపరా

సాధనములగుననియు, ఆత్మజ్ఞానము ఉదయించుటకు ముందు అవి కర్మవిజ్ఞానమును కలిగించే సాక్షాత్-జ్ఞాన-సాధనములనియు శ్రీశంకరులు ఇదివరలో నిర్దేశించియున్నారు. ప్రత్యక్షము, అనుమానము మొదలైనవి దేహేంద్రియమనస్సంఘాతమే ఆత్మ యనే తాదాత్మ్యము గలవానికి మాత్రమే ప్రమాణములగుచున్నవి. ఇట్టి తాదాత్మ్యము లేనిచో, ఆ ప్రమాణములన్నియు బాధితములే యగును. జ్ఞానము కలిగిన తరువాత కూడా ఆ ప్రమాణములు పని చేయుచునే యుండును. కాని, జ్ఞాని విషయములో వాటికి వ్యావహారికసత్యత్వమే గాని, పారమార్థికసత్యత్వము ఉండదు. అదే విధముగా, ఆత్మజ్ఞానమునకు పూర్వములో కర్మకాండకు కూడ ప్రత్యక్షాదులకు వలె సాక్షాత్తుగా ప్రామాణ్యము గలదు. కర్మకాండకు అసలే ప్రామాణ్యము లేదని మనము చెప్పుట లేదు. ఆత్మజ్ఞానికి గలవాని విషయములో మాత్రమే దానికి ప్రామాణ్యము లేదని మనము చెప్పెదము. కర్మకాండలోనైననూ వివిధవిధివాక్యములు అధికారి విషయములో మాత్రమే ప్రమాణమగును. గృహస్థధర్మములకు బ్రహ్మచారి విషయములో ప్రామాణ్యము లేదు. అదే విధముగా, మోక్షార్థత గల వ్యక్తికి గాని, ఆత్మస్వరూపమునెరింగియున్న జ్ఞానికి గాని, కర్మకాండ ప్రమాణము కాదు.

ఇప్పుడు మరియొక అభ్యంతరము గలదు. ఆత్మ కర్మలను వేటినీ చేయదనియు, ఆత్మస్వరూపము నైష్కర్మ్యమనియు ప్రతివాది అంగీకరించుచున్నాడు. కాని, ఆత్మ కర్మలను చేయుట కొరకై మార్పులను వేటినీ పొందకపోయిననూ, దాని సన్నిధిలో కర్మలు జరుగును గనుక, ఆత్మ సన్నిధిచే కర్త కావచ్చును గదా ! కర్తృత్వము పలువిధములుగా నున్నది. కర్మను స్వయముగా మనమే చేయవచ్చును ; లేదా, ఇతరులచే చేయించవచ్చును ; లేదా, ఒక వ్యక్తియొక్క సన్నిధి మాత్రముచే ఇతరులు కర్మను చేయవచ్చును. కావున, ఆత్మయొక్క సన్నిధి మాత్రముచే కర్మలు జరుగుచున్నవి. ఆత్మ లేనిచో దేహము, ఇంద్రియములు మరియు మనస్సు కర్మలను చేయజాలవు. కావున, ఆత్మకు కర్తృత్వము సంక్రమించుచునే యున్నది. దీనికి ఒక దృష్టాంతమునీయవచ్చును. ఒక దేశముయొక్క సైనికులు శత్రుదేశముతో పోరాడుచుందురు. ఆ దేశపు రాజు స్వయముగా యుద్ధరంగమునకు వచ్చి యుద్ధమును చేయకపోవచ్చును. పైగా, ఆయన తన గదిలో కూర్చుండి పానీయమును సేవించుచుండవచ్చును. కాని యుద్ధమును చేసే కర్త ఆ రాజు మాత్రమే. ఏలయనగా, అతని సన్నిధి వలన మాత్రమే సైనికులు యుద్ధమును చేయుచున్నారు. అంతే గాక, జయపరాజయములు ఆ రాజునకు మాత్రమే చెందును. సర్వసేనాధ్యక్షుని విషయములో కూడ పరిస్థితి ఇంతే. అతడు కూడ స్వయముగా తుపాకిని పట్టి యుద్ధమును చేయడు. అతడు యుద్ధనియంత్రణాకేంద్రములో కూర్చుండి, సైనికదళములకు యుద్ధమును చేయుడని ఆదేశములనిచ్చుచుండును. కాని, యుద్ధములో విజయము లభించినచో, అది అంతయు అతని ప్రతిభగనే పరిగణించబడును. యుద్ధములో పరాజయము కలిగినచో, జైలునకు వెళ్లునది ఎవరు ? సర్వసేనాధ్యక్షుడు. వైదికకర్మలలో కూడ పరిస్థితి ఇటులనే యుండును. ' నేను ఈ యజ్ఞమును చేయుచున్నాను ' అని సంకల్పించే యజమాని వాస్తవముగా కర్మను చేయడు. హవనాదికర్మలను అన్నింటినీ ఋత్విక్కులు చేయుదురు. యజమాని ఒక మూల కూర్చుండి పరికించుచుండును. అతడు ఏ క్రియను

చేయకపోయిననూ, కర్మఫలము అంతయు ఆతనికే చెందును. అదే విధముగా, దేహాదులు కర్మలను చేయుచుండగా, ఆత్మ యజమాని వలె, రాజు వలె, సర్వసేనాధ్యక్షుని వలె, ఏ పనినీ చేయకున్ననూ, కర్తృత్వము మరియు కర్మఫలము ఆత్మకు మాత్రమే చెందును. ఈ కర్తృత్వము గౌణము అని చెప్పుటయు సరిగాదు. కావున, ఆత్మయందు ముఖ్యకర్తృత్వము గలదు. సుఖదుఃఖములనిచ్చే పుణ్యపాపములనే కర్మఫలములు కూడ ఆత్మకు మాత్రమే సంక్రమించును.

ప్రతివాదికి తాను ఇచ్చిన దృష్టాంతములు పూర్తి సంతృప్తిని కలిగించ లేదు. ఏల యనగా, రాజు తాను స్వయముగా యుద్ధమును చేయకపోయిననూ, ఆయన కూడ ఏదో ఒక రకమైన క్రియాశీలతను కలిగిన వాడై యుద్ధమునకు సహకరించుచున్నాడు గదా ! కావున, ప్రతివాది మరియొక దృష్టాంతమునిచ్చుచున్నాడు. అయస్కాంతముయొక్క సన్నిధిలో ఇనుప ముక్కలు కదలాడును. ఆత్మయొక్క సన్నిధి కూడ అట్టిదియే. అయస్కాంతము ఒక స్థానములో స్థిరముగా నుండును. దానియందు మార్పులు ఏమియు ఉండవు. అది ఏ పనినీ చేయదు. కాని దాని సన్నిధిలో ఇనుప ముక్కలు చలించును. అదే విధముగా, ఆత్మ తన సన్నిధి మాత్రముచే మనస్సు, ఇంద్రియములు మరియు దేహము అనువాటిని క్రియాశీలములుగా చేయును. కావున, ఆత్మ తాను స్వయముగా ఏ పనినీ చేయకపోయినా, తన సన్నిధిచే ఇతరములను క్రియాశీలములుగా చేయుచున్నది గనుక, ఆత్మయే ముఖ్యకర్త యగును.

శ్రీశంకరులీ వాదమును త్రోసిపుచ్చిరి. ఆత్మ ఏ పనినీ చేయుట లేదని చెప్పి, మరల ఆత్మ కర్తయగునని చెప్పుట విరుద్ధము. దీనిపై ప్రతివాది ఇట్లు చెప్పును : కర్తృత్వమ్ము పలు విధములుగా నున్నది. సైనికుడు యుద్ధమును చేయును. రాజు తాను యుద్ధమును చేయక పోయిననూ, యుద్ధమును చేయించి కర్త యగును. ఆత్మలో వికారములు లేవనియు, అది సాక్షాత్తుగా క్రియలను చేయదనియు సర్వులకు అంగీకారమే. కాని, ఆ కారణముచే ఆత్మయందు కర్తృత్వము లేదని చెప్పలేము. ఆత్మ అవిక్రియమై యుండుట దాని కర్తృత్వమును త్రోసిపుచ్చలేదు. వికారములు లేకున్ననూ, రాజునకు వలె ఆత్మకు కూడ కర్తృత్వము సంభవమే.

శ్రీశంకరులు ఈ రాజు దృష్టాంతములోని దోషమును చూపించినారు. రాజు కర్మను చేయుట లేదను మాట సరిగాదు. రాజులు కూడ యుద్ధమును చేయుదురు. శ్రీరాముడు అటులనే చేసినాడు. సేనాధ్యక్షులు కూడ యుద్ధమును చేయుదురు. కావున, వారు అందరు ముఖ్యకర్తలే యగుదురు. ఒకచో రాజు స్వయముగా యుద్ధములో పాల్గొనక పోయిననూ, యుద్ధమును చేయాలని నిర్ణయించి ఆజ్ఞలను జారీ చేసేది ఆయనే గదా ! సేనాధ్యక్షుడు కూడ ఆజ్ఞలను ఇచ్చుట ద్వారా యుద్ధమును చేయును. నిర్ణయమును తీసుకొనుట, ఆజ్ఞలనిచ్చుట అనునవి కూడ కర్మలే. ఆజ్ఞలనిచ్చువాడు సాక్షాత్తుగా కర్త యగును. యుద్ధమునకు పూర్తి బాధ్యత రాజుది మాత్రమే. యుద్ధము చేయాలనే నిర్ణయము రాజుదే కాని, సైనికులది కాదు. మరియు, ఆ సైనికులకు అందరికీ రాజు జీతములను ఇచ్చి, యుద్ధసామగ్రిని సమకూర్చును. సైనికులు ఉచితసేవను చేయుట లేదు. కావున, యుద్ధములో విజయము లభించినా, పరాజయము కలిగినా, అది రాజునకు, లేదా సేనా

ధ్యక్షునకు మాత్రమే చెందును. యజ్ఞమును చేయు యజమాని విషయములో కూడ పరిస్థితి ఇంతే. ప్రధానహోమమును మాత్రమే గాక, కొన్ని ప్రముఖమగు ఇతరకర్మలను కూడ యజమాని చేయును. యజమాని సంకల్పమును చేయుట మాత్రమే గాక, ఋత్విక్కులకు దక్షిణలను ఇచ్చును. కావున, యజ్ఞములో ముఖ్యకర్త నిస్సంశయముగా యజమానియే. యజ్ఞఫలము కూడ ఆయనకు మాత్రమే లభించును. కావున, ప్రస్తుతములో ఈ ఉదాహరణలు యుక్తియుక్తముగా లేవు. వీటిని బట్టి ఆత్మకు ముఖ్యకర్తృత్వము లేదని చెప్పుట సంభవము కాదు.

శ్రీశంకరులు ఇట్లు వివరించినారు : ఆత్మయందు ఆరోపించబడే కర్తృత్వము ముఖ్యము కాదు ; గౌణము మాత్రమే. పై దృష్టాంతములలో రాజు, సైన్యాధ్యక్షుడు కర్మలను చేయుచునే యున్నారు. కాని, ఆత్మ అట్లు గాదు. ఆత్మ క్రియలను వేటినీ చేయుట లేదు. కావున, ఆత్మయందు కర్తృత్వము ఉపచారమే ( figurative ) గాని, వాస్తవము కాదు. ఆత్మయొక్క సన్నిధిలో సర్వకర్మలు జరుగునని మనము అంటాము. కాని, ఆత్మకు కర్తృత్వమును అంటగట్టుట తాత్పర్యము కాదు. వాస్తవములో, సర్వకర్మలు ఆత్మయొక్క సన్నిధిలో మాత్రమే జరుగుననే ప్రతిపాదనము ఆత్మ కర్త కాదని బోధించుటకై చేయబడినది. ఆత్మసన్నిధి మాత్రముచే సర్వకర్మలు జరుగుచున్నచో, దానిని బట్టి ఆత్మకు కర్తృత్వము సంక్రమించదు. కావున, ఆత్మయందలి కర్తృత్వము ఉపచారము మాత్రమే. రాజు విషయములో పరిస్థితి ఇది కాదు. రాజునకు ప్రత్యక్షకర్తృత్వము లేదను మాట వాస్తవము కాదు. రాజుయొక్క సన్నిధి మాత్రముచే సర్వకర్మలు జరుగుచున్నవని మనము చెప్పలేము. అయస్కాంతసన్నిధి మాత్రముచే ఇనుప ముక్కలు కదలాడే పరిస్థితి రాజు విషయములో వర్తించదు. అయస్కాంతము ఏ పనినీ చేయదు. దానికి కర్తృత్వము లేదు. అదే విధముగా, ఆత్మ తాను క్రియలను వేటినీ చేయకున్ననూ, దాని సన్నిధి మాత్రము చేతనే దేహము, ఇంద్రియములు, మనస్సు వివిధకర్మలను చేయుచుండును. కావున, ఆత్మయందు ఆరోపించబడే కర్తృత్వము గౌణము లేక ఔపచారికము మాత్రమే. ' నేను చూచుచున్నాను ; నేను వినుచున్నాను ' అను ప్రయోగములు ఔపచారికములు ( figure of speech ) మాత్రమే గాని, యథార్థములు గావు. ఇది శ్రీశంకరులు నిరూపించిన సిద్ధాంతము.

కర్తృత్వము ఔపచారికము మాత్రమే అయినచో, ఫలము ఎవరికి చెందును ? ఫలము కూడ ఔపచారికమే. కర్మఫలములగు పుణ్యపాపములు సుఖదుఃఖములనిచ్చును. వాటితో ఆత్మకు గల సంబంధము గౌణమే గాని, ముఖ్యము కాదు. ఆత్మ స్వయముగా కర్మలను వేటినీ చేయుట లేదు గనుక, వాటికి ఆత్మ బాధ్యతను వహించనక్కరలేదు. ఆత్మ కర్మఫలభోక్త కాదు. గౌణకర్త యథార్థమగు కర్మను చేయదు. కావున, అవిక్రియమగు ఆత్మ దేహేంద్రియమనస్సుల కర్మల ద్వారా కర్త గాని, భోక్త గాని యగుట కల్ల. ఆత్మ అవిక్రియమని చెప్పి, మరల ఆత్మ కర్త-భోక్త అని చెప్పుట విరుద్ధము.

దీనితో అభ్యంతరములన్నియు త్రోసిపుచ్చబడినవి. ఈ చర్చకు అంతములో శ్రీశంకరులు ఒక విషయమును చెప్పిరి. భ్రాంతి ఉన్నచోట సర్వము సంభవమగును. ఆత్మ కర్త

కాకపోయినా, కర్త యగును. అజ్ఞానముచే దేహేంద్రియమనస్సంఘాతమునందు ఆత్మ యనే ధారణ ఉండుటచే ఆత్మ కర్త యనియు, భోక్త అనియు భ్రాంతి కలుగును. స్వప్నములో వలె భ్రాంతిచే లేనిది ఉన్నట్లు, ఉన్నది లేనట్లు కానవచ్చును. వాస్తవములో ఆత్మ తక్క ఇతరము లేకపోయినా, భ్రాంతిచే అనేకము ఉన్నట్లు కానవచ్చును. ద్వైతము లేకున్ననూ, జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయవిభాగము ఉన్నట్లు కన్పట్టును. సృష్టి లేకుండగనే సృష్టి, స్థితి లేకున్ననూ స్థితి, ప్రలయము లేకున్ననూ ప్రలయము --- ఏదైనా సంభవమే. మౌలికమగు అజ్ఞానము ఉన్నచో, సర్వము ఘటిల్లును. దేహేంద్రియమనస్సంఘాతమునందు ఆత్మ యనే భ్రాంతితో జీవితము ఆరంభమగును. అప్పుడు కర్మకు ప్రాముఖ్యము పెరుగును. ధర్మ-అధర్మములు, పుణ్య-పాపములు సంప్రాప్తమగును. కావుననే, కర్మయోగము, అంతఃకరణశుద్ధి, సన్న్యాసము మొదలగు సాధనలు ఆవశ్యకమగుచున్నవి.

దేహేంద్రియమనస్సంఘాతమునందు ఆత్మభ్రాంతి ఉండుట చేతనే, మానవుడు తనకు అభీష్టము కాని సర్వమును పొంది సంసారి యగును. మనస్సునందు ' నేను' అను భ్రాంతితో ఈ సంసారము ఆరంభమగుచున్నది. ఈ సూక్ష్మశరీరతాదాత్మ్యమును వెన్నంటి స్థూలశరీరముతోడి తాదాత్మ్యము ఏర్పడును. దాని వెంటనే జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయభేదము అనే ద్వైతము గలదు. అపుడు ఈశ్వరుడు ఆత్మకంటె భిన్నముగా దర్శించబడును.

జ్ఞానము ఉదయించగానే, వ్యక్తి-జగత్తు-ఈశ్వరుడు అనే భేదముతో సహా సంసారమంతయు విలీనమగును. ఆ పూర్ణవిలయమే మోక్షము. కావున, జ్ఞానము వలన మాత్రమే మోక్షము లభించునని నిర్ధారించడమైనది. సర్వకర్మసన్న్యాసము జ్ఞానముచే మాత్రమే సంభవమగును. నీవు ధర్మములను అన్నిటినీ విడిచిపెట్టి ( సర్వధర్మాన్ పరిత్యజ్య ) ఆత్మను శరణు పొందినచో, నేను నిన్ను సర్వపుణ్యపాపములనుండి విడిపించెదను. ఈ 'నేను' ఎవరు ? అదియే ఆత్మ, ప్రత్యగాత్మ, సర్వముయొక్క ఆత్మ, పరమాత్మ. ఈశ్వరునియొక్క మరియు జీవునియొక్క యథార్థస్వరూపమగు ఈ ఆత్మను గుర్తించుటయే మోక్షము అనబడును.

ఈ అధ్యాయములో గీతాశాస్త్రము అంతయూ సారరూపముగా చెప్పబడినది. కాని, గడచిన రెండు శ్లోకములలో మరల గీతాసారము మరింత సంగ్రహముగా చెప్పబడినది. ఒక శ్లోకములో కర్మయోగము చెప్పబడినది. జ్ఞానముచే కర్మలను అన్నింటినీ విడిచిపెట్టుట ( జ్ఞానకర్మసన్న్యాసము ) రెండవ శ్లోకము ( సర్వధర్మాన్ పరిత్యజ్య ) లో చెప్పబడినది.

విద్యాసంప్రదాయమునెరింగి ( సంప్రదాయవిత్ ) శాస్త్రమును బోధించు వ్యక్తి పాటించే నియమము ఒకటి గలదు. అదియే సంప్రదాయవిధి. అది ఇచట శాస్త్రమునకు అంతములో ప్రదర్శించబడుచున్నది. ఆచార్యుడు ఈ జ్ఞానమును ఎవరికి ఈయవలెను?

**అధ్యాయము 18 , శ్లోకము 67 :**

इदं ते नातपस्काय नाभक्ताय कदाचन ।

न चाशुश्रूषवे वाच्यं न च मां यो ऽभ्यसूयति ।। ६७ ।।

ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన

న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోభ్యసూయతి ( 67 ).

తే = నీకు, ఇదమ్ = ( చెప్పబడిన ) ఈ జ్ఞానము, అతపస్కాయ = ధార్మిక-అనుశాసనము లేనివానికి, న వాచ్యమ్ = చెప్పబడరాదు, అభక్తాయ = భక్తుడు కానివానికి, న = చెప్పబడరాదు, చ = మరియు, అశుశ్రూషవే = వినే ఉత్సాహము లేనివానికి, న = చెప్పబడరాదు, చ = మరియు, యః = ఎవరైతే, మామ్ = నన్ను, అభ్యసూయతి = దోషములు లేకున్ననూ వాటిని వెదుకునో వానికి, కదాచన = ఎన్నడైననూ, న = చెప్పబడరాదు.

నీకు చెప్పిన ఈ జ్ఞానమును ఆచార్యుడు ధార్మిక-అనుశాసనము
లేనివానికి, భక్తుడు కానివానికి, వినే ఉత్సాహము లేనివానికి,
మరియు నాయందు లేని దోషములను వెదికి చూపించువానికి
చెప్పరాదు ( 67 ).

లేదా,

నీవు ఈ జ్ఞానమును ధార్మిక-అనుశాసనము లేనివానికి-------
చెప్పరాదు ( 67 ).

' నీవు కారణము లేకుండగనే శోకించుచున్నావు ( అశోచ్యానన్వశోచస్త్వమ్ ) ' అని ఆరంభమై, ' దుఃఖించకుము ( మా శుచః ) ' అని అంతమైన గీతాశాస్త్రమును ఇదమ్ అను పదము పరామర్శించును. నేను నీకు చెప్పిన ఈ గీతాశాస్త్రమును కొంత మందికి చెప్పరాదు ( న వాచ్యమ్ ) అని భగవానుడు చెప్పుచున్నాడు. ఎవరికి చెప్పరాదో నిర్దేశించుట ద్వారా, ఎవరు చెప్పదగినవారు అను విషయము తేలును. నీ హితము కొరకు చెప్పబడినది ( తవ హితాయ ఉక్తమ్ ) అని శ్రీశంకరులు హితాయ, ఉక్తమ్ అనే పదములను జోడించిరి. నీచే చెప్పబడరాదు ( త్వయా న వాచ్యమ్ ) అని మనము త్వయా అను పదమును కూడ జోడించుకొన వలెను. ఈ వచనము అర్జునుని ఉద్దేశించి చెప్పబడిననూ, శాస్త్రము తెలిసిన వారికి అందరికి వర్తించును.

శ్రీశంకరులు ఇట్లు వివరించిరి : గీత సంసారమును నిర్మూలించి మానవునకు హితమును చేగూర్చును. కావున, గీత మోక్షశాస్త్రము అగుచున్నది. కాని, కర్మకాండలో బ్రహ్మజ్ఞానము ప్రధానముగా బోధింపబడదు గనుక, అది జ్ఞానముతో సంబంధమును కలిగియున్ననూ, సాక్షాత్తుగా మోక్షశాస్త్రము కాదు. కర్మకాండలో కూడా అక్కడక్కడ ఆత్మయొక్క మరియు ఈశ్వరునియొక్క స్వరూపమును బోధించే మంత్రములు కానవచ్చిననూ, అచట ఆత్మజ్ఞానము ప్రధానలక్ష్యముగా బోధింపబడుట లేదు. అచట వివిధకామనలను పరిపూర్తి చేసుకొనుటకై కావలసిన సాధన-సాధ్యములు మరియు ధర్మ-అర్థ-కామములనే పురుషార్థములు మాత్రమే బోధించబడును. అచట వేదాంతములో వలె మోక్షము అనే నాల్గవ పురుషార్థము తత్పరతతో బోధింపబడుట లేదు. ఇందువలననే, మనము వేదమును కర్మకాండ మరియు జ్ఞానకాండ అనే రెండు భాగములుగా విభజించినాము. కాని, భగవద్గీతలో పరిస్థితి దీనికి పూర్తిగా భిన్నముగా నున్నది. శ్రీకృష్ణభగవానుడు రెండవ అధ్యాయములోననే అర్జునునకు ఇట్లు బోధించినాడు : ' వేదములు అన్నియు త్రిగుణాత్మకమగు

సంసారము విషయవస్తువుగా కలిగియున్నవి. నీవు ఈ మూడు గుణములనుండి విముక్తుడవు కమ్ము ( త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ) '. త్రిగుణములకు అతీతుడగుట యనగా మోక్షమే. మోక్షము మాత్రమే ప్రధానలక్ష్యముగా గలవానికి నిశ్చయాత్మిక బుద్ధి ( వ్యవసాయాత్మికా బుద్ధిః ) ఉండును. ఇతరలక్ష్యములన్నియు ఆ ప్రధానలక్ష్యమునకు లోబడి యుండును. అట్టి సాధకుని జీవితము కర్మయోగము అగును. కావున, మోక్షమును కోరువానికి ( ముముక్షువు ) మాత్రమే కర్మయోగము సంభవమగును. మానవజీవితమునకు చరమలక్ష్యము మోక్షము మాత్రమే అనే వివేకము లేనివానికి కర్మయే గాని, కర్మయోగము ఉండదు. అట్టి వానికి అసంఖ్యాకములగు లక్ష్యములు ఉండును. మరో మాటలో చెప్పాలంటే, అనంతము లక్ష్యము కానివానికి కోరికలు అనంతముగా నుండును. కావున, ఈ గీతాశాస్త్రమును యోగ్యమగు అధికారులకు మాత్రమే బోధించవలెను. అధికారము లేనివారికి బోధించరాదు.

దీనిని ఎవరికి బోధించరాదు ( న వాచ్యమ్ ) ? ధార్మిక-అనుశాసనము లేనివానికి ( అతపస్కాయ ) బోధించరాదు. బౌద్ధిక-అనుశాసనము లేని వారు ( అమేధావినః ) కూడ ఈ కేటగిరీకు మాత్రమే చెందెదరు. ఈ రెండు రకములు సాధారణముగా కలిపి నిర్దేశించబడును. తపస్సు అనగా జ్ఞానము మరియు జ్ఞాన-అన్వేషణ అను అర్థములు కూడ గలవు. తైత్తిరీయోపనిషత్తులో భృగువునకు ఆయన తండ్రి ' తపస్సుచే బ్రహ్మను తెలుసుకొనుము ( తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ ) ' అని చెప్పెను. అచట తపస్సు అనగా కేవలవిచారము మాత్రమే. కాని, ఇచట తపశ్శాలి అనగా, అంకితభావము కలిగి జ్ఞానమును పొందుటకై అవశ్యకమగు ప్రయత్నమును చేయుటకు సంసిద్ధుడైనవాడు అని చెప్పవచ్చును. ఈ లక్షణము లేనివానికి ( అతపస్కాయ ) ఈ జ్ఞానమును బోధించరాదు.

ఇంతేగాక, ఈ జ్ఞానమును భక్తి లేనివానికి ( అభక్తాయ ) ఈయరాదు. భక్తి ఈశ్వరునియందు మాత్రమే గాక, గురువునందు కూడ ఉండవలెను. అనగా, మోక్షమును పొందుటకు శ్రద్ధతో బాటు ఒక విశిష్టమైన ఈశ్వరీయభావన కూడ ఆవశ్యకమగుచున్నది. మోక్షము ఈశ్వరానుగ్రహము ఉన్నప్పుడు మాత్రమే లభించునని భక్తునకు తెలియును. ఈ భక్తుడు తప్పనిసరిగా జిజ్ఞాసుభక్తుడై ఉండవలెను. కావున, ఆతనికి ఈశ్వరునియందలి భక్తితో బాటు, గురువునందు మరియు గురువుయొక్క బోధయందు అంకితభావము ఉండును. దీనిని బట్టి ఒకడు ఈ జ్ఞానమునందు తత్పరత గలవాడే అయినా, ఆతనికి భక్తి లేనిచో, ఈ జ్ఞానమునకు అర్హుడు కాదనియు, ఆతనికి బోధించరాదనియు స్పష్టమగును.

ఇటువంటి వారికి బోధించకూడని ప్రత్యేకకాలము ఏదైన గలదా ? ఎన్నడూ బోధించరాదని ( న కదాచన ) భగవానుడు నొక్కి చెప్పుచున్నాడు. ఎట్టి పరిస్థితులలోనైనా, బలప్రయోగము చేయబడిన సందర్భములోనైనా ఈ జ్ఞానమును అనర్హునకు ఈయరాదని శ్రీశంకరుల అభిప్రాయము. శాస్త్రము తెలిసిన వ్యక్తి సంప్రదాయము తెలిసిన వాడు కానిచో, అనర్హునకు చెప్పే అవకాశము గలదు. కావుననే, శ్రీశంకరులు ఇచట సంప్రదాయమును స్పష్టము చేసినారు.

ఇంతేగాక, వినే ఉత్సాహము లేనివానికి ( అశుశ్రూషవే ) కూడ ఈ జ్ఞానమును బోధించరాదు. ఉత్సాహము లేనివాడు తరగతికి వెళ్లినమా, ఆతని మనస్సు ఎచ్చటనో

ఉండును. లేదా, ఆతడు తరగతిలో నిద్ర పోవును. శుశ్రూషుః అనగా వినే కోరిక గలవాడు ( శ్రోతుం ఇచ్ఛుః ). శుశ్రూషువు అగు వ్యక్తికి శాస్త్రమునందు అమితమగు ప్రీతి ఉండును. ఆతడు శాస్త్రమును తెలుసుకొనుటకు కటిబద్ధుడై యుండును. అట్టివానికి మాత్రమే శాస్త్రమును బోధించవలెను. చదువు మీద పట్టింపు లేనివానికి చెప్పరాదు. కోరనిదే జ్ఞానమును ఈయరాదని శాస్త్రనియమము ( న అపృష్టః కస్యచిత్ బ్రూయాత్ ) గలదు. వరుణుడు తన కుమారుడగు భృగువునకు ఈ జ్ఞానమును ఆతడు కోరిన తరువాత మాత్రమే ఇచ్చినాడు. అంత వరకు ఈయలేదు. కావున, జిజ్ఞాసువు తరగతిలో కూర్చుండి వినే ఉత్సాహము గలవాడు అయి ఉండవలెను.

దీనిని ఇంకనూ ఎవరికి ఈయరాదు ? గీతాచార్యునియందు దోషములను వెదుకువానికి దీనిని బోధించరాదు. నా కంటె భిన్నమైనది, లేదా నాకంటె ఉత్కృష్టమైనది మరియొకటి లేదు ( మత్తః పరతరం నాస్తి ) ; నీవు నన్ను మాత్రమే శరణు పొందుము ( మామేకం శరణం వ్రజ ) ; నాయందు నిశ్చలమగు భక్తిని కలిగియుండుము ( మయి అవ్యభిచారిణీ భక్తిః ) ; నీ మనస్సును నాయందు నిలుపుము ( మన్మనా భవ ) ; నా భక్తుడవు కమ్ము ( మద్భక్తో భవ ) ; యజ్ఞముచే నన్ను ఆరాధించుము ( మద్యాజీ ) ; నాకు నమస్కరించుము ( మాం నమస్కురు ) అని శ్రీకృష్ణుడు చెప్పినాడు గనుక, ఆయన పొగరుమోతు అని ఎవరైననూ నిందించవచ్చును. ఇటువంటి వాక్యములు చాల గలవు. తరచుగా ఉత్తమపురుష ( నేను ) ను ప్రయోగించే వ్యక్తి జనుల దృష్టిలో పొగరుమోతు. కాని, ఇచట శ్రీకృష్ణుడు ఈశ్వరుని స్థానమునుండి ప్రసంగించినాడు. ఆయనను ఈశ్వరునిగా దర్శించినచో, ఈ ఉపదేశము సార్థకమగును. శాస్త్రము తెలిసి బోధించువాడు శాస్త్రవిత్ అనబడును. కాని, శ్రీకృష్ణుడు శాస్త్రమును రచించి లోకములకు అందజేసిన వాడు గనుక, శాస్త్రకృత్ అనబడును. గీతాశాస్త్రమును సాక్షాత్తుగా భగవానుడే ఉపదేశించినాడు. ఈ విషయమును గుర్తించిన జిజ్ఞాసువునందు విలక్షణమగు శ్రద్ధ నెలకొని అది ఆతనిని అనుగ్రహించును. దీనికి భిన్నముగా, భగవానునియందు లేని దోషములను ఆయనకు అంటగట్టినచో, అది అసూయ అనబడును ( గుణేషు దోషదర్శనమ్ ). సర్వగుణములు భగవానునియందు పూర్ణరూపములో నున్నవి ( సర్వగుణవాన్ ). అట్టి అనంతకల్యాణగుణగణవిశిష్టుడగు ఈశ్వరునియందు కూడ తప్పులను చూపినచో, అది అసూయ యగును. ఇట్టి అసూయాపరునకు గీతను బోధించరాదు. ఎందువలన ? అట్టి ధోరణి గలవానియందు ఈ ఉపదేశము వ్యర్థమగును.

ఈ జ్ఞానమును ఎవరెవరికి బోధించరాదు అను విషయమును నిర్ధారించుట వలన, దీనిని ఎవరికి ఈయవచ్చును అను విషయము సుస్పష్టమైనది. ఆధ్యాత్మిక-అనుశాసనము, భక్తి, వినాలనే ఉత్సాహము, మరియు గురువులో లేని దోషములను వెదికి పట్టే స్వభావము లేకుండుట అను లక్షణములు గల వ్యక్తి దీనికి అర్హుడు.

సంప్రదాయబద్ధముగా ఈ జ్ఞానమును బోధించే ఆచార్యునకు లభించే ఫలము ఎట్టిది ?

**అధ్యాయము 18 , శ్లోకము 68 :**

य इमं परमं गुह्यं मद्भक्तेष्वभिधास्यति ।

भक्तिं मयि परां कृत्वा मामेवैष्यत्यसंशयः ।। ६८ ।।

యః ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః ( 68 ).

యః = ఎవడైతే, మయి = నాయందు, పరామ్ = సర్వోత్కృష్టమైన, భక్తిమ్ = భక్తిని, కృత్వా = చేసి, పరమమ్ = సర్వశ్రేష్ఠమైనది, గుహ్యమ్ = రహస్యమైనది అగు, ఇమమ్ = ఈ జ్ఞానమును, మద్భక్తేషు = నా భక్తులయందు, అభిధాస్యతి = బోధించునో, మాం ఏవ = నన్ను మాత్రమే, ఏష్యతి = పొందగలడు, అసంశయః = సందేహము లేదు.

ఎవడైతే నాయందు సర్వోత్కృష్టమైన భక్తి గలవాడై సర్వశ్రేష్ఠము,
రహస్యము అగు ఈ జ్ఞానమును నా భక్తులకు బోధించునో, అతడు
నన్ను మాత్రమే పొందుననుటలో సందేహము లేదు ( 68 ).

దీనిని ఎవరు బోధించెదరో ( యః అభిధాస్యతి ) అని భగవానుడు చెప్పుటచే, ఈ నియమము అర్జునునకు మాత్రమే గాక, శాస్త్రమును ఉపదేశించే సర్వులకు వర్తించునని స్పష్టమగుచున్నది. ఈ శాస్త్రములోని విషయమును తెలుసుకున్నవానికి మోక్షము లభించును. కావుననే, ఈ శాస్త్రము సర్వోత్కృష్టమని ( పరమమ్ ) చెప్పబడినది. శ్రీకృష్ణార్జునుల మధ్య సంభాషణ రూపములోనున్న ఈ ఉపదేశము మిక్కిలి పవిత్రమైనది మరియు రహస్యమైనది ( గుహ్యమ్ ). దీనిని రహస్యముగా నుంచుటకు కారణమేమి ? ఈ జ్ఞానమునకు సంసిద్ధుడు కానివానికి, దీని ఆవశ్యకత లేనివానికి ఇది హానిని కలిగించును. సామాన్యభక్తునితో ' నీవు భగవానుడవు ' అని చెప్పినచో, అతడు భక్తిని విడిచిపెట్టును. కాని అతనికి జ్ఞానము పట్టుపడదు. అపుడు అతడు ఉభయభ్రష్టుడగును. ఈ ఉపదేశమునకు ముందే అతని స్థితి బాగుండెడిది. కావున, ఈ జ్ఞానమునకు సంసిద్ధుడైన వానికి మాత్రమే దీనిని బోధించవలెను. కావున, ఇది పవిత్రమైనది. అంత మాత్రమే కాదు. ఈ జ్ఞానము పరమపురుషార్థమునిచ్చును. కావున, ఇది చాల విలువైనది. కావున, దీనియందు పూర్ణమగు శ్రద్ధ గలవానికి మాత్రమే దీనిని ఈయవలెను. శ్రద్ధ లేనివానికి ఇది ఉపకరించదు. ఈ జ్ఞానము ప్రత్యక్షము మొదలైన ఇతరజ్ఞానసాధనము ( ప్రమాణము ) లకు ఉపలభ్యము కాదు గనుక, ఇది పరమరహస్యము. మరియు, ఇది సంసారము అనే సమస్యకు పరిష్కారమును వెదుకుచున్న జిజ్ఞాసువుయొక్క స్వరూపమై యున్నది. సాధకుడు దీని కొరకు అన్వేషించుచున్నంత వరకు ఇది రహస్యముగనే యుండును. ఏలయనగా, జిజ్ఞాసువు దేని కొరకు వెదుకుచున్నాడో, అది వాని ఆత్మయై ఉన్నది. సరియగు అర్హత లేనివానికి బోధించిననూ, అది వాని బుద్ధికి అందదు. అనగా, వానికి అది రహస్యముగనే మిగిలి యుండును. విశిష్టసాధనములను వినియోగించి విశిష్టలక్ష్యములను సంపాదించే అభిముఖ్యము గల వ్యక్తికి ఈ ఉపదేశము రహస్యముగనే మిగిలి యుండును. ఏలయనగా, దీనియందు సాధన-సాధ్యములు లేవు. ఇది కేవలము ఆత్మను గురించి తెలుసుకొనుట మాత్రమే. ఆత్మ అతిసూక్ష్మమైనది ; ప్రమాణములకు గోచరము కానిది. దానిని శాస్త్రవచనములు లక్ష్యార్థము ద్వారా బోధించును. ఇది రహస్యమనుటలో ఇది మరియొక కారణము.

ఈ గీత ఉపదేశింపబడేది ఎవరికి ? పరమేశ్వరభక్తులకు ( మద్భక్తేషు ). సాధారణముగా భక్తులు అర్థకామములకు కట్టుబడినవారై, ఆ లక్ష్యములను పొందుటకు ఈశ్వరుని సాహాయ్యమునర్థించెదరు. కాని, ఇచట భక్తులు పరమేశ్వరుని గురించి జ్ఞానమును కోరుచున్నారు. అంతకు తక్కువతో వారికి పని లేదు. పరమేశ్వరునినుండి ఏవో కొన్ని అల్పఫలములను గాక, పరమేశ్వరుని మాత్రమే గోరి వారు పరమేశ్వరుని ఆశ్రయించుచున్నారు. ఈ జిజ్ఞాసు-భక్తుల ఏకైకలక్ష్యము మోక్షము. ఈ జ్ఞానమును పొందుటకు వీరు అర్హులు. వీరికి ఈ జ్ఞానమును ఈయవలెనని చెప్పి భగవానుడు ఇచట భక్తియొక్క ప్రాముఖ్యమును దృఢముగా ప్రతిపాదించుచున్నాడు. జిజ్ఞాసువునకు అనుశాసనము ( తపస్సు ) మరియు వినాలనే ఉత్సాహము ( శుశ్రూష ) తో బాటు ఈశ్వరునియందు భక్తి కూడ అత్యావశ్యకమని ఇచట నిర్దేశించబడినది.

ఈ జ్ఞానమును ఉపదేశించు వ్యక్తి నాయందు సర్వోత్కృష్టమైన భక్తిని ( భక్తిం మయి పరామ్ ) నెరపుచున్నాడని శ్రీకృష్ణుడిచట చెప్పుచున్నాడు. గీతను బోధించు ఆచార్యుడు భగవత్స్వరూపమును నిరూపించుచున్నాడు గనుక, అది భగవంతుని సేవయే యగును. దీనిని బోధించువాడు భగవత్స్వరూపము తెలిసిన జ్ఞానియై ఉండును. జ్ఞాని నా స్వరూపమే ( జ్ఞానీ తు ఆత్మైవ ) అని భగవానుడు చెప్పియున్నాడు. అనగా, భగవానునకు భక్తునకు మధ్యలో భేదము లేశమైననూ లేదు. ఇదియే పరమభక్తి. భగవానుని గురించి వాస్తవముగా బోధించవలసినది భగవానుడే. ఈ జ్ఞానము వలన అహంకారము విలీనమగును. కావున, గీతను బోధించే ఆచార్యుడు భగవానుడే యగును. పరమేశ్వరునితో అభేదమును పొందియున్న ఆచార్యుడు జ్ఞాని-భక్తుడగును. ఆయన బోధించుట ద్వారా భగవానుని నిరంతరముగా సేవించుచుండును.

వానికి లభించు ఫలమేమి ? ' వాడు నన్ను పొంది తీరును ( మాం ఏష్యతి ) '. ఆతడు జీవించియుండగనే ముక్తుడు ( జీవన్ముక్తుడు ) అగును. ఆతనికి జ్ఞాననిష్ఠయందు ఏదేని సమస్య ఉన్నచో, ఈ బోధన వలన అది తీరిపోవును. జీవేశ్వరుల స్వరూపము ఒక్కటియే గాన, గీతను బోధించే ఆచార్యుడు పరమేశ్వరునికంటె భిన్నముగా లేడు. ఆతడు మరణించిన తరువాతనైననూ పరమేశ్వరుని పొందును. అనగా, ప్రారబ్ధకర్మ క్షయమైన తరువాత పరమేశ్వరుడు మాత్రమే మిగిలి యుండును.

పూజలను చేయువారు, యజ్ఞములను చేయువారు ఇత్యాదిగా భక్తులు అనేకరకములుగా నున్నారు. గీతను బోధించు ఈ భక్తుడు చేసే బోధరూపమైన ఈ పూజలో, ఈ జ్ఞానయజ్ఞములో ద్రవ్యములు ఇసుమంతైననూ లేవు. కాని, శ్రీకృష్ణునకు గీతోపదేశకుడైన భక్తుని కంటె అధికమైన ప్రీతిపాత్రుడు మరియొకడు లేడు.

**అధ్యాయము 18 , శ్లోకము 69 :**

न च तस्मान्मनुष्येषु कश्चिन्मे प्रियकृत्तमः ।
भविता न च मे तस्मादन्यः प्रियतरो भुवि ।। ६९ ।।
న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః
భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి ( 69 ).

చ = మరియు, మనుష్యేషు = మనుష్యులలో, తస్మాత్ = వానికంటె, మే = నాకు, ప్రియకృత్తమః = అధికమగు ప్రియమును చేయువాడు, కశ్చిత్ = ఎవడైననూ, న = లేడు, చ = మరియు, భువి = భూలోకమునందు, తస్మాత్ = వానికంటె, అన్యః = మరియొకడు, మే = నాకు, ప్రియతరః ఎక్కువ ప్రియమైనవాడు, న భవితా = ఉండబోడు.

మనుష్యులలో వానికంటె నాకు ఎక్కువ ప్రియమును చేయువాడు
ఎవడైననూ లేడు. మరియు భూలోకమునందు వానికంటె మరియొకడు
నాకు ఎక్కువ ప్రియమైనవాడు ఉండబోడు ( 69 ).

భక్తులందరిలో వీనికంటె భగవానునకు అధికప్రియమైన భక్తుడు మరియొకడు లేడు. ఎందువలన ? ' నన్ను తెలుసుకున్నవాడు నేనే అగును ( జ్ఞానీ త్వాత్మైవ ) '. ఆత్మ అత్యంతప్రీతిపాత్రమైనది. దాని స్వరూపము అనంతము ( ఆనందము ). ఈ స్వరూపమే మన అనుభవములో సుఖరూపముగా అభివ్యక్తమగుచుండును. సర్వులు ప్రేమించేది ఆత్మను మాత్రమే. ఆత్మజ్ఞాని ఆనందస్వరూపమును గురించి బోధించును. ఆతడు ఆ ఆనందస్వరూపముకంటె భిన్నముగా లేడు. కావున, భగవానునకు దీనిని బోధించు వానికంటె ఎక్కువ ప్రియమైనవాడు లేడు.

జ్ఞానికంటె గొప్ప భక్తుడు ఇప్పుడు లేకున్ననూ, రాబోవు తరములలో పుట్టవచ్చును గదా ! అది సంభవము కాదు. ఈ లోకములో భవిష్యత్తులోనైననూ ఈ జ్ఞానమును ఉపదేశించువాని కంటె ఎక్కువ ప్రియమైనవాడు పుట్టడు. ఈ శ్లోకములోని ' చ ' అను పదము వర్తమానమును భవిష్యత్తుతో కలుపును. లేదా, గతములో ఇంతకంటె గొప్ప భక్తుడు లేడని కూడ చకారము నిర్దేశించును. అనగా, ఇంతకంటె గొప్ప భక్తుడు భూతభవిష్యద్వర్తమానకాలములలో లేడు.

ఈ జ్ఞానమును బోధించు జ్ఞాని తనకు అత్యంతప్రియతముడని భగవానుడీ ఉపసంహారములో చెప్పియున్నాడు. ఇప్పుడు గీతను అధ్యయనము చేయువాడు, మరియు పారాయణమును మాత్రమే చేయువాడు కూడ స్తుతింపబడుచున్నారు.

**అధ్యాయము 18 , శ్లోకము 70 :**

**अध्येष्यते च य इमं धर्म्यं संवादमावयोः ।**
**ज्ञानयज्ञेन तेनाहमिष्टस्स्यामिति मे मतिः ।। ७० ।।**

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః
జ్ఞానయజ్ఞేన తేనాహమిష్టస్స్యామితి మే మతిః ( 70 ).

చ = మరియు, యః = ఎవడైతే, ఆవయోః = మన ఇద్దరియొక్క, ఇమమ్ = ఈ, ధర్మ్యమ్ = ధర్మమును గురించిన, సంవాదమ్ = సంభాషణను, అధ్యేష్యతే = అధ్యయనము చేయునో, లేదా పారాయణము చేయునో, తేన = ఆ, జ్ఞానయజ్ఞేన = జ్ఞానయజ్ఞముచే, అహమ్ = నేను, ఇష్టః = ఆరాధింపబడినవాడను, స్యామ్ = అగుదును, ఇతి = అని, మే = నాయొక్క, మతిః = నిర్ణయము.

మరియు, ఎవడైతే ధర్మమును గురించిన మన యిద్దరి ఈ సంభాషణమును

అధ్యయనము లేక పారాయణము చేయునో, వాని ఆ జ్ఞానయజ్ఞముచే నేను ఆరాధింపబడినవాడనే యగుదునని నా నిర్ణయము ( 70 ).

ఈ సంవాదములో బ్రహ్మవిద్య మరియు కర్మయోగము ప్రస్తావించబడి దీనిని అధ్యయనము లేక పారాయణమును చేయువాడు ఈ శ్లోకములో స్తుతింపబడు న్నాడు. ఈ సంవాదమునకు విషయవస్తువు ధర్మము. కావున, ఇది ధర్మ్యము ( ధర్మ నకు విరుద్ధము కానిది ) అనబడునని శ్రీశంకరులు వివరించిరి. ఇచట ధర్మశబ్దమున ఆపేక్షికార్థముతో బాటు మౌలికమగు అర్థమును కూడ స్వీకరించవచ్చును. ఆపేక్షికమ అర్థములో ధర్మమనగా కర్మయోగము. మౌలికమగు ధర్మము బ్రహ్మవిద్య. ఈ సంవ మును అధ్యయనము చేయువాడు తద్ద్వారా నన్ను ఆరాధించినట్లు అగునని భగవా చట చెప్పుచున్నాడు. ఎందువలన ? ఆతడు గీతను కేవలము చదువుటయే అది జ్ఞానరూపమైన యజ్ఞము గనుక, ఈశ్వరారాధన యగుచున్నది. యజ్ఞమనగా ఈ రాధన. ఇది వివిధపదార్థములను అగ్నిహోత్రములో సమర్పించి చేసే ద్రవ్యయ కాదు. ఇది ధార్మిక-అనుశాసనరూపమైన తపోయజ్ఞము గాని, మంత్రజపరూపమైన జ్ఞము గాని కాదు. ఇచట జ్ఞానాభ్యాసమే ఈశ్వరారాధన యగుచున్నది. శ్రీశంక నాలుగు రకముల యజ్ఞములను ప్రస్తావించిరి. వివిధపదార్థములను అగ్నిహోత్రములో ర్పించే వేదవిహితమైన ద్రవ్యయజ్ఞము మొదటిది. మంత్రములను జపించే జపయజ్ఞ రెండవది. మెల్లగా మంత్రమును పారాయణ చేసే ఉపాంశుయజ్ఞము మూడవది. స్సులో మాత్రమే జపించే మానసయజ్ఞము నాల్గవది. వీటిలో మానసయజ్ఞము సర ముగా పరిగణించబడినది. ఏలయనగా, వాచికకాయికకర్మలలో మనస్సు లగ్నము చ్చును ; కాకపోవచ్చును. కాని, మానసకర్మలో మనస్సు తప్పని సరిగా లగ్నగు మనస్సు లగ్నము కానిచో, అది మానసకర్మయే కాదు. గీతలోని ఈ సంవాదమ అధ్యయనము జ్ఞానరూపములోనున్న యజ్ఞము. కావున, అది మానసకర్మయగును. న, ఇది శ్రేష్ఠమని చెప్పబడినది. గీతను అధ్యయనము చేయకుండగా కేవలము యణ చేసిననూ దేవతోపాసనాఫలముతో సమమగు ఫలము లభించునని శ్రీశ చెప్పిరి. ఈ విధముగా ఈ జ్ఞానము స్తుతించబడినది.

గీతాధ్యయనమును చేయు వ్యక్తి ఈశ్వరుని ఆరాధించినట్లే యగును. కావున, ధ్యయనములో పడి ఇతరపూజలను చేయలేకపోతినే యను చింత అనవసరము. ఈ మైన చింత చాలమంది జనులలో కానవచ్చును. జనులు భక్తిని ' చేయ 'గోరెదరు. గీతన చదువుట చదువే గాని, భక్తి కాదని వారి భావన. కాని, గీతాధ్యయనము ఈశ్వరారాధనయే నని పరమేశ్వరుడు ఇచట స్వయముగా చెప్పుచున్నాడు. పూర్ణశాస్త్రములో విషయవస్తువు ఈశ్వరుడు మాత్రమే. కావున, అగ్ని, ఆహుతులు మొదలైనవి లేకపోయినా, శాస్త్రాధ్యయనము కూడ ఈశ్వరారాధనయే యగును. ఆపదలో భగవంతుని ఆరాధించు వాడు ( ఆర్తః ), జీవితములో విజయమును సాధించుట కొరకై భగవంతుని సాహాయ్య మును అర్థించువాడు ( అర్థార్థీ ), ఈశ్వరుని తెలియగోరువాడు ( జిజ్ఞాసుః ), జ్ఞాని అని భక్తులు నాలుగు రకములుగా నున్నారని శ్రీకృష్ణుడు ఇదివరలో చెప్పియున్నాడు. వీరిలో జిజ్ఞాసుభక్తుడు ఏమి చేయును ? శాస్త్రమును చదువును. ఈతడు కూడ భక్తుడేనను విష

యమును మరువరాదు. అతడు చేయు పూజ చదువుకొనుటయే. ఈశ్వరస్వరూపమునెరింగిన జ్ఞాని-భక్తుడు పరమేశ్వరునికంటె భిన్నముగా లేడు గనుక, భగవానునకు అత్యంతప్రీతిపాత్రుడగును. కావున, ఈశ్వరీయజ్ఞానముయొక్క అభ్యాసము కూడ యజ్ఞమే. జిజ్ఞాసువు జ్ఞానయజ్ఞముచే నన్ను ఆరాధించుచున్నాడని నా నిర్ణయము ( జ్ఞానయజ్ఞేన తేనాహమిష్టస్స్యామితి మే మతిః ) అని చెప్పి, భగవానుడిచట గీతాధ్యయనము చేయువానిని స్తుతించుచున్నాడు.

సాధారణముగా శాస్త్రముయొక్క అంతములో శాస్త్రశ్రవణఫలము ( ఫలశ్రుతి ) చెప్పబడును. దానికి శాస్త్రప్రశంస అని పేరు. ఇది సంప్రదాయసాహిత్యముయొక్క ఒక విశిష్టశైలి. గీతను అధ్యయనము లేక పారాయణను చేయు వ్యక్తిని ప్రశంసించిన తరువాత, భగవానుడు ఇప్పుడు గీతాశాస్త్రమును శ్రవణము చేయువానికి లభించే ఫలమును ప్రశంసించుచున్నాడు.

**అధ్యాయము 18 , శ్లోకము 71 :**

श्रद्धावाननसूयश्च शृणुयादपि यो नरः ।
सो ऽपि मुक्तश्शुभान् लोकान् प्राप्नुयात्पुण्यकर्मणाम् ।। ७१ ।।
శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః
సోపి ముక్తశ్శుభాన్ లోకాన్ ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్ ( 71 ).

**అపి** = మరియు, **యః** = ఏ, **నరః** = మానవుడు, **శ్రద్ధావాన్** = శ్రద్ధ గలవాడై, **చ** = మరియు, **అనసూయః** = ఇతరులయందు దోషములను వెదికే స్వభావము లేనివాడై, **శృణుయాత్** = వినునో, **సః అపి** = అతడు కూడ, **ముక్తః** = ముక్తుడై, **పుణ్యకర్మణామ్** = పుణ్యకర్మలను చేయువారియొక్క, **శుభాన్** = శుభకరములగు, **లోకాన్** = లోకములను, **ప్రాప్నుయాత్** = పొందును.

మరియు ఏ మానవుడు శ్రద్ధ గలవాడై, ఇతరులయందు దోషములను వెదికే స్వభావము లేనివాడై వినునో, అతడు కూడ ముక్తుడై పుణ్యకర్మలను చేయువారిచే పొందబడే శుభలోకములను పొందును ( 71 ).

శ్రీకృష్ణుడు ఒక వ్యక్తి కాదనియు, సాక్షాత్తుగా పరమేశ్వరుడనియు గుర్తించి, శ్రద్ధ గలవాడై ( శ్రద్ధావాన్ ) గీతను వినే సాధకుని గురించి ఈ శ్లోకము చర్చించుచున్నది. ఈ జిజ్ఞాసువు ఇతరులలో తప్పులను వెదికే పనిని చేయడు ( అనసూయః ). ఇట్టి వ్యక్తి ఈ గీతాశాస్త్రమును శ్రవణము చేసినచో, ముక్తుడగును. దేనినుండి ? అది పరిస్థితులపై ఆధారపడియుండును. అతడు పుణ్యకర్మలను చేయువారు పొందే శుభలోకములను పొందునని ఇచట భగవానుడు చెప్పుచున్నాడు. అనగా, అర్థము తెలియక పోయినా, కేవలము శ్రవణము చేయుటచే అతని పాపములన్నియు తొలగిపోయినవని యర్థము. ఇట్టి స్థితిలో జ్ఞానము గలవాని గురించి ఏమి చెప్పవలెను ? అని శ్రీశంకరులు జోడించిరి. జ్ఞానము గల వ్యక్తి సంసారమునుండి పూర్ణముగా విముక్తిని పొందును. గీతను సాక్షాత్తుగా భగవానుడే బోధించినాడు గనుక, ఈ భగవానుని వచనములను శ్రద్ధతో వినంత మాత్రాన పావ

ములన్నియు నశించును. అట్టి వ్యక్తి శుభలోకములను పొందును. ఇంతే గాక, ఆతడు శాస్త్రమును అధ్యయనము చేసి దాని అర్థమును తెలుసుకున్నచో, సంసారమునుండి మోక్షమును పొందును.

ఆచార్యుడు తన బోధ శిష్యునకు తెలిసినదా లేదా యను విషయమును తెలియగోరుట సహజము. అదే విధముగా, శ్రీకృష్ణుడు కూడ శిష్యుడగు అర్జునునకు తెలిసినదా లేదా యని తెలియగోరి ప్రశ్నించుచున్నాడు. అర్జునుని మనస్సులోని భావజాలమును భగవానుడు తెలియగోరుచున్నాడు. భగవానుడు అర్జునుని ప్రశ్నించుటకు కారణమేమి అను విషయమును శ్రీశంకరులు ఈ శ్లోకమునకు ఉపక్రమభాష్యములో ప్రస్తావించిరి. ఇట్లు ప్రశ్నించుటలో భగవానునకు ఒక విశేషాభిప్రాయము గలదు. అర్జునునకు శాస్త్రము తెలియలేదనుకొనుడు. అప్పుడు శ్రీకృష్ణుడు మరల బోధించగలడు అనే విషయమును అర్జునుడు గుర్తించుట అవసరము. శ్రీకృష్ణుడు సర్వమును బోధించియున్నాడు. ఇప్పుడు కొత్తగా చెప్పవలసినది ఏదీ లేదు. కాని, అవసరమైనచో, అదే విషయమును మరల ఆయన ప్రక్రియను మార్చి చెప్పవచ్చును. శిష్యునకు అర్థము కాని సందర్భములో మరల పద్ధతిని మార్చి చెప్పగలిగే ప్రతిభ ఆచార్యునియందు ఉండును. ఈ దృష్టితో మాత్రమే భగవానుడు అర్జునుని ఈ ప్రశ్న వేయుచున్నాడు. శిష్యునకు అర్థము కాని సందర్భములో మరియొక మార్గమును అవలంబించ వలసిన బాధ్యత ఆచార్యునిపై గలదు. శిష్యుడు సత్యమును తెలుసుకొని తాను కృతార్థుడనైతిననే గుర్తింపును పొందవలెను. అంతవరకు, ఉపదేశము పూర్తి అయినట్లు పరిగణింపబడదు. శిష్యునకు తెలియని సందర్భములో ఆచార్యుడు ప్రక్రియను మార్చి మరల బోధించవలెననే విషయమును మానవాళికి నిర్దేశించుట కొరకై భగవానుడు ఈ ప్రశ్నను వేయుచున్నాడు.

**అధ్యాయము 18 , శ్లోకము 72 :**

कच्चिदेतच्छ्रुतं पार्थ त्वयैकाग्रण चेतसा ।

कच्चिदज्ञानसंमोहः प्रनष्टस्ते धनञ्जय ।। ७२ ।।

కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా

కచ్చిదజ్ఞానసంమోహః ప్రనష్టస్తే ధనంజయ ( 72 ).

**పార్థ** = పృథాకుమారా ఓ అర్జునా !, **త్వయా** = నీచేత, **ఏతత్** = ఇది, **ఏకాగ్రేణ** = ఏకాగ్రమైన, **చేతసా** = మనస్సుతో, **కచ్చిత్ శ్రుతమ్** = శ్రవణము చేయబడినదా ?, **ధనంజయ** = కీర్తిప్రతిష్ఠలను సంపాదించిన ఓ అర్జునా !, **తే** = నీయొక్క, **అజ్ఞానసంమోహః** = అజ్ఞానముచే కలిగిన భ్రాంతి, **కచ్చిత్ ప్రణష్టః** = తొలగిపోయినదా ?

పృథాకుమారా ఓ అర్జునా ! నీవు ఏకాగ్రమైన మనస్సుతో దీనిని వింటివా ?
కీర్తిప్రతిష్ఠలను సంపాదించిన ఓ అర్జునా ! అజ్ఞానముచే నీకు కలిగిన
భ్రాంతి తొలగిపోయినదా ? ( 72 )

పృథ అనగా కుంతి. కావుననే, ఆయన అర్జునుని పృథాకుమారా ! అని సంబోధించినాడు. ' నీవు ఈ శాస్త్రమును వింటివా ? ' కేవలము వినుట చాలదు. సరియగు పద్ధతిలో వినవలెను. అనగా, ఏకాగ్రమైన మనస్సుతో సావధానముగా వినవలెను. వినే

సమయములో మనస్సులో ఒకే ఒక విషయము ఉండవలెను. ఈ విశేషణమును జోడించ గానే, ప్రశ్నకు అర్థము మారినది. ' నీకు తెలిసినదా ? ' శాస్త్రశ్రవణములో సావధానమన స్కత చాల ప్రముఖమైన విషయము. వినే సమయములో జిజ్ఞాసువు తనకు గల భావము లను, ధారణలను అన్నింటినీ స్థగితము చేసి, తన వద్దకు వచ్చుచున్న శబ్దప్రమాణముచే మనస్సును ఉద్భాసితము చేయవలెను. ఇది ప్రముఖమైన విషయము. ఇంతకు పూర్వ ములో విన్నదానిని, మరియు మనస్సులో ఇదివరకే నిర్మాణమై యున్న భావనలను ప్రక్కన బెట్టి, ఈ క్షణములో బోధింపబడే విషయమును మాత్రమే వింటూ దానిని తెలుసు కొనే ప్రయత్నమును చేయుచుండవలెను. మనస్సులోని పూర్వసంస్కారములు ఉద్బు ద్ధమై శ్రవణమును కలుషితము చేసి సమస్యలను సృష్టించవచ్చును. కావున, అట్లు జరు గకుండగా శ్రద్ధ వహించవలెను. ఈ విధముగా మనస్సులోని సర్వభావనలను స్థగితము చేసి వర్తమానములో బోధింపబడుచున్న విషయమును వినగలిగే సామర్థ్యమునకు ఏకా గ్రత అని పేరు. అనగా, మనస్సునకు ఎదురుగా ఒకే ఒక విషయవస్తువు ఉండును. ఇంతే గాక, ' నీవు నిరాదరము, నిరుత్సాహము లేకుండగా వినినావా ? ' అని శ్రీశంకరులు ప్రశ్నించుచున్నారు.

తరువాత శ్రీకృష్ణుడు అర్జునుని ' కీర్తిప్రతిష్ఠలను సంపాదించినవాడా ! ( ధనం జయ ) ' అని సంబోధించి రెండవ ప్రశ్నను అడుగుచున్నాడు. ' నీ వ్యామోహము తొలగి పోయినదా ? ' వ్యామోహములో నున్న వ్యక్తి భ్రాంతుడై వస్తువులను యథాతథముగా చూడజాలడు. ఆత్మ అనాత్మగను, అనాత్మ ఆత్మగను కానవచ్చును. అనగా, వాటి మధ్యలో పర్సపరభ్రాంతి గలదు. వ్యామోహము ఉన్నచోట భ్రాంతి ఉండును. భ్రాంతిలో రెండు వస్తువులు పరస్పరము కలగాపులగము అగును. ఈ భ్రాంతి రెండు విధములుగా నున్నది. ఒకటి ఆత్మ-అనాత్మల మధ్య గల మౌలికమగు భ్రాంతి. ధర్మ-అధర్మముల మధ్య గల భ్రాంతి రెండవది. ఇవి రెండు అజ్ఞానమునుండి పుట్టినవియే. అజ్ఞానమునుండి పుట్టిన ఈ భ్రాంతులు తొలగిపోయినవా ? అని శ్రీకృష్ణుడిచట ప్రశ్నించుచున్నాడు. దీనిని బట్టి శాస్త్రముయొక్క పూర్ణప్రయోజనము అజ్ఞాననివృత్తియేనని తేలుచున్నది. ఆయన అర్జునుని ' నీవు సరిగ్గా వినినావా ? ' అని ప్రశ్నించినాడు. భగవానుని ప్రశ్నలోని తాత్ప ర్యము ఏమనగా, ' నీకు శాస్త్రముయొక్క అవగాహన కలిగి తద్ద్వారా మోహము పూర్ణ ముగా నశించినదా ? ' ఈ భ్రాంతిని మనము కష్టపడి నిర్మించనక్కర లేదనియు, అది సహజసిద్ధమనియు శ్రీశంకరులు వాక్రుచ్చిరి. జీవనమూల్యముల విషయములో కూడ పరి స్థితి ఇదియే. మంచి-చెడుల జ్ఞానము మానవునిలో సహజముగా ఉన్నది. కాని, మాన వుడు జీవనమూల్యముల విశిష్టతను, విలువను గుర్తించవలసి యున్నది. దాని కొరకై సాధన అవశ్యకమగుచున్నది. పైన చెప్పిన రెండు రకముల భ్రాంతులను తొలగించుకొ నుటకై మనము శాస్త్రమును శ్రవణము చేయుటకు యత్నించవలెను. ఆచార్యుడు బోధిం చుటలోని తాత్పర్యము కూడ శిష్యునిలో ఈ భ్రాంతులను తొలగించుటయే.

ఈ ప్రశ్నతో భగవానుని వచనములు అంతమైనవి. ' నీవు నిర్హేతుకముగా శోకించు చున్నావు ( అశోచ్యానన్వశోచస్త్వమ్ ) ' అను వాక్యముతో భగవానుని ఉపదేశము ఆరం భమై, ' దుఃఖించకము ( మా శుచః ) ' అను వాక్యముతో అంతమైనది. తరువాత కొద్ది

శ్లోకములలో శ్రీకృష్ణార్జునసంవాదము ఉపసంహరించబడినది. ఈ సంవాదము ఈ శ్లోకముతో ముగిసినది. ఈ సంవాదములో ' ధనంజయ ' అనునది భగవానుని అంతిమవచనము. ధనంజయుడు అనగా సంపదను జయించినవాడు అని యర్థము. సంపదలో పలు రకములు గలవు. ఆధ్యాత్మికసంపద కూడ ధనమే. కావున, ఇది చాల మంగళకరమైన ముగింపు.

ఇప్పుడు అర్జునుడు భగవానుని ప్రశ్నకు సమాధానమునిచ్చుచున్నాడు. ' నీవు సన్న్యాసమును, కర్మయోగమును కూడ స్తుతించినావు ; ఈ రెండింటిలో నాకు ఏది హితకరము ? దయేసి నాకు ఈ విషయమును చెప్పుము ( సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి, యచ్ఛ్రేయ ఏతయోరేకమ్ ) ' అని అర్జునుడు పలికినాడనుకొనుడు. శ్రీకృష్ణభగవానుడు మరల మొదటినుండి ఆరంభించ వలసియుండును. కాని, ఇచట అర్జునుడు భగవానుని ప్రశ్నకు చక్కని నిశ్చయాత్మకమగు సమాధానమునిచ్చుచున్నాడు. కావున, గీత ముగింపునకు వచ్చుచున్నది.

**అధ్యాయము 18 , శ్లోకము 73 :**

अर्जुन उवाच ।
नष्टो मोहः स्मृतिर्लब्धा त्वत्प्रसादान्मयाच्युत ।
स्थितो ऽस्मि गतसंदेहः करिष्ये वचनं तव ।। ७३ ।।

అర్జున ఉవాచ
నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత
స్థితోస్మి గతసందేహః కరిష్యే వచనం తవ ( 73 ).

**అర్జునః = అర్జునుడు, ఉవాచ = పలికెను, అచ్యుత = ఓ అచ్యుతా !, త్వత్ప్రసాదాత్ = నీ అనుగ్రహము వలన, మోహః = మోహము, నష్టః = తొలగిపోయినది, స్మృతిః = ఆత్మజ్ఞానము, లబ్ధా = కలిగినది, గతసందేహః = తొలగిన సందేహములు గలవాడనై, స్థితః అస్మి = నిలబడియున్నాను, తవ = నీ, వచనమ్ = మాటను, కరిష్యే = చేయగలను.**

అర్జునుడు ఇట్లు పలికెను ------ ఓ అచ్యుతా ! నీ అనుగ్రహముచే మోహము తొలగి ఆత్మజ్ఞానము కలిగినది. నేను సందేహములు తొలగినవాడనై స్థిరముగా నిలబడియున్నాను. నీ మాటను పాటించగలను ( 73 ).

అర్జునుడు శ్రీకృష్ణుని ' అచ్యుతా ! ( వికారములు లేనివాడు ) ' అని సంబోధించి, ' నా మోహము తొలగిపోయినది ' అని చెప్పుచున్నాడు. అర్జునుడు ఆత్మజ్ఞానము ( స్మృతి ) ను పొందినాడు. ఎట్లు ? తాను ఈ జ్ఞానమును శ్రీకృష్ణుభగవానుని అనుగ్రహముచే ( త్వత్ప్రసాదాత్ ), అనగా శ్రీకృష్ణుని ఉపదేశముచే పొందినానని అర్జునుడు చెప్పుచున్నాడు. నేను సమస్తసందేహములు తొలగిన ఒక వ్యక్తిగా ( గతసందేహః ) నిలబడి యున్నానని అర్జునుడు చెప్పుచున్నాడు. కావున, అర్జునుడు ఇప్పుడు శ్రీకృష్ణుని వచనమును పాటించుటకు సంసిద్ధముగా నున్నాడు. అతనియందు కర్తృత్వభ్రాంతి లేదు. కావున, అతడు కర్తవ్యకర్మను చేయగలడు. ఈ ముల్లోకములలో నాకు పొందదగినది ఏదీ లేక

పోయినా, నేను కర్మను చేయుచునే యున్నాను ( న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన, నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ) అని భగవానుడే స్వయముగా చెప్పి యున్నాడు. అదే విధముగా, అర్జునునకు కూడ స్వీయప్రారబ్ధకర్మ గలదు. కావున, ఆతడు తన కర్తవ్యమును చేసి తీరవలెను. ఆతనికి జ్ఞానము ఉదయించినచో, కర్తవ్యకర్మను చేయుట వలన నష్టపోయేది ఏదీ ఉండదు. జ్ఞానికి కర్తవ్యకర్మానుష్ఠానము ప్రారబ్ధకర్మ యొక్క పరిపూర్తి మాత్రమే. ఒకచో, అర్జునునకు ఇంకనూ జ్ఞానము ఉదయించని పక్షము లో, ఆతడు కర్తవ్యకర్మను యోగభావనతో చేయుటయే మంచిది. ఏలయనగా, కర్తవ్య మును విడనాడి మరియొక కర్మను చేయుటకంటె కర్తవ్యమును చేస్తూ మరణించుటయే మేలు ( స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ). అర్జునునకు కేవలము ధర్మ-అ ధర్మముల భ్రాంతి నుండి విముక్తి మాత్రమే గాక, ఆత్మజ్ఞానము కూడ ఉదయించినదని శ్రీశంకరులు ఇచట అభిప్రాయపడిరి. కావున, మోహము నశించినది అనే అర్జునుని వచన మునకు అజ్ఞానమునుండి పుట్టి సంసారమునకు హేతువు అగుచున్న భ్రాంతి పోయినది అని అర్థము. సంసారము సముద్రము వలె తరించుటకు చాల కష్టమైనది. కాని, ఆత్మజ్ఞాన ముచే ఈ సంసారము పూర్తిగా తొలగిపోవును. ఆత్మయందు మనము ఆరోపించే ధార ణలు అన్నియు కల్పితములే. శుద్ధచైతన్యరూపమగు ఆత్మ మనచే గాఢనిద్రయందు, ఆనందముతో బిగ్గరగా నవ్విన సమయములలో అనుభవింపబడుచునే యున్నది. ఆత్మ సర్వకాలములలో స్వయంప్రకాశమై యున్నది. కావున, జ్ఞానము అనగా ఉన్నదానిని గుర్తించుటయే. కావున, ఆత్మస్వరూపమును గుర్తించుటయే అర్జునుడు చెప్పిన లాభమని శ్రీశంకరులు వ్యాఖ్యానించిరి. ఈ లాభముచే మానవుడు హృదయములోని అవిద్యాగ్రంథి నుండి విముక్తుడగును. అజ్ఞానము, కామన, మరియు కామనయొక్క ఉత్తేజములో చేయ బడే కర్మ అను మూడు కలిసి అవిద్యాగ్రంథి అనబడును. కావున, ' నీ అనుగ్రహముచే మోహము నశించినది ' అని చెప్పి అర్జునుడు ఆచార్యునకు తన కృతజ్ఞతను ప్రకటించు చున్నాడు.

శ్రీకృష్ణుని ఈ ప్రశ్న, మరియు అర్జునుని సమాధానములను బట్టి ఒక సంగతి స్పష్టమగుచున్నది. అది ఏమనగా, శాస్త్రాధ్యయనముయొక్క ఫలము మోహనాశము. మోహము నశించుట తోడనే, సంసారము కూడ నశించును. కావున, సంసారమునకు మోహము కారణమని శ్రీశంకరులు వాక్రుచ్చిరి. అనగా, సంసారము వాస్తవముగా లేదని స్పష్టమగుచునే యున్నది. కావున, ' శోకింపదగని వారిని గూర్చి నీవు శోకించుచున్నావు ( అశోచ్యానన్వశోచస్త్వమ్ ) ' అనే గీతారంభము ' నా మోహము పోయినది ' అనే ముగింపునకు మిక్కిలి అనురూపముగా నున్నది. శోకము మోహమునుండి పుట్టినది గాన, దానికి వాస్తవమగు కారణము లేదు. జ్ఞానముచే మోహము నశించును. అంతే గాక, ఆత్మ స్మృతి, మరియు ఆత్మలాభము కూడ జ్ఞానఫలములే. ఇది అంతయు శాస్త్రాధ్యయనము యొక్క ఫలము.

ఈ జ్ఞానము హృదయములోని అవిద్యాగ్రంథులను అన్నింటినీ నశింపజేసి, పూర్ణ మోక్షమునిచ్చుననే విషయమును ఛాందోగ్యశ్రుతిలోని నారదసనత్కుమారసంవాదము కూడ ప్రతిపాదించుచున్నది. నారదునకు నాలుగు వేదములు మరియు అనేకములగు ఇతర

రశాస్త్రములు తెలియును. కాని, ఆయనకు ఆత్మజ్ఞానము లేకుండుటచే, దుఃఖము తప్పలేదు. ఆయన సనత్కుమారునితో, ' ఆత్మజ్ఞానము లేని నేను శోకమునకు వశుడనైయున్నాను ( *అనాత్మవిత్ శోచామి* ) ' అని పలికి, తనను శోకసముద్రముయొక్క ఆవలి గట్టునకు చేర్చుడని ( *శోకస్య పారం తారయతు* ) ప్రార్థించెను. నారదుని ఈ ప్రార్థనను విని, సనత్కుమారుడు ఇట్లు చెప్పెను : ' సర్వము తెలిసినా దుఃఖవిముక్తి లేదు. ఆత్మజ్ఞానము మాత్రమే శోకమును నిర్మూలించి, ఆనందమునిచ్చును. ఆత్మ యథార్థముగా అనంతము ( *భూమా* ). ' అదే విధముగా, మరియొక సందర్భములో ' ఆత్మ బ్రహ్మయేనని తెలియగానే, హృదయమునందలి ముడి విడిపోయి సకలసంశయములు తొలగిపోవును ( *భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః* ) ' అని వేదము చెప్పుచున్నది. మరియు, ' ఆత్మ అద్వయమని తెలిసిన జ్ఞానికి మోహము ఎక్కడిది ? శోకము ఎక్కడిది ? ( *కో మోహః కశ్శోక ఏకత్వమనుపశ్యతః* ) ' అని ఈశావాస్యోపనిషత్తు ఉద్ఘోషించుచున్నది.

అర్జునునకు ఇప్పుడు సకలసంశయములు తొలగిపోయినవి. కావుననే, ఆతడు శ్రీకృష్ణునితో,' నీ వచనమును నేను ఆచరణలో పెట్టెదను ( *కరిష్యే వచనం తవ* ) ' అని పలుకుచున్నాడు. ' నీ అనుగ్రహముచే నేను కృతార్థుడనైతిని ; నాకు ఇప్పుడు అల్పఫలమును కోరి చేయదగినది ఏదీ మిగిలి లేదు ' అని శ్రీశంకరులు అర్జునుని వచనమును వ్యాఖ్యానించిరి. మోక్షము అనే పురుషార్థములో సర్వపురుషార్థములు అంతర్గతమై యున్నవి. మోక్షము లభించినచో, ధర్మార్థకామములనే పురుషార్థముల సేవనము కూడ చరితార్థమగును. కావుననే, అర్జునుడు ' నాకు కర్తవ్యము మిగిలి లేదు ' అని చెప్పగల్గును. ఆతడు మున్ముందు హృషీకేశమునకు పోవలెనని భావించెను. కాని, ఇప్పుడు ఆతడు తన కర్తవ్యమును తాను ఇబ్బందులు ఏమియు లేకుండగా చేయగలనని గుర్తించినాడు. దీనిని బట్టి శాస్త్రాధ్యయనము జ్ఞానోదయము వరకు మాత్రమే సార్థకమని కూడ స్పష్టమగుచున్నది. జ్ఞానోదయము తరువాత అధ్యయనము కూడ నియతము కాదు.

ఇప్పుడు దృశ్యము యుద్ధరంగమునుండి ప్రాసాదమునకు మారినది. శ్రీకృష్ణార్జున సంవాదమును సంజయుడు ధృతరాష్ట్రునకు పూర్తిగా వర్ణించి చెప్పినాడు. ధృతరాష్ట్రమహారాజు అంధుడు. ఆయనకు దుర్యోధనుడు మొదలగు వంద మంది కుమారులు గలరు. ఆయన యుద్ధపరిస్థితిని సంజయుని ద్వారా విని తెలుసుకొనుచుండెను. ' సంజయా ! యుద్ధమును చేయుట కొరకై ధర్మస్థానమగు కురుక్షేత్రములో ఒకచోట సమగూడిన నావారు మరియు పాండుపుత్రులు ఏమి చేసిరి ? ( *ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః, మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ* ) ' అనే ధృతరాష్ట్రుని ప్రశ్నతో గీత ఆరంభమైనది. గీత సర్వము దీనికి సమాధానము. ఆయన ముందుగా గీతా సందర్భమును వివరించి, తరువాత శ్రీకృష్ణార్జునుల మధ్య జరిగిన సంవాదమును యథాతథముగా చెప్పెను. ఈ సంవాదములో శ్రీకృష్ణార్జునుల ఇద్దరి వచనములు మాత్రమే గలవు. ఇప్పుడు గీతకు అంతములో సంజయుడు తిన్నగా ధృతరాష్ట్రుని సంబోధించుచున్నాడు.

**అధ్యాయము 18 , శ్లోకము 74 :**

**सञ्जय उवाच ।**

इत्यहं वासुदेवस्य पार्थस्य च महात्मनः ।
संवादमिममश्रौषमद्भुतं रोमहर्षणम् ।। ७४ ।।
సంజయ ఉవాచ
ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః
సంవాదమిమమశ్రౌషమద్భుతం రోమహర్షణమ్ ( 74 ).

సంజయః = సంజయుడు, ఉవాచ = పలికెను, ఇతి = ఈ విధముగా, అహమ్ = నేను, వాసుదేవస్య = శ్రీకృష్ణునియొక్క, చ = మరియు, మహాత్మనః = మహాత్ముడగు, పార్థస్య = అర్జునునియొక్క, ఇమమ్ = ఈ, అద్భుతమ్ = ఆశ్చర్యకరమైన, రోమహర్షణమ్ = గగుర్పాటును కలిగించే, సంవాదమ్ = సంభాషణను, అశ్రౌషమ్ = వినియుంటిని.

సంజయుడు ఇట్లు పలికెను -------
ఈ విధముగా నేను శ్రీకృష్ణునియొక్క మరియు మహాత్ముడగు అర్జునుని యొక్క ఈ ఆశ్చర్యకరమగు గగుర్పాటును కలిగించే సంభాషణను వినియుంటిని ( 74 ).

ఇచట సంజయుడు శ్రీకృష్ణుని వాసుదేవశబ్దముచే నిర్దేశించినాడు. ఎవ్వని యందు సర్వము ఉనికిని కలిగియున్నదో, అట్టి పరమేశ్వరుడు వాసుః అనబడును. దేవః అనగా స్వయంప్రకాశుడు మరియు సర్వజ్ఞుడు. లేదా, వాసుదేవుడనగా సరళముగా వసుదేవుని కుమారుడు. పార్థుడు అనగా పృథయొక్క కుమారుడగు అర్జునుడు. మహాత్మనః అనగా గొప్ప మనస్సు గలవాడు అని యర్థము. ఈ విశేషణము శ్రీకృష్ణునకు మరియు అర్జునునకు కూడ సమానముగా వర్తించును. పూర్వములో అర్జునుడు సంసారి ఆత్మ. కాని, ఇప్పుడు మోహము తొలగిపోయినదని ( నష్టో మోహః ) అతడే స్వయముగా చెప్పుచున్నాడు. కావున, అతని ఆత్మ పరంబ్రహ్మయే. కావుననే, సంజయుడు అతనిని మహాత్ముడని వర్ణించినాడు. పైగా, అతడు సాక్షాత్తుగా శ్రీకృష్ణభగవానుని నుండి ఉపదేశమును పొందిన పుణ్యపురుషుడు.

శ్రీకృష్ణార్జునుల మధ్య జరిగిన ఈ సంవాదము తనకు గగుర్పాటును కలిగించినదని ( రోమహర్షణమ్ ) సంజయుడు చెప్పుచున్నాడు. ఈ సంవాదము అత్యద్భుతము మరియు అపూర్వము. ఈ సంవాదములో పూర్తి వేదాంతశాస్త్రము మాత్రమే గాక, యోగము కూడ అంతర్గతమై యున్నది. దీనిలో లేని ఆధ్యాత్మికజ్ఞానము లేదు. ఇది సమగ్రమైన శాస్త్రము. దీనిని నేను వినియుంటిని ( ఇదమహమశ్రౌషమ్ ) అని సంజయుడు మహానందముతో చెప్పుచున్నాడు. ' నీవు ఎట్లు వింటివి ? నీవు నాతో ఇచటనే ఉంటివి గదా ! యుద్ధరంగములో జరిగిన సంభాషణను నీవు వినుట ఎట్లు సంభవమగును ?' అను ఆశంక ధృతరాష్ట్రునకు కలుగవచ్చును. కాని, సంజయుడు వ్యాసుని అనుగ్రహముచే వినగలిగెను.

**అధ్యాయము 18 , శ్లోకము 75 :**

व्यासप्रसादाच्छ्रुतवान् एतद्गुह्यमहं परम् ।

योगं योगेश्वरात् कृष्णात् साक्षात् कथयतस्स्वयम् ॥ ७५ ॥

వ్యాసప్రసాదాచ్ఛ్రుతవాన్ ఏతద్గుహ్యమహం పరమ్

యోగం యోగేశ్వరాత్ కృష్ణాత్ సాక్షాత్ కథయతస్స్వయమ్ ( 75 ).

అహమ్ = నేను, పరమ్ = సర్వోత్కృష్టమైనది, గుహ్యమ్ = రహస్యమైనది అగు, ఏతత్ = ఈ, యోగమ్ = యోగమును, సాక్షాత్ = సాక్షాత్తుగా, యోగేశ్వరాత్ = యోగేశ్వరుడగు, కృష్ణాత్ = శ్రీకృష్ణునినుండి, స్వయమ్ = స్వయముగా, కథయతః = చెప్పుచుండగా, వ్యాసప్రసాదాత్ = వ్యాసుని అనుగ్రహము వలన, శ్రుతవాన్ = వినియుంటిని.

సర్వోత్కృష్టమైనది, రహస్యమైనది అగు ఈ యోగమును నేను వ్యాసుని అనుగ్రహము వలన సాక్షాత్తుగా యోగేశ్వరుడగు శ్రీకృష్ణుడు స్వయముగా చెప్పుచుండగా వినియుంటిని ( 75 ).

సుదూరములో జరుగుచున్న దృశ్యములను చూడగలిగే దివ్యదృష్టిని, మరియు అచటి శబ్దములను వినగలిగే సామర్థ్యమును వ్యాసుడు సంజయునకు అనుగ్రహించినాడు. కావుననే, సంజయుడు ఈ వృత్తాంతమునంతనూ వినగలిగినాడు. దీనిని బట్టి మనము ఇచట ఒక విషయమును ఊహించవచ్చును. మామూలు నేత్రములతో మనము కళ్ల యెదుట ఉన్న పదార్థములను చూడగల్గుదుము. కాని ప్రత్యక్షము కాని పదార్థములను కూడ దివ్యనేత్రముతో చూడవచ్చును. అట్లు గానిచో, శ్రీకృష్ణుని ఉపదేశము సంజయునకు ఎట్లు తెలిసెడిది ? వ్యాసుని అనుగ్రహము వలన ఆత్మ బ్రహ్మ-అభిన్నమని సంజయుడు తెలుసుకొన గలిగెను.

సంజయుడు విన్నది ఏమిటి ? యోగమును గురించి ఆయన పూర్తిగా వినెను. యోగమును బోధించే శాస్త్రము కూడ యోగమనబడును. ఉపనిషత్తు విషయవస్తువుగా గల పుస్తకమునకు ఉపనిషత్తు అని పేరు. ఈ యోగము కర్మయోగము, జ్ఞానయోగము అని రెండు రకములుగా నున్నది. ఈ యోగము మోక్షమునీయగల్గును గనుక, దానికి పరమ్ అని పేరు వచ్చినది. సంజయుడు దీనిని ఎవరినుండి వినెను ? సంజయుడు ఈ జ్ఞానమును పరంపరలో గాక, సాక్షాత్తుగా జ్ఞాననిధానమగు భగవంతునినుండి పొందెను. ఆ ర్గునుడు తాను విన్న ఉపదేశమును మరియొకనికి చెప్పగా, అతడు ఇంకొకనికి చెప్పెనను క్రొనుడు. అది పరంపర యనబడును. ఈ విధముగా ఆ ఉపదేశము కొన్ని తరములు అతి క్రమించు సరికి దానిలో మార్పులు చేర్పులు వచ్చును. దానికి చిలవలు, పలవలు చేరు టకు అవకాశము గలదు. ఒకప్పుడు దాని రూపము పూర్తిగా మారి వికృతరూపము కలుగు టయు సంభవమే. కాని, సంజయుడు సాక్షాత్తుగా భగవానుని ముఖమునుండి వినినాడు. భగవానుడు స్వయముగా తన స్వరూపమును బోధించినాడు. భగవానుడు కర్మయోగ-జ్ఞా నయోగములను రెండింటినీ ప్రవర్తిల్లజేసిన యోగేశ్వరుడు. ' వినాశము లేని ఈ యోగ మును నేను వివస్వానునకు చెప్పగా, ఆయన మనువునకు చెప్పినాడు ; మనువు ఇక్ష్వా కువునకు చెప్పినాడు ( ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్, వివస్వాన్మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ) '. కావుననే, భగవానునకు యోగేశ్వరుడని పేరు వచ్చినది. ప్రాతే గాక, కర్మకాండచే గాని, జ్ఞానకాండచే గాని పొందబడేది ఆ భగవానుడు మాత్రమే.

' నాలుగు వేదములద్వారా తెలియబడేది నేనే ( సర్వైః వేదైః అహమేవ వేద్యః )'. ఈ రెండు యోగములను ప్రవర్తిల్ల జేసినది ఆయనయే. వాటి విషయవస్తువు కూడ ఆయనయే.

సంజయుడు ఈ ఉపదేశమును మురళిని వాయించే, గోవులను పాలించే, పర్వతమును పైకి ఎత్తే, వెన్నను దొంగిలించే శ్రీకృష్ణుని నుండి వినలేదు ; జగద్గురువగు శ్రీకృష్ణుడు స్వయముగా చెప్పుచుండగా ( స్వయం కథయతః ) వినినాడు. శ్రీకృష్ణుడు ' నీవే బ్రహ్మవు ; ఈ సర్వము మాయ ' ఇత్యాదిగా ఏవో రెండు వాక్యములను చెప్పి ఊరకుండలేదు. లేదా, ఏదో ఒక సలహాను చెప్పి తప్పించుకొనలేదు. ఆయన శాస్త్రమును సమగ్రముగా పదునేడు అధ్యాయములలో బోధించినాడు. కథయతః అనే సంజయుని వచనమునకు అర్థము ఉపదేశమే గాని, కబుర్లాడుట కాదు.

తరువాత సంజయుడు ధృతరాష్ట్రునితో ఇట్లు అనుచున్నాడు :

**అధ్యాయము 18 , శ్లోకము 76 :**

राजन् संस्मृत्य संस्मृत्य संवादमिममद्भुतम् ।
केशवार्जुनयोः पुण्यं हृष्यामि च मुहुर्मुहुः ।। ७६ ।।

రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమమద్భుతమ్
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః ( 76 ).

చ = మరియు, రాజన్ = ఓ మహారాజా ! , కేశవార్జునయోః = శ్రీకృష్ణార్జునుల, ఇమమ్ = ఈ, అద్భుతమ్ = అద్భుతమైన, పుణ్యమ్ = పవిత్రమైన, సంవాదమ్ = సంభాషణను, సంస్మృత్య సంస్మృత్య = పదే పదే గుర్తు చేసుకొని, ముహుర్ముహుః = పలుమార్లు, హృష్యామి = ఆనందించుచున్నాను.

ఓ మహారాజా ! నేను శ్రీకృష్ణార్జునుల ఈ అద్భుతమైన పవిత్రమైన సంభాషణను పదే పదే గుర్తు చేసుకొని పలుమార్లు ఆనందముతో పులకరించుచున్నాను ( 76 ).

ఈ శ్లోకములో సంజయుడు ధృతరాష్ట్రుని ' ఓ మహారాజా ! ' అని సంబోధించుచున్నాడు. సంస్మృత్య అను పదము రెండు సార్లు ప్రయోగించ బడినది. అనగా, ఆయన ఆ సంభాషణను ప్రతిక్షణము గుర్తు చేసుకొనుచున్నాడని అర్థము. ఈ సంవాదము ఎట్టిది ? ఇది బంధహేతువులు అగు పాపములను అన్నింటినీ పోగొట్టి మోక్షమును ఇచ్చును. కావుననే, ఇది పుణ్యమ్ అని వర్ణించబడినది. అర్జునుని ప్రశ్నలను, భగవానుని వచనములను మరల మరల తలచుకొని నేను ఆనందించుచున్నానని ( హృష్యామి ముహుర్ముహుః ) ఆయన చెప్పుచున్నాడు.

అంత మాత్రమే గాదు.

**అధ్యాయము 18 , శ్లోకము 77 :**

तच्च संस्मृत्य संस्मृत्य रूपमत्यद्भुतं हरेः ।
विस्मयो मे महान् राजन् हृष्यामि च पुनः पुनः ।। ७७ ।।

తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునః పునః ( 77 ).

చ = మరియు, రాజన్ = ఓ మహారాజా ! , తత్ = ఆ, హరేః = శ్రీకృష్ణునియొక్క అత్యద్భుతమ్ = అత్యద్భుతమైన, రూపమ్ = రూపమును, సంస్మృత్య సంస్మృత్య పదే స్మరించి, మే = నాకు, మహాన్ = గొప్ప, విస్మయః = ఆశ్చర్యము, చ = మరియు పునః పునః = అనేకపర్యాయములు, హృష్యామి = ఆనందించుచున్నాను.

ఓ మహారాజా ! ఆ శ్రీకృష్ణునియొక్క అత్యద్భుతమైన రూపమును పదే పదే స్మరించుచున్న నాకు గొప్ప ఆశ్చర్యము కలుగుచున్నది. నేను ఆ స్మరణచే నిరంతరముగా ఆనందించుచున్నాను ( 77 ).

గీతలో శ్రీకృష్ణార్జునసంవాదము మాత్రమే గాక, శ్రీకృష్ణుని విశ్వరూపము కూడ కానవచ్చు విధముగా వర్ణించబడినది. 11 వ అధ్యాయములో అర్జునుని ప్రార్థ మన్నించి శ్రీకృష్ణుడు తన విశ్వరూపమును ప్రదర్శించెను. దానిలో అర్జునుడు కాలము పంచభూతములు, యమధర్మరాజు, అందరు దేవతలతో సహా సర్వమును గాంచెను. అర్జు నుడు చూచిన సర్వమును సంజయుడు కూడ చూచెను. ఆ విశ్వరూపములో సర్వము దర్శనమిచ్చెను. సంజయునకు శ్రీకృష్ణుని ఆ రూపము అత్యద్భుతమనిపించెను ( రూప మత్యద్భుతం హరేః ). దానిని పదే పదే తలచుకొనుచున్న సంజయునకు గొప్ప విస్మ యము ( మహాన్ విస్మయః ) కలుగుచుండెను. భగవానుని రూపము వలె వచనములు కూడ విస్మయమును కలిగించుచుండెను. కావుననే, సంజయుడు వచనములతో బాటు ఆ విశ్వరూపమును కూడ పదే పదే తలచుకొని మహానందమగ్నుడగుచుండెను.

అంతిమశ్లోకముయొక్క అవతారికలో శ్రీశంకరులు ఇట్లు అనుచున్నారు : ఇన్ని మాటలేల ? సంగ్రహముగా చెప్పాలంటే --------

అధ్యాయము 18 , శ్లోకము 78 :

यत्र योगेश्वरः कृष्णो यत्र पार्थो धनुर्धरः ।
तत्र श्रीर्विजयो भूतिर्ध्रुवा नीतिर्मतिर्मम ।। ७८ ।।

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ ( 78 ).

యత్ర = ఎక్కడనైతే, యోగేశ్వరః = యోగమునకు ప్రభువు అగు, కృష్ణః = శ్రీకృష్ణుడు, యత్ర = ఎక్కడనైతే, ధనుర్ధరః = ధనస్సును చేతబట్టియున్న, పార్థః = అర్జునుడు, తత్ర అక్కడ, శ్రీః = సంపద, విజయః = విజయము, భూతిః = వివిధధనములు, నీతిః = న్యాయము, ధ్రువా = నిశ్చయముగా నుండునని, మమ = నాయొక్క, మతిః = నిశ్చితాభి ప్రాయము.

ఎక్కడనైతే యోగమునకు ప్రభువు అగు శ్రీకృష్ణుడు మరియు ధనుర్ధారి యగు అర్జునుడు ఉందురో, అచట సంపద, విజయము,వివిధధనములు, నీతి నిశ్చయముగా ఉండునని నా నిశ్చితాభిప్రాయము ( 78 ).

ఎక్కడ శ్రీకృష్ణుడు ఉండునో అనగా ఎవని హృదయములో శ్రీకృష్ణుడు ఉండునో అని యర్థము. అచట సంపద ( శ్రీః ) మరియు విజయము ( విజయః ) ఉండును. అర్జునుడు ఉన్నచోట కూడ సంపద మరియు విజయము ఉండును. ఇచట అర్జునునకు ' ధనస్సును చేతబట్టినవాడు ( ధనుర్ధరః ) ' అను విశేషణము గలదు. ఇది సాభిప్రాయవిశేషణము. దీనిని మనము తరువాత చూచెదము. సర్వసంపదలు ఉండేది శ్రీకృష్ణుడు ఉన్నచోట మాత్రమే ; మరియొకచోట కాదు. ఏలయనగా, లక్ష్మిని శ్రీకృష్ణునినుండి విడదీయుట అసంభవము. ఈ సంపద సాధారణమగు ధనము మాత్రమే కాదు. సర్వవిధముల సంపదలు, అనగా, నైతిక సంపద, భౌతికసంపద, ఆధ్యాత్మికసంపద మొదలగు సర్వసంపదలు హృదయములో శ్రీకృష్ణార్జునులను పదిలపరచుకున్న వ్యక్తికి ఉండును. ఇది నిశ్చయము ( ధ్రువా ). ఇట్టి వానికి అపజయము అనే ప్రసక్తి లేదు. ఇంతే గాక, నీతి కూడ నిశ్చితముగా ఉండును. అనగా, న్యాయము, ధర్మబద్ధమగు ప్రజాపాలన ఉండునని అర్థము. శ్రీకృష్ణుడు ధర్మస్వరూపుడు గనుక, ధర్మము ఉండుట సహజమే. అది శ్రీకృష్ణుని ధర్మము కాదు ; శ్రీకృష్ణుడే ధర్మము. శ్రీకృష్ణుడు ధర్మమునకు అతీతుడే అయినా, ధర్మము శ్రీకృష్ణుని కంటె భిన్నముగా లేదు. ధృతరాష్ట్రునకు కోపమును తెప్పించుట సంజయునకు అభిమతము కాదు. కావుననే, ' ఇది నా నిశ్చితమగు అభిప్రాయము ( మతిర్మమ )' అని జోడించినాడు. కానిచో, సంజయుడు ఇచట ధృతరాష్ట్రునితో దుర్యోధనుడు నెగ్గుననే గ్రుడ్డి నమ్మకమును పెట్టుకున్నచో, అది వ్యర్థమేనని చెప్పినట్లైనది. శ్రీకృష్ణార్జునులు ఉన్నచోట సంపద, విజయము,నీతి ఉండుననే వాక్యముతో ఈ సంభాషణను సంజయుడు ముగించినాడు.

సంజయుడు అర్జునునకు ధనుర్ధారి అను విశేషణమును జోడించుటకు గల కారణమును ఇప్పుడు పరిశీలించెదము. కేవల-అర్జునుడు విజయమును సాధించలేడు. అతని యందు కర్తవ్యమును నెరవేర్చె సంసిద్ధత ఉండవలెను. అప్పుడు మాత్రమే విజయము మొదలగునవి లభించును. అర్జునునకు ధనుర్ధరః అను విశేషణమును జోడించి సంజయుడు తన కర్తవ్యమును చేయుటకు సంసిద్ధుడై యున్న మానవుని సూచించినాడు. దీనికి తోడు శ్రీకృష్ణుని శరణు వేడుట కూడ ఉన్నచో, అది కర్మయోగము అగును. అట్లు గానిచో, అది కర్మ మాత్రమే అగును. శ్రీకృష్ణుని శరణు వేడి తన కర్తవ్యమును ఆచరించు వ్యక్తిలో మాత్రమే గాక, అంతఃకరణశుద్ధి కలిగి జ్ఞానము ఉదయించును. ఇచట శ్రీః అను పదమునకు ధనము అని మాత్రమే గాక, అంతఃకరణశుద్ధి అని కూడ అర్థము గలదు. ఇట్టి వ్యక్తి కూర్చుండి చింతిల్లే స్వభావము కలవాడు కాదు గనుక, అతనికి సర్వము సిద్ధించును. కర్మఫలదాతయగు ఈశ్వరుడు తన పక్షమున ఉన్నాడని అతనికి తెలియును. దైవము తన పక్షమున ఉన్న వ్యక్తి చేపట్టే కార్యములలో అదృష్టములగు ప్రతిబంధకములు కూడ అడ్డు తగలవు. అదృష్టము అనే అంశము ఈశ్వరాధీనము గనుక, ఈశ్వరుని ఆరాధించు వానికి అది దృష్టముతో సమానమై స్వాధీనమగును. ఈశ్వరుని గుర్తించి ముందుకు సాగువానికి సర్వము తన అధీనములోనుండును. ఈశ్వరుని ప్రక్కన బెట్టి సర్వమును నియంత్రించ బూనువాడు కష్టముల పాలగును. అతడు కార్యసాధకములగు అంశములను అన్నింటినీ నియంత్రించ లేడు. కాని, ఈశ్వరుని శరణు వేడి తన పక్షములో నిలుపుకున్న వ్యక్తికి జీవితము సరళము

గును. అప్పుడు కర్మ యోగము అగును. దాని వలన, ఆ వ్యక్తియందు కర్మఫలములను అన్నింటినీ హుందాగా స్వీకరించే ప్రసాదబుద్ధి నెలకొనును. కావున, అట్టివానికి సర్వత్ర విజయమే గాని, పరాజయము ఉండదు.

మనము అనుభవములనుండి నేర్చుకొనవలెనే గాని, ' ఇది వ్యర్థము ' అని దేనినీ కొట్టి పారవేయనక్కరలేదు. సాధారణముగా చేపట్టిన కార్యములో చిన్న వైఫల్యము ఎదురు కాగానే, మనము సర్వము వినష్టమైనదా యన్నట్లు అంతిమనిర్ణయమునకు వచ్చి, ఆ కార్యమును విడిచిపెట్టెదము. ఉత్సాహశీలియగు వ్యాపారి కొంత నష్టము రాగానే తన వ్యాపారమును మూసివేయడు. ఆతడు నష్టము వచ్చుటకు గల కారణములను పరిశీలించి వ్యాపారమును ముందుకు గొనిపోవును. వ్యాపారములో ఒకప్పుడు నష్టము, మరియొకప్పుడు లాభము వచ్చుచుండునని ఆతనికి బాగుగా తెలియును. కావున, ఆతడు వ్యాపారమును మూసివేయడు. చేపట్టిన కార్యమును విడువనివాడు యథార్థమగు విజేత ; వైఫల్యము ఎదురు కాగానే అంతిమముగ నిష్కర్షకు చేరుకొని కార్యమును విడిచిపెట్టువాడు నష్టపోవును. జీవితములో విజయమును సాధించగోరు వ్యక్తి తన చుట్టూ గిరి గీసుకొని కూర్చుండరాదు. ఏలయనగా, జీవితములో మనము ప్రతి అడుగులో పాఠములను నేర్చుకుంటూ పూర్ణమైన మరియు ప్రయోజనకరమైన జీవితమును గడుపవలెను. అంతిమనిర్ణయమునకు వచ్చి, ' ఇంతటితో సరి ' అని సర్వమును విడిచిపెట్టే సమయము ఏది ? మరణసమయము మాత్రమే. జీవితము ఒక పెద్ద ప్రక్రియ. శ్రీకృష్ణుడు ఎవని పక్షమున ఉండునో, వాడు జీవితములో విజేత యగును. ఈశ్వరుడు మన పక్షమున లేనిచో, విజయము అసంభవము. దుర్యోధనునకు పరిస్థితులు అన్నీ అనుకూలముగా నుండెను. ఆతని సైన్యము పెద్దది. జయింప శక్యము కాని వీరాధివీరులు ఆతని పక్షములో గలరు. కాని, ఆతడు యుద్ధములో పరాజయమును పొందెను. శ్రీకృష్ణుడు లేనిచో, అర్జునుడైననూ మొదటి రోజే యుద్ధములో యమపురికి అరిగి యుండెడివాడు. కాని, ఆతని రథముపై సారథి స్థానములో శ్రీకృష్ణుడు కూర్చుండి యుండుటచే, ఆతనిని విజయము వరించెను. ఆతని వద్ద ఎన్నెన్ని గొప్ప శస్త్రాస్త్రములు ఉన్ననూ, ఆతనికి ఎంతటి గొప్ప యుద్ధకౌశలము ఉన్ననూ, ఆ సారథి లేనిచో, అర్జునుడు యుద్ధమును చేసి యుండెడివాడు కాదు. యుద్ధమునకు ఆరంభమునందే ' కర్తవ్యమా ? లేక, అనురాగమా ? ' అనే మానసిక ఘర్షణలో ఆతడు పడిపోయెను. ఆతడు ఆ క్షణములో యుద్ధమును ఆరంభించుటకైననూ సంసిద్ధుడుగా లేకుండెను. ఆతడు అదే స్థితిలో కొనసాగినచో, యుద్ధమును కొనసాగించే ప్రసక్తి ఏది ? శ్రీకృష్ణుడు ఉండుట వలన మాత్రమే ఆతనిని విజయలక్ష్మి వరించినది.

శ్రీకృష్ణుడు మరియు అర్జునుడు సమావేశమైన చోట నీతి మరియు సంపద ఉండుట నిశ్చయము. శ్రీ, భూతి, అనే రెండు పదములు ప్రయోగింప బడుటచే, శ్రీ అను పదమునకు జ్ఞానము అని అర్థమును చెప్పవచ్చును. ఆ సమావేశములో సర్వము ఉండును. ఇది కేవలము వ్యక్తుల విషయములో మాత్రమే గాక, సమాజము విషయములో కూడ యథార్థము. నీతిమంతమగు సమాజములో ప్రతి వ్యక్తి తన ధర్మమును పాటించుచుండుటచే, అందరికి సమృద్ధి ఉండును. ఏ కాలములో మరియు దేశములో శ్రీకృ

ష్టుడు ఉన్నాడో, ఆ దేశకాలములలో ప్రజలు కర్తవ్యములను చేయుటకు నడుము కట్టి యుందురు. అప్పుడు ఈ సర్వసంపదలతో ఆ సమాజము తులదూగును.

ఓం తత్ సత్ అని ఉచ్చరించి మనము ముగించెదము. ఓమ్ అనగా సర్వము. అది మాత్రమే సత్యము. మహాభారతములోని భీష్మపర్వము పదివేల శ్లోకములను కలిగి యున్నది. భగవద్గీత దానిలో ఒక భాగము. విషయవస్తువు బ్రహ్మవిద్య అగుటచే, దీనికి ఉపనిషత్తులతో సమానమైన ప్రామాణ్యము గలదు. ఇది యోగశాస్త్రము కూడా. శ్రీకృష్ణార్జునసంవాదరూపములోనున్న గీతలోని ఈ అధ్యాయమునకు మోక్షసన్న్యాస ( మోక్షము నిచ్చే సన్న్యాసము ) యోగము అని పేరు. అనగా, ఆత్మ కర్త కాదని తెలుసుకొని, ఆ జ్ఞానముయొక్క ప్రభావముచే కర్తృత్వధారణను నిషేధించుట ద్వారా సర్వకర్మలను పరిత్యజించుట అని దాని యర్థము. ఈ శాస్త్రములో అనేకవిషయములు ప్రస్తావించబడినవి. కాని, సర్వకర్మసన్న్యాసము ప్రముఖముగా నిర్దేశించబడినది. కావున, ఆఖరి అధ్యాయమునకు మోక్షసన్న్యాసయోగము అను పేరు ఎంతయూ తగియున్నది. ఈ గీతాశాస్త్రమునకు పరమహంససన్న్యాసియగు గోవిందభగవత్పాదుల శిష్యుడగు శ్రీశంకరులు రచించిన భాష్యము కూడ ఇంతటితో ముగిసినది.

సాధారణముగా మనము ఇటువంటి గ్రంథముయొక్క అధ్యయనమును పూర్తి చేసిన సందర్భములో మొదటి శ్లోకమును మరల ఒకసారి పఠించే సంప్రదాయము గలదు. దీని అర్థమేమనగా, మనము మరల గీతాశాస్త్రమునంతనూ అనుసంధానము చేయ నిశ్చయించుకొనవలెను. ఇది జీవితకాలమంతా నిరంతరముగా సాగే అధ్యయనము.

धृतराष्ट्र उवाच ।

धर्मक्षेत्रे कुरुक्षेत्रे समवेता युयुत्सवः ।

मामकाः पांडवाश्चैव किमकुर्वत सञ्जय ।। १ ।।

ధృతరాష్ట్ర ఉవాచ
ధర్మ క్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సఞ్జయ ( 1 ).
ఓం శాంతిః శాంతిః శాంతిః
శ్రీగురుభ్యో నమః హరిః ఓం తత్ సత్ శ్రీకృష్ణార్పణమస్తు
సర్వే జనాస్సుఖినో భవంతు

---

ॐ

# भगवद्गीता

## ఇంటింటా గీతాధ్యయనం




VOL - IV

ఇంటింటా గీతాధ్యయనం

A5